# విషయసూచిక.

వ్యాసము | పుట

గి. చెవ్వాకులు. పై ఐను వన్నెలును గలది ముత్తైదువ.

**ఐబిక్స్ మేక** (Ibex) — ఇది అడవి లేక కొండజాతిమేక. ఇవి నాల్గుజాతులు. అన్నిటి కొమ్ములు తిన్నగనుండక వెనుకకు వంగి యుండును. ఆల్ప్సు పర్వతములపై నుండు నీ జాతిమేకలకు నలువదిఅంగుళముల కొమ్ములుండు నట. ఆసియాజాతుల కేబదిఅంగుళములుండును. వీనిచర్మమును బాగుచేసి కాలిజోళ్లు (బూట్సు) చేయుదురు.

**ఐబీరియ ద్వీపకల్పము** — ఐరోపాఖండ మున నున్న ద్వీపకల్పము. ఇందు స్పెయిను దేశము (స్పానియాదేశము), పోర్చుగలుదేశము (పోర్చుగీసుదేశము), బ్రిటిషువారి జిబ్రాల్టరును (బ్రిటిషువారి సైనికదుర్గమున్న ఊరిట) కలవు. (ఐరోపాఖండము చూడుడు). వైశాల్యము ౨,౩౮,౧౦౦ చతురపుమైళ్లని అంచనా వేయం బడినది

స్పెయిను, పోర్చుగలు దేశములు పీఠభూములు. జిబ్రాల్టరు మధ్యధరాసముద్రములోనికి జొచ్చుకొనివచ్చియున్న శిలాతల ప్రదేశమును, క్రిందిసముద్రతీరప్రదేశమును అయియున్నవి ఆసియాఖండపువారగు ఐబీరియను లీద్వీపకల్పమున కాపురము కుదిరిన కారణమున నీద్వీపకల్పమున కైబీరియను పెనెన్సులాయని పేరయ్యెను. వారు అనార్యులనియు స్పానియాయను దానిమునివాసులగ తరువాతి వారివలన నెన్నబడిరట. వారి సంతతివారగు బస్క్యూస్‌జాతివారిప్పుడు స్పానియాదేశమునందున్నారు.

పోర్చుగలు దేశమునకు రోమనులు లూసిటానియాయని పేరిడిరి. జిబ్రాల్టరు దుర్గమున్న కొండకు Gibel అనిపేరుండెనట. దానిపైం దొలుత దుర్గము నిర్మించినభూపతిపేరు తారీఖని చెప్పంబడినది. ఆయన నామధేయమున కచటి సెటిల్మెంటుకు తరపేరిడియెనట. ఈయన మూరు జాతివాడు. • కొండపేరు, ఆ సెటిల్మెంటుపేరు కలసి బ్రిటీషువారిచే జిబ్రాల్టరునామమిడంబడినది ఇది క్రీ. వె. ౧౭౦౪ లో బ్రిటిషు ప్రభుత్వము వారి హస్తగతమైనది

**ఐరన్‌క్రాస్ బిరుదచిహ్నము** — జర్మను ప్రభుత్వమునందలి సైనికులలో గొప్ప సాహస శౌర్యధైర్యములను యుద్ధరంగమునం జూపినవారికి బహుమతిగ నొసగంబడు బిరుద చిహ్నము. ఇనుముతోం జేయంబడి కొనలు వెండితో ముగింపంబడియుండును ఆంగ్లప్రభుత్వము వారి విక్టోరియాక్రాసువంటిదీన బిరుదు చిహ్నమునకు

**ఐరన్గేట్సు నదీమార్గము** — డాన్యూబు నది, కాల్కను పర్వతములు, కార్పేతియను పర్వతముల సందునుండి యరుగు సుప్రసిద్ధ నదీమార్గము. ఇది పొల్లి నదిపై నడచు నౌకల కాటంకకరముగ నుండెనుగాని, నదీపరిపాలన అంతర్జాతీయ సంఘము (International Commission) వారి వశమైనపిదప వారు దీనిని లోతుచేసి ఆనకలను నిర్మించి గనునాదు కాలములందుసి నదియందు నడచెడి ఓడల కే యాటంకము కలుగకుండ జక్కగ నడపు చున్నారు. డాన్యూబునది చూడుడు

**ఐరావతీ నది** — దీనినిప్పుడు రావి యనుచున్నారు. ఇది పాంచాలదేశములోనిది. సింధునదియొకం జేరును బర్మాదేశమునం బ్రధాననదియగు దాని కైరావతి యనిపేరు. ఇది రంగూన్‌పట్టణము ప్రక్కంబడి జరుచుండునది.

**ఐరిష్ ఫ్రీస్టేటు** — ఐర్లాండు చూడుడు.

**ఐరోపాదేశముల కాలమానము**— కాలవిభజనము, కాలవిధానము, కాలము, కాల మానము చూడుడు.

**ఐరోపా ఖండము** — ఐరోపాఖండము చిన్నదియే యైనను, ఐకమత్య రహస్యధర్మములను చక్కగా గుర్తెరిగిన గొప్ప సాధుబలము చేకూర్చుకొని పిదప నైహిక విద్యలను తమతమ దేశముల వ్యాపింపఁజేసి భౌతికబలములగు యాంత్రిక సాహాయ్య సాహసములు కూడఁగల్గి యితరఖండవాసుల కజేయులై తనరారుచున్నది. పూర్వగోళార్ధమున నింతటిబలాఢ్యమగు ఖండము మఱియొకటి లేదు. ఆముష్మికమైన యాధ్యాత్మికధర్మ విధు లెట్లున్నను ఐహికవిద్యలం దారితేరిన ప్రజలచే నిండియున్న యీఖండమునందలి దేశము లితరఖండములలోని దేశములంగూడ నేలుచున్నవి. సముద్ర తీరము- ఐరోపాఖండమునాశ్రయించి యించుమించు ౨౦,౦౦౦ మైళ్లు పొడవున నుండు ఓడవర్తకమునకు ఐరోపా అపరిమితానుకూల పరిస్థితులు గల్గియుండుటను వేఱుగ వ్రాయ నక్కరయుండదు. సముద్రయాన మహాఫల మింతటితో నాగరిక ప్రజలకు విదేశసంచారావకాశము లొసఁగి దేశపరిస్థితులలో పెక్కుమార్పులను గల్గించుటకు కారణమయ్యెను దీనితో దేశాచారము, పూర్వాచారములును మారుచు నామమాత్రావశిష్టము లగుచుండుటయు నూతనాచారపద్ధతు లవలంబింపఁ బడుచుండుటయు, ఈ ఖండవాసులకు సర్వసామాన్యమయ్యెను. కాన తామే నాగరికులమని చెప్పుకొనుట ఏర్పడియెను అధికారి యైరోపాకు సామాన్యగుణమయ్యెను. విద్యావంతులై, ధనవంతులై, బలవంతులై యున్న దేశము లధికారమున దఖలాపు గల్గియుంట తప్పనిదిగాన లోకువవగు నితరఖండముల వారిపై నధికారగర్వముఁ జూపుచుండుట గానవచ్చెడిని గడుసుతనమున పిశారములు, అంతఃకలహములు లేనివారు.

ఇతరఖండములందువలె నెత్తైన పర్వతము లీ ఖండమున లేవు. సర్వసాధారణముగా దేశము సముద్రపునీటిమట్టముపై ౬౦౦ అడుగులలోపున భూమి ఎత్తుగల్గియుండునని చెప్పఁబడినది. ఐరోపా ఖండమునకుఁ దగిలిన సముద్ర భాగములను ముఖ్యముగ వివరింపవలయును ఏలన నివియే లేకున్న ఓడలవర్తకమింతగా నీఖండమున నభివృద్ధిఁ జెంది యుండదు.

తెల్లసముద్రము- (White sea) ఇది రష్యా దేశమున కుత్తరమున నున్నది. అట్లాంటిక్కు మహాసముద్ర శాఖ. సంవత్సరమున చాలభాగము ఇది మంచుగ ఘనీభవించి తెల్లగ నగుపడుచుండుట నీపేరయ్యెను

బాల్టిక్కుసముద్రము- (జలసంధుల సముద్రము). స్వీడనుదేశ మొకవైపునను, రష్యా, జర్మనీ లొకవైపునను గల సముద్రము. దీని యుత్తరభాగమునకు బాతినియాసంయుక్తాగ్రగుడ మని పేరు తూర్పుభాగమునకు ఫిన్లాండు సంయుక్తాగ్రగుడమని పేరు. ఫిన్లాండుసంయుక్తాగ్ర గుడము ద్వారమున రీగాసంయుక్తాగ్రగుడము కలదు అచటికి దక్షిణభాగమున డాన్జిగ్ సంయుక్తాగ్రగుడము కలదు. బాల్టిక్కుసముద్రము ఎక్కువ లోతుకలదికాదు. అందులో నెక్కువ నదీజలములు కలయుటఁజేసి నీరంత యుప్పగ నుండదు.

నార్తుసముద్రము- దీనిని జర్మన్ ఓషన్ అనియు నందురు. ఇది ఐరోపా ఖండదేశము లొకవైపునను, గ్రేటుబ్రిటనుద్వీపమొకవైపునను కలది.

కేట్టగాట్- దీనికి Steeve అని యర్థము. డెన్మార్కుస్వీడనులమధ్య నున్నది.

స్కాగరాక్- డెన్మార్కు నార్వేలమధ్య నున్న సముద్రము. నార్తుసీ బాల్టిక్కు సీలం గల్పు సముద్రభాగము.

జూడర్జీ- దీనికి దక్షిణసముద్రమని యర్థము హాలండున కుత్తరమున నున్నది.

ఎయిడర్ కెనాల్- ఇది కాల్వకాను. నార్తుసీ బాల్టిక్కు-సీలం గల్పు సముద్రభాగము.

ఐరిష్‌సముద్రము- ఇంగ్లాండు, ఐర్లాండుల నడుమనున్న సముద్రభాగము.

బే ఆఫ్ బిస్కే- అట్లాంటిక్కు-మహాసముద్రపు శాఖాసముద్రము. ఫ్రాన్సుదేశపు పశ్చిమమునను, స్పానియాదేశపు ఉత్తరమునను ఉన్న సముద్రభాగము.

మధ్యధరాసముద్రము- (మెడిటరేనియన్ సీ). ఐరోపాఆఫ్రికాలకునడుమను పోర్టుసయ్యద్ నుండి జిబ్రాల్టరు జలసంధివఱకు వ్యాపించి యున్నది నదులు దీనియందుఁజేర్చు నీటికన్న నెక్కువ నీరు ఆవిరియై దీనినుండి ఎగిరిపోవుచుంట దీని యుదకములు మహాసముద్రములందలి యుదకములకన్న నెక్కువ ఉప్పు గల్గియుండును. తొల్లింటికాలపు వారీసముద్రప్రదేశమును భూమికి మధ్యభాగమని తలంచి యీపేరు వాడసాగిరట. ఐనను కాకపోయినను, రెండు భూభాగముల నడుమ నమరియుంట నీనామము తగియేయున్నది

లయోన్సు సింధుశాఖ- మధ్యధరాసముద్రపు శాఖ. ఫ్రాన్సుదేశపు దక్షిణమున నున్నది. ఇందు తఱుచు తుపానులు గొట్టుచుండును.

జెనోవా సింధుశాఖ- ఇటలీ దేశమునకు వాయవ్యదిశగానున్న సముద్రభాగము.

టరాంటో సింధుశాఖ- ఇటలీ దేశమున ఆగ్నేయదిశగానున్న సముద్రభాగము.

ఎడ్రియాటిక్కు- సముద్రము- ఇటలీ టర్కీ దేశములకు నడుమగానున్న మధ్యధరాసముద్ర శాఖ. దీనియం దకస్మాత్తుగా తుపానులు కొట్టుచుండును.

ఈజియన్ సముద్రము- దీనిని ఆర్కిపిలెగో యనుటయుంగలదు. ఇది గ్రీసు టర్కీ దేశముల నడుమనున్న మధ్యధరాసముద్రపుశాఖ.

మార్మోరా సముద్రము-ఇందుగల(మార్మక్) మార్బెల్ ద్వీపమునుండి పేరుకల్గినది. ఐరోపాలోని టర్కీభాగమునకును, ఆశియాలోని టర్కీభాగమునకును మధ్యనున్న సముద్రభాగము.

నల్లసముద్రము- దీనియొక్క ఉత్తరతీరము రష్యాదేశము (యూరోప్) నకును, దక్షిణతీరము ఆసియా మైనరునకును చెందియున్న భూమధ్య సముద్రము. నీటిరంగునుండి పేరొందినది ఇది ఉప్పునీటిసరస్సు అని చెప్పవచ్చును. ఇది చాల పెద్దది. పదినదు లిందు చేరుచున్నవి దీని నీరు సముద్రపునీరంత యుప్పగానుండదు ఇందు ఐరోపాలో కురిసిన వర్షపునీటిలో మూడవవంతు చేరుచుండునని చెప్పఁబడినది. దీని తొల్లింటిపేరు యూక్సైన్ సముద్రము.

బాతినియా సింధుశాఖ- బాల్టిక్కు సముద్రము యొక్క ఉత్తరపుశాఖ

ఫిన్లాండు సింధుశాఖ- బాల్టిక్కు- సముద్రపు తూర్పుశాఖ ఫిన్లాండు కడనున్నది.

రైగాసింధుశాఖ - గల్ఫాఫ్‌ఫిన్లాండు ముఖద్వారమున దక్షిణముగా నున్నది.

డాంజిగు సింధుశాఖ - బాల్టిక్కు-సముద్రపు దక్షిణభాగమున జర్మనీదేశము నాటియున్నదాని శాఖాసముద్రము.

జలసంధులు.— డోవరు జలసంధి- ఇది ఇంగ్లీషుఛానలు నార్తుసీలంగలుపు జలసంధి మార్గము.

జిబ్రాల్టరు జలసంధి - ఇది మధ్యధరాసముద్రమును, అట్లాంటిక్కు- మహాసముద్రమును కలుపు జలసంధిమార్గము.

డార్డినల్సు జలసంధి- దీనిని తురుష్కులు హెల్లిస్పాంటనియెదరు. ఈజియన్సీ, మార్మొరాసముద్రములంగలుపు జలసంధి.

బాస్ఫరస్- మార్మోరాసముద్రమును, బ్లాక్సీ లంగల్పు జలసంధి.

గ్రేటుబెల్టు- బాల్టికు సముద్రముఖమున గల జలసంధి.

లిటిల్ బెల్టు- బాల్టికు సముద్రముఖమునంగల జలసంధి.

సౌండు- బాల్టికు సముద్రముఖమునం గల మార్గము.

నార్తుఛానెల్- ఉత్తరదిశకేగు మార్గము. సముద్రశాఖ

సెంటుజార్జెన్ ఛానెల్- ఐరిష్ సీ నుండి దక్షిణముకు సముద్రమార్గము.

బానిఫేషియోజలసంధి - కోర్సికా, సార్డీని యాలనడుమ జలసంధి

మెస్సీనాజలసంధి- ఇటలీ, సిసిలీల నడుమ జలసంధి.

ఒట్రాంటోజలసంధి- ఎడ్రియాటిక్కు సముద్రమున జలసంధి.

డార్డనెల్స్- బ్లాక్సీ, సీ ఆఫ్ ఏజాన్సలం గలుపు జలసంధి

ఐరోపాలోని పర్వతము లెక్కువ ఎత్తైనవి కావు ముఖ్యములు పేర్కొనబడుచున్నవి అగ్ని పర్వతములును చాల తక్కువగాంగలవు

యూరల్ పర్వతములు - ఇది పర్వతపజ్త్తి ఐరోపా కీశాన్య సరిహద్దున రష్యా సైబీరియాల నడుమనున్నది ఇందు రత్నములగనులు సుప్రసిద్ధములు. దీనియందెత్తుగల శిఖరము ౫,౪౦౦ అడుగుల ఎత్తుకలది గలదు.

కాకేసస్ పర్వతపజ్త్తి- ఐరోపా కాగ్నేయమున నున్నది. దీనియందెత్తైన శిఖరము ఎల్బ్రుజ్ ౧౮,౫౦౦ అడుగుల ఎత్తు.

ఆల్ప్సు పర్వతములు - ఐరోపా మధ్య పీఠభూమియందున్న పర్వతములు. వీనియం దెత్తైన శిఖరము మాంట్ బ్లాంకు (శ్వేత శిఖరము) ౧౫,౦౦౦ అడుగుల ఎత్తు. ఐరోపా మధ్య భాగమున నొక పీఠభూమి ౭,౦౦౦ అడుగుల ఎత్తైనది కలదు. అందాల్ప్సు పర్వతములున్నవి. వీటియందు ౮,౦౦౦ అడుగుల ఎత్తు నుండి ఉపరి భాగము మంచుచే గప్పంబడియుండును. ఆల్ప్సునందున్న లెక్కకు మీరిన లోయలు, చక్కని పచ్చిక బయళ్లు, గోగ్రాసపు భూములుగ నున్నవి.

ఎపినైను పర్వతపజ్త్తి- ఇటలీ దేశములోనిది. ఇది ఆల్ప్సునుండి బయలుదేరునదిగా నున్నది. సగటున ౪,౦౦౦ అడుగుల ఎత్తుగలను ఇందలి ఎత్తైన శిఖరము మాంట్‌కార్నో, ౯,౫౮3 అడుగుల ఎత్తు మంచుచే గప్పంబడి యుండును.

కార్పేతియను పర్వతపజ్త్తులు - ఆస్ట్రియా హంగేరీలయందు కలవు. ఇందెత్తైన శిఖరము ౮,౭౩౭ అడుగుల ఎత్తు గలది.

బాల్కను పర్వతములు - గ్లాక్సీనుండి టర్కీ గుండా వ్యాపించిన పర్వతములు ఇవి కార్పేతియను పర్వతముల నుండి బయలు దేరినవిగా నున్నవి డాన్యూబునది లోయగుండా కలవు. సగటున 3,౦౦౦ అడుగుల ఎత్తనియనెదరు. ఇందలి ఎత్తైనశిఖరము టెహార్‌డాగ్ (Tebardagh) ౯,౮౪౦ అడుగుల ఎత్తుగలది కలదు.

పిరనీస్ పర్వతములు- ఫ్రాన్సు, స్పెయిను దేశముల హద్దున నున్నవి ఇవి సగటున ౭౦౦౦ అడుగుల ఎత్తనియు, వీనియం దెత్తైన శిఖరము ౧౧,౧౬౮ అడుగుల ఎత్తనియు చెప్పంబడినది.

కాంటాబ్రియను పర్వతములు- బే ఆఫ్ బిస్కే సముద్రమునకు దక్షిణముగా నున్నవి. ఇవి పిరనీస్ సంబంధము.

సెవెనీస్ పర్వతములు - ఫ్రాన్సు దేశమున ఆగ్నేయ దిశయందున్నవి.

సిరానివాడా పర్వతములు - ఇవి స్పానిషూ దేశపు పీఠభూమియందున్నవి. దీనియందెత్తైన శిఖరము ముల్హాసెన్ శిఖరము (మంచు శిఖరమని యర్థము). ౧౧,౬౬౧ అడుగుల ఎత్తు.

స్కాండినేవియను పర్వతపఙ్క్తి - నార్వేదేశమున ఉత్తర సముద్రతీరము నంటి వ్యాపించి యున్నవి. నార్వే స్వీడనులు కలసిన ద్వీపకల్పమునకు స్కాండినేవియా యని పేరు. దానినుండి ఈపేరు కల్గెను. వీని మధ్యభాగమున వీటికి డోవ్రిఫీల్డు పర్వతమని పేరు ఈ పర్వతపఙ్క్తి యందెత్తైన శిఖరము గాల్డుహోపిగ్ శిఖరము ౮,౧౪౬ అడుగుల ఎత్తుగలది.

డోవ్రిఫీల్డు పర్వతము - స్కాండినేవియా పర్వతపఙ్క్తి మధ్యభాగము.

గ్రాంపియన్పర్వతములు - స్కాట్లాండు దేశమునగల పర్వతపఙ్క్తి. ఇందెత్తైన పర్వతశిఖరము బెన్నెవిస్ ౪,౪౦౬ అడుగుల ఎత్తు.

వెసూవియస్ అగ్నిపర్వత శిఖరము - ఇటలీ దేశమున నేపిల్సు నగరమునకుఁ గలిపయి దూరమునఁ గలదు.

ఎట్నా అగ్నిపర్వత శిఖరము - సిసిలీ ద్వీపమున నున్నది ఎత్తు ౧౦,౮౪౦ అడుగులని చెప్పఁబడినది.

స్ట్రాంబెల్ అగ్నిపర్వత శిఖము - ఇది లిపారీ ద్వీపమునందున్నది. సిసిలీకి (సిసిలీ కుత్తరదిశను) జేరిన ద్వీపము. మెడిటరేనియన్సీలోనిది.

హెక్లా అగ్నిపర్వత శిఖరము - ఇది ఐస్లాండు ద్వీపమందున్నది.

ఐరోపాఖండపు నదులు సర్వసాధారణముగ వాయువ్య దిక్కునకుగాని, ఆగ్నేయ దిక్కునకుంగాని ప్రవహించును. ఏలనన నీరెండు వైపులకు భూమి ఏటవాలుగ నించుక తగ్గియున్నది. ఇంకు ఆగ్నేయదిశ ఏటవాలుప్రదేశము పెద్దదిగానున్నది.

పెచోరానది - ఉత్తర వాహినియై ఆర్కిటిక్కు మహాసముద్రము నందుఁ జేరుకొనును. పొడవు ౯౦౦ మైళ్లు.

డ్వైనానది - వైట్సీ యందుఁ జేరుకొనును. పొడవు ౮౦౦ మైళ్లు

డూనానది- రైగా సింధుశాఖ యందు సంగమించును.

విస్చులానది- బాల్టిక్కు సముద్రమున సంగమించును. పొడవు ౫౭౦ మైళ్లు.

ఓడర్నది- బాల్టిక్కు సముద్రమున సంగమించును.

ఎల్బునది- నార్తుసీ లేక జర్మనోషనుసంకు కలియును. ౬౩౦ మైళ్లు.

వేసర్నది- నార్తుసీ లేక జర్మనోషనుసంకు గలియుచున్నది.

మ్యూస్నది- దీనిని మేస్నదియనియు నందరు ఇది నార్తుసీ యందు కలియును.

థేమ్సునది- దీనికి పొల్లింటిపేరు Tems అని యుండెను ఇది ఇంగ్లాండునందు లండను గుండా నడచి నార్తుసీయందు సంగమించును.

రైనునది- ఎడమతట్టు ఆర్నది, మొసెల్లీనది (మొసెల్నది) యును, కుడితట్టు నెకార్నది, మైన్నది ఉపనదులై తనయందు చేర, కల్పుకొని ప్రవహించుచు, ఉత్తర సముద్రముకడ ముఖద్వారముకడ గొప్ప డెల్టానేర్పర్చి అందనేక పాయలుగఁ జీలి సముద్రగామియగును. అందు ముఖ్యమగు పాయకు వాల్ అనిపేరు రైనునది పొడవు ౭౦౦ మైళ్లు. దీనిని The most picturesque river అనిరెదరు.

సీనునది- ఇది ఫ్రాన్సునందు పారిస్గుండా ప్రవహించి అట్లాంటిక్కు మహాసముద్రమునం జేరుకొనును. ల్యారునది (Loire), గారోన్ నది, డౌరో, టేగస్, గువాడియానా, గువాడ

నెక్కివర్ నది-ఇది అట్లాంటిక్కు మహాసముద్రమున సంగమించును.

రోనునది- ఇది ఎక్కువ ఒడిదుడుకుగ ప్రవహించుచు మధ్యధరాసముద్రమునందు సంగమించును.

పోనది - ఎడ్రియాటిక్కు సముద్రమున జేరును

నీస్టరునది (Dniester)- బ్లాక్సీయందు కలియును.

నిపర్ నది (Dnieper)- ౧,౧౦౦ మైళ్లు పొడవు బ్లాక్సీయందు చేరును

డాన్యూబునది - పొడవు ౧,౭౦౦ మైళ్లు. దీని లోయ ౩,౦౦,౦౦౦ మైళ్లు దీని ఉత్తరమున థీసునది (Theiss), ప్రూత్ నది (Pruth) యును, దక్షిణమున లీచ్ నది, ఇజార్ (Isar) నది, ఇన్ నది, డ్రేవినది, సేవనది యును ఉపనదులుగ తనయందు చేర్చుకొనుచున్నది. ఇది ఆల్ప్సు పర్వతముల నైరను, కొన్ని నదులతో గలసి పుట్టును

డాన్ నది - పొడవు ౧,౦౦౦ మైళ్లు రష్యాగుండా ప్రవహించి అజోపు సరస్సున సంగమించును.

వోల్గానది- పొడవు ౨,౦౦౦ ఇది ఐరోపాయందు పెద్దనది కాస్పియన్ సముద్రమున సంగమించును రష్యాదేశమునందె ౯,౯౦,౦౦౦ మైళ్ల లోయ

యూరల్ నది- కాస్పియన్ సముద్రమున సంగమించును పొడవు ౯౦౦ మైళ్లు

ఐరోపా ఖండము నార్తు టెంపరేటుజోను నందున్నది. అందొక చిన్నభాగము నార్తు ఫ్రిజిడ్ జోను నందున్నది గాన శీతలభూమి యని చెప్పవలయును. ఉత్తరమున శీతల మధికముగా నుండును. ఆర్కిటిక్కు మహాసముద్రమునుండి వీచు చలిగాలులు అతిశీతలములై యుండును. ఒక్కొకతరి ఆఫ్రికాలోని సహారాలోనుండి వీచు వేడిగాడుపులు శీతలవాయువు నెడలొని సమశీతోష్ణము గలుగంజేయుచుండును. లేనితరి ఇటలీ, స్విజర్లాండు దేశములందు వీచు ఫోహాన్ ఉష్ణవాయువుగను, అట్టి ఇతరపేర్లతో దక్షిణసీమలందు వేడిగాడుపులువీచి కొండలోయలందు నిల్వయైన మంచును కరుగంజేయు చుండును. సముద్రములనుండి వీచుగాలులు వేసవియందలి ఉష్ణమును, శీతలమును కూడ ఉగ్రత మడంగంజేసి యనుకూలపఱచుచుండును. తూర్పుదేశములందు సగటున చలిగాని, ఉష్ణముగాని అధికముగా నుండును. పండితులు పరిశీలించినవారు ఐరోపా శీతోష్ణస్థితిని ఒకద్వీపమునందలి శీతోష్ణస్థితివంటిదని యనుచున్నారు. పశ్చిమదిశను వర్షమధికము తూర్పున కేగినకొలంది వర్షములు తక్కువగా కురియుచుండును.

ఐరోపాదేశములందు ఇనుము, రాక్షసబొగ్గు, తగరము, సీసము, రాగి, పాదరసము, సైంధవలవణము, బంగారము దొరకెడిని అవి వేర్వేరు దేశములందు నెలియనగును. యూరల్ పర్వతసీమలందు బంగారు, రత్నములు విస్తారముదొరకుచున్నవి బ్రిటన్ మహాదేశమున ఇనుము రాక్షసబొగ్గు అధికముగ దొరకుచుండ, చేతిపనులు యంత్రములు మొదలగు ఇరుపనను లధికముగ జరగ వీలగుచున్నది. స్పానియాదేశము రాగి, సీసము, పాదరసము, కొంతవఱకినుము దొరకుటకుం బేరందినది. ఆస్ట్రియాయందు పాదరసమును, స్వీడనులో ఇనుము దొరకును.

ఐరోపాప్రజలు వ్యవసాయవిద్యను చక్కగ నెఱింగినవారైనను సగటున ఐరోపావ్యవసాయముపై నాధారపడిన భూములు ఎక్కువగాకలది కాదని చెప్పవలయును. ఇందు ఫలించుపంటలు ఆయాదేశములందు తెలియనగును. పండ్లతోటలు

శీతోష్ణతవలనను బాగుగనేకలవు. ద్రాక్షలు, బంగాళ దుంపలు సమృద్ధిగ పైరగుచున్నవి.

నార్తులాటిట్యూడ్ నందు 64 డిగ్రీలదనుక గోధుమలు పైరగును. 65 డిగ్రీలదనుక ఓటు ధాన్యమును, 67 డిగ్రీలవఱకు రై (Rye) ధాన్యమును, 70 డిగ్రీలవఱకు బార్లీధాన్యమును పైరగుచుండును. ఆలివ్‌చెట్లు 44 డిగ్రీలవఱకుం జక్కగ పెరిగి కాయును ఆపిల్ 55 డిగ్రీలవఱకును, ద్రాక్షలు 51 డిగ్రీలవఱకును, పీర్పండు, చెట్లు, చెర్రీచెట్లు, ప్లంపండ్లచెట్లు 63 డిగ్రీలవఱకును పెరిగి ఫలించును అడవిజాతి ఫిర్ (Fir) వృక్షములు 68 డిగ్రీలవఱకును, Willow and Birch వృక్షములు 70 డిగ్రీలవఱకును,చక్కగ పెరుగును. ఉత్తరమున కటనుండి ఏగినకొలది చెట్లు పెరుగుట తగ్గి పొట్టివగుచుండును. కఠిన శీతలప్రదేశముల నవి కొన్ని అంగుళముల పరిమాణమునకు మాత్రమే యెదిగి వృద్ధాప్యదశ నందును

ఐరోపాయందు సింహములు, పెద్దపులులు, చిరుతపులులు లేవు. ఉత్తరపు మంచుప్రదేశములందు రైన్‌డీర్ మృగములును, ఎస్కిమో జాతి కుక్కలును మంచుపై స్లెడ్జెస్ నీడ్చుచుండును. అచట నే యితరమృగములు జీవించవు గాని, ఒక్కొకచోట తెల్లయెలుగుబంట్లు, తోడేళ్లు అడవిమృగములుగ నున్నవి. దక్షిణదేశములందు గుఱ్ఱములు, ఎద్దు, దున్నలు, గొఱ్ఱెలు, మేకలు, పందులు, కుక్కలు, గాడిదలు, పిల్లులు కలవు. రష్యా దక్షిణభాగములందు ఒంటెలు కలవు. స్పానియాదేశపు గాడిదలు పెద్దవిగను అందమైన మృగములుగను ఉన్నవి. కోతులు జిబ్రాల్టరునందు కలవు. దక్షిణదేశములందు పట్టుపురుగులు పెంచఁబడుచుండును.

తక్కిన ఖండములందుకన్న నైరోపాయందు జనసంఖ్య దట్టముగ నున్నది. సగటున చతురపుమైలునకు సాక్సనీయందు ౭౩౯ గురకును, బ్రిటిషు దీవులందు ౪౭౦ గురును, ఫ్రాన్సునందు ౧౮౭ గురును, రష్యాయందు ౪౬ గురును, నార్వేయందు ౧౭ గురును చతురపుమైలు ప్రదేశము నందు వశించు జనులుగ లెక్కింపఁబడినది. ఐరోపాప్రజలు కాకాసియను జాతులవారును, మంగోలియన్ జాతులవారు ననియు చెప్పఁబడినది. మఱియు పరిశీలకులు వీరిని లాప్సుఅనియు, ఫాస్కున్సు అనియు, కెల్టున్సు (Kelts) అనియు, లాటిన్సు అనియు, ట్యూటన్సుఅనియు, శాక్సన్సు అనియు, ఆంగ్లికన్సు అనియు, రోమానిక్సు అనియు, స్లావ్సు అనియు, టర్కున్సు అనియు, హామెక్ అనియు మొదలగు పేర్లిడియున్నారు, కాని, నిజమునకిసి వాడుకయందివి గానరాక వారు నివసించు దేశనామములు సంబంధపదములతే జాతినామముగ వాడుచున్నారు.

ఇంక ఇంగ్లాండు, వేల్సు, స్కాట్లాండు, ఐర్లాండు దేశములు గల్పి బ్రిటిషు దీవులనియు, ఇంగ్లాండు, వేల్సు, స్కాట్లాండులు కలసిన ద్వీపమునకు గ్రేటుబ్రిటన్ అనియు, నార్వే స్వీడనులు కలసిన భూమికి స్కాండినేవియా యనియు, స్పెయిను పోర్చుగలు దేశములు కలసిన భూప్రదేశమునకు ఐబీరియస్పెనిన్సులాయనియు, రుమేనియా, బల్గేరియా, గ్రీసు, యుగోస్లేవియా, రాష్ట్రములుకలసిన ప్రదేశమునకు బాల్కనుస్టేట్సు అనియు, హాలండు బెల్జియములుకలసిన ప్రదేశమునకు నెదర్లాండ్సు అనియు పేర్లు వాడఁబడుచున్నవి.

ఐరోపాఖండమునందలి దేశములు- బ్రిటిషు దేశము (ఇంగ్లాండు, వేల్సు, స్కాట్లాండు, ఐర్లాండులు), డెన్మార్కు, నార్వే (నార్గే), స్వీడను (సర్గె), రష్యా, జర్మనీ (౪ దేశములు, ౪ గ్రాండు డచ్చీలు, ౧ డచ్చీ), ఆస్ట్రియా, హంగేరీ, హాలండు, బెల్జియమ్, ఫ్రాన్సు, స్విడ్జర్లాండు,

స్పానియా, పోర్చుగల్, ఇటలీ,పాపాలుస్టేట్సు, గ్రీసుదేశము, టర్కీ, కేండియా, పోలెండు, జకోస్లోవేకియా, బాల్కనుస్టేట్సు, లక్సెంబర్గ గ్రాండుడచ్చి, ఐర్లాండుదేశములు.

## ఐరోపాలోని చిన్న సంస్థానములు

(Minor States of Europe) —

౧. అండోర్రా(Andorra in the Pyrenees)- ఇది ఒక సామంతము ౧౭౫ చతురపుమైళ్లు ౬,౦౦౦ జనాభా.

౨. డాంజిగ్ (Danzig)- బాల్టిక్కు సముద్ర తీరమునందున్న ఫ్రీ సిటీ సంస్థానము ౭౫౪ చతురపుమైళ్లు ౪,౦౭,౦౦౦ జనాభా గలది

3. లీక్టెన్స్టైను (Liechtenstein)- రైను నది పైభాగమునందున్న (Principality) సంస్థానము, అఱువది చతురపుమైళ్లు. ౧౨,౦౦౦ జనాభాగలది

౪ లక్సెంబర్గు (Luxemburg)- జర్మని, ఫ్రాన్సు బెల్జియములకు నడుమనున్న Grand Duchy వెయ్యి చతురపుమైళ్లు వైశాల్యము. 3.౦౦,౦౦౦ జనాభాగలది.

౫. మొనాకో (Monaco) రివైరా యందున్న Principality మాంటీకార్లో, జూదము లాస్ ఇందులోనిది ౨3,౦౦౦ జనాభా

౬. పాపల్ స్టేటు (Papal State)- పోపు గారి రాజ్యము. వాటికాన్ ఇందులోనిది. (వాటికాన్ చూడుడు,రోమకపురిచూడుడు).

౭. సేన్మారినో (San Marino)- ఇటలీ దేశములోని అపినీను కొండలలోనున్న ప్రజా ప్రభుత్వము. 3౮ చతురపుమైళ్లు వైశాల్యము గలది. పదమూడువేల జనాభా.

## ఐర్లాండుదేశపు కౌంటీలు

— తొల్లి యొకప్పుడైర్లాండు దేశము కౌంట్సు అను ఉద్యోగబిరుదనామముగల సామంతభూపతులచే పాలింపబడుచుండినది. ఒక కౌంటు పాలించిన దేశభాగమునకు కౌంటీ యనియు, లేక షైరు అనియు పేర్లయ్యెను నేఁటికవి పరిపాలనా విభాగములై మనదేశపు జిల్లాలంబోలియున్నవి. ఐర్లాండుదేశమున నిట్టి కౌంటీలు 3౨ కలవు. (ఐర్లాండుదేశము చూడుడు).

లీంచెస్టరు కౌంటీలు ౧౨- లాంగ్ఫోర్డుషైరు, వెస్టుమీాతుషైరు, మీాతుషైరు, లౌతుషైరు, కింగ్సుకౌంటీ, క్వీన్సుకౌంటీ, కిల్డేర్ షైరు, డబ్లిన్షైరు, కిల్కెన్నీషైరు, కార్లోషైరు, విక్లోషైరు, వెక్సుఫోర్డుషైరు.

అల్స్టరుషైర్లు ౯- డోనెగల్షైరు, లండన్డరీ షైరు, ఏన్ట్రిమ్షైరు, టైరోన్షైరు, ఆర్మాఘ్ షైరు, డౌన్షైరు, ఫర్మానాఘ్షైరు, మోనాఘన్షైరు, కేవన్షైరు

కన్నాటు కౌంటీలు ౫- మేయోషైరు, స్లిగోషైరు, లీట్రిమ్షైరు, గాల్వేషైరు, రాస్కామన్ షైరు

మున్స్టరు కౌంటీలు ౬- క్లేరుషైరు, టిప్పరరీ షైరు, కెర్రీషైరు, లిమరిక్షైరు, కార్కుషైరు, వాటర్ఫోర్డుషైరు మొత్తము ముప్పదిరెండు కౌంటీలు

**ఐర్లాండు దేశము** — ఐరోపాఖండమున బ్రిటీషుదీవులందలి యొక ద్వీపము. దీనికి స్వదేశస్తులు పాతుకొను పేరు ఎరిన్ (Erin) అని. ఆంగ్లభాషకులొసైన పిదప ఐర్లాండాయెను వైశాల్యము 3౨,౫౦౦ చతురపుమైళ్లు. ఇది చుట్టు సముద్రముగల ద్వీపమే. పశ్చిమతీరమున సముద్రము భూమిలోనికిం జొచ్చుకొనివచ్చి లోనననేక జలమార్గముల నేర్పఱిచియున్నది.వీటికి స్కాట్లాండు దేశమునందు వలె (Lough or Lochs) లోక్సు అని పేరు.

అట్టివాటియందు ఉత్తరమున Lough Foyle, Lough Swilly అనునవియు, పశ్చిమమున Galway Bay యును, నైరుతిదిశయందు Bantry Bay యును, ఈశాన్యదిశయందు Belfast Lough అనునదియు ముఖ్యములు. ఇట్టిజలములనడుమ మిగిలియున్న ఎత్తైన భూప్రదేశములకు హెడ్ అన్నిపేరు. అట్టివాటియందు డబ్లిను నగరము కడనున్న Howth Head అనఁబడునదియు, ఉత్తరమున Malin Head అనునదియు, దక్షిణమున Cape Clear Head అనునదియు ముఖ్యములైనవి. ఉత్తరమున రత్లిను ద్వీపమును, అచిల్ ద్వీపమును ఐర్లాండుకుఁ జెందిన పెద్దద్వీపములు. రత్లిను ద్వీపముకడ నొక పెద్ద బాటవలె దానికిరుప్రక్కల గల రాతిస్తంభములవలెను నైసర్గిక శిలాస్థలము వింతగ నుండెడిని. ఐర్లాండు యొక్క మధ్యభాగము సమతలము. పశ్చిమమునను దక్షిణమునను కొండలు కలవు. ఇందెత్తైన తావునకు Carntual అని పేరు అది 3,౪౧౪ అడుగులు ఎత్తుకలది షానన్నది (౨౨౪ మైళ్లు) బ్రిటిషు దీవులందు పొడవైన నది. ఇందు ౨౧3 మైళ్లు ఓడలు పోఁదగిన లోతుఁగల్గియుండును ఇది నైరుతి దిగ్వాహినియై Allon Lough, Ree Lough, Derg Lough లగుండా నడచి అట్లాంటికు మహాసముద్రమున సంగమించును. బారోనది తన ఉపనదియగు సూయిర్ నదిం గల్పుకొని ఆగ్నేయ వాహినియై సెంటుజార్జి స్ఫానెలు నందుఁగలియును. బోయిన్నదియు, లిఫేనదియు నీశాన్యదిశగా నడచి ఐరిష్‌సీ యందు సంగమించును. ఐర్లాండునందు సరస్సు లనేకములు కలవు Lough Neagh (లాక్నే) ఈశాన్యదిశయందుకలదు. చాలపెద్దది. కిల్లర్నే సరస్సులు చాలా సౌందర్యవంతములని పేరందినవి. భూమిసదా ఆకుపచ్చని పచ్చికతోఁ గప్పఁబడియుంటచే దీనిని Emerald Isle అనెదరు. మంచువిస్తారము పడుచుండు దేశము, భూములు చాలభాగము పశుగ్రాసోపయోగములైనవి. ఓటుధాన్యము, బార్లీ ధాన్యము, బంగాళా దుంపలు పైరుచేయఁబడు చున్నవి. సముద్రముల నుండి వీచు పశ్చిమగాలి తడియైనది. ఇది చాలముందుగా నీదేశమున వర్షింపజేయును ఐర్లాండునందు విషనాగములు లేవు

ప్రజలు కెల్టిక్ తెగవారు, అనగా స్కాట్సు వంటివారు. వారి Gaelic భాషవంటి స్వభాషను పశ్చిమభాగములందు వాడుచునేయున్నారు. ౧౮౪౧ నాటికి జనాభా చాల నిండియుండెగాని, అనగా 3౦,౦౦,౦౦౦ కు దాటెగాని, ౧౮౪౭ కాటకమును, దానితో నమెరికా వలసపోవుటయు, ప్రజలు తగ్గిపోవుటకుఁ గారణములు నెన్న, లినెన్‌బట్టనేత తప్ప, చేతిపరిశ్రమలు లేవు. అల్‌స్టర్ ప్రజలు ఎక్కువ శ్రమపడి పనిచేయువారును, ధనవంతులు నై యున్నారు

మొత్తమున నైర్లాండుదేశస్థులు ఔదార్య సాహసములు కలవారు. సమయస్ఫూర్తి నెఱిగినవారు సాయిలాపాయిలాగా సంతోషించుచు, సంతోషింపజేయుచుండువారు ఒకమాట ప్రత్యుత్తరమీయఁదగిన తావులం దిరువదిమాటలను ప్రసంగించు నైజము కలవారు దేశమునందు రోమన్కాథలిక్కు క్రైస్తవమతస్థులు ఎక్కువమంది కలరు. కొందఱు ప్రొటస్టాంటు క్రైస్తవులు, కొంతమంది ఎపిస్కోపల్ చర్చివారు, కొందఱు ప్రెస్బిటేరియను క్రైస్తవులునుకూడ కలరు దేశమున మతనిర్బంధము లేదు.

తొల్లింటికాలమున నైర్లాండు ద్వీపము నాల్గు సంస్థానములుగనుండి నల్గురు భూపతులచే పాలింపఁబడుచుండినది. అవి ఉత్తరమునఅల్‌స్టరుస్టేటులు మధ్యను లీన్సటరు స్టేటు, కన్నాటు స్టేటు అను

రెండును, నైఋతి దిశయందు మున్స్టరు స్టేటుగను ఉండినవి. అవి యిప్పుడు ప్రోవిన్సులనంబడుచున్నవి. పిదప నివి ఏకీభవించినతరి డబ్లిన్నగరము రాజధానియై ఐర్లాండుపార్లమెంటు ప్రభుత్వస్థానములు గలుగుచుండెను. ఇంగ్లాండుతో చేరక గల్గుతరి సది లండనునకు చేరి పోయెను. ఇదియు నిర్లాండు, స్కాట్లాండులవలెనే ముప్పది రెండు కౌంటీలు లేక పైకములుగ విభజింపబడి యున్నది క్రీ. శ. ౧౮౦౧లో గ్రేటు బ్రిటను ప్రభుత్వమున గలసిపోయినది. ఇటీవల ఐరిషు ఫ్రీ స్టేటనియు, అల్స్టరు ప్రభుత్వముగను ద్వివిధములుగ పాలనగల్గి బ్రిటిషు ప్రభుత్వము నుండి విడివడెను

పట్టణములు

డబ్లిన్ నగరము - 3,౭౧,౦౦౦ జనభా దేశమున ప్రధాన నగరము. లిఫీనదిపైనున్నది. ఐర్లండు రాజధాని సౌందర్యవంతమైన నగరము ఇచట ట్రినిటీకాలేజి, విశ్వవిద్యాలయము సుప్రసిద్ధములు ఇది బ్రిటిషురాజప్రతినిధి నివాసము. దీనికి కింగ్సుటౌనను తావు రేవుస్థలము పశ్చిమముగా కతిపయదూరమునగల మేనూత్తనబడు తావున రోమనుక్యాథలిక్కు సర్వకళాశాల కలదు.

బెల్ఫాస్టునగరము - (౩,౮౭,౦౦౦) ఇది గొప్ప వర్తకస్థానము, చెలీపనులు, ఓడలుగట్టు తావులును గలవు

కార్కునగరము - (౭౦,౧౦౦), కార్కునిన స్వదేశ భాషయందు బురదనేలయని యర్థమట. ఇట గొప్ప హార్బరుగలదు, భోజన పదార్థముల వర్తకము కలదు. కార్కు ప్రజల కన్యోన్యానురాగము మెండు. పరిచయములేకుండినను ఇతర తావులందుండిన కార్కువారు ఏకస్థులైయుందురు. వృత్తినిగాని, స్థితిగతులంగాని వాటించక అభిమానులై యుందురు.

లిమరిక్కుపురము- (3౮,౦౦౦), షానోన్ నది పైనున్న రేవు పట్టణము. లేసు అల్లికలకు చేరందినది.

లండన్డెరీపురము - (33,౦౦౦). ఉత్తరమున ఫోయిల్నదీతీరము, భోజన పదార్థముల వర్తకమున్నతావు.

ఆర్మాపురము - ఇది ఆర్చిబిషప్పుగారి నివాసస్థానము.

వాటర్ఫోర్డు - విశేష వర్తకముగల రేవుస్థలము. సూయి నదీతీరము

డ్రాయెడాపురము - వెనుకనిట ౧౬౯౦ లో యుద్ధము జరిగెను

కిల్కెన్నెపురము - ఉన్ని బట్టలనేత గల పురము

గాల్వే - రేవు పట్టణము.

స్లిగో - రేవు పట్టణము.

యోఘాల్పురము - ఇట నాదికాలమున సర్ వాల్టర్ రేలీగారి భూములందు బంగాళాదుంప వ్యవసాయము తొలుత జేయబడెనట వారికిట నివాసభవన ముండెనట.

**ఐలండు(గ్రీసుభాగము** — గ్రీసు దేశములోని భాగము (గ్రీసుదేశముచూడుడు). ఇందు డిలోసుద్వీపము, ఆండ్రోసుద్వీపము, నాక్సిసుద్వీపమును పెద్దవి, ముఖ్యములు.

**ఐలారము** — ఇది యొక వనమూలిక యని తలంపబడుచున్నది. దీనిచెట్టు యెఱ్ఱగలిజేసు చెట్టువలె నుండునందురు. విరేచనముకాజేసి మూత్రమును విస్తారముగ వెడలించి ఉబ్బు జాడ్యము నివారించుననియు, జలోదరము, మేహకారకము, అత్యుష్ణములు, క్షయరోగముల ఉధృతము నివారించునందురు.

**ఐక్ష్వాంకసగోత్రము** — కుండినగణము చూడుడు.

**ఐశ్వర్యము తగ్గితే ఆకలి ఎక్కువయగును** — ఆంధ్రలోకోక్తి

**ఐశ్వర్యమున కంతములేదు** — ఆంధ్రలోకోక్తి.

**ఐశ్వర్యములు ౮** — ౧. ధనము, ౨ ధాన్యము, 3. సంపద, ౪. జయముసిద్ధించుచుండుట, ౫. ధైర్యము, ౬. ఆయుధబలము, ౭. రాజ్యము, ౮. మోక్షార్హమగుచర్య. వీనిం గల్గియుండుటను అష్టైశ్వర్యములం గల్గియుండుట యనంబడును.

మఱియు వీటినె ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, సంపల్లక్ష్మి, జయలక్ష్మి, ధైర్యలక్ష్మి, (ఆయుధ) బలలక్ష్మి, రాజ్యలక్ష్మి, మోక్షలక్ష్మి అని యష్టలక్ష్ము లందురు.

ఇంకను ౧. దాసీజనము, ౨ భృత్యులు, 3. పుత్రులు, ౪. మిత్రులు, ౫. బాంధవులు, ౬. వాహనములు, ౭. ధనము, ౮. ధాన్యములు గూడ నష్టైశ్వర్యము లనంబడును.

**ఐస్లాండ్‌స్పార్** — ఇది స్వచ్ఛమై, రంగులేని Calcite అని పోల్పంబడినది ఐస్లాండు ద్వీపమున దొరకుటచే నీపేరందినది దీనికి Double refractive Power గలదట. సూక్ష్మ పరిశోధనములు చేయుటయం దుపయోగించు చుందురట.

**ఐస్లాండుద్వీపదేశము** — ఐరోపా ఖండములోని డెన్మార్కుదేశమునకుం జెంది, అట్లాంటిక్కుమహాసముద్రమున నుత్తరభాగము నందున్న ద్వీపము. ఐర్లాండునకంటె నిదవవంతు పెద్దదేశమని చెప్పంబడినది. ఇది ఆర్కిటిక్ సర్కిల్ కడ నున్నదిగాన చాల శీతలప్రదేశము. ఇట్లనుటవలన ఐస్లాండుపేరునకు మంచుసంబంధార్థము కాదు. ఇది జైడుభాషయందలిపదము. ఐస్లాండనిన ఐలెండు, అనగా ద్వీపమని యర్థము. ఈ మాటయందు మంచుసంబంధ మేమియును లేనేలేదని తెలియంగునది.

ఐస్లాండుదేశము తొల్లింట నెప్పుడు నొక ప్రభుని పాలనక్రింద నుండియుండలేదు. ప్రజలే రాజ్యకార్యనిర్వాహణ మొనర్చుకొనువారు. ఆ సభకు ఆల్తింగనిపేరు. ఆ సభలుకూడు తావునకు ఆల్మన్నాగ్జా అనిపేరు అది తింగవెల్లీరు కడ నున్నది. తింగవెల్లీ రనిన సభాభూమియని యర్థము. ఐస్లాండు అదిని నాడోడు అను దొంగల నాయకునిచే క్రీ. వె. తొమ్మిదవ శతాబ్దమున కనుంగొనంబడినదట. పిదప Ingolf అనువాఁడును, Hjorleif అనువాఁడును, (నార్వేజియను సామంతనృపులు) వారితో కొందఱనుచరులు నట వలసచేరిరట. ఇది క్రీ వె. ౮౭౪ అని చెప్పంబడినది. నేటికిని వారు దిగిన తావులను Ingolfshofdi అనియు, Hjorleifshofdi అనియు పిలుచుచున్నారు. ఐస్లాండు దేశభాషయందు Hofdi అనిన రేవనియో, తావనియో యర్థమట ఆ కాలపు ఐస్లాండుచరిత్ర పాటలందు కలదు. దానికి Landnamabok అనిపేరు. పిదప ననేకులు చేరిరి వీరు నార్వేదేశస్థులు. క్రీ. వె. ౧౦౦౦ మొదలు క్రైస్తవమతస్థులైరని చెప్పుదురు దేశమప్పుడు నార్వేక్రిందనే యుండెను. పిదప నార్వేతోసహా డేనుల క్రిందికి వచ్చెను. తరువాత నార్వే వేఱైపోయినను ఐస్లాండు డెన్మార్కుతో కలసియేయున్నది. ప్రజలు ఐస్లాండర్సు అనంబరగుచున్నారు. లూథర ప్రధాన క్రైస్తవులు. రైక్జావిక్కుపురము ప్రధాన నగరము. ఇది రేవుపట్టణము. వర్తక స్థలము. నదులు పెద్దవిలేవు.

ఈ దేశమున జలపాతములు, జల బుద్బుదములు, వేడినీళ్ళయూటలు, ఉద్ధృతజలవినోదములు, చూడదగినవెన్నియో కలవు. మంచు

మఱుముఖైన గుహాలు కలవు. హెక్లాయనిపేరుగల యగ్నిపర్వతము సుప్రసిద్ధమైనది. ప్రజలు అతిథి అభ్యాగతుల నెక్కువగా నాదరించి భోజన మిడుదురు. ఈదేశమున సుర్తస్సకేవ్ (గుహ) మాచుతో చేయబడిన చిత్రవిచిత్రముల ఆకారములు, వింతలు, గదులు, వావిములు గల గొప్ప గుహ చూడదగినది. సుర్తగు తొల్లింటి కాలపు రాక్షసుడని వారనెదరు (డెన్మార్కు దేశము, ఐరోపా, ఫారోయీద్వీపముచూడుడు)

**ఐస్ బెర్గ్** (Ice Berg)-ధృవప్రదేశము (Polar regions) లందుండు గ్లేసియరుల నుండి విరిగిపోయిన మంచు ముక్కలు. ఇవి పర్వతములవలెనుండి నీటిమీదుగా తేలుచు పోవుచుండును. ఓడలకుండాకిన వాటిని చితుకగొట్టగలవు గాన, నావికులు వీటికి చాల వెరతురు. ఇవి ధృవప్రదేశములందాటి యివ్వల కేతెంచుకొలది కరఁగిపోవును. వీటి శీతలము కడుదూరము వ్యాపించి గాలిని శీతలముగ నొనర్చును. గ్లేసియరు చూడుడు.

**ఐస్ ఏజిసిద్ధాంతము**(మంచుకాలము) తొల్లింటి యాదికాలమున నుత్తరభూగోళార్ధమున ఉత్తర ధృవమునుండి భూమధ్యరేఖ దెసను ఏబది డిగ్రీల ప్రదేశము మంచుచేఁ గప్పంబడి యుండె ననియు, అది రాను రాను భూమధ్యరేఖ నుండి ఉత్తరదిశకు క్రమముగ వెచ్చనగుచు మంచు కరఁగి భూమి, పర్వతములు మొదలగునవి బయల్పడుచు నిప్పుడున్న రీతిగనై, ఇంకనూ అగుచున్న దను సిద్ధాంతము.

ఉత్తర దేశములం దచ్చటచ్చటఁ గన్పించు గ్లేసియరు హిమనిలయము లీకాలమునాఁటి హిమశేషములేయనియు, గొప్ప గొప్ప పర్వతములం దీ సిద్ధాంతమునకు పెక్కు యానవాళ్లు కలవనియు కొందఱు పరిశీలకు లనుచున్నారు.

దీని దక్షిణపు టెల్ల ఇంగ్లాండు దేశమున లండను నగరము దనుకను, వేల్సుదేశమంతయు ఐర్లాండు దేశభాగములు, ఆల్ప్సుపర్వతములు, పిరినీసు పర్వతములు, కనడాదేశము మున్నగున వింకులోనివే యని యందురు.

---

## ఒ అక్షరమునకుం జెందిన క్రైస్తవ నామములు —

**Octavia, Octavie, Octave**- లాటిన్పదములు, ఎనిమిదవ సంతానమని యర్థము. దీని నుండికలిగిన ముద్దుపేరు Tavy. Octavia అనునామె రోమకచక్రవర్తి అగస్టసు తోఁబుట్టువు. ఈమె సుందరియు, సద్గుణవతియునై యుండెను. అక్కాలమున పెక్కండ్రీమె పేరిడ నారంభించిరట.

**Odile, Odila**- ట్యూటోనిక్కు పదములు, సమృద్ధి యని యర్థము.

**Olga**- రష్యను పదము, పవిత్రతయని అర్థము. St. Olga ఋషిపేరు.

**Olive, Olivia**- లాటిన్పదములు, అర్థము స్పష్టము.

**Olwen**- ఐరిషుపదము.

**Olympia, Olympias, Olympie**- గ్రీకు పదములు, స్వర్గమని యర్థము. ఇది **Alexander the Great** తల్లిపేరని ప్రచారముండినటుల తలంపఁబడుచున్నది.

Ondine- లాటిన్పదము.

Onora, Orore- లాటిన్పదములు, గౌరవనీయమని యర్థము. Honora యొక్క వికారరూపపదములు

Ophelia- గ్రీకుపదము, నాగమని యర్థము.

Ortensia- లాటిన్పదము, తోటవాఁడని యర్థము. Hortensia అంటి యర్థముగల పదమే దాని వికారరూపమే.

Osberta- ట్యూటోనిక్కు పదము, దేవునిసంబాధమగు తెలివి యని యర్థము. Osbert యొక్క స్త్రీవాచకపదము.

Ottilie- Ottilia- ట్యూటోనిక్కు పదములు, సుఖకరముగ సంగరమొనర్చు పడుచు అని యర్థము.

Ottoline- ట్యూటోనిక్కు పదము, సమృద్ధియని యర్థము. Otto యొక్క స్త్రీవాచకపదము.

Owena- కెల్టిక్కు పదము, యౌవన యుద్ధవీరురాలని యర్థము. Owen యొక్క స్త్రీవాచకపదము

**ఒంటరులు (ధోరలు)** — తెలఁగాలు చూడుఁడు. ముసలిదైన అడవిపందికిగూడ ఒంటరి యనియెదరు.

**ఒంటికొమ్ము నీటిగుఱ్ఱము** — (Unicorn) ఇక్కాలపు నవనాగరికులు నమ్మకున్నను, తొల్లింటికాలమున స్కాట్లాండు దేశపుసముద్రముల నొంటికొమ్ము నీటిగుఱ్ఱములు, చీనాదేశమున డ్రేగను (Dragon). భరతదేశమున సింహళమున రక్కసులు, మనయరణ్యముల గండభేరుండపక్షులు, చక్రవాకములు, గోనాగసర్పములు, ఇంకను ఆంజనేయుఁడు, గరుత్మంతుఁడు, జాంబవంతుఁడును ఉన్నట్లు వాడుకలు కలవని యెల్ల రెఱింగినదే.

అట్లే స్కాట్లాండు దేశమేలుచుండిన నరపాలుఁ డొక్కం డొకతరి మారువేషమున సముద్రతీరమునం గూర్చుని యొకబాటసారిం గొన్నిప్రశ్నలడుగ నాతఁడును ప్రత్యుత్తరము లొసంగుచు, సముద్రపుగుఱ్ఱము తన్నుం గరుచుకొనిరాఁ దప్పించుకొన్నట్టులఁ దెల్పెనట. ఆభూపాలుం డాగుఱ్ఱముపోల్కి యడుగ నాతఁ డది గుఱ్ఱము వలెనేయుండి యెక్కువ వెండ్రుకలం గల్గియుండు ననియు, తలపై ముందునకేగు నొకకొమ్ము వంకరలేక గల్గియుండుననియు, నీటం బడుట కది వెఱవదనియుఁ దెల్పెనట. భూపాలున కది వినోదము గల్గింప తనరాజచిహ్నమున నారూపమును గూర్పించెనట. నాఁటాదిగ స్కాట్లాండుదేశపు రాజచిహ్నము (Coat of Arms) ఒంటికొమ్ము గుఱ్ఱముగ నేర్పడియెనట.

అట్టిజంతువునకు లాటిన్భాషయందు యూనికారన్ (Unicorn) అనఁదగు అనగా నొంటికొమ్ము గలదని భావము. తొల్లి స్కాట్లాండుదేశము స్వతంత్రరాజపాలన మందుండుతరి నాయేకశృంగాశ్వము జాతీయగౌరవముల నందు రాజచిహ్నమై యుండుచు స్కాట్లాండు దేశపుపాలకుఁడగు జేమ్సు ఆంగ్ల సింహాసనమునఁగూడ నాసీనుఁడౌటతో నాంగ్లరాజ చిహ్నమగు సింహమున కెదురుగ స్కాట్లాండు రాజచిహ్నమగు ఏకశృంగాశ్వము మమర్చబడి నేటికి నట్లె తనరారుచున్నది. ఇట్లు సింహము, ఏకశృంగాశ్వము (Unicorn) గూడ నొకే రాజచిహ్నమగుట స్కాట్లాండు ఇంగ్లాండుదేశముల యైక్య పాలనమును సూచించుచుండును.

**ఒంటిమిట్ట** — ఆంధ్రదేశమున నిదియొక గ్రామము. కడప మండలమున నున్న తావు. మెడ్రాసు సదరన్మరాటా రెయిల్వే బొంబై లైనుపై కడపనుండి పదునాల్గుమైళ్ల దూరము. ఇట కొండపై నొక శ్రీరామాలయము కలదు. దానిని ఒంటడు, మిట్టడు ననుపేరుగలవా రిర్వురు కట్టిరని ప్రతీతి కలదు. ఒంటిమిట్టమున

నొక్కెరాయి యని యర్థము భాగవతము నాంధ్రీకరించిన బమ్మెర పోతరాజు జివటివాడై యనియు, ఇచటనె భాగవతము తెనిగించెననియు, ఎందు చెప్పఁబడిన ఏకశిలానగర మిదియే ననియు కొందఱిటీవల క్రొత్తవాదమును బయలుదేరదీసిరి. కాని పరిశీలనలవలన నేకశిలానగరము ఒరుగల్లు (ఇప్పటి వరంగల్లు) అని స్పష్టపడినది.

**ఒంటిరెక్క వెల్లుల్లి** — ఉల్లి చూడుఁడు.

**ఒక అబద్ధమును కప్పుటకు నాల్గు ఇతరఅబద్ధము లాడవలసి యుండును** — ఆంధ్రలోకోక్తి

**ఒక కంచానతిని ఒక మంచాన పరుండేవారు** — ఆంధ్రలోకోక్తి

**ఒక కన్ను కన్నుగాదు ఒక కుమారుడు గతీగాదు** — ఆంధ్రలోకోక్తి

**ఒకచేయి ఎంతఊపినా చప్పుడు కాదు - రెండు కలసినప్పుడే చప్పుడగుట** — ఆంధ్రలోకోక్తి

**ఒకటేదెబ్బా రెండే ముక్కలు** — ఆంధ్ర లోకోక్తి

**ఒకనాట్రి విందు మరునాట్రికి మందు**—ఆంధ్రలోకోక్తి.

**ఒక రాజధాని నగరమున నితర దేశపు రాయబారుల స్థితి** — ఇతర దేశపు రాయబారులు (Foreign Ambassadors) ఆయాఇతరదేశముల రాజులకో, ప్రభుత్వములకో ప్రతినిధులుగాను, వారి దేశమునందలి ప్రభుత్వమున కాయావిదేశములతోఁ గల మైత్రికి సంబంధించినవారగుట నతిథులుగఁ జూడఁబడుదురు. వారి యుద్యోగ నివాసము (Official residence) ను, దానికి సంబంధించిన ఆవరణము నీదేశమునందుండినను, ఆయా విదేశప్రభుత్వమున కాక్రమాస్థము, అక్కడ ఆవరణములతో స్వాధీనపఱ్చఁబడియుండు నా యావరణమున నీదేశపు శాసనములమేరకైన పరిపాలనముగాక, ఆయావిదేశములందలి శాసనముల పరిపాలనమే జరుపఁబడును యాచారముగ నున్నది. కాన విదేశ రాయబారులను నిర్బంధింపవీలులేదు. వారిపై న్యాయస్థానపు తీర్మానములు చేయ వీలుండదు. ఆయావరణమునకు పన్నులు, బాదెలు విధింపఁబడరాదు. ఇంక యేమనిన, ఆయావరణప్రదేశమట్లు మిత్రభావము లుండునంతకాలము, ఆయా విదేశపు (చిన్న) ప్రదేశముగనో లేక ప్రదేశతుల్యముగనో ఎంచఁబడవలసినదిగనుండి ఎక్స్ట్రా టెరిటోరియల్ లేండ్ (Extra Territorial Land) అని చెప్పఁబడుచుండును.

**ఒకరికి ఉన్నదని దుఃఖపడుటతో ఒక కన్ను తనకులేదని దుఃఖపడుటతో ఒకకన్ను పోయినట్లు** — రెండు కన్నులుపోయినవని భావము (ఆంధ్రలోకోక్తి).

**ఒకఒరలో రెండుకత్తులిముడవు. ఒక తొడిమెకు రెండు కాయలు కాయవు** — ఆంధ్రలోకోక్తి.

**ఒకడూరి కనేకత్రోవలు** — ఆంధ్రలోకోక్తి

**ఒక్కామిజమ్** (Occamism)— విల్లియమ్ ఆఫ్ఒక్కామ్ (William of Occam) అనువాని తత్త్వశాస్త్రమునకు సంబంధించిన సిద్ధాంతము.

**ఒక్కొకరాయి తీస్తూంటే కొండ లైనాతరిగిపోతవి** — ఆంధ్రలోకోక్తి.

**ఒడయర్ వంశనృపతులు** — వీరు మైసూరురాజ్య మేలుచున్నవారు. యాదవ సంతతి క్షత్రియులు. చంద్రవంశము. ఇప్పటి మైసూరుప్రభువులు ఒడయర్‌లు.

**ఒడలు తిరుగుటకు కారణములు**- కొందఱు బాలురాడుకొనుచుతమకుతాము చుట్టు గిరగిర తిరుగుదురు. వారికి నొడలు తిరుగును. చాల నెత్తగు ప్రదేశములనుండి లోతు గల క్రిందికిం జూచితిమేని యొడలు తిరుగును. దీనిని కండ్లు తిరుగుచున్నవనియు ననుటకలదు. మేధావయవములోనికి రక్తముపోవుతరి నిట్లు ఒడలు తిరుగుననియూ లేక దృష్టి కొంచెము తప్పి (సరిగా గన్పించక ఎచ్చుతగ్గులుగా) కన్పించుననియు వైద్యశాస్త్రజ్ఞులు వోల్చిరి. పొత్తికడుపునందలి తబ్బిబ్బు దీనిగల్గించునని పండితులు నుడివియున్నారు. దీనిఫలితముగ చైతన్యము తాదాతుగా (Temporarily) పటిమ గోల్పోవును. యోచనశక్తి సరిగా నడువదు. కొంత చీకాకుగను, కొంత బాధగను దోచెడిని. గ్రహించుశక్తి సరిగానుండదు ఒక్కొకప్పుడు మన చుట్టుపట్ల మనకగుపడునదంతయు తిరుగుచున్నట్లగుపడును. పైత్యాధిక్యము దీనిం గల్గించునని కొందఱనెదరు. విశ్రాంతియు, శైత్యోపచారములును దీని నివారించునందురు.

**ఒడలు స్వాధీనంగాని ఇల్లాలు కాల్రిమట్టెలకుం గందినదట** — ఆంధ్రలోకోక్తి.

**ఒడలెరుంగని శివమాడువారుందురా?** — ఆంధ్రలోకోక్తి.

**ఒడ్డపూడి వెద్దయ్యకవి** — ఆంధ్రకవులయం దాధునికులలో పరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. కాస్యపసగోత్రుఁడు తండ్రిపేరు వేంకట్రామాత్యుఁడు. ఒడ్డపూడియను గ్రామమున కీతఁడు కరణమని తెలుచున్నది ఈతనికాలము కృష్ణదేవరాయని కాలముతర్వాతనియు, బహుశః క్రీ వె ౧౫౨౦ ప్రాంతమనియు, రా. బ కందుకూరి వీరేశలింగం పంతులువా రభిప్రాయపడియున్నారు.

ఈతఁడు రచించినది ఆంధ్రమున వాయుపురాణము దీనిని కొండపల్లె (కృష్ణామండలము) తూర్పుగానుండిన పురుషోత్తమపట్టణనివాసులగు దాసరి చినగంగయ్యచౌదరి (కమ్మవారు) కింగృతియిచ్చెను.

**ఒద్దిచెట్టు (మొండాశింగి)** — లా. Rhus odina అనియు, Odina pinnata అనియు, Asclepias gemenata అనియు పేర్లు.

సం. గృహద్రుమ, చక్షురవాహల (చక్షుర్వహన), మేషశృంగి, సర్వసాధారణముగ మొండాశింగి యని వాడెదరు. ఇది వైద్యోపయోగకరమగునది.

దీనిచెక్క రసము, లేక కషాయము, ఉబ్బురోగము, మధుమేహము, వమనములు, విషదోషములు, విదాహము, శీతజ్వరముల నడంచును. చెక్కను చూర్ణము (గుండ) చేసి నూనెం గల్పి పూసిన నన్ని వ్రణములు మానుననియు, ఒద్దికాయలు చేదుగ నుండి విరేచనముజేసి, ఆకలిని ధృఢపర్చి, కఫము, క్రిమి, కుష్ఠు, మేదోరోగము, మేహముల నడంచుననియుం జెప్పఁబడినది.

**ఒపేరా (Opera)** — గొప్ప వెలుతురు మూలమున Film బొమ్మలప్రదర్శనమున కనుబంధయుక్తముగ గ్రామోఫోనుపాటలం గల్పి కూర్చిన ప్రదర్శనము.

ఒపేరాచరిత్ర క్రీ. వె. ౧౫౯౭ లో ప్రారంభమైనను, ౧౬౩౭ లో వెనిస్‌నగరమున బహిరంగ

ముగ నొక ఒపేరా తెలుచువలకు వ్యాపకము గాంచలేదు. ఇటలీదేశస్థుఁడగు Ales Sandro Scarlatti అనునాయన దీనిరచయిత. ఆయన క్రీ. శ. ౧౬౫౯—౧౭౨౫ కాలమువాఁడు. ఆయన ఏర్పాటుమేరకు Recitativo secco అనియు, Recitativo stromento అనియు, ఇరుతెఱఁగులుగా నుండెనట. పిదప నారంభ మైన ఫ్రెంచిదేశపు ఒపేరా ఇటలీదేశపుగానమునే పాడినది. ఆంగ్లదేశమున ౧౬౩౦లో ప్రారంభమై అభివృద్ధినందిన ఇప్పటిరూపముగాంచిన భరతదేశము నకుఁ జేరియున్నది.

**ఒమార్ ఖాయ్యామ్ కవి** — ఈమహనీయుని ఒమార్ ఖాయ్యామ్ హాకీమనియు నందురు. పారశీకదేశీయుఁడు. క్రీ. శ. ౧౦౭౧—౧౧౨౩ కాలమువాఁడు. గొప్ప కవి ఖగోళశాస్త్రవేత్తయగు జ్యోతిష్కుఁడు గణితశాస్త్రవిశారదుఁడునై యుండెను. ఖొరాసానుదేశమున నిషాపూర్ నందు జన్మించినవాఁడు. పెర్షియన్ కాలెండరును సంస్కరించి యుద్ధరించినవాఁడు. అనేక జ్యోతిషపథకములం జేర్చిన విద్యానిధి. అంకగణితమునను పెక్కు పథకములు కల్పించి వన్నె దెచ్చినవాఁడు. ఒక ఆల్జిబ్రా గ్రంథమును జేసి పేరందెను. ఈకవికృతమైన రుబాయత్ అను గ్రంథము మిక్కిలి పేరందినది. బహు రసవంతమైనది. ఈకావ్యము ముఖ్యప్రపంచభాష లన్నిటిలోనికి ననువదింపఁబడినది.

**ఒరావోఁజాతివారు** — వీరు ఛోటానాగపూరు ప్రోవిన్సునం దున్న కొండజాతి ప్రజలు

**ఒరిస్సాదేశము (ఓఢ్రదేశము)** — ఉత్కలదేశపు తొల్లింటి చరిత్ర వేఱుతావున వివరింపఁబడినది. బంగాళాఖాతపు తీరమునంటి ఆంధ్రదేశమునకుత్తరమునను న్నదేశము. గంజాము మొదలు బంగాళమునుక వ్యాపించియున్నది. వైశాల్య మించుమించు ౨౪,౦౦౦ మైళ్లుండునని అంచనా వేయఁబడినది. మహారాష్ట్రులు దీని నాక్రమించియుండిరి. వారినుండి క్రీ. శ. ౧౮౦౩ లో బ్రిటిషువారికి గలసిపోయినది. సముద్రతీరములు పల్లముగబురద గల్గియుండును. సముద్రపుపోటుపాటు లధికములు. లోనఁగల కొండలు చాల సారవంతములు. కొండలు అరణ్యమయములు, క్రూరమృగ యుక్తములుగ నున్నవి. మహానది, బ్రాహ్మిణి, వైతరణీనదులీదేశముగుండా నడచి బంగాళాఖాతముం జేరును. ఋషికుల్యానది ఆంధ్రదేశమువైపున కలదు. హుగ్లీ కటకముల నడుమ పంటకాల్వ నౌకల కుపయోగించుచున్నది. కొన్ని చిన్నచిన్ననదులు సస్యోపయుక్తము లైయున్నవి. కొండలప్రదేశము లనారోగ్యవంతములు, ధాన్యములు మొదలగు పంటలన్నియుంగలవు. ప్రజలు ఓఢ్రులు (ఉత్కలులు చూడుఁడు). కొండ ప్రదేశముల మన్యపుజాతులవారు వసించుచున్నారు. వారి భాష లనేకములు కలవు ఓఢ్రులు ఓఢ్రభాష మాటలాడుదురు. కొండల ప్రదేశములందు చిన్నచిన్న రక్షితసంస్థానము లనేకములు కలవు. వాటికి మహాలులందురు తీరమునం దుత్తరమున బాలేశ్వరంజిల్లా, దానిక్రింద కటకంజిల్లా, దాని క్రింద పూరీజిల్లాయుంగలవు. దానికిందక్షిణమున గంజాముజిల్లాయున్నది. (ఇది అచిరకాలముననే కొంత ఉత్కలదేశమునకును, కొంత ఆంధ్రదేశమునకుం జేర్పఁబడినది). మహాలుభాగములేగాక కొన్ని పెద్ద స్వదేశసంస్థానములును కలవు. దేశమున సగటున మూడింట రెండుభాగముల కన్న నధికముగనే స్వదేశసంస్థానముల రాజ్యములని యనుట అతిశయోక్తి కానేరదు.

కటకము ముఖ్యపట్టణము. ఇది మహానదియందలి ద్వీపమునందున్నది. ఇట మహానది

యుండానకిట్టయు, గొప్ప పంటకాల్వలు ప్రారంభ మగును. బట్ట, కలపవర్తకము విశేషముగ జరుగు చుండు తావు. దీని రేవు ఛండీబాలేశ్వరము (ఛాంద్బాలీ). ఇది మహానది ముఖద్వారముకడ నున్నది. దీనిని ఫాల్సుపాయింటని యు నందురు కటకమనిన దేశమధ్యమని యర్థమట. తరువాతఁ జెప్పఁదగినది పూరీపట్టణము. దీనిని జగన్నాథ క్షేత్రమందురు (చూడుఁడు). బాలేశ్వరము వర్తక స్థానము, రేవు నై యున్నది. వైతరణీనదీతీరమున నున్న జాజిపూర్ (యాజపురము) పుణ్యక్షేత్ర ముగ నున్నతావు. ఇట యజ్ఞవరాహ దేవస్థానము (యజ్ఞములతావు), విరజాదేవిదేవస్థానము (పార్వతీక్షేత్రము), నాభిగయ, సప్తమాతృకా దేవస్థానము మొదలగునవి కలవు. శ్రీజగన్నాథము (పూరీ) సుప్రసిద్ధ విష్ణుదేవస్థానము. ఇది రేవు పట్టణము ఇచటికిం గతిపయ దూరమున నున్న భువనేశ్వరము సుప్రసిద్ధ శివక్షేత్రము. పూరీ కిరువది మైళ్ల దూరమున కొనార్కమను నొకగొప్ప సూర్యక్షేత్రముండెను. అది యిప్పుడు భగ్నమై జగన్నాథదేవాలయము ఆవరణయం దొకచోట నుంచఁబడి యున్నది. పూరీపట్టణము పురుషోత్తమక్షేత్రమనంబరగుట నాపేరు ఆఙ్గ్లో చ్చారణయందు • పూరీ యనంబరగుచున్నది. ౧౯౩౬ సంవత్సరము ఏప్రిలుమాసములో ఒరిస్సా దేశ మొకప్రత్యేకరాష్ట్రముగ నేర్పరుపంబడి, ఒకగవర్నరుపాలనక్రింద నుండెను. గంజాము జిల్లా మన్యప్రాంతములు, పర్లాకిమిడి మున్నగునవి కొన్నియాంధ్రదేశమునకుఁ జెందినవే యైనను ఒరిస్సాలో నీసందర్భమునఁ జేరిపోయినవి.

**ఒర్ఛానంస్థానము** — సెంట్రలిండియా ఏజన్సీ రాజ్యములలో నొక చిన్న రాజ్యము. ప్రభువు బుందేలా క్షత్రియ కులోత్తంసుఁడు. ఈయనను బుందేల క్షత్రియులకుఁ గులపెద్దయు, మాన్యుఁడునని దెల్పుచున్నారు. సెంట్రలిండియా ఏజన్సీ చూడుఁడు.

**ఒనేబా క్షత్రియులు** — శిశోదియా క్షత్రియులు చూడుఁడు.

---

## ఓ అక్షరమునకుం జెందిన క్రైస్తవ నామములు —

**Oates** - నవీన పదము.

**Obadiah** - హిబ్రూ పదము, Servant of God అని యర్థము.

**Obed** - హిబ్రూ పదము, అర్చన యొనర్చు వాఁడని యర్థము.

**Octavius, Octavus, Octave** - లాటిన్పదము, ఎన్మిదవ వాఁడుగ జన్మించిన వాఁడని యర్థము. దీని ముద్దు పేర్లు Tave, Tavy. రోమకపురి నేలిన ప్రసిద్ధ సామ్రాటునకు Octavian Augustus అని పేరు

**Odo** - ట్యూటోనిక్కు పదము, Rich అని యర్థము.

**Offa** - ట్యూటోనిక్కుపదము, Wild boar అని యర్థము.

**Offley** - నవీన పదము.

**Ogilvie** - ఉచ్చారణ, O'gle-vy అని. నవీన స్కాచిపదము.

**Olaf, Olave, Ole** - ట్యూటానిక్కు పదము, పూర్వపు పదార్థమని యర్థము.

**Oliver** - లాటిన్పదము.

**Opie** - నవీన పదము.

**Orlando** - ట్యూటానిక్కు పదము, Fame of the land అని యర్థము. See Roland.

**Ormerod, Orme** - నవీన పదము.

**Orm** - ట్యూటానిక్కు పదము, నాగము అని యర్థము.

**Osbert** - ట్యూటానిక్కు పదము, Divinely Bright అని యర్థము.

**Osborn, Osborne** - ట్యూటానిక్కు పదము, Divine bear అని యర్థము.

**Oscar** - కెల్టిక్కు పదము, Bounding warrior అని యర్థము.

**Osmond, Osmund** - ట్యూటానిక్కు పదము, Divine Protector అని యర్థము

**Oswald, Oswold** - ట్యూటానిక్కు పదము, Divine power అని యర్థము St. Oswald ఋషిపేరు ఈపేరిటి భూపాలురును నుండెను.

**Othello** - ట్యూటానిక్కు పదము, Rich అని యర్థము.

**Other** - ట్యూటానిక్కు పదము, Happy warior అని యర్థము.

**Otto, Otho** - ట్యూటానిక్కు పదము, Same as Othello ఒక జర్మను రాజు పేరు. Rich అని యర్థము.

**Otway** - నవీన పదము.

**Owen** - కెల్టిక్కు పదము, Young warrior అని యర్థము. వేల్సుదేశమున వాడుక యందున్న పేరు.

## ఓంకార మాంధాత క్షేత్రము —

గ్రేటిండియన్ పెనున్సులా రెయిల్వే కాండ్వాసంధి మీాదుగా చిన్నలైనులో మూర్టిక్కాస్టేషనునుండి పదిమైళ్లదూరమున నర్మదానదియందలి ద్వీపము నందుగల శివక్షేత్రము. సర్వదాదేవళమున వినబడు చుండు ఓంకారనాదమునుండి పేరందినది. గొప్ప శివక్షేత్రము వింధ్యపర్వతప్రాంతము. దీనికెదురుగ నది కవ్వలనుండు పర్వతమునం గొంత యెత్తున అమరేశ్వర మనబడు దేవస్థానము కలదు. అమరేశ్వరము మహాలయక్షేత్రమని కూర్మపురాణము అ 3 యందు పేర్కొనంబడినది.

## ఓంకారము (ప్రణవము) —



ఓంకారమునకుం బ్రణవమనియు, తారాయనియు, తారకమనియు వాడుకనామములుకలవు ఓంకారము పంచ భూతములను రక్షించున దని చెప్పంబడినది. అమరకోశమునందు "ప్రకృష్టోనవః ప్రణవః" అనగా నమస్కరింపంబడం దగినది గాన ప్రణవ మనంబడునని చెప్పంబడినది. "తరంత్యనేనేతితారః" దీనిచేతం దరింతురు గాన, తారయనియు గూడ నందేకలదు. "ఓమితిజగ దఖిలాశ్యాత" ని చెప్పంబడియుండుటను, సూతసంహిత యజ్ఞవైభవ ఖండమున "ఓంకారశబ్దస్సర్వార్థవాచకః" అని చెప్పంబడియుండుటను, సర్వజగత్తును ప్రణవమగు ఓంకారము వివరించునని చెప్పవలయును కావుననే సర్వజగత్తును పరమేశ్వర నిజపదార్థ మగుట అద్వైత మతసిద్ధాంతమున 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అని ప్రణవమును పరమేశ్వరునిగం జెప్పియున్నారు. మాండూక్యోపనిషత్తు ప్రారంభము ననే ఓంకార వివరణముకలదు. ఓంకారమునందలి భాగములు- అ. ఉ. మ్. అనియు, అందు అ+ఉ= ఓ. యనియు, దానికి మ్. చేర్చ 'ఓమ్', లేక 'ఓం' అగు ననియుం జెప్పంబడియున్నది. ఈ మూడువర్ణములకు విశేషార్థము లనేకములు చెప్పంబడినవి. పరమేశ్వరుని యాజ్ఞ మేరకుం

గుమారస్వామి ప్రణవార్థమును వివరించి 'గురుస్వామి' యని పేరందెనని స్కాందమునందు చెప్పబడినది. హిందువుల వేదమంత్రముల నుచ్చరించునపుడు తొలుత బ్రణవముతో నారంభించెదరు. ఇంతియే గాక వేదము బాటించు నద్వైతులును, శైవులును, వేదమును సరకుగొనని వీరశైవులనబడుచున్న లింగాయతులును, అనైదికులనబడుచు ప్రత్యేక (త్రిపిటక) వేదము బాటించు బౌద్ధులును గూడ తామువపించు, పవిత్ర వేదమంత్రములందాదిని ప్రణవముంచి, మఱి యామంత్రజప మొనర్చుచున్నారు. ఇట్టి ప్రణవలక్షణములనే గల పవిత్రోచ్చారణ పదము పాశ్చాత్యులందు గ్రీక్కులలో లొగొస్ (Logos) అనునది యుండెను. దానిగూర్చి ఇక్కాలమున వివరించుట నిరర్థకము.

**ఓకోలొజీ** (Oecology) — ఎకోలజీ చూడుడు

**ఓక్సాలిక్ ఏసిడ్** (Oxalic Acid) - దీనికి సంజ్ఞ $H_2C_2O_4$ అనియు, దీనికి Solid organic అని వాడుక గలదనియు, మెత్తనికఱ్ఱల రంపపుపొట్టునుంచి చేయుదురనియు, రంగులందుపయోగించుననియు దెలియుచున్నది.

**ఓగ్హామ్ (వ్రాత విధానము** — (Ogam Writing) బ్రిటీషుదీవులందు రోమనులాక్రమించినదాదిగ పదియవ శతాబ్దకాలము వఱకు ఓగ్హామువ్రాతప్రచారమునందియుండెనట. ఇవి ఇఱువదియొక్క ధ్వనులు. ఇట్టి వ్రాతలు మూడువందల వఱకు దొరకినవని చెప్పబడినది. ఏనింజమువువిధానము Ballymote అనంబడిన వ్రాతప్రతియందు వివరింపబడియుండి దొరకినదట. అది పదునాలవ శతాబ్దపు ప్రతి యని తలంచుచున్నారు.

**ఓగిరాల జగన్నాథకవి** — ఆంధ్ర కవులలో, నాథునికులందు బరిగణింపబడినవాడు. ఆరువేల నియోగిబ్రాహ్మణుడు. ఆపస్తంబసూత్ర భారద్వాజసగోత్రజుడు. నివాసము ఏనామనుదరినున్న నీలపల్లి. తండ్రి వేంకటరాజు. రచించినది సుమనోమనోరంజనమను ప్రబంధము.

**ఓగిరాల రంగనాథకవి** — ఆంధ్ర కవులలో నాథునికులందు బరిగణింపబడినవాడు. రచించినది ద్విరేఫదర్పణమను వ్యాకరణగ్రంథము. ఈతడు పిండిప్రోలు లక్ష్మణకవికిని, శిష్టు కృష్ణమూర్తి శాస్త్రికవికిని సమకాలికుడని చెప్పబడినది.

**ఓఘు (ప్రవాహ) చతుష్టయము**- బౌద్ధమతధర్మమున ౧. కామము, ౨. భవము, ౩. దృష్టి, ౪. అవిద్య. ఈనాల్గును ఆగిపోవు వఱకు నడతెంపిలేక ధారవలెనే ప్రవహించునవి యని, ఓఘము (ప్రవాహము) లనిమెదరు.

**ఓఘవతీనది** — మార్కండేయ నది కీపేరుకలదు. పంజాబు గెజటీర్ పుట ౫ యందు (అంబాలాజిల్లా ౧౮౮౪ సం.) ఓఘవతీనది ఆపగ కాదని చెప్పబడినది. ఓఘవతీతీరమున పృథూదక ఉండెను దీనిని పిహోఅ యనుచున్నారు. దీనిని మార్కండేయ సరస్వతీసంగమమున నున్న పురముగ పోల్చియున్నారు. ప్రశంస వామనపురాణము ౫౮ యందు కలదు. మహాభారత శల్యపర్వము ౩౮ యందు జెప్పబడిన ఓఘవతి వేఱనితో చెదిని. ఆర్కియాలొజికల్ సర్వేరిపోర్టు ౧౪ వాల్యం ౮౮ పుటయందు చెప్పబడిన దిది కానేరదు.

**ఓజోకెరైట్** (Ozokerite) - ఇది ఘనీభవించిన (గట్టి పడిన) Hydro-carbon అనియు, ఇది ఖనిజసంబంధమనియు చెప్పంబడినది. తేనె మైనమువలె నుండునది. పెట్రోలియము

ఉన్న తావుల భూమియం దేర్పడి దొరకును. శోధ్యాత్తులు చేయుటయం దుపయోగించు చున్నారు.

**ఓజోన్ గాలి** - దీని సంజ్ఞ "$O_3$" అని చెప్పఁబడినది. ఇది ఆక్సిజెన్ యొక్క పరిణామ రూపము. దీనిని రసాయన శాస్త్రమున "This is a form of oxygen containing three atoms in the molecule against two atoms in the molecule of ordinary Oxygen" అని వివరింపఁ బడినది. ఓజోనులు పెక్కు గలవు. ఓజోను ఆక్సిజను యొక్క రూపాంతరము. వజ్రము కార్బనుయొక్క రూపాంతర మగునట్లుల కొన్ని కారణములచే ఆక్సిజెను ఓజోనై నదిగి నెఱుఁగఁబడినది.

ఓజోను ఉల్లివలెను, క్లోరిను వలెను వాసన గల్గి యుండును. దీనిం గాచిన ఆక్సిజెనుగ మారును. ఓజోను, నూనెలను, మైనములను, దంతమును పరిశుభ్రపర్చుట కుపయోగించు చున్నది. మఱియు దీనిని దాసోదకము గూడ పరిశుభ్రపర్చ నుపయోగింతురట.

కాని డాక్టరు బెంజామిన్ మూరు పండితుఁడు సముద్రతీరపు గాలియందలి ఓజోను వేఱుపదార్థమనియు, అది Nitrogen Peroxide అను పదార్థము గాని ఆక్సిజెన్ కాదనియుం దెల్ప వాదించు చున్నాఁడు. ఈయన National Institute for Medical Research సంస్థకుం జెందిన పరిశోధకుఁడు.

**ఓట్సు ధాన్యపువ్యవసాయము** — భరతదేశమునకు క్రొత్తగా పాశ్చాత్యదేశములనుండి రప్పింపఁబడిన క్రొత్తపంట. తొలుదొలుత సైన్యస్థానములప్రాంతభూములందు పైరుచేయఁబడుట ప్రారంభమై, క్రమక్రమముగ నితరప్రాంతములకు వ్యాపించినది. ఇది విస్తారము వేడిలేని సమశీతోష్ణప్రదేశము లందుఁ బైరుచేయఁదగినదిగఁ జెప్పఁబడినను, ఈదేశపరిస్థితులకు సరిపడి, ఇతర తావులందుకూడ పైరగుచున్నది. మీరటుజిల్లా, ఢిల్లీజిల్లా, హిస్సారుజిల్లా, పూనాజిల్లా, అహమ్మద్నగరుజిల్లా, అహమ్మదాబాదుజిల్లా, సతారా జిల్లాలం దీపైరు గాననగును. హిమవన్నగసీమలం దీపంట విస్తారముగఁ గలదు. ప్రశస్తమైన ఓటుధాన్య మచటనే గాననయ్యెడిని.

ఇది సర్వవిధముల యవలంబోలిన పంట. అట్టిభూములే దీనికిని సరిపోవుచున్నవి. మరమ్మతులు నట్టివియె (యవధాన్యపువ్యవసాయము చూడుఁడు). యకరమునకు ౧౦౦ పౌనుల విత్తనములుజల్లుదురు మూడు లేక నాల్గు నెలలలో పండి కోతకు వచ్చును. కోత నాలస్యముచేసిన గింజలు నేల రాలిపోవును ఆలస్యముచేసిన నాగడ్డికూడ పసువులకు రుచికరము గాదందురు. యకరమునకు ౧,౮౦౦ మొదలు ౨,౨౦౦ పౌనుల ధాన్యము పండును.

ఓటుధాన్యము గుఱ్ఱములకు దాణావేయుదురు. పిండి రొట్టెలు జేతురు. గడ్డి గుఱ్ఱములకు బలకరము. వేడిదేశమునపాలములకు నీరుకట్టి పెంచుచున్నారు. నీరసపడి చెడిపోయిన పసువులకు పచ్చిఓటుగడ్డి మేపుటవలన సతిత్వరితముగ నారోగ్యవంతములగుటయేగాక బలియఁజేయును.

**ఓటోమాన్ తురుష్కులు** (Ottoman Turks) — వీరు సెల్జూక్ తెగకుంజెందిన తురుష్కులు. క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతముల వీరికి ప్రధాననాయకుఁడుగా నుండిన ఉత్మాను (లేక ఉస్మాను) అనువానినుండి వీరి కీపేరయ్యెను. ఐరోపాప్రభుత్వములవారు వీరిని ఇట్లు వ్యవహార సంబాధముల వాడుచుండిరి. (పోర్టీ చూడుఁడు).

**ఓడలు** — నీటిమీదఁ దేలుచు బయనములుచేయునవి ఓడలనియు, దీని రాక పోక ప్రయాణమునకు 'సబురు' అనియు వాడుదురు. తొలుత వెదురు



తెప్పలుగా కట్టినవాటితోఁ బ్రారంభమయి, పిదప కఱ్ఱదుంగలుఁ జేర్చి కొంతయాకారముఁ గుదిర్చి చేసిన నావలుగనై రానురా నభివృద్ధిం జెంది తెరచాపలు ఏర్పడి పెద్ద పడవలై, నేఁటికి పెద్దపెద్ద పొగయోడలుగ నావిరిబలముచే నడచుచు ననేక రూపములు గలవిగఁ దనరుచున్నవి.



ఇంచుక పెద్దదియగు పడవ

ఇంకను యుద్ధమున కనుకూలించునట్టుల ఆయుధములం ధరించినవి వేర్వేఱు తెఱంగుల నిర్మింపఁబడినవి కలవు. ఈ నావికా నిర్మాణవిద్య ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు, జపాను దేశములందు చక్కగ నభివృద్ధి నందియున్నది. అమెరికాదేశమున నిటీవల బాగుగ వ్యాపించి అభివృద్ధిగ నున్నదని చెప్పవలయును.

పొగ యోడలు ఏర్పడుట కిక్కాలమున మహాసముద్రములే గాక జలసంధులు లోతుచేయఁబడియు, కాల్వలు త్రవ్వఁబడియు, దారుల పొడవునను మార్గములం జూపు దీపస్తంభము లమర్పఁబడియు, ఓడలునిలచి సరకు లెక్కించుకొనుట, దింపుటల కొఱకు రేవులందు హార్బరులు (నిలుచుస్థానములు) ఏర్పరుపఁబడి నిర్మింపఁబడినవి కలవు.



ప్యాసింజరు స్టీమరు

ఇక్కాలమున పొగ యోడలు నీటియావిరి యంత్రపు బలముచే నడపఁబడును. కొన్ని చిన్న నావలు మోటారు యంత్రబలముచే నడపఁబడుచు నతిత్వరితముగ పరువిడును. పడవలు తెరచాపలగాలిచే నడచును. తెడ్డులతోఁ గొన్నిటిని నడపింతురు.



ఇక్కాలపు పెద్ద లైనరు (స్టీమరు).

**ఓడలు బరువుమోయు లెక్క** — ప్రతిఓడను ఇన్నిటన్నుల బరువు మోయఁగల్గినది యని లెక్క చెప్పుచుందురు. అట్లు లెక్కించుటకు విధానమిది. ఓడలోపలిభాగపు పొడవు, వెడలుపు, ఎత్తులు కొలచి ఒకటితోనొకటి గుణించి ఘనపరిమాణపు అడుగులలెక్కను (Cubic feet) కుదిర్చి నూరుఅడుగుల స్థలమందొక టన్ను బరువుండనగునని గణింతురు. ఇది గ్రాస్‌టన్నేజి (Gross tonnage)

వర్తకపుటోడలంగూ నికరముగ (Net tonnage) లెక్కింపఁబడును. ఆలెక్కనే అవి రిజిష్టరు చేయబడును. యాత్రికులుండు గదులు, నౌకర్ల గదులు మొదలగునవి డబ్బుగడించునవి గావు గాన, వానిని మినహాయించి శేషించిన స్థలమునే కొలచి పైప్రకారము టన్నేజి పరిగణింతురు.

యుద్ధనావలకు సొమ్ముగడించు తావే యుండదు, కాన, ఆయోడ నడచుతఱి నెంతనీటిం ద్రోసికొనిపోవునో దానింబట్టి లెక్కింతురు. కాన టన్నేజి లెక్క వర్తకుల యోడలకు, యుద్ధనావలకు నేసంబంధము లేనిదిగానుండును.

ఎటులున్నను నావలు ప్రయాణములో నర్పుతఱి దారిపొడుగునఁ జెల్లించుచుండవలసిన డాక్ డ్యూస్ (Dock dues), పైలటేజి (Pilotage), టోయేజి (Towage), సేల్వేజి (Salvage), దీపస్తంభములు (Light houses), ఇన్సూరెన్సులు (Insurances) మొదలగునవన్నియు టన్నేజి లెక్కపైనే చెల్లింపఁబడవలయును.

**ఓఢ్రదేశము** — ఉత్కలదేశము. ఓఢ్ర శబ్దము ఉఢ్రశబ్దమునుండి కల్గినది. (ఒరిస్సా దేశము చూడుఁడు).

**ఓతప్రోతన్యాయము** – బట్ట నేయు తరి పడుగునకు ఓతయనియు, పేకకు ప్రోత యనియు నామము. పడుగుపేక నేకీభవించి బట్ట యగునని భావము.

**ఓనమ్ పండుగ** — ఇది కేరళదేశమున జాతీయపండుగగా చెప్పాబడుచున్నది. ప్రతి సంవత్సరము సెప్టెంబరు మొదటివారమున వచ్చు చుండును. ఈదినము కేరళదేశమున వ్యాపించియున్న శకసంవత్సరమున మొదటి నెల యగు చింగోముమాసపు మొదటిదినమట. దీనిని తిరుఓనమ్ దినముచుటయుం గలదు. దీనిప్రాముఖ్యత యాదేశమున నధికము

నైఋతిదిగ్వర్షములు కురిసి భూమి చల్లబడి పొలములు పంటలకాయత్తమగుచు, సస్యము లతో నిండి, వృక్షములు పుష్పఫలభరితములై యుంతటను సంతసము, ప్రమోదము వ్యాపించి యుండుకాలమున నాదేశపు సంవత్సరాదియగు తిరుఓనము దినమున సత్పరిపాలనకు పేరందిన బలిచక్రవర్తియు, కేరళభూమిని సృష్టించిన పరశురాముడును ఈదేశము నేటేటదర్శించి నాల్గుదినము లిటవసించుచుందురట. కావున నీ నాల్గుదినము లోనముపండుగ లాచరింతురట అందు మొదటిరోజునకే తిరుఓనమని పేరు. (పరశురాముడను చూడుడు).

ఇంకనీ తిరుఓనమునందే మళయాళదేశ శక మారంభమాయెనట. పెరుమాళ్లలో గడపటి వా డీతిరుఓనముననే యదృశ్యుండాయెనట. కోలావాశనృపతు లీదినముననే స్వాతంత్ర్యము బడసిరట. ఈ దేశపు నాయరు లీపవిత్రదినము ననే సంగాలములుగ నేర్పడి వీరులై యుద్ధరంగ మున నాతితేరి జయముగాంచిరట.

మళయాళదేశమున నాయరుకుటుంబములం దీపండుగ చాల ముఖ్యమని తోచెడిని. పది దిన ముల ముందునుండి ప్రయత్నములు గానవగు చుండును, ఇండ్లు బాగుచేసుకొనుట, అలంక రించుట, ఉయ్యాలలువైచుట కేర్పాట్లు మొద లిడుదురు తిరుఓనము దినమున నుదయముననే యభ్యాగతములకుంబిదప నాయత్తపడి భోజనము లందు అనంటిపండ్లను బెల్లమునందుడికించి చేసిన భక్ష్యముల నారగించినతోడనే యజమానులు తమకుటుంబమువారలకేగాక నౌకరులకు, ఆశ్రితు లకుం గ్రొత్తబట్టలనిచ్చి గౌరవింతురు. రైతులు భూమియజమానులకుం గూరగాయలు, పండ్లు సర్పింప వారలకు నూతన వస్త్రములనిచ్చి యాదరింతురు పిదప బాలురు మొద్దుగాం జేయం బడిన విల్లంబులాంబూని యుద్ధము లొనర్చుచున్న ట్లుల నాటలనాడ మొదలిడుదురు పెద్దవారు పేకాటలు, చతురంగము, బలాఢ్యులు కాలితో తన్ను బంతులాటలతో కాలము వినోదముగ జరపెదరు. స్త్రీలు మనోహరముగ పాటలం బాడుచు నుయ్యాల లూగెదరు. కొంద ఱలంక రింపబడిన నావలపై నెక్కి పాటలంబాడుచు సలిలవిహారక్రీడలం బ్రొద్దుపుచ్చెదరు. ఇంకం గొందఱు నేర్పరులు నావల పందెములను నీటం జరుపుదురు.

పెక్కండ్రు వినోదనాట్యము లొనర్చుటయుం గలదు. ఆ నాట్యముల కాదేశమున "తిరువ తిరకాలి" యనిపేరు. దీనికిం బాటలయునుసరియ ముండెడిని. ఇటుల నాల్గు దినములు గడచెడిని.

**ఓపని వారికి వద్దనినవారే బంధువులు** - (ఓపనివారనిన గర్భిణీ స్త్రీలని యర్థము.) ఆంధ్రలోకోక్తి.

**ఓపనివారు కోరని వస్తువులూ ఓర్వనివారు అననిమాటలూ ఉండవు** (ఓపనివారనిన గర్భిణీ స్త్రీలు, ఓర్వనివారనిన సహింపు లేనివారని భావము). ఆంధ్రలోకోక్తి.

**ఓపల్ రత్నము** - దీనికి రసాయనశాస్త్రమున Hydrous Dioxide of Silican అని పేరిడఁ బడినది. ఇది Non- Crystalline (Amorphous) జాతులలో నొకటి. అనఁగా స్వచ్ఛతంగల్గిన రత్నము కాదు. ఇందనేక రంగులు కలవు. సూర్యకిరణములు దీనిపైఁ బ్రసరింపఁ జేసిన వింత వింత తళుకులతో నారంగులు కనఁబడును. తొల్లింటి కాలమున నైరోపాదేశముల వారీ ఓపల్ నిర్దుష్టమైన దానిని ధరించువారికి శ్రేయములు కల్గుచుండునని తలంచు చుండెడి వారు.

మంచివి జకోస్లోవేకియా దేశముననను, దక్షిణ అమెరికా, న్యూసౌత్ వేల్సు, యునైటెడ్ స్టేట్సు లందు దొరకుచున్నవి. మెక్సికో దేశమున ఎఱ్ఱని ఓపల్సును, ఎఱుపుపై పసుపుపచ్చ ఆకుపచ్చ ధాతువులు గల ఓపల్సును దొరకు చున్నవి. మఱియు నరుసుగ తెల్లఓపల్సుకూడ దొరకునట.

**ఓపియన్** — ఉపనివేశ దేశము చూడుఁడు

**ఓపెన్** (Open) — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. సర్వసాధారణముగా బహిరంగపు అని యర్థము.

Open- అందఱికి నావకాశముగల యని యర్థము. తీసికొనివచ్చిన వానికి సొమ్మిచ్చునటుల "Payable to bearer on presentation" వ్రాయఁబడిన Uncrossed cheque నకు Open cheque అనియెదరు. పూచీఆస్తిగాని, హామీ ఆస్తిగాని లేకుండా ఒక Banker యిచ్చెడి credit నకు Open credit అని పేరు. ఒకనికి అట్లే Letter of credit యీయబడినను అదే పేరంబరగడిని. ఒక మెరైను ఇన్సూరెన్సుపోలిసీ యందు ఆస్తి యంతయు స్పష్టపడకముందు పు మొత్తము వ్రాయబడకుండ యిచ్చిన పోలిసీకి Open policy అనెదరు. అట్టి పోలిసీసందర్భమున Under writer సంతకముక్రింద యీయబడిన slips of papers నకు Open slips అని పేరు.

**ఓపెన్ ఫౌండేషన్** (Open foundation) — పునాది చూడుఁడు

**ఓపెన్‌పట్టణము** — బూడాపురము. హంగేరీ చూడుఁడు.

**ఓబీ ఓబీ నీవు దంచుచుండు, నేను ప్రక్క తెగురవేయుచుందునని పల్కెనదట** — ఆంధ్రలోకోక్తి.

**ఓబ్లేటు స్ఫిరాయిడ్** (Oblate Spheroid)— గుండ్రముగ బంతివలెనుండిన వస్తువుయొక్క రెండుకొనలు అణుమాత్రము కొంచెముగ చదునుచేయఁబడి యుండినచో దానిని Oblate Spheroid అనెదరు. (Flattened sphere) భూమి గుండ్రముగ నుండియు ఉత్తర దక్షిణధ్రువములుకడ కొంచెము చదునుగ నుండునట్లు గ్రహింపఁబడుచుంట భూమిని Oblate spheroid అనుచున్నారు.

**ఓమపు చెట్టు** — వామపుచెట్టు చూడుఁడు.

**ఓమాన్ భాగము** — అరేబియా చూడుఁడు.

**ఓమ్నియమ్స్ స్టాకు** (Omnium Stock) — వాణిజ్య పరిభాషయందు ఇతర వాటాలతో లేక ఇతరవాటాలలోనికిఁగలసిపోవు భాగములుగ విభజింపఁదగిన వీలుగల వాటాలు.

**ఓమ్యూటవరశాఖ క్షత్రియులు**— ప్రమారశాఖ క్షత్రియులు చూడుఁడు.

**ఓరియంటలిజమ్** (Orientalism)- ప్రాచ్య దేశములయొక్క మత, సాంఘిక, రాజకీయ, వాఙ్మయముల సిద్ధాంతములకు సంబంధించి

నది. ప్రాచ్యదేశముల విజ్ఞానమునకే Orientalism అనునది చెల్లును.

**ఓరుగంటి సోమశేఖరకవి** - ఆంధ్ర కవులలో నాథునితులలోను పరిగణింపఁబడినవాఁడు. బ్రాహ్మణుఁడు, కౌండిన్యసగోత్రము, గొప్పకవి. ద్రావిడి, కాపురము విశాఖపట్టణ మండలమున వీరవిల్లి తాలూకాలోని పెదనందిపిల్లి అగ్రహారము

రచించినది రామ కృష్ణార్జున రూపనారాయణీయము ఇది రాఘవ యాదవ పాండవ్యాఖ్యములనే గాక, దేవిపురముగు నర్థములం గూడ స్ఫురింపఁజేయుచు రంజకమై యున్నది. దీనిని శ్రీ పూసపాటి నారాయణ రాజుగారికి కృతి నిచ్చెను నరసభూపాలరాజీయమను వేఱొక గ్రంథము శ్రీ పూసపాటి నారాయణరాజుగారి సుతులగు నరసభూపాల రాజుగారికిం గూడ కృతి నొసంగెను

**ఓరుగల్లు** — ఏకశిలానగరము చూడుఁడు. తెలింగానాదేశము చూడుఁడు.

**ఓరోగ్రాఫీ (Orography)** — పర్వతముల నిర్మాణములను పరిస్థితులను గూర్చిన పరిశోధనము

**ఓర్లోఫ్ వజ్రము** — దీనిచరిత్ర సరిగా తెలియరాదు దేశమునందలి వాడుక. ఇది శ్రీరంగమునందు నేత్రస్థానమునందో లేక నగలయందో అమర్పఁబడియుండెననియు, ఫ్రెంచి యుద్ధముల గడబిడలలో నొక ఫ్రెంచిసైనికుఁడు దేవాలయమున రక్షకుఁడుగానుండుచో వాని హస్తగతమై వానిచే నొక కెప్టెనుకు ముప్పది వేలకు విక్రయింపఁబడెననియు, అత్తరినది ౧౯౪ రతుల బరువుండెననియు వాడుకగలదు. ఆకెప్టెను దాని నొక లండనునగరపు రత్నాలబేరగానికి లక్షాఎనుబదివేల రూప్యముల విలువకు విక్రయించెనట. పిదప నీరత్నము మఱికొన్ని మార్పులకు లోనై ఎట్టకేలకు రష్యాచక్రవర్తిగారి సన్మానవర్తి ఓర్లాఫ్ రాజకుమారునకు విక్రీతమై ఆయనచే కేథరైన్ చక్రవర్తినిగారికి కర్పింపఁబడి రష్యా రోయల్ స్కెప్ట్రియం దమర్పంజేయఁబడి నానాఁటికి సోవియట్రష్యావారి వశమైయున్నదట.

**ఓర్ఖాన్ ఇన్స్క్రిప్షనులు** (Orkhon Inscriptions)-ఇవి మంగోలియా దేశమునకు వాయువ్యదిశగా ఓర్ఖాన్ లోవయందు బైకాల్సరస్సునకు దక్షిణముగ నున్నవి. క్రీ. వె. ౧౮౯౦ లో కన్గొనఁబడినవి ఈ లోవయందిట్టి వ్రాతలు పెక్కు శిలలపై గానఁగును. అందు ప్రధానశిల నాల్గుపలకలు గల్గినది ఈ ఇన్స్క్రిప్షనులు క్రీ వె ౭౩౩ నాఁటివని తలంపఁబడుచున్నవి. ఇవి చీనాజాతుల యొక్కయు, టర్కీజాతుల యొక్కయు Tribal records అని తలంపఁబడుచున్నవి. Aramaic alphabet అక్షరములని కొందఱనెదరు ౮౦౧ కాలము నాఁటిది ఇటీవలి Inscription అనియు, అవి ఉన్నియుంగలసిరాసగ Turkic and Viguric జాతులప్రజలు అనాగరికులయ్యు గుఱ్ఱపురౌతులనియు, వారికి స్థిరనివాసములు లేకున్నను కొన్నివిద్యల నెఱింగినవారనియు తలంపఁబడుచున్నది. ఇవి Finno- Vgrian సంబంధము గలవిగ తలంపఁబడుచున్నవి. వీటికి స్కాండినేవియా సంబంధము లేదందురు.

**ఓర్పితే ఓరుగల్లు (వరంగల్లు) పట్టణమవుతుంది అన్నట్లు** — ఆంధ్ర లోకోక్తి.

**ఓర్పినవసరమునకుఁ దేటనీరు** — ఆంధ్రలోకోక్తి.

**ఓర్బిట్ (Orbit)** — లాటిన్ భాషయందు Orbit అనిన circle లేక, తిరుగుమార్గ మని యర్థము.

భూమి సూర్యునిచుట్టు తిరుగు మార్గము. కొంచెము పొడవగు గోళాకారము (Oval) గ నుండుటంగాన Ellipse అనఁబడుచున్నది. అచుట్టి వచ్చు మార్గమునకు Orbit అనుచున్నాము. (గ్రహణములు చూడుఁడు)

**ఓర్మసుద్వీపము** — ఆసియాలోని పారశీక దేశమునకుం జెందినది. తొల్లింటపోర్చు గీసువారి వర్తకస్థానముగ నుండినది. గొంబ్రూను (బాదరబ్బాసు) పురముకడ నున్నది.

**ఓలాజాతి** — రూమేనియనులకు హంగేరీయందు పేరు. హంగేరీదేశము చూడుఁడు.

**ఓలి తక్కువయుని (గుడ్డి పిల్లను పెండ్లాడితే నెలకు రెండామములు కుండలు పగులగొట్ట నారంభించిన దట)** — (ఓలి=కన్యాశుల్కము, ఆమము=కుండల ఆమము, వంటకుండలని భావము) ఆంధ్రలోకోక్తి.

**ఓలింపియా** (Olympia) — గ్రీసు దేశమున పెలోపొన్నీస్ (Peloponnese) అను తావునగల ఒక పాటిమైదానమున కీపేరు గలదు. పూర్వమిటనే Olympic Games ఆటలు జరగుచుండినవి.

తొల్లికాలమున నిట Zens అను దైవారాధనగ ఇచట నాలుగేండ్లకొకసారి యైదేసి దినములు సాములు, కుస్తీలు మొదలగు బలప్రదర్శనవినోదములు సల్పుచుండెడివారు. కాన నాకాలమునుండి నాలుగేండ్లకాలమును Olympiad అనుచుండుట వాడుకయయ్యెనట. క్రీ.పూ. ౭౭౬ సంవత్సరమున గొప్ప యాటలు జరిగెననియు, అంతకుపూర్వము చిరకాలమునుండి యీ యాటలు జరగు యాచారముండెననియుఁ జెప్పఁబడినది.

ఈ ఆటలమధ్యమున జెయుస్ దేవత నుంచు స్థానముండెడిది. ఆటలస్థానమునకు వెలుపల ౭౫౦ X ౫౩౦ అడుగుల ప్రదేశమున కావరణమేర్పరిచి కుస్తీలకుగాను ఉంచువారు. దేవత నుంచు పవిత్రస్థలికి ఆల్టిస్ అని పేరు వాడుకయుండెను. కుస్తీలయావరణమునకు Palacstra అని పేరుండెను.

క్రీ. శ ౩౯౪ సంవత్సరమున ఆటలు నిల్పివేయఁబడినవట. కాని తిరుగ ౧౮౯౬ సంవత్సరమున తిరుగ ప్రారంభమైనవిగాని, ఆతావునగాక, క్రీ. శ. ౧౮౯౬ లో అథెన్సు నగరమునను, ౧౯౦౦ సంవత్సరమున పారిస్ నగరమునను, ౧౯౦౪ లో సెంటులూయీస్‌నగరునను, ౧౯౦౮ లో లండనునగరమునను, ౧౯౧౨ లో స్టాకుహామ్‌నగరమునను, ౧౯౨౦ లో ఆంట్వెర్పుపురమునను, ౧౯౨౪ లో తిరుగ పారిస్‌నగరమునను, ౧౯౨౮ లో అమ్సటర్డామ్‌పురమునను, ౧౯౩౨ లో లాస్‌ఆగ్లిసీస్‌పురమునను ఆటలు జరగినవి.

**ఓలింపైనిజమ్** (Olympainism) - హోమరు కావ్యములందు ప్రాచీన గ్రీకుమతము "ఓలింపైనిజమ్" అనిపేర్కొనఁబడెను. 'ఓలింపస్' అను పర్వతము దేవతా నివాసమని వారి నమ్మకము.

**ఓల్డెన్బర్గు గ్రాండుడచ్చీ** - ఐరోపా ఖండమున జర్మను దేశములోని మైనరు స్టేట్సునకుం జెందిన గ్రాండుడచ్చీ. (జర్మను మైనరుస్టేట్సు జర్మనీ దేశము చూడుఁడు).

**ఓవర్** - వాణిజ్య సంబంధ పరిభాషా పదము. Over- మిపోయినది అని యర్థము. కావలసినది మైపోగా పైగానున్నదానిం గూర్చి యనియొప్పుగునది. వర్తకవ్యాపార భాషయందు పైగా యనియర్థము. Over Capitalisation అన ఒక సంస్థను నడపుటకనువగు సొమ్ముగాక

ఎక్కువ సొమ్ము౯డుట కర్తము. ఇతర వ్యయములు (దానికి అవసరముగ తగలవలసినవి) కలిపి దానికగు ఖరీదు మూల్యమునకు Overhead price అని యందురు. ఒక ఓడ౯యొగు గొంపో వలసిన నిర్ణీత సరకుక౯ కవసరమగు తావు లేక సామర్థ్యముకన్న నదనముగా జాగా గాని, దాని బలముగానియు౯డనేని దానిని Over Tonnage అనియెదరు. తన నిల్వసొమ్ముకన్న నదనముగా నొక Bank యందు వాడుకొనుటకు Over draft అనియెదరు.

**ఓవెనిజం** (Owenism) - రాబర్టు ఓవెనులన నతఁడు ప్రబోధించిన పరస్పర సహాయ పద్ధతి క్రీ. శ. ౧౭౭౧ ౧౮౫౮ ఇతఁడు న్యూటనునందు జన్మించెను.

**ఓషధులు** (Drugs) — ఓషధులు, వనమూలికలను, ఇతర పదార్థములును రోగముల నదిరించునవి అన్నియు ఓషధులనియు, కొన్ని కొన్నిటింగల్పి అర్థ గుణమునకుఁగాను చేయఁబడునవి ఔషధములనియు చెప్పఁబడును ఔషధములందు వనౌషధులు, ఇతరఓషధులు గూడ శుద్ధిచేయఁబడుట కొంత వాటియందలి దోషము పరిహారమై గుణముమాత్రము నిలచియుండునవనియు, కేవలౌషధులందు అట్లుగాక వాటి నైసర్గికమగు గుణదోషములన్నియు నట్లేయుండునవనియు నెఱుఁగునది

మనదేశమున ఓషధివైద్యమనఁబడు ఒక విధానము కలదు. మఱియు దానిని మూలికావైద్యమనియు నందురు. ఆంగ్లవైద్య విధానమున ఓషధులు (Drugs) Stimulants అనియు, Remedies అనియు ముఖ్యభేద జాతులురెండు. అందు Stimulants, General stimulants అనియు, Local stimulants అనియు తిరుగ రెండు భేదములు. రెండవది యగు Remedies నందు Chemical remedies అనియు, Mechanical remedies అనియుద్వివిధములు కలవు. వాట్లయం దింకను అంతర్భేదములు గలవుగాన వాట్లను వరుసగ వివరింతుముగాక. ఆంగ్ల వైద్యవిధానమున సర్వసాధారణముగ పెక్కు మారులను Drugs అనివాడుచుండుట యుఁగలదు. కాని అపాయకరమగు కొన్నిటిని జాగ్రతగా వాడవలయును. అవి Cocaine Opium, Heroin, Morphia అనంబడునవి. అందు Opium మన నల్లమందే.

ఆంగ్లవైద్య విధానము చక్కని పరిశీలనల నంది యిప్పటి స్థితికి దేబడకపూర్వము Drugs మానవ శరీరములను రోగములనుండి రక్షించుటకు సాధకములని తలంపఁబడుచుండెను గాని, ఇటీవల అవి మానవ శరీరముల కపాయకరములని గూడ తలంపఁబడ నారంభమాయెను. నల్లమందు మొదలగునవి యపాయకరములగు దురభ్యాసములని గ్రహింపఁబడెను. వీని అమ్మకమునకు కఠిన పద్ధతులు విధింపఁబడి వాడుక తగ్గింపఁబడి వైద్యుల సలహామేరకు వీటివాడుక నిర్బంధింపఁబడుచున్నది. ఈ నిర్బంధము Stimulant nature గల వాటికిఁ గొంతవఱకును, అపాయకరమగు వాటికి పూర్తిగను విధింపఁబడినదని యెఱుఁగవలయును. తక్కినవాటికినిర్బంధములేదు.

౧ Stimulant Drugs — (ఇవి రెండు విధములు) ౧. General stimulants- (ఇవి నాల్గు విధములు). ౧. Tonics- These are used to tone up the system. ౨. Astringents- These have tonic effect also; but their effect is rather by the contraction of the muscles and tissues to reduce excessive discharges. ఇవియు రెండుభేదములంగల్గియున్నవి. ౧. Mineral Astringent Stimulants-

These include Alum chalk. ౨ Vegetable Astringent Stimulants These include Tanin, Oak-bark Etc. 3. Narcotics- These if misapplied will cause trouble; they have the effect of dulling the nervous system. Alcohol and opium are of this Narcotics kind. ౪. Anti Spasmodics - These have an anodyne effect, where inflammation is not apparent, overcoming the spasms of muscles, and allaying pain. Valerian, Ether, Chloroform are ante-spasmodics of this class, Calomel also is of this kind of Drugs.

౨ Local Stimulants—These are emitic drugs for the production of either purging or vomiting- వమనము గాని, విరేచనముగాని చేయునవి. ౧. Laxatives- ఇవి కొలవిరేచనములను ఇామకే బల ముతో గల్గించు ఓషధులు. ఇవి Purgatives అంత బలముగ పనిచేసి విరేచనములు గల్గింపఁ జాలవు. కాని Purgative జాతివంటివే. ౨. Purgative drugs-ఇవి Bowels యొక్క పనిని విస్తారబలముతో జరపును అనఁగా విరేచనములంగల్గించును. నేపాళమిాజాతికిం జేరిన దియే. 3. Diuretics- ఇవి మూత్రము నధికముగ వెడలఁజేయునవి. ౪. Diaphoretics- ఇవి శరీరమున చెమటంబట్టించునవి. ౫. Expectorents- కఫమును వెడలఁ జేయునవి. ౬. Sialogogues- ఇవి Saliva (నోటి నీరు లేక ద్రవము) ను అభివృద్ధిపరచునవి. ౭. Epispastics- These are used to blister and cause redness of the skin suface. ౮. Rubefacients- ఇవియు Epispastics వంటి పనులకే ఉపయోగింతురు. ఆవాలు ఈ తెగకుం జెందినవి. Cantharides and Ammonia are also examples. ఈ Stimulant drugs నాకు Cocaine, Opium (నల్లమందు), Heroin, Morphia అపాయకరములనవిగ జెప్పఁబడినవి వీని హెచ్చుతగ్గు మిశ్రమములను అట్టివేనని చెప్పఁబడినది

౨. Remedies Drugs-(ఇవి రెండు తెగలు) — ౧. Chemical Remedies (ఇవి నాల్గు తెగలు)— ౧ Refrigerants—ఇవి చల్లదనముం గల్గించునవి. Citric acid, Tartaric acid మొదలగునవి ఈ జాతికిం జెందిన Durgs గా చెప్పఁబడినది. ౨. Antacids - These will act like alkalis for relieving excessive acid in the stomach. Bi-carbonates of soda and magnesia are of this class of drugs. 3. Antalkalis- ఇవి Antacids కు వ్యతిరేకముగ పనిం జేయునవి. ౪. Escharotics They are used for destroying parasitic growths as warts, ringworm etc. Blue-stone and Lunarcaustic are of this class of drugs.

౨. Machanical Remedies- (ఇవి నాల్గు విధములు). ౧ Anthelmintics- These are of Ganiboge class and will be used to destroy worms and other parasites. ౨ Demulcents - These are used to reduce irritation by protecting the parts with viscoid matter. Limseed, Liquorice, Arrowroot etc are Demulcents. 3. Diluents- These consist fluids like water Gruel and will dilute infusions of penny royal etc. ౪. Emollients- These are used externally as poultices (ఉడికించి పైనఁబెట్టు కట్లు), ointments (పైపూత పూయునవి).

**ఓషన్ కర్రెంట్సు** – మహాసముద్రములు చూడుఁడు.

**ఓషనోగ్రాఫీ** (Oceanography) — సముద్రములందలి అడుగుభూమిం గూర్చియు, వానియందలి పరిస్థితులు, అచటి ఉదకముల శీతోష్ణస్థితులు, అచటి శిలలు మొదలగువానిం గూర్చి వివరించుశాస్త్రము.

ఈగ్రంథములందు తరుచుగ సముద్రముల అడుగుభాగములు సమముగ బయళ్ల వలెనే యుండుననియు, అందచ్చటచ్చట శిలామయ పర్వతములుగూడ నుండుననియు, కొన్ని తావులందు విశేషలోతులుగల ప్రదేశము లుండు ననియు మొదలగు సంగతులు చెప్పఁబడినవి.

పసిఫిక్కు మహాసముద్రమున లోతు అధికముగఁ గల ప్రదేశము లుండునట ఆపల్లములకు ఆంగ్లమున డీప్స్ (Deeps) అని పేరిడియున్నారు ఆవిమూడువేల అడుగుల లోతువఱకు నుండునని చెప్పఁబడినది. అట్లాంటిక్కు మహాసముద్రమున రెండువేలయడుగుల లోతుగల Deeps ఉండునని చెప్పఁబడినది ఒక్కొకతావులందు నల్లరాళ్లును, ఒక్కొకతావులందు పగడపుకొండలును కలవని చెప్పఁబడినది ఓషన్‌కర్రెంట్సుగల తావులందు మెరకయగుచుండుటయు, పల్లముగ కోసివేయుచుండుటయు జరగుచుండునట. కొన్నిప్రవాహములు సముద్రమున వేడిగల్గి నడచుచుండును.

**ఓయూసిస్** (Oasis) – నిర్జలప్రదేశమగు ఎడారిమధ్య నచ్చటచ్చట నీరు భూమికి పైభాగమునకు సమీపముగ నుండుట సంభవించునేని అత్తివ్రల చెట్లను, పచ్చికయు జీవించి పెరుగును. దానికి ఒయాసిస్ అని పేరు. ఎడారిగుండా నడచు మార్గస్థులు నీరుగల్గుతావుగాన, నటవిడసి పోవుచుండుట గలదు. సర్వసాధారణముగ ఒయాసిస్ సందొక నూయి త్రవ్వంబడియుండును.

**ఓసీనియా** (Oceania) — ఓషన్ అను ఆంగ్ల పదమునకు మహాసముద్రమని యర్థము. ఇందు పసిఫిక్ మహాసముద్రము చాల గొప్పది. ఇది ప్రపంచ పరిమాణమున మూడవ వంతుండునని చెప్పఁబడినది. ఇందు లెక్కకు మీరిన ద్వీపములు కలవు. వీనిని భూగోళ శాస్త్రజ్ఞులు ఓసీనియా యని ఆంగ్ల నామమున వాడుచుందురు. ఓసీనియా (ద్వీపములన్నియుంగల్పి) ఇంచుమించు నలుబది లక్షల చతురపు మైళ్ల వైశాల్యము కలదనియు, అందు ఇంచుమించు నాల్గు కోట్ల జనులు వసించుచున్నారనియు నంచనా వేయఁబడినది.

పసిఫిక్ మహాసముద్రమునందు నార్తు ఈక్వెటోరియల్ కర్రెంటనియు, సౌత్ ఈక్వెటోరియల్ కర్రెంటనియు రెండు ప్రవాహములు కలవని చెప్పఁబడినది. ఉత్తరపు కర్రెంటు చీనాదేశము, జపాన్ దేశములం జుట్టియుండు చెప్పఁబడినది.

ఓసీనియా యందలి ద్వీప సముదాయములను శాస్త్రజ్ఞులు ఐదు భాగములుగ విడదీసిరి. ౧. మలేషియా - ఇది వాయువ్య దిశ యందున్న ద్వీపసమూహము. ౨. ఆస్ట్రలేషియా - ఇది దక్షిణ దిశనున్న ద్వీపసమూహము. 3. మెలనేషియా - ఇది తూర్పు దిశ యందున్నది. ౪. మైక్రోనేషియా - ఇదియు తూర్పు దిశయందున్నది. ౫. పోలినేషియా - ఇదియుఁ గూడ తూర్పు దిశ యందే యున్నది. ఈ ద్వీప సముదాయము లన్నిం గూడిన దానినే ఓసీనియా యని వాడెదరు.

**ఓస్మియన్ లోహము**— ఇది క్రీ. శ. ౧౮౦3 లో కనిపెట్టఁ బడిన అరుదైన లోహము. దీనిని Chemical symbol Os. అనియు.

Atomic weight 190·8 అనియు, Atomic number 76 అనియు, Specific gravity 22·0 అనియు, Melting point సెంటిగ్రేడు థర్మామీటరు 2500 డిగ్రీల వేడి యుండనియు చెప్పఁబడినది. ఊదా ధాతువుతో తెల్లని రంగు కలది.

---

**ఔఖ్యగోత్రము** — వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.

**ఔజతశయన గోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.

**ఔటవృక్ష గోత్రము** — నిధ్రువగణము చూడుఁడు.

**ఔడులోమి గోత్రము** — వశిష్ఠ గణము చూడుఁడు.

**ఔడ్ (అయోధ్య) రాష్ట్రమేలిన మహమ్మదీయ నృపతులు** — ఇరాను రాష్ట్రములోని ఖొరాసానునందుఁగల నైషాపూరు సయ్యదు వంశీయులగు మహమ్మదీయులు క్రీ. శ. పదునాఱవ శతాబ్దాంతమున హిందూ దేశమునకు వచ్చియుండిరి. ఔడ్ (అయోధ్య) రాష్ట్రమేలిన నృపతు లీవంశమువారే. ౧౭౦౮ వ సంవత్సరమున మీరుమహమ్మదు అమీను అనునాతఁడు హిందూదేశమున అజీమాబాదు (ఇప్పటి పాట్నా) నకుఁ దన తండ్రిని జూడ నేతెంచి పిమ్మట మొగలుసామ్రాజ్యమున నేదే నొక యుద్యోగము సంపాదింప ఢిల్లీకేగెను. ఇతని శక్తిసామర్థ్యములకు ముదితుఁడైన ఫరూఖ్‌సియార్ సామ్రాట్టు ఇతనికి నానాఁటికి గొప్ప గొప్ప పదవులనిచ్చుచు నభివృద్ధికిఁదెచ్చి, "బర్హానుల్ ముల్కు" అను బిరుదమునిచ్చి గౌరవించెను.

౧౭౨౦ సంవత్సరమున నీ మీరుమహమ్మదునకు "బహాదూరుజంగు" అను బిరుదము కలిగెను. క్రీ. శ. ౧౭౨౧ లో నాతఁడు ఆగ్రారాష్ట్రపు గవర్నరుగాఁ జేయఁబడెను. ఆపదవిలోనుండగా నీతఁ డారాష్ట్రాభివృద్ధికై చాల కృషిజేసెను. ౧౭౩౨ లో నీతఁడు తిరిగి సాదతుఖాను అనం బడు పేరుతో ఔడ్ (అయోధ్య) రాష్ట్రమునకు రాజప్రతినిధిగా నొనర్పఁబడియెను ఇతని ముఖ్యపట్టణము ఫైజాబాదు. రాష్ట్రమున కేంద్ర ప్రభుత్వము బలపడుటకీతఁడు పాటుబడెను

ఇతని యనంతర మితనికిఁ బుత్రులు లేకుండుటచే నీతని యల్లుఁడగు నిసార్ మహమ్మదు ఖాను నాతఁడు (౧౭౩౯-౫౪) అయోధ్య సింహాసనమెక్కెను. ఇతని యసామాన్య సాహసమునకు చిహ్నముగ "సాఫ్దరుజంగు" అను బిరుదము నీతఁడు బడయఁగల్గెను. ఆసమయమునసే అహమ్మదుషా ఢిల్లీలోఁ బాలించుచుండెను. 'సాఫ్దరుజంగు' యొక్క ధైర్యసాహసములను గమనించి యాతనిని తన సామ్రాజ్యమునకు ప్రధానమంత్రి (వజీరు) గా నొనర్చుకొనియెను. ఇంతేగాక "మీర్-ఇ-అతీష్" (సర్వసైన్యాధిపతి) అను బిరుదముగూడ నాతనికొసంగెను. ఇంతటి నుండియు అయోధ్య రాజప్రతినిధికి 'నవాబ్ వజీరు' అను పదము వాడుకయయ్యెను. ఇతని యనంతరమీతని పుత్రుఁడగు షుజాద్దౌలా (౧౭౫౪-౧౭౭౫) నవాబు వజీరయ్యెను. ఈతని

పాలనమున వర్తకవ్యవహారములు, పరిశ్రమలు నభివృద్ధియయ్యెననునది ముఖ్యవిషయము. ఈస్టు ఇండియా కంపెనీవారిచే నోడింపఁబడిన వంగ దేశపు నవాబగు మీర్ ఖాసిం రక్షణార్థమై ఈతని వద్దకుఁ జేరెను. మీర్ ఖాసిం పక్షము వహించిన షుజాఉద్దౌలాను బ్రిటిషు సైన్యములు పరాజితునిగా నొనర్చెను. ఈ నవాబు వివేకి, కార్యదక్షుఁడు, సర్వసమర్థుఁడు, ప్రజాదరణ పాత్రుఁడు. అసఫ్ ఉద్దౌలా (౧౭౭౫-౧౭౯౭) తండ్రి చనిపోవఁగనే యీతఁడు రాజ్యమాక్రమించి రాష్ట్ర ముఖ్యస్థానము ఫైజాబాదునుండి లక్నోకు మార్చెను. నాఁటినుండియు లక్నో ప్రాముఖ్యమునకు వచ్చి, గొప్ప పట్టణముగను, వర్తక కేంద్రముగను మారెను. వెనుకటి మొగలు ఆస్థానములకే కాక, ఆనాఁటి ఢిల్లీకిఁగూడ లేని సంపద్విభవసౌభాగ్యములతో నితని సంస్థానము తులదూఁగుచు ననేకులదృష్టి నాకర్షించెను. ఈతఁడు ౧౭౯౭ సెప్టెంబరులోఁ జనిపోయెను.

అసఫుద్దౌలా యనంతరము వజీరు ఆలీ యను యువకుఁడు సింహాసన మాక్రమించెను, కాని, అసఫుద్దౌలాకు వరుసకు తమ్ముఁడును, షుజాఉద్దౌలా చిన్నకొడుకు నగు సాదతు అలీఖాను రాజ్యమునకై యాతనితోఁ గలహించి ౧౭౯౮ జనవరిలో సింహాసన మాక్రమించెను. వజీరు ఆలీ చేయునదిలేక లక్నోలోఁ గల బ్రిటిషు రెసిడెంటును చంపి, పారిపోయి తుదకుఁ బట్టువడి కలకత్తాలో మరణించెను. సుశిక్షణ, ఉదారాశయములు, విశాలహృదయము, గొప్ప సామర్థ్యము మున్నగు గుణవంతుఁడుగ సాదతు అలీఖాను, స్లీమను మొదలగు చరిత్రకారులచేఁ బ్రశంసింపఁబడియెను.

సాదతు అలీఖాను, రాజ్యమునకు తన పెద్ద కుమారుఁడగు ఘజియుద్దీను హైదరు హక్కులను త్రోసిపుచ్చి, చిన్నకొమరుని తనకు వారసుగాఁ జేసికొనియెను. కాని తుదకు ఘజియుద్దీను హైదరే అయోధ్యరాజై, బ్రిటిషు వారిచే రాజబిరుదమునంది స్వతంత్రుఁడుగ పాలన మొనర్చెను. ఈతఁడు 'అబూముజఫర్ మొయిజుద్దీను, షాహి జమాన్, ఘజియుద్దీన్ హైదర్ షా, పాద్షాహి ఔధ్' అను 'గౌరవపదవీ' నామములతో రాజయ్యెను.

అతని యనంతరము అతని పుత్రుఁడగు నసీరుద్దీను హైదరు (౧౮౨౭-౧౮౩౭) రాజయ్యెను. ఇతఁ డీతని పాలనాకాలమున ననేక సంస్కరణములఁ బ్రవేశపెట్టెను. దిగ్గుల యభివృద్ధికిని, మనుజుల నమ్ముకొని జీవించెడి బానిసవ్యాపార నిరోధమునకు ననేక ప్రయత్నము లొనర్చెను. ఔధ్ రాష్ట్రమేలినవారిలో బీదసాదలకును దీనులకును ఆధారమైన రాజితఁడేయను ప్రశస్తి యితనికిఁ దక్కినది. మహితవర్తనుఁడగు నీనృపతి ౧౮౩౭ జూలైలో మరణించెను. ఈతని మృతికి సానుభూతిచిహ్నముగ కలకత్తా ఫోర్టువిలియమ్ కోటలో నతని వయసునకు సమానసంఖ్యయగు ౩౭ ఫిరంగులు పేల్చఁబడియెను.

ఇతనికి పుత్రులు లేనికారణమున నొకప్పుడీతఁడు తన పుత్రునిగా భావించిన మున్నాజాను సింహాసనమునకు రాగానే నసీరుద్దీను హైదరు మేనమామయగు నసీరుద్దౌలా యాతనినోడించి రాజ్యమాక్రమించెను. పిదప మున్నాజాను తన మాతామహితో చునార్ దుర్గమున ప్రవాస మనుభవించి ౧౮౪౬ లో మరణించెను.

మహమ్మదాలీషా యను నామముతో నసీరుద్దౌలా ఔధు రాష్ట్రమునకు రాజై గొప్ప సామర్థ్యముకలవాఁ డనిపించుకొనియెను. కార్యనిర్వహణమున నైపుణిగల యీ రాజు ప్రజాదరణ పాత్రుఁడై నాలుగేండ్లైనను పాలింపక మునుపే ౧౮౪౨ లో మరణించెను.

ఈతని పుత్రుఁడగు అజ్మద్ ఆలీషా (౧౮౪౨-౧౮౪౭) పిదప రాజై రాజ్యమును సమర్థతతోఁ బాలించెను. పాలనాధికారి కుండవలసిన సుగుణములన్నియు నీతని కుండెనట మఱల నింకొకసారి రాజ్యమున వర్తకమునకు దోహదమొసంగిన దీప్రభువే. రాజ్యపాలనయందేకాక సాహిత్యమునందుఁ గూడ ప్రవీణుఁడై బ్రౌగామ్ ప్రభు కృతమగు శాస్త్రగ్రంథము (Lord Brougham's Treatise on Science) నొకదాని ననువదించి ప్రసిద్ధి వడసెను. ఇంకుల శాంగ్లగ్రంథకర్త మోదమంది తన యర్థశాస్త్ర గ్రంథమును (Treatise on Political Economy) గూడ ననువదింప నాతనికి బహూకరించెనట. ఈతఁడై దేండ్లే పాలనమొనర్చెను. దేశీయులచేగాక ఆంగ్లేయులచేఁగూడ నీతఁడు సన్నుతింపఁబడియెను.

ఈతని చిన్న కొడుకగు వజీద ఆలీషా(౧౮౪౭-౧౮౫౬) రాజయ్యెను. ఈతఁడు రాజ్యపాలనము నందే దృష్టినిలిపి గొప్ప రాజనీతివిదుఁడని పించుకొనియెను. రాజ్యపాలనా నిర్వహణమున ప్రభుత్వశాఖలన్నిటిని పునర్నిర్మాణము గావించి కార్యదక్షతతోఁ బాలనము నడపెను. ఆంగ్లేయ పద్ధతిని నీతఁడు తన పాలనము సాగించెనట. న్యాయదృష్టియు, దయార్ద్రహృదయము కల ఈతనిని రాజ్యప్రజలందఱును గౌరవముగ జూచు చుండిరి. మహమ్మదీయ ధర్మనిర్ణయానుసారముగ నీతఁడు తన ప్రజలనుండి వచ్చిన ప్రతివిన్నపమును పూర్ణముగ విని న్యాయమును నెఱపు చుండువాఁడు. ఇతని చుట్టునున్న దుర్మార్గుల కుట్రచే నీతఁడు ౧౮౫౬ ఫిబ్రవరి ౭ తేదీని రాజ్యభ్రష్టుఁడు కావలసివచ్చెను. తన తర్వాతి జీవితము నీతఁడు కలకత్తాలో ప్రవాసమునఁగడపవలసివచ్చెను. ఇతని వంశీయు లింకను చాల మంది లక్నో, కలకత్తాలలోఁగలరట. (అయోధ్య ప్రోవిన్సు చూడుఁడు).

**ఔతథ్య ఉపగణము** — ఆంగీరస సంతతి- గౌతమగణములోని ఒక ఉపగణము. ౧౧ ఔతథ్యఉపగణము, గోత్రములు ౧౩౩. కాత్యాయన సూత్రోక్త గోత్రములు (౩౫) — ౧. అభిజిత్, ౨. ఉపవిందు, ౩. కదూకర, ౪. కరగోణ్య, ౫. కరాళి, ౬. కరేలి, ౭. కారవారి, ౮. కారోట, ౯. కుండేబ, ౧౦. కౌటిల్య, ౧౧. గతవ, ౧౨ తుండ. ౧౩. తోమ్యకాణి, ౧౪. తౌలేయ, ౧౫. నరోహిత్య, ౧౬. నీచిర్వా, ౧౭. నైమకి, ౧౮. పాథిర్వ, ౧౯. భాగల, ౨౦. మాంధర్య, ౨౧. మైదహాయన, ౨౨. శావాక్షి, ౨౩. రోహితాయిన, ౨౪. లాగాక్షి, ౨౫. సధూప, ౨౬. సపున్విర్వా, ౨౭. సమూలిర్వా, ౨౮. సాజ్కర, ౨౯, స్కాంద, ౩౦ సార్వ, ౩౧ సైంధవ, ౩౨. సోమని, ౩౩. ఘామ్యాండి, ౩౪. క్షుపోర్వాఘ్ని, ౩౫ క్షీరకరంట.

మాత్స్యసూత్రోక్తగోత్రములు (౩౦) — ౧. అరుణాయని, ౨. ఉతథ్య, ౩. కాసోరు, ౪. కైరాతి, ౫. కోష్ట, ౬. కౌసల్యాయన ౭ గౌతమ, ౮. టికి, ౯ నగ, ౧౦. సాత్వికి, ౧౧ పువ్వవంత, ౧౨. పౌష్కజితి, ౧౩. భాగవిత్తి, ౧౪ బాహుకర్ణి, ౧౫ జాథి, ౧౬ నిబోరాణి, ౧౭. రేవి, ౧౮. రోధోమూలి, ౧౯. రాహిణేయ, ౨౦ వాడాలక, ౨౧ వాసు, ౨౨. విశ్వ, ౨౩. విశ్వంతి, ౨౪ వీర, ౨౫ సామలోమకి, ౨౬. సుగోమాక్షి, ౨౭. సుతప, ౨౮. సురైషిణ, ౨౯. సోమదాయన, ౩౦. సౌపురి.

ఇతర గ్రంథోక్తగోత్రములు (౬౭) — ౧. అజగంధి, ౨. అభిజిత్, ౩. ఆయాశ్య, ౪. ఐటికి, ౫. ఔదాజాయన, ౬. ఔపబిందు, ౭. ఔశనస, ౮. కఠోర, ౯. కాక్షీవ, ౧౦. కారేణి, ౧౧. కారేణుపాలి, ౧౨. కాశిక, ౧౩. కాష్టరేఖి, ౧౪. కిలాలి, ౧౫. క్షీరకరంభ, ౧౬.

కౌమండ, ౧౭. ఔపమన్యవ, ౧౮. కౌమారవత్స్య, ౧౯. ఖరింక, ౨౦. గణి, ౨౧. తాండి, ౨౨. నైమకి, ౨౩. తాదేవ, ౨౪. దరిభి, ౨౫. దిస్య, ౨౬. దీర్ఘతమస, ౨౭ దేవకి, ౨౮. నిహాలనైకరిష్ట, ౨౯. నైకషి, ౩౦. ప్రశస్థ, ౩౧ పార్థివ, ౩౨ పౌడిష్ఠ, ౩౩ బృహదుక్థ, ౩౪. బాల్యోద, ౩౫. బాహ్య, ౩౬ బాభ్య, ౩౭ బార్షశ్యా, ౩౮ మహాహావర, ౩౯ మాధుతుర, ౪౦ మానుధరేవణ, ౪౧. మాసురాక్షి, ౪౨. మాసుకేషి, ౪౩. మూఘరథ, ౪౪. రఘువ, ౪౫. రాజాయున, ౪౬ రాహూగణ, ౪౭. రౌహిణ్య, ౪౮ వాత్షి, ౪౯. వామదేవ, ౫౦. వాయుః, ౫౧ వాస్తవ్య ౫౨ వాసిరి, ౫౩ విశంహాంత, ౫౪ శరద్వాంత, ౫౫ శాలాపి, ౫౬. శ్వేతీయ, ౫౭ శ్రోణీవేధక, ౫౮ శౌనరి, ౫౯. సత్యకి, ౬౦ సాత్యముగ్రిక, ౬౧. సుగోమాక్షి, ౬౨ సుబధ్య, ౬౩ సుహూపాక్షి, ౬౪. సైవ్వదేహ, ౬౫ సోమరాజక, ౬౬. సౌముచయ, ౬౭ సౌమూము

ఈ (ఔతథ్యఉపగణ) గోత్రములకుం బ్రవర రూపములు నాలుగు— ౧ ఆంగీరస, ఔతథ్య, గౌతమ. ౨ ఆంగీరస, ఔతథ్య, ఔసిజ. ౩. ఆంగీరస, ఆయాస్య, గౌతమ ౪. ఆంగీరస, గౌతమ, శారద్వంత.

**ఔత్ఖానా (జలయంత్రము)** — ఎత్తుప్రదేశమునుండి నేలకంగొట్టముగుండా నడిపించిన నీటి నోకరంధ్రముల యుగుఱికగుండా పై కెగురునట్లు చేయుదానికి ఔత్ఖానా యనిపేరు. ఇది హిందుస్థానీపదము. ఈజలయంత్రము లనేక రూపములుగ నుండును. ఉద్యానవనములందు సౌందర్యమునకు స్థాపించుదురు. దీనిచుట్టుపట్ల గాలి చల్లఁబడి వేసవియందు మనోహరమై యుండును.

**ఔతిథి గోత్రము** — ఆత్రేయగణము చూడుడు.

**ఔదమేఘ గోత్రము** — శాండిల గణము చూడుడు.

**ఔదమేఘి గోత్రము**— భరద్వాజ ఉపగణము చూడుడు.

**ఔదరి గోత్రము** — కుశిక గణము చూడుడు.

**ఔదకి గోత్రము** — లౌగాక్షిగణము చూడుడు.

**ఔదలి గోత్రము**— నిధృవ గణము చూడుడు.

**ఔదవాహి గోత్రము** — లౌగాక్షి గణము చూడుడు

**ఔదాజాయనగోత్రము**— కారేణుపాలి ఉపగణము, ఔతథ్య ఉపగణముచూడుడు.

**ఔద్గాలకి గోత్రము** — ఆత్రేయ గణము చూడుడు

**ఔద్గాహాయని గోత్రము** — ఉపమన్యు గణము చూడుడు.

**ఔద్దాలకి గోత్రము** — కౌద్ధక గణము చూడుడు

**ఔథేయుడు** — అత్రి, చంద్ర, పూరువు కురుసంతతి క్షత్రియుఁడు తండ్రి పాండవాగ్రేసరుఁడగు యుధిష్ఠిర మహారాజు (ధర్మరాజు). తల్లి వేదిక. భిన్నోదర సోదరుఁడు ప్రతివింధ్యుఁడు.

**ఔపకల్సకి గోత్రము** — లౌగాక్షి గణము చూడుడు.

**ఔపగదేశము** — కాంభోజ దేశము చూడుడు.

**ఔపగవి గోత్రము** — విష్ణువృద్ధ ఉపగణము చూడుడు.

**ఔపదవ గోత్రము** — వశిష్ఠ గణము చూడుడు.

**ఔపదహాని గోత్రము** — అగస్త్య ఉపగణము, కుశిక గణము చూడుడు.

**ఔపధి గోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుడు.

**ఔపబిందు గోత్రము** — ఔతథ్య ఉపగణము, శరద్వంత ఉపగణము చూడుడు

**ఔపమన్య గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుడు.

**ఔపమర్కటాయని గోత్రము** — కణ్వ ఉపగణము చూడుడు.

**ఔపమర్కటి గోత్రము** — గర్గ ఉపగణము చూడుడు

**ఔపమిత్య గోత్రము** — ఆత్రేయ గణము చూడుడు.

**ఔపలేఖి గోత్రము** — ఉపమన్యు గణము చూడుడు.

**ఔపవత గోత్రము** — వశిష్ఠగణము చూడుడు.

**ఔపవ్య గోత్రము** — నిధృవ గణము చూడుడు.

**ఔపశ్వి గోత్రము** — భరద్వాజ ఉప గణము చూడుడు.

**ఔపస్వస్థ గోత్రము** — కుండిన గణము చూడుడు.

**ఔమిల గోత్రము** — సావులల గణము చూడుడు.

**ఔరశి గోత్రము** — జమదగ్నివత్స ఉప గణము చూడుడు.

**ఔరుక్షాయన గోత్రము** — తార్క్ష్యస్య లేక మిత్రయు.వగణము చూడుడు.

**ఔర్ణనాభి గోత్రము** — గవిమర గణము చూడుడు.

**ఔర్వుఁడు** — ఋషి - ఊర్వుని ఊరువుల యందు జనించెనని జెప్పఁబడినది. ఈతఁడు జ్వాలామాలియయి సముద్రమున బడబా (గుఱ్ఱము) ముఖమున వసించుచు సముద్రోదక మాహార ముగఁ గొనునట్లులను విధాత ఏర్పఱచెనట.

ఔర్వుని పుత్రుఁడు ఋచీకుఁడు. ఋచికుని భార్య విశ్వామిత్రసహోదరి (గాధిరాజపుత్రిక) యగు సత్యవతీదేవి. ఇతనికి మున్నూరు పుత్రులనియు, అగ్రజుని పేరు జమదగ్ని యనియు, (ఈతఁడు పరశురాముని తండ్రి జమదగ్ని కాడు) రెండవవాతని పేరు శునశ్శేపుఁడనియుం దెలియుచున్నది

ఇంకను చ్యవనుని కుమారుఁడు ఔర్వుఁడు. తల్లిపేరు మనుకన్య. ఇతనికి నూర్వురు పుత్రులనియు, అందు ఋచికుఁడు జ్యేష్ఠుఁడనియుం జెప్పఁబడినది.

**ఔలపిగోత్రము** — ఉపమన్యుగణము చూడుఁడు.

**ఔలోకిగోత్రము** — కుశికగణము చూడుఁడు.

**ఔలోప్యగోత్రము** — కుశికగణము చూడుఁడు.

**ఔవేయగోత్రము** — భరద్వాజఉప గణము చూడుడు.

**ఔశనస ఉపగణము** — ఇది ఆంగీరస సంతతి. గౌతమగణములోని యొక ఉపగణము. (గోత్రములు ౮). ౧. ఔశనస, ౨. దిశ్య, ౩. నివాత, ౪. సుహావాస, ౫. సుబధ్య, ౬. సురూపాక్ష, ౭. ప్రశస్త, ౮. వికంవాంత, ఈ (ఔశనస ఉపగణ) గోత్రములకుఁ బ్రవర రూపము ౧. ఆంగీరస, గౌతమ, ఔశనస.

**ఔశనస గోత్రము** — ఔశనస ఉపగణము చూడుడు.

**ఔశీనరుఁడు** (శిబిచక్రవర్తి)— అష్టకాది చతుష్టయము చూడుడు.

**ఔషధప్రాయముగ మద్యపానము చేయవచ్చునని చెప్పినశాస్త్రము ధర్మశాస్త్రమనిపించుకొనదగదుగాని మద్యపానశాస్త్రమగునేమో**— ఆంధ్రలోకోక్తి.

**ఔషధమునకూ అపథ్యమునకూ చెల్లు–రోగం పైపెచ్చు** — ఆంధ్రలోకోక్తి.

**ఔవప్రతిమ గోత్రము** — నిధ్రువ గణము చూడుడు.

**ఔషసగోత్రము** — ఆత్రేయ గణము చూడుడు.

**ఔసిజగోత్రము** — ఇది ఆంగీరస, సంతతి గౌతమ గణము నందలి ఔసిజ గణమునఁ జెప్పఁబడిన గోత్రము. దీనికి ప్రవర రూపములు నాలుగు కలవు. ౧. ఆంగీరస, ఔసిజ, కాక్షీవత, (త్ర్యార్షేయ రూపము). ౨. ఆంగీరస. ఆయాస్య, ఔసిజ, గౌతమ, కాక్షీవత. ౩ ఆంగీరస, ఔతథ్య, గౌతమ, ఔసిజ, కాక్షీవత, ౪. ఆంగీరస, ఔతథ్య, కాక్షీవత, గోతమ, కామన్ష.

**ఔష్ఠకాయనగోత్రము** — నిధ్రువ గణము చూడుడు.

**ఔహాలగోత్రము**—సాహుల గణము చూడుడు.

**కంకంటి పాపరాజుకవి**—ఆంధ్రకవులలో నాథునికునిగ పరిగణింపఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్ర శ్రీవత్ససగోత్రము. తండ్రిపేరు అప్పయ్య. తల్లి నరసాంబ. తమ్ముఁడు నరసింహుఁడు. నెల్లూరుమండలవాసి. ప్రళయకావేరి యను యూర నీతఁ డుద్యోగమున కొంతకాలముండినవాఁడట. ఈ కవి రచించినది ఉత్తరరామాయణము. ఇది ప్రబంధశైలిని రచింపఁబడిన పురాణము. ఇంకను విష్ణుమాయా విలాసమను యక్షగానమును రచించెనట. పాపరాజుకవి పితామహునిపేరు అయ్యన్నమంత్రి. ప్రపితామహునిపేరు వల్లభరాజు అని చెప్పఁబడినది.

**కంకణ గ్రహణములు** (Annular Eclipses) — ఇవి సూర్యబింబమునకుం గలు గ్రహణములు. (గ్రహణములు చూడుఁడు. ఎస్ట్రానోమీ చూడుఁడు)

**కంకణబద్ధ పాణిగ్రహణము** — ఇది యుత్తరహిందూస్థానమునందలి రాజకుటుంబములలో నుండు నొక ప్రాచీనాచారము అవివాహితయగు నొక రసపుత్రకాంత తానాపదలో నున్నప్పుడుగాని, తనకిష్టములేని వరునితో బలవంతమున వివాహముజరిపించునపుడుగాని, తన్ను రక్షించుటకు సమర్థుఁడని తోచినట్టియు, తాను పెండ్లియాడఁదలఁచినట్టియు రాజకుమారునకొక కంకణము పంపును. ఇదియే వీరకంకణమని చెప్పఁబడును. ఆ స్త్రీని పై యాపదనుండి రక్షించి పెండ్లియాడుటకు తనకు శక్తియున్న యెడలతా నాకంకణము ధరింపవలయును; లేనిచో తిరిగి పంపివేయవలయును. తిరిగి పంపివేయుట క్షత్రియలక్షణము కాదు. "క్షతత్రాత యితి క్షత్రియా" యన్నట్లు క్షతమునుండి రక్షించువాఁడే గదా క్షత్రియుఁ డనిపించుకొనుటకుఁ బాత్రుఁడు.

ఒకప్పుడా చిన్నదానిని వివాహమాడుటకు తనకిష్టములేకపోయినను భ్రాతృభావముతో నే నీవీరకంకణముధరించుచున్నాను, అనిచెప్పి ఆమె నాపదనుండి రక్షించుటకయి కత్తిమీఁద చేయి వైచి ప్రతిజ్ఞ చేయవలయును.

**కంకణముల చెయ్యా కడియముల చెయ్యా కలసినట్లు** - (ఆంధ్రలోకోక్తి).

**కంకణరేఖ** - పురుష సాముద్రికము చూడుఁడు. స్త్రీ సాముద్రికము చూడుఁడు.

**కంకణుఁడు** - యదువంశ క్షత్రియుఁడు. నిమ్రోచికిఁ గనిష్ఠ సోదరుఁడని చెప్పఁబడినది.

**కంకాదేవి** - తండ్రిపేరు ఉగ్రసేనుఁడు, భర్త కంకుఁడు (ఈతఁడు వసుదేవుని కనిష్ఠసోదరుఁడు)

**కంకాళము** - ఇప్పుడు హరిద్వారమునందలి యొకభాగమైయున్నది. హరిద్వారము యోగక్షేత్ర మగుట నందు సన్యాసులు, యాత్రస్థులుఁ దక్క రేకాని గృహస్థులు నివాసముగా నుండరట. హరిద్వారమున వసించు పండాలు మొదలగు గృహస్థులు (సంసారులు) కంకాళముననే వసించుచున్నారు. కంకాళము కడ గంగానది మూఁడు పాయలు సంగమ మగును. కంకాళము ననే దక్షప్రజాపతి యాశ్రమముండెను అక్కడ దక్షప్రజాపతి ప్రతిష్ఠిత శివలింగము కలదు. సతీదేవి (దక్షపుత్రిక) దక్షయజ్ఞమున భౌతిక దేహము దహింపఁజేసి పార్వతిగ హిమవంతుని సుతయయ్యెను దక్షయజ్ఞకుండమును దక్షేశ్వర దేవస్థానమునకు వెలుపల జూపు చున్నారు. బహుశః ఆప్రాంత ప్రదేశమంతయు దక్షప్రజాపతి యాశ్రమమై యుండనోపు. దక్షాధ్వరధ్వంస మొనర్చిన వీరభద్రస్వామి చేతిదని యొక త్రిశూలమునటఁ జూపెదరు. అది రాయియో, లోహమో ఇంతవర కెవ్వరును పోల్చి యుండలేదందురు.

కంకాళమున గంగాతీరమున మంచి యిండ్లును వాటిం జుట్టిన చక్కని పూందోటలును కలవు.

**కంకాళీక్షేత్రము** — బంగాళములోని వీరభూమి (బీర్భూమ్) జిల్లాయందు ఉత్తర వాహినియగు కోపాయినదీతీరమున కంకాళీ యనంబడు తావున గల క్షేత్రము. ౫౨ పీఠము లలో నొకటిగ తంత్రచూడామణియందు చెప్పం బడినది. శక్తిపేరు కంకాళీదేవి. దేవస్థానము శ్మశానవాటిక యందున్నది.

**కంకుఁడు**- తండ్రి శూరుఁడు. భార్య పేరు దేవకీదేవి కుమాళ్లు శ్రీకృష్ణ, బలరాములు. సోదరులు వసుదేవుఁడు (జ్యేష్ఠసోదరుఁడు).

యదు వంశ క్షత్రియుఁడు. భార్య ఉగ్రసేనుని కుమార్తెయగు కంకాదేవి. ఇంకను కంకర్షి యను వాఁడొక ఋషికలఁడు. భార్య ప్లమోచ, కూతురు మహీమ.

సంపాతి వంశస్థుఁడగు నొక పక్షిరాజు పేరు కంకుఁడు. అతని కనిష్ఠ సోదరుఁడు కందరుఁడు.

అజ్ఞాతవాస కాలమున యుధిష్ఠిర మహారాజు కంకుభట్టుఁడను విప్ర నామధారియై యుండెను. మరియు యమునకుం గంకుఁడని పేరుకలదు

**కంకుష్ఠము (స్వర్ణక్షీరి)** — లా. Cleome felena సం కంకుష్ఠ, పీత దుగ్ధి, స్వర్ణక్షీరి. ఇది వైద్యోపయోగకరమగు వనమూలిక వెగటు చేదు రుచులంగల్గి వేడిచేసి విరేచనముం గావించును కడుపులోని నులిపురుగులం జంపి వెడలించును. శూలలను హరించును.

మరియు ఉదరరోగములు (ఉబ్బులు మొదలగునవి), గుల్మము, కఫము, అనాహములపై మంచి పనిజేయునందురు. వీర్యవృద్ధికరమగునది.

**కంకుష్ఠానది (కకుస్థ)** — బౌద్ధ గ్రంథములందు కకుత్త యనిరి. మహాపరినిబ్బాణ సుత్తమను బౌద్ధగ్రంథమున బుద్ధభగవానుఁడు పావా (అపాపపురి) నుండి కుశినగరమున కరుగుచో దీనిని దాటెనని చెప్పంబడినది. ఇది చిన్ననది. ఇప్పుడు బార్హియనుచు న్నారు. కాశియాకు దిగువను ఎనిమిది మైళ్లలో ఛోటాగండకీనదియందు సంగమించును. మేజరుజనరల్ కన్నింగ్హాము పండితుఁడు తన Ancient Geography of India లో దీని గూర్చి వివరించెను.

**కంకోన్ష వచనములు** — కంకోన్షము లన నొంటెపెదవులని యర్థము. ఇవి చాల మెత్తనివి. చాల మృదుతరమై యుండును. వీనితో నతివాడి గల గట్టిముండ్లను లోట్టిపిట్ట తిని వేయుచు తీయని మధురవాక్కులతో కఠినమగు సంగతులం దెలుపు నేర్పు మాటలకీ యుక్తిని వాడుచున్నారు.

**కంగ్** — కంగ్ఫుటూస్సు మతస్థుల యైదు మతగ్రంథముల సముదాయమునకుఁ బేరు. (కంగుఫుటూస్సమతము చూడుఁడు) ఈమతమును పాశ్చాత్య క్రైస్తవులు Confucius మతమని తమఉచ్చారణ సౌకర్యమునకు వాడుచున్నారు.

౧. Yih-kung- This is the book of Changes.
౨. Shi-kung- „ „ Songs.
౩. Shu-kung- Annals.
౪. Chuntslu-kung- „ Spring and Autumn.
౫. Le-kung- „ „ Rites.

ఇందు మొదటినాల్గును కంగ్ఫుటూస్స మహాత్ముని విరచితములనియు, ఐదవ పుస్తకము వారి మార్గానుచరులగు ముఖ్యశిష్యులు రచించి చేర్చిరనియు ననెదరు. వారా యైదవపుస్తకమును కంగ్ఫుటూస్స మహాత్ముని బోధనలం జేర్చి కూర్చిరని చెప్పఁబడినది. ఇవి చీనావారి మతమం దగ్రగణ్యములు. వారికి ౮,౦౦,౦౦,౦౦౦ మత గ్రంథములు కలవట.

**కంగ్ ఫుట్సు మతము** — ఈమతమును Confucius కీర్తిగాఁగల Confucianism అని పాశ్చాత్యులు వాడఁదొడఁగిరి. ఇది వారికి సదుపాయమగు నుచ్చారణగాన నట్లుపల్కు చుందురట. ఈమహాత్ముఁడు గొప్ప తత్వజ్ఞాని. చీనాదేశస్థుఁడు. క్రీ. పూ. ౫౫౧ యందు జన్మించి డెబ్బది మూఁడు సంవత్సరములు జీవించినవాఁడు. ఈమహానీయుఁడు కొంతకాల మొకభూపతి కడ మంత్రిగనుండెనట కాని యీమహనీయుని జీవితకాలమంతయు మతధర్మ విషయములను సంగ్రహించుట, కూర్చుట, చేర్చుట, గ్రంథరచనమొనర్చుట, బోధించుట లతో నిండినదని చెప్పఁబడినది. వీరు రచించినవి తొమ్మిదిసుప్రసిద్ధ గ్రంథములు కలవు. అందు మఁహుస్తకములు నాల్గింటియందుఁ దర్కింపఁబడిన ధర్మ విధానములును, మహాధర్మనిరతు లని పేరందిన యైదుగురు చక్రవర్తులనాఁటి ధర్మ పద్ధతులు విపులముగ చర్చింపఁబడి, విమర్శింపఁ బడి వీరిగ్రంథములందు పొందుపర్చఁబడినవి. కొన్ని క్రొత్త ధర్మములును వీరివి కలవు. తత్వ పరిశీలనము తఱచు గానఁబడుచుండును. ఈయన గ్రంథమునకు 'జీవదశయందలి నిజము' అని యర్థ మిచ్చు పేరు పెట్టఁబడిన దట. పెద్దలందు పిన్నల కుండవలసిన భక్తి, విధులు వీరిగ్రంథమున చెప్పఁ బడిన వని చీనాదేశస్థు లనెదరు. చీనాదేశమున నింటింటనొకతావున నొకఫలకమునుంచి దానిపైఁ బూర్వులపేర్లు మొదలగునవి వ్రాసి వాటికి అర్చ నలు, నివేదనలు సల్పుచుండుట ఈమతధర్మమే. ప్రజా క్షేమాభివృద్ధులకై వలసిన ధర్మవిధుల నీ మహాత్ముఁడు బోధించెనుగాని దైవసంబంధ మేమియుం దెల్పలేదట చీనాదేశమున నిపుడు వ్యాపించియున్న మతములలో నిదియె మొదటి మతము. ఇంక తాయిమతము, బౌద్ధమతము మొదలగునవి తరువాతి మతములు. ఇందు విచిత్ర మేమన చీనాదేశమున నన్నిమతములు నొకేతరి వ్యాపకము గాంచి యుండును. బౌద్ధమతము ప్రాణముయొక్క గతికైన విధులందెల్పును. తాయిమతము పదార్థ తత్వవిజ్ఞానములను దెల్పును. కంగ్ఫుట్సూ మతము సర్వధర్మములం దెల్పును. ఆదేశమున సర్వమును దెల్పి విధించు నేకమతి మేదియును వ్యాపించి యుండలేదు.

**కంచి వీరశరభామాత్య కవి** - ఆంధ్ర కవులలో మధ్యకవులందు పరిగణింపఁబడినవాఁడు. నియోగి, శైవుఁడు, కాస్యపస గోత్రజుఁడు. తండ్రి శోభనాద్రీశుఁడు. తల్లి గురువమాంబ, ఈమె పండితారాధ్యుల వీరనారాధ్యుని కుమార్తె.

రచించినది హరిశ్చంద్రోపాఖ్యానము. శంకర కవియు నొక హరిశ్చంద్రోపాఖ్యానము రచించి యుండెను. ఇర్వురు సమకాలికులేనని తలంపఁ బడుచున్నారు. (శంకరకవి చూడుఁడు).

**కంచు** — ఇది ఉపలోహము- భూమినుండి త్రవ్వి ఎత్తబడెడి అసలు లోహము కాదు. రాగితో తగరముం గల్పిగాని, రాగితో తుత్తినాగము, సీసము, తగరములు కల్పి గాని చేయఁబడునది. రాగితోఁ గల్పి చేయఁబడు నుపలోహము చాల పురాతన కాలమునుండి యున్నది. పాశ్చాత్య సీమలందు ఆదికాలముల రాతిపనిముట్ల కాలముగడిచి, ఇనుప పనిముట్లు చేసికొననేర్చిన కాలమువఱకు కంచు పనిముట్లు, ఆయుధములు ఉండెనందురు, కాని, అద్దములు తఱచు వాడబడని తొల్లింటికాలమున భరతదేశమున కంచుఅద్దములువాడబడుచుండుట, పురాతన మత గ్రంథములందు కాంస్యదర్ప ణము నుడువఁబడియుండుటవలన తెలియుచున్నది. ఈజిప్టు దేశమున పూర్వకాలములందు చేయఁ బడిన రాతిపనులకు కంచు పనిముట్లతో రాళ్లు చెక్కబడెనని కనిపెట్టబడినది. అట్లగునేని యా

నాఁటి కంచు, ఇక్కాలపు కంచు కన్న నెక్కువ గట్టిఁగల్గి యుండవలయును. గ్రీకుశిల్పు లాది కాలమున కంచుతోఁ జక్కని చిత్రముల రచించి యుండిరని చెప్పఁబడినది. అట్టివానిలో రోడ్సు పురమునఁగల నూరడుగుల విగ్రహ మొకటియు, తర్వాత టారెంటమ్ పురమునఁగల జూపిటర్ (Zeus) దేవాలయమునందున్న విగ్రహము అరువది యడుగుల ఎత్తుగల దొకటియు ముఖ్యోదాహరణములు. ఈ లోహముతో రోమనులుకూడ నెక్కువ పనులఁ జేసిరని తెలియుచున్నది. రోమను చరిత్రకారుఁడగు ప్లినీ పండితుఁడు, ఒక నాఁటికి రోమునందు మూఁడువేల విగ్రహములకుపైగా నలంకారార్థము నుంచఁబడినవని వివరించెను. ఇవి కంచు విగ్రహములు, ఈవిగ్రహము లన్నియు గుల్లగ బోతపోయఁబడినవి. మూసలంగట్టి పోత పోయఁబడినవట. ఇక్కాలమునందున్న గొప్ప కంచు విగ్రహము, అమెరికా సంయుక్తరాష్ట్రములందలి న్యూయార్కు నగరమునఁగల నౌకాశ్రయము (Harbour) నం దమర్పఁబడిన లిబర్టీవిగ్రహము ఇది అమెరికాదేశమునకు ఫ్రెంచిదేశస్థు లొసంగిన బహుమానము దీనియెత్తు ౧౫౧ అడుగులు. దీనిని చేసిన పనివానిపేరు బార్తోల్డీ (F. Bartholdi) అనియు, క్రీ. శ. ౧౮౮౬ సంవత్సరమున ప్రతిష్ఠింపఁబడినదనియు చెప్పఁబడినది. ఇది విశ్వద్వీపముల ప్రజ్వలించి స్వాతంత్ర్యముకు వెలుఁగుఁ జూపించు చుండును.

కంచుతో గంటలు, చెంబులు, పోయుట యనాదిగ భరతదేశమునఁ గల విద్యయె. హిందువుల దేవస్థానములందు కంచుగంటలు వ్రేలఁదీయఁబడియుంట సుప్రసిద్ధమే. రామాయణమున కంచు ఆయుధములఁ గూర్చిన ప్రశంసలుకలవు. కంచునందు నాదమును చక్కఁగ నిలిపి పాటం బాడు గుణము కలదుగాన నోంకారనాదముం బలుకునటుల పనను, దశసరి, ఆకారప్రమాణములు లెక్కప్రకారము కుదిర్చి, నాదముం బల్కు గంట లెన్నియో యనాదిగ జేయఁబడి దేవస్థానముల సమర్పఁబడియుంట సుప్రసిద్ధమే.

ప్రశస్తమైనకంచుచిలుముపట్టదుగాన, దానితో నన్నముం దిను గిన్నెలు పోతపోయుదురు. ఉత్తర హిందూస్థానమున కంచుపళ్లెములందు భుజించుచుండుట సర్వసామాన్యమే.

కంచుగంట ధ్వనికిప్రసిద్ధమేగాన, అధికప్రసంగమూరక నదేపనిగ విధివిరామములు లేక చేయువారిని కంచుగంటగ బోల్చి సామెత బల్కుదురు. ఎంతకొట్టినను దుర్గుణములు వీడక దెబ్బలను సరకుగొనని వారిని 'కంచుగోలు' అని యనుటయుం గలదు

గంటలకుఁ బనికివచ్చునటుల పాళ్లంగూర్చిన కంచున కాంగ్లమున Bell metal అని పేరు. కంచునం దించుక భాస్వరము భాగముం గూడ కల్పిన నది గట్టిపడిన లోహమగును. ఆకంచుతో నోడలనుముందుకు నడపు యంత్రచక్రములకు రేకులం జేయుదురు ఈజాతి కంచునకు Phosphor Bronze అని ఆంగ్లనామము.

ఆయుర్వేదవైద్యులు కంచును క్రమముగ శుద్ధిజేసి భస్మముగ నొనర్చి వాడుదురు. అది త్రిదోషములను శమింపఁజేసి ఆరోగ్యమును స్థిరపర్చుననియు, చక్కఁగ శుద్ధికాని కంచుభస్మము పైత్యవికారము, శ్లేష్మోద్రేకము, విదాహములం గల్గించుననియు, దానికి విరుగుడు చింతపండుపులుసనియుఁ జెప్పఁబడినది.

**కంచు (మోగునట్లు కనకంబు (మోగునా? —** ఆంధ్రలోకోక్తి.

**కంజంక్షనులు** (Conjunctions) — సంధియని యర్థము. ఎస్ట్రానొమీ శాస్త్రమున

గ్రహణ సందర్భములను, అమావాశ్యలందు భూమి, చంద్రుడు, సూర్యుడు, ఒకేవరుసగ నుండుట కే పేరిడియున్నారు. (గ్రహణములు, ఎస్ట్రోనొమీ చూడుడు).

**కంటకత్రయము** — ఆయుర్వేదవైద్య శాస్త్రమున వాకుడుచెట్టు, నేలమునగచెట్టు, పల్లేరుచెట్లకుం గంటకత్రయమని పేరు.

**కంటక ద్వీపము** — బంగాళములోని బర్ద్వాన్ మండలమున నిప్పుడు కట్వాయని పిలువబడుచున్న పురము. దీనికిం దొల్లింట కంటకనగరమనియుం బేరుండెను. కంటకద్వీపము కాలము గడచినకొలంది కటద్వీపమై, కాటాదియా మై కట్వాగా మారెనట.

ఇది చైతన్యుల యాత్రాస్థలము. చైతన్య దేవుండు తన ఇరువదినాల్గవయేట నిల్లువిడచి యిట కేశవభారతి యనుపేరుగల గోసాయికి శిష్యుండై యాయనవలన చైతన్యవైష్ణవదండి యాయెను. అప్పుడు తీసివేయబడిన యాయన తలవెంట్రుక లొక చిన్న దేవళమున భద్రపఱచి యున్నారు. మరియు చైతన్యస్వామియొక్క యాకృతి (Autograph) కట్వాకు దక్షిణముగ ౧౮ మైళ్ల దూరమునంగల దండూరను గ్రామమున గలదు. కట్వాకుత్తరమున నాల్గుమైళ్లదూరమున ఝూమత్పూరను గ్రామము చైతన్య చరితామృతము రచించిన కృష్ణదాసుకవిరాజునకు నివాసగ్రామము. కట్వాకు నైఋతిదిశగా ౧౬ మైళ్ల దూరముననున్న నన్నూరను గ్రామము పెక్కు చైతన్యవైష్ణవగ్రంథముల రచించిన చండీదాసు జన్మస్థలము. కట్వాకు మహమ్మదీయ ప్రాబల్య కాలమున మూర్షిద్‌గంజియను మహమ్మదీయ నామ మీయబడెనటకాని, ఎవ్వరు దానిని వాడుచుండుట మాత్రము లేదు.

**కంటకన్యాయము** — కాలిలోముల్లు విరిగితే మఱియొకముల్లుతోం దీసి, పిదప రెండు ముళ్లను పరిహరించుదురు. ఒక శత్రువు నింకొక శత్రువు సాహాయ్యమున నడంచివైచి యిద్దరిం బరిహరింపవలయునని భావము.

**కంటకారీత్రయము** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున వాకుడు, రేవటిదూలగోవిల, నల్లి చెట్లకు కంటకారీత్రయమని పేరు.

**కంటత్రయము** - త్రికంటముచూడుడు.

**కంటికి దగులదగిన పుల్లను మొదటనే ఉత్తరించ వలసి యుండును**- అనగా శత్రువుని ఆదియందే దూరముగ నుంచ వలసి యుండునని భావము. ఆంధ్రలోకోక్తి

**కంటికింపైతే కడుపున కింపగుట**- ఆంధ్రలోకోక్తి.

**కంటికి రెప్ప కాలికి చెప్పు కూడా అయ్యేవాఁడు** — అనగా చాల ఉపచరించే వాఁడని భావము. ఆంధ్రలోకోక్తి.

**కంటికోష్టి కానది** - అయోధ్య పరగణా యందు రామగంగలో చేరినది. రామాయణము అయోధ్యాకాండము ౭౧ యందు ప్రశంసింపంబడినది.

**కంటేంగో** (Contango) - వాణిజ్య సంబంధ పరిభాషా పదము. స్టాకు ఎక్సుచేంజి వ్యాపారమునం దొక వ్యాపారమును ఒక తీర్మానపు దినమునుండి వేఱొక దినమునకు నిలిపి యుంచుట కీపేరు వాడుదురు. అట్టిదినమునకు Contango day అనియు నందురు.

**కంత్రకము** - ఈశబ్దము సరియైనది కాకున్నను వాడుకయందున్నది. కంత్రగించుటయన ఆడిపోయుట. అదేపనిగ నిందించుచుండుట యని

భావము. నిందించుటను, ఆడిపోయుటలను కంట్రకమని వాడుచున్నారు.

**కంట్రాక్టు** (Contract)-(వాణిజ్య సంబంధ పరిభాషా పదము). ఒకరికై వేఱొకరు కొన్ని పనులం జేయుటకును, దానికి ప్రతి ఫలమును నిర్ణయించుకొని ఉభయులుఏర్పఱచుకొనిన సమాఖ్య కార్యము. ఆ సమాఖ్యకు Contract note లేక Contract deed అని పేరు.

**కంతకుబ్జనన్నిపాతము** - సన్నిపాత దోషము చూడుడు

**కంతచామీకర న్యాయము**- తనమెడనున్న కంఠాభరణము తానెఱుంగకుండుట యని వేదాంత శాస్త్రమున చెప్పఁబడిన న్యాయము

**కంతరిగోత్రము** - కపి ఉపగణము చూడుడు.

**కంతేరణిగోత్రము** - జమదగ్ని వత్స ఉపగణము చూడుడు

**కండెన్సడ్ మిల్కు పరిశ్రమ** (Condensed Milk)- పాలయందలి ద్రవపదార్థము ఆవిరియైపోవునట్లుచేసిన మిగిలినపదార్థమునకు సుక్రోజు లేక సీకనైను అనఁబడు శర్కర చేర్చిగాని, చేర్చకగాని యుపయోగింపఁబడు పాలకు Condensed Milk అనిపేరు.

ఈకండెన్సుడు మిల్కులో రెండురకములు గలవు. ౧ శర్కరచేర్చినది. ౨. చేర్చనిది. రెండురకములును గాలిప్రవేశింపఁజాలనట్లు సీలుచేయఁబడిన రేకుడబ్బాలతోడనే యితర దేశముల కెగుమతిచేయఁబడును.

సాధారణముగా మార్కెటులో రవానా చేయఁబడుచున్న Condensed Milk లో చాల భాగము పాలనుండియు, పాలయొక్క యుప పదార్థములగు (Skim Milk) మీఁగడ వేఱు చేయఁబడిన పాలు, మజ్జిగ, వెన్న మొదలగువానినుండియే తయారుచేయఁబడుచున్నవి.

ఉత్పత్తి చేయు విధానమును బట్టియు, వానిలో వేయు నుపపదార్థములను బట్టియు, Condensed Milk పలువిధములగు వర్తక నామములతో విక్రయింపఁబడుచున్నది. మధుర పఱ్పబడిన Condensed Milkలో Suckrose అనఁబడు నొకరకపు పంచదార కలుపుదురు.

లోనున్న ద్రవపదార్థము ఆవిరిమూలముగా నిగురునట్లు చేయఁబడి పంచదారకలుపని పాల పదార్థమునకు Evaporated Milk అని పేరు. ఇవియును మధురపఱ్పఁబడిన Condensed Milk వలెనే గాలిచొరరాని రేకుడబ్బాలతోడనే ఇతర దేశముల కెగుమతిచేయఁబడును.

Plain Condensed Milk అనురకము Condensed Milk లో Suckrose చేర్చి Sterilize చేయకుండా అమ్మకమునకు సిద్ధము చేయఁబడుపదార్థము.

Skim Milk వలన తయారుచేయఁబడి Suckrose కలిపిన Condensed Milk నకు Sweetened Condensed Skim Milk అనిపేరు

**కండెన్సుడుస్విస్మిల్కు** (డబ్బాపాలు) - స్విట్జర్లాండు దేశము చూడుడు.

**కంత** — ఇది వివాహములందు వధువునకు నాభరణప్రదర్శనము. ఇందు అభరణములను బంధువులకుఁ జూపుటయు, వానిని పూజించి వధువునకిచ్చి ధరింపఁజేయుటయు నడచు నుత్సవము జరగును. కంతయనిన దొంగతనముఁ గూర్చి యున్నదని తెలియుచున్నది.

**కందకులేనిదురద బచ్చలికా?** — ఆంధ్రలోకోక్తి.

**కంద చెట్టు** — లా Tacca pinna-tifida. లేక Arum campanulatum. సం. ఓలః, ఆర్శోఘ్నః - చిత్రదండకః. కందదుంప రుచికరమగుశాకము. ఇందు పెక్కుజాతులు కలవు. ఆంధ్రదేశమున నెల్లూరు ప్రాంతములందు పైరగు పెద్దదుంపలు మొదలు, గంజాము మండలమున పైరగు చిన్నదుంప వఱకు పలు జాతులుగనున్నది. తంజావూరుమండలమున పైరగు పొడవుజాతి కందయు నీజాతులలోని దనియె చెప్పవచ్చును. ఇందు దురదగల్గినవి తెగిన నెత్తురు రంగు కన్పడును. అది యధమపుజాతిదని చెప్ప నగును ఇంక దురదలేనివి ఉత్తమజాతి అవి తరిగిన తెలుపు, లేక పసుపుపచ్చని రంగు కనపడెడిని. కందచెట్టునకు పసువులపేడ, లేక బాగుగ ముక్కిన గెత్తమును ఎరువుగ వేసినచో దుంపలందు దురదకల్గునని చెప్పెదరు. కంద ఆరుమాసముల కాలమునకు సిద్ధమగును. ఐనను త్రవ్వుకొనక వదిలిన తిరుగ నాటుదుంపనుండియే మరుసటిసంవత్సరము వర్షములకు మొక్కపుట్టి దుంపపెద్దది యగును ఇట్లు నీజాతిని వృద్ధి చేయవచ్చునందురు.

కంద దుంప భోజనపదార్థము. వేడిచేసి గురుత్వముగనుండి జీర్ణమగును. జఠరమునకుఁ దీప్తినిచ్చి కఫము, మేదోరోగము, మూలవ్యాధి, వాతరోగముల నడంచి బలము, వీర్యపుష్టినిచ్చి విరేచనము చేయును. ఇంకను కడుపులోని బల్లలు, కడుపుబ్బరము, గర్భవాతముల నడంచి మేహరోగమును బలపర్చెడిని. కందకు కల్లు, తమలపాకులు, నెయ్యి, పులుసు, బెల్లము విరుగుడులని చెప్పఁబడినది. (అడవికంద చూడుఁడు).

**కందపీడాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. రెండు మోకాళ్లను నేల నాన్చి నాటిపై నిలచి, రెండు పాదములను నాభికడ నుంచుట కందపీడాసన మనంబడును. ఇందువల్ల నాడులందుమలశుద్ధిగలిగి, అపానవాయువు క్షీణించును. కుండలినీప్రబోధ మగును. ప్రాణవాయువు సుషుమ్నగత మగు నని చెప్పఁబడినది.

**కందమూలపు దుంపల వ్యవసాయము** - ఇది భరతదేశమునం దనాదిగగలదు. ఋషులనాఁడు సైతము కందమూలాశనము చెప్పఁ బడిండి ఇది లేని సీమలవారిలో కొందఱు దక్షిణ అమెరికానుండి ఇటీవల రప్పింపఁబడిన దనుచుం దురుగాని, ఇది పూర్వకాలములందు లేకపోలేదు. దీనికి వేర్వేరు సీమలందు వేర్వేరు పేరులు వాడుకయందున్నవి. గుంటూరు, బెజవాడ, బాదరు ప్రాంతములందు దీనిని గెనుసుగడ్డ యనెదరు. కొన్నిసీమలందు దీనిని చిలగడ మనియు, మోహనమనియు నెదరు గాని నిజమున నవి ప్రత్యేకపు జాతి దుంపలుగ నుండుట గాన నగును.

కందమూలపు దుంప లెఱ్ఱని పై పొర రంగు గలవిగను, తెల్లనిపై పొరరంగు గలవిగను రెండు జాతులుగ నున్నవి. కొన్నిసీమల వారెఱ్ఱనివాటి నెఱ్ఱ దుంపలనియు, తెల్లని వాటిం దెల్లదుంప లనియుంగూడ వాడుచున్నారు తెల్లదుంప లధిక వాతముం గల్గించుకతన ననారోగ్యములని చెప్పఁ బడుచున్నవి. ఇవి భరతదేశమున భోజన పదార్థములుగ నున్నవి. ఇవి పూర్వకాలమున నడవులం దుండిన జాతులే.

తేలిక యయిన యిసుకభూములు, గరపభూములు కూడ వీటి కనుకూలములే. బాగుగా కుళ్లిన ఆకుల యెరువు, పసువుల గెత్తము, కాలిన బుగ్గి విస్తారమువీటి కెరువులుగ వాడంబడుచున్నవి. యకరమున ముప్పది బండ్ల ఎరువు పోసి కలియ దున్ని, కలుపు పెరుగకుండశుభ్రము చేయుచుంట

గాన నగును. కందమూలపు తివ్వను రెండు లేక మూడు కణుపు లుండునట్లుల ముక్కలుగ నరికి వర్షముల ప్రారంభమున నాటి, వర్షములు కురియు తరి నీరు తోడుకొనరు. నూతులనుండి నీరెడవలసి నచో చిన్నమళ్లనుగట్టి నీరు తోడి పారింతురు. మళ్లు తఱుచుగ కది యడుగుల చౌక ముండును. కణుపులనుండి ప్రేళ్లు ప్రారంభమై అవియే దుంపలుగ నేర్పడును దుంపలను కొన్ని సీమలవారు గడ్డ లనియెదరు. తీగయొక్క కొనలయున్న లేత భాగములు విత్తనమునకుం బనికిరావు. అడుగు దూరమున కొకటిగ నాటుచుండుగాని, అడుగున్నర దూరమున కొకటిగ నాటుట శ్రేయము, ఏల నన నిది విరివిగ తీగలం జెంచి పొలమంతయుం గప్పివేయును పిదప కిలుపు పుట్టిన నదియే పెరుగలేక చచ్చును.

భూస్వభావముంబట్టి వారమున కొకతడిగాని పదిదినముల కొకతడిగాని, పదినేను దినముల కొకతడిగాని తగులుచుండునట్లుగం జూడవలయును. తీగలు వచ్చిన దాదిగ తీగలు నేలకాని నాటుకొనకుండ చూడవలయును. లేకున్న నిరర్థకము లగు ప్రేళ్లుపారి, అసలు దుంపల పంటం దగ్గించును. కందమూల మైదు నెలలు మొదలారు నెలలకు పండి త్రవ్వుటకు సిద్ధమగును. ఆకులు పండ బారుటం గాంచి రైతులు దీని నెఱుంగ గలరు. నీరు పారించుట మాని కొలుత తీగ గోసివైచి వేళ్లు తావునందు నాటి ముందు విత్తనమునకై యుంచుకుని నీరు పోయుచు పెంచు చుందురు. కందమూలముం ద్రవ్వుతరి బారికెలపోటు దుంపలకుందగులరాదు. త్రవ్వుట యాలస్య మగు నెడల దుంపలు చిత్తగొట్టు నటులనై పుచ్చునుగాన, వెంటనే త్రవ్వవలెను వలసి యుండును యకరమున కరువది రూప్యములు ఖర్చులు పోను లాభము వచ్చునని చెప్పంబడినది.

**కందమూలము దుంపతీగ (గెనుసుగడ్డ)** — లా. Dioscorea, aculeata. ఆంగ్ల. Country (or Sweet) potato. వీనిని దుంపలని సామాన్యముగ వాడుదురు. ఇవి ఎఱుపు, తెలుపురంగులభేదముచే ద్వివిధములుగాన, వీనిని ఎఱ్ఱదుంపలనియు, తెల్ల దుంపలనియు వాడుదురు. గుంటూరు మండలమున గెనుసుగడ్డ లందురు. మరికొన్ని తావుల మాదిఫలపు దుంపలనుచుందురు కొన్ని సీమలందివి యెక్కువ కోలగ వంకరలు గల్గియు, కొన్ని సీమల నెక్కువ వలయముగల్గియు నుండెడివి. ఇందెఱుపురంగుగలవి శ్లేష్మమనియు, తెలుపు రంగుగలవి వాతదోషము నుద్రేకించు ననియు నందురు ఇవి భోజనోపయోగ పదార్థము. వాతముగల్గించి మోన సుద్దంగల్గించును. రక్తవృద్ధి, బలముగల్గించును. జ్వరము నుద్రేకించును. శ్లేష్మము గల్గించును. దీనికి విరుగుడు పంచదార, సొంఠి, ఉప్పు, మోదుగచెక్కరసము నని చెప్పంబడినది

**కందర్పతాళము** — తాళములు చూడుము.

**కందిచెట్టు**- లా. Cajanus indicus. ఆంగ్ల Red gram లేక Pigeon pea. సం. ఆఢకీ, తువరికా, తువరీ, శానపుష్పికా అని పేర్లు. కందులు కందిచెట్టు కాచు కాయలలోని గింజలు. వీటి పప్పు భోజనపదార్థము. కందులందు పెద్దగింజలుగలవి శ్లేష్మము కాదు. చిన్నగింజలు పండు జాతి చాల శ్లేష్మము. కందిపప్పునందు దేహపుష్టి, బలము, జీర్ణశక్తి, రక్తమును శుభ్రపఱచుగుణము, పైత్యములేని గురుత్వము గుణములుగ చెప్పంబడినవి. శ్లేష్మవాతమును, మేహ పైత్యమును, కుసుమరోగమును బలపఱచు దుర్గుణములు కలవని చెప్పంబడినది.

అజీర్తిని, కఫమును, గ్రహణిని, జ్వరమును జ్వరాతిసారమును, వాతమును నివర్తించును. వాతనొప్పులకు కాపులు వేయించి కాచిన నిమ్మళించును. దీనికి విరుగుడులు ఉదకము, వామము, ఉప్పు, కరక్కాయ, శొంఠి, దీని చూర్ణము, పిప్పళ్లు, నెయ్యి, తేనె, పులుసు, మజ్జిగ, కలినీళ్లు.

**కందిపొడిరాయి** (Sand stone) — ఇది గ్రెనైటువలె గట్టిరాయి కాదు. గ్రెనైటు రాయి కొన్నికారణములచే పగిలి గుండయై తిరుగ మట్టితోకలసి యడుగుమబడి నదీపాత మున Mineral matter అధికముగ గల్గియుండిన గట్టిగను, తక్కువగ గల్గియుండిన కేవలము పిండిరాయిగను ఉండెడిని. ఇందుండు రాతిపదార్థము Quartz, Crystal powder ముఖ్యముగ గలిగియుండునని పరిశీలనవలన తేలినది. Felsparmica మొదలగు ఖనిజపదార్థములుకూడ నుండునందురు. పంకమునందు బురద, సిలికా, సున్నముగూడ నుండుటకలదు. ఈజాతి రాళ్ళు ఎఱ్ఱగను, పసుపుపచ్చగను, ఆకుపచ్చగను ధాతువులుగల్గియుంట కలదు ఎఱ్ఱనిధాతువు కలదానిని ఎఱ్ఱకందిపొడిరాయి యనెదరు. ఇదియె విస్తారముగ నుండును. ఇది నల్లఅభ్రకమాదలి యినుము వలన గల్గుచుండురంగు.

గ్రెనైటురాయి యాదలి ఖనిజములును, కందిపొడిరాయియాదలి ఖనిజములును ఒకేరీతి నున్నను, ఇది తిరిగి చేయబడుటచే చాల మెత్తని దిగ నుండి గట్టిని గోల్పోవును. ఈభేదముచేయబడు విధానభేదములచే గల్గినది.

రసాయనశాస్త్రమున దీనికిDetritic Stone అనిపేరీయబడినది. Detritus అనిన రాతిపొడు అని యర్థము.

**కందిరీగ, తేనెటీగ** — కందిరీగలు తేనెటీగలు కుట్టినేని జరుగునది ఇది:- ఈకీటకములకు మొగమున నొకసూదియగుముల్లుండును. ముల్లు గొట్టములోన గుల్లగనుండి యందు మంట గలుగజేయు విషముండును. కందిరీగ కుట్టుటయన నాముల్లునుగుచ్చి విషమునిడుట. తోడనే కుట్టిన చోట మంటకల్గును

పిదపకందిరీగ తనశాంతుసేతులనటనాని తాను గుట్టిన గాయపుగుంటనుండి తనముల్లును బయటికి పెరుకుకొనవలసి యుండును. అంతదనుక వ్యవధి లేకుండనే కుట్టబడిన యాతడా కందిరీగం బరిమార్పను లేకున్న బలాత్కారముగ నటనుండి త్రోసివేయును. ఈబలాత్కారపుకార్యమున తన ముల్లు విరిగిపోవ కందిరీగ (బ్రతికియుండెనేని) బయటపడును ఆముల్లు విరిగిన గాయమే ఆయీగమృతికి త్వరలో కారణము లను.

తేనెపట్టునందు ఒక తల్లియీగయు, తక్కిన తేనెటీగల సముదాయమును ఉండును. తక్కిన సామాన్యపుటీగలే ఇట్లు కరచునవి. తల్లియీగ తన జాతివైరిపైమాత్రమే కలహించి దాడివెడలుంగాని, సర్వసాధారణముగ తేనెపట్టునకై వెడలి వారితో కలహింప నిచ్చగింపదు. (ఈగ చూడుడు)

**కందు లేక కండు గోత్రము** — పరాశర గణము చూడుడు.

**కందుక తాళము** — తాళములు చూడుడు.

**కందుకూరి సీమ** – ఇప్పటినెల్లూరి మండలములోనున్న కందుకూరిప్రాంత దేశమని యర్థము. ఒకప్పుడు దీని ఉచ్చకాలమున కృష్ణానది మొదలు పినాకినీ (పెన్న) నదివఱకు కందుకూరిసీమగాం బరగుచుండెను.

**కందుకూరి రుద్రయ్యాచారి కవి**- ఆంధ్రకవులలో మధ్యకవులందు పేర్కొనబడిన వాడు. విశ్వబ్రాహ్మణుడు. తండ్రిపేరు పెద

లింగన్నాచార్. గుంటుపల్లి భాస్కరునకు ఆశ్వాసకవి. క్రీ. శ పదునేడవ శతాబ్దారంభము నందుండినవాఁడు. అనగా ౧౬౨౦ ప్రాంతము. రచించినది నిరంకుశోపాఖ్యానమను ప్రబంధము

**కందుల వ్యవసాయము** — కందుల వ్యవసాయము ఆఫ్రికాదేశమునుండి తక్కినదేశములకు వ్యాపించినదని వాడుకగలదు. భరతదేశమునందేగాక ఆసియాఖండ మంతటను, వెస్టు ఇండీసుదీవులందునను పైరుచేయఁబడుచున్న పప్పు దినుసు కంది. ఇందులో రెండు భేదజాతులు కలవు. పెద్దగింజలుగల జాతిని పెద్దకందియనియు, కొందఱు గొబ్బికందులనియు నందురు. ఇది అధమపుజాతిగ నెంచఁబడుచున్నది. మధ్యరకపు కందులు సర్వసాధారణపుజాతి. చిన్నగింజలుగల దానిని చిరికందులనియు నందురు. ఇది యుత్తమజాతిగ నెంచఁబడుచున్నది. ఇవి ఆంధ్రదేశమునందు ఈ మూఁడు జాతి కందులు గుంటూరుప్రాంతముల చిరికందులజాతియు, నైజామురాజ్యమునందలి సిద్దిపేట ప్రాంతముల విస్తారముగ పైరగు పెద్దజాతి కందియు, మిగుల రుచ్యములగుటచే నెక్కుడు ధరకమ్ముడుపోవుట కలదు. గుజరాతుదేశమున తెల్లనిరంగుగల కందులు రెండుజాతుల కందులు పైరుచేయఁబడుచున్నవి

ఎఱ్ఱరంగుగల రేగడభూములందు పైరు చక్కగా నగును. ఎల్లరేగడి భూములందునను, ఇసుకగలసిన మట్టిభూములందునను ఒక మోస్తరుగా పైరగును. ఇసుకయందు కందిచేను పెరుఁగక గిడసబారి చచ్చిపోవును. వర్షములు అదనుకు సరిగా పడకుండిన కందిచేను చక్కగా పెరిగి ఫలించదు. దీనిని సజ్జ, జొన్న, నువ్వుచేల యందు కల్పిగాని ప్రత్యేకముగగాని వేయుచుందురు. మెట్టవరితోకల్పి కొన్ని తావులందు వేయుదురు. వర్షములులేక నీరుపెట్టిన మంచి పంట లభించును. కందిగింజల పైపొట్టు పసువులకు మంచియాహారమగును. కందిచెట్లంగాల్చిన బూడిదతో తుపాకిమందు చేయుచుండిరి. కంది పప్పు భరతదేశమున భోజనపదార్థముగ వాడఁబడుచున్నది.

ఇపుడు సంయుక్తరాష్ట్రమునందలి కాన్పూరు ప్రాంతములయందు ప్రశస్తమైన కందిపప్పు ఇటీవల సర్వప్రాంతములకు వ్యాపించి రుచ్యమైన భోజన పదార్థముగ నుపయోగింపఁబడుచున్నది.

ఆంధ్రదేశమునందు గొన్నిచోట్ల కందిచెట్లు వృక్షములవలె పెరిగి యేటేట కాయుచు నారు సంవత్సరములవఱకు జీవించు నొక జాతి కలదు. కాని యిది విరివిగా పైరుచేయఁబడుటలేదు.

**కంపనసన్నిపాతము** — సన్నిపాత దోషము చూడుము

**కంపవాతము** — ఎగురువాతము చూడుము.

**కంపస్, దిక్కులుచూపు యంత్రము** — ఇది క్రీ. శ ౧౧౧౧ లోనే దీనిని చీనావారెఱింగి యుండిరని తెలియుచున్నది. మార్కోపోలో, చీనాయందుద్యోగము చేసి క్రీ. శ. ౧౨౬౦ లో యూరపునకొక కంపసును దెచ్చెననియు, అమాల్ఫీ




కాపురస్థుడు Flavio Gioja అను నాయన (నేపిల్సునందునావికుఁడు) క్రీ. శ ౧౩౦౨ లో Compass Needle ను వ్రేలాడదీయుటను కన్పెట్టెననియు, తర్వాత ౧౪౯౨ లో కొలంబసు దీని Variation కనిపెట్టెననియు, తర్వాత ౧౫౭౬లో Wappeag కాపురస్థుడు Robert Normand అను నాయన Dip of needle ఏర్పర్చి యభివృద్ధి పర్చెననియు, తరువాత Mr. William Barlowe అను నాయన

౧౭౦౮ లో Hanging Compass ను Compass box ను రచించెననియు చెప్పఁబడినది. Measuring compass యంత్రమును క్రీ. శ. ౧౬౦౨ లో Hesse కాపురస్థుఁడు Jos Bing అనునాయన కనిపెట్టెనట. (దిక్కులచూపు యంత్రము చూడుఁడు). ఇది సూదంటురాతియందు గల శక్తిసహాయమున సూత్రము మొదలగు పదునారు దిక్కులం దెలుపు సాధనము, ఓడలు సముద్రమధ్యమున నడచుతరి రాత్రులందు దిక్కులు తెలియకుండుంగాన నీయంత్ర (Mariner's Compass) సాహాయ్యమున దిక్కుల నెఱింగి యోడల నడుపుకొనెదరు. (దిక్కులుచూడుఁడు). వృత్తములంగీయు పనిముట్టునకుం గూడ Compass అని పేరు గలదు.

**కంపిలానగరము** (కాంపిల్యము లేక కాంపిల్యనగరము) — దక్షిణ పాంచాలమునకు తొల్లిటి రాజధానిగా నుండిన పురము. పాంచాల దేశము చూడుఁడు. ఇది ద్రుపదమహారాజునాఁటి రాజధాని చర్మన్వతీ నదీ తీరముదనుక నిది వ్యాపించియున్నదని తెలియుచున్నది.

**కంపిల్లకము** - లా. Mallotus philippinentis అనియు Rottlera tinctoria అనియు, సం కంపిల్లక, రక్తచూర్ణక, లోహితాంగ యనియుం బేర్లు.

ఇది వైద్యోపయోగ కరమైనది. కారము, చేదు రుచులు గలది. ఇది మదిమిం బోగొట్టునదిగ చెప్పఁబడిన యౌషధి. కాక జేసి విరేచనము గల్గించునది.

దీనిచూర్ణము కడుపునొప్పి, కఫము, గుల్మము కాస, శ్వాస, క్రిమి, వాతమున కల్గిన ఎక్కిళ్లు, వ్రణములు, శూలలు, పైత్యభ్రాంతులు, ఉదర రోగములు, మలబద్ధముల నడచి ఆకలిం జక్కపఱచి, యౌవన బలమున శరీరము నిల్పునని చెప్పఁబడినది.

**కంబల నిర్ణేజనన్యాయము** - కంబళి నుతుకుట యని యర్థము తన పాదములపై కంబళి నుతుకుటవలన కంబళియందలి మురికియుం బోవును. తనకాళ్లయందలి ధూళియు (మురికియు) వదలును. రెండు ఉపయోగములని భావము.

**కంబలబర్హి** - అత్రి, చంద్ర, యాదవ, క్షత్రియుఁడు. తండ్రి అంధకుఁడు. సోదరులు భజమానుఁడు, శుచి, కుకురుఁడు.

**కంసాలాయన గోత్రము** - విధృవ గణము చూడుఁడు.

**కంసుఁడు** - అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు తండ్రి ఉగ్రసేనుఁడు కంసునకు దేవకీదేవి సుతుని వలన మరణమని జ్యోతిష్కులు చెప్ప, వారిం జెరసాలయందుంచి నిర్బంధము జరిపెను వారిపిల్లలం జెక్కండ్రను బలిమార్చెను. ఎట్టకేలకు శ్రీకృష్ణునితో కలహించి నిహతుడయ్యెను. ఈతని మామగారగు (మగధ నృపాలుఁడు) జరాసంధుఁడును శ్రీకృష్ణునిపైఁ బగబూని యుండి యాతనితో కలహమున నిహతుఁడయ్యెను

**కకుత్థ్సుడు (పురంజయుడు)** — మరీచి ఇక్ష్వాకుసంతతి సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి వికుక్షి. పితామహుఁడు కుక్షి. సోదరుఁడు బాణుఁడు. సుతుఁడు అనరణ్యుఁడు లేక అనేనస్సు. మఱియు సుయోధనుఁడను నామాంతరమును కలవాఁడు. ఈతఁ డొకరాక్షసునితో దేవహితార్థము సంగర మొనర్పవలసివచ్చి, వృషభరూపుఁడగు దేవేంద్రుని మూపురముపై నెక్కి యుద్ధ మొనర్చుటం జేసి ఇంద్రవాహనుఁ డనియు, వారిం జయించుటచే పురంజయుఁడనియు పేరందినవాడు. ఈతనిసోదరుఁడు బాణుఁడుగ కొన్ని తావుల గానవచ్చెడిని.

ఈసంతతివాఁడగు వేఱొక కకుత్స్థుఁడుకలఁడు. తండ్రి భగీరథమహారాజు కుమారుఁడు అంబరీషుఁడు

**కకుద్దేవి** — దక్షప్రజాపతి కుమార్తె ధర్ముని భార్య.

**కకుద్మి** — అనువంశ క్షత్రియుఁడు. తండ్రి పేరు రైవతుఁడు. కుమార్తె రేవతి. అల్లుఁడు శ్రీకృష్ణుని జ్యేష్ఠసోదరుఁడగు బలరాముఁడు

**కక్కిన కుక్కవద్దకు కన్న కుక్క వద్దకు పోవుట అపాయకరము** — ఆంధ్రలోకోక్తి

**కక్కుపాలచెట్టు** — లా Zizyphus trinervivus ఇది వైద్యోపయోగమగు వనౌషధి. దీనియాకు కషాయము పొక్కు, సవాయి, సెగ, వ్రణములవలన చెడిన శరీరమందలి రక్తమును శుభ్రపఱచి రోగనివృత్తి గల్గించునని చెప్పఁబడినది

**కచి బీహారు సంస్థానము** — ఇది భూటాన్ దేశమునకు దక్షిణముగానున్న స్వదేశ సంస్థానము మహారాజు బ్రహ్మసమాజ మతస్థుఁడు కుచిబీహారుపురము రాజధాని.

**కచుఁడు** — తండ్రి బృహస్పతి తల్లి తార శుక్రాచార్య శిష్యుఁడై యాయనను డి మృతసంజీవనివిద్య నేర్చినవాఁడు. మృతసంజీవని విద్య యీతనికిచ్చుటకు తొలుత శుక్రుఁడు వెఱచెగాని పుత్రికయగు దేవయాని ప్రోత్సాహమున నట్లొనరించెను దానిప్రతిఫలముగ దేవయాని తన్ను పరిణయమగుమని కచునిఁగోరెను. అతఁడు గురుపుత్రికగాన తగదని యామెను నిరాకరించెను. ఆమె యలిగి మృతసంజీవని విద్య నీకు ఫలింపకపోవుగాకయని శపించెను. కచుఁడు మృతసంజీవని నుపయోగించజాలక పోయెను గాని, యాతని శిష్యులుపయోగింప వీలయ్యెను. దేవయాని పిదప యయాతిమహారాజుం బరిణయమయ్యెను.

**కచ్చడికాయచెట్టు** — ఇదియు ఈదెపండువంటి నారింజజాతిలోనిది కాయ పుల్లగ రుచిగా నుండును ఆయుర్వృద్ధి నొసంగు నంతటి యారోగ్యకరమని చెప్పఁబడినది కండ్లకు చలువజేయును. చర్ది, దాహము, మూలవ్యాధి, వాతదోషములను శమింపజేయును

**కచ్చిదేశము** — కచ్ఛదేశముచూడుఁడు.

**కచ్చిస్టేట్సు** — బొల్లింటి భరుకచ్ఛదేశము ఇది అర్ధచంద్రాకారముగనున్న ద్వీపకల్పము. దీనికిం దక్షిణమున కచ్చి సంయుక్తాగ్రగుడ సముద్రము (గల్ఫాఫు కచ్చి) కలదు. దీనికిని సింధుదేశమునకును నడుమనున్న మెరకతంపరకు రన్నాఫు కచ్చి యనియు, గ్రేటు రన్ననియు ననుచున్నారు. ఇది ఇసుకమయమగు పల్లపు, ప్రదేశము. సాతు వెస్టుమాన్సూనుల (వర్ష) కాలమున నిండును. తక్కినకాలములం దెండిపోవుచుండును ఈ ప్రాంతముల నడవిగాడిదలు తిరుగుచుండును ఈఁగలు విస్తారము. దేశమున హిందువులు, మహమ్మదీయులు చెరిసగముగ నున్నారు. దేశమేలు ప్రభువునకు మహారావని బిరుదము కలదు ఆయనకులోఁబడిన సామంతరాజులు రెండువందలమంది యున్నారు. భుజపురము (భూజ్) రాజధాని. ఇది దేశమధ్యమందున్నది సముద్రతీరమందున మాండవిపురము రేవుపట్టణము. క్రీ. శ. ౧౮౧౯ లో కల్గిన భూకంపము దేశమును చాలభాగమునష్టపర్చినది.

**కచ్చూరపుచెట్టు** — లా. Curcuma zedorea అనియు, Curcuma zerumbet అనియును, ఆంగ్లమున Round zedoary అనియు, సం కచ్చురా, కచ్చూరికా, గంధ

కచ్చూర, చంద్ర యనియుం పేర్లు కలవు. ఇంకను కొందఱు గంధాఢ్య (జవ్వాది) యనియుం గూడ కచ్చూరమునకు పేరు వాడియున్నారు. మఱికొందఱు చంద్రమూలిక యని వాడిరి ఇవి సువాసనగల్గిన దుంపలు (అల్లమువలెనే భూమి యందు పారునవి). కఫవాతము, ఉబ్బు, పార్శ్వపునొప్పులు మొదలగు తలనొప్పులు, గొంతుకయందలి నుస, జలుబు, పాండువు, శైత్యము, దగ్గులు, మేహదోషములు, వ్రణములు, శ్లేష్మము, సన్నిపాతముల నివారించునని చెప్పఁబడినది.

శ్రీగంధముతో దీనిని పరిమళమునకుం గల్పు చుందురు. మఱియు గంధకచ్చూరమని ఇంకొక శ్రేష్ఠమైన జాతిభేదము కలదు అది వెగటు చేదు రుచులంగల్గి వాతము, కడుపుతోనిబల్లలు,(గుల్మ) మూలవ్యాధి, నీరసముల నడఁచును. దీనిం గొందఱు పెద్దకచ్చూరమందురు. సంస్కృతమున గంధమాదిని, గంధమూల, గంధమూలిక, వేదముఖ్య అని యందురని తెలిసెడిని.

**కచ్ఛదేశము, కక్షదేశము, అక్షకచ్ఛము, మరుకచ్ఛము, కోటీశ్వరదేశము, కచ్ఛేశ్వరదేశము ఇప్పటి కచ్చి దేశము (Cutch)**— రుద్రదమనుని శాసనమున దీనిప్రశంస కలదు మహాభారతము సభాపర్వ ర౩ యందీదేశమునకు కోటీశ్వర దేశమనియు, కచ్ఛేశ్వరదేశమనియు పేరులు చెప్పఁబడినవి. బృహత్సంహిత ౧ర యందు మరుకచ్ఛమని చెప్పఁబడినది. (మరు శబ్దమునకు సేద్యోపయోగముకాని యని యర్థము). ఇటుల చెప్పుట కాసకే కచ్ఛనుండి దీనిని వేఱని చెప్పుటఁదెల్పెడిని. "ఇరానా" యన ఉప్పుపట్టయని యర్థము. కావ దాని క్లుప్తరూపమగు రాన్ ఆఫ్ కచ్చి అని ఈదేశమును వాడుచున్నారు. రాజధాని ఔదుంవర, లేక ఔదుంబర పురము. గుజరాతు నందిప్పుడు ఖేడాయనఁబడు కైరా పట్టణము కచ్ఛపుర సంజ్ఞకమనియు నందురు. ఇది వేత్రవతీ నదీతీరము. వేత్రవతి యిక్కాలమున బట్రాక్కు నదిగ నున్నది

**కచ్ఛేశ్వరదేశము** — కచ్ఛదేశము చూడుఁడు

**కజిలిర్మాకునది** — ఏషామైనరు నందున్నసది. ఎఱ్ఱనది యని యర్థము తొల్లింటి పేరు హాల్యాసునది బ్లాక్సీయందు కలియును (ఏషామైనరు చూడుఁడు)

**కటకగవోదాహరణన్యాయము** — ఆవరణలోని యావని యర్థము. అప్పు ఆవరణలో నుంచబడినకతన వెలుపలినుండి రక్షణకలదనియు, లోపనే దానికేదేని విపత్తు సంభవించిన తప్పించుకొన వీలుకూడ లేదనియు. ఇట్టి అపాయోపాయములు రెండును కలిసియున్నస్థితి యని భావము.

**కటకము** - ఉత్కలదేశమున నిప్పుడు ప్రధాన నగరమై యున్నది మహానది, ఖడ్జూరీ నదుల సంగమమున నున్నది ఈ మహానది కడ్డముగ నానకట్టుగట్టియున్నారు.

దీనికి తొల్లి వినీతపురమని పేరుండెను. (ఉత్కలదేశము చూడుఁడు).

**కటకాముఖహస్తము** - హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.

**కటకావర్ధన హస్తము** - హస్తాభినయము చూడుఁడు భరతశాస్త్రము చూడుఁడు.

**కటపయాది లెఖ్ఖవిధానము** — ఈలెక్కవిధానము జనకరాగము (కర్తారాగము)ల సంఖ్య నెఱుంగుట కుపయోగింతురు. ఇది ఇంచుక చిత్రముగ దోచును. జనకరాగము యొక్క సంఖ్య నెఱింగినకతన దానియందలి స్వరములం దెలిసికొన వీలగును. దానిని ముందు వివరింతుము.

"కాదిదశ, టాదిదశ, పాదిపంచ, యాద్యష్ట" యని దీనికి మూలసూత్రము. దీనిని మనసునం దుంచుకొనవలయును. కాదిదశ యనగ 'క' మొదలు పదియక్షరములని భావము. టాదిదశ యన 'ట' మొదలు పదియక్షరములని భావము. పాదిపంచ యన 'ప' మొదలు ఐదక్షరము లని భావము. యాద్యష్ట యన 'య' మొదలు ఎన్మిదక్షరము లని భావము

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సంఖ్య | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ |
| కాదిదశ | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| టాదిదశ | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| పాదిపంచ | ప | ఫ | బ | భ | మ | | | | | |
| యాద్యష్ట | య | ర | ల | వ | శ | ష | స | హ | | |

కర్తారాగములలో రెండవరాగమగురత్నాంగి, ౧౬ చక్రవాకము, ౧౭ సూర్యకాంతము, ౪౬ షడ్విధమార్గణి, ౪౮ దివ్యమణి, ౫౪ విశ్వాంభరి, ౫౭ సింహేంద్రమధ్యమము, ౬౬ చిత్రాంబరి యనునవి తప్ప తక్కిన రాగములలో దేనియొక్కనైనను మొదటి రెండక్షరములు ఏయేపట్టులలో దొరకునో వాటితల పై నుండు అంకెలను తిరగవైచిన వచ్చున ఖ్యయే రాగసంఖ్యయని తెలిసికొనవలెను. ఉదాహరణము- ధీరశంకరాభరణరాగముయొక్క ప్రథమాక్షరము నవ సంఖ్యకును, ద్వితీయాక్షరము రెండవసంఖ్యకును దిగువగ నున్నవిగాన ఆసంఖ్యలు ౯౨ అగును దానిం దిరగవైచిన ౨౯ యగును అది ధీరశంకరాభరణరాగసంఖ్యగ దెలియవలయును

ఇట్లనే కామవర్ధని రాగముయొక్క ప్రథమాక్షరము ౧ సంఖ్యకును, ద్వితీయాక్షరము ౫ సంఖ్యకును దిగువగ నున్నవిగా ఆసంఖ్యలు ౧౫ అగును. దానిం దిరగవైచిన ౫౧ యగును, అది కామవర్ధనిరాగముయొక్క సంఖ్యగం దెలియ వలయును

ఇంక తక్కిన ఎన్మిది రాగములు ఈక్రింది విధానముననే ప్రథమ ద్వితీయాక్షరములుగ (నిజముగాకున్నను) విభజింపం బడవలయును. అట్లు విభజింపం బడెనేని పైపద్ధతులమేరకు రాగసంఖ్య తెలియనగును.

౨ రత్ నాం గి (ఇచట 'రత్' ఒకయక్షరము 'నా' రెండవ యక్షరము).

౧౬ చ క్ర వా కము (ఇచట 'చ' మొదటి అక్షరము 'క' రెండవ యక్షరము),

౧౭ సూర్య కాంత ము (ఇచట 'సూర్య' మొదటి అక్షరము 'కా' రెండవ యక్షరము),

౪౬ ష డ్వి ధ మార్గణి (ఇచట 'ష' మొదటి అక్షరము, 'డ్విధ' లోని 'డ'కి వత్తులేకున్నను ఉన్నట్లు భావించి ఢ్వి అని చూడవలెను).

౪౮ దివ్యమణి (ఇచట 'వ్య' యందలి 'వ' అక్షరమునే రెండవ యక్షరముగ లెక్కించవలెను).

౫౪ విశ్వాం భరి (ఇచట ప్రథమాక్షరము 'వ', ద్వితీయాక్షరము 'శ' అని చూడవలెను)

౫౭ సింహేంద్ర మధ్యమము (ఇచట 'స' ప్రథమాక్షరము 'మ' ద్వితీయాక్షరముగ (కాకున్నను తలంచి) చూడవలయును)

౬౬ చిత్రాంబరి (ఇచట 'చ' ప్రథమాక్షరముగను త్రా లోని 'త' ద్వితీయాక్షరముగను చూడవలయును).

ఇంక దీనియుపయోగమగు రాగసంఖ్యవలన రాగమునందలి స్వరముల నెఱుంగుటగూర్చి వివరింపఁబడును.

౧ రాగము- ఏకచక్రమునందైనను షడ్జమ పంచమ స్వరము లొకేరీతి నుండుంగాని భేదములుండవు.

మొదటియారు చక్రములందు- అనగా ౧ మొ॥ ౩౬ వ చక్రము కడదనుక శుద్ధ మధ్యమస్వరమును, తక్కినయారు చక్రములందు అనగా

౩౭ వ రాగము మొదలు ౭౨ వ రాగము కడదనుకను ప్రతిమధ్యము స్వరమును ఉండెడిని.

ఋషభస్వరము- మొదటి మూడుచక్రములు, ఏడు, ఎనిమిది, తొమ్మిది చక్రములందలి రాగములకు అనగా ౧ మొదలు ౧౮ వ రాగము కడవఱకును, ౩౭ మొదలు ౫౪ వ రాగము కడవఱకును శుద్ధ ఋషభ స్వరమును,

౪, ౫, ౧౦, ౧౧ చక్రములందలి రాగములకు అనగా ౧౯ మొ॥ ౩౦ రాగము కడవఱకును, ౫౫ మొదలు ౬౬ వ రాగము కడవఱకును చతుశ్శ్రుతిఋషభస్వరమును,

౬, ౧౨ చక్రములందలి రాగములకు అనగా ౩౧ మొదలు ౩౬ వ రాగము కడవఱకును, ౬౭ మొదలు ౭౨ వ రాగము కడవఱకును షట్ఛ్రుతిఋషభ స్వరమును ఉండును.

గాంధారస్వరము- ఒకటవ చక్రమున అనగా ౧ మొదలు ౬ వ రాగము కడవఱకును, ఏడవ చక్రమున అనగా ౩౭ మొదలు ౪౨ వ రాగముకడవఱకును శుద్ధగాంధారస్వరమును,

రెండు, నాలుగు, ఎన్మిది, పది చక్రముల రాగములందు- అనగా ౭ మొ॥ ౧౨ కడవఱకును, ౧౯ మొ॥ ౨౪ కడవఱకును, ౪౩ మొ॥ ౪౮ కడవఱకును, ౫౫ మొ॥ ౬౦ కడవఱకును రాగములందు సాధారణ గాంధార స్వరముండెడిని.

మూడు, ఐదు, ఆరు, తొమ్మిది, పదునొకండు, పన్రెండు చక్రముల రాగములందు- అనగా ౧౩ మొ॥ ౧౮ కడవఱకు, ౨౫ మొ॥ ౩౬ కడవఱకు రాగములందునను, ౪౯ మొదలు ౫౪ రాగము కడవఱకును, ౧౬ మొ॥ ౭౨ రాగము కడవఱకును అంతర గాంధారస్వరముండును.

దైవతస్వరము - ప్రతి చక్రమునందు మొదటి మూడురాగములందు శుద్ధ దైవతస్వరమును, తర్వాతరెండురాగములందు చతుశ్శ్రుతి దైవత స్వరమును, తర్వాత ఒక్కరాగమునందు షట్ఛ్రుతిదైవతస్వరమును ఉండును. అన్ని చక్రములందు నిట్లేయుండును.

నిషాదస్వరము- ప్రతి చక్రమునందు మొదటి రాగమున శుద్ధ నిషాద స్వరమును, రెండవ, నాల్గవరాగములందు కైశికీనిషాద స్వరమును తక్కిన మూడవ, ఐదవ, ఆరవ రాగములందు కాకలీ నిషాద స్వరమును ఉండును అన్ని చక్రములందు నీవరుసనే యుండును

ఈవిధమున కర్తారాగములందుండు స్వరముల అంతర్భేదముల నెఱింగిన, వాటి జన్యరాగములందు కూడ నా యంతర్భేద స్వరములే యుండు నని తెలియగలను.

**కటాయని గోత్రము** — జమదగ్ని బీధాతపగణము చూడుడు.

**క్రటాస్** — కటాక్షక్షేత్రము చూడుడు.

**కటాక్షక్షేత్రము (కటాస్ గ్రామము)** — పంజాబునందు జీలంజిల్లా పిండుదాదన్ఖాన్ తహసీలులో నార్తు వెస్ట్రన్ రెయిల్వే ఖేవ్రాస్టేషనునుండి పదునొకండున్నర మైళ్ల దూరమున గల గొప్ప యాత్రాస్థలము.

ఇట నొకపుష్కరిణి శివాజ్ఞ చే నిర్మింపఁబడిన దట. ఇది అజ్మీరువద్ద పుష్కరిణివంటి దందురు. ఇట సప్తదేవస్థానములు కలవు. ఇవి పాండవ నిర్మితము లందురు. వా రిట కొంతయరణ్యవాస మును గడపిరట. పుష్కరిణియందు చైత్రమాస మున లక్షమంది జనులు స్నానము లొనర్తురట.

**కటికనేని రామయ్యకవి** — ఆంధ్ర కవులలో నాథునికులందుపరిగణింపఁబడినవాఁడు.

ఈ కవి పద్మనాయక కులజుఁడు (వెలమవారు), చెరుకుమాళ్ల గోత్రము. తండ్రిపేరు సూర్యానారాయణసింగారు. తల్లిపేరు బుచ్చమ్మారావుగారు.

రచించినది కువలయానందప్రకాశము. ఇది అలంకార శాస్త్రమగు కువలయానందమునకు ఆంధ్ర పద్యరూపకావ్యము.

**కటుకరోహిణి చెట్టు** — లా. Pierorrhias kurroa అనియు, Helliborus niger అనియును, ఆంగ్ల Hellibore అనియును, సం. ఆమఘ్నీ, కటుకా, తృష్ణభేదా అనియును పేరులు కలవు. ఇది నల్లనిది తెల్లనిది యని ద్వివిధము. అందు నల్లనిది శ్రేష్ఠము. తెల్లనిది అపాయకరముగాన నతిజాగ్రతగా వాడవలయును. కటుకరోహిణి పంచతిక్తములలో నొకటిగఁ జెప్పఁబడినది. ఇందు ప్రధానము వేరు మాత్రమే.

నల్లకటుకరోహిణి- వెగటు, చేఁదు రుచులఁగల్గి నాలుక తిమ్మిరెత్తఁ జేయును. ఎలుక, తేలు, జెఱ్ఱి వీటి విషమును హరించును. గాఢవిరేచనము వమనము గల్గించును. చూర్ణముగాని, కషాయముగాని జాగ్రతగా లోనికిచ్చిన స్త్రీల ఋతురక్తమును వెడలించును. గుల్మరోగము మొదలగు నుదరరోగములు ఉన్మాదము (పిచ్చి), పక్షవాతము, వాతరోగములు, శ్వాసకాసలు, శీతజ్వరములు మొదలగు జ్వరములు నివృత్తియగును. పైన పట్టు వేసినగంధములో గుండెలలోని నొప్పి తగ్గును. కటుకరోహిణి కల్గించు దోషములకు బాదాంగురు (కతేరా), బాదంనూనె విరుగుడులని చెప్పఁబడినది.

తెల్లకటుకరోహిణి- ఇది నల్లకటుకరోహిణి పోలి తెల్లగ నుండునది. ఇదియును వేరే. ఇది ఎక్కువ దారుణవిరేచనములను వమనములను గల్గించును. కొంత అధికమైన ప్రాణముం గూడ దీయునంతటి ఘోరమైనదిగాన నందఱు తలఁచువాడరు.

ఉదరరోగములు, ఉన్మాదము, మూర్ఛలు, తలత్రిప్పు నివృత్తియగుననియు, పైపూతచే తామర, పల్లికలు, దద్రు మొదలగు చర్మరోగములు మానుననియు చెప్పఁబడినది. ఇది కల్గించు దోషములు తలతిరుగుడు, తలదిమ్ము, వణుకు, మూర్ఛ అధికముగ వాడినచో కల్గునని చెప్పఁబడినది.

**కటుకి గోత్రము** — గవిష్ఠరగణము చూడుఁడు.

**కటుచాతుర్జాతకము** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున నలకులు, ఆకుపత్రికము, దాల్చినచెక్క, మిరియాలు, ఈనాల్గింటికి కటుచాతుర్జాతక మని పేరు.

**కట్టుకథ** (Fable) — కథనము అనగా చెప్పఁబడినది. జరిగినచరిత్రను జరిగినట్లు యదార్థముగా కథనమొనర్చి చెప్పినదానికి గాథ యని పేరు. కల్పించి చెప్పినదానికి కట్టుకథయని పేరు. కట్టుకథ కల్పితముగాన నిందు నసాధారణపు శక్తులుకొన్ని కొందఱికిఁగల్పింపబడుట సహజము. మృగములు, పక్షులు మొదలగునవి మాటాడునట్లు, అచేతనములు చేతనములవలె చూచినట్లు, పనులు జేసినట్లు మొదలగునవి కట్టుకథలయందు గాన్పించును. ఈకల్పనాకథలకు ఈసపు ఫేబిల్సు ఉదాహరణములుగ జెప్పవచ్చును.

**కట్ట వరదరాజభూపతి** — ఇతఁడు శ్రీకృష్ణరాయసార్వభౌముని యల్లుఁడగు అళియరామరాయల పినతల్లి కొమరుఁడు. క్రీ. శ. ౧౫౭౦ సంవత్సర ప్రాంతమువాఁడు. ఇతఁడు రచించినది శ్రీరంగమాహాత్మ్యమను పద్యకావ్యము. శ్రీరంగనాథునకుఁ గృతినిచ్చెను.

ఇతనిది మృదువై, మాధుర్యమై, ప్రాచీనకవుల కవితంబోలిన గమనికగల కవిత్వము. వేరొకకవి శైవపుండను బ్రాహ్మణుడొక శ్రీరంగమహాత్మ్యము రచించియున్నాడు. అది ఎక్కువ జటిలముగను, రసపుష్టిం దక్కువగ నున్నదని పరిశీలకులు చెప్పెదరు

వరదరాజభూపతి ఇంకను పరమభాగవతచరిత్రమును, ద్విపదరామాయణమును కూడ రచించెనట.

**కట్టినయింటికి లోపములు చెప్పేవారు చాలామంది ఉంటారు** — ఆంధ్రలోకోక్తి

**కట్టెవంక పొయ్యి తీర్చును**—(కట్టె-వంటచెరుకు, వంక=వంకర). ఆంధ్రలోకోక్తి

**కట్లె చెట్టు** — దీనిఆకుల రసము, చెక్కరసము లేక కషాయము, కారము, చేదు, వెగటు రుచులంగల్గి వాతపైత్య శ్లేష్మముల నివారించును విషదోషములను హరించును. ఉదరరోగములం దగ్గించును విరేచనములం గావించును దీని పండ్లను కూరచేతురనియు, అది వెగటుగనుండియు రుచిగానుండుననియు, చలువజేసి మూలవ్యాధిని, గుల్మమును, కఫవాతముల నడంచుననియుం జెప్పుదురు.

**కట్ పర్సు** (Cut Purse) — జేబులు కత్తిరించువాండ్రు. పూర్వకాలమున నాంగ్లేయులందు సంచులలో డబ్బుంచుకొని మొలకుం గట్టుకొనువారట. జనసమ్మర్దము గలతావులలో నా మొలసంచులం గత్తిరించి డబ్బు దొంగిలించు వారలకు Cut Purses అని పేరయ్యెనట. తర్వాత, ధరించు చొక్కాలు, కోట్లు మొదలగు వస్త్రములకు జేబులంగట్టి అందు డబ్బు ఉంచుకొనుట వాడుకలోనికి వచ్చెనట. ఆజేబులం గత్తిరించి దొంగిలించువానికి పిక్‌పాకెట్ అని పేరయ్యెను.

**కట్ యువర్ స్టిక్ అండ్ గో ఎవే** (Cut your stick and go away)— నీచేతనైనపనిం జేసికొమ్ము పొమ్ము, అని నిరసనగా తూలనాడుటకీపదసముదాయము నుపయోగించుచున్నారు. పూర్వమింట నాంగ్లేయులందు పాలు, రొట్టెలు మొదలగువాటి ననుదినము గృహములకుందెచ్చి యమ్ముచుండువారు ఒక కఱ్ఱపై ననుదినమొక గంటునుబెట్టుచు నిచ్చుచుండువారట. కడకా గంట్లమొత్తముంబట్టి వారికి సొమ్ము చెల్లింపంబడుచుండెడిదట. వేరొకకఱ్ఱ దీని నకలుగ సమ్మునారికడ నుండెడిదట వాటి లెక్కలలో భేదాకలిగి కొనినవారు సామ్మియ్యక నిరసించుతఱి Cut your own stick and go (నీకఱ్ఱపై గంటుపెట్టుకొనిపో) అని నిరాకరించుచుండిరట నేటికాలమున నావ్యవహారము పోయినను, మాటసామెతయై వాడుకయందున్నది.

**కఠోర గోత్రము** — ఆయాస్య ఉపగణము చూడుడు.

**కఠోర గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుడు.

**కఠోరకృత్ గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుడు.

**కడచి ప్రతికితిమని గంతులు వేయరాదు** — ఆంధ్రలోకోక్తి.

**కడప జిల్లా** — ఆంధ్రదేశములోనిది. చెన్నరాజధానియందుం జేరినది. ప్రత్తిపంట యీ జిల్లాయందధికము కడప ముఖ్యపట్టణము. ఇట నేత పరిశ్రమ కొంతవఱకు గలదు. గుత్తి, సిద్ధవట్టము వేఱుపట్టణములు. సిద్ధవట్టము దోసకాయలకు పేరందినతావు. మదనపల్లి సమశీతోష్ణస్థానము ఒంటిమిట్ట శ్రీరామక్షేత్రము. ఒకప్పుడీ ఒంటిమిట్టను బమ్మెరపోతరాజు నివాసమగు ఏకశిలానగరమని భ్రమగల్గుచుండెడిదిగాని పరిశీలనల వలన కాదని తేలినది.

ఈ కవి పద్మనాయక కులజుఁడు (వెలమవారు), చెరుకుమాళ్ల గోత్రము. తండ్రిపేరు సూర్యానారాయణింగారు. తల్లిపేరు బుచ్చమ్మారావుగారు.

రచించినది కువలయానందప్రకాశము. ఇది అలంకార శాస్త్రమగు కువలయానందమునకు ఆంధ్ర పద్యరూపకావ్యము.

**కటుకరోహిణి చెట్టు** — లా. Pierorrhias kurroa అనియు, Helliborus niger అనియును; ఆంగ్ల Hellibore అనియును; సం. అమఘ్నీ, కటుకా, కృష్ణబేధా అనియును పేరులు కలవు. ఇవి నల్లనిది తెల్లనిది యని ద్వివిధము. అందు నల్లనిది శ్రేష్ఠము. తెల్లనిది అపాయకరముగాన జాగ్రతగా వాడవలయును. కటుకరోహిణి పంచతిక్తములలో నొకటిగఁ జెప్పఁబడినది. ఇంక ప్రధానము వేరు మాత్రమే.

నల్లకటుకరోహిణి- వెగటు, చేఁదు రుచులుగల్గి నాలుక తిమ్మిరెత్తఁజేయును. ఎలుక, తేలు, జెర్రి వీటి విషమును హరించును. గాఢవిరేచనము వమనము గల్గించును. చూర్ణముగాని, కషాయముగాని జాగ్రతగా లోనికిచ్చిన స్త్రీల బుతు రక్తమును వెడలించును. గుల్మరోగము మొదలగు నుదరరోగములు, ఉన్మాదము (పిచ్చి), పక్షవాతము, వాతరోగములు, శ్వాసకాసలు, శీతజ్వరములు మొదలగు జ్వరములు నివృత్తియగును. పైన పట్టువేసిన గంధముతో గుండెలలోని నొప్పి తగ్గును. కటుకరోహిణి కల్గించు దోషములకు బాదంజిగురు (కతేరా), బాదంనూనె విరుగుడులని చెప్పఁబడినది

తెల్లకటుకరోహిణి- ఇది నల్లకటుకరోహిణి వలె తెల్లగ నుండునది. ఇదియును వేరే. ఇది ఎక్కువ దారుణవిరేచనములను వమనములను గల్గించును. కొంత అధికమైన ప్రాణము కూడ దీయునంతటి ఘోరమైనదిగాన నందఱు తెఱచు వాడరు

ఉదరరోగములు, ఉన్మాదము, మూర్ఛలు, తలత్రిప్పు నివృత్తియగునియు, పైపూతచే తామర, పల్లికలు, దద్దు మొదలగు చర్మరోగములు మానుననియు చెప్పఁబడినది. ఇది కల్గించు దోషములు తలతిరుగుడు, తలదిమ్ము, వణుకు, మూర్ఛ అధికముగ వాడినచో కల్గునని చెప్పఁబడినది.

**కటుకి గోత్రము** — గవిష్ఠరగణము చూడుఁడు.

**కటుచాతుర్జాతకము** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున ఏలకులు, ఆకుపత్రికము, దాల్చినచెక్క, మిరియాలు, ఈనాల్గింటికి కటుచాతుర్జాతక మని పేరు

**కట్టుకథ** (Fable) — కథనము అనగా చెప్పఁబడినది. జరిగిన చరిత్రను జరిగినట్లు యథార్థముగా కథనమొనర్చి చెప్పుదానికి కథ యని పేరు. కల్పించి చెప్పుదానికి కట్టుకథయని పేరు. కట్టుకథ కల్పితముగాన నిందు నసాధారణపు శక్తులు కొన్ని కొందఱికి కల్పింపబడుట సహజము. మృగములు, పక్షులు మొదలగునవి మాటాడునట్లు, అచేతనములు చేతనములవలె చూచినట్లు, పనులు చేసినట్లు మొదలగునవి కట్టుకథలయందు గాన్పించును. ఈకల్పనాకథలకు ఈసపు ఫేబిల్సు ఉదాహరణములుగ చెప్పఁదగును.

**కట్టు వరదరాజభూపతి** — ఇతఁడు శ్రీకృష్ణరాయసార్వభౌముని యల్లుఁడగు అళియ రామరాయల పినతల్లి కొమరుఁడు. క్రీ. శ. ౧౬౬౦ సంవత్సర ప్రాంతమువాఁడు. ఇతఁడు రచించినది శ్రీరంగమహాత్మ్యమను పద్యకావ్యము. శ్రీరంగనాథునకుఁ గృతినిచ్చెను.

ఇతనిది మృదువై, మాధుర్యమై, ప్రాచీనకవుల కవితంబోలిన గమనికగల కవిత్వము. వేఱొకకవి భైరవుండను బ్రాహ్మణుడొక శ్రీరంగమాహాత్మ్యమును రచించియున్నాడు. అది ఎక్కువ జటిలముగను, రసపుష్టిం దక్కువగ నున్నదని పరిశీలకులు చెప్పెదరు.

వరదరాజభూపతి ఇంకను పరమభాగవతచరిత్రమును, ద్విపదరామాయణమును కూడ రచించెనట.

**కట్టినయింటికి లోపములు చెప్పేవారు చాలామంది ఉంటారు** — ఆంధ్రలోకోక్తి.

**కట్టెవంక పొయ్యి తీర్చును**—(కట్టె వంటచెరకు, వంక=వంకర). ఆంధ్రలోకోక్తి.

**కళ్లి చెట్టు** — దీనిఆకుల రసము, చెక్క రసము లేక కషాయము, కారము, చేదు, వెగటు రుచులంగల్గి వాతపైత్య శ్లేష్మముల నివారించును. విషదోషములను వారించును. ఉదరరోగములం దగ్గించును విరేచనములం గావించును. దీని పండ్లను కూరచేతురనియు, అది వెగటుగనుండియు రుచిగానుండుననియు, చలువజేసి మూలవ్యాధిని, గుల్మమును, కఫవాతముల నడంచుననియుం జెప్పుదురు.

**కట్ పర్సు** (Cut Purse) — జేబులు కత్తిరించువాంగ. తొల్లింటికాలమున నాంగ్లసీమలందు సంచులలో డబ్బుంచుకొని మొలకుం గట్టుకొనువారట. జనసమ్మర్దము గలతావులలో నా మొలసంచులం గత్తిరించి డబ్బు దొంగిలించువారలకు Cut Purses అని పేరయ్యెనట. తర్వాత, ధరించు చొక్కాలు, కోట్లు మొదలగు వస్త్రములకు జేబులంగుట్టి అందు డబ్బు ఉంచుకొనుట వాడుకలోనికి వచ్చెనట. ఆ జేబులం గత్తిరించి దొంగిలించువానికి పిక్‌పాకెట్ అని పేరయ్యెను.

**కట్ యువర్ స్టిక్ అండ్ గో ఎవే** (Cut your stick and go away)— నీచేతనైనపనిం జేసికొమ్ముపొమ్ము, అని నిరసనగా తూలనాడుటకీపదసముదాయము నుపయోగించుచున్నారు. తొల్లింట నాంగ్లసీమలందు పాలు, రొట్టెలు మొదలగువాటి ననుదినము గృహములకుం దెచ్చి యమ్ముచుండువారు ఒక కఱ్ఱపై ననుదినమొక గంటును బెట్టుచు నిచ్చుచుండు వారట. కడకా గంట్లమొత్తముంబట్టి వారికి సొమ్ము చెల్లింపఁబడుచుండెడిదట. వేఱొకకఱ్ఱ దీని నకలుగ నమ్మువారికడ నుండెడిదట. వాటి లెక్కలలో తేడాకలిగి కొనినవారు సొమ్మీయక నిరసించుతఱి Cut your own stick and go (నీకఱ్ఱపై గంటుపెట్టుకొనిపో) అని నిరాకరించుచు రట. నేటికాలమున నాయాచారము పోయినను, మాటసామెతయై వాడుకయందున్నది.

**కఠోర గోత్రము** — ఆయాస్య ఉపగణము చూడుడు.

**కఠోర గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుడు.

**కఠోరకృత్ గోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుడు.

**కడచి బ్రతికితిమని గంతులు వేయరాదు** — ఆంధ్రలోకోక్తి.

**కడప జిల్లా** — ఆంధ్రదేశములోనిది. చెన్నరాజధానియందుం జేరినది. ప్రత్తిపంట యీ జిల్లాయందధికము కడప ముఖ్యపట్టణము. ఇట నేత పరిశ్రమ కొంతవఱకు గలదు. గుత్తి, సిద్ధవట్టము పేరుపట్టణములు. సిద్ధవట్టము దోసకాయలకు పేరందినతావు. మదనపల్లి సమశీతోష్ణస్థానము. ఒంటిమిట్ట శ్రీరామక్షేత్రము. ఒకప్పుడు ఒంటిమిట్టను బమ్మెరపోతరాజు నివాసమగు ఏకశిలానగరమని భ్రమగల్గుచుండెడిదిగాని పరిశీలనల వలన కాదని తెలినది.

**కదలి (కాయ) చెట్టు** – ఇది మిక్కిలి పైత్యము, శ్లేష్మము చేయుననియు, వాతమును హరించి జఠరదీప్తి నధికముగఁ గల్గించుననియు చెప్పఁబడినది.

**కదలూరు జిల్లా** — దక్షిణారా్కటు జిల్లా చూడుఁడు.

**కదవంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువ** — ఆంధ్రలోకోక్తి.

**కడ వ్రేళ్లైనా భూమియందు మిగిలితే గరికగడ్డి చిగర్చక మానదు** — ఆంధ్రలోకోక్తి.

**కడి గండముగాచును వత్తి మృత్యువుంగాచును** — (కడి=ముద్ద భోజన మిడుట వత్తి లేక వర్తి యనిన దీపారాధన చేయుట యనిభావము) పరోపకారపు సబహో లేక ఎఱిగింపు. ఆంధ్రలోకోక్తి.

**కడుపుకూటికేడిస్తే కొప్పుపువ్వుల కేడ్చినదట** — ఆంధ్రలో [illegible]

**కడుపు చించుకుంటే కాళ్లమీదనే పడుతుంది** — తనవాని తానే నిందించుట తనకే గౌరవలోపమని భావము. ఆంధ్రలోకోక్తి.

**కడుపుతో ఉన్నమ్మ కనకమానదు వండినమ్మ తినక మానదు**-ఆంధ్రలోకోక్తి.

**కడుపునిండితే గారెలు చేదగును** ఆంధ్రలోకోక్తి.

**కడుపునిండిన బేరము** - అనగా తొందరలేని ప్రయత్నమని భావము. ఆంధ్రలోకోక్తి.

**కడుపులోలేని ఆపేక్ష కౌగలించుకుంటే వస్తుందా?** — ఆంధ్రలోకోక్తి.

**కడూక్షర గోత్రము**—ఔతథ్య ఉపగణము చూడుఁడు.

**కణపకసవు చెట్టు** (గడ్డి) - ఇది రెల్లువలెనుండు నొక జాతి పెద్దగడ్డి. దీని కాడలలో గట్టివి చెక్కి కలముల క్రింద వాడుదురు.

కణపగడ్డివేళ్లరసము లేక కషాయము తియ్యని రుచినిగల్గి వీర్యమునకు వేడిం గల్గించును. కఫమును, పైత్యమును, రక్తవాతమును హరించును.

**కణాదుఁడు** - ఈతఁడు కణాద మతమను నొక గ్రంథము వైశేషిక మనఁబడు తర్కశాస్త్ర గ్రంథము రచించిన వాఁడు. ఆగ్రంథమున తన మతము నొప్పించినవాఁడు గాన నీతని మతమునకు వైశేషికమతమనియుం బేరుగల్గెను. ఈతఁడు అంతరిక్షయను నగరమేలుచుండిన బలశ్రీయను భూపతి యాస్థానమున నుండినవాఁడట (కణాద మతము చూడుఁడు). ఈతఁడు తర్కశాస్త్ర గ్రంథము రచించి యందు "విశేషము" అను పదార్థ మొకటి యధికముగఁ జెప్పియుంటంజేసి వైశేషికమని పేరయ్యెనట.

**కణికుఁడు** - శకుని కాప్తుఁడగు మంత్రి.

**కణ్వ ఉపగణము** — ఇది ఆంగీరస సంతతియందు కేవలాంగిరస గణములోని యొక ఉపగణము. ఇందు ముప్పదియారు గోత్రములు కలవు. మాత్స్యసూత్రోక్త గోత్రములు ౧౨. ౧. అమరనాశన, ౨. అగ్ని, 3 గర్దభ, ౪. గోదాయన, ౫. చతుః, ౬. నాడాయన, ౭. నారి, ౮ ప్రాగావసు, ౯. రథి, ౧౦. శ్యామాయన, ౧౧. శ్యామాయని, ౧౨ శైవేః.

కాత్యాయన సూత్రోక్త గోత్రములు (౧౧). ౧. కణ్వ, ౨. కరభ, 3. ఖరుండ, ౪. ప్రసాద. ౫. భరుండ, ౬. మర్కట, ౭. మర్కటి, ౮, రమణ, ౯. శాకటాయన, ౧౦. సణ, ౧౧, సౌనారి.

బోధాయన సూత్రోక్త గోత్రములు (౯). ౧. ఔపమర్కటాయని, ౨. పౌలాహవి,

3.భాష్కల, ౪.మాంజి,౫. మాంజి, ౬. మాంజిగవ, ౭. వాజయు, ౮. వాజిశ్రవ, ౯. విజిగవ.

ఇతర గ్రంథోక్త గోత్రములు (౪). ౧. అజమైద, ౨ ఆంగీరస, 3. గర్దభ, ౪ మర్కటాయని.

ఈగోత్రములకు ౖబవర రూపములు (కన్వ) ౧. ఆంగీరస- అజామీఢ, కాన్వ. ౨ ఆంగీరస- అఘోర, కాన్వ.

**కణ్వ గోత్రము** - కణ్వ ఉపగణము చూడుడు.



**కణ్వ మహర్షి**- పూరు వంశస్థుఁడగు అతిసారుని కుమారుఁడు. తపము వలన ఋషి యైన వాఁడు. శకుంతల పెంపుడు తండ్రి ఈమె దుష్యంత మహారాజు భార్య.

ఈతఁడు తపోబలమచ్చె బ్రాహ్మణత్వ మందిన వాఁడు. మహారాష్ట్ర బ్రాహ్మణ శాఖలోని కణ్వ లను (ఉపశాఖ) వారీతని సంబంధులే యని తెలియు చున్నది.

ఈతని సంతతి కణ్వాయులనంబడు బ్రాహ్మణులు. ఇంకను మగధభూపతి యగు దేవభూతి కడ మంత్రిగ నొక కణ్వుఁడుండువాఁడు. ఇతనికి వసుదేవుఁడనియు పేరుండెను. దేవభూతి సంగ వ్యసనుడగుట నీకణ్వుఁడాతనిజంపి తాను రాజాయెను. అతనితర్వాత నతని సంతతివారు నలుగురు మగధదేశమును నలువది యైదు సంవత్సరములు పాలించిరి.

**కణ్వవంశ నృపతులు** - వీరు శుంగ వంశ నృపతులకుం బిదప మగధ రాజ్యమును క్రీ. పూ. ౭౬ మొదలు ౩౧ వఱకు నలుబది యైదు సంవత్సరములు పాలించిరి. వీరిలో కడపటి వానిని శ్రీముఖశాతకర్ణి యోడించి పదభ్రష్టునిగా నొనర్చెను. (ధరణికోట రాజ్యము చూడుడు. మగధరాజ్యము చూడుడు).

**కణ్వాశ్రమములు** - మహారాష్ట్రాఉరు అయోధ్య మండలముల గుండా ప్రవహించు మాలినీనదీ తీరమున (ఇప్పటి చూకానది) కణ్వాశ్రమముగలదు. ఇది హరిద్వారమునకు పశ్చిమముగా ముప్పదిమైళ్ల దూర ముండును. ఇట శకుంతల పెరిగిన దందుకు ఈ ప్రశంస శతపద బ్రాహ్మణమున ౧౩-౫-౪-౧౩ యందు నాదపీర మని చెప్పఁబడిన తావునఁగలదు.

రాజపుత్ర స్థానమున కోటాపురము నుండి ఆగ్నేయదిక్కుగా నాల్గుమైళ్లు దూరమున చంబల్ నదీ తీరమున నొక యాశ్రమము దీని ప్రశంస మహాభారతము ౮౨ యందునను, అగ్నిపురాణము ౧౦౯ యందునునుకలదు. ఇచట నాశ్రమారణ్యమునకు ధర్మారణ్యమని పేరు.

నర్మదా నదీతీరమున నొకకణ్వాశ్రమ ముండె నని పద్మపురాణము ఉత్తర. ౯౪ యందు చెప్పఁబడినది.

**కతారగామా దేవస్థానము** — బహుశః ఇది క్షత్రగ్రామ శబ్దమునుండి కల్గినది గానోపు. ఇది సింహళద్వీపములోనిది. కుమారస్వామి దేవళ మిచటఁగలదు దీని నాదేశస్థులు భక్తిపారవశ్యమున సింహళదేశపు వారణాశియను చున్నారు. మాణిక్య గంగానదీతీరము, అరణ్యమధ్యమున నొకపాటి కొండపైనున్న దేవస్థానము. ఇట సరియైన గ్రామములేదు. కొండపై నొక సమతల ప్రదేశమున సుబ్రహ్మణ్య ప్రధాన దేవళమును, వల్లీదేవి యాలయమును, మరికొన్ని యితర దేవళములున్నతావే గ్రామముగ నెంచబడుచున్నది ఇట మార్గశిర శుద్ధ షష్టి మొదలు పదునేను దినములు యాత్ర జరుగును తక్కిన పదునొకండు నెలల పదునేను దినములందాతావు నిర్మానుష్యమే.

ఈ ప్రాంతములందు కొండజాతుల యడవి మనుష్యులలో వెద్దా జాతివారు కలరు. వారి

సింహళమున కాదిమ నివాసుల మని చెప్పుకొందురు. కుమారస్వామి వివాహమాడిన వల్లీదేవి ఇచటి వెడ్డాజాతి యామె యనుచుచేనియుఁ, కుమారస్వామి తమ జాతివారికి అల్లుడనియు నచటి వెడ్డాజాతి వారనుచుందురు. ఈ యాత్రకు హిందువులు, మహమ్మదీయులు, బౌద్ధులు కూడ నరుగుట గానగుచు భారతదేశమునుండి కూడ యాత్రస్థు లేగుచుందురట. రెండువేల వత్సరములుగ నీయాత్ర నడచు చున్న నిదర్శనములున్నవందురు.

నిదర్శనము లేతవఱకు లభించునో తెలియదుగాని, క్రీ॥ పూ రెండవ శతాబ్ద కాలమున ఎలారాయను పేరుగల ఒక కేరళభూపతి సింహళ మేలుచుండ (అనూరాధపురమప్పటి రాజధాని) వారిని దరిమివేయ నేరక దరముగాకుండెననియు, కతెతిస్వా కుమారుడగు దుతుగెమును యను సింహళ ఏకతరగామా కుమారస్వామి క్షేత్రమున గొప్ప తపమాచరించి సంగరమున ఎలరా భూపతిని జయించి రాజ్యమాక్రమించి పలుచ నిచటి దేవళములు గట్టించె ననియు వాడుక కలదు. దేవాలయ నిర్మాణము క్రీ॥ పూ. ౧౬౦ అని చెప్పు చున్నారు. అరణ్యమునగల యడవి జంతువులు యాత్రస్థులను బాధింపవని వాడుక కలదు.

ఇట యాత్రికులు మాణిక్య గంగాస్నానము మహా ఫలప్రదమని గొప్ప వాడుక కలదు. మ్రొక్కుకొనిన వారు నీయాత్ర యందిట నుపవసించుట కలదు. ఆకాలమున నెటుగన్నను, ఎట విన్నను 'హారో హార' యనియు, 'సాధు సాధు' యనియుం కేకలు మిన్ను ముట్టునట్లుగును.

**కతీరా** — ఆంగ్ల. Tragacanth. ఇది బంక. ఇంచుక తెల్లగ, పెళుసుగనుండి నీటియందు కొంత కరఁగియు, కొంత కరుఁగకయు నుండును.

చిన్నఆసియా (Asia Minor) దేశమున నే కొన్ని జాతులచెట్ల బంకయు, రసము ఘనీభవింప నియగునని చెప్పఁబడినది. లోనికిచ్చిన రక్తమును శుభ్రపఱచి, దుష్టపదార్థజన్యవికారముల నడంచి వీర్యవృద్ధిగల్గించునని చెప్పఁబడినది.

**కత్తృణ గోత్రము** — విష్ణువృద్ధ ఉపగణము చూడుడు.

**కత్తితీసి గంపలోవేసి ఏకుదీసి పొడుచుకున్నదట** — ఆంధ్రలోకోక్తి.

**కత్తినిచ్చుట** — కొన్ని యైరోపాదేశములందు యుటివాడుకయు గుపయోగించుటకు ప్రత్యేకముగ కత్తులులేకుండిన వట. కైజారులనే యుటివాడుకయు నుపయోగించు చుండిరి. మరియు నక్కాలమున నట్టికత్తి నొకనికందిచ్చుట విరోధభావమును సూచించుచుండెడిదట. తన సేవకులకు నొసంగుతరి, తన యజమానున కొసంగుతరి, తనమిత్రునకొసంగుతరి నొకతావున నిడవలయుంగాని చేతికందీయరాదు ఒకరి చేతికి కత్తినిచ్చుట నీరలక్షణమై కలహమునకుంగాలుద్రవ్వు విరోధభావమును సూచించెడిదట. అట్టికతి రెండవవాఁడు కలహింపఁజాలఁడేని కత్తినటఁబెట్టి తావెడలిపోవుట యాచారము. ఇప్పు డాపద్ధతియాచారము లంతరించినవి.

**కత్తిపోటు కన్న కలము పోటు బాధకరము** — ఆంధ్రలోకోక్తి

**కత్తిపోటుతప్పినా కలముపోటు తప్పదు** — ఆంధ్రలోకోక్తి

**కత్తిమందు** — ఇదికాడలవలె పెరుగు గుబురు, దానియందు చిన్నముండ్లు కల చెట్టు. తొలుత ఈస్టుఇండసు దీవులనుండి వ్యాపించిన దని ఆంగ్లవృక్షశాస్త్రవేత్తలనిరిగాని, భరతదేశపు కొండలందెల్లెడల నెవ్వరు నాటిపెంచకనే కన్పించుచుంట భరతదేశపు వృక్షమే యని తేలుచున్నది.

నరకిన పాలుగార్చుచెట్టు. నరకినకొమ్మను బ్రాతిక నాటుకొని బ్రతుకుచుండును నీరులేని గొడ్డు మెరకలందు వర్ధిల్లును దీనిపాలనెండించి కణికల వలె సమ్ముదురు. దానినే కత్తిమందనియెదరు. అనాదిగ భరతదేశమున కత్తిఅలుగులను పిడులం దుంచి వెచ్చఁజేసిన కత్తిమందులో నంటించు నాచారముకలదు. ఇప్పటికి నది యట్లేయున్నది. మేహవాతపునొప్పులను, వాతనొప్పులను కత్తి మందుపట్టు నివారించునని ఆయుర్వేదవైద్యు లనుచున్నారు.

**కత్తిమందు చెట్టు** — లా. **Euphorbia antiquorum**; ఇంగ్ల. **Triangular Spurge** సం వజ్రకంటకా, వజ్రక్షీరి. కొందఱు దీనిని బొంతచెముడనియు, బొమ్మ చెముడనియు వాడుదురు. కత్తిమందు పాలు వండి, ఎండించిన కత్తిమందనఁబడును. దానిని వెచ్చఁజేసిన కరఁగి మెత్తబడును. అత్తరి కత్తు లను (ఖడ్గములను) అనగా కత్తిఅలుగు (Blade) లను పిడులందు కత్తిమందుతో బిగింతురు. కత్తిమందుచెట్టు ముండ్లనుగల్గి గొడ్డుభూములందు శిలలమధ్యను పనికిరాని మెరకప్రదేశముల బ్రతికి విస్తరించును. పలకలుగల్గి ఆకులు లేక పైకి పెరుగుచు కంచెయందు వేయఁదగినట్లోయున్న ట్లుండును. కత్తిమందుపాలు లేక కత్తిమందు చెట్టు రసము దారుణముగు వేడిజేయును. దారుణముగు విరేచనములం జేయును. పాలు పైనపట్టువేయుట వలన ప్రాతనొప్పులు, వాతములు, రాచపుండ్లు, వ్రణములు, గ్రంధులు, అండవాతములు, పక్ష వాతపునొప్పులు నివారణమగునని చెప్పంబడినది. దీనికివిరుగుడులు- పెరుగుఅన్నము, చల్లతోచేసిన కండశర్కరపానకము, పెసరపప్పు బియ్యము కల్పి కాచినజావ, శీతలప్రదేశవాసము.

**కత్తి మెత్తన అత్త మంచి ఉండదు** — ఆంధ్రలోకోక్తి.

**కత్తిసాము** (Sword Exercise)-కత్తి సాము భరతదేశమునందు ధనుర్విద్యతోపాటుగ ననాదిగ గలదు. ఆదికాలములందు శత్రువులనెదు ర్కొన భారతవీరులు ఖడ్గములం బట్టుచుండిరని చెప్పఁబడియున్నది. ఇందువలన కత్తిసాము వారు నేర్చియుండిరని తెలుచున్నది నేఁటికిని భరతదేశపు తాలింఖానాలనఁబడు వ్యాయామస్థానములందు భరతదేశపు విధానపు కత్తిసాము నేర్పఁబడు చుండుట గానవగును.

ఇంకనాంగ్లసైన్యములందు వాడఁబడుచున్న కత్తిసాము కొంతవేఱువిధానముగనుండుట గానవగు చున్నది అడుగంటియున్న భరతదేశపువిధానము కన్న నుచ్ఛ్రదశయందున్న ఈ యాంగ్లవిధానమున గల మెళుకువలు భరతదేశపు విధానమునకు గల్పుకొనుట నిక్కాలమున సమంజసమని తోచెడిని. ఖడ్గమునందు ముఖ్యభాగములు రెండు గలవు. అవి కత్తియనియు (Blade), కత్తి బట్టుకొనుటకైన పిడి (Hilt) యనియునై యున్నవి కలహములందు కత్తి పొడుచుటకును, నరకుటకు నుపయోగించును. ఆంగ్లవిధానమున పిడి శత్రువుల నరకు దెబ్బలం గాచికొనునటుల నభివృద్ధిపఱ్చఁబడినది. దానియందైదు ముఖ్య భాగములుకలవు

౧. **Button**.- ఇది కత్తిపిడికి మొదటనుండు మరమేకు (Screw) ఇది కత్తి (Blade) ని, పిడినికల్పి బిగించి పట్టియుంచుచున్నది.

౨. **Hood**- ఇది తేలుచుగ గట్టియుక్కుతో చేయఁబడుచున్నది. పిడిని చుట్టియుండును.

3. **Handle**- ఇది నిజమగు పిడి. సాధారణ మైన కఱ్ఱతో చేయఁబడి Shark-skin చర్మముచే జుట్టబడి తీగెలచే బిగింపంబడి యుండును. దీనిగుండా లోనున్న రంధ్రమున కత్తి అలుగుయొక్క సన్ననిభాగ మేగియుండి

Button తో బిగిసియుండును దానికి tang అనిపేరు.

౪. Ferrule- ఇది చిన్నఉక్కుతో చేయబడిన hoop అయి యున్నది handle నున్నూ, hood నున్నూ కల్పి పట్టుచుండునది.

౫. Guard - ఇది ఉక్కుతో చేయబడిన రక్షణ భాగమై యున్నది. ఆకారము వాకరలిరిగి పట్టుకొనిన చేతిభాగముం గప్పియుండును. శత్రుప్రదెబ్బలనుండి చేతిం గాపాడునది. దానియందుగల రంధ్రముగుండా కత్తిలలుగు (tang) పిడిలోని కేగుటయు, పిడికడను button తో బిగింపబడుటయు నుండుటచేత నిది బలముగ బిగిసియుండును.

రెండవది ముఖ్యభాగమునకు కత్తిలలుగు (Blade) నాకు పొడవు మూడు సమభాగములును, పిడిలోనికి జొచ్చియుండు tang భాగమును గల్గియుండును. పిడిలోని tang గాక, తక్కినకత్తికి గ్లేడు అనియుం బేరు వాడుదురు. Blade మూడు సమభాగములుగ నొనర్చిన పిడి వైపు మొదటిభాగమునకు Forte అనియు, దన్యాతిభాగమునకు Middle అనియు, కడభాగమునకు Feeble అనియుం బేరులు. కత్తికొనకు Point అనెదరు (కత్తిచిత్రము చూడుడు.) ఈకత్తిగూర్చి యీ సందర్భమునసే వివరింపం దగిన రహస్య మింకొకటి కలదు కత్తియొక్క Centre of Gravity పిడికి రెండంగుళములకు మించనిదూరమున నుండవలయునని గ్రహింపం బడినది అట్టిఖడ్గములు చేతియందు తేలికగా నుండి ఇష్టమువచ్చినరీతిని బలముగ పనిచేయును. Centre of Gravity దూరమైన, చేతికిం గత్తి బరువగుటయు సరిగా పనిచడవకపోవుటయు సెక్కింగిస యాంగ్లఖడ్గశాస్త్రవేత్తలు జాగ్రతం గొని ఖడ్గములం జేసెదరు.

ఇంక నీఖడ్గముం బట్టుకొనుటయందును విధానము కలదు. తర్జని (చూపుడువ్రేలు), మధ్యమ, అనామిక, కనిష్ఠిక (చిటికెన) వ్రేళ్లతో కత్తిపిడిం బట్టుకుని బొటనవ్రేలు అంగుష్ఠము కత్తి (Blade) వైపు వెనుకభాగమున చూపుడు నుంచవలయుం గాని, బొటనవ్రేలిని తక్కిన నాల్గువ్రేళ్లకెదురుగ ముడువ రాదని చెప్పఁబడినది.

కత్తిసాము కొనర్ప నాయత్తపడినవారి స్థితికి On the command అని పేరు. మఱియు దీని నాఱువిధములుగఁ బ్రదర్శింతురు.

౧ Attention- ప్రారంభమున సప్రమత్తుఁడై యుండుట.

౨ Stand at ease - అదనునకు నిరీక్షణము.

3 First Position.

౪. Directing line-నిలువబడి కత్తిని శత్రువు వైపు చూపుట.

౫. Sword in line.

౬. Salute- కత్తినిపైకెత్తివందనమొసఁగుట. ఇది One అనియు, Two అనియు, Three అనియు మూడువిధములుగ నొనర్తురు.

కసరత్తునందు కలహమునకుం గడఁగుస్థితికి On Guard అనిపేరు. అన్యాయగు దూరమునసే నిలచి కలహేసన్నద్ధుండగుట కిదియుక్తము. ఇందు 1. Distance, 2. Advance, 3. Beating the attack with the right foot, 4. Retire, 5 Jump, 6 The line of offence, 7. Target అను సప్తక్రియలు కలవు. Target నందు Upper Division, Lower Division, Inner Division, Outer Division అని నాల్గుభాగములు చెప్పఁబడినవి. వీటిని నాల్గు Lines అనియు ననుటకలదు. పిదపం జెప్పఁబడినది, కత్తులంగల్పి ఒకరికొక రెదుర్కొనుట. దీనికాంగ్లమున Parries అనెదరు. ఇది

1 First parry యనియు, Second parry యనియు, Third parry యనియు, Fourth parry యనియు, Fifth parry యనియు, Sixth parry యనియు నారువిధములు. ఇవి యిరువురి కత్తులం గల్పుటలో గలభేదములు. అందు Third and Fourth parry ల యందు Low parry, High parry యని రెండు భేదములుకలవు. Low parry క్రింది భాగమునను, High parry పై భాగమునను కత్తులంగల్పుటయై యున్నది. ఇంక నీప్రక్రియలయందు ఒకప్రక్రి నుండి వేఱొక ప్రక్రికి కత్తుల విన్యాసమును మార్చుకొనుటయు, లేక ఒకేప్రక్రియందే యుండి ఇరువురిటునటు కదలుచుండుటయుకూడ కలదు.

కలహాముసకు గాలుద్రువ్వట యనందగు కవ్వించుట కాంగ్లఖడ్గవిద్యయందు Invites అని పేరు ఇది Simple invite అనియు, Invite by binding అనియు ద్వివిధము. కత్తితో కత్తి దాకక కవ్వించుట Simple invite అనంబడును కత్తితో కత్తి దాకుచు కవ్వించుటకు Invite by binding అనదరు ఇట Binding అన తనకత్తి యొక్క Forte తో పగతుని కత్తి యొక్క Feeble ను తాకుటయని చెప్పఁబడినది.

కత్తిసామునందుపయోగ్యములగు పోటునరకులం గూర్చి ఈక్రింద వివరింపఁబడినది. ఈవిద్యయందు వివరింపఁబడినవి.

౧. Lunge - కాలా త్రిప్పనటుల వృత్తాకారమున ముందునకు, వెనుకకు సాముగా దడుగులు.

౨. మొనలో గుచ్చు పోటు.

3. Direct Point - తిన్నగ నెదుర్కొనిన పోటు.

౪. Point by Graze - పై పైననే తాకు (గుచ్చు) పోటు.

౫. Point by Disengage-వదలి మఱలు నో పొడుచు పోటు.

౬. నరకులు (Cuts) - ఇవి Direct cuts అనియు, Circular cuts అనియు, Cut over అనియు మూడు విధములు

౧. Direct Cuts - ఎదుర్కొని నరకుట. ఇది తలపై నరకు, కుడివవక నరకు, ఎడమ దవడ నరకు, కడుపు గుండాలు హృదయము నరకు, ప్రక్కనరకు నను భేదములు కలదిగ నున్నది

౨. Circling cut ఇది కత్తి త్రిప్పి నరకుట. ఇందు తలనరకు, ఎడమదవడ నరకు, కడుపు నరకు, హృదయము నరకు నను భేదములు కలవి ఇంకను కుడిదవడ నరకు, కుడిప్రక్క నరకు నను మరిరెండు విధముల నరకులు వేఱుగఁ జెప్పఁబడినవి ఇత్తరి Circling cut అనుటవలన మనిసి తిరుగక, చేయి, కత్తి తిరుగునటుల నని యర్థము. ఈనరకులను తెలుపుచుగ Circling cuts Number One, Two, Three, Four, Five, Six అనియు వాడుటకలదు. కొందఱికను ఒక్కొకదానియందు One, Two, Three అనియు వాడుచున్నారు.

3. Cut Over- ఇది Cut over outside అనియు, Cut over inside అనియు ద్వివిధము. ఈ నరకులు చేతుల పట్లనున్న Simple reposte అనియుం గూడ కలదు.

౭. Counter Parries- కత్తుల నెదుర్కొని కలుపుట.

౮. Feints- ఒకతావునచూపి వేఱొక తావునం గొట్టు మాయదెబ్బ. ఇది నవవిధభేదములు కలది. (దొంగదెబ్బ).

1. Feint of direct point.
2. Feint by Graze.
3. Feint by Disengage.

4. Feint direct cut
5 Feint circling cut
6. Feint cut over.
7. Double feint
8 Trible feint.
9 Reposte with feint.

౯. Transport- పారవశ్యతం గల్గించు కత్తి (గాబరా కల్గించునేర్పు).

౧౦. Deviation- తప్పుడు దెబ్బల విధానములు.

౧౧ Changement- అకస్మాత్తుమార్పులు

౧౨. Beat- ఒడిసిపు

౧౩ Reattack- తిరిగి ఎదుర్కొనుట

౧౪ Repeated attacks- పునఃపునః ఎదుర్కొనుటలు

౧౫ Disengage in time- సమయ విరామము

౧౬ Assault- ఎదుర్కొని కలహించుట.

ఈ కత్తిసాముసంబంధ పనులేను మెలకువలును, ఆరు జాగ్రత్తలును చెప్పబడినవి వాటి సల్లే వివరములుగాక

1 Before commencing the assault care must be taken that the equipment is in order.

2 It is necessary to be in good distance when taking First possession to avoid surprises when coming on guard

3 When ignorant of adversary's style of play better to be cautious in advancing and study his play executing actions by graze etc.

4 When fencing with an opponent who is quick in attack, better to try to interrupt him by acting in time and attacking very often

5 When fencing with an opponent with strong defence, better to attack seldom and go on with double feints preceded by beats or efforts.

6. Opposing a fencer, who acts in time, better to fein to attack him with impetuosity and instead of so doing advance being ready for parry and act with second intention, first try to find if the opponent times simply or with feints If simple times, parry and return, or if he acts with feints or his feint in time, better time him on the arm (that is counter time him)

7 In case the adversary returns quickly, better to attack him with half blows so as to be able to parry his returns and then return at him.

8 If powerful adversary, better avoid keeping contact with his blade to prevent him executing beats, deviations, efforts or disarms and if he tries to do that, better act in time.

9 If a tall opponent acts in time, advance with second intention so as to be able to approach him Better use attacks against such opponents finishing in the low line

10. If the opponent is wild and impetuous, better to develop times continually at the arm, and return as soon as possible when his blade is on the parry

11 If the opponent is short, better to keep him out of distance, and avoid the contact of his blade. Act in time with or without feints finishing in the upper time.

12. If you understand that the adversary is going to execute an attack, and have confidence in being able to oppose a valid defence to him, better to allow him to develop his attack, but if such confidence is not felt, it is better to disturb him with sudden attacks so as to prevent him from carrying out his intention.

13. It is right to practise assaults with both strong and feeble opponents on study.

ఇవి ఖడ్గవిద్యా సంబంధమైన మెలకువలు. ఇందింకను నాల్గుమర్యాద సంబంధమగు నాచారములుకలవు.

1. Salute the opponent and any person of good possession present, both before and after the assault

2. Never complain of or criticise the opponent's play.

3 Acknowledge by indicating with the left hand, the part hit or hit you receive.

4. If from any cause the opponent becomes "Hors de combat" (be disarmed) you should not hit him at that time.

ఇంక నారుజాగ్రతలు వివరింపఁబడును.

With the opponents:—

1. Who always parry, attack seldom.

2. Who always attack, alleck often

3. Who always act in time, counter time

4. Who always attack with many feints, act in time.

5. Who always attack with actions by graze, beat, deviation or efforts, avoid the contact of the blades.

6. Who always use efforts and disarms, act in time.

**కత్తు** — ఖత్తు చూడుఁడు.

**క(త్రిపురదేశము** — క్త్రిపురదేశము చూడుఁడు.

**కథ (లేక కథ్య) గణము** — విశ్వామిత్ర మహర్షి సంతతిలోని యొకగణము. ఇందు గోత్రములు ౩౦ కలవు.

బోధాయనసూత్రోక్త గోత్రములు (౧౦) · ౧. కథ, ౨ కథ్య, ౩. కరంభ, ౪ కౌసుల్య, ౫ పిండగ్రీవ, ౬. సారాథ్య, ౭. నారాయణ, ౮. సాంహితేయ, ౯. సైరంధ, ౧౦ వాజాయన.

లౌగాక్షిమాత్స్య సూత్రోక్తగోత్రములు(౧౧) ౧. ఇంసువని, ౨. కరీరాంభి, ౩ కాత్యాయని, ౪. తార్క్ష్యాయణి, ౫. తార్క్ష్యాయణి, ౬. సైకాయని, ౭. హాంసాయని, ౮. లావలి, ౯. శాలఙ్కాయని, ౧౦ శౌశిరి. ౧౧ సైౕకాయని.

ఇతరగ్రంథోక్త గోత్రములు (౯)- ౧ కాలి, ౨. గోదాయని, ౩ చోరాయని, ౪. తుంగాయని, ౫. మేనాయని, ౬. వేదాయని, ౭. రాణి, ౮. వేనాయని, ౯. కతకేః

ఈ కథ లేక కథ్య గణమునందలి ౩౦ గోత్రములకు ప్రవర (౧)- విశ్వామిత్ర, కాత్య, అత్కీల.

**కథక గణము** — ఇది విశ్వామిత్ర సంతతిలోని యొకగణము ఇందు గోత్రములు నాలుగు కలవు. ౧. అఘు, ౨. ఉదూర్ణవ, ౩. కథక, ౪. క్రథక. ఈ కథకగణమునందలి నాలు గోత్రములకు బ్రవరమొక్కటి కలదు. ప్రవర; విశ్వామిత్ర, కాథక, క్రాథక.

**కథక గో(త్రము** — కథకగణము చూడుఁడు.

**కథ (కథ్య) గో(త్రము** — భరద్వాజ ఉపగణము, కథ లేక కథ్యగణము చూడుఁడు.

**కథాకాలి** (నాటక (ప్రదర్శన కళ) - ఇది కేరళదేశమందున్న నాటక (ప్రదర్శన విద్య. నిజముగ నిదియొక విధానము. దీని నింతదనుక నెవ్వరు (గ్రంథముగ వ్రాసియుండలేదు. కాని సంపూర్ణతనందిన కళగాని లోపములులేవు. గురుముఖతః ఈవిద్యం గఱచి యభ్యసింప వలయును

గాని, వేఱుమార్గము లేకుంట, విద్యార్థులతిజాగరూకులై కడుశ్రద్ధగ జ్ఞాపకముంచుకొన వలసిన విద్యయని కథాకాళి విద్యావిశారదు లనుచున్నారు. ఈవిద్యయందు వగ, ఒద్దికలు, అభినయ భాషయు (Gesture language), వాటి పద సముదాయము (Vocabulary of words) ను, వాని లక్షణముల పద్ధతులు (Rules) ను, వాక్యసముదాయ సంబంధ వ్యాకరణమును (Grammar), పదముల కూటములకు వాక్య ధర్మవిధి విధానమును (Syntax) కూడ కలవు. ఇట్లగుటవలన నిది శబ్దములచే పలుకంబడు భాష కానేరదనియు, మనోభిప్రాయములను శరీరేంద్రియావయవములచే నటించి, మొఱుకపలుకుచుమూక భాష యని మనము మరువరాదు. ఈవిద్యయం దభినయ ప్రదర్శనములే పదవాక్య వితతులై తనరెడిని. అందలి వ్యాకరణాది సమస్త ధర్మవిధులు నిశ్శబ్దముగనే పాటింపఁబడఁ దగినవిగా నెంచుగునది. ఈకళిన విద్య నభ్యసింప సంవత్సరముల కాలమాక్రమించు ననుచున్నారు. ఇంక దీని నభ్యసింప సాంప్రదాయానుసారముగ నుండవల యనుగాన వీరు మాటలాడుటగాని, పాటలం బాడుటగాని యుండక శరీరావయవాదుల భేద ప్రదర్శనములచే మనోభిప్రాయములం దెలుపవలసి యుండునని మనస్సునం దుంచుకొన వలయును. మఱియు నిట్లగుట నిందలి తప్పులు, భిన్నాభిప్రాయములను ప్రదర్శించుట లేక నిజాభిప్రాయము లను సరిగా దెలుపలేక పోవుటయో నగునుగాన నిష్కర్షగా విద్య యలవడుట యత్యవసరము.

ప్రదర్శనములందుఁ గొన్ని పాత్రములకు ముఖాకార నిరూపణ వస్తువులను (Masks) ఒక్కొక్కతరి వాడుటయుం గూడ గలదు. దుస్తులు కూడ సర్వారీతినుండెడిని. ప్రదర్శనములం దట్టి పాత్రలు, సాత్త్విక, రాజస, తామస పాత్ర లుగ త్రివిధము. ఇంకను అసుర, బ్రాహ్మణ, దైవ, మిత్ర, శత్రు, సేవక, స్త్రీ, భార్య, పుత్రాది పాత్రము లర్హానుస్తులం గల్గి ఉచిత వేషములనే యుందురు. వేత్వేఱు వేషధారుల యభినయ ములందుఁ గాంచఁదగిన విశేషమేమన, ప్రదర్శ నాధిక్యతగాని, ప్రదర్శనన్యూనతగాని కానరాక, అన్నియు స్వతస్సిద్ధ స్వభావ ధర్మమునందే యమరియుంట నచ్చెరువు గొల్పెడిని.

ఈ కేరళ దేశపు కథాకాళి విద్య ఇతర దేశము లాదలి సోదరీవిద్యల నధిగమించినదిగ పెక్కండ్రు ఐరోపా నాటక కళావిశారదు లనుచున్నారని తెలిసెడిని. భావప్రకటన మొనర్పఁజేయు ప్రదర్శన ముల నట్లె నిలిపియుంట (Poses) అత్యద్భుత ముగఁ దోఁచి ప్రదర్శకుని విద్యావిశారదత్వము స్ఫురింపఁ జేసెడిని. ఇంతియెగాక పాదముల విన్యాసములు, నడకలు మనోహరములుగ నుం డును. వీనికిం దోడు అనునయించు గానమును చక్కఁగ నమరి యుండును.

ఈవిద్యయందలి నాట్యమున పెక్కు-ముద్రలు చెప్పంబడినవి. ఇవి స్వతంత్రములు, భావప్రదర్శ నానుకూలములును యోగశాస్త్రమున వివరింపఁ బడిన ముద్రలకు వీనికి నేసంబంధము లేదని యెఱుంగునది

కేరళ దేశపు విద్వాంసులు కథాకాళీ కళానై పుణికి శరీరావయవాభ్యాసము మాత్రమే చాల దనియు, మనస్సు, అనుభవజ్ఞానము (Feeling), చతురతల (Intellect) ను కూడ నిశ్చలత నొందుచు వాటియందు లీనమగునటుల విద్యా వంతములుగఁ జేయుబడు చుండుననియు నను మన్నారు.

**కదంబకుల గోత్రము** — ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. వైశ్య గోత్రములు చూడుఁడు.

కదంబకులగోత్రము- ఏకాక్షేయ గోత్రము (౪౧), తొల్లింటి సంస్కృతగోత్రము కుత్సస

లేక కౌత్సునకస, కుత్సగణము, ఆపస్థంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథము ధర్మసింధు నిర్ణయసింధు, సమానగోత్రము మహాతేజస్కాస, నందీశుఁడుదేవత, భార్య నంది సద్వామ, నర్మదాతీరము తపస్థానము, నంది సరస్సు తటాకము, జపము పదివేలు, దీపములు ౪౦, క్షేత్రసంఖ్య ౪౦, కన్యక దానము, నల్ల కలువ వర్జనీయము.

**కదంబకోరకన్యాయము** — కదంబ చెట్టు పుష్పములు పూర్వసూచనలు లేక అకస్మాత్తుగా బయల్పడినట్టుల, అకస్మాత్తుగా జరగిన యొకకార్యముం దెల్పుటయం దీన్యాయమును వాడుదురు.

**కదంబవంశ నృపతులు** — వీరు గోపకవనరాజ్యము లేక, గోపవనరాష్ట్రమును పాలించిరని చెప్పఁబడినది. ఆరాజ్యము గోవా పట్టణప్రాంతమని తేలుచున్నది. గోపక వన పురము మారి, గోవాగా నిలచియున్నదట

**కదంబవృక్షము (కదిమిచెట్టు)** — లా. Nauclea, cadamba. సం కదంబః, కదంబకః, కదంగికా, నీపః, ధారాకదంబ లేక కేళికదంబ, నీపరాజః.

కదంబ- పెద్దకదంబ యనియు, చిన్నకదంబ యనియు రెండుభేదములు కలది. పెద్దకదంబను రాజకదంబయనియు, కేళికదంబయనియు, ధారా కదంబ యనియు, నీపకదంబ యనియు కూడ నందురు. ఇది శ్లేష్మమగునది. దీని పూవులు ముండ్లబంతులవలె పెద్దవిగ నుండును. చిన్న కదంబపూవులు చిన్నవి. శాక్తేయులు కదంబ చెట్లపూవులు దేవీప్రీతిగ నెంతురు. ఆదిశక్తిని "కదంబవనవాసినీ" యనెదరు.

కదంబ ఆకు, చెక్కల రసకషాయములందు జ్వరము, పైత్యదోషము, రక్తదోషము, రక్త స్రావముల నడంచుగుణము కలదని చెప్పఁబడినది.

**కదనార్భటులు** — వీరిని కదనార్భట వీరులనుటయుం గలదు. కదనమన సంగరము, లేక యుద్ధము. అం దార్భాట మొనర్చువారని భావము.

కదనార్భటు లను యుద్ధవీరులు కారనియు, ఆర్భాట మొనర్చువారనియు, డాబులుచెప్పువా రనియు, హేళనగా ననుచుండిరు కార్యశూరులు కాని వారికి, అనగా కేవలవాగాడంబరపరుల కీపేరు వర్తించెడిని

**కదమ్ నడక** — హిందూస్థానీజాతి గుఱ్ఱములు ఒయ్యారముగ నడచు నడక ఇది స్వారీ గుఱ్ఱములందుఁ గాననగునది

**కదలిక** (చలనము) — జరగుటను కదలిక యనెదరు. నిజమున చలనమే కదలికయగును. దశదిశలందెటుల చలించినను కదలికయే. Sir Issac Newton (పిదప న్యూటన్ప్రభువు) కదలికను త్రివిధములుగ వివరించెను. ఆమహానీయుని వాక్యములు వివరించుట సమంజసము. 1. Every body continues in its state of rest or uniform motion in a straight line unless it is compelled by an impressed force to change that state. 2. Change of motion in proportion to the impressed force takes place in the direction of the straight line in which the force acts. 3 To every action there is always an equal and opposite reaction. కదలిక External force యొక్క పనిగా నెన్నఁబడినది.

**కదలికారణ్యము** — అరణ్యములు చూడుఁడు.

**కదళీవృక్షము** — అరఁటిచెట్టు చూడుఁడు

**కదిరీపతినాయకుఁడు** - ఇప్పటి యనంత పురమండలములోని కదిరి తన రాజధానిగ నా ప్రాంతసీమనేలిన ప్రభువు క్రీ. వె. ౧౬౨౦

సంవత్సరపు ప్రాంతమువాఁడు. ఈయన రచించినది శుకసప్తతిపద్యకావ్యము. ఇది వ్యభిచారపరమగు గ్రంథమైనను, స్వభావోక్తులు చక్కఁగ వివరింపఁబడి ఎంతటివారి చిత్తములనైన నాకర్షింపఁగల మాధుర్యచాతుర్యములు గల్గిన రచనలతో విలసిల్లెడిని. ఇతనికిఁ జగచ్చక్షువనియు, సర్వేంద్రియ వ్యాపారుఁడనియు వాచకనామములు కలవు.

**కద్రువ** — ఈమె దక్షప్రజాపతి. భర్త కశ్యపుఁడు. ఈమె సంతతివారు నాగగణమని భారతమునఁ జెప్పఁబడినది (కశ్యప మహర్షి భార్యలు చూడుఁడు)

**కథాత్రయము** — తర్కశాస్త్రమున వాదించునపుడు- ౧ వాదము- నిజము గవుఁ గొనుటకుగాను తర్కించి వాదించుటకు వాదమని పేరు. ౨ వితండము- స్వపక్షస్థాపనము నకుగాను అన్యవాదములను ఖండించుచు చేయు వాదము. ౩. జల్పము- స్వపక్ష స్థాపనము ప్రధానముగాక కేవల అన్యవాదఖండనమే ప్రధానముగ నడపువాదము. ఇది సారెసారెకు అడ్డుదగులునది. ఈమూఁటికి సాముదాయికముగ కథాత్రయమని పేరు

**కనక పురము** — దక్షిణ మళయాళములోని తిరువన తళయనము (తిరువానూరు) నకే పేరు వాచకముగనుండెను

**కనకము మంచిదైతే కాల్పనకు గీటునకు వెఱవదు** — ఆంధ్రలోకోక్తి

**కనకవతి (పురము)** — యమునా నదిలో పయశ్విని (పైశుని) సంగమించు తావు దరిని యమునానది దక్షిణతీరమున (కాళాప్ పురమునుండి పడమరగా ౧౬ మైళ్ల దూరము) ఇప్పుడు కానోట లేక కనకోట్ అనంబరు చున్న గ్రామము. దీనిప్రశంస అవధానకల్పలత ౧౦౬ యందు గాననగును.

**కనంద్రమ్ (Conundrum)** — రిడిల్ కనంద్రమ్ చూడుఁడు.

**కనడా దేశపు ప్రభుత్వము** – ఉత్తర అమెరికాఖండమునందలి బ్రిటీషు డొమినియన్ Constitutional Country. ముప్పదియారు లక్షల నలుబదియొన్మిది వేల ఐనువందల చతురపు మైళ్ళు వైశాల్యమనియు, ఎనుబదిఏడు లక్షల ఎనుబది ఎనిమిదివేల ఐదువందలు జనసంఖ్యగఁ జెప్పఁబడినది. మాంట్రీల్నగరము రాజధాని.

**కనడాదేశము (Canada)** — ఇది బ్రిటీషు నార్తుఅమెరికాలోని గొప్పదేశము. దీని యొక్క ఉత్తరభాగము కడు శీతలప్రదేశము. ఆర్కిటిక్కు సముద్రప్రాంతము దానికిం దొల్లింట Hudson Bay Territory అని పేరుండెను. ఇప్పుడు నార్తువెస్టుటెరిటరీయను పేరం బరగుచున్నది. ఇది తూర్పునకు ఏటవాలుగల గొప్ప సమతలప్రదేశము. ఇం దనేక సరస్సులు కలవు. వీటిపై ననిమిదడుగులదళసరిని మంచు పేరుకొనుచుండును. ఈ ప్రదేశమున ఉత్తరభాగమున ఎస్కిమోజాతివారును, దక్షిణభాగములందు ఇండియన్ జాతులవారును ఆదిమ నివాసులు. వీరికి వేట చేపలంబట్టుటయు వృత్తులు. చర్మములు, బొచ్చు (Fur) వర్తకపు దినుసులు, ఇటీవల గొప్ప బంగారుగనులు దొరకుటచే కొంత మార్పు గల్గినది. ఇది యూకాన్ నదీతీరమున క్లోండైక్ ప్రాంతముల నీ గనులు బయల్పడినవి. ఈప్రాంతము అలాస్కాకుసమీపము. ఇటనుండి ఉత్తరమునకు పోలారుప్రాంతమని పేరు. అందు ఆరునెలలు రాత్రియు, ఆరునెలలు పగలునై యుండెడిని. అరోరాబోరియాలిస్ అను ప్రకాశము, కాంతి గల మేఘము లాకాశమున సంచరించుటల చీఁకటివేళల కాన్పించు చుండును. ఈప్రాంతములనుండి వాయువ్యదిశగానొకసముద్ర

మార్గము భరతదేశమున కేర్పాటుచేయ ప్రయత్నములు జరగినవిగాని, మంచు హెచ్చయదాయెనట. (ఉత్తరబ్రిటీషుఅమెరికా నార్తువెస్టుకెంపెనీ చూడుడు.)

కనడాదేశమును ఆంగ్లదేశస్థులు Dominion of Canada అనియెదరు ఇందు ప్రధానభాగములకు ప్రోవిన్సు లనియెదరు. అవి ౧. అంటారియో, ౨. క్విబెక్కు, ౩ మానిటోబా, ౪. శాస్కాట్చివాన్, ౫. బ్రిటీషుకొలంబియా, ౬. నోవాస్కోషియా, ౭ న్యూబ్రన్సువిక్కు, ౮. ఆల్బర్టా యనంబడునవి. ఇంకను ౧ ప్రిన్సు ఎడ్వర్డుప్రోవిన్సు అనియు, న్యూఫౌండ్లాండనియు, మెకంజీలాండు అనియు, యూకాన్ అనియు, ఉంగావా యనియు, లాబ్రడార్ అనియు, మరి యూదు పరగణా లిందు చేరినవి కలవు ఇవి యన్నియుం గలసి డొమినియన్ ఆఫ్ కనడా యను పేరునం బరగుచున్నవి. ఇది స్వపరిపాలన మందిన బ్రిటీషు సామ్రాజ్యములోని ప్రత్యేక రాజ్యమై ఒక బ్రిటీషుగవర్నర్ జనరల్ క్రింద నున్నది

కనడారాజ్యము బ్రిటీషు సామ్రాజ్యమున మూడవవంతని చెప్పంబడినది. తూర్పున అట్లాంటిక్ మహాసముద్ర తీరమందున్న హాలిఫాక్సుపురమున ఇంపీరియల్ లిమిటెడ్ అనంబడు త్వరితగమనము గల ఇనుపదారిబండిని సోమవారముదయమున నెక్కిన, నోవాస్కోషియా, న్యూబ్రన్సువిక్కు, క్విబెక్కు, ఒంటారియో, మానిటోబా, శాస్కాట్చివాన్, ఆల్బర్టా బ్రిటీషు కొలంబియా ప్రోవిన్సులగుండా నడచి శనివారము ఉదయమునకు పశ్చిమమున పసిఫిక్ మహాసముద్ర తీరమం దున్న వేన్కోవరు చేరుదుమనిన దేశవిస్తీర్ణము తెలిసెడిని.

ఉత్తరభాగములందు చలి మిక్కుటము. శీతకాలమున వేడి Zero కు దిగువ ౫౫ డిగ్రీలుండును. జనులు చాలతక్కువగ నట నివసించుచున్నారు. దక్షిణభాగములందు జనసంఖ్య యధికమైన పెద్ద పెద్ద పట్టణములు కలవు. తూర్పునుండి పడమరకు గల కనేడియన్ పసిఫిక్కు రెయిల్వే 3,000 మైళ్లు పొడవున్నది. ఇది తూర్పున మాంట్రీలు హాలిఫాక్సులనుండి పశ్చిమమున వేన్కో వరు వఱకు వేయంబడినది

౧. ఒంటారియో (Ontario)- ఈప్రోవిన్సునందు నాల్గుసరస్సులు ప్రధానదృశ్యములు. ఈ సీమయంతయు నొక తోటవలె నుండును దీని తొల్లింటిపేరు అప్పరుకెనడా యనియుండెను. భూమిసారవంతమైనది. గోధుమలు, జొన్నలు, నార విస్తారము పైరుచేయంబడుచున్నవి. అరణ్యప్రదేశములు విస్తారముగనుండును కలప ఎగుమతి చేయంబడుచున్నది. శీతకాలమున బండ్లు చక్రములు తీసివేయంబడి స్లెడ్జిలుగా మార్పనగును. ప్రజలు బ్రిటీషుదేశమునుండి వలసవచ్చి యిచ్చట కాపురము కుదిరినవారు నారందఱు ప్రొటెస్టాంటు క్రైస్తవ మతస్థులుగనున్నారు. ఈ ప్రోవిన్సునందున్న ఒటావాపట్టణము కెనడా దేశమునకంతకు ప్రభుత్వస్థానము. ఇందు ౮౫,౦౦౦ జనులు వసించుచున్నారని తెలిసెడిని ఒంటారియో సరస్సు పశ్చిమతీరముననున్న టోరెంటోపురము ౧,౮౦,౦౦౦ జనసంఖ్య కలది. చక్కని సౌందర్యవంతమైనది. కింగ్సుటన్ వేఱొక పట్టణము

౨ క్విబెక్కు (Quebec) - ఈప్రోవిన్సునకు తొల్లింటి కాలమున లోవరు కెనడాయని పేరుండెనట. భూమిసారవంతమైనది, గోధుమలు, జొన్నలు, నార విస్తారముగ పైరు చేయంబడుచున్నవి. అరణ్యప్రదేశములు విస్తారముగం గలవు, కలప ఎగుమతి చేయంబడు చున్నది. శీతకాలమున బండ్లు చక్రములు తీసివేయంబడి స్లెడ్జిలుగా

మాట్లాడుచుండును ప్రజలు ఫ్రాంచి దేశము నుండి ఇటకు వలసవచ్చినవారు. వీరు క్రీ. శ. ౧౭౬౩ వరకును నిటు చేరుచుండిరి. దేశము ఫ్రాంచివారి వశముగానుండెను. పిదప ఫ్రాంచివారీ సీమను బ్రిటీషువారికి వశపఱ్చిరి. ఇచట సెంటు లారెన్సు ద్వీపమున మాంట్రీల్ (౨,౫౧,౦౧౦) నగరము కలదు మఱియు సెంటులారెన్సు నదీ తీరమున క్విబెక్కు (౬౯,౦౦౦) పురము కలదు ఇచటి దుర్గము చాల బలవత్తరమని ప్రతీతి

3 మానిటోబా (Manitoba) - ఈప్రోవిన్సు నడుమ దిశగానున్న సీమ ఇచట అడవులు లేవు దీనికి పూర్వము Red River Settlement అని పేరుండెను ఇది న్యూసౌత్ వేల్సు అనియు నామము కలదు. దీనిని Rolling Wide Prairies అని నాడుచున్నారు ఇచట ప్రధాన పురమునకు విన్నిపెగ్ అని పేరు.

౪ సాస్కాచ్చివాన్ (Saskatchewan) - ఈప్రోవిన్సునందును Rolling Wide Prairies అనబడు చున్నవి.

౫ బ్రిటీషు కొలంబియా (British Columbia) - ఈ ప్రోవిన్సు కనడాదేశమున చాల ప్రాముఖ్యమైనది కడుసుందరమైనది. వినోదకరము ఫలవంతము నైయున్నది. దీనిని అచటివారు Little Paradise (చిన్నస్వర్గము) అనియెదరు. సంవత్సరముపొడవునను గులాబీలు, చేమంతులు, చెంగల్వలు విధివిరామములేకుండ దేశమంతయు బయళ్లయందు సహా అపరిమితముగా పూచుచుండును. ఫలవృక్షముల తోటలు మిత మీరి కలవు. ఓకనగాన్ లోయయు, కుట్నీలోయయు, ఫలవృక్షముల మయమైయున్నవి.

ఈమహాసీమ మధ్యభాగమున సెల్కిర్కు పర్వతపఙ్క్తియు, పుర్సెల్ పర్వతపఙ్క్తియు చాల నున్నవి వీటి శిఖరములు పసిఫిక్కు మహాసము ద్రమునుండివచ్చు వర్ష మేఘముల నడ్డుకొని అధిక వర్షములం గురియఁజేయును. అడవులందు Douglas Fir అను నొక జాతి వృక్షములు కలవు. అవి చాల గొప్పచెట్లు. వేంకోవరు పట్టణపరిసరములనున్న Stanley Park ఉద్యానమునఁ గల ఒకచెట్టులోని ఖాళీస్థలమొక గది యంతకలదు. అందు యాత్రస్థులు నిలువంబడి ఛాయాపటములం దీయించుకొనెదరు. ఆచెట్లు అన్నుకొలత ముప్పదియడుగులుండును

పసిఫిక్కు మహాసముద్రమునకు దరినే వేంకోవరు ద్వీపముననున్న విక్టోరియాపురము గొప్ప రేవుస్థలమును, ఈబ్రిటీషు కొలంబియాకు ప్రధాననగరము నైయున్నది ప్రిన్సు రూపర్టు ద్వీపమును, అందలి యాపేరుగల పట్టణము మరి యొక రేవుస్థలము, దీనికిచెందినవియే. వెంకో వరు ద్వీపము ఐర్లాండుదేశములో సగముండును. బ్రిటీషు కొలంబియాయందలి పర్వతములలో కొన్ని ౭,౫౦౦ అడుగుల ఎత్తుకలవి కలవు. వేంకోవరు ద్వీపము, క్వీన్ ఛార్లటీ ద్వీపములు బంగారము, కలప, రాతిసంగ్గులకు పేరొందినవి New West-minster అనునది వేరొక పెద్దపట్టణము

౬ నోవాస్కోషియా (Nova Scotia) - దీనికి న్యూస్కాట్లాండని యర్థము. ఈప్రోవిన్సు ఒక ద్వీపకల్పము. చలిప్రదేశము. ఇనుము, రాతిసంబొగ్గు విస్తారము గనులందు దొరకు చున్నవి. కలపవర్తకము, మత్స్యముల సలాపము విస్తారము. ఇచట హాలిఫాక్సుపురము (౪౦,౦౦౦) ప్రధానస్థానము ఇట చక్కని పెద్దనౌకాశ్రయము (హార్బరు) కలదు. ఇది రెయిల్వేకొన. ఇట నుండి ఇంగ్లాండునకు రాకపోకలు విస్తారము జరుగు చుండును. అనేకఓడలరైనులు కలవు. కేపు బ్రిటన్ ద్వీపము దీనికిచెందినది.

౭. న్యూ బ్రన్సువిక్ (New Brun's Wick)- ఈ ప్రోవిన్సునందు దడవులు విస్తారముగాను, కలప వర్తక మధికముగా నుండెనట. కాని యిప్పుడు ఫండీ బే తీరమున, సెంటుజాను నదీముఖద్వారమునం గల సెంటుజానుపట్టణమున నోడల నిర్మాణ మధికముగా జరుగుచున్నది ఇట Fundy Bay యొక్క గొప్ప కెరటములు డెబ్బది యడుగుల వఱకు లేచుచుండును

౮. ఆల్బర్టా ప్రోవిన్సు (Alberta)- దక్షిణమున నున్నది. ఇందడవులు లేవు. ఇది Rolling Wide Prairies అనంబడుచున్న సీమ.

ఇవిగాక Prince Edward Province అనియు, Rupert Land అనియు, Mackanzie Land అనియు, Yukan Land అనియు, Ungava (దీనిని New Briton అనియు నందురు) అనియు ప్రదేశములు కనడాకుం జెందినవిగనే

**కనికరము** — ఇది కరుణతో సంబాధము కలది దయయొక్క పరిపక్వస్థితి, దాతృత్వము నుండి కల్గు నవస్థ కనికరము హృదయము నాశ్రయించియుండు శక్తి. తనకన్న భేదముగల యన్యులంగూర్చి కల్గు కరుణసంబాధమగు మనస్సునందలి శక్తి.

**కని గుడ్డి విని చెముడు ఉండవు** - (కని=చూచి, విని=ఆకర్ణించి) ఆంధ్రలోకోక్తి.

**కనువర్తి అబ్బయామాత్య కవి** — ఆంధ్రకవులలో నాధునికుండుగ పరిగణింపంబడిన వాండు. ఆర్వేలనియోగి బ్రాహ్మణుడు. కౌండిన్యస గోత్రుండు. తండ్రి పేరు రాయనమంత్రి. తల్లి నరసాంబ అన్నగారిపేరు యోగానందము. రచించినవి- ౧. అనిరుద్ధచరిత్రము, ౨. కవిరాజ మనోరంజనము నను ప్రబంధములు. ఇది వసుచరిత్రంబోలి రసవంతమైనది. దీనికిం బురూరవచరిత్ర మనియుం బేరుకలదు.

**కనుబొమలు**— ఇవియేతదముఖముమునందు ఏర్పఱ్చబడవలయునని ప్రశ్నించువారు లేక పోలేరు. వీటిఉపయోగము పైకికానరాకున్నను లేకపోలేదు. ఇవి అందమునకని కొందఱు తలంతురుకాని ఉపయోగ మెక్కువగంగలదు. వేడికి లేక పనిచేయుతరి ముఖమున, అందుముఖ్యముగ నుదుటను చెమటపట్టును చెమటనీరు లోపలి విషములను పైకితెచ్చునదికాన పరిసుభ్ర జలముకాదు. కనుంబొమ్మలే లేకుండిన నాచెమట నీరు కన్నులలోనికి దిగజారెడిని. అట్లులంగాకుండ కనుంబొమలు చెమటనీటిని ప్రక్కలకుమఱల్చును.

**కనుము పండుగ** — మకరసంక్రాంతి పండుగ చూడుండు.

**కనెమ్ స్టేటు** — ఆఫ్రికా ఖండమున సూడాన్ లేక నిగ్రిటియాదేశముననున్న స్టేటులలో నొకటి. స్వతంత్ర రాజ్యములలోనిదై బాగిర్మి, వాడై స్టేటులతోకలసి ఒకసుల్తాన్ ఏలుబడిలో నున్నది. (ఆఫ్రికాఖండము సూడాన్ లేక నిగ్రిటియా దేశము, బాగిర్మిస్టేటు వాడైస్టేటు చూడుండు).

**కన్నడ (కర్ణాటక) దేశపు సామెతలు** ( లోకోక్తులు చూడుండు )

అవ్వను చూచుటకు తాత బయలుదేరినట్లు. ఆముదముకొలిచే తవ్వ అన్ని కాలములను జిడ్డే ఈంగను కప్పమ్రింగితే కప్పనుపాము మ్రింగును. ఎద్దుకు కొబ్బరికాయ యిస్తే ఏమి చేస్తుంది. పీనుంగనుచూచి కుక్క మొఱిగినట్లు కంచెయే పొలమును మ్రింగితే కాసేవారెవ్వరు ? కప్పలు కూస్తే వర్షంపడినట్లు కస్తూరిమోయు గాడిదవలె గిన్నెడన్నము ఉడికినదీ లేనిదీ ఒక్క మెతుకు చెప్పితే చాలును. చంకను దుడ్డుకఱ్ఱ; చేతులతో వందనము. చేపలు నీటిలోమున్గుతూ ఉండుటకు స్నానఫలమా ? చిన్న తలకాయకు

పెద్ద తలపాగా. చిరకాలపు రోగి చిన్న వైద్యునికన్న నయమే. చిలకను పెంచి పిల్లి కప్పగించినట్లు. చేతికందినగాని నోటిదాకా రాదు. గుడిసెలో నైతే మాత్రము దీపాలు వెలుగవా? దున్నపోతుపై వర్షించినట్లు గున్నపోతు ముందు వీణవాయించినట్లు దొంగకూ దొంగకూ పరిచయము లేకపోయినా స్నేహితులే. నల్లాప్రవాలు కూడా తెల్లగానే ఉంటవి నీరు లేని తావని మొరకను గ్రామం కట్టుకున్నట్లు నూతిలో నీరు తోడుకోవలెగాని సంతలట తానేనై కివ్వ దా? దేశమేల నేలుతూ ఉంటేనేమి? భాగ్యా దాపురుం లేనిదే గాని విద్యా రాదు పట్టాలముంటి కీడే సైన్యాధిపతి, భార్యకు బానిస మైనట్లు ప్రీతిలేని భర్త పెరుగొంపలోనున్నా ఇంట్లోనున్నా ఒక్కటే ప్రీతిలేని భర్త పెరుగులో రాళ్ళి వచ్చాయన్నాడట పురోహితులు జూదరి నోళ్ళ వాతలు పెట్టుకొన్నట్లు బంగారపు కత్తి నని కీసు కోసు కుంటారా? పుట్టపై బాదితే పాము చచ్చునా? గాడిదపునిగానికి చెవులు బంగారమైనా రాయినైనా బంగారమైనా ఒకటే పెద్ద పరాయివాడని నూతిలోతు మూసి పోసినట్లు విద్యా చల్లితే కాకులు కావలసినన్ని వస్తే మే ...క్కకుండను పగుల గొట్ట పోక మూకు కావలయునా? ముక్కునత్తు ముక్కు కంటె బరువైతే ఏలాగ. ముగ్గురికి తెలిసిన రహస్యం మూడులోకాలా ప్రాకినదే రాజుగారికెక్క గుఱ్ఱమే కాలుత్రొక్కితే నొప్పి చేయదూ? రోటిలోకి వచ్చి రోకలిపోటుకు సిద్ధపడిఉండవలసినదే వస్త్రమునకు కొత్తదనమే యౌవనం (గాల్యమే లేదని భావము). శత్రువు చేత క్షౌరం చేయించుకున్నట్లు. సాగదీసినదే చిరుగునది, వాసవైనదే విరుగునది. సీసపు శాసనంలో గాటిని తొలువ గలమా?

**కన్నడబ్రాహ్మణులు (కర్ణాటకబ్రాహ్మణులు)** — పంచద్రావిడశాఖలలో నొకశాఖ. (బ్రాహ్మణులు చూడుడు.) వీరు కర్ణాటకదేశనివాసులు. (కర్ణాటకదేశము చూడుడు.) వేర్వేఱు కాలముల చీలిన కర్ణాటకశాఖలు పదమూడు నేటికి గానవచ్చుచున్నవి. వీరు శాఖాభేదములుగ నున్నారు. అద్వైతులగు స్మార్తులుగ కొందఱును, ద్వైతులగు వైష్ణవులుగ కొందఱు నున్నారు వైష్ణవులు ఆనందతీర్థస్వామి శిష్యులు గాని, రామానుజీయవైష్ణవులుకారు. ఆంధ్రదేశమున కేతెంచి యుల కాపురమునుగుదిరిన ఈ వైష్ణవులు మధ్వులనిపించుకొందురు. కన్నడదేశమున గల రామానుజీయవైష్ణవులుద్రవిడదేశస్థులేగాని, ఇచటివారిలో గానరారు

౧ కన్నడబ్రాహ్మణశాఖ, ౨ అరవత్తొక్కులు, 3. ఉరుచిబ్రాహ్మణశాఖ, ౪. కుమ్మెశాఖ, ౫. నగరబ్రాహ్మణశాఖ, ౬. బొబ్బరబ్రాహ్మణశాఖ ఈయాఱుశాఖలవారిని గూర్చి కన్నడస్మార్తులనుటకన్న నేమియుం దెలియరాకున్నది.

౭. వీరు కన్నడస్మార్తులు. వీరు అరుదుగ గానవచ్చుచున్నారు. వీరిగూర్చి ఏమియు దెలియరాకున్నది.

౮. నంబూరిబ్రాహ్మణులు- వీరికి నంబూద్రీలనియు వాడుకగలదు వీరు కన్నడదేశపు నంబూరీలనియు, మళయాళదేశపు నంబూరీలనియు నిరుతెగలుగ నున్నారు. మళయాళదేశమందు హెక్కుడుగ గానవచ్చుదురు.

౯. అమలవాసీలు- వీరు స్మార్తశాఖ. దేవస్థానములందు అర్చకులుగ గానవచ్చుదురు. వీరు కన్నడదేశమునందేగాక మళయాళసీమలందు నను గుడిపూజారులుగ వ్యాపించియుండుట గానవచ్చెడిని.

౧౦. పొట్టిబ్రాహ్మణులు- ఈశాఖయు దేవాలయములం దర్చకులుగ గాననగుచున్న స్మార్త శాఖ. వీరింగూర్చి సరిగా తెలియదు.

౧౧. ముత్తసబ్రాహ్మణులు- వీరు కన్నడ స్మార్తశాఖ. మళయాళమునందుగూడ గాననగుచున్నారు.

౧౨. పట్టర్బ్రాహ్మణులు- వీరు నంబూరీల కన్న శ్రేష్ఠమగు శాఖవారమాదురు అరుదుగ మళయాళమునగూడ గాననగుచున్నారు

౧౩. వైష్ణవులు- వీరు ద్వైతులు. ఆనందతీర్థ శిష్యులు. వీరి మతగురువు లుండు ప్రధానమఠములు ఉడిపి (రజితపురి) యందు కలవు. ఆంధ్రదేశమున కాపురములు కుదిరిన ఈ వైష్ణవులు మధ్వులనిపించుకొనుచున్నారు. వీరిలో తాక్క్యులాదలుచు రావు, రాయుడు, గౌడ యను బిరుదనామములను, వైదికవృత్తిచే జీవించువారు ఆచారిగళు అను బిరుదనామమును చేరునకుం బిడప నుంచుకొందురు

**కన్నతల్లికైనా కనుమరుగు** — ఆంధ్రలోకోక్తి.

**కన్నుంబోగొట్టిన దేవుడు మతిని (బుద్ధి లేక జ్ఞాపకశక్తి) ఇచ్చినట్లు**— ఆంధ్రలోకోక్తి

**కన్నుపోయేటంత కాటుకపెడుదురా?** — ఇది ఆభరణము లపాయకరములగునట్లు చేయుదురా అనుసామెతవంటిది. ఆంధ్రలోకోక్తి

**కన్నుఎఱిగింప కున్నను కడుపు ఎఱిగించెడిని** — అనగా పోల్కి ఎఱుగక పోయిన తననుకనిన తల్లిని ఎఱుగనగును. ఆంధ్రలోకోక్తి.

**కన్నుఎఱ్ఱనయైనా మిన్నుఎఱ్ఱనయైనా నీరే**— అనగా కన్ను ఎఱ్ఱనవలన కంటినీరు వచ్చును. మిన్ను=ఆకాశము ఎఱ్ఱనయైనా గానవచ్చిన వర్షించును. ఆంధ్రలోకోక్తి.

**కన్నెకోమలిచెట్టు** — దీనిదుంప వెగటు రుచిగల్గి జిగటగానుండి త్రిదోషములను హరించును. వీర్యవృద్ధిజేయును. తాపము, విదాహము, పైత్యము, శుక్లదోషములు నడంచుననియు, దీనియాకుపసరు కాలినచోట శమింపం జేయుననియుం జెప్పంబడినది దీనిదుంప నెండించి జూర్ణముగం జేసియు వాడుటకలదు

**కన్ఫరమ్ లేక కన్ఫర్మేషన్** — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము). Confirm or Confirmation ఖాయపడుట, స్థిరపడుట యని యర్థము. కొనుగోలు వ్యాపారములందు ఒకరు ఇచ్చిన Offer కు రెండవవారంగీకరించుట కన్ఫర్మేషను అనంబడును.

**కన్ఫెస్సర్** (Confessor) — మార్టైర్ కన్ఫెస్సర్ చూడుండు.

**కన్వర్టు** — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. Convert- అన మార్చుట యని యర్థము. "On Demand" నోట్లు మొదలగు తత్క్షణము నాణెంబుగా మార్చందగిన కాగితపు సొమ్మును Convertible Paper Currency అనిపెదరు. ఇటులనే ఎప్పుడు కబడితే అప్పుడు నగదుగా మార్చందగిన Securities కన్వర్టిబిల్ సెక్యూరిటీస్ అనంబడును.

**కన్వెన్షన్** (Convention)— రాజకీయ కక్షలు కలసి అందఱికిందావలసిన ఏర్పాటులు గావించుకొనగూడిన ప్రత్యేకసభ. అమెరికా సంయుక్తరాష్ట్రములలో నన్ని కక్షలవారునుగలసి అగ్రాసనాధిపతి నెన్నుకొనగూడిన సభకు ఈపేరు వాడుదురు. అట్లే భరతదేశమునను భేదాభిప్రాయులగు కక్షలవారు కలసిసాముదాయిక సఖ్యతకై చేయుసభకు నిదే పేరు.

**కన్నము** — కుంచముగా నిరూపించినది. (ఆయుర్వేదమానము జూడుము).

**కన్సిడరేషన్** (Consideration) ప్రతిఫలము- వాణిజ్య సంబంధ పరిభాషా పదము — ఇది నగదురూపముగఁ గాని, సరకుల రూపముగఁ గాని, ఉపకార రూపముగఁ గాని, పరిచర్యా రూపముగఁ గాని ఉండవచ్చును. ఇది ధన రూపముగ నుండినచో దానిని Consideration Money అనెదరు. క్రయములు వేర్వేఱుగఁగాని, రెండు మూడు వరుసలుగగాని జరుగుచో స్టాంపు మొదలగు ఖర్చులు పైగా కలిపినచో నట్టివి యీ పేరునఁ బరగఁజాలవు.

**కన్సెషన్స్** (Concessions)— వాణిజ్య సంబంధ పరిభాషాపదము రైల్వేలు వేసికొనుటకు, గనులను త్రవ్వించుకొనుటకు మొదలగు పనులకును, వేఱుకార్యములకును, భూమిని గ్రాంటుగా నిచ్చుట మొదలగు సహాయములను ప్రభుత్వమువారొసఁగునప్పుడు కీపేరువచ్చెడిని

**కన్సైన్మెంటు నోటు**— (Consignment note) వాణిజ్య సంబంధ పరిభాషా పదము రైల్వే మొదలగు సంస్థలద్వారా సరకుపంపించుతఱి వాటివివరములను తెలుపుచు గొంపోవఁగోరి పంపించువారలు ఆసంస్థకు వ్రాసి యిచ్చుపత్రము.

**కన్యకాపరమేశ్వరి** — ఈదేవి (లేక శక్తి) ఇంద్రాణియగు శచీదేవియొక్క అవతారమని చెప్పఁబడినది. ఇప్పటి పశ్చిమగోదావరీమండలములోని నరసాపురపుకాల్వదరినున్న పెనుగొండ యను పేరుగల నగరమందు ఉద్యావాకులగోత్రోద్భవుఁడగు కుసుమశ్రేష్ఠియను పేరుగల యార్య వైశ్యప్రముఖునకు సహధర్మచారిణియగు కుసుమాంబయందు పుత్రకామేష్టి యొనర్చిన ఫలితముగ వరపుత్రికయై జన్మించెను. తలిదండ్రులీమె కిడిన పేరు వాసవాంబ. ఈమెసోదరుని పేరు విరూపాక్షశ్రేష్ఠి. కన్యకాపురాణంబునం దీ దేవి జన్మతిథి వైశాఖ శుద్ధదశమి శుక్రవారమనియు, వారు కవలవారనియు చెప్పఁబడినది.

తలిదండ్రులు కడు ధనికులును, తండ్రి కుల పెద్దయగు ప్రముఖుఁడు నౌటయు, వారికి లేక లేకఁ గల్గిన సంతానమగుటయు నా బాలబాలు రతిగారాబముతో పెంపఁ బెరుగుచుండిరి. ఆబాలికకు యుక్తవయస్సురాగా వైశ్యకులాచారము మేరకు శ్రేష్ఠిగారు మేనల్లునకిచ్చి పరిణయమొనర్ప సమకట్టియుండి రట. కాని యట్లు జరుగలేదు.

ఆకాలమున పెనుగొండ (నగరము) వేఁగి దేశములోనిదిగ నుండి, విష్ణువర్ధనుఁ డను భూపతిచే పాలింపఁబడుచుండెనట. ఆ మహారాజు మార్గవశమున పెనుగొండ కేతెంచి నగరేశ్వరుని దేవస్థానపుమంటపమున సుఖాసీనుఁడై యుండ వైశ్యు లాయనను బహూకరించుటయు, వైశ్యభామినులాయనకు మంగళహారతు లిడుటయు జరిగెనట. అత్తఱిం దల్లియగు కుసుమాంబతో సుతయగు వాసవకన్యకయుం గూడ నటకేగియుండె, భూపాలుం డాబాలం గాంచి సౌందర్యాతిశయంబున కచ్చెరువంది యనురాగవశంబున నాసుందరాంగిఁదనకుఁ బరిణయంబు సేయుమని తన మంత్రులద్వారా రాయబారమంప నాకుసుమశ్రేష్ఠి పదునెన్మిది వైశ్యపురంబులనుండియు వైశ్యప్రముఖులను రాబనిచి వారి కెఱింగింప వారియ్యరా దనిరట. దానిని విని భూపాలుం డుగ్రుండై వైశ్యుల రాయబారులం జెర నుంచెనట. ఎట్టకేల కెట్టులో వారిం జెరనుండి విడిపించుకొని వైశ్యులు దూరాలోచనమొనర్చి వాసవకన్యతో సహా యగ్నిగుండంబునం బడెదముగాని, కులాచారమును విడఁజాలమని తీర్మానించుకొనిరట.

ఆసభనుండి ఎన్బదిగోత్రములవారు పాగ్ధికకును, రెండువందల గోత్రములవారు దక్షిణము

నకును, నూటయొన్బదియూరు గోత్రములవారు పశ్చిమమునకును, నూటముప్పదినాల్గు గోత్రములవా రుత్తరదిశకును, పండ్రెండు గోత్రములవారు పలుతెఱంగులకును చావునకుం దెగింపక పారిపోయిరనియు, వారందఱాఱువందలపండ్రెండు గోత్రములవారనియు, తక్కిన నూటరెండుగోత్రములవారు అగ్నిగుండంబునం బడ నిలచిరనియు, కన్యకాపురాణమునందు చెప్పఁబడినది.

వారటుల నగ్నిగుండంబునఁ బడుతరి వాసవాంబ నూరేగించి అగ్నిగుండంబుకడకుం దెచ్చినతరి నాయార్యుల కామె శక్తిస్వరూపిణిగఁ గన్పించి తాను శచీదేవి ననియు, విష్ణువర్ధనమహారాజు నంతము నొందింప నవతరించితి ననియు, తా నగ్నిగుండంబునం బడిన వార్త విన్నతోడనే యా భూపతి శిరంబు వేయి వ్రక్కలగుననియు వచించి, తనను బూజించుచుండు నట్టివారి నుద్ధరించి యభివృద్ధికిం దెచ్చి రక్షించుచు నుందుననియు, బాలురకు సభయంబొసంగి యగ్నిం బ్రవేశించి శరీరంబు వీడె. ఆనూటరెండుగోత్రములపెద్దలును తోడనే యగ్నింబడి యామెతో భౌతికశరీరంబుల వీడి స్వర్గమున కేగిరని చెప్పఁబడినది. వారి సంతతి వారే ఇప్పు డార్యవైశ్యులనంబడుచున్న కోమటులుగ నున్నారు.

ఇంతకుం గన్యకాపురాణమున వివరింపఁబడిన ఇందలి పూర్వోత్తరగాథల నిట వివరించుట సమంజసము. ఇవి కన్యకాపురాణమున వివరింపఁబడిన మూడు ముఖ్యగాథలు- వైశ్యులు భూమికిం జేర్పఁబడక పూర్వము కైలాస వాసులై యుండువారట. అత్తరి నొకసారి బ్రహ్మలోకమున కేగి బ్రహ్మ సభయందుండుతరి పరమేష్ఠి నిందుకొల్వున నుండి బ్రహ్మక్షత్రియవైశ్యులం దెక్కుడుగోత్రంబు లెవ్వరియం దున్నవని ప్రశ్నింప, వైశ్యులు తమయం దేడునూరులపదు నాల్గుగోత్రంబులును, అన్నిగణములును గల వనిరట. తోడనే వారియం దారునూఱుల పండ్రెండు గోత్రములవా రతిశయమున తక్కిన వర్ణములం గేలిసేసి నగిరట. సభయం దున్న దూర్వాస మహర్షి కోపించి, "వైశ్యాధములారా! గర్వింపకుఁడు. మీగర్వ మడంగి మీరు కొంతకాలము వేదవిహీనులు కర్మభ్రష్టు లగుదురుగాక!" యని శపించెనట. పరిహసింపని నూటరెండుగోత్రముల వా రచ్చటఁ బ్రాధేయపడి వేడ, కనికరించి, "నగవకుఁడు మీలో నొక కన్యకం గూర్చి వారి నుండి వేఱై శాపానుభవవిముక్తిం గాంచి యభివృద్ధినందుదు" రనియెనని చెప్పఁబడినది.

మఱియొకప్పుడు సోమకాంతుఁడను యక్షుని పత్ని సుశీలయను నామె తనకు నూఱుగురు పుత్రులుండి, పుత్రికలు లేక నింద్రాణిం బూజించుచుండ నామె వరంబీయ గర్భంబు నిలచి శచియంశంబున నొకపుత్రికం బడసెనట. ఆబాలికను చిత్రకంఠుఁడను గంధర్వసుందరుఁడు మోహింప నాబాల యియ్యకొనకున్న నాతఁడు భూమియందు జన్మింపు మని శాపంబిచ్చెనట. ఆబాలయు "నీవును నావలెనె భూమియందు జన్మించియుటగూడ విఫలమనోరథుండవై అకాలమృతికిం బొల్పుదువు గాక!" యని ప్రతిశాపంబిచ్చె నని చెప్పఁబడినది.

ఇంకొకతరి బ్రహ్మదేవుం డొకయజ్ఞ మొనర్ప నమకట్టి యజ్ఞభంగంబు సేయనున్న శతజిహ్వుం డను రక్కసునితో యుద్ధమున కేగుమని నలకూబరునికానతీయ నాతండు వెఱగంది, వగడాయె నట. అందునకుం గినిసిన పరమేష్ఠి భూమియందు జనింపుమని శపించి శచీదేవి తనయుండగు జయంతు నేగుమనియెనట. అందునకా ఇంద్రాణి తన తనయుఁడు బాలుండుగాన యుద్ధమున కేగఁజాలఁడనిన విధాత యల్గి, నీవును భూలోకంబునం బుట్టుమని యామెను శపించెనట. అదివఱకే

యారక్కసునితో కూడ వానిం బరిమార్చియే తెంచి, ఆ క్రూర శాపము గల్గుటవిని యచ్చున్నై దీనతం బ్రార్థింప దయాళువై 'పురందరా వెఱవవలదు ఇంద్రాణి భూలోకంబునం బుట్టియు కన్యకగనె యాశోకం బగ్నియందు వీడి నీకడకుం జేరు' నని యభయము నిచ్చెను.

ఇట్లు ప్రస్తుతాంశంబుగ నలకూబరుడు కుసుమశ్రేష్ఠిగను, శచీదేవియే వాసవకన్యకగను, సోమకాంతులు నూటొక్క మంది పుత్రులు నూటొక్క గోత్రముల మూలపురుషులుగను, చిత్రకంఠుడు విష్ణువర్ధన మహారాజుగను జనించిరని కన్యకాపురాణమున చెప్పబడినది.

ఇంక నిక సిల నిల్లువదలి వాసవ కన్యకాపరమేశ్వరీ యవతార కాలమునకు మనలువముగాక. కన్యకా పురాణము కలియుగము రెండువేల వన్నూట యిరువది సంవత్సరములు గతించినతరి నని వ్రాయబడి యున్నది. ఇట్లే యగునేని క్రీ పూ. ౬౮౦ సంవత్సర ప్రాంతముగాతోపు. అక్కాలమున వేగిదేశమే లేదు. రాజమహేంద్రవరము నిర్మింపబడనూ లేదు. విష్ణువర్ధనుడను పేరుగల చాళుక్యనృపతి పాలనమును లేదు ఇది సంభావ్యమే కానరాదు

చాళుక్య భూపతులు వాతాపి (ఇప్పటి బాదామి) పురము రాజధానిగ మహారాష్ట్ర దేశమేలుచుండిరి. ఆరాజ కుటుంబమున సుప్రసిద్ధుడై, అశ్వమేధయాగ మొనర్చినటుల చెప్పబడిన మొదటి పులికేశి మహారాజు (సుప్రసిద్ధుండగు జయసింహుని మనుమడు) పౌత్రులగు రెండవ పులికేశియు నాతని కనిష్ఠ సోదరుడగు కుబ్జవిష్ణువర్ధనుడును, తమ పూర్వ రాజ్యము పంచుకొని పశ్చిమచాళుక్యులు, తూర్పుచాళుక్యులనంబరగుచు రెండుగం జీలిరి. అందెట్లో కుబ్జవిష్ణువర్ధనుని సైన్యాధిపతుల మూలమున (అది వఱకు స్వదేశ భూపతుల పాలనమందుండిన) వేంగి దేశమాయన వశమాయెననియు, ఇది క్రీస్తు వెనుక ఐదవ శతాబ్దాంతమో లేక ఆరవ శతాబ్ద ప్రారంభ కాలమో అని పరిశీలనమున నిజమునకే నిర్ధారణమై యున్నది. వీరు పూర్వ చాళుక్య నృపతుల వంశము వారు.

ఈకుబ్జవిష్ణువర్ధనుడు వేగిదేశమునందు కాపురముండినటులం గాని, ఈయనకుం బిదప రాజ్యమునకు వచ్చిన రాజ రాజ నరేంద్రుడు లేక రాజమహేంద్రుడను పేరు గల కుమారుడు వున్నట్లు గాని యెక్కడను తెలియబడుట లేదు. ఉండునేమో యని ఊహించినను, కాలమనుకూలించుట లేదు. కాని ముందునకుం జనుట సమంజసము. చరిత్రలవలన పిదప తెలియంగబడిన తర్వాతి నృపాలుడు చాళుక్య భీమనృపతి. ఈతడు ఇప్పటి చామర్లకోట రైల్వేస్టేషను కెదుటనున్న భీమవరము తనరాజధానిగ నిర్మించి తన కుటుంబ నివాసమునకు శ్యామలా దుర్గము నిర్మించిన వాడు. అదియే ఇప్పుడు చామర్లకోటయై యున్నది. (చాళుక్య భీమవరము చూడుడు). ఆయనకుం బిదప విజయాదిత్యుడు తూర్పున సింహాచలము దనుక తన రాజ్యమును వ్యాపింపజేయ దొడంగెను. ఈతనికిం బిదప నీతని సుతుండగు అమ్మరాజు విష్ణువర్ధనుండను భూపతి రాజ్యమునకువచ్చి రాజమహేంద్రవరము తన రాజధానిగ నిర్మించెనని తేలినది. ఆయనకుం బిదప నాయన జ్యేష్ఠ సుతుండు బేతరాజ విజయాదిత్యుండును, పిదప దాయాదియగు తాళరాజును, పిదప విక్రమాదిత్యుడును, భీమరాజు (బేతరాజు తమ్ముడు) ను, పిదప యుద్ధమల్లుడు (తాళరాజు కుమారుడు) ను రాజ్యమేలిరి. ఈ యుద్ధమల్లుడు క్రీ. వె. ౯౨౭ - ౯౩౪ రాజ్యమేలినవాడు.

పిమ్మట రెండవ చాళుక్యభీముఁడను నృపతి (అమ్మరాజు విష్ణువర్ధనుని సవతితమ్ముఁడు) రాజ్యమునకు వచ్చెను. ఈయన శత్రునిర్మూలన మొనర్చి ప్రజారంజకముగను, నిష్కంటకముగను రాజ్యమేలి పేరుప్రతిష్ఠలం గాంచినవాఁడు. ఈయనకే చాళుక్య భీమ విష్ణువర్ధనుఁడను బిరుదనామముండెను. ఈయన సుతుఁడగు అమ్మరాజునకు విజయాదిత్యుఁడనియు, రాజమహేంద్రుఁడనియు బిరుదనామము లుండెను.

సుతుఁడగు అమ్మరాజ విజయాదిత్యుని (రాజమహేంద్రుని) పట్టాభిషేకము క్రీ. శ. ౯౪౫ డిశంబరు ౫ వ తేదియనియు, ఇతఁడు గొప్ప రాజనీతిజ్ఞుఁడనియు నిదర్శనములు పెక్కులుండెను గాన, రెండవ చాళుక్యభీమ విష్ణువర్ధనుని కడదినములా దీకన్యకాపరమేశ్వరి యగ్నిగుండ ప్రవేశము జరగియుండనోపు ఆదేవికప్పటికి పదమూఁడు వత్సరముల వయస్సుండునని యనుకొనినచో క్రీ. శ. ౯౩౩వ సంవత్సర ప్రాంతమున జననమై యుండును. ఇదియెనిజమగునేని క్రీ. శ. ౯౩౨ నందనయో, లేక ౯౩౩ విజయయో జన్మసంవత్సరమై యుండును. ఇంక వైశాఖ శుద్ధ దశమీ నాఁటికి ఏప్రిల్ నెల కడదినములు గానోపు. (వేఁగిదేశము చూడుఁడు). ఇంకపిదపఁగూడ పరిశీలింతముగాక. ఈఅమ్మరాజ విజయాదిత్య రాజమహేంద్రుని పాలనము క్రీ శ ౯౭౦ వఱకునని తెలుచున్నది. ఈతనికింబిదప నీతని సవతితమ్ముఁడును, పిదప కీర్తివర్మయు రాజ్య మేలిరి. కీర్తివర్మ ౯౯౯ మొదలు ౧౦౧౧ వఱకు పాలించెను. పిదప విజయాదిత్యుఁడు ౧౦౨౨ వఱకుఁ బాలించెను. ఈతనిపుత్రుఁడే విష్ణువర్ధనుఁడని నన్నయభారతమున చెప్పఁబడిన రాజరాజ నరేంద్రుఁడు. ఈతఁడే ఆంధ్రభారత కృతిపతి. ఈతనికింబిదప నీతని సుతుం డీరాజ్యమేలుచు నిటనుండనేలేదు. మాతామహుఁడు నిటుబెరుగుచు దక్షిణదేశమున చోడచక్రవర్తి యుంటనే యుండెను. ఆయనపేరు రాజేంద్రచోడుఁడు. ఆయనపేరే రాజరాజనరేంద్రుని సుతున కిడిరి. రాజరాజనరేంద్రునకుం బిదప విజయాదిత్యుఁడును రాజ్యమునకు వచ్చెనుగాని సుతుఁడగు రాజేంద్ర చోడుఁ డీదేశమున నుండి యేలలేదు. పిదప నీరాజ్యము చోడుల హస్తగతమాయెను. ఇట్టి స్థితియుండఁగ వేఁగీశ విష్ణువర్ధనుఁడును, ఆతని సుతుఁడును (రాజమహేంద్రుఁడో లేక రాజనరేంద్రుఁడో) కుమారుఁడగుఁగాక యనను ఇఁకను పరిశీలనలు జరుగఁదగును.

**కన్యకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి (వైశ్యగోత్రములు చూడుఁడు) కన్యకులగోత్రము- ఏకార్షేయ గోత్రము. పౌరాణిక సంస్కృతగోత్రము ఉత్కృష్టస, ఉత్కృష్టగణము. ప్రథమదికర్షి, ఆపస్తంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథ మాధ్యప్రవరఖండ, సమానగోత్రములు ఉత్కృష్టస, ప్రమదస, భైరవేశుఁడు దేవత, భార్గవ రామహస్త్యంబ, కూర్మాచలము తపస్థానము, హస్తి సరస్సు తటాకము, జపము కోటి, దీపములు ౫౦, క్షేత్రసంఖ్య ౫౦, గజదానము, నేఁడి పప్పు వర్జనీయము

**కన్యాకుబ్జదేశము** — కుశనాభుఁడను ఋషియొక్క నూర్వురుపుత్రికలు వాయు శాపముచే కుబ్జలుకాఁగా నాతఁడు బ్రహ్మదత్తుఁడను ఋషి నాశ్రయించి యాతనికిచ్చి వారింబరిణయ మొనర్చెననియు, నాతఁడు తపంబొనర్చి యా తపోమహిమచే వారికుబ్జత్వమువాపి వారింగూడి సంతానమును గనెననియు, వారిచే నివసింపఁబడిన దేశము కన్యాకుబ్జదేశమనం బరఁగసాగెననియు చెప్పఁబడినది. రాజధానిగనుండిన తొల్లింటి కన్యాకుబ్జపురము నిప్పుడు కనూజనఁ బొల్చు

యున్నారు ఎట్లన నిది కనూజపురము ప్రాంతదేశమని చెప్పవలయును ఈపురమునకు మహోదయమను పేరు ప్రసిద్ధిగ గలదు విశ్వామిత్రమహర్షి తండ్రియగు గాధిరాజు పాలనమున గాధిపురమనియు వానికి గల్గెను ఒకప్పుడు కుశస్థలియనియు వాడుకయుండెను కాళీనది పశ్చిమతీరము ఈనది ఇటకారు మైళ్ళ దూరమున గంగానదిం జేరుకొనును రామాయణము బాలకాండమున నిది గాధిరాజునకు రాజధానియనియు, విశ్వామిత్రుని జన్మస్థానమనియుం జెప్పంబడినది. పద్మపురాణమున శ్రీసృ 37 అధ్యా- ఉత్తర 73 అధ్యాయములందు ఇచట ప్రసిద్ధవామన దేవస్థానమున్నదని చెప్పంబడినది.

నాలిభాస్కరమను గ్రంథమున శ్లో॥ శృంగి నస్థలమారభ్య దాల్భ్యస్యాశ్రమ మాంతతః। కోసలా ద్దక్షిణోద్దే॥ కాన్యకుబ్జ ప్రశస్యతే అని చెప్పంబడినది. దక్షిణమున శృంగిబేరపురము (ఇప్పటి రామచ్ఛిలహరజానకుపశ్చిమోత్తరదిశ) ఉత్తరమున దాల్భ్యగ్రామము, (ఇప్పటి దాలామే రాయబెర్లిజిల్లా U P) ఇది కోసలకు దక్షిణదేశమని చెప్పంబడినది

హ్యూయనత్సాంగు, కన్యాకుబ్జదేశము దక్షిణమున ప్రయాగ, ఎటావాల నుండి ఉత్తరమున గోగ్రానదీ తీరమున కేయురాబాదు తాండోల వఱకు నని సూచించెను. దీనికే కన్నింగ్హామ్ దొరగారు వివరించి యున్నాడు పృథ్వీరాజ వైరియగు జయచంద్రుడు పాలించిన దీకన్యాకుబ్జదేశమే. మఱియు కుశుని సుతులలో నొకడగు కుశనాభుడు కుశావతి యనుపేరున (తనపేరుగ) రాజధానిగ పురమును నిర్మించుకొనెననియు, అది పిదప కన్యాకుబ్జమనంబడి నేటికి కనూడ్ అయెననియు దెలియుచున్నది.

కన్యాకుబ్జ పురమున నైఋతి దిశగా నిప్పటి లాలామిశ్రి టోలా యనంబడు తావున మూడు గొప్ప బౌద్ధ విహారము లుండెడివనియు, అందొకదానియందు ఇప్పుడు సింహాళమున కేండీయందలి దేవస్థానమున భద్రపర్చంబడిన బుద్ధభగవానుని నోటిపళ్ళొకటి కొంతకాలముంచి భద్రపర్చంబడిన దనియు చెప్పంబడినది. మఱియు నిచట పురాతన హిందూరాజులనాటి కోటయు, అందుండిన రంగమహాల్ భవనమును, (నైఋతి మూలను) అజపాలుడను నృపతి కట్టెననియు, అతడు క్రీ. వె. ౧౦౨౧ సంవత్సరమున నిహతుడయ్యెననియు తెలుచున్నది. కోట యానవాళ్లు త్రికోణాకారముగ నున్నటుల నేటికిని చిహ్నములు కలవు ఈకోట యందలి మహాలు నుండియె సంయుక్తా దేవిని పృథ్వీరాజు కొనిపోయెనని అచటి వారనెదరు. కొన్ని పర్యాయములు కనూజనేలిన కొందఱు భూపతు లితర పురములకు రాజధానిని మార్చి కనూజను వదలుచుండిరి

ఫాహియాన్ క్రీ. వె ఐదవ శతాబ్ది ప్రారంభమునను, హ్యూయనత్సాంగు క్రీ. వె ౬౩౬ సంవత్సరమునను కన్యాకుబ్జ పురము దర్శించినటుల వ్రాసియున్నారు మఱియు హ్యూయనత్సాంగు దర్శించినతఱి (అనగా క్రీ. వె. ౬౩౬) రెండవ శిలాదిత్యుడను హర్షవర్ధనుడు పరిపాలించుచుండెనని వ్రాసియున్నాడు. మాక్సుముల్లరు పండితుడు హర్షవర్ధనుని పాలన కాలము క్రీ. వె. ౬౧౦ మొదలు ౬౫౦ వఱకని లెక్కించెను గాన, నీకాలము మహమ్మదు జగద్గురుని సమకాలము. హిజరాశకము అనగా మక్కానుండి మదీనాకు మహమ్మదు వెడలుట క్రీ. వె. ౬౨౨ అని లెక్కింపంబడి యున్నది. కాన వీరిద్దరు సమకాలికులే యగుదురు. హర్షవర్ధనుని కాలముననే అతని యాస్థానమున కాదంబరిని, హర్షచరితమును రచించిన బాణభట్టును, నాగానందమును రచించినటుల తెలిన ధావకుడును, ఆస్థాన

విద్వాంసులుగ నుండెడివారు. మఱియు సంతకు పూర్వము మౌఖరివంశ నృపతు లీదేశమును పాలించు చుండిరనియు, హర్షవర్ధనుఁడు వారిని జయించి రాజధానిని స్థానేశ్వరము నుండి కనూజకు మార్చెననియు పరిశోధనల వలన తేలుచున్నది.

యశోవర్మ నృపతిపాలనకాలమున భవభూతి యను పండితుఁడిట నాస్థానమున నుండె ననియు, లలితాదిత్యుఁడను కాశ్మీర రాజు కన్యాకుబ్జమును జయించి తిరుగ కాశ్మీరమునకు మరలు తరి యాతనితో నాపండితుఁడును కాశ్మీరమున కేగినట్లుల రాజతరంగిణి యందు చెప్పఁబడినది

కనూజ భూపతి జయచంద్రుఁడు పృథ్వీరాజునకు వైరి. ఈతని కాలమున జయచంద్రపుర మని పేరుండెననియు, ఈతని యాస్థాన పండితుఁడు శ్రీహర్షుఁడు నైషధమును రచించెననియు, తెలిసెడిని. జయచంద్రుని పూర్వులం గూర్చిన విషయములు తామ్రశాసనములు కలవని Journal of Asiatic Society of Bengal 1841, P. 98 యందు కలదు. జయచంద్రుఁడు క్రీ. శ. ౧౧౯౩ సంవత్సరమున మహమ్మద్‌ఘోరీతో కలహమున మడిసెను. పిదప రాజధానిపేరు ఫిరోజాబాదుగ మార్చబడె ననియు నందురు. ఇది కనోజపురమో లేక వేరొక రాజధానియో పరిశీలింప వలయును. బౌద్ధులకాలమున కనూజపురమే రాజధానిగ నుండెను. పదియవ శతాబ్దమున నిది పాంచాల దక్షిణభాగమునకు రాజధానిగ రాజశేఖరుని కర్పూరమంజరి తృతీయాంకమున చెప్పఁబడినది.

**కన్యాకుబ్జ (కాన్యకుబ్జ లేక ఖాన్యకుబ్జ) బ్రాహ్మణులు** — పంచగౌడశాఖలలో నొకశాఖవారు. (బ్రాహ్మణులు చూడుఁడు). కన్యాకుబ్జదేశపు బ్రాహ్మణులు కన్యాకుబ్జు లనఁబడిరి. (కన్యాకుబ్జదేశము చూడుఁడు) కన్యాకుబ్జదేశపుబ్రాహ్మణులును క్షత్రియ వీరులవలెనే రణవిశారదులని కొన్నింటికాలమునం జెప్పఁబడినది. జాతిభాస్కరమను గ్రంథమున శ్లో॥ కస్యపశ్చ, భరద్వాజః, శాండిల, స్సాంకృతి స్తథా । కాత్యాయ, నోపమాన్యాచ, కాశ్యపశ్చ, ధనుంజయః । కవిస్తో, గౌతమో, గర్గో, భరద్వాజ స్తథైవచ । కౌశికశ్చ, వశిష్ఠశ్చ, వత్సః పారాశర స్తథా । ఇత్యేతే కాన్యకుబ్జానాం, గోత్రాణ్యాహుశ్చషోడశ। అని చెప్పఁబడియుంట కన్యాకుబ్జులు- ౧. కశ్యప, ౨. భరద్వాజ, ౩. శాండిల్య, ౪. సాంకృతి, ౫. కాత్యాయన, ౬. ఉపమన్యు, ౭. కాశ్యప, ౮. ధనంజయ, ౯. కవి, ౧౦. గౌతమ, ౧౧. గర్గ, ౧౨. భరద్వాజ, ౧౩. కౌశిక, ౧౪. వశిష్ఠ, ౧౫. వత్స, ౧౬. పారాశర యనునట్టి పదునారుగోత్రముల వారని తెలిసెడిని

కన్యాకుబ్జులు రణవిశారదులని పేరందియుండిరట. ఇక్కాలమున వర్తకనైపుణ్యము గలవారని పేరందియున్నారు. బికనీరురాజ్యము, మార్వాడ్, మేవాడ్ మొదలగు రాజపుత్రస్థానపుసీమలలో నున్న కన్యాకుబ్జులు జసమ్మాక్ శాఖవారనియు, పల్లీవలశాఖవారనియు నిరుతెగలుగ నున్నారు. వీరు మాంసాహారులని తెలియుచున్నది. వీరు ధనవంతులును, వర్తకులు నట. వీరినుండి విడిపోయిన నందవనపల్లీవలులను వేఱొకశాఖవారు అశ్వములపై సవారిజేయు ఖ్యాతులై పేరందిరట. వారు శుభకార్యములందు నేటికిని గుఱ్ఱపుకళ్ళెములం బూజింతురు. వీరిక్కాలమున వర్తకులై యున్నారు

ఇటీవల కొందఱు కన్యాకుబ్జు లస్సాందేశమునకు వలసపోయి, యచట మంగోలుజాతివారితో సంబంధబాంధవ్యము లొనర్ప నారంభించిరనియు

తెలిసెడిని కొందఱు కన్యాకుబ్జులు చాంబల్ నర్మదానదులమధ్య మధ్యప్రదేశములందుఁ గాన నగుచున్నారు. వీరు రాజకీయములందు పేర్వడసినవారు. వైదికాచారపరాయణులు.

అయోధ్యాప్రాంతవాసులగు కన్యాకుబ్జులు సరయూపారీ, లేక సరయూపారీణబ్రాహ్మణులనఁ బడుచున్నారు. మఱియు వీరిలోనే కొందఱు సనాఢ్యబ్రాహ్మణు లనఁబడుచున్నారు. వీ రొక తెగవాండ్రేయై వేర్వేరుచు పరస్పరసంబంధబాంధవ్యము లేర్పఱుచుకొనరు. బృందావనసనాఢ్యు లెక్కువగా గలరు. గను వర్తకులే బాగా శమున నున్నవారు కన్యాకుబ్జశాఖవారము అని చెప్పుకొందురు. కన్యాకుబ్జులలో శాక్తేయులు, శైవులు, వైష్ణవులు అనఁబడు మూఁడు మతముల వారు గానఁబడుదురు.

కన్యాకుబ్జులలో పదమూఁడు అంతశ్శాఖల వారు గలరు.

౧ మిశ్రబ్రాహ్మణశాఖ- మిశ్రయన శ్రేష్ఠ వాచకమఁట. ఇది వీరి బిరుదనామము. ఋగ్వేదులును, శుక్లయజుర్వేదులును వీరియందు గలరు. గౌతమ సూత్రము వీరికి ప్రధానగ్రంథము. కణ్వశాఖ.

౨ శుక్లబ్రాహ్మణశాఖ శుక్లయజుర్వేదులు, మాధ్యందినశాఖ కాత్యాయనసూత్రము ప్రమాణ గ్రంథము.

౩. శివా బ్రాహ్మణశాఖ- సామవేదులు, కౌథుమ శాఖ ప్రమాణగ్రంథము గోభిల సూత్రము.

౪. దూబే (దువే)- శుక్లయజుర్వేదులు సామ వేదులునుకూడ నైయుంట ద్వివేదు లనఁబడు చున్నారు. ద్వివేదమనఁగా ద్వివేదసంబంధ మనట. మాధ్యందినశాఖ. వీరి ప్రమాణగ్రంథము గోభిల సూత్రము.

౫. పాఠకబ్రాహ్మణ శాఖ- యజుర్వేదులు; సేద్యము వీరి కాదివృత్తియఁట. ఉపాధ్యాయ వృత్తివలన గౌరవనామముగ పాఠక యని పే రందినవారని చెప్పుదురు. (వేదవిద్య.)

౬. ఉపాధ్యాయబ్రాహ్మణశాఖ- యజుర్వేదులు. సేద్యము వీరి కాదివృత్తియఁట. ఉపాధ్యాయవృత్తివలన గౌరవనామముగఉపాధ్యాయ అని పేరందినవారని చెప్పుకొందురు. బడిపంతులుగ నుండిరట.

౭. చౌబే (చౌవే)- వీరు ఋగ్యజుస్సామాథర్వణవేదములు నాల్గింటికిఁ జెందియుంట చతుర్వేదులని పేరొందిరనియు, ఐనను వీరిలో కొందఱకు యజుర్వేదమును, కొందఱికి సామవేదమును ప్రధానవేదములనియు తెలిసెడిని.

౮ దీక్షితబ్రాహ్మణ శాఖ- శుక్ల, కృష్ణ యజుర్వేదములు ఇరు తెగలుగ జెందినవారు వీరికి శ్రౌతము అధ్వాకర్మ ప్రధానమైయుంట దీక్షిత యనునది సాముదాయకనామమయ్యెనందురు.

౯. వాజపేయబ్రాహ్మణశాఖ- వీరిని లఖనే వాజపేయ యనియు నందురు. ఇది సుప్రసిద్ధుండగు లక్ష్మణవాజపేయ సంబంధమును సూచించుచున్నది. వాజపేయక్రతువు నుండి పేరందినవారు.

౧౦. పాండే-శాక్యవృత్తివలన పండితశబ్దము నుండి ఈపేరుగల్గెను. ఆంధ్రదేశమున పంతులు అను పేరును ఇట్టిదే.

౧౧. సరవరియా- దీనిని సరయూపారీ అనియు ననుట గలదు. సరయూనదీతీరవాసము వీరి కీ పేరుఁ గల్గించెను.

౧౨. కనిష్ఠబ్రాహ్మణశాఖ- వీరిం గూర్చి సరిగా తెలియరాకున్నది.

౧౩. విశిష్ఠబ్రాహ్మణశాఖ- వీరిం గూర్చి సరిగా తెలియరాకున్నది.

**కన్యాతీర్థము** — కురుక్షేత్రమున నొకటియు, కావేరీనదియందొకటియు కన్యాతీర్థము లున్నవని చెప్పఁబడినవి. తిరువాన్కూరు రాజ్యమున దక్షిణదిశను సముద్రమున (బంగాళా ఖాతము అరేబియా సముద్రము) పూర్వపశ్చిమ సముద్రములు కలియుతావున కన్యాకుమారి అగ్రముకడ కన్యాకుమారీ తీర్థముకలదు ఇట కన్యాకుమారీదేవి దేవస్థానముచుకలదు. దీనినిం గూర్చినప్రశంస మహాభారతము వనపర్వము నందు కలదు.

**కన్యారాశి(అధిపతి బుధుఁడు)** — ఇది ఉత్తరానక్షత్రము నందలి ౨, ౩, ౪, పాదములును, హస్తానక్షత్రమునందలి ౧, ౨, ౩, ౪, పాదములును, చిత్తానక్షత్రమునందలి ౧, ౨, పాదములును కలసినైన ౯ పాదములరాశి. ప్రమాణము ఘడి ౫-౧౫, లేక గంట ౨-౬. కన్య సౌమ్యరాశి, ద్విస్వభావము, వైశ్యజాతి, స్త్రీలక్షణరాశి, చిత్రవర్ణము, పాదజలరాశి, దక్షిణదిగ్రాశి, శీర్షోదయరాశి. పగలుబలమధికము, కటిస్థలము బలావయవము. కన్యారాశి, బుధునకు స్వక్షేత్రము. మూలస్థానము బుధునకు ఉచ్చ, నీచ శుక్రునకు, మిత్రక్షేత్రము చంద్ర, శుక్ర, శనులకు, శత్రుక్షేత్రము కుజ గురులకు, సమక్షేత్రము, రవికి, కన్యాలగ్నమునకు రవి ద్వాదశస్థానమునకును, చంద్రుఁడు ఏకాదశ స్థానమునకును, కుజుఁడు తృతీయ, అష్టమ స్థానములకును, బుధుఁడు లగ్న దశమ స్థానములకును, గురుఁడు చతుర్థ, సప్తమ స్థానములకును, శుక్రుఁడు ద్వితీయ, నవమ స్థానములకును, శని పంచమ షష్టమ స్థానములకును అధిపతులగుదురు.

**కన్‌స్ట్రక్టివ్ ట్రస్టు** (Constructive Trust) — ఒకట్రస్టును ఏర్పర్చు ఉద్దేశమాది నెవ్వరికిని లేకున్నను పద్ధతి సమలుజరుపుట వలన నేర్పడిన ఒకట్రస్టు. ఇది ఈక్విటీధర్మము మీఁద కేర్పడుచున్నది. ఒకనికి, ఇంకొకరిద్రవ్యము వేఱుకారణములచేనంది ఆద్రవ్యముచు మొకటి యాతఁడు ఒకగృహముం గొనుటయు నుపయోగించెనేని ఆగృహము రెండవవాని దగుట సహజము అది రెండవవానికి స్వాధీన పర్చఁబడుదనుక మొదటివాఁడాగృహమునకు ట్రస్టీయగును. అట్టిట్రస్టునకు కన్‌స్ట్రక్టివ్ ట్రస్టు అనిపేరు.

**కపరిశుద్ధము** — ఇది Vitriol అని కొందఱును, కాదని కొందఱును అనుచున్నారు పైనబూసిన విషదోషములనడంచి నేత్రరోగముల నివారించునని యు దీనిని శాస్త్రోక్తముగ భస్మమొనర్చి లోనికిచ్చిన పైదోషములే గాక కుష్ఠురోగముగూడ నివర్తించునని యు, వ్రణములు మాన్చునని యు, సరిగా శుద్ధిగానిచో వమనము, దాహము మొదలగు కొన్నివికారములు కల్గునని యు, దీనికి విరుగుడు వడిసెలాకు, నిమ్మపండ్ల రసమునని యు చెప్పఁబడినది

**కపాలమోచనతీర్థము** — ఒక ఋషికిఁగల్గిన శాపమునుండి కాలికంటుకొనిన యొకకపాలమింట జలకుండముల స్నానమొనర్చు కతనవదలిపోవుటం జేసి ఈపేరందెం తావు. యాత్రాస్థలము, పంజాబుదేశమున అంబల్లాజిల్లాలోని జగద్ధితవాళ్ళిలు జగద్ధీపురమునుండి తొమ్మిది మైళ్ల దూరమున నీక్షేత్రముకలదు ఇట కొన్ని స్నానతీర్థకుండములు దేవస్థానములు కలవు.

తొల్లి శ్రీరామునిచే వధింపబడిన మహోదరుడను పేరుగల యసురుని కపాలము (పుఱ్ఱె) ఒక తపస్వి కాలికిం బ్రమాదవశమున దగుల్కొని ఊడిరాక బాధింప నతఁడు వేదన నందుచుండ, తొల్లింట నొకప్పుడు శుక్రుఁడు తపమొనరించి యీపవిత్ర క్షేత్రమున తీర్థమున మున్కలిడ నా

కపాలము వదలిపోవునట్లు చేసి నాటనుండి కపాలమోచన తీర్థమని అనరసన్నుచుకుచు, యీతాపున కును పేరయ్యెనని చెప్పఁబడినది.

మఱియు కాశీయందొక కపాలమోచనతీర్థము కలదు. దీని ప్రశంస శివపురాణము ౧-౫౯ యందు కానఁగును. వేరొక కపాలమోచనము మాయాపురి (హరిద్వారము) యందు గానఁగును దీని ప్రశంస పద్మపురాణము ఉత్తర. ౫౧ యందు గానవచ్చెడిని, మహాభారతము శల్యపర్వము ౪౦ యందు కురుక్షేత్రమున సరస్వతీ నదియందు ఔశనస తీర్థమనియుం బేరుగల కపాలమోచన తీర్థముగూర్చి ప్రశంసింపఁబడినది ఇవికాను గుజరాతునందలి సబర్మతీ నదియు కొకటియు, బంగాళమునందలి తామ్రలిప్త పురమునందొకటియు కపాలమోచన తీర్థములు గానఁగుచున్నవి

**కపాలి గోత్రము** - ఉమదగ్నివత్స ఉపగణము చూడుఁడు

**కపి ఉపగణము** — ఇది ఆంగీరస సంతతి. ౨ భారద్వాజగణమున కపి ఉపగణము (౪౮ గోత్రములు). కాత్యాయన సూత్రోక్త గోత్రములు (౧౫) ౧. అథ్వాసు, ౨ అమావాస్యాయన, 3. కరోరు, ౪ కపిస్థని, ౫ కలశి, ౬. కాత్యాయన, ౭. చైతకి, ౮ త్రైపరంతి, ౯. దండి, ౧౦. పతంజలి, ౧౧. భూయామశి, ౧౨ రాజకేశి, ౧3. విను, ౧౪. శక్తి, ౧౫. స్వస్తరి.

బోధాయన సూత్రోక్త గోత్రములు (౯) ౧. ఐతిశాయన, ౨. కరకేశుమ, 3 కౌసఖి, ౪ కాండిన, ౫. పౌష్పి, ౬. భోజను, ౭ మైమీతకి, ౮. వైతల, ౯ సాగర

హిరణ్యకేశి సూత్రోక్త గోత్రములు (౬). ౧. జలంధు, ౨. తరస్వాన్, 3. తిల, ౪. ద్వ్యాద్వాక్షి, ౫. విను, ౬ శాలు.

మాత్స్యసూత్రోక్త గోత్రములు (౧౨). ౧. ఊర్క్యసు, ౨. కపైతర, 3. కాయ, ౪. తుపేయు, ౫. కుశీద, ౬. గాధి, ౭. జలసింధకి, ౮. ధాన్యాయని, ౯. సావస్యాయని, ౧౦. సాసవిసల్లి, ౧౧. స్వైదతర, ౧౨ సౌజరి.

ఇతర గ్రంథోక్త గోత్రములు (౫). ౧ ఆత్వరి, ౨. ఆత్వగ, 3. ఆత్మభవ, ౪ భరద్వాజ, ౫. మాత్రవర.

ఈ కపి ఉపగణగోత్రములకు ప్రవరరూపములు— ౧. ఆంగీరస, అమహీయువ, ఔరుక్షయ. ౨ ఆంగీరస, బార్హస్పత్య, భరద్వాజ. 3. ఆంగీరస, బార్హస్పత్య, భరద్వాజ, మాత్రవర, ఆత్మభవ ౪. గార్గ్య, రౌక్షాయణ. ౫ ఆంగీరస, శైన్య, గార్గ్య. ౬. ఆంగీరస, త్రైత్రి, ఆపిభువ ౭ ఆంగీరస, వందన, మాతవచస. ౮ ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ. ౯ ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ, శైన్య, గర్గ (లేక గార్గ్య). ౧౦. ఆంగీరస, గారుపిత, శజ్యృత్య ౧౧ శక్త్య, గారువిత, శజ్యృత్య ౧౨ ఆంగీరస, గార్గ్య, శైన్య ౧3. భరద్వాజ, గార్గ్య, శైన్య

**కపికేశ గోత్రము**— ఉపమన్యుగణము చూడుఁడు.

**కపి గోత్రము** — గర్గ ఉపగణము చూడుఁడు

**కపి గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**కపింజల గోత్రము** — ఉపమన్యుగణము చూడుఁడు.

**కపిద్థహస్తము** — హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.

**కపింజలన్యాయము** — వసంతాయ కపింజలానాలభేత యనుటకి అనగా, వసంతుని

కొంఱకు కపింజల పక్షులు లభించుననట. వసంత ఋతువు సమీపించుతరి కపింజలపక్షులం దఱచు చూడఁగల్గుదుమని భావము.

**కపిముఖ గోత్రము** — పరాశర గణము చూడుఁడు,

**కపిల గోత్రము** — కౌత్సాయన ఉప గణము చూడుఁడు

**కపిల దేశము** — ఈపేరుగల రాజ్య మొకప్పుడుండినదిగ తెలియుచున్నది దీనిగూర్చి పూర్తి వివరములు ఏవియుం దెలియరాకున్నవి

**కపిశదేశము**— వ్యాకరణ సూత్రకారుఁడగు పాణిన్యాచార్యుఁడు దీనిని కాపిశీదేశ మని వ్రాసెను. డాక్టరు. సర్. భాండార్కరు పండితుఁడు ఉత్తరఆఫ్ఘన్ దేశమని పోల్చెను. హిందూకుష్పర్వత ప్రాంతమున కుభానది (ఇప్పటి కాబూల్నది) కుత్తరమున గల ఆఫ్ఘనుస్థాన ప్రాంతదేశభాగమని పోల్పఁబడినది. కపిశా పట్టణము ప్రధాననగరమై యుండెను. అది యొకప్పుఁడు గాంధారమునకుఁగూడ రాజధానియై యుండెనట.

**కపిలధార** - కపిలయోగి ఆశ్రమము కలదఁట ఇది విష్ణుదేవుని ఏక వింశద్యవతారములలో నొకటిగ జెప్పఁబడిన కపిలుని యాశ్రమముగ జెప్పఁబడినది. (అమరకంటకము చూడుఁడు. ఉపప్లవ్య దేశము చూడుఁడు).

**కపిల మహర్షి** - ఈయన విష్ణుదేవుని ఏక వింశద్యవతారములలో నొకటిగ వర్ణించియున్నారు. సేశ్వర సాంఖ్యయోగ గ్రంథకర్త; కర్దమప్రజాపతి కుమారుడు. తల్లిపేరు దేవహూతి. కపిలుడు శ్యామరశ్మి యను పేరుగల మునితో వేదము ప్రమాణమని వాదించి యోడించి యొప్పించినవాఁడు. ఈయన ఆశ్రమము ఇప్పుడు గంగాసాగర సంగమముకడ సగరద్వీపమునఁగల కపిలాశ్రమమని చెప్పఁబడినది.

సగరచక్రవర్తి పుత్రులు యజ్ఞాశ్వమును వెదకుచు నీ కపిల మహర్షియె దానిని హరించినవాడని అపోహపడి ఆయనను బాధింప, యలిగి వారి నాయన తన కోపాగ్నిచే భస్మముగా నొనర్చెను. వారిసంతతివారి తపంబుల మాహాత్మ్యమున సగరుని ముమ్మనుమడు భగీరథుఁడు పరమేశ్వర ప్రసాదమునఁ గంగఁగొనివచ్చి ఈ మహామునియాశ్రమముగూడా నడిపించి తనపూర్వులు కాలిపోయియున్న బూడిదెదడిపి వారికి సద్గతిం గల్గించెనని చెప్పఁబడినది.

కపిలులు అనేకులు గలరు. అందొకఁడు నిరీశ్వరవాది గాన, కపిలులను జాగ్రతగా పరిశీలించి చూడవలసి యున్నది.

**కపిలయోగి ఆశ్రమము** - కపిలధార, అమరకంటకము ఉపప్లవ్య దేశము చూడుఁడు

**కపిలర్షి**- ఇతడు సాంఖ్యమతకర్త ఈతని సాంఖ్యమునకు నిరీశ్వర సాంఖ్యమని పేరు. ఇతని తండ్రిపేరు తెలియదు కొందఱు కర్దముఁడనుచున్నారు తల్లిపేరు దేవహూతి, ఈమె స్వాయంభువమను పుత్రికయని కొందఱనెదరు నివాసము పుష్కర క్షేత్రమనియు, విష్ణ్వంశా సంభూతుఁడనియు, గంగాసాగర సంగమముకడ యోగసిద్ధి నందినవాడనియు, కొందఱనెదరు. ఈతఁడు నిరీశ్వరవాది తత్వములను సంఖ్యచేసి తెల్పెనుగాన నీతని మతమునకు సాంఖ్యమతమని పేరయ్యెనట. సేశ్వరసాంఖ్య మీతని మతము కాదు.

**కపిలవస్తు(రాజ్య)దేశము** — రాజధానియగు కపిలవస్తుపుర పరిసరప్రాంత దేశము కపిలవస్తుదేశము. ఇది బుద్ధభగవానుని సంబంధ దేశముగాన బౌద్ధులకు పవిత్రభూమి.

కపిలవస్తు పురము గోర్లిపూరు, ఇప్పటి తిలౌరా, సాద్వా, రామ్‌ఘాట్, చిత్రాదేయి గ్రామములుండిన చోటున నుండెనిదిగ చెప్పబడి నది. ఇందు తిలౌరా నున్న చోటున కోటయు, రాజగృహములును ఉండెనంటారు. బాణగంగ యను నామాంతరము గల భాగీరథి నది పూర్వ తీరమున నున్నది.

లుంబినీవనం బనంబడిన చోటిప్పుడు రుమ్మిని దేయి యనంబడుచు కపిలవస్తునుండి చోటునకు పదిమైళ్ల దూరమున తూర్పుగను, భాగ భాన్పూరు నుండి రెండు మైళ్ల దూరమునను చెప్పంబడినది. అటుగల యశోక శాసన స్తంభ మున 'లుమ్మినిగామ' యని యుండు నిది నిస్సంశయాంశముగ తెలుపం బడినది. ఇటనే బుద్ధభగవానుని తల్లియగు మాయాదేవి యాల యము కలదు. గర్భవతియై యుండి కపిలవస్తు నుండి బయలుదేరి రోహిణీ నది కవ్వలనేయున్న కోలిపురమునకు పుట్టింటికి పురిటికి కేగుచో దారిలో నిట నొక సాళ్వ (గుగ్గిలము) వృక్షము క్రింద ప్రసవమై బుద్ధభగవానుని గనెనట. ఈ సాదృశ్యము: కోలిపురాధి నాధుడగు సుప్ర బుద్ధుడను నామాంతరము గల అంజనరాజు కుమార్తెలగు మాయాదేవియు, ప్రజాపతియను నామాంతరము గల్గిన గౌతమియు నిర్వురును బుద్ధభగవానుని తండ్రియగు శుద్ధోదనుని భార్య లని యెరుంగ వలయును.

బుద్ధభగవానుని మేనమామ పేరు దండపాణి యని యు, ఈతని సుతయు యశోధర యను ముద్దు పేరుగల గోపాదేవిని బుద్ధభగవానునకు బాల్య మున వివాహము చేసిరనియు నీమె గర్భముననే రాహులుండను (బుద్ధుని సుతుడు) జనించెననియు, చెప్పంబడినది. తిలౌరా నుండి నాల్గు మైళ్ల దూరమునం గల గుటివ యను గ్రామమును గోర్లింటి క్రకుచంద్రుని జన్మస్థాన మగు ఖేమ (క్షేమ) నగరముగం జెప్పి యున్నారు.

బుద్ధత్వ మందిన పిదప తండ్రియగు శుద్ధోద నుని ప్రార్థనమొకకు తండ్రిపంపిన ఉదాయితో బుద్ధభగవానుండు కపిలవస్తున కేగుతరి వసించిన న్యగ్రోధారామము, అందలివిహారము పెద్దదిబ్బగ గుటివనుండి తూర్పుగ నొక మైలు దూరమున లోరికుడను నక్షిణమునం గానవగును (తిలౌ నుండి అరమైలు దూరము).

ఈ న్యగ్రోధారామమే బుద్ధుని సుతుం డగు రాహులునకు సవతి తమ్ముండగు నందునకు బౌద్ధదీక్ష నిచ్చిన చోటందురు.

మఱియు శరకూప మను చోట పిప్రవ మను చోటకడ నున్నది. ఆగ్రామముననే బుద్ధ భగ వానుండు నిర్వాణపద మందినపిదప ఆయన యస్థులనుంచి (అస్థులయం దెనిమిదవభాగముంచి) శాక్యులందఱు నిర్మించిన స్తూపము కలదు. తులౌరాకోట స్థలమునుండి ఉత్తరమున రెండు మైళ్ల దూరమున గల సగర్వ యనంబడు స్థలము శాక్యులను విరుద్ధకుండనువాడు బలాత్కార వధ గావించిన చోటని జెప్పుదురు.

ఈ శాక్యులును, కోలియులును ప్రజా ప్రభుత్వ పద్ధతిని రాజు నెన్నుకొను వారట శుద్ధోదనుండును ఇట్లెన్నుకొన బడిన భూపతియె నట. ఇటులనే ఉజ్జయినులు, విశాలీదేశస్థులగు లిచ్ఛవులు, కుశినగరరాజ్య ప్రజలగు మల్లులు, పావాదేశపు ప్రజలు గూడ రాజు నెన్నుకొను నాచారముండెనట. వారి సభా భవనములకు శాంతాగారములని పేరని చెప్పంబడినది.

**కపిలవస్తు పురము** — కపిలవస్తు రాజ్యము చూడుడు.

**కపిలషష్ఠి** — భాద్రపద బహుళ షష్ఠి దినమున రోహిణీనక్షత్రము, వ్యతీపాతయోగము,

కుజవారము, ఆదివారము సంభవించిన దానికీ పేరుకలదు. అందు సూర్యపూజ, కపిలగోదానము లొసర్తురు. (అవమచాంద్రమష్టి, పండుగలు చూడుడు).

**కపిల (నది)** — సింధునదిలో కలియు నుపనదియొకటి కపిలానదికలదు. కశ్యపునిభార్యలలో నొకతెయగు దక్షప్రజాపతి కుమార్తెకుం గపిలాదేవియని పేరుకలదు. ఈమెసంతానము పశుగణము, మఱియు నీమెకు సురభియనియుం బేరుకలదు. ఇంకను పుండరీకమను దిగ్గజము యొక్క భార్యకు అనుపమాంగునకు కపిలయని పేరు అమరకంటకమను నర్మదానది జనించుచోటునం బడుజలధారం (జలపాతమును)కుం గపిలధారయని పేరు

**కపిలానది** — మైసూరురాజ్యమున నంజనగూడు నంజనగూడు క్షేత్రము ప్రక్కగా ప్రవహించు నదికి కపిలయని పేరు. దీనింగూర్చినప్రశంస మత్స్యపురాణము ౨౨ ౨౭ యందు గానవగుచున్నది ఇట నీలకంఠరుద్ర శివలింగము ప్రసిద్ధమైనది. దీనిని నంజుండేశ్వర శివలింగమని కన్నడ భాషయందు వాడుచున్నారు. నంజుండయన విషభక్షణ (చేసినట్టి) యని యర్థము. మఱియు నర్మదానది అమరకంటక పర్వతముపై జనించిన దాది రెండుమైళ్లదూరమున జలపాతమై కపిలధారగ పడుచున్నది ఆనదీభాగమును కపిలానది యనుచున్నారు. కపిలధారప్రశంస పద్మపురాణ సర్గ ౨౨ యందు కలదు. వేరొక కపిలధార ప్రవాహామునర్మదానదిలో అమరేశ్వరమనుచోట సంగమించెడిని. దీనిని కపిలాసంగమ మందురు.

**కపిలాశ్వుఁడు** — తండ్రి కువలయాశ్వుఁడు. కువలయాశ్వునకు దుంధుమారుఁడనియుం బేరుకలదు. కుమారుని పేరు దృఢాశ్వుఁడు.

**కపిలుఁడు** — ఋషి. తండ్రి కర్దమ ప్రజాపతి. తల్లి దేవహూతి సాంఖ్యయోగ ప్రవర్తకుఁడు. ఈతఁడు విష్ణుదేవుని యవతారముగ జెప్పఁబడినది. సగరచక్రవర్తి కొడుకులను భస్మముగ కొనర్చినవాఁడీ కపిలుఁడే (గంగానది చూడుఁడు). ఇంకను దనుపుత్రులలో నొకనికి కపిలుఁడని పేరు కలదు (అమరకంటకము చూడుఁడు).

**కపిశానది** — బంగాళములోని మేదినీపురము (ఇప్పటి మిడ్నపూర్) మండలము గూడా ప్రవహించునది దీని నిప్పుడు కసై నది యనుచున్నారు రఘువంశమున చతుర్థాధ్యాయమున ౩౮ శ్లోకమున కపిశానది ప్రశంసకలదు. దానినికొందఱు ఉత్కలములోని సువర్ణరేఖానదితో పోల్చిరి గాని, కపిశానది ఇప్పటి కసై నదియె యనుట నిస్సందేహము.

**కపిత్రోత గోత్రము**- పరాశరగణము చూడుము.

**కపిష్ఠల గోత్రము** - వశిష్ఠ గణము చూడుము.

**కపిష్ఠరి గోత్రము** - కపి ఉప గణము చూడుము.

**కపిష్ఠలి గోత్రము** - భరద్వాజ ఉప గణము చూడుము

**కపిష్ఠల తీర్థము** - పంజాబు దేశములోని కర్ణాల్మండలమున కర్ణాల్ నుండి ౧౮ మైళ్ల దూరమున ఇప్పుడు కైతాల్ అని పిలువఁబడుచున్న తావు. ఇదియొక సుప్రసిద్ధ సాగరతీరము నందున్నది. దీనియందు సోపానములు, తీరమున దేవళములు మొదలగు పవిత్రస్థల లక్షణము లన్నియుం గలవు. ఇది యుధిష్ఠిర ప్రతిష్ఠితమనియు, ఆంజనేయునితో సంబంధము కల

దనియు ననెదరు. పేరు కపిస్థల ముని యొక్క శాసనము కలదు.

**కపిస్థల పురము** - పాంచాలమునందు కర్నాల్ మండలమున కర్నాల్ పురమునుండి 30 మైళ్ల దూరమున నిప్పుడు కైతల్ అనబడు పురము.

దీనిని యుధిష్ఠిర మహారాజు నిర్మించెననియు, ఆంజనేయునితో సంబంధము గల దనియు, చెప్పబడును. ఇది పెమారము దీనిం జుట్టియు నిమము నున్న పెద్ద సరోవర తీరమునను న్నది. దీని ప్రశంస బృహత్సంహిత గల గిరి యందు కలదు.

ఇట నగ్నిని వర్షించుటచే గట్టబడిన కోట గలదు. నూరయు- గొంతకాలము సిక్కుల హస్తగతమై యుండెను. దక్షిణపంజాబు రైల్వేలైనుపై నున్నది.

**కప్పులు సాసర్లు** (Cups & Sausers)



ల్లంత తేయాకు కషాయము (Tea) త్రాగు కప్పులు (Cups) చిన్న మూకుడు (Basin) వలె నుండెడివట. దానికి క్రిందిపళ్లెము (Saucer) లేకుండెను. రాను రాను పోలు దోలంత త్రైంచి దేశమున టీ వాడుక ఎక్కువ యయ్యెనట. త్రాగునపుడు ఒలికి బట్టలపైబడ నొక గుడ్డను కప్పుక్రింద నుంచి త్రాగ మొదలిడిరట. ఆబట్టకు (Tea cloth) అను వస్త్రమిప్పు డున్నది వాడుచుండిరట. ఇప్పుడు కప (Cup) అను ఆంగ్లపదము ఫ్రాంసుభాషా పదమగు Coupe అను మాటనుండియె జనించెను.

కాలానుగతమున ఒకతెమ్మో స్త్రీలు లోతగు పళ్లెమును క్రిందనుంచు పళ్లెము లేక క్రిందనుంచు కోపి (Sou Coupe) అని వాడుచు నుపయోగింపఁ గొడఁగిరట. అది ఇప్పటి సాసర్ రూప మునకుమారి సాసర్ అనిపేరంది ఇంగ్లాండు నందు వెలసెనట. ఇటుల కప్ సాసర్ (Cup & Saucer) అనుపదములు ఫరాసు పదముల నుండియె జనించినవి.

**కపూర్తలా సంస్థానము** — పంజాబు దేశములోని బ్రిటీషురక్షితములగు ముప్పదినాల్గు సంస్థానములలో నొకటి. సిక్కు-సంస్థానము కపూర్తలాపురము రాజధాని.

**కపివేతర గోత్రము** — కపి ఉపగణము చూడుడు.

**కపోతలోముఁడు** — యదువంశ క్షత్రియుఁడు. తండ్రి విలోమతనయుఁడు.

**కపోతవేదిక** - శిల్పశాస్త్రమున దేవాలయ శిల్పమున విమాన నిర్మాణమునందు చెప్పఁబడిన సప్తవేదికలలో నొకటి. (విమానలక్షణము చూడుఁడు) పదునెనిమిది వేదికలనుధ్య చిలుకల బారును చిత్రించిన నది కపోతవేదిక యగునని చెప్పఁబడినది పురుషవిమానములందు కపోత వేదికకు దుర్గయును, స్త్రీవిమానములందు అష్ట వసువులును, మిశ్రవిమానములం దగ్నియు, నపుంసకవిమానములం దాకాశమును, అధిదేవత లనియు, అన్నివిమానము లందునను కపోత వేదికకు భరద్వాజుఁడు ఋషియనియుం జెప్పఁ బడినది

**కపోణీ గుడన్యాయము** - మోచేతి కంటిన బెల్లము నాకుటకందదని యర్థము. తనకు స్వాధీనముకానట్టి లాభకార్యమని తెల్పుట కీన్యాయమును వాడుచుందురు.

**కపోతహస్తము** — హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.

**కపాలభాతి (క్రియ)** — యోగాభ్యాసమున వాత, పైత్య, శ్లేష్మ దోషసంజనిత

రోగములు కలుగకుండ నిరోధ పరిహారముగను, ప్రాణాయామాభ్యాసము నడచుచుండుటకును పద్ధతులు చెప్పఁబడినవి. (యోగాభ్యాస క్రియాపద్ధతులు చూడుఁడు). అందు కపాలభాతి క్రియయొకటి. ఇది వ్యుత్క్రమము, వామక్రమము శీతక్రమము అని మూడు తెఱఁగులు. ౧. వ్యుత్క్రమ కపాలభాతి క్రియ- నాశికా రంధ్రములగుండా నీటిపీల్చి నోటిగుండా వెడలించుట, ౨. శీతక్రమ కపాలభాతిక్రియ- నోటిలోపీల్చిననీళ్లు ముక్కు రంధ్రముల గుండా బయటికి వెడలించుట. 3. వామక్రమ కపాలభాతి క్రియ- ఇది వాయుసాధనము ఎడమముక్కుగుండా గాలిపీల్చి కుడిముక్కుగుండా బయటికి వదలుటయు, కుడిముక్కుగుండా గాలిపీల్చి ఎడమ ముక్కుగుండా బయటికి వదలుటయు నభ్యసించుట వామక్రమ కపాలభాతి యనఁబడును. ఇవి ఆరోగ్యాభివృద్ధికరములని చెప్పఁబడినవి.

**కఫోల్బణ సన్నిపాతము** - సన్నిపాత రోగము చూడుము

**కబంధదేశము** — ఇప్పుడు సరీక్కుల్ అనఁబడు తావునఁగల దేశమని తలఁపఁబడుచున్నది రాజధాని తస్కుర్ఘాన్ అనఁబడుచున్నది ఇప్పుడు తగ్దుంబష్పామీరాక్‌లో నున్నతావు. దీనింగూర్చి సరిగా తెలియకున్నది.

**కబంధుఁడు** — బాణాసురుని మంత్రియగు కుంభాండుఁడనఁబడు వానికి కబంధుఁడనియుం బేరుకలదు. మఱియు దనువను గంధర్వుఁడొకఁడు స్థూలకేశర్షి వలనఁగల్గిన శాపమువలన రాక్షసత్వముకల్గి కబంధుఁడనుపేరున దండకారణ్యమున నుండెను. శ్రీరామలక్ష్మణులు సీతాదేవిం గోల్పోయి యామెను వెదకుచుండఁగా కబంధుఁడు వారింబట్టి మ్రింగఁబోవ వారతని చేతులందెగనరుక నతనికి శాపవిమోచనము కల్గి పూర్వరూపము కల్గెనని పురాణగాథ కలదు.

**కబళమనిననోరుతెరచి కళ్లెమనిన నోరుమూయడము** — ఆంధ్రలోకోక్తి.

**కబీరు** — ఈ మహాత్ముఁడు భక్తుఁడని మహమ్మదీయులు గూడ నీయనను సంభావించుచుండిరి. ఒకబ్రాహ్మణ వితంతువునకు జన్మించిన బాలుఁడనియు, ఒకమహమ్మదీయుఁడీతని పెంచెననియు వాడుకగలదు. చిన్ననాఁటనుండియు భక్తియుండు మనస్సుగల కబీరు రామానందగురుని నాశ్రయించి మంత్రోపదేశముచేయుమని కోరెనను, అతఁడు వెనుదీయుమంగెనట. రామానందులు బనారస్‌పట్టణ నివాసిగాన, కబీరు నేతనేయుచుండువాఁడు. ఎట్టకేలకు రామానందుల శిష్యుఁడై, మహాభక్తుఁడైన కబీరు అనేకగీతముల రచించి, పాడుచు భజన చేయుచుండెను. ఈతఁడు బట్టలునేయుట వృత్తిగాఁ గలవాఁడు. కబీరుకనేకమంది శిష్యులు చేరిరి. రానురాను కబీరుసాంప్రదాయ మొకమత ముగనయ్యెను. ఈమతస్థులందు కబీరుపంథువలెనె జాతిమతమనదిలేదు. అన్యోన్యప్రేమయు, అందఱు సోదరులవలె మెలఁగుటయు, భక్తులై భజనజేయుచుండుటయుఁ గాననగును. ఇది సిద్ధాంతమని స్పష్టముకాదు. మొత్తమున శ్రీరామునియందు భక్తిగల్గియుండుడు తెల్లనిజెండా కబీరుసాంప్రదాయ మతస్థులకుఁ జిహ్నము. ఈతనిపాటలందు కులాచారములు నిషేధించుచుండుట గానఁగును. విగ్రహారాధన మీమతస్థులందుఁ గానరాదు. మాగరుఅనఁబడు గ్రామమున నీతఁడు మరణించెను. అప్పుడీతఁడు కప్పుకొనియుండిన బట్టతొలగింప నందు పువ్వులరాసి యుండెనని వాడుకగలదు. అటుహిందువులు కబీరుమందిరమును, మహమ్మదీయులు కబీరుమసీదును నిర్మించుకొనియున్నారు. (కబీరుమతము, రామానందుఁడు చూడుఁడు).



**కబీరు మతము** - కబీరు రామానందుల శిష్యుఁడు ఈతఁడు కాశీపట్టణవాసిని యగు నొక బ్రాహ్మణ స్త్రీకి సుతుఁడనియు, కాలవశమున బాల్యముననె అరణ్యమున నొక తురక నేతపనివానివలన పెంచఁబడి బట్టలనేత వృత్తియె జీవనముగఁ గల్గి యుండెననియుఁ జెప్పుదురు కబీరను పేరును తురక పేరుగూడయున్నది.

కబీరు గొప్ప భక్తుఁడు. రామానందుల కడ రామనామమంత్ర ముపదేశ మొందినవాఁడు (రామానందస్వామి చూడుఁడు). కబీరు తన మతమును వేఱుగ శిష్యుల కుపదేశించినవాఁడు ఈతని మతమునం దాచారము, కర్మ, సిద్ధాంత ధర్మములు గానరావు. ఈతనికి భక్తియే ప్రధానము ఈతఁడు, ౧ మనుష్యులందు భేదములులేక సమానులనియు, అన్ని యెడలను భావించు చుండవలయుననియు, ౨ పరమేశ్వర సృష్టియందు భేదబుద్ధిలేక ప్రేమించుట మతధర్మములలో ముఖ్యమనియు, 3. పరమేశ్వరుని భక్తి విశ్వాసములతో ధ్యానింప వలయుననియు, భజనమొనర్ప వలయుననియు, మూఁడు ధర్మములను మత విధులను బోధించిన వాఁడు

కబీరు మతస్థులు బందగీ యనియు, లేక సత్ సాహేబు అనియు వందనములను జేసి కొందురు రామభజన మొనర్తురు. భజనకడ తెల్లజెండా వైచెదరు, లేక తెల్లబట్టను చుట్టును మరుగు కట్టుకొందురు కబీరు కృతములగు కీర్తనలను భజనజేయుదురు తెంగలతిరుమణిని యొక్కని శ్రీచూర్ణముతో ధరింతురు. వీరి మతమున జాతిభేదము, విగ్రహారాధనములు లేవు. కబీరు జీవించి యుండుతరి నాచార కర్మల నిరసించు పాటలం బాడుచు, భక్తిని, సర్వసమత్వమును బోధించుచు దేశాటన మొనర్చుచుండెనట. హిందవులు, మహమ్మదీయు లేకభావమున కబీరుమహాత్ముని గారవించు చుండిరట. కబీరు మాగరు గ్రామమున మరణించెనట. వారికి సంస్కారము లొనర్ప హిందువులు, మహమ్మదీయులు కూడ నేగి, కబీరుపైఁ గప్పిన బట్ట తీయ నందు శవములేక పూవులుండెనట. వానిం బంచుకొని మాగరు గ్రామమున హిందువులు కబీరు మందిరమును, మహమ్మదీయులు కబీరు మశీదుం గట్టుకొనిరి. (కబీరు చూడుఁడు)

**కబీరువాది** — శకలతీర్థము చూడుఁడు.

**కమలకుల గోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. వైశ్యగోత్రములు చూడుఁడు.

కమలకుల గోత్రము- ఏకాగ్నేరు గోత్రము (౨౯), కొల్లేటి సాస్కృతగోత్రము శౌనకస, శునగణము, శుకర్షి, ఆపస్తంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాద్యప్రవరఖాడః సమానగోత్రములు శునకస, తృకశిష్టస, శన కాలకుల, ధనదకుల ముక్తేశుఁడు దేవత, భార్యముక్తాంబ, కమలాలయతీరము తపస్థానము, ముక్తి సరస్సు తటాకము, జపము కోటి, దీపములు 23, క్షేత్రసంఖ్య 23, ముక్తాహారము దానము. తామర వర్జనీయము.

**కమలపాలిక** — ఇది హిడింబకు నామాంతరము అన్న హిడింబాసురుఁడు పుత్రుడగు ఘటోత్కచుఁడు భారత యుద్ధమున మడిసెను హిడింబ పాండవులలో నొకఁడగు భీముని భార్య.

**కమలాఫలపు చెట్టు** – లా. Citrus aurantium. ఆంగ్ల. Kamala fruit tree. సం. కమలా, కులపాలక, కురుంబ. ఇది నారింజ కుటుంబములోని దని తలంపఁబడినను నిజమున వేఱుజాతివలె నున్నది. మన్యమునందే కాని, ఈచెట్టు ?

దీని ఫలరస మారోగ్యకరము. చలువజేసి పైత్యశాంతి, మేహశాంతి గల్గించును. దాహ మడంచి, వమనమును ఆపును అధికమైనచో దగ్గును కల్గించి మెదడునకు హానిజేయునని చెప్పబడినది.

కమలాఫలము గల్గించు సుగుణములకు విరుగుడులు- దూలగొండివిత్తుల చూర్ణము, పంచదార, సజ్జాక్షారము (సజ్జాకారము) నని చెప్పబడినది.

పండుతొక్కయందు అల్కహోలు కలదు. ఘాటుగను, వెగటుగ నుండి జీర్ణమొనర్చు శక్తి దానికి గలదు.

**కమస్వతి (కోశానది)** — దీనిని పెక్కండ్రు పొరబడి కసయినదిగా పోల్చిరి. అది సరికాదు. మహాభారతము భీష్మపర్వము నందు కోశ యని పేర్కొనబడినది కసయినది మిడ్నపూర్ (మేదినిపురము) కడ నున్నది కపిశయను నది అఫగనిస్థానపు హద్దులనున్న నది.

**కమిటీ ఆఫ్ ఇన్స్పెక్షన్** – (వాణిజ్య సంబంధ పరిభాషాపదము). Committee of inspection- ఒకసంస్థ (Company) కు నష్టములుకల్గి దివాలాసిద్ధమైన (Winding up) తరి నప్పులవాండ్రందఱు కలిసి తమలో కొందఱి నెన్నుకొని ఒక కమిటీ నేర్పఱచి, వారి పరిముఖమున ఆస్తిఅప్పులు మొదలగునవి పరీక్షించుచు నడుపజేయుదురు. ఆకమిటీకీపేరు వర్తించెడిని.

**కమిషన్** (కమీషను) — (వాణిజ్య సంబంధ పరిభాషాపదము). Commission- ఒక వర్తకుని కార్యములం జక్కబఱచి నెఱపు వేఱొక వర్తకుండు తీసికొను మూల్యము (Commission). ఇవి నూటికింతని యుండెడిని. ఇటుల మూల్యము (Commission) తీసికొని పనిజేయు వర్తకునకు కమిషన్ ఏజెంటు (Commission agent) అనిపేరు. ఈ పదము క్రియగా వాడినతరి నియమించుట యని యర్థమిచ్చును. ఇట్లే యొక కార్యమొనర్ప నియమింపబడినవానిని కమిషనర్ (Commissioner) అనియెదరు.

**కమోడేటమ్** (Commodatum) — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. కొన్ని సరకులు బదులుపుచ్చుకొని వాటినే తిరిగి తీర్చివేయుపద్ధతి నేర్పాటునకుపేరు. ఇది లాటిన్పదము.

**కమ్మదేవతా బ్రాహ్మణులు** — కరణకమ్మవ్యాపారులు చూడుడు

**కమ్మనాటిసీమ** (కమ్మనాడు)— ఆంధ్రదేశమునందు గోదావరీ ప్రాంతసీమలలో పావులూరు ప్రాంతప్రదేశమునకు కమ్మనాడు లేక కమ్మనాటిసీమ యని వాడుకనామము కలదు. బహుశః ఈప్రాంతమున కమ్మవారు (చౌదరీలు) విశేషముగనో ప్రాబల్యముగనో ఉంట నీ పేరు నాడుకయై యుండవలెను.

**కమ్మవారు** — వీరాంధ్రులలో నొక తెగవారుగ నున్నారు క్షత్రియ శాఖలలో నొకటిగం జెప్పుదురు. వీరికి "చౌదరి"లని కుల బిరుదము కలదు. ధనవంతులగు జాతిగం బేరం దినవారు చిరియాల గంపకమ్మలనియు, పెద్ద కమ్మవారనియు రెండు భేదశాఖలు కలవు. గంపకమ్మవారిని తూర్పుకమ్మలనియుం గూడ నందురు

వీరి కులోత్పత్తి-గూర్చిన గ్రంథములు గాన రాకున్నవి గాని, వీరిలో ననుస్యూతముగ వ్యాపించి యున్న కథనములు మూడు కలవు. తొల్లింట దండకారణ్యము రాక్షసాక్రాంతముగ నుండినతరి ఋషుల తపోయాగాదులకు రాక్షసులవలన భంగములు కలుగుచుండ వారు విష్ణుదేవుం బ్రార్థించి మహాలక్ష్మీదేవి కర్ణాభరణమగు కమ్మల

నారాధించి వానినుండి పెన్నూర్గురు క్షత్రియవీరు లుద్భవింప వారినుండి రక్షణనందిరట. అది యాదిగ నావీరులు కమ్మవారనఁబడిరట. వారి సంతతివారు పరీక్షిన్మహారాజుని నిరసించుటఁజేసి యాభూపతి వీరిని శూద్రులుగఁ జూడఁబడునట్లు శాసించెనట.

పిదప కాలానుగుణముగ నాంధ్రదేశమునకు జేరి త్రిలింగదేశాధీశుఁడగు ప్రతాపరుద్ర రాజ్యమునం దుద్యోగులుగ నుండుటకేగెనట. అంతరి నామహారాజు చెవికమ్మలు శత్రులచే నపహృతములుకాగా నిరెడ్లు నవయుపాయసాధనములం బ్రయోగించి శత్రువులనడంచి వానినుండి వాటిఁదెచ్చి యాభూపాలున కిచ్చినకతన కమ్మవారను కులనామము వీరికిఁగల్గి స్థిరపడియెనట.

ఇంకొకకథ: స్త్రీలకంత పురవాసముగ పురుషుల కగపడని నిర్బంధము తగదని వీరును, తగునని ఇప్పుడు వెలమవారనంబడుచున్న నుటికొందఱును నభిప్రాయభేదములు కలవారై వీరందఱు నొక సమాఖ్యను తాటికమ్మలయాకులపై వ్రాసికొనియుంట నాకమ్మలను డి కమ్మవారను కులనామమునకుం బాల్పడిరనియుఁగూడ ననుటకలదు.

వీరందఱు చౌదరీ లను కులబిరుదముఁగల్గియున్నను కొందఱు 'నాయుఁడు' అని పిలువఁబడుటయు గూడ కలదు. కృష్ణానదీతీరమందలి ధాన్యకటకమున (అమరావతి) రాజ్యపాలన మొనర్చిన సుప్రసిద్ధుఁడగు వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడను భూపతి కమ్మకులజుఁడని చెప్పఁబడినది. కృష్ణామండలము లోని చల్లపల్లి, ముక్త్యాల సంస్థానాధిపతు లీకులమువారే. విశాఖపట్టణమండలమున కొంచెముగను, గోదావరిజిల్లాలు రెంటియందునను, కృష్ణా, గుంటూరు, చిత్తూరు మండలముల నధికముగను, ఇంక నితరమండలములందు కొంతగను వీరు గానవచ్చుచున్నారు.

కమ్మవారియందు కల ముఖ్యభేదము లేవనగ శ్రీ వె. ౧౮౯౧ జనాభారిపోర్టువలనఁ దెలియును.

౧. బంగారుకమ్మవారు- వీరిస్త్రీలు బంగరు ముక్కరలం ధరింతురట చిత్తూరు జిల్లాయందు వీరు గానఁగుదురని చెప్పఁబడినది.

౨. గంపచాటువారు- పరపురుషుల ముఖములఁ జూడరాదని గంపలో ముఖము మరుగుపఱచుకొనుటచే వీరికీ పేరందిరట.

3. గోషచాటువారు- చిత్తూరు, చెంగల్పట్టు మొదలగు ప్రాంతములనున్నారు వీరి స్త్రీలకు రాణివాస మధికము

౪ ఇలువెల్లని కమ్మవారు- రాణివాసపు స్త్రీల యాచారమునుండి పేరందిరట. అనంతపురము, నెల్లూరు, కృష్ణామండలములందున్నారు.

౫ పెద్దకమ్మవారు, ౬ శావడికమ్మవారు, ౭ తెలుగుకమ్మవారు.

**కమ్యూనిజమ్** (Communism) — దేశము, దేశమునందుండు ఆస్తులు, ప్రజలకు సాముదాయికమనియు, దేశప్రజలందఱు సమముగ వానిననుభవింపఁదగినవారనియు, కొందఱెక్కువగను, కొందఱు తక్కువగను గల్గియుండుట యధర్మమనియు, దేశమందలి ప్రజాసామ్యదాయకమైనది ప్రభుత్వముగాన, ప్రభుత్వమున కరాజకము (రాజు లేకుండుట) ధర్మమేయనియు వివరించు రాజకీయ సిద్ధాంతము.

తొలుత నిట్టిది ఫ్రెంచిదేశమున నుత్పన్నమయ్యెను Communard అనువాఁడు దీని కర్త ఇదియె ఫ్రెంచి విప్లవమునకు మూలమని కొందఱందురు ఇది భయంకరమగు పరిస్థితి యందురు. ఈ రాజకీయమతము తిరుగుబాటు (Revolution) నకు మూలము గానఁగుచుండును. మార్క్సు, ఎంజిల్సు ఈసిద్ధాంత వ్యాఖ్యాతలలో ముఖ్యులు.

**కమ్‌డివిడెండు** (Cum-dividend) — (వర్తకసంబంధ పరిభాషాపదము. డివిడెండునకు సావకాశముగల వ్యాపారము.

**కమ్ డ్రాయింగు** (Cum-drawing) వాణిజసంబంధ పరిభాషాపదము. ముందురాగల Drawing నందు ఎంత లాభము రా వీలుగల పత్రముల అమ్మకపు వ్యాపారము.

**కమ్ న్యూ** (Cum-new)— వాణిజ్య సంబంధ పరిభాషాపదము. ఒక సంయుక్త వర్తక సంఘమును (Joint stock company) యొక్క వ్యాపారమువలన వచ్చిన లాభమును వాటాలు గల భాగస్థులకు పంచి యిచ్చుటకు బదులుగ వ్యాపార మభివృద్ధిచేయు తలంపుతో మూలధన మెక్కువచేయుటకై యాదాయమును వాటాల క్రింద మార్చి భాగస్థులకే యిచ్చుటకు పేరు.

**కయ్యేటోర్ జలపాతము** (Kaietur Falls)-బ్రిటిషు గినియాదేశమునందు ఎస్సెక్వెబో యను పేరుగల నదియొక్క ఉపనదియగు పోతారోనదియొక్క జలపాతము. ౭౪౧ అడుగుల ఎత్తునుండి క్రిందికింబడు జలపాతమని చెప్పంబడినది

**కరకపాలకుల గోత్రము** — ఆర్య వైశ్యుల (౧౦౨) గోత్రములలో నొకటి. వైశ్య గోత్రములు చూడుడు.

కరకపాలకులగోత్రము- ఎకాష్టేయగోత్రము (౯) దీనిని కరకపాలగోత్ర మనియు నందరు. తొల్లింటి సంస్కృతగోత్రము కౌశికస, కుశిక గణము; ఆపస్తంబ సూత్రము యజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాద్యప్రవరఖండ, గౌరీసుంద దేవత, భార్య కర్ణాంబ, బదరికాశ్రమము తప స్థానము, గర్గసముద్రము తటాకము, జపము దశ లక్ష, దీపములు ౩౦, క్షేత్రసంఖ్య ౨౯, వస్త్ర దానము, బిల్లేము వర్జనీయము.

**కరక్కాయ చెట్టు** — లా. Terminalia chebula. ఆంగ్ల. Chebula myrobalan. సం. హరీతకీ, అభయ, హైమవతీ.

కరక్కాయలు వైద్యోపయోగ మగుకతన విలువం గల్గియున్నవి కాయ మొతపెద్దదిగ నున్న నంతవిలువం గల్గియుండునందురు ఇది త్రిఫలములలో నొకటిగ (తాని, ఉసిరిక, కరక) చెప్పంబడినది. కరక్కాయచెట్టు విస్తారముగం గల చిత్తూరుజిల్లాలోని తిరుపతిప్రాంతములందు కరక పిందెలను పచ్చడిగం జేసి భోజనపదార్థముగ నుపయోగించుచున్నారు. "కరక్కాయ" పదము లేదనుటకును, కార్యము కాకపోవుటకును హీనపదముగ నాంధ్రభాషయందు వాడంబడు చున్నది.

ఇంచుక వగరురుచి గల్గియుండును త్రిదోష హరమైనది. జఠరదీప్తినిచ్చుచు జీర్ణముచేయుచు బుద్ధికిని పంచేంద్రియములకును బల మొసంగి, సమస్త చర్మరోగముల నడంచి, దంతముల గట్టి పఱచి వయోబలమును నిలపియుంచి ఆయుర్వృద్ధి నొసంగునదిగం గరక్కాయ చెప్పంబడినది. "దశ మాతా హరీతకీ" కరక్కాయ పదితల్లుల పెట్టు అని సుప్రసిద్ధలోకోక్తియుం గలదు.

కరక్కాయపిందెలు విరేచనము జేయును. విదాహపుపిచ్చను నివారించును. కరక్కాయ పువ్వులు గర్భిణీస్త్రీలకుం గల్గిన కుసుమరోగము నివారించును. విరేచనములు కట్టును. స్త్రీల గర్భమునకు బల మొసగును.

కరక్కాయచూర్ణముతో పండ్లు తోముచుండిన దంతరోగములు నివారణమగును కరక్కాయను వసంతఋతువునందు తేనెతోడను, గ్రీష్మఋతువున బెల్లముతోడను, వర్షఋతువునందు సైంధవ లవణముతోడను, శరదృతువున తెల్లశర్కరతోడను, హేమంతఋతువునందు శొంఠితోడను, శిశిర

బుతువునగు పిప్పళ్లతోడను సేవించుచుండిన నేరోగములను దరిఁ జేరనీయక యౌవనమును నిల్పునని వైద్యులందురు. మరియు, కరక్కాయను బెల్లము తైలము (నూనె) అనుపానముతో సేవించిన శరీరమందలి వాతప్రకోపమును, నెయ్యి పంచదారల అనుపానముతో సేవించిన పైత్యో ద్రేకమును, తేనె పిప్పళ్లతో సేవించిన శరీరమందలి శ్లేష్మాధిక్యమును తగ్గించు శక్తి గలదని చెప్పబడినది.

ఇంకను కరక్కాయను శిలా (రాచు) తో సమభాగములుగ నీళ్లతో నూరి కండ్లపై పట్టు వేసిన నేత్రరోగములు నివారణమగునని యందురు. కరక్కాయను శుద్ధిచేయక కరక్కాయలు తినుచుండిన వీర్యము చెడిపోవుననియు, కరక్కాయలోని పలుకులు పురుషులకు నపుంసకత్వము గల్గించుననియు చెప్పబడినది. మరియును కాలిన కరక్కాయలు, చవిటిభూములందు పండిన కరక్కాయలు, నీటంబడి నానియుండిన కరక్కాయలు, పుచ్చిన కరక్కాయలు, బురదయందు పడి నానిపోయిన కరక్కాయలు, భిన్నమై విడిపోయియుండిన కరక్కాయలు వర్జనీయములుగ బుషులు చెప్పిరి.

విదాహముగలవారు గొంతుక ఆరియుంటచే బాధపడువారు, కార్శ్యము (దేహము క్షీణించియుండురోగము) గళగ్రహము నవజ్వరము గల రోగులు, పైత్యరోగులు, మార్గాయాసమందిన వారు, లంఘనమున్న వారు (ఉపవాసము) హనుస్తంభ, హస్తకోశపుఖలు, గర్భిణీస్త్రీలు, రక్తస్రావముగల స్త్రీలు కరక్కాయలను వాడరాదనియు వారికది విషతుల్యమనియు చెప్పబడినది.

మఱియును కరక్కాయ అతిసారము, ఉదర రోగములు, ఉబ్బులు, ఊరుస్తంభ వాతము, శామెర్లు, క్రిమిరోగములు, గ్రహణి, గుల్మము, ఛర్ది, దగ్గు వగరపు, ద్వందరోగములు, నేత్ర రోగములు, పాండు రోగములు, పిచ్చి (అపస్మారోన్మాదము), పీనస, ప్లీహ, పురాణజ్వరములు, పైత్య శ్లేష్మ వాతములు, మలమూత్రబద్ధ రోగములు, మూర్ఛ, మూలశంక రోగములు, మేహ రోగములు, విసర్పి, విషదోషములు, విషమజ్వరములు, శిరో రోగములు, శూలలు, శోషలు, హృద్రోగములపై చక్కగ పనిచేయునర్చి నివారించునని చెప్పబడినది.

కరక్కాయకు విరుగుడులు, కరక్కాయను ఉపయోగించుతరి కొంచెము కాల్చుటయు (కాని నిల్వయుండరాదని భావము), నెయ్యి మొదలగు చమురు పదార్థములు కాదంపప్పులు నని చెప్పబడినది

కరక్కాయ జాతియందు "జాగిలీహాల్దా" యనంబడు పెద్దజాతి కరక్కాయ గలదు. ఇది ఎక్కువ బలముగ పనిచేయును. దీనియందు ముదము, కంఠములందుఁ గల శీతలము నివారించు గుణమున్నదనియు, ఇది తలవెంట్రుకలను నెరయనీయక నిలుపుననియు, పురుషులకు పుంసత్వము దగ్గించుననియు చెప్పబడినది. కరక్కాయయందలి సుగుణములన్నింటిని గల్గియుండును

**కరకోటకులు లేక కరకోటక వంశ నృపతులు** - క్రీ. వె ఆరువందలు మొదలు ఎన్మిదివందల సంవత్సరముల వఱకు కాశ్మీర దేశమున రాజ్యమేలిన నృపతులు.

**కరగోణ్యగోత్రము** - కౌతస్య ఉపగణము చూడుడు.

**కరమ్ఘ గోత్రము** - కణ్వ ఉపగణము చూడుడు.

**కరచక్రదామి గోత్రము** — ఉపమన్యు గణము చూడుడు.

**కరంజ ఋష్యాశ్రమము** - బీరారు దేశమున అకోలాజిల్లా మూర్తిజపూర్ తహశ్శీలు నందు అమరావతీ పురమునకు 33 మైళ్ల దూరమున కరంజ యను గ్రామము కలదు. ఇట కరంజ ఋషి యాశ్రమ ముండెనట ఆ ఋషి పుత్రుడు ఒక ఘోరమగు రోగమునకు పాల్పడి, ఇట గొప్ప తపంబొనర్చి రోగవిముక్తిం గాంచెనట. ఇప్పుడిది రోగవిముక్తి నిచ్చు యాత్రా స్థలముగ నెన్నంబడు చున్నది.

**కరటకుల గోత్రము** — కరటకుల చూడుడు.

**కరణకమ్మ దేవతాశాఖవారు** — కరణకమ్మ వ్యాపారులు చూడుడు

**కర్ణాకమ్మలు** - ఆంధ్ర బ్రాహ్మణులు చూడుడు

**కరణ కమ్మ వ్యాపారులు** — వీరాంధ్రదేశమున కాపురము కుదిరిన యొక బ్రాహ్మణశాఖ. తొలుత మహారాష్ట్రదేశస్థులు. వీరందఱు మహారాష్ట్రశాఖలలోని దేశస్థులు అనబడువారు నాశిక పట్టణము దరినున్న కొబరిగాన్ గ్రామమునుండి కొబరిగాంవారనియు, గుల్బర్గాపురమునుండి కలబరిగివారనియు, బీజాపూర్ (నేఁటి విజాపూర్) నుండి విజాపురపు వారనియు ఇంటిపేరులు గల్గియున్న కుటుంబములు వీరియందు కలవు. అందు విజాపురపువారు మధ్వమత మవలంబించిరట

మరియు నాభి, బీరకాయల, సబ్నివీసు, మొసలికంటి, పీష్వానా మొదలగు నింటిపేళ్లు వారి పూర్వులొనర్చిన ఉద్యోగానులనుండి వచ్చినవని చెప్పుచున్నారు. ఇంకను వసంతరావు మొదలగు కొన్ని ఇంటిపేర్లవారు పూర్వపు మూలపురుషుని నామము నింటిపేరుగం గల్గియున్నారనియు, మైసూరువారు మొదలగు కొన్నికుటుంబము లు కన్నడులనియు తేలుచున్నది. గ్రామనామము లింటిపేర్లుగ వీరియందు విస్తారము కలవు.

వీరందఱు ఋగ్వేదులు కన్నడులైనను ఋగ్వేదులగుకతన మధ్వమతస్థులతో వీరుసంబంధబాంధవ్యము లొనర్తురు.

వీరియందు కరణకమ్మ వైదికశాఖ యొకటి కలదు వారికిం గరణకమ్మదేవతలనియు, దేవతాశాఖవారనియు గూడ వాడుకగలదు. వారు తక్కినవారికి గురుకుటుంబములుగను పురోహితులుగ నుందురు. వారు సాలగ్రామమువారనియు, తాటికొండవారనియు ఆంధ్రదేశమున ఇంటిపేర్లు గైకొనినవారివి కొన్ని దేవతాకుటుంబములు కలవు. ఇట్టివారికి మహారాష్ట్రదేశమున కులబ్రాహ్మణులని పేరుకలదట వారట పౌరోహిత్యమొనర్చు అగ్రశాఖయని తెలిసెడిని కరణకమ్మశాఖవారందఱు నిప్పు డాంధ్రులుగనే యున్నారు.

**కరణము కాటికి పోయినా (గడుసుతనము) తన్కరణము మానఁడు** — ఆంధ్రలోకోక్తి.

**కరణ** — కరణములు ౧౧ - కరణము తిథియొక్క పంచాంగములలో నొకటి. ౧ బవ, ౨. బాలువ, 3. కౌలవ, ౪ తైతులాకరణము, ౫. గరజి, ౬. వణజి, ౭. భద్రాకరణము, ౮. శకుని, ౯. చతుష్పాత్కరణము, ౧౦. నాగకరణము, ౧౧. కిమస్తుఘ్నము.

**కరతలామలక న్యాయము** — అరచేతిలోని ఉసిరికకాయ యనియర్థము. హస్తామలకన్యాయము (చేతియందలి ఉసిరికకాయ), కరవిన్యస్తబిల్వన్యాయము (బిల్వమన మారేడు కాయ) ఇట్టివియె

**కరతోయానది** — బంగాళమున రంగపూర్, దినాజ్పూర్, బోగ్రామండలముల గుండా

ప్రవహించు పవిత్రమగునది. మహాభారతము వనపర్వము నందిది కామరూప, వంగదేశ ములమధ్య నున్నట్లుగా చెప్పబడినది. హైమవతీ పరిణయకాలమున పరమేశ్వరుని చేతినుండిజారిన యుదకములు క్రిందికి ప్రవహించు నీపవిత్రజల మేర్పడినదని చెప్పబడినది. ఇది పౌండ్రపుంద్రక దేశముగుండా ప్రవహించునది. పెక్కండ్రు పరిశోధకులు కరతోయానదియు సదానీరయు నొక్కటి యని పొరబడి తలంచిరిగాని,సదాతోయా నది వేఱనియు. యాజ్ఞవల్క్యునుహర్షి శతపద బ్రాహ్మణము రచించుటచే సదాతోయానదియె ఆర్యనివాసమునకు తూర్పుపొలిమేరగానుండినదనియు తెలియుచున్నది. (శతపథబ్రా- ౧-౪). సదా తోయానది నేడు కనపడుటలేదు మహాభారతము భీష్మపర్వము నందు గానవచ్చెడిని

**కరత్వానది హోల్లాల్యానదీ సంగ మము** - ఈపవిత్ర జలస్రవంతి జల్పాయిగురి నుండి దక్షిణముగ నిరువది నాల్గు మైళ్లు దూర మునగల నాగూరా పరిసరముల నాహోర్లని (బహుశః సప్తముని) యనబడుచున్నహోల్లాల్యా నది నుండి సంగమించెను. ఈపవిత్రతీర్థమున స్నానము మహాఫల ప్రదమని చెప్పబడినది

జల్పాయిగురిసిలిగురినుండి డార్జిలింగునకు కేగు ఇరుకుబాటపై నున్నట్టి స్టేషను కలదు

**కరంధమ మహారాజు** - యయాతి మహారాజు సంతతియగు తుర్వసుని ముమ్మను మడు, వహ్నిపౌత్రుడు. గోభానుని పుత్రుడు.

మహాబలాఢ్యుడగు నృపతి. కరంధముడనునది బిరుదు వానుకలో నీతని పేరు బలాశ్వుడు. ఈతని పుత్రుని పేరు ధుర్యజిత్తని చెప్పబడినది. మరియు నవిక్షిత్తనియును గానవచ్చెడిని

**కరబచాంద్రమస గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుడు.

**కరంభ గోత్రము** — కథ లేక కథ్య ఉపగణము చూడుడు.

**కరంభి** — యదువంశ క్షత్రియుడు. ఇతనికి కుంతియనియును పేరుండెను. తండ్రిపేరు శకుని

**కరంభి గోత్రము** — అగస్త్యి ఉప గణము చూడుడు.

**కరభికి గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**కరమధ్య (ఎత్తు)** — రొడుతులముల ఎత్తు ఆయుర్వేద మానము చూడుడు

**కరమేనియా** — ఆసియామైనరులోని యొక ప్రావిన్సు. (ఆసియామైనరు చూడుడు).

**కరవప్రమాణము** — ఆయుర్వేద మానము చూడుడు

**కరవాక** - ఈప్రదేశమునకు కరవాక యను పేరే వాడుకయందున్నను న్యాయతః దీనిని కరవాకసీమ యనుటయే సమంజసమని తోచెడిని. ఇందలి వాకశబ్దము ప్రదేశార్థముగ వాడబడి నను అది కరవాకసీమ యనిన నెల్లరకు చక్కగ స్ఫురించునని తోచును.

కరవాక ప్రదేశము చాల యొక ప్రదేశము; విశాఖపట్టణపు మండలములో నున్నది. బహుశః ఆగ్నేయమున బుకుమారు మొదలు వాయవ్య మున సింగవరమునది దనుక సముద్రము వఱకు మదరాసు–కలకత్తా రాజబాటనంటి ఇరుచుమించు ఆరువందల చౌకపు మైళ్లప్రదేశమున కీపేరు వర్తిం చెడిని. ఇందు వేమకోటి పరగణా యనియు భోగాపురపు పరగణా యనియు రెండుఖండములు పూర్వ మొప్పుడో యుండెనటంగాని, ఇప్పుడట్టి పర్పాట్లు లేకున్నను ఆపేరులు మాత్రము వాడుక యందు నిలచి యున్నవి.

పొల్లింట మెరకగనుంట నిర్జనమై పోవగా కరవాకయని వాడు చూడిరట ఇక్కాలమున పరిస్థితులట్లుగాక తోటలు, చెరువులు, నూతులు, వ్యవసాయములు గల్గి జననివాసములతోనున్నను కరవాక యనిన మెట్టప్రదేశమని గ్రామములోనే వాడుకయున్నది. పొల్లింట బిడారపువర్తకులు ఆ ప్రాంతమును దర్శించ చూడినా నాటి నిర్మాణము లచ్చటచ్చట (బిడారువర్తకులచే నిర్మింపబడిన వసతి గృహములు) కలవు.

**కరవిన్యస్తబిల్వ న్యాయము** — సంశయమునకు తావులేకుండిన విస్పష్టస్థితి యని తెల్పుట కీన్యాయము వాడుచున్నురు

**కరవీరపురము** — దీనినిప్పుడు కొల్హాపూర్ అనుచున్నారు. పొల్లింటి కాలమున శైలహారదేశమునకు రాజధానియై క్షుల్లకపురముగ నుండెను. కాలగతిని నూరి నేటికి కొల్హాపురమైయున్నది ఇక్కడివారు దీనిని కార్వీర్ అనెదరు. అది పొల్లింటి కరవీరసంబంధమై యున్నది (శైలహారదేశము చూడుడు) ఇట మహాలక్ష్మీపీఠము (దేవస్థానము) మిగుల ప్రసిద్ధమైనది పద్మపురాణము ఉత్తరఖండము ౭౬ దేవీభాగవతము ౮-౩౦, ౩౮, మత్స్యపురాణము ౧౩ ల యందు ప్రశంసింపబడినది. కృష్ణానదిలో సంగమించు వేణీనదీతీరము ఇంకను బ్రహ్మావర్తదేశమున ద్వృషద్వతీ నదీతీరమున వేరొక కరవీరపురము కల్కిపురాణము ౭౮-౮౦ యందు చెప్పబడినది.

**కరసిఖడు గోత్రము** — కపి ఉప ఉపగణము చూడుడు.

**కరహాటక కొంకణము** — సప్త కొంకణములలో నొకటి. (కొంకణ దేశము చూడుడు).

**కరాచీ జిల్లా** — బొంబై రాజధానియందలి వేరైన సిండ్ (సింధు) ప్రావిన్సులోనిది. కరాచీపురము ప్రధానస్థానము. (బొంబై రాజధాని చూడుడు)

**కరాచీ రేవుపట్టణము** (పొల్లింటి, తోట్టాపురము) — కరాచీపట్టణమును, ఆపేరుతు నవీననిర్మాణము. సింధు రాష్ట్రమున గొప్ప సముద్ర రేవుస్థలముగ నున్నది. ఇట సింధునది సముద్రగామినుగుట గొప్ప రేవుగ వర్తకస్థలమై యున్నది. హజాబుదేశపు పంట లీపురమున సముద్రపుటోడల కంచెడిని. క్రీ. శ ౧౮౪౩ లో నిర్మింపబడినది తుంకేయు నిది సింధురాష్ట్రమునకు ప్రధాననగరముగఁగూడ నున్నది. ఇచట నిర్మింపబడిన గొప్ప హార్బరు వచ్చిపోవు ఓడలకుఁ జాలదనిపించెడిని. ఇటనుండి పశ్చిమోత్తరపు సరిహద్దు పరగణాకు ఇనుప బాటమార్గమున గొప్ప ప్రయాణస్థలముగ నిదా నున్నది ఈరేవు చాల శాంతికరమై సౌఖ్యమునదందురు. ఇచట ౪,౫౧,౮౦౮ మంది జనులు వసించుచున్నారు. ఇంక నిట పొల్లింటి కాలమునయుండిన తోట్టాపట్టణమును గూర్చి పరిశీలనలు జరుగవలసియేయున్నది. దానియానవాళ్లు చక్కగఁ గన్పట్టుచుండును.

**కరాలపాటి రంగయ్యకవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. త్రైవర్ణులనబడు వైష్ణవవైశ్యకులజుఁడు. తండ్రిపేరు రామయకవి. తాత నారాయణసూరికవి రంగయామాత్యుఁడు చెన్నపురియందు పచ్చయప్ప కళాశాలయందు కొంతకాలమును, ప్రెసిడెన్సీ కళాశాలయందు కొంతకాలమును ఆంధ్రపండితుఁడుగా నుండిన విద్వాంసుఁడు. భారత భాగవతరామాయణములను మొట్టమొదటదిద్ది లేఖకప్రమాదజనితదోషముల సవరించి పరిష్క-

రించి ముగ్రించి జేసిన దీనమహానుభావుఁడే ఈయన రచించినవి శ్రీవిజయమనోహరము, భూతపురీ (శ్రీపెరుంబూదూర్) మాహాత్మ్యము అను పద్య కావ్యములు అందు భూతపురీమాహాత్మ్యము మూఁడాశ్వాసములు కాకిముందే ఇతఁడును నీచుటచే నది గ్రంథము సంపూర్తికాక నిలచిపో యెను

**కరాస చెట్టు** - దీనిని బరివెంక, బర్రెంక, బిరాకయని కొందఱుకు తప్పుగా పిలుతు రట గాని. ధాణికొట్టు దీనితో నేమ సంబంధములేని వేఱుచెట్టు కరాసచెట్టుఆకు చాలగరుకుగల్గి యుంట చే నిల్వయుంచుకొని నానితోకొట్ట సామా నులు నునుపుఁజేయ నుపయోగింతురు.

కరాసమాపుచెక్క, ఆకుల రస కషాయ చూర్ణములు కుష్ఠువ్యాధి సుఖవ్యాధియు, స్త్రీలపాలు ఏడిపోవుగుణము గలదనియుఁ జెప్పుదురు. మేకలకునైతము కరాసఆకులు మేపి పాలుఎండిపోవునని వాడుకగలదు వైద్యము జేయును.

**కరాళి, కరేలి గోత్రము**— ఔతథ్య ఉపగణము చూడుఁడు.

**కరిఘుంటాన్యాయము** — ఏనుఁగు మెడకుఁ గంటకట్టుటయని యర్థము శరీరబలము కన్న బుద్ధిబల మధికమని తెల్పుట కీన్యాయము వాడుదురు.

**కరిదినములు** — అరవదేశమునందిది ఎక్కువప్రచారమునంది యున్నది. చిత్తినెల ౬,౧౫ దినములు. వైయాసనెల ౭,౧౬,౧౮ దినములు. ఆనినెల ౧,౬ దినములు. ఆడినెల యందు ౨,౧౦,౨౦ దినములు. ఆవణినెలయందు ౨౯,౨౮ దినములు. పెరటాసినెలయందు ౧౬, ౨౯ దినములు. అల్పిసినెల ౬,౨౦ దినములు. కార్తికనెల ౧,౧౦,౧౭ దినములు. మార్గళినెల ౬,౯,౧౧ దినములు తైనెల ౧,౨,౩,౧౧,౧౭ దినములు. మాసినెల ౧౬,౧౭ దినములు. పంగునినెల ౬,౧౫,౧౯ దినములు. ఇవి శుభ కార్యాచరణమున కనర్హదినములుగ వాడు చున్నారు

**కరిబృంహితన్యాయము** — ఏనుఁగు ఘీంకారమని యర్థము. బృంహిత యనుటయందే ఏనుఁగు ఘీంకారమని యర్థముగలదు గాన, ఇట కరి (ఏనుఁగు) అనవసరోక్తి. ఇట్లే గజఘటా న్యాయము, నవోదీవరన్యాయము (నల్లకలువ), వాజివాదిరన్యాయము (గుర్రాల శాల), మృగ వాగురన్యాయము, షరవతాధిక్యకా న్యాయము, పర్వతోపత్యకా న్యాయము, కరకంకణన్యాయము మొదలగునవికలవు అన్నియు ననవసరోక్తులు.

**కరిభూజ పాదు (కర్బూజా)** లా. Cucumis melo ఆంగ్ల Musk melon (Sweet melon) - సం కర్బూజా (కస్తూరిజా) మధుఫలా, మధ్వృఖా, మద్రేఖా, మధుసాకా, వృత్తేర్వారు అను పేళ్లు కలవు. ఇంతియె గాక త్రికఫలా, శిక్షా యను పేర్లు కూడఁ గానవచ్చె డిని. బహుశ ఇవి రెండును చేరగ నూడు యీజాతి పండునకని తోఁచెడిని. ఇదియును దోస జాతిలోనిదే నని ఆంగ్ల వృక్ష శాస్త్ర వేత్తలు నుడువు చున్నారు కొందఱు దీనిని అతి చలువ జేయునదిగ ఘంటాపథముగ వచించు చున్నను, ఆయుర్వేద వైద్య శాస్త్రమునందు మేహశాంతి నొసఁగి, బలమొసంగి,సముశీతోష్ణస్థితి శరీరమున కిడునంతటి చలువఁ జేయునదిగ వివరింపఁబడినది. కర్బూజా పండునందు రుచియేగాక పరిమళము గూడ గలదు.

కర్బూజాపండురసము నందు త్వరిత ముగ జీర్ణమై, ఇతర పదార్థముల నతివేగముగ జీర్ణింపఁజేయు శక్తియు, శరీరము సంకటను వేగ



ముగ వ్యాపించు శక్తియుం గలదని చెప్పబడినది బుద్ధిని స్థిమితపఱచి వాత, పిత్త, శ్లేష్మములను సమపఱచి మల మూత్ర నిరోధమును విడగొట్టి మేహశాంతియు, వీర్యవృద్ధియుం జేయును మూత్రపుతిత్తిలోని దోషములను జయించి ఇచుక మూత్ర మెక్కువగ వెడలించును. విషపు రసిపొక్కులు గలవా రీపండును కొంతకాలము తప్పక తినుచుండిన నవి నివారణ మగును.

కరిబూజ విత్తుల చూర్ణ మునందున నీ గుణములే గలవు. విత్తుల కషాయము దోషజ్వరము (Typhus Fever) నివారించు ననియు, జెప్పబడినది విత్తుల కషాయముగాని, చూర్ణము గాని పరగడుపున పుచ్చుకొనరాదు, తల నొప్పియు, పైత్యజ్వరమును గల్గించును మొత్తమున పైత్యతత్వము గలవారును, శరీరమున వల సినంతకన్న నధిక రక్తము గలవారును, అధిక విరేచనములు గలు తత్వము గలవారికిని విత్తుల చూర్ణముగాని, కషాయముగాని విషప్రాయమై యుండి సేవించరానిదని చెప్పబడినది

తేనె, మిరియాలగుండ, పటిక పంచదార, పాలు, పుల్లదానిమ్మపండు, గుల్కంగు విరుగుడు లని చెప్పబడినవి (కరిబూజ పాదు) చూడుడు.

**కరివేపచెట్టు** — లా. Corchorus capsularis అనియు, Bergera koenigh అనియును, ఆంగ్ల. Curry leaf tree అనియును, సం. కాలశాక, కృష్ణనింబ, సురభినింబ అనియు పేర్లు. దీని ఆకులు భోజన పదార్థములందు పరిమళమునకై ముఖ్యముగ చేర్చుకతన దీని యుపయోగ మేర్పడినది.

కరివేప ఆకును, చెక్కయు, వేరును రసము లేక కషాయముగ వాడుదురు. ఇది చలువజేసి యార్చి వేయును. జిహ్వకు అరుచి దోషము బాపును. దేహమునకు పుష్టినిచ్చును. ఆకలిని బలపర్చును కఫము, గ్రహణి, దారుణాతి సారము, వాంతులనే గాక కలరాయందలి వాంతులను గూడ నడంచును. ఆకులు వేడిచేసి రక్తగ్రహణిని సహా ఆపును. విష జంతువుల విషము హరించును. ఆకులునూరి పైనిపూసిన కురుపులు, పొక్కులు మానును. చెక్కగంధము పైనిపూసినను పొక్కులు పళ్లికలు మానును. పండ్లు, రక్త పైత్యము, దాహము నడచునని చెప్పబడినది, కరివేప పువ్వు వాసన చాల ఆరోగ్యకరమనియు, రోగవ్యాప్తి నాపుననియు జెప్పబడినది.

**కర్త్రితాళము** — తాళములు చూడుడు.

**కరీబియన్ సముద్రము**(Caribbean sea) — దక్షిణ అమెరికాయందు గయానా యను దేశముకలదు. అందు ఆదిమనివాసులు కరీబుజాతి ఇండియనులు అధికసంఖ్యాకులు నివసించుచుందురు. వారిదేశమున కొకప్పుడు వారినుండి కరీబియాయను పేరును ఆప్రాంత సముద్రమునకు కరీబియా సముద్రమను పేరును గలిగెను. ఇప్పుడాపేరు వాడుకయందు లేకున్నను సముద్రగామియై వదలకున్నది. (గయానా దేశముచూడుడు)

**కరీరాంభిగోత్రము** — కథ లేక కీశ్యగణము చూడుడు.

**కరుగేటెడ్ ఐరన్** — ఇనుపరేకును వంకరలుగజేయుట (Corrugate) వలన దాని యందలి బలమధికమై వంగిపోక నిలచునట్టి గట్టి దగును అంతదళసరియొగల సాదాఇనుపరేకున కాగట్టియుండక దన్నుచాలని తావుల వంగి పోవును వర్షపుధారల నెదుర్కొనవలసిన ఈ రేకులు వంగినతావులు గలవగునేని అపల్లముల నీరునిలచుట యనర్థకము. ఇంక నోనెలంబోలు వంకరలంగల్గిన కరుగేటెడ్ రేకులైనచో వర్షపు

వీరాదోనెలలోబడి క్రిందికి తిన్నగ జారుంగాని నిలువజాలరు. వీటిని జంకుతేకులనియు నను చున్నారు.

**కరుణతాళము** — తాళములు చూడుడు

**కరుణాయనగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు

**కరువు కొంచెమైనా గాబరా లావు గల్గిస్తుంది** — ఆంధ్రలోకోక్తి

**కరువు కొద్దికాలమైనా జ్ఞాపకం చాలాకాలముంటుంది** — ఆంధ్రలోకోక్తి

**కరూరు** — చేరదేశము చూడుడు

**కరూశదేశము** (అధిరాజదేశము) — దీనిని గూర్చి యభిప్రాయభేదములున్నవి. దీని కధిరాజదేశమనియు పేరుండెను. చంద్ర వంశపు ఇక్ష్వాకుమహారాజు కనిష్ఠసోదరుడగు కరూశుడు దీనిపాలించుటచే కరూశమని పేరయ్యెనందురు. రామాయణము ౧ ౨౪ సర్గమును, బ్రహ్మాండపురాణము పూర్వ ౧౬ వ అధ్యాయము వను కరూశదేశ ప్రశంసలు కలవు. వామనపురాణము ౧౩ వ అధ్యాయమున నీ దేశము వింధ్య పర్వతపాదమునందున్న దేశముగ చెప్పబడినది. కరూశ బాహేలు దేశముల కలసిన భాగమునకు కరూశదేశమని పెక్కండ్ర తలంపు. శ్రీకృష్ణునిచే యుద్ధమున హతుడైన దంతవక్త్రుని రాజ్యమని పద్మపురాణము 3౧ వ పటలమున గలదు. పాండవకనిష్ఠుడగు సహదేవుడు ఈరాజ్యమును జయించెనని మహాభారతము సభాపర్వమున చెప్పబడినది. హరివంశము నందు దీని కధిరాజ మని పేరు కలదనియు దంతవక్త్రుని దేశమనియు గలదు.

కరూశదేశము తూర్పు పడమర భేదములచే రెండుగ చెప్పబడినది. మహాభారత భీష్మ పర్వము ౯ అధ్యాయమున నిది మత్స్య భోజ దేశముల మధ్యనున్న దేశముగను, ఇతరగ్రంథముల నిది వింధ్యకు వెనుకనున్న దేశముగను చెప్పబడినది. ఫార్గిటారు (Pargitar) పరిశోధకుడు ఉత్తరమున కాశీదేశము, వత్సదేశమును, పశ్చిమమున చేదిదేశము, తూర్పున మగధదేశము, ఎల్లలుగాగల్గి కైమూరు పర్వతప్రదేశములం గల్పుకొనిన దేశముగ నిరూపించియున్నాడు. ఇది ఇప్పటి రివా-సంస్థానస్థానమని తెలియుచున్నది.

నిజము స్పష్టముగ తెలకున్నను బీహారము లోని షహాబాదు మండలభాగమును అనగా శోణభద్ర కర్మనాశ నదుల మధ్యప్రదేశవాసులు తమది కరూశదేశమని చెప్పుచుందురు. ఇది కరూశపాలితమై యుండెనేమో. ఇంకను పుండ్రక దేశమునకుం గూడ కరూశదేశమని పేరుండెను. పాణినిసూత్రము ౪-౧-౧౭౮ ను కరూశగ్రంథకులకు కరూశదేశము వరేన్ద్ర మలదదేశముండెనట

**కరూశుడు** — ఇతడు సూర్యవంశ క్షత్రియుడు. తండ్రి వైవస్వతమనువు. పితామహుడు వివస్వంతుడు (సూర్యుడు). సోదరులు ఇక్ష్వాకుమహారాజు, నృగుడు, దిష్టుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నభగుడు, పృషధ్రుడు, కవి. ఈతని సంతతివారి పేర్లు సరిగా తెలియకున్నను వారికి కరూశులని పేరు. మరియు నీతడేలిన దేశమునకు కరూశదేశమని ఈతనినుండియే పేరుకలిగెను. ఈతడు ఇక్ష్వాకుమహారాజునకు సామంతభూపతియై యుండెనని తెలిసెడిని.

**కరూషదేశము** — పుండ్రదేశము చూడుడు.

**కలోట గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుడు

**క్యారెటీ యూదశాఖ వారు** — యూదులలో నొకశాఖవారగు కరైటీయూదులు (Jews) బైబిలునందలి ప్రాతనిబంధన (Old Testment) నంగీకరించెదరు గాని దాని తాల్మూడ్ వ్యాఖ్యానముల నంగీకరింపరు. వీరు క్రీ. శ. ౭౬౦ లో బోధకులగు రబ్బీల నాగ్రొనిరుగబడినవారు, నేటికిని వారినంగీకరింపరు. Moses the Law giver గారి ధర్మములను గౌరవింతురు యూదులు క్రీస్తుప్రభుని శిలువవేయు టకు కారకులనుటను కఠినముగ నిరాకరింతురు

**కర్కాటక సన్నిపాతము** — సన్నిపాత దోషము చూడుడు.

**కర్కటి హస్తము** — హస్తాభినయము చూడుడు. భరతశాస్త్రము చూడుడు

**కర్కాటకరాశి** — అధిపతి చంద్రుడు ఇది పునర్వసునక్షత్రముయొక్క ౪వ పాదమును, పుష్యమి యొక్క నాలుగు పాదములును, ఆశ్లేషానక్షత్రముయొక్క నాలుగు పాదములును కలసియైన ౯ పాదములరాశి దీని ప్రమాణము ఐదున్నర ఘడియలు లేక రెండు గంటల పండ్రెండునిమిషముల కాలము

కర్కాటకము సౌమ్యరాశి, చరస్వభావరాశి, బ్రాహ్మణవర్ణరాశి, స్త్రీస్వభావరాశి, పాటల వర్ణము, పూర్ణజలరాశి, ఉత్తరదిగ్రాశి, పృష్టోదయరాశి, రాత్రి బలమధికము హృదయబలము అని చెప్పబడినది.

కర్కాటకము చంద్రునకు స్వక్షేత్రము. మూలత్రికోణ మెవ్వరికిని గాదు. ఉచ్చ గురునకు, నీచ కుజునకు, మిత్రక్షేత్రము రవి, కుజ, గురులకు, శత్రుక్షేత్రము, బుధశనులకు; సమక్షేత్రమెవ్వరికిం గాదు. కర్కాటకము లగ్నమగునేని రవి ద్వితీయాధిపతిగను, చంద్రుడు లగ్నాధిపతిగను ఉందురు. కుజుడు పంచమదశమస్థానములకును బుధుడు తృతీయద్వాదశస్థానములకును, గురుడు షష్టను నవమస్థానములకును, శుక్రుడు చతుర్థైకాదశస్థానములకును, శని సప్తమ అష్టమస్థానములకును అధిపతులుగ నుందురు

**కర్కాటక శృంగిచెట్టు** – లా. Rhus succedanea అనియు, Pistacia integerrima యనియు. ఆంగ్ల. Galls సం కర్కాటకశృంగి, కుళింగా, విషాణి యనియుం బేరులు దీనిని చూర్ణముజేసియు, కషాయముగాచియు వాడుదురు. చేదుగనుండును. ఉదరరోగములు, ఊర్ధ్వవాతము, కిఱుపుబ్బు, కాస, జ్వరములు, విషమువలనఁ గల్గెడిబాధలు, శ్వాసలు, శ్లేష్మ రోగములు నివారించునని చెప్పబడినది ఇది కేవల వైద్యోపయోగమగు నోషధి

**కర్కాటక సంక్రాంతి** — సూర్యుడు కర్కాటకరాశిం బ్రవేశించు సమయమునకుఁ గర్కాటక సంక్రాంతి యని పేరు ఇది దక్షిణాయనమునకుఁ బ్రారంభము. ఇందు పితృర్చన (శ్రాద్ధము) విధింపంబడినది. రవి కర్కాటకరాశికిం బ్రవేశించుటకుపూర్వ మిరువదిఘడియలకు ముందుగనే పితృర్చన జరుపవలయును. (పండుగలుచూడుడు).

**కర్కోటక నగరము** — సంయుక్త రాష్ట్రములలోని అలహాబాదు పురమునకు వాయవ్యదిశగా ౪౧ మైళ్ల దూరమునఁ గల కర్కోటకనగరమిప్పుడు కర్రా యనుపేరం బరగుచున్నది ఇది ౫౨ శక్తిపీఠములలో నొకటి. సతీదేవికర మిట పడినదట.

**కర్ష్వారాయణ గోత్రము** — లోహితగణము చూడుడు.

**కర్ణకౌంతేయ న్యాయము** – కర్ణుడు తాను రాధేయుం డని (రాధపుత్రుడని) తలచుచుండి పిదప శ్రీకృష్ణునివలన కుంతీదేవి కుమారుడైనట్లు తెలిసికొని కౌంతేయుడుగ గ్రహించినట్లు. (రాజపుత్రవ్యాధన్యాయము చూడుడు).

**కర్ణగంగ** — దీనిని పిండారిగంగ యనియు నందురు కర్ణుండు ఈనదీతీరమున నొకయాగ మొనర్చి తపంబొనరించిన కతమున కర్ణగంగయని వాడుకగలదు అనుశోద దేశమున (గద్వాల్ సంస్థానము) అలకానంద నదిలో కర్ణప్రయాగయను పేరుగల తావున సంగమించును.

**కర్ణప్రయాగ** — పిండారిగంగ, అలకానందల సంగమము. హిమాలయముపై నున్న పంచప్రయాగలలో నొకటి సంగమముకడ కర్ణప్రతిష్ఠితమై శంకరభగవత్పాద పునఃప్రతిష్ఠితమైన ఉమాదేవి దేవస్థానముకలదు. హరిద్వారము గూడా నాటుదారినిపోవగును (హిమాలయ మార్గములు చూడుడు. పంచప్రయాగలు చూడుడు )

**కర్ణజంఘ గోత్రము** – కుశికగణము చూడుడు

**కర్ణసుత గోత్రము** — రౌక్షాయణ ఉపగణము చూడుడు

**కర్నల్ ఆల్కాటు గారు** — వీరు అమెరికాదేశస్థులు వీరుస్థాపించినది థియాసఫికల్ సొసైటీ. వీరు భరతదేశమునకువచ్చి దయానంద సరస్వతీస్వామి (ఆర్యసమాజస్థాపకుడు) శిష్యులైరట గాని, వారిబోధలు రుచింపమి వారిని వీడి వెళ్లిరని చెప్పబడినది వీరు దివ్యజ్ఞాన సమాజమును బొంబాయిలో స్థాపింపజూచిరి కాని యచటివారికీమతవిధానము రుచింపనందున నచ్చోటువాసి చెన్నపట్టణమున అడయారునందు ఆశ్రమము నిర్మించుకొని యాపని ప్రారంభించిరి. (థియాసఫీ చూడుడు). వీరికింబిదప అడయారు దివ్యజ్ఞాన సమాజము డాక్టరు ఏనీబీసెంటమ్మగారి కాలమున నభివృద్ధిగాంచెను

**కర్ణసువర్ణపురము** - అధిశూర నృపాలుని పాలనమున వంగదేశపు రాజధాని ఇప్పుడు రంగమాటి యనంబడుచు ముర్షిడాబాదు జిల్లాలోని బరంపురమున కారుమైళ్ల దూరమందున్నది దీని ప్రశంస కుబ్జికాతంత్రమున ఏడవ యాధ్యాయమున కలదు.

**కర్ణాటలఘువు** (కరాటకలఘువు) — సంగీత శాస్త్రమున జాతి (లయ) ప్రాణమున చెప్పబడిన దశప్రాణములలో నొకటి ౧౬ అక్షరములకాలము. (జాతి (లయ) ప్రాణము చూడుడు).

**కర్నాల్ జిల్లా** - కర్ణాలుపురము ప్రధాన స్థానము (పంజాబుదేశము చూడుడు)

**కర్ణావతీనది** - ఆర్కియాలాజికల్ సర్వే రిపోర్టు రెండు, ఇరువదియొకటి వాల్యములందు బుందేల్ఖండములోని కేన్ నదిని కర్ణావతిగా వ్రాసిరి గాని ఏ పురాణమునను నిదర్శనములు గానరావు. మత్స్యపురాణమున ౧౧౩ శ్లో ౨౩ ధోరణివలన కర్ణిని శ్యేని నదిగా నన్వయించు చున్నది. (సుజాభుక్తి దేశము జూడుడు).

**కర్ణాలీనది** — దామోదర కుండము. (గండకీనదిచూడుడు) గండకీనదిని టిబెట్టుదేశస్థులీపేరున వాడుచున్నారు. ఈనదియే (సాలగ్రామి) టిబెట్టుదేశపు హద్దుననున్న తకలాకోట (మండీ) వద్ద నుండి ప్రవహించుటచే నీపేరు అధికముగ ప్రసిద్ధమయ్యెను.

**కర్ణిక** - అనకుని భార్య కర్ణిక, ఇంకను కర్ణికయను నప్సరయొకతె కలదు.

**కర్ణిక్రము** - బాణాగ్రములు చూడుడు.

**కర్ణిక సన్నిపాతము** — సన్నిపాతదోషము చూడుడు.

**కర్ణికాపురము** దీనికి కర్ణాళి,కర్ణపురము, భద్రకర్ణిక యనియు పేర్లు కలవు. బృహచ్ఛివ పురాణము ౧-౭౫ యందు కర్ణిక యని పేర్కొనబడినది. నర్మదానదియందు ఉరినది సంగమము కడనున్న ప్రసిద్ధ శివక్షేత్రము మహాశివ పురాణము ౧-౧౫ యందునను, మహాభారతము వనపర్వము ౮౪ యందునను ప్రశంసింపబడిన క్షేత్రము.

ఉరినదిని ఇప్పుడు ఎరాండి యనుచున్నారు. బరోడా రాజ్యమున ప్రవహించు నది. పద్మ పురాణమున ఆది సర్గ. ౯ యందు దీని ప్రశంస కలదు.

**కర్ణికానది** - కావేరినది యొక్క ఒక శాఖ. ఇప్పుడు కొల్లడమనియు, ఆంగ్లమున కొల్లరూన్ అనియు పిలువబడు చున్నది. తిరుచునాపల్లి మండలములోని శ్రీరంగమున కొకతట్టుకావేరియు, రెండవతట్టు కర్ణికయు ప్రవహించి చుట్టుకొని యున్నను.

**కర్ణికారవనము** - మేరుపర్వత ప్రాంతమున నెచ్చటనో గల వనము సరిగా తెలియదు.

**కర్ణుడు** - అంగదేశాధిపతి అంగదేశము చూడుడు.

పాండవుల తల్లియగు కుంతీదేవి కన్యకగా నుండునపుడు ఆమెకు సూర్యాంశమున గల్గిన సుతుడు. ఇతడు జనింపగనే కుంతీదేవి యొక మందసమున నీబాలునుంచి గంగానది యందు వదలివేసెను.

అది సూతవంశజుడగు అతిరథునకు దొరకిన నాతడును, ఆతనిభార్య రాధయును అతి ప్రేమతో పెంచ నీతనికి సూతపుత్రుడనియు, రాధేయుడనియు వాడుకపేర్లు గల్గెనట. ఈ బాలుడు సూర్యాంశనుజనించుట సహజకర్ణకుండలుడుగాన కర్ణుడనియు, వసువర్మధరుడై యుంట వసుసేనుడనియు పేర్లు వాడుక యయ్యెనట. వసువనిన స్వర్ణము, వర్మమనిన కవచమనియు నర్థము. ఈతనికి ద్రోణాచార్యుడస్త్రవిద్య నీయక నిరాకరించుటచేత బ్రాహ్మణ వేషము ధరించి పరశురాముని కడ విలువిద్య నేర్చెను. ఈతడర్జునునకు ప్రబల విరోధి. దుర్యోధనున కాప్తుడగు సామంతుడు. మహాదాత యని పేరుగాంచిన వాడు. భారతయుద్ధమున నర్జునునిచే నిహతుడాయెను.

**కర్ణనివంశావళి** (అంగభూపతి) — గాంధారభూపతి వంశావళి, పాండ్యభూపతి, చోళ భూపతి, కేరళభూపతి, ఉశీనరభూపతి, పుండ్ర భూపతి, కళింగభూపతి, వంగభూపతి, సుద్రభూపతి, కేకయభూపతి, సువీరభూపతుల పూర్వవంశావళి. నహుషమహారాజు సంతతి, చంద్రవంశము అత్రిసంతతి.

**కర్నూలు జిల్లా** — ఆంధ్ర దేశములోనిది చెన్నపురిరాజధానిం జేరియున్నది. కర్నూలు ప్రధాన స్థానము తుంగభద్రానదీతీరము నందియాలు పురము వర్తకస్థానము గిద్దలూరు, కంభము యితరపట్టణములు. మహానంది స్నానతీర్థము నందియాలుకడనున్నది సుప్రసిద్ధమగు శ్రీశైల క్షేత్రము యీజిల్లాలోనిదే. ద్రోణాచలము యనుపవారికూడలి స్థానము

**కర్తరీముఖ హస్తము** — హస్తాభినయము చూడుడు భరతశాస్త్రము చూడుడు.

**కర్తార్ పూర్ సిక్కు క్షేత్రము** — పంజాబుదేశమున జలంధరుజిల్లా జలంధరునుండి తొమ్మిదిమైళ్ల దూరమునందున్న పట్టణము. ఇట సిక్కుమతస్థుల గురువులలో నొకడగు రామదాసుగురునకు కొంతప్రదేశము ఒసంగబడెనట. ఆయనతరువాత గురుడైన అర్జునగురుడట నివాసభవననిర్మాణ మొనర్చ సమకట్టిన, అటకొక

చెట్టుపై నుండిన భూతిమిల్లక దానినాటంకపర్చెనట. ఆగురునియందు దయార్ద్రహృదయుండై అభూతము జోలి కెవ్వరు రారని యభయమిచ్చి భవననిర్మాణమొనర్చెనట. నాండాదిగ నది గురువులకు నివాసభవనమై పవిత్రస్థలిగ నెన్నబడియెనట. ఇప్పటికిని సిక్కులకు యాత్రాస్థలమై యున్నది.

**కర్తారాగములు మేళకర్తలు —** ఉపాంగరాగములు, సంగీతము చూడుడు

**కర్త్రిపురదేశము, కత్రిపురదేశము** ఈరాజ్యము ఆల్మోడా. కుమాన్, గఢవాల్, కాంగ్రా ప్రాంతములన్నియు కలిసి, ఈపేరబిలువంబడుచు న్నది. సముద్రగుప్త చక్రవర్తి దీనిని జయించి యాక్రమించెనని చెప్పబడినది

**కర్దమర్షి ఆశ్రమము —** ఇప్పటి బరోడాసంస్థానరాజ్యమున (నేటి గుజరాత దేశము) సరస్వతీ యనబడుచున్న ఒక చిన్ననది ఉత్తరభాగమున గల సిద్ధపురము (ఇప్పటి పేరు సిధ్పూర్ లేక సిత్పూర్) అను తావున బిందు సరోవరమను సరస్సుకడ కర్దమఋషి ఆశ్రమము కలదు. ఇదియె కపిలమహర్షి జన్మస్థానము బిందుసరోవరము విష్ణుదేవుని కన్నీరని భాగవత పురాణము 3-౨౧ యందు చెప్పబడినది

**కర్బూజాపాదు** - కలిభూజ చూడుడు.

**కర్ఫ్యూ** (Curfew) — సాయంకాలము వాయింపబడు గంటను వాడబడుచున్న పదము నార్మనులకాలమున సాయంకాలముల నగ్నిం గప్పుచుండుట పద్ధతియైయుండెనట. అగ్ని విజృంభించి ప్రమాదములు గల్గింపకుండుట కట్లొనర్చువారట. Cover Fire అను పదములు క్లుప్తపరచబడి యిట్లైనదట

**కర్మ, కర్మలు** — చేయుపనికి కర్మ యని పేరు. కర్మ సత్కర్మగంగాని, దుష్కర్మగం గాని యుండవచ్చును. సత్కర్మ సత్ఫలములను, దుష్కర్మ దుష్ఫలములను ఒసంగునని చెప్పంబడినది.

ద్వివిధ కర్మలు- ౧. ఇష్టకర్మలు- యాగములు, క్రతువులు. ౨. పూర్తకర్మలు- కూప తటాకాదులను ధర్మార్థముగ నిర్మించుట మొదలగు ధర్మకార్యములు.

త్రివిధకర్మలు- ౧. ఆగామికర్మ- ప్రస్తుతము తానొనర్చుచుండుకర్మ. దీనిఫలము ముందుతన కనుభవమునకు రానున్నది యని భావము. ౨. సంచితకర్మ యన- వెనుక తానొనర్చి ఇప్పుడు తాననుభవించెడిది యని భావము 3. ప్రారబ్ధకర్మ యన- వెనుక తానొనర్చినది తన యనుభవమునకై నిలచియున్న కర్మ యని భావము ఈ ఆగామిసంచితప్రారబ్ధములను బాధత్రయ మనియు నందురు.

కర్మచతుష్టయము ౧. కృచ్ఛ్రము, దానములు యథావిధిగా నొనర్చుచుండుట. ౨. చాంద్రాయణము- తీర్థయాత్రార్థము దేశదేశముల వెంబడితిరుగుట. 3. నిత్యకర్మానుష్ఠానము- అనుదినావశ్య నిత్యకర్మల నొనర్చుచుండుట ౪. నైమిత్తిక కర్మానుష్ఠానము- అయా పర్వతిథులు మొదలగు నిమిత్త కాలముల కర్హములగు కర్మల నొనర్చుచుండుట

కర్మపంచకము (తర్కశాస్త్రమున)-౧. ఉత్క్షేపణము (పైకెత్తుట). ౨ అవక్షేపణము- (క్రిందికిదించుట లేక పడవేయుట, క్రిందికిం ద్రోయుట). 3. ఆకుంచనము- (వంచుట లేక ముడుచుట). ౪. ప్రసారణము- (చాచుట లేక సాగదీయుట లేక తిన్నగనుండునటుల నొనర్చుట) ౫. గమనము (నడచుట, పోవుట, చలించి ముందునకుసాగుట).

షట్కర్మలు, షట్కర్మానుష్ఠానములు, షడ్విధికర్మలు ౧. యజనము- (తానుయాగాదు

లోనర్చుట). ౨. యాజనము- (యాగములు చేయించుట). ౩. అధ్యయనము- (వేదములు మొదలగు విద్యల నొకరియొద్ద చదువుట, అభ్యసించుట మొదలగునవి). ౪. అధ్యాపనము- (వేదములు మొదలగు విద్యలను ఇతరులచే జదివించి నేర్పుట). ౫. దానము- (ఇచ్చుట). ౬. ప్రతిగ్రహము- (దానమును పుచ్చుకొనుట).

నిత్యకర్మాష్టకము (అష్టకర్మలు)-౧. స్నానము, ౨. సంధ్య, ౩. జపము, ౪. హోమము, ౫. స్వాధ్యాయము, ౬. దేవపూజనము, ౭. ఆతిథ్యము (ఇచ్చుట), ౮. వైశ్వదేవము ఇవి నిత్యకర్మలు.

షోడశకర్మలు-మానవార్హకర్మలు పదునారు. ఇవి తానుగర్భమందు పడుటకుముందుగ ప్రారంభమై తనమృతికిఁబిదప బూర్తియగును. ఈకర్మలు పదునారును ఒకరిచే జేయఁబడునవి కానేరవు మొదటి ఎన్మిదియు పితృకర్తృకములు, తండ్రి చేయునవి. పిదప ఆచార్యకర్తృకకర్మలు రెండు పిదప ఆర్యకర్తృకములు రెండు. పిదప ఆత్మకర్తృకములు మూడు (తానొనర్చుకొనునవి). కడకు పుత్రకర్తృకము(కుమారుఁడు చేయుకర్మ) ఒకటి. ఇవి షోడశకర్మలు.

పితృకర్తృక కర్మలు (ఎన్మిది)- ఇవి అనిర్దేశ్యములు, నిర్దేశ్యములు అని ద్వివిధము.

అనిర్దేశ్యములు ౩- ౧. గర్భాదానము, ౨. పుంసవనము, ౩. సీమంతము. ఇవి తన తండ్రి యొనర్చునవి. ఒక నిర్దేశ్యము లేకయే యొనర్పఁబడునుగాన, అనిర్దేశ్యములని పేరు.

నిర్దేశ్యకర్మలు ౫- ౧ జాతకర్మ (బారసాల), ౨. నామకర్మ (నామకరణ మహోత్సవము), ౩. అన్నప్రాశనము, ౪. చౌడము (చెవులు కుట్టుట) ఇది కుడిచెవితమ్మి, ఎడమచెవితమ్మి యని యెఱుంగునది. ౫. ఉపనయనము (తనకు వడుగు తండ్రి చేయుట). ఇంక సంబంధ కర్మలు ఉదయమాధ్యాహ్నిక సాయంసంధ్య కర్మలును, ఔపాసనకర్మలు నైయున్నవి. ఔపాసనములందు నిత్యములు ప్రాతస్సాయంకాల అగ్నిహోత్రములును, ప్రాయశ్చిత్త సంబంధములు సమస్తహోమములు నైయున్నవి

ఇంక నైమిత్తిక హోమములు— ముఖ్యపక్షములుగ, గ్రహణహోమమును పండ్రెండు నెలలందు శుద్ధ పాడ్యమి, బహుళ పాడ్యమి యందొనర్పఁదగిన శాలిపాక హోమములునైయున్నవి.

ఇటుల పితృకర్తృకకర్మలగు జాతకర్మ, నామకర్మ, అన్నప్రాశన, చౌడ, ఉపనయనములు నిర్దేశించియె చేయుకర్మలుగాన నిర్దేశ్యకర్మలని యెఱుంగునది. ఇటుల అనిర్దేశ్యకర్మలు ౩, నిర్దేశ్యకర్మలు ౫ మొత్తము అష్టకర్మలును, తనకుంగాను తండ్రియొనర్చు (పితృకర్తృక) కర్మలు.

ఆచార్యకర్తృకకర్మలు రెండు- ౧. ఆశ్రమవేదవ్రతము. దీనినే దీక్షయనియునందురు. ౨. వైశ్వదేవము

అగు ఆశ్రమవేదవ్రతము- ౧. ప్రాజాపత్యమనియు, ౨ సౌమ్యమనియు, ౩ ఆగ్నేయమనియు మూడుగనున్నది. కడపటిదియగు ఆగ్నేయము ౧. ఔపాశనాగ్ని, ౨ లౌకికాగ్ని యని రెండువిధముల అగ్నులుగలది.

రెండవదియగు వైశ్వదేవము- మహాహుతులు, చతుర్వింశతిబలులు, పంచయజ్ఞహోమబలులు, అగ్రదానహోమములు రెండు, అగ్రదాన బలి ఒకటియు నైయున్నవి.

మహాహుతులు- ౧. అగ్నినిగూర్చి, ౨. విశ్వేదేవులగూర్చి, ౩. ధృవభూములగూర్చి, ౪. ధృవక్షితుంగూర్చి, ౫. అచ్యుతక్షితుంగూర్చి, ౬. స్విష్టకృదగ్నింగూర్చి నైయున్నవి.

చతుర్వింశతిబలులు- ౧. ధర్మదేవత, ౨. అధర్మదేవత, ౩. ఉదకములు, ౪. ఓషధీవనస్పతులు, ౫. రక్షోదేవజనులు, ౬. గృహ్యాములు, ౭. అవసానములు, ౮. అవసానపతులు, ౯. సర్వభూతములు, ౧౦. కాముడు, ౧౧. అంతరిక్షము, ౧౨. యదేనాముడు, ౧౩. పృథ్వి, ౧౪. అంతరిక్షము, ౧౫. దివి, ౧౬. సూర్యుడు, ౧౭. చంద్రుడు, ౧౮. నక్షత్రములు, ౧౯. ఇంద్రుడు ౨౦. బృహస్పతి, ౨౧. ప్రజాపతి, ౨౨. బ్రహ్మ, ౨౩. స్వధాపితరులు, ౨౪. పశుపతిరుద్రుడు. వీరలం గూర్చినవైయున్నవి

పంచయజ్ఞములందలి హోమములు (౨) — ౧. మనుష్యయజ్ఞమునందలి హోమము, ౨. దేవయజ్ఞమునందలి హోమము.

పంచయజ్ఞములందలి బలులు (౩) — ౧. బ్రహ్మయజ్ఞమునందలి బలి, ౨. భూతయజ్ఞమునందలి బలి, ౩. పితృయజ్ఞమునందలి బలి

అగ్రదాన హోమములు (౨) — ౧ ధాన్యములంగూర్చిన హోమము, ౨. పరమేష్ఠిం గూర్చిన హోమము.

అగ్రదాన బలి — రౌభూ . . గూర్చిన బలి.

ఇటుల ఆచార్యకర్తృకకర్మలు, ఆశ్రమవేద వ్రతము, వైశ్వదేవమునని ద్వివిధములు—

అన్యకర్తృకకర్మలు (౨) — ౧. సమావర్తనము, (దీనినే స్నాతకమందరు) ౨ సహధర్మచారిణీవ్రతము (దీనిని వివాహమందురు).

ఆత్మకర్తృకకర్మలు (౩) — ఆత్మకర్తృకమన తననిమిత్తము తానొనర్చుకొనియెడి కర్మ. ఇవి ౧. పాకయజ్ఞములు, ౨ హవిర్యజ్ఞములు, ౩. సోమయజ్ఞములునని త్రివిధయజ్ఞములుగ నున్నవి. ఈ మూడు ఒక్కొకటి ఏడువిధములుగ నుంట మొత్తము ఇరువదియొక భేదములుగ నున్నవి.

సప్తపాకయజ్ఞములు — ౧ అష్టకశ్రాద్ధములు (౩) మాఘబహుళమున సప్తమి, అష్టమి, నవమి దినములం దొనర్చునవి మూడు.

౨ పార్వణశ్రాద్ధములు (౨౪)— సంవత్సరమునందలి పండ్రెండు నెలలయొక్క శుక్ల పాడ్యమి, బహుళపాడ్యములం దొనర్చునవి ఇరువదినాలుగు.

౩ మాసశ్రాద్ధములు— సంవత్సరమునందలి పండ్రెండు మాసములందు పితృతిథి నొనర్చు శ్రాద్ధములు పండ్రెండు.

౪. శ్రావణికర్మ- శ్రావణశుద్ధపౌర్ణమి సర్పబలి.

౫. ఆగ్రహాయణికర్మ- మార్గశిరశుద్ధపౌర్ణమి సర్పబల్యుత్సర్గము.

౬. చైత్రి లేక శూలగవకర్మ- చైత్ర శుద్ధ పౌర్ణమి, ఈశానబలి.

౭. ఆశ్వయుజ లేక హేమంత ప్రత్యవరోహణ కర్మ- ఆశ్వయుజశుద్ధ పౌర్ణమి

సప్తహవిర్యజ్ఞములు- ఇవి ౧ అగ్న్యాధేయము, ౨ అగ్నిహోత్రము, ౩. దర్శపూర్ణమాసములు, ౪. చాతుర్మాస్య హవిర్యజ్ఞములు (ఇవి ౧. వైశ్వదేవము, ౨. వరుణప్రఘాసము, ౩. సాకమేధము, ౪. సునాసీరయము నని నాలుగు), ౫. ఆగ్రాయణేష్టి, ౬. నిరూఢపశుబంధనము, ౭. సౌత్రామణి

సప్తసోమయజ్ఞములు-ఇవి ౧. అగ్నిష్టోమము, ౨. అత్యగ్నిష్టోమము, ౩. ఉక్థ్యము, ౪. షోడశి, ౫. వాజపేయము, ౬. అతిరాత్రము, ౭. అప్తోర్యామము నని. ఇటుల ఆత్మకర్తృక కర్మలు పాక, సోమ, హవిర్యజ్ఞములు.

౧౬. పుత్రకర్తృకకర్మ ఒకటి- దీనినే అంత్యేష్టి యనియు, పితృకర్మయనియు నందురు. ఇది తాను మృతినందినపిదప తనకుమారుడు తనకై యొనర్చు యంత్యకర్మ. దీని నపరకర్మ యనియు ననుట గలదు.

ఇట్టుల ౮ పితృకర్తృకకర్మలు- ౨ ఆచార్య కర్తృకకర్మలు, ౨ అన్యకర్తృకకర్మలు, 3 ఆత్మ కర్తృకకర్మలు, ౧ పుత్రకర్మ కలిసి షోడశకర్మ లగును.

**కర్మఛండాలురు** - వీరిని కర్మఛండాల చతుష్టయ మనియు, జన్మవలన ఛండాల పంచక మనియుఁగూడ ననెదరు.

శ్లో॥ అసూయకః పిశునశ్చ। కృతఘ్నో దీర్ఘరోషకః।
చత్వారః కర్మచండాలా, జన్మతశ్చాపిపంచమః॥
వశిష్ఠోక్తిః

అసూయాపరుడు, పిశునిగొట్టు (కొండెములు చెప్పు గొట్టువు), విశ్వాసములేని కృతఘ్నుడు, దీర్ఘక్రోధి వీరు ఛండాలురనియు, జన్మఛండాలుడు కూడ నయ్యోనేని ఛండాల పంచకమునియు చెప్పఁబడినది.

**కర్మజిత్తు** - మగధ బార్హద్రథ సంతతి క్షత్రియుఁడు. శ్రీ బృహచ్ఛేనుఁడు, పితామహుడు సురక్షితుఁడు. పుత్రుడు కృతంజయుఁడు.

**కర్మథి గోత్రము** ధనంజయ గణము చూడుఁడు

**కర్మనాశ నది** - సగోదరమను గ్రామము కడ నలబుద్బదిమున జనించి బీహారము, సంయుక్త రాష్ట్రముల మధ్య సరిహద్దుగా ప్రవహించి షహాబాద్ జిల్లాకు పశ్చిమపు హద్దుగ దాఁటుచు గంగానదియందు సంగమించుచున్నది. దీని యుదకము లపవిత్రవంతములని తెలుపఁబడుచున్నవి. విశ్వామిత్ర మహర్షి యభిమానించిన త్రిశంకుని పాపచయములకు గలసి నీటిని అపవిత్రవంతముగ నొనర్చెనని వాయుపురాణము ౮౮-౧౧3 యందుకలదు. ఈనదిందాటిన దోషము పరిహారముగ గంగానది స్నానము చేయదగినదని యందురు. ఇది తొల్లింటి కీకటదేశములోని నదియని తెలియుచున్నది. కీకటదేశము గూర్చి ఇంతకన్న నేమియుఁ దెలియరాకున్నది.

**కర్మ భూయస్త్వాత్ఫల భూయస్త్వమితి న్యాయము** - ఎంత శ్రమపడి పని జేసిన నంతగా ఫలించునని తెల్పుట కీన్యాయ ముపయోగింతురు.

**కర్మవాదిమతము** - దీనికి మీమాంసకమతమనియు, పూర్వమీమాంసామతమనియు, జైమిని మతమనియు వాడుక పేరులు కలవు. వ్యాసుని శిష్యుఁడగు జైమిని ఈమత కర్త. పూర్వమీమాంస సూత్రములు (జైమినికృతము) ఈమత గ్రంథము, వీనిపై శబరర్షి వ్రాసిన భాష్యమును రచించెను. (మీమాంస శాస్త్రము చూడుఁడు) ఇది కర్మ ప్రతిపాద్యమై వేదార్థమును విచారించును.

ఈమతమున వేదము ఋగ్యజుస్సామాథర్వణాత్మకమగునది. స్వతః కల్పితముగాని పరమేశ్వరాగతమని చెప్ప నిదర్శనములు లేవు. అది స్వతః ప్రమాణము. జగత్తు సత్యము గాని, మిథ్య గానేరదు. వేదమునందు చెప్పఁబడుటచే ఈశ్వరుఁడున్నాఁడని ఎఱుఁగ బడుచున్నది. కాని ఈశ్వరుడు స్వతః ప్రమాణముగాక పరతః ప్రమాణమగుచున్నాఁడు. వేదమునకును, జగత్తునకును ఆద్యంతములు లేవు. వేదము కర్మము దెల్పుఁగాన ధర్మాధర్మముల నెఱుఁగ జిజ్ఞాస చేసి సత్కర్మల నాచరించిన సత్ఫలములను, దుష్కర్మల నాచరించిన దుష్ఫలములను ప్రాణి స్వర్గమునందును, నరకమునందును అనుభవించుటయెగాక, ఐహికమునను పెక్కుజన్మల ననుభవించనగుచుండును. ఆత్మ ఆద్యంతములు లేనిది. తానొనర్చిన కర్మ ననుసరించి జన్మముల ఫలానుభవము లందుచుండును. ఈమతమున ప్రత్యక్ష అనుమాన ఉపమాన శాబ్ద ప్రమాణము లంగీక

రింపఁబడినవి. బ్రహ్మజిజ్ఞాస, పరమేశ్వరారాధ నాదుల వలన మోక్షము గల్గుట, భక్తి ఇవి అంగీకరింపఁబడ లేదు.

కర్మవాది మతమున ఆత్మ యోగాభ్యాసము వలన నెఱుఁగఁదగినదనియు, మనోగ్రాహ్యమనియు అద్వితీయమనియు ఆత్మకన్న వేఱుగ నీశ్వరుఁడను నది లేదనియుఁ జెప్పఁబడినది.

**కర్మవాది మతమునకు నిషేధములు** — కామ్యకర్మ, నింద్యకర్మ, పరమేశ్వరార్చన, అనాచారము. ఇవి నాల్గు నిషేధ కార్యములుగ చెప్పఁబడినవి

**కర్మవిపాకము** — ఇది పూర్వకర్మానుభవములం గూర్చి తెల్పు గ్రంథము జాత్యాయు ర్భోగ నరకానుభవములం గూర్చి వివరింపఁ బడినది. సూత్రరూపకముగ రచింపఁబడి దానికి భాష్యము కూడ వ్రాయఁబడినది

**కర్మసాక్షులు** — మానవులొనర్చు సకలకర్మలను గాంచుచుండువారగు సాక్షిభూతులు. శ్లో. సూర్య స్సోమో యమః కాలో । మహా భూతాని చ పంచ । యేతే శుభాశుభస్యేహ । కర్మణో నవసాక్షిణః ౧ సూర్యుఁడు ౨ చంద్రుఁడు, 3, యముఁడు ౪ కాలము, ౫. పృథ్వి, ౬, జలము, ౭ తేజస్సు, ౮ వాయువు, ౯. ఆకాశము.

**కర్మస్థానములు** (చత్వారింశతి కర్మస్థానములు ౪౧)---కృత్స్న కర్మస్థానములు ౧౦, అశుభ ౧౦, అనుస్మృతి ౧౦, బ్రహ్మవిహార ౪, అరూప్య ౪, సంజ్ఞ ౧, వ్యవస్థా ౧.

**కర్మేంద్రియములు** — ఇంద్రియములు చూడుఁడు.

**కర్రంట్సుపండ్లు** (Currants fruits) ఆదికాలమున వీటిపేరు కోరింతమని యుండెను. గ్రీసు దేశమున కోరింతమునుండి యీపేరు గల్గి రాను రాను ఆంగ్లభాషయందు కర్రెంట్సాయెను. నల్లని గింజ లేని ద్రాక్షజాతిపండ్లు. ఈచెట్లు అన్ని చోట్లను పెరగవు. చెట్లుకల తావున కొంచెము దూరములోన నాటిన బ్రతుకునను నమ్మక ముండదు. ఇది గ్రీసుదేశపు వాక్కు అని చెప్పఁబడి నది. ప్రపంచమందలి యన్ని దేశములకు ఆదేశ మందలి కొరింతు రేవునుండియు, కలామతా రేవునుండియు, పెట్రాస్ రేవునుండియు ఎగుమతి చేయఁబడు చున్నవి

కర్రెంట్లు క్రీ. శ. ౧౮౧౬ నుండి ఇతర దేశ ముల కెగుమతి చేయఁబడు చున్నవి. కొరింతు పురప్రాంతమునను సముద్రమున గల జంటిద్వీప మునను, కేఫలోనియా ద్వీపమునను పిదప వీటిని పెంచుట ప్రారంభించిరి. సముద్రతీరముఁ దప్ప ఇతర తావుల నివి పెరుగవని తెలుచున్నది. ఇటీవల ఆస్ట్రేలియా యందు కొన్ని తావుల స్వల్పముగా పెరిగి కాయుచున్నవి గాని అది చాల స్వల్ప మాత్రమని చెప్పఁదగినది

**కర్రపెండలము** - కర్రపెండలము పెండలపు జాతితో సంబంధము కలది గానేరదు. ఇది చిన్నచెట్టు. దీనికర్రలను తియ్యగ ముక్కలుగ కొట్టి నాటిన బ్రతికి అడుగున కుంపఁ బారుఁనది. తీగగాదు.

కర్రపెండలము భోజనపదార్థము. దీని దుంప లాగు బలముగల్గించు గుణము గలదు. ఇది వాతము నుద్రేకించి విరేచనబద్ధము గల్గించి ఆమ వికారము జేసెడిని. కొందఱీదుంపలనుండి పంచదారం దీయుదురు. కాని అది అంత శ్రేష్ఠము గాదు. విస్తారముగనూ రాదు.

**కర్రలేనివానిని గొర్రెకూడా కరవ వచ్చెడిని** - ఆంధ్రలోకోక్తి.

**క్రాపురము**- తొల్లింటి కర్కోటక నగరము చూడుఁడు.

**క్రికుక్క కపిలధేను వగునా ?** ఆంధ్రలోకోక్తి.

**క్రెంటు ఎకౌంటు**- (వాణిజ్యసంబంధ పరిభాషా పదము) - దీనిని ఎకౌంటు క్రెంటు అని వాడుచుందురు. వడ్డీలేకుండ దాచి నిల్వ యుంచిన ధనము. కోరగనే ఈయ వలసిన ధనము.

**క్రెన్సీ** (Currency)- (వాణిజ్యసంబంధ పరిభాషాపదము). నాణెములు, రూకలు. దేశమున ప్రచారమునందున్న నాణెములు, నోట్లు మొదలగునవి యని యర్థము. నాణెములో నిమిత్తములేక లెక్కమాత్రము చూచుకొనుటకు Currency by Tale అనియందురు. నాణెములను రూకలుగ ముద్రించుట మొదలుగని తొల్లింటికాలమున బంగారు, వెండి మొదలగు లోహములను తూచి విలువక్రింద నిచ్చుచుండెడివారట. దానికి Currency by Weight అని పేరు. ఆదేశమున ప్రచారమునందుగల నాణెములలో అసలువృద్ధుల నిచ్చుపద్ధతిని Issue చేయఁబడిన అప్పుపత్రములకు Currency Bonds అనిపేరు. బ్యాంకివ్యాపారమునను Credit కు సరియగు Debit (loans) మాత్రమే నడపుచు తనకు లభించు Commission పైని మాత్రమే ఆధారపడి వ్యాపారము నడపుపద్ధతికి Currency Principal అని పేరు. వడ్డీలేకుండా బాంకియందు సొమ్ము నిల్వయుంచి ఎప్పుడు కావలసినప్పుడు తీసికొనుచుండు ఏర్పాటునకు Current Account అనిపేరు.

**కర్లింగు ఆట** (Curling) — ఇది చలికాలపుటాటగా నెంచఁబడినది. ముప్పదిరెండు లేక నలుబదిరెండు గజముల పొడవున మంచుచే గప్పఁబడిన ప్రదేశమున ఆడబడుఆట. ఈరంగ స్థలికి రింకు(Rink)అని పేరిడియున్నారు. ఇరుకక్షుల వారిచే నాడబడుచుండును. కక్షకు నల్వురాటకాండ్రుందురు. వీరు రెండు రాతిపురాళ్లతో నాడుదురు. అవి రెండు పౌనుల బరువునకు మించనివిగనుండి ఇనుపసాధనములను పట్టుకొనుటకు అమర్పఁబడియుండును. ఇది బౌల్సుఆటవంటిదే యని చెప్పఁబడినది. కాని కొంచెము భేదములగు పద్ధతులమేర కాడఁబడునాట, మా దేశమున వ్యాపకముదలేదు.

**కర్షము** — రెండుతులములయెత్తునకు కర్షప్రమాణమని పేరు. మరియు ఉదుంబర మనుటయుం గలదు. (ఆయుర్వేదమానము చూడుఁడు).

**కర్హాడ, కరాడ, కర్హాటక దేశము, కర్హాటదేశము** — బొంబై రాజధాని సతారాజిల్లాలో కరాడపురమున్నది. ఇది కృష్ణాకోయనదుల సంగమముదరిని కలదు. ఇది తొల్లింటి కర్హాడపురము. ఈప్రాంతదేశము కర్హాటక దేశము స్కాందపురాణ సహ్యాద్రిఖండమున వేదవతీనదికి దక్షిణమునను, కోయనానది కుత్తరపు టెల్లగను గల దేశమని చెప్పఁబడినది. మహాభారతము సభాపర్వము ౩౧ యందు నకులుఁడు జయించిన దేశమని ప్రశంసింపఁబడినది. ఒకతరి కర్హాడపురరాజ్యమును శైలాహారవంశ నృపతులు పాలించిరి. కుంతలదేశమును కల్యాణ నగరము రాజధానిగ (షోలాపూరు ప్రాంతము) ఏలిన రెండవ విక్రమాదిత్యనృపతి కర్హాటక ప్రభుండగు నొక శైలాహారవంశనృపతి కుమార్తెయగు చంద్రరేఖం బరిణయమయ్యెనని విక్రమాంకదేవచరిత్రము ౭ వ అధ్యాయమున చెప్పఁబడినది.

నది. ముద్రణయంత్రముల మూలముగా అద్దకము ప్రపంచమంతయును గప్పివేయుచున్న యీ దినములలో భారతీయులు తమ తాతలనాటి చేతి యద్దకము విడువకుండినచో అనాది సిద్ధముగా అద్దకపుపనియందు తమకున్న పేరుప్రతిష్ఠలు నిలబెట్టుకొనజాలరు. అందుచే బూర్వపుపద్ధతులను గూర్చి యిందు విపులముగా జెప్పక ప్రస్తుతపద్ధతులనే వివరించుచున్నాము. పక్కా రంగు గలిగి వివిధములగు విదేశపు నమూనాలకు దీసిపోనప్పుడే మనదేశపు అద్దకపు సరకునకు విదేశీసరకుముందు గిరాకీనిలచును.

అద్దకపు విధానములు- ౧. చేతి యద్దకపుబని. దీనినే Block Printing by Hand అందురు.

౨. యంత్రముల సహాయమున అద్దకము- దీనిని Block Printing by Machine (Surface and Perrotine) అందురు.

3. లోహపు రేకులను వలసిన నమూనాలకుం దొలచి రంగుపూచి యద్దుట- Flat Press లేక Stencil Printing అనియందురు.

౪. నమూనాలు చెక్కబడిన లోహపురోలరుల సహాయమున అద్దకము (Cylinder) పై నుదహరింపబడిన విధానచతుష్టయమునందును చేతియద్దకము మిక్కిలి సులువైనది. Cylinder అద్దకము పనివానితనమునందేమి, సున్నితమునందేమి, మన్నికయందేమి మిగుల నెన్నిక గన్నది. Perrotine అద్దకము నాలుగురంగులకు మించని చిన్నచిన్న నమూనాలకుమాత్రమే యుపకరించును. Flat Printing వలన నిడివియైన నమూనాలు విడుపులేకుండ నద్దుట కడుకష్టము. Hand block printing వలన పెద్ద పెద్ద Pattern ఎన్నిరంగులనైనను సున్నితముగా నద్దకము చేయవచ్చును. ఏదైనను నొక నమూనా (Pattern) ఒక బ్లాకులో పూర్తిగాకపోయినపుడు అనేకములైన బ్లాకులలో నదిపెంచి పూర్తి యగునట్లు చేయవచ్చును. పనితనము కచ్చితముగాను, సున్నితముగాను కావలసివచ్చినపుడు Cylinder Printing ఉపయోగింతురు. Cylinder Printingలో తక్కువవెలలో అధికముగ పని వచ్చును. కాని Hand Block Printing అంతనాణ్యముగా నుండదు. ఒక నమూనానుబట్టి (Block)దిమ్మలు చేయుటకు ముందు ఎటువంటి Printing ఏర్పాటు చేయబడునో మూదాలోచించుకొనవలయును. Block Printing నకు దిమ్మమీద Design ఉబ్బి యుండవలయును. అప్పుడు దానిని రంగులో ఒక బట్టపై నద్దుటకు వీలుగా నుండును. Cylinder Printing లో నమూనాలు చెక్కబడిన రాగిరోలరు గాని రోలరు గాని యద్దకము ముద్రించుట కుపయోగింపబడును. ఒక్కొక్క రకము రంగున కొక్కొక్క రోలరు వాడబడ వలయును.

కావలసిన పరికరములు -అద్దకము పని సులువుగా చేయుటకు సమ మట్టముగా నున్న చతురస్రపు బల్ల. అది దిట్టమగు కర్రతో జేయబడినదియై యుండ వలయును పరిమాణము అవసరోచితముగా నుండును. ఎప్పుడైనను బట్ట వెడల్పుకన్న బల్ల వెడల్పు అధిక మయినదై యుండ వలయును.

బల్ల మీదిభాగము నందు ఉన్ని నుప్పటి యొకటి బిగువుగా నుండునట్లు అమర్చబడి యుండును. బల్లయొక్క ఒక కొసను రెండు రోలరులకు (Rollers) బ్రాకెట్లు (Brackets) అమర్పబడి యుండును. వాటిమీదనే (Black cloth) గుడ్డయును అద్దకముచేయవలసిన గుడ్డయు గుత్తముగా బిగింపబడి యుండును. క్రింది రోలరుమీదినుండి బిగింపబడిన (Black cloth Unbleached) కోరా కాలికో (Calico)

గుడ్డయై యుండును. అది అద్దకము చేయబడ వలసిన వస్త్రమునకును, ఉన్నినుప్పటికి నడుమ నమర్పబడి యుండును. అందువలన అద్దకము వేయునప్పుడు రంగుచెదరుట కవకాశముండదు. Printing Table రెండవ కొనను మూడవ రోలరుండును. అది టేబిల్ పొడుగునను అద్దకము పూర్తియైన వెనుక Black cloth ను తిరిగి ముందునకు లాగుట కుపకరించును. అద్దకము పూర్తియైన తరువాత Loop లనబడు కొక్కెములకుఁ దగిలించి ఆరఁ బెట్టఁ బడును. ఒకప్పుడు ఆవిరివలన వేడిగా చేయఁబడిన Cylinders సహాయమున ఆరఁబెట్టుటయుఁ గలదు.

అద్దకపు కుంచెలు (Brushes) :- రంగు పాత్రలలోని రంగులను సమ మట్టముగా నుండునట్లు అద్దకపు టొత్తులపై (Pads) పారించుటకు కావలసిన పరికరములలో అద్దకపు కుంచెలు (Brushes) ప్రధానము లైనవి. ఒక్కొక్క రంగునకు ప్రత్యేకముగా నొక్కొక్క కుంచె వాడుక చేయఁబడ వలయును. సాధారణముగా ఆరంగుళముల Shoe Brush మూఁడు కుంచెలు గాఁ జేయఁ బడును. Block లలో అగత్యముయిన దానికన్న నధికముగా రంగు పట్టినయెడల దానిని తొలగించు చుండుటకు చిన్న Painters Brushes కూడ కావలసి యుండును.

అద్దకపు దిమ్మలు (Blocks) -రంగులు అద్దకము వేయుటకు దిమ్మల విషయములో ప్రత్యేకపు జాగ్రత్త పుచ్చుకొనవలయును. అవి శిల్పపుఁ బనివాని తనము కలిగి మంచి నమూనాలతో కూడినవియై ఏమాత్రపు టరుగుదల కనిపించినను వెంటనే మార్పఁబడు చుండవలయును.

ఈ రెండు రకములలో నొకటి Ordinary Blocks, రెండవది Combination Blocks. ఒకేరంగు అద్దకపుఁబని చేయవలసి వచ్చినపుడు Ordinary Blocks ను, రెండు మూడు కలిసిన Combination Blocks ను పలు రంగులు ముద్రింపవలసి వచ్చినపుడు నుపయోగింపఁబడును.

నమూనాను బట్టియు, కావలసిన పని స్వభావమును బట్టియు Hand block పరిమాణము మారుచుండును. అయినను సాధారణముగా ౯, ౧౦ అంగుళముల పొడవును, ౫, ౬ అంగుళముల వెడల్పును గలిగి యుండును. సులువుగా పట్టుకొనుటకు వెనుకభాగమున (Handle) పిడి అమర్పఁబడి యుండును. ఈ బ్లాకులు పూర్వకాలము నుండియు చేవచింతకఱ్ఱతో చేయఁబడు చుండుట యాచారము. కాని యిందులో నరుగుదల విశేషముగా నుండుట యిటీవల కనిపెట్టి, రాగితీగలు బల్లపరుపుగా సాగగొట్టి అంచు కట్టి ఆదిమ్మమీద నమూనా ఉబికించి యుపయోగించు చున్నారు.

రంగుల జల్లెడ (Sieve) — రంగుల జల్లెడలో మూడు ప్రత్యేక భాగములుండును. ౧. Swimming Tub అనఁబడు పెద్ద కర్రతొట్టెయొకటి మూడువంతులు అద్దకపురంగుతో గాని, పిండిపేస్టుతోఁ గాని నింపఁబడియుండును. ౨. Mackintosh అనఁబడు నొకజాతి రబ్బరు పూతగుడ్డతో నొకయంచున మూయఁబడిన drum. Swimming Tub మీద నీ drum తేలియాడుచుండవలయును. కాని ప్రక్కలకు పోరాదు. 3. రంగులజల్లెడ యనఁబడు మరియొక drum ఒకయంచున ఉన్నివస్త్రముతో మూయఁబడియుండవలయును. ఈ drum మొదటి drum లో నుంచవలయును.

ఒక్కొక్క రంగునకు ప్రత్యేకముగా నొక్కొక్కరంగుల జల్లెడ వాడుకచేయఁబడు చుండవలయును. కాని యెన్నిరంగులకైనను ఒకే

Swimming tub చాలును. Swimming tub లో పిండిపేస్టు వేయుటయందలి యుద్దేశము బ్లాకునకు రంగు ఏకరాసిని పారించుటకై యున్నది. Swimming tub లోని పేస్టుమీద రంగుపడి పాడుచేయకుండ మొదటి డ్రమునకు కట్టిన Mackintosh గుడ్డ అపును.

ఆవిరిచే తడియార్చు పరికరములు (Steaming apparatus) - ఇవి తప్పనిసరిగా నుంచ వలసిన పరికరములు ఈక్రింద వ్రాయఁబడిన వివరముల వలన వాని యుపయోగము విశదము కాఁగలదు. ఇంకఁగావలసిన యితర పరికరములు గరిటెలు, చిప్పలు, కొలపాత్రలు, త్రాసులు, గుళ్ళు మొదలగునవి.

వేఱు వేఱు రంగుల ద్రావకములఁగాని, పేస్టులనుగాని, ఉడకబెట్టుటకు సామాన్యము లగు ప్రొయ్యలైనను పనికి వచ్చును.

రంగులు పాళ్ళు.- ఇఁక నుపయోగింపఁదగు రంగులను గూర్చి తెలుప వలసి యున్నది. ప్రస్తుత కాలములో హిందూదేశపు పచ్చిరంగులగు నీలి, తొగరు, చాబరా మొదలగునవి కాక Synthetic రంగులు వానికి బదులుగా వాడుక చేయఁబడు చున్నవి. పక్కా-రంగులు, Chlorine వలనగాని, ఉతుకుట వలన గాని ఎండవలన గాని చెడిపోని Alizarine colours, Naphthol colours మొదలగునవి ఉపయోగింపఁబడు చున్నవి

బట్టలను దట్టపఱచు సాధనములు .- ఈసాధనములలో రెండు విధములు కలవు. ౧ మొట్ట మొదట రంగుపట్టుటకు చాలినంత మట్టుకు దట్టము కలిగించుటకు మాత్రమే యుపయోగింపఁబడి తరువాత రంగునకుగాని, అద్దకపు నమూనాలకుగాని భంగము లేకుండ తీసివేయుటకుఁ దగిన సాధనము మొదటి రకము.

ఇందులకు చింతఅంబలి, గంజి, సెనిగాంబియా జిగురు, ట్రగాకాంత్ జిగురు మొదలగునవి యుపయోగింపఁ బడును.

౨. రంగులలో నవిభాజ్యములుగాఁ గలిసి పోయి బట్టను దట్టపఱచుటకును, రంగును నిల బెట్టుటకును గూడఁ బనికి వచ్చు Albumen, Casein, Glue (సరేసు) మొదలగునవి రెండవ రకము సాధనములలోఁ జేరును.

నూలుపోగుల యందు సుఖువుగాను, సమముగాను రంగు పట్టునట్లు చేయుటకే గంజి, సరేసు మొదలగు చిక్కఁబఱచు పదార్థములు వాడుక చేయఁబడు చున్నవి. అవి రంగు చెదరకుండ కాపాడును. బట్టకొక్క స్వభావమును బట్టి చిక్కఁబఱచుటకే పదార్థ ముపయోగింపఁ బడ వలయునో నిర్ణయించుకొని వలసి యుండును. మెత్తని యద్దకము కావలసిన బట్టలమీద గంజి బిగి పనికిరాదు. అట్టివానికి Senegal, Tragacanth or Dextrin అను జిగురుపదార్థములనే వాడుక చేయ వలయును. మోటద్దకమునకు గంజిబిగి ముఖ్యము రంగు రెండు ప్రక్కలను సమానముగా నాటుకొనవలయునేని Tragacanth ఉపయోగింప వలయును.

బట్టలకుపెట్టు గంజి (Starch) - గోధుమ, మొక్కజొన్న, ఉరలగెడ్డలు, వరిబియ్యము మొదలగువాని గంజి (Starch) చల్లని నీటిలో విశేషము పనిచేయదుగాని, ఉడుకునీటిలో మంచిపని చేయును.

Acetic Acid తప్ప తక్కిన Acid లన్నియు పలుచని Starch పేస్టులు తయారుచేయుటకుపకరించును. బ్రిటీషుదేశపుబంకను Starch కు బదులుగా వాడుక చేయుచుండుటయుఁ గలదు. అద్దకపుఁబని కుపయోగింపఁబడు గంజి లన్నిటిలో గోధుమగంజి మంచిది. గోధుమగంజిలో తగు

మాత్రము Olive oil చేర్చి మిగడవలె తయా రగునట్లు కొంచెము చల్లనినీటిని పోసినయెడల మొదటిరకపు గోధుమ Starch తయారగు చున్నది.

Tragacanth బంక - బట్టకు దట్టముచేయుట కిదియొక ప్రకృతిసిద్ధమగు బంక అద్దకపుబని కెంతయు నుపయుక్తమైనది. దీనిని గంజితోఁ జేర్చి యుపయోగపఱచినయెడల కేవలము గంజిని చేర్చినప్పటికంటె రంగు సమపాలుగా నంటి అద్దకపుబని నాణ్యముగా నుండును నాణ్య మును స్ఫుటత్వమును చెడకుండ పెద్దపెద్ద రేకు లపై నద్దకము గాఢమగు రంగు అద్దకముచేయు పట్ల దీనియుపయోగము కలదు.

Dextrin and British Gum - గంజిని (Starch) విశేషముగా నుడకబెట్టుటవలన పై నుదహరించిన బంకలు తయారగు చున్నవి. ఇవి లేతరంగు గాని, ముదురు రంగు గాని, కలిగి యుండవచ్చును ఆభేదము చిక్కఁదనము శక్తి ననుసరించి యుండును. Dextrin గాని, British Gum గాని తయారుచేయుటకు Starch అనగా నీటిలో కలిసిపోవునట్టి స్థితి వచ్చుకును పదగించుచు ఉడకించును. లేతరంగు బంకలు ముదురురంగువానికన్న నధికముగా అసలు Starch గుణమును కలిగియుండును. పైని వివరించిన రెండురకముల బంకలలో నేదియును రంగు బట్టలో నికిఁ జొచ్చుకొనిపోనీయదు అందుచే ముదురురంగువేయుట కేవలమాత్రము నుపకరిం పవు. చిక్కఁదనము కుపయోగించు British gum లో 20% మొ॥ 30% కరుఁగ కుండ మిగులు Starch ననుసరించి చిక్కఁ దనము కలిగియుండును. కాని యీయధిగువ వివ రింపఁబడిన పాళ్లు అనుసరించుట సమంజసము. లేతరంగులయద్దకపుజిగురు రెండుమూడు పౌన్లకు ఒక గాలను నీరు కలపవలెను. ముదురు రంగులు యద్దకపుజిగురు ఆరు మొ॥ పది పౌనులవఱకు నొక గాలను నీరు కలపవలెను. ఈ జిగురులను నీటిలో మరగించి చల్లార్చినఁ జాలును.

సెనిగల్ (Senegal) గమ్ము, అరబిక్ గమ్ము - బట్ట యాతర్భాగమునకు గాఢముగా రంగు ప్రాకిపోవకుండునట్లు పైనిచెప్పిన రెండు రకముల బంకలును ఉపయోగింపఁబడును.

ఇందుపయోగింపఁబడు రసపదార్థములు - అద్దకపుబనికి Neutral gum solution అనఁబడు నొకవిధమగు జిగురుపదార్థమును, Standard ఎఱ్ఱసారాయమును, సీసపు Sulphate ద్రావక మును, తగరపు పొర (Tin pulp) మొదలగు నవి యవసరములు వీనిని తయారుచేయు విధానమును గూర్చి Neutral gum solution, Standard red liquor, Lead sulphate solution, Tin pulp అను ప్రత్యేక వ్యాస ములు చూడుఁడు

**కలకాల దొంగ ఒకనా డెప్పు డైనా దొరకకపోడు** — ఆంధ్రలోకోక్తి

**కల గోత్రము** — లాగాక్షి గణము చూడుఁడు.

**కలబంద** లా. Aloe indica మరియు, Aloe carbadensis. ఆంగ్ల Indian aloes సం. ఘృతకుమారీక, అమరా.

కలబంద వైద్యోపయోగమగు ఓషధి. ఉత్తర హిందూదేశమున దీనిని భోజన పదార్థ ముగఁ గూడ వాడుచున్నారు కలబంద తెల్లని దియు, ఎఱ్ఱనిదియు నని ద్వివిధములు. అం దెఱ్ఱనిది శ్రేష్ఠమగును. కఫము, కుష్ఠువ్యాధి, సెగరోగము, కండ్లపుండ్లు, కండ్లనీరు, పుసికట్టు చుండుట, కండ్లనొప్పులు, ప్లీహము, గర్భము లోని పుండు, విరేచనబద్ధము, మేహవాతపు

నొప్పులు నివారించును. నలవచేసి మేహశాంతి పైత్యశాంతి నొసర్చును. కపుకుదెబ్బకొప్పులు మాన్పును

కలబందపువ్వు క్రిమి, శ్లేష్మరోగములనడంచి మేహశాంతి, చలవచేయుటయేగాక వాతోద్రేకము గల్గించును. శాకతత్వము గలవారి కను కూలమై యుండును. వాత శరీరులకు పనికి రాదు.

**కలబోలిజమ్** (Calabolism) — Katabolism చూడుడు.

**కలము** (Pen) — సిరాయూని ముంచి కాగితముపై వ్రాయు పనిముట్టు నకు కలమనియెదరు సంస్కృత మున దీనిని లేఖని యనియెదరు.



లేఖని యనగ వ్రాయు పనిముట్టనియె యర్థము ఆంగ్లమున దీనికి Pen అని పేరు. ఈపదము లాటిన్ భాషయందలి Penna (పక్షిరెక్క) పదమునుండి యేర్పడినది. అనగా తొల్లిటికాలమున ప్రాశ్చాత్యదేశములందుసహా భారతదేశమునందువలెనే పక్షిరెక్కల ఈకల గుల్ల భాగములు రెక్కసూదిగ నొనర్చి వ్రాయుచుండిరని తెలుచున్నది.



ఇక్కాలమున ఉక్కుపాళిలతో కూడియుండిన లేఖనులకుం గూడ నా కలమను పేరే ఒప్పుచు వాడుక నందియున్నది.

**కలరావ్యాధి** — విషూచి చూడుడు.

**కలశపురస్సర (ప్రాసాద (దేవాలయ) నిర్మాణ తుల్య న్యాయము** — దేవాలయనిర్మాణ మొనర్చి శిఖరప్రతిష్ఠ యొనర్చుటవంటిదని యర్థము. ఓర్పుతో శ్రమచేసి పని పూర్తిచేయుట యని భావము.

**కలశభవులు** — అగస్త్యమహర్షి, వశిష్ఠమహర్షి, ద్రోణాచార్యులు వీరు కలశభవులు లేక కుంభసంభవు లనంబడుదురు. వీరు మైత్రావరుణుల తేజంబు కలశంబునం బడ యందుండి జన్మించిరని చెప్పంబడినది

**కలశరేఖ** — పురుష సాముద్రికము చూడుడు. స్త్రీసాముద్రికము చూడుడు.

**కలశి గోత్రము** — కపి ఉపగణము చూడుడు.

**కలహాకంటకి** — కాలకౌశికుని భార్య పేరు. కలహప్రియురాలగు యువతి నీపేర పిలువనగా నుడివెదరు. హరిశ్చంద్రుని చరిత్రమున నిది విపులముగం గలదు.

**కలహగ్రామము** (కహల్గాన్) — అంగదేశము చూడుడు

**కలహారీ ఎడారి** — ఆఫ్రికాఖండమున నైరుతిదిశగానున్న ఎడారి. ఆరెంజినదికుత్తరముగ నాలుగువందలమైళ్ళు దనుక వ్యాపించియున్నది. లక్షా ఇరువదివేల మైళ్ళప్రదేశమట.

**కలాన్నగరము** — దీని నిప్పుడు కలట్ అనుచున్నారు. బాలోచి (బెలూచిస్థానము) దేశపు రాజధాని (బాలోచి చూడుడు.)

**కలాప గ్రామము** — మరుడు, దేవాపి యను నిద్దరు చంద్రవంశపుక్షత్రియులు తపంబొనర్చిన తావు. వీరు కల్క్యవతారమున విష్ణుదేవుండు దస్యురాజ్యముల సమయం జేసినపిదప తామిద్దరు ఒకరయోధ్యకును, రెండవవారు హస్తినాపురమునకును ప్రభువులై యొనర్పంగోరుచు తపంబొనర్చినవారుగ కల్కిపురాణము ౩-౮ యందు చెప్పంబడినది. మహాభారతము వనాసల పర్వము ౮ యందునను భాగవత పురాణము ౧౦-౮౭-౭ యందునను బృహన్నారదీయ

పురాణము ఉత్తర ౬౬ యందనను, కలాప గ్రామము హిమాలయముపై బదరీక్షేత్రమున నున్నదని చెప్పబడినది

వాయు పురాణము ౯౧ యందు ఊర్వశి కొకకాలము పురూరవునితో గడపిన హిమాలయ పార్శ్వభాగ ప్రదేశమని వివరింపబడినది. ఫ్రాం. కెప్టెన్ రేపర్ పూర్వోక్తకుడు గడ్వాల్ సంస్థానము బదరీనాథ ప్రాంతమున అలకానందలో చేరుకొను సరస్వతీ జన్మస్థానమునకు సమీపమున నుండియుండునని తెల్పియున్నాడు

**కలాపహార నగరము** — మందరగిరి కడనుండిన పురము అంగదేశము చూడుడు

**కలాల్డమన్** — హితోపదేశము చూడుడు.

**కలావతి** — తండ్రి పేరుడను పేరుగల ఋషి తన పుంజకస్థలయను పేరుగల అప్సరస సాదర్యవతురాలనియు పార్వతీదేవి ఈమెకు పద్మినీవిద్య నొసంగెననియు, అది కోరకసౌఖ్యము లొసంగు విద్యయనియు, నాసు దానిని వాహాధిని పుత్రుడగు స్వారోచికిచ్చి తానాతనిని బరిణయ మాయెననియు చెప్పబడినది స్వారోచి మనువని యొకండు

**కలాహపహాడ్** - కోలాహాల పర్వతము చూడుడు.

**కలిగినవారు కన్నెత్తి చూచే వరకు వారి ప్రాణం పోతుంది** — ఆంధ్రలోకోక్తి

**కలిగినవారి కందరు చుట్టాలే** - ఆంధ్రలోకోక్తి

**కలిగినవాడు కలవానికే చేర్చును లేనివాడు కలవానికే చేర్చును** — ఆంధ్రలోకోక్తి

**కల్మి కులములకు మిండడు** — భాగ్యవంతుడు శ్రేష్ఠకులజుడుగ తలంపబడు నని భావము. (ఆంధ్రలోకోక్తి).

**కలిమిలేములు కావడికుండలు** - ఆంధ్రలోకోక్తి.

**కలుగానుగ చెట్టు** — లా. **Ficus heterophylla** సం. త్రాణం, త్రాణా, త్రాణీ, త్రాయంతీ, త్రాయమాణా, బలభద్రా, బలభద్రికా, వాష్ణికీ. ఇది వైద్యోపయోగమగునది. దీనిఆకు, చెక్క, వేరులను, రస, చూర్ణ,కషాయ రూపముల వాడుచున్నారు ఉన్మాదములు (పిచ్చి), కఫపైత్యములు, జ్వరములు నివారణ మగునని చెప్పబడినది. ఈచెట్టు రాతిమీదనే పుట్టి మంటి (మన్ను) సాయమక్కరలేకనే పెరుగు స్వభావముకలది

**కలువచెట్టు** — ఇది నీటియందు పెరుగున భూమిపై శేరియుండు బుగదలోనుండి పుట్టినదుంప నుండి నీటిపైకి కాడలగుండా లేచి ఆకులు నీటిపై తేలుచుండు విప్పు, మటనేపూయ నీటిచెట్టు. దీనిపూవులు కొన్నిదినములు జీవించును. అత్తరి నవి చంద్రోదయముతో రాత్రులందు వికసించును తెల్లవారినపిదప ఎండ బలపడుటతో ముడుచుకొనిపోవును, తిరుగ చంద్రోదయమున రాత్రియందు శీతలత వ్యాపించు కతన తిరిగి వికసించుచుండునుగాన, చంద్రునితో సంబంధము గలవిగ చెప్పబడినవి. కవులు స్త్రీల నేత్రములను కలువరేకుల (పూవునందలి రేకులు) తో పోల్చి వర్ణించుదురు కలువలు తీయని నీటియందే పై పరిస్థితులలో పెరుగుంగాని భూమిపై పెరుగునవికావుగాన తియ్యనినీటి జలనిలయములందు (ప్రవాహజలములందుకాదు) మాత్రమే పెరిగెడిని. తెల్లకలువ యనియు, ఎఱ్ఱకలువ యనియు, నల్లకలువ యనియుం గలువజాతి

త్రివిధము. అందు నల్లకలువ (నీలోత్పలము) ఇంచుక యరుదుగఁ గాననగుచుండును. కలువలు సరోవరముల కలంకారములుగ నెంచఁబడు చున్నవి.

తెల్లకలువ- ఇది కలువజాతులలో సామాన్య మైనది. దీనికి లా. **Nymphaea anthers** ఆంగ్ల. **Water lily white.** ఇందీవర, ఉత్పల, కువలయకుముద, శశిత్రయ యని పేర్లు కాని ఈ సంస్కృతపుపేరు కలువకు సామాన్య నామము లుగ నున్నవి. సుగంధయుతమైనది. తెల్లకలువ దుంప రసము, కషాయము లేక చూర్ణము మేహము, పైత్యమును, శ్లేష్మమును నివారించు ననియు, తెల్లకుసుమ రోగము పై స్త్రీలకు చక్కగ పనిచేయుననియు, స్త్రీల గర్భమందలి పిండములను రక్షించుననియు చెప్పఁబడినది. ఇం కను కొందఱు ఋషులు జ్వరములను, విదా హము, అతిసారములు గూడ నివారించు ననిరి. చలువ జేయును.

ఎఱ్ఱకలువ లా **Nelumbium speciosum.** ఆంగ్ల. **Red water lily.** సం. రక్తో త్పల, రాజీవ, కోకనద. ఎఱ్ఱకలువదుంప రసము, కషాయము, చూర్ణము స్త్రీలకు గల్గెడి ఎఱ్ఱ కుసుమ రోగముపై చక్కగ పనిచేసి నివారించు ననియు తక్కిన గుణములు తెల్ల కలువ దుంప వలెనే ననియు చెప్పఁబడినది. పూవులు కండ్లకు చలువజేసి తాపము, కాస, పైత్య వికారముల నడంచును.

నల్లకలువ- **Nymphaea stellata** ఆంగ్ల. **Black water lily.** సం. నీలోత్పల. దీని దుంప రసము, కషాయము లేక చూర్ణము కలువ సామాన్య గుణములే యైనను స్త్రీల రక్త కుసుమ రోగము, రక్తపైత్యము, రక్తస్రావము లపై చక్కగ పనిచేయు ననియు, ఎక్కువ బల ముగ పనిచేయుననియుం జెప్పఁబడినది.

కొందఱు ఋషులు కలువజాతులన్నియు శిరో రోగములపై చక్కగ పనిజేయు ననియు, కలువ ఆకులందు భోజనము మాత్రము అనారోగ్యకర మగునంతటి విసర్జనీయమనియు నుడివియున్నారు.

**కల్కి ద్వాదశి** — ఉపేంద్ర ద్వాదశి చూడుఁడు.

**కల్పచికిత్స (కాయకల్పచికిత్స)** — కల్పింపఁబడినది లేక కల్పనవది కల్పము. ఇష్టా ప్రాప్తియని యర్థము కల్పలత యను పదమును కల్పవృక్షమను పదమును ఈయర్థమునందే శ్రేష్ఠ వాచకములై దనరెడిని. వైద్యశాస్త్రవిదులు పునరుద్భవ కారణములుగ కల్పమున నర్థము చెప్పిరి. శ్వేతవరాహకల్పము మొదలగు పదము లందుకూడ పునరుద్భవకాలమనియే అర్థమగును. ఈ "కల్పము" ఔషధము కల్గించు పునరుద్భవ స్థితికి ఆంగ్లవైద్యశాస్త్రమున **Rejuvenation** అని పేరిడిరి.

ఆంధ్రదేశమునం దీకల్పౌషధములు సర్వ సాధారణముగ వాడుకయందున్నను కల్పచికిత్స యను ప్రత్యేకవిధానము వాడుకగా నుండమి క్రొత్తయైనట్లు తోచినను తోచుచుండును వసంత కుసుమాకరము, పుష్పబాణరసము మొదలగు ఆయుర్వేదీయఔషధములు కల్పౌషధములే. వీటి యందు రస, విష, గంధికాదులు కలియును. కల్ప చికిత్సావిధానము శరీరరోగముల నడంచి రోగికి సుఖ మొసంగు ఔషధప్రయోగ మనుటకన్న తొలుత రక్తశుద్ధిం జేసి శరీరధాతువులను మంచి స్థితియందు స్థిరపర్చి శరీరావయవసముదయమును **(Cells)** పునర్నిర్మాణ మొనర్చుటమూలమున సమస్తరోగనివారణం గల్పించి పునర్జన్మ మెత్తిన యటుల నారోగ్యమిచ్చునది యనదగునని శాస్త్ర మున చెప్పఁబడినది. ఈ మహాఫలితములను చ్యవనమహర్షి చ్యవనప్రాశ సేవనమున నంది

యుంట నీవిధానమైద్య ప్రభావమే. (చ్యవనప్రాశము చూడుఁడు.)

ఇంకను ఆరూతిమహారాజు శస్త్రచికిత్స మూలమున నిష్ఫల మగుచెననియు, ఋషులనేకులు యోగాభ్యాసమున నిష్ఫలము నొందిరనియుఁ జెప్పఁబడుట ఔషధసేవ లక్కర లేకనే కేవలోపచార పథ్యాదులచే నీ ఫలము లందిరని తోఁచెడిని

కల్పచికిత్స- బుద్ధికల్పచికిత్స యనియు, కేశకల్పచికిత్స యనియు, కాయకల్పచికిత్స యనియు త్రివిధము. బుద్ధికల్పములు మనస్సును బుద్ధిని దృఢపఱచి జ్ఞాపకశక్తిని విజృంభింపఁజేసి బలము గల్గించెడిని కేశకల్పములు రోమకూపములు బలపఱచి, కేశము (వెండ్రుక) లకు నల్లని నిగనిగలాడు రంగును, కోమలమును స్థిరముగఁ గల్గించెడిని కాయకల్పములు శరీరావయవసముదాయము నంతటను దృఢము గల్గించి నవయౌవన లక్షణములతో బలము చేకూర్చి శరీరకోమలమును గల్గించెడిని

కాయచికిత్స (మూడవది) నెరవేర్చుటకు పూర్వము పంచకర్మలచే శరీరశోధన మొనర్చి బహిః పరిశుద్ధిని, అంతఃపరిశుద్ధిని కల్గింపవలెనని చెప్పఁబడియున్నది మఱియు నిట్టిది కుటీప్రవేశకల్పమనియు, వాతాతపికకల్పమనియు ద్వివిధము

కుటీప్రవేశికకల్పము మిగుల కష్టమైనది దీని నాంగ్లేయులు Sealed cell treatment అని వాడుచున్నారు. దీనికి భక్ష్యము శీతోదకము, దాహమునకు తగదు కపిలధేనువు (నల్లఆవు) పాలు ఆహారము శరీరావయవము లేపనిం జేయకయు, బుద్ధియు దేనియూహాలు యోచనలు లేకయు, సంపూర్ణవిశ్రాంతిఁ గల్గియుంట విధింపఁబడినది. శాస్త్రముల దీకష్టతరమైన కుటీప్రవేశచికిత్సయే సంపూర్ణఫలప్రద మని చెప్పఁబడినది

తరువాత దగు వాతాతపిక కల్పచికిత్స కొంత సుకరముగ నుండెడిని. ఇందు కదలమెదలకుండు నిర్బంధములు లేవు. విశ్రాంతి విధింపఁబడినను శ్రమకలుగకుండ నటు నిటు తిరుగాడవచ్చును. నిత్యకృత్యములం దీర్చికొనుచు, అన్నభోజన మొనర్చుచు, దీని కర్హకాలము నియమింపఁబడకున్నను, శీతకాల ముత్తమ మని కల్పచికిత్సా నైపుణ్యులనుచున్నారు.

నల్లఆవునకుం గాని, అదిలభింపనిచో నల్లమేకకుం గాని లోని కౌషధమిచ్చుచు దానిపాలు నలువదిదినములును, పిదప దాని కౌషధమిచ్చుట మాని దానిపాలనే ఇంక నలువదిదినములును, రోగి ఎనుబదిదినములు ఔషధముగ త్రాగుచుండవలయును ఈకాలమునందు ఉప్పు, పులుసు, కారములు వర్జనీయములని పథ్యము విధింపఁబడినది. మిరియములకారము కొంచెము వాడవచ్చునని కొందఱనియున్నారు. మూడువారములలో దీని గుణ మగునట. వేఱొక (కల్ప) విధానము పది దినములలో పనిచేయునది కలదట

కల్పచికిత్సలు మృత్యుంజయములు కావనియు జీవితకాలమునందే తిరుగ జన్మించినట్లు నూతన యౌవనమును, నవకోమలదేహముల నొసంగి బలవంతులుగఁ జేయుననియుఁ జెప్పఁబడినది

ఇటీవలి మదనమోహనమాలవ్యపండితునకును వారణసత్యశాస్త్రిపండితునకును (కాంగ్రెసులోనకుం జెందిన సుకేతసంస్థానపు రాజగురువు) పొందిరని చెప్పఁబడిన కాయకల్పచికిత్సలు, కుటీప్రవేశిక కల్పచికిత్స లని తెలిసెడిని. (ఆయుర్వేదము చూడుఁడు)

**కల్పములు** (బ్రహ్మమానపు మాసము నందలి 30 దినములు) — బ్రహ్మమాన మాసమున గలముప్పది దినములను ముప్పది కల్పములనంబడును. ఇవి మనుష్యమానపు

మాఘమాసమునందుగల పాడ్యమి, ద్వితీయ, తృతీయ చతుర్థి మొదలగు తిథులని తెలిసినవి. (మత్స్య పురాణ ౨౨౮ అధ్యా).

౧. శ్వేతవరాహకల్పము, ౨. నీలలోహిత కల్పము, ౩. వామదేవకల్పము, ౪. రాథంతర కల్పము, ౫. రౌరవకల్పము, ౬. దేవకల్పము, ౭. బృహత్కల్పము, ౮. కందర్పకల్పము, ౯. సత్యకల్పము, ౧౦ ఈశానకల్పము, ౧౧. తమః కల్పము, ౧౨. సారస్వతకల్పము, ౧౩. ఉదాన కల్పము, ౧౪. గారుడకల్పము, ౧౫. కౌర్మ కల్పము, ౧౬. నారసింహకల్పము, ౧౭ సమాన కల్పము, ౧౮ ఆగ్నేయకల్పము, ౧౯. సోమ కల్పము, ౨౦ మానవకల్పము, ౨౧ తత్పురుష కల్పము, ౨౨ వైకుంఠకల్పము, ౨౩. లక్ష్మీ కల్పము, ౨౪ సావిత్రీకల్పము, ౨౫ ఘోర కల్పము, ౨౬. వరాహకల్పము, ౨౭. వైరాజ కల్పము, ౨౮ గౌరీకల్పము, ౨౯. మహేశ్వర కల్పము, ౩౦. పితృకల్పము.

ఇందు శ్వేతవరాహకల్పమును ప్రతిపత్తిథి యనియు, కౌర్మకల్పమును పౌర్ణమి యనియు, గౌరీకల్పమును మాఘదేవీరాత్రిగను, మహేశ్వర కల్పమును మాఘశివరాత్రిగను, పితృకల్పము నమావాస్యగను కూర్మ, మార్కండేయ, బ్రహ్మాండ పురాణములందు చెప్పఁబడినవి. ఇంకను ఒక్కొక్క కల్పమునందు మనుష్యమాన సంవత్సరములు ౮౬౪౦౦౦౦౦౦౦ లును, ముప్పది కల్పములు గలిగిన ఒక బ్రహ్మమాన మాసమున ౨౫౯౨౦౦౦౦౦౦౦౦ సంవత్సరములును ఉండెడిని దీనినే సర్వసాధారణముగఁ బాటించుచున్నారు.

ఇంకను భవిష్యపురాణ ప్రతిసర్గ (3) పర్వమున చతుర్యుగఖండ కలియుగేతిహాస సముచ్చయమునం దిరువదియైదవ అధ్యాయమున పదునెన్మిది కల్పములు చెప్పఁబడినవి అవి ౧. కూర్మకల్పము, ౨ మత్స్యకల్పము, ౩ శ్వేత వరాహకల్పము, ౪. నృసింహకల్పము, ౫. వామన కల్పము, ౬. స్కాంధకల్పము, ౭ రామకల్పము, ౮. భాగవతకల్పము, ౯. మార్కండేయకల్పము, ౧౦. భావిష్యకల్పము, ౧౧ లింగకల్పము, ౧౨ బ్రహ్మాండకల్పము, ౧౩ అగ్నికల్పము, ౧౪. వాయుకల్పము, ౧౫ పద్మకల్పము, ౧౬. శివకల్పము, ౧౭ విష్ణుకల్పము, ౧౮. బ్రహ్మ కల్పము

ఇవి ఇట్లుండ వాయుపురాణ పూర్వార్ధ ౨౧, ౨౨, ౨౩ అధ్యాయములందు కల్పనిరూపణ మిట్టుల చెప్పఁబడినది. ౧. భవకల్పము, ౨ భువ కల్పము, ౩. తపఃకల్పము, ౪. భవఃకల్పము, ౫. రంభఃకల్పము ౬ ఋతుకల్పము, ౭. క్రతు కల్పము, ౮. వహ్నికల్పము, ౯ హవ్యవాహన కల్పము, ౧౦ సావిత్రీకల్పము, ౧౧ ఉసిక కల్పము, ౧౨. కుశికకల్పము, ౧౩. గంధర్వ కల్పము, ౧౪. ఋషభకల్పము, ౧౫ షడ్జ కల్పము, ౧౬. మార్జాలీయకల్పము, ౧౭. మధ్యమకల్పము, ౧౮. వైరాజకకల్పము, ౧౯. విషాద కల్పము, ౨౦. పంచమకల్పము, ౨౧. మేఘ వాహనకల్పము, ౨౨. చింతకకల్పము, ౨౩. ఆకూతికల్పము, ౨౪. విజ్ఞాతికల్పము, ౨౫ మనః కల్పము, ౨౬. భావకల్పము, ౨౭ బృహత్కల్పము, (ఇవి ౨౧ అధ్యాయమునను), ౨౮. శ్వేత లోహితకల్పము, ౨౯. రక్తకల్పము (ఈ రెండు ౨౨ అధ్యాయమునను), ౩౦. పీతవాహన కల్పము, ౩౧. సీతకల్పము, ౩౨ విశ్వరూప కల్పము (ఈ మూడు ౨౩ అధ్యాయమునను) చెప్పఁబడినవి.

**కల్పవృక్షముం జుట్టుకున్న గచ్చపొద** — గచ్చపొద ముండ్లపొద. చొర శక్యముకానిది. ఒక యోగ్యుఁడు దాతయు నగు

భాగ్యవంతునికడ నున్న మనుష్యునిగూర్చి చెప్పు సామెత (ఆంధ్రలోకోక్తి).

**కల్పవృక్షములు** (పంచకల్పవృక్షములు) - ౧. మందార, ౨. పారిజాత, 3. సంతానవృక్షము, ౪. హరిచందనవృక్షము, ౫. కల్పవృక్షము. వీటికి పంచకల్పవృక్షములని పేరు.

**కల్క్యతారహస్తము** — హస్తాభినయము చూడుఁడు, భరతశాస్త్రము చూడుఁడు

**కల్క్యవతారస్థలము** — శాంబలాపూర్ చూడుఁడు

**కల్పిత స్వప్నములు** – స్వప్నశాస్త్రము చూడుఁడు

**కల్మాష గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు

**కల్మాషపాదుఁడు** — ఇక్ష్వాకు సంతతి సూర్యవంశపు క్షత్రియుఁడు. తండ్రి రఘు మహారాజు సౌదాసుఁడు శంఖణుఁడు ఇతనిపేరు మిత్రసహుఁడు

**కల్మోశాఖ క్షత్రియులు** - గ్రామా క్షత్రియులు చూడుఁడు

**కల్యాణపురము** - సతారా మహారాష్ట్ర దేశములు చూడుఁడు.

**కల్యాణ మొచ్చినా కక్కొచ్చినా ఆపలేరు** — ఆంధ్రలోకోక్తి.

**కల్యాణకలవణము** — సుశ్రుతమను ఆయుర్వేద వైద్య గ్రంథమున వివరింపఁబడిన యొక ఔషధ విశేషము. ఇది స్వయంసిద్ధలవణము కాదు.

**కల్లబొల్లి కబుర్లు** - ఆంధ్రభాషా సాంప్రదాయక పదము. అబద్ధములు, సుబద్ధములు కలసియుండుట విశ్వసింపఁ దగనివియు, కేవల వినోదార్థ మగు ప్రసంగము లని పేర్కొన వాడుక. కల్ల యనిన అసత్యమని యర్థము బొల్లి యను హేయమని యర్థము.

**కలింగోత్కల దేశసీమ లందు రాజ్యపాలన వత్సరములఁ బరిగణించు విధానము** — ఆంధ్రుల కొలుక యగునాతనికి నీపరిగణనవిధానము పర్లాకిమిడి, పెద్దకిమిడి, చిన్నకిమిడి మొదలగు జమీందారీ ప్రాంతముల నాచరణయందున్నది. ఇది క్రీ. శ. ౧౦౭౮ రాజ్యమున కవుదెంచిన అనంతవర్మ చోడగంగదేవ భూపతినాటినుండి యని కొందఱును, అంతకుపూర్వమునుండి యని కొందఱును వాడుకయందున్నదనుచున్నారు. గంగవంశపు రాజుల శాసనములందిది గానవచ్చుచున్నది.

సంవత్సరసంఖ్యయందు ఆరవ సంవత్సరములను పరిగణింపక వదలివేసెదరు పదిసంఖ్య కాక తక్కిన సున్నతో నంతమగు సంవత్సరములను పరిగణింపక వదలివేసెదరు అనగా ఐదునకు తరువాత (ఆరంకెను వదలి) ఏడంకెను లెక్కించుటయు, పదిహేనుకుంబిదప (పదునారంకెనువదలి) పదునేడును, ఇట్టులనే తక్కినవియు లెక్కించెదరని ఎఱుఁగునది. ఇది యేబదితొమ్మిదితో నాపి (అఱువదిని లెక్కింపక) తిరుగ రెండవ సారిగ మొదటినుండియు పైవిధముననే లెక్కింతురు. ఒకభూపతి మరణించిన సంవత్సరముననే తర్వాతిభూపతి రాజ్యమునకు వచ్చుటచే నాసంవత్సరమును ఇర్వురిపాలనలందును కూడ పరిగణించెదరు. ఈవిధానమున లెక్కించు సంవత్సరములకు భాద్రపద శుద్ధ ద్వాదశినాఁడు క్రొత్త సంవత్సరారంభమగుచుండును. ఇందొక విచిత్రము గమనింపఁదగినది కలదు. వారు భాద్రపద శుద్ధ పౌర్ణమి సంవత్సరాంతమని చెప్పుచు, పాటింపుచు ద్వాదశినాఁడు సంవత్సరారంభముగ లెక్కించుచుందురు. అనగా నేకాదశి సంవత్సరాంతముగను, ద్వాదశి సంవత్సరాది యనియు భావముకాని, సంవత్సరాదిని ఒకటవ

దినముగ భావించక పంద్రెండవదినముగ లెక్కించుట విచిత్రముగఁ దోచును.

**కల్లిగ్రాఫీ** (Calligraphy- Good hand writing)— కుదిరిన చక్కని దస్తూరీ వ్రాయగలనేర్పు లేక కళ. ఇంక కొందఱి మతమున అక్షరములపొంకము లేక కుదిరిక. చక్కని పదవిన్యాస (Style hand writing) విధానపు వ్రాతశక్తియుం గలసి Calligraphy అగునందురు. అందమగు వ్రాతయు, అలంకారయుతమగు వ్రాతయుం గల్లిగ్రాఫీ యని తెలుచున్నది.

**కలెక్టివిజమ్** (Collectivism) — పంటభూములు మొదలగు ఫలవంత ప్రదేశము లన్నియు జాతీయసామ్యగతమై యుండవలయు నను సిద్ధాంతము.

**కవచము** - కవచము యుద్ధములందు శరీరరక్షణమునకై ధరించునది. ఇది ఇనుము, ఉక్కు, రాగి మొదలగు లోహముల రేకులతో జేయంబడి వేత్వేఱు భాగములుగ శరీర భాగముల నన్నిటిని లోహపు రేకులచే గప్పి శత్రువుల కత్తిపోటులకు, ఈటెపోటులకు వెఱవకుండునటుల శరీర రక్షణ మొనర్చునది. భరతదేశమున నాదినుండి వాడుకయందున్నదియె. కర్ణునకు కవచకుండలములు సూర్యుని వలనను, అర్జునునకు ఇంద్రునివలనను ఈయబడినటుల భారతమున చెప్పంబడియుంట భరతదేశపు తొల్లింటికాలపు శూరులకిది క్రొత్తగాదని తెలుచున్నది. కర్ణార్జునులు కలియుగమునకుఁ బూర్వమున ద్వాపర యుగాంతమున నుండిన వారని యెఱుంగునది. హిందువుల మంత్రములందు కవచమని యొకటి కలదు. అది ఆత్మరక్షణకైన ప్రయోగము. ఇంక నీభరతదేశపు కవచమును వీడి పాశ్చాత్య దేశముల కవచములగూర్చి విచారింతము గాక.



పాశ్చాత్యులు తమ యుద్ధనావలకుఁ గూడ కవచరక్షణ మొసంగు చుండిరి. వారియందు కవచమును ధరించిన వారిలో ముఖ్యులు గ్రీకులు రోమనులునై యున్నారు. ఈరెండు సామ్రాజ్యములు శిథిలములైనతరువ లోహపు కవచములు తగ్గిపోయి ఈజిప్టు, అస్సీరియాల మాదిరి తోలు కవచముల వాడుక కొంతవఱకు తిరుగ తలసూపెనట. క్రీ. వె. ౧౪౦౦ ప్రాంతముల కవచములందు ముఖ్యభాగములు అనగా హృదయము, చేతులు, మోకాళ్లు ఇనుప రేకులు వేయంబడి తలపై ఉక్కుటోపీ (Helmet) కుదర్పంబడియుండెను. నైట్సు (Knights) పూర్తియగు ఇనుప కవచములు ధరించువారుండి రని తెలియు చున్నది.

క్రీ. వె పదునారవ శతాబ్దమునుండి తుపాకులు, ఫిరంగులు మొదలగు ఆగ్నేయసంబంధ ఆయుధవ్యామోహ మధికమై వాటియుపయోగ మతిశయించి కవచములు పాతబడి మూలలకుం జేరినవి. పదునేడవ శతాబ్దమున ఇనుపటోపీలు (helmets) మాత్రము వాడుకయందుండెను.

ఇటీవలి ఐరోపాసంగ్రామమున ఇనుపటోపీల నందఱు నేదోవిధమునవాడుచునేయుండిరి. జర్మను సైనికులు హృదయకవచము నినుపరేకులతో ధరించియుండిరి. ఇంక వేత్వేఱు భాగముల నినుపరేకు రక్షణము లమరియుండెను. నావికా సైన్యమునకు సంపూర్ణ కవచరక్షణమే యవసర

మని తెలిసెది. అందు ముఖము ముఖ్యము. ఆంగ్లదేశమునందలి షెఫీల్డునగరవాం డవి నావికా సైన్యమునకు చేయుచున్నారు. పాశ్చాత్యకవచము లు ఇన్ని మార్పులందెందినవి.

పాశ్చాత్యసీమలం దీ కవచధారణము క్రీస్తు మునుపు పండ్రెండవందల సంవత్సరములకుం బూర్వము ట్రోయి(Troy)సైనికులు కవచధారణ మొనర్చినటుల సుప్రసిద్ధ పాశ్చాత్య కవి యగు హోమరు వ్రాతలందు కలదు. బైబిలునందు కవచధారణ ప్రశంసలు గానంబడుచున్నవి.

పాశ్చాత్యదేశపు కవచములు మూడు తెఱం గులుగ నుండినవి ౧ Mail armour - తోలు అంగీపై అంటగట్టబడిన చిన్న చిన్న ఇనుప రేకులుగలదిగ శరీరమంతయు ఇనుపరేకు మయముగం జేయునది ౨. Chain armour- చిన్న ఇనుపతీగె రింగులతో నల్లబడిన బట్టను తోలుఅంగీ కట్టి శరీరమంతయు ఇనుపఅల్లిక మయముగం జేయునది ౩ Scale armour - కొన్ని జాతుల చేపల శరీరమందలి పొలుసుల వలెనే ఇనుప కలల చిన్న బిళ్లలను తోలు అంగీకంటగట్టి శరీరమంతయు ఇనపపొలుసుబిళ్లల మయముగం జేయు కవచము. ఇందలి ఇనుప బిళ్లలు గుండ్రముగ పెద్ద చేపపొలుసు బిళ్లలం బోలియుండునవి.

ఇంక పాశ్చాత్యులు తలపై ధరించుటోపీలు (Helmets) ఉక్కుతో చేయంబడినవి ధరించు టయు కవచము ధరించుట లోనిభాగమేయగును. ఐరోపా మహాసంగ్రామకాలమున నీ ఇనుప టోపీలు తియగ తలలెత్తి వాడుకలోనికి తప్పని వచ్చెనట. ఇక తుపాకి గుండ్లనుండి తలను గాచెట. నీటి నందటిసైన్యములు ధరించినవి.

కనులనే మోటారుబండ్లకు ఇనుపకవచములు కూర్చి వాటిని యుద్ధరంగప్రదేశములకు సరకులం జేర్చినడపుట నేర్చిరి. స్టీమరులకు ఉక్కు రేకులందగిల్చి కవచరక్షణము గల్పించి యుద్ధపు ప్రదేశపు సముద్రములందు నడుపబడుచుండిన వని వినుచున్నాము. నీటి అడుగున మునిగి అటపనిచేయువారికి చేపలవలన బాధలేకుండ ధరించునదియగు ఒకవిధమగు కవచము కలదు. ఇటీవల రైలుబండ్లకుంగూడ ఉక్కురేకుల కవచములమర్చి యుద్ధభూములకు సైన్యములను సరకులను మందుగుండు సామానులను జేర్చుట వినియున్నాము.

ఇంక సృష్టియందు జన్మతః తాంబేలు మొదలగు కొన్ని జంతువులకుకవచయుత శరీరమేకలదు.

**కవద(గహ ఎత్తు** — రెండుతులములు. ఆయు ర్వేదమానము చూడుడు.

**కవర్ లేక హోమీ**—(వాణిజ్యసంబంధ పరిభాషాపదము) cover. ఒకవర్తకుడు తనకు Stock exchange వ్యాపారమున నష్టము సంభవించునేని దానికిహామీగా ముందునటుల చెల్లించిన (deposited money) సొమ్ము లేక ఆట్లుచెల్లించవలసిన వానికట్టుమున అన్యులుచేసిన ఇతర ఏర్పాటులు ఇవియన్నియు నావర్తకునికి నష్టములు వచ్చినయెడల దానికి హామీగా నిలచు నవి యైయుండవలయును.

**కవి-కవులు** — కవి కవిత్వము లేక రచనమొనర్చువాడు గద్యరూపమున గాని పద్యరూపమునగాని గ్రంథముల రచించు వాడు కవి. కవులునాల్గు విధములు ౧. కవి. గ్రంథమును రచించువాడు. ౨. గమకుడు. గ్రంథమును పేఱొకభాషలోనికిం గాని పేఱొక విధముగగానిమార్చి యనువదించువాడు.తర్జుమా లేక భాషాంతరీకరణ మొనర్చువాడు. 3. వాది- గ్రంథమును సమర్థించుచు వాదించువాడు. వ్యాఖ్యాన మొనర్చు వాడు. ౪. వాఙ్మిడు

గ్రంథవ్యాపకమునకుగాను చమువుట మొదలగు పనులచే వ్యాపింపఁజేయువాఁడు. వీరందఱు కవులనంబడుదురు.

కవిత్వము ౧ ఆశుకవిత్వ (ఎప్పటికప్పుడు ప్రసంగవశముగ రచించునది) మనియు, ౨. చిత్ర కవిత్వమనియు (శబ్దచిత్ర అర్థచిత్రములతో రస వంతముగఁ జెప్పుట). 3. బంధకవిత్వ మనియు, (నిర్ణీతనియమములతో పామువలె నాగబంధము, పద్మమువలె పద్మబంధము మొదలగునవి చెప్పుట) ౪. శ్లేషకవిత్వమనియు (కథానుసారముగ నర్థ మిచ్చుచు వేఱ్ఱేఱ్ఱర్థములకు గుదురుచుండునట్లు రచించుట), నాల్గువిధములు.

సప్తవిధకవులు — ౧. వివేకి- గణ, యతి, ప్రాస, శబ్దార్థ, గుణ, దోష, అలంకారముల నెఱింగిన రచయిత ౨. వాచకకవి- అనుప్రాసాదిబంధనియమములతో రచించువాఁడు. 3. కాచికుఁడు- మృదుమధురశబ్దార్థముల రుచి స్ఫురించునటుల రచించువాఁడు. ౪. అరకుఁడు- అర్థగాంభీర్యము, స్పష్టార్థము గల్గునటుల శబ్దముల నెన్నుకొని రచించువాఁడు. ౫. శిల్పకుఁడు- యమకప్రధానముగ శబ్దాలంకారములం గూర్చుచు రచించువాఁడు. ౬. భూషణార్థి- అలంకారలక్షణమే ప్రధానముగ నమర్చుచు రచించువాఁడు. ౭. మార్దవస్ఫుటకరుఁడు- లేతమాటలతో విరళార్థవంతములై దనరునటుల రసప్రధానముగ మృదుత్వసరళిని రచించువాఁడు.

గద్యపద్యాత్మకమగు కావ్యములను రచించు గ్రంథకర్తకుఁ గవియని ప్రతీతి కలదు. దానవ గురుండగు శుక్రునితండ్రికిం (భృగునిపుత్రుఁడు) గవి యని పేరు కలదు. మరియు ఋక్షయుని కుమారుఁడును కవియను పేరుగలవాఁడే. ఋక్షయుఁడు పూరువంశ క్షత్రియుఁడు. మహావీర్యుని కుమారుఁడు. ఈతనికి ౧. పుష్కరారుణి, ౨. కవి, 3. త్రయ్యారుణి యని ముగ్గురు పుత్రులు. ఈముగ్గురుసంతతివారు బ్రాహ్మణులైరని చెప్పంబడినది.

ఇంకను వైవస్వతమనువు కొడుకు (ఇక్ష్వాకు సోదరు) లలో నొకఁడు కవియను పేరుగలవాఁడొకఁడు బాల్యమునందే మరణించెను.

**కవిగోత్రము** — ఆర్ష్టిషేణగణము చూడుఁడు.

**కవి గోత్రము** — నిధృవగణము చూడుఁడు

**కవిభల్లటుఁడు** — ఆంధ్రకవి. ఆంధ్ర సంస్కృతములందు గొప్ప పాండిత్యము కలవాఁడు. ఈతఁడు సంస్కృతనిఘంటువు, పదమంజరి, విక్రమార్కచరిత్రము, వేఱొక లక్షణ గ్రంథమును రచించెనని తెలియుచున్నది రావు బహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులు వారీతనిని పూర్వకవులలో లెక్కించియున్నారు.

**కవిరాక్షసుఁడు** — ఆంధ్ర కవి. ద్రాక్షారామనివాసి నన్నయభట్టు, తిక్కన సోమయాజులకు నడిమికాలమువాఁడని రావు బహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులు వారు నిర్ణయించియున్నారు ఈకవి రచించినవి కవిరాక్షసీయము, ఆదినారాయణ చరిత్రము నని చెప్పఁబడినది. రావుబహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులువారీతనిని పూర్వకవులలో లెక్కించియున్నారు. ఈతఁడు కవియగుటచు కవిరాక్షసుఁడను పేరీతనికిఁ గలిగినది. అమాత్యుఁడగు రాక్షసుఁడింకొకఁడు కలఁడు. ప్రతిభాశాలి. (అమాత్యరాక్షసుఁడు చూడుఁడు).

**కవిరి (కవిరె లేక కాచు)** — లా. Mimosa catechu, Acacia catechu. ఆంగ్ల Catechu. సం. ఖైరసార. పోకచెట్ల కాయలను కత్తిరించి వండి పోకచెక్కలుగ

జేయుతరి దిగిన వగరుపదార్థమును వడకట్టి శుభ్ర పఱచి గట్టిపదార్థముగఁ జేసిన కవిరి లేక కాచు అనఁబడును. ఇంకుఁ గొన్ని పరిమళ ద్రవ్యములం జేర్చుటయుఁ గూడ కలదు. కవిరి తాంబూలము నందు చేర్చుదురు. ఉత్తర హిందుస్థానమున నున్నమునకిది కల్పఁబడి తమలపాకులకు వ్రాయబడి బీడాలుగ నిర్మింపఁబడును. ఇది చలవ లేక సమ ధాతువు గల్గించి బిగదీసెడు లక్షణముగలది. కర్ణ రోగములు, నేత్రరోగములు, మేహము, శ్లేష్మ ద్రోషముల నివారించును ఇంచుక విరేచన బద్ధము చేయును. ఆమవిరేచనములు, రక్త విరేచనములు, నీళ్ళవిరేచనములు గట్టును. సెగ రోగోద్రేకము నడంచును. దంతపటుత్వము గల్గించి, ఇంచుక ధాతుపుష్టిఁ గల్గించును. నాలుకపూత, నోటిలోని పుండ్లు, పండ్లవెంట రక్తముపడుట నివారించును. అధికముగ దినిన నరములబలహీనత గల్గించును దీనికి లవంగాలు, తమలపాకులు, అంబరు విరుగుడులు స్త్రీలు ను తాంబూలమునఁ కవిరి ఉపయోగించరాదని చెప్పఁబడినది.

**కవి షష్టము లేక గవిషట్కము**

ఈఆర్గురు కవులెవ్వరో సరిగ తెలియదు. అప్పకవి తనఅప్పకవీయమున తృతీయవర్గ సరళమునకు రాచమల్లుహరి షట్సంధమున ప్రయోగము కలదని వ్రాసియుండినట్లు చెప్పుటకన్న వేఱు పరికరములు గానరాకున్నవి. వీరురాచమల్లు వారను ఇంటిపేరో, లేక బిరుదునామమో గల ఆర్గురుకవులుగానోపు. ఇదినిశ్చయమని చెప్పవీలు గాదు.

**కవిష్టావధానము** — అవధానములు చూడుఁడు

**కవుల వేర్లు తెలియని గ్రంథములు** — ఆంధ్రవాఙ్మయమున ఎవ్వరు రచించినది తెలియని, అనగా కవులపేర్లు తెలియని పద్యకావ్యములు కొన్ని యచ్చటచ్చట గాన నగుచున్నవి. ౧. ఆదినారాయణ చరిత్రము, ౨. చమత్కార రామాయణము, ౩. చారు ఘోష్ణ చరిత్రము, ౪. పంచబాణ విలాసము, ౫. ప్రద్యుమ్నోపాఖ్యానము, ౬. దేవీ విజయము, ౭. భేతాళ పంచవింశతి, ౮. మధుసేనము, ౯. విజయసేనము, ౧౦. శశిబిందు చరిత్రము, ౧౧. శూద్రకరాజ చరిత్రము, ౧౨. శివ ధర్మము. ఇంకనెన్నియో కలవు.

**కశానేయ గోత్రము** — ఉపమన్యు గణము చూడుఁడు.

**కశ్యప గోత్రము** — కాశ్యపగణము చూడుఁడు.

**కశ్యప గోత్రము** — శాండిలగణము చూడుఁడు

**కశ్యప ప్రజాపతి నక్షత్రము లేక గోళము** — దీనిని ప్రజాపతి నక్షత్ర మందురు. నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు.

**కశ్యప ప్రజాపతి** — ఇతఁడును ప్రజా పతిగ చెప్పఁబడినది. మరీచి (బ్రహ్మమానస పుత్రుఁడు) కి భార్యయగు కళయందు జనించిన వాఁడనియుఁ జెప్పఁబడినది. ఈతనివలన సృష్టి వృద్ధినందెను. గొప్పగొప్పవారగు సూర్యవంశ క్షత్రియప్రభుపుంగవులీతని సంతతివారిలో నున్నారు.

భార్యలు- దక్షప్రజాపతి కుమార్తెలు పదముగ్గురు ఈతని భార్యలు. మఱియు వైశ్వానరు పుత్రికలిద్దరును ఈతనిభార్యలే గాన, పదునేను గురని తెలియుచున్నది.

౧. దితి- దక్షపుత్రిక, ఈమె సంతానము దైత్యులు.

౨. అదితి.- ఆదిత్యులు- ౧. ధాత, ౨ మిత్రుఁడు, ౩. అర్యముఁడు, ౪. శుక్రుఁడు,

౫. వరుణుఁడు, ౬. అంశుమంతుఁడు, ౭. భగుఁడు, ౮. వివస్వంతుఁడు, ౯. పూషుఁడు, ౧౦. సవిత, ౧౧. త్వష్ట, ౧౨ విష్ణువను నామాంతరము గల ఇంద్రుఁడు. వీరు వైవస్వతమన్వంతరమున అదిత్యులుగను, చతుర్మన్వంతరమునతుషితులుగను ఉండువారు. తొలుదొల్త సృష్ట్యాదిని జయులు అని సృజింపఁబడియు సృష్టివిముఖులగుటచేత బ్రహ్మచే ప్రతిమన్వంతరమున తిరుగతిరుగ జన్మించుచుండునటుల శపింపఁబడినవారు.

౩. దనువు- దానవులు. ౪. అనాయువు లేక అనుగ- సిద్ధులు. ౫. ప్రాధ- గంధర్వులు. ౬. ముని- మానేయులు. ఇది గంధర్వశాఖ. ౭. సురస- యక్షులు, రాక్షసులు. ౮. ఇల- వృక్షలతాతృణజాతులు. ౯. క్రోధవశ- పిశితాశనములైన సింహవ్యాఘ్రాదులు. ౧౦. తామ్ర- అశ్వ, ఉష్ట్ర, గార్దభ, శ్యేన, గృధ్రాదులు. ౧౧. కపిల (ఈమెకు సురభియనియును పేరు కలదు)- గోకులము. ౧౨. వినత- గరుడకులము అనూరుఁడు. ౧౩. కద్రువ- నాగ (సర్ప) కులము.

౧౪. కాల- (వైశ్వానరుఁడను రాక్షసుని కుమార్తె) ఈమె సంతానము కాలకేయులు. వీరును రాక్షసులే. సముద్రమున దాగియుండి దేవతలను బాధించుచుండ దేవతలచే ప్రార్థితుఁడై అగస్త్యుఁ డాసముద్రజలముల బానకమువర్చి వీరిం బయల్పడజేయ నర్జునునిచే నిహతులైరని చెప్పఁబడినది.

౧౫. పులోమ- ఈమెసంతతి పౌలోములను రాక్షసులు. వీరును అర్జునునిచే నిహతులైరని చెప్పఁబడినది. ఈపౌలోములలో నొకపులోముని కుమార్తె యగు శచీదేవి ఇంద్రుని భార్య.

ఇంకను పర్వతుఁడను దేవర్షియు, విభండకుఁడను బ్రహ్మర్షియు కశ్యపుని పుత్రులని చెప్పఁబడినది గాని భార్యపేరు తెలియదు.

ఇంకను పరశురామునిచే అశ్వమేధ యాగ కాలమున భూమిని దక్షిణగాగొని (భూమికి కాశ్యపి యను పేరు దెచ్చి) న ఋషికిని కశ్యపుఁడని పేరుకలదు. వసుదేవుని పురోహితుఁడును కాశ్యపుఁడే. మరియు వేఱొక పౌరాణికునకు కాశ్యపనామము కలదు (కశ్యప మహర్షి చూడుఁడు).

**కశ్యపమహర్షి**—మరీచిమహర్షి పుత్రుఁడు తల్లిపేరు కళ. ఈమె కర్దమప్రజాపతి కుమార్తె. ఇతఁడు ప్రజాపతులలో నొకఁడు ఈతఁడు దక్షప్రజాపతి కుమార్తెలలో పదముగ్గురిని వివాహమాడి సంతానముంగనెను. (దక్షప్రజాపతి చూడుఁడు). ఇంకను కశ్యపమహర్షి వైశ్వానరుని కుమార్తెలిద్దరం బరిణయమై సంతానము గనెను ౧ కాలాదేవి. ఈమెయందు గల్గిన సంతానమునకు కాలకేయులని పేరు. ౨. పులోమాదేవి. ఈమెయందు కల్గిన సంతానమునకు పౌలోములని పేరు. ఇటుల కశ్యప మహర్షి భార్యలు పదునార్గురు. ఇంకను పర్వతుఁడను పేరుగల దేవర్షియును, విభాండకుఁడను పేరుగల బ్రహ్మర్షియును గశ్యపుని పుత్రులని చెప్పఁబడినది. పరశురామునిచే అశ్వమేధ యాగ కాలమున భూమిని దక్షిణగా గైకొని కాశ్యపి యని పేరందజేసిన వేఱు కశ్యపుఁడొకఁడును, వసుదేవుని పురోహితుఁడొకఁడును, పౌరాణికుండగు వేఱొకఋషియు కశ్యపనామములు గలవారే. (కశ్యపప్రజాపతి చూడుఁడు).

**కశ్యపమహర్షి ఆశ్రమము** – కాశ్మీరములోని శ్రీనగరమునకు కొంచెముదూరమున హారముఖ పర్వతమున ఆశ్రమముండిన తావుం జూపుదురు. ఇటనే శారికాదేవి పీఠము (దేవస్థానము) కలదు. ఇత్తావుననుండియే కాశ్యప మహర్షి తొల్లింటి సతీసరస్సునందలి నీటిం బ్రవహింపఁజేయించి కాశ్మీరభూమిని బయలు

పఱచి నివాసయోగ్యావస్థకుం దెచ్చెనని చెప్పంబడినది

**కశ్యపమహర్షి భార్యలు** — కశ్యప ప్రజాపతి చూడుఁడు

**కశ్యపి గోత్రము** — పితహవ్య లేక యాస్క-గణము చూడుఁడు

**కషాయ మూలములు** — దశకషాయమూలములు— ౧ నల్లఉప్పివేళ్లు, ౨. తెల్లఉప్పివేళ్లు, 3 కోలాకుపొన్న, ౪. ముయ్యాకుపొన్న, ౫ చిత్రమూలము, ౬. శీతాఫలము, ౭. వావిల, ౮. చేఁగపొట్ల ౯. వనగొక్కి, ౧౦ నేల ఉసిరిక, ఏటివేళ్లను దశకషాయమూలములందురు.

**కష్టములు ౮(అష్ట కష్టములు)**- ౧. దాసత్వము (తానొకరివద్ద బానిసవలె నుండుట), ౨. దారిద్ర్యము (లేమి, ద్రవ్యహీనత), ౩. దారాహీనము (భార్యలేని జీవనము), ౪. స్వయంకృషి (ఇతరుల సహాయము దొరకకుంట తానే పనులు చేసుకొనుట), ౫. యాచన (ఇతరుల నర్థించుచు చులకనై యుంట), ౬. తనను యాచించినవారికి లేదని చెప్పుచుండుట, ౭. ఋణము (అప్పులలో బడియుండుట), ౮. మార్గగమనము (నడచుచు ప్రయాణము చేయుచుండుట, కాలినడక).

**కష్టమ్సు ఎగుమతి దిగుమతి సుంకము** — (వాణిజ్యసంబంధపరిభాషాపదము). Customs- విదేశములనుండి వచ్చు సరకుపై విధింపఁబడు పన్నునకు Customs అనియు, Customs duty అనియుం బేరులు ఇవి స్వదేశమునందలి పరిశ్రమల నభివృద్ధిపరుప విధించు పన్నుగా నుండెడిని. పంటలు చాలని కొన్ని దేశములం దితరదేశములనుండి దిగుమతియగు భోజనపదార్థములు మొదలగువాటిపై పన్నులుండవు. తఱచుగ నితరదేశములనుండి దిగుమతియగు Luxuries పై దిగుమతిపన్నులు విధింపఁబడుట యాచారమై యున్నది. స్వదేశమున నవసరమగు సరకు లితరదేశముల కెగుమతి గాకుండ నిరోధముగ గూడ నెగుమతులపై బన్నులు విధింపఁబడుచుండును. విదేశమునుండి వచ్చు దిగుమతిసరకుల పూర్తిజాబితాలకును, ఎగుమతియగు సరకులజాబితాలకును, Customs Bill of Entry అని పేరు. దేశమున నుత్పత్తియగువస్తువు లితరదేశముల కెగుమతిచేయఁబడులేరి, ఒకవేళ యవి తిరుగ వచ్చునేని వాట్లపై నప్పుడు వసూలుచేయఁబడినసుంకము తిరిగి వారికే వాపసు చేయఁబడునని కష్టమ్సు ఉద్యోగులిచ్చిన ఒప్పుదల పత్రములకు Customs Debenture Bonds అనియు, Customs Debentures అనియుం బేరులు. ఎగుమతి జేయు సరకుల వివరములను వివరించును కష్టమ్సు కచేరీయందు ఎగుమతిచేయువారిచ్చిన పత్రమునకు Customs Declaration అని పేరు మరియు దీనినే Customs Entry అనియు నందురు.

**కష్టీథలీ** — కుశస్థలి చూడుఁడు.

**కసరత్తు (శరీరవ్యాయామము)**— భరతదేశపు ప్రాచీనకాలమున శరీరవ్యాయామ పద్ధతి దండెములుతీయుట మొదలగు పను లుండినవి. మహమ్మదీయ పరిపాలనకాలమున వారి మొస్తరు వ్యాయామమును "తాలింఖానా"లను, పీరుతావులను స్థాపించి అందు నేర్పుచుండిరి. బానాకత్తి గుర్కాలు త్రిప్పుట అందలిపద్ధతులందు గాన్పించుచునే యున్నది. ఇక్కాలమున పాశ్చాత్య పద్ధతిని పాఠశాలలందు విద్యార్థులకు శరీరవ్యాయామము నేర్పుచున్నారు. పీరిపద్ధతిని పరుగిడుట కూడ వ్యాయామమే. ఇంకను అనేకరకములు వ్యాయామములు కలవు.

**కసివింద చెట్టు** — లా. Cassia occidentalis, ఆంగ్ల. Negro coffee, సం.

కాసారి, కాసమర్ధ, దీపన. దీనిని కసివింద చెట్టని వాడుచుందురు. వైద్యోపయోగమగు ఓషధి. కసివిందకాయలు లేతవి కూరగ జేయుదురు. అది కాస, శ్వాసలు, జ్వరములు, వాతములు హరించునందురు. ఆకును కొందఱు కూర జేయుదురని తెలియుచున్నది.

కసివిందఆకు- వాతములు, విషము హరించునని చెప్పఁబడినది. కండ్లకుం గట్టిన ఎఱుపులు మొదలగు నేత్రరోగములును, నూరి పైనవేసి కట్టిన గాయములు వ్రణములు మానుననియుఁ జెప్పఁబడినది. చర్మరోగములు మానును. ఆకురసము మర్దనచేసిన పక్షవాతములనడంచి బలము గల్గించును.

వేరు- నూరి లోనికిచ్చిన ఉబ్బులు, కుక్షిలోని రోగములు, చర్మవ్యాధులు, దోషగుణము, సన్నిపాతము, మూత్రనిరోధము వీటి నడంచునని చెప్పఁబడినది. ఆకులు, వేరు, చెట్టుపెట్ట, చిఱుకగొట్టి ఎండించి చేసిన చూర్ణము తేనె మొదలగు వాటితో గల్పి వ్రణములు, పళ్లికలు, పొక్కులు, తామర మొదలగు చర్మవ్యాధులపై పూసిన మానును. విత్తులచూర్ణము తేనెతో కల్పి లోనికిచ్చిన అతిమూత్రము తగ్గును.

కసివిందజాతిలోనే ఇంచుక భేదముతో కమ్మకసివింద యని వేఱొకజాతి కలదు. దానియాకులు మంచివాసన గల్గియుండును. అది లోనికిచ్చిన కాక జేసి మలబద్ధము గల్గించును. వాతముల నడంచుశక్తిగలదిగ జెప్పుచుందురు. మఱియు కొండకసివింద యని వేఱు జాతి కలదు. దానిని లాటిన్ భాషయందు Toddalia aculeata అనియు, సంస్కృతమున యూస, యవానకా, వికర్ణికా యని పేర్లను కొందఱు వాడుచున్నారు. దీనికి మనదేశమున ఓటకసివింద, ములుకసివింద యను పేర్లు కలవు. ఇదొంకవలెఁ బ్రాకు తీగె. దీని చెక్క, ఆకు, (ముఖ్యముగ) దీనివేరు కారముగ నుండి, కాక, ఇంచుక పైత్యము జేయును. దీపనకారి (Stimulant) యై పొట్టకు బలము గల్గించి, రోగసంబంధమైన నిస్త్రాణల నడంచుననియు, జ్వరము, అందు ముఖ్యముగ మన్యపు జ్వరము, నీరసము, నీళ్ళవిరేచనములు, వాతపు నొప్పులు, వాతములు, సన్నిపాతములు నివారించునందురు.

**కస్టమర్** — క్లయింటు చూడుఁడు

**కస్టమ్సు ఉద్యోగశాఖ** — ఇతర దేశములందు వసించువారీదేశ ప్రభుత్వమునకే పన్నును చెల్లించువారుకారు. వారిదేశభక్తియు వారి స్వదేశముపైననే గురియగుగాని ఈదేశముపై నుండదు. కాన నట్టివారొనర్చు వర్తక సందర్భమున వారి వర్తకదినుసు లీదేశముగుండా నడచుటకుగాని, వారీదేశమున కేతెంచుచో గూడ దీసుకొనివచ్చు సామానుల నూరక గొంపోవుటకుగాని, వారీదేశమున సివిల్ రక్షణస్వాతంత్ర్యముల గల్గియుంటకుగాని ఏహక్కును లేదు. కాన వారి సామానులపై కొంత సుంకము విధింపఁబడి తత్ఫలితముగ నీదేశప్రభుత్వమునుండి సివిల్ రక్షణ స్వాతంత్ర్యము (Civil rights of protection) ఒసఁగబడుచుండును మధ్యకాలముల నీరక్షణము నరపాలుఁడొసంగునదిగాన, ఈసుంకమునకు నరపాలుని మామూలని (King's customary tax) పేరయ్యెను. కొంతకాల మీ ప్రత్యేకపు పన్ను ప్రభుని స్వంతబొక్కసమునకు జేరుచుండెంగాని పిదప నన్నిపన్నులతోపాటు ప్రభుత్వవశమైనను పేరట్లేనిలచియున్నది కాలానుగుణ్యముగ పేరునందు కొంత తగ్గింపు గల్గినను కస్టమ్సు (Customs) శాఖయని పేరు నేటికి నిలచియున్నది.

**కస్యపర్షి గోత్రము** — (శిష్టకరణములు చూడుఁడు). వీరికిఁ బ్రధానర్షి కస్యపుఁడనియు, ప్రవరరూపము కాస్యప, ఆవత్సర, అసిత, యను

త్ర్యార్షేయమనియుం జెప్పంబడినది. శిష్టకరణములలో ౧. కస్పావారు, ౨. కోటగంగ్రేడువారు, ౩. డబ్బీరువారు, ౪. త్యేడవారు, ౫. పద్మాపురంవారు, ౬. పురుషోత్తమువారు, ౭. రాజాపురంవారు, ౮. లావేటివారు, అను ఇంటిపేర్లవా రీగోత్రజులై యున్నారు

**కస్తూరి** - లా. Moschus moschiferus ఆంగ్ల. Musk సం. కస్తూరికా, మృగః, మృగజా, మృగనాభిః, మృగమదః, మృగాంకజః, మృగాంగజా, మృగాంకజః, యోజనగంధా, యోజనగంధికా. కస్తూరి, కస్తూరిమృగమనుబడు ఒకజాతి లేడి కడుపులోనుండు తిత్తులందు లభించెడిని. ఈ తిత్తులకుం గస్తూరివీణలందురు. కస్తూరిలేడికి ఆంగ్లమున Musk deer అనియు, సంస్కృతమున కస్తూరిహరిణః, కస్తూరిపాలికా, కస్తూరిమృగః అనియుం బేర్లు ఎక్కువ పరిమళమును, చాల ఘాటును గల సుగంధద్రవ్యము. ఇతరద్రవ్యముల పరిమళముకన్న కస్తూరి పరిమళము చాలకాలము నిలచియుండెడిని. కస్తూరి ఒక చిన్న రేణువు లక్షలకొలది అడుగుల పరిమాణముగల గాలిప్రదేశమును, దాని బరువు పోగొట్టుకొనకయే పరిమళింపజేయును. అనగా కర్పూరమువలె కస్తూరి తన బరువు గోల్పోదని భావము. సుగంధద్రవ్యములలోను, ఔషధములలోను దీనింగల్పి వాడుదురు. కస్తూరి మృగములు హిమవన్నగప్రదేశమునను, టిబెట్టు, ఆసాములోని కొన్నిభాగములందునను, గానవచ్చుచుండెను. కస్తూరికాకున్నను కస్తూరింబోలిన పదార్థమొకటి కస్తూరి ఎద్దు, కస్తూరిబీవర్ అనుమృగము, కస్తూరి ఎలుకలందు కూడ దొరకునని ఇటీవల కనిపెట్టబడినది. కస్తూరి ఎద్దు తొల్లింటి కాలమున పైబీరియా దేశమునను, ఐరోపాఖండమందలి ఉత్తరసీమల నుండెగాని ఇక్కాలమున గ్రీనులాండు, ఉత్తరధృవసీమలందు (Arctic regions) అందు ముఖ్యముగ ఉత్తర అమెరికాకుం జేరిన ఉత్తరధృవ ప్రదేశములందు మాత్రము నిలచియున్నవందురు. తక్కిన కస్తూరిబీవరును, కస్తూరి ఎలుకయు చాల అరుదై క్షీణించిపోయినవందురు.

ఆయుర్వేద వైద్యులు కస్తూరిని ఎక్కువ విలువగల ఓషధిగ నెంతురు. వేడిచేసి సర్వాంగములను బలపర్చి దేహదార్ఢ్యమిచ్చి త్రిదోషములను, సర్వవాతశ్లేష్మరోగముల నిర్మూలించు మహౌషధియని చెప్పంబడినది. క్షీణించిన నాడిని బలపర్చును, శరీరపు నైసర్గికపు వేడిని వృద్ధినందించును. స్త్రీలకు కస్తూరి తగదని నిషేధింపబడినది. కస్తూరి నించుక తాంబూలమున గూడం జేర్చెదరు. కస్తూరితో సమానమగు గుణము గల్గించు పదార్థమును, పరిమళమునిచ్చు పదార్థమును వేరొకటి లేదని సామెతగవల్కుదురు. కస్తూరి అధికమైన వేడి ఎక్కువచేయును దీనికిం గొబ్బరికాయలోనిజలము, పచ్చకర్పూరము, తవాక్షీరి, మంచిగంధము, శర్కరంగల్పిన ఆవునెయ్యి, ఉసిరికాయలరసము విరుగుడులని చెప్పంబడినది.

**కస్తూరిబెండ చెట్టు** — ఈచెట్టు పేరిట్లున్నను నిజమున కిది బెండయునుగాదు, కస్తూరి సంబంధమునుకాదు. లా. Abelmoschus moschatus అనియు, Hibiscus abelmoschus అనియుపేరు. ఆంగ్ల. Musk mallow. సం. లతాకస్తూరికా. దీని విత్తుల చూర్ణముగాని, చెట్టుయొక్క సమూలచూర్ణముగాని నీళ్లతోకల్పి లోనికిచ్చుటయు, పైకి పూయుటయు వలన జంతువిషములు హరించి గుండెలకు బలముగల్గించును. విత్తులందు సువాసన గలదు.

**కస్తూరిరంగ కవి** — ఆంధ్ర కవులలో ఆధునికులందు పేర్కొనఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. తండ్రిపేరు వెంకటకృష్ణయామాత్యుఁడు. తల్లి కామాక్షమ్మ క్రీ. శ. ౧౭౯౦ ప్రాంతమున తంజావూరు సంస్థాన విద్వత్కవిగా నుండినవాఁడు. ఈతఁడు రచించినవి కృష్ణార్జున సంవాదమను పద్యకావ్యము, సాంబనిఘంటువు, రంగరాట్ఛందస్సు (లక్షణ చూడామణి) అను గ్రంథములు. శంకరవిజయము రచించిన యాంధ్ర కాళిదాసు ఈరంగకవి శిష్యుఁడట

**కహల్గగాన్ (కలహగ్రామము)**- అంగదేశము చూడుఁడు

**కర్పూరము** (Camphor)—ఇది యొక సుగంధద్రవ్యము దీని ననేకరూపముల వినియోగింతురు. కర్పూరహారములు, కర్పూరనీరాజనములు, కర్పూరతాంబూలములు, కర్పూరాసనములు మొదలగువానికిఁ గర్పూరముపకరించును పిల్లలకు గర్పూరము వేసితిమని చెప్పునది సుగంధద్రవ్యమగు కర్పూరముగాదు. కర్పూరమువలెఁ దెల్లగానుండు రససంబంధమగు నొక పదార్థము.

కర్పూర మొక చెట్టునుండి లభించును. కర్పూరవృక్షములు చీనా, జపాను దేశములందును, చీనా ప్రాంతముననుండు ఫార్మోజా ద్వీపమునందును, హిందూమహాసముద్రమునందలి సుమిత్రా, జావా, బోర్నియో ద్వీపములయందును విశేషముగా గాననగును. కర్పూరపుఁజెట్టు ౧౦౦ అడుగుల యెత్తువఱకుఁ బెరుగు నొక వృక్షముగాని చిన్న మొక్కగాదు. దానికి బహుశాఖలుండును పట్టనున్నగా కొంచెమాకుపచ్చరంగుగలిగియుండును. ఆకులు పచ్చగా నిగనిగలాడుచు నట్లే యాకారమునఁ బొడవైన తొడిమలతో వృక్షమునంటి యుండును. అవి నలిపి యాఘ్రాణించిన ఘాటు కర్పూరపువాసనగొట్టును. పుష్పములు చిన్నవి; తెల్లగా నారుదళములు గలిగియుండును. ప్రత్యేకముగాఁ జేయనక్కఱలేకుండఁ గర్పూరము వృక్షగర్భమునందును, కణుపులయొద్దను, తొఱ్ఱలయందును పెల్లపెల్లలుగా దొరకును. సుమిత్రా, బోర్నియో దీవులయందు చెట్లు కొట్టి కర్పూరముదీయు వ్యాపారముగలవారు కలరు. ఒక్కొక్క పెద్దచెట్టునుండి యిరువది పౌనుల కర్పూరమువఱకు లభించును. చెట్టుకొట్టి మంచి గట్టికఱ్ఱను కలపగా నుపయోగించి మిగిలిన కొమ్మలు, రెమ్మలు మొదలగువానినుండి కర్పూరము తీయుదురు. కర్పూరము తీయువిధములు వేఱువేఱు స్థలములయందు వేఱువేఱు విధముల నున్నవి. ఫార్మోజావా రొకరీతిగను, చీనావా రొకరీతిగను కర్పూరమును తయారుచేయుదురు. జపానువారు కర్పూర మందఱికంటె సులువుగను నున్నితముగను తయారుచేయుదురు. పాశ్చాత్య దేశములనుండివచ్చు కర్పూరము సున్నముతోను, సున్నితమగు నినుపపొడితోడను శుద్ధిచేయుదురు.

కర్పూరముయొక్క యుపయోగము లనేకములు. దీనివాసనతాకిన, గుడ్డలుకొట్టు పురుగులు దరికిరావు. కర్పూరపుఁగఱ్ఱ తేలికగను, లేత రంగుగలదిగను నుండును, కాని గట్టిది. దీనితో పెట్టెలు మొదలగునవి చేయఁబడును. సుగంధి దారువగుటచేఁ జెదలుగాని, పురుగులుగాని దాని పాడుచేయనేరవు. వైద్యులు లేపనముగాఁ జేసి కర్పూరము నొప్పులకు వాడుదురు. దీనిని "కాంఫర్ లినిమెం" టందురు. ఘనసారము లేక పచ్చకర్పూరము నజ్జాగింజలతో శుద్ధిచేయఁబడిన పరిశుభ్రమగు కర్పూరమేకాని వేఱుకాదు. కర్పూరపువాడుక హిందూదేశమునందు ప్రాచీనకాలమునుండియుఁ గలదు. కర్పూరములు చంద్రకళలంబోలి పదునారని వైద్యశాస్త్రమున చెప్పఁ

బడినది. కర్పూరమాదియొుక్క కర్పూరపుచెట్ల రసమునుండి చేయబడునదియైనను, వేర్వేఱు వంటలకుం గాలాంట వేర్వేరుగుణముల నిచ్చున దియై వేర్వేఱు పేరుల నందును. ఇందు ఘనసార మనంబడు పచ్చకర్పూరము చాల శ్రేష్ఠమైనది.

౧. ఘనసారకర్పూరము (దీనిని పచ్చకప్పుర మనెదరు) ౨ భీమసేనము, ౩. ఈశావాస కర్పూరము, ౪. ఉదయభాస్కర కర్పూరము, ౫. కమ్మకర్పూరము, ౬. ఘుటికకర్పూరము, ౭. తుహుదావాకర్పూరము, ౮. తుషారకర్పూరము, ౯. హిమము, ౧౦. దగ్ధము, ౧౧. రస కర్పూరము. ౧౨ హారతి, ౧౩. శుద్ధకర్పూరము, ౧౪ హిక్కరికర్పూరము, ౧౫. పోతాశ్రయము, ౧౬. పోతాసము.

**కహూర్వుడు** — యదువంశ క్షత్రియుడు తండ్రి ఉగ్రసేనుడు (మధురాపురాధీశుడు). జ్యేష్ఠ సోదరుడు కంసుడు

**కహెూర్యియా శాఖ క్షత్రియులు**– ప్రమారశాఖ క్షత్రియులు చూడుడు.

**కళలు** — కళలు (౬). ౧. నివృత్తి, ౨. ప్రతిష్ఠాకళ. ౩. విద్యాకళ, ౪. శాంతికళ, ౫. శాంత్యతీతకళ, ౬. శాంత్యతీతోత్తర కళ శైవసిద్ధాంతమున పరమేశ్వరుని భావనాశరీరమున పాదములు మొదలు మోకాళ్ల పర్యంతము నివృత్తికళ యుండునను, అటనుండి నాభివఱకు ప్రతిష్ఠాకళ యుండునను, అటనుండి కంఠమువఱకు విద్యాకళ యుండునను, అటనుండి లలాటము వఱకు శాంతికళ యుండునను, పిదప శాంత్యతీత కళ, శాంత్యతీతోత్తర కళలయుండునను వ్యాపకము గల్గియుండునని సిద్ధాంత నైమిత్తిక కాండయందున షడధ్వశోధన ప్రకరణమునను, క్రియాసారమునందునను చెప్పబడినది. ఈ ఆరు కళలు కళాధ్వగా వివరింపబడినది.

అగ్నికళలు (౧౦)- ౧. ధూమ్రకళ, ౨. అర్చి కళ, ౩. జ్వలినీకళ, ౪ జ్వాలినీకళ, ౫. విస్ఫులింగినీ, ౬. సుశ్రీకళ, ౭. స్వరూపకళ, ౮. కపిలాకళ, ౯. హవ్యవాహనకళ, ౧౦ కవ్య వాహనకళ.

బ్రహ్మకళలు (౧౦)- ౧. సృష్టికళ, ౨. బుద్ధి కళ, ౩. స్మృతికళ, ౪. మేధా, ౫. కీర్తి, ౬. లక్ష్మీకళ, ౭. ధృతి, ౮. స్థితి, ౯. స్థిరా, ౧౦ సిద్ధికళ

విష్ణుకళలు (౧౯)- ౧. జరాకళ, ౨. పాలినీ కళ, ౩. శాంతి, ౪. ఈశ్వరీకళ, ౫. రతీకళ, ౬. కామికాకళ, ౭ వరదాకళ, ౮. హ్లాదినీకళ, ౯. ప్రీతికళ, ౧౦ దీర్ఘాకళ.

రుద్రకళలు (౧౦)- ౧. తీక్ష్ణా, ౨ రౌద్రీ ౩. భయా, ౪ నిద్రాకళ, ౫. తంద్రీకళ, ౬ క్షుత్కళ, ౭. క్రోధిని, ౮. క్రియాకళ, ౯. ఉద్గారిణీకళ, ౧౦. మృత్యుకళ.

సూర్యకళలు (౧౨)- ౧. తపిని, ౨. తాపినీ, ౩. ధూమ్రా, ౪. మరీచీకళ, ౫. జ్వాలినికళ, ౬. రుచికళ, ౭. సుషుమ్నాకళ, ౮ భోగదాకళ, ౯. విశ్వకళ, ౧౦. బోధినీకళ, ౧౧. ధారిణీ, ౧౨ క్షమాకళ.

చంద్రకళలు (౧౬)– ౧. అమృతకళ, ౨. మానదకళ, ౩ పూషాకళ, ౪. తుష్టికళ, ౫. సృష్టికళ, ౬. రతికళ, ౭. ధృతికళ, ౮. శశినీకళ, ౯. చంద్రికాకళ, ౧౦. శాంతికళ, ౧౧. జ్యోత్స్నకళ, ౧౨ శ్రీకళ, ౧౩ ప్రీతికళ, ౧౪. అంగదాకళ, ౧౫. పూర్ణాకళ, ౧౬. పూర్ణామృతకళ.

ఈశ్వరకళలు- ౧. నివృత్తికళ, ౨. ప్రతిష్ఠా కళ, ౩. విద్యాకళ, ౪. శాంతికళ, ౫. శాంత్యతీతకళ, ౬. శాంత్యతీతోత్తరకళ. ప్రకారాంతర మున ౧. ఈశ్వరకళ, ౨. ప్రీతికళ, ౩. శ్వేతకళ, ౪. అరుణాకళ, ౫. అసితాకళ, ౬. నాదకళ.

దీనినే సదాశివకళ యందురు. ౭. నివృత్తి కళ, ౮. ప్రతిష్ఠాకళ, ౯. విద్యాకళ, ౧౦. శాంతి కళ, ౧౧. రాధికాకళ, ౧౨. దీపికాకళ, ౧౩ రేచికాకళ, ౧౪. మోచికాకళ, ౧౫. పరా కళ, ౧౬. సూక్ష్మాకళ, ౧౭. సూక్ష్మామృత కళ, ౧౮. జ్ఞానామృతకళ, ౧౯. ఆప్యాయనీకళ, ౨౦. వ్యాపినీకళ, ౨౧. వ్యోమరూపాకళ, ౨౨ జీవాకళ, (ఇరువది రెండు).

విష్ణుకళలు ప్రకారాంతరమున- ౧. వైష్ణవీ కళ, ౨. జరాకళ, ౩ పాలినీకళ, ౪. శాంతి కళ, ౫. ఈశ్వరీకళ, ౬. రతీకళ, ౭. కామినీ కళ, ౮. వరదాకళ, ౯ లాదినీకళ, ౧౦. ప్రీతికళ, ౧౧. దీర్ఘాకళ, ౧౨. రుద్ర కళ, ౧౩. తీక్ష్ణకళ, ౧౪. రౌద్రకళ, ౧౫. భయాకళ, ౧౬. నిద్రాకళ, ౧౭. తంద్రీ కళ, ౧౮. క్షుత్కళ, ౧౯. క్రోధినీకళ, ౨౦. క్రియాకళ, ౨౧. ఉద్గారీకళ, ౨౨. మృత్యు కళ.

సదాశివకళలు పదునారని చెప్పఁబడినవి.

ఇంక నిట్లు బ్రహ్మకళలు పదియును, విష్ణు కళలు పదియును, రుద్రకళలు పదియును, ఈశ్వర కళలు ఐదును, సదాశివకళలు పదునారును మొత్తము ఏబదియొక కళలును దేవాలయ ప్రతిష్ఠలందు యంత్రకలశములు, తీర్థకలశములు ప్రతిష్ఠించుటయందు ప్రతిష్ఠించుచున్నారు.

**కళాప్రాణము** — సంగీతశాస్త్రమున దశ ప్రాణములలో నొకటి. కళ (ప్రాణము). కళలు నాల్గు- ౧ లఘువు (ఒకకళ), ౨ గురువు (రెండు కళలు), 3. ప్లుతము, (మూడుకళలు), ౪. కాక పాదము (నాల్గుకళలు). చచ్చత్పుట, చాచపుట, షట్పితాపుత్రిక, సంపద్వేష్ట, ఉద్ఘట్ట ఇవి కళ లనంబడును. (దశ ప్రాణములుచూడుఁడు).

**కళింగకోమటులు** — వీరు వైశ్య జాతికిం జెందిన తెగలలోనివారు. వీరిం గూర్చి ద్వివిధములగు కథనములు గలవు. కొందఱి యభి ప్రాయమున వీరు కాళింగులవలెనే విశ్వామిత్ర సృష్టివంటివారు. మఱికొందఱి మతమున వీరు తొల్లింటి వైశ్యస్థుల సంతతివారగు వైశ్యులే యనియు, కన్యకాపరమేశ్వరితో నగ్నిగుండంబు నం బడక తప్పించుకొని వచ్చియు, కళింగదేశమున నివాసము కుదురుకతన కళింగకోమటు లనఁబడి రని కొందఱును తలంచుచున్నారు. వీరిగోత్రములు ఈమధ్యకాలమున వాడుకొనుచుండిన తెలుగు గోత్రములుగా జాలియుండును అవి సంస్కృత గోత్రముల వికారరూపములే యని యందురు. ఇంటిపేరులును ఇతరాంధ్రులకువలెనే వీరికిం గలవు. శుభకార్యముల తగవులందు భోజనభాజ నాదిమర్యాదలయందు వీరిలో నైశ్యరాజు అను ఇంటిపేరు గలవారికి రాజమర్యాదలును, స్వగ్రామ మున కా గ్రామముననే పుట్టుబడి గలవారు మంత్రిమర్యాదలను పొందుచుండుటయు ఆచా రములో నున్నది. తొల్లింట నీమంత్రిమర్యాదల నంగట పొట్నూరువారికే చెందినవి. వీరిలో వీ రివి జరుపుకొనుచుండుట యాచారమై సనాతన ముగ నున్నది. కళింగకోమటులు కన్యకాపర మేశ్వరినుండియే కల్గినవారని వీరనుచున్నారు.

వీరియందొక వింతపద్ధతికలదు. ఉత్తరభాగము లందు గుంసూరు, సురడా ప్రాంతవాసులగు కళింగకోమటులకు, దక్షిణసీమల వసించు కళింగ కోమటులకును కులగోత్రములేగాక, ఇంటిపేరులు గూడ నొకటిగనే యున్నను, వియ్యసంబంధము బాటింపక అన్యకులజులవలె మెలంగుచుందురు. వీ రాంధ్రులేయైనను ఉత్కలసీమల వసించువా రుత్కలులవలెను, ఆంధ్రసీమల వసించువా రాం ధ్రులవలెను ఆచార వ్యవహారాదులం గల్గియుం దురు. వీరియం దంతశ్శాఖలు ఏర్పడియున్నటుల గానరాదు. వీరిలో నిప్పుడు పెక్కండ్రు మత్స్య

నిలచినదేశము కళింగ యని చెప్పఁబడినది బలి చక్రవర్తి మూఁడవ సుతుఁడగు కళింగభూపతి పాలనమున వానిపేరందిన దేశమని బలమగు ప్రతీతికలదు. కూర్మి తామ్రశాసనమున మధ్య (మధ్య) కాళింగము, గంగారిదేశకాళింగము, కాళింగము నని కళింగము త్రికళింగములని చెప్పఁబడినది దీనిని పరిశోధకులు కాళింగమన నాంధ్రదేశ కాళింగమనియు, మధ్యకాళింగము ఉత్కళ కాళింగమనియు, గంగారిదేశకాళింగ మనఁగ గాంగా నదివఱకు అనగా రాఢాదేశముదనుక వ్యాపించిన మధ్యకాళింగమునకు పైనున్న భాగమనియు పోల్చిరి. మహాభారతకాలమున ఉత్తరపుటెల్ల వైతరణి యని తోఁచెడిని. రఘువంశమున మహాకవి కాళిదాసు కళింగోత్తరశము వేఱని వివరించెను. కళింగదేశమేలిన ఇంద్రవర్మ యొక్క పర్లాకిమిడి శాసనము వలన కళింగపట్టణము రాజధానిగ నుండినట్లు తెలుచున్నది. ఇది యిప్పుడునా పేరునను బరగుచు వంశధారానది సముద్రగామి యగు తావుననున్నది అనవాళ్లేనియును గానరాకున్నవి పెక్కుమంది పరిశోధకులు వేఱ్వేఱుకాలముల వేఱ్వేఱుతావులు రాజధానులైయుండె నాయా కాలముల నన్నియు కళింగపట్టణము లేక కళింగ నగరమను పేరంబరగుచుండెననియు అట్లే మణిపురము (ఇది చిలుకసరస్సున పల్లెయైయున్నదట) రాజపురము (బహుశః రాజమహేంద్రవరము), పిష్టపురము, జయంతపురము, సింహపురము, ముఖలింగము (ఇది క్షేత్రముగ ప్రాముఖ్యమున్నై యున్నది. పెక్కు శాసనములు కలవుగాని తెలియకున్నవి. వంశధారానదీతీరము. ఇటనున్న సోమేశ్వరము దేవస్థానము మంచిపనితనము గలది), నగరికటకమును అట్లేయుండినవని తలంచుచున్నారు.

**కళింగరాష్ట్రము చెట్టు** — ఇది వైద్యోపయోగమగుటమది. దీని పేరునకే కళింగ రాష్ట్రమని వాడుచున్నారు. ఇంచుక క్షారము, వెగటు రుచులంగల్గి విరేచనము కేయును జ్వరములు, దగ్గులు, వాతము, శ్లేష్మము వీటిపై చక్కఁగ పనిజేయును. దీనిని చూర్ణమొనర్చియు, గంధముతీసియు వాడుదురు

**కళింగుఁడు** — అత్రిసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి బలి ఈతనినుండి ఈతఁడేలిన దేశమునకు కళింగదేశమని పేరయ్యెను. మఱియు నితనిసంతతి నృపాలవంశమునకు మూలపురుషుఁడయ్యెను. కళింగుని సోదరులు అంగుఁడు, వంగుఁడు, పుండ్రుఁడు, సుహ్మఁడు లేక సుబ్రహ్మఁడు (కళింగదేశము చూడుఁడు)

**కళులె వీరరాజు** — ఈతఁడు క్రీ. శ. ౧౬౮౫ సం। ప్రాంతమువాఁడు మహీశూర రాజాధిరాజగు దేవరాజునకు, చిక్కదేవరాజునకును సేనాధిపతి (దళవాయి) గానుండి, పిదప మధురాపురమున నుండినవాఁడట. ఈతఁడు రచించినవి భారతవచనకావ్యమును, ఎక్కదేవకల యనంబడిన పద్యకావ్యమునై యున్నవి. వచన భారతము కవిత్రయ మార్గమున నడచినదిగాక వ్యాసభారతమునకు యథానువాదముగ నున్నది. ఇతనిది గంభీరమై మనోహరమగు వచనము. మఱియు నీతనిది వీరభూపాలీయమను ఛందోగ్రంథముకలదు. అది మూలగ్రంథమనియు, దాని నుండియె అప్పకవి తన యప్పకవీయము రచించెననియు కొందరి వాదము కలదు ఇది ఎంతవఱకు నిజమో పరిశీలింపవలసియున్నది. ఈతని సుతుండును పెక్కు వచనగ్రంథముల రచించెనట

**కక్షదేశము** — కచ్ఛదేశము చూడుఁడు.

**కక్షల గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**క్రంకుశారి గోత్రము** — పరాశర గణము చూడుఁడు.

**క్రకచ సన్నిపాతము** — సన్నిపాత దోషములు చూడుఁడు.

**క్రకుచంద్రుఁడు** — క్షేమవతీపురము చూడుఁడు.

**క్రకుం చేహోండు** ((క్రకుం చేంద్రుఁడు) — క్షేమవతీనగరము చూడుఁడు.

**క్రతు గోత్రము** — అగస్తితపగణము చూడుఁడు.

**క్రతునక్షత్రము లేక గోత్రము** — నక్షత్రములు భారతీయులు గుర్తించిన చూడుఁడు.

**క్రతువుసంతతి** — క్రతువు బ్రహ్మమానస పుత్రుఁడు నవబ్రహ్మలలో నొకఁడు. ఇతని సంతానము వాలఖిల్య మాహర్షులను బడుదురు, అరువదినైదుగురు అంగుష్ఠమాత్ర దేహులు తపస్సంపన్నులు వీరు సూర్యుని పరివేష్టించి యుందురని చెప్పఁబడినది. ఇతను బ్రహ్మ రోమకూపములనుండి జనించినవారనియు నొకచోట గానవచ్చెడిని పేర్లు తెలియవు.

**క్రథకగోత్రము** — కథకగోత్రము చూడుఁడు.

**క్రథక గోత్రము** — కౌశికగణము చూడుఁడు.

**క్రథువు** — అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు. తండ్రి విదర్భుఁడు. సోదరులు కుశుఁడు, సోమపాదుఁడు. పుత్రుఁడు కుంతి. శాత్రులు ప్టోముఁడు, దాశార్హుఁడు.

**క్రమవిపర్యాసన్యాయము** - క్రమము తప్పించి చేయుట, ముందుది వెనుక, వెనుకది ముందు చెప్పుట, ఇట్టి క్రమము లేని విధానములకు నీ న్యాయము వాడుచుందురు.

**క్రమశిష్టకుల గోత్రము** — ఆర్య వైశ్యుల (౧౦౨) గోత్రములలో నొకటి. వైశ్య గోత్రములు చూడుఁడు.

క్రమశిష్టకుల గోత్రము విశ్వాశ్రేయ గోత్రము (౪౩) దీనిని క్రమశ్రేష్ఠకుల యనియు నందురు. తొల్లింటి సంస్కృతగోత్రము శరభంగస, శరభంగ గణము, ఆపస్తంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ, సమాన గోత్రము కాశ్యపతస, జమదగ్నిసు దేవత, భార్య రామాంబ, శ్రీశైలము, జాహ్నవి తటము, తపస్థానములు, పావన సరస్వతటాకము, జపము దశకోటి, దీపములు ౭౧ క్షేత్రసంఖ్య ౩౩, స్వర్ణ దానము, నీలగోరము, కందమూలము వర్జనీయములు.

**క్రమసరస్సు** (కోనసలనాగము)- మత్స్యావతార స్థలము. కాశ్మీర దేశము చూడుఁడు.

**క్రస గోత్రము** — హిమోదక ఉప గణము చూడుఁడు

**క్రస్టేసియా** (Crustecea) - వెన్నుపై పెంకు చిప్పలున్న పీతలు మొదలగు వానిం గూర్చిన కల ఎంటమోలోజీ చూడుఁడు.

**క్రప్పుకర్మాగారము**-(Krup factory) జర్మనీదేశమున వెస్టుఫేలియా రాష్ట్రమున ఎస్సెన్ పట్టణముకడ నియంత్రిశాల (కర్మాగారము) కలదు యుద్ధపరికరములను, ఆయుధములను, ఫిరంగులు మొదలగువానిని మందుగుండు సామానులను చేయు కర్మాగారములందు ప్రపంచమునందిది పెద్దకర్మాగారమని చెప్పఁబడినది. పీటరు ఫెడరిక్ క్రుప్పు అను వానివలన స్థాపింపఁబడినది. ఆయన సుతుఁడు అతుకులు లేని రైలుబండి చక్రములం జేయుట కనిపెట్టి దానివలన

చాల ధన మార్జించి ఆధనమంతయు నీ కర్మాగారమును వృద్ధిచేయుటయందే వినియోగించి ఫిరంగులం జేయుట వృద్ధిపఱచెనట. ఇందు నలువది వేల్వేఱు పనులం జేయు కర్మాగారములు కలవట. దీనియావరణములోననే వేఱ్వేఱు తావులకు సరకులనందిచ్చు ఇనుపదారులు ముప్పదిమైళ్ల పొడవున కలవని చెప్పఁబడినది. కర్మాగారమునకు వెలుపల సరకుల నితరతావులకుం జేర్చు ఇనుపదారి నలువదిమైళ్ల పొడవున కలదందురు. ఈకర్మాగారమంతయు పనిచేయుచుండుతఱి నలుబదివేల పనివాండ్రును, నాల్గువేల యుద్యోగులును పనిచేయుదురట. ఈకర్మాగారమునకు కొన్ని బొగ్గుగనులు గలవు, అందు పదివేలమంది పనివాండ్రు పనిచేయుచున్నారట. కీలు నగరమున వీరికి నౌకానిర్మాణమునకై కర్మాగారములు కలవనియు, అందు పెక్కండ్రు పనిచేయుచుందురనియు వినుము.

**క్లబ్బు** (Club) — రాజకీయ కార్యములకుంగాని, స్నేహ కార్యములకుంగాని, సాంఘిక కార్యములకుంగాని, అట్టికార్యములకు వేఱైనను కూటములకు, కార్యనిర్వాహకమునకు ఆయా సంఘములవారు కూడుచుండుట కేర్పఱచుకున్న తావును క్లబ్బు అనెదరు. తఱుచుగ నీభారతదేశమున పెద్ద స్థలములయందు సోషల్ క్లబ్బులు (Social clubs) గాననగుచుండును. టౌన్ హాలు క్లబ్బు చూడుఁడు.

**క్లయింటు, కస్టమరు** (Client and Customer) — పైకి రెంటికిని అర్థమొక్కటిగనె స్ఫురించుచుండునుగాని నిజమున ఉపయోగమునం దర్థభేదము కలదు.

ఐరోపాయందు రోమనుల ఆధిక్యత కాలమున రాజానుగ్రహ పాత్రతం బడసిన వారికి నైట్సు (Knights) అనియును, ఆనోబుల నాశ్రయించి యుద్ధమున గాని, పరిపాలనమున గాని, సేవ యొనర్ప సంసిద్ధుఁడై వేచియున్నవానికి క్లయింటు (Client) అనియును వాడుక యుండెను.

ఇప్పుడు విద్యాధికులై నేర్పరులైన న్యాయవాదులు, వైద్యులు, మొదలగు వృత్తుల జీవనము గలవారికి సొమ్మిచ్చి వారి శక్తి సామర్థ్యముల నమ్మి తమ యవసరములను వారిమూలమున చక్కబఱచుకొను చుండువారు, ఆ వృత్తిజీవనములు గల వారికి క్లయింట్లు (Clients) అనబడుదురు.

ఇంక, ఉభయులు సమాన యోచనలతో ద్రవ్యార్జనమే పనిగాఁగల్గి అన్యోన్య సమాన భావములతో నొకరియొద్ద నొకరు కొనుట, ఒకరి కొకరమ్ముట మొదలగు వ్యాపారములం జేయు వర్తకులు ఒకరి కొకరు కస్టమరులగుదురు (Customers). ఇంక న్యాయవాది వృత్తి, వైద్యవృత్తి మొదలగు నాటి నవలంబించియుండు వారి కడ కరిగి తమ కార్యములను వారి పరిముఖమున చక్కబఱచుకొనుచు వారికి ప్రతిఫల ద్రవ్య మొసంగు వారిక్కాలమున క్లయింట్లన బడుచున్నారు.

**కౌంకాయన గోత్రము** – జమదగ్నివత్స ఉపగణము చూడుడు.

**కాంకోలొజీ** (Conchology) — జంతువుల చిప్పలు (Shells- ముత్యపుచిప్ప, నత్తగుల్ల, గవ్వ, శంఖము మొదలగునవి) ఆ జంతువులంగూర్చిన శాస్త్రము వాటిం గూర్చిన కళ. ఇవి సర్వసాధారణముగ 1. Univalves, 2. Bi-valves, 3 Multivalves అని మూడు తెఱగులు.

**కాంక్రీటు, రీఎన్ఫోర్స్డు కాంక్రీటు** (Concrete and reinforced concrete)- నైసర్గికముగ రాయి గట్టిపదార్థముగ మానవుల యుపయోగార్థముగ నిర్మింపబడినది. రాళ్లు పెక్కు తెగలుగలవు. ఇండ్లకు పునాదులువేయుట మొదలు ఆభరణములలోని రత్నములవఱకును రాళ్ళు వివిధరూపముల నుపయోగించుచున్నవి మానవబుద్ధి లము నైసర్గికముగ సృష్టిచే నొసంగబడిన వస్తువులతో తృప్తిం జెందక విశేషోపయోగము గు కృతకపదార్థములను తయారుచేసి యుపయోగించుకొన నేర్చుచుండును. అట్లు కాంక్రీటును రీఇన్ఫోర్స్డు కాంక్రీటును కనిపెట్టంబడిన కృతకములు. రెండును రాతికి ప్రతులే (Imitation Stones). రాతిని మనకు వలయు రూపమున సిద్ధపఱచుట మిక్కిలి శ్రమకరము. శ్రమకరమును వ్యయమెక్కువ గాన, రాతిగుండయు, సున్నమును లేక సిమెంటును పాలుగూర్చి పునాదులయందుంబోసి దట్టించిన నది గాయివలెనె బరువునాపగలదు. కాన రాతికి ప్రతియగుదానివి రాతికన్న నగ్గువగ నిర్మించుకొనుచున్నారము. కాని దీనికి రాపిడిబలము నెమర్చుచు నిలువగల శక్తిలేదు అనగా రాతిని నేలపఱచి చప్టాగా నొనర్చి దానిపై ఎంతనడచియు, కూర్చునియు, సామానులనునిచియు, లాగియు, నీడ్చియు ఎంత వాడినను శెకల నిలచియుండునట్లు కాంక్రీటు నిలువజాలదు. కాన నాపనుల కుపయోగింపకుండెడిని. కాంక్రీటును రీఎన్ఫోర్సు చేసినయెడల పైవిధమగు రాపిడులకాగి నిలచును గాన, చప్టాలకుReinforced concrete నుపయోగింతురు. ఇది కొంచెము వ్యయమెక్కువగల్గించును.

**కాంగ్రెసు సభ** — సర్వసాధారణముగ ప్రజాప్రతినిధిసభకు పేరు. ఇండియా దేశమున నట్లేయున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములలో దీపేరుగల సభ అచటి ప్రభుత్వముచే నంగీకరింపంబడియుండుట గాననగును ఇది సెనేటు సభ యనియు, హౌస్ ఆఫ్ రిప్రజంటేటివ్సు అనియు ద్వివిధముగ నేర్పడి రెంటికిని కాంగ్రెస్ పేరు వర్తించెకిని. ఐరోపాదేశములలో కొన్నిటియందీ పేరు కలదు. భరతదేశపు జాతీయ మహాజన సభాధ్యక్షులు చూడుడు.

**కాంగోనది**– పశ్చిమఆఫ్రికా చూడుడు.

**కాంగోఫ్రీస్టేటు** (బెల్జియన్ కాంగో)- ఇది చాల పెద్దదేశము. కాంగోనది బేసిను కల్పుకొని తంగనాయిక సరస్సువఱకు వ్యాపించియున్నది. ఆఫ్రికా ఖండమున పశ్చిమ భాగమున లోయరు గినియాదేశమున కలదు. ఇది తొలుత బెల్జియమ్ భూపాలునకు స్వంతఆస్తిగా క్రీ. శ. ౧౮౮౫ లో ఏర్పాటుచేయబడి యీయబడినది. ఆయన దానిని బెల్జియమ్‌రాజ్యమున కిచ్చివేసెను. ౯,౦౦,౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యముగల దేశము. మూడుకోట్లజనులు వసించుచున్నారని తెలియుచున్నది. ఇండియా రబ్బరు, కోకో, కాఫీ, పామ్ఆయిలు (Palm Oil) విస్తారము పైరుచేయుంబడుచున్నవి. ఏనుంగుదంతములు దొరుకుతావుల పోగుచేయుంబడి ఎగుమతి చేయుంబడుచున్నవి. విదేశవర్తకము విశేషముగ నడచుచున్నది. ౨౫౦ మైళ్ల పొడవుగల ఇనుపదాటకలదు. అది మటాడీనుండి స్టాన్లీపూల్

వలకు వేయుబడినది. కాంగ్ లో దిగువభాగమున బోమా ప్రధానస్థానము. మటాడీ, స్టాన్లీపూల్ ముఖ్యవర్తకస్థలములు

**కాంచనక్షీరి చెట్టు** (చిరుపాలచెట్టు) - సం. త్రికనుగ్గా, హిమావతీ, క్షీరిణీ. దీనిని చిరుపాల చెట్టనియు నందురు. దీనిచెక్క కషాయము గను, చూర్ణము గను ఉపయోగింతురు. క్షీర కంచుకిని ఉపయోగింతురు.

సర్వదోషములును, విషములుగూడ హరించునని చెప్పబడినది. కఫము, క్రిమి, కుష్టు, గురదలు, పైత్యము, శ్వాస, హృద్రోగములు కాంచనక్షీరి వలన నివారణమగు నని చెప్పబడినది

**కాంచనుడు**-అత్రి సంతతిలోని చంద్రవంశ క్షత్రియుడు. తండ్రి భీముడు, కుమారుడు సుహోత్రుడు.

**కాంచీపురము (కంచి)**- దక్షిణ దేశమునగల సుప్రసిద్ధ క్షేత్రము సప్తమోక్షదాయక పురములలో నొకటి ఇచటి ఏకాంబరేశ్వర శివలింగము పృథ్వీలింగ మనెదరు. కామాక్షి దేవస్థానము సుప్రసిద్ధము. లలితా సహస్రనామము లీక్షేత్ర సంబంధములే యని ప్రతీతి. వరదరాజస్వామి విష్ణుదేవస్థానము శ్రీ వైష్ణవ మతస్థులకు ప్రధాన దివ్యస్థలము లలో నొకటి. కొంతకాలము కాంచీపురము రాజధానిగ నుండెనట. గొప్ప పనితనముగల మంటపములను శ్రీ కృష్ణ రాయ సార్వభౌముడు నిర్మింపజేసెను.

ఇది దక్షిణ దేశమున చెంగల్పట్టు మండలమునగల పట్టణము. ఒకప్పుడు చోళదేశమునకు రాజధానిగ నుండెను. సప్తమోక్షదాయక పురములలో నొకటి కామాక్షి శక్తి దేవస్థానము సుప్రసిద్ధము. రామానుజీయవైష్ణవ దివ్యతిరుపతి క్షేత్రములలో పెక్కులిచటనే యున్నవి. అరువది వేల జనాభా గల్గిన పురము. కడు పురాతన శివక్షేత్రమని తేలిన కైలాసనాథ దేవస్థానము ఇటీవల త్రవ్వబడులు దేరంగ దీయబడినది.

**కాంటినెంటు** (Continent)— పెద్దదియగు భూమి ఖండము. ఇందు పెక్కు దేశము లుండును. ఆ దేశము లొండొకటితో సంబంధముగాని పోల్కిగాని యుండినను లేక యుండకున్నను, ఒకే ఖండమునందా దేశము లిమిడి యుండుటచే ఆయా దేశముల నారీ నా ఖండ వాసు లనియెదరు (Land Portions చూడుడు)

**కాంటినెంటల్ (డ్రిఫ్టు సిద్ధాంతము** (Continental Drift)- ప్రపంచము నందలి ఆసియా, అమెరికా మొదలగు భూఖండములు మెల్లగ (సర్వసాధారణముగ పశ్చిమదిశకు) జరగుచున్నవిగాని ఒకే తావున నిలచియుండునవి కావను సిద్ధాంతము. దీనికింగొన్ని యాధారములఁజూపి కొందఱుపరిశీలకులు వాదించుచున్నారు.

**కాంటినెంటల్ షెల్ఫు సిద్ధాంతము** (Continental shelf) — అనగా ఆసియా, అమెరికా మొదలగు భూఖండముల చుట్టి సముద్రము మెరకగనుండును. ఈలోతులేని సముద్రములందే కొన్నితావుల ద్వీపములును కలవు. దీనినుండి పూర్వకాలమున భూభాగము లన్నియుకలసియే యుండెననియు, మెల్లమెల్లగ సముద్రము ప్రబలుచు వాటిని వేఱుచేయుచుంట నాలోతుతక్కువ ప్రదేశము లట్లున్నవనియు, కొందఱు పరిశీలకులు వాదించుచున్నారు. బ్రిటను ద్వీపము, ఐరోపాఖండము లట్లే యొకప్పుడు కలసియుండెననియు, ఐర్లాండు, బ్రిటనుద్వీపములు కలసియుండెననియు; భరతదేశము, సింహళము

కలసి యుండెననియు ఇట్లు పెక్కులాగ్యాప్ వాదించుచున్నారు.

**క్రాంటియానిజమ్ (Kantianism)**- కేంట్ అను తత్వశాస్త్రజ్ఞని విధానము. ఇతఁడు జర్మను దేశస్థుఁడు. క్రీ. పె. ౧౭౨౪ - ౧౮౦౪ మధ్య నుండినవాఁడు. ఈతఁడు గొప్ప ప్రపంచ విఖ్యాతి సాధిన వాఁడు.

**క్రాంట్రాక్టు** — కాంట్రాక్టుచూడుఁడు

**క్రాండర్షులు** ఋషులు చూడుఁడు.

**క్రాండరథి గోత్రము** - జమదగ్ని బీధా ఉపగణము చూడుఁడు.

**క్రాండవాయన గోత్రము** నిధ్రువ గణము చూడుఁడు.

**క్రాండవృద్ధి గోత్రము** - వశిష్ఠ గణము చూడుఁడు

**క్రాండాయన గోత్రము** నిధ్రువ గణము చూడుఁడు.

**క్రాండేయగోత్రము** వాత్స్యాస్వ లేక విశ్వామిత్ర ఉపగణము చూడుఁడు

**క్రాంద్రేగుచెట్టు** - లా Flacourtia sepearia అనియు, Flacourtia romontchi, స. వికంకత, గ్రంథిలః, స్వాదుకంటకః, స్వాదువృక్షః వ్యాఘ్రపాదకః, వృత్తీకర, స్రువావృక్షః, స్రువారు, కంటకపత్ర, బ్రహ్మపాదపా, పిండారా హిమకః, పూతకికికః, రావణా, పాదరోహిణా అని వైద్య గ్రంథములందు వాడిరి. దీనిని కానరేగనియు, మలువెలసు అనియు గూడ వాడుట కలదు.

దీని వేళ్లకషాయము, ఆకులరసము, చూర్ణము సర్పవిషమును నివారించును. దీని చెక్క నూనెలో నూరి కాచిగాని, కాచకగాని పైన పూసి వర్దిని చేసిన వాతనొప్పులు, మేహవాత నొప్పులు, ఆమవాత నొప్పులు నివారణమగును. పండ్లుతిన రుచిగా నుండి అజీర్ణము జయించి యాకలి గల్గించును.

**క్రాంతలోహము** — అయస్కాంతము చూడుఁడు.

**క్రాంతికృత్ గోత్రము**— జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.

**క్రాంతిపురి లేక పురము** – స్కాంద పురాణము నాగరఖండము ౪౭ యందు చెప్పఁబడిన కాంతిపురము గ్వాలియరు సంస్థానపు రాజధాని పురమునుండి ఉత్తరముగ నిరువది మైళ్ల దూరమునఁగల కొత్వాల్ పురముగ కన్నింగ్హామ్ పండితుఁడు పోల్చియున్నాఁడు. విష్ణుపురాణము ౪-౨౪ యందు గంగాతీరమున ప్రయాగ సమీపముగ నొక కాంతిపురము ప్రశంసింపఁబడినది

**క్రాంధాహార్పురము (గాంధార పురము**, — ఇది ఇప్పటి గాంధారదేశపు రాజధానియగు గాంధారపురమని పోల్పఁబడుచున్నది (గాంధారదేశము, అపగదేశము, ఆఫ్ఘనిస్థానము చూడుఁడు)

**క్రాంపనోలొజీ (Campanology)**— గంట (Bell) ను వాయించునేర్పు లేక విధానము గూర్చిన కళ.

**క్రాంపిల్యుఁడు** — అత్రి చంద్రపూరువంశస్థుఁడగు క్షత్రియుఁడు తండ్రి భర్మ్యాశ్వుఁడు. కాంపిల్య నగరనిర్మాత. (పాంచాల దేశము చూడుఁడు).

**క్రాంపౌండ్సు (Compounds)** — రెండుగాని అంతకు ఎక్కువగగాని కలసిన ద్రవ్యముల కూటములకు కాంపౌండ్సు అనిపేరు. ఇక్కాలమునకు యెఱిఁగియున్నంతవఱకు మూడు వందలవఱకు Compounds కలవు. అవి మూడు

తరగతులుగ విభజింపఁబడినవి. ౧. పేరాఫిన్సు (Paraffins)- వీనిని Saturated fatty hydro-carbons అనియెదరు. ౨. ఓలిఫిన్సు (Olefines) వీటియందు Olefiant gas అనం బడునది, అనగా Ethylene మొదటిదై యుంట నీపేరయ్యెనట 3. ఏసిటిలిన్ జాతివి- ఇవి అధమపుజాతివిగ జెప్పఁబడినవి.

**క్రాంబలోదరి గోత్రము** — జమ దగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**క్రాంబలోదరి గోత్రము**— నిధ్రువ గణము చూడుఁడు

**క్రాంబినేషన్ బ్లాక్సు** (Combination Blocks)- కలంకారి పరిశ్రమ చూడుఁడు.

**క్రాంబే స్టేటు** — బొంబై రాజధాని ప్రభుత్వపు టధికారమునకు లోఁబడిన చిన్న స్వదేశసంస్థానము మాహీనది ముఖద్వారము కడనున్న కాంబేపురము రాజధాని. ప్రభువు ఒక నవాబు మహమ్మదీయుఁడు.

**క్రాంభోజదేశము** (ఔపగ దేశము)— డా స్టెయిను పండితుఁడు రాజతరంగిణి ౧-౧౩౬ యందు తూర్పు ఆఫ్ఘనుభాగము కాంభోజ మనియు, ఆఫ్ఘనుపదము అశ్వకాన్ పదవికార రూపమనియు వ్రాసెను. మహాభారతము సభా పర్వము ౨౭-౯౧ యందు అశ్వము లచటివి మిగుల శ్రేష్ఠములని చెప్పఁబడినది. మార్కండేయపురాణము ౯౩వ అధ్యా. కాంభోజప్రశంస కలదు. కాంభోజదేశము ఆఫ్ఘనుస్థానపు తూర్పు, ఉత్తరభాగములని పోల్చఁబడుచున్నది. కాంభోజమున ద్వారక యని యొక రాజధాని యుండె నట. మరియు లోహభూమి యని ఈదేశమునకు వాడుకయుండెనట. మరియు గజినీపర్వతప్రాంతము లోకప్పుడీదేశములోనివేనట. ఇప్పటి హిందూకుష్ పర్వతప్రాంతవాసులగు షియాపోష్ అను జాతి నామముగలవార లీకాంభోజమున ఆదిమ నివాసులుగ చెప్పఁకొనుచున్నారు. పదియవ శతాబ్దమున కడపటి క్షత్రియనృపతి మహమ్మదీయులచే నిహతుఁడయ్యెను. నాఁటాదిగ మహమ్మదీయ దేశమైయున్నది. ఆఫ్ఘనుశబ్దము అపగదేశ శబ్దముయొక్క పరిణామరూపమని పోల్చబడినది. (అపగదేశము చూడుఁడు).

**క్రాంబోడియా దేశము** — ఫ్రెంచి కొచ్చిన్ చైనా చూడుఁడు.

**క్రాంబోడియా ప్రత్తి వ్యవసాయము** - దీనికి ఎనుబది పాళ్లిసుకయు, ఇరువదిపాళ్లు ఒండుమట్టియుఁ గలసిన గుల్లనేలలు, గరపనేలలు తగినవి కేవలము చవిటిభూములు తప్ప తక్కిన ఇతర భూములలో కొద్దిగనో గొప్పగనో పెరుగుఁగాని పెరుగక పోదు (ప్రత్తి వ్యవసాయము చూడుఁడు) ఎక్కువ బలముగలభూములందు కాపు తక్కువ కాచునని ఇటీవలి పరిశీలనలు తేల్చుచున్నవి. ఆకులు పెద్దవిగను ఎక్కువ పసుపుగల్గి రంగుగనుండును. ఏనుగుల వరకుం బెరుగుచు పుష్పంబు తెలుపుగను, కాయలు జామికాయల వలెను యుంట, కొందఱు రైతులు దీనిని జామికాయల ప్రత్తియని వాడుచుందురు. ప్రత్తి చాలా తెలుపు, సన్నదారము వచ్చుట మిగుల ధరగల్గి యుండును మొక్కలు రెండు మూరల దూరముండునటుల నాటుదురు. కలుపు తీయకున్న మొక్క బలక్షీణమగును. ప్రత్తినాటిన ఆరు నెలలకుం గాయ నారంభించి వర్షాధారము వల్ల బ్రతుకునేగాని నీరు కట్టనవసరమే లేదు. కాపు ప్రారంభించిన పిదప నాలుగైదు నెలలు కాయుచునే యుండును.

**క్రాంస్యభోజి న్యాయము** — లోకోక్తి

**కాంసేయ గోత్రము** – జమదగ్ని వత్స ఉపగణము చూడుడు.

**కాకడిద్వారక** - ద్వారకలు చూడుడు.

**కాకతాళీయ న్యాయము** - కాకి వ్రాలుటయు తాటిపండు పడుటయు నని యర్థము. అప్రయత్నముగా దానియంతట అదే ఏపనియైనను నడచుటయు, అ సంఘటనమునకు అచటికే తెంచిన వానివలన నీకార్యము జరిగెనని భ్రమజెందునట్లు పరిస్థితులుండుట యని భావము

పండిపోయి నేలకు రాలనున్న తాటిపండు కడ కాకి హఠాత్తుగా వ్రాలుటయు, అపు డత్తుగా ముగనే పట్టుకొని నేలబడుటయు ఒకేసారి (అన్యోన్య సంబంధము లేకనే) సంభవించుటగూర్చిన న్యాయము.

వాటంతట అవేగా జరిగిన పనులం దన్యోన్య సంబంధ భ్రమనుగూర్చి యీ న్యాయమును వాడుదురు.

**కాకతీయ వంశ నృపతులు** — ప్రతాపరుద్ర మహారాజు పేరెఱుంగనివారు లేరు రుద్రదేవుని శాసనములు సుప్రసిద్ధములు వరంగల్లు (ఓర్గల్లు - ఓరుగల్లు పురము) రాజధానిగ త్రిలింగరాజ్య మేలినవారు వీరి పాలనకాలము క్రీ. శ. ౧౧౧౦ - ౧౩౨౩ అని చెప్పబడినది వీరిరాజ్యమునకు తర్వాత కాలమున తెలింగానా యనియు వాడుక గల్గెను

**కాకతుండము** — బాణాగ్రములు చూడుడు

**కాకందకి గోత్రము** — శాండిల గణము చూడుడు.

**కాకదంతపరీక్షా న్యాయము** — కాకికి పండ్లున్నను లేకున్నను నిరర్థకము. కాన కాకి దంత పరీక్ష నిరర్థక ప్రయత్నము.

ప్రయోజనములేని పనికి ప్రయత్నించుటయం దీన్యాయమును వాడుచుందురు.

**కాకదధిఘాతక న్యాయము** — పెరుగును కాకి తాకిన, దానిని వాడరాదని యాచారము కలదు. ఇట్టితరి కాకి తాకకుండ పెరుగును జాగ్రత చేయుమని చెప్పుటయందు ఇతర అన్ని బాధలనుండియు పెరుగును భద్రపఱచు మని భావము. కాకులబాధ తఱచుగా గల్గుచుండు నదిగాన దానిని జెప్పుట వాడుకయైన దని యెఱుంగునది.

ప్రధాన బాధను దెల్పిన, దానికింగల్గు ఇతర బాధలను వేరుగ చెప్పకనే యర్థమిచ్చునని భావము.

**కాకనదము** - ఇది భోపాలు రాజ్యమున నగరున సాంచి స్థూపముండిన తావునకు పేరు.

**కాకపిక న్యాయము** - కాకీ నలుపే కోకిలా నలుపే. వినను కోకిలను గౌరవ నీయముగ నెంతురు. రంగుతోఁ బనిలేదని భావము

**కాకమాని మూర్తి కవి (వెన్నామూర్తి)** ఆంధ్రకవులందు ఆధునికులలో పరిగణింపఁబడిన వాఁడు. కాకుమానిశాఖ బ్రాహ్మణుఁడు, కౌండిన్యసగోత్రము, తండ్రిపేరు రామలింగ భట్టు, ఇంటిపేరు పెన్నావారని తెలియుచున్నది.

రచించినవి పాంచాలీ పరిణయము, రాజవాహన విజయము నను రెండు ప్రబంధములు. కృతి శైవపర మొనర్చెను. ఈతఁడు కాకమాని గ్రామ నివాసి యని (చిత్తూరుజిల్లా చంద్రగిరికి సమీపము) తెలియుచున్నది. వసు చరిత్ర మూర్తికిం దరువాతి వాఁడని తేలినది.

**కాకమాంసం శునోచ్ఛిష్టం స్వల్పం తదపి దుర్లభమ్** - కాకి మాంసమే హీనత. అందు కుక్క ఎంగిలిచేయుట హేయము. అదీ స్వల్పముగా ననుట ఇంకనూ దుర్లభ మగుట

కక్కుర్తి యని భావము. ఇది సంస్కృత లోకోక్తి.

**కాకరకాయ** (పాదు) **చెట్టు** - కాకర కాయ ప్రసిద్ధమగు భోజన పదార్థము. ఇందు పెద్దజాతి కాయలు శ్రేష్ఠములు. జాతి తక్కువ యైనను కొలదియు కాకరకాయలు చిన్నవియై చేదు రుచి అధికముగ నుండును. పెద్దజాతి కాయ లందు తెల్లరంగు గలవియు, ఆకుపచ్చ రంగుగల వియు ద్వివిధము. ఆకుపచ్చ రంగు బలముగ నున్న కొలది కాయలు ఎక్కువ చేదుగనుండెడిని. తెల్లకాయ యందు పైనుండు ముండ్లమొనలు వాడిగనుండినవియు, ఇంచుక తగ్గి ఉన్నతము గాన రాకుండునవియునని భేదము కలదు. ఉన్నతము లేకుండు జాతియందు చేదింకనూ తగ్గియుండును.

ఇందు తెల్లజాతియె, చేదు తగ్గి యుండు జాతియే భోజనపదార్థములందు శ్రేష్ఠమని చెప్పఁ బడు చున్నది దీనికి లాటిన్భాష యందు Momardica charantia అనియు, ఆంగ్ల. Better Gourd, అనియు పేర్లు సం. కటిల్లకీ, కారవేల్ల, కారవేల్లకః, కారవేల్లీ, సుకాండ, సుకాండికాయనియును పేరులు కలవు.

కాకరకాయలు లేతవి త్రిదోషహరమనియు, ముదురుకాయలు విరేచనకారు లనియు చెప్పఁ బడినది. పండుకాయ కఫమును జయించి పైత్య వాతముల గల్గించును. సగటున కాకరకాయలు కండ్లకు చలువజేసి అగ్నిదీప్తిని గల్గించి సర్వరోగ హారమని చెప్పఁబడినది.

కాకరకాయలు-కాసలు, కుష్ఠురోగము, జ్వర ములు, మేహము, వాతములు, శ్వాసలు నివా రించుననియును, అతిసారము, క్రిమిరోగము, శ్లేష్మ ములపై చక్కగ పనిజేయుననియును చెప్పఁబడినది. మూలవ్యాధికి నీకాకరకాయ చక్కగ పనిజేయు నందురు.

కాకరఆకు- కాయలకన్న నెక్కువ ఆరోగ్య ప్రదమని యందురు. కుక్క, నక్కల విషము లను (కరిచిన విషము), క్రిమిరోగము, చర్మ రోగములు, పాండురోగము కూడ కాకరాకు (ఆకు ముఖ్యముగ పసరు) వలన నివారణమగు నని చెప్పఁబడినది క్షయరోగము, కడుపుబ్బును నివారించునని కొందరు నుడివిరి.

పొట్టికాకరకాయలు - ఇవియును భోజనము నందు కూర మొదలగునవిగ రచింతురు. ఇవి కొంచెము చేదు తక్కువగ గుండ్రనై యుండును. చిన్నవి. కాకరకాయ గుణములే కలవి

పొట్టికాకర సమూలరసము అర్ధ్వారికిని కొన్ని ఇతరవస్తువులతో కల్పి లోనికిచ్చినను పైకి రాసి నను కుక్క నక్కల విషములు, గజ్జి, చిడుము, పల్లికలు, సర్పి మొదలగు చర్మ వ్యాధులను నివారించును. కాకరజాతికి నెయ్యి, పులుసు, ఆవాలగుండ, మోదుగమాడల కషాయము, అంగాకరకాయలు, దోసకాయలు, పెద్దములం కాయలు విరుగుడులు.

ఈకాకర జాతికిం జేరియు పొట్టికాకరయుం దడవిజాతిగ నెన్నఁబడు చుండునది, మట్టకాకర యను వేఱొకజాతి కలదు. ఇది పొట్టికాకర కన్నను చిన్న కాయలుం గాచును. ఇదియును కొందరు తినెదరట.

ఇది ధాతుపుష్టి, దేహదార్ఢ్యము, జఠరదీప్తులం గల్గించు ననియు, కఫ, క్రిమి, గుల్మములపై చక్కగ పనిఁజేయు ననియు, తాపమును, పైత్యమును, వాతమును, నివారించుననియును జెప్పుదురు.

**కాకరపర్తి కృష్ణకవి**—ఆంధ్రకవులలో నాధునికులందుపరిగణింపఁబడినవాఁడు. వెలనాటి బ్రాహ్మణుడు. తండ్రి తిరుపతిపాత్రుఁడు తల్లి సీతమ్మ రచించినవి శశిరేఖాపరిణయము, ముఖ లింగక్షేత్రమాహాత్మ్యము నను పద్యకావ్యములు.

**కాకరపర్తి తిరుపతిపాత్రకవి** — ఆంధ్రకవులలో నాధునికులలోను పరిగణింపఁబడిన వాఁడు వెలనాటి బ్రాహ్మణుఁడు. విశాఖపట్టణ వాసి. శ్రీ గొడే జగ్గారాయణింగారను ప్రభువున కాశ్రితుఁడు కాకరపర్తి కృష్ణకవి యితని సుతుఁడు ఈకవి రచించినది సత్యభామాకృష్ణసంవాద మను ప్రబంధము. దీనిని శ్రీగొడే జగ్గారాయప్రభుఁ కంకితమొసర్చెనని చెప్పఁబడినది

**కాకరపర్తి బుచ్చిపాత్రకవి**—ఆంధ్రకవులలో నాధునికులలోను పరిగణింపఁబడినవాఁడు. వెలనాటి బ్రాహ్మణుఁడు కాశ్యపసగోత్రము తండ్రిపేరు కృష్ణకవి (ఈకృష్ణకవి ముఖలింగక్షేత్రమాహాత్మ్యకర్త). కాపురము విశాఖపట్టణ ప్రాంతము. రచించినది సత్యవతీపరిణయ మను ప్రబంధము ఇది జటిలమై ప్రౌఢకావ్యముగ నున్నది దీని కృతిపద్యములు రచింపకమున్నె కవి మృతినొంద, కవిసోదరపుత్రుఁడగు వేంకట శాస్త్రి కవిసంకల్పము మేరకు శ్రీగొడేనారాయణ గజపతిరాయ మహారాజగారికి కృతిపద్యముల రచించి కృతినిచ్చి పూర్తిగావించెను.

**కాకవంధ్యత్వము** — వంధ్యత్వము చూడుఁడు.

**కాకవేణీనది** — ఇది గండకీనది పూర్వ భాగమునకు పేరు. ఇంకను సాలగ్రామ మనియు నందురు (సాలగ్రామ క్షేత్రము చూడుఁడు, గండకీనది చూడుఁడు).

**కాక (కాకుల) శాస్త్రము** —



ప్రయాణసందర్భమున ఊరి నుండిగాని, ఇంటినుండి గాని బయలుదేరునపుడు, కాకులు కుడి వైపునుండి ఎడమవైపున కేగిన కార్యము జయమగుననియు, ప్రవేశసందర్భమున ఊరియందుగాని, ఇంటి యందుగాని ప్రవేశించునపుడు, కాకులు ఎడమవైపు నుండి కుడివైపున కేగిన శుభమనియు చెప్పఁబడినది. ప్రయాణకాలమునను, ప్రవేశకాలమునను తప్ప తక్కినకాలములందు మార్గమధ్యమున కాకుల శకునములు పాటింపఁబడ నక్కరలేదని బుధులు పల్కుచున్నారు. ఇట్టిసందర్భములందు కుడినుండి ఎడమకేగు కాకి యొక్కటియె యగునేని మేలుకల్గుననియు, రెండగునేని శుభప్రదమనియు, మూఁడుకాకు లగునేని భూలాభ మనియుం జెప్పఁబడినది.

కాకములు తొలుత కుడివైపునుండి ఎడమ వైపున కేగి, వెంటనేమరలి, ఎడమవైపునుండి కుడి వైపున కేతెంచిన మృత్యుతుల్యమగు ఆపద కల్గుననియు, ఎడమ వైపునుండియె బయలు దేరి కుడివైపున కేగిన దైన్యముగల్గునని కొందఱనిరి. రెండు వైపులకుఁ గాకులూరక తిరుగుచుండుట కార్యసిద్ధి సూచకమని పెక్కండ్రు బుధులు పల్కియున్నారు. కుడి నుండి ఎడమవైపున కేగుచుండు వెనుకనుండి ముందునకుఁ గాకులేతెంచిన కార్యసానుకూల మనియు, ఎడమనుండి కుడికేగునపుడు వెనుకనుండి ముందునకేతెంచుట కార్యమునకు విఘ్నములు గల్గుననియు చెప్పఁబడినది. దూరమునుండి కాకులు ఎగురుచు కుడినుండి ఎడమవైపున కేగు నేని యాలస్యముగ వాంఛితకార్యసిద్ధి యగుననియు, సమీపమునుండి ఎగురుచుఎదురై గుడివైపునుండి ఎడమవైపున కేగనేని మేలనియు, మొత్తమున గాకులు వెనుకనుండి ముందున కేగుట శుభ మనియు, ముందునుండి (ఎదురై) తనవెనుక కేగుట కార్యహానియనియుం జెప్పఁబడినది.

ఆహారముకాని, కట్టెపుల్లంగాని కాకినోటం గరచుకొని తన కుడినుండి ఎడమవైపున కేగిన లాభమును, ఎక్కువ సంఖ్యాకములగు కాకులు

కుడినుండి ఎడమదిక్కున కేగుటయు, ఒక్క కాకి వాటికెదురుగ ఎడమదిక్కునుండి కుడిదిక్కున కేగుటయు, తనకెదురుగ సంభవించుట తాను దానిం జూచెనేని మిక్కిలి శుభప్రదమనియు, జోడుకాకులు రెండుమూడు పర్యాయములుగ తన కుడివైపునుండి ఎడమవైపున కేగుచేని తా దలంచుచున్న కార్యమగుట దుర్ఘటమనియు వాయస శాస్త్రానుభవజ్ఞులగుబుధులు నుడివెదరు. వాయసమైథునముం జూచుట యాపత్కరమనియు, కాకి తనతలను తన్నుట కార్యహాని, అశుభము, భయప్రదముననియు, కాకులుగూళ్ళు విస్తారముగ గట్టుకొనుట క్షామసూచకమనియుం జెప్పఁబడినది

**కాకశీర్షి గోత్రము**—గవిష్ఠిరగణము చూడుఁడు.

**కాకాతూపక్షి (కాకాతువ్వ)** — దీనిని చిలుకతెగకు జేర్చెదరు నెత్తిపై జుత్తు నిలవఁబడియుండును. ఆస్ట్రేలియాయందు చుట్టుపట్ల ద్వీపములందు తరుచుగ గానఁబడును. దీనిని తెల్లచిలుకయని గూడ నందురు.

**కాకాధికరణత్వ న్యాయము** — కాకి వ్రాలుట నానవాలుగా చెప్పుట కష్టము. కాకి వ్రాలియుంట ఒక ఆనవాలుకానేరదు. అది క్షణమాత్రమైనను ఎగిరిపోవును అనిశ్చితమగు ఆనవాలని భావము.

**కాకాయుము** — అష్ట విధాయుములు చూడుఁడు.

**కాకాక్షిగోలకన్యాయము** — కాకి రెండుకండ్లకును ఒకటే గ్రుడ్డుండుననియు, అది అవసరముకొలది ఇటునటు తిరుగుచుండుననియు ఒక ప్రతీతికలదు. అట్లే ఒకచోట నుండుతరి రెండవతావున లేకుండుటయు, ఒకస్థితి రెండు మూడు తావుల నప్పటప్పట సంభవించుచో, ఒకేతావుననుండి తక్కిన తావుల గలుగకుండుటయు దెలుప నీ న్యాయమును వాడుచుందురు.

**కాకిచంపుచెట్టు** — లా. Menispermum Cocoulus. దీనిగూర్చి యంతగా తెలియదు. దీని యాకులు మునగయాకులం బోలియుండుననియు, దీనికాయలు తొలుత ఎరుపు పిదప తెలుపు, పిదప నలుపురంగులుగ మారుననియు చెప్పఁబడినది. కాయల చూర్ణము తైలముందు గల్పి పైని రాయుటవలన గజ్జి, చిడుము, తామర, పల్లికలు, పురుగుకాటు విషము, సర్పి నివారణమగుననియు, ఆహారమున నించుక గల్పి పక్షులకిడిన నవి మత్తెక్కి ఎగురజాలకుండుననియు, చిన్న చెరువులందు చేపలున్న తావుల నీ కాకిచంపుచెట్టు కొమ్మలు, ఆకులు కొన్ని పడవైచిన వానిసారము నీటంగలియుటవలన చేపలు చచ్చి పైకి తేలుననియు దీనిం గూర్చి చెప్పఁబడినది. ఇందువలన నిది యొక్క మోస్తరు విషమని తేలుచున్నది

**కాకిని తెచ్చి పంజరములో పెడితే చిలుకవలె మాట్లాడునా?** — ఆంధ్రలోకోక్తి.

**కాకిపిల్ల కాకికిముద్దు** — ఆంధ్రలోకోక్తి.

**కాకిపుట్టి నలుపే, పెరిగినలుపే**- ఆంధ్రలోకోక్తి.

**కాకిముక్కున దొండపండు** — (అనగా తగని జోడాయని భావము). ఆంధ్రలోకోక్తి.

**కాకీముద్ర** — యోగాభ్యాస విధానమున జెప్పఁబడిన వింశతిముద్రలలో నొకటి. కాకి చంచువుల పోల్కిని నోటితో వాయువును లోనికి పీల్చుట కాకీముద్రయనియు, ఇది సకల రోగహారమనియుం జెప్పఁబడినది.

**కాకీవాలినది పండూపండినది** — ఆంధ్రలోకోక్తి.

**కాకునూరి అప్పకవి** - ఆంధ్రకవులలో మధ్యకవులలో పరిగణింపబడినవాడు. గొప్ప లాక్షణికుడు వెలనాటిశాఖ బ్రాహ్మణుడు. తంగేటినగరమునకు కాలెంపల్లి కాపురము. ఇది కాశీక్షేత్రతుల్యమగు క్షేత్రమని ఇతడనియున్నాడు. ఇతడు రచించినది అప్పకవీయమను లక్షణ గ్రంథము. ఇతనిగూర్చిన కథలు కొన్నికలవు. అవి ఈ గ్రంథమునందప్రస్తుతము మరియు నవి విమర్శనీయములుగ నున్నవి. కాని యప్పకవి గొప్ప లక్షణవిదుడని చెప్పకతీరదు (అప్పకవి చూడుడు)

**కాకురిగోత్రము** — వసిష్ఠగణము చూడుడు.

**కాకులంగొట్టి గ్రద్దలకు సంతర్పణ జేసినట్లు** — కాకుల జంపి యామాంస మును గ్రద్దలకు భోజనమిడినట్లని యొక అర్థము. కాకుల నవ్వాలకు బారదోలి, అవి తినకుండ గ్రద్దలకు భోజనమిడినట్లని రెండవ యర్థము. ఆంధ్రలోకోక్తి

**కాకోగ్రాఫీ** (Cacography) — వర్ణక్రమభంగము (Incorrect spelling) తెలియని వ్రాతదస్తూరి (Bad hand-writing). దీనికి వ్యతిరేకమైనది Orthography (or correct spelling) and Calligraphy (or Good hand-writing).

**కాకోలూకనిశావదిత న్యాయము**- కాకికిపగలుగనుండు దివసమున నులూకము (గుడ్లగూబ) రాత్రిం జేసుకొని నిద్రించును. గుడ్లగూబ మేల్కొనియుండు రాత్రియందు కాకి నిద్రించుచుండును. ఒకరియనుకూలత వేరొకరి కననుకూలముగను, అట్టి (వేరొకరి) యనుకూలత మొదటివారి యననుకూలతగను నుండుపరిస్థితిం గూర్చి యీన్యాయము వర్తించును.

**కాకోళిచెట్టు (క్షీరకాకోళీ)** - దీనిం గూర్చి యంతగ తెలియదు. వైద్యోపయోగమగు నౌషధి. కాకోళియనియు, క్షీరకాకోళియనియు ఇది ద్వివిధమగును. కాకోళికి (సం) జీవనీ, జీవనీయగణః యనియు, క్షీరకాకోళికి జీవనీయ గణః, శుక్లక్షీరా, శుక్లావయస్థా, వయస్సా యని యు పేర్లు. అసంసిద్ధముగ వాడబడియున్నవి. క్షీర కాకోళిని క్షీరమధురా యనియు వాడియున్నారు. కాకోళిచూర్ణము లేక కషాయము త్రిదోషహార మనియు, దేహపుష్టి, వీర్యవృద్ధి గల్గించుననియు, జ్వరములు, తాపములు, మేహము, క్షయల నిర్మూలించుననియు, క్షీరకాకోళి రసము లేక చూర్ణము లేక కషాయము వీర్యవృద్ధికొసంగి వయస్సును నిల్పుననియు, శరీరకాంతి గల్గించు ననియు, కఫపైత్యములు, కాస, జ్వరము, తాపము, శ్వాస, హృద్రోగములు, క్షయ వీటిని నివారించుననియు చెప్పబడినది.

**కాక్లి గోత్రము** — పరాశరగణము చూడుడు

**కాక్ ఎండు బుల్ స్టోరీ** (Cock and Bull Story) — అసందర్భపు కథలును, అసంభవములగు సంగతులు గల కథలకును ఈపేరు సామెతగ దనరెడిని. పూర్వమింట ఈజిప్టు దేశమున, జంతుజాలములు వృక్షములు మొదలగు చిహ్నములతో చెక్కబడిన భాషయుండెను. దాని పేరు Hieroglyphy. ఆభాష దుర్భేద్యముగ చాలాకాలముండి ఎట్టకేలకు గ్రహింపబడినది. అంతవఱకు చరిత్రలలో నసందర్భము లగు రెంటిం గైకొని పై పేరున సామెతగా నసందర్భ చరిత్రకు వాడుచున్నారు.

**కాఖ్ వైద్యుని నిర్ధారణ సూత్రములు** — ఈమహానీయుడు గొప్ప వైద్యశాస్త్రవిదుడు. ప్రాత్యాశ్చ వైద్యవిధానమున గొప్ప పరిశీలనలొనర్చినవాడు. Germ Theory బాగుగ పరిశీలించి అంటువ్యాధులవ్యాపకమునకై కొన్ని సూత్రములను నిర్ధారణచేసి (అంటువ్యాధులచూడుడు) వెల్లడించెను. ఇవి ప్రాత్యాశ్చ వైద్యులచే గౌరవింపబడుచున్నవి.

౧. ఒకవ్యాధికి కారణమని ధృవపరుపబడిన సూక్ష్మజీవి, అదేవ్యాధిగల ప్రతిశరీరమున కనబడవలయును. ౨. అట్లు కనిపెట్టబడిన క్రిములు వృద్ధిచెందుటకనుకూలమైన పరిస్థితులు కల్గుటచేసి యవి బాగుగ పెరుగవలెను. 3 అట్లు పెరిగిన క్రిములు వేఱుచేసి ఆరోగ్యవంతమగు శరీరమున ఎక్కించినచో నారోగలక్షణము లగపడవలెను. ౪. అట్లు రోగలక్షణము లగపడినపిదప రోగి శరీరమున తిరిగి ఆ క్రిములు కనిపెట్టబడవలెను. ౫. అట్లు క్రిములు మరల నింకొక శరీరమున నావ్యాధిగల్గింపగల శక్తిగలవై యుండవలెను

**కాఖ్సు పోశ్చులేట్సు** (Coch's Postulates) — కాఖ్ వైద్యుని నిర్ధారణ సూత్రములచూడుడు

**కాగల కార్యములు గంధర్వులే తీర్చెదరు**— ఆంధ్రలోకోక్తి.

**కాగితముల పరిమాణములు**— కాగితములు వ్రాయుటకును, ముద్రించుటకును, పైనిచుట్టుట, అట్టలువేయుట మొదలగు పనుల కుపయోగించెడివి తొల్లింటికాలమున భరతదేశమున తాటియాకులపై వ్రాయబడుచుండిన గ్రంథములు, పత్రములు, లేఖలు కాగితముల నిర్మాణమారంభమైనపిదప కాగితములపై వ్రాయబడుచున్నవి. ఇంకను ముద్రించుట ప్రారంభమైన పిదప కాగితముల నన్నివ్రాతపనులు ముద్రింపబడుట ప్రారంభమయ్యెను. ఇంకను వార్తాపత్రికలు పెక్కులుగ వెలువడు నిక్కాలమున కాగితముల ఉపయోగ మింతింత యనరాకున్నది.

కాగితములు పలుతెఱగులుగ నుండును. మరియును వానినిపెక్కు పరిమాణములలో చేయుదురు. వాటియందు ముఖ్యములగునవి- ౧ అచ్చు (Printing paper) కాగితములు, ౨ పుస్తకముల కాగితములు (Book paper), 3. ఆంటిక్ పేపరు (Antique paper), ౪. పైనిచుట్టు కాగితములు (Wrapping paper) అనునవి.

౧ అచ్చుకాగితములు- ఇవి Wood, Pulp అను పదార్థములతో చేయుదురు చేయువిధానము Sulphite Process అనియెదరు. దీనిని మూటి నొక పాలుగల్పి చేసెదరట ఈకాగితములు చౌకగ తయారగునవి గాన, వార్తాపత్రికలు మొదలగునవి ముద్రింతురు. వాటి పరిమాణములు వివరింతును.

| | | |
|---|---|---|
| పోస్టు (Post) | అంగుళములు | 19½ × 15½ |
| డెమ్మీ ( Demy ) | ,, | 22½ × 17½ |
| షీట్ అండ్ హాఫ్‌పోస్టు (Sheet & Half Post) | | 23½ × 19½ |
| మీడియమ్ (Medium) | | 24 × 19 |
| రోయల్ (Royal) | | 25 × 20 |
| డబుల్ఫూల్సుకేపు (Double Foolscap) | | 27 × 17 |
| సూపర్రాయల్ (Super Royal) | | 27½ × 20½ |
| డబుల్క్రౌన్ (Double Crown) | | 30 × 20 |
| ఇంపీరియల్ (Imperial) | | 30 × 22 |
| డబుల్పోస్టు (Double Post) | | 31½ × 19¾ |
| డబుల్డెమ్మీ ( Double Demy ) | | 35 × 22½ |
| డబుల్రోయల్ (Double Royal) | | 40 × 25 |

కాగితములు ౨౪ లేక ౨౫ ఒక దస్తాగను, ౨౦ దస్తా లొక రీముగను లెక్కింపఁబడును తెలుపుగ రీము కాగితములు రెండుకట్టలుగ కట్టఁబడి విక్రయింపఁబడుచుండు పరిమాణములుగ చిక్కుడివి. రీము నకు ౪౮౦ మొదలు ౫౦౦ కాగితములుండును. పెద్దరూపు కాగితముల దళసరి ననుసరించియు, కాగితముల నునుపు చేయఁబడుటనుండియు వేఱు వేఱు విధములుగ నున్నవి. రీము కాగితములు ఎన్మిదిపౌనులు మొదలు నూఱుపౌనుల వఱకు బరువు తూగునట్లుగ చేయబడుచుండును ౮, ౧౦ పౌనులబరువు కాగితములను రఫ్ అనియెదరు

౨. పుస్తకముల కాగితములు (Book paper)- చౌకరకములు ఇవి అచ్చుకాగితములవలెనే చేయఁబడి ఆర్లీయుండెను. మంచి రకములందు పాతగడ్డపోచలు కూడ కలియును కలపరంగులతో నీకాగితములు చేయఁబడును. ఈకాగితములు చేయుటయందు చౌక చిత్రములకును సైజింగు అనునది ఒక Vegetable matter నూ Woodpulp యందు కలుపుదురు. దీని వలన కాగితము సిరా చిమ్మకుండును. ఇట్టి కాగితములను Sized paper అనియెదరు ఇందు చీనామట్టి (China clay) అనుబడు నొక జిగురు మొదలగు పదార్థమును కూడ చేర్చెదరనియు, Gelatine అను వస్తువును చేర్చెదరనియు కూడ చెప్పుదురు ఇది యంతయు కాగితమును సైజ చేయుటకే నని ఎఱుగునది. ఇక కాగితములను ఒకదాని నొకటి నొరసికొనిపోవునట్లుగా వేడిచేయఁబడిన సిలెండరులగుండా నడచునట్లు చేయుదురు దీనిని Calendering అనియెదరు ఈ Calendering వలన కాగితము నునుపై మెరుగుదేరెడిని. Calendering ఎక్కువగసాగిన కాగితములకు Super Calendered paper అనియెదరు. కావున కాగితములు S (Sized paper) అనియును, S. & C. (Sized and Calendered paper) అనియును, S & S. C. (Sized and Super Calendered paper) అనియును మార్కులుం గల్గియుండెడివి. చిత్రములను ముద్రించు ఆర్టు కాగితమును కొందఱు Enamelled paper అని యనుటయుఁగలదు. ఇది ఎక్కువగగాని, కొంతదనుకగాని దళసరిగను మిగుల నునుపుగల్గి మెరయునదిగను ఉండును. దీనికి విలువయు ఎచ్చుగనే యుండెడివి. ఇందు Gelatine ఎక్కువ కలుపఁబడును మరియు ఎక్కువగ Calender చేయబడును.

3. ఆంటిక్ కాగితములు (Antique paper)- ఇది ఎక్కువజాతి కాగితము. దీనికి సైజుచేయుట, కేలండరుచేయుట యుండదు. కాగితముల పరిమాణములు అచ్చుకాగితములందు వివరింపఁబడినరీతినే అన్నిరకముల కాగితములకుండునుగాని (పుస్తకములు మొదలగునవిగ) మడచుటయందు భేదములుండి వేర్వేఱుపేరులం బరగుచున్నవి వాటిని వివరించుచున్నము.

| | | |
|---|---|---|
| Demy 8 Vo | పొడత అంగుళములు | $8\frac{7}{8} \times 5\frac{3}{4}$ |
| Post 8 Vo | ,, | $7\frac{7}{8} \times 5$ |
| Crown 8 Vo | ,, | $7\frac{1}{2} \times 5$ |
| Demy 12 Mo | ,, | $7\frac{1}{2} \times 4\frac{3}{4}$ |
| Foolscap 8 Vo | ,, | $6\frac{3}{4} \times 4\frac{1}{4}$ |
| Demy 8 Mo | ,, | $5\frac{7}{8} \times 3\frac{3}{4}$ |
| Demy 16 Mo | ,, | $5\frac{1}{2} \times 4\frac{3}{4}$ |
| Imperial 32 Mo. | ,, | $5\frac{1}{2} \times 3\frac{1}{4}$ |
| Foolscap 12 Mo. | ,, | $5\frac{1}{2} \times 3\frac{1}{4}$ |
| Royal 32 Mo. | ,, | $5 \times 3\frac{1}{8}$ |
| Demy 32 Mo | ,, | $4\frac{3}{8} \times 2\frac{5}{8}$ |
| Crown 32 Mo. | ,, | $3\frac{1}{4} \times 2\frac{1}{4}$ |

౪. పైనిచుట్టు కాగితములు (Wrapping paper) - ఇవి పలురకములు. వేర్వేఱు దళసరులతో చేయఁబడును. పరిమాణములలో

ముఖ్యములెన్మిది రకములు గానవచ్చుచున్నవి కాని ఇంకను కలవు.

| | | |
|---|---|---|
| Casing | అంగు. | 46 × 36 |
| Double Imperial | ,, | 45 × 29 |
| Elephant | ,, | 34 × 24 |
| Double four pound | ,, | 31 × 21 |
| Imperial cap | ,, | 29 × 22 |
| Haven cap | ,, | 26 × 21 |
| Bag cap | ,, | 24 × 19½ |
| Kent cap | ,, | 21 × 18 |

ఇంక ఉత్తరముల కాగితముల పరిమాణములు తఱుచుగ మారుచుండుటను వ్రాయు వీలుండదు కాన వివరింపక వదలివేసితిమి.

**కాచకిగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**కాచకుంభకారి పరిశ్రమలు** —



గాజుతోడను, మట్టితోడను జనోపయుక్తములగు పాకరములను నిర్మించు పరిశ్రమలకు కాచకుంభకారి పరిశ్రమలని పేరు. ఇట్టిసామానులను చేయుట హిందూదేశమునం దనాదిసిద్ధముగా నున్నది. గాజుతో చేయంబడిన పులాకాగి విశేషముల ప్రశంస ఋగ్వేదమునందుం గలదు. నిలువుటద్దములు, కాచపాత్రములు, గాజు కుప్పెలు మొదలగు గాజుసామానులు వేదకాలమునుండియు హిందూదేశమునందు వాడుకలో నున్నవి.

ఇటీవల పదునారు, పదునేడవ శతాబ్దముల యందు మొగలాయీ ప్రభుత్వములో రంగు రంగుల గాజుకూజాలును, ఇనామిల్ పాత్రలును మహమ్మదీయ ప్రభుకుటుంబములలో విశేషముగా వాడుకచేయంబడుచుండినట్లు మనకు దేశచరిత్రవలనం దెలియుచున్నది. మనోహరమగు గాజుసామానులును కిటికీలకుం గూర్పంబడు నద్దపు తలుపులును ఢిల్లీయందునే తయారు చేయంబడుచుండెను. ఇట్లు హిందూదేశమునందు చేయంబడిన కుంభకారపరిశ్రమయందలి కొన్ని కొన్ని రకముల సామానులు వివిధదేశములలో విఖ్యాతి విమర్శనలకు భాజనభూతములైనవి. కాని గాజు పరిశ్రమమాత్రము హిందూదేశమునందంతగా నభివృద్ధిం బొందలేదు. ఇంకను పూర్వపుం బద్ధతినే సామాన్యముగ గృహపరిశ్రమ వలెనే గాజు తయారుచేయంబడుచున్నది. ఇదియైనను పంజాబు, బీహార్, బొంబాయి, బెంగాల్ ప్రెసిడెన్సీల యందుమాత్రమే గలదు.

గాజుచే చేయంబడు సామానులను రెండు ముఖ్య భాగములుగా విభజింపవచ్చును. ఒకటి పుణ్యస్త్రీలు హస్తాభరణములుగా నుపయోగించు వేలువేలు రకముల గాజులు, రెండవది సీసాలు, బుడ్లు, కూజాలు, చిమ్నీలు, గొట్టములు, కప్పులు, సాసర్లు, పలకలు మొదలగు వివిధములగు గాజుసామానులు

సర్వసాధారణముగా గాజులు మొదలగు మొదటిరకములలోం జేరిన హస్తాభరణ విశేషములు విదేశములనుండి వచ్చుచున్న గాజుసామానులలో పగిలిపోయినవానిని తిరిగి కరగించిన పదార్థముతో తయారు చేయంబడుచున్నవి. రెండవరకమునందు కూడ చాలవస్తువులు అట్టి గాజుతోడనే చేయంబడుచున్నవి.

గాజు తయారుచేయుటకుం గావలసిన ముఖ్యములగు కోరా పదార్థము లేవియన సిలికా, సోడాకాంపౌండులు, పోటాసు, కాల్చగా నుసియైన బుగ్గి ఇందులో గాజు తయారుచేయుటకు సిలికా ప్రధానద్రవ్యము. సామాన్యముగు నిసుకకే సిలికాయని పేరు. కాని సిలికా ఘనరూపావస్థలోనున్న క్రొవ్వురాయి, సున్నపురాయి, చెకుముకిరాయి, పిండిరాయి మొదలగు

నవి పొడిచేసి వానినుండి సిలికా సంగ్రహింపఁబడును. పిదప సిలికాను పలువిధములగు రసాయనిక ద్రవ్యములతో కలిపి కరఁగించి పలువిధములగు కాచభేదములు చేయఁబడును. ఇందులో నుపయోగింపఁబడు ముఖ్యములగు రసాయనిక పదార్థములు ౧. కార్బొనేట్ ఆఫ్ సోడా, ౨. సల్ఫేట్ ఆఫ్ సోడా, 3. సున్నము లేక ఉప్పు, కార్బొనేట్ ఆఫ్ సోడాతో సిలికాను కలిపి చేసిన గాజు పెళుసుగానుండును. కాని దీనిలో సున్నము కలిపినయెడల బలముగా నుండును.

అన్ని రకములయిన గాజు తయారుచేయుటయందును సున్నము ముఖ్యముగా కలుపఁబడవలయును. ఫ్లింట్‌గ్లాస్ కంటియద్దములు - వీని కొరకై తయారుచేయఁబడు గాజులో బోరిక్ ఆసిడ్ (Boric Acid) గాని, పొటాషియమ్ కార్బొనేట్‌గాని ముఖ్యముగా కలుపఁబడవలయును. ప్రత్యేకదనము తళుకు కావలసిన యెడల సీసము కలుపవలయును. వేడి లేని గాజు కావలసిన యెడల అల్యూమినియమ్ చేర్పవలయును.

హిందూదేశమునందు తయారగుచున్న గాజులో కలుపఁబడు కోరావస్తువు లేవియన్న సిలికా, సున్నము, ఆల్కలి, సీసము మరకొన్ని రసాయనిక ద్రవ్యములు, నేలబొగ్గు.

సిలికా, సున్నపురాయి హిందూదేశమునందనేక భాగములయందు విశేషముగా దొరకును. ఉత్తరపుపాక్ స్టేటులలోని సిల్వర్, లెడ్, జింకు గని యొద్ద సీసము విశేషముగా దొరకును. ఆల్కలి, సోడియం కాంపౌండ్సు మొదలగు నితర రసాయనిక పదార్థములే హిందూదేశమునందు అరుదుగా లభించుటచే విశేష వ్యయప్రయాసముల కోర్చి విదేశములనుండి తెప్పించుకోవలసియున్నది. వంగదేశమునందు నేలబొగ్గు విశేషముగా లభించినను, ఇతరరాష్ట్రములవారికదియు నిబ్బందిగానేయున్నది. ఇదిగాక గాజు తయారుచేయుటకు నధికోష్ణప్రదేశము లనుకూలింపవు. పై పరిస్థితులే హిందూదేశమునందు ఈ పరిశ్రమ యింకను అభివృద్ధి కాకుండుట కంతరాయములై యుండవచ్చును.

**కాచమణి న్యాయము** — గాజురాయి రత్నమున కీభావమువారుగుదు. పరీక్షాకాలమున తెలిసి పోవునని భావము.

**కాచవిభుఁడు, విఠలరాజు** — వీరిద్దరు సోదరులు బుద్ధరాజు కుమారులు. ఆంధ్రకవులందు పూర్వకవులలోని వారుగఁ బరిగణింపఁబడిన వారు తమతండ్రి కోర్కెమేరకు ఉత్తర రామాయణమును ద్విపద కావ్యముగ రచించిరి. వీరి కవితాధోరణి రంగనాథ రామాయణమునుబోలియున్నదని తలంపఁబడుచున్నది.

**కాచాయనగోత్రము** — నిధ్రువగణము చూడుము.

**కాచింగు ఎ టార్టార్** (Catching a Tartar) — తానే యితరులకు లోఁబడుటకు వాడఁబడుచున్న ఉక్తి. కొల్లిరు తార్తారులతోడి కలహమున నొక ఇంగ్లాండుదేశపు సైనికుఁడొక తార్తారు సైనికునిఁ బట్టుకొని బిగ్గరగ "నేనొక తార్తారుని బట్టుకొన్నాను" అని యరచెను. అతని పై యధికారి 'వాని నాకడకు దెమ్మన వాఁడు 'నన్నటులఁ జేయనీయడ' నెనట. తోడనే యా తార్తారుఁ డాయింగ్లాండు సిపాయినీడ్చుకొని తనశిబిరము జేర్చి నిర్బంధించెనట. ఇక్కాలమున నాతఁడరచిన యగపు తానే యితరులకు లొంగిపోవుటం దెల్పు సామెతగానున్నది.

**కాచిన చెట్టుకు రాళ్ల దెబ్బలు కాని కాయని చెట్టుపై ఎవ్వరు**

రాళ్లు విసరుదురు ? ఇట రాతిని విసరుట పండును నేలబడజేయుటకు. ఆంధ్రలోకోక్తి

**క్రాచు** (కవిరె)-కవిరె చూడుడు.

**క్రాజపాయనగోత్రము**- ఉపమన్యుగణము చూడుడు.

**క్రాజాన్ పురము సీమ**- సోవియటు రష్యాలోని తార్తార్ సీమ. ఈ దేశమునందు తోళ్లపని పేరందినది కాజాన్పురపు పాదరక్షలు సుప్రసిద్ధములు

**క్రాజ్మొగొనీ** (Cosmogoney) — కాజ్మొలొజీ (Cosmology) చూడుడు.

**క్రాజ్మొలొజీ** (Cosmology) -జగత్తునందలి పదార్థ వితతి, ఉన్నది ఉన్నటుల పరిశీలించు కళ. దీనికిం గొంతభేదముగల ఇట్టికళయగు Cosmogoney జగత్తును అందలి పదార్థము లెట్లుండెనో ఆస్థితి. పిదప మారుట విమర్శించి పరిశీలించు కళయై యున్నది. Cosmology వర్తమాన స్థితిని, Cosmogoney తొల్లింటి స్థితిని విమర్శించు శాస్త్రములు.

**కాటకుల గోత్రము**—ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములు లలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుడు) కాటకుల గోత్రము దాక్షాగ్నేయ ౧ర గోత్రము- దీనిని కాటకుల, కోటకుల, కోలకుల గోత్రమనియు నందురు తొల్లింటి సంస్కృత గోత్రము కణ్వాయనస, కణ్వగణము, కణ్వర్షి, ఆపస్తంబసూత్రము యజుశ్శాఖ, ప్రమాణగ్రంథములు ఆశ్వలాయన సూత్రము, నిర్ణయసింధు, ధర్మసింధు. దాక్షేశుడు దేవత, భార్యరామాంబ, గంగాసాగర సంగమము తపస్థానము, రామాంబుధితటాకము, జపము దశలక్ష, దీపములు ౨౦, క్షేత్రసంఖ్య ౨౦, ఒంటెలొట్టిపిట్ట) దానము, తెల్లకందులు వర్జనీయము.

**క్రాటికిక్రాళ్లచాచుకు నిత్రిం దికి చేయిజాచినట్లు** — ఆంధ్రలోకోక్తి

**క్రాటుకగింజల చెట్టు** - లా. Epomaae hederaceae ఆంగ్ల Kaladane. కాలాదానా యన హిందూస్థాన్ భాషయందు నల్లగింజలని యర్థము. ఈచెట్టుంగూర్చి అంతగా తెలియదు. ఈగింజలుమాత్ర మీ దేశమున దొరకెడిని. వైద్యోపయోగముగ దీని నెఱుంగుదుము. సీటికి కొల్లివిత్తులనియు, జిరికివిత్తులనియు వానుక నామములుకలవు. ఈచెట్టు జిగురు కాయలలోని గింజలును ఉపయోగింతురు. గింజల నొడించిగాని, కొంచెము వేయించిగాని గుండజేసి లోనికిచ్చిన విరేచనములగును. అట్టిభేగులు శ్లేష్మము, పైత్యము, క్రిములు చక్కగ వెడలి, ఏవికారములు, కడుపునొప్పి మొదలగు బాధలు లేక సుఖవిరేచనములగును. చెట్టుజిగురు విరేచనకారియని చెప్పఁబడినది కాని దీని నితర విరేచనౌషధములందు కలుపుచుందురు. గింజల చూర్ణము స్వతంత్రముగనే విరేచనముల నొసర్చును.

**క్రాణాద పెద్దనసోమయాజికవి** – ఆంధ్రకవులలో నాధునికునిగఁ బరిగణింపఁబడినవాఁడు. నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. ఆశ్వలాయన సూత్రుఁడు. ఆత్రేయసగోత్రుఁడు తిమ్మనార్యపుత్రుఁడు. నిజాముకాజ్యములోని గద్వాల సంస్థానపు ప్రభువగు ముష్టిపల్లి సోమభూపాలుని ప్రోత్సాహమున ముకుందవిలాసము, అధ్యాత్మ రామాయణము నను గ్రంథములు రచించినవాఁడు. ఇంకను "శివశైలేశలీల" యను గ్రంథమును క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ అను నక్షరము లిరువదియైదు రాకుండునట్లు వదలి రచించెనట. ఈతఁడు

సంస్కృతాంధ్రములందు గొప్ప శబ్దస్వాతంత్ర్యముంగలవాడు. శబ్దాలంకారమెచ్చుగ తెనుగవిత్వమున వాడినవాడు. చిత్రకవిత్వము, బంధకవిత్వము, శ్లేషకవిత్వము రచించుటయందు ప్రౌఢ. అంత్యనియమముల సొగసు ఈతనికధికము.

**కాణాదమతము** — దీనికి వైశేషిక మతమనియు పేరు కలదు. తర్క శాస్త్రము నందనరు నైయాయిక శాస్త్ర మతమునను చెప్పబడిన పదార్థముల కన్న ని శాస్త్రమున విశేషమను వేరొక పదార్థమధికముగఁ జెప్పఁబడి యుంట దీనికి వైశేషికమను పేరు గల్గెనట.

ఈమతకర్త కణాదుఁడు గాన దీనికిం గాణాదమని పేరు కల్గెను. కణాదునకు కణభుక్ అనియు పేరుండెనట. ఈమహాత్ముఁడు అంతరంజికయను పురమును పాలించిన బల్లశ్రీయను భూపతి కడ నుండిన వాఁడని కొందఱనిరి గాని, నిదర్శనములు సరిగాఁ గానరాకున్నవి. ఈతఁడు గొప్ప విద్వాంసుఁడు, తార్కికుఁడు.

వేదముస్వతః ప్రమాణమై, సర్వధర్మ క్రియాప్రతిపాదక మొప్పునది. జగత్తు శాశ్వతములగు పరమాణువులచే నొప్పునది. కాన జగత్తు వస్తుతః సత్యమే గాని మిథ్య కానేరదు. జగత్సంబంధ సుఖదుఃఖాలందు వేదనలై తనరెడిని ప్రాణులు వానిననుభవించు చుందురు. ఆ వేదనానుభవము నుండి తప్పించుకొనుటకు పరమేశ్వరానుగ్రహమే కారణమగును. దానిని శ్రవణ మనన నాదుల వలనఁ గల్గించుకొన వలయును.

జగత్తు మిథ్యాజ్ఞాన మయమై, సత్యమను జ్ఞానము మరుగుపడి, నామ రూపములచే నాక్రమింపఁబడిన సత్యమగు జగద్వస్తు సముదాయమంతయు మిథ్యగా భ్రమింపఁ జేయుచున్నది. అది లెక్కలేని జగద్వేదనల కాస్పదము గాన ప్రాణులకు వేదనలు తప్పకున్నవి.

మిథ్యాజ్ఞానము నశించినంతనే రాగద్వేషాదులు నశించును. రాగద్వేషాది దోషపుంజము లడఁగనేని ధర్మాధర్మ రూపమైన ప్రవృత్తి నశించును. ప్రవృత్తి నశించుట సంభవించిన పిదప దేహప్రాప్తి రూపమగు జన్మ కలుగనేరదు. జన్మనాశన మన దుఃఖనాశనమే. కాన పదార్థ తత్త్వజ్ఞానము దెలుపు విద్యకన్న మిథ్యాజ్ఞానము నంతమొందించు వేరు సాధనము లేదు.

శ్లో. ఆగమేనానుమానేన। యోగాభ్యాసబలేనచ।
త్రిధా ప్రకల్పయన్ప్రజ్ఞాం। లభ్యతే యోగముత్తమమ్॥

అని చెప్పఁబడి యుంట ఆగమ, అనుమాన, యోగధ్యానాభ్యాస బలముచేతను (బ్రహ్మజ్ఞాన) యోగము బడయుట చెప్పఁబడినది.

ఆత్మ, దేహేంద్రియాదులకు వ్యతిరిక్తుని యెఱుఁగుట మనన మనియు భావము. ఈభావన అనుమాన సాపేక్ష్యము ఇంక అనుమానము వ్యాప్తిజ్ఞానపేక్షము, వ్యాప్తిజ్ఞానము పదార్థ వివేకసాపేక్షము గాన, పదార్థ వివేకజ్ఞానము వినుక్తి కత్యవసరము. అట్టి పదార్థ వివేక జ్ఞానము గలిగి పరమేశ్వర ప్రసన్నతాముఖులక మగు లోక వేదనల నుండి తప్పించుకొనఁగల్గుటయె ముక్తి.

ఈమతమునకు కణాద భాష్యము ప్రధాన మతగ్రంథము. ప్రత్యక్ష ప్రమాణము, అనుమాన ప్రమాణము ననునవి రెండు ప్రమాణములు. ఈమతము నాస్తిక మతములను ఖండింపుటయందు సామర్థ్యము కలది. మననము ప్రధానముగఁ జెప్పఁబడినది. కణాదుఁడు పరమశైవుఁడని శైవులు స్తుతింతురు.

ఈ మతమున పృథివి, జలము, అగ్ని, వాయువునని నాల్గుభూతములు. ఇవి అనిత్యములుగ చెప్పఁబడినవి. అనగా నీనాల్గుభూతములు పరమాణువు సముదాయములనియు, ఆ

పరమాణుసముదాయ మెప్పటికిని స్థిరముగనుండు ననియు, కాని వాటి పరిణామములు ఒక్కొక రూపము చెందుచు తన ఒక్కొక నామముచే బరగుచు నారూపము నశించునంతనే ఆనామము గోల్పోవుచు ననిత్యములై అస్థిరములుగ దనరు చుండును. కాన చతుర్భూతాత్మకమగు జగత్తంతయు వస్తుతః సత్యమయ్యు నామరూపములచే బరగుతరి మిథ్యయై బరగుననియు జెప్పఁబడినది. ఇంక నైదవభూతమగు ఆకాశము (పరమాణువులు వేర్వేఱు రూపములం జెంది వేర్వేఱు నామములచే బరగుచు నశించుచు మిథ్యయనంబడునట్లుగాక) స్థిరమై ఏమార్పునకు లోగాక, నశింపక స్థిరముగ నల్లేయుండి సత్యమైయుండు ననియు చెప్పఁబడినది. మరియు దిక్కులు, కాలము నను రెండును నిత్యములుగ నేమార్పును చెందనివికలవనియు (ఇవి భూతములకన్న వేఱుగ నుండుననియు) జెప్పఁబడినది

ఈ మతమున ఆత్మలు పైకి కనుపింపని యాకారముగలవిగను, నిత్యములుగను, అనేకములుగను, భౌతికశరీరములకన్నను శరీరేంద్రియములకన్నను, వేఱుగ నుండునవిగ చెప్పఁబడినవి. ఆత్మలు నశించునవికావు.

మనస్సు నిత్యము. ఇది జ్ఞానమునకు హేతువగ జెప్పఁబడినది. ఇది శరీర, శరీరేంద్రియ, భూత, దిక్, కాల, ఆత్మలకన్న వేఱుగనుండునదిగ జెప్పఁబడినది.

ఈ పంచభూతములు, దిక్కులు, కాలము, ఆత్మలు, మనస్సు నవద్రవ్యములు లేక ద్రవ్యపదార్థములని చెప్పఁబడినవి. ఇంక రూపాదులు గుణపదార్థములని పేర్కొనఁబడినవి. గుణపదార్థము లిరువదినాలుగు. అవి ౧. రూపము, ౨. రసము, ౩. గంధము, ౪. స్పర్శము, ౫. సంఖ్య, ౬. పరిమాణము, ౭. పృథక్త్వము (అనగా వేర్వేఱుగానుండు స్థితి), ౮. సంయోగము (కలసియుండుస్థితి), ౯. విభాగము (వేఱగుట), ౧౦. పరత్వము (అన్యపదార్థమగుట), ౧౧. అపరత్వము (ఏకజాతి లేక స్వజాతి పదార్థమగుట), ౧౨. గురుత్వము (బరువగుట), ౧౩. ద్రవత్వము, ౧౪. స్నేహము, ౧౫. శబ్దము, ౧౬. బుద్ధి, ౧౭. సుఖము, ౧౮. దుఃఖము, ౧౯. ఇచ్ఛ(కోర్కి), ౨౦. ద్వేషము, ౨౧. ప్రయత్నము, ౨౨. ధర్మము, ౨౩ అధర్మము, ౨౪ సంస్కారము, (పూర్వవాసన లేక స్మృతికి సాధనమగునది యని భావము).

కర్మపదార్థము లైదు ఈ మతమున అంగీకరింపబడినవి అవి ౧. ఉత్క్షేపణము (పైకి ఎత్తుట లేక ఎగుర వేయుట), ౨. అవక్షేపణము (క్రిందికించుట లేక పడద్రోయుట, పడుట), ౩ ఆకుంచనము (వంచుట, వంగునట్లుచేయుట లేక వంగుట), ౪ ప్రసారణము (చాచుట, సాగుట, వ్యాపించుట, వ్యాపింపఁజేయుట), ౫. గమనము (నడచుట, నడపుట లేక జరగుట లేక పోవుట) అనునవి.

సామాన్య పదార్థములు ద్వివిధములు. ౧. పరసామాన్య పదార్థములు, ఉండుట, చేయుట, చూచుట, తినుట మొదలగునవి. ౨. అపరసామాన్యములు - గోత్వము, ఘటత్వము, వృక్షత్వము మొదలగునవి.

**కాణ్వగోత్రము** — ఉపమన్యుగణము చూడుఁడు.

**కాణ్వ బ్రాహ్మణులు** — కాణ్వాయులు చూడుఁడు, మహారాష్ట్ర బ్రాహ్మణులు చూడుఁడు.

**కాణ్వాంజలిగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**కాణ్వాయులు** — కణ్వుని పుత్రుఁడు. మేధాతిథి (అప్రతిరథుని పౌత్రుఁడు). ఇతనికి

ప్రస్కందుడు మొదలగు సుతులు జనించిరి. వారందఱు బ్రాహ్మణులైరి. కాణ్వబ్రాహ్మణులు మహారాష్ట్రులలో కొందఱు.

**కాత్యాయన గోత్రము**—భృగుసంతతి (ఆర్ష్టిషేణగణము చూడుడు)

**కాత్యాయన గోత్రము**-కపిఉపగణము చూడుడు.

**కాత్యాయని గోత్రము** — కథ లేక కణ్వగణము చూడుడు.

**కాత్యాయనీ తంత్రము** — ఇది తంత్ర గ్రంథము. శివప్రోక్తమని చెప్పఁబడినది. కాత్యాయనీదేవి అర్చనావిధి విధానము లిందు వివరింపఁబడినవి

**కాత్యాయనుఁడు** — యాజ్ఞవల్క్య మహర్షికి గాత్యాయనుఁడని పేరు వైశంపాయనునివద్ద యజుర్వేదాధ్యయనము చేసి యాతని కపరాధము వచ్చి కోపింపఁబడి, అది యతనికి వదలివేసి తిరుగ సూర్యునిగూర్చి తపమాచరించి యాయననుండి తిరుగ యజుర్వేదము గ్రహించెను కాని దానికి శుక్లయజుర్వేదమనియు, వాజసనేయశాఖ యనియు పేరమ్యెను వైశంపాయనునుండి తిత్తిరి గ్రహించెగాన దానికి కృష్ణయజుర్వేదమనియు, తైత్తిరీయశాఖ యనియు పేరమ్యెను యాజ్ఞవల్క్యమహర్షి రచించిన గ్రంథమునకు యాజ్ఞవల్క్యస్మృతి యని పేరు ఇది అష్టాదశస్మృతులలో నొకటి. ధర్మశాస్త్రము. దీనికి విజ్ఞానేశ్వరయోగి మితాక్షర యను వ్యాఖ్యను వ్రాసెను. ఆ రెంటిని కలిపిన గ్రంథమునకు విజ్ఞానేశ్వరీయమని వాడుచున్నారు. ఇతడు పాణినివ్యాకరణ సూత్రములకు వార్తికము (వృత్తి) రచించెను. వరరుచికి కాత్యాయనుఁడని పేరు కలదు (వరరుచి చూడుడు, ఉజ్జయని చూడుడు).

**కాత్రముగ్రీక ఉపగణము** — ఆయాస్య ఉపగణము చూడుడు.

**కాథరైన్ అర్చిపిలెగో** (Catherine Archipelago) — ఈ ద్వీపసమువాయమును Aleestian Islands అనియు నందురు. అలాస్కా ద్వీపప్రాంతములనుండి వ్యాపించిన నగిం ద్వీపములకు చేరియున్నవి ఇందు కొన్ని అగ్నిశిఖరములు గల పర్వతమయములుగ నున్నవి. కాపురస్తులు ఎస్కిమోజాతికిం జెందిన అలేయూటి తెగవారు.

**కాదోవమేక గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**కాద్రవ్యగోత్రము** — సాంకృతి ఉపగణము చూడుడు.

**కాద్రేయగోత్రము**- ఆత్రేయగణము చూడుడు.

**కాద్వాయనగోత్రము**— జమదగ్ని వత్సఉపగణము చూడుడు.

**కానజింహగోత్రము**-ఆత్రేయగణము చూడుడు

**కానన్(క్యాన్యన్)** Canon (Canyan)-నదులు ప్రవహించుచుండి కొత్తని భూప్రదేశమున ఎక్కువలోతునకు భూమిని ఒరగోసికొని లోతుగడిగ చేసినచో దానిని అమెరికాదేశమున Canon అనెదరు ఇతరదేశముల నాంగ్లమున Gorge అనిపేరు (నదులు చూడుడు).

**కానాయనగోత్రము**- గర్గఉపగణము చూడుడు.

**కానాల నరసింహాకవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. నందవరీక బ్రాహ్మణుఁడు. నియోగి. వాశిష్ఠ గోత్రము. తండ్రి వేంకటేశయ్య. నివాసము

తరిగొండగ్రామము. రచించినది శేషధర్మము, పద్యకావ్యము. ఇది హరివంశములోని యాశ్చర్య పర్వమునందలి శేషధర్మము.

**కానికాలమున కఱ్ఱయె పామగు నటు** — ఆంధ్రలోకోక్తి.

**కానికూడు తిన్నా కడుపు నిండ వలయును** — ఆంధ్రలోకోక్తి

**కానుకుల గోత్రము**—ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి (వైశ్యగోత్రములు చూడుడు)

కానుకులగోత్రము ఏకాగ్నేయగోత్రము ౫౨-తొల్లింటి సంస్కృత గోత్రము, ఔత్కృష్టస, ఉత్కృష్టగణము, పుండరీకర్షి, ఆపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథ మాధ్యప్రవరఖండే, సమానగోత్రములు ప్రమదస, పుండరీకస, కామేశుడు దేవత, భార్య కామాంబ, సరస్వతీ తీరము తపస్థానము, కామసరస్సు తటాకము, జపముకోటి, దీపములు ౨౦, క్షేత్రసంఖ్య ౬౦, గజదానము, ఎఱ్ఱముల్లంగి వర్జనీయము.

**కానుగచెట్టు (కాగుచెట్టు)**— లా. **Dalbergia arborea** అనియు, **Galedupa indica** యనియు, **Pongamia glabra** అనియు, ఆంగ్ల. **Indian Beech**, సం. కరజ-కరంజ, కరంజక, చిరబిల్వ, తమ, తమా, తమాల, తమాలక యని పేర్లు. దీనికి చీకటిమ్రాననియు, కాగుచెట్టనియు, గానుగచెట్టనియు వాడుక నామములును కలవు. చేదురుచికలది. చల్లని నీడనిచ్చునది. దట్టమైన నీడకల్గి చల్లగనుండునది. దీని వేరు, చెక్క, ఆకులరసము, కాయలపై చెక్కలు, లోనిగింజలు (పలుకులు) చూర్ణము, కషాయము, భస్మములుగ నొనర్చి వైద్యులుపయోగించుచుందురు. గింజలనూనెయు వైద్యోపయోగమైనదే. కాగుగింజలను నీటిలోనూరి పైనిపూసిన సకల చర్మరోగములు నివృత్తి యగుననియు, లోనికిచ్చిన కుష్ఠురోగము నివృత్తి యగుననియు చెప్పబడినవి. ఆకులుచూర్చి కట్టిన పురుగులుపడిన వ్రణములైనను మానుననియు, సమస్త చర్మవ్యాధులు నివారణమగుననియు, పసరు లోనికిచ్చిన సెగరోగము, కడుపుబ్బు, అగ్నిమాంద్యము, నీళ్ళవిరేచనములు కట్టుననియు, పూవులందినిన అతిమూత్రవ్యాధి తగ్గుననియు, కాయలపై చెక్క చూర్ణమొనర్చి లోనికిచ్చిన ఎగరొప్పుదగ్గు నివారణమగుననియు, వేరురసము పిచికారీచేసిన భగంధరము నివారణమగుననియు, కాగుపుల్లతో అనుదినము దంతధావన మొనర్చుచుండిన దంతరోగములు నివృత్తియై దంతములు చిగుళ్ళలో గట్టిపడుననియు చెప్పబడినవి. నోటిపూతయు కాగుచెక్కరసమున నివారణమగును. సమూలరసము లేక కషాయము నెఱ్ఱినక్క వెఱ్ఱికుక్కల విషమును హరించునందురు. సగటున కాగుచెట్టువలన కఫము, క్రిములు, ప్రమేహము, కడుపులోని బల్లలు, వ్రణములు, వాతము, రక్తపైత్యము, చర్మరోగములు, యోనిరోగములు నివారణమయ్యెడిని. కాగుపిక్కలనూనె చర్మరోగములన్నిటిని, వాతనొప్పులను నివారించుటయేగాక, లోనికిచ్చిన కుష్ఠురోగమును కూడ నాపునని చెప్పబడినది. కాగుకఱ్ఱలు కాలినధూమము వేడి, కుష్ఠురోగముం గల్గించునని తెలిసెడిని.

**కాన్మన్** — కానన్ చూడుడు.

**కాన్ఫ్యూకస్** — కంఫ్యూటస్ మతము చూడుడు.

**కాన్వాయన గోత్రము** — గర్గ ఉపగణము చూడుడు

**కాన్వెంటు** (Convent) — అబ్బే చూడుడు.

**కాన్షన్సుఫండు** (Conscience Fund) పశ్చాత్తాప నిధియని దీని భావము. క్రీ. వె. ౧౮౧౧ సం॥ పేరూ తెలుపక బయల్పడని యొకడు (బహుశః న్యూయార్కు U. S. A. కాపురస్తుడని తలంపబడు చున్నాడు) ఒక డాలరు మూల్యమును వాషింగ్టనులోని ప్రభుత్వ మువారి ప్రభుత్వకోశపు పెట్టెకు తాను ద్రోహమొనర్చి దానిని హరించితి ననియు, పిదప పశ్చాత్తాప పడి దానిని పంపితి ననియు వ్రాసెను. అదియె ఈ ఫండు నిలయపు ఖాతాకు పునాదియట. పిదప నేబది సంవత్సరముల వఱకు ఇట్టిపేరుతో నేవరూ మ్రొక్కరాలేదు. పిదప ౧౮౬౧ లో ౨,౦౦౦ డాలర్ల పత్రములు అటకేచేరె Sorely tried Conscience could no longer endure its burden of Guilt అని యొక లేఖ లోనుండె నట. పిదప నల్లే చేరుచుండిన ద్రవ్యములన్నియు గలసి ఇప్పటికి మూడు లక్షల డాలరులుగ చేరి యున్నదట మఱియు నిందొకరు తన భార్య విదేశమునుండి తెప్పించు కొన్న నగలపై ప్రభుత్వము వారికిచెల్లింపవలసిన సుంకమును పన్నును తప్పించుకొన్నట్టు వ్రాయుచు ౧౮,౬౬,౯౬౦ డాలరు లంపెనట. ఇది క్రీ వె ౧౯౦౧ సంవత్సరమని తేలినది. ఇదంతయు నిజమో కాదో యుండును కాని, యింత డ్యూటీ చెల్లింపక కొన్న నగ లాతని కొరకో వారెంత ధనవంతులై యుండవలెనో, అయినయుండియు నిట్టి నీచ కార్యమునకు కట్టుపడంబడిరో ఆశ్చర్యము కలుగక పోదు

**కాన్సర్వేటివ్ కక్ష** (Conservative Party)-బ్రిటిషు సామ్రాజ్య మందలి రాజకీయ కక్ష. తొందరగ మార్పుచేయ నొల్లనివారు. యూనియనిష్టులతో వీరికి సంబంధములు కలవట.

**కాన్‌స్టలేషన్** (Constallation) — ఒకే సంబంధముం గల్గినవియు, ఒకేసారి చూడం బడునవియు, ఒక సముదాయముగ నమరిన నక్షత్రముల గుంపునకు కాన్‌స్టలేషన్ అనిపేరు. ఇట్టి వనేకము లాకసమున జూడనగును

పిటిసొలుంగుట కాకసమును ఎస్ట్రొనొమీ శాస్త్రజ్ఞులు మూడు భాగములుగ విభజించి, వాటియందు చూడం దగిన కాన్‌స్టలేషనులను పేర్కొని యున్నారు. (ఫిక్స్‌డ్ స్టార్సు చూడుము) భూమధ్యరేఖ (Equator) చుట్టి పైగానుండు ఆకాశమును పండ్రెండు ఖండము లుగ విభజించి, పండ్రెండు కాన్‌స్టలేషనులను వివరించిరి ఈ పండ్రెండు కలసిన మధ్య భాగమును Zodiacal constallation ప్రదేశమని నామమున్నారు. ఇవి జాతు సంబాధమని యక్షమిమ్ము గ్రీకుపండితులు చెప్పం బడినది ఈ పండ్రెండును భరతదేశపు జ్యోతిష శాస్త్రము నందలి ద్వాదశ రాసుల కన్వయించు చున్నవి. ఇంక దాని కుత్తర భాగమున నగుపించు వానిని Northern constallations అనియు, దక్షిణ భాగమున గన్పించు వానిని Southern constallations అని యనుచు న్నారు. ఉత్తరపువి ౩౮ నూ, దక్షిణపువి ౪౭ నూ Constallations కలవందురు

జోడియాకల్ కాన్‌స్టలేషనులు, పండ్రెండు—

౧ Arica- ఆంగ్లమున Ram , మేషరాశి

౨ Taurns- ఆంగ్లమున Bull, వృషభరాశి. ఇందు ప్రధాన నక్షత్రము Aldebaran అని చెప్పం బడినది

3 Gemini- ఆంగ్ల Twine, మిథునరాశి. ఇందు ప్రధాన నక్షత్రములు Castor Pollux అనునవి.

౪. Cancer- ఆంగ్ల Crab, కర్కాటకరాశి.

౫. Leo- ఆంగ్ల Lion, సింహరాశి ఇందు Regulus అనునది ప్రధాన నక్షత్రము.

౬. Virgo- ఆంగ్ల Virgin, కన్యారాశి. ఇందు ప్రధాన నక్షత్రము Spica Verginia అనబడునది.

౭. Libra- ఆంగ్ల Scales, తులారాశి.

౮. Scorpio- ఆంగ్ల Scorpian, వృశ్చికరాశి.

౯. Sagittarius- ఆంగ్ల Archer, ధనస్సు రాశి.

౧౦ Capricornus- ఆంగ్ల Goat. ఇది బహుశః మకరరాశి

౧౧. Aquarius- ఆంగ్ల Water bearer. కుంభరాశి.

౧౨. Pisces- ఆంగ్ల Fishes మీనరాశి.

Northern constallations ౩౪. ఇందు ముఖ్యమైనవి ౧౮ మాత్రము చెప్పంబడినది

౧ Ursa major- ఆంగ్ల Great Bear. ఇది Double star అని చెప్పం బడినది.

౨. Ursa minor- ఆంగ్ల Lesser Bear ఇది Pole Star.

౩. Perseus- ఇందు ప్రధాన నక్షత్రము Algenib అని చెప్పంబడినది.

౪. Auriga- ఆంగ్ల Waggoner. ఇందు ప్రధాననక్షత్రము Capella అనంబడునది.

౫. Bootes- ఇందు ప్రధాన నక్షత్రము Areturus అనంబడునదిగా చెప్పంబడినది.

౬. Draco- ఆంగ్ల Dragon

౭. Triangulam- ఆంగ్ల Triangle.

౮. Corona, Borealia- ఆంగ్ల Northern Crown.

౯. Serpens- ఆంగ్ల Serpent.

౧౦. Hercules- ఆంగ్ల With the branch.

౧౧. Lyra- ఆంగ్ల Harp. ఇందు ప్రధాన నక్షత్రము Vega యని చెప్పంబడినది.

౧౨. Sagetta- ఆంగ్ల Arrow.

౧౩ Aquila- ఆంగ్ల Eagle. ఇందు ప్రధాన నక్షత్రము Altair అని చెప్పంబడినది.

౧౪. Dulphinus- ఆంగ్ల Delphin.

౧౫. Cygnus- ఆంగ్ల Swan ఇందు ప్రధాన నక్షత్రము Deneb Adege.

౧౬. Cassiopela- ఆంగ్ల Lady in her chair.

౧౭ Pegasus- ఆంగ్ల Winged horse.

౧౮. Andromeda

Southern Constallations ౪౫. ఇందు కొన్నిటిని ప్రధానములు చెప్పంబడినవి.

౧. Bridanus- దీనికి ఆంగ్ల River Po. ఇందు ప్రధాననక్షత్రము Achernar అని చెప్పంబడినది.

౨. Cetus- దీనిని Whale అని ఆంగ్లమున వాడెదరు.

౩. Noah's Dove- ఇందు Betelgeuse ప్రధాననక్షత్రమని చెప్పంబడినది.

౪. Orion- ఇందు Canopus ప్రధాననక్షత్రమని చెప్పంబడినది

౫. Argo Navis- దీనిని Ship Argo అనియెదరు

౬. Leanis major- దీనిని Greater Dog అనియెదరు ఇందు Sirius నక్షత్రము ప్రధానమని చెప్పంబడినది.

౭. Leanis minor- ఆంగ్ల Lesser Dog. ఇందు Proeyon ప్రధాననక్షత్రమని చెప్పంబడినది.

౮. Hydra- ఆంగ్ల Water Serpent. ఇందు ప్రధాననక్షత్రము Car Hydrae అని చెప్పంబడినది.

౯. Piscis Australia- దీనిని Southern Fish అనియెదరు ఇందు Fomalhant ప్రధాననక్షత్రమని చెప్పంబడినది.

| | 1st | 2nd | 3rd | 4th | 5th | 6th. | Total |
|---|---|---|---|---|---|---|---|
| | 5 | 16 | 14 | 120 | 183 | 645 | 1014 |
| Northern | 6 | 24 | 95 | 200 | 291 | 635 | 1251 |
| Southern | 9 | 36 | 84 | 190 | 221 | 323 | 863 |
| Totals | 20 | 76 | 223 | 510 | 695 | 1604 | 3128 |

ఈ నక్షత్రముల మొత్తము.

| | | |
|---|---|---|
| Zodiacal Constallations | | 12 |
| Northern | do | 34 |
| Southern | do | 45 |
| కాన్స్టలేషనుల మొత్తము | | 91 |

ఈకాన్స్టలేషను రాశి గోళములకు నక్షత్రముల గూర్చి వివరించు శాస్త్రమునకు ఉరనోగ్రాఫీ అనిపేరు.

ఇటీవలి పరిశోధనలు మరికొన్ని కాన్స్టలేషనులను కల్పించి వాటికి Modern constallations అని పేరిడియున్నారు. వీటిలో ౪౦ కాన్స్టలేషనులు

Northern Modern Constallations ౮.

౧. Camelopardalis- ఆంగ్ల Giraffe
౨. Canes Venatici-ఆంగ్ల Grey hounds
౩. Coma Berenices- ఆంగ్ల Hair of Berenice
౪. Lacerta- ఆంగ్ల Lizard.
౫. Lio minor- ఆంగ్ల Lesser Lion
౬. Lynx- ఆంగ్ల Lynx
౭. Monocerous- ఆంగ్ల Unicorn.
౮. Vulpecula-ఆంగ్ల Fox and the Goose.

Southern Modern Constallations ౩౨

౧. Antlia (Pneumatica)- ఆంగ్ల Air Pump
౨. Apus- ఆంగ్ల Bird of Paradise.
౩. Carina Argo Navis- ఆంగ్ల Argo.
౪. Chamaeleon- ఆంగ్ల Chameleon.
౫. Circinus- ఆంగ్ల Compass.
౬. Caelum (Cacla Scalptoris)
౭. Columba (Noachi)- ఆంగ్ల Noah's Dove
౮. Crux- ఆంగ్ల Cross
౯. Dorado ఆంగ్ల The Sword Fish.
౧౦ Fornax (Chemica)- ఆంగ్ల Chemical Furnace
౧౧ Grus- ఆంగ్ల Crane.
౧౨ Horologium- ఆంగ్ల Clock.
౧౩ Hydrus- ఆంగ్ల Water snake.
౧౪ Indus- ఆంగ్ల Indian
౧౫ Malusargo navis- ఆంగ్ల Mast of the ship Argo
౧౬ Mensa (Mons Mensae)- ఆంగ్ల Table Mountain
౧౭. Microscopium-ఆంగ్ల Microscope.
౧౮ Musca (Apis Musca Australis).
౧౯. Norma (Quadra Euclidis)- ఆంగ్ల Role or Euclid's Square
౨౦ Octans (Hadleianus)- ఆంగ్ల Hadley's Octant.
౨౧ Pavo- ఆంగ్ల Peacock
౨౨. Phoenix- ఆంగ్ల Phoenix.
౨౩ Pixis Nautica- ఆంగ్ల Mariner's Compass
౨౪ Puppis Argo Navis-ఆంగ్ల Poop of the Ship Argo.
౨౫. Reticulum (Reticulus Rhomboidalis).
౨౬. Sculptor (Apparatus sculptoris ఆంగ్ల Sculptor's workshop.
౨౭. Sextans (Uranie)- ఆంగ్ల Sextant of Urania.

౨౮. Teles Copium-ఆంగ్ల Telescope.

౨౯. Toucan-ఆంగ్ల Toucan American Goose.

౩౦. Trangulam Australis— ఆంగ్ల. Southern Trangle

౩౧ Vela Argo Navis- ఆంగ్ల Sails of the ship Argo

౩౨. Volans (Piscis Volans)-ఆంగ్ల Flying fish

**కాపత్యుఁడు** — పారియాత్ర పర్వతారణ్యమున వసించిన ఒక బోయకులజుఁడు ధర్మగుణసంపన్నుఁడు.

**కాపర్ ఆక్సైడు పరిశ్రమ** (Copper Oxide)— సర్వసాధారణముగ నిది Cupric Nitrate మొదలగు Cupric Salts సాంఖ్యావకా సకు Caustic Potash ఎక్కువ భాగముగ కల్పుదురు. పిదప Boiling point వఱకు వేడిగఁగ్రాగించి ఉడకబెట్టుదురు. దానిని గ్రోఁగు చేసి కడిగి శుభ్రపఱచి ఎండింతురు ఇది సర్వసాధారణపద్ధతి.

**కాపాలమతము** — ఇది అతిమార్గిక మతములలో నొకటి అతిమార్గిక మతములు- ౧. పాశుపతము, ౨. మహావ్రతము. 3 కాపాలము నను త్రిమతములుగ నున్నవి. ఈ మూఁడు మతములందు ఋగ్యజుస్సామాథర్వణాత్మక వేదము పాటింపబడక, ఆగమములను ప్రమాణమగు మతగ్రంథముగ గైకొనంబడినది కాపాల మత మీశ్వరతత్వస్థ రుద్రప్రోక్తమని చెప్పఁబడినది. ఈమతధర్మము దీక్షనందు విధానము మాత్రము పాశుపత, మహావ్రతమతములనుండి వేఱుగనున్నది. కాని తక్కిన ధర్మములన్నియు నీమూఁడు మతములకు సమానముగనే యున్నవి. కాపాలమత విధానమున దీక్షనంది ఈ మత ధర్మమువేరకు ఒక్కొక్కదిక్కున జెండానగుర వేయుచు ననగా పతాకధ్వజము వేయుచు నాలుక నసే భిక్షుగూర్చి తిరిగి సంపాదించుకొనుచు లభించిన భిక్షాన్నాదుల నొక మనుష్యకపాలము (పుఱ్ఱె) నందు గ్రహించి భుజించుచుండవలయు నని చెప్పఁబడినది. ఈ మతమునకు ఈశ్వర తత్వాదు ప్రధానతత్వమని చెప్పఁబడినది.

**కాపిల మతము** — కపిల మహర్షి పరివర్తించిన మతము దీనికిప్రమాణము కపిల సూత్రము. ఇందు ప్రకృతి జగత్సృష్టికి గారణమనియు పురుషుఁడు నిర్లిప్తుఁడనియు మొదలగు సిద్ధాంతములు గలవు మఱియు నొక ఉపపురాణమును కాపిలమను పేరుగలదియే కలదు.

**కాపీరైట్** (Copyright)—ముద్రణ స్వాతంత్ర్యము లేక ముద్రించుకొను స్వామ్యము. పునర్ముద్రితపుహక్కు (లేక కాపీరైటు) వాణిజ్య సాబాధ పరిభాషాపదము ఒక ముద్రింపఁబడిన అక్షరగ్రంథము గాని, చిత్రము గాని ఇతరులు ముద్రించుకొని నిలులేకుండ తన స్వామ్యమును నిలుపుకొనుటకు ప్రభుత్వపు శాసనముద్వారా రక్షణసందు పర్పాటు.

**కాపుటి గోత్రము**—లాంగాక్షిగణము చూడుఁడు. కుండినగణము చూడుఁడు

**కాపులు** — తెలగాలు చూడుఁడు. వీరు మూనాటికాపులు, తూర్పుకాపు లని ఇరుఁ దెఱఁగులుగ నున్నారు. చూడుఁడు.

**కాఫీచెట్టు** — లా. Coffea arabica అనియు, Coffea tetrandra అనియు, ఆంగ్ల. Coffee Plant అనియు, సం. అటుత్రి, మ్లేచ్ఛఫల అని పేర్లు కాఫీచెట్టుకత్తి చేతికల్లుగఁ జేయఁబడుటవలనను, గింజలచూర్ణమును కషాయము దీసి పాలు పంచదార కల్పి త్రాగుటవలనను, ముఖ్యముగ వాడుక నందియున్నది.

కాఫీగింజలను పచనముగ వేయించి చూర్ణము జేసి కషాయము దీయుదురు. దీనికి పాలు శర్కరలం జేర్చి పానము సేయుదురు. దానికిం గాఫీ యని వాడుకనామము గలదు. శీతలదేశములవారి శరీరములకుం గాఫీ మేలుచేయుననియు, ఉష్ణదేశముల వారి శరీరములకు కాలము గడచినకొలంది కీడు చేసి రోగములం బుట్టించుననియు, ఆకను ఏదేని లఘుతరముగ నాహారముం గొనినపిదప కాఫీ సేవనము మేలుచేసియు, పరగడుపున (కడుపులో నేమియు లేకుండునపుడు) త్రావిన కాఫీ దుర్గుణములం గల్గించి రోగములం గల్గించుననియు, నీనడుమనే ఘనవైద్యులు కనిపెట్టియున్నారు.

కాఫీయం దొకవిధమగు విషపదార్థము కలదు. కాఫీగుండపై వేడినీళ్లు పోసిన తోడనే దిగినకషాయము పరిమళయుతమై రుచికరమై యుండెడిని. మఱియు నాలసించిన కొలదివిషమునూర కషాయమునం జేరుకొని నాలుక జిలజిలలాడునటులం జేయును. అత్తరి నాకాఫీ యనారోగ్యకరమని చెప్పంబడినది. కాఫీచేయు నా గుణతత్వ మెట్టుగ దగినది. కాఫీవ్యామోహ మెల్లెడల వ్యాపించియున్నకతన దానిగుణదోషముల రెంటిని వివరించుట ఈగ్రంథము యొక్క కర్తవ్యములలో నొకటియై యున్నది.

కాఫీగల్గించు దుర్గుణములు- విరేచనబద్ధము, పైత్యవికారము, నోరు బెరడుకట్టిన ట్లుండుట, కాకజేయుట. దేహము నార్చివేయుట, అతి మూత్రమును, ఉన్మాదమును బలపర్చుట, ఎక్కువ యగునేని మనస్థితము జెరపి చీకాకుం గల్గించుట.

కాఫీవలనగల్గిన దోషములకు- పంచదారయు, పాలును, శికంజబీనును పరిహారము (విరుగుడు) లని కనిపెట్టంబడినది. కాఫీ అలవాటుపడినవారలకు నల్లమందువలెనే ఆవేళకు భ్రాంతి దానిపైననే యుండునట్టి నిర్బంధవాడుకం గల్గియుండెడిని.

కాఫీయందు గల గుణములు- కలరాలోని వాంతుల నివారించును. గర్భపాతము నడంచును. దీపనకారియు బలకారియునై యుండును. నెత్తురు గడ్డలుగాంగట్టెడి పోటు నివారించును. వర్ధకము, కునికిపాట్లు రాకుండఁజేసి ఒంటికొప్పులను బడలికను నివారించును. శరీరమందలి రక్తములోని వేడిని అడంచును. మఱియును ఆయాసముకల వారికి, ఉబ్బసపుదగ్గు కలవారికి, తలనొప్పి కల వారికి, నరములందుపు వికృతి, నరముల నొప్పి, నరముల బలహీనతకలవారికి, పాత్తికముపునాకు వ్యాధులుకలవారికి, నీళ్లవిరేచనములగుచుండు వ్యాధికలవారికి, మూలవ్యాధికలవారికి, మూత్రబద్ధముకలవారికి, రొంప పడిశెములు కలవారికి, అనుకూలమై వారిరోగము యొక్క ఉద్రేకమును తగ్గించును.

కాఫీగింజలందనేకజాతులు కలవట. అందు నిమ్మగింజలజాతియు, బద్దగింజలజాతియు సర్వసాధారణముగం గానవచ్చుచుండును. నిమ్మగింజల జాతి శ్రేష్ఠమైనది. కాఫీ అబ్సీనియాదేశమున ప్రప్రథమమున వాడుకలోనికి వచ్చెనట. అట నుండి క్రీ. శ. ౧౫వ శతాబ్దప్రారంభకాలమున అరేబియాకు తేఁబడినదట. అట మోచాప్రాంతముల విస్తారము పైరుచేయంబడెనట. మెక్కా నుండి బాబాబూదానను పేరుగల మహమ్మదీయ భక్తుండు భరతదేశమునకు ఇప్పటి మైసూరు రాజ్యములోని దత్తాత్రేయపర్వతమునకుం దెచ్చి యట తాను వసించుట కారంభించెనట. అతండు సుప్రసిద్ధుండగు భక్తుండగుట మహమ్మదీయ మతస్థు లందఱు నాఁడాదిగ నాపర్వతమును బాబాబూదాన్ పర్వతమని వాడసాగిరి.

ఆపర్వతమున నాటంబడిన కాఫీపంట అభివృద్ధి నంది, దక్షిణదేశమంతటను కాఫీవాడుక నతిశయింపఁజేసి స్థిరపడెను. ఇప్పుడు బాబాబూదానంను కాఫీపంట మానినను దక్షిణదేశమున

కాఫీవాడకము తగ్గనిస్థితియందు స్థిరపడియున్నది. ఇంక నితరస్థలములందును కాఫీ నాటుచున్నారు. అరవదేశమునుండి ఆంధ్రదేశమునకుం జేరి స్థిరపడి వ్యాపించుచున్నది. అరవదేశస్థులగు కాఫీ హోటల్ యజమానులు ఆంధ్రులకు కాఫీరుచి మప్పిరనియనెదరు.

**కాఫరుజాతివారు** — దక్షిణాఫ్రికా దేశమున అరబ్బులు దాడివెడలి ఎల్లరను మహమ్మదీయ మతమునకుం గలుప బలాత్కరించు తరి దొరకక, లొంగక, తప్పించుకొని దాగియు, మతస్వీకరణ మొనర్పని వారికి నసూయతోఁ గాఫరబ్బు లీపేరిడిరట. ఇట్టిజాతులు బెచుయానాలును, బసుటోజాతివారునని తెలియుచున్నది. ఇంకను ఓవాంబోజాతివారును, హెరిటోజాతివారును కూడ కలరనియు, అందఱునుకలసి యర్వాలమున నలుబదినైదు లక్షులవఱకుండిరని అచటి వారనెదరు. ఇప్పుడువీరికి వ్యవసాయము, పసువులం బెంచుట, వేట, వృత్తులుగనున్నవి. వీరినివాసముల సముదాయములకు కాఫర్ కరాల్ అనిపేరు. వీరియందును గొన్ని మతసంస్కారములు కలవట. అత్తగారి నల్లుండు చూడరాదట. స్త్రీలు మగని పేరు వచింపరట. తమపూర్వులం బూజింతురు. వీరిదైవము స్వాజిన్ అంకులంకు లని పేరుగల వాఁడట. వీరిజనసంఖ్య అభివృద్ధినందుచున్నది. వీరు ఎక్సోసా యనుభాషను మాటలాడుదురు. ఆఫ్రికాఖండమున వీరువసించు దేశమును కాఫ్రి స్థానమందురు. ఇంకను దక్షిణముగ కూడ వీరు కలరు. వీరియందు పదునెన్మిది అంతర్భేద శాఖలు కలవందురు. అందొకశాఖ ఎక్కువసల్లనివారు ఎక్కువపరుగిడగల శ్వేతగమనులు. వారిశాఖకు పియాపోష్ అని పేరు. వారు మహమ్మదీయ మతమునకు లొంగక నిలచినవారమని గర్వముగఁ బల్కుచుందురు.

**కాఫర్ బ్రెడ్** (Farinaceous Peth)- కాఫరుజాతివారికిది యాహారముగ వాడఁబడు చుంట నాంగ్లేయు లీపేరిడియున్నారు ఆదేశమునం గల ఒకవిధమగు చెట్టునకు Bred tree అని పేరుకలదు (కాఫరుజాతివారు చూడుఁడు). దక్షిణాఫ్రికాయందు విస్తారముగఁగలవు. ఇరువది యడుగులదనుక చెట్టుపెరుగును. చాలనలంకార వాతముగ నుండు వృక్షము. దీనిని కాఫర్ బ్రెడ్ వృక్షమనియెదరు

**కాఫ్రిస్థానము** — ఆశియా ఖండమున చిత్రాల్సంస్థాన రాజ్యమునకును, ఆఫ్గనుస్థాన మునందలి కాబూలు పరగణాకును నడుమనున్న ప్రదేశము. ఇది ఇప్పుడు ఆఫ్గనుస్థానమునకుం జెంది యున్నది (ఆఫ్గనుస్థానము చూడుఁడు).

**కాబా దేవస్థానము**— ఇది మహమ్మదీయ దేవ స్థానము. ఇస్లాం మత ప్రధాన స్థానము దీనిని బైతుల్లాయని ఖురాను నందు వాడం బడి యున్నది. దైవ గృహ మని యర్థము అరేబియా దేశమునందు, మక్కా నగరమందు మశీదు ఆవరణమున నడుమగా నున్న కట్టడము. ఇది హాజీ యాత్రా ప్రధాన స్థానముగ నున్నది. నలువది యడుగుల పొడవు, ముప్పది యడుగుల వెడలుపుం గల్గి, ఏబది యడుగుల ఎత్తుగ నిర్మింపం బడిన గదివలె నున్నది దీనికి వెండి రేకు తాపం బడినది. ఒక ద్వారమును, తలుపులు కలవు అవి సదా మూయం బడి యుండి, ఒకతరి పురుషుల కొఱకు, ఒకతరి స్త్రీల కొఱకు, ఒకతరి శుభ్రపఱచుటకును, మూడు సారులు మాత్రము సంవత్సరమునందు తెరువం బడుచుండును.

ఆదిని మొదటి మనుష్యుఁడగు ఆదము మహాత్ముఁడు, తోఁటనుండి వెడల గొట్టం బడిన కతన తొలుత నీ (కాబాయుండిన) తావున నొక

గుడారమునందు దేవుని నారాధించె ననియు, ఆ గుడార మాతని కడకు స్వర్గము నుండియె పంపఁ బడెననియుఁ జెప్పఁ బడినది. సేత్ అను నాయన చుచ్చు రాళ్లతో కాబా నిర్మించెనట కాని, యది జల ప్రళయపు ముంపునందు పడి పోయెననియు, పిదప అబ్రహాము మహాత్ముఁడును, ఇస్మాయెలు మహాత్ముఁడును పునర్నిర్మాణ మొనర్చి రనియు, ఇప్పుడున్న కాబా కట్టడము క్రీ శ ౧౬౨౬ నాఁటి దనియుఁ జెప్పఁ బడినది

ఈ కాబా నిర్మింపఁబడియున్నతావు భూమి యొక్క మధ్యభాగమనియు, స్వర్గమున దిట్టి కాబా యుండినతావునకు సన్నగా క్రింద భూమిపయినున్నదనియు, ఇస్లాంమతస్థు లనియెదరు. స్వర్గమునుండి ఒక రాతిబడవేయ నది భూమిపై విస్తారపడఁబడెననియు వారేయనెదరు ఆ శిల తొలుత తెల్లగ పాలవలె నుండెనట. దాని నీకాబాయొక్క కోనమూల, బ్రతిష్ఠించి యున్నారు దానిని యాత్రస్థులు తాకుచు స్పృశించుచుండి వారిపాపములు బీల్చుకొని ఇప్పుడు నల్లగగన్పించుచున్నదనెదరు అది కాబా వెలుపలనే వాయవ్యదిశమూల సమర్పింబడి యున్నది. ఈ శిలయే కాబాయొక్క ప్రధానము. ఇది దేవుని కుడిహస్తమువలెనిగఁ జెప్పంబడినది దీనిదసకే మహమ్మదీయులు సమారాధనర్చు కాలములయందు ఏరుగవలయును.

కాబా దేవస్థానమునకు జుట్టి పిదప నిర్మింపంబడిన మశీదు గొప్ప భవనము. ఇందు బంగారు మలామాపనిగల నిర్మాణములు కలవు కాబాపై నల్లపట్టు గలేబు కప్పంబడుచుండును దీనిని కలీఫాయగు టర్కీ సుల్తాను పంపుచుండువాఁడట. దానిపైని ఖురానులోని పవిత్రవాక్యములు జల్తారు బుటెదారీపని చేయంబడును.

**కాబాలిజమ్** (Cabbalism) — ఇది యొకమతము. ఈమతమున క్రైస్తవమతముతోఁ గొన్ని సమానలక్షణములు కలవు. కాని ఈ మతస్థులకేగాని యన్వయింపని గూఢార్థములు గల్గియుండును. సాధారణముగ అన్వయించని గూఢార్థపదములకు Cabbalistic sentence అని నామక సర్వసాధారణముగ గలదు. కాన గూఢార్థముగ మాటలాడగల ప్రతిభ (శక్తి లేక సామర్థ్యము) ను Cabbalism అనియెదరు. ఇది ఇట్లొక కళగా నేర్పడినది.

**కాబాల్** (Cabal)—దీని యుత్పత్తిని గూర్చి పలువిధములుగ తెలియుచున్నది. తొల్లింట ఇంగ్లాండునందు రెండవ ఛార్లెసుభూపతి పాలనమునగల పరిపాలక సంఘము (Cabinet) నందు Clifford, Arlington, Buckingham, Ashley, Lauderdale అనుపేళ్లుగల యైదుగురు సభ్యులుండిరి వారిపేరుల ప్రథమాక్షరములం గూర్చి Cabal అనుపదము కూర్పబడి అతిరహస్యమున కర్థముగ నేర్పరుపఁబడినదట. Cabalistic అను మాటకు రహస్యశాస్త్రమని యర్థము దీనికన్య భాషాపదములు క్లిక్కు (Clique) అనియు, గూడుపుఠాణీ యనియు, గూఢాలోచన మనియు నెలిసెడిని.

**కాబాశాఖ క్షత్రియులు** - ప్రమార శాఖ క్షత్రియులు చూడుఁడు.

**కాబూల్ నగరము** — ఇది అఫ్ఘను స్థానదేశపు రాజధాని కాబూల్ (కుభా) నదీ తీరము, ఎత్తగు పర్వతపాద పీఠభూమిపై నిర్మింపంబడినది పరిసరములు మిగుల సారవంతములై ఫలవంతములుగ నుండును. ఇట నుండిన బాలాహిస్సారను దుర్గము భగ్న పఱుపంబడినది. గొప్పవ ర్తకస్థలమై, పలుబాటలు కలియుతావుగ నున్నది. తివాచులు, పట్టుబట్టలు, ఇంగువ, ఎండినపండ్లు ఇట విస్తారముగ నమ్ముడు పోవును.

తైమూర్ లేక తామర్లేన్ చే పట్టుకొనబడి క్రీ. శ. ౧౩౯౮ న ఈదేశపు రాజధానిగఁ జేయం బడినది. నాదర్షా దీనిని ౧౭౩౯ లో పట్టుకొని మొగలాయి రాజ్యమునకు ప్రధాన నగరముగ జేసెను. కాని ౧౭౪౮ లో నిది అఫ్ఘను రాజ ధాని యైనట్లుల నిదర్శనములు కలవు. అటులే నేటికిని నిలచియున్నది ఎనుబది వేల ప్రజలు నివసించు పట్టణము.

**కామంతకగోత్రము**— కుశికగణము చూడుము.

**కామందకము** — రాజనీతిని దెల్పెడి యొక యుద్గ్రంథము.

**కామకాయనగణము** — ఇది విశ్వామిత్ర సంతతిలోని యొక గణము. కామకాయన గణమున ౬ గోత్రములు కలవు ౧ కామకాయన, ౨ కాలకాయన, 3. దేవశ్రవస, ౪. దైవతరస, ౫ విశ్వామిత్ర, ౬. క్రౌమత. ఈ కామకాయనగణమునందలి గోత్రములకు ప్రవర రూపములు ౨. ౧ విశ్వామిత్ర, మాధుచ్ఛందస, అజ ౨. విశ్వామిత్ర, అశ్మరథ్య, నాథూల.

**కామకాయనగోత్రము** — కామకాయనగణము చూడుము భరద్వాజఉపగణము చూడుము.

**కామకాయనిగోత్రము**- అశ్మరథ్య గణము చూడుము.

**కామకోటి క్షేత్రము లేక పీఠము**- దక్షిణదేశములోని చెంగల్పట్టు మండలములోని కాంచీపురము. దీనిని సర్వసాధారణముగ కంచి యనెదరు. ఇటంగల కామాక్షీ దేవస్థానమును కామకోటి పీఠమనెదరు. ఇందు చిదగ్నికుండము శ్రీచక్రము కలదు. కామాక్షీదేవి యిట పంచ ప్రేతాసనాసీనయై లలితా సహస్రనామముల లక్షణములచే దనరును.(కాంచీపురము చూడుము). కాంచీపురము విష్ణుకంచి యనియు, శివకంచి యనియు రెండుభాగములు. విష్ణుకంచిని చిన్న కంచి యనియునందురు. ఇందు దివ్యతిరుపతి యగు వరదరాజస్వామి దేవస్థానమొక చిన్న మిట్టపై నున్నది (దివ్యతిరుపతులు ౧౦౮ చూడుము). శివకంచి యందు ఏకాంబరనాథ దేవస్థానము కలదు. ఏకాంబర శివలింగమును పృథ్వీలింగమందురు. (పంచభౌతిక లింగములు చూడుము). శివలింగమునకు ఉదకముచే నభిషేకింపక పుష్పముతోనే యభిషేకింతురు. కామాక్షీ దేవస్థానము శివకంచియందే వేఱుగ నున్నది. ఈపెను ఏకాంబరేశ్వరుని దేవియనుచున్నారు. కాంచీపురము తొల్లింట నొకప్పుడు చోళదేశపు రాజధానిగ నుండెను. కామాక్షీదేవాలయము శంకరభగవత్పాదులనాఁటి ఆలయమై యున్నది.

**కామధేనువు** - సురభి చూడుము

**కామసూరికృష్ణయ్య కవి** - ఆంధ్ర కవులలో నాథునికులాగు పరిగణింపబడినవాఁడు. నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు. తండ్రిపేరు గోవిందరాజు

రచించినది ఇందుమతీ పరిణయమను ప్రబంధము. ఇది కాళిదాస మహాకవి రచించిన రఘువంశ కావ్యములోని యొక కథ.

**కామరూపదేశము** - కామరూప దేశము ఇప్పటి అస్సాందేశమందలి గౌహతిపుర ప్రాంత దేశము. బ్రహ్మపుత్రా నదీతీరము. ఇప్పటి గౌహతిపురముకడ పురాతనపు దిబ్బలు, పెద్ద కొలతలుగల కోటగోడల యానవాళ్లు, తొల్లింటి కామరూప దేశపు రాజధాని యగు ప్రాగ్జ్యోతిషము లేక ప్రయాగజ్యోతిష పురపు ఆనవాళ్లు గలవు. నరకాసురుఁడును, అతని సుతుఁడు భగదత్తుఁడు నీదేశ మేలిరి. ఈ ప్రశంస

మహాభారతమున గలదు. ఆనాటి దేవస్థానమొక పాటి కొండపై నున్నది. దేవిని కామాఖ్య యనియు, కామరూపిణి యనియు నందురు. ఈశక్తిపీఠపు ప్రశంస దేవీభాగవతము ౭ ౧౧ యధ్యాయమున కలదు. ఈ దేవస్థానము నుండియె ఈ దేశమునకీపేరు గలిగినదందురు. అచట బ్రహ్మపుత్రానది మధ్య నొక శిలాద్వీపముపై కామేశ్వర శివలింగము లేక ఉమానందస్వామి దేవస్థానము కలదు.

ఈదేశమున కుత్తరముగ భూతాంగ దేశము (ఇప్పటి భూటాన్ దేశము) ఒకప్పుడిందు చేరియుండెనప్పుడు వేఱుగ నుండియు ఉత్తరపు ఎల్లగ నుండెనని చెప్పబడినది. ఇంకను మణిపూర్ జయంతియము, కాచార్, మైమన్సింగులోని భాగములు, సిల్హెట్టు పరగణాలు అంతగనో కొంతగనో ఇందు చేరుచు తిరిగి విడిపోవుచు నుండెననియు భగదత్తుని పాలనకాలమున రంగపూరు పరిసరములు కూడ నిందు చేరి యుండెననియు అందుకు రంగపూరుకడ భగదత్తుని దేశనివాస భవనము (Country House) ప్రబలనిదర్శనమనియు తెలియుచున్నది.

కామాఖ్యగిరికి నీలకపర్వత మనియు, నీలకూట పర్వత మనియు నామాంతరములు కాళికా పురాణము ౭౮ అధ్యాయమున చెప్పబడినవి.

నీలధ్వజుండను కామరూపదేశ నృపతి కామాతపురమను క్రొత్త రాజధానిని కట్టించెనట. అది యిప్పుడు కామాతాపూరను పేరం బరగుచు రంగపూరు జల్లానుందు కుచ్ బీహారు సంస్థానపు హద్దున నున్నది. మఱియు నీ కామోత్పురము బ్రహ్మపుత్రానది కుత్తర తీరమున అశ్వక్రాంత పర్వతోపరిభాగమున కలదట. శ్రీకృష్ణుడు నరకాసురునితో యుద్ధమొనర్చినతావుగ బ్రహ్మపురాణము ౧౧ యందునను, బృహద్ధర్మపురాణము మధ్యఖండము ౧౦ యందునను కలదు.

మహాభారత ఉద్యోగపర్వమున భగదత్తుడు సుయోధనుని మిత్రునిగ చెప్పబడినది. యోగినీ తంత్రమను గ్రంథమున నరకాసుర సంతతింగూర్చి కొంత వివరింపబడినది. Journal of Asiatic Society of Bengal 1838 - P. 5 నందు మైనావతీ సుతుండగు గోపీచంద్రుని చరిత్రము, అతనిసుతుండు గవచంద్రుని చరిత్రము వివరింపబడినవి. వీరందఱును కామరూప దేశమేలిన వారే

క్రీ. శ. ౧౩ వ శతాబ్దమున ప్రారంభ కాలముననే తూర్పుదిక్కునుండి అహోంవంశ నృపతులు అసాముకు చేరిరనియు చెప్పబడినది. కొందఱు పరిశోధకులీ అహోంసంతతి నృపతులు నరక సంతతి వారని తెల్పుచున్నారు. అహోంసంతతి నృపులంగూర్చి కాళికా పురాణము ౩౮ యందు ప్రశంస కలదు.

కామరూప దేశపు ఈశాన్య దిక్పరిహద్దున దల్పని నదీతీరమున తామ్రేశ్వరీ దేవస్థానముండెననియు, ఆదేవి గుడి రాగిరేకులచే వేయబడినదనియు బుచానన్హామిల్టను నుడివి యుండినటుల Journal of Asiatic Society of Bengal 17 P 462 యందు కలదు. మఱియు అశ్వక్రాంత పర్వత ప్రశంస యోగినీ తంత్రమను గ్రంథమున ఉత్తరఖండము మూడవ అధ్యాయమున కలదు.

**కామలగోత్రము** — జమదగ్నిబీధా ఉపగణము చూడుడు.

**కామలాయనగోత్రము** – అశ్మరథ్య గణము చూడుడు.

**కామశాస్త్రము**—ధర్మార్థకామమోక్షములను పురుషార్థములలో కామము మూడవది. కామము అన కామించునది, కోరునది యని యర్థము. శరీరేంద్రియములచేత నపేక్షింపబడు

విషయానుభవసుఖకాంక్ష యని భావము. ఇది సుఖాతిశయమువలన నైహికముగను, సంతానము గనుటవలన ఆముష్మికముగను ఫలప్రదమైనదని చెప్పఁబడినది. మన్మథుఁ డధిదేవతగాఁగల పురుషార్థము. విశాలాక్షునిచే రచింపఁబడిన వైశాలాక్షమను పేరుగల దండనీతిశాస్త్రములో నీకామశాస్త్ర మొకభాగ మని చెప్పఁబడినది.

కామశాస్త్రము కృతయుగమున వేయి అధ్యాయములగ్రంథ ముండెడిదట. త్రేతాయుగమున శ్వేతకేతు వను ఋషి ఏనూరధ్యాయములుగ సంగ్రహించెనట. ద్వాపరయుగమున బాభ్రవ్యర్షి దానిని ౧౫౦ అధ్యాయములుగ క్లుప్తపఱచెనట. పిదప దానినే దత్తకర్షి, చారాయణర్షి, సువర్ణనాభర్షి, ఘోటకముఖర్షి, గోనర్దీయర్షి, గోణికాపుత్రుఁడు, కూచిమారుఁడు సప్తాధికరణగ్రంథముగ బాభ్రవ్యర్షి కృతగ్రంథమునుండి ఇంకను క్లుప్తపఱచి అందఱు తలకొకయధ్యాయము చొప్పున ఏడ్గురు ఏడధ్యాయములు రచించిరట. దానికి వాత్స్యాయనుఁ డనుపేరున చాణక్యుఁడు సూత్రములుగఁ జేసి, ముప్పదినాలు గధ్యాయములుగ సప్తాధికరణ శాస్త్రగ్రంథముచు రచించెనట. దానికే వాత్స్యాయనకామసూత్రము లని పేరు

ఈగ్రంథమునకు వజ్రఖడ్గధరాచార్యుఁడు భాష్యము రచించియున్నాఁడు. దానికి భాస్కర నృసింహశాస్త్రి వృత్తిగ్రంథమును రచించెను. పిదప సద్దానికే జయమంగళ వ్యాఖ్యయు రచింపఁబడెను.

ఈగ్రంథమును మాతృకగాఁ గైకొని పెక్కండ్రు కవులు శ్లోకరూపముగఁ గొక్కోకము, రతిరహస్యము, అనంగరంగము, కామకళానిధి మున్నగు వేఱ్వేఱు కామశాస్త్రగ్రంథములను రచించిరి. ఇవియన్నియు సంస్కృతశ్లోకములు. అందు వైశ్యదత్తుఁడు రచించిన కొక్కోకమును తెనిగించి ఎల్లనయను నొక కవి కళాశాస్త్ర మను గ్రంథము నాంధ్రపద్యముల రచించియున్నాఁడు.

కామశాస్త్రమునుండి తెలియవగినవి స్త్రీపురుషుల సంగమము (రతి) లందలి కార్యవిధాన ధర్మమర్మములు అవి ఎనుబదినాల్గు విధముల సంగమములును, వాటి కంగము లగనో లేక ఉపాంగములుగనో అనుబంధములుగ వాడఁదగిన ఆలింగనములు, చుంబనములు, దంతక్షతములు, నఖక్షతములు, సీత్కారములు, తాడనములును ఈసందర్భమున నెఱుఁగఁదగిన మఱికొన్ని ఇతర హాంశములునై యున్నవి. వాటినిగూర్చి తెల్పబడును

సంగమములకు రతులనియు, బాధనములనియుం బేరులు కలవు. అవి (౧) ఉత్తానకరణ బాధములు (వెల్లకిల పరుండగా పైకొని రమించు విధానములు ౪౧). (౨) తిర్యక్కరణబాధములు (ప్రక్కగ నభిముఖులై పరుండి రమించు విధానములు ౮) (3) స్థితకరణబాధములు (కూర్చుండి పైకొని రమించు విధానములు ౮). (౪) ఉత్థితకరణబాధములు (గోడ మొదలగువాట్ల కానించి నిలచి రమించువిధానములు ౬) (౫) వ్యానకరణబాధములు (తిర్యగ్జంతువులవలె పైకొని రమించువిధానములు ౧౦). (ఇవి అదూషితము లందురు). భావదూషితములు ౧౧ ను కల్పి ౮౪. ఇటుల బాధములు ౮౪ చెప్పఁబడినవి. మతాంతరములుగ చిత్రబాధములు మూఁడును విపరీతకరణములు నాల్గునుకూడ చెప్పఁబడినవి.

వీటి కనుబంధములగు ఆలింగనములు- జాతస్మరాలింగనములు, అజాతస్మరాలింగనములు అని ద్వివిధము. అవి ౧౨ విధములు.

చుంబనములు ౧౫- దంతక్షతములు సప్తవిధ భేదములును, నఖక్షతములు ఆరు విధములుగఁ జెప్పఁబడినవి.

బాధములు.—— ౧ ఉత్తానకరణబంధములు ౪౧ విధములు- ౧ గ్రామ్యబాధము, ౨. నాగర బాధము, ౩ ఉత్ఫుల్లకము, ౪ విజృంభితబాధము, ౫. ఇంద్రాణికము, ౬. ఇంద్రకము, ౭ పార్శ్వ సంఘటితము, ౮. ఉత్తానసంఘటితము, ౯ పీడితము, ౧౦ వేష్టితము, ౧౧ బాడబికము, ౧౨. ఉద్భుగ్నకము, ౧౩ ఉరస్ఫుటనము, ౧౪. ఊర్ధ్వాంగపీడితము, ౧౫. జృంభితబాధము, ౧౬ ప్రసారితబాధము, ౧౭ వేణువిదారితము, ౧౮. శూలచితబాధము, ౧౯ కార్కటకము, ౨౦. ప్రేంఖాయితము, ౨౧ పద్మాసనము, ౨౨. అర్ధపద్మాసనము, ౨౩ బంధురితము, ౨౪. నాగపాశబాధము, ౨౫ సంయమన బాధము, ౨౬ కౌర్మకబాధము, ౨౭ పరివర్తనము, ౨౮. నిష్పీడితబాధము, ౨౯ సమపాద బాధము, ౩౦. త్రివిక్రమబాధము, ౩౧ వ్యోమపదబంధము, ౩౨ స్మరచక్రబాధము, ౩౩ అవదారితము, ౩౪ సౌమ్యబాధము, ౩౫ జృంభితము, ౩౬ నౌకము, ౩౭ ధేనుకబాధము, ౩౮ కీరపాదము, ౩౯. సాచీముఖము, ౪౦ అర్ధచంద్రబాధము ౪౧ ఉపాంగబాధము.

౨ తిర్యక్కరణబాధములు ౮ విధములు ౧. సముద్గకబాధము, ౨ పరివర్తితబాధము, ౩. సమాంగబాధము ౪ అభిగ్రీకము, ౫. సంపుటబాధము, ౬. వేణుకబాధము, ౭. కుక్కుటబాధము, ౮ మాసితబాధము

౩ స్థితకరణబాధములు ౮ విధములు - ౧. యుగపదబాధము, ౨. విత్థరికము, ౩. మార్కటము, ౪ ఘట్టితము, ౫. సమ్ముఖీకరణము, ౬. ప్రస్ఫుటబాధము, ౭. ఉద్గ్రీవబాధము, ౮. జాఘనబాధము.

౪. ఉత్థితకరణబాధములు ౬ విధములు- ౧. జానుకూర్పరము, ౨. సింహవిక్రమము, ౩. కీర్తిబాధము, ౪. ద్వితలబాధము, ౫. పార్శ్వవేష్టితము, ౬. ధృతబాధము.

౫. వ్యానకరణబాధములు ౨౧ ఇవి అదూషితములనియు, భావదూషితములనియు ద్వివిధము.

(౧) అదూషితవ్యాన కరణబంధములు ౧౦ విధములు- ౧ వ్యానతము, ౨. నివతము, ౩ నిఘాతకబాధము, ౪. చటకవిలసితము, ౫. జుష్టబాధము, ౬. వరాహఘాతకము, ౭. వృషాభిఘాతకము, ౮ ధైనుకము, ౯. ఇభము (ఏనుఁగు), ౧౦. మార్జాలబంధము. (౨) భావదూషి వ్యానకరణ బాధములు ౧౧ విధములు- ౧ సార్గాలబాధము, ౨ గార్దభబాధము, ౩. ఔష్ట్రము, ౪. పౌండరికము, ౫. విపరీతబాధము, ౬ ఐణబాధము, ౭. పారావతబాధము, ౮. మయూరబాధము, ౯. మూషకబాధము, ౧౦. భేరుండబాధము, ౧౧ గరుడబాధము

మతాంతరమున చిత్రబాధములు రెండు- ౧ సంఘాటబాధము, ౨ ఉపపదబాధము.

విపరీతకరణ బాధములు (మతాంతరమున) నాలుగు ౧ పురుషాయితము, ౨. భ్రమర బాధము, ౩ ఉద్గతబాధము, ౪. ప్రేంఖావతీ బాధము.

ఈ చాశీతి (ఎనుబదినాలుగు) బాధముల కముబాధములుగ ఆలింగన, చుంబన, దంతక్షత నఖక్షత, సీత్కార, తాడనములు గలవని మున్ను వివరింపఁబడినది. వాటిని వివరింతుము.

౧ ఆలింగనములు ౧౨. ఇవి జాతస్మర, అజాతస్మర లని ద్వివిధము. (౧) జాతస్మరాలింగనములు(ప్రమత్త పూర్వకములగునవి)౮ విధములు- ౧. లతావేష్టితము, ౨. వృక్షాధిరూఢము, ౩. తిలతండులము, ౪. నీరక్షీరము, ౫. ఊరూపగూహనము, ౬. జఘనోపశ్లేషము ౭. కుచాశ్లేషము, ౮. లాలాటకము.

(౨) అజాతస్మరాలింగనములు (అప్రయత్నముగ సంభవించినతరి చేయు నాలింగనములు) ౪- ౧. స్పృష్టకాలింగనము, ౨ విద్ధకాలింగనము, ౩. ఘృష్టకాలింగనము, ౪. పీడనము.

౨ చుంబనములు ౧౫, చుంబన స్థానములు ౧౦- ౧ నేత్రములు, ౨. అధరము, ౩. కుచములు, ౪ గళము, ౫. చెక్కులు, ౬. నాశికము, ౭. లలాటము, ౮. హస్తమూలములు, ౯. నాభి, ౧౦. మర్మావయవము

చుంబనములు ౧౫- ౧. నమితచుంబనము, ౨ స్ఫురితము, ౩ ఘటితము, ౪. భ్రాంతచుంబనము, ౫. తిర్యగచుంబనము, ౬. పీడితచుంబనము, ౭ విఘటితము, ౮. అధరచుంబనము, ౯ ఉత్తరచుంబనము, ౧౦. సంపుటచుంబనము, ౧౧ అనాదరనము (అనువదనము), ౧౨ అవ్యర్థము, ౧౩ ప్రాతిబోధకము, ౧౪ ఛాయికము, ౧౫ క్రాంతికము.

౩. దంతక్షతములు ౭- ౧. మూఢకము, ౨. ఉచ్ఛూనకము, ౩ ప్రవాళమణి, ౪. బిందుకము, ౫. మణిబిందమాల, ౬. ఖండాభ్రకము, ౭ కోలచ్ఛురితము లేక కోలచర్వితము.

౪. నఖక్షతములు స్థానములు ౯- ౧. హస్తములు, ౨. ఊరువులు, ౩ బాహుమూలములు, ౪. ఊరుమూలములు, ౫. జంఘములు, ౬. పిరుదలు, ౭. హృదయము, ౮. కంఠము, ౯. వక్షస్థలి.

నఖక్షతకాలములు ౪- ౧. దూరదేశయాత్రాసమయము, ౨. భ్రాంతినొందినసమయము, ౩. నుత్తిల్లినసమయము, ౪ కోపముగల్గినసమయము.

నఖక్షతములు ౬- ౧. వఠిష్ఢత లేక చురితము, ౨. అనువినత లేక అర్ధచంద్రము, ౩. మృదుత లేక మండలకము, ౪. ఉజ్జ్వలిత లేక మయూరపదము, ౫. నిరేఖిత లేక శశిప్లుతము ౬. స్ఫుటిత లేక కుముదపత్రము.

౫. సీత్కారములు లేక రతిధ్వనులు ౯- ౧ సీత్కృతధ్వని, ౨. ఉత్కృతధ్వని, ౩. ఫూత్కృతధ్వని, ౪. హుంకృతధ్వని, ౫. శ్వసితధ్వని, ౬. రోదనధ్వని, ౭ స్తనితధ్వని, ౮. భూత్కృతధ్వని, ౯ మణితధ్వని

౬. తాడనములు ౨ విధములు - ౧ సమతాడనము, ౨ ముష్టితాడనము. తాడితాంగములు- ౧. శిరము, ౨. రొమ్ము, ౩ పార్శ్వము, ౪. వీపు, ౫. గుహ్యాంగము

౭ కూజితములు ౫ - ౧. మయూరకూజితము, ౨. మరాళకూజితము, ౩ కోకిలాకూజితము, ౪. పారావతకూజితము, ౫ లకుముకి

కళలు ౬౪ - ఇవి ౧ ఔపరిష్టము ఎన్మిది విధములు, ౨ దంతక్షతములు ఎన్మిదివిధములు, ౩ నఖక్షతములు ఎన్మిదివిధములు, ౪. సంప్రవేశనము లెన్మిదివిధములు, ౫. గళస్పర్శనము లెన్మిదివిధములు, ౬. పురుషలీల లెన్మిదివిధములు, ౭. చుంబనము లెన్మిదివిధములు, ౮. ఆలింగనము లెన్మిదివిధములుగలసి యరువదినాల్గును కామశాస్త్రకళ లనంబడును.

కళాస్థానములు - ప్రథమదినమున తలయందు కళయుండును. రెండవదినమున ఎదరొమ్ము, ౩ వ దిన చేతులు, ౪ వ దిన. కుచములు, ౫ వ దిన తొడలు, ౬ వ దిన. నాభి, ౭ వ దిన. నుదురు, ౮ వ దిన. కడుపు, ౯ వ దిన. పిరుదు, ౧౦ వ దిన. వీపు, ౧౧ వ దిన. చంకలు, ౧౨ వ దిన. మర్మస్థానము, ౧౩ వ దిన మోకాళ్లు, ౧౪ వ దిన. పిక్కలు, ౧౫ వ దిన. పాదములు, ౧౬ వ దిన. బొటనవ్రేలు కళాస్థానములనియు, ౧౭ వ దినము మొదలు తిరుగ ఋతుమతి యగువరకు స్త్రీలు నిష్కళావంతులనియుం జెప్పఁబడినది.

కామశాస్త్రమునందింకను ఎఱుఁగఁదగినవి ప్రేమలు ౫ - ౧. అభ్యాసయోగప్రేమ, ౨. అభి

మానజప్రేమ, ౩. సంప్రత్యయోగప్రేమ, ౪. వైష యికయోగప్రేమ, ౫. స్వభావసాత్వప్రేమ.

దశావస్థలు (౧౦)- ౧. కనులఁజూచుట, ౨. మనస్సంగమమగుట, ౩. తలంపుగల్గుట, ౪. జాగరమగుట, ౫. కృశించుట, ౬. అన్యములందు విముఖత కల్గుట, ౭. సిగ్గుదూరమగుట, ౮. ఉన్మాదము గల్గియుండుట, ౯. మూర్ఛ నొందుట, ౧౦. చావునకుఁ జేరుట.

స్త్రీల జవ్వనభేదములు -

| | | | | |
|---|---|---|---|---|
| ౯ వ సం॥ మొ॥ | ౧౬ | వఱకు | లేతజవ్వనము | గౌరి |
| ౧౬ | ,, | ౨౦ ,, | నెరజవ్వనము | బాల |
| ౨౦ | ,, | ౩౦ ,, | విందుజవ్వనము | ముగ్ధ |
| ౩౦ | ,, | ౪౦ ,, | మించుజవ్వనము | విదగ్ధ |
| ౪౦ | ,, | ౫౦ ,, | బలజవ్వనము | ప్రగల్భ |
| ౫౦ | ,, | తరువాత | వీడుజవ్వనము | ఇచ్ఛామణి |

మతాంతరమున జవ్వనములు- ౧౬ సంవత్సరములవఱకు బాలయనియు, పిదప ౩౦ వఱకు యౌవనియనియు, పిదప ౫౦ వఱకు ప్రౌఢ యనియు, పిదప లోలయనియుం జెప్పఁబడినది.

చతుర్విధ ప్రీతులు ౧. అభిమానప్రీతి, ౨ విభవప్రీతి, ౩. సదృశప్రీతి, ౪. విషయప్రీతి

మోహములు ౪. ౧ లజ్జామోహము, ౨. విభవమోహము, ౩ కరుణామోహము, ౪. మోహము. మతాంతరమున కూర్మమోహ ముత్తమమనియు, మత్స్యమోహము మధ్యమ మనియు మృగమోహ మధమ మనియుఁ జెప్పఁ బడినది

నాయక చతుష్టయము- ౧. అనుకూలుఁడు, ౨ దక్షిణుఁడు, ౩. ధృష్టుఁడు, ౪. శఠుఁడు.

నాయకసఖులు- ౧ పీఠమర్దుఁడు, ౨. విదూష కుఁడు, ౩. పీఠమర్దుఁడు, ౪. చేటుఁడు.

పురుషజాతులు- ౧. పాంచాలుఁడు, ౨. కూచి మారుఁడు, ౩. భద్రుఁడు, ౪. దత్తుఁడు. మరియు శశజాతి, వృషభజాతి, తురగజాతి యని యవాంతరజాతులు చెప్పఁబడినది. స్త్రీజాతులు పద్మిని, చిత్రిణి, శంఖిణి, హస్తిని యనియు, అవాంతర జాతులు హరిణీజాతి, తురగీజాతి, హస్తినీజాతి యనియుం జెప్పఁబడినది.

**కామశిగోత్రము** — శాండిలగణము చూడుఁడు.

**కామశిష్టగోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి (వైశ్యగోత్రములు చూడుఁడు). కామశిష్టసగోత్రము, వికాశ్యపగోత్రము (౪౦) గొల్లింటి సంస్కృతగోత్రము కాంతేయస, కుంతేయగణము, కామ్యకర్షి, ఆపస్తంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణ గ్రంథమాద్య ప్రవరఖండ, సమాన గోత్రము కామ్యకస, పూర్ణేశ్వరుఁడు దేవత, సుగోత్రకామభార్య, కాళిందీ తీరము, తపస్థానము, కామాంబుధి తటాకము, జపము అర్బుదము, దీపములు ౨౦. క్షేత్రసంఖ్య ౩౬. స్వర్ణదానము, కర్పూరము, కందమూలము వర్జనీయములు.

**కామా** (Comma) - ఇదియాంగ్ల భాషా సాంగత్యము నుండి యాంధ్రభాష లోనికి తెచ్చికొనిన ఒకగురుతు కొంచెపు ఆపుదలను సూచించును. వ్రాతలందిది కేవలము అర్థాన్వయము కొఱకె ఉపయుక్తమని యెఱుఁగునది. వాక్యసంగము లందిది, ఊపిరి తీసి కొనుటకు అర్థస్థలముగ అర్థాన్వయమును స్పష్టము గ దెల్పు కొఱకు నుండెడిని. ఇది వాక్యములోని దని యెఱుఁగునది.

**కామాఖ్య** — కామరూపజిల్లా (అస్సాము దేశము) ప్రధాననగరమగు గౌహతి పరిసరముల నీలకూటపర్వతముపై కామాఖ్య లేక కామరూపిణీదేవి పీఠము. దీనింగూర్చిన ప్రశంస బృహద్ధర్మ పురాణము ౧, ౧౪ యందుకలదు.

(కామరూపదేశము చూడుడు). పంజాబుదేశము నందు దేవికానదీతీరమున నిదేపేరుగల దేవి దేవ స్థానము కలదు. ఇది దేశప్రసిద్ధ దేవస్థానము. దీనింగూర్చిన ప్రశంస పద్మపురాణము సర్గ ౧౧ యందుగలదు.

**కామానది** — దీని పూర్వచరిత్ర సరిగ తెలియదు తొల్లిటి యార్యుల కాలమున దీనిపేరు కామ్యద లేక కామద



యని యుండియుండనోపు. ఇప్పుడు కునార్ అనెదరు. ఇది ఋగ్వేదమున వివరింపఁబడిన కుభా నది (గ్రీకులు కాఫెన్ అనియు, ఆఫ్గన మ్లేచ్ఛులు కాబూల్ అనియు నందురు) యందు సంగమించెడిని కునార్నదికి అర్రియన్ చారిత్రకుఁడు చోయీస్ అని పేరిడెనని Journal of Asiatic Society of Bengal of 1840 p. 472 లో గలదు.

**కామాశ్రమము** — బాలియాజిల్లా లోని కొరంతేడి యనంబడు తావున కుత్తరముగ నెన్మిదిమైళ్ల దూరమున కారోం అనంబడు తావునంగల కామాశ్రమము. ఇది పరమేశ్వరుఁడు మన్మథుని తననేత్రాగ్నిచే దహించిన తావుగ పోల్చియున్నారు. దీనింగూర్చిన ప్రశంస రామాయణము బాలకాండము ౨౩ యందుకలదు. తొల్లింట నిట సరయూనది గంగానదిలో సంగమించుచుండెనట. కాని ఇప్పుడు ప్రవాహగతి మారి తూర్పుగానడచి (ఛపాపురమున కెన్మిది మైళ్లలోనున్న) సంగియనుతావున సంగమమగు చున్నది. ఇట కామేశ్వరనాథ శివలింగముకలదు. అద్దానిని కాలేశ్వరమనియు నందురు రఘువంశము ౨, ౧౩ యందు చెప్పఁబడిన మన్మథ తపోవనమిదియె నందురు. కాని స్కందపురాణము అవంతిఖండము (అవంతీ క్షేత్రమహాత్మ్యమున) ౩౪ యందు కామదహనము దారుకావనమున జరిగినదని చెప్పఁబడుటచే నిది కేవలమన్మథ తప స్థానముమాత్రమెయైయుండెడిని. ఇటశివలింగము మన్మథ ప్రతిష్ఠ యనుచున్నారు.

**కామికారణ్యము** — అరణ్యములు చూడుఁడు.

**కామిల** (కామెర్లు) - ఆంగ్ల Jaundice. కండ్లు, పిదప శరీరావయవములు పసుపుపచ్చ రంగు ధాతువుంగల్గి అగ్నిమాంద్యలక్షణము, తంద్రలక్షణములు, విదాహము, నీరసము మొద లగు లక్షణములంగల్గియుండు జబ్బు ఇది పాండు రోగ జాతులలో నొకటిగఁ జెప్పఁబడినది.

**కాముడిపున్నమ** — డోలాపౌర్ణమి చూడుఁడు.

**కాముఁడు, కామము**— ధర్మునకు శ్రద్ధ లేక సంకల్పయందు జన్మించెనని చెప్పఁ బడినది. భార్య రతీదేవి. మన్మథునకు నామాంతరముగ నెంచుచున్నారు

**కామెట్టు** (తోకచుక్కలు) — తలయుఁ దోకయుంగల్గి ప్రకాశించు నక్షత్రముగ తోక చుక్క యనియు, గ్రీకుభాషయందు తలవెండ్రు కల కర్థమిచ్చు పదమునుండి ఏర్పడినది గాన Comet అనియు పేరొందినపదము తొల్లింట పెక్కు దేశములందు తోకచుక్క లగుపడుట ఘోరాపదలకుం గారణమని తలంచి ప్రజలు భయమందుచుండెడివారట జోసెఫస్ అను పేరు గల యూదుండను చరిత్రకారుఁడు కత్తిం బోలిన యొక తోకచుక్క జరూసలెం పట్టణము నకు పైగా నాశనమునందు జరూసలెంనందుండిన యెహోవా మహాదేవాలయము నాశనముచేయం బడుటకు ముక్కొనిశిసంవత్సరముగఁ గనుపట్టుచుండె నని వ్రాసియున్నాఁడు

వీటింగనిపెట్టుచు పరిశీలించు నిర్భిణి యంత్ర పరికరములు చాల పెద్దవి. వాటిని Comet finder అనియు, Comet seeker అనియు నందురు మరియు నీశాస్త్రమునకు కామెటోలోజీ యనిపేరు. తోకచుక్కల పునరాగమనములు తెల్పుటకున్న ప్రాత్యాక్షప్ ఎస్ట్రోనొమీ శాస్త్రవిదులు వీటినిజరిత్వ మెరమెద్దనుని సరిగా తెలుపఁజాలకున్నారు పునరాగమనపు భవిష్యత్సూచనలు పెక్కులు నిదర్శనములైనవి కొన్ని తప్పిపోయినవి. పరిశీలన లధికముగానే జరిగినవి.

కామెట్సు- ప్రకాశించు శరీరములు కలవి. తోంకలత కొంచముగ గప్పుకుచు పెద్దవిగ విజృంభించి త్వరితగతిఁ గగ్గినవిగనై సూర్యునివేన కరుగుచు తగ్గిపోయి తుదకదృశ్యములగుచని చెప్పంబడినది నక్షత్రములంత వెలుగిచ్చునవి కావు. మేఘములంగోలిన శరీరములు కలవి. పొడుగైన తోకలు, పలుచగనుండు శిరములు, కలవి యని తలంపబడుచున్నవి. కొన్నిటిగుండా నక్షత్రములగుపడు నవి Transparent శరీరములని తలంపఁబడుచున్నవి వీనితోకలు సూర్యునకెదురుతిరిగియుండు గానవచ్చెడివి. (తోకచుక్క చూడుఁడు)

నూరు తోకచుక్కలు పరిశీలింపంబడినవనియు, ఇవి వేయివరకుండునవనియు చెప్పంబడినది పెక్కులు గుర్బిణీతోగాని గానరానంత చిన్నవిగను, పలుచనివిగను నుండుననురు. Dr Herschel గారు పరిశీలించి, ఇవి నీటియావిరి యని తెల్పిరి. ఇవి భూమికిం దగిలిన నిర్బాధకమనియు, ఏపాటిదైన కల్గెనేని అది తత్ప్రదేశప బాధమేగాని యన్యప్రదేశములకు నిర్బాధకమే ననియు ఋజువుపర్చెను.

మరికొందఱు పరిశీలకులు సూర్యునివైపునకుం దిరుగువో దాని శరీరము తగ్గిపోవుచు తుదకు నశించునని తలంచుచున్నారు. Sir Issac Newton గారు వీటి దేహములు నీటియావిరి సంబంధమనిరి Dr Hamilton పరిశీలకుఁడు వీటి శరీరములు గుల్లగ నుండుననియు, అవి నక్షత్రములనుండి తప్పించుకొనుచుండెడి Electric matter అనియు, ఇవి యా Matter ను తిరిగి తెచ్చుచుండునవియు నభిప్రాయపడియున్నాఁడు.

క్రీ. శ. ౧౬౮౦ లో నొకతోకచుక్క చాల గొప్పతోకతోఁగన్పించెను ఇష్టంబూలుంగరమున నక్షత్రము భూవలయ ఖకడను Zenith నాను దానితోకయునుండు నది సూర్యుని వెడలుపునం దారవభాగము తోకగలదియునది. అదియొకసారి తిరిగివచ్చుటకు ౫౭౫ సంవత్సరములు పట్టుననిరి. ఇదియె ౧౮౮౧ లో తిరిగికన్పించిన నక్షత్రముగ దలంపఁబడుచున్నది క్రీ శ ౧౩౧౫, ౧౪౫౬, ౧౫౩౧, ౧౬౦౭, ౧౬౮౨, ౧౭౫౯, ౧౮౩౫, ౧౯౧౦ సంవత్సరములలోఁ గన్పించుచుండిన తోకచుక్క ఒకటియేయనియు, దీని పునరాగమనములను Dr. Halley పరిశీలకుఁడు సరిగాఁ జెప్పుటచే దానికి Halley's Comet అని పేరిడంబడినదనియు, ఇది సూర్యునిజుట్టి తిరుగుతరి శరీరము చాలభాగము నశించుచుండినను తిరుగఁ దిరుగ చేకుకొనుచుండుట గల్గుచున్నదనియు చెప్పఁబడినది. క్రీ. శ. ౧౭౭౦ లో కన్పించిన తోకచుక్క అయిదున్నర సంవత్సరములలో తిరిగి కన్పించునని లెక్కించిరిగాని, కన్పింపలేదు. దాని మార్గము మారిపోయినదనియు, అది భూమియంత పరిమాణము కలదియనియు, భూమి కెక్కువ దగ్గరగావచ్చిన తోకచుక్క అదియె ననియు సుప్రసిద్ధ ఫ్రెంచి ఎస్ట్రోనొమీశాస్త్రవేత్తయగు Laplace పండితుఁ డభిప్రాయపడియున్నాఁడు. క్రీ. శ. ౧౭౪౪ లో నొకటియు, ౧౮౧౧ లో నొకటియు తోకచుక్కలగుపడెను.

౧౮౩౭ లో నొకటి మార్సెలీసు నగరమునం దగపడి Transparent గ నుండెను అదిసూర్య బింబమును దాటిపోయెను (ఎస్ట్రోనొమీ, ఫిక్సెడ్ స్టార్సు చూడుడు).

**కామేపల్లి సీమ** - గుంటూరు మండలము లోని కామేపల్లి ప్రాంత దేశము. కామేపల్లికి తంగేటినగరమని పేరుండినటుల అప్పకవీయమున చెప్పబడినది. ఇది క్షేత్రమట.

అప్పకవి అప్పకవీయ మిచటనే రచించి దేవున కు కృతినిచ్చెను అతం డిచటి కాపురస్థుండేమొ

**కామేపానకి గోత్రము** - ని ధృవ గణము చూడుడు.

**కామేశ్వరకవి** (లింగసముఖ కామేశ్వర కవి) - ఆంధ్రకవులలో నాథునికునిగా పరిగణింపం బడినవాండు, నియోగి బ్రాహ్మణుండు, కాపురము దక్షిణ మధురాపురము. అట రాజాస్థానకవిగా నుండినవాండు, ఇంటిపేరు లింగసముఖవారు, తండ్రి పేరు నాగనామాత్యుండు, తల్లిపేరు కామాక్షమ్మ

రచించినవి సత్యభామా సాంత్వనము దీనిని మధురాపురాధీశుండగు ముద్దళగిరి భూపతికిం గృతి నిచ్చెను అతండుసుప్రసిద్ధుండగు తిరుమల నాయకుని సుతుండు. మఱియు నీకవి రుక్మిణీ పరిణయమను ప్రబంధమును గూడ రచించెనట

ఈకవి కాలము క్రీ. శ. ౧ ౬౦ సంవత్సర ప్రాంతముగా తెలిసెడిని.

**కామ్ చట్కా ద్వీప కల్పము** (కామ్ చట్కా) - ఆసియా ఖండమున సైబేరియా దేశమునకుం జెంది పశిఫిక్కు మహాసముద్రమున నున్న ఒక ద్వీప కల్పము. ఇది ఆర్కిటిక్కు మహాసముద్రము నంటియుంట శీతలమధికము. పాడవునను పర్వతపంక్తులును, అందగ్ని శిఖర ములును, కొన్ని యడవులును కలవు. ఫర్ నిచ్చు మృగములు విస్తారము. ప్రజలు భూమి యందు గోతులు త్రవ్వి అందు నివాస గృహ ములు నిర్మించుకొని యుందురు. పెట్రోపాలో వస్కిపురము ప్రధాన పట్టణము. ఫర్ వర్తక స్థానము.



**కామ్యకవనము** - వ్రజ మండలమున మధురకు సమీప మున కామ్యక వనము వ్రజ మండల వనములలో నొకటియై దన రెడిని ఇది యమునాతీరము శ్రీకృష్ణుని బాల్య లీలలతో సంబంధము కలది.

కురుక్షేత్రమున స్థానేశ్వరముకడ నొక కామ్యక వనముండెను. ఇది సరస్వతీ నదీతీరము. పాండ వులు ద్యూతమున నోడి రాజ్యభ్రష్టులైన కతన ఇచట (స్థానేశ్వరమున కాగ్నేయ దిశగా నాలు మైళ్ల దూరమునగల) కామోద యను పేరు గల గ్రామముకడ ద్రౌపదీదేవి వంటచేసి పాండవులు భుజించిన తావని చూపుచున్నారు. మహాభార తము వనపర్వము ౬ యందు వివరింపంబడిన కామ్యకవన మిదియె. మఱియు వామన పురా ణము ౩౮-౪ యందిదియె వివరింపంబడినది

ఈ కామ్యకవనము తొల్లింటి కురుజాంగల దేశములోనిది. పాండవులిం దరణ్యవాసము గడపి రని చెప్పంబడినది. కురుక్షేత్ర వనములలో నొకటియై యున్నది.

**కామ్యగోత్రము** — విష్ణువృద్ధ ఉప గణము చూడుడు.

**కామ్యాయన గోత్రము** — భర ద్వాజ ఉపగణము చూడుడు.

**కామ్యాయనిగోత్రము** — వసిష్ఠ గణము చూడుడు.

**కాన్ కోటిక క్షత్రియులు** — శిశో దియాశాఖ క్షత్రియులు చూడుడు.

**కాయకల్ప చికిత్స** — కల్ప చికిత్స చూడుడు.

**కాయగతానుస్మృతి** — దశబాహ్యానుస్మృతులు చూడుడు.

**కాయగోత్రము** — కపిఉపగణము చూడుడు.

**కాయనగోత్రము** — భరద్వాజఉపగణము చూడుడు.

**కాయసిద్ధి** — కాయసిద్ధి యనగా శరీరమునకు వ్యాధులు, ముదిమి, మృత్యువు బాధింపకుండ యోగాదిసాధనములవలనను, ఓషధులవలనను మణిమంత్రములు మొదలగు సాధనములవలనను శరీరసంరక్షణమును గల్గించుటకు కాయసిద్ధి యనిపేరు.

**కాయావరోహణక్షేత్రము** (నకులీశక్షేత్రము) — నకులీశక్షేత్రము చూడుడు.

**కారకపంచకము** — బౌద్ధవైభాషికులు కర్మేంద్రియములైదింటికిని కారకపంచకమని పేరు.

**కారకోరమ్ పర్వతములు** — మధ్యఆసియాయందు నాల్గవదగు హైన్లో పొడవు గల పర్వతము. హిందూకుష్ పర్వతపంక్తి నుండి హిమాలయముల గెల్పునది. దీనియందలి (౨౮,౨౫౦ అడుగులయెత్తు) గాడ్విన్ ఆస్టిన్ శిఖరము ప్రపంచమున రెండవ శిఖర మనుచున్నారు. కాశ్మీరదేశమున ఈశాన్యదిశగానున్న పర్వతపంక్తి.

**కారగ్రీవిగోత్రము** — భరద్వాజఉపగణము చూడుడు.

**కారణగుణప్రక్రమన్యాయము** — కారణ మేగుణములు గల్గియుండునో దానినుండి జనించినకార్యమును ఆగుణములనే గల్గియుండు నని యర్థము. ఏరంగునూలుతో నేయబట్ట ఆరంగుతో నే యుండెడిని.

**కారణనాశే కార్యనాశః కార్యనాశే కారణనాశః** — కార్యము నశించిన కారణము నశించును. కారణమునశించిన కార్యము నశించు నని భావము.

**కారణములు** — తర్కశాస్త్రమున, వాదసౌకర్యమునకు గాను మూడువిధములగు కారణముల నేర్పరచుకొనిరి. కారణమన కార్యమునకు పూర్వముండునది యని ఇటభావము — ౧ నిమిత్తకారణము, ౨ ఉపదానకారణము (లేక సమవాయికారణము), 3 సహకారి (లేక అసమవాయికారణము). కుండలను మట్టితో చేయు 'కుమ్మరి' ఆకార్యమున నిమిత్తకారణముగను, అతడు కుండల జేయు మన్ను ఉపాదానకారణముగను, ఆమన్నుకొక్క జాతి (బాక, మన్ను లేక రేగడిమన్ను మొ॥) రంగు (అనగా ఎఱ్ఱమన్ను పచ్చమన్ను తెల్లమన్ను మొ) లక్షణములు సహకారికారణముగ నెంచుగూడును. అనగా కర్త నిమిత్తముగను, ప్రధానపదార్థము ఉపాదానముగను, ప్రధానద్రవ్యలక్షణములును, సహకారికారణముగను ఎరుంగునది.

**కారపులిగోత్రము** — ఉపమన్యుగణము చూడుడు.

**కారల్సుబాద్** (Karlsbad) — భరతదేశమున చేయబడుచున్న ఏరేటెడ్ వాటర్సు సంకుకొన్ని కారల్సుబాద్ పేరిడంబడియుండుట పెక్కుండ్రెఱిగియే యున్నారు. కారల్సుబాదు పట్టణము ఐరోపాఖండమునందలి (బాల్కన్ స్టేట్సు) బొహీమియా దేశమునందలి యుగోస్లావికా సీమయందు కలదు. కారల్ అను పేరుగల భూపతి పేరిడంబడినపురము. తొల్లింట ఆస్ట్రియా సంస్థానరాజ్యమునకుం జేరియుండి ఇటీవల వేరైనది. టేపిల్ నదీతీరము అనది ఈగరు నదిలో సంగమించు తావుకడ నున్నది.

ప్రేగునగరమునకు వాయువ్యదిశగా ౧,౧౦౦ అడుగుల ప్రదేశమున నిర్మింపబడిన పురము. పురప్రదేశమునను, పరిసరములను, వేడిగల Alkaline Springs కలవు. వాటివేడి ౧౧౦ మొదలు ౧౬౩ డిగ్రీలదనుక ఫారెన్‌హీట్ థెర్మోమీటరు వేడిం గల్గియుండెడిని. శరీరారోగ్యము చెడినవారు ఏటేట డెబ్బదివేలమంది ఇట స్నానపానములచే నారోగ్య మందుచున్నారని లెక్కింపంబడినది ప్రజలు ౧౭,౦౦౦ మందికలరు. వీరు అను జర్మనులే. ఏప్రెల్ మొదలు అక్టోబరు వఱకు జనులబత్తిడి గల్గియుండును ప్రభుత్వపు నామము Karlovy Vary

**కారల్** (Carl) ట్యూటోనిక్కు నామము. ఇంగ్లిశబ్దము గు Charles నకు Danish రూపము. ఒకచక్రవర్తి పేరని వాడుచున్నారు. మానవత్వమున కర్థము. పురుష నామము. (క్రైస్తవ నామములు చూడుడు)

**కారవానా** (కాయావరోహిణక్షేత్రము)- దీనిని నకులీశ క్షేత్రమనియు నందురు. (కాయావరోహిణ క్షేత్రము చూడుడు)

**కారవారిగోత్రము** కౌతస్య ఉపగణము చూడుడు.

**కారాచ గోత్రము** - జమదగ్ని వత్స ఉపగణము చూడుడు.

**కారాస్కరుల దేశము** - కారాష్ట్ర దేశము చూడుడు

**కారాష్ట్ర దేశము** - కారాస్కరుల దేశము. జైనులు, బౌద్ధులు ఆక్రమించినదేశము. వారు వేదమును పాటింపని వారు గానను, తీర్థయాత్రావిరహిత ప్రదేశముగానను, కారాస్కరదేశమనియు, కారాష్ట్రమనియు నప్పాలపు ఆర్యవేద మతస్థులు పిలచిరట. దక్షిణ దేశమున కారెక్కాలు అని పిలువంబడు పురప్రాంతము. ఇప్పుడిది ఫ్రాంచివారి పరిపాలనయందున్న సీమ.

మహాభారతము కర్ణపర్వము ౪౪ యందును, మత్స్యపురాణము ౧౧౩ యందును దీని ప్రశంసలు కలవు.

**కారికేచరోలొజి** (Caricatureology)- కార్టూనిస్ట్రీ, కార్టోగ్రాఫీ చూడుడు.

**కారి గోత్రము** — గర్గ ఉపగణము చూడుడు.

**కారియోప్లాజం** (Karyoplasm) — వృక్ష జంతుజాలములు పరమాణుపదార్థ పరిణామముగూర్చిన విధానము.

**కారిరాత్రిగోత్రము** — గర్గ ఉపగణము చూడుడు.

**కార్తి కార్తులు** — నక్షత్రములు, చరిత్ర చూడుడు

**కారీషిగోత్రము** — కుశికగణము చూడుడు

**కారీషితగోత్రము** — వశిష్ఠగణము చూడుడు.

**కారీషిగోత్రము**—హారిత ఉపగణము చూడుడు

**కారీక్షిగోత్రము**— ధనంజయగణము చూడుడు.

**కారుంజయ గోత్రము** — శండిల గణము చూడుడు

**కారుకుబ్జపురము** — కథియవాడు దేశమునందలి జూనఘడ్పురమున కిది యాది నామముగ చెప్పంబడినది. ఇది అంతర్గృహక్షేత్రమని స్కాందపురాణ ప్రభాసఖండమునందు చెప్పంబడినది.

**కారుపథ లేక కారాత్ప లేక కైలావత దేశము** — ఈదేశమును బన్ను జిల్లాలోని నిలికొండలనంబరగు సాల్టురేంజి కొండల పాదమున సింధునది కుడిగట్టు (అనగా పశ్చిమ తీరమున) కాలాబాగ్ అనియు, కారాబాగ్ అనియు పిలువంబడు పురప్రాంతదేశమని పోల్చియున్నారు. కారాబాగ్పురమునకు కాలాబాగ్ అనియు, బాఘా ననియు వాడుకపేర్లుకలవు. అది ఇప్పటి అఫ్ఘనుస్థాన రాజ్యమున కాందహారు నుండి ఘజనికిపోవు పెద్దరస్తాపైనున్న పురము. ఇది తొల్లింట కారుపథరాజ్యపు రాజధానిగ నుండెను. అప్పుడు కారుపథపురమని పేరుండెను. ఇది ఘజనీనుండి నైరుతిదిశగా ముప్పదియైదు మైళ్ల దూరము.

బృహత్సంహిత ౧౪ అధ్యాయమున కైలావతమని చెప్పబడిన తొల్లింటి వాడుకనామమే కాలాబాగ్ గా మారియుండునోపు. ఇది ఇక్షులమున ఎక్కువ ఫలవంతమగు సీమగా నున్నది. రఘువంశము ౧౫వ సర్గ, ౯౦వ శ్లోకమున శ్రీరాముడు తన రాజ్యమును పంచియిచ్చుటలో లక్ష్మణుని కుమారుడగు అంగదున కీరాజ్యమిచ్చినటుల చెప్పబడినది. రామాయణము ఉత్తర ౧౦౨వ యందు దీనిప్రశంస కలదు. అందు మల్లదేశమని పేర్కొనబడినది.

**కారుపథి గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**కారుషాయనగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**కారూబా** — అంబరు చూడుడు.

**కారూశుడు**— వైవస్వతమను పుత్రులలో నొకడు. ఈతని సంతతివారు కారూశ వంశస్థులు. వారు ధర్మక్రియులగుట బ్రాహ్మణులయిరి. మరియు వీరిలో పెక్కండ్రు ఉత్తరాపథమున రక్షకులైరి.

**కారెక్కాలు**— ఫ్రెంచిఇండియా చూడుడు. కారాష్ట్రదేశముం జూడుడు.

**కారెళ్ల వ్యవసాయము** — దీని కాంధ్రనామ మెద్దియో తెలియకున్నది. ఇది కన్నడభాష యందలి పేరు. గుజరాతీలు



రామ్తిలయనెదరు. మహారాష్ట్రులు ఖురాసాంతిల యనెదరు. బహుశః ఆ దేశమునుండి తొలుత వచ్చియుండనోపు. భరతదేశమున నిప్పుడు పైరుచేయబడుచున్నది. తొలకరి పైరులలోనిది. బొంబై రాజధానియందు కన్నడసీమలందు గానగుచున్నది. ఇది యైదుమాసముల పంట.

దీనికై నాలుగైదుచాళ్లు భూమిదున్నెదరు. యకరమునకు నాల్గుమొద లారుపౌనుల విత్తులను నాటుదురు. ఐదు రోజులలో నవి మొలచెడిని. గాలి ప్రసరించుట వీటికి ప్రధానము లేకున్న పంట నష్టమగునందురు. ఒకటి రెండుసార్లు కలుపుతీసి గొప్పు త్రవ్వుటయుం గలదు. వీటి గింజలును, ఆకులును కొబ్బరియాకులవలె జాలియుండును. పశువులు వీటిని దిని పాడుచేయవు.

గింజల నూనె నువ్వులనూనెకంటె శ్రేష్ఠమని ఎంచబడుచున్నది. భోజన పదార్థముగ వాడబడుచున్నది. పిండి పశువుల కాహారముగ వేయబడుచున్నది. పాడిపశువులకిది ప్రశస్తమందురు. గింజలందు నూటికి ముప్పది లేక ముప్పదిరెండుపాళ్ళ చమురుగల్గియుండును. నల్లరేగడిభూము లీపంటకు ప్రశస్తములు. పరిస్థితి, కాలములు బాగుండెనేని ఇసుక, రేగడిలందు కూడ చక్కగ ఫలించెడిని.

**కారేణి గోత్రము** - ఆయాస్య ఉపగణము చూడుడు. కౌతధ్య ఉపగణము చూడుడు.

**కారేణుపాలి గోత్రము** - ఔతథ్య ఉపగణము చూడుడు.

**కారేణు ఫాలి ఉపగణము** - ఇది అంగీరస సంతతిలోని గౌతమ గణము నందలి యొక ఉపగణము ఇందు ఏడు గోత్రములు కలవు.

౧. అజగంధి, ౨. ఔదాజాయన, ౩. కారేణుఫాలి, ౪. పౌజిష్ఠ, ౫. మాధుక్షుర, ౬. వాస్తవ్య, ౭. శ్వేతీయ

ఈ (కారేణుఫాలి ఉపగణ) గోత్రములకు ప్రవర- ఆంగీరస, గౌతమ, కారేణుఫాల.

**కారేణుఫాలి గోత్రము** - కారేణు ఫాలి ఉపగణము చూడుడు.

**కారేయ గోత్రము**- శాండిల గణము చూడుడు.

**కారోలైన్ ద్వీపములు** (Caroline Islands) - పశిఫిక్కు మహాసముద్రపు వాయవ్యదిశను ఆర్కిపిలెగో అనంబడు చున్న ద్వీపములు. ౩౯౦ చతురపు మైళ్ల వైశాల్యము. తొల్లింటి స్పానియా దేశపువై యుండి, క్రీ. శ. ౧౮౯౯ లో జర్మనీ కమ్మబడి ౧౯౧౪ లో జపాన్ వారిచే నాక్రమింపఁబడి నానాజాతిసమితి ఉత్తరువు (మాండేటు) మేరకు జపాన్ వారి పాలనయందున్నవి. ౧౯౩౦ జనాభా మేరకు ౩౮,౬౪౭ మంది జనులు వసించు చున్నారు.

**కార్టునోటు** (Cart Note) — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము). Custom duty వసూలుచేయఁదగిన సామానులను దిగుమతిచేయు ఓడనుండి Bonded godown నకుగాని, ఒక Bonded godown నుండి వేరొక Bonded godown నకు గాని గొంపోవుటకు నొసంగబడిన యుత్తరవు.

**కార్టూనిస్ట్రీ** (Cartoonistry) — Cartoon అనగా స్పష్టముగ నర్థమిచ్చు భావముం దెల్పుటకు వ్రాయఁబడిన బొమ్మ. ప్రస్తుతకాలమున రాజకీయభావములం దెల్పుటకు తత్సంబంధులగు మనుజరూపములతో వ్రాయఁబడు బొమ్మలకు వాడుచున్నారు. దీనిని Caricature అనియు నందురు.

**కార్టోగ్రాఫీ** (Cartography) — దీనిని Cartoonistry అనియుం గొందఱనెదరు గాని కొంత భేదముగలదు. ఫ్రెంచిభాషయందు Carte-map, జర్మనుభాషయందు Graphein అన to draw or write గాన ఈకళకు map or chart making అని అర్థముకాఁగలదు.

Cartoonistry తాను జెప్పదలంచుకొనిన భావమును పెద్దగా, స్పష్టముగా బోధపడునట్లు బొమ్మలను సంబాధించిన మనుష్యుల పోలికలతో లిఖించి చూపుటయగును. దీనిని Caricaturology అనియు ననుటకలదు (చూడుడు). అట్టి బొమ్మకు కార్టూన్ యని పేరు.

**కార్డియెరైటు** (Cordierite) — దీనిని ఆంగ్లరసాయనవేత్తలు “Hydrated silicate of alumina, iron and magnesia” అనుచున్నారు

**కార్తవీర్యార్జున మహారాజు** — యాదవవంశక్షత్రియుఁడు హైహయవంశజాతుఁడు. చేదిదేశమేలిన నృపతి. తండ్రి పేరు కృతవీర్యుఁడు. ఈతనిపేరర్జునుఁడయ్యు కృతవీర్య సుతుఁడగాన కార్తవీర్యార్జునుఁడనియు వాడుక బలమయ్యెను. మాహిష్మతిపురము రాజధాని (చేదిదేశము చూడుఁడు). వింధ్యపర్వత సీమయందు నర్మదా నదీతీరము. ఇతఁడు యదుమహారాజుయొక్క జ్యేష్ఠపుత్రుఁడగు సహస్రజత్తు సంతతిలోనివాఁడు. మహాబలాఢ్యుఁడు. పరశురాముని తండ్రియు,

విశ్వామిత్రుని మేనమామయు నగు జమదగ్ని మహర్షి యొక్క ధేనువును కార్తవీర్యార్జునుండు బలత్కారమున నపహరింప, పరశురాముడలిగి కార్తవీర్యార్జునుని వధించెను. అతనిసుతులు పగం బూని జమదగ్నిని జంపిరి. అత్తరినట లేకుండిన పరశురాముడరుదెంచి పితృవియోగ దుఃఖమున క్షత్రియులొనర్చిన మత్తత దుష్కార్యములకు గినిసి యుగ్రుండై దేశమున క్షత్రియ శౌర్యాగ్నితుని బయలుదేరి ఇరువదియొక సారులు క్షత్రియులపై దాడివెడలుచు క్షత్రియులంజంప మొదలిడి నాశనమొనర్చెనట. అత్తరిం బరశురామునిబారికి దొరకనివారు కార్తవీర్యార్జునను పుత్రులలో నైదుగురు గలరు వారు- ౧. జయధ్వజుండు, ౨. శూరశేనుండు, 3. వృషణుడు, ౪. మధువు, ౫ శూరుండు లేక ఊర్జితుండు అనువారలు.

## కార్తవీర్యార్జునుని వంశావళి — కార్తవీర్యార్జున మహారాజు (సంతతి) వంశావళి.



**కార్తికేయ పురము** — సంయుక్త రాష్ట్రములకుం జెందిన కుమావ్ జిల్లాయందు అల్మోడాపురమునుండి ౮౦ మైళ్లు దూరమున వైద్యనాథము, బైజనాథ్ అను పేరం బరగుచున్న గ్రామము. దీనికి కార్తికపురమనియు పేరుండెను. దేవీపురాణము ౫ అధ్యాయము నందు ప్రశంసింపఁబడినది.

**కార్దమాయని గోత్రము** — అత్రి మేరగణము చూడుఁడు

**కార్పాతదేశము** — కారిపథదేశము చూడుఁడు

**కార్పాసరక్తతాదృష్టాంతన్యాయము** లత్తుక దూదియందలి యెఱుపురంగు దూదికిం దగిలింపఁబడిన రంగుచే గల్గినది కాని ప్రత్తిగింజలకిది మొలచినను ఎఱ్ఱని ప్రత్తి పండింపఁబడలేదని భావము.

ఈ న్యాయమును (కర్మయే లేదను) బౌద్ధులు వాడియున్నారు

**కార్పెటిస్ట్రీ** (Carpetistry) - తివాచీలం గూర్చియు చాపలం జేయు లక్షణ విధాన ధర్మములం గూర్చి తెలుపు కళ

— **ర్పెట్ బేగర్** - ఇక్కాలపు పనితనము నాగరికతములతో పోల్చి చూచినచో వీరలకు పోస్టు మోటారులు రోడ్లుతో డను, కేస్ఫ్సు గడ్డలతోడను చేయఁబడక పూర్వము పూర్వులు వాడుకొనుచుట్టి గైలు సంచులు పోలిన సంచు లింగ్లాండునందును, అమెరికా దేశమునందునను వాడుకయందుండెనట. ప్రయాణములో నెల్ల వారీ సంచుల బట్టలు మొదలగునవి గొని చేతం బూని పోవువారట. కాన తొలునాలుత నెప్పుడు తిరుగుచుండు ప్రయాణికులను కార్పెట్ బేగర్ (Carpet bagger) లనుచుండెడి వాడుక యుండెనట.

పిదప రాను రాను ఈ పేరు నగరముల నుండి ఏవేవో అనుదినోపయోగములగు సరకులం గొని మాయమాటలం జెప్పుచు నెక్కువ ధరలకు పల్లెటూళ్ల స్త్రీలకు, బాలుర కంటగట్టి తమసామలని పుణిని తరలి పోవుచుండెడి మధ్యబేరగాండ్లగు వర్తకులకు Carpet bagger అని వాడుక గల్గెను.

తర్వాత నమెరికా దేశమున బానిసలకు స్వేచ్ఛ లభించినపుడు పిమ్మట (Voting qualification) కల్గిన పిదప ఉత్తరాది నాయకులు మాయమాటలు చెప్పి నమ్మించి వారి ఓటుల సంపాదింపు తిరుగు చుండెడి దేశభక్తుల కీ నామము వర్తింప నయ్యెను.

ఇప్పటికిని రాజకీయములు, దేశసేవయు చక్కగా దెలియక, గొప్పకొఱకు స్వలాభముకొఱకు తిరుగు దేశభక్తుల కీనామము వాడబడుచున్నది. ఇంగ్లాండు నందెక్కువ వాడుక గలదు.

**కార్బన్** (Carbon)-ఇది Non-metalic elements లో ముఖ్యమైనదిగా చెప్పఁబడినది. దీనికి Symbol C అనియు, Atomic weight ౧౨ అనియు, Atomic number ౬ (ఆరు) అనియు చెప్పఁబడినది.

కార్బను గూర్చిన Chemistry కెమికల్ సైన్సులోని గొప్పది. కార్బన్ Mineral పదార్థములందు Carbonate రూపమునఁ భూమియొక్క ఉపరిభాగమున విస్తారముగ నుండెడిని మఱియు Animal and Vegetable matters నందు అన్నిటియందు నుండునది. గాలి యందు Carbonic acid gas రూపమున గలదు. సూర్యుని Atmosphere నందు అతివిస్తారముగ నుండునని చెప్పఁబడినది. వజ్రము కార్బన్ పదార్థమే. గ్రాఫైటు (Graphite) అనంబడిన పెన్సిలు లోహము కార్బన్ రూపమే, రాక్షస

బొగ్గు కార్బన్ రూపమే, పెట్రోలియం విస్తారముగ ఉపచరించు ఈపదార్థమే.

**కార్బన్ డయాక్సైడ్ గాలి** (Carbon Dioxide Gas) - మహావాయు పథము నందనేక గాలులు కలవు. అందు ఆక్సిజన్ అను గాలియు, కార్బన్ డయాక్సైడ్ గాలియు గూడ కలవు. మనుష్యులు మొదలగు ప్రాణులు ప్రాణవాయువును ఉపయోగించుకొని మిగిలిన గాలులను (ఊపిరి తీసిన గాలినుండి) వదలివేయు నటుల మొక్కలు చెట్లు మొదలగునవి గాలిని లోనికి పీల్చుకొనునని ఇదివరకు గనిపెట్టబడి నది. ఇందు విశేష మేమన, మొక్కలు గాలిని తినివేయునని తేలుచున్నది. అనగా గాలినో లేక గాలియందున్న కార్బన్ డయాక్సైడ్ గాలినో లోనికి పీల్చుకొని అందున్న కార్బను పదార్థమును తన శరీరమందలి పదార్థముగ జేసికొనుచు బలపడు చుండును. కాన మొక్కల శరీరము బలపడుచుండ నందు కార్బన్ పదార్థములు వృద్ధి యగుచున్నదని మన మెరుంగ వలయును.

ఆక్సిజను గాలియు, కార్బను కలిసిన సమ్మిశ్రమునకు కార్బన్ డయాక్సైడ్ అని పేరు. దీనిని విభజించి కార్బనును తా ముపయోగించు కొని ఆక్సిజన్ గాలిని వదలివేయు శక్తి మొక్కలకు గలదని తేలుచున్నది.

**కార్బన్ డియాక్సైడ్** (Carbon Dioxide) — దీనికి కార్బానిక్ ఏసిడ్ గాస్ (Carbonic acid gas) $[CO_2]$ అని యందురు. ఆంగ్లరసాయన వేత్తలు "Heavy colourless and odourless gas found in nature in free state, and also combined with alkali metals and other elements is a constituent of atmosphere and a product of respiration" అని దీనిని వివరించుచున్నారు. కార్బన్ డియాక్సైడు నిప్పునార్ప పనికివచ్చును. ఇది Combustion ను support చేయదు. పురాతనపు నూతులందు రాతిబొగ్గుగనుల గోతులందు Cellers యందు కూడను దానికి choke damp అని పేరు అది గట్టిపడునేని మంచువలె నగును. దానిని వాతావరణమున బహిరంగ పరచిన కొంతసేపు తగ్గిపోక నిలుచును. పుల్లలవలె గట్టిపడునటుల చేసినది Caustic అనబడి శస్త్రకార్యములం దుపయోగించును

**కార్బన్ బైసల్ఫైడ్** (Carbon bisulphide)— దీని నాంగ్లరసాయన వేత్తలు "Colourless liquid with an ethereal odour when pure, but generally with a dis-agreeable sulphurous smell" అని వివరించుచున్నారు. ఇంకను దీనిగూర్చి It is used for extraction of oils and fats, as a solvent for chloride of sulphur in rubber volcanising, to recover sulphur from mineral ores, and as a germicide, and also insecticide అని చెప్పబడియున్నది.

**కార్బన్ మొనాక్సైడ్** (Carbon monoxide) — దీనిని Carbonic oxide అనియు నందురు. ఆంగ్లరసాయనవేత్తలు దీనిని "Colourless odourless gas, and will burn with a pale blue flame" అని వివరించుచున్నారు. బొగ్గుల నొక కుంపటియందు కాల్చిన, కార్బన్ మొనాక్సైడ్ బయలుదేరును. ఇది చాల విషవాయువుగ జెప్పబడినది. గాలి ప్రసరించని గదులలో బొగ్గులకుంపటిం గాల్చిన మృతి సంభవించుటయం దబ్బుర మేమియు లేదు.

**కార్బొనరీ సంఘము** (Carbonari Association)-కార్బొనరియనగా ఇటలీభాషలందు బొగ్గులగాల్చునది యనియర్థము. తొలుత ఇటలీ యందునను, తర్వాత ఫ్రాంసుదేశమునను ఏర్పడి

చేరందిన రహస్యసంఘములు. ఇవి ౧౭ వ శతాబ్దపు ప్రారంభ కాలమున నుండెను. ఈరహస్య సంఘములు రాజకీయసంఘములై పనిచేసినవి.

**కార్బొనేట్సు** (Carbonates) — కార్బన్ డియాక్సైడ్ నకు బేసిక్ ఎలిమెంట్సుతో కూటమిసంభవించిన లవణము (Salts) గా నేర్పడును వాటిని కార్బొనేట్సు అనెదరు ఆంగ్ల రసాయన వేత్తలు "Carbonates are widely found in nature in distributed state అనియు, Calcium carbonate being met with as marble whiting and lime stone and in the fish shells అనియు, Double carbonate of magnesium and calcium is known as dolomite అనియు ఆంగ్ల రసాయన వేత్తలనుచున్నారు

**కార్బొరండమ్** (Carborundum) - ఆంగ్ల రసాయనవేత్తలు దీనిని సిలికన్ కార్బైడ్ అనియు, Silicide of Carbon అనియు నందురు ఇది Blue, Green, Brown, Crystals వలె దొరకునది సెంటిగ్రేడు థర్మామీటరు ౨,౨౨౦ డిగ్రీల వఱకు వేడికిం జెడదు ఆమ్లముల (Acids) వలన నష్టపోదు, వాతావరణమునకు మార్పుచెందదు చాలగట్టిగ నిలచునది

దీనిని కృత్రిమముగం జేయుదురని చెప్పంబడినది కార్బొరండమును కురువిందపుపొడికి (Corundum Powder) మారుగా నరగదీయు పనుల కుపయోగించు చున్నారు.

**కార్బొలిక్ ఏసిడ్** (Carbolic acid)- ఆంగ్ల రసాయన శాస్త్రవేత్తలు దీనిని Phenol అనియు, Body prepared by distillation of coal tar అనియు నందురు.

" When pure it is a colourless crystalline substance but it rapidly absorbs water from the air assuming a pinkish colour and eventually becomes a thick liquid" అని ఒకసుప్రసిద్ధ రసాయన వేత్త వ్రాసియున్నాండు.

ఇది పుండ్లు మాన్ప నుపయోగించు విషమై యున్నది.

**కార్శ్యరోగము**- ఆంగ్ల. Emaciation. శరీర రక్త మాంసములను క్షీణింపంజేసి యొంగింపం జేయు రోగము. దీనిని ఎండురోగమనియు నందురు

**కార్ముకములు** (కార్ముక బాణములు)- చాపములు, కోదండములు, ధనస్సులు అని త్రివిధము (ధనుర్విద్య చూడుండు). శ్రీరాముని కార్ముకము కోదండ మని చెప్పంబడినది.

**కార్ముకాసనము** - యోగశాస్త్రమున జెప్పంబడిన యాసనములలో నొకటి మతము నైయుకొని పద్మాసనమునం గూర్చుని (పద్మాసనము చూడుండు) కుడిచేత నెడమబొటనవ్రేలును ఎడమచేత కుడిబొటనవ్రేలును పట్టుకొనుట కార్ముకాసనము ఇందువలన శరీరమున నిస్త్రాణ తగ్గునని చెప్పంబడి నది.

**కార్శ్యభాసిత గోత్రము** — ముద్గల ఉపగణము చూడుండు.

**కార్యాచరణము (కాయికముకాని మానిసికము కాదు)** - ఈ మతమును ఆంగ్లదేశస్థులు ఆటోమేటిజమ్(Automatism) అనెదరు. కార్యాచరణము శరీరావయవములు కర్తగా చేయుంబడుంగాని మనస్సు (Brain) కాదని వారి యభిమతము. ఇంక తనంతటతానే ఏపనినైన చేయుటను Automation అని యెదరు.

శాస్త్రమున కాలప్రాణములారు విధములు. ౧. ప్రథమకాలము, ౨. ద్వితీయకాలము, ౩. తృతీయకాలము, ౪. చతుర్థకాలము, ౫. పంచమకాలము, ౬. షష్ఠమకాలము అని కాలప్రాణము సంగీతలయమొక్క దశప్రాణములలో నొకటి

**కాలపృష్ఠము** — కర్ణుని ధనస్సు, ధనుర్విద్య చూడుడు.

**కాలభైరవ సప్తమి** — మిత్రసప్తమి చూడుడు.

**కాలభైరవాష్టమి** – మార్గశిర శుద్ధ అష్టమినాడు కాలభైరవక్షేత్రములందు పూజలు, యాత్రలు నడచును (పండుగలు చూడుడు)

**కాలభైరవుడు** — కాశీపురమును రక్షించెడి ఒకఅధిదేవత.

**కాలమానము** (Measurement of Time) - జ్యోతిశ్శాస్త్రమును సారమగు కాల విభజనము. ఇది మనుష్యమానము సూదితో తామరాకుపై పొడుచు కాలము త్రుటి యనబడును. ఇది కడుస్వల్ప కాలము. ౧౦౦ త్రుటుల పరిమాణమగు కాలము ఒక లవ మనంబడును ౩౦ లవములు (౩,౦౦౦ త్రుటుల) కాలము ఒక నిమేషము (రెప్పపాటు కాలము), ౧౮ నిమేషములు (౫౪౦ లవములు) ఒక కాష్ఠ (పరిమితి) యనబడును రెండున్నర కాష్ఠల కాలము (౪౫ నిమిషములు) ఒక ప్రాణము ౬ ప్రాణములు (౨౭౦ నిమిషములు) ఒక విఘటికా కాలము ౨ విఘటికలు (౫౪౦ నిమిషములు) ఒక కల ౩౦ కలలు (౧౬౨౦ నిమిషములు లేక ౬౦ విఘటికలు) ఒక ఘటిక.

దీని నాంధ్రమున ఘడియ కాలమనియు, ఆంగ్లమున ౨౪ నిమిషములనియు నందురు. ౬౦ ఘటికలు (లేక ఆంగ్లమానమున ౨౪ గంటలు) ఒక దినమగును. ౧౫ దినములు (చాంద్రమానమున శుద్ధపాడ్యమి మొదలు పౌర్ణమి అంతమునకుం గాని, కృష్ణపాడ్యమి మొదలు అమావాస్య అంతమునకుం గాని) ఒకపక్ష మనంబడును. ౨ పక్షములు ఒక మాస మనంబడును (ఇది చాంద్రమానపు లెక్క). ౨ మాసములు ఒకఋతువు (సంవత్సరమునకు ఋతువులు ఆరు). మూడు ఋతువులు (లేక ఆరు మాసములు) ఒక అయనము ౨ అయనములు (లేక ౬ మాసములు ఉత్తరాయణమును, ౬ మాసములు దక్షిణాయనమును కలిసి మొత్తము పండ్రెండు మాసములు) ఒక సంవత్సరము ౧౦౦ సంవత్సరము లొక శక మనంబడును.

కృతయుగము ౧౭ ౨౮,౦౦౦ సంవత్సరములు పరిమితి గలది. త్రేతాయుగము ౧౨,౯౬,౦౦౦ సంవత్సరములు పరిమితికలది. ద్వాపరయుగము ౮,౬౪,౦౦౦ సంవత్సరములు పరిమితికలది. కలియుగము ౪,౩౨,౦౦౦ సంవత్సరములు పరిమితి కలది మహాయుగము ౪౩,౨౦,౦౦౦ (నాల్గు యుగములు కలసి ఒక మహాయుగమగును) డెబ్బదియొక్క మహాయుగములు ౩౦,౬౭,౨౦,౦౦౦ సంవత్సరము లొకమన్వంతరమగును. ఇట్టిమన్వంతరములుపదునాలుగయ్యేనేని అనగా ౪,౩౨,౦౦,౦౦,౦౦౦ సంవత్సరము లొక కల్పమగును (విరోపాకాలమానము చూడుడు)

కాలవిభజనము, కాల విధానము కాలము, పగోపా దేశమున కాలమానము చూడుడు.

**కాలము**— చంద్రుడు భూమింజుట్టియు, భూమి సూర్యునిం జుట్టియు తిరుగుచుంట సుప్రసిద్ధమే దీనినే ఆధారముగం జైకొని మధ్య మధ్య హద్దులుగ నేర్పఱచి, సంవత్సరములుగను, అయనములుగను, మాసములుగను, పక్షములుగను, వారములుగను, తిథులుగను, నక్షత్రములుగను, యోగ, కరణములుగను భరత

దేశపు జ్యోతిషశాస్త్రము ఏర్పఱచి విధించి యున్నది. ఈవిధివిధానము లెంతవఱకు నైసర్గికముగ నిజమగు పునాదింగల్గినవియో లేక కేవల మనుష్యనిర్మాణములైన యేర్పాటులోనివో విచారింతుము

పాశ్చాత్య జ్యోతిషవేత్తలు వారిమతప్రవక్త యొక్క (యేసుక్రీస్తుప్రభువు) కాలమును పాటించుచు క్రీస్తుపూర్వకాలపు వత్సరములుగను (B C) క్రీస్తు వెనుకకాలపు వత్సరములుగను (A D.) ఏర్పఱచుకొనిరి. ఇంక మాసములు వేర్వేఱు దేవతలపేళ్లను, చక్రవర్తులపేళ్లను, తత్కాలపు భూపతినేతల పేళ్లను వాడుచున్నారు. వారి పన్రెండు మాసములలో నేమాసమునకైనను సూర్యుని రాశులతోగాని భూచలనముతోగాని సంబంధము లేదు. ఇంక వారములు లేక వారముల పేర్లతో సంబంధమున్నట్లుండినను అంగా ఆదివారము (రవివారము) ను పాశ్చాత్యులు Sunday అను చున్నారు. ఇంకను శనివారమును వారు Saturday అనెదరు. ఇట్లు ఇదొకటి సంబంధము స్ఫురించెడిని. తేదీలు (వారి కాలభాగములు) ఒకటి, రెండు మూడు మొదలైనవి సంఖ్యాప్రసిద్ధములై కొన్ని నెలలకు ముప్పదియు, కొన్ని నెలలకు ముప్పదియొకటియు, ఒక నెలకు ఇరువదియెనిమిది గను, ఆ నెలకే నాల్గవయేట ఇరువదితొమ్మిదిగను ఏర్పఱచుకొనిరి. ఇంక నీ సంఖ్యాగోధికములను దినము ప్రజల సౌఖ్యముకొఱకుగాను రాత్రి పన్రెండు గంటలకు ప్రారంభమై తిరుగ సర్ధరాత్రివఱకు యిరువదినాల్గు గంటలుగ నిర్ణయింపఁ బడినది. ఆ గంటలైనను సూర్యోదయాదిగనో, చంద్రోదయాదిగనో లేక వేఱొకవిధమైనవో లెక్కింపఁబడక అందఱు నిద్రించుచుండు నర్ధరాత్రము దినము మారిన వ్యాపారములకు చిక్కు కల్గునుగాన నట్లు ప్రారంభము నేర్పఱచి నడపు చుండిరి. ఇందువలన పాశ్చాత్య జ్యోతిష విధానము నిర్లక్ష్యముగ నీ విధులం దతిక్రమింపఁ బడినదని తెలుచున్నది. కాన, వారికి ప్రజానుకూల విధానమునందు తప్ప శాస్త్రవిధియందు ఆచరణ లేదని మనమెఱింగి వారి విధానము నింతటితో వదలి భరతదేశపు పద్ధతిం బరిశీలింతము.

భరతదేశమున వేర్వేఱు భాగములందు వేర్వేఱుశకములు పాటింపఁబడుచున్నవి. ఏశకము మీఁదనైనను ప్రభవాదిసంవత్సరము లరువది చెప్పఁబడినవి. సంవత్సరమునందు ఉత్తరాయణ మనియు, దక్షిణాయనమనియు రెండయనములు కలవు. అనగా భూమధ్యరేఖ (Equator) కు సూర్యుఁ డుత్తరదిశగా నుండునట్టుల భూమి తిరుగుకాల ముత్తరాయణముగను, భూమధ్య రేఖకు సూర్యుఁడు దక్షిణదిశగా నుండునట్టుల భూమి తిరుగుకాలము దక్షిణాయనముగను చెప్పఁబడినది.

చంద్రుని సంచారమును చాంద్రమాసముచే నిర్ణయింపఁబడు మాసములు చైత్ర వైశాఖాది మాసములు పన్రెండును. చంద్రోదయముతో ప్రారంభమయి తిరుగ చంద్రోదయమువఱకు నొక మాసముగ గణింపఁబడుచుండును. ఒక్కొక సంవత్సరమున పదమూఁడు చంద్రోదయములు, పదమూఁడమావాస్యలు సంభవించును. ఆ వత్సరమున నధికమాసము వచ్చుచుండును. చంద్రుఁడు కళాపూర్ణుఁడై మహావృద్ధినొందుచుండు దినము పౌర్ణమి. చాంద్రమాన మాసమున ప్రధానమైనదైన యానాఁడే నక్షత్రము సంభవించునో యా మాసమున కాపేరే యుంచఁబడియున్నది, అనగా చిత్రానక్షత్రయుక్త పౌర్ణమిగల మాసమునకుఁ జైత్రమనియు, విశాఖానక్షత్ర యుక్త పౌర్ణమిగల మాసమునకు వైశాఖమనియు, జ్యేష్ఠానక్షత్ర యుక్త పౌర్ణమిగల మాసమునకుం జ్యేష్ఠమనియు ఇట్లు అన్ని నెలలు నక్షత్రనామముల నందియున్నవి. ఈసందర్భమున నింకొక్క విశేషము

వివరింపవలయును. ప్రతిసంవత్సరమునను ప్రథమ దినమగు చైత్రశుద్ధ పాడ్యమి దినమున, ప్రథమ నక్షత్రమగు అశ్వనీనక్షత్రము సంభవమగుచునే యుండును. ఇందువలన నక్షత్రములతో సంవత్సరములకు నెలలకుంగల సంబంధము తెలియుచున్నది. అనేకనక్షత్రములన, భూమింజుట్టి చంద్రుండు తిరుగు మార్గము నిరువదియేడు భాగములుగ విభజించి మొదటిభాగమున కశ్వనీనక్షత్రమనియు, రెండవ భాగమునకు భరణీనక్షత్రమనియు, ఇట్లు ఇరువది యేడు భాగములు ఇరువదియేడు నక్షత్రములుగ పేర్కొనబడినవి. ఆ దేభాగమున చంద్రుండున్నో నాడా నక్షత్రమని చెప్పంబడినది. శుద్ధ పాడ్యమి మొదలు పౌర్ణమివఱకు చంద్ర కళలభివృద్ధి నందుచుండు పదునేనుదినములును శుక్ల పక్షము లేక శుద్ధపక్షమనియు, బహుళ పాడ్యమి మొదలు అమావాస్యవఱకు చంద్ర కళలు క్షీణించుచుండు పదునేనుదినములును కృష్ణపక్షము లేక బహుళపక్షమనియు, ప్రతి నెలను రెండుపక్షములుగ పాటించుచున్నారు. ఇంతవఱకు భరతదేశపు పద్ధతి సూర్య చంద్రుల గమనములతో సంబంధముకల శాస్త్రవిధిగాని మనుష్యకల్పిత విధానముకాదని తేలుచున్నది. (కాలవిభజనము చూడుము, కాలవిధానము చూడుము, కాలమానము చూడుము, లన్యోన్యానుబంధ సంబంధము చూడుము).

**కాలముల మార్పులు** (Seasons). సీజన్సు చూడుము.

**కాలవిజ్ఞానశాస్త్రము** (మేఘమాలికాశాస్త్రము, రెట్టమతము) — రెట్టమతము మేఘమాలికాశాస్త్రమనియు వాడంబడెడిని. ఇది భూమిని సేద్యమొనర్చు రైతులకు లేక వ్యవసాయవృత్తి గలవారికైన శాస్త్రము. ఇందు వర్షములు, పంటపైరులు, కాలముయొక్క సుభిక్షదుర్భిక్షములు వివరింపంబడుచు వీటి నెఱుంగుజ్ఞానము నిరువది విధములుగ విభజించి భాగములుగ నొనర్చిరి. ఇవి యిరువది పరీక్షలని చెప్పంబడినవి. ఇరువది విధముల పరీక్షల లక్షణము లిందు వివరింపబడును.

రెట్టండను విజ్ఞాని ఈశాస్త్రమునకుం గర్త. కాన, నీమతమునకు రెట్టమతమని పేరు వాడుక యయ్యెను. అతం డీశాస్త్రమును తన విజ్ఞానముచే వ్రాసి యుండును. ఈరెట్టనికే నారాయణభట్టని నామమని కొందఱు తలంచుచున్నారు. మఱికొందఱు నారాయణభట్టారకుండు రెట్టనికి పూర్వుండనియు, కాలవిజ్ఞానియనియు దలంచుచున్నారు. ఏదియేమైనను రెట్టండు దైవజ్ఞుండును, కాలవిజ్ఞానియు ననుటకు సందేహము లేదు. మఱియు నీతండు నారాయణభట్టు వేఱుపురుషుండై యుండెనేని యితనికి నెఱియుండడు. ఈతండు పొల్లింపక గర్గాచార్య హరిభట్టు, ధన్వ, శ్రీపతి, వరాహమిహిరాచార్య మతములందలి కాలవిజ్ఞానమును చక్కగనుగ్రహించి మేఘమాలికాశాస్త్రమర్యాదమేరకీశాస్త్రము రచించెనని కానంబడుచున్నది.

రెట్టమతము నాపేరనే అయ్యలభాస్కర కవులు పద్యరూపమున నాంధ్రీకరించి తిమ్మరాజు తనూభవుండగు కొండ్రాజు వేంకటరాజు నృపతి కంకితమొనర్చిరి. దానిని రెట్టమతమని యిక్కాలమున వాడుచున్నారు. రెట్టమతమును కాల విజ్ఞానశాస్త్రమనియు నందురు. శాస్త్రమున వింశతిపరీక్షలు చెప్పంబడినవి. ఈవింశతిపరీక్షలలో కొన్ని కాలవిజ్ఞానము నెఱుంగం జేయునవియు, కొన్ని జ్యోతిశ్శాస్త్రమునందువలె గ్రహగతుల నుండి కాలవిజ్ఞానము దెల్పునవిగను, కొన్ని నక్షత్ర తిథ్యాదులందలి చిహ్నములనుండి వర్షాదులం దెల్పునవిగ నున్నవి.

౧ పుష్పఫలపరీక్ష, ౨ గోప్రజార్చనపరీక్ష, ౩. దూతలక్షణపరీక్ష, ౪. పక్షిశకునపరీక్ష, ౫. గర్భఋతులక్షణపరీక్ష, ౬. మేఘలక్షణపరీక్ష, ౭ విద్యుల్లక్షణపరీక్ష, ౮ గర్జలక్షణపరీక్ష ౯. ఇంద్రచాపలక్షణపరీక్ష, ౧౦. పరివేషలక్షణపరీక్ష, ౧౧ ప్రతిసూర్యాతప వాయులక్షణపరీక్ష, ౧౨ వాయుపరీక్ష లేక గ్రహయుద్ధలక్షణ పరీక్ష, ౧౩. బీజావాపనపరీక్ష, ౧౪ అర్ఘలక్షణపరీక్ష, ౧౫. గ్రహణలక్షణపరీక్ష, ౧౬. ఆకస్మికలక్షణపరీక్ష, ౧౭. గ్రహకూట లక్షణ పరీక్ష, ౧౮ గ్రహబల లక్షణపరీక్ష, ౧౯ సంవత్సరఫలపరీక్ష, ౨౦ సంవత్సరాది ప్రతిఫలపరీక్ష యనునవి పరీక్షలు. వీనిగూర్చి వేర్వేఱు తాం లాగు గాననగును

**కాలవిత్ గోత్రము** -- గర్గఉప గణము చూడుడు

**కాలవిధానములు** — భూమికి రెండు విధములగు కదలికలు గలవు. ఒకటి తనకుతానే గిరగిర తిరుగుటయు, రెండవది అట్లుతిరుగుచు సూర్యునిచుట్టు (ప్రదక్షిణముగ) తిరిగివచ్చుటయునై యున్నది. ఒకసారి తనంతటతానే తిరుగుట కిరువదినాల్గుగంటలకాలము. లేక అరువదిఘడియలకాలము పట్టునుగాన దీనికొక దినమందురు.

ఇట్లు తిరుగుతరి సూర్యునకెదురుగ తిరుగుచుండు భూభాగమున పగలనియు, సూర్యునుండి వెనుక మువ్వలిభాగమునందుండు భూభాగమున రాత్రియనియు దలంపబడుచుండును. ఇటుల పగలు రాత్రియుం గలసి అరువదిఘడియలు, లేక మున్నూటఅరువది విఘడియలు కాలమగును. వీటినే మున్నూటఅరువదిభాగము లని పేర్కొని యున్నారు. ఆంగ్లపండితులు వీనిని డిగ్రీ లాందురు.

ఇట్లు తాఁ దిరుగుచో భూమి చంద్రునితో సంబంధమున సూర్యునిం జుట్టు వచ్చు కాలమున పదునొకండో, లేక పండ్రెండో, లేక పదమూడో పర్యాయములుగ చంద్రునకు పూర్తిగ రాత్రులందు ఎదురుగనుండుట సంభవించుతరి నాటికి లను పౌర్ణములనియు పౌర్ణమినాటి నక్షత్రములనుండియే మాసములకుం బేర్లు కల్గెను. రాత్రులందు చంద్రునికి విముఖమై పగలే చంద్రుని కెదురుగ తిరుగు దినములకు అమావాస్య లనియందురు. అమావాస్యకెదురుండి తిరుగ నమావాస్యకడవఱ కొక మాసముగ నెంతురు. ఇట్టి మాసములు పదునొకండు సంభవించిన వత్సరమునకు నష్టమాససంవత్సర మనియు, పండ్రెండు సంభవించిన వత్సరమునకు సమమాససంవత్సర మనియు, పదమూడు సంభవించిన వత్సరమునకు అధికమాససంవత్సర మనియుం బేర్లు.

భూమి సూర్యునిం జుట్టివచ్చుతరి నడుచు సంవత్సరమున వంకరగ తిరుగవలయునుగాన వృత్తాకారమున సూర్యునకెదురుగ (అనగా వంకరలు లేని సమీపమున) కొంతకాలమును, ప్రక్కలకుం దిరిగి కొంతకాలమును తిరుగును. సూర్యునకెదురుగనుండు కాలమున కిరణములు వంకరలు లేక నేరుగ భూమిపైఁ బడునుగాన నెక్కువ వేడిగనుండునది వేసవికాల మనఁ బరగెడిని.

ఇకఁ బ్రక్కలకుం దిరిగి తిన్నగ కిరణములు పడనికాలములు వర్షకాల మనియు, శీతకాల మనియు పేర్లం బరగుచుండును.

అందు సూర్యకిరణములు ప్రక్కవాటుగను దూరముగను భూమిపైఁ బడవలయుంగాన నంత వేడిగానుండవు. కొన్నిగాలులమూలమున నాకసమున శీతల మెక్కువయగుట మేఘము లుదకబిందువులై వర్షములుగ భూమిపైఁ బడగానే వర్షకాల మనం బరగెడిని.

ఇవి కాలములు మూడును గల్గు విధానము- (కాలము, కాలమానము, అన్యోన్యానుబంధ సంబంధము చూడుడు).

**కాలవిభజనము** (Time and its divisions)- సూర్యోదయ సూర్యాస్తమయములనుండి కాలమును విభజించి లెక్కించుపద్ధతి జగమంతటను వ్యాపించియున్నది. ఎస్ట్రానమీ శాస్త్రమున అపరాహ్ణము మొదలపరాహ్ణము వఱకు (Noon to Noon) ఒక దినమునిపరిగణింప బడినది. Appearing on Meridian మొదలు తిరుగ మెరిడియన్ చేరుటకైన దినమును Sidereal time అనియెదరు. దీనియందు ౨౩ గంటల ౫౬ నిమిషములగును. ఇంక సూర్యుడొకే మార్గమున తిరుగుటలేదు గాన Noon to noon దినమునందు దేశకాలభేదము కలుగుచు ఇంచుక ముందుగనైనను వెనుకగనైనను కాకుండును. ఈ భేదమునకు Equation of time అనియెదరు. దీనిని English almanacks యందు ప్రకటించుచుందురు. సంవత్సరమునందు రెట్టిభేదముండునని కాలము నాల్గుసార్లు సంభవించుచుండును అనగా నప్పుడు Equation of time సున్నయై యుండు నిర్ధారణము. సూర్యుడొక ఈక్వినాక్సు నుండి తిరుగ నా ఈక్వినాక్సునకు చేరుటకొక సంవత్సరమగును. దీనిని Tropical year అనియెదరు. నక్షత్రములు సూర్యునిపై పురోగమించు ఈక్వినాక్సులు తిరుగునుగాన నక్షత్రకాలమునకును సూర్యుని గమనకాలమునకు భేదమేర్పడి యుండెడిని. దీనికి Precession of Equinoxes అనియెదరు.

సౌరమాన సంవత్సర (Solar year) మునకు 3౬౫ దినముల, ౫ గంటల, ౪౮ నిమిషములపై చిలుకు కాలముండెడిని. తొల్లింటి కాలమున నైరోపా దేశములందు ప్రచారము నందుండిన Civil year నందు 3౬౫ దినములు మాత్రము వాడబడుచుండి ఏటేట నొక పాతిక దినము మించుచు తప్పుగుచు నాలుగు వందల సంవత్సరములలో మూడు నెలలధికమై వెర్నల్ ఈక్వినాక్సు జూను నెలయందు సంభవింప నయ్యెను. ఇంక తొమ్మిది వందల సంవత్సరములలో క్రిస్టమసు పండుగ వేసవియందునను జూలై నెల చలికాలము లోనికగుటయు సంభవించిన ట్లగుపడెను.

జూలియస్ సీజరుగారి కాలమున ఈతప్పు దిద్దుటకొక శాసనము చేయబడి దాని ప్రకారము సంవత్సరమున 3౬౫ దినముల, ౬ గంటలు విధింపబడియెను. ప్రతి నాల్గవ సంవత్సరమునకు 3౬౬ దినము లుండునట్లును, ఆసంవత్సరము ఫిబ్రవరి నెల కిరువది తొమ్మిది దినము లుండునట్లును, దానికి లీప్ ఇయర్ అని పేరుండునట్లును విధింపబడెను. అట్టి పంచాంగ పత్రమును Julian Calendar అనుచుండిరి.

కాని సంవత్సరమునకు 3౬౫ దినముల ఆరు గంటలు పూర్తిగా లేనందున ఇదియుం దప్పగనే కాలము గడచుచుండి క్రీ. శ. ౧౫౮౨ ఈక్వినాక్సు మార్చి ౨౧ తేదీని సంభవింపవలసియుండ ౧౧వ తేదీకే సిద్ధమయ్యెను. దీనిని Pope Grigory గారు కన్పెట్టి తప్పును గద్దింప ప్రయత్నించి క్రీ. శ. ౧౫౮౨ అక్టోబరు ౫వ తేదీని ౧౫వ తేదీగా పరిగణించి పదిరోజులు కల్పించి ఈక్వినాక్సును ౨౧ మార్చి నెలకు దిరుగ దెచ్చిరి.

దీనిని గ్రిగోరియన్ కేలండరని పోపుగారి పేర వాడుచు ప్రజలీవిధానము ననుసరింప ప్రధానమునియు, తొల్లింటి జూలియన్ కేలండరును పూర్వపు విధానమనియు (Old style) వాడుచుండిరి. ఇట్టి తప్పు మరల కలుగకుండునట్లు ని గ్రిగోరియను పద్ధతి కూడ వదలక మూడేసి శతకముల సంవత్సరములు లీపు గాక నల్గవశతాబ్దవత్సరము (అనగా ౧౦౦, ౨౦౦, ౩౦౦ లీపు గాక ౪౦౦వ సంవత్సరము) లీపగు నట్లేర్పరుపబడియెను. కాననే గత ౧౯౦౦ సంవత్సరము లీపుకాదని ప్రభుత్వములు ప్రకటించెను. ఇట్లయ్యు నింక నాల్గు వేలసంవత్సరముల కొకదినము తేడావచ్చునని

తలంపఁబడుచున్నది. (కాలవిధానము చూడుఁడు. కాలవిభజన చూడుఁడు. కాలము చూడుఁడు).

**కాలాకంబల్వాలా**— వీరు బైరాగులు. నల్లకంబళీలను కప్పుకొనుటంజేసి వీరి కీపేరు వచ్చెను హృషీకేశమునందు ఈబైరాగుల నేత యగునొక మహాంతుగలఁడు ఆయనవారిద్వారము కడనున్న ఒక గొప్ప మఠమున వసించుచుండును. హిమాలయములపైనున్న యాత్రామార్గములందు పెక్కుతావుల వీరికి మఠములుండును, శిష్యులును గలరు వీరు యాత్రస్థుల నాదరించి తమ మఠమునందు విడిదిచేయనిచ్చెదరు హృషీకేశ మఠమునందలి పెద్దమహాంతుగారి వద్దనుండి అంగీకారపత్రమునుగైకొని పగిదచో వారిపోవుచున్నను వారి మఠములందాదరణము, సహాయము లభించుటయేగాక వీరు మార్గములం జూపుటకు కూడ నేతెంచెదరు

**కాలాంజరపురము** — చేది లేక అనూప (ఇప్పటి బుందేల్ఖండు) దేశములోనిది ఇచట ప్రసిద్ధమైన కాలాంజరపర్వతము కలదు (ఋషుల పంచజన్మములు చూడుఁడు, అనూప దేశము చూడుఁడు).

**కాలాంజరము** — ఇది ఒకపర్వతము. కాలాంజర క్షేత్రము సప్తోత్కలములలో నొకటిగఁ జెప్పఁబడినది. అసగా జలప్రశయమునకగు ఉదకము వీటినుండి యుద్భవించునట.

సంయుక్తరాష్ట్రములలోని బాందాజిల్లాయందు బదౌశీ తహశ్శీలుకుం జేరి, బాందాపురమునుండి దక్షిణముగా ముప్పదిమూడు మైళ్ల దూరమున బుందెల్ఖండ్ నందున్న తావు మహాభారతము, శివపురాణములందు వీటిప్రశంసలు కలవు. ఇచటి కోటితీర్థకుండస్నానఫలము సహస్ర గోదానతుల్యమని మహాభారతమున చెప్పఁబడినది. ఇది గొప్ప యాత్రాస్థలమై యున్నది. శ్రీరాముండును సీతాదేవియు నిట కొంతకాలము వసించిరట. సీతాదేవి కూర్చుండు శిలాస్థానమును నేటికిని జూపుచున్నారు.

ఇచటి కోటితీర్థమును కనోరుతీర్థ మనియెదరు. మృగధర దేవస్థానము, నీలకంఠేశ్వర దేవస్థానము, కొన్ని పవిత్రగుహాలు దర్శనీయములై యున్నవి. సప్తమహర్షు లొకతని శాపబద్ధులై మొదటిజన్మమున నేడుగురు వ్యాధిపీడితు లైరట అది దశార్ణ్య మని చెప్పఁబడినది. రెండవజన్మమున నేడుమృగములు (లేళ్ళు) గ నీకాలాంజరమున జన్మించిరట. అతావుననే ఇప్పటి మృగధరదేవస్థాన మున్నదట. పిదప మూడవజన్మమున సరద్వీపమున నేడుచక్రవాకములుగ జన్మించియుండిరట నాల్గవజన్మమున మానససరోవరమునం దేడు హంసలై జన్మించిరట పిమ్మట నైదవ జన్మమున నేడ్గురు విప్రులై కురుక్షేత్రమున జన్మించి వేదపారగతులై శాపవిముక్తిం గాంచి మహర్షులైరట. ఈజన్మము లన్నియు పితృవ్యనల యందు పరమేశ్వరప్రీతి యగునటుల శ్లోకరూపమున పఠించుచున్నారు. ఇది మృగధరదేవస్థానము. (కాలాంజరపురము, ఋషులపంచజన్మములు చూడుఁడు.)

**కాలాజ్వరము లేక క్రాలాఅజార్ రోగము** — ఈ రోగ మాదిని నల్లులవలన వ్యాపించునని తలంచిరికాని ఇటీవలి పరిశీలనలు Sand Fly అనంబడు దోమలకన్న చిన్నవియగు నొక జాతి ఈఁగలవలన వ్యాపించునని తెల్పినవి. ఈ ఈఁగల తల, ఉదరము తెల్లగను, మొండెము నల్లగను, ప్రక్కలు పసుపుపచ్చగను, కాళ్ల చివర భాగములు వెండివలె తెల్లగ మెఱయునవిగ నుండును. ఆడు ఈఁగలు మనుష్యులం గరచి రక్తపాన మొనర్చుటతో ఈ సూక్ష్మ జీవులను శరీరమునం బ్రవేశపెట్టును. ఇవి పల్లపుభూము

లంను, మన్యముకడలంకఁ గానవచ్చెడిని. వీటికి గ్రుడ్లను బెట్టుటకు వర్షకాలమును, విజృంభించుటకు వేసవికాలమును అనుకూలములు. పగటియం దివి నీడగలతావులందు దాగియుండి రాత్రులందు విజృంభించి తిరుగుచు కరచుచుండును. ఇవి కుట్టిన చోట్ల మొత్తుగా నెగురుజాలకుండును. జ్వరముతగిలి రక్తముక్షీణించి ప్లీహము, కార్జము వృద్ధియై తగు జాగ్రతఁ గొనకున్న మృతికిం గారణమగునంకుగు. ఈ ఈఁగల నాంగ్లమున Sand flies అనెదరు వీటియం దనేకజాతు లున్నను ఒక్కజాతికి మాత్రమే ఈ సూక్ష్మజీవులు పట్టు దోషముండునట.

**క్రాలానలుఁడు** — ఆత్రిసంతతిం చంద్రవంశపు క్షత్రియుండు. తండ్రిపేరు సభానరుండు. పుత్రునిపేరు సృంజయుండు.

**క్రాలాయనిగోత్రము** — ఆత్రేయ గణము చూడుడు

**క్రాలాయన గోత్రము** — కుశిక గణము చూడుఁడు. గర్గ ఉపగణము చూడుఁడు.

**కాలాయ గోత్రము** - వశిష్టగణము చూడుఁడు.

**క్రాలాశి గోత్రము** - గవిష్టరగణము చూడుఁడు

**క్రాలా హజార** — కాలాజ్వరము చూడుఁడు.

**క్రాలికి వేస్తే మెడకు మెడకు వేస్తే క్రాలికి** — ఆంధ్రలోకోక్తి

**క్రాలి గోత్రము** — కథ లేక కథ్య గణము చూడుడు.

**క్రాలిజోళ్ల మడమలు** — భారత దేశమున తొల్లింటికాలమున చేయఁబడుచుండిన వలు తెలుఁగుల పాదరక్షలకు మడమలు పాదము క్రిందిభాగమున కనుకూలించునట్లు సమముగఁ జేయఁబడుచుండినవి చెప్పులు పైజారులు మొదలగునవి అట్లునేఁటికినియున్నవి ఇంక పాంకోళ్లు ఎచ్చుండినను లేకుండినను మడమపాదముల కొక్క ఎత్తే ఉంచఁబడుచుండినవి. మడమకడ ఎత్తు ఎక్కువనిడు నాచారమే లేదు. తొల్లి ఐరోపా దేశములందితరులలో నెత్తుగనుండి మహోన్నతుని వలెను, గొప్పవానివలెను అగుపడుటకు కాలి జోడుయొక్క మడమలను చాలనెత్తుగ నుంచెడి వారట పురాతనపు విగ్రహములు పటములలో నివెత్తు విపరీతముగఁ గానవచ్చెడిని. ఇది గొప్ప వారిపద్ధతి. సామాన్యులు మడముంబలేని పెన్నిస్ షూస్ వంటివి తొడుగుచుండిరట. రానురాను ఇవి తగ్గి ఇప్పుడున్నరీతిని రెండును సమమయ్యెనట. ఇప్పటికాలపు జోడునందలి మడమల బాట యందలి లోపములవలనఁ గల్గిన దెబ్బలనాపు కొను పరికరము (Shock absorber) గా మాత్రమున్నది. ఐనను స్త్రీల (దొరసానుల) జోడులకు కాలిమడమలు ఇంకను కొంచె మెత్తుగా నుండుట గాననగును. ఇది గమన సౌందర్యము నతిశయింపఁ జేయునని తలంతురు

**క్రాలిడోఫోన్ (Kaleidophone)**— జన్మను భాషాపదజన్యము ధ్వనియొక్క అలలు (Vibration) లేక తరంగముల విధాన పరిణామములం దెల్పు పరికరయంత్రము.

**క్రాలితో చూపితే వేలితో చెయ్యి వలయును** — ఆంధ్రలోకోక్తి.

**క్రాలిని జుట్టుకున్న పాము కరవక మానునా?** — ఆంధ్రలోకోక్తి.

**కాల్సియము** — క్షారలవణములను నీటంగరగించి బలమగు విద్యుత్ప్రవాహమునందు నరపి భేదించుటచే బయల్పడిన ధాతువులలో నొకటి. దీని పరిశీలకుఁడు సర్, హంఫ్రీ డేవీ పండి

తుఁడు (హాంఫ్రీ డేవీ పరిశీలకుఁడు చూడుఁడు). కాల్సియము అగ్నిసంపర్కమున నెఱ్ఱగ కాలును. సున్నమునందిది కలదనుచున్నారు.

**కాలీకాలని మొరడు** — ఆంధ్ర లోకోక్తి.

**కాలీడోస్కోప్** (Kaleidoscope)— మూడు పొడగాటి యద్దములమర్పఁబడిన ఒక గొట్టము. ఇందు అడుగునగల వివిధ వన్నెల శకలముల ఆకారములం ప్రతిఫలించి ప్రదర్శించెడిని. ఇది చూచు వినోదార్థపరికరము. క్రీ. శ. ౧౭౮౧-౧౮౬౮ మధ్యన సర్, డేవిడ్ బ్రూస్టరు అను నాతఁడు ఊహించి కూర్చెను. ఇవి తొల్లింట మూడు నెలలలో మూడు లక్షలు అమ్మఁబడినవియైనట.

**కాలీఫ్ హరూన్ అల్రషీద్ చక్రవర్తి** — ఈయన క్రీ. శ. ౭౮౬ ౮౦౯ బాగ్దాదు నగరము రాజధానిగ రాజ్యపాలన మొనర్చిన (మహమ్మదుగారి సంతతి) వాఁడు ఈయన రాయి అను గ్రామమున క్రీ. శ. ౭౬౩ మార్చి నెలను జన్మించెననియు, తండ్రిపేరు మహమ్మద్ మహాదీ యనియు, ఈయన పదునెన్మిదవ యేట తండ్రిచే యుద్ధములందు పంపఁబడినవాఁడనియు, ఇస్తాంబూల్నగరపుజోస్పరస్ చే ౭౮౬ సంవత్సరమున నట చక్రవర్తినిగా నుండిన ఐరీనీ రాజ్ఞిపై కప్పము విధించినవాఁడనియు, ౭౮౬ సంవత్సరమున తన ఇరువదిమూడవ యేటనే అబ్బాసిడీ రాజవంశపు ఐదవ కాలీఫుగా తన జ్యేష్ఠసోదరునకుం బిదప సింహాసనమునకు వచ్చెననియు, గ్రీకులతో పలుయుద్ధములొనర్చి జయమందుచుండెననియు తెలియుచున్నది.

ఈయన పాలనము సౌఖ్యవంతము గాన పెక్కండ్రు నియుక్తసమయమున కాంక్షించుచుండెడివి. విద్యలను, కళలను వ్యాపింపఁజేసినవాఁడని పేరుకలదు. ఖురాసాన్ సీమలందు తిరుగుబాటు కలుగ, దానినడంపనేగుచు మార్గమున టూస్ అను గ్రామపరిసరముల తన విడిదియందు ౮౦౯ మార్చి నెలలో మృతినందెనని చెప్పఁబడినది. అరేబియన్ నైట్సు కథలం దీయనం గూర్చి వివరింపఁబడియుండుట గాన నయ్యెడిని

**కాలు గాలిన పిల్లివలె తిరిగేవాఁడు** — ఆంధ్రలోకోక్తి

**కాలుజారితే తీసుకోవచ్చుగాని నోరుజారితే తీసుకోలేము** — ఆంధ్ర లోకోక్తి

**కాలుపట్టుకొని లాగితే చూరు పట్టుకొని వ్రేలాడేవాఁడు** — ఆంధ్ర లోకోక్తి

**కాలువలు- పంట కాల్వలు, ప్రయాణపు కాల్వలు** — నీటికాల్వలు- పంట కాలువ లనియు, ప్రయాణముల కాల్వ లనియు ద్వివిధము. పంటలకుపచరించుకాలువలు



పొలములకు నీరివ్వవలసినవేగాన నీటిని పంపక మొదర్చుట కర్తవ్యముకునటుల పెక్కుశాఖలుగఁ ద్రవ్వఁబడునుగాని వెడల్పు, లోతులం బాటింపను. తక్కిన ప్రయాణపుకాలువలయందు ప్రయాణస్థులం గొనిపోవు రహదారీపడవలును, సరకులంగొనిపోవు తొట్టెపడవలును నడచుటకుఁ దగిన రీతిని వాటిం ద్రవ్వవలసియుండును.

సర్వసాధారణముగ కాలువలు అడుగు వెడలుపు అందునడచు పడవలవెడలుపునకు రెట్టింపుపై మూడవవంతు ($2\frac{1}{3}$) ఉండునటులను, ప్రక్కలు నలువదిదిగ్రీలకుం గల ఏటవాలు వెలుపలి



భాగముల కుండునటులను, అందు నడచు పడవ లందు పూర్తి బరువు వైచిన, నీటిలో ఎంత మున్గునో అంతయుండగాక పైగా ముప్పాతిక లోతధికముగ నుండునటులును త్రవ్వుట పద్ధతిగ నున్నది. త్రవ్వినమట్టిని కాలువ కిరుదెసలందు పడి లేక, పంద్రెండడుగుల దూరము నుండియు నిరుదెసలను గట్లుగపోసి, గట్టు కిరుదెసలను పనస, కొబ్బరి, మామిడి మొదలగు వృక్షములను నాటుదురు. తఱుచుగ మధ్యనుండు ప్రధానమగుకాలువ (Main canal) ఎక్కువ వెడలుపుగలదిగను, తక్కినవి దానికి దగ్గినవి గను త్రవ్వంబడుచుండును. ఐరోపాదేశములందలి కాలువలు వాటివాటి అవసరములకుం దగిన వెడలుపు లోతులు గల్గియుండునటుల ద్రవ్వం బడినవి. జర్మనుదేశమందలి కాలువలు డెబ్బది యడుగుల వెడలుపుగలవిగ నుండును. కాలువల ప్రక్కల నున్న గట్టిదిగానితావులందు, ప్రక్కలంగు రాయి పేర్చిగాని, కాంక్రీటు చేంగాని భద్రపఱ్చెదరు. కొన్నితావులందు గట్టిమట్టిం దెచ్చి పోసియైన భద్రపఱ్చెదరు. లేకున్న పడవల నడకవిసురుగు వాటిం గోసివేయును. కాలువ మొరకనుండి పల్లమునకుం దిగు తావులంగు లాకు లం గట్టుదురు.

లాకు లవసరములేక కాలువ యధికముగ పొడవగుతరి నవసరమని తోచినతావులందు అచ్చటచ్చట Safety gates నిర్మించుటయుం గలదు. ఇవి వెల్లువకాలములందు గట్లకపాయము కలుగకుండ కాపాడును. హాలండుదేశపుకాలువలు భూమట్టముపైననే యుండునటుల గట్టులంబోసి నిర్మింపంబడెను. అందులోనికి ప్రక్కలనుండి నీరు పంపులగుండా పోయంబడుచు ఊరిన అధిక జలములు సముద్రమున కంపంబడుటకుం దోడు ప్రయాణపుకాలువలుగ పడవలరాకపోకల కుపయోగించునవిగ నున్నవి. వీటియందలి నీరు మంచిదికాదు. వీటిలో రెండువేలటన్నుల బరువు వేసికొను పెద్దవియగు Rhine barges కూడ సుకరముగ పోగలవు.

రష్యాదేశము నందలి గొప్పనదుల నుండి త్రవ్వంబడిన పెద్దకాలువలు గలవు. నాటినిరు పంటల కుపయోగించుటయేగాక, Black Sea నుండి బాల్టిక్కుసముద్రము, White Sea లం గలుపుచు పెద్దపెద్ద పడవలు పోతగినవిగ నున్నవి. చీనాదేశము నందలి గ్రాండుకెనాలు చాల ముఖ్యమగు రాకపోకలసాధనముగ నుండెంగాని ఇటీవలి దేశసంస్థితులవలన మేటవేసిన దని వినుచున్నారము. (కెనాలైజేషన్ పద్ధతి చూడుడు)

**కాలూప్స్ శాఖ క్షత్రియులు** — శిశోదియాశాఖ క్షత్రియులు చూడుడు

**కాల్వానల్ క్షత్రియులు** - ప్రమార శాఖ క్షత్రియులు చూడుడు.

**కాలే కడుపుకు కూడా వేడిగంజి కావలెను** — ఆంధ్రలోకోక్తి.

**కాలేయ గోత్రము** – అత్రి పుత్రికా పుత్రుల గణము చూడుడు.

**కాలోరిమీటర్** (Calorimeter) — కొంతపాటి బరువుగల ఏదేని యొక వస్తువును వేడిచేయుటకుగాను (ఒక్కొక డిగ్రీ వేడిచొప్పున) ఉపయోగించు నొక పరికరము

**కాలొలొజీ** (Kalology) — సౌందర్యము, రసజ్ఞత వీటింగూర్చిన కళ.

**కాలోహావి గోత్రము**- వశిష్ఠగణము చూడుడు.

**కాల్** (Call) — (వాణిజ్య సంబంధపరిభాషాపదము). కాల్ అనిన పిలుపని యర్థము.

ఇట నడుగుటయని భావము చెల్లింపవలసిన వాటాలభాగపు Premium మొదలగునవి అడుగుట ఒక నిర్ణీతమగు ధరకు కొన్ని వాటాలు మొదలగునవి (తొల్లింటి కంట్రాక్టు మేరకు) కొనుటకుగాని, అమ్ముటకుగాని తరుణమున హెచ్చరించుటకు Call to buy అనియు, Call to sell అనియు నందురు. ఒక ఓడ తాను పయనించు మార్గమున నిలచుచుట్టి రేవులకు Calling ports అనెదరు. కొన్ని ఋణపత్రములను కడ్డానిచ్చి కావలసిన తరుణమున ఫలాని విధపు రూపముగాని, మరియొకటిగాని ఇచ్చునట్టుల నేర్పరచుకొనిన పత్రములకు Call bond అనియు, అట్టి సంబంధ ద్రవ్యములకు Call money అనియు పేరులు. మున్ముందుగ కొనుటకుగాను చేసికొనిన ఏర్పాటునకు ఎక్కువగాగాని, రెట్టింపుగాగాని కొనుటకు గల Call నకు Call more లేక More call అని పేరు.

**కావాధి గోత్రము**– శిపమన్యుగణము చూడుడు.

**కావాల్య గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు

**కావాక్షి గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుడు

**కావిధి గోత్రము** — వశిష్ఠగణము చూడుడు.

**కావిష్కిర గోత్రము** — ఆత్రేయ గణము చూడుడు

**కావేపావగోత్రము**— కుశికగణము చూడుడు.

**కావేరీభవానీ సంగమము (భవానిపురము)**— దక్షిణదేశమున కోయంబత్తూరు జిల్లాలోని ఈరోడ్డు పురమునుండి పది మైళ్ళ దూరమునగల భవాని యనిపేరుగల గ్రామము కడ అమృతలింగేశ్వర దేవాలయ ముఖమున భవానీనది కావేరీనదిలో సంగమించు పవిత్ర స్నానతీర్థముకలదు

**కావ్యవంశనృపతులు** — వీరికి గుప్తాస్పస్ లేక విటాస్ అని వారుక పేరుకలదు. బహ్లీక (ఇప్పటి గాల్ఖు) రాజ్యమేలినవారు.

**కావ్యగుణములు (దశవిధగుణములు)**– కావ్యములందుండదగిన గుణములు దశవిధములుగ నలంకారశాస్త్రమునం దెంచబడినవి. ఇచట గుణములన యోగ్యతలని భావము. (గుణములకు వ్యతిరేకములగునవి దోషములని ఈసందర్భమున మనస్సునందుంచు కొనవలసియున్నది) (దోషములు చూడుడు). ౧ శ్లేషము- శ్లేషలతో దెలుపుట, ౨. ప్రసాదము, ౩ మాధుర్యము, ౪ సుకుమారత, ౫. సమత, ౬ అర్థవ్యక్తి, ౭ ఔదార్యము, ౮. కాంతి, ౯ ఓజము, ౧౦. సమాధి ఈపదియు కావ్యరచనలయందు గానదగు యోగ్యతావిశేషములు.

**కావ్యదోషములు (౬౬)** —

పద లేక శబ్దగతదోషములు ౧౬- వీటిని వాక్యగతములనియు నందురు ౧ గ్రామ్యయోగదోషము, ౨ వైవర్ణ్యదోషము, ౩ తత్సమశబ్దక్రమదోషము, ౪. అవసరస్మృతదోషము, ౫. అప్రయుక్తదోషము, ౬. విసంధిదోషము, ౭ గ్రస్తసంధిదోషము, ౮. కుసంధిదోషము, ౯. నకారబాహుళ్యదోషము, ౧౦. హీనోక్తి దోషము, ౧౧. దీర్ఘకాకువు, ౧౨. హ్రస్వకాకువు, ౧౩. సమాసభంగము, ౧౪. ఛందోభంగము, ౧౫. యతిభంగము, ౧౬. ప్రాసభంగదోషము.

అర్థగతదోషములు ౫౦- ౧ న్యూనోపమ, ౨. అధికోపమదోషము, ౩. అప్రసిద్ధోపమ, ౪. అసదృశోపమ, ౫. మహాధికోపమ, ౬. నీచోపమ, ౭. వ్యర్థవాచక దోషము,

౮. పునరుక్తదోషము, ౯. వ్యర్థదోషము, ౧౦. అప్రయోజక (క్లిష్ట) దోషము, ౧౧. అలంకారవర్జితదోషము, ౧౨. భిన్నవచనదోషము, ౧౩. భిన్నలింగదోషము, ౧౪. భిన్నసంబంధ దోషము, ౧౫. అనర్థకదోషము, ౧౬. అప్రతీతము, ౧౭. అన్యార్థదోషము, ౧౮. అవిమృష్ట విధేయాంశదోషము, ౧౯. నిర్హేతుకదోషము, ౨౦ హీనపదదోషము, ౨౧. సమాప్తపునరాత్త దోషము, ౨౨. అధికపదము, ౨౩ పతత్ప్రకర్ష దోషము, ౨౪. అసంగతదోషము, ౨౫. అప్రస్తార్థకదోషము, ౨౬. క్లిష్టగూఢార్థదోషము, ౨౭. శ్రుతికటువు (పరుషవాక్య) దోషము, ౨౮. క్రమభంగదోషము ౨౯. అక్రమము, ౩౦. ప్రక్రమభంగదోషము, ౩౧. నేయార్థము, ౩౨ సంధిగ్ధదోషము, ౩౩. సంశయదోషము, ౩౪ దేశవిరోధము, ౩౫. సమయవిరోధము, ౩౬. లోకవిరోధము, ౩౭ దిగ్విరోధము, ౩౮ కాలవిరోధము, ౩౯. మైత్రీవిరోధము, ౪౦ ఆగమవిరోధము, ౪౧. కలావిరోధము, ౪౨. వ్యాకరణదోషము, ౪౩. అసమర్థము, ౪౪ అపార్థము, ౪౫. విరసము, ౪౬. అతిమాత్ర, ౪౭ అశుభము. ౪౮ లజ్జాదోషము, ౪౯. జుగుప్స (రోత) దోషము, ౫౦. అశ్లీల దోషము.

**కావ్యలక్షణ** — (లక్షణ చూడుము). ఇది వృత్తి, రీతి, శయ్య, పాకము నని నాల్గు విధములు గలది.

**కావ్యచతురార్థము** (కావ్యార్థములు నాలుగు) — ౧. కథార్థము- గ్రంథకర్త అభిప్రాయమగు కథాసందర్భార్థము. ౨. పదార్థము- పర్యాయ పదములచే నర్థము వివరణమగుట. ౩. పదచ్ఛేద తాత్పర్యములు- పదములను వేర్వేరుగ విభజించి కలుపుచు తాత్పర్యము వచించుట. ౪ విశేషార్థము- గ్రంథమందలి మాటల కర్థాంతరములుగా దనరు ధ్వనిశ్లేషల వివరించుట.

**కావ్యము** — కవికృతమగునది కావ్యము. పంచకావ్యములు (కాళిదాసమహాకవి రచించినవి మూడు) ౧ రఘువంశము, ౨. కుమారసంభవము, ౩. మేఘసందేశము, ౪. భారవికావ్యము, ౫ మాఘకావ్యము

**కావ్య లక్షణము** — కావ్య మన కవి కృతమని భావము కవులచే రచింపబడుటం గావ్యము నిపేరం బరగునవి. ఇవి సంగీతకావ్యములనియు, సాహిత్య (పద్య) కావ్యములనియు, దృశ్యకావ్యము (నాటకాదిరూపకము) లనియు త్రివిధమని కొందఱనెదరు గద్యపద్యాత్మక మగు కావ్యమునకు చంపు అని పేరిడిరి. ఇవి భోజచంపు, రామాయణచంపు, భారతచంపు మొదలగు సంస్కృతకావ్యములు. సంగీతకావ్యము లన తాళబద్ధములై రాగసంయుతములై చారిత్రక విషయములుగాని, కవిమనోభావములం గాని తెలుపునవి ఇవి జయదేవకృతమగు గీతగోవిందకావ్యము మున్నగునవి. ఇంక పదకవిత్వము విస్తారముగ నుండెను దీనిగూర్చిన లక్షణము శార్ఙ్గదేవకృతమగు సంగీతరత్నాకర మను గ్రంథమున తుర్యాధ్యాయమగు ప్రబంధాధ్యాయమున గలదు.

సాహిత్యకావ్యములు- ఇతిహాసములు, ప్రబంధములు అని ద్వివిధము. భారతము మున్నగునవి ఇతిహాసములుగను, రామాయణము మున్నగునవి ప్రబంధములుగను చెప్పబడినవి. మరియు ౨౭ వర్ణనలుండిన మహాప్రబంధమనియు, అంతకొన్ని తక్కువయుండినను ప్రబంధమనియుం గూడ పిదప నేర్పడినది. వీట్ల లక్షణములు వృత్తరత్నాకరమను ఛందోగ్రంథమున దెలుపబడినవి.

ఇంకను వామనసూత్రము, కావ్యాదర్శము, కావ్యప్రకాశిక, సాహిత్యకౌముది, సాహిత్యచంద్రోదయము, సాహిత్యరత్నాకరము, సాహిత్యదర్పణము, ప్రతాపరుద్రీయము మున్నగు గ్రంథములందు వివరింపఁబడియున్నది. ఆంధ్రమునను నరసభూపాలీయము మొదలగు కొన్ని గ్రంథముల సవిమర్శములు రచింపఁబడినవి.

దృశ్యకావ్యములగు నాటకములు ఇవి పది విధములు. ఇవి గద్యపద్యాత్మకములై యుండుటయేగాక సంగీతకావ్యమువలె నచ్చటచ్చట తాళబద్ధములును, రాగయుతములునగు పాటలుగూడ చేర్చుచున్నారు. ఇందు ముఖ్యముగునది ముఖాముఖలక్షణధర్మమును, ఉత్తర ప్రత్యుత్తర రూపగమనికయును ఈ దశవిధరూపముల (దృశ్యకావ్యము) లక్షణము దశరూపకమను గ్రంథమున వివరింపఁబడినది.

మఱియు నిటీవల ప్రతి పద్యము తాళబద్ధమై రాగయుతముగ గానముచేయుఁబడ సర్హమైనదేయనియు, వసుచరిత్ర రచించిన రామరాజభూషణుఁ డీసంగతిని తన మనంబున నిడికొనియే నా గ్రంథమును రచించెననియు ఒకరిద్దరు పరిశోధకులగు పండితులు బయలుదేరదీసిరి. ఐనను ఈ యంశమింకను కొంత పరిశీలించి యాంధ్రలోకమునకు వెల్లడింపవలసిన బాధ్యత పరిశోధకులయందు కలదనియే చెప్పవలయును.

కావ్యముఁగూర్చి తెలియవలయునన్న పెక్కుసంగతులం దెలియవలయును ౧. అవి కావ్యలక్షణములు, ౨. కావ్యదోషములు, 3 కావ్యగుణములు, ౪. రసములు, ౫. లక్షణ, ౬. యతిప్రాసములు, ౭. నాయక నాయికల లక్షణములు, ౮. సమాసములు, ౯. కావ్యభేదములు, ౧౦. ఛందములు, వృత్తములు ననునవి ముఖ్యములు. కావ్యము గద్యరూపముగనైనను, పద్యరూపముగనైనను ఉండవలయును. గద్యము వచనము. ఇంకను చరిత్రలు, నవలలు, కథలు మొదలగునవి వచనరూపమున నుండెడిని. ఇంక పద్యకావ్యము ౨౨ ఛందస్సుల మేఱకుగాని వాటికి మించిగాని సర్వదు పద్యములరూపమున కథాసందర్భము నడచెడిని. ౧ ఉత్తమకావ్యము, ౨. మధ్యమకావ్యము, 3. అధమకావ్యమునని కావ్యము త్రివిధము. ౧. అవివక్షిత వాచ్యము, ౨. వివక్షితాన్యపరవాచ్యము, 3. ధ్వని వాచ్యమునని మూఁడుతెఱఁగులుగ నుండును. దీని నుత్తమకావ్యమందురు. ౧. అవివక్షితవాచ్యము- అత్యంతతిరస్కృత మనియు, అర్థాంతరసమేతమనియు ద్వివిధము. ఈ రెంటియందును ఒక్కొక్కటి వాక్యగతమనియు, పదగతమనియు భేదములుంట నాల్గుభేదములుగ దనరెడిని. ౨. వివక్షితాన్యపరవాచ్యము- సంలక్ష్యక్రమవ్యంగ్య మనియు, అలక్ష్యక్రమవ్యంగ్య మనియు ద్వివిధము. అందు సంలక్ష్యక్రమ వ్యంగ్యము ౧. శబ్దశక్తి మూలయనియు, ౨ అర్థశక్తి మూలయనియు, 3 ఉభయశక్తి మూలయనియు త్రివిధము.

౧. శబ్దశక్తిమూల-వస్తురూప (ఇది వాక్యగత పదగతములని ద్వివిధము), అలంకారరూప (ఇది వాక్యగత అలంకారగత యని ద్వివిధము) యనియు ద్వివిధము.

౨. రెండవదియగు అర్థశక్తిమూల ౧. స్వతః ప్రతిపన్నమనియు, ౨. కవిప్రౌఢవచనసిద్ధమనియు, 3 కవినిబద్ధోక్తిసిద్ధ మనియు త్రివిధము. ఇందొక్కొకటి వస్తుమూలము, అలంకారమూలము నను భేదములచే దనరుచు ఆఱువిధములుగనుండెడిని.

మఱియు నిందలి వస్తుమూలములు- ౧. వస్తుమూలవస్తు వనియు, ౨ వస్తుమూలాలంకారమనియు ఇరుతెఱఁగులై అందొక్కొకటి పదగతములు, వాక్యగతములు, ప్రబంధగతములు నను త్రివిధభేదములచే దనరుచు, పదునెన్మిది భేదములుగ నొప్పెడిని.

ఇటులనే ఇందలి అలంకారమూలములును- ౧. అలంకారమూలవస్తు వనియు, ౨. అలంకారమూలాలంకార మనియు ఇరుతెఱంగులై అందొక్కొకటి పదగతములు, వాక్యగతములు, ప్రబంధగతములు నను త్రివిధభేదములచే దనరుచు పదునెన్మిది భేదములుగ నొప్పెడిని.

౩ మూడవదియగు ఉభయశక్తిమూల ఒకే విధము- ౨. ఇంక (వివక్షితాన్యపరవాచ్యమందలి) రెండవదియగు అలక్ష్యక్రమవ్యంగ్యము ఆరు విధములు- అవి ౧. ప్రబంధగతము, ౨. వాక్యగతము, ౩. పదగతము, ౪. పదైకదేశగతము, ౫. రచనాగతము, ౬. వర్ణగతము నని. (ఇక్కడికి వివక్షితాన్యపరవాచ్యము ద్వివిధముగ చెప్పం బడినది)

ఇంక నుత్తమకావ్యమందలి మూడవదియగు ధ్వనికావ్యము ద్వివిధము- ౧. సంసృష్టిధ్వనులు ౧౩౨ ఒక సముదాయముగను ౨ సంకరధ్వనులు ౩౯౭౮ ఒకసముదాయముగను దనరెడిని. ఇక్కడికి ఉత్తమకావ్యము సంపూర్ణము.

కావ్యభాగమున రెండవదియగు మధ్యము కావ్యము ఎన్మిదిభేదములుగలది అవి ౧. అగూఢము, ౨. అపరాంగము, ౩. వాక్యసిద్ధ్యంగము, ౪ అస్ఫుటము, ౫ సందిగ్ధము, ౬ తుల్యప్రాధాన్యము, ౭ కాక్వాక్షిప్తము, ౮. అసుందరము.

ఇంక మూడవదియగు అధమకావ్యము ౧. శబ్దచిత్రము, ౨ అర్థచిత్రము, ౩. ఉభయచిత్రమునని త్రివిధము. శబ్దచిత్రమున శబ్దాలంకారములును, అర్థచిత్రమున నర్థాలంకారములును, ఉభయచిత్రమున శబ్దార్థాలంకారములు రెండును అని గ్రహింపనది. ఇక్కడికి ఉత్తమకావ్య, మధ్యమకావ్య, అధమ కావ్య లక్షణములు వివరింపం బడినవి.

కావ్యములు పలువిధములుగ నుండును. మహాప్రబంధములు, ప్రబంధములు, రూపక (నాటక) ములు, యక్షగానములు, చాటువులు, జంగముకథలు, పాటలు, ఏలపాటలు, పాంబల పాటలు, తందనపదములు మొదలగునవన్నియు కావ్యసముదాయములోనివే.

మహాప్రబంధములు- ఇందు ౨౬ చందములకు లోబడిగాని, మించిగాని ప్రస్తారమున వెలువడిన పద్యములు పదునెన్మిది యుండును. అవి ౧. నగరవర్ణన, ౨. సముద్రవర్ణన, ౩ పర్వతవర్ణన, ౪ ఋతువర్ణన, ౫. చంద్రోదయవర్ణన, ౬. సూర్యోదయవర్ణన, ౭. ఉద్యానవనక్రీడ, ౮. జలక్రీడావర్ణనలు, ౯. మద్యపానవర్ణన, ౧౦. రతివర్ణన, ౧౧. విప్రలంభ, ౧౨. వివాహవర్ణనలు, ౧౩. కుమారోదయ, ౧౪. మంత్ర, ౧౫. దూత్యవర్ణన, ౧౬. ప్రయాణవర్ణన, ౧౭. యుద్ధవర్ణన, ౧౮ నాయకాభ్యుదయవర్ణనలు పదునెన్మిది యుండవలయును. ఛందములు, వృత్తములం గూర్చి వేఱుతావున గాంచనగును. మహాప్రబంధ వర్ణనలలో గొన్ని తక్కువయయ్యేనేనియు ప్రబంధ మనంబడెడిని.

నాటకములు పదివిధములు- ౧. నాటకము, ౨. ప్రకరణము, ౩ భాణము, ౪. ప్రహసనము, ౫. డిమము, ౬. వ్యాయోగము, ౭. సమవాకారము, ౮. వీథి, ౯. అంకము, ౧౦. ఈహామృగము.

యక్షగానములు ఐదు తెఱగులు- ౧. కథాసందర్భము, ౨. చక్రవాళము, ౩. తారావళి, ౪. బిరుదావళి, ౫. భోగావళి

చాటువులు క్షుద్ర ప్రబంధము లేక చాటుధారలు- ఇవి ౧౪ విధములు. వీటింగూర్చి వేఱుతావునం గాంచనగును. ఇవి సంఖ్యాబద్ధచాటువులు. అసంఖ్యాబద్ధచాటువులు (లేక సంఖ్యారహిత చాటువులు) రగడలు, కలికోత్కలిక, ద్విపద, దండకములు, పద్యముల మాలలు (ఉత్పలమాల, సీసమాలిక మొ॥), సింహావ

లోకనములు, బిరుదగద్యములు మొదలగునవి వీనికి చరణసంఖ్యా నియమము లేదు.

కావ్యదోషములు ౫ ఇవి అర్థగతదోషములు, వాక్యగతదోషములు, పదగతదోషములు నని త్రివిధము. దోషములు మొత్తమున నేబది యారు కలవు. వాటింగూర్చి వేఱు తావున గాననగును

కావ్యగుణములు ౧౦ - ౧ శ్లేషము (శ్లేష), ౨ ప్రసాదము, ౩ మాధుర్యము, ౪. సుకుమారత, ౫. సమత, ౬. అర్థవ్యక్తి, ౭. ఔదార్యము, ౮. కాంతి, ౯. ఓజము, ౧౦. సమాధి యనునవి

రసములు ౯ (నవరసములు) - ౧ శృంగారరసము, ౨. వీరరసము, ౩. కరుణారసము, ౪. అద్భుతరసము, ౫ హాస్యరసము, ౬. భీభత్సరసము, ౭ భయానకరసము, ౮. రౌద్రరసము, ౯. శాంతరసము అని తొమ్మిది రసములు. ఇందు శృంగారరసము కడు విస్తారమైనది. ఇందెఱుంగదగిన సంగతులు పెక్కు కలవు ఇందు భావములు త్రివిధములు, అవస్థలు ౧౦, నాయకులు ౩౧౨ గురు మొదలగునవి పెక్కు గలవు.

భావములు - ౧. విభావములు, ౨. అనుభావములు, ౩ అవస్థలు అని త్రివిధము. ఇందు విభావములు రెండువిధములు.

౧. ఆలంబనము- ఇది ఒకేవిధము.

౨ ఉద్దీపనము నాల్గువిధములు ౧. ప్రాయము (వయస్సు), ౨. అలంకారము (సొమ్ములు మొదలగునవి ధరించి శృంగారించుకొనుట), ౩. చేష్టలు, ౪. తటస్థము (సమీపవాసము లేక సహవాసము).

౨. అనుభావము - ఇది సాత్త్వికభావము, సంచారీభావము, చేష్టాభావము అని త్రివిధము.

౧. సాత్త్వికభావములు ౮ - ౧. స్తంభనము, ౨. ప్రళయము, ౩. రోమాంచలము, ౪. స్వేదము, ౫. వైస్వర్ణ్యము, ౬. కంపము, ౭. అశ్రువు, ౮. వైవర్ణ్యము (నిశ్చేష్టత, మూర్ఛ, గగుర్పాటు, చెమట, స్వరము, స్వరము మారుట, వణకుట, కండ్లనీరు గ్రమ్ముట, వర్ణము మారుట).

౨. సంచారీభావములు ౩౩ - ౧. నిర్వేదము, ౨ శ్రమము, ౩. దైన్యము, ౪. జాడ్యము, ౫. గ్లాని, ౬. త్రాసము, ౭. శంక, ౮. ఆర్తి, ౯. రోషము, ౧౦. గర్వము, ౧౧. ఆవేగము, ౧౨. ధృతి, ౧౩. స్మృతి, ౧౪. చాపలము, ౧౫. ఉగ్రత, ౧౬. అవహిత్థ, ౧౭. త్రప, ౧౮. విషాదము, ౧౯. మదము, ౨౦. ఔత్సుక్యము, ౨౧. మతి, ౨౨. నిద్ర, ౨౩. మోహము, ౨౪. బోధము, ౨౫. మృతి, ౨౬. ముదము, ౨౭. అలస్యము, ౨౮. వితర్కము, ౨౯. సుషుప్తి, ౩౦. అసూయ, ౩౧. చింత, ౩౨. ఉన్మాదము, ౩౩. అపస్మృతి.

చేష్టానుభావము నాల్గువిధములు- ౧ చిత్తజ చేష్టలు, ౨. గాత్రజ చేష్టలు, ౩. వాగారంభ చేష్టలు, ౪ బుద్ధ్యారంభ చేష్టలు.

౧. చిత్తజ చేష్టానుభావములు ౭ - ౧. హావము, ౨. భావము, ౩. హేల, ౪. మాధుర్యము, ౫. ప్రాగల్భ్యము, ౬. హసితము, ౭ ధైర్యము నని ఏడు తెఱంగులు.

౨ గాత్రజ చేష్టానుభావములు (౧౧)- ౧. లీల, ౨. విలాసము, ౩ విచ్ఛిత్తి, ౪. విభ్రమము, ౫. కిలికించితము, ౬. మొట్టాయితము, ౭. కుట్టమితము, ౮. చకితము, ౯. బిబ్బోకము, ౧౦. లలితము, ౧౧. విహృతము నని.

౩. వాగారంభ చేష్టానుభావములు (౧౨)- ౧. ఆలాపము, ౨. విలాపము, ౩. సల్లాపము, ౪. ప్రలాపము, ౫. అనులాపము, ౬. అపలాపము, ౭.సందేశము, ౮.అతిదేశము, ౯.నిర్దేశము,

౧౦. అపదేశము, ౧౧. ఉపదేశము, ౧౨. వ్యపదేశము.

౪. బుద్ధ్యారంభ చేష్టానుభావములు (౩)- ౧. రీతి, ౨. వృత్తి, ౩. ప్రవృత్తి.

౩ అవస్థలు (౧౦ విధములు)-౧. చక్షుఃప్రీతి (కనులజూచుట), ౨. మనస్సంగమము (మనసు తగులుట), ౩. సంకల్పము (ప్రయత్న సంకల్పము), ౪. అరతి(అన్యానురాగము తగ్గిపోవుట), ౫. తాపము (వేడిగలుగుట), ౬. లజ్జాత్యాగము (సిగ్గువదలుట), ౭. జాగరము (నిద్రపట్టకుండుట), ౮. ఉన్మాదము (చికాకుతోచుట), ౯. మూర్ఛ (మైమరపు), ౧౦. ధన్యత.

నాయక, నాయికలు '- నాయకులలో ౩ భేదములు. ౧. కథానాయకులు- ౧. ధీరోదాత్తుడు, ౨. ధీరోద్ధతుడు, ౩. ధీరశాంతుడు, ౪. ధీరలలితుడు నని.

౨. శృంగార నాయకులు (౪ విధములు)- ౧. దక్షిణుడు, ౨. అనుకూలుడు, ౩. ధృష్టుడు, ౪. శఠుడు అని.

౩. సాహాయ్యనాయకులు (౪ విధములు)- ౧. విటుడు, ౨. చేటకుడు, ౩. పీఠమర్దకుడు, ౪. విదూషకుడు అని.

నాయికలు త్రివిధము- స్వీయ, పరకీయ, సామాన్య యని మొత్తమున నాయికలకు భేదములు ౩౧౨ గలవు. దీనింగూర్చి వేఱుతావున గాననగును. ఇంక శృంగారరసభేదముల నెఱుగదగును.

౧. శృంగారరసము- ౧. విప్రలంభశృంగారమనియు, ౨. సంయోగ శృంగారమనియు ద్వివిధము. ౧. విప్రలంభశృంగారము- ఇది శుద్ధ విప్రలంభము, మానము నని ద్వివిధము. శుద్ధ విప్రలంభము- అయోగము, విరహము, ప్రవాసము, శాపము నని నాల్గుతెఱంగులు. మాన విప్రలంభము- ఈర్ష్యాజన్యమానము, ప్రణయజన్యమానము నని ద్వివిధము. ఇటుల విప్రలంభ శృంగార మాఱుభేదములుగలది. ౨. సంయోగ శృంగారము- ఇది సంక్షిప్త సంయోగము, సంపన్న సంయోగము నని ద్వివిధము.

౨. వీరరసము- ఇది దానవీరము, దయావీరము, యుద్ధవీరము నని త్రివిధము.

౩ కరుణారసము- ఇందు భేదములులేవు.

౪. అద్భుతరసము- ఇందు భేదములులేవు.

౫. హాస్యరసము- ఇది ఆఱు తెఱంగులు- ౧. స్మితము, ౨. హసితము, ౩. విహసితము, ౪. ఉపహసితము, ౫. అపహసితము, ౬. అతిహసితము.

౬. భీభత్సరసము.

౭. భయానకరసము.

౮. రౌద్రరసము- ఇది మాత్సర్యరౌద్రము, విద్వేషరౌద్రము నని ద్వివిధము.

౯. శాంతరసము- ఇది ఆత్మానాత్మ వివేకశాంతము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగశాంతము, శమదమాది షట్కసంపద శాంతము, ముముక్షుత్వశాంతము నని నాల్గు తెఱంగులు. (ఇవి నవరసములు).

౫. లక్షణ- ౧. వృత్తి, ౨. రీతి, ౩. శయ్య, ౪. పాకము నని నాల్గువిధములు.

౧. వృత్తి- ఇది ౧. శబ్దము, ౨ కావ్యము నని ద్వివిధము

౧. శబ్దము- ౧. వ్యంజన, ౨ లక్షణ, ౩. అభిధ యని మూడు తెఱంగులు. అందు వ్యంజన ౧. శబ్దశక్తిమూల, ౨. అర్థశక్తిమూల, ౩. ఉభయశక్తిమూలయనియు; లక్షణ- ౧. జహత్తు, ౨. అజహత్తు, ౩. జహదజహత్తు యనియు; అభిధ- ౧. యోగమూల, ౨ రూఢిమూల యని భేదములచే దనరెడిని. ఇటుల శబ్దము త్రివిధమై యన్ని భేదములం గల్గియున్నది.

౨. కావ్యము ౪ విధములు - ౧ కైశికి, ౨. ఆరభటి, ౩ సాత్త్వతి, ౪. భారతి యని.

౨. రీతులు మూడువిధములు-౧ వైదర్భి, ౨. గౌడి, ౩. పాంచాలి యని. ౩. శయ్య ఒకేవిధము-దీనికి భేదములు లేవు. ౪ పాకము ద్వివిధము- నారికేళపాకము, ద్రాక్షాపాకము నని. ఇంకను కదళీపాకమనియు గొందఱు వచించియున్నారు.

౬. యతిప్రాసములు- ఇవి పద్యముల నిబంధనలు. పద్యములు వినుటకే సుందరములై యుండుట కివి యేర్పడినను, పద్యముయొక్క గణ పరిశుద్ధతను నిలుపుట కివి సాధనము లగుచున్నవి. వేర్వేఱు వృత్తములకు వేర్వేఱు యతిస్థానములు విధింపంబడియున్నవి. యతిప్రాసములం గూర్చి వేర్వేఱు తావులం గాననగును.

౭. సమాసములు ౬ విధములు- శబ్దములను ఒకటితో నొకటి గలియుంపజేసి, బిగిబిగిగా గూర్చుటను సమసింపజేయుట యనియు, అట్లు సమసింపజేయబడిన పదసముదాయమునకు సమాసమనియు, తొల్లింటిపండితులు పేరిడియు, వాడియు నున్నారు. పద్యములందు సమాసములను రచించుటకు అనేకసమయములు కలవు. సమాసము లాఱువిధములు.

౧. అవ్యయీభావ సమాసము- ఇది ౧. అవ్యయపూర్వపదమనియు, ౨. అవ్యయోత్తరపదమనియు, ౩. నామోభయపదసమాసమనియు త్రివిధము.

౨. తత్పురుషసమాసము (ఎనిమిదివిధములు)- ప్రథమాతత్పురుషసమాసము, ౨. ద్వితీయాతత్పురుష, ౩. తృతీయాతత్పురుష, ౪ చతుర్థీతత్పురుష, ౫. పంచమీతత్పురుష, ౬. షష్ఠీతత్పురుష, ౭. సప్తమీతత్పురుషసమాసము, ౮. నఞ్ తత్పురుషసమాసము.

౩. కర్మధారయసమాసము (నవ విధములు)- ౧. విశేషణపూర్వపదము, ౨. విశేష్యపూర్వపదము, ౩. విశేషణోభయపదము, ౪. ఉపమానపూర్వపదము, ౫. ఉపమానోత్తరపదము, ౬. అవధారణపూర్వపదము, ౭. సంభావనపూర్వపదకర్మధారయ సమాసము, ౮. లుప్తమధ్యమపదకర్మధారయము, ౯. భిన్నోత్తరపదకర్మధారయసమాసము

౪. ద్విగుసమాసము- ౧ ఏకవిద్భావి, ౨. అనేకవిద్భావి యని ద్వివిధము.

౫. బహువ్రీహిసమాసము (పండ్రెండు విధములు)- ౧. ద్వితీయాబహువ్రీహి, ౨ తృతీయాబహువ్రీహి, ౩. చతుర్థీబహువ్రీహి, ౪ పంచమీబహువ్రీహి, ౫ షష్ఠీబహువ్రీహి, ౬. సప్తమీబహువ్రీహి, ౭. వ్యధికరణబహువ్రీహి, ౮. సహపూర్వపదబహువ్రీహి, ౯. ఉపమానపూర్వపదబహువ్రీహి, ౧౦ దిగంతరాళబహువ్రీహి, ౧౧ వ్యతికరణలక్షణబహువ్రీహి, ౧౨. నఞ్ బహువ్రీహిసమాసములు.

౬. ద్వంద్వసమాసము- ఇది ద్విపదద్వంద్వమనియు, బహుపదద్వంద్వమనియు అగును. ద్విపదద్వంద్వము- ఇతరేతరయోగ ద్విపదద్వంద్వమనియు, సమాహారద్విపదద్వంద్వమనియు నిరుదెఱంగులు. అట్లే బహుపదద్వంద్వమును ఇతరేతరయోగబహుపదద్వంద్వ మనియు, సమాహారబహుపదద్వంద్వమనియు ద్వివిధ భేదములై ద్వంద్వసమాసము నాల్గుభేదములం గల్గియున్నది.

౮. ఛందములు ౨౬, వృత్తములు- పద్యకావ్యములు ఛందోబద్ధములు. కాన పద్యకావ్యములను గూర్చి యెఱుంగుతరి ఛందములం గూర్చియు, వానియందు జనించు వృత్తములం గూర్చియు నెఱుంగు టత్యవసరము. ఛందమెన్నవ సంఖ్యదో ఆఛందమున జనించిన వృత్త (పద్య) పాదమునందన్ని యక్షరములుండును. ఛందము లిఱువదియాఱు. అవి ౧. ఉక్త, ౨. అత్యుక్త, ౩. మధ్య, ౪. ప్రతిష్ఠ, ౫. సుప్రతిష్ఠ,

౬. గాయత్రీ, ౭. ఉష్ణిక్కు, ౮. అనుష్టుప్పు, ౯. బృహతి, ౧౦. పంక్తి, ౧౧. త్రిష్టుప్పు, ౧౨. జగతి, ౧౩. అతిజగతి, ౧౪. శక్వరి, ౧౫. అతిశక్వరి, ౧౬. అష్టి, ౧౭. అత్యష్టి, ౧౮. ధృతి, ౧౯ అతిధృతి, ౨౦ కృతి, ౨౧. ప్రకృతి, ౨౨. అకృతి, ౨౩. వికృతి, ౨౪. సుకృతి లేక సంకృతి, ౨౫. అతికృతి లేక అభికృతి, ౨౬. ఉత్కృతి.

ఈ ౨౬ ఛందములందు జనించిన వృత్తములు ౧౩,౪౨,౧౭,౭౨౬ కలవు. ఇవి అన్నియు వాడుకయందిప్పుడు లేవు

ఇంక నిరువదియారు ఛందములందు జనించినవేకాక, ఉద్ధరమాలావృత్తము లనుపేరం బరగుచు లాటీవృత్తమును, రమణకవృత్తమును, త్రిభంగివృత్తమును, లయహారీవృత్తమును, లయవిభాతీవృత్తమును, లయగ్రాహీవృత్తమును, పదివిధములగు దండకములును అచ్చటచ్చటఁ గానవగుచున్నవి. కాని దండకములు ౯౯౯ భేదములనియు, అందిప్పుడు ౧౦ విధములు మాత్రము వాడుకయందున్నవనియు, ఈపదునారు విధములగు వృత్తములు ౨౬ వ ఛందమునకు గూడ దాటినవనియు జెప్పఁబడినవి. ౨౬ ఛందములు, వృత్తములంగూర్చి వేఱొకచోట గాననగును.

**కావ్యవిధానము** — అలంకారశాస్త్రమున కావ్యము- ఉత్తమకావ్యమనియు, మధ్యమకావ్యమనియు, అధమకావ్యమనియు త్రివిధములై తెలియఁబడును. కవి రచించినది కావ్యమని చెప్పఁబడినది.

౧. ఉత్తమకావ్యము- ౧. వివక్షితాన్యపరవాచ్యమనియు, ౨. అవివక్షితాన్యపరవాచ్యమనియుం ద్వివిధము.

౧. వివక్షితాన్యపరవాచ్యము- ఇది తిరుగ సంలక్ష్యక్రమవ్యంగ్య మనియు, అలక్ష్యక్రమవ్యంగ్య మనియు ద్వివిధము.

౧. సంలక్ష్యక్రమవ్యంగ్యము త్రివిధము- ౧. శబ్దశక్తిమూల, ౨ అర్థశక్తిమూల, ౩. ఉభయశక్తిమూల యని.

౧. శబ్దశక్తిమూల- వస్తురూప, అలంకారరూప యని ద్వివిధము

౧. వస్తురూప- వాక్యగత మనియు, పదగత మనియు నిరు తెఱంగులు.

౨ అలంకారరూప- వాక్యగత మనియు, అలంకారగత మనియు నిరు తెఱంగులు.

౨. అర్థశక్తిమూల త్రివిధము- ౧. స్వతఃప్రతిపన్నము, ౨. కవిప్రౌఢవచనసిద్ధము, ౩. కవినిబద్ధోక్తిసిద్ధము అని మూఁడైయున్నవి.

౧. స్వతఃప్రతిపన్నము- ౧. వస్తుమూలమనియు, ౨. అలంకారమూలమనియు ద్వివిధము.

౧ వస్తుమూలము- తిరుగ వస్తుమూలవస్తువనియు, వస్తుమూలాలంకారమనియు ద్వివిధము.

౧. వస్తుమూలవస్తువు- ౧. పదగతము, ౨. వాక్యగతము, ౩. ప్రబంధగతము నని మూఁడు తెఱంగులు.

౨. వస్తుమూలాలంకారము- ౧. పదగతమనియు, ౨. వాక్యగతమనియు, ౩. ప్రబంధగతము నని మూఁడు తెఱంగులు.

౨. అలంకారమూలము- ౧. అలంకారమూలవస్తువనియు, ౨. అలంకారమూలాలంకార మనియుం ద్వివిధము.

౧. అలంకారమూలవస్తువు- ౧. పదగతము, ౨. వాక్యగతము, ౩. ప్రబంధగతము నని మూఁడు తెఱంగులు.

౨. అలంకారమూలాలంకారము- ౧. పదగతము, ౨. వాక్యగతము, ౩. ప్రబంధగతము నని మూఁడు తెఱంగులు.

౨. కవిప్రౌఢవచనసిద్ధము- ఇది ద్వివిధము- ౧. వస్తుమూల, ౨. అలంకారమూలము నని.

౧. వస్తుమూలము- ౧. వస్తుమూలవస్తువు, ౨. వస్తుమూలాలంకారము నని ద్వివిధము.

౧. వస్తుమూలవస్తువు- ౧. పదగతము, ౨. వాక్యగతము, ౩. ప్రబంధగతము నని త్రివిధము.

౨. వస్తుమూలాలంకారము- ౧. పదగతము, ౨. వాక్యగతము, ౩. ప్రబంధగతము నని మూఁడు తెఱంగులు.

౨. అలంకారమూలము- ఇది ౧. అలంకారమూలవస్తువనియు, ౨. అలంకారమూలాలంకారమనియు ద్వివిధము

౧. అలంకారమూలవస్తువు- ఇది ౧. పదగతము, ౨. వాక్యగతము, ౩. ప్రబంధగతము నని త్రివిధము

౨. అలంకారమూలాలంకారము- ఇది ౧. పదగతము, ౨. వాక్యగతము, ౩. ప్రబంధగతము నని త్రివిధము.

౩. కవినిబద్ధోక్తిసిద్ధము- ఇది వస్తుమూలమనియు, అలంకారమూలము నని ద్వివిధము.

౧. వస్తుమూలము ఇది ౧. వస్తుమూలవస్తువనియు, ౨. వస్తుమూలాలంకారమనియు ద్వివిధము.

౧. వస్తుమూలవస్తువు- ౧. పదగతము, ౨ వాక్యగతము, ౩. ప్రబంధగతము నని త్రివిధము.

౨. వస్తుమూలాలంకారము- ౧. పదగతమనియు, ౨. వాక్యగతమనియు, ౩. ప్రబంధగతమనియు త్రివిధము

౨. అలంకారమూలము- ఇది ౧. అలంకారమూలవస్తువనియు, ౨. అలంకారమూలాలంకారమనియు రెండువిధములు.

౧. అలంకారమూలవస్తువు- ఇది ౧. పదగతము, ౨. వాక్యగతము, ౩. ప్రబంధగతము నని త్రివిధము.

౨. అలంకారమూలాలంకారము- ౧. పదగతము. ౨. వాక్యగతము, ౩. ప్రబంధగతము నని త్రివిధము.

౩. ఉభయశక్తిమూల- ఒకే విధము.

౨. అలక్ష్యక్రమవ్యంగ్యము- ఇది ఆఱు విధములు. ౧. ప్రబంధగతము, ౨ వాక్యగతము, ౩ పదగతము, ౪ పదైకదేశగతము, ౫. రచనాగతము, ౬. వర్ణగతము నని యైయున్నది.

౨ అవివక్షితాన్యపరవాచ్యము- ఇది ౧. అత్యంతతిరస్కృతమనియు, ౨. అర్థాంతరసమేతమనియు ద్వివిధము.

౧. అత్యంతతిరస్కృతము- ఇది ౧. వాక్యగతమనియు, ౨. పదగతమనియు ద్వివిధము.

౨ అర్థాంతరసమేతము- ఇదియు ౧. వాక్యగతమనియు, ౨. పదగతమనియు ద్వివిధము.

మఱియు నీయుత్తమకావ్యసందర్భమున సంసృష్టిధ్వనులును, సంకరధ్వనులును కలవని చెప్పఁబడినవి. సంసృష్టిధ్వనుల సంఖ్య ౧౩౨౬ గను, సంకరధ్వనుల సంఖ్య ౧౩౨౬ × ౩=౩౯౭౮ గ నలంకారశాస్త్రవేత్తలు లెక్కించియున్నారు.

౨ మధ్యమకావ్యము- ఇది ఎన్మిదిభేదములు గలదిగఁ జెప్పఁబడినది. అవి ౧. అగూఢము, ౨. అపరాంగము, ౩. వాచ్యసిద్ధ్యంగము, ౪. అస్ఫుటము, ౫. సందిగ్ధము, ౬. తుల్యప్రాధాన్యము, ౭ కాక్వాక్షిప్తము, ౮. అసుందరము నై యున్నవి.

౩ అధమకావ్యము- ఇది అలంకారరూపముగఁ దనరెడిని. అలంకారములు- శబ్దాలంకారములనియు, అర్థాలంకారములనియు, ఉభయమనియుఁ జెప్పఁబడినవి. అనగా శబ్దచిత్రము, అర్థచిత్రము, ఉభయచిత్రము నని భావము. అందు శబ్దచిత్రమన శబ్దాలంకారములనియు, అర్థచిత్రమన అర్థాలంకారములనియు, ఉభయచిత్రమన శబ్దాలంకారము, అర్థాలంకారము గూడ (ఉభయ సంయుతము) ననియు నెఱుంగునది.

**కావ్యుఁడు (శుక్రుఁడు)**—కవి పుత్త్రుఁడని భావము. శుక్రాచార్యుఁడు రాక్షసగురుఁడు.

పితామహుఁడు భృగుమహర్షి. సోదరులు ధాత, విధాత. పుత్రులు చండామార్కుఁడు, త్వాష్ట్రి, త్వష్ట్ర, భద్రకర్ముఁడు. కుమార్తెలు అరజ (యోగిని), దేవయాని (యయాతిమహారాజు భార్య).

**కావోలిన్** — బంకమట్టి చూడుఁడు.

**కాశకుశావలంబన న్యాయము**— నిరాయుధుఁడై ఎదిరింపఁజాలక గడ్డిశల్యంజేతబట్టినట్లని యర్థము. వాదమున నిర్వహింపఁజాలక వేరొక నిరర్థక వాదప్రయత్నము సల్పుటయని భావము.

ఓటమి సిద్ధమగుట, వేఱునిరర్థకమగు బలహీన వాదమునకుం బ్రయత్నించుట మొదలగు పనులను నిరసించుటయం దీన్యాయమును వాడుదురు.

**కాశికిపోతే కఱ్ఱికుక్క గంగిగోవగునా?** — ఆంధ్రలోకోక్తి.

**కాశికిపోయి కుక్కబొచ్చు తెచ్చినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**కాశీక గోత్రము** — అయాస్యకౌప గణము చూడుఁడు. ఔతథ్య ఉపగణము చూడుఁడు

**కాశితకి గోత్రము** — నిధ్రువగణము చూడుఁడు.

**కాశీ దేశము** — తొల్లింటి కాలమున నొకప్పుడు సంయుక్త రాష్ట్రములలోని బనారస్ పట్టణము రాజధానిగ దానిపరిసరములోని చిన్న రాజ్యముగనుండెను. రాజధాని కాశీ (కాశీదేవి క్షేత్రమగు కాశీ లేక బనారస్ పట్టణమే). ప్రజలకు కాశీలని వాడుకయుండెను. వీరు చాల బలముగలవారని పేరందియుండిరట.

**కాశీక్షేత్రత్రయము** – ౧ వారణాశి (కాశీ)- దీనిని బనారస్ అనెదరు. ఉత్తరహిందూస్థానమున సంయుక్తరాష్ట్రములలో నున్ననగరము. ౨ గుప్తకాశీ-హిమవన్నగ దేశమున గడ్వాల్‌లో ఉఖీమఠముకడ నున్నది మందాకినీతీరము; హరిద్వారమునుండి ౧౨౫ మైళ్లు. హరిద్వారము నుండి బదరీకేదారమున కేగు మార్గము. 3. ఉత్తరకాశీ - హిమవన్నగమున బారాహాట్ అనఁబడు తావునకు సమీపము. గంగానదీతీరము. డేరాడూన్ నుండి ౮౦ మైళ్లదూరము. గంగోత్తర కేగు మార్గము

**కాశ్మీరదేశ చరిత్ర** — కాశ్మీరదేశము భరతభూమి కుత్తరమున హిమవత్పర్వత పఙ్త్కుల మధ్యనున్న లోయ. ఆదికాలమున నీ లోయయంతయు జలమయమై సరస్సుగ నుండెడిది. ఇచటి హరముఖ పర్వతమున నక్కాలమున పరమేశ్వరుఁడును, వారి శక్తియగు సతీదేవియు లీలావతారులో యనునట్లు మాయాశరీరధారులుగ వసించుచు విహరించుచుండిరి దానినుండి కాశ్మీర దేశపులోయయందున్న సరస్సునకు సతీసరస్సనియు అందిప్పుడు ఊలూరు లేక్ అనంబడు జలనిలయమును, ఆలవాలమనియు వాడుచుండిరి. ఆప్రాంతముల నాగజాతివారు వసించుచుండిరి. వారికిం గస్యపమహర్షి సంతతివాఁడగు నీలభూపతి ప్రభువై పాలించుచుండు వాఁడు. అత్తరుణముననే జనకంటకుం డనందగిన మహాదుర్మార్గుండగు జలోద్భవుండను రక్కసుండొకఁడు సపరివారముగ నా సతీ సరోవరప్రాంతములను, అవసరమగుతరి సరోవరమునందునను వసించుచు, భరతఖండ నివాసుల యొక్కయు, దేవతల యొక్కయు సత్కర్మానుష్ఠాన చర్యలకు ధ్వంసము గల్పించుచు బాధించుచుండువాఁడు.

భూపాలుండగు నీలమహీపాలుండు తన ప్రజలీజలోద్భవునిచే నంకుచుండు నిక్కట్టును, వాని యధర్మవర్తనలను గాంచి మోర్వఁజాలకయు, చేయునదిలేకయు గొప్ప తపంబొనర్చి, కశ్యప

మహర్షి మూలమున దేవతాప్రసన్నతం గల్గించు కొని దేవగణముల నటకు రప్పించి దానవునిం బరిమార్ప యత్నించెను. కాని దానవుండు పరివార సమేతుండుగ నీట నప్పుడు హరిపర్వత మనంబడుచున్న కొండయందొక కందరము నందు దాగి కుశలుండై యుండ, దేవతలు చిక్క మొగములు వైచియుండ, దేవకార్య నిర్వహణ ముం కటకటంచి సైన్యములకు ముందుగ నిలచి యుండి శ్రీకృష్ణబలరాములు వితస్త (ఇప్పటి జీలమునది) ప్రవహించు కనుమమార్గమున కనుమం దింపుజేసి నీరవ్వలకుం బార మార్గ మేర్పర్చిరట. నీరవ్వలకుం బ్రవహించ నేల బయల్పడి రక్కసుండు విధిలేక బయటికే తెంచి యుద్ధసన్నద్ధుండైన కతం శ్రీకృష్ణుండు సంగరో న్ముఖుండై రక్కసునిం గూలంజేసి దునుమాడి శాంతిం గల్గించెనట. సతీసరోవర మటుల భూప్రదే శమై కశ్యపర్షి దేశమని పేరిడంబడియు, కాలము గడచినకొలంది కాశ్మీరముగ పేరు మారియున్న దట. దేశప్రజలగు నాగులకు దేశికులై పురో హితులైయుండ నియమితులగు విప్రు లిప్పుడు కాశ్మీరపండితులనంబడుచున్నారు.

ఇక నిక్కాలమున కొండతీపూర్వకథనమును నమ్మకుండినను భూగోళశాస్త్ర పరిశోధకులు కాశ్మీరపరిసర పర్వతోపరిభాగ లబ్ధములగు ముత్యపుచిప్పలు, నత్తగుల్లచిప్పలు మొదలగు వాటిం జూచి, ఈ ప్రాంతమంతయు నొకప్పుడు జలనిలయమై యుండియుండవలయునని యంగీకరించు టను కాదనంజాలరు. ఇదియే శ్రీకృష్ణావతార కాలమున గల్గింపఁబడిన దేశము. కుంకుమపూవు నకు జన్మప్రదేశము కాశ్మీరభూమి.

కలియుగమాదిగ క్రీ. వె ౧౯౩౮ సంవత్స రము వఱ కించుమించు ౫౦౩౯ సంవ త్సరములైనవి. అందు క్రీ. వె. వెనుక గడచిన వత్సరములు ౧౯౩౮ ను, క్రీ. ముచుపు సంవత్స రములు ౨౫౦ గలపిన ౨౧౮౮ సంవత్సరము లగును. ఈ కాలమును కలియుగారంభమునుం డియు గడచిన ౫౦౩౯ నుండి తీసివైచినచో ౨౮౫౧ సంవత్సరములు మిగులును. ఈ కాలము తరువాత చరిత్ర మనకు తెలియరాకున్నది. కల్హణ పండితుని రాజతరంగిణి మొదలగు గ్రంథ ములవలన క్రీ. పూ. ౨౫౦ నాంటివాఁడగు అశోక చక్రవర్తి కాలమునుండియు మనకుఁ గొద్దిగనో గొప్పగనో చరిత్ర దొరకుచునేయున్నది. కాన దానినే వివరింపవలయును.

అశోకచక్రవర్తి పాలనముంగూర్చియు మన కంతగా తెలియదుకాని ఆ కాలమున నీ దేశము నొక ప్రధానస్థానమును నిర్మించి దానికి శ్రీనగర మని పేరిడెను. ఇట శ్రీ యనిన సూర్యుం డనియు, శ్రీనగరము సూర్యుని పట్టణమనియు, ఆ మహారాజాభిప్రాయార్థముగ బౌద్ధగ్రంథము లందు వివరింపఁబడినది. ఆ శ్రీనగరపు తావిప్పటి శ్రీనగరమునుండి నాల్గుమైళ్ల దూరమున రెండు దేవాలయములు తప్ప నేయానవాలు లేనిదై పాండ్రెంతా నని పిలువఁబడుచు, ఇస్లామాబాదు రస్తాయందు జీలమునది నంటియే యున్నది దీనిని స్పష్టముగ దెలియుట కశోకుని శ్రీనగరమని వాడుచుందుముగాక.

పిదప ప్రభుత్వమునకు వచ్చిన కాశ్మీర భూప తులు పేరందినవారు కారుకాని, క్రీ. వె. ౧౦౦ సంవత్సర ప్రాంతముల రాజ్యపాలన మొనర్చిన కనిష్కమహారాజు సుప్రసిద్ధుండు. ఈయన గాంధారదేశ మేలుచుండినవాఁడు, కుషాన్ తెగ కుం జెందినవాఁడు. ఈయన కూర్చిన బౌద్ధభిక్షు వుల మహాసభయందు త్రిపిటకములనంబడు బౌద్ధ మతవేదగ్రంథము కూర్పంబడినది. ఇది సుప్రసిద్ధ గ్రంథము. ఈ కనిష్కమహారాజు క్రీ. శ. ౧౫౦ వఱకు రాజ్యపాలన మొనర్చినవాఁడు.

ఆయనకుఁ బిదప హువిష్క మహారాజు కాశ్మీర సింహాసన మధిష్ఠించెను. ఈయన తన రాజధానిని హువిష్కపురమను పేరను వేఱుగ నిర్మించెను. అది బారాముల్లా (వరాహమూలపురము) పట్టణమునకు ఆగ్నేయ దిశగా రెండు మైళ్ళదూరమున నున్నది. ఇప్పుడు ఉష్కూరని పిలువఁబడుచున్నది. తరువాత లలితాదిత్యుఁ డీహుష్కపురముననే బౌద్ధస్తూపమును మఠమును నిర్మించెనని తెలిసెడిని. ఈ కుషాను భూపతులగు ఇద్దఱి కాలముననే గ్రీకుదేశముతో రాకపోక సంబంధము లధికముగ నుండెను. గ్రీకుదేశపు గృహనిర్మాణవిధానము కొంత వఱకు కాశ్మీరదేశమం దవలంబింపఁబడెను. ఈ గ్రీకు శిల్పకళ కాశ్మీరదేశపు ఆనాఁటి దేవాలయములందు స్పష్టముగఁ గానఁగనగుచున్నది.

కుషాను భూపతుల తరువాత కాశ్మీరసింహాసన మధిష్ఠించిన భూపతులలో క్రీ. వె. ౧౦౦ వఱకు సుప్రసిద్ధులు గానరారు. క్రీ. వె. ౫౦౦ ల కాలమున రాజ్యమునకు వచ్చిన శ్వేతహూణుఁడగు మిహిరకులుం డను నృపతి కిముకుర్మార్గుఁడనియు, క్రూరుఁడనియు తెలియుచున్నది. ఈతఁడు శివభక్తుఁడని బలసైన వాడుకకలదు. ఈతని పరిపాలన విధానములు తెలియవు. కల్హణపండితుఁడు తన రాజతరంగిణియం దీతనిని మానవవైరి యనియు, వయస్సు గడచినవారియందు గౌరవమును, స్త్రీలయందు మర్యాదయు, బాలురయందు కనికరమును లేని క్రూరునిగ వివరించుచు ఈతం డొసంగిన భూదానములం బరిగ్రహించిన విప్రులను నిరసించియున్నాఁడు. ఈయన ఎంత కాలము పాలించెనో తెలియరాదు కాని, ఆఱవ శతాబ్దాంతకాలమున సింహాసన మధిష్ఠించిన ప్రవరసేనమహారాజు ఇప్పటి శ్రీనగరమునందలి తూర్పుభాగమున తన రాజధానిని తనపేరట ప్రవరపురమను పేరున నిర్మించుకొనెను. మరియు సీతఁడే జీలమ్‌నదిం దాటుటకొక పడవల వంతెనను నిర్మించెను. ఇతఁడు ఇప్పటి శ్రీనగరమునందలి డాల్లేటునుండి జీలము నదీతీరమున పట్టణము దనుక చీనారుబాగు డాల్లేకుల నడుముగా జీలము వెల్లువవలన నపాయము గలుగకుండునట్టుల నొక గట్టుఁ బోయింపనారంభించినట్లుల చెప్పఁబడినది. ప్రవరసేనుని మేనమామ జయేంద్రుఁ డీప్రవరపురమున జయేంద్ర మఠమను గొప్ప బౌద్ధ సన్యాసాశ్రమమును నిర్మించెను. ఇట్టుల నీకొత్త రాజధాని సకల వైభవోపేతమగుచున్నను అశోకుని శ్రీనగరమునకంతయు దగ్గరగ నిలచియుండెను. క్రీ. వె. ౬౩౧-౬౩౩ హ్యూయనత్సాంగను పేరుగల చీనా దేశస్థుఁడు కాశ్మీర దేశమునకే తెంచి ఈదేశమునందుండియే ఆ రెండు సంవత్సరముల కాలమున నాతఁడు తిరిగిన ప్రయాణకాలముతప్ప దక్కినకాలమున ఈజయేంద్ర మఠముననే వసించెను. ఆయన బారాముల్లా పురముగూడా నడచివచ్చి తొలిరాత్రి హువిష్కపురముననే (హుష్కూరు) గడపెనని ఆయన వ్రాసిన యాత్రాచరిత్రయందు కలదు.

పిదప క్రీ. వె. ౭౧౦ ప్రాంతముననో లేక ఎనిమిదవ శతాబ్దారంభ కాలముననో లలితాదిత్య ముక్తాపీడుఁడగు మహాబలాఢ్యుఁడగు భూపతి సింహాసనమధిష్ఠించెను. ఆయన భరతదేశము కొన్ని యుద్ధములొనర్చెను. టిబెట్టు దేశమున యుద్ధమొనర్చెను. చీనాదేశమునకొక రాయబారి నంపెను. దీనిగూర్చి చీనాప్రభుత్వపు రికార్డులందు ఉదహరింపఁబడియున్నది. ఈ భూపతి హిందువుఁడు; సకల మతసహనము కలవాఁడు. కాశ్మీరదేశమున సుప్రసిద్ధమగు మార్తాండ దేవస్థానమున కట్టడములను విరివిగ కట్టించెను. కాశ్మీరరాజులు పెక్కండ్రవలె నీయనయు తానొక వేఱురాజధానిని నిర్మింపఁజేసికొని దానికి పరిహాసపురమని పేరిడెను. అందు గొప్ప

దేవాలయనిర్మాణముల నొనర్చెను. పరిహాస పురమిప్పటి పాదీపూరు తన రాజధానియగు పరిహాసపురమున నొక బౌద్ధమఠము గట్టించి అందొక గొప్ప బుద్ధవిగ్రహము చేయించి స్థాపింపఁజేసెను. మరియు హుష్కపురమున నొక బౌద్ధస్తూపమును, ఒక బౌద్ధమఠమును నిర్మించినవాఁడని మున్నె వివరింపఁబడి యున్నది. ఈరణశూరుఁడొక కలహమునందే ప్రాణములు విడిచెనందురు. లలితాదిత్యునకుంబిదప క్రీ. వె. ౮౫౦ వఱకు రాజ్య మేలిన భూపతులు చాల బలహీనులు. క్రీ. వె. ౮౫౦ లో అవంతివర్మ మహారాజు రాజ్యమునకు వచ్చెను. ఈయన పరిపాలనకాలమంతయు ప్రజల యభివృద్ధికి దగిన పనులొనర్చుటయందే వినియోగించిన వాఁడు పరరాజ్యములకై యుద్ధములొనర్చు తలంపీయనకు లేనేలేదు. పిక్కండ్రు కాశ్మీర భూపతులవలె తనరాజధానిగ నవంతిపురమును నిర్మింపఁకొనియెను. అయూరిప్పుడు శ్రీనగరము నుండి ఇస్లామాబాదు (తొల్లింటి యనంతనాగ పురము) నకేగు మార్గమున సగముదూరమున నున్నది ఇది పిదపకాలమున కొంత మట్టిదిబ్బగ వేయఁబడి పోయియుండ, ఇటీవల ప్రభుత్వము వారిచే త్రవ్వింపఁబడి బయలుదేరదీయఁబడియున్న ఇందు రెండు గొప్ప దేవస్థానములు బయల్పడినవి

ఈయనకాలమున సూర్యుఁడను ఎంజినీయరుండువాఁడు. అవంతివర్మపాలనకాలమున జరిగిన పెద్దపనులు కొన్నికలవు. జీలమునదిలోని జలములను వేఱుమార్గమునకుం గాలువత్రవ్వి త్రిప్పి, వేఱుమార్గమున ఊలారు (తొల్లింటి అలవాలము) సరస్సునందుచేర్చి వేఱుమార్గమున నది పైకివెడల కాలువంద్రవ్వించి తొల్లింటి సింధు నదికిం జేర్పించెను. ఇందువలన అపరిమితప్రదేశము బయల్పడ దానిగుండా నీటికాల్వలంద్రవ్వించి పంటభూములుమార్చి గ్రామముల నిర్మించెను. అందొకటి సూర్యపురమని ఎంజినీయరుగారిపేరం బఱగుచు నేటికిని అట్లేయున్నది. కల్హణ పండితుఁడు ఈపట దేశసమృద్ధమై తొల్లింట కరవారప్రమాణధాన్యము ఇన్నూట దీనారముల విలువం గల్గియుండినది. ముప్పదియాఱు దీనారము (టంకము లేక రూప్యము) లయ్యెనని వ్రాసెను.

అవంతివర్మకుం బిదప టిబెట్టుభూపాల సుతుఁడగు రించనుషా అను యావనుఁడు తండ్రిపై తిరుగఁబడి కలహించి కాశ్మీరముపై దాడివెడల నుద్యుక్తుఁడై విఫలమనోరథుఁడై లహారా దుర్గముపై రక్షక సామంతుఁడగు రామచంద్ర నరేంద్రుని నిహతుంజేసి, ఆయన భోగవనిత నెత్తుకొనిపోయెను. తానుమహమ్మదీయుఁడైన తనకు సహాయ్యము కలుగునని కాబోలు బుల్బుల్లా యను పేరుగల ఫకీరునకు శిష్యుఁడై సదరుద్దీనను పేరున మహమ్మదీయమతస్థుఁడై గురుఁడగు బుల్బులుషా మరణించుకతన నట బుల్బుల్లాంకారను పేరున నొకదరగానిర్మించి తానును క్రీ. వె. ౧౩౨౫ లో మృతుండాయెను. తోడనే యాతనికి భార్యగా నుండిన (తొల్లింటి రామచంద్రుని భోగవనిత) కాశ్మీరదేశ మేలుచుండిన కడపటి హిందూ నృపాలుని కడకుఁ జేరుకొనియెను. ఆనృపతియు ౧౩౪౩ లో మరణింప షామీర్జా యను సైన్యాధిపతి కాశ్మీరసింహాసన మాక్రమించి వెనుకటి నృపాలసోదరుని కడనున్న వనితం గాంక్షించి బలాత్కరించెను. ఆమె బలాత్కార మరణమునందెనని చెప్పఁబడినది. షామీర్జా పారశీక దేశమునందలి హమదానుపురము నుండి మీరుసయ్యద్ అలి యను నామము గల షాహామాదానను పండితుని రావించి దేశమును మతముపాల్సేయ మొదలిడెను. అయనగోరీ ఇప్పటి శ్రీనగరమున మూడవవంతెన, నాల్గవ వంతెనల నడుమ గానవగుచున్నది. ఇట్లుండ సికిందరను మహాత్ముఁడు కాశ్మీరముఁజొచ్చి దేవ

స్థానములను భగ్నమొనర్ప మొదలిడెనట ఈ దుర్దశయందు ప్రజలనేకులు దేశము వీడిరి. పారిపోయిన రైతులకు పొలములు, ఇండ్లు నిలువను లయ్యెనట.

సికిందరునకుం బిదప రాజ్యాధిపతియైన సుల్తాన్ జేయునులబ్దీనుగారు కొంతవఱకు అన్యమత సహనము కలవారగుట శాంతినెలకొల్ప ప్రయత్నించిరి. ఈయనకాలము క్రీ. శ. ౧౪౨౦ ౧౪౭౦ అని చెప్పఁబడినది. ఇప్పుడు నాల్గవ వంతెనయని చెప్పఁబడుచున్న వంతెన ఈసుల్తాను గారి నిర్మాణమేనని యందురు. జామామసీదు నిర్మించెననియు, ౧౪౭౨ మహాక్షామమున ప్రజలను రక్షించెననియు చెప్పఁబడినది. దేశమున పంటకాల్వలఁ గొన్నిటిఁ ద్రవ్వించెనని చెప్పఁబడినది. ఈయన సింహాసనమెక్కుట క్రీ శ ౧౪౧౭ అని కొందఱనుచున్నారు. క్రీ శ ౧౫౮౬ లో కాశ్మీరము మొగలాయి సామ్రాజ్యమునకు జేరిపోయెను. అక్బరుచక్రవర్తి పాలనము సుప్రసిద్ధమేగాన వేఱుగ వ్రాయఁ బనిలేదు. ప్రజలందు తిరుగ శాంతిగల్గెను హారిపర్వతముం జుట్టి యొకదుర్గము నిర్మింప నక్బరు మొదలిడెను. ఇది పారిపోయిన ప్రజలను తిరుగి కాశ్మీరమునకు రప్పింప నాయనతలంపని కొందఱనెదరు ఆయన తన వేసవి నివాసముగ కాశ్మీరముఁ నేర్పఱ్చుకొనియెను. దాల్లేకునం దిప్పుడు గల ఫ్లోటింగు గార్డెన్సు తొలుత అక్బరుచక్రవర్తి ఏర్పఱ్చినవే యని యందురు. సగటున ఔరంగజేబు కాలము వఱకు దేశమల్లకల్లోలములు లేక శాంతిననుభవించినదని చెప్పఁబడినది. మొగలాయి రాజ్యమస్తమింపఁగనే కాశ్మీరమునకుఁ గష్టములు తల సూప మొదలిడెనట. దేశము ముక్కముక్కలై ఆఫ్ఘనుల పాలఁబడియెనట. ఇది క్రీ శ ౧౭౫౦ ప్రాంతమని చెప్పఁబడినది. ఇట నాశకాబ్దాంతము వఱకుఁ గడచెనట.

క్రీ. శ. పందొమ్మిదవ శకాబ్దారంభమున సిక్కులు విజృంభించుచుండిరి. ఒత్తిడిచే నిరాశ జీవనములం గడపుచున్న కాశ్మీరదేశస్థులకు శిక్కులను తమరాజ్యాధిపతులుగఁ జేయఁదలంపు నుదయింపసాగెను అప్పటి శిక్కుప్రభువగు రంజితసింగు నృపాలుఁడును సిద్ధమయ్యెను ప్రజలాహ్వానించి యాతనిపాలన నిచ్చగించుచుండిరి. ఆఫ్ఘనులందఱినివైచి యాతఁడు సింహాసనమధిష్ఠించెను ఇది క్రీ శ ౧౮౧౯ ప్రాంతము. క్రీ. శ. ౧౮౧౯ లో రంజితసింగు నృపాలుఁ డాఫ్ఘనుస్థానముఁ గూడ జయించెఁగాని నిల్పుకొనలేక కాశ్మీరమున స్థిరపడి జీవించియున్నదనుక నేలెను. ఆయన పరిపాలనంగూర్చి అంతగా తెలియకున్నను పన్నుబాధ మధికముగనే యుండెనందురు. క్రీ శ. ౧౮౪౬ లో మొదటి సిక్కు-యుద్ధమునకుంబిదప బ్రిటిషిండియా ప్రభుత్వము వారు సిక్కులను కాశ్మీరమున అధికారపదవినుండి తొలగించక వీలులేకపోయెను బ్రిటీషుప్రభుత్వమునకు సిక్కులతోనడచిన కలహములందు జమ్మురాజ్యపు ప్రభుఁడగు గులాబుసింగుగారు బ్రిటీషువారి పక్షమున పోరుచు సిక్కులందఱిమివైచెను. బ్రిటీషువారును అట్లుగెలిచిన కాశ్మీరరాజ్యమును గులాబుసింగు భూపతికి క్రీ. శ. ౧౮౪౬ లో వశపఱచిరి. ఈభూపతి డోగ్రావంశ సంభవుఁడు. క్రీ. శ. ౧౮౫౭ లో బ్రిటీషువారికింగల్గిన చిక్కులందు అచలుఁడై వారిపక్షమున నిలచిన వాఁడు. ఆయనకాలమున ఉద్యోగులు సరియగు వారు కుదరమి పరిపాలన సత్పథమునఁ జరుగదాయెనట. కాని ౧౮౭౭ లో కాశ్మీరమునకుఁ గష్టకాలముకూడ తోడయ్యెను. పంటనష్టము, క్షామము, రోగములు కూడ దేశమును జేరగొనెనట. పిదప వర్షివృద్ధింగాంచు పాడిపంటలందే గాక, చేతిపనుల అభివృద్ధి నందినవి. వర్తకమతిశయించినది. పరిపాలనము బాగున్నది. ఇండియా

ప్రభుత్వమునందిది బ్రిటీషురక్షిత సంస్థానరాజ్యమై యున్నది.

**కాశ్మీరదేశపు సామెతలు** — అంధునకు రాత్రి, పగలు ఒక్కటే. ఆకారము గొప్ప, హృదయము తోడేలు. ఎద్దునకుఁ గొమ్ములు భారమా? కనబడే శాలిగ్రాములకన్న ఎట్టి రాళ్లతో నడచుట సుఖము. తిన్నప్పటి తీపి డబ్బిచ్చేటప్పటికి చేదగును. నమ్మకస్తుఁడను పేరు సంపాదించుకొనుట డబ్బు గడించుటకు మూలమగును. పల్లెటూరిపులితో పట్టణపు కుక్క సమానము. పాము ఎన్నివంకరలుపోయినా తనపుట్టలోకే దారి. పెండ్లిలేనివాఁడు పెండ్లామే లేదని గొణుగుచుండగా, పెండ్లాడినవాఁడు ఎందుకు పెండ్లాడితినని గొణుగునట. బాల్యము బాధ్యతలు లేనిది. బాగచేరునిచోట్లనే గాబు పుట్టి పెరిగి బలపడు. మోసగాఁడు తప్పు తానైనా మోసగించుకోనిదీ ఉండలేఁడు. వ్యాముతో పాటిద బురద సేహ్యముకన్న సత్యము బలవంతము.

**కాశ్మీరదేశము**-సరిహద్దులలో కొంత మార్పు జరిగినను ఇతరపరిస్థితులందు దదేఁతిని, అదేపేరున నిలచి నేఁటికిని అటులనేయున్న దేశములలో నొకటి కాశ్మీరము. దీని కనేకతావులు రాజధానులైనవి. ప్రవరసేనమహారాజు ప్రవరపురమును (ఇప్పటి శ్రీనగరము) నిర్మించి రాజధానిగఁ జేసికొనెను. పిదప నశోకచక్రవర్తిపాల సమురా సత్తి శ్రీనగరమను రాజధాని నిర్మింపఁబడెను. కొంతకాలమునకా శ్రీనగరము కాలిపోయెను. ప్రజలందఱు ప్రవరపురమునకుఁ జేరుకొని అట కొంతస్థలముపుచ్చుకొని యిండ్లు గట్టుకొనుచు, ఆక్రొత్తపేటకు తమ శ్రీనగరము పేరిడిరట. నానాఁటికది బలపడి ప్రవరపురమను పేరు మాసి అంతకును శ్రీనగరమనియే వాడుక యయ్యెను. నేఁటికిని అట్లే నిలచియున్నది. విక్రమాంకదేవచరిత్ర రచించిన బిల్హణుఁడీప్రవరపుర వాసియె. ప్రవరసేనుఁడు క్రీ. వె. ౪౩౨ మొదలు ౪౭౪ మధ్య రాజ్యముచేసెను.

మరియొకప్పుడు అవంతివర్మ అవంతీపురము నిర్మించుకొని రాజధానిగఁ జేసుకొనెనట. వేఱొకప్పుడు పురాధిష్ఠానము రాజధాని. (ఇప్పటి పాంద్రితాన్) ఇది శ్రీనగరమున కాగ్నేయ దిశగా నాల్గుమైళ్లు. దీనిఁ గూర్చి రాజతరంగిణి గ౭౩వ పుటను ప్రశంస గలదు. అశోకచక్రవర్తిచేఁ బంపఁబడిన బౌద్ధమతబోధకుఁడగు 'మధ్యాంతికుఁ'డు అరవాలుఁడను కాశ్మీరనృపతిని బౌద్ధమతమునకుఁ జేర్చెనని "మహావంశ" మందున్నది. ఇంకను వితస్తా (ఇప్పటి జీలమ్) నదిపైనున్న అనంతనాగపురము (ఇప్పటి ఇస్లామాబాదు) ను ఒకప్పుడు రాజధానిగౌరవము నందినదే. మహమ్మదీయులప్రాబల్యమున పేరు మార్చఁబడినది.

ఈ ఇస్లామాబాదున కీశాన్యమున నైదుమైళ్ల దూరమున ప్రసిద్ధమగు మార్తాండ (సూర్య) క్షేత్రము గలదు. ఈ కతిపయదూరముననే మార్తాండ తీర్థము, విమలకమల తీర్థములును ఈ దేశమున సుప్రసిద్ధములు.

ఇస్లామాబాదు నుండి అరువదిమైళ్లదూరమున హిమవన్నగమునకుఁ జెందిన భైరవఘాటీకనుమల పై అమరనాథమను శివక్షేత్రము కలదు. మంచుచే గప్పఁబడియుండు దీనిశిఖరమునకు పశ్చిమభాగమున నొక గుహయందీదేవస్థాన మున్నది. దానినచటివారు భక్తిపారవశ్యమున నపరకైలాసమనెదరు. గుహకడనే జన్మించి, ఇటకేగుబాట ప్రక్కగనే ప్రవహించుచు క్రిందికిదిగి సింధునదిం జేరుకొను అమరగంగ యను చిన్ననది చాల పవిత్రమని తలంపఁబడుచున్నది. ఇది అమరనాథముకడ విభూతివలె యుండు ప్రదేశముగుండా ప్రవహించుటచే చాల గౌరవింపఁబడుచుండును.

దేవస్థానపు గుహాముఖము మూడు బారలు ఇరువదియైదడుగుల వెడలుపును, ఏబది యడుగుల ఎత్తును, కలిగి ముప్పది యడుగులు కొండలలోనికిఁ జొచ్చుకొనియుండి లోన మంచు లింగము గల్గియుండును. ఈ శివలింగము చంద్రునితో సంబంధముగలది. శుక్లపక్షమున దినదినాభివృద్ధినందుచు పౌర్ణమిదినమున ఎనిమిదడుగుల చుట్టుకొలతయు, మూడడుగుల ఎత్తు గల్గి స్ఫటికమువలె స్వచ్ఛమై తళతళ మెఱయుచు తేజోమయమైయుండి కృష్ణపక్షమున తగ్గిపోవుచు అమావాస్యనాటికి సశేషముండకఁ గరఁగిపోవును. శివలింగమున కిరుప్రక్కలను రెండు మంచు విగ్రహములు గానవచ్చుగాని అవి వృద్ధిక్షీణతల నందునవి కావు. శ్రావణ మాసమున కాశ్మీర ప్రభుత్వపు టుద్యోగుల రక్షణక్రింద యాత్రస్థు లట కేగుచుందురు.

తొల్లింట వరాహమూలపురమిప్పుడు బారా మూలా యనుపేరం బరగుచున్నది. ఇచటి వరాహదేవస్థానము మహమ్మదీయుల కాలమున భగ్నపఱ్చబడినది. ఇచ్చటి వరాహపర్వతము నేటికిని ఆపేరనె బరగుచున్నది. మున్నొకప్పుడు శంకరభగవత్పాదులు కాశ్మీరమునకేగి శ్రీనగరముకడనున్న సంధిమానపర్వతముపై జ్యేష్ఠరుద్రుండను శివలింగప్రతిష్ఠ చేయఁగ తదాదిగాన ర్చుచుఅటనుండినకతననాపర్వతమునకుసంధిమాన పర్వతమను పేరుమాసి శంకరాచార్య పర్వతమని పేరయ్యెనట. అశోకచక్రవర్తి సుతుండగు జలోకుండను నామాంతరముగల కునాలుండది యాక్రమించి బౌద్ధచైత్యము నటనిర్మించి యాగిరికి గోపాద్రి యని పేరిడెనట. పిదప మహమ్మదీయులు కాశ్మీరమాక్రమించి, అట నొక మశీదు గట్టి యాగోపాద్రి యనుపేరుమాపి తఖ్తిసులేమానను నామకరణ మొనర్చిరట. నేటికినది అట్లే పిలువంబడుచున్నది.

కాశ్మీరమున ఆలవాలమను సరస్సు కలదు. అద్దానినిప్పుడు ఊలూర్ సరస్సనుచున్నారు. ఇది కాశ్మీరములోనికెల్ల పెద్ద సరస్సందురు. ఇందొకజాతి దుంపలు, కాయలు విస్తారము లభించుగాన కొన్ని వేలమందికి జీవనము గల్గించుచున్నది. ఇంక నీదేశమందలి అచ్ఛోద సరోవర మిప్పుడు అబీహావ త్తని వాడఁబడుచున్నది. ఇది మార్తాండ క్షేత్రమునుండి యారుమైళ్ల దూరము. సిద్ధాశ్రమమనంబడిన మహాశ్వేతాశ్రమము నీతీరమున నుండెనట. కాదంబరియందు బాణభట్టారకుడును, విక్రమాంకదేవ చరిత్రమున బిల్హణుండును దీనిగూర్చి వివరించియున్నారు. బృహన్నారదీయ పురాణమున ప్రథమాధ్యాయమున దీనిప్రశంస కలదు. పర్వత శిఖరములం దీదేశమున చూడతగినది హరముఖ శిఖరము. మఱియు శ్రీనగరసమీపముననే కస్యపాశ్రమము కలదు. ఈ దేశవాసులలో కాస్యులనువారి ఋషిసంతతివారే యనుచున్నారు. ఆదివిష్ణువు మత్స్యావతారమెత్తిన పవిత్రస్థలి కాశ్మీరదేశమున జూపుదురు. పీర్పాంజాల్ అని పిలువంబడు పర్వత పాదమున కోన్సరనాగము(తొల్లింటి క్రమసరము) కలదట. క్రమపాదమని పిలువంబడు విష్ణుపాదముకలదు; అది మత్స్యావతార స్థలమను ప్రతీతియుకలదు.

**కాశ్మీర దేశపు సుప్రసిద్ధోద్యాన వనములు** — కాశ్మీరమునందు సుప్రసిద్ధములగు నుద్యానవనములు నాల్గు గానవచ్చెడిని. అవి షాలీమార్ బాగ్, నిషాత్ బాగ్, అచ్చిబాల్ బాగ్, బాష్మాషాహిబాగ్ అనంబడునవి.

౧. షాలీమార్ బాగ్ - రాజధానియగు శ్రీనగరము (తొల్లింటి ప్రవరపురము) నుండి తొమ్మిది మైళ్లదూరమున డాల్ సరస్సు (Dal Lake) నంటియే యున్నది. ఇచట పర్వతము నుండి సరస్సునందలి జలములదనుకఁ బ్రదేశమెట

వాలుగ నుండి సీకసుచెట్లు యుపవృక్షములుగల పర్వతముచే నూరుమైళ్ల చుట్టుబడియుండును. ఈ ప్రదేశమున కీపేరు కాశ్మీరదేశమును క్రీ. శ. ౭౯ మొదలు ౧౩౯ వఱకును ఏలినవారును, ప్రసిద్ధనిర్మాతయునగు రెండవ ప్రవరసేనమహారాజే యిడెనట. పాలీమారనగ అనురాగ నిలయమని యర్థము. నాటనుండియు నాప్రదేశమాపేరుననే దనరుచుండెనట. పిదప క్రీ. శ. ౧౬౧౯ లో జహాంగీరు చక్రవర్తియు ఆయన యనుంగుపత్ని నూర్జహాను బేగమును ఇప్పుడున్న సుందరోద్యానవన నిర్మాణ మాతావునే మొనర్చి అట్లే పిలువ సాగిరని చెప్పబడినది.

ఇది ౬౦౦ గజముల పొడవును ౨౫౦ గజముల వెడల్పుగలది. చుట్టు ఆవరణము గలదు. ఇందు మూడు భాగములు కలవు. వెలుపలి భాగ మెల్లరు వాడుకకును, తరువాతి మధ్యభాగము చక్రవర్తిగారి స్వంతవాడుకకును, మూడవ లోపలిభాగము చక్రవర్తినిగారి యొక్కయు, వారి ఘోషాస్త్రీల యొక్కయు వాడుకకై యేర్పఱుపబడియెనట. జనానాభాగము కడుంగడు సౌందర్యవంతము. తోటలన్నిటియందు షాలీమారు మిగుల మనోహరమని యెల్లరనెదరు.

౨. నిషాత్బాగు ఉద్యానవనము- ఈసుందరవనము డాల్ సరస్సు తూర్పుగట్టున నిప్పటి శ్రీనగరమునుండి యేడుమైళ్లదూరమున సుప్రసిద్ధురాలగు ముంతాజ్మహాల్ బేగముగారి తండ్రి అసఫ్ ఖానుగారిచే తమ స్వంత వాడుకకుంగాను నిర్మింపబడినది. దీని నిర్మాణము జహాంగీరు చక్రవర్తి పాలనకాలమున క్రీ. శ. ౧౬౩౦ ప్రాంతమని పొల్చుచున్నారు. దీనిపొడవు ౬౦౦ గజములును, వెడలుపు ౩[illegible]౦ గజములును కలదు. ఉద్యానవనము కొండప్రక్కనుండుట ఒకటికన్న నొకటి ఎత్తుగనుండు పండ్రెండు సమతలప్రదేశములుగ నిర్మింపంబడియుండుట దీనిని టెర్రేస్గార్డెన్సు అనియు ననుట కలదు. చీనారు వృక్షములు తఱచుగ నున్నవి. చాల నీడగనుండి ఎండవేళ కడుంగడు మనోహరమై నడుమ ప్రవహించుచుండు నీటికాలువలచే రమ్యమై యుండెడిని. ఇందు బహిఃప్రదేశ మాయనయొక్కయు, వెనుక ప్రదేశభాగము జనానాయొక్కయు వాడుక కేర్పఱుపబడినది. దీని యావరణగోడలు పదునెన్మిదడుగుల ఎత్తుగలవి. మూలలందు బురుజులు కలవు. ఇప్పుడిందు విద్యుద్దీపము లమర్చియున్నారు.

౩. అచిబాల్బాగుతోట - అచీబాలను నది యొక నీటియూటపేరు అది ఈతోటయందుండుట దీని కంతకు నాపేరే వాడుచున్నారు. దాని యుదకము లించుక పులుపుతోగల తీపిరుచిగల్గి మిగుల శీతలములై అతిమనోహరములుగనుండుటకుం దోడు పానమొనర్చిన బలహీనత, అలసట కాన్పింపక అవి శీఘ్రముగ నారోగ్యముంగల్గించెడిని. కాన రోగులు దీనినాసించి యరిగి పానమొనర్చుచు యారోగ్యముం బడయుచుందురు. కాశ్మీరదేశపు ఇస్లామాబాదు (తొల్లింటి యనంతనాగ) పురమున కైదుమైళ్ల దూరమునందున్నది. ఇస్లామాబా దిక్కాలమున కాశ్మీరదేశమునందు రెండవ పట్టణమని ప్రాముఖ్యతనందియున్నది. జహాంగీరు చక్రవర్తి దీనిని నిర్మించెననియు, దీని నీటియూటయందలి జలముల నతిప్రీతితో పానమొనర్చుచుండువాడనియు చెప్పబడినది. ఇది పర్వతపాదమునందతిసుందరముగనున్న ఉద్యానవనము. అక్బరుచక్రవర్తినాడు రచింపబడిన "ఐయినీఅక్బరీ" యను గ్రంథమునం దీనీటియూట ప్రశంసింపబడియున్నది. ఇందుగల మూడు సమతలప్రదేశము (టెర్రేసు) లందడుగ వేర్వేఱు జలపాతములు, జలనిలయములు (రిజర్వాయరులు) కలవు. అందు అచిబాల్ నీటియూట పెద్దది. ఇందొకచో ట్రౌటు చేపలం బెంచుటకొక చెఱువుకలదు.

౪. షాహ్మాషాహీబాగ్ - ఇదియు గూడ నొక జలబుద్బుదమే. దానినుండియే ఈయుద్యానవనము పేరందెను షాహ్మాషాహీ యనిన, జలబుద్బుద నాయకమణి యని యర్థము. ఈ యుద్యాన మీజలాశయము నాశ్రయించి యున్నది. దీనిని క్రీ. శ. ౧౬౩౨ లో షాజహాను నిర్మింపఁ జేసెను. ఇది శ్రీనగరము నుండి మూడు మైళ్ల దూరము. నీటిధారనీరు చాల మాధుర్యముగ నుండును. పంజాబునుండి విద్యార్థులిటకు వేసవి సెలవులం దరుదెంచుచుందురు.

**కాశ్యపగణము** — ఇది కాశ్యప సంతతి. దీనిని కేవల కాశ్యప గణమనియు నందురు. కేవలకాశ్యపగణము నందు- ౧. కాశ్యప, ౨. కస్యప యని రెండుగోత్రములు కలవు. వీటికి ప్రవరరూపము లైదు కలవు.

౧. కాశ్యప, అవత్సర, నైధృవ (త్రయార్షేయ ప్రవర) ౨. కాశ్యప, అవత్సర, నైధృవ, రేభ, రైభ (పంచార్షేయ ప్రవర) ౩ కాశ్యప, అవత్సర, నైధృవ, రేభ, రైభ, శండిల, శాండిల్య (సప్తార్షేయ ప్రవర). ౪. కాశ్యప, అవత్సర అసిత. ౫. కాశ్యప, అవత్సర, శాండిల్య.

**కాశ్యప గోత్రము** — కశ్యప గణము చూడుఁడు.

**కాశ్యప బుద్ధుఁడు** — గురుపాదగిరి చూడుఁడు.

**కాశ్యపి** — భూమియని భావము. కాశ్యపుఁడను విప్రునకు పరశురామునిచే యాగకాలమున భూమియంతయు దానముచేయఁబడుట భూమికిం గాశ్యపియని పేరయ్యెనని చెప్పఁబడినది.

**కాశ్యపీగంగ** – గుజరాతులోని సబర్మతీ నదిగ పద్మపురాణము ఉత్తర ౫౨ నందుఁ జెప్పఁబడినది.

**కాశ్యపుఁడు** – సర్పవిష హరణవిద్యను చక్కఁగా నేర్చిన ఒకవిప్రుఁడు. పరీక్షిత్తుమహారాజునకు శాపము కల్గుటవిని అతనిని తక్షకుఁడు కరవగనే తానావిషబాధ నివారించి ధనము సంపాదింపనెంచి, అతఁడేగుచుండెననియు, దారియందు తక్షకుఁడీతనిం గలసికొని ఈతనివలన నీతనిపని తెలిసికొని ఈతనికివలయు ధనమొసంగి వెనుకకుఁ బంపివేసెననియుఁ జెప్పఁబడినది

**కాశ్యుఁడు** — అత్రి సంతతి. చంద్రవంశము. పురూరవ, ఆయువు, క్షత్రవృద్ధుఁడుసంతతి. తండ్రి సుహోత్రుఁడు. సోదరులు కుశుఁడు, కృత్స్నమదుఁడు. కుమారుఁడు ధన్వాంతరి ఈతఁడు కాశిరాజు ఈతని సంతతివారికిఁ గాశ్యులని వాడుకపేరయ్యెను. మరియు వేరొక కాశ్యుఁడు బృహద్విషుని సంతతియందు సేనజిత్తు కుమారుఁడు నీపేరుగలవాఁడే గలఁడు.

**కాశ్యహాయన గోత్రము** — నిధృవ గణము చూడుఁడు.

**కాషన్ మనీ** — Caution money (ధరావత్తు సొమ్ము). (వాణిజ్యసంబంధ పరిభాషా పదము). కంట్రాక్టు తనకంట్రాక్టు చక్కఁగ నెరవేర్చుటకు బాధ్యతం గల్గియుండుటకుఁగాను చెల్లించిన ధరావత్తుసొమ్ము.

**కాష్టరేఖి గోత్రము** — కౌతస్య ఉపగణము చూడుఁడు. కొమండ ఉపగణము చూడుఁడు.

**కాష్గార్ దేశము** – ఖారోష్ట్ర దేశము చూడుఁడు

**కాష్ఠాయన గోత్రము** — నిధృవ గణము చూడుఁడు.

**కాస** — దగ్గులకు సాధారణముగ కాస రోగమందురు. దగ్గులు అనేకవిధములు కలవు.

**కాసఖ గోత్రము** – కపి ఉపగణము చూడుఁడు.

**కాసరనాడు (సీమ)** — కాసలనాటి లేక కాసులనాటిసీమ యనియు నగును ఆంధ్ర దేశమునందలి పశ్చిమగోదావరీ మండలమునందలి నరసాపుర ప్రాంత సీమ కొకప్పు డీపేరు వాడుక యందుండెను ఆంధ్ర బ్రాహ్మణులలో కొంత శాఖ వారగు కాసరనాటివారను వారికి శాఖానామ మిచ్చినసీమ ఇదియే

**కాసరి చెట్టు** — (కామంచి చెట్టు). లా. Solanum nigrum, సం. కాక, మాచీ అనిపేర్లు. కాచిచెట్టనియు, కాసరచెట్టనియు గాజు పండ్లచెట్టనియు కూడ వాడుచున్నారు ఇది ఏటేట పుట్టుచుం జచ్చుచుండెడి చెట్టు. ఇది నల్లని పండ్లు కాయునది, ఎఱ్ఱని పండ్లుకాయునది, పసుపుపచ్చ రంగు పండ్లుకాయునదిగను త్రివిధమైయున్నది. అన్నిటికి గుణము నొక్కటిగనుండును. దీని కాయలు, ఆకు భోజనపదార్థములుగ వాడు చున్నారు. వైద్యులన్నిటిని ఉపయోగించెదరు త్రిదోషహరమైనది కొంచెము వేడిచేసి జఠరమునకు దీప్తికొసంగి, వీర్యవృద్ధిగల్గించి, విరేచనము జేయును. జ్వరములు, పాండురోగములు, మూల వ్యాధి, మేహము, వాపులు నడంచును. ఉబ్బులపై చక్కగ పనిచేయుననియు, పండ్లు చిన్నపిల్లల దగ్గులను శమింపజేయుననియు చెప్పం బడినది కాసరతీగె యని ఇదే పేరున వేఱు తీగెపాకు పాదు గలదుగాని దీనికేసంబంధమును కలదికాదు.

**కాసరితీగె (పాదు)** — ఇది తీగప్రాకి కాయలుగాయును దీనికాయలు కూరచేయుదురు, ఎండించి వరుగు చేయుదురు. గుల్మరోగముల నడంచి, జఠరదీప్తి, పైత్యము, దేహదార్ఢ్యములం గల్గించును. నేత్రరోగముల హరించును దీనిఆకు పసరు, గుంపయు గర్భోత్పత్తిగల్గించునని చెప్పం బడినది విషదోషములను హరించును. వ్రణ ములు మానజేయును. ఉబ్బు జాడ్యము, వాత రోగములు, శ్లేష్మరోగములపైం జక్కగ పని చేయును. దుంపను చూర్ణమొనర్చియు వాడు చున్నారు

**కాసలి గోత్రము** — నిధ్రువగణము చూడుడు.

**కాసా** — ఇది యొక కులముగ నున్నది. ఈ కులమువారు ఆంధ్రదేశమున వెలమవారి గృహములందు పరిచారకులుగ నుందురు.

**కాసుకు గతిలేదు, నూటికి ఫరవా లేదు** — ఆంధ్రలోకోక్తి

**కాసు గొడ్డుకు రూక బందె** — ఆంధ్రలోకోక్తి.

**కాసోరు గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుడు.

**కాసె సర్వప్పకవి** — ఆంధ్రకవులలో మధ్యకవులనుఁ పేర్కొనంబడినవాఁడు. ఈ కవిం గూర్చిన విషయములు తెలియరాకున్నవి. కాల మును సరిగా తెలియందగిన నిదర్శనములు లేవు. ఈతఁడు రచించినది సిద్ధేశ్వర చరిత్ర మనంబడు ద్విపదకావ్యము. ఇది చరిత్రాత్మకమైనది ప్రతా పరుద్ర చరిత్రమని చెప్పవొప్పును. కూచిమంచి జగ్గకవి తన సోమదేవరాజీయమునకు ఈగ్రంథము నుండియె ముఖ్యాంశముల నెత్తికొనెనట.

**కాస్టిక్ సోడా (Caustic Soda)**— తయారుచేయు విధము- ప్రస్తుతము కాస్టిక్ సోడా తయారుచేయుటకు వైద్యుత విధానమే (Electrolysis) అమలులో నున్నది. ఈ విధానము మొదట కనిపెట్టి ఆచరించుచున్న వారు కాస్ట్నర్ అండ్ కెల్నర్ కంపెనీవారు. వారి పద్ధతిప్రకారము Electrolysis అనగా వైద్యుత పరిణామముచెందు సెల్ అనబడు ఆ స్తరణము మూడుఅఱలుగా విభజింపబడి యుండును. ఈగదులను విభజించు రెండు అడ్డు

గోడలును అడుగునంటియుండవు. కాని అడుగున నున్న నరదలలోనికి చేర్పబడుట కవకాశము కలిగియుండును కొసలనున్న అఱలో లవణ ద్రావము (Common salt solution) పారుచుండును. నడుమనున్న యఱలో జలముండును విద్యుత్ప్రవాహము (Electric Current) విడిచిపెట్టినతోడనే లవణద్రావములో కలిసిపోయిన లవణము సోడియమ్‌గాను, క్లోరైనుగాను వేరైపోవును విడువడిన క్లోరైను పైనున్న యఱలకు వానిపైనుదమర్పబడిన గాలి రంధ్రములగుండా వచ్చును కాని సోడియమ్ విద్యుత్ప్రవాహముతోడనే నడచుచు అఱ అడుగు భాగమునందున్న పాదరసముతో కలిసి సోడియమ్ అమాల్గమ్ అను నొక మిశ్రపదార్థమగును. అపుడొక విద్యుచ్చక్రముచే యంత్రము తయు మెల్లగా చలించునట్లు చేయబడును. అచలనము మృదువైన డోలికా చలనమువలె నుండును. ఇందువలన పాదరసము ఆయఱనుండి రెండవ యఱలోనికి జేరుకొనును. అపుడు మధ్యగదిలో నున్న మంచినీటితో దీనికి సంపర్కము కలుగును. అప్పుడది వెంటనే Decompose అయి లోనున్న ఉదజనిని విడిచిపెట్టి కాస్టిక్‌సోడా అగును.

**కాస్టు** (కిమ్మతు, ఖరీదు, వెల) Cost — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము). కిమ్మతు వెల, క్రయధనము. అమ్మువారు, కొనువారు కూడ నంగీకరించిన మూల్యము.

**కాస్టు అండ్ ఫ్రైటు** (Cost and Freight) — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. సరకుల క్రయము, మోతఛార్జీ కూడ కల్పి కొనువారు చెప్పినచోటునకు చేర్చి యప్పగించు ధర యని యర్థము.

**కాస్పియను సముద్రము** (Caspian Sea) — శాస్త్రవేత్తలచే డిప్రెస్సుడు సీ అనంబడుచున్నది (డెడ్ సీ చూడుము). ౭౬౦ మైళ్లు పొడవు రెండు వందల మైళ్లు వెడల్పు ౧,౮౦,౦౦౦ చతురపుమైళ్లు వైశాల్యము. సముద్రపు నీటిమట్టముకన్న దీని నీటిమట్టము ౮౫ అడుగులు తక్కువయని యందురు. ఇది డెడ్ సీ వలె సంతతముగ నెండిపోయి నశింపదనియు, ఎండి పోతగుకాలంబి దీని యొడ్డిరియనుగుంయుంగూడ తగ్గిపోవుచున్నదనియు కొందఱు శాస్త్రజ్ఞు లభిప్రాయపడియున్నారు. బ్లాకుసీ నీటిమట్టముతో సరిగా దీనియందొక యానవాలుండు తొల్లి యొకప్పుడీ రెండును కలిసియుండి పిదప వేరై యుండవలెనని కొందఱు తలంచుచున్నారు. ఈ కాస్పియనుసీ ఇన్లాండు సముద్రములలో గొప్పది యని పేరొందినది

**కాస్మొథియిజమ్** (Cosmotheism) - దీనిని Pantheism అనియు నందురు.

జగత్తంతయు పరమేశ్వర పదార్థమేయనియు దేవునకు ప్రత్యేక స్థలము లేదనియుం దెల్పెడి మతము.

**కాహలగోత్రము**- సాహుల గణము చూడుడు.

**కాహ్వాయనగోత్రము** — పరాశర గణము చూడుడు.

**కాళీకాష్టమి** — మహాష్టమి చూడుడు.

**కాళింగులు** - కాళింగులనగనే కళింగ దేశ సంబంధులని తెలియుచునే యున్నను, వీరింగూర్చి తెలియదగిన గ్రంథములు లభింపమి యెక్కువ పరిశీలనలు జరగవలసి యుండును. దేశమునందు సుప్రసిద్ధమగు విశ్వామిత్ర సృష్టింగూర్చి యెల్లరెఱింగియే యుందురు. కారణాంత

రముగ మహాతపస్సంపన్నుఁడును మహాప్రభావ సంపన్నుఁడు నగు విశ్వామిత్ర మహర్షి త్రిశంకు మహారాజునకొరకు ప్రతిసృష్టికి బ్రహ్మసృష్టి నోర్చెనని చెప్పఁబడినది. ఆప్రతిసృష్టియందే కాళింగు లనఁబడుచున్న జాతివారు విప్రులుగ సృష్టింపఁ బడిరని వారియందనేక బలమైన నమ్మకముగలదు.

వీరు కళింగ దేశమునకు, ఇటీవల ఆపరిసరము లను గాను నగుచున్నారు. బ్రహ్మసృష్టికిని విశ్వామిత్రసృష్టికి కలసిపోయిన పిదప వీరు సేద్య మొనర్చు వృత్తిగలవారుగ నుండిరట. ఇకాల మున వీరు ఆరు ముఖ్య తెగలుగ విభజనము నందియుంట తెలియుచున్నది. అవి బూర గాము కాళింగులు, కింతలి కాళింగులు, మొహిరి కాళింగులు, పాయికారి కాళింగులు, గౌడకాళిం గులు, ఒడ్డె కాళింగులు ననంబడుచున్న తెగలు. ఇందింకను వీరి పేరునందు ఉపశాఖలుగ వివిధము లగు తెగలింకను పిదప నేర్పడినవని తెలియు చున్నవి. కాని సమగ్రమగు భోగట్టాలభించుట దుర్లభముగ నున్నది.

ఇందు మొహిరి, గౌడ తెగలవారు మహేంద్ర గిరికి దక్షిణమునను, బూరగాం తెగలవారు ఉద్దానపు సముద్రతీర దేశము నందునను (ఉద్దా నము చూడుఁడు), ఒడియా కాళింగ తెగలవా రుత్కలులు విశేషముగ గల ప్రాంతములను, పాయికారీ తెగలవారు గుంసూరు సురడా సీమ లందునను అధిక కాపురములు కుదిరిరని చెప్పఁ బడినది. కింతలి కాళింగులు శ్రీకాకుళ ప్రాంత మున నున్న కింతలిగ్రామ పరిసరములందు నివసిం చువారుగ నున్నారు. బూరగాము గ్రామము ఉద్దాన వనసీమలందే యున్నది. వీరి వీరి కివి ప్రధాన నివాస సీమలుగనే యున్నవి. పరిసరము లగు నితర కాపులకును చెదరి కొందఱు కాన్పించు చున్నను ప్రధాన నివాస స్థలములివియే.

వీ రాదిని శివభక్తులగు స్మార్తవ్రులుగ నుండి రట. విశిష్టాద్వైత వైష్ణవ మత స్థాపకుఁడగు శ్రీమద్రామానుజాచార్యుఁడొకతరి వీరి సీమల గుండా జరుట సంభవించి వీరికి యజ్ఞోపవీతమును వైష్ణవ సంస్కారములకొసంగ, వీరు విశిష్టాద్వైత మతస్థులుగనై పెక్కండ్రు తిరుమణి శ్రీచూర్ణ ధారులైరనియు, వైష్ణవ మతావలంబులు కాని వారు యజ్ఞోపవీతమును మాత్రము ధరించిరనియు జనుశ్రుతమగు వాడుక వీరియందు కలదు. ఒడియా కాళింగులందు తప్ప తక్కిన తెగలవారు యజ్ఞోపవీత ధారులుగనే యున్నారు. యజ్ఞోప వీతము లేనివారిని ధరించువారలతి చులకనగఁజూచి వారితో కలియకున్నారు

ఈసందర్భమున నొకసంగతి వివరించుట సమంజసము. శ్రీకాకుళ ప్రాంత సీమయందు పర్లాకిమిడి సంస్థానమున ముఖలింగమను క్షేత్రము కలదు. ఇది సుప్రసిద్ధ శివక్షేత్రము. ఈదేవ స్థానమున నర్చనలు సలుపు పూజారులు కాళిం గులే. వీరు కింతలి తెగకుం జెందిన వారట. వీ రాదేశపు బ్రాహ్మణజాతివారివలెనే యుందురు. ఆదేవస్థానమందలి అర్చనావిధులను సమగ్రముగా నెఱపుచుండ నేర్చినవారు. వీరు విభూతి రుద్రా క్షలను ధరించువారు. ఇంక పాయకారీ తెగ వారు తమలోని యొక యంతశ్శాఖవారని వారనెదరు. ఇంకను తాము కాళింగులలో నగ్ర శాఖవార మందురు.

పిదప నుడువఁదగినది పైకారీ కాళింగశాఖ. వీరు శూరులు. ఆదికాలమున దేశప్రభువుల కడ బల్లెముం ధరించిన శూరులుగ కొలువుండెడివారు. పైక అనిన బల్లెమున కర్థము. దాని నుండియె వీరి తెగకు పైకారీ యని పేరు గల్గెను. వీరికి స్వదేశ ప్రభువులు ఆదరణ నెఱపుచు భూముల నిచ్చి యుండిరి. పిదప ఈస్టిండియా కంపెని

ఛారికాలమున గొప్పైన యశోవ్యాస్య సంపాదక కలహాముల కాలమున నాకలహముల నడుమట యు దధికతరమైన పరాక్రమముం జూపుచు చేసిన గొప్ప సహాయ్యమునకుం గుంపెనీవారు వీరిభూముల నీనాములుగ స్థిరపఱచిరి మఱియు నీపై కాకి కళింగపురముననే గుసూరు, సురడాలందరి తిరుగుబాటు కాలమున కంపెనీ వారి పక్షమున నిలచి వారి కృతజ్ఞతకుం బాత్రులయిరి ఏను తాము సంస్థానముల పైకాలమని గర్వముగఁ జెల్పుచుందురు. ఇప్పటి గంజాం మండలోత్తర భాగమునందు అంచు ముఖ్యముగ జమీందారీ లంగునను కాన నగుచున్నారు

తరువాతచెప్పఁదగిన తెగలు గూడ కాళింగులు, మొహరీ కాళింగులునై యున్నారు. వీరికాలమున వర్తకులుగఁ గాన నగుచుందురు. వీరు ముఖ్యముగ ధాన్యపువర్తకము జేయుచుందురు. కొంతవఱకు ధనవంతులు తెగగానున్నారు. వీరు జమీందారీ స్థానములందు ముస్తాజరీలు చేయుచుందురు. కొందఱు గొప్ప వారికి మోదీ (భోజన పదార్థముల నాదిచ్చు గుత్తేదారులు) లుగ నుందురు.

ఉత్కల సీమలందు కాపురములు కుదిరిన కాళింగులు ఉత్కలాచారములను, ఆంధ్రసీమలందు కాపురములు కుదిరిన కాళింగులు ఆంధ్రాచారముల నెక్కువగ నవలంబించి యుంటఁగాన నగును. ఒక్కలి, శ్రీకాకుళముల సీమలందు గ్రామ మునసబులుగ నీకాళింగు లధికముగ నుంట నాప్రాంతముల గ్రామ మునసబులను "నాయుడు" అను బిరుద నామమున వాడుటంజేసి ఆప్రాంత వాసులగు కాళింగులందఱు నాయుడు లనిపించుకొను చుందురు. కొందఱికాళింగులందు వైష్ణవ శాఖయు, స్మార్త శాఖయుం గూడ కలవు. అందు వైష్ణవసంస్కారముల నందియున్నవారు రెంతవవారి తన్నధికులుగఁ జెప్పుకొను చుందురు. వీరుకొంతలి యూరగాం కాళింగ శాఖల వారిండ్లయందు శుభాశుభకార్యములందు పౌరోహిత్యము నెఱపుదురట. ఓసియాకాళింగులు, పైకాకికాళింగులు, మొహరీ కాళింగులందు భోజనప్రతిభోజనము సహపఙ్క్తియు లేనే లేదట

ఎటులనైన యుత్తర సీమలందు కాళింగులు చైతన్య, వైష్ణవ ధర్మములను, దక్షిణప్రాంతముల రామానుజీయ విశిష్టాద్వైత ధర్మములను కొంత వఱకుఁ గ్రహించిరి. ఉత్తరపు వారియందు మేనత్త కూతురు గాని, మేనమామ కూతురు గాని వివాహ మాడరు మఱియు వారిని దోఁబుట్టువులవలెనె బిలచెదరు దక్షిణపు గాళింగులందు నిషేధము లేదు

కాళింగులందు ఋషి గోత్రములు కలవు. వీరియందు శ్రాద్ధములు పట్టుదలగ నాచరింతురు. పెద్దలైనవారు దీవాలను మాసము జరిపింతురు. ఏటేట మృత తిథులందునను, మహాలయ పక్షమునను తప్పక నెఱపుదురు. గుసూరు ప్రాంతముల కాళింగులకును, కొందఱు మొహరీకాళింగులకును జాతిభేదములు లేవు. వీరియందు కంచి కావేరియను పేరుగల ఒకమహాకావ్యము గలదు. అందు కేసరివంశస్థుఁడగు నొక యుత్కల మహారాజు గోదావరీనది వఱకుంగల దేశముం జయించి దాడియాత్ర వెడలి శత్రువుల నోడించి రాజ్యమాక్రమించి తిరిగి వచ్చుతరి (ఆయన కంచి గూడ జయించి యాక్రమించెనని చెప్పఁబడినది) పళానయందు విడసెనట. అత్తరి నీకాళింగులు తమ బ్రాహ్మణ వేషముల నాయనం దర్శించి దీవించి తమ విద్యలం బ్రదర్శించిరట. ఆభూపాలుండును సంతసించి వారికి బ్రాహ్మణ తరలా గ్రామము నగ్రహారముగ నొసంగినటుల చెప్పఁబడినది.

## కాళింద లేక కుళింద దేశము —

హిమవన్నగముపై ఖండారుపుచ్ఛ పర్వతప్రాంత

మనుష్య కొండలదేశముగ చెప్పబడినది. ఇందు యమునానది జన్మస్థానమును యమునోత్తరి తీర్థముకలదు. కాళిందదేశమున జనించుటచే యమునానదికి కాళిందీనదియనియు పేరుకలదు. అది జన్మించిన పర్వతమునకు కాళిందగిరి, కుళిందగిరి, యమునాగిరి యని నామాంతరము లుండెను. రామాయణమున కిష్కింధాకాండము ౪౦ యందు దీనిప్రశంస కలదు.

**కాళింది** — సూర్యుని (వివస్వతు) కుమార్తె. తల్లి సంజ్ఞాదేవి భర్త శ్రీకృష్ణుడు కాళింది లేక యమునానది ఈమెయంశమని చెప్పబడినది. (యమునానది చూడుడు).

**కాళిందీ నది** — యమునానదికిపేరు కలదు.

**కాళిదాసత్రయము** — మహాకవి కాళిదాసుచే రచింపబడిన కావ్యత్రయమును, నాటకత్రయమును, భాణత్రయమును గలసి కాళిదాసత్రయమందురు ౧ రఘువంశ మహాకావ్యము, ౨. కుమారసంభవ కావ్యము, 3. మేఘసందేశము (మేఘదూత), ౧ శాకుంతలనాటకము (అభిజ్ఞానశాకుంతల), ౨. విక్రమోర్వశీయము, 3 మాళవికాగ్నిమిత్రము ౧. పుష్పబాణ విలాసము, ౨. ఋతుసంహారము, 3. భామిని విలాసము.

**కాళిదాస మహాకవి** — ఉజ్జయిని నగరము చూడుడు

**కాళిదాసు మహాకవి** — సంస్కృత వాఙ్మయముతో పరిచయము గల వారికి కాళిదాసను పేరు సుప్రసిద్ధమని యెల్లరెరిగినదే. కాళిదాసనిన మహాకవి కాళిదాసని వాడుచుండు వారు పెక్కండ్రు గలరు. ఇటీవలి వాఙ్మయ పరిశోధనలవలన కాళిదాసొక్కడు కాడనియు మువ్వురాపేర ప్రసిద్ధిగాంచిన సంస్కృత కవులుండిరనియు తెలియుచున్నది

ఇందొకడు కాళిదాసు- ఉజ్జయినీ పట్టణము రాజధానిగ అవంతిదేశమేలుచుండిన విక్రమార్క మహారాజాస్థానము నందుండిన నవరత్నములని పేరుగాంచిన తొమ్మండుగురు మహావిద్వాంసులలో నొకడు. ఈయన మహాకవి యను బిరుద మందినవాడు. ఈయన రచించినవి రఘువంశము, కుమారసంభవము, మేఘదూత లేక మేఘ సందేశము, స్మృతిచంద్రిక, జ్యోతిర్విద్యాభరణ మను పేరుగల కాలజ్ఞానశాస్త్రము, మాళవికాగ్నిమిత్ర నాటకము, విక్రమోర్వశీయ నాటకము, అభిజ్ఞానశాకుంతల నాటకము ఋతుసంహారము, నళోదయము. ఇందు మాళవికాగ్నిమిత్ర మీయన కృతముకాదేమో నని కొందరు శంకించిరిగాని, పెక్కండ్రీయనదే నని స్థిరపఱచిరి. మఱియు నీ కాళిదాసు ఉపమాలంకారమును కవిత్వమునం దెక్కుడుగా బ్రయోగించినవాడుగ పేరొందెను. కవిత్వనారీరణి యను చక్కనిది

ఇంక నీమహాకవి కుమారసంభవము, మేఘ దూత, రఘువంశములను కావ్యములు రచించుటం గూర్చి యొక వింతకథ పండితులం దనుశ్రుతముగ వాడుకయందున్నది కలదు. దాని నిట వివరించుట సమంజసముకాదు. ఈమహాకవి భార్యయందత్యనురాగము కలవాడట. ఆమెయు సకలశాస్త్ర పారంగతురాలగు విదుషీమణి. కాళిదాసు సాహిత్యముంగల్గియు, ప్రసంగములందు అపశబ్దప్రయోగము లొనర్చుచుండు శబ్దసిద్ధిలేనివాడై యుండెనట. అతనిభార్య యపశబ్దముల నిరసించుచు నాతని దిరస్కరించుచుండెడిదట. తనభార్యయె తన్నుం దిరస్కరించుచుంటకు వగచుచు నాతండామెయందు బద్ధానురాగుండయ్యు నెట్టకేలకామె నెడబాసి యెటకో నేగి

సరస్వతి నారాధించి, ఆమె ప్రసన్నతవడసి తిరుగ నింటికిం జేరెనని వాచస్పత్యమునందు చెప్పంబడినది.

ఏదియెట్లైనను తిరుగ నిలుసేరునప్పటికి రాత్రి యాయెనట. తలుపుకడ నిలుచున్న భార్యయే తెరచి "అస్తికశ్చిద్వాగ్విశేషః" అని ప్రశ్నింప నాతండు తన ప్రజ్ఞం జూపందలంచియేమొ ఆమె ప్రశ్నయందలి మొదటిపదమగు "అస్తి" అను పదముతో మొదలిడి "శ్లో॥ అస్త్యుత్తరస్యాందిశి దేవతాత్మా । హిమాలయో నామ నగాధిరాజః" అనియును, రెండవ పదమగు "కశ్చిత్" పదముతో మొదలిడి "కశ్చిత్కాన్తా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః । శాపేనాస్తంగమితమహిమా వర్షభోగ్యేణభర్తుః" అనియును, శేషించిన "వాగ్విశేషః" అను పదములందు "వాక్" అను పదమును ప్రధానముగ గైకొని "శ్లో॥ వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే" అనియును, ఇటుల కుమారసంభవ, మేఘసందేశ, రఘువంశ కావ్యముల ప్రథమ శ్లోకములుగ రచించి యామెను మెప్పించి యామెంగూడి సుఖించుచు పిదప నాయాకావ్యములను రచించి పరిపూర్తి చేసెనట. పిదప విక్రమార్క మహారాజుచే గౌరవింపంబడి మహాకవి బిరుదముం గూడ వడసి యాస్థానకవియై యుండెనను నానుడికలదు.

రెండవ కాళిదాసు. భోజమహారాజాస్థాన విద్వాంసుండై భోజప్రబంధమను గ్రంథమును, పెక్కులు సమయోచితములగు చాటువులను రచించి పేర్వడసినవాండు.

మూడవ కాళిదాసు పేరు జగన్నాథమిశ్రుండనియు, అభినవకాళిదాసను బిరుదముందినవాండనియు, భామినీవిలాస మను గ్రంథమును రచించినవాండనియుం దెలియుచున్నది.

**కాళీకుమార్ డివిజను** — కూర్మాచల దేశము చూడుండు.

**కాళీగండకీనది** (కృష్ణానది) — ముక్తినాథము చూడుండు.

**కాళీఘట్టము** — ఇది కలకత్తాకాది నామముగనుండెను. ఇప్పుడు కాళీక్షేత్రమునకు మాత్రము వర్తించుచున్నది.

**కాళీనది జన్మస్థానము** — ఆగ్రా, అయోధ్య సంయుక్త రాష్ట్రములలోని కాళీకుమార్ డివిజనునందు ఆల్మోడానుండి కైలాసముకడకేగు మార్గమున గావామూర్ఖారు కాముంచుధ్య యార్ఖాగ్రామము కడ కలదు. ఇట భూమియందు నల్లగనేయుండును శిలలును నీలములంగాంచిలి నంబుపుగల్గియుండెడివి. ఇట్టిరాళ్ళ నడుమనుండి జలము ఉద్భవించి చిన్న ప్రవాహముగ నేర్పడి కాళీనదియగును. జన్మస్థానమున కనతిదూరమునందే కుటియాంక్తినది ఇందు సంగమించి ప్రవాహము వెడలుపగును. కాళీనది జన్మస్థానమున పిత్రర్చనలొనర్తురు. ఆల్మోడానుండి ౧౮౦ మైళ్ళదూరము.

**కాళీయుండు** — యమునానది యందలి ఒకమడుగు లేక గుండమున వసించుచుండిన ఒక విషనాగము. ఇతండు వ్రజమండల ప్రాంతము దుర్మార్గుండై క్రూరుండై పెక్కండ్ర వెతపించుచుండ శ్రీకృష్ణుండితని శిక్షించి వెడలనంపెనట. ఇతను భాగవతమున నిత్యాపునకు గరుడుండు నాతుంచ సౌభరియనుఋషి శపించెననియు నదికారణముగ నీకాళీయుండిందు జేరెననియు గూడం జెప్పంబడినది.

**కాళేశ్వరము** — గోదావరీ నదియందు పయోష్ణీనది సంగమమగు కావున నీ క్షేత్ర ముండును.

**కాక్షీవ గోత్రము** — ఆయాస్య ఉప గణము చూడుండు.

**కాక్షీవత గోత్రము** — ఇది ఆంగీరస సంతతిలోని గౌతమగణమందలి కాక్షీవత గణ

ముగ చెప్పఁబడిన గోత్రము. దీనికి ప్రవరరూపములు నాల్గుకలవు. ౧ ఆంగీరస ఔతథ్య, గౌతమ, ఔశిజ కాక్షీవత ౨ ఆంగీరస, ఔశిజ, కాక్షీవత. 3. ఆంగీరస ఔతథ్య, కాక్షీవత, గౌతమ, కామార ౪ ఆంగీరస, ఆయాస్య, ఔశిజ, గౌతమ కాక్షీవత

**క్యాయిక్తియో గోపురము (బర్మా)**

ఇది బర్మాదేశములోని యొక విచిత్రమని తలపంబడు నైసర్గిక కృతక విగ్రహముల దృశ్యము.

ఇట నొక్క గొప్ప గండశిలపై నొక కడవున్నట్లుగా దుప్పబడినట్లుండు, వేరొక గండశిలయు, దానిపై నిర్మింపబడిన యొకపాటి గోపురమును కలదు. ఆ గోపురమున బుద్ధభగవానుని శిరోజములలో నొకటి యుంచబడినదందురు. శాస్త్రవేత్తలు పరిశీలించి యొకానొక కాలమున రెండురాళ్లును కలసి ఒకేరాయిగ నుండినవిగను, పిదప బలిసి గాలికి నాజలకుఁ గదలుచు నున్నపై యిట్లాయెనియు ననుచున్నారు. ఇప్పుడు గాలికి ఉగ్గాటలాడుచు ముందువెనుకల కదలుచుండును.

ఒకప్పుడొక్క గొప్ప గాలివానకది క్రిందపడనున్న స్థితి నొక బౌద్ధభిక్షువొకఁ డెఱిఁగి భక్తులకడ ధనము సేకరించి, తనకడనుండిన బుద్ధభగవానుని శిరోజము నొసఁగి దానిపై నాగోపురము నట భక్తులొసంగిన ధనముచే నిర్మింపఁజేసెనట. ఆ నిర్మాణ మాయున దగ్గరనుండి Laws of Gravitation చక్కబఱ్పఁబడి, రాతిం బడనీయక నిల్పియుంచుచున్న దనియెదరు. యాత్రికులగు బౌద్ధులిట భక్తితో బుద్ధభగవానుని శిరోజమందలి గౌరవ సూచకముగా నట క్షౌరములం జేయించుకొని తమ శిరోజముల నర్పించుచున్నారు.

**కాంతేశ్వర క్షేత్రము** — అగ్ర అయోధ్య సంయుక్త రాష్ట్రములలోని అల్మోడా లేక కాళీకుమాన్ సీమ పరగణాపట్టు అన్నియులోని చంపావతి పరిసరములనున్న యొక సుప్రసిద్ధ శివక్షేత్రము. ఈ ప్రాంతమునఁ నే హింగుళాదేవి దేవస్థానము వేఱొక శిఖరమున కలదు. (హింగుళాదేవి చూడుఁడు. చంపావతి, కూర్మాచలము చూడుఁడు).

**క్రాఫ్ ఫోర్డు** —(Crawford) - నవీన కల్పితనామము ఇది Cranmer అనుపేరు (Canterbury Arch Bishop, స్వాంగపేరు. పురుష నామము. (క్రైస్తవ నామములు చూడుఁడు)

**క్లాన్ నా గయల్ సంఘము** — ఐర్లాండుకు స్వరాజ్య మిప్పించు సందర్భమున క్రీ. శ. ౧౮౬౭ ప్రాంతమున అమెరికాలో నివసించు ఐర్లాండు దేశస్థులచేత షికాగోనగరమున స్థాపింపఁబడిన సంఘము. ఇది బ్రిటీషువారిని వెడలింపుటకై ఏర్పడినదగును

**క్వార్టరు డే** (Quarter day) సంవత్సరమునందలి నాల్గుభాగములను గుర్తించు మధ్య దినములకు క్వార్టరు డే లని పేరు.

ఇంగ్లాండు, ఐర్లాండు దేశములందు మార్చి ౨౫ Lady Day అనియు, జూన్ ౨౪ Mid-Summer Day, సెప్టెంబరు ౨౯ Michaelmas Day, డిసెంబరు ౨౫ Christmas Day క్వార్టరు డే లని చెప్పఁబడినవి. స్కాట్లాండు నందు ఫిబ్రవరి ౨ వ తేదీ, మే ౧౫ వ తేదీ, ఆగస్టు ౧ వ తేదీ, నవంబరు ౧౧ వ తేదీయును క్వార్టరు డేలని చెప్పఁబడును.

**క్వాడ్రెంటు** (ఉపకరణము) - తురీయ, షడంశ, పరిశోధక సాధనములు చూడుఁడు.

మైక్రోబాహి పరిశీలకుఁడు చూడుఁడు.

**క్వాడ్రిలియను** - న్యూమరికలును చూడుఁడు.

**క్వాదియన్ మిర్జా మేహిన్డి** — పంజాబు దేశమున గురుదాసుపూరుజిల్లా బటాలా నుండి పదిమైళ్ల దూరమున నున్న క్వాదియన్ గ్రామ కాపురస్థుఁడగు మిర్జా ఘులామ్ అహమదు అను పేరుగల మహమ్మదీయుఁడు మహాత్ముఁడు తానుమహమ్మదీయ మత గ్రంథములందు, క్రైస్తవ మత గ్రంథములందు రాఁగల డని చెప్పఁబడిన రెండవ మెస్సయ్యా నని యు చెప్పెను. వారి కనేకులు శిష్యులు కలరట. వారినుండి అది యాత్రాస్థలముగ బరిగణింపఁబడు చున్నదట. ఏటేట క్రిస్టమసు పండుగులందట గొప్ప సభలు జరుగుచు న్నవి. వారందఱును మహమ్మదీయులు వారికి అహమెదీలని పేరు వాడుక గలదు. మహీదిగారే అట నొక గొప్ప అతిథి భవన మేర్పఱచి నిరతాన్నప్రదాన మొనర్చు చున్నారట. ఈ అహమెదీలు తెగవారి అట నొక హైస్కూలును, ఒక తర్వాణి పాఠశాలయు నడపుచున్నారు. కొన్ని పత్రికలు ప్రకటించు చున్నారట మిర్జా మెహిందిగారి శిష్యుండగు నొక వైద్యశిఖామణి యట ధర్మవైద్యశాలను ఏర్పఱచెనని తెలిసెడిని.

**క్వారంటైన్ (Quarantine)** — అంటు రోగము లంటియున్నవేమో యని పరీక్షలన కేర్పఱుపఁబడిన నివాసస్థానము. నలుబది దినము లని యర్థమిచ్చు Quarante అను మాటనుండి పుట్టిన పదము ఇప్పుడు వేఱ్వేఱు శాసనముల మేరకు వేఱ్వేఱు పరిమితికాలము లేర్పడియున్నను (వేఱ్వేఱురోగములకు) పేరట్లే యున్నది.

---

**కింగ్ ఓస్మార్క్ కాలక్స్** — అర్ధరాత్రి సూర్యుఁడు కన్పించుట చూడుఁడు, నార్తుకేప్ అగ్రము చూడుఁడు, ఉత్తరధ్రువమహాసముద్రము చూడుఁడు.

**కింగ్డమ్ - రాజ్యము (Kingdom)** — రాజ్యము. ఒకరాజు (భూపాలుని) చే పాలింపఁబడు భూభాగమని యర్థము. (సామ్రాజ్యము చూడుఁడు).

**కిండర్గార్టినిజం (Kindergartenism)** — చిన్నబాలుర కతిబాల్యమున నాటలతో విద్యగఱపు విధానము. దీనిని Friedrich Froebel అనునాతఁడు క్రీ. శ. ౧౭౮౨-౧౮౫౨ మధ్యకాలమున కనిపెట్టెనని చెప్పఁబడినది.

**కింపురుష దేశము** (లేక కింపురుష వర్షము) — నేపాలదేశము చూడుఁడు దీని కీపేరు కలదు.

**కిక్రాజి గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**కికీదివి (పాలపిట్ట) శాస్త్రము** — కికీదివి యన పాలపిట్ట యనియు, పాలగుమ్మి యనియుఁ గూడ నందురు. పాలపిట్ట శకునఫలములు కథలరూపమున వచించుచున్నారు. ఇది బహుశుభప్రదమైనదని ఎగురగుచేని మృష్టాన్న భోజనము ధనలాభము గల్గునని చెప్పఁబడినది.

కికీదివి తూర్పున గనంబడిన చెరుపుగల్గు ననియు, ఆగ్నేయమూల గనబడిన అతికష్టమనియు, దక్షిణదిశయందుఁ గానంబడిన లాభ

మనియు, నైఋతిదిశయందు గానంబడిన వాహన లాభమనియు, పశ్చిమదిశం గానంబడిన కీర్తిప్రద మనియు, వాయువ్యదిశయందు గానంబడిన సుభ మనియు, ఉత్తరదిశం గానంబడిన మరణయోగ మనియు, ఈశాన్యదిశంగానంబడిన కష్టములనియు చెప్పంబడినవి.

పాలగుమ్మపిట్ట తనకుం గుడివైపుం నుండిన శుభప్రదమనియు, కుడినుండి ఎడమవైపున కేగుట శుభప్రదమనియు, ఎడమవైపునుండి కుడివైపున కేగుట నశుభప్రదమనియు, ముందువైపుం గన్పడిన మేలనియు, వెనుకవైపున గన్పడుట నిష్ఫల మనియు నందురు.

**కిక్కిసగడ్డి చెట్టు** – లా. Phragmites karka, Arundo karka అనియు, ఆంగ్ల. Bur Grass అనియు, సం నడ, నల యని పేరులు. కొందఱు రాగ్రఢీ యనియు వాడిరి.

దీనిని రసము దీసియు, కషాయము గాచియు వైద్యు లుపయోగింతురు కఫము, తాపము, పైత్యము, మూత్రదోషము, రక్తదోషము, విసర్పి వీనిపైం జక్కగ పనిచేయుచుండును. (నళద్వయము చూడుండు)

**కిక్ ది బక్కెట్** (Kick the Bucket)— ఉరిదీసి చంపుట కీయుక్తిని వాడు చున్నారు తొల్లింటి ఆంగ్లసీమలందు ఉరిదీయ బడు నేరస్థులకాళ్ళక్రింద ఒక బక్కెటు నుంచి వారిమెడ కురి తగుల్చువారట. ప్రాణము పోవు కాలమున కాళ్ళక్రింది బక్కెట్టును దన్ని త్రోస వైచువారట. తోడనే యురిత్రాడుబిగిసి ప్రాణము పోవుచుండెడిదట. ఆపద్ధతి పోయినను వాడుక యందొక యుక్తియై నిలచియున్నది.

**కితకితలు** — అదివఱకు లేశమును తెలి యక అటులసంభవించునని అనుమానమైనను లేక అకస్మాత్తుగా తన మిత్రులగువారు తనమేనియం దలి మెత్తని ప్రదేశములను తాకిరేని మన మేమన పరవశతయు, కులుకును, నవ్వును, ఆశ్చర్యా నాదములును, భరింపలేని వినోదమును గల్గును వీనినే కితకిత లందురు.

ఇవి అకస్మాత్తుగను, తన కదివఱకు తెలియ కుండగను సంభవించినప్పుడే ఈ అవస్థలు సంభ వించును ప్రయత్నముగ తాను సిద్ధపడియుండుచో కితకితలు గలుగనేరవు కితకితలుపెట్టువారు తన మిత్రులు కాకుండిరేని భయముగల్గి కితకిత లసలే గలుగవు

ఇంకను తనకు తాను కితకితలుపెట్టుకొని గల్గించుకొనుట కసలే వీలుకాకుండును. వీల గాన తనకది తెలియకుండ జరుగవు

**కిత్తలినార చెట్టు** — నారనిచ్చు చెట్లన్నిటిలో కిత్తలి మిగుల బలమైన నారనిచ్చును. కిత్తలినారత్రాడును ఒకఅంగుళము దళసరికలదానిని తెంపుట మసాధ్యము. నాల్గుటన్నుల బరువును మోయగలబలము ఒక్కొక్కవైపునం దగల్చి లాగించిన త్రెగునదనియు, తక్కువమైన తెగదనియు లెక్కింపంబడినది. ఆకులనందగిన దీని మట్టలందే నార లభించును. కడనుముండ్లుంట కిత్తలి మొక్కలను భరతదేశమున తోటలకు కంచెలుగ నాటుచున్నారు. కాని ఫిలిప్పైనుదీవులందు నారదీయుటకు గాను కిత్తలిని బయళ్ళయందు వ్యవసాయముగనే నాటి పెంచుచున్నారు. ఎందు లకుంబనికిరాని భూములందిది చక్కగా పెరుగును. కిత్తలి పెద్దకిత్తలి యనియు, చిన్నకిత్తలి యనియు రెండు భేదములు గలది. పెద్దకిత్తలిని గేదె కిత్తలియనియు, చిన్నకిత్తలిని పాదాకిత్తలియనియు వాడుచున్నారు. దీనిమట్టను జతుకగొట్టి కడిగి నారందీసి పైన్వనుదారము చేయుదురు లేత మట్టల నార సన్నముగ నుంచి చక్కని పని నిచ్చుంగాన నారబట్టలు నేయ నుపయోగింతురు. ఇంచుక ముదిరిన మట్టల నార త్రైవను మొదలగు

సన్న దారములందీని నుపయోగింతురు. ముదిరిన మట్టల నార త్రాళ్ళు చేయుదురు.

**కినెటోస్కోప్** (Kinetoscope) — సినిమాచిత్రములను తయారుచేయుట కుపయోగపడు కినెమెటోగ్రాఫ్ అనబడు యంత్రమునందు ననుర్పబడు నద్దము. ఇది క్రీ. శ. ౧౮౯౩ లో థామస్ ఎడిసను అను వానిచే కనుగొనబడినది. చలనములను కోణములకేర్పడుటనుగూడ దీనివలన ప్రదర్శింపవచ్చును

**కినెమెటోగ్రాఫీ** (Kinematography) — దీనినే Cinematography అనియెదరు. ఛాయాచిత్రదర్శనము చూడుము

ఇది క్రీ. శ. ౧౮౯౫ లో ప్రారంభించబడినది. తెరపై బొమ్మలనీడలం జూపించునది. ఈబొమ్మల సమష్టికళకు Kinematography అనియెదరు. తొలుత Kinetoscope అని చేయబడి పిదప వృద్ధిపఱుపఁబడి యిటుల నయ్యెను

**కిమజ్ఞానస్య దుష్కరః** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. అన్నిటికి అజ్ఞాని సిద్ధపడునని భావము. అజ్ఞానికి కష్టమైనదేది కలదు? (లేదని భావము)

**కిమార్ద్రకవణిజో వహిత్రచింతయా ఇతిన్యాయము** — అల్లము నమ్మువానికి ఓడవలతో సంబంధ మేమి యని యర్థము. కేవల మసంబంధస్థితిం దెల్పుటకై దీని నుపయోగింతురు.

**కిమోస్కోప్** (Kimoscope or Cimoscope) — సిమోస్కోప్ చూడుడు.

**కిమ్మిర్త్య దేశము** — కైరమాలి చూడుడు.

**కిమ్మూరుసీమ** — దీనికి సరిగా నుచ్చరించుట కిమ్మీరుసీమ గానోపు. ఆదిని కిమ్మీరుఁడను రక్కసుండీదేశమును పాలించుటం జేసి కిమ్మీరసీమ యని పేరొందెను. అత్తఁడ నిప్పటి కిమ్మూరునం దాతని గర్త ముండెనట. నానాటి కాతావునకుం గిమ్మూ రనియు, ఆసీమకుం గిమ్మూరుసీమ యనియు పేరులు వాడుక యయ్యెను. తూర్పు గోదావరి మండలమున చామర్లకోట పరిసరములనున్న పెద్దాపుర ప్రాంత దేశమున కీపేరు కలదు. కిమ్మూరుదు అదే యున్నది (పెద్దాపురసంస్థానము చూడుడు.)

**కియాటాంగు బుద్ధవిగ్రహము** — ప్రపంచమునందు చూడఁదగిన గొప్పవింతలలో నొకటి. ఇది కృత్రిమము. కియాటాంగు చీనాదేశములో నున్న ఒక గ్రామము. ఇట నూటయేబది అడుగుల పొడవుగల బుద్ధవిగ్రహ మొక చిన్న కొండప్రక్క భాగమునందు చెక్కఁబడినది. ఇది మొత్తని కడిరాతిప్రదేశము. జానుకూల మగు నటుల నచ్చటచ్చట మెట్టుపొరలుగా గలవు. ఆప్రదేశములో నొక జాతిగడ్డి మొలచి తలవెంట్రుకలు, కనుబొమలు, కనురెప్పలు, మీసములు, గడ్డము మొదలగునవి యథాస్థానములందు పెరిగియున్నటుల గాన్పించుచున్నది. భక్తిపారవశ్యమున నుండు బౌద్ధుల కద్భుత మనిపించునట్లు పాదములందు గనుగొనటుల ఒక చిన్న సెలయేరు పారుచుండును. ఒక బౌద్ధభిక్షువు తన జన్మకాల మంతయు నటనే వసించుచు దీని జెక్కెనని చెప్పుచుంటారు. పాదములందు గనుగుచు ప్రవహించు సెలయేటిజలములు పవిత్రోదకములుగ నెంచబడుచున్నవి.

ఇంక నట్టి విగ్రహము లీప్రాంతమున కొన్ని గలవు. అందొక ఏకశిలాతలమున గట్టి రాతిప్రక్కం జెక్కఁబడినదానిని గిల్టు చేసియున్నారు. కియాటాంగు గ్రామము యుంగ్హ్వాసైనుపురము కడ నున్నదావు.

**కియూషియూద్వీపము** — జపాన్ దేశము చూడుడు.

**క్రియోస్వీపము** (క్రియోస్) — ఏషియామైనరు చూడుడు.

**క్రిరాత (త్రిపుర-టిప్పెరా) దేశము**- త్రిపురదేశము రాయసాను తిప్పరయనంబరగి యిప్పుడు టిప్పెరాయై యున్నది తొల్లింటి రాజ్యోన్నతి వైశాల్యములం గోల్పోయి సంస్థానమైయున్నది. దీనికింకను గిరాతదేశమనియు, ప్రజలకుఁ గిరాతులనియుఁ బేరుండెనని దీనింగూర్చి అలహాబాదు శాసనముగ ప్రశంసకలదు. ఈరాజ్యమున సిల్హెట్ ఆసాములోకన్పొకు చేరియుండెనని చెప్పఁబడినది. మరియు రాజమాల యను పేరుగల Chornicles of Tripura in Journal of Asiatic Society of Bengal 19 of 1850 P. 536 యందున్నది. ఇందు దీని చరిత్రయుం గూడ కలదు. గౌడదేశాధీశుఁడీ దేశమేలుచుండిన రత్నాభుఁడను పేరుగల ప్రభువునకు క్రీ. శ. ౧౨౭౯ సంవత్సరమున మాణిక్య యను బిరుదమొసఁగెనట. నేటికిని ఆసంస్థానాధిపతులు దానిని వహించుచున్నారు. మరియొకప్పుడీ దేశము కామరూపదేశమునకు సామంతరాజ్యమై యుండెనట. క్రీ శ అరవశతాబ్దమున కోమలాపురము రాజధానిమైయుండెను (ఇప్పటి ఆసాములోని కోమిల్లా) హ్యూయెంత్సాంగు దీనిం దర్శించి తన యాత్రా చరిత్రయందు కియామోకియా యని వ్రాసెను. వాయుపురాణము ౨-౩౭-౩౬౮ యందు కోమలపుర ప్రశంసకలదు. ఉదయపురమునందలి త్రిపురేశ్వరీ దేవస్థానము ౫౨ పీఠములలో నొకటి. ఈ దేశరతుకురాలగు ప్రధానశక్తి.

**క్రిరాతాదిగణము**— ఆయుర్వేద వైద్య శాస్త్రమున నేలవేము, తిప్పతీగ, తుంగముస్తెలు, లోం ఏటికి కిరాతాదిగణమని పేరు.

**క్రిరీటకోన** (కిరీతకోన) — దహపాదము నుండి నాల్గుమైళ్ల దూరమున ముర్షదాబాదు మండలమున బంగాళములో నున్న దేవక్షేత్రము సతీదేవియొక్క కిరీటము పడినతావు (శక్తిపీఠము) అని తంత్రచూడామణి యందు ప్రశంసకలదు.

**క్రిలాలి గోత్రము** — ఆయాస్య ఉపగణము చూడుడు కౌత్సక్య ఉపగణము చూడుడు.

**క్రిసిమిసిపండు (తీగ) చెట్టు** — లా Vitis vinifera. ఆంగ్ల Raisins దీనిసంస్కృతపుపేరు గోనరామున్నది ఇది ద్రాక్ష జాతిలోనిది. గింజలులేని ద్రాక్షగఁ జెప్పనొప్పు క్రైస్తవుల క్రిస్టమసుపండుగ సంబంధిగ దీనిని కిసిమిసిపండని వాడదొడంగిరి ద్రాక్షపండు గుణములనే గల్గియుండును. త్రిదోషములను హరించుచు ఆరోగ్యకరమైనది. ఉష్ణమువచ్చియున్నతరి శరీరమునకు బలముగల్గింప నీగునగును. అధికమైనచో విరేచనము కేయును. కొండఱు నేత్రములకు, దాతములకు బలముదగ్గించునందురు దీనికి విరుగుడు పుల్లనిఫలములు, పంచదార, శికంజబీను అనెదరు. (ద్రాక్షచెట్టు చూడుడు).

**క్రిలోసైకిల్** -- ఎలక్ట్రిసిటీయందిది నొకకొలత. సెకెండునకు వేయి సైకిల్సు అని చెప్పఁబడినది దీనిని క్లుప్తపర్చిన రూపము Kc. అని. (ఎలక్ట్రిసిటీ చూడుడు.)

**క్రిల్కిలా (కైక్కిలా) పురము లేక నగరము** — తొల్లింటి వాకాటక దేశపు రాజధాని. (వాకాటక చూడుడు).

**క్రిల్బిన్నృప వంశము** — వీరు ఆనిస రాజరాజులకు విడప వారేలుచుండిన రాజ్యము

చేసిన ముసల్మాన్ ప్రభువులు. క్రీ. శ. ౧౨౯౦ మొదలు ౧౩౨౦ వఱకు వీరి పాలనము.

వీరిలో అల్లాఉద్దీన్ ఖిల్జీ ముఖ్యుఁడు (మహమ్మదు ఘోరీ చూడుఁడు).

**కిష్కింధ** — తొలుత వాలికిని, పిదప నాతని తమ్ముఁడగు సుగ్రీవునకును రాజధాని. తుంగభద్రానదీతీరము. దీని నిప్పుడు ఆనెగొంది యనుచున్నారు. నైజాము రాజ్యమునందు చేరియున్నది. బళ్లారిజిల్లా హొసపేట తాలూకా జీర్ణ విజయనగరమునకు ఉత్తరమున తుంగభద్రానది కవ్వలనున్న జమీందారీస్థలము

**కిష్కింధ పర్వతము** — నైజాము రాజ్యమున ఆనెగొంది పరిసరములందు తుంగభద్రానదీతీరమందున్నది. ఆనెగొందిని కిష్కింధ పురమనెదరు. ఇట పంపాసరోవరమును, అంజనాద్రి (ఆంజనేయుని జన్మస్థలము) మొదలగునవి కలవు. ఆనెగొంది జమీందారీస్థలము. (విజయ నగరరాజ్యము చూడుఁడు). (ప్రస్తుతము విజయ నగరము హంపియని వ్యవహరింపఁబడుచున్నది).

**క్రికెట్టు ఆట** (Cricket)-ఇది బాగుగ



ప్రోత్సహింపఁబడునాట. ఇందిరుకక్షుల వారికి టీమ్సు (Teams) అని పేరు. టీమునందు పదునొకండుగు రాండ్రుండుట యాచారముగ నున్నది. ఒక పెద్దసమతలమగు మైదానమున నాట ప్రారంభపు గుర్తు తావునుండి ఇరువదిరెండు గజములకు ఆట అంతము గుర్తించి యుందురు. దీనికి వికెట్ (Wicket) అని పేరు.

ఆటతరి చేతంబట్టి కొట్టు ఫలకమునకు బేట్ (Bat) అనెదరు. అది నాల్గున్నర అంగుళముల వెడలుపును, ఆద్యంతములు ముప్పదియొన్మిదంగుళముల పొడవుంగల్గి ప్రత్యేకముగ చేయఁబడిన యాకారము గలది. ఆటబంతులు ఐదున్నర ఔన్సులబరువుగ నొక్కఁబడిన బెండు (Compressed Cork) పై తోలు మూయఁబడియుండును.

ఆరు బంతిపాటలకు Over అని పేరు. దీని ధర్మములం బాలించుచు నరసి తీర్మానమిచ్చు చుండు అధికారిని Umpire అనియెదరు. ఈ ఆట నడపు పద్ధతులు పెక్కు కలవు. వాటిం జక్కగ నెఱుంగవలసి యుండును.

**క్రెటీద్వీపము** — కేండియా ద్వీపము చూడుఁడు.

**క్రిప్టోగ్రాఫీ** (Cryptography) — కేవలాక్షరములతో తనయభిప్రాయమును వ్రాయుటను వ్రాఁతయనెదరు. అది ఆభాష నెఱిఁగినవారి కవగాహించి యర్థమగును. కొన్ని యంకెలంగాని ఇతర గురుతులంగాని, కొన్ని చిహ్నములంగాని, గుర్తులుగగాని లేఖలు వ్రాయు విధానమునకు Cryptography యనియు, Cryptology అనియు పేర్లు. అట్లు వ్రాయఁబడినదానికి Cryptograph అని పేరు. మరియొక నామము Cryptogram అనియుంగలదు. వ్రాయనెఱింగినవానిని Cryptographist అనియు నందురు.

**క్రిమినోలోజీ** (Criminology) — నేరముల (Crimes)ను గూర్చినకళ(శాస్త్రము).

**క్రిమిభూపతి** — అత్రి సంతతి. చంద్ర వంశ క్షత్రియుఁడు. ఉశీనరుని కుమారుఁడు. సోదరులు శిబి, నృగుఁడు, నవుఁడు, సువ్రతుఁడు. క్రిమి క్రిమిలాపురమును నిర్మించెనందురు.

**క్రిమి రోగము** — గర్భమున క్రిములను (పురుగులను) జనింపఁజేసెడి జబ్బు. గజ్జి, చిడుము, తామర, తీట, కుష్ఠు మొదలగు చర్మవ్యాధులన్నియు క్రిమిసంబంధములే.

**క్రియలు** — మూఁడువిధములు. మణులు, మంత్రములు, ఔషధములు.

**క్రియాశ్వ గోత్రము**– గర్గఉపగణము చూడుడు.

**క్రియాప్రాణము** — ఇది సంగీతలయ యొక్క దశప్రాణములలో నొకటి. క్రియాప్రాణము (క్రియలు) మార్గక్రియలు, దేశ్యక్రియలు అని ద్వివిధములుగ నుండును. (సంగీతలయ దశప్రాణములు చూడుడు).

(౧) మార్గక్రియ రెండువిధములు- నిశ్శబ్దము సశబ్దము అని. ౧. నిశ్శబ్దమార్గము నాల్గువిధములు (చతుష్కళలు)- ౧. ఆవాపము- వెల్లకిల యెత్తబడిన పతాకహస్తము యొక్క నాలుగువ్రేళ్ళను ముడుచుట. ౨. నిష్క్రామము- అట్లుముడిచిన వ్రేళ్ళను విప్పుట. ౩. విక్షేపము ఆహస్తమును వెలుపలి (కుడి) పార్శ్వమునకు విదిలించుట. ౪. ప్రవేశము- ఆహస్తమును అప్రదక్షిణముగా క్రిందుగా ముందుకు రానిచ్చుట ౨. సశబ్దమార్గము నాల్గువిధములు (చతుష్కళలు)- ౧ ధ్రువము- శబ్దపూర్వకమైన చిటిక వేయుట. ౨ శమ్యము- కుడిహస్తమున ఎడమచేతి చరచుట. ౩. తాళము- ఎడమచేతితో కుడిచేతి చరచుట. ౪ సన్నిపాతము- రెండుచేతులు సమముగ చప్పటలు వేయుట.

(౨) దేశ్యక్రియలు ఎన్మిదివిధములు- ౧ ధ్రువకము-శబ్దముతో కూడికొనుచు హస్తముయొక్క ఘాతము ౨. సర్పిణి- పతాకహస్తముచేత ఎడమప్రక్కకు (వంకకు) చేయి చాచుట. ౩. కృష్య- ఆచేతిని ఎడమనుండి కుడిపార్శ్వమునకు రానిచ్చుట. ౪. పద్మిని- అరచేతిని క్రిందుగా (అధోముఖముగ) చేయిచాచుట. ౫. విసర్జిత- ఆచేతిని వెలుపలకు విసరుట. ౬. విక్షిప్త- ఆచేతినాల్గువ్రేళ్ళు ముడిచి తనదిక్కు కుదీయుట. ౭. పతాకము- పతాకహస్తముగా బట్టినచేతిని మీదికెత్తుట. ౮. పతిత- ఆయెత్తిన హస్తమును క్రిందికి దించుట.

**క్రియాభేదాత్ఫలభేదః ఇతి న్యాయము** — చేసినపనింబట్టియే ఫలము కలుగును. అనగా భేదము ఫలభేదముం గల్గించు నని భావము.

**క్రియాశైవము** - ఇది చతుర్దశ, శైవ, భేద మతములలో నొకటి (చూడుడు) ఇందు మలత్రయము, త్రిపదార్థములు శివసమవాది శైవమునందువలెనె యుండెను. ఈమతమున గురునిచే అధ్వశోధనపూర్వకముగ సముయదీక్ష నంది శివజ్ఞానమెఱింగి కర్మలను సాధించుటకు పంచశుద్ధి కల్గించుకొనుచు, ఆవాహనాది విధులచే శివారాధన మొనర్చుచుండుట వలన నిత్యముక్తి యలవడుననియు, అది యాత్మముక్తికి మార్గమనియు నందురు.

**క్రియాహివికల్ప్యతేన వస్తు ఇతి న్యాయము** — ఒక వస్తువుంగూర్చి వేర్వేరు అభిప్రాయములు వేర్వేరుగ కల్గినయెడల అది వారి భావసంపత్తి ననుసరించి కల్గినవేగాని వస్తువునం దేభేదము ఉండదని భావము

**క్రయోమీటర్** (Kryometer, Kriometer — మిగుల తక్కువ పరిమాణము గల యుష్ణమును కూడ తెలుపునట్టి (Thermometer) థర్మామీటర్

**క్రివిదేశము (పాంచాల దేశము, అరాటదేశము)** — ఇందు పెక్కు దేశములుగ వేర్వేరు కాలములందు వేర్వేరు పేరులం బరగియుండుట నొక దేశమని వ్రాయుట యసమంజసము. ఐనను పెద్ద దేశమై ప్రసిద్ధమై యుండుటచేత దీనిని వేఱుగ వ్రాయవలసి వచ్చి వ్రాయబడినది. ఈదేశమునకు తొల్లింటి పేరు క్రివిదేశమని యుండెనట. ఇందైదు నదులు ప్రధానములై ప్రవహించుచు, అన్నియు సింధునదియందు చేరుకొనుటచేత పాంచాలమని పేరు.

గగ్గెను. ఇక్కాలమున పంజాబు బనంబరగుచున్నది. దీనికిని ఐదుజలములనియె అర్థము. అనఘాలెవ్వి యన ౧. వితస్తానది (ఇప్పటి జీలమునది), ౨. శతద్రు నది (ఇప్పటి సెట్లజ్ నది), 3 రావినది, ౪ విపాశా నది (ఇప్పటి బీయాస్నది), ౫. అశక్ని లేక చంద్ర భాగానది (ఇది చంద్రానది, భాగానది కలసిన ప్రవాహము. దీనినిప్పుడు చీనాబు నది యను చున్నారు.) యని మహాభారతము కర్ణపర్వము ౪౪ యందునను, అగ్నిపురాణము ౧౦౯ యందు నను చెప్పఁబడినది. అశక్ని (చీనాబ్) వితస్థ నదులు కలసిన భూప్రదేశమునకు త్రినాబని వాడుకనామము కలదు. శతద్రు, విపాశలు కలిసిన ప్రదేశప్రాంతమునకు ఘూరాయని వాడుకనామము కలదు. ఋగ్వేదమున విపాశానది అర్జికియా నది యని పేర్కొనఁబడినది.

ఈదేశమున అంజనగిరి పర్వతము గలదు. దీనినిప్పుడు సులైమాన్ పర్వతమనిఅనుచున్నారు. ఈ పర్వతపఙ్క్తి పశ్చిమపాంచాలము పశ్చిమపు టెల్లగ కొంతవఱకు వ్యాపించియున్నవి. పాంచా లము ఉత్తరపాంచాలమనియు, దక్షిణపాంచాల మనియు, ముఖ్యభాగములు రెండుగ తోచెడిని. ఆదికాలమున ఉత్తరపాంచాలమున అహిచ్ఛత్ర పురమును, దక్షిణపాంచాలమునకు కంపిలా నగర మును రాజధానులుగ నుండినవి. ఆదికాలముననే మరిమొకప్పుడు పాంచాల దక్షిణభూమి గంగా నది దక్షిణతీరమునుండి చర్మణ్వతీ నదివఱకు వ్యాపించి యుండెడిదని మహాభారతము ఆది పర్వము ౧౪౦ యందు చెప్పఁబడియున్నది. బుద్ధ భగవానుని కాలమున కనూజపట్టణము దక్షిణ పాంచాలరాజధాని యని చెప్పఁబడినది.

ఆదికాలమున పాంచాలము హిమాలయము మొదలు చంబల్నది వఱకు ఇంద్రప్రస్థము (ఇప్పటి ఢిల్లీ) యొక్క ఉత్తరపశ్చిమములకు వ్యాపించి యుండెననియు, పిదప నింకను వ్యాపించి గంగా నది మధ్యభాగముగా ఉత్తరదక్షిణ పాంచాలము లనంబరగునట్టుల రెండుదేశము లాయెననియు చెప్పఁబడెను. వాగ్గులు సరిగా తెలియవు గాని కొంచెము హెచ్చుతగ్గులతో గ్రీకుదేశపు నృప తులు, శకనృపతులు, ఇండూసిథియనునృపతులు, ఇండోపార్థియన్ నృపతులు (వీరు పహ్లవులు), కుషాన్ నృపతులు, గుప్తవంశ నృపతులు, హూణులు కూడ నీదేశముం బాలించిరి. తొలుత నీదేశమును డెరయస్ హిస్టాస్పస్ అను గ్రీకురాజు జయించెను.

౧. మెనేండరు, ౨. అపోలోడోటస్, 3 జోయి లస్, ౪. డియోనిసియస్, ౫. స్ట్రేటస్, ౬ హిపోస్ట్రేటస్, ౭. డియోమిడిస్, ౮. నిసి యస్, ౯. టెలిఫోస్, ౧౦. హెర్మాయిఅస్.

వీరు పదిమందియు నొకరితర్వాత నొకరుగ పాలించినవారు కారు. మఱియు నొకేకాలమున పాలించినవారును కారు. వేర్వేఱు భాగముల నొకే కాలమునను, వేర్వేఱు కాలములను కూడ పాలించినవారు. మొత్తమున వీరి పాలనము క్రీ. పూ. రెండవశతాబ్ది మొదిగ క్రీ. వెనుక ౭౮ సంవత్సరములవఱకుం బాలించిరి. అనగా ౨౭౮ సంవత్సరముల కాలమని యెఱుంగు నది. శక నరపతులు వీరిం జయించి వీరిపాలన మంతమొందించిరి. శక నరపతులకు ఇండోసిథి యను నరపతులనియు వాడుకనామము గలదు. వీరు అగ్గురు ౧. వొనొనోయిస్ (శకారంభ కారకుఁడు), ౨. స్పాలిరిసీస్ (వొనొనోయిస్ కనిష్ఠసోదరుఁడు), 3. ఒకటవ అజాస్, ౪. అజి లీసిస్, ౫. రెండవ అజాస్, ౬. మాయీస్ (ఈతనికి మొగ యనియుం బేరుకలదు).

శకారంభకారకుఁడు కనిష్కుఁడని ఓల్డెన్‌బర్గు పరిశోధకుఁడు అనెంగాని దానిని ఖండించి డా. భండార్కరు పండితుఁడు వొనానోయిస్ లేక వొనోనిస్ కారకుఁడని నిరూపించెను. ఇండో

సిథియన్ లేక శకనరపతులు క్రీ. వె. ౭౮ మొదలు ౧౫౬ వఱకు అనగా ౭౮ సంవత్సరములు పాలించి ఇండోపార్థియను నృపుడగు గొండోఫారిస్‌వలన నోడింపఁబడి పదభ్రష్టులైరి. వీరు రాజప్రతినిధులగు పరిపాలకోద్యోగుల ద్వారా పాలించిరిగాని స్వాతంత్ర్యపరిపాలన నెరపినవారు కారు. వీరి రాజధాని నివాసము శాకద్వీపము నందలి సిస్థానునందే యుండెనట. ఇండోపార్థియను నరపతులు పహ్లవులని చెప్పఁబడినది. వీరు రాజులు. ౧. గొండోఫారిస్, ౨. అబ్దాగసీస్ (గొండోఫారిసు సోదరపుత్రుఁడు), ౩. ఆర్థాగ్నీస్ ౪. అర్సాకీస్, ౫. పకోరేస్, ౬. సబరిస్.

వీరు క్రీ. వె. ౧౫౬ మొదలు ౧౯౮ వఱకు, అనగా నలుబదిరెండు వత్సరములు పాలించిరని లెక్కించిరి. వీరును స్వాతంత్ర్యపరిపాలన నెరపిన వారు కారని తెలియుచున్నది. వీరి రాజధాని శాల్లపురము. వీరిని (పహ్లవులను) కుజుల్కడ్ఫిసిస్ అనుపేరుగల కుషాను నృపతి యోడించి పదభ్రష్టులఁ జేసెను. (కిర్మానుకు తూర్పుగా నున్న దేశమునకు కుషాన్‌దేశ మని పేరు దీనుల ఈ సందర్భమున మనసునందుంచుకొనవలెను).

కుషాను నృపతుల పాలనము క్రీ వె. ౧౯౮ మొదలు క్రీ. వె. ౩౭౬ వఱకు నడచెను అనగా నూటడెబ్బదియెనిమిది వత్సరములుగ నెలుగుచున్నది. పిదప కుషానులను, గుప్తవంశ నృపతులను, వారిని హూణులును ఓడించి పదభ్రష్టులం జేసి రాజ్యమాక్రమించిరని చెప్పఁబడినది.

ఉత్తర పాంచాలమునకు రోహిల్‌ఖండమని వాడుకనామ ముండెను. తొల్లిటికాలమున అహిచ్ఛత్రపురము రాజధాని. దానికి ఛత్రవతియని మహాభారతము ఆదిపర్వమునను, అహిక్షేత్రమని వనపర్వమునను వాడఁబడియున్నది. అది ఛత్రము, ఛత్రవతి యని కొన్ని శాసనములందు చెప్పఁబడినది. అది ఇప్పటి రోహిల్‌ఖండములోని బరేలీపురమునకు పశ్చిమముగా నిరువది మైళ్ల దూరమున ప్రస్తుతము రామ్నగర్ అనం బడు పురముకడ పోల్చిరి. తొల్లింటి పురముండిన తావుగ అలంపూరుకోట నగ్రహార్గాజి యనంబడు భాగములను జూపుచున్నారు. జైనులగ్రంథములందు జాగలదేశమని పేర్కొనఁబడి యున్నది.

దక్షిణ పాంచాలదేశమునకు కంపిల్యనగరము లేక కంపిలానగరము రాజధానిగ మున్ను చెప్పఁబడినది. ఇది పురాతనపుగంగ లేక వృద్ధగంగా తీరము. అట నొక దిబ్బను ద్రుపదమహారాజు యొక్క నివాసభవన ముండిన తావుగను, అట్టివి గనేయున్న యితరపాడుదిబ్బలను ఇతరభవనములనియుఁ జూపుచున్నారు సంయుక్తరాష్ట్రముల లోని ఫరూఖాబాద జిల్లా పట్గార్ పురమున కీశాన్యముగ ౨౮ మైళ్లదూరమున వృద్ధగంగా తీరమున నేఁటికిని కంపిల్ అని పిలువంబడుచున్న ఇత్తావు తొల్లింట కంపిలానగరముండిన ప్రదేశమట. పాండవుల మామగారగు ద్రుపదమహారాజు రాజధానియనియు, ఆయన దక్షిణపాంచాల దేశాధీశుఁడనియు, ఇది ద్రౌపదీ స్వయంవరస్థానమనియు, ఆమెపేరు కృష్ణాదేవియనియు మహాభారతము ఆదిపర్వము ౧౩౮ యధ్యాయమునను, రామాయణము ఆదికాండము ౨౩ యధ్యాయమునను ప్రశంసింపఁబడినది.

**క్రిస్టలోగ్రాఫీ** (Crystallography)– Crystals (స్వచ్ఛ పదార్థములు) అనగా స్ఫటికములు మొదలగునవి ఎటుల నేర్పడునో వాటి యందలి పదార్థము లెవ్వియో విమర్శించు కళ. దీనిని Crystallography అనియు నందురు. ఇంకను పిటిపలకలు, వాటి (Angles) మూలలు కొలతలు దెలుపు శాస్త్రభాగమునకు Crystallometry అని యందురు (Crystallogeny చూడుఁడు).

**క్రిస్టలోజెనీ** (Crystallogeny) — స్ఫటిక వద జన్యము. Chystallography చూడుడు.

**క్రిస్టలోమెట్రీ** (Crystallometry)- Crystallogeny చూడుడు.

**క్రిస్టమసు ద్వీపము** - జావాద్వీపము నుండి నైఋతి దిశగా ౧౫౦ మైళ్ల దూరమున హిందూ మహాసముద్రమునఁ గల ద్వీపము.

సింగపూరు డిపెండెన్సీగా బ్రిటిషు సామ్రాజ్యము లోనిది. ౬౨ చతురపు మైళ్లవైశాల్యము.

**క్రిస్టలైజుడు ఫ్రూట్ పరిశ్రమ** (Crystallised fruit) ఈపరిశ్రమపండ్లలభించు నకాలమున సిరప్ (Syrup) అనగా పాకమును ముందుగ నాయత్తపఱచుకొనవల యుండును. తొలుత గెల్లని ఇసుకపంచదారను వేడినీటియందు కరఁగజేసి తిరిగి కాచవలయును. ఇదిగట్టిముగారు పాకము వచ్చునటుకం గాముగారు ఇంగు చూచు పాసుల శర్కరకు అరపాను Formic acid కలిపికాచిన అచ్చుకట్టకనిలచును. ఇది పానకము. ఇదిచాల చిక్కగనుండును మంచిపండ్ల నెంచి ఇంచుక నీటియొగ దికించుట శ్రేష్ఠము అపండ్లను పైఁజెప్పిన పాకముఁవంకఁకూడ నుడికించి యొరెండునిమసములు నిలువ యుంచవలెను. పిదప పానకము పలుచఁబడియుండ దానిందిసివైచి తిరుగ చిక్కబడు వఱకు మఱల కాచవలయును. ఇంటే తిరుగ నాపండ్లనవైచి యవివేడెక్కు నటులఁ జేసి అటుల నాల్గునినము లుంచవలయును తిరుగ నిల్లె యొనర్చుచూడవలయును. బహుశః నాల్గు తేం మైకుసారులిట్లొనర్చు వఱ కాపానకము పలుచఁగాకచిక్కగ నిలచియుండఁగల్గును. తోడనే యాపండ్లందీసి యెండనెండిప వలయును. పిదప పండ్లపైఁ బంచదార అంటజల్లి సీసాలయందు నిల్వయుంచి గాలితగులకుండ మూతమూసి భద్రపఱ్చిన నిల్వయుండును. లేక పెట్టెలందైనను కాగితముంజుట్టి భద్రపఱుపదగును.

**క్రిస్టియన్ బ్రదర్సు** (Christian Brothers) — ఐర్లండుదేశమున క్రీ. శ. ౧౮౦౨ సంవత్సరమున నేర్పడిన సంఘము. మొదట క్రైస్తవసంఘముగ నాదేశమున పేరంది నది రోమకపురినుండి ఈసంఘము Chartar నాదినదట వీరిపాఠశాలలు బ్రిటీషుసీమలందు చాల చోట్ల కలవందురు.

**క్రిస్పియన్, క్రిస్పిన్, క్రిస్పస్** (Crispian, Crispin, Crispus) — లాటిన్ పేరు. ఇది జోళ్ళుకుట్టు పనివారి రక్షకుం డగు ఋషి (Patron Saint) పేరు. ౨౫ అక్టోబరు ఈయన దినము. ఊగరముల జత్తు (కుటిలాలకుఁడు) గలవాఁడని యర్థము. పురుష నామము. (క్రైస్తవనామములుచూడుఁడు).

**క్రిస్టియన్ సైన్సు బోధ**-ఇది అమెరికా సంయుక్తరాష్ట్రములందు మేరీ బి ఎడ్డీ యను నామెవలన ప్రారంభింపబడినదట క్రైస్తవ మతబోధ రోగుల కొనర్చుచూడిన నది మనస్సు పై పనిచేసి రోగములం గునర్చునని పీ నమ్మకము ఇంతకన్న దీనింగూర్చి సరిగాఁ దెలియరాకున్నది.

**క్రిస్టొఫర్, క్రిస్టోఫ్**-(Christopher Christoph) గ్రీకునామము క్రీస్తునుమోయు అనియర్థము. దీనినుండిగల్గిన ముద్దుపేర్లు Chrys, Chris, Kester, Kit, Kitty అనునవి. పురుష నామము. (క్రైస్తవ నామములు చూడఁడు).

**క్లినికల్ థర్మామీటర్** (Clinica-Thermometer)- ఒకరోగిశరీరశీతోష్ణము (Temperature) కను



గొను కలికరము.

దీనిం దఱుచుగ నాంగ్లవైద్యు లుపయోగించుచుందురు.

శీతోష్ణములం గొలుచు యంత్రము జూడుము.

**క్లినోమేటర్** (Clinometer) - మెరక నుండి పల్లమునకు దిగు ఏటవాలు ప్రదేశము (Slope) నందలి పరిస్థితులం గొలుచు పరికరము.

**క్లిమెటోలొజీ** (Climatology) — వేర్వేఱు దేశములందు లేక వేర్వేఱు భూప్రదేశములందు, వేర్వేఱు విధములైన శీతోష్ణ పరిస్థితులు గల్గియుండును అవి వేర్వేఱు కారణములచేఁ గల్గియుండెడివి. శీతోష్ణ స్థితులకు Climate అని పేరు.

ఈ శీతోష్ణస్థితులు కొంత కొంత కాలమునకు ఆకారణ పరిస్థితులు మారెనేని తామును మారెడివి. అట్లె సమశీతోష్ణ ప్రదేశములు, ఉష్ణప్రదేశములు లేక శీతల ప్రదేశములగుచు. కొన్నిటికి అడవులు నశించుటవలన వర్షములు మాని పల్లపుభూములు మెట్టప్రదేశము లగును. ఈ మార్పులు, పరిస్థితులు మొదలగు Climatic కళకు Climatology అనిపేరు

**క్లియరెన్సు** (Clearance) (వాణిజ్య సంబంధ పరిభాషా పదము) - ఓడను వసియైన వెనుక రేవునుండి పోవచ్చునని గాని, దిగిన సరకులపై చెల్లింపఁ బడదగిన Customs duty చెల్లింపఁబడినపిదప తీసుకుపోవచ్చునని గాని, Customs ఉద్యోగియొసంగు అనుమతిపత్రమునకు Clearance అని పేరు. ఇది రెండు విధములు- ఓడ రేవుకు చేరగనె దిగుమతిసరకులం దింపివేసినట్లు ఇచ్చునది Inward clearance అనియును, ఎగుమతి సరకుల నెక్కించుకొనిన పిదప బయలుదేరవచ్చునట్లు ఇచ్చునది Outward clearance అనియును పేరులు. ఇంకను హుండి సొమ్ము చెల్లించివేయుటకు Clearing a bill of exchange అని యందురు. Clearing వ్యాపారముజేయు బాంకికి Clearing Bank అని పేరు. ఇట్టి క్లియరింగు బాంకివ్యాపారము లొనర్చు ప్రత్యేక స్థానముండెనేని దానికి Clearing house అనియనుటయుం గలదు. ఇట్లు రైల్వేద్వారా పంపఁబడు సరకుల Clearing వ్యాపారములను చక్కబఱచునట్టి Railway clearing house అనియును, Stock exchange clearing వ్యాపారములను చక్కబఱచునట్టి Stock exchange clearing house ను కూడ నుండెడివి

**క్లియోపాత్రా** — (ఈజిప్టుదేశపు రాణి) చరిత్రలలోఁ బ్రాముఖ్యత నంది ప్రపంచదృష్టినే తనవైపు మరల్చుకొనగలిగిన కొలదిమంది స్త్రీలలో నీజిప్టు (ఈజిప్టు) దేశపు రాణి యగు క్లియోపాత్రా యగ్రగణ్య. ఈమె టోలెమీ (Ptolemy) వంశసంజనిత. టోలెమీ వంశస్థులకు సహజముగఁ గల కఠినత్వ మీమెయందును లేక పోలేదు.

క్లియోపాత్రా సింహాసన మెక్కిన కొలఁది కాలములోనే తన తమ్మునితోఁ గలహించుటతో రాజ్యమున తిరుగుబాటు ప్రారంభమయ్యెను. క్లియోపాత్రా యానాఁటికాలమున విఖ్యాతుఁడగు జూలియస్ సీజరుతో పరిచయము జేసుకొనుటకు పైసందర్భ మనుసరించెను. స్వదేశమున తిరుగుబాట్లు తీవ్రముగ నుండుటచే క్లియోపాత్రా తనసైన్యములతో ప్రవాసమున నుండెను. ఆసమయముననే అలెగ్జాండ్రియాపురము దన్న జూలియస్ సీజరును, సేవకుఁడగు అపొల్లొడోరస్ సహాయమున క్లియోపాత్రా చూడఁగల్గెను. వీరిద్దరి ఈ ప్రథమసమావేశము చాల ప్రాముఖ్యమైనది. క్లియోపాత్రా సుందరస్వరూపమును గాంచిన జూలియస్ సీజరు ఆమెను మోహించెను. ఆమె సాహాయ్యమున ఈజిప్టుదేశముపై నాధిపత్యమును

గూడ సంపాదింప సీజరు తలంచుచుండెను. రోము నగరమున నున్న భార్యనైనను తలంపక, రాజ్య కార్యములఁగూడ విస్మరించి సీజరు ఈజిప్టులోనే క్లియోపాత్రా కడ సుఖముగఁ గాలము గడపు చుండెను. ఈదినములలో క్లియోపాత్రా కొక పుత్రుఁడు జనించెను. అతఁడు కేసరియన్ (Caesarion) అని పేరిడి. తనపుత్రుని విఖ్యాతునిగఁ జేయవలయునను తలంపే నాటినుండి యామె నావరించెను. ఈతరువాత కొలది కాలము నకు సీజరు స్వదేశమునకు మఱలి పోయెను. ఇంతటినుండి వారిరువురకు నొకరిపై నొకరికిఁ గల ప్రేమ క్రమక్రమముగ తగ్గఁజొచ్చెను. కేసరియన్‌ను సీజరు పాలించు సామ్రాజ్యము నకు వారసునిగా ప్రపంచము గుర్తించునట్లుఁ జేయుటయే క్లియోపాత్రాకు జీవితాశయ మయ్యెను.

క్లియోపాత్రా తన పుత్రునితో సీజరు అను మతిపై రోమునకుఁ బయనమయ్యెను. రోము పురమున కామెరాక ప్రజలకే తమాత్ర మిష్టము లేకుండెను. రోముపురవాసులు సీజరుక్లియోపాత్రాలకైన పరిణయము న్యాయబద్ధమని సమ్మతింపరైరి. అందువలన క్లియోపాత్రా పుత్రుని యుచ్ఛస్థితి కొఱకు మూడు సంవత్సరము లొంటరిగఁ గాలము గడపుచుండెను. జూలియస్ సీజరున కంతకంతకు శత్రువు లెక్కువైరి. తుద కాతఁడు శత్రువర్గముచే సెనెటుభవనమున చంపఁ బడియెను. ఇంతతో క్లియోపాత్రా ఆశ లడుగంటినవి. భగ్నమనోరథయై యామె తనయునితోఁ గలసి తిరుగ ఈజిప్టునకుఁ బయనమై పోయెను.

మార్కు ఏంటొనీ అనునాతఁడు జూలియస్ సీజరునకు ప్రాణమిత్రుఁడు. సీజరు అనంతర మీతఁడు సీజరునై రివర్గము నోడించి రోము సామ్రాజ్యమున కధిపతి యయ్యెను. ఇతనితో చెలిమిజేసి తనకోర్కెను దీర్చుకొన క్లియోపాత్రా నిశ్చయించెను. కేసరియనునకు సింహాసన మిప్పించుటే యామె గాఢవాంఛ. ఈరాజకీయాధికృతకొఱకే తనప్రేమ నామె వెచ్చించెను. మార్కు ఏంటొనీ టార్సిషునందు బసచేసె నని తెలిసి క్లియోపాత్రా మధ్యధరాసముద్రమును దాటి సపరివారముగ మహావైభవముగ నేగి యాతనిం గలిసికొని, రత్నఖచితములగు బంగరుపళ్ళెము లాతనికిఁ గానుకగా నొసఁగి రాజసమ్మానము నడిపెను. ఈమహాభోగములలో సమ్మోహితుఁడైన మార్కు ఏంటొనీ క్లియోపాత్రాతోఁగూడి ఈజిప్టున కేగి యామెనుగూడి, యామెను పరిణాయమై నిఖిలభోగము లనుభవించుచు విలాసముగఁ గాలము గడపుచుండెను. ఇంతటిలో ఏంటొనీ ఈజిప్టు వీడిపోవలసివచ్చిన యత్యవసరము లగు కార్యము లుండుటచే నాతఁడు రోమునకుఁ బయనమై పోయెను. ఏంటొనీకి క్లియోపాత్రాకుఁ గల సంబంధము తెలిసినతర్వాత ఏంటొని భార్య చనిపోయెను. తర్వాత ఏంటొనీ తిరిగి పరిణయమై యామెయం దొక పుత్రికను గనియెను ఈసమయము లన్నియు క్లియోపాత్రాకు దుఃఖభాజనము లగుచుండెను. తుద కన్నివిధముల నామె మోసగింపఁబడెను.

సిరియాదేశమును జయింపనెంచిన ఏంటొనీకి క్లియోపాత్రాసహాయ మావశ్యకమగుటచే నామె నాతఁడు రోమునగరమునకు పిలువనంపెను. మఱల నామెను వివాహమాడ ఏంటొనీ వాగ్దానమొసఁగెను కొంతకాలము వారిర్వురును కలసి యున్నతరువాత క్లియోపాత్రా కొక పుత్రుఁడు కల్గెను

సిరియాపై ఏంటొనీ దండయాత్ర విఫలమయ్యెను. అతని కలుకుబడి యంత కంతకుఁ దగ్గఁజొచ్చెను. తనవాంఛను వీడక క్లియోపాత్రా అతని నంటియే యుండెను. ఆక్టియమ్ (Actium) అను తావున జరిగినయుద్ధములో

క్లియోపాత్రా పంటోనీల సైన్యములు పూర్తిగ నోడింపఁబడెను. వారిద్దరును ప్రాణముల దక్కించుకొని పారిపోవలసినవారైరి. పలాయితుఁడైన పంటోని ఆత్మహత్య జేసికొనెను. క్లియోపాత్రాను పట్టుకొనవచ్చిన శత్రువుల చేతఁబడి యవమానము నొందక యే యామె చనిపోయెను. అంతటితో గొప్పజీవితము ననుభవించిన ఈజిప్టుదేశపు రాణి యగు క్లియోపాత్రా చరిత్ర ముగిసెను. (క్లియోపాత్రా నీడిల్ చూడుఁడు.)

**క్లియోపాత్రానీడిల్స్** (Cleopatra Needles) — క్లియోపాత్రా ఈజిప్టుదేశపు రాణియై చరిత్రయందు ప్రసిద్ధిఁగాంచినది. ఇమె పేరింటివి క్లియోప్రాత్రా నిడిల్స్ అనఁబడు రాతి కంబములు రెండుకలవు. అందొకటి లండను నగరపు విక్టోరియా ఎంబేంక్ మెంటు నందునను, రెండవది అమెరికా న్యూయార్కు నగరపు సెంట్రల్పార్కు నందునను ఉంచఁబడినవి. ఈ స్తంభములు ఈమె స్థాపించినవిగాని, ఈమెగౌరవార్థము స్థాపింపఁబడినవిగాని కావని తెలియుచున్నది. (క్లియోపాత్రా చూడుఁడు).

**క్వింటిలియను** — న్యూమరికల్సు చూడుఁడు

**కీకటదేశము** — దీనింగూర్చి యేమియు తెలియరాకున్నది. కర్మనాశ యను పేరంబరఁగు నది ఈదేశమందలిది అని మాత్రము తెలియఁబడుచున్నది. ఇప్పటి బీహారములోని షహాబాదు జిల్లాప్రాంతముగా నుండనోపు. దీనింగూర్చి స్పష్టముగాకున్నను బప్పదేవపండితుని భాగవతము నందు శ్లో॥ చరణాద్రిం సమారభ్య-గృధ్రకూటాంతికం శివే। తావత్కీకట దేశశ్యాత్-తదంతర్మగధో భవేత్। అని చెప్పఁబడినది. దీనింగూర్చి యింకను శక్తిసంగమమను తంత్రగ్రంథమున ప్రశంస కలదు. (కర్మనాశానది చూడుఁడు).

**కీడెంచి మేలెంచుమన్నారు** — ఆంధ్రలోకోక్తి.

**కీప్ హౌస్** (Keep House) — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము). ఒక దప్పుల పాలై తన యింటికిం దిరుగుచుండు అప్పులవాండ్లకగుపడకుండ ఇంట లేఁడనిపించుకొనుచుండువాని కీపేరు వాడుచున్నారు.

**క్రీచీశాఖ క్షత్రియులు** — చౌహాను శాఖ క్షత్రియులు చూడుఁడు.

**క్రియా చిలుక** — ఇది న్యూజీలాండు దేశములలోని చిలుక. ౧౭ అంగుళముల పొడవుండును. దానికూతంబట్టి పేరందినది.

**కీరగ్రామ (ము)** — పాంచాలదేశములోని సుప్రసిద్ధవైద్యనాథక్షేత్రము. కాంగ్రాకోట నుండి తూర్పుగా ౩౦ మైళ్ల దూరమగున్న తావు. ఇది [illegible]శాపురీదేవీక్షేత్రమునుండి ఈశాన్య దిశగా ౧౨ మైళ్ల దూరమునందున్నది. ఈవైద్యనాథప్రశంస శివపురాణప్రసిద్ధము.

**క్రీరత్కంబు** — కీర్తిస్తంభము చూడుఁడు.

**కీరిగోత్రము** — నిధృవగణము చూడుఁడు.

**కీర్తిరథుఁడు** — ఇక్ష్వాకుని తరి సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి ప్రతీంధకుఁడు. పితామహుఁడు మరువు లేక మరుత్తు. కుమారుఁడు దేవమీఢుఁడు.

**కీర్తిరాతుఁడు** — ఇక్ష్వాకుని తరి సూర్యవంశక్షత్రియుఁడు. మిథిలాదేశాధిపతి. తండ్రి మహీధ్రకుఁడు లేక మహాధ్రకుఁడు. కుమారుఁడు మహారోముఁడు.

**కీర్తిస్తంభములు** — కీర్తిని స్మారింపఁజేసి నిల్పునవిగాన కీర్తిస్తంభము లనఁబడుచున్నవి. హిందీభాషయందు వీటిని కీరత్ లాట్ లను చున్నారు. "ఒనర్చిన ఘనకార్యములు, దానములు, శాసనములు" మొదలగునవి వీటిపై లిఖించెదరు. కీర్తిస్తంభములు Towers గను, కేవల స్తంభరూపముననుగూడ గాన్పించుచున్నవి. ఢిల్లీ నగరమునందునను, అలహాబాదు నగరమునందును ఇట్టి లోహపు స్తంభములును పలు రాజుల శాసనములను వహించిన ఇతర స్తంభములు కొట్టడములును పెక్కులు గాన్పించుచున్నవి. ఈ కీర్తిస్తంభములలో నగ్రగణ్యమైనది చిత్తూరునందలి కుంభరాణా మహారాణా శాలివాహనశకము ౧౪౪౨ లో నిర్మించిన (Tower) కీర్తిస్తంభము. ఆయన మాల్వాగుజరాతులను జయించిన సూచకముగ దీనిం గట్టించెను. భరతదేశమున ఢిల్లీలోని కుతుబ్ మీనారునకుఁ బిదప గాదగిన ఎత్తైనదే గాని పనితనమునం దెక్కువమైనది. దీని ఎత్తు ౧౨౨ అడుగులు. పీఠముకడ ౩౫ అడుగుల మందముం గల్గి తలవద్ద ఫలకమునకు పదునేనున్నర అడుగులుండును. నలువది రెండడుగుల చౌకపుదిమ్మపై నెత్తగు ప్రదేశమున తొమ్మిది అంతస్థులుగ నిర్మింపఁబడినది. దీని తొమ్మిదవ అంతస్థున రాచక్రీడనడుమను చుట్టు రాణావంశావళియుఁ జిత్రింపఁబడినది. Goath జాతివారు వీటిని కొంతదనుక విధ్వంసమొనర్చి పాడుచేసినను ఒక ఫలకమున ౧౭౨-౧౮౩ శ్లోకములని పోల్పఁదగిన రెండు శ్లోకములు కొంతభాగమును చెడక అక్షరములు తెలియుచున్నవి. అందు "కుంభరాణా అరిమృగతతికి వ్యాఘ్రమువంటివాఁడనియు, శత్రుసుస్థానరాజ్య దవానల దవానలుఁడనియు కలఁడు. పిదప కడను భూమిపై సూర్యకిరణ ప్రసారముండుదనుక, హిమవన్నగము క్రుంగక నిలచియుండుదనుక, సాగరము ఇంకక భూమిని చుట్టియున్నంతదనుక కుంభరాణా మహీపతి నామము లోకమున చిరస్మరణీయమై యుండుఁగాక!" అనియున్నది.

**క్రీలప్రతిక్రీల న్యాయము** — రెండు చక్రములను కల్పి పట్టిడుచే ఇరుసున కిరుదెసల చక్రములు జారిపోకుండునటుల కీలలు బిగించి యుంచుదురు. అట్టి కట్టుదిట్టమని భావము.

**కీలు కెనాల్** (లేక కీలుకాలువ) — ఐరోపాయందున్న బాల్టిక్కు సముద్రతీరమునందు జర్మనుదేశమునందున్న కీలునగరపు హార్బరువద్ద నుండి హాంబర్గు నగరముదనుక త్రవ్వఁబడిన సముద్రపు నీటికాల్వ. డ్రెడ్నాట యుద్ధనావలు సైతము నడచుటకును, లంగరువేసికొని నిల్వయుండుటకును తగినంత విశాలముగ వెడలుపుసగి క్రీ. శ. ౧౯౧౪ సంవత్సరము జూన్ ౧౪ తేదిని తెరువఁబడినది. అఱువదిమైళ్ల పొడవును, నీటి పైభాగమున ౩౩౪ అడుగుల వెడలుపుం గలదని తెలియుచున్నది. రెండుకొనలయందు లాకులు కట్టఁబడినవి. కాల్వపొడవునను విద్యుచ్ఛక్తి దీపములు వెలిగింపఁబడుచు, రాత్రింబవళ్లు ఓడలు నిర్భయముగా నడవ వీలిచ్చుచున్నది. ఇందు యుద్ధనావలు నిర్భయముగ నిల్వయుండనగునట.

**కీలు పనులు** — యంత్రసాధనముల మూలమున నెన్నోపనులు సాధ్యములగుచున్న

టలనే కీలుపనుల మూలమున గూడనన్నాని తెలుపసాధ్యము లగుచున్నవి. కర్రదాంగానరాకుండ నదివఱకే వేగ్నాలుచి యుంచిన కీలువలన కొన్ని విధ్వస్త కార్యములను, మరికొన్ని నిర్మాణ కార్యములను అద్భుతముగా నెరవేర్చుచుందురు. "కీలు" అనునది "మీట" యను గ్రాంథికశబ్దార్థమును, 'కిటుకు' అను గ్రామ్యశబ్దార్థమును స్ఫురింపజేయును. మరియు కీలు శబ్దము "మర్మము" అను భావమును స్ఫురింపజేయు నదికయు కలదు.

ఈ కీలుపనుల మర్మము తెలిసినవాడగుటనే నవనందుల కాలమున నమాత్య రాక్షసుడు చంద్రగుప్తుని మారణోపాయములు పన్నుచు, కీలురథము చేయించి చంద్రగుప్తునకు పిలుచ బంపుట యొకటియు, నింకొకటి చంద్రగుప్తుని పట్టాభిషేక సమయాన, నాతడు రాజకోట ప్రవేశించవలె సింహద్వారము దాటం బోవు కాలమున నా పట్టపుటెనుగును, మావటీడును, నా మదకరీంద్రముపై నధివసించియున్న చంద్రగుప్తుడు నొక్కే మహూర్తమున మడియుటకు సాగించిన కీలు పనులు మన కుదాహరణములు.

మనుష్యులు చేయు పనులలో పెక్కింటిని కీలుబొమ్మలచేత జేయించుట మన దేశమున నాటికాలమునుండి వాడుకలో నున్నదన్న పలుకు సత్యమని చెప్పుట కీ క్రింది యుదాహరణము చాలునని తలంతుము.

మ॥ ఒక మాణిక్యపు బొమ్మ పెట్టెనగ కీలొత్తన్,
జాళివాతాయన ! క్ష్మీశ బాగాల్కపురంపు టాకు
మడపుల్ దెచ్చి రాజన్న చా ! యకు నందియ్య
నతండు లేనగవుతో నక్కేళి నవ్వాళక ! న్యక
గౌంగేల నొసంగ గైకొనియె సమ్మ్యాటంబు
వాటిల్లగన్.

అని ౧౬-౧౭ శతాబ్దము వాడగు చేమకూర వేంకటరాజు తన రచియించిన విజయవిలాసమున వ్రాసియున్నాడు.

**కిలోమీటరు కొలత** — ఇది మెట్రిక్ సిస్టమునందలి కొలతపరిమాణము. ఇది వెయ్యి మీటరులు అనగా ఇంగ్లీషుమైలునందు 0. 6214- ఇది ఇంచుమించు అయిదు ఫర్లాంగులు లేక ౧౧౦౦ గజములు గానగును. ఒక చౌకపు కిలోమీటరు ౨౪౭ యకరముల ప్రదేశమని లెక్కింపబడినది. ఒక చౌకపు మైలునందు 3౨౦ మంది జనులు వసించుచుందురని లెక్కించుచో ఒక చౌకపు కిలోమీటరు ప్రదేశమున ౧౨౭ జనులుందురని తేలుచున్నది.

**కీళ్ల జ్వరము** (Dengue fever) — ఈ రోగము స్టేగోమియాజాతి దోమలవలన కల్గుచున్నది. (స్టేగోమియా దోమలు చూడుడు, దోమలు, అంటువ్యాధులు, సూక్ష్మజీవులు చూడుడు)

ఈ దోమల కాటువలన కీళ్లయందు నొప్పితో జ్వరము ప్రారంభమై ఈ వ్యాధి పొడసూపును. వేసవి కాలమునను, ఉష్ణ ప్రదేశములను ప్రబలు చూపును దీనికి కారణమగు సూక్ష్మజీవిని గూర్చి సరిగా నిరూపింపబడలేదు. దోమ రోగినికుట్టి రక్తపానము సల్పి తానా సూక్ష్మజీవులను లోన నుంచుకొనిన పిదప పదిదినములలో నితరులను గుట్టి రోగవ్యాపన మొనర్చును. దోమ కరచిన నై౫ దినములలో రోగలక్షణము క్రొత్తవాని నావహించెడిని. కాని కొన్ని గ్రంథములందు పదునాల్గు దినములకని చెప్పబడినది. రోగులకు తమశరీరమునం దసహాయత మిక్కుటమై యుండును. మలేరియా సాధనములే దీనికిని సాధనములని ఆంగ్ల వైద్యులనెదరు (మలేరియాజ్వరము చూడుడు). ఈజాతి దోమలనుండియే,

యెల్లో జ్వరము కూడ వ్యాపించెడిని. యెల్లో జ్వరము ఆఫ్రికాదేశమున ప్రబలముగ నున్నదట. డెంగ్యూజ్వరము అప్పుడప్పుడు భరతదేశమునం దగుపడుచుండును.

**క్రీక్ (Creek)** — సముద్రపుపాయ సన్నముగ భూమిలోనికిం జొచ్చుకొనిపోయి యుండుదానికి Creek అని పేరు. దీనియందొక నది సంగమించునేని దానిని స్కాట్లాండు దేశమున Frith లేక Firth అనియెదరు. (Sea Portions చూడుడు).

**క్రీటీ (లేక) క్రీటు లిపి**— మధ్యధరా సముద్రము (మిడిటరేనియన్సి) యందుగల క్రీటీ ద్వీపమునం దీలిపి వాడుక యందుండెను. ఇచటి ప్రజలు గొప్పనాగరికస్థితి నాదికాలమునం దంది యుండిరట. ఆద్వీపమందు పురాతన స్థలముల తావులం ద్రవ్వ రెంకువాదల వలను శాసనములు కాల్చిన కుండపెంకులపై నున్న లిపితో దొరకినవి అవియేమో ఇంతవరకు తెలియదు. ఇవి క్రీ. పూ ౨౦౦౦ మొదలు ౧౫౦౦ నడుమ కాలమువిగ తలంచుచున్నారు.

**క్రీటీ ద్వీపము** — కేండి యాద్వీపము చూడుడు.

**క్రీడతాళము** — తాళములు చూడుడు.

**క్రీడా బ్రహ్మవాద మతము** — ఇది షడ్వేదాంతవాది మతములలో నొకటి ఈ మతమున జగమంతయు ఈశ్వరునిచే ఉపాదాన కారణముగ సృష్టింపబడినదే. అనగా జగమంతయు పరమేశ్వరుని స్వపదార్థమే. జగద్వస్తు సముదాయమంతయు నిత్యములు, సత్యములు నని వస్తుతః యొంచుగునది. కాని పరమేశ్వరుని వికారరూపములగు బహునామ రూపములం ధరించిన పదార్థతతిగ చెప్పంబడినది. పరమేశ్వర పదార్థమే ప్రాణులనియు, సాత్విక, రాజస, తామసాంబులను గుణములు శరీరములతో పాటు ప్రాణులకు పరమేశ్వరునిచేః గుర్పంబడినవనియు, బ్రహ్మానుట్లుతానే తన స్వపదార్థములో వేర్వేఱు రూపములం జెంది తనతో తానాడుకొనును. క్రీడావినోదమే జగద్వ్యవహారమనియు, సృష్టి యంతయు పరమేశ్వరుని (పరిణామ రూపము కాదనియు) వికారరూపమనియు చెప్పంబడినవి. తక్కిన నిర్వచనములన్నియు నాదబ్రహ్మవాద భాస్కరీయ సిద్ధాంతములంనువలెనె చెప్పంబడినవి. (చూడుడు). జగద్వస్తువులలో తానొక వస్తువే యనియు, బ్రహ్మాంబుయొక్క సంబాధినేయనియు, క్రీడార్థమే సృష్టించబడితిననియు, తానొండుప్పకర్మ మాత్రయు బ్రహ్మముయొక్క క్రీడయందలిదేయనియు, తాను అటుల నిత్యుండంగాని మిథ్యగాదనియు, అనుభవపూర్వక జ్ఞానముగంనుట మోక్షమనియుం జెప్పంబడినది.

ఈ క్రీడాబ్రహ్మవాదమతమును ఇప్పటి పంజాబు నందు జీవించియుండిన గురునానక్ అను మహాత్ముండు శోధించి కొంత శిష్యసాధువులను స్థాపించి మతవ్యాపకము ప్రారంభించెను. వారి నిప్పుడు అకాలీలనియు, సిక్కులనియు వాడుచున్నారు. వారి ప్రధానస్థానము అమృతసర్ నగరము. అటనే వారి ప్రధానదేవస్థానము కలదు. ఇంకను పెక్కుతావులందుగు రుద్వారము లనంబడు పవిత్రస్థానములు కలవు. వానిగూర్చి ఈ సందర్భమున నించుక వివరించుట సమాజసము.

సిక్కు మతమున గురువులు పదిమంది

౧. నానకుగురుండు-రావీనదీతీరమున తాలాతురానగరమున జన్మించినవాండు. షడ్గుణైశ్వర్యవంతుండనియు, గగనసంచారియనియు, సంపూర్ణయాత్రాపరుండనియు, తానేగవలసిన తావును తనకడకు రప్పించుకొను శక్తిగలవాండనియు, క్రీ. శ. ౧౪౬౯–౧౫౩౮ మధ్య జీవించినవాండనియుం జెప్పంబడినది.

ఈయన తపస్థానము ఇప్పుడు అమృతసర్ నగరములోని అమృతసరస్సు (సరోవరము) ఉండినచోటు. ఈయనకు కుమారుడుండిన నీయన మఠాధిపత్యము తన సుతున కొసంగక ప్రధానశిష్యుడగు లహానున కొసంగి యాతని అంగదగురుడని పేరొసంగెనట.

౨. అంగదగురుడు

3. అమరదాసుగురుడు.

౪. రామదాసు గురుడు- ఈతడమరదాసు గురుని పుత్రుడు. ఈతడు అమృతసరస్సను పవిత్రసరోవరము త్రవ్వించినవాడు. మరియు నీతడే యచట దర్బారుసాహెబు దేవస్థానము నిర్మాణ మారంభించెననియు, దానిచుట్టి అమృతసర్ పురము కట్ట ప్రారంభించెననియు, గ్రంథ సాహెబు అని పేరిడి పూర్వగురోక్తుల చేర్చ మొదలిడినవాడనియు జెప్పబడినది

౫. అర్జునగురుడు- ఈతడు రామదాసు గురుని పుత్రుడనియు, తండ్రి సంకల్పించిన కార్యములన్నియు బరిపూర్తి చేసినవాడనియు, తన శిష్యులకు యుద్ధతంత్రము బోధించి మతరక్షణ నియమించెననియు, గురుడై, సైన్యాధిపతియై మతస్థులను నడిపెననియు జెప్పబడెను.

౬. హరగోవిందగురుడు.

౭. హరిరాయి గురుడు.

౮. హరికిసన్ గురుడు.

౯. తేగ్బహదూర్ గురుడు.

౧౦. గోవిందసింగు గురుడు- ఈతడు, తేగ్బహదూర్ గురుని కుమారుడు. ఈ దేశికుని మహాఘనునిగ చెప్పుదురు. తనశిష్యులగు సిక్కులలో ప్రతివానినామములకు సింగ్ (సింగము) అను బిరుదము తప్పక వాడునటుల శాసించెను. కృపాణమును చిన్న చూరకత్తిని ప్రతివాడును నిత్యము ధరింపజేసెను. శిఖ (జుత్తుపెంచుట), గడ్డముల క్షౌరమొనర్పరాదని శాసించి పాగను ధరింప విధించి రూపములంగూర్చెను. మతరక్షణవిధి నుద్బోధించి ఖడ్గము బూనించుట మతధర్మములుగా జొన్పెను. అన్నికులముల సమత్వము నిర్ణయించి జాతిసమాన్య సాధుబలమభివృద్ధి గొందించెను. స్వమతమున కన్యుల వలన బాధకల్గినతరి మతరక్షణకై యొనర్పు సంగరము ధర్మసంగ్రామముగ బోధించెను. తన శిష్యబృందమును వీరవరులం జేసెను. మతగ్రంథమును బూర్తిచేసి తన కుంబిదప మఠాధిపత్యమునకు వేఱొకగురుని నియమింపక ఎప్పటికేని యీగురుగద్దెను గ్రంథమునాదే యుండునుగాన దానిని జూచుకొనుడని సెలవిచ్చి మతగ్రంథమునె గురునిగ నియమించెను.

పిదప నీమతమునందు గురువులు లేరు. తక్కినవారందఱును శిష్యులే గాన సిక్కులనబడిరి. ఇక పరమేశునకు కాలము లేదు అకాలి యనుట నీమతస్థుల నికాలీలనియును బేరుకలదు. వీరి మతగ్రంథమును గ్రంథసాహెబనియు, దానినుంచు దేవాలయమును దర్బారుసాహెబనియు ననుచున్నారు వీరు పరమేశ్వరుని ప్రధాన నామము హరి యనెదరు. వీరికి గురుశిష్యధర్మము ప్రధానమట పరమేశ్వరుడగు హరి క్రీడావినోదియై సర్వత్ర వ్యాప్తిగలవాడందురు. పునః పునర్జన్మములందు వీరికి నమ్మకము కలదు. విగ్రహారాధన వీరియందు లేదు. గ్రంథపఠనము గానవాద్యములతో నడపుచుందురు. ఇదియె అర్చనా విధానము. హరినిజేరుట ముక్తియని కొంద అందురు.

**క్రీవ గోత్రము** — గర్గఉపగణము చూడుడు.

**క్రీస గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుడు.

**క్రీస్తుప్రభువు జన్మకాలము** — ఈయన B. C. ౪ వ సంవత్సరమున (అనగా ౬ సంవత్సరములు ముందు) జన్మించెనని యూరోపా దేశపు పండితులు అనుచున్నారు ఇంకను వారి జన్మదినము డిశెంబరు ౨౫ కాదనుటకును గూడ సిద్ధమైయుండుట గాననగును క్రీ. వె. ౬ వ శతాబ్దమున Abbot Dionysius Exigwes అను బోధకుడు ఈ శకమును నిర్ణయించినవాడని చెప్పబడినది ఆయన రోమాశకము ౭౫౪ సంవత్సరము జన్మవత్సరముగ నిర్ణయించియుండెను. హెరోద్ భూపతి రోమకశకము ౭౫౦ లో మృతినందియుండుట నాయన మృతికిం బూర్వమె క్రీస్తుప్రభువు జన్మించియుండుటలు బైబిలునందేయున్న కారణమున అబ్బాటుగారి నాతత్ నిర్ణయము సరికాదని తేలుచున్నది. ఇటీవలివారు క్రీస్తుప్రభుని జన్మము B. C. 5 లేక 6 లోనో, రెంటి మధ్యకాలమునో జరిగియుండునని తలంచుచున్నారు కొందఱు క్రీ ము. ౭ వ సంవత్సరమనియు నందురు. ఏది ఎట్లున్నను ఇప్పుడు నవరించుట దుస్సాధ్యము. ఇంక నెలస్థితియు విశ్లేషయున్నది. బైబిలునందు శీతకాలపు రాత్రులనియు, మేకల గొఱ్ఱెల కాపరులారుబైట నుండ వీలుండని కాలమనియు, వారు ఆరుబయట వసించుట ప్రారంభము Vernal Equinox (అనగా మార్చినెల ౨౧ తేదీ) నుండి జరుగునది యనియు తేలుచుండుట, అమహాత్ముని జన్మము Spring లేక Summer నందని తలంచుచున్నారు. (ఈస్టరు పండుగ చూడుడు).



**క్రీస్తుప్రభుని పంౘ్రెండుగురు శిష్యులు** —

౧. Matthew, ౨ Bartholomew. 3. James- ఈయనను క్రీస్తుప్రభువు Son of Thunder అని పిలచుచుండువాడని చెప్పబడినది. (పెద్దజేమ్సు). ౪ John- ఈయన క్రీస్తుప్రభుని ప్రియశిష్యుడు.(John the Baptist కాదు. ఈయన వేఱు) ఈయన తండ్రిపేరు Zebedee, తల్లిపేరు Salcme, వీరు Galile దేశపు చేపలవాండ్రు ౫. Philip (ఫిలిప్పు) ౬. Thomas (థామాసు). ౭.Peter- ఈతడు రోమునకుపోయెనని చెప్పెదరు ౮ చిన్నజేమ్సు 'Little James).౯ Simon (సైమన్).౧౦ Andrew (ఆండ్రేయు). ౧౧ Judas (జూడాస్) ౧౨. Thaddeus (థాడియస్).

**క్రీస్తుప్రభువు జన్మించిన పిదప మొదటి శతాబ్దకాలమున బైబిలు నందు వివరింపఁబడినమేరకు చరిత్రాత్మకములగు సంగతులు, వాటి కాలము** — ఇవి బైబిలునందు వివరింపఁబడిన చరిత్రాత్మక విషయముల తరువాయిగ నెఱుగవలయును. క్రీస్తుప్రభువు జన్మము A. D. ప్రారంభమునకు పూర్వము నాల్గుసంవత్సరముల నాడని చెప్పఁబడినది. ఈలెక్క నిట్లొనర్చుటకుఁ గల కారణము గుహ్యము. Nativity of Jesus Christ four years before A. D. అనియు మాత్రము చెప్పఁబడినది. క్రీస్తుప్రభువు తన పన్నెండవయేటఁ యెరూసలమునకేగి దేవాలయము లోనికి ప్రథమమున జనుట.

పొంపియస్‌పిలాత్ లేక పిలాటస్ జూడియా పరిపాలకుఁడుగ రోమునుండి పంపఁబడుట- క్రీ వె. ౨౨. జాన్ ది బాప్టిస్టు స్నానములిచ్చుటను ప్రారంభించుట అనగా నాచార్యత్వము

వహించుట- క్రీ. వె. ౨౬. క్రీస్తుప్రభువు జాన్‌ది బాప్టిస్టుకడ జోర్డాను (బూర్డన్) నదియందు జ్ఞానస్నానమునందుట- క్రీ. వె. ౨౭. క్రీస్తుప్రభువు శిలువవేయబడి మృతులనుండి లేచుట- ఇది ఆయన 33 వ సంవత్సరము. క్రీ. వె. ౨౯. పౌలు క్రైస్తవ దీక్షనందుట. క్రీ. వె. 3౨. Gentiles Conversion- క్రీ. వె. 3౫. హేరోదుభూపతి అపోస్తలుండగు జేమ్సును శిరచ్ఛేదము చేయుట, పీటరు దేవదూతవలన విడుదల చేయబడి రక్షింపబడుట క్రీ. వె. ౪౪. పౌలు ఖైదీగా రోమకపురి కంపబడుట- క్రీ. వె. ౬౨. యూదా యుద్ధప్రారంభము- క్రీ. వె. ౬౬. పౌలు రోమకపురిని నీరో యాజ్ఞమేరకు చంపబడుట- క్రీ. వె. ౬౭. రోమునందుకు టైటాస్ సేనాని జరూసలెం ముట్టడించుట క్రీ. వె. ౬౮. రోమనుండగు టైటాస్ సేనాని జరూసలెం పట్టుకొనుట, మహోత్పాతము, ౧౧,౦౦,౦౦౦ మానియూదులు నాశనమగుట, అన్యప్రదేశముల జనాశము- క్రీ. వె. ౭౦ జహోవాదేవళము పునాదులతో పీకివేయబడుట- క్రీ. వె. ౭౧. డొమిటియన్ పాట్మాస్ ద్వీపమునకు జానును ప్రవాసమంపుట- క్రీ. వె. ౯౬. జాను పట్మాసున తన దివ్యబోధ గ్రంథమును వ్రాయుట క్రీ. వె. ౯౭. యోహాను (జాను లేక జోహాను) ప్రవాసమునుండి విడుదల నంది తినగోస్పెలు వ్రాయుట- క్రీ. వె. ౯౮. కడకు మిగిలి బ్రతికిన యోహాను (John) అపోస్తలుడు (తన నూరవ సంవత్సరము వయసున) చనిపోవుట- క్రీ. వె. ౧౦౦.

## క్రీస్తుప్రభువు జీవితము —

ఈయనను యేసుక్రీస్తనుటయుంగూడ కలదు. పాలస్తీనాదేశపు బెత్లెహేముపురమున నొక సత్రము నందలి పశువులశాలయందు జన్మించెనట. తండ్రి పేరు జోసెఫనియు, తల్లిపేరు మేరీదేవియనియుం చెప్పంబడినది. ఆమె అవివాహితయు పరిశుద్ధాత్మవలన నామెకుం గర్భముకలిగెననియుం చెప్పంబడినది. జోసెఫు వడ్రంగము చేయువాడట. క్రీస్తుప్రభువు పాపరహితుండని చెప్పంబడియున్నది. వారు యూదులు.

పిదపం దలిదండ్రులును నాజరేతుకుం గాపురముపోవ క్రీస్తుప్రభువటనే సోదరులతో పెంపంబడెనట. కొందఱు సోదరులనుట వలన వారు వేఱొకభార్యయందు జోసెఫునకుం గల్గిన పుత్రులనిరి కాని వానింగూర్చి యేమియుం దెలియరాకున్నది. క్రీస్తుప్రభువు పండ్రెండు సంవత్సరముల వయస్సున తలిదండ్రులతో జరూసలెము దేవాలయమునకరిగి యట దేవాలయపు బాడితులతో వాదించి తలిదండ్రులవిగాంచి యాశ్చర్యపడిరని చెప్పంబడినది. పిదప ముప్పదియేండ్లవరకుం గ్రీస్తుప్రభువు వడ్రంగపనియు గొర్రెలకాపరితనమును వృత్తులుగగల్గి గడపెననియందురు. ముప్పదియేండ్లప్పుడు జార్డ్ది బాప్టిస్టు మహాత్ముండీయనకు జార్డనునదియందు బాప్తిస్మమునొసంగి యాశీర్వాదమిచ్చెనట. పిదప నలువదిదినములు క్రీస్తుప్రభువు గారు అడవులందు విశ్రమించుచు సైతానువలన ప్రోత్సహింపంబడుచు మనోవేదనల ననుభవించిరట. పిదప వానిని నిరసించి తనమతబోధకై యుక్తులైన పండ్రెండుగురు శిష్యులఁగా యనః జేసుకొనిరని చెప్పంబడినది వారితో నాగుటువరేఖ్యండు దేశాటనము బోధలొనర్చుచు గడపెను. అత్తరి ననేక మాహాత్మ్యములు చూపెననియు, పెక్కండ్రు రోగములం గుదర్చెననియుం జెప్పంబడినది. ఆయన బోధలందు మానవులందు యెహోవా దేవుండగు తండ్రికిఁగల ప్రేమాతిశయమును నీతులును లోక వర్తనధర్మములును కలవు. ఆజగద్గురుండు తాను దేవునిసుతుండననియు, దేవునకు దైవచింతన గల వారికిని మధ్యవర్తిననియు తెలుపుచుండెనట.

వారి శిష్యులలో నొకఁడగు ద్రోహి ఆచోకి నీయగా రోమనుభటులచే పట్టుకొనంబడి పోంటియస్ పిలాతను న్యాయాధికారిచే విమర్శింపఁబడి మృతిశిక్ష వేయంబడి, శిలువ (Cross) పై ఇద్దరు చోరులనడుమ కాలుసేతులకు మేకులు గొట్టంబడి శుక్రవారమున మృతినొందెనట. నాఁటినుండి ఆదినమును Good Friday అని పవిత్రదినముగ నాయనమతస్థు లాచరించుచున్నారట. ఆవప్తీయుని శరీరము దింపి ఒక సమాధియందుంచిరట వారిపేర అరిమతీయా కాపురస్థుఁడగు యోసేపుగారని చెప్పఁబడియున్నది. వారిని సిలువవైచినతావునకు కాల్వేరీయని పేరట.



పిదప 3 దినములనాఁడా శరీరము పైకిలేచిపోయి నలుబదిదినములవఱకప్పుడు కొందఱు భక్తులకుఁ గన్పడుచు మాటలాడుచుచుండి కొందఱు చూచుచుండఁగా నాకాశమున కెగసిపోవ మేఘము లడ్డమాయెనని చెప్పఁబడినది. ఇది బైబిలునందలి కథనము. పిదపఁ గొందఱు క్రైస్తవమతాభిమానులు వారిచర్యలను లోకకారణయుక్తముగ సమర్థింపఁ దొడఁగిరట గాని క్రైస్తవచర్చి వాటినెల్లను ఊహామాత్రములుగ నెంచి నిరాకరించెనట.

---

**కుంకుడు చెట్టు** — లా. Sapindas emarginatus, Sapindas trifoliatus అనియు, ఇంగ్ల. Soapnut tree అనియు, సం. అరిష్టక, ఫేనిలం అనియు, కొందఱు కృష్ణబీజమనియు వాడిరి. కుంకుడు పెద్దకుంకు డనియు, చిన్నకుంకు డనియు ద్వివిధము. పెద్దకుంకుడు ఉత్తరహిందూస్థానమునను, అందు ముఖ్యముగ పాంచాలదేశమునందు కల్గియుండును. చిన్నకుంకుడు ఆంధ్రదేశమునం దెల్లెడలను కలదు. పెద్ద కుంకుడుకాయలు (లోనిపిక్కలుసహా) చిన్నకుంకుడుకన్న చాల పెద్దవిగ నుండును. ముఖ్యముగ కుంకుడుచెట్టు కాయలకై వాడుదురు. కాయలలోనిగుంజు అభ్యంగనమున తల, శరీరము రుద్దుకొనుటకు (మురికి వదల్చుటకు) ఉపయోగింపఁబడును. మఱియు లోనికిచ్చిన ఉబ్బసపు దగ్గు, శ్లేష్మముల నాపును. మూర్ఛరోగికి తెల్వి దెప్పించును. పైన పట్టించిన పాము, తేలు, జెఱ్ఱి కాటువలనగగ్గిన విషము విరిగిపోవును. ఆకుంబదంచి తలకుంగట్టిన శిరోవాతము, దారుణమగు తలనొప్పి యడంగును. కాయల పులుసు పశువుల దొమ్మరోగము నివారించును. సాధారణముగ దీనిని గృహస్థులు ఇంటిపెరళ్లలో పెరుగనియ్యరు. ఇది అట్లు నిషేధము.

**కుంకుమపూవు చెట్టు** — లా. Crocus lativus. ఆంగ్లమున కొందఱు Saffron అందురుకాని అది సరియగు అనువాదనామము కానేరదు. సం. కుంకుమం, అగ్నిశిఖ అని పేర్లు కొన్నిచోట్ల పీతక, అని గూడ వాడియున్నారు. ఈచెట్లకు కాశ్మీరదేశమును, హిమవన్నగోపరిశీతలప్రదేశములును జన్మస్థానములు. అచ్చోట్లయందు దీనిని కుంకుమ చెట్టని యెదరు. ఈచెట్లపూవునందిదియే దీనివాడుక. ఇతరతావుల నీచెట్టు పెరుగుటలేదు.

కుంకుమపూవునకు కస్తూరి గోలు పెక్కు గుణములు కలవు. తాంబూలముతో కల్పిన అంతరమలినశరీరమున కమితమగు ఉత్సాహశక్తిం గల్గించి, రుచికరమై పరిమళము గల్గించును. రోగికిచ్చిన వేడిచేసి విరేచనము చేయించును. వీర్యవృద్ధి బలము గల్గించి, బుద్ధికి బలమొసంగి నిద్రం గల్గించును రక్తమును శుద్ధపఱచి శరీరమందలి చెమట మొదలగు మలముల వెడలజేయును. సన్నిద్రరోగము నాపును త్రిదోషహారమై, విషములను, విషదోషములను, రసపట్లను, గుండెదడలు, ఈడ్పు, గూడెకొప్పి నివారించును. పనులాడలి పట్లు, పోటులు, శోభిమచ్చలు, చర్మరోగములు, వాతములు, పురాణజ్వరములు, రక్తపైత్యము నివారించును. అపస్మారము, విచారపుబిచ్చి, దోషజ్వరములు, నేత్రరోగములు, నాశికారోగములు, కర్ణరోగములు, శిరస్సునందలి రోగముల నాపును

ఏయౌషధముతో దీనిని రోగికిత్తురో ఆ యౌషధమును శరీరమునందు నాటుచు చక్కగ వ్యాపింపజేయును. నైని నీరృతోమూత్ర పట్టించిన గడ్డలు గరగించుటయో, లేక పక్వపఱచుటయో జరగించుటయేగాక, స్ఫోటకరోగము నగు కురుడల (పొక్కుల) కేవిరోధము లేకుండ నాగగజేసి చక్కగ బక్వపఱచును.

ప్రసవించిన స్త్రీలకు వేడినీళ్ళతోనూరి లోని కిచ్చిన జ్వరమురాకుండ నాపి, మైలరక్తమును నీటిని చక్కగ వెడలించి శరీరమునకు బల మొసంగుచుండును. నీట నూరి కండ్లచుట్టు పట్టు వేసిన, కండ్ల ఎఱుపులు, మంట, పోటు మొదలగు నేత్రరోగముల నివారించును. అధికముగ దినిన కాకజేసి, రక్తమును పలచనగ గరగించి, నీరసముం దెచ్చి బుద్ధిం జెరుపుటయేగాక, తల నొప్పి గల్గించి ఆకలి మందగింపజేసి మెదడునకు పిండోత్పత్తిస్థానమునకు వికృతిం గలుగజేయునని చెప్పబడినది.

కుంకుమపూవునకు విరుగుడు- నల్లమందు, సముద్రపునురుగు, కొబ్బరికాయనీళ్లు, శీకాయబీజము అని చెప్పబడినదిగాని, ఇది శరీరతత్త్వముల ననుసరించి అనుగుణ్యమైనదానినే యీయవలసి యుండును.

**కుంచములో కదుళ్లు పోసినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**కుంచెడు గింజల కూలికిపోతే తూమెడు గింజలు దూడ తినేసి నట్లు** — ఆంధ్రలోకోక్తి.

**కుంజరస్నానన్యాయము** — ఏనుగు ఎంతసేపు ఎంతపరిశుభ్రముగ జలకమాడినను, పైకివచ్చి తొండముతో బుగ్గినెత్తి తన మేనిపైం జల్లుకొనును.

**కుంజరుడు** — ఒకానొక వానరుడు. ఋష్యమూక పర్వతశాఖ యగు అంజనాద్రిపై (కిష్కింధ నంటియే యున్నది) నివసించువాడు. ఈతని కుమార్తె అంజనాదేవి. వాయుదేవుని వలన ఆంజనేయునింగనినది. కుంజరుడాంజనేయునకు మాతామహుడు. (అంజనగిరి చూడుడు).

**కుంటికాలిక్కి జారిపడుట యెముఖ్యమగు నెపము** (సాకు) — ఆంధ్రలోకోక్తి.

**కుండధారోపాస్తి న్యాయము** — కుండధారుడను పేరుగల ఒక యక్షుని ఒక భక్తుడు సేవించుచుండువాడట. ఒకనాడు సంప్రీతుడై ఏమికావలయునని యడుగ నాభక్తుండొక వరముం గోరెనట. దానినీయ నాయక్షునకు బలముచాలక తాను మఱియొక దేవత నుపాసించి దానింబడసి తన భక్తునకిచ్చెనట. ఇట్టి ఆశ్రితవత్సలత్వముం దెలుప నీ న్యాయము వాడుదురు.

**కుండల** — వింధ్యవంతుని కుమార్తె. ఈకుండలకు ఎల్లయెడల సంచరించు శక్తి కలదనియు, కుండలభర్త శంభుఁ డను రాక్షసునిచే బంపఁబడినవాఁ డనియుఁగూడ చెప్పఁబడినది.

**కుండలమధ్యకు గుర్రాన్ని తోలినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**కుండలరేఖ** — పురుష సాముద్రికము చూడుఁడు, స్త్రీసాముద్రికము చూడుఁడు.

**కుండినర్షి (లేక కౌండిన్య) గోత్రము** — (శిష్టుకరణములు చూడుఁడు). వీరికిం బ్రధానర్షి వశిష్ఠుఁడనియు, ప్రవరరూపము వాశిష్ఠ, మైత్రావరణ, కౌండిన్య యను త్ర్యార్షేయ మనియుం జెప్పఁబడినది. శిష్టుకరణములలో అమరాంవారు, గజగంటరావువారు, మంత్రివారు, మురహరిరావువారు అను నింటిపేర్లవా రీగోత్రజులై యున్నారు.

**కుండినగణము** — ఇది వశిష్ఠసంతతి యందలి యొక గణము ఇందు 33 గోత్రములు కలవు.

బోధాయన సూత్రోక్తగోత్రములు (౨౧)- ౧. ఆక్షిత, ౨. అచిరవం, 3. అవగ్రాను, ౪. అశ్వద్ధ, ౫. అశ్మరథ్య, ౬. కాపుటి, ౭. కుండిన, ౮ కౌత్రోహ్య, ౯. గుగ్గులి, ౧౦. తిమ, ౧౧. శైక్షగ్ని, ౧౨ పేటక, ౧3. పైప్పలాది, ౧౪. బాహు, ౧౫. మాధ్యందిన, ౧౬. లోహాయన, ౧౭. శామంగలి, ౧౮. స్వాతి, ౧౯. సాగి, ౨౦. సౌపటి, ౨౧. హిరణ్యాక్షాయణ

కాతీయ సూత్రోక్త గోత్రములు (౯)- ౧. ఐశ్వమిస, ౨. ఔపస్వస్థ, 3. త్రయమభృంగ, ౪. మిత్రావరుణ, ౫. మాద్గల, ౬. లులాము, ౭. లోహి, ౮. స్వలోశ్య, ౯. స్వసులి.

ఇతర గ్రంథోక్త గోత్రములు (3)- ౧. కౌండిన్య, ౨. గోపన, 3 పాలోహ.

ఈకుండినగణమునందలి 33 గోత్రములకు, ప్రవరరూపములు (౪)· ౧. వశిష్ఠ. ౨. వశిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య. 3 వశిష్ఠ, ఇంద్రప్రమద, ఆభరద్వసు. ౪. వశిష్ఠ, ఆభరద్వసు, ఇంద్రప్రమద.

**కుండిన గోత్రము లేక కౌండిన్య గోత్రము** — కుండిన గణము చూడుఁడు.

**కుండిన పురము** — తొల్లింటి విదర్భ దేశమునకు రాజధాని (విదర్భ చూడుఁడు)

**కుండేబ గోత్రము** — ఔతథ్య ఉప గణము చూడుఁడు.

**కుండోదరాయణ గోత్రము** — ఉపమన్యు గణము చూడుఁడు.

**కుంతలదేశము** — తూర్పున తూర్పు కనుమలు, గోదావరినది, దక్షిణమున తుంగభద్రానది, పశ్చిమమున అరేబియా సముద్రము, ఉత్తరమున నర్మదానది, ఎల్లలుగ చెప్పఁబడినవి. కాని, ఇవి చాళుక్యుల పాలనమున అభివృద్ధిఁ గాంచిన నాఁటి ఎల్లలుగాని, అసలు ఎల్లలు కావు. రాజధానులును వేర్వేఱుకాలముల వేర్వేఱుగ నుండెను. దీనికి మల్లఖేటమనుపురము రాజధానియై యుండ అహమల్లుఁడను తూర్పు చాళుక్య నృపతి క్రీ. వె. ౧౧వ శతాబ్దమున కల్యాణపురమును నిర్మించి రాజధానిగఁ జేసుకొనెను. మల్లఖేటమునకు మాన్యఖేటమనియుం బేరుండెనట యని డాక్టరు భాండార్కరు పండితుఁడు వ్రాసెను. క్రీ. వె. ఏడవ శతాబ్ద ప్రారంభ కాలమున చాళుక్య రాజులు రెండు భాగములైరి. పశ్చిమ చాళుక్యులు దక్కన్ (దక్షిణాపథము) యొక్క పశ్చిమభాగమును, తూర్పుచాళుక్యులు గోదావరి కృష్ణానదుల మధ్య

పల్లపు భూముల ప్రదేశమును ఆక్రమించి యేలు చుండెను. కల్యాణపురము బొంబాయి రాజధాని షోలాపూరు ప్రాంతమున గలదు.

సోమేశ్వర భూపతి రెండవ సుతుండగు త్రిభువన మల్లుని యాస్థాన కవియు, పండితుండును అగు విజ్ఞానేశ్వరుండు, మితాక్షర యను ధర్మ శాస్త్ర కర్త త్రిభువన మల్లునకు రెండవ విక్ర మాదిత్యుండని పేరుండెను. ఈతని పాలన క్రీ. శ. ౧౦౭౬ నుండి ౧౧౨౭ వఱకని లెక్కింపఁబడినది. ఈతఁడు చాళుక్యరాజులలో మిక్కిలి బలాఢ్యుండని South Indian Paloegraphy P. 56 యందు డాక్టరు బర్నెల్ పండితుండు వ్రాసి యున్నాఁడు. ఈ రెండవ విక్రమాదిత్యుని యాస్థానమునని బిల్హణుండను నొక పండితుం డుండు వాండనియు, అతండు బహుశః క్రీ శ. ౧౦౮౫ ఆ ప్రాంతమున విక్రమాంకదేవ చరిత్ర వ్రాసియుండెననియు, దానికి ఉపోద్ఘాతము వ్రాయుచు Dr. Buhler వ్రాసెను.

వాసవ పురాణమునందు కల్యాణపురమున ప్రభుత్వ మొనర్చిన నృపతులలో కడపటివాఁడగు బిజ్జల నృపతి జైన మతస్థుఁడనియు, బసవాచార పద్ధతిని వీరశైవ మతశాఖను ప్రారంభించిన బసవేశ్వరుని మంత్రిగ గల్గియుండియు బసవాచార మార్గశైవులగు జంగములను, లింగాయతులను కడుంగడు బత్తిడిగల్గించ దానిం భరింపజాలక జగద్దేవుండను లింగాయత ధీరుఁడొకండు తనవారి కష్టముల ఏముక్తికి నోసంగునని బిజ్జల భూపతిని యాయన నగరునందే వధించెననియు చెప్పఁబడి యున్నది.

పిదప నంతఃకలహములు గల్గి కల్యాణపురము పడిపోయినట్టు కలదనియు, అట బసవేశ్వరుఁ డైక్యముచెందిన సంగమేశ్వరదేవస్థానముకలదు. అది నేఁటికిని లింగాయతవిధానమున నర్చింపఁ బడుచున్నది. ఒకప్పుఁడు నాశికయు రాజధానిగ నుండెనట. ఒకప్పుఁడు దక్షిణ మహారాష్ట్ర దేశ మందు చేరియుండెనట. ఇప్పటి మైసూరు రాజ్యములోని ఉత్తరసీమలం దొకప్పుఁడు చేరి యుండెనట. క్రీ. శ. ౧౦ వ శతాబ్దమున విదర్భయు నందు చేరియుండెనని రాజశేఖరుని కర్పూరమంజరి యందు చెప్పఁబడి యున్నది. మార్కండేయ పురాణము ౫౭ యందు కుంతల దేశము దక్షిణాత్య కుంతల యనియు, మధ్యదేశ కుంతలయనియు రెండుగ జెప్పఁబడినది మైసూరు రాజ్యములోని శివమొగ (ఇప్పటి షిమొగా) మండలమున సురభి (ఇప్పటి సొరాబ్) కడనున్న కుబత్తూరు తొల్లింటి కుంతలపురమని యచటి వారనెదరు. కుబత్తూరు చంద్రహాసుని రాజధాని యని వాడుక గలదు.

**కుంతిభోజుఁడు** - భోజుఁడు చూడుఁడు.

**కుంతీభోజదేశము** — (భోజదేశము, భోజపాలనము, కుంతీదేశము) - ఇది మాళవదేశ మునకో లేక దేశభాగమునకో ఇతర దేశభాగ ములం గల్పిరో ఒకప్పుడు పై నాల్గు పేరులం బరగెనని తెలియు చున్నది.

హర్ష చరిత్రయందు రంతిదేవుని రాజధాని రంతిపురమని గలదు. దానికి కుంతిభోజపుర మని పేరనియు తెలిసెడిని. ఇకను భోజదేశ మనియు, కుంతీదేశమనియు గూడ పేర్లుండెనట. పాండవుల తల్లియగు కుంతీదేవి ఈదేశపు రాజగు కుంతిభోజుని దత్తత కుమార్తెయె. దీనిం గూర్చి మహాభారతము ఆదిపర్వము ౧౧౧-౧౧౨ లందు కలదు. అశ్వ లేక అశ్వరథానది ఈదేశముగుండా ప్రవహించును. ఈ నదీ తీర మున రాజధాని యుండెను.

ఈదేశమునకు భోజపాలన మనియు వాడుక యుండెను. అదియె యిప్పటి పేరగు భోజ

పాలుగా మారినదని తెలియఁబడుచున్నది. భోజ మహారాజు గొప్ప పేరందిన వాఁడు. ఆయన యాస్థానమున కాళిదాసాది గొప్ప కవిపుంగవు లుండెడివారు. ఆయననాఁడు మాళవదేశమని పేరు వాడుక యందుండెను. ధారా నగరము రాజధానిగ నుండెను. ఆనాఁటి చెఱువుకట్టలు నేఁటికిని గలవు. వాటికి Bhoja's Dam అని నేఁటికిని పేరు కలదు.

భాగవతపురాణము ౧-౧౦ యందు మధురాపురము భోజుల రాజధాని యని చెప్పఁబడినది. రుక్మినృపాలుఁడు భోజకటకమును నిర్మించుట శ్రీకృష్ణునిచే నోడింపఁబడిన పిదపనని అందరభిప్రాయ పడుచున్నారు. భోజకటకమున భోజేశ్వర మహాదేవుని శివలింగము కలదు. అది భోజవంశపు రాజులలో నొకరు ప్రతిష్ఠించినదిగ తెలియఁబడుచున్నది.

బ్రహ్మాండ పురాణమున నిది వింధ్యాద్రి దేశముగ జెప్పఁబడినది. మహాభారతము భీష్మపర్వ ౯ యందునను, విరాటపర్వ ౧ అధ్యాయమునను ఇది కుంతీ దేశమనియు వాడఁబడినది. హర్ష చరిత్రయందు రాజధాని వైరణ్యనగరమని పేర్కొనబడినది. భాసకవి తన అవిమారక నాటకమున దీనిని రంగముగ నొనర్చెను. భోజరాజీయమను గ్రంథమున భోజమహారాజు పూర్వజన్మ వృత్తాంతము వివరింపఁబడినది. అందు ఈదేశమునకు మాళవమనియు, రాజధాని ధారా నగరమనియు చెప్పఁబడినది.

**కుంతీదేవి** - తండ్రి దేవమీఢుఁడు, తల్లి మారిష. సోదరుఁడు వసుదేవుఁడు మొదలగువారు. శ్రీకృష్ణ బలరాములకీమె మేనత్త. ఈమెను పెంచిన దత్తత తండ్రి కుంతిభోజుఁడు. ఈమెకు పృథ యను నామాంతరము కలదు.

కుంతీదేవి బాల్యమున దూర్వాస మహర్షి కుపచారములొనర్చి మెప్పించి యాతని నుండి ఒక దివ్యమంత్ర ముపదేశ మందెను. దాని మహిమ దెలియగోరి యామె సూర్యుని వేడ నాతని ప్రసాదమున నీమెకు కర్ణుఁడు పుత్రుఁడై జనింప నాతని నొకతొట్టియందుంచి గంగయందు వదిలివేసెను, సూతకులజుఁ డొకనికి దొరికిన కతన నాతఁడు వాని పెంచెను.

ఈమె పాండురాజును బరిణయమై యాతనికి సంతానముగలుగ వీలుండమి యామంత్రమహిమ వలననే యమధర్మాంశమున యుధిష్ఠిరుని, వాయ్వంశమున భీమసేనుని, ఇంద్రాంశమున నర్జునుని, అశ్వినిదేవతల యంశమున నకుల సహదేవులను పాండురాజు తనయులుగఁ గనెను

**కుంతీదేశము** — కుంతీభోజ దేశము చూడుఁడు

**కుంతీపురము** (లేక గ్వాలియరు) — గ్వాలియరు సంస్థానపు రాజధానియగు గ్వాలియరునకు నొల్లిటిపేరు కుంతీపురము. (భోజపురము, కుంతీభోజపురము చూడుఁడు).

**కుంతీ భూపాలుఁడు** — యాదవసంతతి యందీపేరు పెక్కుంద్రకు గలదు. హేహయుని పౌత్రుఁడొకఁడు (ధర్మనేత్రుని పుత్రుఁడు) కుంతి. విదర్భుని పౌత్రుఁ డొకఁడు (పృథుని సుతుఁడు) కుంతియను పేరుగలవాఁడు శశిబిందు వంశస్థుఁడు. మఱియు నీతని సంతతియందే కరంభియనువానికి కుంతి యనియు, నామాంతరము కలదు. ఇంకను సాత్వతుని కుమారుఁ డొకఁడు మహాభోజుని వంశస్థుఁడు కుంతీభోజుఁ డను వాఁడు. ఈతని పెంపుడుపుత్రిక పాండవుల తల్లియగు కుంతీదేవి.

**కుంథనాథుఁడు** — జైనతీర్థకరులలో నొకఁడు. (తీర్థకరులు చూడుఁడు). వీరి చిహ్నము మేక. కురువంశక్షత్రియుఁడు. తండ్రిపేరు శూరసేనరాజు. తల్లి శ్రీకాంతాదేవి. జన్మస్థానము

హస్తినాపురము. పొడవు 3½ ధనస్సులు. వర్ణము సువర్ణచ్ఛాయ. ఆయువు తొంబదియైదు వేలు. గణధరసంఖ్య 3½. నిర్వాణస్థలము సుమేరుశిఖరము. అంతరాళము ఒక పల్లులో వేయి కోట్లు సంవత్సరములు లోటు.

**కుందగామ** — విశాలీపురము మగధ రాజ్యము చూడుఁడు.

**కుందచతుర్థి** - మాఘ శుద్ధ చతుర్థి. మల్లె మొగ్గలతో గౌరీదేవిం బూజించు వ్రతదినము. ఆడపిల్లలు తలలను మల్లెమొగ్గలతో జడలు వైచుకొనెదరు. ఇంకను దీనినే తిలచతుర్థి యనియు, వరదచతుర్థి యనియునందురు. (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు).

**కుందుర్తి వెంకటాచల కవి** — ఆంధ్రకవులలో నాధునికుడిగ పరిగణింపఁబడిన వాఁడు. ఆర్వేలనియోగిబ్రాహ్మణుఁడు ఆపస్తంబ సూత్రము, శాండిల్యసగోత్రము, తండ్రి రామ రాజు, తాత గోవిందరాజు

ఈతని తాత విజయనగరపు వీరవెంకటపతి రాయ యాస్థానవిద్వాంసుడు. ఈ కుందుర్తి వెంకటాచలకవిదక్షిణమధురకుం జేరి, అచటి ప్రభు వగు విజయరంగచొక్కభూపతి యాస్థానమునం బ్రవేశించి, మిత్రవిందాపరిణయము రచించె నని తెలియుచున్నది. ఇంకను ఇతఁడు భారత, భాగవత, రామాయణకథలు మూడును వచనకావ్యములుగ రచించెనటగాని యవి గానరాకున్నవి. ఈతఁ జీవితో నాటకములు రచించెనందురు. అవియుం గానరాకున్నవి.

**కుందేలు (చెవులపిల్లి)** — మనదేశపు కుందేలునకు చెవులపిల్లి యని వాడుకనామము



కలదుగాని ఇది పిల్లిజాతికిం జెందినదికాదు. సాధారణముగ బయళ్లయందుఁ గాన్పించు జాతి అడవికుందేలుజాతి. ఇది అధమపు జాతిగ నెంచబడుచున్నది. ఇంకు త్తమజాతిని సీమకుందేలు అనెదరు. ఇవి మాదగమనపు జంతువులుగ మనదేశమున నెన్నబడుంగాని పాశ్చాత్య దేశములందు మంచి పరుగిడు జంతువులుగను, బాగుగ నీదగలవి గను,



చెప్పఁబడుచున్నవి. అతాత్తుగ మరలి దాగుకొను శక్తి వీటి కెక్కువగ గలదు. గడ్డిగాదలం దిని జీవించునుగాని అధికమైన పంటలను నాశనమొనర్చును. త్వరితకాలములో నివి యసంఖ్యాకములుగ వృద్ధినందునట. ఆస్ట్రేలియాయం దివి యసంఖ్యాకములై పైరుల నాశన మొనర్చునని వీటిం బరిమార్చుచుందురట ఇంగ్లాండు దేశమున నొక శ్రేష్ఠజాతి కుందేళ్లు కలవట. వాటి బొచ్చు ఎక్కువ విలువగలదని తెలియుచున్నది. బెల్జియం దేశపు కుందేళ్లు చించిల్లా జాతికుందేళ్లు, సిల్వరుగ్రేజాతికుందేళ్లు, పెంపుడు జాతు లని చెప్పఁబడినవి. ఇంక కొన్ని జాతుల కుందేళ్లు ఆంగ్లదేశమునను కలవట

**కుంపటిలో తామర మొలచునా ?**

ఆంధ్రలోకోక్తి.

**కుంభకము** (ప్రాణాయామము) — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన అష్టాంగయోగములలో ప్రధానమగునది ప్రాణాయామము. ఆ ప్రాణాయామము పూరక, కుంభక, రేచకాత్మకము. (ప్రాణాయామము చూడుఁడు).

కుంభకమనగా- పూరక క్రియనొనర్చి లోని కీల్చిన వాయువును లోననిరోధించుట- పీల్చుట ముగించినతోడనే ముక్కురంధ్రములను బిగించి 'యం' అను బీజము నరువదినాల్గుసారు లుచ్చరించునంత కాలము వఱకు లోపలి వాయువును వెలుపలకు రానీయక నిరోధించుట కుంభకమని చెప్పఁబడినది (ప్రాణాయామము చూడుఁడు).

ప్రథమ ప్రాణాయామమనియు, ద్వితీయ ప్రాణాయామమనియు, తృతీయ ప్రాణాయామమనియు ప్రాణాయామాభ్యాసము త్రివిధములుగ జెప్పఁబడినది. అందు ప్రథమ, ద్వితీయ, తృతీయ ప్రాణాయామములందు పీల్చిన వాయువును బయటికి రానీయక లోపలనే నిరోధించి కుంభించుటఁ జెప్పఁబడినది.

కుంభక యోగ మష్టవిధములని యోగ శాస్త్రమునఁ జెప్పఁబడినది. ౧. సహితము. ౨. సూర్యభేద కుంభకము. 3 ఉజ్జయి కుంభకము. ౪. శీతలము. ౫. భస్త్రికకుంభకము. ౬. భ్రామరీకుంభకము. ౭. మూర్ఛా కుంభకము ౮. కేవల కుంభకము. వీటింగూర్చి వేఱ్వేఱు తావులందు గానవగును. (అజప చూడుఁడు).

**కుంభకయోగము** (అభయోగము)— అభ్యాస యోగములు చూడుఁడు.

**కుంభకర్ణుఁడు**- అసురుఁడు, తండ్రి విశ్రవస్సు, తల్లి కైకసి, రావణుని తమ్ముఁడు గొప్ప తపమాచరించి బ్రహ్మాదమ న నిద్రవరము వేడి సదా నిద్రించుచుండు వాఁడు. సోదరుఁడు విభీషణుఁడు, కుమారుఁడు నికుంభుఁడు, కుంభుఁడు. శ్రీరామునిచే లంకాయుద్ధమున నిహతుఁడైన వాడు. భార్య బలిచక్రవర్తి మనుమరాలగు వజ్రజ్వాల.

**కుంభకోణము** - కుంభకోణమనిన నీటి జారీ కొమ్ముముఖమని యర్థమట. దక్షిణ దేశమున తంజావూరు మండలములోని పట్టణము. చెన్నపట్టణమునకు నైరుతి దిశగా నూటనలుబది మైళ్ల దూరము. ఒక తరి చోళరాజ్యమునకు రాజధానిగా నుండెనందురు.

ఇటనున్న ఆంగ్ల కళాశాల (కాలేజి) దక్షిణ దేశమున సుప్రసిద్ధము. ఇందు గణితశాస్త్ర విశారదత్వము అధికమని పేరందినది. కుంభకోణమును ఆంగ్లులు Oxford of Southern India అనియెదరు. కుంభకోణము వేదశాస్త్రముల విజ్ఞానమునకు పండితుల సంఖ్యకు పేరందిన విద్యాస్థానము గడుసుతనమునకు, దూరాలోచనలకు, ఆరింద్యా తనమునకు పేరందిన ఊరు. ఎవ్వరేని గుసగుసలాడుచుండిన దానిని వెక్కిరింతగా కుంభకోణం చేయుచున్నారని యనుట దక్షిణదేశమున సాధారణమె.

కావేరీనదీతీరమునగల ఈపట్టణమునసుప్రసిద్ధ చిత్రపు పనులుచే పేరందిన దేవస్థానము లిరువదినాల్గు కలవు. అంను రామస్వామి దేవాలయము, శార్ఙ్గపాణి దేవాలయము, కుంభేశ్వర దేవస్థానము ముఖ్యములు. అందునను రామస్వామి దేవాలయము నందలి చిత్రపు పనులు ఎక్కువ పేరందినవి. కుంభేశ్వరుని దేవస్థానమున లోనికేగు మార్గము 330 అడుగుల పొడవుగల్గి లోన బజారుంగల్గి రమ్యమై యుండును. ఈ దేవస్థానమునకుం జెందిన రథములనేకము లీయూరందలముగఁ గాననగుచుండును. ఈపట్టణమున ధర్మశాలలు, అన్నసత్రములు పెక్కులుగలవు.

స్మార్తవుల జగద్దేశికుండగు శంకరభగవత్పాదులచే స్థాపింపఁబడిన షణ్మఠములలో నొకటి కుంభకోణపట్టణమున కలదు. ఆమఠాధిపతియగు యతి ఈప్రాంత వాసులగు స్మార్తవులకు గురుండగునందురు. మఠమున సదా నిరతాన్న ప్రదానము జరుగుచుండు ననియు, మఠమునకు గొప్ప భూస్థితి నుండి గొప్ప రాబడి కలదనియు వినుము.

కుంభకోణము ఇత్తడిపనులకు పేరందినతావు. కొన్ని వీధులందు కేవలము ఇత్తడిపనులు చేయువారే నివసించుచుండుట నావీధులందు జనుటయన ధ్వని మధ్యమునఁ జనుటయే యగును. కుంభకోణము చుట్టుపట్లప్రదేశము కడుదూరము వఱకు వరిపొలములు, అరఁటితోటలు, కొబ్బరి

తోటలు, పోకతోటలు సర్వత్రా వ్యాపించి యుంట, మెట్టపంటల ప్రదేశము నెట్టికో గానరాకుండుట కావేరీ జలము లవారిగఁ బ్రవహించుచుంట, దేశమంతటను సస్యసమృద్ధియు, ధనసమృద్ధియుఁ గన్పట్టుచుండుట యిచ్చటి విశేషములు. కాఫీ త్రాగుటయం దధిక ప్రీతి. కాన కాఫీహోటల్లిట నపరిమితము. కుంభకోణమున కాఫీ రుచికర మని చక్కఁగఁ జేయనేర్తురని యరవల యందొక వాడుక గలదు.

కుంభకోణ పురమున పేర వెనవాటిలో పేరొందినది మహామఖ మనంబడు సరస్సు ఇది పట్టణమునందే కలదు. ఇది ఇరువది యెకరముల చెరువు. చుట్టు వింత వింత వాకిరలుగల సోపానములు, రమ్యములగు చిన్న దేవళములచే జుట్టఁబడి చూడ ముచ్చటగ నుండియు, జలము లపరిశుభ్రతలేక యుండును ఇందేటేట మాఘ మాసమున స్నానయాత్ర జరుగును పన్నెండేండ్ల సంవత్సరముల కొకతూరి బృహస్పతి, సింహరాశి గతుండగు నదయం పౌర్ణమిని ఇట గొప్ప స్నానయాత్ర జరుగును. అద్దాని కనేకలక్షల జను లేతెంతురు. మధ్యాహ్నమున ఇత జనమాసరసునందు దిగువారకుండున్న నీరుపైకిలేచును. అద్దానిని గంగానదీ జలములతో జేరునని యందురు ఈసాగరమునేగాక ఆద్వాదశవర్ష సంభవితమగు యాత్రకుగూడ మహామఘమనియె బేరు వాడుచూరురు. మహామఖము (సరస్సు) జుట్టి సోపానముల నంటిన సుందర దేవళములు పదునారు కలవు

నగటున కుంభకోణవాసులు చాల గడసరులనియు వారితో వ్యవహారముల మిగుల జాగ్రతగొని జరుపుట సమంజస మనియు లోకమున ప్రతీతికలదు. ఇది యెంతవఱకు నిజమో తెలియరాదు.

**కుంభమము** (శూర్పము) — ఆయుర్వేద మానము చూడుఁడు.

**కుంభరాశి** (అధిపతి శని) — ఇయ్యది ధనిష్టానక్షత్రమందలి 3-౪ పాదములును శతభిష నక్షత్ర మంతయును, పూర్వాభాద్రా నక్షత్రము నందలి ౧-౨-3 పాదములును కలిసియైన ౯ పాదములరాశి. ప్రమాణము ఘడియలు ౪-3౦ లేక ఒకగంట నలుబదియెన్మిది నిమిషముల కాలము. కుంభము- క్రూరరాశి, స్థిరస్వభావ రాశి, శూద్ర వర్ణ రాశి, పురుషస్వభావ రాశి, బభ్రువర్ణము, పాదజల రాశి, పశ్చిమదిగ్రాశి, శీర్షోదయ రాశి. పగలు బలమధికము పిక్కలందు బలమని చెప్పఁబడినది. కుంభరాశి శనికి స్వక్షేత్రమును, మూల స్థానమును ఐయున్నది. ఉచ్చనీచ లెవ్వరికింగాను. మిత్రక్షేత్రము శుక్రునకు, శత్రుక్షేత్రము రవికి, సమక్షేత్రము చంద్ర, కుజ, బుధ, గురులకు కుంభ లగ్నమునకు రవి సప్తమస్థానాధి పతి. చంద్రుఁడు షష్ఠాధి పతి కుజుఁడు తృతీయ దశమ స్థానము లకును, బుధుఁడు పంచమ అష్టమ స్థానము లకును, గురుఁడు ద్వితీయ ఏకాదశ స్థానము లకును, శుక్రుఁడు చతుర్థ నవమ స్థానములకును, శని లగ్న ద్వాదశ స్థానములకును అధిపతులుగ నుందువారు.

**కుంభసంభవులు** (కలశభవులు) — అగస్త్య, వశిష్ఠ మహర్షులు, ద్రోణాచార్యులు, కుంభసంభవు లనంబడుదురు. (కలశభవులు చూడుఁడు).

**కుంభస్థాపము** — ద్రోణస్థాపము చూడుఁడు.

**కుంభిల** — ఇంద్రజిత్తు యాగమొనర్చిన తావు. (లంకారాజ్యము చూడుఁడు). విజయనగర పట్టణ పరిసరమునఁగల కుంభిల యను గ్రామము

నకు కుంభిల యనుట గలదు. కాని కృతకముగ గాన్పట్టెడిని.

**కుంభిలాపురము**- దీని నిప్పుడు కుమిలి యనుచున్నారు విశాఖపట్టణ మండలమున విజయనగరము నుండి ఆరుమైళ్ళ దూరమున నున్న గ్రామము. ఇట పూర్వము స్థలదుర్గము (సైన్యముల కాపు) ను తొల్లింట కళింగ నృపులు గట్టియుండిరి. (కుంభిల చూడుడు).

**కుంభీధాన్య న్యాయము** — కుంభీ ధాన్యుఁ డన శ్రోత్రియుఁ డని రూఢ్యర్థము. దానిని మాని, కడవయందు ధాన్యముపోసికొను వాఁడని యర్థము చెప్పి యపార్థము కల్పించ తగ దని భావము.

**కుకుభపర్వతము** — ఉత్కలదేశము లోనిది. దీని ప్రశంస దేవీభాగవతము ౮-౧౧ యందుఁగాననగును

**కుకురుఁడు** — అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి అంధకుఁడు. కుమారుఁడు వృష్ణి. సోదరులు భజమానుఁడు, కంబలబర్హిషుఁడు, శుచి.

**కుకురుదేశము, దశారదేశము**— రాజపుత్రస్థానములోని యొకభాగముగ పోల్చఁబడినది. రాజధాని బాల్మెర్.

బృహత్సంహిత ౧౪ వ యందును, పద్మ పురాణము సర్గ 3 యందును దీని ప్రశంసలు కలవు. Dr. Bhandarkar's Early History of Deccan P. 14 యందును, Bombay Gazette Vol. I Part 1. P. 36 యందునను తూర్పు రాజపుత్రస్థానమున చెప్పఁబడిన దేశము. కుకురులు యాదవులనియు, వా రొక తెగవారనియు తెలియుచున్నది.

**కుక్క** — కుక్క సర్వసాధారణముగ ఊరకేయుండు జంతువుగఁ దలంచఁబడుచున్నది. గ్రామసింహమని కుక్కకు వెక్కిరింతపేరు కలదు.



ఏలనన కుక్కను చాల నీచపు జంతువుగ బరిగణించుచున్నారు కొన్ని కుక్కలు సర్వాసహ్యకరమగు వస్తువులం దినుటయు, దుర్గంధపూరితములగు ఎముకలం గొరుకుటయు దీనికిం గారణములై యుండవోపు. తురుష్కదేశపు ఇస్తాంబూల్నగరమున వీధులం బారవైచిన సమస్తహేయపదార్థములం దినుచు, తమ కలహధ్వనులచే వీధులం బ్రతిధ్వనింపఁజేయుచుండు కతమునను, మహమ్మదీయుల మతగ్రంథమగు ఖురానునం దిది నీచపుజంతువుగ జెప్పఁబడియుండు కతమునను, మహమ్మదీయమతస్థులు కుక్కం గౌరవింపరు. కాని కుక్కలందు మంచిజాతివియుం గొన్ని కలవు. అవి కొన్ని సుగుణములును, కొన్ని ఉపయోగకరమగు గుణములనుకూడ గల్గి, విశ్వాసము లక్షణముగ గల్గియున్నవి. కొన్ని వేట కుపయోగించెడివి. కొన్ని కావలిగాను నుపయోగించును.

కుక్కలు తొల్లింటికాలపు తోడేళ్ల నుండియు, పెద్దనక్కలనుండియు జనించినవే యని పాశ్చాత్య పరిశీలకులు నుడువుచున్నారు. కొన్నిజాతుల కుక్కలు తోడేళ్ల పోలికలను, కొన్ని జాతుల కుక్కలు తోడేళ్ల యొక్కయు, పెద్దనక్కల యొక్కయు గుణములం గల్గియుంటయు, ఇక్కాలమునం దున్న యన్నిజాతులశునకములు వాటి సంతతియే యని వారు వాదించుచున్నారు. ఏది ఎట్లైనను ఇక్కాలమున రెండువందల వఱకు కుక్కలజాతులు గలవని లెక్కింపఁబడినది. మన దేశమున సర్వసాధారణముగ వీధులందు ఆకుల లోని యుచ్చిష్టభక్షణ మొనర్చు యూరకుక్కలందు యధమపుజాతిగాక పరిగణింపఁబడదగిన కుక్కలజాతు లారు తెగలుగ విభజింపఁదగియుం

డును. పాశ్చాత్యపరిశీలకు లట్లే విభజించిరి. ఇవిగాక ఇంకను కొన్ని మేలుజాతులుకూడ నచ్చు టచ్చుట గానవగుచున్నవి

ఈ తెగలు- ౧ తోడేళ్ళబోలిన జాతి, ౨. గ్రేహౌండుజాతి (Grey Hound), 3 స్పానియ ల్జాతి (Spaniel), ౪. హౌండుజాతి (Hounds), ౫. మేస్టిఫ్‌జాతి (Mastiff), ౬. టెర్రియరు జాతి (Terriers) అనునవి.

౧. Wolf-like Dogs- జాతి ఇందు ముఖ్యమగునవి ౧౨ భేదజాతులు కలవు.

౧. Alaska Wolf Dog- ఇది చాల పెద్దదిగ నుండు కుక్క. బలమైనది.

౨. Eskimo Dog- లాప్లాండు దేశస్థుల స్లెడ్జి బండ్లను లాగుచుండునవి. తోడేలు లక్షణ ములు కలవి.

3. Norwaygian Sledge Dog- దీనిని నార్వే దేశమున ఎస్కిమో సీమలందలి మంచు ప్రదేశములందు స్లెడ్జిబాడ్లను లాగుట కుపయో గించుచున్నది. తోడేలు పోలికగల కుక్కలు.

౪. Siberian Sledge Dog- ఇది సైబీ రియాదేశమున స్లెడ్జిబాడ్లను లాగుట కుపయో గించుచున్నారు. తోడేలు పోలిక.

౫. Pomeranians-ఈజాతి Big Pomeranians అనియు, Top Pomeranians అనియు రెండుగ నున్నవి. ఇందు పెద్దజాతిని తొల్లింటికాలమున జర్మను దేశమున తోడేలువేట కుపయోగించుచుండిరట. చిన్నజాతియు, పెద్ద జాతియు తోడేలు పోలికం గల్గియుండును.

౬. Poms- ఇవి చిన్న కుక్కలు. ఇండ్ల కావలిగామనవి.

౭. Sehipperkes-ఇది తోడేలుపోల్కితో అందమైన కుక్కజాతి కడు నుల్లాసముగ నుండునది.

౮. Chow-Chow- ఇది చీనా దేశము నందున్న కుక్కజాతి. వీటికి త్వరితముగ కోపము వచ్చును. చాల జాగ్రతయు, తెలివియుంగలదు.

౯. Wolf Dog of Florida- తోడేలు పోల్కిగల కుక్క.

౧౦ Alsatian Wolf Dog-దీని Wolf Honed అనియు నందురు. తోడేలు పోలికలు గల కుక్క

౧౧. Coyotes Dog- అమెరికా దేశముల అందు ముఖ్యముగ Prairies యందు కావలి గాయు కుక్క.

౧౨. Tiney Pet of Boundoir- ఇది చిన్నజాతికుక్క. ఇండ్ల కావలిగామనది.

౨. గ్రేహౌండు (Grey Hound) జాతి- ఇందు భేదజాతులులేవు. ఇది వేటకు బనికివచ్చు కుక్కజాతి. అతిత్వరితముగ బర్వెత్తుటయందు పేర్వడసిన కుక్కజాతి. దాని కేజంతువునైనను చూపిన పరుగిడి దానింబట్టుటయందు పేరందినది. ఒకవేళ వేటజంతువును తానే చూచినను తోడనే యుఱికిపర్వడి దానిందఱుముకొనిపోయి పట్టుట యీజాతికుక్క లక్షణమని చెప్పబడినది. ఇది తప్ప ఇతర తెలివితేట లీకుక్కకు లేవు అఘ్రాణ స్థానపు గ్రేహౌండు కుక్కలకును ఇవియే లక్షణ ములు. కాని శరీరమున పొడవగు వెండ్రుకలం గల్గియుండెడిని. దానిని Afgan Grey Hound అనియెదరు.

3. స్పానియెల్ (Spaniel) జాతికుక్కలు- ఈజాతికుక్కలందు పది భేదజాతులు కలవు. వీనికి సర్వసామాన్యముగా తన యజమానితో వేటకువెళ్లుట, పిశాళ్లు దిరుగుట, అతడు తుపాకితో కొట్టి నేలంబడ జేసిన పక్షులు మొదలగు వానింబట్టితెచ్చి అతనియెదుట నుంచుట, ఉత్తర ము, చీట్లు, చేతికఱ్ఱ మొదలగు వస్తువులు తెచ్చి

యందిచ్చుట, లాంతరు నోటంగఱచుకొని రాత్రి దారిచూపుట, నీటంబడి ఈదుకొనుచుంబోయి తేలుచుండు వస్తువులం దెచ్చియిచ్చుట మొదలగు తెలివితేటలు గలవు. నగటున స్పానియల్జాతి కుక్కలు తెలివిగలవి. బుద్ధిగలజాతి. అవిచేయు పనులను మిగుల ఉత్సాహముతో చేయుంగాని విధిలేక చేయునట్లు చేయునదికాదు.

౧. Clumber Spaniel.

౨. Sussex Spaniel.

3 Norfolk Spaniel

౪. Cocker Spaniel- ఇది చాల చిన్న జాతి.

౫. King Charles Spaniel- దీనిని Prince Charles Spaniel అనియు ననుట కలదు.

౬. Blenheim Spaniel.

౭. Setter Spaniel.

౮. Retriever Spaniel.

౯. Newfoundland Dog- ఇదియు స్పానియల్జాతికిం జేరినదియే. ఇది చాల సుప్రసిద్ధమగు కుక్క. చాల రౌూగ్యమగుజాతిగ చెప్ప బడిన జాతి. నీటియందు పడినవారిని రక్షించు గుణము గల జాతి. దీనికి సాటియగుజాతి మఱియొకటి లేదందురు. న్యూఫౌండ్లాండుదేశపు జాతి.

౧౦. Irish Water Spaniel- ఇది నీటియందు చాల బాగుగ నీదుచు నెక్కువ పనిచేయ గలదు. ఐర్లాండుదేశపు కుక్క.

౪. వేటాడు (Hound) జాతి కుక్కలు- ఇవి సుప్రసిద్ధమగు వేటకుక్కలు. వీనియందు ౧3 భేదజాతులు కలవని తెలుచున్నది.

౧. Rodesian Lion Hound- ఆఫ్రికా ఖండమునందలి రోడీషియా దేశపుకుక్క- చాల బలసాహసములుగల పెద్దజాతికుక్క. ఎక్కువ ధైర్యముతో సింహముల నెదిరించి వేటాడునది. ఇతర తెలివితేటలు చాల తక్కువగా నుండును.

౨. Russian Barzoi- గుండెలు కడ ఎక్కువ వలయుండు వేటకుక్క. చేతులు (ముందు కాళ్లు) తీగుతావున ముప్పదియంగుళములుండియు నడుము సన్నముగ నుండును. మంచి బలముగు తోడేలో నక్కయో యనిపించును. వేటకుక్క ఈజిప్పుదేశమున తొల్లి ఫరోలనాటి కట్టడములపై వీనిబొమ్మలు కలవు

3. Blood Hound- తొల్లింటి కాలమున మనుష్యులను వేటాడి చీల్చివేయుచుండెడి జాతి వేటకుక్కగా నుండెను. ఇప్పుడు మనుష్యులం జాపు గుణముపోయినది. సూదియైన ముక్కుగల వేటకుక్క.

౪ Boar Hound- అడవిపందులను వేటాడు వేటకుక్క

౫. Fox Hound- వాసనంబట్టి నక్కలను వేటాడునవి. ఇంకకొన్ని తెలివిగల కుక్కలు వేటజంతువుల అడుగులజాడలంబట్టి చని నక్కలు మొదలగువాటిం బట్టుకొనును.

౬. Harriers-చెవులపిల్లులను, సీమకుందేళ్లను వేటాడుజాతి. వాసనచే పసిబట్టుచు నేగును.

౭. Beagles- ఇదియు Harriers లక్షణములనే కల్గియున్నది.

౮. Otter Hound-సూదియగు మూతియు శరీరమున దట్టమగుబొచ్చునుగలజాతి వేటకుక్క.

౯. Dachs Hound - పెద్దజాతి నీటియందు వేటాడు కుక్క. ఇందు పెద్దజాతి, చిన్నజాతి యని రెండు భేదజాతులు కలవు. ఇవి జర్మనుదేశపు కుక్కలు. వాసనంజూచి పసిబట్టుశక్తి ఈ జాతి కుక్కల కధికము.

౧౦. Pointer- ఇది ఇంగ్లాండుదేశపు జాతి కుక్క. ముక్కు సూదిగనుండును. వాసనలవలన పసిబట్టగలశక్తి దీనికధికము.

౧౧. Dalmatin- పెద్దజాతి. శరీరమున చర్మము చాల వదులుగ నుండుటంగాన వ్రేలాడు చుండుచుండును. మేన ఎఱ్ఱమచ్చలుగల్గి మొత్తమున శరీరము భారమైయుండునట్లుగానుండు వేటకుక్క.

౧౨ Dalmatian Plum Pudding — ఈజాతికుక్క లిప్పుడు గానరాకున్నవి. జాతి యంతయు మొండినదని తలంపబడుచున్నది.

౧౩. Basaet Hound.

౫ Mastiff జాతికుక్కలు- ఇందు పది నొకండు భేదజాతులు కలవు.

౧. Mastiff Proper- చాల పెద్దజాతి కుక్క. శౌర్యకలది.

౨. Great Dane - చాల పెద్దజాతికుక్క. ఎక్కువచురుకుగలది

౩. German Boar Hound - చాల పెద్దజాతికుక్క. వేటకుగూడ పనికివచ్చునది ఇది వరాంకుజాతి కాదనుచున్నారు.

౪. English bred Mastift- గ్రహించు శక్తి అధికముగల కుక్క.

౫. Cuban bred Mastifi.

౬. Wolf Fighting Tibetan Dog-ఇది చాల గొప్పబుద్ధి యోచనలు, బలముగల జాతి కుక్క. టిబెట్టుదేశమున గ్రామకావలిగా ని కుక్కలం బెంచెదరు. దుష్టజంతువులం దరిజేర నీయక గ్రామములం గాచుజాతి.

౭. Pug dog- ఇది చిన్నజాతికుక్క. చాల పుష్టిగా బలియును. చపలచిత్తముగల కుక్క. తెక్కలించుటగుణమును గలది

౮. Collie- అందమైనకుక్క. కష్టపడుట కష్టము గలది. విశ్వాసవర్ధకము.

౯ Australian Dingo-ఇది ఆస్ట్రేలియా ఖండమున గొఱ్ఱెలమందలఁ గావలిగాయుట కుప యోగింపబడుచున్న జాతికుక్క. అచట పురాతనపు జాతియని తలంపబడుచున్నజాతి. వేటచేయ గలదు. భయపడక ఆపదయందునిలచు ధైర్యము గలజాతి. చాల విలువగల కుక్కలీజాతియందు కలవు. ఇట్లయ్యు చాల నపాయకరమగు జాతిగ దలంపబడుచున్న జాతియైయున్నది

౧౦. St. Barnard- చాల తెలివి తేటలు గల గొప్పజాతికుక్క. ఆపదంజెందినవారిని రక్షించు తెలివిలక్షణములు గలది. ఆల్ప్సు పర్వతములపై శాలినడకమార్గముల మంచుచేఁ గప్పఁబడిన మనుష్యుల నొందరినో కాళ్ళతో మంచునువిప్పివైచి బయలుదేరదీసిన ప్రఖ్యాతిగలజాతి. దీనిని Giant Mastiff అనియు నందురు.

౧౧. Bull Dog- ఇది నశించుచున్నజాతి. తొల్లిటికాలమున ఎద్దులు మొదలగు జంతువులను వేటాడుచూడనీవేరుగల్గెనట. మిగులనురహంకారమును మక్కోపముగలజాతి. తెల్వితేటలు తక్కువ. అపాయకరమగుజాతి. కావలిగాయుటకు యోగించును.

౬ టెర్రియర్ (Terrier) జాతి కుక్కలు. ఇవి ౧౦ జాతుల అంతర్భేద జాతులుగలవి.

౧. Fox Terrier జాతి- ఇది ఇంగ్లాండు దేశపుజాతి, ఇంగ్లాండుదేశము జాతియని రెండుభేద జాతులం గల్గియున్నది. అందొకొక్కటి Rough haired జాతియనియు Smooth haired జాతి యనియు తిరుగ రెండేసి భేదజాతులయి మొత్తమున నాల్గుభేదజాతులుగ నున్నది. ఇందు Irish rough haired జాతిని wire haired dog అనుటయుఁగలదు Scotch smooth haired జాతిని High land Terrier అనియునందురు.

౨. Skye terrier-ఇందు మెత్తనిబొచ్చును గరుకుగల బొచ్చునుగల రెండుజాతులు కలవు. మెత్తనిబొచ్చుగల జాతికుక్కల చెవులు వ్రేలాడు చుండును. గరుకుబొచ్చుగల జాతికుక్కల చెవులు పైకిలేచి సూదిగొనదేరియుండును.

౩. **Yorkshire Terrier**- శరీరమంతటను దీనికి నాల్గు లేక ఐదంగుళముల పొడవుగల వెంట్రుకలు దట్టముగ నుండును.

౪. **Griffons**- ఇందు నల్లనిరంగుగల జాతియు Tan రంగుగల జాతియు, రెండుజాతులు కలవు.

౫. **Kerry Blue Terrier.**

౬. **Airedale**- బలమైనజాతి.

౭. **Maltese.**

౮. **Mexican lap dog.**

౯. **Poodle Terrier**- ఇది ఫ్రెంచిదేశపు కుక్క. తెలివితేటలుగలజాతి

౧౦. **Toy Terrier**- అనేక భేదజాతులిందుగలవు. అన్నియును చిన్నజాతికుక్కలే.

ఇంకనూ **Duch Tail less dog** అనియు, **Sheep dog** అనియు, **Dachshund** జాతికుక్కలనియు, **Dandie dinmount** అనియు నెన్నియో జాతికుక్కలన్నియు వేర్వేరుదేశములందున్నవి **Dandie dinmount** జాతి కుక్కల చర్మము వసులుగ వ్రేలాడుచున్నటులుండును. పొట్టి జాతి- **Pikingese** అనంబడు కుక్క చీనాదేశమున **Pekin** నగరమందును అప్రాంతములందును కలదు. ఇది స్పానియల్జాతియని కొందఱిరి కాని, స్పానియల్జాతి లక్షణములెవ్వియు దానియందు గానరావు.

మఱియు **Scottish deer hound** అనంబడు ముతక వెంట్రుకలుగల మోటకుక్కజాతి యొకటియు, **Italian Whippet** అనంబడు రోముదేశపు (ఇటలీ) కుక్కజాతియు, **Slughi** అనంబడు పారసీకదేశపు కుక్కయు, గ్రేహౌండు తెగకుంజెందినవిగ పోల్చుచున్నారు. కాని స్పష్టమనుట కింకను పరిశీలకులకు ధైర్యముచాలకున్నది. భరతదేశమునను కొన్ని జాతుల కుక్కలున్నవి. కాని సరియైనపేర్లు తెలియరావు.

**కుక్క కాటుకు చెప్పుదెబ్బ** — ఆంధ్రలోకోక్తి.

**కుక్కగులాబిచెట్టు** — దీనిపేరిటుల నుండుటకు కారణము ఆంగ్లమున దీనికి **Dog Rose** అని ఉండుటయని తోచెడిని. దీనికి తెలుగింటిపేరు తెలియరాకున్నది ఇది కుక్కలతోగాని గులాబీతోగాని ఏసంబాధము కలదికాదు. దీని వేరురసము, చెక్క రసము, లేక సమూలకషాయము వెఱ్ఱికుక్కకాటు విషము (**Hydrophobia**) నివారించు నందురు.

**కుక్కగొడుగు** — పుట్టగొడుగులు చూడుడు.

**కుక్కచిలుకకూరచెట్టు** — దీనిం గూర్చి అంతగా తెలియదు. ఇది కారముగ వెగటుగ నుండుననియు, వ్రణములు, కురుపులు నివారించుననియు నందురు

**కుక్కతోకపట్టుకొని గోదావరి ఈదంజనినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**కుక్కతోకవంకరుదరదు** — ఆంధ్రలోకోక్తి.

**కుక్కతోకాడించుట** - కుక్కకు సంతోషమెూ లేక కృతజ్ఞతయో గల్గినతరి తోకాడించును. ఇందుకుం గారణము దాని యుద్రేకములను అది మనస్సునందు దాచుకొనలేకుండుటయే. అట్లే కుక్కకు దురద గల్గినతరి వెనుకకాలి గోరుతో గోకుకొనుట పరిపాటు. మనము కుక్కశరీరమందెచ్చటనైనను గోకినచో అది దాని వెనుకకాలితో గోకుకొను చున్నట్లు అభినయించుకొను చుండును.

**కుక్క దొరికితే బెడ్డ దొరకదు, బెడ్డ దొరిక్కితే కుక్క కుదరదు, రెండు దొరక్కితే దివాణం వారి కుక్కవుతుంది** - (ఇక కొట్టడపుమనస్సు తీర లేదని భావము). ఆంధ్రలోకోక్తి

**కుక్కను అందలంలో కూర్చుండ బెట్టితే కుచ్చులు తెగగొరిక్కినదట** – ఆంధ్రలోకోక్తి.

**కుక్కను పెంచితే గంపెడు కూటి కుండలకు చేటైనట్లు**- ఆంధ్రలోకోక్తి.

**కుక్కను సింహాసన మెక్కిస్తే చెప్పులంజూచి క్రిందికి ఉరికినట్లు**- ఆంధ్రలోకోక్తి

**కుక్క నోట్లో కర్రపెడితే లొళ్లు మంటుంది** ఆంధ్రలోకోక్తి

**కుక్క నోటిలోవన్నీ గొగ్గి పళ్లె** (నోటిపండ్లు) ఫలములు కావు. ఆంధ్రలోకోక్తి.

**కుక్క పిల్లుల జాతివైరము** — ఈవైరము తెలుచుగ నేటికిని నొకపిల్లిం జూచె నేని కుక్క వెంటదరుముటవలన నెఱుంగు చున్నాము. ఈవైరమునకు కారణ మక్కర లేదు. తొల్లింట నవి కలహించియు నుండ వక్కరయును లేదు. ఇది పిల్లుల పూర్వులకు కుక్కల పూర్వులకు తొల్లింటికాలములనే ఘోరవైరము లుండి యుండవలయు ననియు, ఆవిరోధభావము రెండుజాతులందు నైసర్గికముగ బరిణమించి స్వభావముగనయ్యెనని యుఁ గొందఱు తలంతురు. ఇంకగొందఱు కుక్కకు వేటస్వభావము లక్షణమనియు, అల్లే తనకుం బలహీనముగ గన్పడు పిల్లిపై నుంకించి దరుముకొనిపోవుచుండు టకుజాలిన కారణమనియు తలంతురు. కాని, రెంటిని కల్పి యొకే గృహమున పెంచితిమేని కుక్కలు పిల్లులు మైత్రిం గలసి మెలసిమెలంగుట జూడగలము.

**కుక్కపొగాకు చెట్టు** — దీని తొల్లింటిపేరు తెలియదు. ఆంగ్లమున Wild tobacco అని కొంద అనెదరుగాని ఆపేరు సరి కాదని తోచెడిని.

దీనిరసము లేక సమూలకషాయము- కఫము, చలిజ్వరములు వీటిపై చక్కగ పనిజేసి యాపు ననియు, ఇంచుక కాకయు, విరేచనబద్ధము కల్గించు ననియు నందురు. మఱియు ఈ చెట్టును నూరి కట్టిన వ్రణములలోని క్రిములు మృతినంది శుభ్రపడునందురు.

**కుక్క వేషంవేస్తే మొఱగక తీరదు** — ఆంధ్రలోకోక్తి.

**కుక్షి పరిమాణము** — ఆయుర్వేద మానము చూడుఁడు.

**కుక్కుటధ్వానన్యాయము** — కోడి కూత రాను రాను అధికమగుచు హ్రస్వము



దీర్ఘమై, దీర్ఘము ప్లుతమై పరిణమించెడిని. ఇట్లే పరాహ్ణచ్ఛాయా న్యాయము (మధ్యాహ్నమునకుం బిదపగాలము పరాహ్ణ మనిపేరు). అపరాహ్ణమందలి నీడ క్రమముగ పెద్దది యగు నని భావము.

**కుక్కుటపాదగిరి**-బీహారములోగయకు తూర్పుగా ౧౬ మైళ్ల దూరమునఁ గల వజీగంజి యనంబడు పురమునకు ఈశాన్యముగా మూడు మైళ్ల దూరమున గల కుర్కీహార్ అనంబడు గ్రామముకడ నున్నది. దీనికి కోడికాలుపాదము వలె మూడు శిఖరములుంట నీపే రయ్యెనట. కుర్కీహార్ న కొక మైలుదూరమునందు గల నీశిఖరములపై మహాకాశ్యపుఁడను బుద్ధభిక్షువు మాహాత్మ్యములను కొన్ని జూపెనందురు.

ఈయన బుద్ధభగవానునిశిష్యుడు. ఇటనేనిర్వాణ పథ మందెను.

**కుక్కుటాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి.

పద్మాసనమున గూర్చొని తొడలకును, పిక్కలకును మధ్యనుండి చేతులు క్రిందికిదూర్చి నేల కానించి వాటి ఆధారముపై నల్లే శరీరమును పైకి లేవనెత్తుట కుక్కుటాసన మనఁబడును.

దీని యభ్యాసమున జఠరాగ్ని బలపడి, నిద్రాలస్యములు తగ్గి నాడులు శుభ్రతనందునని చెప్పఁబడినది.

**కుక్కు ద్వీపములు** (Cook Islands) - వీనిని హెర్వేఇస్పిలెగో అనియు ననెదరు. పగడపుచట్టువలన నేర్పడినవి.

న్యూజిలండులోని ఆక్లాండునకు ఈశాన్య దిక్కుగా ౧౭౮౦ మైళ్ల దూరము. ఇందు రోరోటాంగా యను పేరుగలది పెద్దద్వీపము.

కుక్కుద్వీపములు ౨౮౦ చతురపు మైళ్ల వైశాల్యము కలవి. క్రీ. శ. ౧౯౦౧ లో న్యూజీలండు వశమైనవి.

**కుర్గైర శాఖ క్షత్రియులు** — క్షత్రియకులము చూడుఁడు.

**కుచంచలి కూర** — దీనిఁగూర్చి యంతగా తెలియదు. ఇదియు చంచలి కూర సంబాధమేనని కొందఱును, కాదని కొందఱును అనుచుందురు. దీని యాకులు పొడవుగ నుండు ననియు, గురుత్వముగ నుండి గ్రాహి, నిరసమును గల్గించి నేత్రరోగములను బలపర్చు అపథ్య పదార్థ మనియుఁ దెలియుచున్నది.

**కుచేలుఁడు** — శ్రీకృష్ణుని బాల్యస్నేహితుఁడు. ఎక్కువ సంతానముగల విప్రుఁడు. ఈతఁడు బ్రహ్మవేత్తయు, జితేంద్రియుఁడయ్యు దారిద్ర్యభరమున తనపిల్ల లనుభవించు లేమికి నోర్వజాలక అటుకులంగొని శ్రీకృష్ణుం దర్శించ నాతఁడు కనుంగడు యాదరణము నెఱపి మహా దైశ్వర్యవంతునిగ నొనర్చెనని చెప్పఁబడినది. కుచేల శ్రీకృష్ణులు సాందీపుని యొద్ద సహాధ్యాయులని కూడ చెప్పఁబడినది.

**కుటికా నది** — దీని నిప్పుడు కోశిల యనుచున్నారు. రామగంగానది యొక్క తూర్పు శాఖానది, రోహిల్ఖండము, అయోధ్య పరగణాల గుండా ప్రవహించు నది. రామాయణము అయోధ్యకాండము ౭౧ యందు దీని ప్రశంస కలదు.

**కుటిల గోత్రము** – భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**కుటిలానది** — కుటికానది చూడుఁడు.

**కుటీచక సన్యాసాశ్రమము** — ఆశ్రమ చతుష్టయము చూడుఁడు.

**కుట్టుపని** (Sewing) — ఆంగ్లులు కుట్టుయంత్రమును మొట్టమొదట క్రీ. శ. ౧౭౯౦ సంవత్సరమున Thomas Saint అనునాతఁడు కనిపెట్టెనని యందురు గాని, ఇప్పుడు వాడుక యందున్న యంత్రపుపోలికయే దానికి లేదని చెప్పుదురు. తరువాత Mr. Elias Howe అనునాతఁడొక యంత్రముం జేసెనట. అది Chain Stitch యంత్రమట. పిదప క్రీ. శ. ౧౮33 సంవత్సరమున Mr. Walter Hunt అనునాతఁడు Lock Stitch యంత్రమును రచించెనట. అట్లు నానాఁటి కభివృద్ధులం జెంది ఇప్పుడు వాడుకయందున్న రకముల కుట్టుయంత్రములు బయలువెడలినవి.

కుట్టుపనివారు కుట్టుయంత్రములను రెండు ముఖ్యభేదములు కలవిగ వివరింతురు. అవి యిండ్లయందు చులకనగ వాడుకొనుచుండునవి

Shuttle యంత్రములును, కుట్టుటకు వ్యక్తిగా సైకొనిన పనివాండ్రను, తోలుపనిజేయు జోళ్ళు మొదలగు కుట్టుపనివాండ్రను ఉపయోగించు చుండు బరువగు పెద్ద పనినిచ్చు Spool fed Threading యంత్రములై యున్నవి. ఇటీవల నీకుట్టుయంత్రములను విశ్వవ్యాప్తి వలన పని చేయుచుందగిన ప్లు చేయుచున్నారని తెలియు చున్నది. ఇంకను తోలుపనులు చేసి Gloves చేయుట మొదలగు వేర్వేరు పనులకు వేర్వేరు యంత్రములు చేయబడు చుండుట జూచు చున్నాము.

ఆంగ్లవిధానమున కుట్టుపనియందు ముఖ్యము లగు భేదములు గొన్ని

౧. Back stitch- ఇది లాకుస్టిచ్ లోని యంతర్భేదమే ననియెదరు. ఇది బలమగు కుట్టు అనియు, ఎక్కువ ఉపయోగమనియు నను చున్నారు. ఎక్కువ ఒత్తిడియు, భారము వహించుటయే గల్గు తావులందీకుట్టు చాల బలముగ నిలచును. కాని అందమైనదియు, త్వరితముగ పని నడచునదియుగూడ కాదుగాన, భారవాహక మగు గట్టి కుట్టుగాన అట్టి పనుల కుపయోగింపం బడును.

౨. Blanket stitch- ఇది అందమగు కుట్టుపని. చీలిపోయి పోగులూడిపోవచ్చు అంచు లను మడచి కుట్టి భద్రపఱచుట కెక్కువ ఉప యోగింపబడుచున్నది. గుండీల కాజాకన్నములు ఈకుట్టుపనితో భద్రపఱచబడును.

3. Cross stitch- ఇది సర్వసాధారణ ముగ వాడబడుచున్న కుట్టుపని. చులకన పని. అతివేగిరము పోగులు విస్తారముగ నూడిపోవు గుడ్డలుతప్ప తక్కిన సామాన్యపుబట్ట యంచులను మడచి కుట్టి భద్రపఱచుట కీకుట్టుకుట్టుచుందురు.

౪. Felling stitch- ఇది అంచులం భద్ర పఱచుట కుపయోగించుచున్నారు. అతివేగిరము పోగులు విస్తారముగ నూడిపోవు గుడ్డలకు దీనిని కుట్టుచుందురు. అందుచేతనే దీనిని పోగులు జారి పోకుండ కుట్టు అని పేరొందినది.

౫. Running stitch- ఇది అందమైన కుట్టుపని. తొందరగా కావలసిన కుట్టుపనులకిది యనుకూలించును. కాని ఎంతమాత్రము దిట్ట మును, బలమును కలపనికాదు. ఒకతావున కుట్టు జారియూడినచో అంతటను అట్టిజారుడే ప్రత్యక్షమై యూడిపోయి కుట్టు విడిపోవుట సహజము. Basting stitch పనియు, ఈ Running stitch పని సంబంధమైనదే.

౬. Chain stitch-

౭. Feather stitch-

౮. Herring bone stitch-

ఇవి మూడును అలంకారపు కుట్టుపనులు. అలంక రించుటకై ఉపయోగించుచున్నారు.

౯. Tatting stitch- ఇది ఇంగ్లీషువారి కాలపు పని. విక్టోరియా మహారాజ్ఞి పరిపాలనా ప్రారంభ కాలమున అలంకారార్థముగ చేయుచుండిన పని యట. ఇది ఇక్కాలమున ఆంగ్లేయులు గూడ మాని పోయినదట. ఇంకను ఆంగ్లవిధానమునియు, ఫ్రెంచివిధానమునియు రెండుభేదము లుండెడివట. ఇది పిదప Crochet పని యందు లీనమై పోయిన దని యందురు.

మఱియు నియాంగ్లవిధానపు కుట్టుపని యం దీక్రింద వివరింపబడిన విధముల పనులు చేర్చ బడినవి. అవి అంతర్భేదపు కుట్టుపనులని ఎఱుంగునది.

1. Aiglet work- Aiglet is a metal tag of a lace.
2. Basque work- Working a small circular tail piece to short jacket worn by ladies.

3. Baste work- To hold together lightly with large stitches, preliminary to permanent sewing.

4. Bodkin work - Rounding the holes of eyelets or button holes with a bodkin

5. Braid work - Trimming with a plaited cord This cord is generally made of Mohair, or Silk, or Gold thread or silver hread.

6. Cobble work - to draw together with a needle (drawn carelessly).

7. Crimp work - to gather or crease in a regular pattern.

8. Eyelet work - making small round threading-eye edged either with metal or with a button hold stitch.

9. Facing work - Either linings or trimmings in the fronts of uniforms and coats etc.

10. Fancy work - Needle work composed of ornamental stitches etc.

11 Fly fronted work - having a flap over the buttons so that they may not appear to all.

12. Gathering work - Pleating regularly (drawing in) over an area by means of a running stitch

13. Goose work - working a heavy pressing iron with a sharp nose (specially used for this work by Tailors).

14. Gore work – This is otherwise called gusset work, to insert into a garment, a wedge shaped piece in order to enlarge the whole or a portion of a garment.

15. Hair cloth work - Hair cloth is an uncreasable canvas made from a mixture of cotton and horse hair used for giving body to coats.

16 Italian cloth work - Italian cloth is a hard wearing form of sateen cloth used for linings of coats.

17. Kilting work - to pleat liberally like a kilt.

18 Patch pocket work - to stitch pocket on to the out side of a garment instead of being jetted into it.

19. Placket work- This is also called plaquet work to slit down the side of a skirt closed by press fasteners or hooks.

20. Reverse work- or Lapel work- to fold forward a portion of garment so that the lining or inside portion is visible

21. Soye work - Soye is a hole into which a sleeve head is sewn.

22. Seam work - Sewing the two edges of a cloth together

23. Stay tape work - to fasten round the inside edge of a Coat or round a pocket-mouth- a narrow linen or heavy tape to keep it from stretching.

24. Smocking work– This is an ornamental gleating work.

25 Tacking Work– Holding in place by pinning or basting work, preliminary to stitching.

26 Tuck work - is a pleat held in place by stitching.

**కుట్టుయంత్రము** (Sewing Machine) —బట్టలు మొదలగు వాటిం గుట్టుటాది



కాలము నుండి ఎల్లదేశములంగు సేర్పుగు చేతిఁనిగనే యుండెడిది. ఈ పని ని యంత్రముచే చేయుంచు ప్రయత్న మాదిని ౧౭౯౦ లో ఇంగ్లాండు దేశమున థామస్ సెయింటు అను

నాయన యొకర్చి యొకయంత్రముం జేసి Patent చేసికొనెను.

పిదప ఫ్రాన్సుదేశమున ౧౮౩౦ సంవత్సరమున Barthelemy Thimomrier అను నాయన మఱియొక యంత్రముం జేసెను. ఇది కొంత యభివృద్ధి నంది నడిగనే యుండెను

శ్రీ. శ. ౧౮౪౧ లో Newton Archbold అను నాయన ముఖ్యముగు కొంత యభివృద్ధితో వేఱొక కుట్టు యంత్రమును రచించి బయలు వెట్టెను. ౧౮౪౬ లో Elias Howe అను నాయన లాక్ స్టిచ్ పద్ధతిగ వేఱొక యంత్రమును రచించి పేటెంటు గైకొనెను. కాని వేఱొక అమెరికాదేశపు పనివాఁడు Hunt అను పేరుగలవాఁడు ఈపద్ధతినే తలపోయుచు చేయుచుండి యుండెనట.

Howe గారి యంత్రమునకుం బిదప A B Wilson అను పేరు గల వేఱొక బుద్ధిశాలి Four-motion feed పద్ధతిని మఱియొక రకపు కుట్టుయంత్రమునురచించి వాడుకలోనికిం దెచ్చెను. నేఁటికిని ఆపద్ధతి మార్గముల ననుసరించుచు కుట్టుయంత్రములు చేయుంబడుట గానవచ్చు

రాను రాను అనేక అభివృద్ధులనంది చేయఁబడుచున్న ఇక్కాలపు యంత్రములు అనేకములుగ గానవచ్చుచున్నవి ఇక్కాలపు కుట్టుయంత్రములు Buttonholing, Embroidery-work, Hemming Darning మొదలగు కష్టపు వింత పనులంగూడ చేయుచుండుటం గానవగును. ఇందొక్క సంగతి జ్ఞాపకముంచుకొనదగినది కలదు. తక్కిన అన్నిపనులందు కుట్టంబడు బట్టలు, తోళ్లు మొదలగునవి కుట్టు యంత్రము గూడా నవ్వానికు నడచుచుండ తివాచీలు కుట్టు యంత్రములు వాటిపైనన సంచరించెడిని.

దీనిని అమెరికా దేశపు యంత్రకారుఁడగు Mr. Elias Howe అను నాయన శ్రీ. శ. ౧౮౪౬ వత్సరమున అమెరికా దేశమున Cambridge Mass అను చోట రచించి కనిపెట్టెనట. తరువాత చాల నభివృద్ధి పఱచఁబడినవి.

**కుఠారచ్ఛేద్యనాత్రం గుర్వాన్నఖచ్ఛేద్యం నపంది తేతి న్యాయము** - గొడ్డలితో ఛేదింపదగిన దానిని తాను గోరుతో ఛేదింపఁ గలనని బుద్ధిమంతుఁ డనుకొనరాదని భావము.

**కుడ్యం వినాచిత్ర కర్మేవ ఇతి న్యాయము** — గోడ యుండిన దాని పై చిత్రములు వ్రాయవచ్చును. గోడయే లేకుండిన దేంపై చిత్రించుటకే అనునాలక యని భావము.

**కుడ్యాక్షిగోత్రము—** అగస్త్య ఉపగణము చూడుఁడు.

**కుడిచేతివాటము** - దీనికి పండితులు అభిప్రాయ భేదములం గల్గి యున్నారు. మానవ శరీరమున బలహీనమగు మనస్సు ఎడమ వైపున నుండునియు, బలముగల కుడివైపు తనకు ధైర్యమైన స్థానముగాన దాని నేపనినైన నుపయోగించుట తరతరములుగమానవస్వభావలక్షణమైయుంట, నాలక్షణమే పసిబాల యందునను గల్గి యున్నదనియు కొందఱనుచున్నారు.

ఇంకఁ గొందఱు, పసిబాల తను పెద్దలనుండి గుణ, లక్షణముల నేర్చునంతటిదిగ తనను పెంచు పెద్దవారి శరీరములచే నాకర్షింపఁబడి యుండి యున్న దనియు, పెంచు తల్లి, తండ్రి మొదలగు వారు కుడిచేతి వాటముంగల్గి యుండుటగాన, పసిబాలయు, దానినే ప్రదర్శించిన ప్రదర్శించుంగాని వాటము జన్మతః కలుగదనియు, ఇంకను కొందఱు ఎడమచేతి వాటముగల వారిని మన మప్పుడప్పుడు చూచుచునే యున్నార మనియు, ఈ సంపర్కపు అలవాటు మునిరి పెద్దమైన పిదప వాటమా ననియు నందురు.

ఇంకను రెండువైపుల సమానముగల వాటముగల వారుండుట (Ambidextrous people) అరుదు. కుడి యెడమల భేదము లేకుండగనే వాటము గలవాఁడు సవ్యసాచియని వాడుకయందున్నది.

**కుడుక్క- తాళము** — తాళములు చూడుఁడు.

**కుడుములు వండడంచేత గాని ఆడుదీ కూనిరాగం తీయలేని మగవాడూ ఉండరట** — ఆంధ్రలోకోక్తి.

**కుడువబోతూ రుచులడిగినట్లు** - ఆంధ్రలోకోక్తి.

**కుతకుకోలుక దేశము** — కులింద చూడుఁడు.

**కుతుబ్మీనారు స్తంభము** — ఇది ఢిల్లీనగరపు పరిసరముల కుతుబ్ మశీదుకడనున్నది ఎత్తు ౨౩౮ అడుగులు. ఐదు అంతస్థులం గల్గినది. ఇట రాజ్యమేలిన బానిసరాజు(Slave kings)లలో మొదటివాఁడగు కుతుబుద్దీను ఐబెక్కుగారు దీనిని నిర్మాణముజేసెనని లోగడతలంపఁబడుచుండెను. ఈ యభిప్రాయమును ఐరోపాదేశస్థులు కొందఱామోదించిరట.



ఇటీవలి పరిశోధన లీతలంపు సరికాదనియు దెల్పుచున్నవి. ఇది యాదిని ఇట నింద్రప్రస్థ రాజ్యమేలిన చౌహాన్ (చతుర్హస్త) నృపతి పృథ్వీరాజు యజ్ఞశాల ప్రదేశమనియు, దీనినంటియె నిర్మాపంబడియున్న కుతుబ్మశీదు మహమ్మదీయమత ఆచారము మేరకు పాడుదేవాలయముల పదార్థములచే నిర్మింపంబడెననియు బలముగు వాడుక యీప్రాంతమందు వ్యాపించియున్నది.

శార్‌స్టీఫెను పరిశీలకుఁడు రచించిన ఢిల్లీ చరిత్రయందు కుతుబుద్దీన్ భూపతి మొదటియంతస్థును కట్టించెననియు, తక్కినదానిని సుల్తాన్ షాంషుద్దీన్ అల్తముష్‌గారు నిర్మాణఁజేసిరనియు అభిప్రాయపడియున్నారు. విన్సెంటు స్మిత్తు పరిశీలకుఁడును ఈయభిప్రాయమునే ఆమోదించెను. సర్ సయ్యదు అహమద్ పరిశీలకుఁడు అంతయు అల్తమూష్ సుల్తానుగారే నిర్మాణఁజేసియుందురని అభిప్రాయపడియెను. ఇంకను కొందఱు పరిశీలకులు ఇటీవల అమీర్ సేనానిప్రభువగు కుతుబుద్దీన్‌గారిపేర ప్రారంభించి మొదటి అంతస్థు కట్టించిరనియు, తరువాతి మూడంతస్థులు ఇంచుక లోపముగ సుల్తాన్ షాంషుద్దీన్ అల్తముష్‌గారవలంబించికట్టించిరనియు, తక్కిన నాల్గవఅంతస్థు కడభాగమును ఐదవ అంతస్థును ఫిరోజు తుగ్లక్ భూపతిగారు కట్టించిరనియు, బయల్పఱచిరి. ఎవ్వరునిర్మించినను దీనింగూర్చిన గొప్ప గొప్ప పరిశీలకులు దీనిగట్టిన పనివాండ్రు హిందువులగుట హిందూకట్టడముల లక్షణములింగు లేకపోలేదని యనుచున్నారు.

ఇంతదనుక పరిశీలనలనుండి తేలిన ఫలితముగ నిది బాగ్దాద్ నగరప్రాంతములనున్న ఉష్ పుర నివాసియగు క్వాజా కుతుబుద్దీన్ భక్త్యార్ కాకీ మహాత్ముఁడు గొప్పభక్తుండై పెక్కండ్రు శిష్యుల నాకర్షించుచుండెననియు, వారియందు అఘ్వనులకు భక్తి మెండనియు, వారి శిష్యులలో నొకరగు సుల్తాన్ షాంషుద్దీన్ అల్తముష్‌గారు కట్టించి ఆమహాత్ముని పేరంబరగునటుల నేర్పఱచెననియు, ఆమహాత్మునిపేరే దీనికివాడుకయయ్యెననియు నైయున్నది. మరియు నీ స్తంభము కుతుబ్సాహిబులాట్ పోలిక నున్నదందురు.

ఒకతరి సుల్తాన్ షాంషుద్దీన్ అల్తముష్‌గారి పాలనకాలమున మహాత్ముండగు కుతుబుద్దీన్ భక్తియార్కాకిగారికి షేకుల్ ఇస్లాం గౌరవ

పదవి నీయ ప్రార్థించిరటగాని సర్వార్థత్యాగియగు కుతుబుద్దీన్ మహాత్ముండక్కర లేదనుచుం గైకొన లేదని పెక్కండ్రకు బలమగునమ్మకము కలదు.

కుతుబ్మినారుపై కుతుబుద్దీననియు, సుల్తాన్ మయీజుద్దీననియు రెండు పేర్లు గానంబడుచున్నవి. వీటిని అల్తమష్ గారే చెక్కించియుండిరందురు. ఇవి కుతుబుద్దీను యొక్కయు, ఒకప్పుడు తనకు యజమానుడుగా నున్న వారి పేరై యుండిన సుల్తాన్ మయీజుద్దీన్ గారి యొక్కయు పేర్లని తలంచుచున్నారు

Vincent A. Smith C I. E, M A. Oxon & Dublin పండితుడు తన Oxford History of India Page 223 యందు కుతుబ్మినారు ఇరువదిపదు హిందూదేవళముల సామగ్రితో నిర్మింపబడినటుల చెప్పంబడుటం గూర్చి వివరించెను ఇక్కాలమున నిది ఢిల్లీ యందు చూడదగిన చిత్రములలో నొకటిగ నున్నది.

కుతుబుద్దీన్ ఐబెక్ క్రీ. శ ౧౨౦౬-౧౨౧౦ యును, ఫిరోజుతుగ్లక్ ౧౩౫౧ ౧౩౮౮ యును, పరిపాలనకాలములుగాను కుతుబ్మినారు స్తంభము క్రీ. శ. ౧౨౦౬ మొదలు ౧౩౮౮ వఱకుగాని, ఆమధ్యకాలములందు గాని నిర్మింపబడినట్లు తేలుచున్నది.

**కుతుబ్ వంశ నృపులు** — తొల్లింటి బహామనీ రాజ్యము క్రీ. శ. ౧౫౨౬ లో నైదు చిన్న రాజ్యములుగ చీలుటతో నేర్పడిన రాజ్యములలో నొకటియగు గోలకొండ రాజ్యమునేలిన మసల్మాను నృపులు. వీరు మొగలాయీశాఖ వారగు ఇప్పటి హైదరాబాదు నృపుల పూర్వుల కోడి రాజ్యముం గోల్పోయిరి.

**కుత్స గోత్రము** — హారిత ఉపగణము చూడుడు.

**కునింద దేశము** — కులింద దేశము చూడుడు.

**కుపథ దేశము** — భరత దేశమునకు వాయవ్యదిశనుండు కొండదేశములలో నొకటి. హ్యూయనత్సాంగు దీనిందర్శించి తన దినచర్యయందు కియొపాన్ అని వ్రాసెను ఇది కబంధ దేశమని కొందఱు పొరబడిరి కాని కబంధ కానేరదు. మత్స్యపురాణము ౧౧౩-౫౫ యందు కుపథ దేశ ప్రశంస కలదు

**కుపిత గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**కుప్పందగుల బెట్టి వేలాలు ఏరుకు తినేవాడు** — ఆంధ్రలోకోక్తి.

**కుప్పింటచెట్టు** — లా. Acalypha indica ఇంగ్లీ. Indian Acalypha. సం. పేరు సరియైనది తెలియదుగాని పెక్కండ్రు మూర్కొండచెట్టు పేరగు హరితమంజరియని వాడిరి దీనికి కుప్పిచెట్టనియు, పుప్పంటిచెట్టనియు వాడుక పేరులు కలవు అరవమున కుప్పామేని యనెదరు. దీని యాకు మూర్కొండ యాకుం బోలియు పొడవుగను, అంతకన్న నెక్కువ నునుపుగ నుండును.

దీని వేరు కషాయము, ఆకుల కషాయము విరేచనములు, వమనము గల్గించును గాన, వైద్యులు కొంచపు మోతాదును జాగ్రతగా వాడెదరు. ఆకులు, సున్నము లేక ఉప్పుతో నూరి పైనవేసి కట్టిన గజ్జి, చిడుము, తామర, తీట, పల్లికలు మానునందురు. మరియు తేలు, జెఱ్ఱి, పురికొన, కందిరీగలు, తేనెటీగలు కుట్టిన బాధ నిలుచును. మరియు మేహవాతపునొప్పులు నివారణమగును. పురుగులు పట్టిన పుండ్లు మానును. సమూలమూర్ణము లోనిచ్చిన ఉబ్బసము, వగరుపు, క్షయ, క్రిమిరోగము నివారణ

మగును. మరియు మహాకాండచెట్టునకుం గల గుణములు గలవని కొందఱనెదరు.

**కుఫీవ్రాత** — ఇది అరబ్బీదేశపు భాషకుం జెందినది. బహు పురాతనమైన దండారు. మెసపొటేమియాదేశమునందలి కుఫా యను స్థలమీ వ్రాతకు ప్రధానస్థానముగా నుంట పేరొందినది. ఖురాను పాతప్రతులు కొన్ని ఈ కుఫీ వ్రాతలోనున్నవి బయల్పడినవి.

అరబ్బీప్రాగ్దేశములందు నష్కీ వ్రాతవిధానమును, అరబ్బీపశ్చిమదేశములందు మఘ్రేబ్ కర్సివ్ వ్రాతయు, ఆదిని వాడుకయందుండె ననియు, మఘ్రేబ్ కర్సివ్ కుఫీయొక్క పరిణామమే ననియుం దెలియుచున్నది.

**కుబేరుఁడు**—యక్షులకు ప్రభువు. అలకాపురి రాజధాని. ఉత్తరదిశాధిపతి. శివభక్తుఁడు. అసమానమగు ధనాధినాథుఁడు. తండ్రివిశ్రవస్సు, తల్లి ఇలబిల గాన నితనికి ఐలబిలుఁడనియు పేరు కలదు. భార్య పేరు చిత్రరేఖాదేవి. కుమారులు నలకూబరుఁడు, మణిగ్రీవుఁడు.

అష్టదిక్పాలకులలో నొకఁడు వాహనము గుఱ్ఱము, ఆయుధము ఖడ్గము. నరవాహనుఁడు, కుబేరుఁడు గుహ్యకులకుంగూడ ప్రభువు. మరియు రాజాధిరాజని బిరుదముగలవాఁడు.

కుబేరుని తండ్రిపేరు విశ్రవణుఁడు గాన కుబేరునకు వైశ్రవణుఁడనియు వాడుకనామము కలదు.

**కుబ్జానది** - నర్మదా నదిలో సంగమించు చిన్ననది. దీని ప్రశంస పద్మపురాణము భూమిఖండము ౬౩ యందు కలదు.

**కుబ్లైఖాన్** — ఈయన చీనాదేశమేలిన మొదటి మంగోలు చక్రవర్తి. జంఘిస్‌ఖానుని మనుమఁడు. జన్మము ౧౨౧౬ అనియు, రాజ్యమునకు అధిపతి యగుట ౧౨౬౦ అనియు, మృతి ౧౨౯౪ అనియు చెప్పఁబడినది. ఇతఁడు ౧౨౬౪లో చీనా ఉత్తర భాగములను, ౧౨౭౯ చీనా దక్షిణభాగములను స్వాధీనపఱచుకొనిన వాఁడనియు, ౧౩౬౮ వఱకు రాజ్యమును పాలించిన యూఎన్ రాజ వంశమునకు మూలపురుషుండనియు, పీకింగ్ నగరమున్న తావుననే ఈయన రాజధాని యుండెననియు, బౌద్ధమతము తన రాజ్యమున ప్రధాన మతముగ ప్రకటించిన వాఁడీతఁడేయనియు, మార్కోపోలో ఈయన కడనే కొలువుండె ననియు చెప్పఁబడినది. ఈతఁడు జపానుపై దాడి వెడల యత్నించెనట గాని సాగరావరణ మున్నకుండె నందురు.

**కుభా నది (కాబూల్ నది** — ఇప్పటి ఆఫ్ఘనిస్థానమునందున్న నది. హిందూకుష్ పర్వతశ్రేణులందు హెల్మండు నది జన్మస్థాన ప్రాంతమునందే జన్మించి రాజధానియగు కాబూల్పట్టణము గుండా ప్రవహించుచు భరతదేశము జొచ్చి అటాక్ పట్టణము కడ సింధునదిలో సంగమించును. దీని పొడవు ౩౨౦ మైళ్లని చెప్పంబడినది. దీని ఇప్పటి పేరు పట్టణము నుండియే గల్గెనో లేక నదినుండియే తత్తీరము నందున్న పురికి గల్గెనో తెలియరాకున్నది. (కాబూల్ నగరము చూడుఁడు).

ఇప్పుడు దీనిని కాబూల్ నది అనుచున్నారు.



ఆఫ్ఘనిస్థానములోని కాబూల్పురము నుండి ౩౮ మైళ్ల దూరమున కోహిబాబా పర్వత పాదమున సిరిమస్మా యను పేరుగల జలబుగ్గ్భదమున ఉద్భవించి ఇతర నదులం గల్పుకొని చని కాబూలు (దీనిపేరే వహించిన పురము) గుండా నడచి భరతదేశమున పాంచాలము జొచ్చి సింధు నదితో సంగమించును. కుభానది ప్రశంస ఋగ్వేదము ౧౦-౭౫ యందు కలదు.

కుభానది లోయకు నంగ్నిహార్ లేక నిగ్రహార (నవనదుల భూమి) అని యందురు. ఆ

నదులు ౧. సుర్ఖాబ్, ౨ గండమాక్, 3. కుర్రుమ్, ౪. ఛిత్రియల్, ౫ హిసారక్, ౬. కోట్, ౭ మోమందరా, ౮ కోహిస్టాటి, ౯. కాబూల్ ఇందు కడపటిదే ప్రధానమై అన్నిటికీ గతి.

**కుమారతంత్ర బాల్యవైద్యము** — ఇది లంకారాజ్యమేలిన రావణభూపతి రచించెనని యనుచున్నారు. కావుననే ఈ వైద్యగ్రంథము రావణకుమారతంత్రమను పేరంబరగుచున్నది. ఆమహారాజీగ్రంథమును రచించెననియు, తన స్వకుటుంబమందలి బాలబాలికల కీవైద్యవిధానము వాడుకయందుండెననియు వాడుకకలదు. (ఆయుర్వేదవైద్యము చూడుడు, సిద్ధవైద్యము చూడుడు). ఇందు నందనా, సునందా, పూతనా, ముఖమండికా, కటపూతనా, శకునికా, శుష్కరేవతీ, ఆర్యకా, భూసూతికా, నిరృతాపిలిపిచ్ఛికా కామకా, గ్రహబాధల చికిత్సలు పంద్రెండును, శిశురోగోత్పత్తి కారణములును, స్తన్యపానశిశువులకుం గల్గెడి గ్రహదోషలక్షణములును, కొన్ని యౌషధములును, ఔషధ ప్రమాణములును, కొన్ని కషాయములు మొదలగు ఉపశాంతులును వివరింపబడియున్నవి.

**కుమారధూర్జటి** (వేంకటాచార్యకవి) — ఆంధ్రకవులలో మధ్యకవులందు పరిగణింపబడిన వాడు. పాకనాటి నియోగి బ్రాహ్మణుడు. కాళియామాత్య పుత్రుడు సుప్రసిద్ధుండగు ధూర్జటికవికి పౌత్రుడు. ఆపస్తంబసూత్ర భరద్వాజసగోత్రుడు శ్రీకాళహస్తి కాపురము. కుమారధూర్జటి యను పేరు బిరుదమో లేక చిన్నానాటిముద్దుపేరో గాని ప్రసిద్ధికెక్కియున్నది. రచించినది కృష్ణరాయవిజయము. దీనిని శ్రీరామాంకితముగ నర్పించెను. ఆకువీటి ప్రభుండగు చినవెంకటాద్రి నృపాలుడు ప్రోత్సహించి యీ గ్రంథరచనం జేయించెనట.

**కుమార రాజ్యము** — కైరమాలి చూడుడు.

**కుమార వనము** — కూర్మాచల (కుమాన్) దేశపర్వములందుండు వనము దీనిం గూర్చిన ప్రశంస విక్రమోర్వశీయనాటకము ౪ వ అంకమున కలదు. (కూర్మాచలదేశము చూడుడు).

**కుమారశిష్ట గోత్రము** — ఆర్య వైశ్యుల గోత్రము (౧౦౨) లలో నొకటి (వైశ్య గోత్రములు చూడుడు). కుమారశిష్టసగోత్రము ఏకాక్షేయ గోత్రము (౨3) దీనిని కొమరశిష్ట, కొమిరిశిష్ట, కొమిరిశెట్ట, కొమరశెట్ట యనియు నందురు. సంస్కృతగోత్రము ఉగ్రసేనస, ఉగ్రసేనగణము, ఆపస్తంబసూత్రము, యజుశ్శాఖ. సమానగోత్రము ఔర్వసేన, భృంగీశుడు దేవత, భార్య పూజాంబ, వృద్ధాచలము తపస్థానము, అపూపసరస్సు తటాకము, జపము లక్ష, దీపములు ౬౦, క్షేత్రసఖ్య ౬౦, అన్నదానము, గోంగూరాకు వర్జనీయము.

**కుమారషష్ఠి** — ఆషాఢశుద్ధ షష్ఠి. కుమారస్వామిపూజ యొనర్తురు పర్వతిథి. (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుడు)

**కుమారీనది** — బీహారు సబుడివిజనులో రాజగిరికి సమీపముగా శుక్తిమతీ పర్వతపంక్తిలో జనించునదికి కుమారీనది యని పేరు. దీనినిప్పుడు కవోర్వానది యనుచున్నారు. దీనింగూర్చిన ప్రశంస విష్ణుపురాణము ౨-3 యందు కలదు. ఇదిజనించు పర్వతమునకు ఋక్షపర్వతమని పేరట. మఱియు యమునానదినుండి (ధోల్పూరునకు ౧౨ మైళ్లలో) జనించి సింధునదిలో కలియు నదికిని కుమారనది యనియు, యమునాకుమా-

యనియు, సుకుమారీనది యనియు పేర్లుకలవు. దీనింగూర్చిన ప్రశంస మత్స్యపురాణము ౧౧౩ యందు కలదు. ఇప్పటి కన్యాకుమారీ అగ్ర పరిసరముల నొక చిన్న మెట్టయు, దానినుండి యుద్భవించి, అటనే ఇప్పటి కన్యాకుమారీ దేవస్థానము కట్టంబడి సముద్రముం జేరుకొనుచున్న జలప్రవాహామునకు కుమారీనది యని పేరుండె ననియు, అక్కాలమున నాపర్వతసీమ పాండ్య భూనిభుల పాలనకులోబడి యుండెననియు, నాపరిసరములనే యెక్కడో రాజ్యపాలనా ప్రధానస్థానముండెననియు, ఇవి యన్నియుగల భూభాగము సముద్రాక్రాంతమై శిలాతలమగు కన్యాకుమారి దేవస్థానము అగ్రముగ నేర్పడి నిలచెననియు సుప్రసిద్ధ విద్యాధికుండగు నొక పరిశీలకుండు వ్రాసియున్నాడు. (తమిళసంగములు చూడుడు).

**కుముదగంధ గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు

**కుముద పర్వతము** — రైవతకపర్వతము చూడుడు.

**కుముదవతి** — వింధ్యపర్వతమున నుత్పత్తియగు ఒకనది.

**కుముదాక్షుడు, కుముదుడు** - విష్ణుఅనుచరులలో నొకడు. మఱియు కుముదుడను నొక వానరము కలదు. ఇంకను ఒకరాక్షసుడును కుముదుడను పేరుగలవాడు కలడు.

**కుమ్మర మొల్ల** — ఆంధ్రకవులలో మధ్యకవులందు చేర్పబడిన ఈమె ఆతుకూరి కేసన్నసెట్టి కుమారిత. ఈమె కులాలవంశజాత యని పరంపరగ వాడుకవల్ల తెలియుచున్నదిగాని నిదర్శనములు లేవుగాన అట్లుచెప్పఁబడినది. నివాసము నెల్లూరివద్ద పడుగుపాడనియందురు. ఆంధ్రకావ్యముల రచించిన స్త్రీలలో నీమెయె మొదటిది. తరువాతనివాసస్థానము నెల్లూరుమండలములోని గోపవరమని వాడుకకలదు. రచించినది ఆంధ్రరామాయణము దీనిని మొల్లరామాయణమని యనుచున్నారు

**కుమ్మరిఆవములో కుండలేగాని చిందెలు దొరకవు** — ఆంధ్రలోకోక్తి.

**కుమ్మర(కుండల)ఆవములో గచ్చకాయ దాచినట్లు** – (అనగా వేలి కుండలం బుగులఁ జేయునని భావము). ఆంధ్రలోకోక్తి.

**కుమ్మరికష్టమంతా ఒక్క దెబ్బకు లోఁగువ** — ఆంధ్రలోకోక్తి.

**కుమ్మరిపురుగు వాటము**- (కుమ్మరి పురుగు బురదలోఉన్నను దానికి మన్ను అంటదు). ఆంధ్రలోకోక్తి

**కుమ్మరివీధిలో కుండలనమ్మనేగినట్లు** — ఆంధ్రలోకోక్తి. దీనినే "Carrying coal to Newcastle" అను నాంగ్ల సామెతగా భావింపఁ దగును.

**కురటకుల గోత్రము** – ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుడు).

కురటకుల గోత్రము ఏకార్షేయ గోత్రము ర, దీనిని కోరటుకుల, గోరంటకుల, కరటకుల యనియు నందురు. తొల్లింటి సాంస్కృత గోత్రము-హారివల్క్యహారివల్క్యపగణము, మతంగర్షి, ఆపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణ గ్రంథమాద్య ప్రవరఖాండ. సమాన గోత్రము మతంగ, కుమారేశుడు దేవత, భార్య ధరణీసతి. రత్నాచలము తపస్థానము. ధరణీసరము తటాకము. జపము లక్ష, ద్వీపములు ౫౧. క్షేత్రసంఖ్య ౫౦. గజదానము. గుమ్మడికాయ వర్జనీయము.

**కురాన్** — ఇది మహమ్మదీయ ఇస్లాం మత ప్రధాన మత గ్రంథము. దీనిని భక్తితో

ఖురాన్ మజీదనియు, అల్కితాబ్ (The book) అనియు నందురు. అరబ్బీ భాషయందు 'కుర్,ఆన్' అను పదములకు చదువవలసిన దని యర్థము. ఇది మహమ్మదు జగద్గురుని జీవిత కాలమున జిబ్రయిల్ పరిముఖముగ నామహాత్మునకు ఇరువది మూడు వత్సరముల కాలములో నుపదేశింపఁబడుచు వెల్లడింపఁబడిన దగుటచే మహాకర్తులగు మత ధర్మ రహస్యముల కీమత పరిభాష యందు హదీత్తులందురు గాన అట్టివి గాక కురాన్ కేవలము దేవుని ఉక్తులు, మాటలు అని చెప్పఁబడినది.

ఇట్టి కురానునందు ఇస్లామ్ (శరణ్య) మతము ప్రతిపాదింపఁబడినది. ఇది భక్తి మతము. దీని సిద్ధాంతమున కిమాన్ అని పేరు మఱియు నీమత విధానము "దీన్" అను పరిభాషా పదముచేఁ బరగెడిని. పరమేశ్వరునకు త్రిసహస్ర నామములున్నను కురానునందు తొంబది తొమ్మిది తెలుపఁబడినవి. ఒకనాను యింకను లోకమున కనుగ్రహింపఁబడనే లేదు. వీటియందల్లా యను నామము అతిశయ పవిత్రతలం గల్గినది. మహమ్మా న్వ్రతము రమదాన్మాసము ముప్పది దినములు, పగ లుపవసించుచు కురాను భాగమును పఠించు కొనునటుల నిమహా గ్రంథము ముప్పది భాగములుగ నేర్పఱచఁబడినది. అట్టి భాగమునకు జుజ్ అనియు, పారా అనియు పరిభాషా నామములు కలవు. ఇంక కురాను మఱియు స్వతస్సిద్ధముగనే ౧౧౪ అధ్యాయములుగ నున్నది. వాటికి సురాలని పేరు. అవి తెలుపు సంగతులం బట్టి ప్రతి సురాయును దాని దాని ప్రత్యేక నామ సహితముగ వాడఁబడుచుండును. సురా తుల్నబీ యాథ్యాయ మనియు, సురాతుల్ఫతీహా యని పేరులుండు నిందుకు సాదృశ్యములు. ఇందు మొదటి సురా అను దినపు సలాత్ (నమాజ) ప్రార్థనలందు పఠింపఁబడుచుండెడిని.

మహమ్మదు గురుఁడే తన కప్పుడప్పుడుపదేశింపఁబడు కురాన్ భాగములను వేత్యేలు తాళ్వుల వ్రాయించుచునే యుండెనట. తర్వాతి ఖలీఫా అబూబకరు గారు వాటి నన్నిటిం జేర్పించి కూర్పించి యేకగ్రంథముగఁ జేయించిరట. దీనిం గంఠస్థ వల్లెవేసిన వారిని హాఫిజ్ అను బిరుదమున గౌరవించెదరట.

**కురాసాం దేశము** — ఖురాసాన్ దేశము చూడుఁడు

**కురింజచెట్టు** — లా. Asclepias vomitoria, Asclepias asthmatica అనియు ఆంగ్ల Vomiting Swallow wort అనియు, సం మూావని యని కొంద ఱనెదరుగాని సరియగు పేరు తెలియరాకున్నది

దీనివేరు చేఁగ, వెగటు గల్గియుండు ననియు, శ్లేష్మమును వెడలించు ననియు, పసిపిల్లలకు కఫము తట్టినతరి వమనము చేయించి కఫము వెడలింప నీకషాయమును తక్కువగను దేలికగను ఇచ్చిన వమనమై కఫము పడిపోవుననియు నందురు.

**కురుజాంగలారణ్యము** — నవారణ్యములు చూడుఁడు.

**కురుజాంగల దేశము** — మహాభారతము ఆది ౨౦౧ యందునను, వామనపురాణము ౩౨ అధ్యాయమునను, కురుదేశమంతయు కురుజాంగలదేశమే యని చెప్పఁబడినది. మహాభారతము ఆది ౧౨– యందు హస్తినాపురము కురుజాంగలములోనిదే యని చెప్పఁబడినది. కామ్యకవనము కురుజాంగలములోని దందురు. ఇప్పటి సర్హింద్ ప్రాంతదేశమని పోల్చియున్నారు. బౌద్ధప్రాబల్యకాలమున దీనికి బౌద్ధులు శ్రీకాంత దేశ శ్రీకంఠదేశ మని పేరిడిరట. ఇది కురుక్షేత్రదేశములలోనిది. కొంతకాలము విలాసపురము, మఱి కొంతకాలము స్థానేశ్వరమును రాజధానులుగ

నుండినటుల తెలియుచున్నది. రెండవశైలా దిత్యుఁ డను పేరుగల హర్షదేవుఁ డను భూపతి ప్రభుత్వకార్యాలయములను కనూజకు మార్చె నని చెప్పఁబడినది. (జాంగలదేశము చూడుఁడు).

**కురుజిత్తు**— మిథిలదేశాధీశుఁడు తండ్రి అంజకుఁడు.

**కురుదేశము** — వేదకాలమునందును, మహాభారత కాలమునందును, నేఁడును నీకురు దేశము మహాప్రసిద్ధినే పొందియున్నది.

ఈ కురు దేశమునే, మనువును, కాళిదాసునుం గూడ బ్రహ్మావర్తమని వర్ణించిరి.

ఉత్తరమున :—హిమాలయమును,

తూర్పున :—పాంచాల దేశములోని అహిచ్ఛత్రమును, మాకుది కాంపిల్యయను భాగములును,

దక్షిణమున:— మత్స్యదేశము, నాఁడు మరుస్థలమని పిలువఁబడు రాజపుత్రస్థానపు ఎడారియును,

పశ్చిమమున :— నేటి "కాందహారు, పశ్చిమోత్తర పరగణాలలోను, పంజాబులోను" గలిసిన గాంధార దేశమును గలవు. గాంధారదేశమునకుఁ బశ్చిమోత్తర భాగములలో—"బాహ్లిక మద్ర, కాశ్మీర దేశములును, నైఋతి దిక్కున కేకయ, సింధు సౌవీర"దేశములును—నేటి "రాజపుత్రస్థాన గుజరాతి" దేశములలో మరుస్థలమును ఎడారియును, 'మత్స్య త్రిగర్త దశార్ణ' దేశములును, 'శూరసేన, అవంతి, సౌరాష్ట్ర' దేశములును, నేటి 'మాల్వా, మధ్యరాష్ట్ర' భాగములలో "నిషధ, హైహయ, విదర్భ, చేది, దక్షిణ కోసల"దేశములును, పాంచాలమునకు దూర్పున 'గాశీ,కోసల ' దేశములును—'బేహారు బంగాళా రాష్ట్రముల' లోనివగు విదేహ, మగధ, అంగ, వంగపౌండ్రదేశములును—'అసాం చీనా బర్మా' భాగములలోనిదగు ప్రాగ్జ్యోతిష రాజ్యమును కలవు. మరియు, "ఉత్కలాంధ్ర మహారాష్ట్ర దేశములలోనున్న గళింగాంధ్ర మణిపుర, కోసల మల్ల" దేశభాగములును, "ద్రవిడ కర్ణాటక, మళయాళ, మహారాష్ట్ర" భాగములలో "చోళ, పాండ్య, కేరళ, కొంకణ, సాళ్వ" దేశములును నుందేకలవు.

భరతఖండము నేకఛత్రాధిపత్యముతో నెవరు పరిపాలింప వలయునని మహాభారత యుద్ధానంతరమునగూడ మూడు కురుక్షేత్ర సంగ్రామములు జరిగినవి.

౧ పానిపట్టు, (క్రీ. శ. ౧౧౯౧-౨), ౨. ఢిల్లీ, (౧౫౨౬), 3 స్థానేశ్వరము,(౧౭౬౧) (థానేశ్వర్ అని కూడ వ్రాయుచుందురు)

౧. పానిపట్టునొద్ద పృథ్వీరాజు, మహమ్మదు ఘోరీలకును, ౨ ఢిల్లీయొద్ద బేబరు, ఇబ్రహీం లోడీలకును, 3. స్థానేశ్వరముకడ మహారాష్ట్రులు అహమదషాబ్దాలీలకును జరిగిన ఘోరసంగ్రామములే యిటీవలి ముఖ్యములగు కురుక్షేత్ర యుద్ధములు. మహాభారతయుద్ధమున నాకురుక్షేత్రము నేకేమి యంటుదగిలినదోకాని యుండి యుండి ఒక్కొక్క మారు మహార క్తపాత మొనగూడిన మహాసంగ్రామములే జరిగినవి

**కురుకుస్థానము** — ఆసియాఖండమున నిప్పాటికి టర్కీ యందున్న చిన్న దేశము. తొల్లింటిపేరు అస్సీరియా దేశము. ఇది ఆర్మీనియాకును టైగ్రిసు నదికిని నడుమ నుండెనని చెప్పఁబడినది ఈశాన్యదిక్కున కొండలును, నైఋతిదిక్కున సమతలమును కలవు. టైగ్రిసు నదీజలము లవ్వారిగ పొలములకుం బ్రవహించును. ప్రజలు కురుకులగుట కురుకుస్థానమని అస్సీరియా రాజ్య మంతరించినపిదప పేరుకల్గెను. ఇప్పు డొకవిధమగు మహమ్మదీయులుగ నున్నారు. తొల్లింటి అస్సీరియారాజ్యముండిననాటి రాజధాని నినివే

పురము పాషై బైగ్రిసు నదీతీరమునా నున్నది. ముప్పదిమైళ్లు. ఆపట్టణపు టానవాళ్లు కలవు ప్రాసాద భవనములు, దేవళములు, పురాతన శాసనములు త్రవ్వి బయలుదేర దీసియున్నారు అందు **Arrow headed letters** శాసనములు కలవు. అవి గ్రహింపంబడి నినివేచరిత్ర బయలుపడుచున్నది.

**కురుధాముఁడు**— అత్రిసంతతి చంద్రవంశపు క్షత్రియుఁడు తండ్రిపేరు దివ్యరథమహారాజు కుమారుఁడు అత్రితుఁడు.

**కురునాథ్యగోత్రము** — అగస్త్యపగణము చూడుఁడు

**కురుబజాతివారు** — వీరు అడవి జాతులవారిలో గొఱ్ఱెలమందలం గాచు నొక జాతిగ నున్నవారు ఆంధ్రదేశమున మదనపల్లి ప్రాంతములఁ గానఁగుదురు. వీరియందు అత్రి (ప్రత్రి) కురుబ లనియు, ఉన్నికురుబ లని రెండు తెగలుగ నున్నారు వీరికి జంగములు గురువులు వీరి వివాహములకు జంగములు చేయింతురు వీరి కులోత్పత్తింగూర్చిన గ్రంథములు గానరాకున్నను వీరియం దనుశ్రుతముగ వాడుకనొందియున్న కథన మిట్లున్నది.

కాపుకులస్థుండగు మాసిరెడ్డికిని, భార్యయగు నీలమ్మకును జంగమవేషధారియగు నీశ్వరుని వరప్రసాదమున ఉండాలపద్మన్న యను సుతుండు గల్గెనట. ఈతండు డాసె కేడవసుతుండని చెప్పుదురు. ఈబాలుఁడ కొక మాటయందు గొఱ్ఱెల మంద నొకటి పరమేశ్వరుండు గల్గించెనట. ఈతనికి ఒక కాపుబాలికయు, ఒకరాక్షసునిచే చెరపెట్టంబడి తప్పింపంబడిన యొక విప్రవనితయు నిర్వురు భార్య లుండిరనియు, కాపుబాలసంతతి వారు అత్రి (ప్రత్రి) కురుబలును, విప్రవనితసంతతి వారు ఉన్ని కురుబలును. ఇట్లీరు సంఘముల మూలపురుషుఁడు ఉండాల పద్మన్న యనియు చెప్పుదురు. వీరికి వీరప్పదేవర, గౌడ యను కుల దేవతలుం గలరు. వారలం గొలిచి వివాహము లందు వీరు తాంబూలము లర్పింతురు

**కురువస్సుఁడు**- అత్రిసంతతి, చంద్రవంశ క్షత్రియుఁడు, యదుసంతతి. తండ్రి మధువు (రెండవ వాఁడు).

**కురువశువు** - అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు. తండ్రి దేవక్షేత్రుఁడు, కుమారుఁడు అనూరధుఁడు.

**కురువింజచెట్టు** — లా. **Chretia buxifolia.** దీనిని కురువిందమని కొన్ని తావుల వాడుచున్నారు గాని తొల్లింటి పేరు తెలియరాకున్నది దీని వేరు తీసి, కారము రుచులం గల్గియుండు నందురు.

దీని వేరు మూలికల వలన శరీరమునకుఁ జేరిన విషమును హరించుననియు, వ్రణములుగాని, సుఖవ్యాధులుగాని గల్గియుండు శరీర తత్వము గల వారికి లోనికిచ్చిన శరీర తత్వమును మార్చి వారికి వేరు కషాయము గుణమిచ్చు ననియు, పూవులు-వాతము, రక్తపైత్యములపై చక్కఁగ పనిచేయుననియు నందురు.

**కురువు** (కురుమహారాజు)— అత్రి, చంద్ర పూరువసంతతి. తండ్రి సంవరణుఁడు, తల్లి తపతీదేవి (సూర్యపుత్రిక), సుతులు ఒకటవ పరీక్షిత్తు, సుధనుస్సు, నిషధుఁడు, జహ్నువు. ఈతఁడు కడు ప్రసిద్ధినందిన మహారాజు. ఈతఁడేలినది శమంతపంచక మనంబడు దేశము; ఈతని నుండియె కురుక్షేత్రమను పేరంబరగ సాగెను.

మఱియు దానిని కురుదేశమనియునను చుండిరి. ఈతని సంతతి క్షత్రియులగు కౌరవులకు ఈతని నుండియె పేరు వచ్చెను.

**కురువేరు చెట్టు**- లా. Lavendula carnasa సం. తోయజ, శోగంధ, (ఇవి తెల్లకురువేరుకు ప్రసిద్ధములు) హ్రీవేర హ్రీవేలకం (ఇవి నల్లకురువేరుకు ప్రసిద్ధములు) ఇంకను అంబునామకమ్, కచామోదమ్, కుంతలః, కుంతలోశీరమ్, కేశనామకమ్, పింగమ్, బాలకమ్, వరం కేశ్యమ్, వర్హిష్టమ్, వారిదమ్, వారినామకమ్, వాలమ్ అను పేరులు గూడ కురువేరుకు సామాన్యముగ వాడియున్నారు

కురువేరు చూర్ణము లేక కషాయము చేసి రుచిం గల్గి ఇంచుక చలువజేసి, వీర్యపుష్టిజేసి తాపమడంచును. కఫదోషము, జ్వరదోషము, తాపజ్వరము, చర్మరోగములు, పైత్యవికారము, ప్రమేహము, భ్రమ, కురదలు, రక్తపైత్యము, రక్తస్రావములనడంచుననియు, ఆకు రసము గొంతుకలో కురుపును నివారించుననియు చెప్పఁబడినది. కురువేరు విసనకఱ్ఱలు జేతురు. దాని గాలి సుగంధయుతమై దనరెడిని.

**కురుక్షేత్ర గోత్రము** (కౌరుక్షేత్ర గోత్రము) — భారద్వాజస ఉపగణము చూడుఁడు.

**కురుక్షేత్రము**— కురుక్షేత్రము డెబ్బది లేక ఎనుబది మైళ్ల వఱకు వ్యాపించిన ప్రదేశము. అందు స్థానేశ్వరము ప్రధానస్థానము. ఇందు శోనీపాట్, పానిపాట్, అమీన్, కర్నాల్ చేరియున్న ప్రదేశము. మహాభారతము వనపర్వము ౮౩ అధ్యా. సరస్వతీనది ఉత్తరపు టెల్లగను, దృషద్వతీనది దక్షిణపు టెల్లగను గల మధ్యప్రదేశమని చెప్పఁబడినది. కురుపాండవ (మహాభారత) యుద్ధమీ ప్రదేశమంతటను పదునెన్మిది దినములవఱకు జరిగినది. ద్వైపాయన హ్రదము స్థానేశ్వరమునకడం గలదు. వ్యాసస్థలి (ఇప్పటి బస్థలి) స్థానేశ్వరమున నైఋతిదిశగా పదునేడు మైళ్ల దూరము. అభిమన్యుఁడు మరణించిన పద్మవ్యూహము తావు. స్థానేశ్వరమునకు దక్షిణమున నాలుగు మైళ్ల దూరమున అమీన్ అనుచోటగలదు. ఇంకను అదియె అదితిసూర్యునిగన్న తావు. స్థానేశ్వరమునకు పశ్చిమముగ నెన్మిది మైళ్ల దూరమున గల భోర్ అనంబడు తావున భూరిశ్రవుఁడు వధింపఁబడిన తావు. స్థానేశ్వరమునుండి నైఋతి దిక్కున పదునొకండు మైళ్ల దూరమున నార్థయను పేరంబరగు తావు. భీష్ముఁడు భౌతికశరీరము విడిచిన తావు. స్థానేశ్వరమునకు పశ్చిమమున కొంత దూరమున ఔజస్ఘాట్‌కు దక్షిణమున అస్తిపుర మనంబడు తావు యుద్ధమున నిహతులైన వీరుల శరీరముల ప్రోగుచేసి దహనమొనర్చిన స్మశానము. దీని ప్రశంస పద్మపురాణము సృష్టి అ. ౧౩ అధ్యాయమున గలదు. ఇప్పుడు శోన్పాట్ అనంబడుచున్నది తొల్లింటి శోణప్రస్థము. పానిపాట్ అనంబడుచున్నది తొల్లింటి పాణిప్రస్థము. స్థానేశ్వర సరస్సునందలి చక్రతీర్థము (శ్రీ)కృష్ణుఁడు తాను యుద్ధరంగమున ఆయుధము బట్టనని మొదట వాగ్దానంబిచ్చియు కోపమున భీష్ముని జూచి తన చక్రమును దీసిన తావు. కురుక్షేత్రమునకు స్థాణుతీర్థమనియు పేరు గలదు. స్థానేశ్వర శివలింగమునందు దేవస్థానము. స్థానేశ్వర గ్రామమున కుత్తరముగ నరమైలు దూరమున గలదు. స్థానేశ్వర సరస్సున స్నానమును, స్థానేశ్వర శివలింగ దర్శనార్చనలును సర్వకాలములందును జరుగుచుండెడివి. అందు గ్రహణకాలములందెక్కువగ నడచెడివి. కురుమహారాజు దున్ని క్రతువొనర్చుటం జేసి కురుక్షేత్రమని పేరందినది. ఈ కురుక్షేత్రపు పూర్వపు టెల్లలంగూర్చి పురాణములందలి శ్లోకముల నిటవివరించుట సముంజసము.

౧. శ్లో॥ దక్షిణేన సరస్వత్యా । దృషద్వత్యుత్తరేణచ । యేవసంతి కురుక్షేత్రే । తేవసంతి త్రివిష్టపే॥ మహాభారతము-వనపర్వము.

౨ శ్లో॥ దీర్ఘక్షేత్రే కురుక్షేత్రే । దీర్ఘ సత్రాంతమాగతః । నద్యాస్త్రి ద్వివదద్వత్యాః । పుణ్యాయసుచిరోధస॥ వామనపురాణము.

3 శ్లో॥ తద్రత్నుకాఽరత్నుకయోః యదంతరం । రామహ్రదానాంచ భచక్నుకాశ్యచా । యేతత్కురుక్షేత్ర సమంతపంచకం । పితామహస్యోత్తర వేదిరుచ్యతే। మహాభారతము

ఇంకను ఈకురుక్షేత్రముగూర్చి స్థానేశ్వరము చూడుడు. అభిమన్యుఖేరా చూడుడు. పృధుధాక చూడుడు).

**కురుక్షేత్ర వనములు ఏడు** — ౧. కామ్యకవనము, ౨. అదితివనము, 3. వ్యాసవనము, ౪. ఫలకీ (అస్థిఖండము) వనము, ౫. సూర్యవనము, ౬. మధువనము, ౭ సీతావనము

**కురుక్షేత్ర సమంత పంచకము** (బ్రహ్మ ఉత్తరవేది) — దీనిఁగూర్చి ఇట్లుఁ జెప్పఁబడినది. శ్లో॥ తద్రత్నుకాఽ రాత్నుకయోర్యదాంతరమ్ రామహ్రదా నాంచ- భచక్నుకాశ్యచ। ఏతత్కురుక్షేత్ర- సమంత పంచకమ్। పితామహస్యోత్తరవేది- రుచ్యతే।

**కురూపిని ఎందుకు జన్మించితి వనినను రూపులను వెక్కిరించ జన్మించితి ననెనట** — ఆంధ్రలోకోక్తి

**కుర్కీహార పర్వతము** — కుక్కుటపాదగిరి చూడుడు.

**కుర్మయోశాఖ క్షత్రియులు** — క్షత్రియులు చూడుడు.

**కుర్దుజాతులు** — కుర్దుస్థాన్ దేశపు ప్రజలు. ఆర్మీనియా, మెసపొటేమియాల మధ్యసీమలు వీరి నివాస భూములు. బెర్బరు శాఖలకుం జెందినవారట. వీరియందు చాల తెగలు కలవందురు.

**కుర్రం లోవ మార్గము** — కైబరు కనుము చూడుడు.

**కులకి గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**కులగౌరవముగల ఇంటి కోతియైనను శ్రేష్ఠమే** — ఆంధ్రలోకోక్తి.

**కులపర్వతములు** — (సప్తకులపర్వతములు). వీటికి సప్తకుల పర్వతములనియు వాడుక గలదు. ఇవి ఏడు సుప్రసిద్ధపర్వతములు.

౧. హిమవతము- ఇది లోకప్రసిద్ధమైన పర్వతపంక్తి భరతదేశమున కుత్తరపు టెల్లయనిన చాలును. కులగిరులలో నగ్రగణ్యము. లోకములోనెల్ల నెత్తైన గౌరీశంకర శిఖరముం గల్గినది.

౨. నిషధపర్వతము- నిషధదేశము నార్యావ్రాంతదేశముగాన నాపర్వతపఙ్క్తియు నారాజ్యమునంటియే యుండవలసియుండును. నిషధరాజ్యమేలిన నలమహారాజు చక్రవర్తిగఁ జెప్పఁబడినవాఁడు. కాన నిషధ గొప్పరాజ్యముగ నొకప్పుడుండియుండును ఇప్పటి హిందూకుష్పర్వతము లవియేయని తోఁచుచున్నారు.

3. వింధ్యము-ఇదియు సుప్రసిద్ధపర్వతములే. వింధ్య పర్వతపంక్తి నాఁటికి నేఁటికొక్క తీరుననే యున్నది వేఱుగ వ్రాయనక్కరలేదు.

౪. మాల్యవంత పర్వతము- దీనిఁగూర్చి సరిగాఁ దెలియరాకున్నది. శ్రీకృష్ణరాయ సార్వభౌముని రాజధానిగనుండిన ఇప్పటి జీర్ణవిజయనగరమున నొక మాల్యవంత పర్వతముకలదు. ఇది చాలచిన్నది. కాన ఇదియాయని సంశయము వాడమకపోదు. దీనిపై నొక చిన్న శ్రీరామాలయము కలదు. అది బైరాగుల స్వాధీనమందున్నది. శ్రీరాముండిట నెక్కొల్లంట సీతావియోగియైనివసియుండెనట; నాల్గునెలలుండెనని చెప్పఁబడినది. దీనికి స్ఫటికశైలమనియు, ప్రశ్నవనగిరియనియు నా

మాంతరములని హేమకోశమునందు చెప్పబడి నది. కాని భవభూతి ఉత్తరరామ చరిత్ర ప్రథమాంకమున ప్రస్రవణగిరి వేఱుగను మాల్యవంతము వేఱుగను వివరించియున్నాడు.

ఇకను పశ్చిమాద్రియొక్క దక్షిణభాగమునకు అనగా కోయంబత్తూరు (పర్వత) ఖండన స్థానము (Gap) మొదలు కన్యాకుమారి అగ్రమువనుకంగల పర్వతపఙ్క్తి మలయ పర్వతమని పేరు దీనికి, మాల్యవంతమున కైమైన సంబాధముండునేమో పరిశీలనలు జరుగవలసియుండును.

౫. పారియాత్రము- శ్రీమద్రామాయణమున కిష్కింధాకాండమున ఇది పశ్చిమసముద్రతీరమని చెప్పబడినది. డాక్టరు సర్ భాండార్కరు పండితుడు పరిశీలించి వింధ్యపర్వత పశ్చిమభాగమున చంబల్నదీ ముఖద్వారమునుండి కాంబే సంయుక్తాగ్ర గుశమువఱకు వ్యాపించిన పర్వతపంక్తిగ వివరించెను ఇవి ఆరావళీ (నేఁటి ఆదర్శావళి) పర్వతములు, రాజపుత్రస్థానములోని పర్వతములును చేరియుండును. వాటి కొకప్పుడు పారియాత్రమని నామముండెనట

౬. గంధమాదన పర్వతము- టిబెట్టుదేశమున కైలాస శిఖరప్రాంత పంక్తికి గంధమాదనమని పేరు. ఇది ఘడవాలు రాజ్యము (నేఁటి అరుణోదదేశము) నంటి యున్నది. రామేశ్వరము కడ నున్న గంధమాదనము దీనిముక్కయె యని చెప్పబడినది.

౭. హేమకూటము - ఇది టిబెట్టుదేశము నందలి కైలాస శిఖర ప్రాంతమునుండి పశ్చిమదిశగా నీపర్వతపఙ్క్తి వ్యాపించిన దందురు. గంగోత్తరి, యమునోత్తరి, అలకానంద జన్మస్థానము దీని యందలివని చెప్పబడినది. హేమకూట పర్వత పఙ్క్తికి ఖండారుపుచ్ఛ మనియు పేరుకలదు. నీటికి నీలకూటముం జేర్చి అష్టకుల పర్వతములని కొందఱనియున్నారు. నీలకూటములం గూర్చి అభిప్రాయ భేదములు కలవు. కామరూప దేశమున కామాఖ్య దేవస్థానమున్నది. నీలకూటము దక్షిణదేశమున ఉదకమండలమున్న పర్వతము. నీలగిరి శ్రీజగన్నాథమున దేవాలయమున్న చిన్న మెరక తావు నీల పర్వతము

**కులము నెఱిగి చుట్టరికము స్థలమునెఱిగి నివాసము కుదుర్చు కొనదగును** — ఆంధ్రలోకోక్తి.

**కులాలచక్రన్యాయము** — కుమ్మరి చక్రముపై వ్రాలిన పురుగాచక్రముపైనుండియే దానితోఁ గూడ తిరుగుచుండును.

**కులుతదేశము** — కులిందమూడుఁడు.

**కులుతభూమి** — కులింద చూడుఁడు.

**కుల్మాష గోత్రము** — అగస్త్యఉపగణము చూడుఁడు.

**కుల్యాప్రణయన్న న్యాయము** — వ్యవసాయమునకుం ద్రవ్విన నీటికాలువ అనేక ఇతరపనుల కుపయోగించునని భావము.

**కుల్లినాన్ వజ్రము** — ఇది చాల పెద్ద వజ్రము. ౩౦౨౫ ౩/౪ రతుల బరువుండెనట. క్రీ. వె. ౧౯౦౫ లో ట్రాన్సువాలు దేశమున దొరకెనట. దీనిని ఏడవ ఎడ్వర్డు చక్రవర్తి గారికిఁ గానుకపెట్ట వారు దానిని రెండుగ గోయించి అందొకదానికి ఆఫ్రికావెలుతురని యర్థమిచ్చు Star of Africa అనియు, రెండవ దానిని తనకిరీటమునందే నాయకమణిగ నుండ జేసి పేరిడిరట.

**కువలయాశ్వమహారాజు** — ఈతఁడు సుధన్వదేశవాసియగు ధుంధుఁడను రక్కసుని వధించినవాఁడు. ఈతఁడు శ్రీరాముని పూర్వులలో నొకఁడగు నికుంభనృపతికి ముత్తాత

యనియుఁ జెప్పఁబడినది. (అంబరీషపురరాజ్యము చూడుఁడు).

**కువలయాశ్వుఁడు** — ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి బృహదశ్వుఁడు. ఇతఁడు దుంధుఁడను రాక్షసుని జంపి దుంధుమారుఁడని పేరందినవాఁడు మరియుం గాశ్యుని సంతతి యందు వత్సుని సుతుఁడొక కువలయాశ్వుఁడు కలఁడు. ఇతని సుతుఁడు అలర్కుఁడు. ఇతఁడు పాతాళకేతుఁడు (తాళకేతుఁడనియును) అను రాక్షసుని చంపినవాఁడు. ఇతనికి ఋతుధ్వజుఁడని నామాంతరము కలదు. ఇతనికి శత్రుజిత్తను కుమారుఁడు కలఁడని పేరొకచోఁ గానవచ్చెడిని. ఇతనికి గాలవర్షి కువలయాశ్వమను గుఱ్ఱము నిచ్చెను. అది సమస్తలోక దేశములందును, పర్వతాగ్రములను, నీటిపైని నాకాశమున సంచరింప గలదగాన కువలయాశ్వమనిపేరు. దానినెక్కి పెల్లతావులం దిరుగుచు మదాలస యను యప్సరను గాంధర్వ వివాహమయ్యెను.

**కుశనాభుఁడు** — అత్రి సంతతి. చంద్రవంశము. తండ్రి కుశికుఁడు. సోదరులు కుశాంబుఁడు, అమూర్తరజుఁడు, వసువు అనువారలు. కుమారుఁడు గాధిరాజు. మనుమఁడు విశ్వామిత్ర మహర్షి.

ఇతని పుత్రికలు నూర్వురు. వారందఱు వాయుశాపముచే కుబ్జలు కాగా వారినందఱిని (చూళియను ఋషికిని, సోమదయను గంధర్వకును పుత్రుఁడై జనించిన) బ్రహ్మదత్తున కొసంగి పరిణయ మొనర్చె నాతఁడు తనచేఁ బొసఁగ్చి కుబ్జత్వముం బోగొట్టి, వారివలన సంతానముం బడసెను. వారే కన్యాకుబ్జులు. ఆ దేశభాగమునకు కన్యాకుబ్జ దేశమని పేరయ్యెను. గాధిరాజు, విశ్వామిత్ర మహారాజు లేలిన దేశమిదియే. (కన్యాకుబ్జదేశము చూడుఁడు).

**కుశప్రస్తము** (నాసిక్రప్రస్తము)- సామంతపంచకము చూడుఁడు.

**కుశమిశ్ర గోత్రము** — విష్ణువృద్ధ [illegible]పగణము చూడుఁడు.

**కుశలహస్తము** — హస్తాభి నయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.

**కుశస్థలి** — ఆనర్త దేశమున ఇక్ష్వాకు సోదర పుత్రుఁడగు ఆనర్తభూపతిచే నిర్మింపఁబడిన (రాజధాని) ఆనర్త పురమునకు కుశస్థలి యని పేరు దాని తావునన శ్రీకృష్ణుండు పిదప ద్వారకను నిర్మించెను. హరివంశము ౧౧౩ చూడుఁడు. (ఆనర్తదేశము చూడుఁడు). కొందఱు కుశావర్తమనియు ననుచుండిరట.

మఱియు ఉజ్జయనికిం గూడ నీపేరు కలదు. (కన్యాకుబ్జపురము, ఆనర్తదేశము చూడుఁడు).

**కుశాగారపురము, పాటలీపుత్రము** — మగధదేశము చూడుఁడు.

**కుశాగ్రుడు** – అత్రి, చంద్ర, పూరువు, కురు, బార్హద్రథసంతతి క్షత్రియుఁడు, తండ్రి బృహద్రథుఁడు, సోదరుఁడు జరాసంధుఁడు.

**కుశాపురము** — కుశాభవపురము అయోధ్య రాష్ట్రమున కుంభీనదీతీరము నందిప్పుడు సుల్తాన్పూరను పేరం బరగుచున్నది.

**కుశావతి** — తొల్లింటి ఆనర్త. ఇప్పటి గుజరాతులోని ద్వారకాపురమునకు కుశావతి యని పేరు. (ఆనర్తదేశము చూడుఁడు).

శివపురాణము ౬ పటలము, ౭౦ అధ్యాయమున దీనిప్రశంస కలదు.

**కుశావర్తము** — బొంబై రాజధాని నాశికజిల్లాయందలి త్రియంబకమున నొక పవిత్ర సరస్సునకుం గుశావర్తమని పేరు.

మఱియు హరిద్వారమునందు గంగాతీరమున పిత్రర్పణలు సలుపు ఘట్టమునకును కుశావర్త మందరు ఇది ఆ దూరుసంస్థానమువారిచే నిర్మింపఁబడినది.

**కుశావార్‌పురము (దేశము)** — శ్రీరామ ని సుతుం డగు కుశభూపతి కీయంబడి, అయనచే నీపురము నిర్మింపంబడెనట. ఇట్లే లవభూపాలున కొసంగబడిన దేశమున లవపురము (ఇప్పటి లోహవార్) నిర్మింపఁబడెనట. కుశావార్పురమున అదిని పంద్రెండుగర్గములు నిర్మింపఁ బడెనటగాని, ఇక్కాలమున నేడుమాత్రము గానవచ్చుచున్నవి. అన్నియు పాడువే. ఇప్పుడు పంజాబునందలి ఫిరోజపూర్ ప్రాంతము విపాశానదీ తీరము (ఇప్పటి బియాసునది) మహమ్మదీయాక్రాంతమై, మశీదలు గోరీలతో పరిసరములు నిండియుంట తొల్లింటి చుట్టుకొలతలు తెలియరాకున్నవి. హూణకొస్క్యాగు దీనిం దర్శించెగాని పై సంగతులు తనయాత్రాచరిత్రమున వ్రాయలేదు. (లోహావార్ చూడుఁడు. లాహోరునగరము పంజాబుదేశము చూడుఁడు)

**కుశిక గణము** - ఇది విశ్వామిత్ర సంతతియందలి యొక గణము. ఇందు ౭౫ గోత్రములు కలవు.

బోధాయన సూత్రోక్త గోత్రములు (౪౩)- ౧. ఆభిన్న, ౨ అనూతి ౩. అకఘువ్య, ౪. ఉత్సరి, ౫. ఉద్దరి, ౬. ఔదరి, ౭. ఔపదహని, ౮. కామంతక, ౯. కాలాయన, ౧౦. కుశిక, ౧౧. కౌశిక, ౧౨ చింతిత, ౧౩. చిత్రంతవి, ౧౪. చైత్రేయ, ౧౫. జాబాలి, ౧౬. తారకాయని, ౧౭. తాలవత, ౧౮. దర్భజంఘ, ౧౯. బద్ధకఫ, ౨౦. బాభ్రవ్య ౨౧. భాష్టకి. ౨౨. భౌవని, ౨౩. బృహదగ్ని, ౨౪. మండూకర. ౨౫. మాణి, ౨౬. మాంతవ, ౨౭. యమదూత, ౨౮. యాజ్ఞవల్క్య, ౨౯. రాఘుహి, ౩౦ రాలవి, ౩౧. లామకాయన, ౩౨. లోకాగార, ౩౩. హిరక్ష్య, ౩౪. హిలకాయన, ౩౫. విలంకు, ౩౬. శాంకాయన, ౩౭. శ్యామేయ, ౩౮. శాలజ్కాయ, ౩౯. శ్వేతక్యంతాయన, ౪౦. శ్వోవల, ౪౧ సాగతీయ, ౪౨ సామత్య, ౪౩. సౌశృతి.

అపస్తంభ సూత్రోక్త గోత్రములు (౧౦)- ౧. ఉలూతబభ్రు, ౨ ఔలోకి, ౩. కావేపావ, ౪. చారకి, ౫. తతు, ౬. దేవరాత, ౭. మను, ౮. వాలఖిల్య, ౯. విశాల, ౧౦. శాల.

హిరణ్యకేశి సూత్రోక్త గోత్రములు (౪)- ౧. ఊర్భకి, ౨. యజ్ఞవాన్. ౩. శాలావతి, ౪. సాంశివ్య.

మాత్స్య సూత్రోక్త గోత్రములు (౧౪)- ౧. అశ్వతాపన, ౨. ఔలోక్య, ౩. కారీషి, ౪. గవల, ౫. పాడలి, ౬. పార్ష్ణి, ౭. ప్రాశోదరి, ౮. వలశంకు, ౯. వైకృతి, ౧౦ శ్యామాయన, ౧౧ సంశృత, ౧౨. సంశృత్య, ౧౩. సైంధవాయన, ౧౪. హిరణ్య.

ఇతర గ్రంథోక్త గోత్రములు (౪)- ౧. అశ్వలాయన, ౨ శోమపేయ, ౩. సౌరథి, ౪. క్షీరి.

ఈ కుశిక గణము నందలి ౭౫ గోత్రములకుఁ బ్రవర (౧). ప్రవర- విశ్వామిత్ర, దైవరాత, ఔద్దాలక. (త్ర్యార్షేయ ప్రవర).

**కుశికగోత్రము**— అఘమర్షణగణము చూడుఁడు.

**కుశిక గోత్రము లేక కౌశిక గోత్రము** — కుశికగణము చూడుఁడు.

**కుశికుఁడు** — అత్రిసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి బలాకేశ్వుఁడు. పుత్రులు కుశాంబుఁడు, కుశనాభుఁడు, అధూర్తరజుఁడు, వసువు అనువారలు.

**కుశీద గోత్రము** — కపిశపగణము చూడుడు

**కుశీలవుఁడు** — తండ్రి మైత్రేయుఁడు.

**కుశుఁడు** — శ్రీరాముని సుతుఁడు. కుశుఁడు క్షత్రవృద్ధుని రెండవసుతుఁడు కుశుఁడను పేరుగలవాఁడే. క్షత్రవృద్ధుని పెద్దకొడుకు సుహోత్రుని రెండవ సుతునకును ఈపేరే. యదువంశక్షత్రియుఁడగు విదర్భుని కుమారుఁడీపేరిటివాఁడే.

**కుశ్వాహా రాజపుత్రులు** — వీరు క్షత్రియులు. సూర్యవంశస్థులలో నగ్రశాఖవారు శ్రీరాముని యగ్రసుతుఁడైనందున కుశుని సంతతివారు ఉదయపూర్ సంస్థానాధీశులగు మహారాణా ఆఫ్ మేవాడ్ ఈకుశ్వాహా రాజపుత్ర క్షత్రియులందఱిలో నగ్రగణ్యుఁడనఁబడుచున్నాడు వీరికిక్షత్రియులందఱుఅనగాసూర్యవంశక్షత్రియులు వయస్సుఁబాటింపక వందనమొనర్చు నాచారము కలదు. సుప్రసిద్ధమగు చిత్తూరుముట్టడి, పద్మినిదేవిస్మృతి మొదలగు శౌర్యపుచర్య లీసంస్థానాధీశుని కుటుంబపుచర్యలే .

**కుషానువంశనృపతులు** — కిర్మానుకు తూర్పుగానున్నసీమ కుషానుదేశము. కుషానునృపతియగు కుజుల్కత్విపిస్ అను నృపతి మొట్టమొదట పహ్లావులలో కడపటివాఁడగు సంబరీస్ అను భూపతినోడించి ఇప్పటి పంజాబుదేశ భాగములగు క్రిపి అరాటదేశముల భాగముల నేలెనని చెప్పఁబడినది క్రీ శ. ౧౫౫-౩౨౦ కాశ్మీరదేశమేలిన కనిష్కమహారాజు ఈకుషానుభూపతియె. (శకద్వీపదేశము చూడుఁడు, క్రివి లేక అరాటదేశము చూడుఁడు).

**కుష్ఠురోగము** — సవాయిరోగము ముదిరి కుష్ఠురోగముగా పరిణమించునని పెక్కండ్రు తలంచుచుండిరి గాని, ఇటీవలి పరిశీలనల నుండి కుష్ఠురోగకారణమగు సూక్ష్మజీవి (bacellus) వేఱని యు, ఇది ప్రత్యేకమగు స్వతంత్రరోగమనియుఁ బయల్పడినది ఇది అంటువ్యాధి. దీని సూక్ష్మజీవి దళమైన కవచముఁగల్గి కణికవలె నుండును. వీటికిఁ గుష్ఠ సూక్ష్మజీవులు లేక సూక్ష్మాణువులు అనిపేరు. ఆంగ్లమున Leprosy Basillus అనిరెదరు.

కుష్ఠురోగము భరతదేశమున చిరకాలము నుండి కలదు. పురాణములందు శ్రీకృష్ణుని సుతుఁడగు సాంబుఁడనువాఁడు ఘోరపాతకమొనర్చి ఈ వ్యాధికి పాల్పడి సూర్యునిఁగూర్చి ఎండయందు తపమాచరించి నివృత్తిఁగాంచెనని చెప్పఁబడినది.

ఈ మహావ్యాధి ఉష్ణప్రదేశముల నధికముగ వ్యాపించునని ఆంగ్లవైద్యులనుచున్నారు. మరియు నిరువది సంవత్సరముల లోపువయస్సుగల బాలురును, ముప్పది సంవత్సరములకుఁ బైఁబడినవారును యీవ్యాధికి సులభముగ పాల్పడిరని చెప్పుచున్నారు. ఎక్కువను విటమినులు లోపించిన యాహారములం దినుచుండువారును, అజీర్తిరోగము, సవాయిజబ్బు, శీతపైత్య జ్వరములచే లొంగిపోయిన శరీరములు కలవారును ఈ ఘోరవ్యాధి కతిసులభముగ సోకినట్లోడనే పాల్పడుదురని పరిశీలకులనుచున్నారు

ఇది వంశానుగతముగ సంభవించు వ్యాధియగునా ? కాదా ? యను సంగతి నిర్ధారణ చేయఁబడలేదని కొందఱు వైద్యులును, ఇది వంశపరంపరగ నంటు వ్యాధికానేరదనియు, రోగియొక్క సంతానమును, జన్మించినపిదప సాధ్యమగునంత త్వరగ, వేఱుపఱచి పరిశుభ్రపఱచుచు (Segregate) పెంచిన నాపసిపాప కారోగమంకురింపఁజాలదని కొందఱును, అనుచున్నారు

ఆయుర్వేద వైద్యవిధానమున బొల్లిఁగూడ కుష్ఠుజాతులలోఁ జేర్చి, శ్వేతకుష్ఠు అని పేరిడియు .

న్నారు. తక్కినజాతి కుష్ఠురోగమును రక్తకుష్ఠనియు, పెద్దరోగమనియు ననిరి. ఆంగ్లవైద్యవిధానమున, రక్తకుష్ఠునే కుష్ఠురోగముగనెంచి దానికాంగ్లమున Leprosy అని పేరువాడిరి. ఇయ్యది రెండు ముఖ్యభేదజాతులుగను, ఒకమిశ్రజాతిగను కలసి మూడుజాతుల రోగముగ ఆంగ్లవైద్యవిధానమున నేర్పడినది. అందు మొదటిది చర్మగత కుష్ఠు. ఇది Infectious జాతికిం జెందిన యంటు వ్యాధి. (అంటువ్యాధులు చూడుడు). దీని పని యంతయు శరీరపు చర్మమునందలి tissues నందే జరగుచుండునట. రెండవది శరీరమునందలి నాడులకంటి వాటిమూలస్థానములందు స్థిరపడి శరీరమున వ్యాపించురోగము. దీని నాంగ్లవైద్యులు, Noninfectious type గాఁ జెప్పియున్నారు పైరెంటి సంకరముగ నుత్పన్నమైనవ్యాధి మూడవజాతిది. దీనిని Mixed type అని వివరించిరి.

రోగము తగిలినదాదిగ- బయల్పడుటకైన మధ్యకాల మాంగ్లవైద్యవిధానమున Incubation period అనంబడును. ఇది మూడు మొదలారు వత్సరములవఱకని చెప్పంబడినది. రోగము బయల్పడగనే శరీరమునం దచ్చటచ్చట అందు ముఖ్యముగ ముఖమందు చెవులయందుగుంపులుగ నేర్పడి పల్లికలవలె నుబ్బినట్టి మలినచిహ్నములుగ రోగపుమచ్చలు పొడచూపి క్రమముగ చర్మము లేగి పుండగుటయు, చర్మగత వ్యాధియందు సంభవించును. ఇంక నరములనంటిన వ్యాధియందు చర్మము రంగుచెడుటయు, అట్టి తావులందు చైతన్యముతగ్గి మొద్దుబారుటయు లక్షణములు. క్రమముగ శరీరభాగములు గాని కండరములు గాని రాలిపోవుట ప్రారంభమగుచుండును.

కుష్ఠురోగము అన్యులశరీరములకు వ్యాపించుటకైన కారణములు, విధానము, ఇదమిత్థమని స్పష్టముగఁ దెలియరాకున్నను, గొప్పపరిశీలనలలోన ఘనవైద్య లీక్రిందిసంగతులను వివరించియున్నారు. ఈ బేసిలస్ పరిమాణమునందును, ఆకారమునందును, మాలిన్యముంగల్గించు ప్రతీకారకార్యము (reaction) నందు ఉబ్బసపు జాడ్యపు సూక్ష్మజీవి (Tubercle) వలె నుండునని మనసునకుంచుకొనుటమేని, రోగిశరీరమునుండి, వేఱు శరీరముకుం జేరి యటవృద్ధినందుటకు కొన్ని యనుకూల పరిస్థితు లవసరియుండవలయునని తెలియక పోదు. లోనికిం జేరుట నాశికేంద్రియముగుండా నైనం గావచ్చును, నోటిగుండానైనంగావచ్చును. కురుపులు, గోకుడుపుండ్లు మొదలగు నైసర్గికములుగాని మార్గములగుండానైనం గావచ్చును. ఒక్కసంగతి నిజమని చెప్పవచ్చును. రోగి శరీర స్పర్శ సాబాధములుండిన వ్యాధియంటుట కేమియభ్యంతరము యుండజాలదు ఒకటి రెండు సూక్ష్మజీవులు(Bacelli) మాత్రము క్రొత్తశరీరమునందుమని, యభివృద్ధినంది రోగమునుద్భవింప జేయుంజాలవనియు, రోగి దేహమునందలి సూక్ష్మజీవులలో ప్రతిసూక్ష్మజీవియు రోగముం గల్గించు శక్తియందు, తగ్గిపోయియుండదనియుఁ బరిశీలనల వలన తేలియేయున్నది. సూక్ష్మజీవులు రోగి కురుపులలోని ద్రవములందుండుంగాన పైనివ్రాలిన ఈఁగలు రోగులంగరచిన నల్లులు రోగవ్యాప్తికిం గారణములు గావచ్చును. మరియు నాహారపదార్థములతో, జీర్ణకోశమునకుం జేరి, బలపడినచో రోగముంగల్గించి వ్యాపింపంజేయవచ్చును. భరత దేశమునం దీరోగమంటినవారైమలక్షలకు పైగా గలరట.

ఈ రోగ మనివార్యమని (Incurable) తలంపంబడుచుండినది. ఇటీవలి పరిశీలనలు, రోగ

ప్రారంభదశయందు కుష్ఠు బాగుచేయగుదని స్పష్టపడుచున్నది. చికిత్స మొదలి ప్రథమ కార్యము, రోగమంటుటకైన మూలకారణములను, ఇతర రోగములను దూరముగ దొలగించుటయని చెప్పబడినది. ఇంక నాంగ్లవైద్యవిధానమున పరియగు చికిత్స Chaulnoor oil అనబడు తైలము ప్రధానద్రవ్యముగా సంయుక్తపఱచిన యౌషధములను లోనికి పిచికారి (injection) మూలమునను పైకి లేపనముగను ఇచ్చుచుండుట మేలని యందురు.

ఇంక నిట్టి ఘోరవ్యాధులను దర్శనముల రోగము వశమునందుంచుకొనుట ముఖ్యముగాన దీనిని మితిమీరనీక యుంచుటయు, సంపూర్ణముగ నిర్మూలించుటయు నత్యావశ్యకములని తెలుపబడు చున్నది. కుదర్పగల వ్యాధులను వదలుచు నుంచుకొని నైష్ఠికముగ జయప్రదముగ చికిత్స సాగించవలెనని ఆంగ్లవైద్యవిధానమునందు ఉక్తి కలదట. బలాత్కారపు పంక్తి (Compulsory Segregation) ఇప్పుడెంత అవసరమని చెప్పనొప్పినను, ప్రారంభదశయందే నిర్బంధముగ నీవ్యాధి వ్యాపింప విలుగలదు. ఇంకను రోగుల సంతానపదలు, ఔన్నత్యాధికారములు, వారి నడవడిలో స్వేచ్ఛగ తిరుగనిచ్చుటయు, అనగా జనసమూహములలోనికి వారిని అటునిటు పనుప నీ లియ్యకుండుటయు, రోగవ్యాప్తికి కారణము లగుచుండెడిని. ఇట్టిసందర్భములందు ప్రజాభిప్రాయమును జాగ్రత్తకై యుద్బోధించి మరల్చుట కర్తవ్యమని ఆంగ్లవైద్యులు తలంచుచున్నారు. (సూక్ష్మజీవులు, అంటువ్యాధులు చూడుము.)

**కుస్తానరాజ్యము** — తూర్పు చీనా టర్కీస్థానమునం దిప్పుడు ఖోతా ననబడుచున్న రాజ్యము చీనావారు Yu (Jade) tion అనుచున్నారు. దీని నాకను కుస్తానా యందురు. దీనిని షాహిదూరను ద్వీపమున యార్కాన్ పూర్వపురాజధాని కోస్తానునకు పశ్చిమముగా నున్నది. (స్థానదేశము చూడుము).

**కుసుంబపూవుచెట్ల వ్యవసాయము** — వీటి జన్మస్థానము భరతదేశమని కొందఱును, ఆఫ్రికాఖండమని కొందఱును, ఉభయదేశములు నని కొందఱును అభిప్రాయభేదములు గల్గియున్నారు. భరతదేశమున చాలా తక్కువగను, ఐరోపా దక్షిణదేశములందు ఒకమోస్తరుగను, చీనాదేశము దక్షిణ ఆసియా దేశములందు విరివిగను నది పైరుచేయబడు చున్నది.

ఇందు మూడు రకముల జాతులు గలవు. బొంబై రాజధానియందు ఒకజాతి నూనెకును, వేఱొకజాతి రంగులకును పైరుచేయబడుచున్నది. రంగులజాతి పూవులు నారింజపండు వర్ణపు రెక్కలు గల చూడఁ ఆకులు ముళ్లులేనివి. బొంబై రాజధానిలోని అహమ్మదునగరు, పూనా, సతారా, ధార్వారు, బెళగాం, బిజాపూరు జిల్లాలయందు ౨,౦౦,౦౦౦ ఎకరము లీమొక్కలు పైరుచేయుచున్నారని తెలియుచున్నది. ఇంకను కర్ణాటక, దక్కన్ భాగమున నిర్వచనాయము కలదు. ఆకులు ముండ్లు గల్గియుండు ఇతరవ్యవసాయముల పొలములందు చుట్టు నీచెట్లను రెండు మూడు వరుసలుగ నాటిన పశువులు మేయ వెఱచెడిని.

కుసుంబ తైలము నిలలకుండ బాగుండును. ఆకులు కాడలు పండబారినపైని వేళ్ళతో పెల్లగించి మూడు నాలుగు దినము లెండపైని గింజల రాలగొట్టుదురు. గింజలంగు పాతికవంతు నూనె వచ్చును. అది భోజనోపయోగమైనది. నువ్వుల

నూనెవంటిది. పిండి (పుచ్చు) పశువులకాహారమై యున్నది.

**కుసుంబా చెట్టు** - లా. Carthamus tinctorius. ఆంగ్ల. Bastard saffron tree. సం. కుసుంభః, గ్రామ్యకుంకుమం, పాతక, వహ్నిశిఖ. కుసుంబాచెట్టు పూవులతో బట్టలకు రంగు (ఛాయ) వైచెదరు. దానికిం గుసుంబా రంగని పేరు. కాననే దీనిని కొన్నితావులందు కుసుమవృక్షమని వాడుటయుం గలదు.

దీని విత్తులనుండి తీసినతైలము పైకి మర్దనా చేసిన మేహావాతకొప్పులు, వాతనొప్పులేగాక పక్షవాతమును నివారణమగును. దుష్టవ్రణములు మానును. విత్తులను నీటితోనూరిన గడ్డలు హరించును. ఎండించిన పూవుల చూర్ణము కామిలరోగము నివారించును. దీనియాకులు కూర చేయుదురట గాని, అది వేడిచేసి అమపైత్యముల నుద్రేకించును.

**కుసుంభుఁడు**- అత్రి, చంద్ర, పూరువు, కురుసంతతి క్షత్రియుఁడు. ఉపరిచరవసువు కుమారుఁడు, సోదరులు బృహద్రథుఁడు, మత్స్యుఁడు, ప్రత్యగ్రుఁడు, చేదిషుఁడు.

**కుసుమపురము** — పాటలీపుత్రము చూడుఁడు.

**కుసుమరోగము**— ఇది స్త్రీలకుగల్గు రోగము, (అసృగ్దరము చూడుఁడు).

**కుసుమాంజనము** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున ఇత్తడింగాల్చి కొట్టుతరి రాలిన పొడికి కుసుమాంజనమని పేరు.

**కుస్తీ (ఆంగ్ల విధానము)** — కుస్తీ భరత దేశమునకుం గ్రొత్తవిద్య కాదు. ఈ వ్యాసమున పాశ్చాత్యవిధానము వివరింపఁ బడును. కుస్తీకి ఫలితము కుస్తీ పట్టుటకు డీకొనువారిద్దరిలో నొకరి నొకరు నేర్పు గఁబట్టుకొని నేర్పున దాటిపోనీక స్వాధీ



నమునం దుంచుకొనుట, అనగా లొంగునట్లుం జేయుట యని భావము. దానికాంగ్లమున Catch as the catch can అని పేరిడి యున్నారు. అట్టి పట్టు సిద్ధించుటకు వలసిన ఇతర పరిస్థితులు బొమ్మయందు జూపఁబడినవి. కుస్తీ పందెములు పదునారడుగుల చతురపు దళముగు చాపంబఱచి జరుపుదురు. రోమను విధానమున నేలంబడుట పట్టువదుట వంటిదేయని చెప్పఁబడినది.

**కుహకచకితో లోకః సత్యేఽపి అపాయమపేక్షతే** — కపటుని యందు (కృత్రిమ) శొందరగల జనుఁడు (అనగా ఆతురత గల వాఁడు) సత్యము అయినను అపాయముగఁ దలచు వాఁడగును.

**కుహవ గోత్రము** – శండిల గణము చూడుఁడు.

**కుహూదేశము** – ఇప్పుడు కాబూల్ (ఆఫ్ఘను స్థానమున) నది యనంబడు నదికి తొల్లింట కుహూయనియు, కుభాయనియుం బేర్లు. ఆప్రాంత దేశమునకు దీనికి కుహూదేశమని పేరు. అచటి ప్రజలకుం గుహూలని పేరుండెను. పురాణకాలము నందిది యుండెనని తోచెడిని. మత్స్యపురాణము ౧౨౦ అధ్యాయ శ్లోకమునను,

౧౧౩ అధ్యా ౨౧ శ్లోకమునను సింధునది కుహూదేశమున నుండునని చెప్పబడినది.

**కుహూదేవి** — భర్త ధాత (భృగు మహర్షి పుత్రుడు. తల్లి ఖ్యాతి). సవతి పేరు యతి. సవతి కుమారుడు మృకండర్షి.

**కుహూనాడి** – అష్టాంగ యోగములు చూడుడు.

**కులింద (కులుత,కునింద) దేశము**– (కులుతిభూమి, కులకుకోలుత దేశము) బృహత్సంహిత ౧౪ యందు విపాశ (ఇప్పటి బీయాస్ నది) పై భాగమున కులుత దేశమని యున్నది. అనగా కాంగ్రాజిల్లాలోని కులూభాగమని అర్థము. మరియు గునిందయనియు నాదేకలరు. మహాభారతము సభాపర్వము ౨౭ అధ్యాయమున పై భాగమున గంగాశతద్రునదుల మధ్య భూమి కులింద దేశమని చెప్పబడినది ఇందు కులు అనబడు Himalayan tharai ప్రదేశము కలదు. కులింగులు హిమాలయ దక్షిణభాగముల నెత్తగు పర్వతచరియపరిసరముల నేపాళము వరకు నివసించువారని Journal of Royal Asiatic Society of Bengal 1908; P.3:6 యందు కలదు. కొందఱు పరిశోధకులు ఒకప్పుడు గఢవాలు సంస్థానభాగము సహారాన్పూరుభాగమిందుండెనని తలంచుచున్నారు. ఇప్పుడు కులు ఉన్న ప్రదేశము కులుతభూమియని వాడుకయుండెనని ప్రతీతి కలదు. రాజధాని నగరకోట.

చంద్రానది, భాగానది కలియుతావున దిగువ ౩౨ మైళ్లదూరమున చంద్రభాగ ఎడమవొడ్డున కూంకడయను గ్రామముకడ నొక పర్వతముపై త్రిలోకనాథ దేవస్థానము కలదు. ఇది అవలోకితేశ్వర విగ్రహమని బౌద్ధులందురు. అత్తావునకు కులకుకోలుకయని పేరనియు, (ఇది కులు శబ్దసంబంధ మేమో) జలంధరుపురమునుండి ౧౧౭ మైళ్ల కిదేశము ఈశాన్యదిశగా నుండునని కన్నింగ్హామ్ పండితుడు వ్రాసెను.

**కువలీ మహారాజు**— సూర్యవంశ క్షత్రియుడు. తండ్రి ఇక్ష్వాకుమహారాజు. సోదరులు నిమి,దండుడు, విశాలుడు. కుమారుడు వికుక్షి మహారాజు. రాజధాని అయోధ్య.

**కుక్షు గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**క్రుము నది** — కాబూలు నదియందు సంగమించు (జలాలాబాద్ వద్ద) కునార్ నదిగను, కుర్రమునదిగను అనుమానించుచున్నారు. దీని ప్రశంస ఋగ్వేదమున ౧౦-౭౫ నదీస్తుతియందు కలదు.

**క్లుప్తపఱ్చబడిన ఆంగ్లరూపములు**- భరత దేశమున సర్వసాధారణముగ వాడుక నందియున్న ఆంగ్లపదములలో క్లుప్తపఱ్చబడిన రూపములు గల వాని నట్టి వాడుటయుం గలదు. కాన వాటిని దెలియుట సముచితము.

Abbr. - Abbreviated క్లుప్త పఱుపబడిన రూపము

Abp.—Archbishop.

Acr.- Acre ఎకరము.

A.C Ante Christum or Before Christ క్రీస్తునకు పూర్వ మని యర్థము.

A. D—Anna Domini or in the year of Our Lord- క్రీస్తు వెనుక నని యర్థము.

A. D. C- Aide de Camp- దీనిని ఎయిడి కాంపు అనియు వాడుదురు. శరీర రక్షకోద్యోగి యని భావము.

Ad. fin—Adfiaem- To the end- కడవఱకు

Ad. lib - Ad libitum. At discretion యుక్తమని తోచినరీతి నని భావము.

Ad. inf.—Ad infinitum కడవఱకు నట్లేనని. భావము.

Aet.—Aelatis Aged- వయస్సు మీరిన యని యర్థము.

A.F A—Associate Faculty of Actuaries.

A. H—Anno Herira- (హిజ్రా) సారిపో యిన సంవత్సర మని, మహమ్మదు వారు మక్కా నుండి మదీనాకు పలాయనమైన వత్సర మని భావము.

A. I A-Associate Institute of Actuaries.

A. M- Anno mundi - years of the world. సృష్ట్యాది వత్సరసంఖ్యకు దీనిని వాడుచున్నారు.

A. M- Ante Meridiem - ఆ దినమున మధ్యాహ్నమునకుం బూర్వమని భావము. అనగా రాత్రి పండ్రెండు గంటలకు రోజు ప్రారంభముగాన అది మొదలు పగలు 12 గంటలవఱకు ఆంగ్లమాసమున A.M. అనియు, అది మొదలు తిరుగ రాత్రి 12 గంటల వఱకు P. M. అనియు వాడుచున్నారు. (P. M. చూడుడు).

A. M. I. C. E. - Associate Member of Institute of Civil Engineers.

A. M. I. E. E- Associate Member of Institute of Electrical Engineers.

Amen - తథాస్తు- అట్లగుగాక (దీవన).

Anon- Anonymous- అనామధేయముగు.

Ans- Answer- ప్రత్యుత్తరము.

A. O. D- Ancient Order of Druids.

A. O. F- Ancient Order of Foresters.

App - Appendix- అనుబంధము - తరువాత చేర్పంబడినది.

A.R.A-Associate of Royal Academy.

A. R. A. M - Associate of the Royal Academy of Music.

A.R C.O- Associate of Royal College of Organists.

A. R. I. B. A- Associate of Royal Institute of British Architects.

A. R. S. A- Associate of Royal Scottish Academy.

A. U C- Auno urbis conditoe- From the foundation of the city of Rome- రోమకపురి ప్రారంభకాలమునుండి.

Bart or Bt - Baronet.

B. C. - Before Christ- క్రీస్తు మునుపు (A. D చూడుడు).

Bot- Botany లేక Botanical.

C లేక c. - Cent అనియు, Centimes అనియు, Centigrade అనియు (ఫారెన్హీటు మీటరు) మూడర్థములు.

C - Roman numeral for one hundred.

C. A. - Chartered accountant- శాసన నియుక్తుండైన అంకశాస్త్ర, గణితశాస్త్ర పండితుండు. శాసన నియమితుండైన లెక్కగాండు.

C. B. - Companian of Bath (order of).

C. E. - Civil Engineer- సివిల్ ఎంజనీయర్

C. I. - Imperial order of the Crown of India

C. I. E. - Companion of the order of Indian Empire.

C. M. G. - Companian of the order of St. Michael & St. George.

&. - And- మరిన్ని అని యర్థము.

Co. - Company- సంఘమువారని యర్థము.

Con. or Contra -Contrary యొక్క క్లుప్త రూపము-in opposition.

Cr. - Credit జమవ్రాయుటకును, Creditor అప్పునిచ్చినవాండనియు రెండర్థములు.

C. S. - Custos sigitli - Custodian of the Seal

C. S. I - Companian of the order of Star of India.

Cycl - Cyclopaedia- విజ్ఞాన సర్వస్వము.

D. C. L—Doctor of Civil Laws.

D. D—Doctor of Divinity (Divinitatis Doctor)

D. G—Dei gratia- By the grace of God అని యర్థము.

Do.— Ditto- the Same అని యర్థము

D. Ph - Doctor of Philosophy.

Dr.—దీనికి డాక్టరు (వైద్యుడు, పండితుడు) అనియు Debtor అప్పుతీసికొనిన వాడనియు నర్థము.

D. Sc - Doctor of Science

D. V. - Deo Volente - If God willing అని యర్థము.

E. &. O. E - Errors and Omissions Excepted.

Ed - Editor, Edition.

E. G - Exempli Gratia- for example.

Encyc - Encyclopaedia.

Esq - Esquire.

Etc. - Etcaetera మొదలగునవి, and so forth.

Fahr- Fahrenheit (Thermometer).

F. D - Fidei defensor - Defender of the Faith.

F. F- Fellow of the Faculty of Actuaries.

F. G. S - Fellow of the Geological Society.

F. H. S - Fellow of the Historical Society.

F. R. C. O - Fellow of Royal College of Organists.

F. R. S-Fellow of the Royal Society.

F. S. A - Fellow of the Society of Antiquaries of Arts.

G. C. B - Knight Grand Cross of the Bath.

G. C. M G- Knight Grand Cross of St. Michael and St George.

G. C V. O- Knight Grand Cross of the Royal Victorian Order.

Gent- Gentleman.

Geog- Geography.

Geom- Geometry.

G. M T- Greenwich mean time.

G. P. O- General Post Office.

Gr- దీనిని Greek అనియు, Grains అనియు, Gross అనియు మూడర్థములుగ నుపయోగింతురు.

G. R- Georgius Rex-King George అని యర్థము.

H. M- His Majesty యనియు, Her Majesty యనియు కూడ వాడుచున్నారు.

H. M. S-His లేక Her Majesty's service అని యర్థము.

H. R H- His Royal Highness.

Ib, Ibid- Ibidem- In the same place అని యర్థము.

i. e- Id est- that is అని యర్థము.

Incog- Incognito- unknown ప్రచ్ఛన్నముగ.

Inst- Instant, present month ఈ నెల.

I. O. U- I owe you నేను మీకు బాకీ యున్నానని యర్థము.

J. P- Justice of Peace.

K. B- Knight of the Bath.

K. C- King's Counsel.

K. C. B- Knight Commander of the Bath.

K. C. M. G- Knight Commander of St. Michael and St. George.

K. C. S. I- Knight Commander of the Star of India.

K. G- Knight of the Garter.

Kil- Kilometre పరిమాణము.

Kilo- Kilogramme.

K. P- Knight of St. Patric.

Kt. లేక Knt- Knight.

L- Roman numeral 50.

Lat- Latitude లేటిన్ భాషకు కూడ వాడుచున్నారు.

Lb- Pound weight పౌను (40 తులముల) బరువు.

L. C. J- Lord Chief Justice.

Lib- Leber- a book పుస్తకమని యర్థము.

L. L. D- Doctor of Laws.

Lon- Longitude.

Long- Longitude.

Loq- Loquitor మాట్లాడుచుంట కర్థము.

Ltd- Limited (limited liability).

M- Roman numeral for 1000.

M. D- Doctor of medicine.

M. E- Mining Engineer.

Mem- Memorandum.

M. Inst. C. E- Member of Institute of Civil Engineers.

M. M. O. - Madame.

Mngr - Monsignor.

M. O. - Money order.

M. P. - Member of Parliament.

M. R. C. S.-Member of Royal College of Surgeons.

M. R. C. V. S - Member of the Royal College of Veterinary Surgeons.

Mrs. - Mistress.

Ms. లేక Mss. - Manuscript వ్రాతప్రతి పుస్తకము

Mus. Dr. - Doctor of Music.

Nem. Con - Nemine Contradicente No one Contradicting-ఎవ్వరూ ఎదురు చెప్పలేదని భావము.

Net - Nett - Netto - Free from all deductions. నికరమని భావము.

No. - Numero. Number. సంఖ్య.

Non. seq - Nonsequitur. It does not follow అని యర్థము.

N. P. - Notary Public.

Ob. - Obiit-died మృతిచెందెననుట కర్థము.

O. B. E. - బిరుదము Order of British Empire.

O. H M. S. - On His Majesty's Service.

O. M. - Order of merit.

O. P. Opposite to Prompt side (stage term)

Oxn - Oxon-ఆక్సుఫర్డు యూనివర్సిటీ సంబంధము.

Oz. - Ounce. ఔన్సు (కొల) పరిమాణము.

P. C- Percent by the hundred. దీనికి % అని గురుతుకూడ కలదు.

P. C- Privy Councellor.

Per. Pro- Per procuration for and on behalf of అని యర్థమగును.

Pinx లేక Pxt- Pinxit. He Painted it అని యర్థము.

Pl- Plural బహువచనమని భావము.

P. M.- Post Meridian. After noon అని యర్థము (A. M. చూడుము).

P. M. G.- Post Master General.

P. O.- పోస్టుఆఫీసు అనియు, పోస్టల్ ఆర్డరనియు రెండువాడుకలు కలవు (సామాన్య భావము).

P. O. O.-Post Office Order.

Pop- Population.

P.P.- Pages.

P. P. C.- Pour Prendre Conge శెలవు పుచ్చుకొనుట.

Prof- Professor.

Protem- Protempore, Sub protemporee for the time being తాత్కాలికపు.

Prox- Proximo next, రాగల నెల యని యర్థము

P. S.- Post Scriptum, Post Script.

P. T. O.- Please turn over పుటం ద్రిప్పి చదువుడని భావము.

Q. E. D.- Quod erat demonstrandeem which was to be demonstrated

Q. E. F.- Quod erat, Faciendum which was to be done

Quant suff- Quanlum sufficit, a sufficient quantity కావలసినంత అనియర్థము.

Q. V.- Quod Vide which see.

R. A. M.- Royal Academy of music.

Rev- Reverend.

Rip- Requiescat in pase, may he rest in peace.

R. S. V. P.- Respondezs il vous plait Please send answer జవాబునకు నిరీక్షింతుమని యర్థము.

S. P. Qr లేక S. P. Q. R.- Senate and People of Rome అని యర్థము.

Sq- Sqare చౌకము.

S. S.- Steam ship-

Syn- Synonymous

T. M. O.- టెలిగ్రాఫ్మనియార్డరు.

T. O.- Turn over తిరుగవైచి చూడుము.

Vlt- Ultimo కడచి.

Ultimo- గతనెల యని యర్థము.

Univ- యూనివర్సిటీ విశ్వవిద్యాపీఠము.

Vs లేక Versus- ఎదురు, ఎదుటికక్షి, వైరి అని యర్థము. మరియు Roman numeral for five

V. C.- Victoria cross

V. G.- Verbi grate- for example అని యర్థము.

Visc- Viscount (వైకౌంటు) అని యర్థము.

Viz- Namely అని యర్థము.

V. R.- Victoria Regina.

V. S.- Veternary Surgeon.

Wis- Wisconsin.

W. S. - Writer of the Segnet.

X. - Roman numeral for 10.

X or Xt - Christ- క్రీస్తు ప్రభువు.

Xmas- Christmas- క్రిష్టమసు పండగ.

Xn- Xtian Christian- క్రైస్తవుడు.

Yds. Yards- గజములు.

Yrs- Years- సంవత్సరములు.

&- And మరియు నని యర్థము.

& etc. - And etcetra and so fourth- అని యర్థము. మొదలగునవియని భావము.

**కూచిమంచి జగ్గకవి (లేక జగ్గరాజు)** — ఆంధ్రకవులలో నాథునికుఁడుగ పరిగణింపఁబడినవాఁడు. సుప్రసిద్ధుఁడగు అభినవ వాగనుశాసన కవిసార్వభౌమ కూచిమంచి తిమ్మకవికి సోదరుఁడు. (కూచిమంచి తిమ్మకవి చూడుఁడు.)

ఇతఁడు రచించినవి జానకీపరిణయము, రాధాకృష్ణ చరిత్ర, సుభద్రాపరిణయము, చంద్రరేఖా విలాపము, ఇంకఁగొన్ని చాటుప్రబంధములు, శతకములుఁ గూడ కలవు. ఈకవి వరేణ్యుఁడు చంద్రరేఖావిలాపము రచించి తిట్టుకవులలో పేరొందిన వాఁడు. ఇటీవలనే వీని సంబంధమగు వేణుగోపాల శతకము బయల్పడినది.

**కూచిమంచి తిమ్మకవి** — ఈమహాకవి ఆంధ్రకవులలో నాథుఁకులందు పేర్కొనఁబడినవాఁడు. కవిసార్వభౌమబిరుదమును, అభినవ వాగనుశాసనబిరుదమును కలవాఁడు. క్రీ. శ. ౧౬౯౦-౧౭౫౭ ల మధ్యకాలమువాఁడు. ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడు, కౌండిన్య సగోత్రము, తండ్రి పేరు గంగన్న, తాత పేరు తిమ్మరాజు, ముత్తాత బయ్యనామాత్యుఁడు, తిమ్మకవి పేరు తిమ్మరాజు, గోదావరిజిల్లా పిఠాపురప్రాంతమునందున్న కందరాడ నివాసము. ఇతఁడు కందరాడ కరణమని యనుచున్నారు. శివభక్తుఁడు. దొంతులూరి లింగనారాధ్యులవారి శిష్యుఁడు. భార్య పేరు బుచ్చమాంబ, తల్లిపేరు లచ్చమాంబ. సింగన్న, జగ్గరాజు, సూరన్న కనిష్ఠసోదరులు. జగ్గరాజు, సింగరాజు, నరసరాజు పిత్రువ్యులు, వీరమ్మ పాపమ్మగార్లు మేనత్తలు.

ఈ మహానీయుఁడనేక గ్రంథముల రచించినవాఁడు. గొప్ప కవి. పిఠాపురము కుక్కుటేశ్వరస్వామియందు భక్తిగలవాఁడై చాల గ్రంథము లాదేవునిపై కృతి సమర్పించి కుక్కుటేశ్వరశతకముం జెప్పెను.

ఈ కవి సార్వభౌముని గ్రంథములలో రుక్మిణీ పరిణయము, రసికజన మనోభిరామము, సారంగధర చరిత్ర, రాజశేఖర విలాసము లను నవి ప్రబంధములు. అచ్చతెలుఁగు రామాయణము, నీలాసుందరీపరిణయము ననునవి అచ్చ తెలుఁగు ప్రబంధములు. లక్షణసారసంగ్రహము లక్షణగ్రంథము, సాగరసంగమమాహాత్మ్యము, సింహశైల (సింహాచల) మాహాత్మ్యము, సర్పపుర మాహాత్మ్యము ననంబరగునవి, క్షేత్రమాహాత్మ్యములు. అనేకశతకములు దండకములు రచించిన వాఁడు. చనిపోవుముందు రచించిన కడపటి కావ్యము శివలీలావిలాసము. ఈయనను శతాధిక గ్రంథకర్త యనెదరు.

**కూబీజమ్** (Cubism) — పారిస్ నగరమున కాపురముండిరిన స్పానిషు చిత్రకారుఁడగు పికాసో (Picasso) అను నాయన ఈ సిద్ధాంతమునకుం గర్త.

ఒక పదార్థము యొక్క నిజస్థితి దానికిం గల సంబంధములనుండియు, అంతరములుగ విచారించుటవలన తెలియుననియు, దానియొక్క Cubic capacity అనగా ప్రకృతియందు ఆవస్తువు ఆక్రమించుకొనియున్న ప్రదేశమునుసరించి యుం దెలియుననియు, ఆకారము రంగు భేదింపఁదగినవి కావనియు, బాహ్యాకారము భ్రమాకారమేగాని నిజాకారము కాదనియు సిద్ధాంతము.

**కూజితదోషము** — జ్యోతిషశాస్త్రమున ముహూర్తభాగమునం దుపనయన ముహూర్తముంగూర్చి చెప్పంబడినదోషములలో నొకటి. లగ్నాదికేంద్రములందు కుజుఁడుండిన కూజితదోషమనియు, నిది వటువు తల్లికిం గీడనియుం జెప్పంబడినది.

**కూటకర్షాపణన్యాయము** — కృత్యార్థమునకు స్వల్పార్థము అనుకూలించిన నాయర్థము అంగీకరింపఁబడఁగినదనియు, అనుకూలింపని యర్థము నిరాకరింపఁబడవలెననియు భావము. అనఁగా న్యాయర్థము పాటింపఁబడఁజనదు.

**కూటపాకము** — ఆయుర్వేద వైద్య శాస్త్రమున సన్నిపాత జ్వరమునకుఁ గూటపాకమని పేరు.

**కూటపాలకము** — ఆయుర్వేద వైద్య శాస్త్రమున పిత్తజ్వరమునకుఁ గూటపాలక మని పేరు

**కూటికి వేదవైతే కులానికి వేదలా?** — ఆంధ్రలోకోక్తి

**కూడు గుడ్డలు డబ్బు అడగక పోతే అందరినీ పోషిస్తా నన్నాడట** — ఆంధ్రలోకోక్తి.

**కూడుటయే చేత గాకపోయినచో గుణకారము ప్రారంభించిన లాభ మేమిటి?** — ఆంధ్రలోకోక్తి

**కూత ఆర్భాట మెక్కువ కువ్వలో గింజలు తక్కువ** — ఆంధ్రలోకోక్తి.

**కూతురుబుడమ** — లా. Cryonia scabra. సం ఏలావాలుకమ్, ప్రసర. కొందఱు లోహిత అనియు వాడియున్నారు. దీనికి నూగు దోసచెట్టనియు, ముసిముసిచెట్టనియు నామాంతర నామములు కలవు

దీని సమూలరసము చలువజేసి విరేచనమొడలించి వీర్యపుష్టిగల్గించుననియు, అరుచి, కార్శ్యము, అగ్నిమాంద్యము, క్రిములు, జ్వరములు, పాము విషదోషవ్రణములు, ప్రమేహరోగము, పైత్యము, భ్రమ, దాహము, నీరద, మూత్రరోగములు (బహుమూత్రముసహా) రక్తపైత్య, రక్తవమనములు, శ్లేష్మకాసలు, హృద్రోగము, క్షయరోగము, నివారించుననియు, దీనిపచ్చియాకురసము విరేచనమొనర్చు గుణముగలదనియుం జెప్పఁబడినది.

**కూత్బర్ట్** (Cuthbert) — ట్యూటోనిక్కు నామము. ఇది Northumbrian Saint అగు నొకస్వామిపేరు. ఈయన సమాధి Durham నందుగలదు. Well-known splendour అని యర్థము. పురుషనామము. క్రైస్తవ నామములు చూడుఁడు.

**కూనను పెంచితే గంపైడి కరవ వచ్చి నట్లు** — ఆంధ్రలోకోక్తి.

**కూనూరు** — దక్షిణదేశమున ఉదకమండలమునకు ౧౧ మైళ్ళదూరమున కొండపై కొంత దిగువగనున్న సమశీతోష్ణ ప్రదేశము (ఉదకమండలము చూడుఁడు). సముద్రపు నీటిమట్టముపై నారువేల అడుగుల ఎత్తుననున్నది. ఈ ప్రదేశమందలిశీతోష్ణస్థితిని ఆంగ్లులు Mild and Genial అనెదరు. ఉదకమండలమంత శీతలప్రదేశముకాదు. ఏవేళను ఉష్ణరేచరు ౬౦ డిగ్రీలుండును. డెబ్బది డిగ్రీలకన్న నెప్పుడు అధికముగాకను, అరువదియైదు (ఫారిన్హీటుథర్మామీటరు) డిగ్రీల కన్న తగ్గకను ఉండునని చెప్పఁబడినది అక్టోబరు నెలనడుమను, నాత్రీస్టుమాసమునను వర్షములు ప్రారంభమై రెండుమాసములు వర్షించును. వేడి దేశముల కలవాటుపడిన దేహతత్వములు కల వారికిది చాల అనుకూలమైనది.

కూనూరుకుఁ గతిపయదూరమున వెల్లింగ్టన్ అనంబడు ప్రదేశము సైన్యములుండు తావు. చెన్నపట్టణపు పటాలములకిది ప్రధానస్థానమై యున్నది. ఆరోగ్యప్రదేశము.

**కూపఖానక న్యాయము—** నుయ్యి త్రవ్వుచున్నవారు నూతిలో పనిచేయుతరి తమ కాలి కంటుకొనిన బురదను పైకివచ్చి ఆనీటితోనే కడుగుకొందురు.

**కూపయంత్రఘటికా న్యాయము—** నూతిలోని నీటిం బయటికిం దోడుటకు పాత్రలను దండ (లేక పేరు) వలెంగట్టి తోడుచుందురు. దానికి కూపయంత్ర ఘటిక యనిపేరు (Water wheel). అందు అడుగుకుండలు నీటినింపుకొను చుండుతరి పైకుండలు ఆనీటియందలి నీటిని పైకి వెలుపుచు కాళీ లగుచుండును. ఒకేకాలమున ఆపనియు నీపనియుం గూడ నడచు చుండుగాగాన కష్ట సుఖములు, ఆపద సంపదలు, కల్మి లేములు వరుసగ గల్గుచుండు మానవ సంసార జీవితముం గూర్చి దెల్పుటయం దీ న్యాయమును వాడు చుందురు

**కూపస్థమండూక న్యాయము —** నూతిలోనికప్పకు నూయే సముద్రమను లోకోక్తి వంటిది. పెద్దకార్యములన నేమోఎఱుంగని అల్ప జ్ఞుల యజ్ఞాన స్థితిం దెల్పుటయం దీన్యాయమును వాడుదురు.

**కూరోశివో** (క్యూరో శైవో)- Kuro Sivo - జపాను దేశస్థులు North Equatoreal Current ను, Kuro Sivo అనియెదరు. జపాను భాషయందు నల్లని నీరని యర్థము ఆ ప్రాంతములందు గలYellow Sea ఉదకములు బురదగలిసి పచ్చగనుండ దాని నుండి వేఱుగ నగుపడుచు వేడిగల్గి యుంట జపాను దేశముల శీతల బాధను కొంతవఱకు తగ్గించి ఉత్తరముగ బర్విడుచు ఉత్తర ధృవముం జేరు తఱి తడి తగ్గి యంతరించి పోవును.

(సముద్ర ప్రవాహములు చూడుఁడు).

**కూర్గుదేశము —** కొడగు దేశము చూడుఁడు.

**కూర్చుండి తింటూంటే కొండ లైనా ఆగవు**-(అనగా పని పాటలు చేయ కుండా నని భావము). ఆంధ్రలోకోక్తి.

**కూర్చుండి పరుండవలెను, ముం దుకూర్చుని పిదప పరుండవలెను -** అనగా తన పనిం జేసికొని ముగించి పరుండ వలెనని ఒక భావము ప్రక్కపై ముందుగా గ్చుని పరుండ గలరుగాని కూర్చోకుండా ఒకే సారి పరుండ జాలరని వేఱొక భావము. ఆంధ్ర లోకోక్తి

**కుర్తాళం** - ఇది దక్షిణ దేశమున తిరునెల్వేలి జిల్లాయందలి సమశీతోష్ణప్రదేశము. కొండలనడుమనుండివీచు పిల్లగాలి తఱచుగ వర్షము జల్లులు జల్లులుగ పడజేయుచుంట చల్లగనుండు తావు. ఆరోగ్య ప్రదేశమని చెప్పఁబడినది. వేసవి కాలమున నిటకు పెక్కండ్రేగి వసించు చుందురు.

ఇట కొండలపై నుండి చిత్రానది జలపాతముగ పడుచుండును. దీనిని సుప్రసిద్ధముగ Kurthalam Falls అని వాడెదరు. ఇట కుర్తాల నాథుండను శివలింగము కలదు. పర్వతమునుండి జారిపడు చిత్రానది శాఖలు పెక్కులుంట నవి యన్నియు కాల్వలుగ గ్రామ మంతట నక్కడక్కడ కాల్వలుగ ప్రవహించు చుంట వింతగ నుండును. కొండపైకెక్కిన నట ధన్వంతరి వన మని చెప్పఁబడు నొక వనము కలదు. అందు సకల విధములు వృక్షసముదాయమును లెక్క లేని వనౌషధులును ఎండకాలమున గూడ పడు చుండు వానజల్లులకు నపరిమితముగ పెరిగి వృద్ధి నంది ఫలించు చుండును. చిత్రానదియు లెక్క

లేని పాయలుగ నీయరణ్యము నందన్ని దిక్కులను ప్రవహించుచు కడకు పర్వతమునుండి జారి జలపాతమై బడిన దిగా నొకే జలప్రవాహమై చిత్రానది యనంబడుచు నేగి తామ్రపర్ణీ నదియందు సంగమించును

కొండపైనున్న ఈధన్వాలి వనమధ్యమున చంపకాదేవి యాలయముకలదు. ఇందు కోతులే యర్చించుచుండునని ప్రతీతి ఈయరణ్యము కడను ఒక గొప్ప గుహయందు చిత్రానది జన్మస్థానమున్నది. ఈగుహయందు పై భాగమున యసంఖ్యాకములగు తేనెపట్టులుండి తేనెచుక్కలు క్రింది కొల్లప్పుడు పడుచు నదీజలములం గలయుచుండుట నీజలములందనేక మహాగుణములు గల్గి యారోగ్యస్థితిం గూర్చునని గొప్ప గొప్ప వైద్యులనుచున్నారు. ఈ వనమంతయు ప్రభుత్వమువారి ఫారెస్టు రిజర్వుగా నున్నది.

**కూర్మహస్తము** — హస్తాభినయనము చూడుము. భరతశాస్త్రము చూడుడు

**కూర్మద్వాదశి** — పుష్యశుద్ధ ద్వాదశి దీని క్రిష్ణ ద్వాదశి యనియు నందురు. (పండుగలు చూడుము). వైశాఖ ద్వాదశి.

**కూర్మపురాణము** (కౌర్మము) — లింగపురాణము, కూర్మపురాణము లందిది పదునాల్గవదిగను, తక్కిన చోట్ల పదునేనవదిగను చెప్పబడిన పురాణము ఇది కూర్మరూపియగు విష్ణువు ఇంద్రద్యుమ్ననకుం జెప్పినది సర్గవర్ణాశ్రమ ధర్మ శివ మహాత్మ్యములు కలవు. గ్రంథసంఖ్య మత్స్య పురాణమున ౧౮౦౦౦ గను, తక్కిన వాటి యందు ౧౭౦౦౦ గను చెప్పబడినది.

**కూర్మాంగ న్యాయము** — తాబేలు యొక్క అవయవములు దాని చిప్పయందిమిడి పోవును. అవసరము లేనితరి కనిపించవనే కనిపించవు. అవసరము వచ్చుతరి బయటికివచ్చి పని చేయును. అనగా ఉన్నట్లగుపడును. ఇది యర్థము. లేనివి కల్గుచుంటయు, ఉన్నవి లేకపోవుటయు అసంభవవాదమని భావము ఇవి వాదమునకై ఉపయోగించెడి న్యాయము. ఇంతయె గాక అవసరమగు సమయమున బయటపెట్టుటకు దాచిన (మరుగుపర్చి యుంచిన) వాటింగూర్చి తెలుపుటకీన్యాయము వాడుదురు.

**కూర్మాచలదేశము**- ఇప్పుడు కుమాౝన్ డివిజను లేక కాళీకుమాౝన్ అనంబడుచున్నది. సంయుక్త రాష్ట్రములలోని ఆల్మోడాకుం జేరినది. హిమవన్నగము పై నున్న దేశము. దీనికి చంపావతీపురము రాజధానియై యుండెను అట నొక పర్వతముపై క్రాంతేశ్వర శివలింగము హింగుళాదేవి దేవస్థానమును గలవట. ఒకచిన్న పల్లమున రాతితాంబేలుకలదు. అది కూర్మావతారస్థలముగదు. దానినుండియె యాపర్వత పంక్తికి కూర్మాచలమని పేరయ్యెనట. కూర్మాచలమును మాటనానాటికి గుమాసయ్యెనట ఇంకను ఈదేశమున ప్రాముఖ్య మగునది కాళీగంగ గాన కాళీకుమాౝన్ అను పేరు గల్గెట బాణాసురుని కుమార్తె చంపావతి ఇట స్థిరరాలౌట నామెపేరే ఈ తావునకుం గల్గెనట. చంపావతి పుణ్యక్షేత్రము. దీనిని దేవతా నివాసభూమి యనెదరు. ఇచట కొంతదూరమునగల లోహావతి రాక్షస నివాస భూమియందురు. అట రాక్షసులనాటి శిలాదుర్గమును రాక్షసులచే పూజింపం బడుచుండిన భగవతి ఆలయమును కలవు. అత్తావునకు తొల్లింట శోణితపురమని పేరట. ఇప్పుడు సూయి అనుచున్నారు. ఈదేశ మొకప్పుడు అరుణోదదేశమునకుం జేరియుండిన దందురు.

కూర్మాచల దేశముంగూర్చిన ప్రశంస స్కాందపురాణ మహేశ్వర ఖండమున గలదు.

ఈదేశమున త్రిశూలీ పర్వతపు పశ్చిమపు కడను పూర్ణాదేవి (అన్నపూర్ణాదేవి) దేవస్థానము ప్రసిద్ధము. ఇప్పు డాపర్వతమును పూర్ణగిరి యనియు, దేవిని పూర్ణగిరిమాయి యనియు ననుచున్నారు. దూనగిరి తొల్లింటి ద్రోణాచల పర్వతమని పోల్పఁబడినది. లోఘ్మానా అరణ్యమును గర్గర్షి ఆశ్రమ స్థలముగ పోల్చియున్నారు. అటజనించిన గాగస్ నదికి తొల్లింట గర్గనది యని యందురు. ఇది ధవళీనదిలో సంగమించును. మఱియు నీదేశమున పంచ ప్రయాగలు గలవు. (పంచ ప్రయాగలు చూడుఁడు). ఉమావస ముండిన తావును ఉషా మఠము (ఉఖిమట్) ను ఈదేశములోనివే. ఈదేశపు బ్రాహ్మణులు జోషీ లనంబడుదురు. వీరియందు సెలాఖాలా జోషీ లనియు, జిశెహాగ్జోషీలనియు రెండుభేదములు కలవు. ఆభేదము జ్యేష్ఠ కనిష్ఠ శాఖలనియు, గ్రామ నామములే యనియు చెప్పఁబడినది. ఈదేశ మేలిన రాజులం గూర్చి Journal of Asiatic Society of Bengal 1844; P. 887 నందు చూడవలయును.

**కూర్మాసనము (లేక గోముఖాసనము)** — యోగశాస్త్రమున చెప్పఁబడిన ఆసనములలో నొకటి. గుద ద్వారమునకు ఇరు దెసల రెండుకాళ్ల మడిమను అదిమి పట్టి గుదద్వారము మూసి కూర్చుని రెండు తొడలపైని రెండు చేతులానుట. దీనియభ్యాసమున ఇంద్రియములు బహిర్గతములు గాక శరీరబల మతిశయించి అపానవాయువు క్షీణించునని చెప్పఁబడినది. దీనికి గోముఖాసన మనియుం బేరుకలదు.

**కూలికివచ్చి పాలికి మాట్లాడినట్లు** — (పాలికి = భాగమునకు) ఆంధ్ర లోకోక్తి.

**కూష్మాండ నవమి** — కార్తీకశుద్ధ నవమి. దీనిని అక్షయనవమియనియు నందురు. (అక్షయనవమి చూడుఁడు) కూష్మాండకుఁడను రక్కసుని విష్ణుదేవుండు ఈ దినమున సంహరించిన యానవాలుగ విష్ణుదేవు నారాధించి పూజింతురు. ఇంకను కొందఱు గుమ్మడికాయల నీదినమున దానములొనర్చువారునుం గూడ కలరు. (పండుగలు చూడుఁడు).

**కూనేగాడిదవచ్చి మేనేగాడిదను (బుద్ధి) చెరిపినదట** — (అనగా దుస్సహవాసమని భావము). ఆంధ్రలోకోక్తి.

**క్వా అక్షరమునకుం జెందిన క్రైస్తవ పురుష నామములు** —

Quayle- వెల్షుపదము.

Quentin, Quentus, Quintin, Quinton- స్కాచిపదములు ఐదవసంతానమనియర్థము.

Quintyre- నవీన కల్పితపదము.

**క్వా అక్షరమునకుం జెందిన క్రైస్తవ స్త్రీల నామములు** —

Queenie- నవీన కల్పితపదము Quene అను పదమునుండి కల్గిన శబ్దము.

**క్యూజెక్కు (Cusec)** — డ్యూటీ ఆఫ్ వాటర్ చూడుఁడు.

**క్వానీఫారము వ్రాత** — 'క్యూనీ ఫారము' అనగా లాటిన్ భాషయందు 'బాణాగ్ర రూపము' అని యర్థము. ఇది ఆసియాదేశపు పడమటి భాగమునందును, ఆఫ్రికా ఖండమునందును ప్రచారమొంది యుండెను నిలువుగ, అడ్డుగ, ఏటవాలుగ వ్రాయఁబడుచు, అనేక పరిమాణములలో నుండెడిది. రానురాను మంటిమీదను, కఱ్ఱమీదను, రాలమీదను, లోహములమీదను గూడఁ జెక్కఁబడుచుండెడిది. ఈ

గురుతులు పురాతనపు బాబిలోనీయములని కొందఱు పరిశోధకు లభిప్రాయపడుచున్నారు. సుప్రసిద్ధుడు "రాలిన్‌సన్" పండితుడు ఇట్టి గురుతులకు పెక్కింటి కర్థములను దెల్పియున్నాడు. క్రీ. పూ. ౩౦౦౦ నాఁడీలేఖనము పరిపూర్ణత నొంది యుండెనని చెప్పుదురు. ఇది 'కప్పాడోషియా' సీమకు వ్యాపించి క్రీ. పూ. ౨౩౦౦ నాఁడు పాల స్తీనా దేశమున దలసూపి 'ఈనక్' సీమలందు గూడగన్పట్టినదట. క్రీ.పూ. ౧౫౦౦ మొ ౧౩౦౦ వఱకు భూపతుల రహస్యలేఖల కుపయోగపడుచు బడుచుండెడిదట. క్రీ.పూ ౯౦౦ నాఁడు ఫార్మీని యా రాజ్యమున బ్రచారమొందినట్లు గన్పట్టు చున్నది ఇంచుమించిది క్రీస్తు పుట్టుక వఱకును అచ్చటచ్చట నున్నటుల దోచెడిని అస్సీరియా దేశమున వ్యాపించియున్న యీ గురుతులను బేబిలోనియా దేశీయులు కొంత సరళపఱచి లిఖించిరని చెప్పఁబడినది. సరళపఱచిన గురుతులు ౧౧౭ వరకును గన్పట్టుచున్నవి పారశీక దేశపు "క్యూనీఫారము" క్రీ.పూ. ౫౭౦ మొ॥ ౩౭౦ వఱకును ౩౯ పలుకు గురుతులును, ౪ Ideograms ను ఈభాషను సరళపఱచెనని చెప్పఁబడినది.

**క్యూనిఫారమ్ లిపి** (Cuneiform) — దీని నాంగ్లదేశస్థులు Arrow headed letters అనియెదరు. ఈలిపితో చెక్కఁబడిన శాసనములు పారశీకదేశము, అస్సీరియా, ఆర్మీనియా, మిడియా, బాబిలోనియా, మెసపొటేమియా దేశములందు గానఁబడుచుంట ఆప్రాంతభూమిని వాడుకయం దుండెనని తెలియుచున్నది.

బాణములం బోలియుంట నీపేరందినదట. అరబ్బులు వీటిని మేకులతోఁబోల్చి మిస్మారీ లిపి యనెదరు. దానింబట్టియె ఆంధ్రవిజ్ఞానసర్వస్వము రచించిన కొమర్రాజు లక్ష్మణరావుగారు దీనికిం గీలలిపి యని పేరిడిరి. బాణాగ్రరూపమునుండు నీయక్షరములు రెండుబాణములు కలిసినతెరం దప్పు, తక్కిన తెరుణముల కుడివైపునకుగాని, క్రిందికిగాని మొనలుదేరియుండును.

బాబిలోనియాలోని సుమెరులు దీనిని తొలుత వాడుచుంట, వారే దీనికిం గర్తలని తలంపంబడు చున్నది. (బాబిలోనియా చూడుడు). అది నొకప్పుడిది హీరొగ్లిఫిస్ నుండి జనించి యుండునని కొందఱు తలంచుచున్నారు. బాబిలోనియా రాజ్యకాలమున నిది యభివృద్ధినందె ననెదరు. పరిశీలకు లీలిపి క్రీ. ము. ౪౫౦౦-౧౦౦౦ నడుమకాలమున వాడుకయందుండె ననుచుందురు. బాబిలోనియనులనుండి అసీరి యనులు గైకొనుటయందు దీనియందు కొన్ని మార్పులను కల్గించిరందురు. వారు క్రీ. ము. ౧౫౦౦-౬౦౭ వఱకు వాడుచుండిరని శాసన ములనుండి తెలిసినది. వారినుండి ఛాల్డియనులు, పారశీకులు, సుసియనులు గైకొనుటతో వేర్వేఱు మార్పు పాలైనదట. దీనినుండి పారశీకమునం దొకప్పుడు వాడుకయందుండిన ఏదోలిపి పుట్టెనట గాని అది యిప్పుడు వాడుకయందే లేక నశించి నది. ఇప్పుడు పారశీకమునందున్న లిపి దీని సంబంధమే కాదు.

క్యూనిఫారమ్ లిపి అక్షరాత్మకము. దీనికి గుణితము కూడ కలదని తేలినది. సుప్రసిద్ధ పరిశీలకుండనఁదగిన గోల్డుస్టక్కరు పండితుఁడు పాణిన్యాచార్యుఁడు తన అష్టాధ్యాయియందు యవనలిపి యని వాడిన దీక్యూనిఫారమ్ వ్రాత యని పోల్చియున్నారు.

**క్యూబాదేశ ప్రభుత్వము** — వెస్టు ఇండీసు ద్వీపములలో నొకటి. ప్రజాప్రభుత్వము. నలుబదియొకవేల చతురపుమైళ్ళ వైశాల్యముని యు, ముప్పదిమైదులక్షల జనసంఖ్యయునియుం జెప్పఁబడినది.

**క్యూబాద్వీపము**— (Island of Cuba) ఇది పశ్చిమ గోళార్ధమున, పసిఫిక్కు మహాసముద్రమునందు వెస్టిండీస్ అనుపేరుగల ద్వీపములందు పెద్ద ఆంటిలీద్వీపములని చెప్పఁబడు ద్వీపసమూములోనొకద్వీపము. ఇదిచాలపెద్దది. ౩౬,౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యముకలది. ఇది అమెరికా సంయుక్తరాష్ట్రములవారిది, తొల్లింట స్పానియావారిదై యుండెను. హావనాపురము ప్రధాన స్థానము, ఇది పెద్దవర్తకస్థలము. ఇందు పొగాకు చుట్టలు విస్తారము చేయుబడుచున్నవి. పొగాకు పంట ఈ ద్వీపముగందధికముగా పైరుచేయుంబడుచున్నది. (వెస్టిండీసు ద్వీపములు చూడుఁడు) (పెద్ద ఆంటిలీ ద్వీపములు చూడుఁడు).

**క్యూలెక్సుజాతి దోమ** — ఇది అనేక విషయములలో స్టెగోమియా జాతిని పోలియుండును. దీనిగ్రుడ్లు నొకదానితో నొకటికలసి పడవ వంటి ఆకారముకలవై యుండును. గ్రుడ్లు కొంచె మెఱుపుధాతువు కలసిన నలుపురంగువలె యుండును. పురుగులు నీటిమట్టమునుండి క్రిందికి వ్రేలాడుచు గాలిపీల్చుట కేర్పడిన రంధ్రములద్వారా నీటిపైనుండు గాలినిపీల్చును. (అంటువ్యాధులు చూడుఁడు మలేరియా చూడుఁడు).

**క్రూరగ్రహములు** — (పాపగ్రహములు) జ్యోతిషశాస్త్రమున రవి, కుజ, రాహు, శని, కేతువులు క్రూరగ్రహములనియు పాపగ్రహములనియు చెప్పఁబడినవి. ఇవి కానివి శుభగ్రహములు. (శుభగ్రహములు చూడుఁడు).

**కృక్ష గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**కృణి గోత్రము** — విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.

**కృతక రత్నములు**— రత్నములు భూమియందు తమంతటతామే నైసర్గిక పరిస్థితులందు ఉత్పత్తియగునవి (Real gem is made by nature ). కృతకరత్నములు మానవులచే నా పదార్థ సమ్మేళనమువలన కల్పింపఁబడినవి. (Reconstructed gem is made by men with the same material). వీటిని గాజు రత్నములతో (Artificial or imitation gems generally made of glass) పోల్చి పొరబడరాదు.

కృతకరత్నములను Synthetic stones అని యందురు. రసాయనశాస్త్రవేత్తలు రత్నములందలి పదార్థములనే రంగులవరబడి సమర్చి తమ కనుకూలమగు పరిమాణములుగ కల్పి రచింతురు. ఇదియు అన్నిలక్షణములను, అన్ని పరిశీలనలను, అన్నిపరీక్షలందునను ఆరత్నమునే పోలియుండును.

క్రీ. శ. ౧౮౮౫గి సంవత్సరమున కృతకరత్నము (ఒక కెంపు Ruby) తొలుత జేయఁబడెంగాని దానింగూర్చుటకగు వ్యయము నిజమగు కెంపు విలువకన్న అనేకరెట్లెక్కువయగుట నిష్ప్రయోజనకార్యముగ నెన్నబడియెను. ఈనడుమ రత్నములధర లోకమందంతటను పెరుగుటయును, మధ్యకాలమున చేయఁబడిన పరిశీలనలవలన కృతకరత్నములం జేయువ్యయము కొంతతగ్గుటం గనిపెట్టఁబడుటయు సంభవించి ఇప్పుడు ప్రోత్సహింపఁబడి చేయఁబడుచున్నవి. కాని వాట్లను Imitation రత్నములకు శ్రేష్ఠములుగ మాత్రమెన్నుచున్నారు.

**కృతకుడు**— అత్రి, చంద్ర, యదుసంతతి క్షత్రియుఁడు, తండ్రివసుదేవుఁడు.

**కృతకృత్యుడు**— తండ్రి త్రికకుత్తు, ఇతడు విరక్తుడై చనినవాడని చెప్పఁబడినది.

**కృతద్యుతి**— భర్త చిత్రకేతుఁడు.

**కృతశ్రవణుఁడు** — (ఋషి) పరశురాముని యనుచరుఁడు.

**కృతభాగగోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**కృతమాలానది** — దీనినిప్పుడు వైఘ యనియు, అరవమున వైగైయనియు ననుచున్నారు. పాండ్యదేశమున, దక్షిణ మధురాపట్టణముగుండా అంతర్వాహినియై యుండు నది దీని యుదకములు సముద్రమునకుం జేరక దారిలో నింకిపోవును. మలయపర్వతమున జన్మించును దీనింగూర్చిన ప్రశంసలు మార్కండేయ పురాణము ౫౭. వాయుపురాణము ౨-౩ యందు గానవగుచున్నవి.

**కృతవర్మ** — అత్రి, యదు, సంతతి క్షత్రియుడు, తండ్రి హృదికుడు సోదరుడు, దేవమీఢుడు శతధనువు, పితామహుఁడు భోజుఁడు భారతయుద్ధానంతరము అశ్వత్థామ పాండవశిబిరముఁజొచ్చి ఉపపాండవులను మొదలుగాగలవారిని నరకి చంపివేయుటయందు అశ్వత్థామతోఁగూడ నుండినవాఁడట భారతయుద్ధానంతరము యాదవులకును సాత్యకులకును సంభవించిన నిరోధకలహము (Civil War) నందు మృతుఁడాయెనని తెలియుచున్నది. ఈయన భారతసంగరమున మరణింపక మిగిలినవాఁడు (అక్రూరుడు చూడుఁడు. హార్దిక్యుఁడు చూడుఁడు)

**కృతవీర్యుఁడు** — అత్రి, చంద్ర, యదు (తాళజంఘ) హైహయవంశ క్షత్రియుడు, చేదిదేశాధినాథుడు, తండ్రి ధనికుడు లేక రెండవ మాహిష్మంతుడు. కుమారుడు కార్తవీర్యార్జునుడు లేక అర్జునుడు.

**కృతవైహారి గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**కృతాగ్ని** — చంద్ర యదువంశ క్షత్రియుడు. తండ్రి మహిష్మంతుఁడు. సోదరుడు కృతవీర్యుఁడు. పితామహుడు ఉశనస్సు కృతాగ్ని కార్తవీర్యార్జునుని పినతండ్రి.

**కృతాయువు** — మిథిలభూపతి. తండ్రి అరిష్టనేమి.

**కృతాశ్వుఁడు** — మరీచి సూర్యవంశ క్షత్రియుడు. ఇక్ష్వాకు సంతతి. బర్హిణాశ్వుని మొదటికుమారుడు. కృతాశ్వుని కుమారునిపేరు రెండవ యువనాశ్వుడు ఇతనికి కృతాశ్వుడనియు హూపాశ్వుడనియు పేర్లు వాడబడి యున్నవి. (హూపాశ్వుడు చూడుఁడు).

**కృతి** — ఈ పేరుగలవారు పెక్కండ్రు కలరు. అందఱు క్షత్రియులే. మిథిలదేశాధీశుడగు బహుళాశ్వుని సుతునిపేరు కృతి యాదవులలో విభువు సుతునిపేరు కృతి కురుసంతతిలోని చ్యవనుని సుతునిపేరు కృతి. పూరువుసంతతిలోని సన్నతిమంతుని కుమారుడు కృతి. ఈతఁడు హిరణ్యనాభునివలన యోగమార్గ ముపదేశమంది ప్రాగ్దేశమున సామసంహిత పఠించెనని చెప్పఁబడినది

**కృతిమంతుఁడు** — పూరువు సంతతి చంద్రవంశక్షత్రియుడు యవీనరుని పుత్రుడు. ధృతిమంతుడను నామాంతరముగలవాడు.

**కృతుఁడు**—ఈపేరుగలవారిద్దరుకలరు యాదవులందు వసుదేవుని కుమారులలో నొకడు (బలరామ శ్రీకృష్ణుల యనుజుడు) కృతిమంతుడను పేరుగలవాడు. మరియు గంభీరుడనువాని సుతుడును కృతిమంతుడే. ఈతని సంతతివారు ఈతని నుండి బ్రాహ్మణులైరి.

**కృతౌజస్సు** — యదువంశ క్షత్రియుడు. కృతవీర్యుని కనిష్ఠసోదరుడు.

**కృత్తికనక్షత్రము** — ఆకసమున మంగలికత్తిం బోలియుండు ఆరునక్షత్రముల సముదాయము. జ్యోతిషశాస్త్రగ్రంథములందు దీనికి కృత్తికా, అనలః, జ్వలనః, పావకః, బహుళా, వహ్నిసాజ్ఞికః, షట్తారకః, హుతభక్, అనుమాటలు పర్యాయపదములుగ వాడంబడియున్నవి.

అగ్ని అధి దేవతయనియు, రాక్షసగణముకుం జెందినయధోముఖ నక్షత్రమనియు, పుంస్వభావమనియు, మేక, నెమలి, అత్తిచెట్టు దీనిసంబాధములనియు, కృత్తిక ప్రవేశించినపిదప ముప్పదిగడియలపై త్యాజ్యమును, ఏబదినాల్గు ఘటికలపై నమృతమనియు, సాధారణస్వభావ నక్షత్రమనియుం జెప్పంబడినది.

**కృత్రిమాకృత్రిమయోః కృత్రిమే కార్యసంప్రత్యయః ఇతి న్యాయము** — అకృత్రిమను అర్థమునగా వాడుకనాదిగాని నైఘంటికముగగాని ఒప్పిన సాధారణమైన యర్థము. కృత్రిమమన సాంప్రదాయార్థము (Technical meaning) సాంప్రదాయార్థములు విద్యాసాంప్రదాయమనియు, ధర్మసాంప్రదాయమనియు, శాస్త్రసాంప్రదాయమనియుం ద్రివిధము. ఇందు సాధారణార్థము సంశయగ్రస్తమగుతరి సాంప్రదాయార్థమే చెప్పవలెనని యీ న్యాయముయొక్క భావము.

**కృత్వాచింత న్యాయము** - ముందు చేసి తర్వాత దానింగూర్చి యోచించుట యని యర్థము. ముందు యోచించి పిదప చేయుట బుద్ధిమంతుల లక్షణమైయుండ, యోచింపనిది చేసి వైచి పిదప యోచించుట బుద్ధిహీనుల లక్షణమని చెప్పుట యందీన్యాయమును వాడుచుందురు. ఇట్టిదే ముండితశిరోనక్షత్రాన్వేషణ న్యాయము, క్షౌరము పూర్తియైన పిదప అర్హనక్షత్రమగునా కాదాయని యోచించుకొన్నట్లని భావము.

**కృశ్వన గోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుడు.

**కృత్స్నమదుండు** — చంద్రవంశము. ఈతనికి గృత్స్నమదుండనియుం బేరుకలదు. తండ్రి సుహోత్రుండు. కుమారుండు శునకుండు, పౌత్రుండు శౌనకర్షి.

**కృథుండు** — యదువంశ క్షత్రియుండు, విదర్భుని రెండవకుమారుండు.

**కృపాచార్యుండు** — కృపుండు చూడుడు

**కృపి** — సత్యధృతి కుమార్తె, ద్రోణాచార్యుని భార్య, కుమారుండు అశ్వత్థామ, సోదరుండు కృపాచార్యుండు.

**కృపుండు (కృపాచార్యుండు)** — తండ్రి సత్యధృతి, సోదరి కృపి, (ఈమె ద్రోణాచార్యుని భార్య) మేనల్లుండు అశ్వత్థామ.

కృపాచార్యులు కొంతకాలము (ద్రోణాచార్యునకుం బూర్వము) కౌరవులకు అస్త్రవిద్యాగురువుగ నుండినవాండు. గౌతముని వంశస్థుండగుట నీతనికి గౌతముం డనియు నామాంతరముండెనట. ఈతండు ఏకాదశరుద్రాంశజన్ముండని చెప్పంబడినది.

**కృశుండు** — ఒకఋషి- ఈతండు శమీకుని మెడను పరీక్షిత్తుమహారాజు చచ్చినపామును జుట్టినవాండని (శమీకునిపుత్రుండగు) శృంగికిం దెల్పినవాండు. శృంగి పరీక్షిత్తు నెలరోజులలో పాము కఱచి మరణించునట్లు శపించినవాండు.

**కృష్ణకవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపంబడినవాండు. శ్రీవైష్ణవ బ్రాహ్మణుం డని తలంచుచున్నారు. మైత్రేయస గోత్రుండు, తండ్రిపేరు నరసింహాచార్యుండు, రచించినది శకుంతలాపరిణయ మను ప్రబంధము.

**కృష్ణగిరిపఙ్క్తి** — నల్లగానుండుటచే నీపర్వతపఙ్క్తి కీపేరు గల్గెనని వాయుపురాణము 36 యందు కలదు.

దీని నిప్పుడు కారకోరమ్ పర్వతపఙ్క్తి(Kara-korum Mountains)అని వాడుచున్నారు.

**కృష్ణగోత్రము** — ఉపమన్యుగణము చూడుఁడు.

**కృష్ణచంద్రగోత్రము** — ఆత్రేయ గణము చూడుఁడు.

**కృష్ణజిల్లా** — చెన్నపురిరాజధానియందు చేరిన ఆంధ్రదేశములోనిది. ప్రధానస్థానము మచిలీపట్టణము. దీనిని మచిలీబందరనియు, బందరనియు అనుచున్నారు. తొల్లింటి కలంకారీ అద్దపుగుడ్డలకు పేరొందినది. వెనుక నొకప్పుడు రేవుపట్టణమై యుండెను ఇప్పుడు రేవు మెరకేసి పోయినది.

బెజవాడ-రెయిల్వే కూడలిస్థానము, వర్తక స్థలము. కృష్ణానది కడ్డముగా నిట నానకట్టు గలదు. ఇట ఇంద్రకీలాపర్వతముపై నున్న కనకదుర్గ దేవస్థానము సుప్రసిద్ధక్షేత్రము. నూజవీడు గొప్ప జమీందారీస్థానము. జగ్గయ్యపేట వర్తకముగల తావు. వల్లూరు జమీందారీ స్థానము. చల్లపల్లి, ముక్త్యాల జమీందారీస్థానములు. గుడివాడ వేఱొక పట్టణము. (జల్లిసీమ చూడుఁడు.)

**కృష్ణతామర (మెట్టతామర)** — లా Canna indica ఆంగ్ల Cannas లేక, Indian Shot సంస్కృతపుపేరు తెలియదు గాని సర్వజయా యనిరి.

ఇందనేక రకముల రంగులపూవులంబూచు భేదములు పెక్కు గలవు. అరఁటిఆకులంబోలిన చిన్న ఆకులతో నుండును. పూవులతోటలందు అలంకారముగ పెంచుట కలదు. దీనిదుంప మిరియాలపొడిం జేర్చి నూరి బియ్యపుకడుగుతో కషాయము కాచి పశువులకుం బోసిన, పశువులు విషవృక్షములాదినినదోషము కల్గిన కడుపుబ్బు నిమ్మళించునందురు.

**కృష్ణదాసకవి** — ఆంధ్రకవులలో నాథునికులందు పరిగణింపఁబడినవాఁడు. తండ్రి వెంకటదాసు, రచించినది రాధాకృష్ణ విలాసము. ఇందలికథ గీతగోవిందము (జయదేవకవి) లోనిది.

**కృష్ణదాసకవిరాజుగారు** - ఈయన చైతన్యచరితామృతమును రచించినవాఁడు. కట్వా నుండి ౭ మైళ్ల దూరమున నున్న జహమత్పూరు నివాసి. (కాటకద్వీపము చూడుఁడు.)

**కృష్ణభట్టు(మహానుభావుఁడు)**— ఈమహాత్ముఁడు మహానుభావుఁడనికూడ బిలువం బడుచుండువాఁడుగాన ఈతనిమతమునకు మహానుభావమతమని పేరుగల్గెను. ఈయనకు శేతాళుం డొక మాత్రకిరీట మొసంగెననియు, దాని ధరించిన సాక్షాచ్ఛ్రీకృష్ణునివలె మహాతేజోవంతుఁడై యెల్లరకు గుపపడువాఁడనియు నొకవాడుక గలదు. ఇది నిజమైనను యన్సృతమైనను ఇతఁడు గొప్ప విద్వాంసుఁడు, బుద్ధిశాలి కానోపు శాలివాహన శకము ౧౧౨౫ ప్రాంతములవాఁడని యందురు. ఈయన కృష్ణచరితామృతము, లీలామృతము నను మతగ్రంథములను రచించెనట. వీరి మతమునకు పది మఠములు గలవందురు. ఈమతములోని సన్యాసులను మహాంతులనియు, వారినివాసములను మఠములనియు నందురు సంసారులు క్షౌరము ... నమకొనరు. అహింసావ్రతులై యుం ... శ్రీకృష్ణుని దత్తాత్రేయుని అర్చింతురు. మణ్ముళీము ద్రాధారులై జపము జేయుదురట.

**కృష్ణమిశ్రుఁడు** — ప్రబోధచంద్రోదయనాటకకర్త. (యజాభుక్తిదేశముచూడుఁడు).

**కృష్ణయ్యకవి**-ఆంధ్రకవులలో నాథునికులందు పరిగణింపఁబడినవాఁడు. ఈకవిం గూర్చి సరిగా తెలియరాకున్నది

బ్రాహ్మణుఁడు, స్మార్తవుఁడని తలంపఁబడు చున్నాఁడు. భరద్వాజస గోత్రము, తండ్రిపేరు చంచయ్య, కాపురము నెల్లూరుప్రాంతముల పినాకినీనదీతీరమందలి కమలాపుర మని చెప్పఁబడినది. రచించినది పార్వతీపరమేశ్వర పరిణయ మను ప్రబంధము.

**కృష్ణశీర్షకగోత్రము** — గవిష్ఠర గణము చూడుఁడు.

**కృష్ణుని వంశావళి**—వీరిది అత్రిసంతతి, చంద్రవంశము, పురూరవచక్రవర్తి, నహుషమహారాజు, యదుమహారాజు, సత్యవ్రతభూపాలుఁడు సంతతి క్షత్రియులు.

- సత్యవ్రత భూపాలుఁడు (సాత్వతుఁడు).
  - మహాభోజుఁడు. (వీరిసంతతి వారు భోజులనంబడిరి).
  - అంధకుఁడు.
    - భజమానుఁడు.
      - భోజుఁడు.
        - హృదికుఁడు.
          - కృతవర్మ
          - శతధనువు.
          - దేవమీఢుఁడు.
            - శూరుఁడు.
              - వసుదేవుఁడు. (భార్య దేవకీదేవి).
                - త్రివృష్ఠుఁడు.
                - కృతకుఁడు. (భార్య ధృతి)
                - బలరాముఁడు.
                  - కుమార్తె శశిరేఖ.
                - గరుఁడు.
                - విపులుఁడు.
                - సారణుఁడు.
                - కృతముఖ్యుఁడు.
                - సుధన్వానుఁడు.
                - శ్రీ కృష్ణుఁడు.
                  - ప్రద్యుమ్నుఁడు.
                    - అనిరుద్ధుఁడు.
                  - చారుదేష్ణుఁడు.
                  - సుచారుఁడు.
                  - భద్రచారుఁడు.
                  - తామ్రుఁడు.
                  - చక్రుఁడు.
                  - సాంబుఁడు.
                  - చిత్రవంతుఁడు.
                  - సుసీధుఁడు.
                  - చిత్రబాహువు.
                - వసువు.
                - హంసుఁడు. (కౌశికుఁడు)
                - శూరుఁడు.
                - కుమార్తె సుభద్ర (అర్జునుని భార్య).
    - కంబలబర్హిషుఁడు.
    - శుచి.
    - కుకురుఁడు.
      - వృష్ణి లేక దుందుభి
        - దవిద్యోతుఁడు లేక అభిజిత్తు.
          - ఆహుకుఁడు.
            - దేవకుఁడు.
              - దేవకీదేవి. (వసుదేవుని భార్య)
            - ఉగ్రసేనుఁడు.
              - కంసుఁడు.
              - తుష్టిమంతుఁడు.
  - దేవావృధుఁడు.
    - బభ్రువు.
  - వృష్ణి. వృష్ణి సంతతి అక్రూరుఁడు, సత్రాజిత్తు (సత్యభామ తండ్రి), సాత్యకి మొదలగువారు. (సత్రాజిత్తు వంశావళి చూడుఁడు).
  - దివ్యుఁడు.
  - భజి.
  - భజమానుఁడు.

**కృష్ణాంగారక చతుర్దశి** — కృష్ణపక్షమున చతుర్దశిని మంగళవారము సంభవించునేని దానిని కృష్ణాంగారక చతుర్దశి యనెదరు

**కృష్ణాగరుచెట్టు** — లా. Aquilaria aquallocha ఆంగ్ల. Eagle wood అనియు, Aloe wood tree ఈచెట్టుయొక్క సారము గట్టిపడి అగరగును అగరు సుగంధద్రవ్యము గాన విలువంగల్గి యున్నది. అగరుతైలమును అమ్ముకుపోవు సుగంధద్రవ్యమే. అగరును సంస్కృతమున అగరు, విశ్వధూపకమ్, శీర్షమ్ అని యందురు. ఇది ఇరుగుడుచేవ చెట్టుజాతిది

అగరు-కర్ణరోగములు, క్రిమి, కుష్టురోగము, చెమట, దుర్గంధము (శరీరమునగల్గు దుర్వాసన), నేత్రరోగములు, బొల్లి, మేహము, వ్రణములు, వాతము, విషము, శ్లేష్మ రోగము, శోషలు కొట్ల పడుచునని చెప్పఁబడినది. ఆరోగ్య మొసగు వాసన గలది.

**కృష్ణాగరు సంస్థానము** - ఇండియాయందలి రాజపుటానా ఏజన్సీలోని బ్రిటీషు రక్షిత సంస్థానము లిరువదింటిలో నొకటి (రాజపుటానా ఏజన్సీ చూడుఁడు) కృష్ణాగరుపురము రాజధాని.

**కృష్ణాజని గోత్రము** — పరాశర గణము చూడుఁడు

**కృష్ణాత్రేయగోత్రము** - ఆత్రేయ గణము చూడుఁడు.

**కృష్ణాదేవి** - ద్రౌపదీదేవి చూడుఁడు.

**కృష్ణానది** (కృష్ణవేణీనది)— కృష్ణానది పడమటి కనుమలందు (Western Ghats) మహాబలేశ్వర మను పురపరిసరములం దుత్పన్నమగును. జన్మస్థానమున దేవస్థానము శివలింగము కలదు. దేవాలయమున శివలింగము కడనే జన్మించును. ఇది యాత్రాస్థలము. దీనిం గూర్చిన ప్రశంస రామాయణము కిష్కింధకాండ ౪ అగ్నిపురాణము ౧౧౮ యందునను కలదు

ఇందు వేణీనది సంగమమైన కడనుండియు కృష్ణవేణి యను పేరం బరగుచున్నది. కృష్ణకర్ణామృతము రచించిన బిల్వమంగళ కవి కృష్ణానది పడమటి తీరమున నుండినవాఁడు.

కృష్ణవేణీ నదిం గూర్చిన ప్రశంస పద్మ పురాణము స్వర్గఖండము 3 అధ్యా ౨౮ శ్లో॥ కలదు.

**కృష్ణావతార హస్తము** — హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.

**కృష్ణాష్టమి** — (శ్రీకృష్ణజయంతి) దీనిని గోకులాష్టమియనియు నందురు శ్రావణ బహుళ అష్టమి స్మార్తులు శ్రీకృష్ణుని జన్మదినముగ నాఁడే పూజింతురు. రామానుజీయ శ్రీవైష్ణవులు శ్రావణబహుళ అష్టమి, నవమి, దశమి తిథులలో నెప్పుడైనను రోహిణీ నక్షత్రము సంభవించిన రోజు యుండఁజూచి, శ్రీకృష్ణజయంతి జరిపి పూజింతురు ఒకవేళ యట్లు సంభవించనిచో సౌరమాససింహ (అవణి) మాసమున ఎనిమిది, తొమ్మిది, పది తిథులలో నెప్పుడైనను రాత్రియందు రోహిణీనక్షత్రము సంభవింపఁజూచి శ్రీకృష్ణజయంతిం జరుపుదురు. వారికి రోహిణీనక్షత్రము రాత్రియందుంట ప్రధానము.

ఇంక మాధ్వులగు వైష్ణవులకు రాత్రి నియమము లేదు. అష్టమి, రోహిణి కలియుటయే ప్రధానము. స్మార్తులకు తిథియే చాలును.

ఈ తిథిని (అష్టమి) రోహిణీనక్షత్ర మర్ధరాత్రమునం దుంటయు, తులానాథుండగు శుక్రుఁడు ఉదయించుటయు సంభవించునేని దశఫలవ్రత మాచరించు పర్వదినమగును.

**కృమ్య (క్రియ)**-పతాకహస్తముచేత ఎడమ ప్రక్కకు (వంకకు) చేయి చాచిన (సర్పిణి చూడుఁడు), ఆ చేతిని ఎడమనుంచి కుడిపార్శ్వమునకు రానిమ్చుటకు పేరు.

ఇది సంగీతశాస్త్రమున క్రియాప్రాణములోని దేశ్యక్రియ లెన్మిది విధములలో నొకటి. (క్రియా ప్రాణము చూడుఁడు).

**క్రూప్ (క్రుప్పు) కర్మాగారము**-ఆంధ్రదేశమునకుఁగాని, భరతదేశమునకుంగాని, ఏసంబంధము లేనిదయ్యు నీ కర్మాగారము ఐరోపామహాసంగ్రామమున బ్రిటిషు ఇండియాకును, వైరమున బద్ధకంకణులైన జర్మనులకు కుడిభుజమై, పరికరమై, చేదోడై సంగరమునెరపు సాధనసంపత్తిగ దనరుటయేగాక పిదపను ప్రపంచమందలి గొప్ప పరికరములలో పేరందిన నీ కర్మాగారముం గూర్చి ఆంధ్రవిజ్ఞానమున వివరించుట సమంజసము కాకపోదు.

క్రూప్ అను పేరుగల జర్మను కుటుంబము ఉక్కు, ఇనుము, తుపాకులు, రైల్వే సామానులు, ఎంజినులు, ఫొటోగ్రాపు కెమేరాలు, మోటారుయంత్రములు, మొదలగువాటి నిర్మాణ కర్మాగార సందర్భములందు పేరందికొనెటుంబము. ఆదిని Friedrich Krupp అనునాయన క్రీ. వె. ౧౭౮౭-౧౮౨౬ కాలమునాటివాఁడు. ఈతఁడు జర్మనుదేశమందలి Essen పుర వాస్తవ్యుఁడు ఆ పుర మదివరకే ఇనుప, ఉక్కు పనులకు తావుగ నుండ నందొకచో నీ ఫ్రెడరిక్కు-క్రూపుగారు పనివాఁడుగనుండి ఇనుమునుండి ఉక్కుఁదీయు విధానములు, ఉక్కుయొక్క నిజతత్వమును పరిశీలించుచుండువాఁడు. కొంతకాలమున కాతఁడు ఉక్కును (Cast steel) తాను చేయుట వృత్తిగ గైకొనదలంచి కొల్వుమాను తాని Friedrich Nicolai అను భాగస్వామిం గూర్చుకొని ప్రత్యేకముగ నాయూర నేవేఱొకచో కర్మాగార రహస్యస్థలమున గుప్తముగ ఉక్కుం జేయ నారంభించెంగాని అదిలాభముం గూర్పమి ఆ వ్యవహారము మానివేసియు నా ఫ్రెడరిక్కు-క్రూపుగారు భార్య పిల్లలుంగలసి తామే యా వృత్తి చేయుచు బ్రతుకుచుండిరి. ఇది క్రీ. వె. ౧౮౧౧ వ సంవత్సరము. ఆయన ౧౮౨౬ లో మరణించ నాయన యాలుబిడ్డలాపనినే సాగించ సాగిరి. రానురాను క్రీ. వె ౧౮౪౮ నాటికి వారికి మంచిదినములు పొడసూపెను.

సుతునిపేరు Alfred Krupp గారు. ఆయన నాఁడు ఒకపాటి స్థితి చేకూరెను. చిన్నకర్మాగారమును ఏర్పడియెను. ఆయన ౧౮౮౭ జూలై ౧౪ తేదీని మృతినంద, ఆయనకొమరుఁడు Friedrich Alfre ( Krupp గారావృత్తినే యవలంబించి యాకర్మాగారమునే నడపుచు అభివృద్ధి నందుచు ధనము నిల్వజేయు చుండెను. ఈయన ౧౮౯౩-౧౮౯౮ ఆదేశపు శాసన నిర్మాణసభయగు Riech Stag నందు సభ్యుఁడుగ నుండెనట. ఆతఁడు ౧౯౦౨ నవంబరు ౨౨ మృతి నందెను. ఈయనకు సుతులు లేరు, Bertha యను పేరుగల కుమార్తె మాత్రముండెను. ఆమె ౧౯౦౬ లో Gustav Von Bohlenund Halbach అను ప్రభుత్వోద్యోగిని పెండ్లియాడెను. నాతఁడదివరకు German Diplomatic Service నందుండ దానిని వదలివేసి క్రూప్ అదృష్టనామమును తానును ధరించి అంతటినుండి Krupp Von Bohlenund Halbach అను పేరం బఱగుచు భార్యను సంతోషపర్చుచుండువాడట. ఈయన క్రీ. వె. ౧౮౭౦ లో జన్మించెనట.

క్రీ. వె. ౧౮౪౭ లో ౧౨౦ మందిపనివాండ్రు మాత్రముండిన కర్మాగార మిప్పటికి చాల బలపడియెను. టంకశాల యందు ఉక్కు, రాగి

పాల్లుగూర్చి మొదట చూపిన దీకర్మాగారమే. జర్మను టంకశాలకు రోలర్సుం జేసియిచ్చిన దీకర్మాగారమే. ఇనుపదారి బాటలకాదేశమున పరికులను, ఇంజనులను ఇచ్చిన దీకర్మాగారమే. యిరోపా మహాసంగ్రామ కాలమున యుద్ధపరికరములు, యుద్ధాయుధములు మొదలగున వన్నింటిని గొడవ లేకుండ నిచ్చిన దీకర్మాగారమే. ఒక్క జర్మనీకే గాక యిరోపా ఇతర దేశములకు ఆయుధ వితరణ జేసి యిచ్చిన దీకర్మాగారమే. ఇప్పుడు గొప్పగొప్ప ఓడలనుయుద్ధనావలంగూడ గట్టుటకు వీలుగ సముద్రతీరమున నొక శాఖా సంస్థను నిల్పిననట.

---

**కె అక్షరమునకుంజెందిన క్రైస్తవ పురుష నామములు** - Karl, Karol- ట్యూటోనిక్కు పేరు. (Charles కు ప్రతిరూపము). మనుష్యుడని యర్థము.

**Kay**- లాటిను నామము, Rejoicing అని యర్థము.

**Kean, Keanny**- ఐరిషునామము. Vast అని యర్థము.

**Keith**- నవీన స్కాచిపదము.

**Kenelm**- ఆంగ్లో సాక్సను పదము, Protector of his kindred అని యర్థము.

**Kenneth**- కెల్టిక్కు పదము, స్కాచిదేశ ప్రచారమున గలదు. Leader అని యర్థము.

**Kester**- Christopher చూడుడు.

**Kitto**- గ్రీక్కు పదము, క్రీస్తును వ్రోయువాడని యర్థము.

**Konard**- ట్యూటోనిక్కు పదము, Bold speaker అని యర్థము. (Conard చూడుడు).

**Kivas**- నవీన కల్పిత పదము.

**Kormak**- కెల్టిక్కు పదము, Son of a chariot warrior అని యర్థము.

**Kosmos**- గ్రీక్కు పదము, Order అని యర్థము.

**Kynaston**- నవీన పదము, (ఉచ్చారణ kinn-aston అని).

**కె అక్షరమునకుంజెందిన క్రైస్తవ స్త్రీల నామములు** — Katherine, Katharine, Katarina, Katrine- గ్రీక్కుపదములు, పరిశుద్ధతయని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేరులు. Kate, Katica, Kati, Katie, Katy, Katra, Katla, Katty, Kitty అనునవి. ఇవి Katherine అను పదము వంటివియె.

**Kathleen**- ఐరిషుపదము, పరిశుద్ధత యని యర్థము ఇదియును Katherine, Catherine పదములవంటిదె.

**Konstantia**- లాటిన్పదము, అచంచలమని యర్థము.

## కెంటకీ మహాకందరము (గుహ)

**(Mammoth cave of Kentucky)** — ఈ గొప్పగుహ కెంటకీ సీమయందు అమెరికా

సంయుక్త రాష్ట్రములలో నున్నది. గుహయొక్క మధ్యభాగము మూడువందల అడుగుల వెడలుపును, నూట యిరువదియైదడుగుల ఎత్తును గలదిగ నున్నది. ఎత్తగు తావున రెండు ఎకరముల వైశాల్యము కలదందురు. ప్రధాన కందరమునుండి మార్గములు శాఖలవలె ఇతర గుహలకుం జనును. మార్గముల మొత్తము ౧౫౦ మైళ్లుండునందురు. ఇట వింతగొల్పు చిత్రములు-౨౫౦ అడుగుల ఎత్తునుండిపడు జలపాతము, దీనిచుట్టును Draperies of stalactite చూడదగినవి. అన్నిరంగుల స్ఫటికము లీగుహయందు గాననయ్యెడిని నీరు చేరుకొనుచు అనేక సరస్సులుగ నేర్పడు River hall ను, ఒక మార్గముగుండా నడచుచుండు Echo river యొక్క దీర్ఘములగు ప్రతిధ్వనులు చూడ వింత గొల్పకపోవు. గుహయందు గుడ్డిపక్షులు, గుడ్డి చేపలు కలవందురు.

**కెంట్లెడ్జి** (Kentledge) - వాణిజ్య సంబంధ పరిభాషాపదము. ఓడయందు సరకున్నను లేకున్నను విధిగ నుండితీరవలసిన ఇనుప దుక్కలు మొదలగు బరువు సామానులు.

**కెందూలీ** (జయదేవుని జన్మస్థానము) — బంగాళా రాజ్యమున వీరభూమి (బీర్భూమ్) జిల్లాలో అజయా నదీతీరము నందున్న చైతన్య మతస్థుల యాత్రాస్థలము. ఇది సుప్రసిద్ధ భక్తి గీతమగు గీతగోవిందమును రచించిన జయదేవ కవి జన్మస్థానము. ఇతఁడు చైతన్య మతస్థుఁడు. గొప్పభక్తుఁడు.

**కెంపు** (Ruby-రత్నము)- ఇదియు నవ రత్నములలో నొకటి. ఇది Corundum (కురువిందము) జాతి Mineral సంబంధము. కొందఱు Beryl సంబంధము కలదనిరందురు. కురు విందమును రసాయన శాస్త్రజ్ఞులు Oxide of aluminium అనెదరు. కెంపు ఎఱ్ఱని రంగు గలది. రంగు దట్టమైయుండిన శ్రేష్ఠము. గులాబీ రంగు కెంపులును కొన్నికలవు. Carmine రంగు కెంపులును కలవు. గువ్వపిట్టల రక్తముం బోలిన రంగుల కెంపు లధిక మూల్యముల కమ్ముడు పోవును. (రత్నము, రత్నములు చూడుఁడు).

## కేజియిన్ లేక పెరుగు పరిశ్రమ-

కేజియిన్ (పెరుగు) అనునది పాడిజంతువు లన్నిటి పాలనుండియు సంగ్రహింపఁబడు పదార్థము అది పాలనుండి మీఁగడ తొలగించి తయారు చేయఁబడును. అనఁగా మీఁగడ తీసివేయగా మిగిలెడి పాలే పెరు గగును. ఆవు పాలలో నది ౨ మొదలు ౪.౫% వఱకు నుండును. సగటున 3.౨% ఉండునని చెప్పవచ్చును. అది పాలలోకలియదు. మీఁదను తేలియుండును. పాలలో నది యుండుటవలన నసాధారణమగు గుణము లభించు చున్నది. ముఖ్యముగా వట్టి జిడ్డువలననే మీఁగడ సులభముగా వేఱుచేయఁబడుచున్నది. పాలను కాగబెట్టుట వలనగాని, మరగించుటవలనగాని Casein గుణముమారదు. అది మనము సామాన్యముగా చేయునట్లు తోడు పెట్టుటవలననే జలమిశ్రితములైన లోహ ద్రావకములుగాని (Mineral Acids), జంతు ద్రావకములు (Organic Acids), గాని తయారగు చున్నవి. తోడుకొని గడ్డకట్టిన పెరుగు నీటిలో గాని నీరుకలిపిన ద్రావకములలోగాని (Dissolve) నేరదు. పెరుగు తయారు చేయుటకు రెండు సాధారణ విధానములు కలవు.

Milk Sugar అనఁగా పాలలోని శర్కర పులియబెట్టుటచే వేఱు చేయఁబడి అందువలన కలిగిన Lactric Acid మొదలగునవి పెరుగై తోడుకొని గడ్డ కట్టునట్లు చేయును. సాధార

ణముగా మనము పెట్టు తోడువలనఁగూడ నీఫలితమే లభించుచున్నది. ఇందులో మొదటి పద్ధతివలన పరిశుభ్రమైన Casein లభించును రెండవదానివలన మామూలు పెరుగే లభించును. దీనిని Paracasein అందురు. అందుచే నివి రెంటును అవలంబింపఁ దగినవియే. పరిశుభ్రమయిన పెరుగు Casein లభింపవలెనన్న పాలు 140° F డిగ్రీల కధికముగా కూడదు 68° F డిగ్రీల వేడిమికి తక్కువగాకుండగ కాచవలయును. ఇంతకన్న నధికము వేడిమి యున్నయెడల పాలు తోడుకొనక విరిగిపోవును

తోడుబెట్టు పాలు ఒక Enamel పాత్రలోఁ బోసి కలియఁబెట్టుచుండు నేర్పాటు చేయవలయును. తోడు వేయుటకుఁ దగిన వేడిమి వచ్చు వరకు కాచవలయును మొదట మార్పేమియుఁ గనిపించదు కాని క్రమక్రమముగా పాలు తోడుకొన నారంభించును. 95° F డిగ్రీల వేడిమి గల పాలను పెరుగుచేయుటకు పదివేల భాగములకొక భాగము తోడు చాలును. రెండు భాగములు చేర్చిన యెడల సగము కాలములోనే తోడుకొనును లేదా ఆకాలములోనే అంతకు రెట్టింపు పాలు తోడుకొనునట్లు చేయును.

పాలనుండి వేఱు చేయఁబడిన Casein నకు Curd లేక పెరుగు అని పేరు.

**కెథటోమీటరు** (Cathetometer)- ఎత్తులలో గల చిన్న చిన్నవగు స్వల్ప భేదములం బరిశీలించు కొలత పరికరము

ఇది సూక్ష్మదర్శినితో సహా వాడఁబడఁ దగినది

**కెనాలైజేషన్ పద్ధతి** - దీని నాంగ్లమున ఇట్లు వల్కుదురు. Canalisation of *Shallow Rivers* అనుట సమంజసము. వర్తకము విస్తారముగ జరుపఁదగిన ప్రదేశమందలి ఒక మెరకనదిలో పడవలు నడవనిచో ఆనదిఁ ద్రవ్వి లోతుచేయుట అంత స్థిరముగ నిలువక మేట వేయుచుండుట నిజమని Engineering ఈపద్ధతి నవలంబించినది. నదియందు పడవలు పోవఁగినంత లోతున నీరు నిలచునట్లుగ మెరకనుండి పల్లముకరగు తావులందు ఒక్కొక Weir ను నదికడ్డముగ నిర్మించుచో దాని ప్రక్కగనే ఒక లాకును నిర్మించెదరు. అనఁగా లాకు ఎగువ మెరకనీటినుండి దిగువ పల్లమునందలి నీటికి పడవ లాదింపుటగాని, పల్లమునుండి మెరక కెక్కించుటకుగాని వీలు కలుగఁజేయును లాకు ప్రక్కనుండుటయే నది కడ్డముగ నిర్మింపఁబడిన Weir ఇట్టుల నది విభజింపఁబడిన అన్ని భాగములందు ఒకే లోతున నీరు నిలచు నట్లొనర్చును. దీని నింకను 'వీరు' నందలి చిన్నతలుపులతో సరిచేసుకొనుచుందురు. ఇందువలన నానదియందు దిగువనుండి ఎగువకును, ఎగువనుండి దిగువకును సరకులతో పడవలు సుకరముగ లాకులగుండా దిగుచు, ఎక్కుచు పోనగును. దీనిని కెనాలైజేషన్ అనియెదరు

ఇటులనే ఇంగ్లాండు దేశపు థేమ్సునదియు, ఫ్రాన్సు దేశపు సీనునదియు కెనాలైజేషను సంస్కారముల నొందినవియె

**కెన్నరీ ద్వీపములు** (Canary Islands) — ఇది ఒక అర్కిపిలెగో అని చెప్పఁబడినది. అట్లాంటికు మహాసముద్రమున ఆఫ్రికా తీరమునుండి అరువదిమైళ్ల దూరమున గలవు. ఈ ద్వీపములందు ప్రధానమైనది Grand Canary ద్వీపము. తక్కినవి Teneriffe ద్వీపము, Fuerte లేక Ferro ద్వీపము, ఇంకను కొన్ని చిన్నవి కలవు. ఇవి స్పానియా వారివి. వారు వీటిని పరిపాలనకై యొక పరగణాగా పరిగణించుచున్నారు. వీటి అన్నిటి వైశాల్యము ౩౨౦౭ చతురపుమైళ్లు, జనాభా

౪,౭౩,౪౯౭ అని క్రీ. శ. ౧౯౩౦ సంవత్సరమున లెక్కింపఁబడినది. వీరందఱు స్పానియర్డ్సు తెగవారే. ఈద్వీపములందు Santa Cruz అనునది ప్రధానపురము. Teneriffe ద్వీపమున ఆపేరుగలపురము కలదు. ఇంకను Los Palmas అను పురము వర్తకస్థలము. ఆరోగ్యమునకై పెక్కండ్రిట కేగుచుందురు. ద్వీపములందు Canary wine చేయుదురు. (ఆఫ్రికాఖండమునకుం జెందిన పండ్రెండుద్వీపములు చూడుఁడు).

**కెన్యాదేశము** — బ్రిటీషుకోలనీగా ఆఫ్రికాఖండము పూర్వుగా హిందూమహాసముద్రతీరమున ౬౦౦ మైళ్లదనుక వ్యాపించియున్న దేశము, పర్వతమయము. అందు కెన్యాశిఖరమునుండి పేరందిన దేశము ౨,౨౪,౯౬౦ చతురపుమైళ్ల ప్రదేశము టాంగినాయికా, సూడాను, అబిసీనియా, సోమలీలాండు దీనిసరిహద్దుల నున్నవి నైరోబీపురము ప్రధానస్థానము. మొంబాసా, కిల్లిందిపురములు వర్తకముగల రేవులు. విక్టోరియాసరస్సుతీరమున కిసుము పురము రేవుస్థలము. కాఫీ, ప్రత్తి, రబ్బరు, జొన్నలు, పంటలు. గొఱ్ఱెలకు, నిష్వాకోళ్లకు ఫారములు కలవు జనాభా ౩౦,౭౬,౩౪౩. అందు ౧౬,౮౦౦ యూరోపాదేశస్థులు, కొందఱు భారతీయులును కలరు.

**కెప్లరుపండితునిసిద్ధాంతములు**- ఆకాశగోళముల గమనవిధానములను ఈయన సిద్ధాంతములు మూడును ప్రధానధర్మరహస్యములని ఎస్ట్రోనొమీ శాస్త్రవేత్త లెఱుంగనిది కాదు. ఈమహనీయుని సిద్ధాంతములన్నియు ఈయన పరిశీలనలపై నాధారపడుటకుందోడు, ఈయన గురువగు టైకోబ్రాహీపండితుని పరిశీలనవ్రాతలపై ముఖ్యముగ నాధారపడియుంట నీసందర్భమున నీయనపేరును ముందాయనపేరును నుడువవలసియుండదగినది. (టైకోబ్రాహీ పరిశీలకుఁడు చూడుఁడు, కెప్లర్సు త్రి లాస్ ఆఫ్ ప్లానెటరీ మోషన్సు చూడుఁడు).

కెప్లరు ధనికుఁడుకాఁడు. శరీరపటిమయు అధికముగ కలవాఁడుకాఁడు. గొప్పమేధావి చక్కని భాషాజ్ఞానము గల్గిన లేఖరి. ఊహాపోహాలంగల్గి వాటిని వ్రాతయందు వివరింపఁగల్గిన బుద్ధిశాలి. గణితశాస్త్రవిశారదుఁడు. అతివేగిరము గ్రహింపఁగల శక్తిఁగల్గినవాఁడు. ఈయన జననము క్రీ. శ. ౧౫౭౧ డిశెంబరు ౨౧ యనియు, మృతి ౧౬౩౦ యనియుఁ జెప్పంబడినది. ట్యూబింజన్‌పురపు కళాశాలయందు పట్టపరీక్షయందు కృతార్థుఁడైనవాఁడు కోపర్నికస్ పండితుని సిద్ధాంతము నంగీకరించి భూమధ్యసిద్ధాంతము నిరశించినవాఁడు. (కోపర్నికస్ పండితసిద్ధాంతము చూడుఁడు, భూమధ్యసిద్ధాంతము చూడుఁడు) ఈతని పేరు జాన్ కెప్లరని కొందఱనెదరు ఈతఁడు గ్రాజువిద్యాశాలలో కొంతకాలము ఎస్ట్రోనొమీ శాస్త్రోపాధ్యాయుఁడుగ పనిచేసెనవాఁ డని యందురు.

టైకోబ్రాహీపరిశీలకుఁడు బొహీమియాదేశపు రాజధానియగు ప్రేగునగరమున జ్యోతిషాలయమున పరిశీలనలొనర్చుచుండుతరి క్రీ. శ. ౧౫౯౯ లో ఆయనకడ కేగి యాయనశిష్యుం డాయెననియు, ఆయన క్రీ. శ. ౧౬౦౧ లో మృతినందుతరి ఆయనపరిశీలనకాగితములన్నియు ముఖ్యశిష్యుండగు జాన్ కెప్లరుగారి వశమొనర్చుచు సద్వినియోగ మొనర్చు మని దీవించె ననియుఁ జెప్పంబడినది. పిదప కెప్లరుగారే ఆజ్యోతిషాలయమున ప్రధానవిద్వాంసుం డాయె నని యందురు.

కెప్లరు పరిశీలకుఁడు-మానవనేత్రపు నిర్మాణముంగూర్చి, యొకగ్రంథము వ్రాసెనందురు. సము

ద్రపు పోటుపాటులంగూర్చి యొక గ్రంథము వ్రాసె నందురు. ఇంత సన్నిహితమౌ గ్రంథము లీయనవి ద్రవ్యహీనుఁడగుట ముద్రింపఁబడక యంతరించిన వనుచున్నారు. ఈపరిశీలకుఁడొనర్చిన ముఖ్య కార్యములఆకాశగోళములు సూర్యునిఁజుట్టి తిరుగ కరి నవి చక్రమువలె వృత్తాకార (గుండ్రముగ) గమనమా లేక అండాకార (కోడిగ్రుడ్డువలె ఇంచుక కోలగ) గమనమా యనునది నివారించుటయై యున్నది. ఆదికాలమున గ్రీకు దేశస్థులలో నగ్రగణ్యుండగు ఆరిస్టోటల్ పండితుఁడే పొరబడి ఇవి చక్రగమనమున తిరుగుచుండునని యభిప్రాయ పడియెను. యూరోపు దేశమువారందరూ దానినే నమ్మియుండిరి. కెప్లరు పండితుఁడు తానుపరిశీలన లొనర్చి గణించి తనగురుఁడగు టైకోబ్రాహి పండితుని కాగితములతో సరిచూచుచు గోళముల గమన మండ రూపముగాని, చక్రరూపముకాదని ఋజువుచేసి చూపుచు క్రీ. శ. ౧౬౦౯ వ సంవత్సరములో ఒక గ్రంథము వ్రాసి ప్రకటించెను.

కెప్లరు పండితుఁడు ఖగోళ చలన విధానము మూడుభాగములుగ విభజించెను. వాటిని కెప్లర్సు త్రీ లాస్ ఆఫ్ ప్లానిటరీ మోషన్సు అనుచున్నారు. అకాలమున కొందఱు అసూయాగ్రస్త చిత్తులు వాటిని నిరశించినను రానురాను అవియే సరియైనవిగ తలంపఁబడి వాడుకనందినవి. అందు కడపటిదగు మూడవ లా (సూత్రము) సుబోధకమగు నటుల ఆయాకాలను కెప్లరు పండితుని గుణకమును పరిశీలించవలసి యుండెడిని.

భూమి- సూర్యునుండి దూరము ౧ ౦౦౦౦, చుట్టివచ్చుకాలము ౧ ౦౦౧౦, కుజుఁడు- సూర్యునుండి దూరము ౧ ౫౨౩౭, చుట్టివచ్చు కాలము ౧.౮౮౦౮; బుధుఁడు- సూర్యునుండి దూరము ౦.౩౮౭౧, చుట్టివచ్చు కాలము ౦.౨౪౦౮, గురుఁడు- సూర్యునుండి దూరము ౫.౨౦౨౮, చుట్టివచ్చు కాలము ౧౧.౮౬౨౦; శుక్రుఁడు- సూర్యునుండి దూరము ౦.౭౨౩౩, చుట్టివచ్చు కాలము ౦.౬౧౫౨; శని- సూర్యునుండి దూరము ౯.౫౩౮౮, చుట్టివచ్చు కాలము ౨౯.౪౫౨; వీటిలో దూరము to the power of three, కాలము to the power of two యును ఒకటిగనై సరిపోవును.

## కెప్లర్సు త్రి లాస్ ఆఫ్ ప్లానెటరీ మోషన్సు — (Kepler's three laws of Planetary Motions)

వీట్లను, సర్వసాధారణముగ, ఎస్ట్రోనోమీ శాస్త్రమునందు Kepler's three laws అని వాడుచుందురు. ఈ విధానములు మూడుగలసి Planets సూర్యునిం జుట్టి తిరుగుటకు వలయు పద్ధతులను సూచించెడిని.

ఆదికాలపు ఎస్ట్రోనోమీ వేత్తలగు Tycho-Braho పండితులు ప్రతి Planet నూ తిరుగు మార్గము గుండ్రముగా సూర్యునిచుట్టూ ఉండు ననియు, దాని centre (ధమ్యకేంద్రస్థానము) సూర్యునకుం గనుసమీపముననే ఏదోయొకతావుగ నుండుననియు, ఏర్పఱిచియుండిరట. దానిని ఖండించి ఈ కెప్లరుపండితుఁడు తనవిధానము సరియైనదని ఋజువుపరచెను. ఈయన Danish Astronomer అనియు ఈయన Mars గోళముంగూర్చి De Motibus Stellae Martis అను గ్రంథమును రచించి అందీసంగతి విమర్శించి వివరించెననియుం జెప్పంబడినది. మరియు నందే ఈయన పరిశీలనలు తొమ్మిదేండ్లకాల మొనర్చె నని తెలిపెను.

1. Every planet moves in an ellipse with the sun in one of the foci.

2. The straight line drawn from the centre of the sun to the centre of the planet (the planet's "Radius Vector)"

sweeps out equal areas in equal times.

The squares of the periodic times of the several planets, are proportional to the cubes of their mean distances from the sun.

ఇందు మొదటిది, రెండవది, భూమింగూర్చియు, మూడవది భూమింగూర్చియు తక్కిన Planets గూర్చియు సరిపోవుచున్నవనియు చెప్పంబడినది.

ఈ కెప్లరు పండితుడు వృత్తాకారమార్గముల క్రింద వివరింపబడిన విధానము (law) ను వివరించియున్నాడు. ఇదియు Third law for circular orbits అని వాడంబడుచున్నది

3. To compare the Sun's attractions on different Planets assuming that the orbits are circular, and that the squares of the periodic times are proportional to the cubes of the radii

**కెమికల్లీ ఫారమ్డు రాక్సు** — (Chemically formed rocks) సముద్రపు నీటి ఉప్పుకణ్జాలా దీరాళ్ళు గానగుచుందును. ఇంగు సముద్రలవణము Sulphate of Lime or Gypsum చేరియుండు భాగములని పరిశీలకులు తెల్పుచున్నారు. జర్మనీదేశమందలి Slassfurt కడ నిట్టి రాళ్లు విస్తారముగ గొప్ప విలువంగలవి కలవు. దక్షిణదేశమునందు రామేశ్వర ద్వీపమున నివి తఱుచు గానంబడుచున్నవి. అవి చిత్రవిచిత్రాకారములంగల్గియుండుట గానవచ్చెడిని.

ఈరాళ్ళయందు ౧. Silica ఖండములు అధికముగా గల్గినవి. ౨. మెత్తని బురద అణువులధికముగా గల్గినవి. 3. Carbon compounds అధికముగా గల్గినవి. ౪. Lime compounds అధికముగా గల్గినవి. ౫. Silica in solid flinty masses విస్తారముగ గల్గినవి యని తెలియు తెగలుగ బాహ్యాకారములంబట్టి విభజింప వీలుగల్గియున్నను రసాయనవేత్త లిట్లు విభజించిరి. 1. Detritic లేక bult from inorganic rock debris. 2. Organic లేక bult from remains of plants or animals. 3. Chemical లేక Chemically formed rocks. ఇవి సీమసుద్దయుండు తావుల నడుగు భాగములందు చెకుముకి రాళ్ళవలె నేర్పడునవి. ఇవి Silica యొక్క Impure form అనియు దాని Quartz కొంత స్వచ్ఛత గలదిగ నుండు ననియు జెప్పంబడినది. ఇవి సీమసుద్దలోని మార్గములగుండా జారిన నీటినుండి ఏర్పడునవి.

**కెమిస్ట్రీ** (Chemistry) — రసాయన శాస్త్రము. శాస్త్రములు మూడింటు నైసర్గిక పదార్థ రసాయనశాస్త్రము. ఇది alchemy లోని భాగముగా నెన్నంబడుచున్నది. ఏపదార్థమోతెంత ఎందెందు గలసియుండునో వాటిని విమర్శించి వివరించు కళ. దీనిని రసాయనశాస్త్రమని సాధారణముగ నెందురు. ఇది (రసవాద) శాస్త్రము చూడుము.

**కెమోరిజమ్** (Camorrism) — భయపెట్టుట లేక వెరపించియు బలాత్కరించియు పరిపాలనము నడపుటనుగూర్చిన కళ. ఇటలీ దేశపు మాటనుండి జనించినది.

**కైయిన్** (Cain) — క్రైస్తవమతమునను, మహమ్మదీయ మతమునను చెప్పంబడిన ఆదిదంపతులగు ఆదమ్ ఈవులకు తొలిచూలి కుమారుండు. ఈతని తమ్ముండు ఆబెల్ ఇతనిం జంపి దేశాటన మొనర్చి కడకు రామేశ్వరమున నితని జాతి గోరిచేసి, తానుంజచ్చి ఆ ప్రక్కనే గోరిచేయంబడెను. (ఆబెల్ కాబెల్ చూడుము).

ఆబెల్ కుమారుని పేరు ఎనోచ్. అతని పేరునను ఒక పట్టణము నిర్మించెనట. అదియే మొదటి పట్టణమని చెప్పంబడినది. మరియు నాతండును

తన సంతతిలోనివాఁడేయగు లమేచ్ అనువానిచే ప్రమాదముగ జంపఁబడి మృతిఁజెందెనని యూద మత గ్రంథములఁ జెప్పఁబడినది.

**కెయిసన్ ఫౌండేషన్** (Caisson foundation) — పునాది చూడుఁడు.

**కెయిసియమ్ లోహము** (Caesium) — ఇది తెల్లని వెండివలెనుండు నొక లోహము. దీని నాఁగ్లరసాయన శాస్త్రము Alkaline metal అనియెదరు. దీని కెమికల్ సింబల్ Cs అనియు, Atomic weight 132.8 అనియు, Atomic number 55 అనియు, Specific gravity 1.87 అనియు, Melting point సెంటిగ్రేడు థర్మామీటరు 26.27 డిగ్రీల మధ్యనుండునని చెప్పఁబడినది. క్రీ. శ. 1860 సంవత్సరపు Spectrum analysis వలన కనుగొనఁబడి "Soft at ordinary temperatures" అనఁగ కనుగొనఁబడిన అప్పుడు మెత్తగ నుండు లోహము. Rubidium తో కలసి యుండును.

**కెరడాక్ కేరక్టేకస్** — (Caradoc Caractacus) కాట్టస్కాట్లాండు ప్రాచీన కాలమున బ్రిటను దేశపు యొక రాజు పేరని యెదరు. Beloved అని యర్థము పురుషనామము. (కెల్ట్ స్థల నామములు చూడుఁడు)

**కెరవానికా (పత్తి) వ్యవసాయము**— శాఖకడ ఫ లెనేని ఈజాతిపత్తి చాల లాభకరమైనది. ఇందు రెండు భేదజాతులు కలవు. ఒకదానిజాతి ప్రత్తి కట్టనగానోయి రెండవజాతి ప్రత్తి ఉన్నిగానోయియుండుట వాడికయగు కలుపుడుగియుండి ఎక్కువధర కమ్మనగున్నను. చెట్లు పన్నెండడుగులు పెరిగి నాటుబడ చెట్లగా యగును. యకరమునకు 600 చెట్లు నాటవగును. ఈ చెట్లు ముప్పదిసంవత్సరములు జీవించి కాచుచుండును.

తొలుత గోతియందు గంపెడు ఆకులు పేడ మొదలగు ఎరువులుపోసి వేఱుతావులపోసి యుంచినవారు నరిజాగ్రతగా గోతులలో నాటి, నీరుచుచెమ్మతప్ప నధికము వేళ్ళకు తగులకుండు పరిస్థితులలో మొక్కలుంచెంచి, ఏటేటపాతకొమ్మలుంగత్తిరించివైచుచు నీ వ్యవసాయము నరపవలయును. మొక్క స్థిరపడినపిదప శ్రేష్ఠమగు ఫలితము కల్గుచుండుట మొదలియును. నాటిన యారునెలలకే చెట్లు నాల్గుఅడుగులుఎత్తు పెరిగి కాయనారంభించును. (ప్రత్తి వ్యవసాయము చూడుఁడు). కెరవానియా ప్రత్తిచెట్టు లేటేట 300 మొదలు 400 వఱకుఁ గాయలుగాచును. దీని నంటురోగము నకు స్టెయినిల్ బోరరన్ అనంబడు పురుగుల వ్యాధి పట్టుచుండును అవి కొమ్మలుండు రంధ్రములందేయుచు చెట్టునుజంపెడిని వాటిని నరికి దూరముగా పారవేయుచుండవలయును.

**కెరౌలీ సంస్థానము** — ఇండియా దేశమందలి రాజపుటానా ఏజన్సీలోని బ్రిటీషు రక్షిత సంస్థానము లియవదింటిలో నొకటి (రాజపుటానా ఏజన్సి చూడుఁడు). కెరౌలీపురము రాజధాని.

**కెర్గ్యూలియన్ ద్వీపము** (Kargue-lion Island) — ఇది దక్షిణధృవప్రదేశము లందుండెడి అంటార్కిటిక్ సంబంధమగు ద్వీపమనియు, ఆఫ్రికా, ఆస్ట్రేలియాల నడుమకు తిన్నగా దక్షిణమున నుండు నదియుం జెప్పఁబడినది.

**కెల్టు జాతివారు** — స్కాట్లాండు దేశపు హైలాండర్సు యీ జాతివారనియు, ఐరిషు తెగవారు, వెల్షు తెగవారు, బ్రిటను తెగవారు, కెల్టు జాతివారని తెలియు చున్నది. కొందఱు కోర్నిషు తెగవారు కూడ కెల్టులే నందురు.

**కెల్ప్** (Kelp) – స్కాట్లాండు దేశమున సముద్రపు మొక్కలను (Sea weed) గోతులందుకాల్చి పచ్చి Sea weed తో కప్పివేడి నిలచునటులచేసి కాల్చిన బూడిద గడ్డలు. ఇది సోడా, ఉప్పు, పొటాషు, సాల్టు, ఐయోడైన్, అద్దములు చేయుటయందుపయోగించును. దీనిని ఫ్రెంచిదేశమున నార్మాండీసీమ యందునను కూడ చేయుదురట.

**క్రెడిట్** (లేక పరపతి) — (వాణిజ్య సంబంధ పరిభాషాపదము). Credit- పరపతి యని యర్థము. ఒక చిఠాయందు జమ్మువ్రాయఁబడుటకు Credited అనియు నందురు. ఆస్తి వలన గల పరపతి యని యెఱుఁగునది ఒక బ్యాంకివారుగాని, ఒక ధనవంతముగు వర్తక సంఘముగాని, ఒక ధనవంతుఁడగు వర్తకుఁడుగాని, తాను ఒక వర్తకున కింతసొమ్ము వఱకు నప్పియఁదగువాఁడని క్రెడిట్ నోట్ (Credit Note) ఇచ్చెదరు, లేక తమవానిమూలో Credit Letter యిచ్చెదరు.

**క్లెమెంట్** (Clement) — లాటిను నామము. రోముదేశమును పదునేనుగురు పోపుగురుస్వాములీనామము కలవారు. పురుషనామము. (క్రైస్తవనామములు చూడుఁడు).

**క్లెయిర్** (Clair)— లాటినునామము. ప్రసిద్ధిగల యని యర్థము. పురుషనామము. (క్రైస్తవనామములు చూడుఁడు).

**క్వయిటిజమ్** (Quietism) — క్రైస్తవ మతమునందలి వైరాగ్యయుతమగు సిద్ధాంతము.

---

**క్రేండియా ద్వీపము** (క్రీటీద్వీపము)— ఐరోపా ఖండమునకుఁజెంది టర్కీ దేశముకడ మధ్యధరాసముద్రమున నున్న యొకపాటి పెద్ద ద్వీపము. దీని పురాతనపుపేరు క్రీటీద్వీపము. ఆర్కిపిలెగో దక్షిణదిశయందున్నది ఫలవంతము సారవంతమునగు భూమింగల్గిన సౌందర్యవంతమైన ద్వీపము. టర్కీవారిక్రింద నుండినది. ప్రజల తిరుగుబాటు ప్రభుత్వపు పోట్లాటలమధ్య చిరకాలము దుస్థితియందుండి ఇటీవల ప్రత్యేక స్వపరిపాలన ప్రభుత్వమునందినది. ఉత్తరతీరమున నున్న కేండియాపురము ముఖ్యపట్టణము. దీనికిం జెందిన ద్వీపములు- సమోత్రాకీ ద్వీపము (తొల్లింటి సమోత్రేషియా ద్వీపము), థాసో ద్వీపము, ఇంబ్రోద్వీపము, లెమ్నో ద్వీపమును ఆర్కిపిలెగోలోనివి దీనికిం జెంది యున్నవి. (టర్కీ దేశము, ఐరోపాఖండము చూడుఁడు)

**కేంద్రములు** — జ్యోతిషశాస్త్రమునను లగ్నస్థానమునుండి నాలుగు, ఏడు, పది, మొదటి లగ్నస్థానముసహా ఈ నాలుగు స్థానములును కేంద్రస్థానములనఁబడును. ఇందు క్రూరగ్రహములకు బలమధికమని జ్యోతిషశాస్త్రమునందు చెప్పఁబడినది.

**కేకటుఁడు** — సంకటుని కుమారుఁడు. ఈతనికి దుర్గాభిమాన దేవతలు పుట్టిరని చెప్పఁబడినది.

**కేకయదేశము**— ఇది విపాశ (బీయాస్ నది) శతధ్రు (సట్లేజనది) నదుల మధ్యప్రదేశముగ పోల్చబడిన దేశము శ్రీరాముని తండ్రియగు దశరథ మహారాజు భార్యలలో నొకతెయగు కైకేయి కేకయరాజు పుత్రికయె. రాజధాని గిరివ్రజపురము, దానికి కొంతకాలమునకు గిరిజారను వాడుకనామము గల్గెనని కన్నింగ్హామ్ పండితుడు వ్రాసెను మఱియు ఆర్కియాలాజికల్ సర్వే రిపోర్టునగు వార్గిరాక్ పండితుడును దీనిని వివరించెను. ఇప్పుడు జలాల్పూరుకడ పాంచాలము నందున్నది. రామాయణము అయోధ్య కాండము ఎల యందు దీని ప్రశంస కలదు. (కేకయుడు చూడుడు.)

**కేకయుడు** – అత్రి సంతతి చంద్రవంశ క్షత్రియుడు తండ్రి శిబిచక్రవర్తి. ఇతనినుండి ఈతడేలిన దేశమునకు కేకయదేశమని పేరయ్యెను. దానికి గిరివ్రజపురము రాజధాని సోదరులు వృషదర్భుడు, సువీరుడు, మద్రుడు (కేకయదేశము చూడుడు).

**కేజారిక్షత్రియులు** — ప్రమారశాఖ క్షత్రియులు చూడుడు.

**కేదఖలేటి గోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుడు

**క్యేటబోలిజం** (Kataholism) — పదార్థములను విభజించి చిన్నచిన్న జీవపదార్థ పరమాణు విధానములుగ నముగ్ర విధానము దీనివలన నిరమించిన జీవాణువులు అర్థస్థితికి మారుచున్నట ఈవిధానమే యని చెప్పబడినది.

**క్యేటరాక్టు** (Cataract )—నది జలములు మెట్టనుండి పల్లమునకు దిగబోవు

**క్యేటికిజమ్** (Catechism) — ప్రశ్నోత్తరరూపమున బోధించు పద్ధతి.

**కేట్సుపా** (Cat's-Paw) — ఇంకొకరి వ్యయమున తనకార్యము జరుపుకొను గడుసుతనపు ప్రయత్నమున కిది వాడబడుచున్నది. ఒకప్పుడొక కోతి ఎవ్వరు లేకుండుతరి నొక వంటగదిం జొచ్చి అట పొయిపై వేగుచున్న ఒక గింజను అట నిద్రించుచున్న యొక పిల్లి కాలితో నీవలకుం దీయ యత్నించెనట. తన చేయి కాలకుండ నీవలకీడ్చి తాను దానిం దినం దలంచినటుల చెప్పబడిన యీ కట్టుకథ కొంత యసందర్భముగా గానవచ్చుచున్నను వ్యయ మన్యులకగు దగులుటతో తన కుపయోగించు కొనదలంచు గడసరులనుగూర్చి using Cat's Paw అను ఉక్తిని వాడు చున్నారు.

**కేడూసియస్ధ్వజము** (Caduciaus) ఇది తొల్లింటి కాలమున గ్రీకులు యుద్ధకాలములందు దండయాత్రలందు వాడుచుండిన ధ్వజము. తలపై నొక గరుత్మంతుడును క్రిందనిరుప్రక్కల చుట్టుకొనిన రెండు నాగములునుగల్గి యుండినది. గ్రీకులం దిది దేవతల వార్తాహారులగు పరిచారకుల ధ్వజమనియు గాన బలమునకు చిహ్నమని ఎంచ బడినది. దేవహూతయగు హెర్మీస్ దీనిని ధరించు చుండు నందురు

**క్యేడ్మియన్విక్టరీ** (Cadmean Victory, ఇది గ్రీకు దేశపు సామెత ఆయుద్ధమున గెల్చిన వారికిని, ఓడినవారికిని గూడ సమానముగు గొప్ప నష్టములు వాటిల్లి నిరర్థకముగు జయాపజయములుగ తోచెనట. నిరర్థక జయమున కీ యుక్తిని వాడుదురు.

**క్యే యి స ర్** (Caesar) — లాటిన్ నామము. ఒక గొప్ప రోమనుచక్రవర్తి పేరు. Hairy అని యర్థము పురుషనామము. ఇది సంస్కృతభాషయందలి కేసరిపదసంబంధపదమని

పోల్పఁ బడినది (క్రైస్తవ నామములు చూడుఁడు.)

ఈపదవర్ణక్రమము (Spelling) ను వేర్వేఱు భాషలందు వేర్వేఱువిధములుగ జేయుచున్నారు.

**కేతకీవనము** — చితాభూమి యనం బడు వైద్యనాథక్షేత్రముండిన ప్రాంతారణ్యము నకుఁ దొల్లింట కేతకీవనమని పేరుండెను. ఈ ప్రాంతము నిప్పుడు దియోఘర్ అనుచున్నారు. (వైద్యనాథధామము చూడుఁడు)

**కేతనకవి (మూలఘటికకేతన)**

ఆంధ్రకవులంద పూర్వకవులలో పరిగణింపఁబడిన వాఁడు తిక్కనసోమయాజి కాలమునాటివాఁడు. (తిక్కనసోమయాజి పెదతండ్రియు కేతనయే. అతఁడు వేరు.) ఇంటిపేరు మూలఘటికవారట. తండ్రిపేరు ప్రౌఢయ్యయట, శివభక్తుఁడట. రచించినవి ఆంధ్రభాషాభూషణము (లక్షణగ్రంథము). దశకుమార చరిత్రము, విజ్ఞానేశ్వరీయ మను యాజ్ఞవల్క్య ధర్మశాస్త్రము దెనిగించెను. దశకుమార చరిత్రము తిక్కన సోమయాజి కంకిత మొనర్చెను. ఈతని నభినవదండి యని పండితులు పొగడుచుండిరట.

**కేతనమంత్రి** — ఈ కేతన దశకుమార చరిత్రమునురచించిన కేతనకవి కాఁడనియు, భాస్కరుని కేతన యనియు, కొట్టరువు కేతన యనియు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, శ్రీమానవల్లి రామకృష్ణకవిగారును అభిప్రాయపడిరి. ఇదియే నిజమైనచో కేతన తిక్కన సోమయాజికిఁ బెదతండ్రి కావలెననియు, అట్లైరి నతనికాలము క్రీ. శ. ౧౨౩౦-౧౦ ప్రాంతమై యుండుననియు రావు బహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులువారభిప్రాయపడిరి. ఈతఁడు రచించినవి తెలుగున కాదంబరి యనంబడు గ్రంథమును, కువలయాశ్వ చరిత్రను నని తెలియుచున్నది. ఈ కేతనమంత్రిని రావు బహదూర్ కందుకూరి వీరేశలింగంపంతులుగారు పూర్వకవులలో పరిగణించిరి.

**కేతలప్రదేశము** — కేరళదేశము చూడుఁడు.

**కేతుమంతుఁడు** — నల్వురు లోకపాలురలో నొకఁడు. ధన్వంతరికుమారుఁడు వేఱొక కేతుమంతుఁడు కలఁడు. ఇతని సుతుఁడు కేతురథుఁడు.

ఇంకను కళింగదేశాధీశులలో నొక కేతురథుఁడు కలఁడు. మఱియు సూర్యవంశక్షత్రియులలో అంబరీషుని కుమారుఁడు విరూపుఁడు, శంభుఁడు అనువారల సోదరుఁ డొక కేతుమంతుఁడు కలఁడు.

**కేతుమాలవర్షదేశము** — చక్షు (ఆక్సస్) నది వలన తడుపఁబడిన తురుష్కస్థానభాగ ప్రదేశమునకు కేతుమాలవర్ష మని పేరుండెను. దీనిప్రశంస విష్ణుపురాణము ౨ అధ్యాయము నందును, మార్కండేయపురాణము ౫౯ యందును కలదు. ఆదేశప్రజలకు కిర్ఘిసు లనియు వారి నివాసదేశము కు దెశికిర్ఘిసనియు వాడుక యుండెనట. ఇప్పటి ఉర్గెండియని వాడుకగల ఖర్జెమ్ (దీనికి ఖైవాఖనాతని వాడుక పేరు కలదు), బొఖారాఖనాత్, కోకానుఖనాత్ (వీనికి ఫర్గానా యనియు పేరుకలదు) ఈమూఁడు పరగణాలు కలసినదేశముగ చెప్పఁబడినది.

ఈప్రాంతముపై క్రీ. శ. ౧౨౨౧ సంవత్సరమున జంఘీస్ఖాన్ దండయాత్రకాలమున పరిపాలన పక్కనెలగుటలై యుండెనట. పరిశోధకులు తెలుపుచుండెనట.

**కేతురథుఁడు** - తండ్రి కేతుమంతుఁడు. పితామహుఁడు ధన్వంతరి. సూర్యవంశక్షత్రియుఁడు.

ఈతని సంతతియందే భగీరథ మహారాజు జన్మిం చినవాఁడు

**కేదారనవమి**— నందానవమిచూడుడు.

**కేదారనాథము**— (బదరికాద్వారము) అరుణోద దేశము చూడుఁడు

**కేదారములు** — హిమవన్నగమున గార్వాల్ సంస్థానమునందున్న కేదారనాథ మనం బడు బదరీకేదారక్షేత్రమునంటియున్న కేదారము లలో ముఖ్యములైదు. ౧. బదరీకేదారము లేక మహాకేదారము, దీనినే కేదార్‌నాథ (మధ్యమ మహా) మనియెదరు ౨ మధ్యమేశ్వరము (మదమహేశ్వరము) 3 తుంగనాథ కేదారము ౪. రుద్రనాథకేదారము ౫. కల్పేశ్వర కేదారము ఇంకను బృహత్కేదారము తాళ (తల కేదారము) కేదారము బిల్వకేదారము మొదలగు నవియుఁగలవు కేదారక్షేత్రము లిరువదియైదని యందురు గాని అన్నియుం గానరావు.

**కేదారారణ్యము**— అరణ్యములు చూడుఁడు

**కేనన్** — గంది చూడుఁడు.

**కేన్సిలింగ్** (వదలుకొనుట లేక రద్దుపఱచు కొనుట) Cancelling—(వాణిజ్యసంబంధ పరిభాషాపదము) కొల్లింటి ఏర్పాటులను మాను కొనుట.

**కేపిటలిజమ్** (Capitalism) — ధనమును అభివృద్ధిపఱచుటకు ఆధనమునే ఉప యోగించి పెంచు విధానము (Economic system). యంత్రశాలలు మొదలగునవి తన ధనముచే నిర్మించి ఇతరుల పని సహాయమున (Labour) వానిచే పనిచేయించి నడపి ధనము నభివృద్ధిపఱచుట Capitalisam కళసంబంధమే యగును.

**కేపిటల్** (Capital) — (మూలధనము లేక పెట్టుబడి ధనము). వాణిజ్యసంబంధ పరిభాషాపదము. మూలధనమని యర్థము. పెట్టుబడిసొమ్ము - ఇది ద్వివిధము. Fixed capital అనియు (ఇది భూములుగొనుట ఇండ్లు కర్మాగారములు (Factories, work shops) ముద్రాక్షరశాలలు మొదలగువాటి నిర్మాణము నకుగాను ఇచ్చినది), Circulating capital అనియు (ఇది వర్తకవ్యాపారమునందు కర్మాగారములు (Work shops) ముద్రాక్షరశాలలు మొదలగువాటిని నడపుచుండుటకుగాను ఇచ్చినది) ఇవి రెండుగాలు అప్పుతీసికొని ద్రవ్యము (వడ్డీ కాకుండా) Principal ను కూడ Capital అనుటయుం గలదు. డబ్బును పెట్టుబడి పెట్టుటకు Capitalisation అనియెదరు.

**కేపు అగ్రము** — అగ్రము చూడుఁడు.

**కేప్ కాలనీ** — దక్షిణ ఆఫ్రికాయం దున్న కాలనీ. ఇటలీ గుడ్‌హోపు అగ్రము నుండి పేరందినది బ్రిటిషువారిక్రింద స్వపరిపాలన నందిన కాలనీగా నున్నది. ఇందొక హైకమీషనరు అధికారిగ నుండును. పార్లమెంటు కలదు. అద్దాని సభ్యులు ప్రజలచే నెన్నుకొనబడువారు ౨,౩౦,౦౦౦ చతురపు మైళ్ళ వైశాల్యముగలది. క్రీ. శ. ౧౪౮౬ లో పోర్చుగీసువారు కనుగొనిరి. ౧౬౫౨ లో డచ్చివారి సెటల్మెంటై, ౧౮౦౬ లో బ్రిటిషు వారి వశమైనది

ధాన్యము, పండ్లు, ద్రాక్షలు పైరగుచున్నవి ఉన్ని గొఱ్ఱెలమందలనుండి లభించును. బంగారము, రత్నములు గనులందు దొరకుచున్నవి. వ్యవసాయదేశము గాన పెద్ద పట్టణములు లేవు. ఇది బ్రిటిషువారి కాలనీ. కేపుటౌను ప్రధాన నగరము. కింబర్లీ బేపురము, పోర్టు ఎలిజబెత్తు

పురము రేవుస్థలములు. కేప్‌టౌన్ సమీపమున గల టేబిల్ మౌంటెన్ శిలామయమగు పీఠభూమి వింతగొల్పు పర్వతము. పడమట గ్రిక్వాలాండునందలి కింబర్లీ పురముకడ రత్నములగనులు కలవు. ఇది ఆరుభాగములుకలవు. ౧ కాలనీ ప్రోవిన్స్, ౨. పశ్చిమగ్రిక్వాలాండు, ఇందు వజ్రపుగనులున్నవి 3. తూర్పు గ్రిక్వాలాండు, ౪ టెంబూలాండు, ౫ ట్రాన్స్కీ, ౬ బెచుయానాలాండుకాలనీ (దక్షిణఆఫ్రికాచూడుడు).

**కేప్వెర్డోద్వీపము** — ఆఫ్రికాఖండమునకుచెందిన పండ్రెండుద్వీపములు చూడుడు.

**కేప్నోమాన్సీ** (Capnomancy) గ్రీకుభాషాపదజన్యము. పొగయొక్క స్థితిచలనములంబట్టి భవిష్యత్తు దెలియగల శక్తి. (విధానశాస్త్రము) తొల్లింటికాలమున బలులర్పించి యగ్ని తిన్నగ చలనముబాధలేక పైకేగిన శుభమనియు, దేవాలయములోనుండి పైకెగయకున్న నశుభమనియు, ఇటునటు గాలిచే త్రోయబడిన ఆపదలు, వ్యాకులములనియు మొదలగు ఫలములను గుర్తించెడివారు దానిగూర్చిన శాస్త్రము.

**కేప్రితేజఃకందరము** (Blue Grotto Capri) — ఇటలీదేశపు నేపిల్సునగరమునుండి సముద్రమువైపు దృష్టి ప్రసరింపజేసి పరికించిన మూడుద్వీపము లగుపడును. పడమరగా ఇస్కియాద్వీపము, ఇశ్చియాద్వీపమును, దక్షిణముగా కేప్రిద్వీపమును గాన్పించెడిని. కేప్రి రెండు పర్వతములు కలసియైయున్నది మరియు నిది ఐరోపాలోని నైసర్గికపు వింతలలో నొకటిగ నెన్నంబడుచున్నది. ఇంక కొండయొక్క క్రిందిభాగము సముద్రపుకెరటడిచే తొలువంబడి గుల్లగ చేయంబడి ఇరువెసలందు మార్గములుగల గుహాంతాలి సముద్రపునీటిచే నాక్రమింపంబడియున్నది. దీని Blue grotto (ఊదా కాంతుల గుహ) యనుచున్నారు. చిన్ననావలలో నెక్కి లోని కరుగగనే అంతయు ఊదారంగుల తేజస్సు మయమైయుండుట యగ్పడుచునిపించును. గాఢమగు నీలిమందురంగు మొదలు పలుచని ఆకాశపు రంగువఱకు వేత్త్వేఱుతావుల సమరి ఉదకముతో గాక అందున్న మనుష్యులు, పడవలు మొదలగు సర్వమును ఊదారంగు తేజస్సుగలవిగనే గాన్పించెడిని. ఈ వన్నెలందు వెండిధావళ్యమును స్ఫురించుచుండెడిని ఇందికను యతిశయమేమన ఈరంగు పూరించినటుల నిలచియుండక క్రిందినీటితో పాటుగ కదలుచున్నట్లగుపడు చుండును ఈ రంగులు మధ్యధరాసముద్రపు టడుగుభాగము నుండి గల యొక ద్వారముగుండ నతిశయించి ఇట్లుగ వెలుగుచుండుననియు, అవి క్రిందినుండి పైకివెడలుచు ప్రతిఫలించుచున్నవని కొందఱిచట శాస్త్రవేత్తలనుచున్నారు.

**క్రేప్ ఆఫ్ లిబర్టీ** (Cap of Liberty)_ ఫ్రెంచిదేశపు రివల్యూషన్ ౧౭౮౯ క్రీ. వె. విప్లవమున విప్లవకారులు ఎఱ్ఱటోపీలు ధరించుచుండిరి విప్లవముజయమై ప్రజాప్రభుత్వమేర్పడి శాంతినెగ్గినపిదప నెఱ్ఱటోపీకాదేశమున Cap of liberty అని పేరయ్యెను.

**కేబిలు వార్తలు** — వార్తలంపు టెలిగ్రాపు తీగలను సముద్రము గుండా అట్లుగా నీటిగుండా నడపి అవ్వలి దరినున్న తావునకుం జేర్చి వాటిపై నడపిన టెలిగ్రాపు వార్తలకు కేబిళ్ళు అని పేరు (తంత్రీవార్తా యంత్ర విధానము చూడుడు)

**కేబేజిచెట్టు** - ఆంగ్ల. Cabbage ఇది శీతల దేశములయొక్క చెట్టు. శీతల దేశవాసులగు నాంగ్లేయులచే భరతభూమికి దేబడి ఇట నాటుకొని స్థిరపడినది. ఈదేశమున చక్కగ పైరగుట ప్రారంభమైనను నేటికిని శీతలము గల

భూములపై చక్కగ వృద్ధియగుచుండును. ఉష్ణ మధికముగనుండు తావులందు శీతకాలమున పైరు చేయఁబడు చుండెడిని. ఇది ముఖ్యముగ భోజన పదార్థముగ నుపయోగించు చున్నది. ఇది పైర గుటకు రమారమి మూడు నెలల కాలముపట్టును. దీని విత్తనములు పాలంబోలి యుండును తెల్లని ఆకులు ఒకటి నొకటి చుట్టుకుని ఉండవలెనై భోజనయోగ్యముగ నయ్యెడిని

కేబేజి మద్యపానమునఁగల్గిన వేడినిహరించును. మెదడునందలి వేడిని నివారించి నిద్ర దెచ్చును. గురుత్వముగ నుండి సనుధాతువు గల్పించి దేహ పుష్టి నిచ్చును. బుద్ధిమాంద్యము దగ్గించును. ఉడికించి చితుకని కుసుపులు, గడ్డలకుం గట్టిన వానిని పక్వపఱచి చితుకఁ జేయును. శీతల శరీర తత్వములు కలవారి కెక్కువ మేలు చేయు నందురు. కేబేజీ కూరకు నెయ్యి విరుగుడు.

**కేయిన్** (Cain) — హెబ్రూనామము, బైబిలుసృష్టి, ఆదాము ఈవుల తొలికాన్పు కుమారుని పేరు. Possession అనియర్థము. పురుష నామము (క్రైస్తవ నామములు చూడుఁడు.)

**క్యారట్ లేక క్యారట్టు** (Carat) (వాణిజ్య సంబంధ పరిభాషాపదము) - వన్నెయని యర్థము. ఇరువది వన్నె బంగార మను నపుడు బంగారము నిరువదినాల్గు భాగములుజేసిన నది ఎన్ని Carats అనెదరో అన్నివంతులు అసలు బంగార మున్న దనియు, తక్కినవి కలుపుడు లోహములనియు నెఱుంగునది. ఇట్లు ౨౪ వన్నె బంగారము కలుపుడులేని అసలు బంగారమని (మేలిమి బంగారము) యర్థము. ఇంక రత్నములం దూచుట యందిన్ని క్యారట్లతూనికయగు క్యారటు ఒకటికి $3\frac{1}{6}$ Troy Grains (గురిగింజ-చిన్న గురివెంద గింజలు) ప్రమాణమని యెఱుంగునది.

**కేరళ (కొంకణము)** — సప్త కొంకణములలో నొకటి చూడుఁడు. కొంకణము చూడుఁడు.

**కేరళ కళా మండలము** — ఇది నాటక కళాసంస్థ. కేరళ దేశమున షోరనూరు పురము (బ్రిటిషు మలబారు జిల్లా) ప్రక్కనుండి ప్రవహించు భారతప్పుఝానదీ తీరమున ౧౯౩౦ సంవత్సరమున వల్లత్తోలు నారాయణ మేనన్ కవితిలకునిచే స్థాపింపఁబడినది. దీని పోషణకై యా కవితిలకుఁడు కొంత ధనము గూర్చెనట (వల్లత్తోలు నారాయణ మేనన్మహాకవి చూడుఁడు) ఇది రెండు భవనములుగ నున్నది. ఒక దాని యందు కథాకాళి నాటక ప్రదర్శనముల కొరకు రంగమును, సర్వసాధారణ నాటక ప్రదర్శనముల కొరకు రంగమును కలవు. రెండవది అందలివారి నివాస గృహముగ నున్నది. కళలను నేర్పు పాఠశాల అప్రక్కనే నిర్మింపఁబడుచున్నది. ఈ నాటక ప్రదర్శనములు ఐరోపా, అమెరికా దేశస్థుల నాకర్షించుచు వారి నుతుల నందుచున్నవి. ఉదయశంకర్, శుభాకన్నాంబూద్రి ప్రదర్శన కళావిదు లిచటివారే యందురు. మహాకవియిందే వసించుచు నేఁటికిని బధిరుఁడుగనే యున్నాఁడు.

**కేరళ దేశము (కేరళ పుత్రము, కేరల పుత్రము)** — ఇది సప్తకొంకణములలో నొకటి. (కొంకణదేశము చూడుఁడు). చంద్రగిరినదికి దక్షిణమునగల సముద్రతీర మలయాళభూమికిఁ గేరళపుత్ర మనియు, కేరలపుత్ర మనియు వాడుకపేరు లున్నవని డా. భాండార్కరుపండితుండు తన Early History of Deccan 3-౧౦ యందు దెల్పియున్నాఁడు. అశోకుని గిరినార్ శిలాశాసనమున కేరళచేరనామములు గాన్పించుచున్నవి. కొల్లంశకము (సప్తర్షి శకమే) క్రీ. శ. ౮౨౫ లో ప్రారంభమైనది.

రాజధాని అనంతపద్మనాభక్షేత్ర మగు తిరువనంతశయనము. దీని నిప్పు డాంగ్లమున ట్రివేండ్రమ్ (Trivandrum) అనెదరు. దీని కింకను కనకపురమనియు, మూషిక పురమనియు పేరులు కలవు. దీనిప్రశంస పద్మపురాణము ఆది సర్గ 3 యందు కలదు. ఇప్పటి తిరువాన్కూరుమహారాజును దైవముగు అనంతపద్మనాభదాస యను పేరును బిరుదముగ వహించుచున్నారు. ఈక్షేత్రమును చైతన్యస్వామియు, నిత్యానందస్వామియు దర్శించినటుల చైతన్యభాగవతమునందు కలదు. (చేరదేశము చూడుడు)

**కేరళపుత్రదేశము** — కేరళదేశము, చేరదేశము చూడుడు.

**కేరళమహారాజు** — అత్రిసంతతి. చంద్రవంశ క్షత్రియుడు. కేరళదేశము నేలిన రాజులలో మొదటి వాడు. కేరళదేశమితని పేరంబరగు చున్నది కేరళవంశమునకు మూలపురుషుడు (కేరళదేశము చూడుడు.)

**కేర్సినోలోజీ** (Carcinology) - ఎండ్రకీతలు మొదలగు బహుపాద జంతువులంగూర్చిన కళ. వాటిభేదలక్షణ గుణముల నెఱింగించెడి శాస్త్రము.

**కేరీ** (Carry)- వాణిజ్యసంబంధ పరిభాషాపదము. తీసికొని పోవుటయని యర్థము. రెయిల్వే కంపెనీలు, స్టీమరు కంపెనీలు మొదలు Carrying agencies అన్నియు నిట్టివర్తకము చేయునవియె యగును. చిఠాలెక్కలు వ్రాయుతరి నొక పుటకొననుండి తర్వాతిపుట ప్రారంభమున కంకెలందీసికొని పోయి వ్రాయుటకు Carried over అనియు నందురు. (ఇంక తర్వాతిపుటపైన యంకెలను వ్రాసి Brought forward అని వ్రాయుచుందురు). తగవు పరిష్కారమున నెద్దియేని యాటంకము గల్గినచో దానిని మఱియొక రోజునకు నిలపియుంచుటకు Carrying over అనియెదరు

**కేరేయ గోత్రము** — అత్రి పుత్రికా పుత్రుల గణము చూడుడు.

**కేలండరు** (Calendar) — లాటిన్భాషాపదమగు కేలండేరియమ్- అనగా లెక్కపుస్తకమనుమాటనుండి కల్గినపదము. సంవత్సరమందలి నెలలు, నెలలందలి పర్వములు, వారములు, దినములు మొదలగునవి దెల్పునది కేలండరనంబడును. ఇట్టివి రోమను కేలండరు, చీనా కేలండరు, జూయిష్ కేలండరు, హిబ్రూ కేలండరు, మహమ్మదీయ కేలండరు మొదలగు కేలండరులుకలవు. ఇవియన్నియు హిందువుల పంచాంగములం బోలినవియే.

౧౯౩౦ లో రష్యాదేశము ఒక కేలండరును ప్రకటించెను. అందు ఐనుదినము లొకవారముగను, ఆరువారము లొకమాసముగను ౩౬౦ పనిరోజులును ఐదు శలవురోజులును కలిసి ౩౬౫ దినములుసంవత్సరముగను చెప్పబడినవి. (ఐరోపా కాలమానమును చూడుడు)

**కేలాకిలయవనులు** — వీరు వాకాటదేశ మేలినవారు. మైసూరురాజ్యము పశ్చిమ సముద్రముల మధ్యదేశము కొంకణ మళయాళభాగములు, రాజ్యస్థాపకుడైన మొదటిప్రభువు వింధ్యాశక్తి. రాజధాని కిల్కిలానగరము. (వాకాటదేశము చూడుడు).

**కేలిఫోర్నియా మహావృక్షములు**- (California big trees) అమెరికా సంయుక్తరాష్ట్రములకుం జెందిన కాలిఫోర్నియా దేశమునందు Kalaveras సీమయందు అనగా స్టాక్టను పురమునుండి తూర్పుగా డెబ్బదియైదు

మైళ్ళ దూరమున కెలవెరాస్ అనంబడు వనము నందు మహావృక్షము లించుమించు నూరుకలవు. ఇవి రాక్షసవృక్షము (Giant trees) లని పేరొందియున్నవి. ఇందన్నిటికన్న పెద్దవృక్షమునకు Father of the forest అనిపేరు. ఆచెట్టిప్పుడు పడిపోయియున్నది దానిపొడవు ౪౩౫ అడుగులు, మ్రాను చుట్టుకొలత ౧౧౦ అడుగులు, బెరడు ౧౮ అంగుళముల దళసరి.

ఈతోటయందలి కొన్ని పెద్ద వృక్షములకు పేర్లుకలవు.

| | ఎత్తు | మ్రాను. |
|---|---|---|
| | అడుగులు | చుట్టుకొలత |
| Keystone | ౩౨౫ | .. |
| Mother of the forest | ౩౨౧ | ౯౦ |
| Hercules | ౩౨౦ | ౯౫ |
| Hermit | ౩౧౮ | ౬౦ |
| Pride of the forest | ౨౭౬ | ౬౦ |
| Three graces | ౨౯౬ | ౯౨ |
| Husband and wife | ౨౫౨ | ౬౦ |
| Burnt tree (పడిపోయి యున్నది) | ౩౩౦ | ౯౭ |

ఇంకను Empere state, Old maid, Siamese twin, Mother and sons, Two guardians మొదలగునవి కలవు. అడవి ౩౨౦౦ పొడవు, ౬౦౦ వెడల్పు కలది.

చుట్టుపట్ల నిట్టిచెట్లు కాకున్నను ఈజాతిచెట్లు కొన్ని కలవు. ఇందలి మహావృక్షములు గవర్న మెంటు రిజర్వ్ ఫారెస్టుగ నుంచి రక్షింపఁబడి యున్నవి. ఈజాతి వృక్షములు సముద్రపు నీటి మట్టముపై నాల్గువేల అడుగులకు తక్కువ Altitude ప్రదేశములందు బ్రతుకవని పరిశీలనల వలన తేలుచున్నది. మఱియు ఏడువేల అడుగుల ఎత్తు కూడ పెరుగవని తెలియుచున్నది. చెట్టు యొక్క పైబెరడు ఎఱుపు పసుపు కలసిన రంగుగా నుండెడిని. నూరు లేక డెబ్బదియైదు అడుగులకుం దిగువగ కొమ్మలుండవే యుండవు లోనికేగు మార్గమున కిరుదెసలనుండు చెట్లకు Sentinels అని పేరిడియున్నారు. వనమునందు Grizzly Giant అను వృక్షము వెయ్యి సంవత్సరములు జీవించెనని చెప్పఁబడినది Wawona అను చెట్టు వేళ్ల గూడా ఒకటన్నెలు మార్గము నరికి దానిగుండ బాటసార్లకి నడపియున్నారు. దాని గుండా బండ్లు పోవుచుండును. ఈమహావృక్ష సముదాయము మాత్రము కాలిఫోర్నియా యందు Sirra Nevado slope నందేగాని ఇతర తావుల గానరాకున్నవి.

**కేలిఫ్ హరూన్ అల్రషీద్** — మహమ్మదీయ మతసంబాధమున ఐదవ కేలిఫు గా బాగ్దాదు పురమున రాజ్యమేలినవాఁడు. అబ్బెడి వంశపువాఁడు. క్రీ. శ. ౭౬౩ మార్చి ౨౦ న జన్మించి, ౭౮౬లో రాజ్యమునకువచ్చి, ౮౦౯లో మార్చి నెలయందు మృతినందెను చాలా సుప్రసిద్ధ పరిపాలన చేసినవాఁడు. భార్యపేరు జోబది. అరేబియన్ నైట్సు కథలందు ఈయన ప్రశంసలు కలవు.

**కేల్వినిజం (Calvinism)** - ప్రొటెస్టాంటు క్రైస్తవమతమున నొకయాచార్యుఁడుగా నెంచఁబడిన జాను కాల్విన్ (John Calvin) యొక్క మతము. ఈతఁడు క్రీ. శ. ౧౫౦౯-౧౫౬౪ర జీవించినవాఁడు. మానవప్రవర్తనము నిరాశకరముగు దుర్మార్గగమనముకలదియనియు, దేవుఁడే కొందఱిని రక్షించుట కెన్నుకొనునని యు, తక్కిన ప్రాణులు నశింపవలసినదే గాన మానవ ప్రయత్నము లెవ్వియు నాతని రక్షణకు నిరర్థకము లేననియు నీతని మతము. దీనిని క్రైస్తవమత ధర్మమున Doctrine of Predestination and

Election అనియెదరు. దీనికి వ్యతిరేకమగునది ఆర్మీనియన్ సిద్ధాంతము. (చూడుము).

**కేలిస్థెనిస్ట్రీ (Calisthenistry)** — శరీరమునందలి కండరములకు, అవయవములకు కసరతు (వ్యాయామము) గల్గించి శరీరముచక్కఁబఱచి పెంచుటనుగూర్చి తెల్పుకళ.

**కేలీఫాత్ (ఖలీఫాత్)** — దీనికి కిలాఫత్ అనియు ననుటగలదు. మహమ్మదీయ మతమున మహమ్మదు జగద్గురుని తర్వాతవారిని కలీఫ్ లేక ఖలీఫా యనియెదరు. వీరు మహమ్మదీయ మతాధిపతులు.

మహమ్మదువారికిం బిదప అబూబకరను వారిని వారిశిష్యులు మొదటి కలీఫాగా నెన్నుకొనిరట వీరు మహమ్మదువారి ప్రియశిష్యులును ప్రియభార్యయగు అయెషాబేగంగారి తండ్రిగారు వారికింబిదప ఓమార్ కాలీఫాయును పిదప ఉత్మాన్కాలీఫాయును ఈపదవి నధిష్టించిరి. వీరికింబిదప క్రీ. వె ౬౩౨లో కొందఱు ఆలీ యనువారి నెన్నుకొనిరట. వారాదినమునుండి షియాలనంబడిరి. తక్కినవారు సున్నీలనంబడిరి. పిదప బాగ్దాదుపురమునందు కొందఱు కాలీఫాలు పరిపాలనసల్పిరి. క్రీ. వె. ౧౨౫౮ లో మేన్లూకులు బాగ్దాదుం బట్టుకొని కలిఫాత్ పదవిని అటనుండి ఈజిప్టునకు మార్చిరి. క్రీ వె. ౧౫౧౭ లో టర్కీ ఈజిప్టును జయించుటతో కలీఫాత్ టర్కీపాలై ఇస్థంబూల్ (లేక కాన్స్టాంటినోపిల్) నందు స్థిరపడి ఉత్మాన్ కలీఫా పదవి నధిష్టించెను క్రీ. వె. ౧౯౨౪ లో టర్కీలోని నేషనల్ ఎసెంబ్లీ అంగోరాయందు కలీఫాతుపదవి నిరాకరించి విసర్జించెను.

**కేలోరిమిట్రీ (Calorimetry)** —ఒక పదార్థమును' కొంతబరువుగలదానిని వేడిచేయుటకు ఎక్కువ లేక తగ్గిన వేడిని కొలుచు పరిజ్ఞానశాస్త్రము. ఎంతబరువుగల ఏజాతి పదార్థమునకు వేడిచేయుటకు ఎన్నిడిగ్రీలవేడి ఎక్కించవలెనో తెలుపు కళ.

**కేవల కాశ్యపగణము**—దీనిని కాశ్యపగణమని యందురు. కాశ్యపగణముచూడుము.

**కేవల కుంభకము** — పైసప్తకుంభకముల నభ్యాసము కల్గినపిదప దీని నాచరింప వలెనని చెప్పఁబడినది. యోగులు ప్రాణాయామము యొక్క ముఖ్యోద్దేశ మీ కేవలకుంభక సిద్ధికొఱకేనని నుడువుచున్నారు. కేవలకుంభకము సిద్ధించెనేని పిదప ప్రాణాయామాభ్యాసముతో పని యుండదందురు.

ఇందుపూరకముగాని రేచకముగాని ప్రత్యేకముగ నాచరింపనక్కరలేదనియు లోపలివాయువును బైటికిపోనీయక నిరోధించి, ఉన్నదానినున్నట్లె నిలపియుంచుట కేవలకుంభక మనంబడునని చెప్పఁబడినది. ఇది అనుభవైక వేద్యమే కాని వ్రాయదరముగానిది. (కుంభకము చూడుము). (అజప చూడుము).

పూరకమువలన శరీరములోనికి జేరిన వాయువుచే శరీరపు లోపలిభాగమున అన్నితావులను శోధింపఁజేయుట కుంభకమని పైనచెప్పఁబడినది. ఈకుంభక క్రియకు విష్ణుదేవుఁ డధిపతియనియు, సత్వగుణలక్షణమనియు, ఇదియె యోగసిద్ధికి చిహ్నమనియు, చెప్పఁబడినది.

నాభియందు వాయువును నిలపి పైకిగాని క్రిందికిగాని వెడలనీక నిరోధించుటవలన, విషము సైతము బాధింపనేరదనియు క్రమముగ నీటియందు పద్మాసనమున గూర్చుని మునుఁగక యుండనగుననియుఁ జెప్పఁబడినది. (అష్టాంగయోగములు చూడుము).

**కేవల భరద్వాజఉపగణము**—ఇది ఆంగీరస సంతతి. భరద్వాజగణమునందలి యొక ఉపగణము దీనిని భరద్వాజ ఉపగణమని యందురు. (భరద్వాజఉపగణము చూడుడు).

**కేవల భృగు (గోత్రము) గణము**- ఇది భృగుసంతతిలోనిది ఇందు ఒకే గోత్రము కలదు. దీనిని ఆర్‌ష్టిషేణగణమునందు కొందఱు చేర్చుచున్నారు. మఱికొందఱు దీనిని ప్రత్యేకగణముగ నెన్నుచున్నారు. (ఆర్ష్టిషేణగణము చూడుడు).

**కేవలాగస్త్య ఉపగణము**— అగస్త్య ఉపగణము చూడుడు.

**కేవలాంగిరస గణము** — ఇది ఆంగీరస సంతతియందలి ఒక గణము ఇందు ౧౩౦ గోత్రములు కలవు అవి హారిత, కణ్వ, రథితర లేక నైధ్రువ, ముద్గల, విష్ణువృద్ధయను నైదు ఉపగణములుగ విభజింపఁబడియున్నవి. (గోత్రములు చూడుడు).

**కేవలాంగిరస గోత్రము** — ఇది ఆంగీరసగోత్రమునియు గ. బ. మ. ఆంగీరససంతతి యందు కేవలాంగిరసగణమున హారిత ఉపగణము లోనిది (హారిత ఉపగణము చూడుడు)

**కేశరవయు గోత్రము**— భరద్వాజ ఉపగణము చూడుడు

**కేశవ చంద్రసేనుఁడు**— ఈ మహాత్ముఁడు బ్రహ్మసమాజ నేతృఁడు. గొప్ప భక్తుఁడు ఈయన బ్రహ్మ ద కేశవ చంద్ర సేనుఁడని యందురు. ఈయనవలన రామమోహన రాయల బ్రహ్మసమాజమత మునకు మాన్యుల యందు గౌరవమును శ్రోత్రియాకమును వహించినది. దానికి ఆధారముగా బ్రహ్మసమాజమునిపేరు దేవేంద్ర నాథుని శిష్యవర్గములో చేరినవాఁడట. గొప్ప యుపన్యాసకుఁడనియు, గొప్పగొప్పవాదికీమతము నందావేశము కల్గించిన వాఁడనియు నందురు. వంగదేశీయుఁడు ఈయన కుమార్తెను కుచి బీహారు మహారాజుగారు పరిణయమాడిరి. (బ్రహ్మసమాజమతము చూడుడు).

**కేశవతీ (విష్ణుమతీ) నది**— నేపాళ దేశములోనిది. భాగమతీనదియందు సంగమించును ఆ దేశపు చతుర్దశ తీర్థములలో కేశవతీనదియందు శామతీర్థము, నిర్మలతీర్థము, నిధి లేక నిధానతీర్థము, యుగళతీర్థము నను నవి కలవు. స్వయంభు పురాణము ౭ అధ్యాయమున విమలావతీనదితో సంగమమున మనోరథ తీర్థమును, భద్రానదితో సంగమమున నిర్మల తీర్థము, స్వర్ణవతీనదీ సంగమమున నిధానతీర్థము, పాపనాశినీనదీసంగమమున జ్ఞానతీర్థమును, కనకవతీనదీతీరమున చింతామణితీర్థమును చెప్పంబడినవి.

**కేశవ వ్యూహము** — రామానుజీయ వైష్ణవ చైతన్యవైష్ణవ మతధర్మములందు తదేకాత్మ్యభావ మహావిష్ణువు అంశ ద్వితీయ చతుర్వ్యూహము లలో నొకటిగ చెప్పఁబడినది. దీనిని వాసుదేవవ్యూహము లైదింటిలోని యొక ఉపవ్యూహ మనియు, వైభవ విలాసమూర్తి యనియు, పంగసగపద్మ, శంఖ, చక్ర, గదలు ఆయుధము లనియు



చెప్పఁబడినది (విష్ణుదేవాలయములందలి విగ్రహములు చూడుడు).

**కేశి** — తండ్రి వసుదేవుఁడు. తల్లి భద్రాదేవి. యదువంశ క్షత్రియుఁడు. మరియు కేశి

యను దానవుఁడొకఁడు దేవసేనను నెత్తుకపోవుచుండ ఇంద్రుఁడు విడిపించెనని చెప్పఁబడిన ఒక దానవుఁడు కేశి. ఇంకను హయరూపధరుఁడై వచ్చి శ్రీకృష్ణునితో పోరాడి నిహతుఁడైన ఒక అసురుఁడు కేశియని పేరుగలవాఁడే.

**కేశిధ్వజుఁడు** — ఇతనికి ఖాండిక్యుఁడని నామాంతరము కలదు. నిమిసంతతి, సూర్యవంశ క్షత్రియుఁడు.

**కేశిని** — దమయంతి పరిచారికలలో నొకతె )

**కేశిభ గోత్రము** — శండిలగణము చూడుఁడు.

**కేష్** (రొక్కము, మూల్యము, ధనము, డబ్బు, ద్రవ్యము)—(వాణిజ్యసంబంధ పరిభాషా పదము). Cash- రూప్యములు, నోట్లు (ఆంగ్లసీమ యందు Bank of England Notes వలె) అన్ని పద్ధతులమేరకు అర్థనుయొఁడిని కాని వర్తకవ్యాపారసందర్భమున హుండీలు మొదలగు (అవసరమగునేని తోడనె నగదుగా మార్చగల వాట్లను) హామీ కుగావలుగల లిఖ్యనిచ్చిన పత్రములు, ఇన్సు, భూములు గోడౌన్లు వీని విలువలంగూడ నగదుగనే పరిగణించెదరు

**కేసరి** — ఋష్యమూకపర్వతము కడనున్న అంజనాద్రిపై వసించు నొక వానరము. భార్య అంజన. కుమారుఁడు ఆంజనేయుఁడు అంజనాద్రి నైజాముదాజ్యమునకుఁజేరి ఆనెగొంది యనంబడు పురముకడ పంపాసరోవర పరిసరముల నున్నది. కేసరి ప్రభాసతీర్థముకడ ప్రజలాబాధించుచుండిన ఒక కుంజరమును వధించుటంజేసి కుంజరసూదనుఁడనియు, కేసరి (సింహము) అనియు బిరుదనామము వహించినది. (అంజనాద్రి చూడుఁడు).

**కేసరివంశ నృపతులు** — ఉత్కళదేశమును క్రీ. వె. ౪౭౩-౧౧౩౨ ఏలిన నృపులు. యయాతికేసరి (క్రీ. వె. ౪౭౩-౫౨౦) భువనేశ్వర దేవళము ప్రారంభించినవాఁడు. తర్వాతివారు పని సాగింప లలితేందుకేసరి (౬౨౩-౬౭౭) పాలనమున పని పూర్తియాయెనట. రాజ్యపు పేరు కళింగరాజ్యమని యుండెనని కొందఱనెదరు. భువనేశ్వరము రాజధాని. ఉత్కళ దేశమును కేసరినృపులు జాజిపురము, కటకము, భువనేశ్వరము రాజధానులుగ ౬౫౦ సంవత్సరములు ఏలినవారు. నృపకేసరి (క్రీ. వె. ౯౪౧-౯౫౩) పాలనమున కటకముకోట కట్టఁబడినట్టుల శాసనము దొరకినది

**కేసరిహిందు పతకము** — ఇండియా సామ్రాజ్యసేవ యొనర్చినవారికిచ్చుటకు క్రీ. వె. ౧౯౦౦ సంవత్సరమున ఏర్పఱ్పఁబడిన బహుమానపుబిళ్ల. దీనియందు బంగారపుది మొదటితరగతిగను, వెండిది రెండవ తరగతిగను చెప్పఁబడినది.

**కేసరీయ క్షేత్రము** (ఇసాలియా) — ఇప్పుడు ఇసాలియా యను పేరంబరఁగుచు మధ్యరాష్ట్రములందున్నది. ఇట బుద్ధభగవానుఁడు తన పూర్వజన్మపు చక్రవర్తి లోకమున చంపారణ్యమున దర్శనమిచ్చెనట. ఆ పవిత్ర ప్రదేశమున ఆయన భిక్షాపాత్రమునుంచి దానిపై రాతిస్థూపము నిర్మింపఁబడెననియు, నిర్మించినదియు, దానిని ఫాహియాన్ దర్శించెననియు, ఆర్కియాలోజికల్ సర్వే రిపోర్టు ౧౮ సంపుటము, ౧౬ పుటయందు కలదు. ఇప్పుడా స్థూపపుపాదును రాజాబేనాడియో యనుచున్నారు దీని సంబంధమేమో అర్థమగుటలేదు. సందర్భము గానరాదు.

**కేస్ నీడ్ లేక కేసాఫ్‌నీడ్** (వాణిజ్యసంబంధ పరిభాషా పదము). Case of need- హుండీలపై నొక్కొకతఱి "In case of need

apply to" ఒక అసామి పేరు "to take the bill up" అని ఇంగ్లాండు చేయుదురు. ఇది ఆహాబాడీసామ్ముకు Security అని యొసంగునది.

**క్రేటర్** (Crater) — అగ్ని పర్వతము నందలి భూమిలోనికి జొచ్చుకుని యుండు రంధ్రము. ఇందుండియే లోపలియగ్ని కార్యము లగు పొగ, నీరు, అవిరి, లావా, సిండర్సు, రాళ్లు మొదలగునవి బయటికివచ్చుచుండును. (Mountains చూడుము)

**క్రేనియోగ్నొమీ** (Craniognomy)- వేర్వేరు జాతుల మనుష్యుల యొక్కయు, వేర్వేరు మృగ, పక్షి, కీటక జాతుల యొక్క పుర్రెల (Skulls) విధాన లక్షణములగూర్చిన కళ.

**క్రేన్మర్** (Cranmer) — నవీన కల్పిత నామము, ఇది Canterbury Arch Bishop స్వామిపేరు పురుషనామము. క్రైస్తవ నామములు చూడుము.

**క్రేషర్ని గోత్రము**— గర్గఉపగణము చూడుము.

**క్లేశపంచకము** (పంచ క్లేశములు) — బౌద్ధధర్మమున ౧. కామము, ౨ క్రోధము, 3 అవివేకము, ౪. అహంకారము, ౫. గర్వము క్లేశపంచక మనబడును.

**క్లేశలబ్ధమధికాదరదం** — కష్టపడి పొందిన దానియందు మిక్కిలి ఆదరము కలిగి యుండును కష్టార్జిత మగునేని విలువందెలిసి సంచరించుట గలదని భావము

**క్వేకరిజమ్** (Quakerism) —జార్జి ఫాక్సు అనునతడు క్రీ. శ. ౧౬౪౦ లో మత సంబంధమగు సంఘమును స్థాపించెను. ఆసంఘ సభ్యులకు క్వేకరులను పేరుండెడిది. వీరి సిద్ధాంతములు ప్రకృత కాలమున ప్రపంచము నందనేక ప్రాంతముల వ్యాపించెను.

**క్వేకరులు** (Quakers)-వీరిని Society of friends అనియెదరు. క్రైస్తవ మతసంస్థ. అమెరికా సంయుక్త రాష్ట్రములు, ఇంగ్లాండు, ఐర్లాండు దేశములందు వ్యాపించి యున్నది. క్రీ. వె పదునేడవ శతాబ్ద మధ్యమున George Fox అనువారి నాయకత్వము క్రింద ప్రారంభమైనది. క్రైస్తవచర్చి సంస్కరణము వీరిముఖ్యోద్దేశమట. సొసైటీ ఆఫ్ ఫ్రెండ్సు (క్రైస్తవ సంఘము చూడుడు).

**క్వేక్** (Quack)— వైద్య మెరుంగుదునని క్రియాభ్యాస మొనర్చువాడు. శాస్త్ర మెఱుంగని వాడని భావము.

**క్వేయింటాల్** Quintal — (వాణిజ్య పరిభాషాపదము). ఇది ఒక తూనిక (బరువు). వేర్వేరు దేశములందు వేర్వేరు విధముల నుండెడిది. ఇంగ్లాండునందు, అమెరికా యునైటెడ్ స్టేట్సునందునను ౧౦౦ పౌనుల (Avoirdupois) బరువునకు ఈపేరు వర్తించును. ఫ్రాన్సుదేశమున ౧౦౦ Kilos (ఇది రమారమిగా రెండువందల ఇరువది పౌనులు సరిగ తూగెడిది) బరువును Quintal అనుచున్నారు. ఇట్లు వేర్వేరు దేశములందు వేర్వేరుగ నుండెడిది.

**కైకశ రాజ్యము**—మగధరాజ్యము చూడుఁడు.

**కైకసి** — తండ్రి సుమాలి యను రాక్షసుఁడు. తల్లి కేతుమతి యను గంధర్వస్త్రీ. భర్త విశ్రవసుఁడు. (అసురులలో కైకసి చూడుఁడు).

**కైకసి గోత్రము** — విధృవగణము చూడుఁడు.

**కైకేయి**—కేకయరాజపుత్రి యనిభావము. సూర్యవంశ క్షత్రియుఁడగు దశరథ మహారాజు మూడవభార్య. ఈమె సుతుఁడు భరతుఁడు, మఱియు మత్స్యదేశాధీశుఁడగు విరట్రాజు భార్యకు కైకేయి యని వాడుకపేరు కలదు. ఈమె అసలుపేరు సుదేష్ణ. ఈమెయె నూర్వురు కీచకుల సోదరి.

**కైజాలి గోత్రము** — విధృవగణము చూడుఁడు.

**కైతవాయనగోత్రము** — వాధ్ర్యస్య లేక మిత్రయుపగణము చూడుఁడు.

**కైదారిక న్యాయము**— వ్యవసాయపు పొలములకు నీరుపెట్టుకొనువారు ఒకపొలము నిండినతర్వాత వేరొక పొలమునకు కాలువనుండి నీరుపెట్టుదురు అన్ని పొలములు వరుసగ నొకటి తర్వాత నొకటికి తడుపుకొందురు.

**కైనొమెటోగ్రాఫీ**-(Kinematography) ఛాయాపటచిత్రముల (Photo) ఛాయలను ఒక తెరపై నాని యగుపడునట్లు చేయుటయు, అవి కదలుచున్నట్లు పటముల పరంపరం త్రిప్పి నడపుచు జూపుటయు నొకవర్ణ్ణకళ. దీనిని సాధారణముగ యంత్రసాహాయ్యమున జూపుచుందురు.

**కైపమాయనకవి** — ఆంధ్రకవులలో నాధునికులంద పరిగణింపఁబడినవాడు. వెలనాటి బ్రాహ్మణుఁడు. తండ్రిపేరుమహాదేవశాస్త్రి, తల్లి పేరు కామాక్షమ్మ. రచించినది ఉషాకల్యాణమనాబడు ప్రబంధము శబ్దాలంకారములం దీకవికి ప్రజ్ఞకలదు

**కైముతిక న్యాయము** — కిమ్ముత-చెప్పేదేమి యని యర్థము? పెద్దవాటికి దిక్కు లేకపోతే చిన్నవాటికి చెప్పేదేమి ? యని వాకులకు యీన్యాయము వర్తించెడిని

**కైరజిగోత్రము** — విధృవ గణము చూడుఁడు

**కైరజిగోత్రము** — ఆత్రేయగణము చూడుఁడు.

**కైరదేశము** — కైరమాలి చూడుఁడు.

**కైరమాలి దేశము** (కైరదేశము, కిమ్మిర్యదేశము, కుమార రాజ్యము) — ఈ శబ్దమున మాలియన పర్వత మర్థముగాన కైరదేశమని యెఱుఁగునది. మఱియు "కిమ్మిర్య" దేశమనియుం బేరుండెనట. కుమార రాజ్యమని పెక్కండ్రు పరిశీలించి యనుచున్నారు కైమూర్పర్వతపఙ్క్తి యీదేశములోనిదే. "కిమ్మిర్య" "కైమూర" పదములు కైరమాలి పదముతో సంబంధము గలవిగ పరిశోధకులు తలంచుచున్నారు శోణభద్ర, టోన్సు నదుల నడుమ కైమూర్పర్వతము, వింధ్య పర్వతములకుం జెందిన శాఖయై జబ్బల్పూరువద్ద కటంగికడ ప్రారంభమై రీవా సంస్థానము జొచ్చి బీహారములోని మహాబాదు మండలముగుండా నడచును. మహాభారతము సభాపర్వము 30 అధ్యాయమున కుమారరాజ్యము చేదిదేశమునకు సమీపమని చెప్పఁబడినది.

**కైరా**— కేతకము చూడుఁడు.

**కైరాత గోత్రము**— శండిలగణము చూడుఁడు.

**కైరాతి గోత్రము** — ఔతథ్యఉపగణము చూడుఁడు.

**కైరోగ్రాఫ్, కైరోలోజీ** (Chirology or Cheirology) — జర్మనుభాషయందు Kheir = చేయి (హస్తము), Logos = సంభాషణ గాన, చేతి సంజ్ఞలచే సంభాషించుటయని యర్థము. చేతితో సంజ్ఞలం జేయు మూలమున మనోభావముల నెఱింగించుకళ.

**కైరో నగరము** — ఈజిప్టు దేశపు రాజధాని. తొల్లింటినామము అల్కహిరా. ఆ పేరు మారి నేటికి కైరోయైనది. భక్తికొలది దీనిని ఉమ్ముద్దున్యా (జగన్మాత) యనియు నను చుందురు. నైలునది కుడివైపున అనగాతూర్పు తీరమున నైలునదికిని, ఇస్మేలియా కాలువకు నడుమనుండిన పట్టణము బహు పురాతనదేశమగు ఈజిప్టునకు ప్రధాననగరమై వైభవోపేతమైనది. ఇంకను చూడదగినతావు లనేకములు కలవు. స్ఫినిక్సునగరమునకుఁ గలిపయదూరమున్నది. అదియును కుఫూ, కాఫ్రా, మెంకారా అను ఫరోల (భూపతుల) సమాధులుగల పిరామిడ్సును తప్పక జూడఁదగినవి. నగరమున గోవారు నిర్మితమగు ఎల్ అజారుమసీదుం దిరుగ పెద్దదిగ నిర్మించి అందు యూనివర్సిటీ నిర్మించి యున్నారు. సల్లాయుద్దీను రాజనగరు అమ్రు మసీదు ప్రభువుల గోరీలుగల కట్టడములు మొదలగున వనేకములు చూడఁదగినవి కలవు. ఈజిప్టు దేశపు పురాతనవస్తువు లుంచఁబడిన మ్యూజియమ్ తప్పక జూడఁదగినది కలదు.

**కైలవర్ధని గోత్రము** - జమదగ్నివత్స ఉపగణము చూడుడు

**కైలాకిలులు లేక కిలాకిల వంశ యవనభూపతులు** —వీరు యవనులనియు, వాకాటదేశమేలిన వారనియు, ఇది కొంకణ ఆంధ్రదేశములు కల్పిన భాగమనియు, రాజధాని కిల్కిలా నగరమనియు, వీరి మూలపురుషుఁడు వింధ్యాశక్తి యనియుఁ జెప్పఁబడినది. (వాకాట దేశము చూడుఁడు).

**కైలావత్ర దేశము**— కాయపథ దేశము చూడుఁడు.

**కైలాస శిఖరము** - హిమవన్నగముపై టిబెట్టు దేశమున పశ్చిమ భాగమందున్నది అల్మోడా నుండి ౨౨౦ మైళ్లదూరమునను, తకలా కోటనుండి ముప్పదియైదు మైళ్లదూరమునను గల పవిత్ర శిఖరముమాడ కడుగంభీరవంతమై యుండును. పరిసరములన్నియు మంచు ప్రదేశములగుట సూర్యరశ్మియు, వెన్నెలయు వాటిపైం బడి ప్రతిఫలించుచు నొక మహాతేజస్సువలె నేర్పడి పున్నమనాఁటి వెన్నెలకన్న మిన్నయై ఒకానొకతరి దివ్యతేజోమయమగుట నాసమధ్యమున కైలాసశిఖర దర్శన మచ్చెరువు గొల్పెడిని.



కైలాసపర్వతముం జుట్టియుండు నటవాలు ఎత్తుంధికముగ గల్గియుంటయు, తెల్లని హిమమయమైయుంటయు నెక్కుటకు వీలులేకుండును. కాన యాత్రికులు దర్శించుటయు, పరిక్రమ మొనర్చుటయు నొనర్చుదురు పర్వతము చుట్టును కొంత యెత్తున నొక త్రాటిం జుట్టి బిగించిన నేర్పడునరకు లేక నరదవలె నొక యానవాలు గానవచ్చుచుండును కైలాస శిఖరమున్న పర్వత పాదమున దర్చిన్ అను పేరుగల గ్రామము కలదు. ఇది టిబెట్టు దేశములోనిదయ్యు భూటానీయుల వశమైయున్నది. ఇట యాత్రికులను రక్షించు నధికారి దోషకను పేరు ఉద్యోగమున నొక భూటాన్ సామంతరాజు యుద్యోగాధికారిగ వసించుచుండును. కైలాసశిఖర దర్శనమును

గల్గించు తావునకు తొల్లింట దర్శనమని పేరుండి యుండనోపు. ఇప్పుడు దర్శ నమనంబడుచున్నది.

ఈదర్శనక్షేత్ర మొకపాటి కొద్దిపాటి వర్తక స్థలము. ఇటనొక మండీ (అంగడుల సముదాయము) బజారు కలదు. ఇచట టిబెట్టు, లడక్కు, చీనా, భూటాన్, నేపాళము దేశపు వర్తకులు కలరు, అన్ని దేశముల సరకులు దొరకును ఇటనుండి తీర్థపురి, చక్రతీర్థము, తోలామఠమునను యాత్రాస్థలముల కరగు మార్గములును, పరిక్రమ మొనర్చు బాటలును కలవు తూలామఠము, బౌద్ధమఠము, చక్రతీర్థము, స్నానతీర్థము ఇటను తీర్థపురి యందును శివలింగములు కలవు. కైలాసమునకు పరిక్రమ మొనర్చుచో దర్శనము నుండి బయలుదేరి తిరుగ దర్శనమునకుం జేరుటకు ముప్పదిమూడు మైళ్ల దూరమగును. తెలుచుగ యాత్రస్థులు మధ్యాహ్నము దర్శనమునుండి బయలుదేరి నాల్గవనాటి యుదయము పదిగంటలకుఁ దిరుగ దర్శనమునకుం జేరుచుందురు

మొదటి దినమున మధ్యాహ్నము ఎండ మరలగనే దర్శనమునుండి బయలుదేరి నాలుగుకాలమున నైదుమైళ్లు దూరమునందున్న నందిగుహకుం జేరఁగును ఇట రాత్రిలో చఁదముండ [illegible] శివలింగము నారాత్రియే చెచ్చి [illegible] కురు ఈగుహ చీనావారి స్వాధీనమునందున్నది [illegible] ముఖద్వారము చందనదారుతముతో రచింపబడినది ఇట రాత్రినిగడిపి మరునాఁడుదయమునఁనే బయలుదేరి మఱియైదుమైళ్లుదూరమరిగి యట నెత్తగు ప్రదేశమున విడసి భోజనమొనర్చుకొని మధ్యాహ్నము తిరుగ బయలుదేరి రాత్రికి అటనుండి ఏడుమైళ్లదూరమునందున్న డిమపుగుహ కేగి యట నిద్రింతురు. డిమపుగుహ(దర్శనమునుండి పదునేడు మైళ్లు) యందు బుద్ధభగవానుని విగ్రములు కలవు. ఈబౌద్ధదేవస్థానము టిబెట్టుదేశస్తుల స్వాధీనమందు న్నది. అటరాత్రి నివసించి మూడవనాఁ డుదయమున నే బయలుదేరుదురు. దారి ఎక్కుడై కష్టతరముగ నుండి గాలిపల్చనగుట ఊపిరిసరిగాయాడకుండును. మాటలు సరిగా విన్పించవు. మూడుమైళ్లు దూరము నడుచువఱకు మధ్యాహ్నమై ధాల్మలయను గుహకుం జేరుదురు. ఇది కైలాసశిఖరము క్రింద నున్నతావు. ఇట చీనా, టిబెట్టు యాత్రస్థులు కొన్ని లోనసాగి పూజించు పవిత్రస్థలి బౌద్ధదేవస్థానము గుహాకృతిగున్న [illegible] కలదు. అద్దానిని వాధ్యులుగుప్తకుండము నెదరు ఇదిమంచుచే గప్పబడి యుండు ఇనుప గజముతో బగులదీసి హిందువులు తర్పణములును, బౌద్ధులు సమ్మార్జనమును గావించి తిరుగబయలుదేరి ఇంక రెండు మైళ్ల దూరమునకున్న ఒక ఎత్తగు తావున విడసి మధ్యాహ్న భోజనము నొనర్చుకుని తిరుగ బయలుదేరి యటనైదుమైళ్ల దూరమునందున్న లాలూలాన్ గుహకుం జేరుదురు. ఇక్కడికి దర్శనము నుండి ఇరువదియేడు మైళ్లదూరము.

లాలూలాన్గుహకుం దనేక దేవతా విగ్రహములు కలవు లడకు దేశస్థుల దేవస్థానము. ఇట రాత్రి నివసించి నాల్గవదిన ముదయమునఁనే బయలుదేరి మూడుమైళ్ళలో సద్గ్గున్గుహాయును (లడకీండి) పిదప నరమైళ్ళులో ఒకపాటి పేరొకచిన్న గుహను గడచి పిదప రెండున్నరమైళ్ళ మార్గమున తిరుగ దర్శనమునకుం జేరుదురు. ఈవిధ పరిక్రమము ముప్పదిమూడు మైళ్ళగును

కైలాసశిఖరము దూరమునుండి చూడ మూడవ గును దగ్గరకుం బోయినకొలఁది హిమము మేఘ వాతమై శిఖరిపాదస్థలమునకుం బోవుటకుం గాన రాకుండును. ఆశిఖరమునకుం బోవుమార్గముం గల బార్హా మైదానముయొక్క ఉత్తరభాగమున నత్యున్నతమై శివాలయమువలె కైలాసశిఖరము కాన్పించును. మానససరోవర ప్రాంతములనుండి

శిఖరము మొదటఁగాన్పించినను కైలాస పాద మున నున్న నాల్గు బౌద్ధమఠములలో నొకటియగు దిండిఫు మఠమునుండి శిఖర సంపూర్ణ దర్శన మగును

**కైవలాయన గోత్రము** — గర్గ ఉపగణము చూడుఁడు.

**కైవాల్య గోత్రము** (కైవల్య) — గర్గఉపగణము చూడుఁడు.

**కైతికివత్తి** — లక్షణ చూడుఁడు

**కైక్రుమతి గోత్రము**—పరాశరగణము చూడుఁడు.

**క్రైస్తవ అరియన్ మతశాఖ** — క్రీస్తుప్రభువు తండ్రియగు దేవునకు సమానము కాఁడను సిద్ధాంతము క్రీ.శ. నాల్గవశతాబ్దమున అలెగ్జాండ్రాపురవాసి యగు అరియన్ అను బోధకునివలన తొలుత బోధింపఁబడినది. తరువాత కాలములందిదియే తిరుగ తలయెత్తి Unitarianism అనఁబడినది.

**క్రైస్తవఏంగిలస్ సర్వీస్** (ప్రార్థనలు)- క్రైస్తవమతమున రోమనుక్యాథలిక్కు దేవాలయములందు వర్జిన్ మేరీ దేవిగారి Annunciation గౌరవచిహ్నముగ నుదయకాలములందు మధ్యాహ్నకాలములందు ఆరుగంటల వేళలందునను, అపరాహ్ణ కాలములందునను, దినమునందు మూఁడుమారులు ప్రార్థనలు చేయుటను Angelus Service అనియెదరు.

**క్రైస్తవ నామములు**— క్రైస్తవుల నామములంగూర్చి వాటి విధివిధానములు నెఱుఁగ నెక్కుడ్రకగమ్యగోచరముగ నుండుంగాన వాని యుత్పత్తులును, అర్థములును వివరింతుముగాక. ఇవి తొలుదొల్త హీబ్రూభాషా పదములుగ నారంభమై, పిదప నెక్కుభాషలలోని పదములంగలుపుకొనసాగెను. రానురాను క్రైస్తవమతము పలుదేశముల వ్యాపించినకొలఁది ఆయాదేశ పదములలో కొన్ని క్రైస్తవమత నామములుగ సిద్ధమగుచుండెను. ఈ కాలమునంగల క్రైస్తవమత నామములలో కెల్టిక్కుపదములు, శాక్జను పదములు, ఆంగ్లోశాక్జను పదములు, ట్యూటోనిక్కుపదములు, గ్రీకుపదములు, లాటిన్పదములును గానవచ్చెడివి. ఇంకను మధ్య కాలమునందు చేర్పఁబడిన రష్యనుపదములు, పోలిషుపదములు, జర్మనుపదములు, ఇటాలియన్పదములు, ఆంగ్లికనులు, ఫ్రెంచిపదములు స్కాచి, ఐరిషు, వెల్షుపదములేగాక అమెరికన్ పదములును, రెడ్డిండియనుపదములును, పరిషియన్ పదములు, అరబ్బీపదములు, సంస్కృతపదములు గానవచ్చెడిని

ఇంకను కొన్ని నవీన కల్పితపదములుగలవు. షేక్స్పియరు మొదలగు కవుల నాటకములందు వాడఁబడిన విచిత్రపదములు కొన్నివాడఁబడు చున్నవి మఱికొన్ని పదముల ఉత్పత్తి అర్థములు గానరానివి ప్రచారమునందున్నవి.

ఈ క్రైస్తవనామ పదముల కర్థముల నాలోచింతముగాక ! హీబ్రూపదములు ముఖ్యముగ దైవభక్తిని వివరించు నర్థములం దెల్పెడిని. ట్యూటోనిక్కు పదములు- ప్రభుచిహ్నములగు మహోన్నత్యవిరశూరత్వములం దెల్పెడిని. కెల్టిక్కు పదములు మానవ ధర్మ లక్షణములగు విశాల హృదయ, ధైర్య, సాహస శౌర్యగుణగణముల వివరించెడిని. లాటిన్పదములు- దైవచిహ్నములను, జన్మసంఖ్యలను, తీర్థయాత్రాదివిశేషములం దెల్పెడిని. మఱియు స్త్రీలపేరులందు స్త్రీ సహజధర్మములగు సౌభాగ్యతాదివిశేషములును, సౌందర్యములును, శౌర్య, ధైర్య, బలాదులును గృహపరిపాలన లక్షణములును, మాతృ

కాది రత్నములపేర్లు, శరీరకాంతులు మొదలగు నవి వివరింపఁబడెడిని.

ముఖ్యముగ నన్ని పేరులందునను తెలుచు పవిత్రులగు ఋషి, యోగినీ నామములు గలవు. కొందఱు భూపాలుర పేరులును, రాణులపేర్లును గాననయ్యెడిని. కొన్ని పువ్వులపేర్లు సౌందర్య లక్షణములుగను, సింహాదిమృగముల పేర్లుబలనిరూపణమునను వివరింపఁబడినవి. ఆయాపేరుల కర్త్వములగు ముద్దుపేరులు పెక్కునామములకుగలవు.

ఇంకను నవీనకల్పితాంగ్ల, ఫ్రెంచి, జర్మను నామములు కలవు. వాటింకూర్పి యేమియుం దెలియరాదు. మఱికొన్ని నామములు పరంపరగ వాడఁబడుచున్నను వాటికుత్పత్తి గాని, యర్థము గాని తెలియదు. ఏటికేరూపము నందైనను అక్షర వర్ణక్రమము (Spelling) కడుముఖ్యము. దాని నిదివరకున్నది యున్నటులనే వాడఁబడు చుండదగును.

## క్రైస్తవ మత పర్వదినములు, పండుగలు —

**New Year's Day**- సంవత్సరాది; మనఉగాది పండుగంబోలిన దినము. ఇది జనవరి నెల ఒకటవ తేదీని జరపుచుందురు

**Epiphany**- గ్రీకుభాషయందు **Epiphaneia** అన దర్శనమని యర్థము. యేసుక్రీస్తుప్రభువు పసిబాలుఁడై యుండుటచే ముగ్గురు ధీశాలు రాబాలునిదర్శించి కానుకలు సమర్పించిరట. దాని జ్ఞాపకార్థమీదినమును పర్వముగా నెంచి యాచరింతురు. ఇది జనవరి ప్రారంభమున ఆరవతేదీ ఆప్రాంతమున నుండెడిని.

**Conversion Son of St. Paul** - బుధవారము. జనవరినెల ఇరువదియైదవ దిన ప్రాంతము.

**Charles King Martyr Day** - సోమవారము. ఇది జనవరినెలకడ నుండును.

**Purification of B. V. M.**- గురువారము. ఇది ఫిబ్రెవరి ఆదియందు రెండవతేది ప్రాంతమున నుండును

**Septuagesima Sunday**- ఇది ఫిబ్రెవరి పండ్రెండవ దినప్రాంతము.

**Shrove Sunday**- దీనిని **Quinquagesima Sunday** అనియు నందురు ఫిబ్రెవరి కడను ఇరువదియారవ దినప్రాంతము.

**Ash Wednesday** - ప్రభువు ఆదాప్రవక్తతో **'From dust thou art and unto dust thou shalt return'** అనిరొకట. అజ్ఞాపకార్థమీదినము పర్వదినముగనడపుచున్నారు. ఇది మార్చినెల ప్రారంభమున తటస్థించు చుండును.

**Quadragesima Day**-ఇది ఆదివారములందు జరపుదురు. ఈస్టరుపండుగకు నలువదిరోజులు ముందు మార్చినెల మొదటివారమున తట స్థించుచుండును. ఇంకను భక్తులు కొందఱు ఈస్టరుపండుగకు ఏబది దినములు ముందుగా **Quinquagesima Sunday** పర్వము కూడ నడపుదురు.

**All Fool's day** - ఇది కేవలము పండుగ. వినోదములదినము. ఏప్రెల్ ప్రారంభమున సంభవించును.

**Palm Sunday**-ప్రభువైన యేసుక్రీస్తు జరూసలేమునగరము ప్రవేశించునపుడు ఆకుల కొమ్మలం జేతబూని ఆయనను గౌరవించుచు జనులాయనను వెంబడించిరట. ఆ జ్ఞాపకము నకుంగాను ఈపండుగ జరపుచున్నారు.

**Maunday Thursday** - ఇది ఏప్రెల్ మధ్య భాగమున సంభవించును.

**Good Friday** - తొలుత God's Friday అనియుండియు రానురాను ఇటుల మారెను. ఇది పవిత్రదినము. ఏప్రెల్ నెల మధ్యభాగమున సంభవించుచుండును. శుక్రవారము.

**Easter Day**-ఒక క్రీస్తు ప్రభువు యూదులచే నందఱిని యీ దినమున వధింప తన మంత్రి వలన మోసగింపబడి యాజ్ఞ నిచ్చెనట. యూదస్త్రీయైన యాయన రాణిఆయాజ్ఞ ను రద్దుపఱచెనట. దాని జ్ఞాపకార్థము ఈస్టరురాణి పేరని పండుగ జరుపుదురు. ఇది ఏప్రెల్ మాసమున మధ్యభాగమున సంభవించును.

**Rogation Sunday** — Ascension day కు ముందుగ వచ్చు ఆదివారము. మేనెల ఇరువది యొకటవ దినప్రాంతమున సంభవించును.

**Ascension day**- క్రీస్తు ప్రభువు ప్రపంచము వదలి పైలోకమున కరిగిన నాటి యానవాలుగ నీ దినము మేనెల ఇరువదియైదవ ప్రాంతమున జరుపుదురు.

**Whit Sunday**- ఇది పండుగ. ఆదివారమున జూన్ మొదటి వారమున నడపెదరు. దీని నింకను Pente Cost అనియు నందురు. ఏబదియవ దినమని దీనికర్థమట.

**Trinity Sunday**- జూన్ నెల ౧౦, ౧౧ తేదీల ప్రాంతమున నాదివారమున నీ పర్వము నాచరింతురు.

**Corpus Christi day**- ఇది జూన్ మధ్యభాగమున సంభవించుచుండును.

**Mid Summer day**- దీనిని St. John the Baptist day అనియు నందురు. జూన్ మాసపు ఉత్తరపక్షమున సంభవించుచుండును.

**Translation of St. Martin day**- ఇది జూలై ప్రారంభవారమున మంగళవారము నందు సంభవించును.

**Lammas day**- యూదుల దేశమున పంటలు తేలగనే అప్పుడే కూర్చిన గోధుమలందంచి, పిండిచేసియు రొట్టెచేసి దేవాలయమున నిడచి భుజింతురట. ఇది ఆగష్టు ప్రారంభముననో అప్రాంతముననో వచ్చుచుండు నాచారపు పండుగ.

**Assumption day**- ఇది ఆగష్టు నెలమధ్యమందు వచ్చును.

**Nativity of B. V. M. day**- ఇది సెప్టెంబరు మొదటివారమున సంభవించును.

**Holy Cross day**-ఇది సెప్టెంబరు మధ్యభాగమున గురువారమున సంభవించును.

**Day of Atonement**- అక్టోబరు పదియవ తేది ప్రాంతముల మంగళవారమున సంభవించును.

**All Saints day**- సంవత్సరమున ప్రత్యేక దినము లేని కీర్తిపడని పవిత్రపురుషుల దినము. నవంబరు ప్రారంభమున జరుపుదురు.

**All Souls' day**- ఇదియు పైకాలముననే ఆ తోడనే జరుపుదురు.

**First Sunday in advent**- డిశంబరు ప్రారంభమున సంభవించెడు ఆదివారము పవిత్ర దినము.

**Christmas day** -ఇది డిశంబరు ౨౫ లేక ౨౬ తేదీలం బడుచుండును. క్రీస్తుప్రభువు భూమియందు జన్మించినదినము. ఇది చాల పవిత్ర దినము.

**Holy Innocent's day** - డిశంబరు ౨౮ అప్రాంతమున సంభవించెడిని.

**Childermas day** - దీనిని St. Silvester day అనియునందురు. డిశంబరు నెల కడను సంభవించును.

ఇంకను అప్రసిద్ధపండుగుల నాచరించుటయుం గలదు.

**Boxing day**- బీదలకు ధర్మముచేయ నదివఱకు పెట్టెలంగట్టియుండి వాటి నీదినమున తెచ్చి వచ్చినదానిని బీదలకిడు దినము.

**Candlemas** - క్రైస్తవులు వెలిగించి క్రొవ్వొత్తులను Mass నకుం గొంపోవుదిన దినము.

**Ember days** - ఆంగ్లోశాక్సను మాటయగు ఎమ్బైర్ యన వేడి, రొయ్యి యని యర్థము. ఇది వారము దినములు ఆచరింతురట. కొందఱు ఉపవాసములుందురట.

**Holy week** - క్రీస్తుప్రభువు శిలువవేయఁబడిన వారమని యర్థము. ఇవి పవిత్రదినములు.

**Lent** - లాటిన్భాషయందు Lenten అన Spring కాలమని యర్థము.

**Lady day** - క్రీస్తుప్రభువు జన్మించకముందు మేరీమాతకు దేవదూత (Angel) దర్శన మిచ్చిన దినమునకు జ్ఞాపకదినము. పిదప ప్రభువు జన్మించెనట.

**Passover day**- నాశనకరుం డగు దేవదూత (Destroying Angel) రాగా ఇస్రాయేలీయులు తమద్వార స్తంభములకు రక్తమును పూసినకతన వారియిండ్లకు రాక, ఇండ్లపై నుండి అనాశనకరుఁడేగిపోయి అపదగడచిన యూదవాలుగ నీపర్వము నాచరించుచుందురు. ఈదినమున పులియనిరొట్టెలను తినెదరట.

ఇవియునుగాక పవిత్రపురుషులగు కొందఱు క్రైస్తవమతభక్తులగు ఋషిస త్తముల పేర్లం బరగు దినములు కొన్ని గలవు. వాటిని గూడ కొంద ఱాచరించుచుండుటయుం గలదు.

**St. Lucian day**-

ఆదివారము జనవరి 8 ప్రాంతము.

| | | |
|---|---|---|
| **St. Hilary day**- | „ 13 | „ |
| **St. Prisca day**- | „ 18 | „ |
| **St. Agnes day**- | „ 21 | „ |
| **St. Vincent day**- | „ 22 | „ |
| St. Blaise day- | ఫిబ్రవరి 3 | ప్రాంతము. |
| St. Agatha day- | „ 1 | „ |
| St. Mathias day- | „ 24 | „ |
| St. David day- | మార్చి 1 | ప్రాంతము. |
| St. Chad day- | „ 2 | „ |
| St Perpetud day- | „ 7 | „ |
| St. Gregory day- | „ 12 | „ |
| St. Patrick day- | „ 17 | „ |
| St. Benedict day- | „ 21 | „ |
| St. Ambrose day- | ఏప్రెల్ 4 తేది | ప్రాంతము |
| St Alphege day- | „ 19 | „ |
| St Dominle day- ఇది Passover పండుగ సంసు కూడటి దినము. | „ 21 | „ |
| St. George day- దీని Low Sun-day అనియు నందురు. | „ 23 | „ |
| St. Mark's day- | „ 25 | „ |
| St. Philip day- St. James day- | మేనెల 1 | „ |
| St. Dunstan day- | „ 19 | „ |
| St. Boniface day- | జూన్ 5 | „ |
| St. Barnabas day- | „ 11 | „ |
| St. Alban day- | „ 17 | „ |
| St. Peter's day- | „ 29 | „ |
| St. Swithun day- | జూలై 15 | „ |

సైంట్ స్విథిన్ మహాత్ముఁడు తన శరీరమును ఆంగ్లదేశమున వించెస్టరు కేథిడ్రలునందు పాతవలదని చెప్పి మరణించెనట. ఐనను అట పాతుటకు పెద్దలు తీర్మానించు నాదినమున గొప్పగాలి వర్షముఁగల్గి ఆపాతుట ఆగిపోయెనట. పిదప ముప్పదితొమ్మిది దినములిట్లు గాలివాన గలుగుట ఆగిపోవుటసంభవించుచుంట, పెద్దలాదరాలోచించి అట్లుజరుపమనిరట. తోడనే వర్షమాగిపోయెనట. పిదప నామహాత్ముని కొర్కెమేరకు దేవాలయము వెలుపల పెరటి స్థలమందు పూడ్చిపెట్టిరట. కాన నాఁటినుండి St. Swithen day D

వర్షించిన, తర్వాత 30 దినములు వర్షించునందురు.

| | | | |
|---|---|---|---|
| St. Margaret day- | జూలై | 20 | సాధ వించును. |
| St. Mary Magdalen day | ,, | 22 | ,, |
| St. James day | ,, | 25 | ,, |
| St. Anne day | ,, | 27 | ,, |
| St. Lawrence day | అగష్టు | 10 | ,, |
| St. Bartholomew day | ,, | 24 | ,, |
| St. Augustine day | ,, | 28 | ,, |
| St. Giles | సెప్టెంబరు | 1 | ,, |
| St. Eumerchus day | ,, | 7 | ,, |
| St. Lambert day | ,, | 17 | ,, |
| St. Mathew day | ,, | 21 | ,, |
| St. Cyprian day | ,, | 26 | ,, |
| St. Michael day దీనిని Michaelmas day అనియు నందురు. | ,, | 29 | ,, |
| St. Jerome day | ,, | 30 | ,, |
| St. Remigius day | అక్టోబరు | 1 | ,, |
| St. Faith day | ,, | 6 | ,, |
| St. Denys day | ,, | 9 | ,, |
| St. Etheldreda day | ,, | 17 | ,, |
| St. Luke the Evangelist day. | ,, | 18 | ,, |
| St. Crispin day | ,, | 25 | ,, |
| St Simon day / St. Jude day | ,, | 28 | ,, |
| St. Leonard day | నవంబరు నెల | 6 | ప్రాంతము. |
| St. Martin day | ,, | 11 | ,, |
| St. Britius day | ,, | 13 | ,, |
| St. Cecilia day | ,, | 22 | ,, |
| St. Clement day | ,, | 23 | ,, |
| St. Catherine day | ,, | 25 | ,, |
| St. Andrew's day | ,, | 30 | ,, |
| St. Nicholas day | ,, | 6 | ,, |
| St. Lucy day | ,, | 13 | ,, |
| St. Thomas day | ,, | 21 | ,, |
| St. Stephen day | ,, | 26 | ,, |
| St. John day, this is St. John the Evangelist. | ,, | 27 | ,, |

**క్రైస్తవ మతము** — ఇది తొలుత యూదుల మతమునుండి బయలుదేరి యేసుక్రీస్తు ప్రభునిచే సంస్కరింపఁబడిన రీతిని వేరుగనై తరువాత వారి వారి అభిప్రాయములకు లోనై చిన్న చిన్న మార్పులం జెందియున్న మతము. కష్టములు అక్కరలేక సౌఖ్యముగనే మతవిధులు నెరవు చుండ వీలగుచుండుటయు గొప్ప గొప్ప ప్రభుత్వములబలము దీనికి గల్గియుండుటయుపలు దేశములందు వ్యాపించి యున్నది. ఒక్క టర్కీ దేశము తప్ప తక్కిన ఐరోపా ఖండమంతయు ఏదో విధమున క్రైస్తవ మత వ్యాపకము గాంచిన ఖండమనియే చెప్పవలసి యున్నది.

క్రైస్తవ మతగ్రంథమున కాంగ్లమున బైబిలు అని పేరు. అరబ్బీ, పారశీక దేశ భాషలందు ఇది కొన్ని మతశాఖల వారియందు పాతనిబంధన క్రొత్తనిబంధన యను రెండు పుస్తకములుగను రోమన్ క్రైస్తవులందు మూడు పుస్తకములుగను, ఇంకఁగొన్ని తెగల క్రైస్తవులందు నాల్గు, ఐదు పుస్తకములుగను కూడ నున్నది. పాత నిబంధన లోని సంగతులు క్రైస్తవులు, యూదులు, మహమ్మదీయులు కూడ నంగీకరించుచున్నారు. ఈ మతముల వారలకందఱికి సృష్టిక్రమము మొదలగునవియు ఆదికాలములవారి చరిత్రలు నిందు చెప్పఁబడినది.

క్రైస్తవ మత ధర్మమున తొలుత దేవుఁడు భూమ్యాకాశములు సృజించె ననియు, భూమి శూన్యముగా నుండి అగాధ జలములపై చీఁకటి క్రమ్మి యుండెననియు, దేవునియాత్మ జలములపై నల్లాడు చుండెననియు వెలుగును దేవుఁడు కల్గించి వెల్గును చీఁకటిని వేఱుపరచె ననియు, వెలుగునకు పగలనియు, చీఁకటికి రాత్రియనియు దేవుఁడు పేరిడె ననియు, అస్తమయము ఉదయము కాగా మొదటి రోజాయెననియు చెప్పఁబడినది. ఈ ఉదయాస్తమయములు దేనికో చెప్పఁబడ లేదు.

ఇట్లే రెండవ దినమున దేవుఁడు ఆకాశమును, మూడవ దినమున భూమికి భూమియని పేరిడి, సమస్త వృక్ష జాతులను గడ్డిమొక్కలం గల్గించెను. నాల్గవ దినమున ఆకసమున వెలుఁగు నీయ నొక పెద్ద జ్యోతిని రాత్రి చీఁకటియందు ఇంచుక వెలుఁగీయ నొక చిన్న జ్యోతిని కల్గించెను. నక్షత్రములు కల్గించెను. ఐదవ దినమున నీటి యందు జలచర జంతువులను, ఆరవ దినమున పశువులను, అడవి జంతువులను, కీటకాదులను సృజించెను. ఏకవ దినమున దేవుని స్వరూపముననే మనుష్యులను సృజించి వారిని వృద్ధిగ సంతానముం గని లోకమును ప్రజలచే నింపుడని దీవించెను. ఏడవ దినమున దేవుఁడు విశ్రాంతిఁ గొనియెను ఇది సబ్బాతనంబడుచున్నది. అనగా సోమవారము మొదటి దినము, మంగళవారము రెండవ దినము, బుధవారము మూడవ దినము, గురువారము నాల్గవ దినము, శుక్రవారము ఐదవ దినము, శనివారము ఆరవ దినము, ఆదివారము ఏడవ విశ్రాంతిదినమునని యెఱుఁగునది. ఇది సృష్టి విధానము.

సర్వ సాధారణముగ క్రైస్తవ మతమున దేవునకు తండ్రి యనియు, యేసుక్రీస్తు కుమారుఁడనియు, పరిశుద్ధాత్మను Holy Ghost అనియు ననెదరు ఈమూఁడును త్రిత్వమని (Trinity) చెప్పఁబడినది.

దేవునకు యూదులమతమున జహ్వా యని పేరుండెను. దానినే ఆంగ్లోచ్ఛారణలో జహోవా యనియు, జోవ్ అనియు వాడుటయుంగలదు. దేవుఁడు పరిశుద్ధుఁడు. సృష్టికిం బూర్వము శబ్దముండెననియు, అందు జహోవా యుండెననియుం జెప్పఁబడినది. అతఁడు జగమునకు కర్త గాని, ఆసృష్టి భౌతికసృష్టి కాదు. జహోవా సృష్టిని తన స్వపదార్థములతో చేసియుండలేదు గాన జగత్స్వరూపుఁడు కాఁడు. కొందఱు జగద్వ్యాపియందురు. కాని ఊర్ధ్వలోకమగు సత్యలోకము లేక దేవలోకమునందుండువాఁడని చెప్పఁబడియున్నది. దేవుఁడు సీనాయిపర్వతోపరిభాగమున ఇశ్రాయేలీయులాచరించుటకుగాను మోషే (Moses) ప్రవక్త పరిముఖమున పది యాజ్ఞలనొసంగెను. వాటిని Ten Commandments అనియెదరు. అవి,

Duty to God :—

1. Not to worship any other than the one true God.
2. Not to worship images.
3. Nat to use God's name lightly
4. To keep holy the Sabbath day.

Duty to Man :—

5. Honour thy father and thy mother
6 Thou shalt not kill.
7. Thou shalt not commit adultery.
8. Thou shalt not steal.
9 Thou shalt not bear false witness.
10. Thou shalt not covet.

వీటిని క్రైస్తవులు కూడ గౌరవించుటంజేసి ఈ మతధర్మము లింతక తెలియనగుచున్నవి సృష్టియందు దేవుఁడు మనుష్యులను తన ఆకృతిగానే చేసెనని చెప్పుబడుటవల్లను దేవుఁడు సాకారిగాని నిర్గుణబ్రహ్మము కాఁడని స్పష్టమగుచున్నది. దేవునకు అర్చనయు, మానసికార్చనయె గాని, కాయికఅర్చన కాదని తేలుచున్నది

జహోవాతో నరులకు సాన్నిధ్యవాసము ముక్తిగాని ఐక్యముక్తి లేనందుటంజేసి ప్రాణులు పరమేశ్వర పదార్థము కాదని తేటుచున్నది. దైవారాధనము కరణీయమును, క్షమాపణార్థించుటయు ముఖ్యభాగము. ప్రతిమానవుఁడు పాపములు చేసినవాఁడే యనియు, అవి క్షమింపఁబడుటకు ప్రార్థన యనియు చెప్పఁబడినది. ఆక్షమ యేసుక్రీస్తు ప్రభుని మూలముననే గల్గవలయునని విధికలదు.

పవిత్రప్రదేశము) మొదలగునవి కొన్ని కలవు. తక్కినవి Christian Saints యొక్క స్థానములుగ నున్నవి.

అదృష్టవశమున గొప్పరాజ్యము లీమతము నవలంబించి బలాఢ్యములై యుండుటచేత నీ మత బోధకులు అధికారవంతముగ నటించుచుండుట భారతదేశమున నెల్లరెఱిగినదే. వీరికి స్వాభిమానము మెండు. ఐరోపాదేశస్థులు స్వతంత్రప్రియులు గాన స్వాభిమానము మతధర్మములందు స్వతంత్రరూపమునంది స్వాభిప్రాయ పుట్టుదలతో ననేక సంఘములుగఁ జీలి క్రైస్తవమతము ఇక్కాలము ౨౭౫ వేఱ్వేఱు శాఖా సంఘములుగ నున్నదని వింటిమి.

ఈ క్రైస్తవమత ప్రభేదసంఘములను ఆంగ్లమున Churches అనియెదరు. అందు ముఖ్యములు గ్రీకుచర్చి, రోమన్కాథలిక్చర్చి, ప్రొటస్టాంటుచర్చి, లూథర్చర్చి, అమెరికన్బాప్టిస్టుచర్చి, వెస్లియన్చర్చి, మోర్మన్చర్చి, మొరేవియన్చర్చి, ఏంటివేగానియన్చర్చి, కాల్వినిస్టుచర్చి, ప్రెస్బిటేరియన్చర్చి, యూనిటేరియన్చర్చి, లండన్మిషన్చర్చి, స్కాట్స్చర్చి, ఇంగ్లీష్ ఎపిస్కోపల్చర్చి, క్వేకర్చర్చి, స్వీడన్బర్గీచర్చి మొదలగునవి కొన్ని కలవు. తక్కినవి స్వల్పసంఖ్యాకులుగల సంఘములుగ నున్నవి వీటియందు అభిప్రాయభేదములచే గల్గిన కొన్ని భేదములు, విధులు, విధానములు గాననగుచుండును. వీరికి ప్రార్థనమందిరములు వేఱ్వేఱుగ గలవు.

**క్రైస్తవమత శిలువభేదములు** — క్రైస్తవమతప్రభువగు యేసుక్రీస్తు ప్రజల పాపములను నివారింపఁ దాను శిలువ వేయంబడి మృతినొందినసంగతి బైబిలునందు వివరింపఁబడినది. పిదప క్రైస్తవమతమభివృద్ధిఁ జెంది వ్యాపించినకాలది,



వేఱ్వేఱు సంఘములుగ చీలుట సంభవించెను. వారియందు కల్గిన భేదములగు మతాభిప్రాయము లీ చీలికకుఁ గారణము మయ్యెను.

అటుల వేర్వేఱసంఘములు తమతమ ప్రధాన మతచిహ్నమగు శిలువయందు భేదములు కల్పించి వాడుకొనుచున్నవి. అవి ఇరువది కానంబడుచున్నవి.

౧. గ్రీకుశిలువ, ౨. టాన్ (Tan) శిలువ, 3. లాటిన్ (Latin) శిలువ ౪. పాట్రియార్కి శిలువ, ౫. పాపల్ (పోపుగారి) శిలువ, ౬. కెల్టిక్ శిలువ, ౭. ఏంథ్రూస్ శిలువ, ౮. బోటోనీ శిలువ, ౯. క్లెచీ (Clechee) శిలువ, ౧౦. క్రాస్ క్రోస్లెట్, ౧౧. ప్లియూరీ శిలువ. ౧౨. ప్లియూరిటీ శిలువ, ౧3 పొర్ఫీ శిలువ, ౧౪. మాల్టీస్ శిలువ, ౧౫. పేటోనీకీ శిలువ, ౧౬. పోటెంట శిలువ, ౧౭. పోమ్మీ శిలువ, ౧౮. రిసెర్సీల్లీ శిలువ, ౧౯. గ్రింగోలెక్ శిలువ, ౨౦. పట్టీ శిలువ.

**క్రైస్తవమత సప్తగుణములు** — గుణమన దోషముకానిది గుణమని యర్థము ఇవి యోగ్యతలని చెప్పఁబడినవి.

౧. నమ్మకము, ౨. ఆశ, 3. వితరణము, ౪. జాగ్రత, ౫. ధర్మపథము (న్యాయము), ౬. మనస్థైర్యము. ౭. మితభోగము ఇవి సప్తగుణములని చెప్పఁబడినది. (క్రైస్తవమతసప్తదోషములు చూడుఁడు.)

**క్రైస్తవమతసప్తదోషములు** — ౧. గర్వము, ౨. కోపము, 3. అసూయత, ౪. దంభము, ౫. కుక్షింభరత్వము, ౬. అసమాధానము, ౭. సోమరితనముకల్గియుండుట క్రైస్తవులకు ఘోరాపరాధము లని చెప్పఁబడినవి. ఇవి సప్తదోషములట. (క్రైస్తవమతసప్తగుణములు చూడుఁడు.)

**క్రైస్తవమతసప్తసత్కార్యములు-** ౧. జబ్బుపడినవారి కుపచారము లొనర్చుట, ౨. ఆకలిగొనినవారి కాహారమిచ్చుట, 3. దాహాతురులకు దాహపానీయ మిచ్చుట, ౪. వస్త్రహీనులకు బట్టల నిచ్చుట, ౫. ఇండ్లులేనివారికి వసతు లమర్చుట, ౬. రక్షకులులేనివారి నరయుచుండుట, ౭. మృతులకు సమాధి యొనర్చుట.

**క్రైస్తవమున సప్త యోధాభిమానులు** — Seven champions of Christendom.

౧ ఇంగ్లాండు దేశమున St. George

౨. ఫ్రెంచి దేశమున St. Denis.

3. ఇటలీ దేశమున St. Anthony.

౪. స్పానియా దేశమున St James.

౫. స్కాట్లాండు దేశమున St. Andrew.

౬. ఐర్లాండు దేశమున St. Patrick.

౭. వేల్సు దేశమున St. David.

వీరు Patron Saints అని చెప్పబడినది.

**క్రెస్సెంట్** (Crescent) — లాటిన్ నామము, వృద్ధిపొందుచున్నయని యర్థము పురుష నామము (క్రైస్తవ నామములు చూడుడు).

**క్లైమేట్** — శీతోష్ణ, వర్ష వాతావరణ పరిస్థితులు చూడుడు శీతోష్ణస్థితి చూడుడు.

---

**కొంకణ దేశము** (కొంగను దేశము, పరశురామ క్షేత్రము) — కొంకణ దేశమునకు కొంగను దేశమనియు, పరశురామ క్షేత్రమనియు పేరుగలదు Journal of Asiatic Society of Bengal 1838 P. 187లో నున్నది పడమటి కనుమకు పశ్చిమసముద్రమునకు(Arabian Sea) నడుమనుండు సీమ నాటి భూభాగ మని Bombay Gazeteer Vol I. Part 2 P 283 యందు కలదు ఈదేశము సూరతునుండి గోవావఱకు పైవెల్లగను, దక్షిణముగ నుత్తర కన్నడదేశము వఱకు సముద్రతీరము నాటియె వ్యాపించిన దేశముగ చెప్పియున్నారు. దాని ఉత్తరపు ఎల్ల గుజరాతుగను, తూర్పు ఎల్ల దక్షిణపథముగను, (Deccan), దక్షిణపు ఎల్ల ఉత్తర కన్నడ సీమ, పశ్చిమపు ఎల్ల అరేబియా సముద్రమును అని తెలుపుచున్నది. ఇది యిటులనే పరశురామ క్షేత్రముకు సప్తకొంకణములని చెప్పియున్నారు. అవి కేరళము, తులుంగము, గోరాష్ట్రము, కరహాటము, వరాలాటము, ఖర్జరము, కొంకణమునని. అందు కేరళమనిన మలయాళదేశము గోరాష్ట్రమన ఇప్పటి గోకర్ణ ప్రాంత సీమ. కరహాటము కరాడపుర ప్రాంతము. వరాలాటము వస్యపుర ప్రాంత సీమ. వస్యపురము నిప్పటి బేసిన్ గా చెప్పియున్నారు. ఇంక నీవిషయమున నీక్రింది నాగకులు గమనింపవలసి యుండును. (సప్త కొంకణములు చూడుడు)

స్కాందపురాణమున సహ్యాద్రి ఖండము ౬౧ యందు కొంత వివరణ కలదు. బొంబాయి రాజధాని రత్నగిరిజిల్లా సంగమేశ్వర పురమునగల సంగమేశ్వర శివలింగము పరశురామ ప్రతిష్ఠితముగ చెప్పబడినది. ఇది కృష్ణానది యందు వేణీనది సంగమించు తావున నున్నది. అందు చెప్పబడిన

వాలుకేశ్వర శివలింగము బొంబాయి నగరమందు మలబార్ హిల్ అనుచోట వాలుకేశ్వరమను పేట యందు గలదు. మఱియు బాణవల్లి యనియందే చెప్పఁబడిన సరస్సు ఇప్పుడు వంబల్లియను పేరం బఱగుచు గోవాకు దక్షిణముగా కతిపయ దూరముననున్నది. పరశురామ క్షేత్రములోనిదని చెప్పఁబడిన శూర్పారక క్షేత్రమును భాండార్కరు పండితుఁడు ఉత్తర కొంకణముగఁ జెప్పి యున్నాఁడు. (అపరాంత దేశము చూడుఁడు). కొందఱు దీనికి ఉత్తరమున ఉత్తర వైతరణీయ నదియును, తూర్పున సహ్యాద్రి పర్వతము, దక్షిణమున సుబ్రహ్మణ్య క్షేత్రము, పశ్చిమమున పశ్చిమ సముద్రమునని చెప్పిరి. మహాభారతము శాంతిపర్వము ౪౯ యందు ఈ క్షేత్రమున చతురంగణ పర్వతమున పరశురాముఁడు వసించు వాఁడని చెప్పఁబడినది.

ఉత్తర కొంకణమున శ్రీస్థానక పురము లేక శైలాహార పురమను పేరుగల పురము చెప్పఁబడినది అది ఇప్పుడు ఠానాపురమని పిలువఁబడుచున్నది. కొంకణదేశమున కంత కొకప్పుడు అనగంధిపురము రాజధానియై యుండెననియు, దానికింబిదప బేసీపురమును, వేఱొకప్పుడు ఠానాపురమును, మఱియొకప్పుడు రేవావంతి లేక రేవతీక్షేత్రము (ఇప్పటి రాల్ పురము) ను, రాజధానులుగ నుండెనని చెప్పఁబడినవి. ఒకప్పుడు కిల్కిల నగరము లేక కిల్గిల రాజధానిగ నుండెనట. దీని తావిప్పుడు గానరాకున్నది. తొల్లింట రొకప్పుడు శ్రీశైలము నుండి బంగాళాఖాతము వఱకు వ్యాపించి యుండిన వాకాట దేశమునే శైలాకిలయమను లనంబడువారు కొంకణాల మేలి రనియు, వారికి వింధ్యాశక్తి మూలపురుషుఁడనియు, విష్ణుపురాణ ౪-౨౪ యందు గానవగుచుంట, దీనికాసంబంధ మేదియైన గలదాయని సంశయము తోఁచెడిని. దీని నింకను బాగుగా పరిశీలించ వలసి యున్నది.

**కొంకణపురము** — అనగంధిపురము, కొంకణదేశము చూడుఁడు.

**కొంకణసప్తకము** — (సప్తకొంకణములు) పశ్చిమసముద్రతీరము నాదలివి:- ౧. కేరళము (మలయాళదేశ మంతయును), ౨ తుంబ (తులుంగ లేక, తులువ) దక్షిణకన్నడ మని ఇప్పుడు పిలువఁబడు దేశప్రాంతము, స్కాంద పురాణసహ్యాద్రిఖండమున దీనికిఁ గళ్యాణపురము మొదలు చంద్రగిరినదివఱకుం గల పశ్చిమ పర్వతములకును సముద్రమునకు మధ్య గల ప్రదేశ మని చెప్పఁబడినది 3. గోరాష్ట్రము, గోకర్ణద్వీపము లేక, ద్వీపకల్పమునుదానికిఁ దొల్లి గోరాష్ట్రమని పేరు. ౪. కొంకణదేశము (కొంకణు లుండు దేశము), ౫. కర్ణాటకదేశము, (కారాష్ట్రదేశము) కర్హాటపురము రాజధానియై యుండెను. స్కాందపురాణసహ్యాద్రిఖండమున కోయినా లేక, కోయన ఉత్తరపుటెల్లగను, వేదవతి దక్షిణపుటెల్లగను చెప్పఁబడినది. ఇప్పటి సతారా (సత్రా) మండలమును, ఆప్రాంత భూములు నై యుండనోపు. ౬. వరాలాట దేశము, లాటదేశము దక్షిణఘూర్జర దేశప్రాంతము, ఖాండేశభూమి. ౭. బర్బరదేశము.

**క్రొంకిపిసిని (తీగ)** — ఇది డొంకగ తీగ ప్రాకునది. ముండ్లుండును. దీనిని కొంకి చెట్టనియు, కొంకిరిపీతిరి చెట్టనియుగూడ ననెదరు. దీనియాకు రసము కాకకేసి. ఉబ్బు, గుల్మము, పాండురోగము, శ్లేష్మవాతములపై మంచిపని చేయునందురు.

**క్రొంకిపురుగువ్యాధి**(Hook worm)- ఇది సూక్ష్మజీవుల (Worms) జాతికిఁ జెందిన

పురుగులనుండి కల్గు అంటువ్యాధి. దీనిని క్రీ. శ. ౧౭ వ శతాబ్దమున కనిపెట్టిరి. అరంగుళము పొడవు, దారమువంటి శరీరముఁ గల్గి గ్రుడ్లనుండి జనించును. ఈపురుగు ఆహారమునకై ఆకులు, పండ్లు మొదలగువాటిపైఁ జేరుకొని, ఉడకని భోజనపదార్థములతో లోని కేగును. శరీరము పెంపుకలదై యుదిరెండు సంవత్సరము జీవించగల దనియు, లోనికేగి ఉదరకోశమున (Duodenum) అంటుకొని శిరోభాగమున నివాసము గుదస్థ్సకుని ఐన, లేక ఆరుసంవత్సరములు జీవించుననియుఁ జెప్పుదురు. ఆడుపురుగు కొండలు పక్షిలకులు జేసు...చే...చూస్తును అంకాలు దొల్చుకొని లోనికిఁ బోవలవసును. అన్త్రిసట వరవ గల్గ చర్మరోగము కల్గుట కొరకు తీరకను నొప్పికిని, జీర్ణకోశమునకుకూడ చేయుగలరు ఆరువారములకు కీళ్లరోగము బాగుపడునట. కోఁతులు, కుక్కలు మొదలగు సుంధజంతుజాతుల మూలమున నివి వ్యాపించి, అంటురోగ మగునని పోల్చఁ బడినది. (అంటువ్యాధులు చూడుఁడు, సూక్ష్మజంతువులు చూడుఁడు)

**కొంగమదేశము** — కొంకణదేశము చూడుఁడు

**కొంగుదేశము**—కోయంబత్తూరు సేలం మండల ప్రాంతదేశమున కొకప్పుడు కొంగుదేశమని పేరుండెను. గంగవంశపురాజులపాలనమున ఈకొంగుదేశపు రాజులు స్వాతంత్ర్యముల కుపయోగించుకొనువారట. కొంగుశబ్ద మేమో తెలియకున్నది.

**కొండకు వెండ్రుకకు ముడి వేసేవాఁడు** — అనగా వస్తే (లాభిస్తే) కొండవచ్చును. పోతే తలవెండ్రుకయే తెగిపోవును.

**కొండగోగు చెట్టు** — లా. Carleria ciliata, Hibiscus cannabinus. అనియు, సం. కిరాతః, కర్ణికాద్రుమః, పీతభద్రకా యని కొండజువాడిరి. దీని కషాయము, వేరు రసము లేక ఆకులరసము శోధనచేయుననియు, కుష్టురోగము నివారించి యాపునినియు, రక్త దోషములు, వ్రణములు, వాపులు, శ్లేష్మరోగముల నివారించుననియుఁ జెప్పుదురు.

**కొండచెముడు చెట్టు** — ఆకుడు చెట్టు చూడుఁడు.

**కొండంతమగడుపోతే పిడికెడు బొచ్చునకా ఏడ్చుట?** — ఆంధ్రలోకోక్తి.

**కొండంత దూదిం గాల్చుటకు కొండంత నిప్పు కావలెనా?** — ఆంధ్రలోకోక్తి.

**కొండ తలక్రింద నుంచుకుని రాళ్లకు వెదకి తాపత్రయపడినట్లు** - ఆంధ్రలోకోక్తి

**కొండనాల్కకు మందువేస్తే ఉన్న నాల్క ఊడినట్లు** — ఆంధ్రలోకోక్తి

**కొండంజూచి కుక్కలు మొరిఁగినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**కొండంద్రవ్వివేచి ఎలుకం బట్టుకొన్నట్లు**—ఆంధ్రలోకోక్తి

**కొండపల్లి దుర్గము** — ఆంధ్ర దేశమున కృష్ణా జిల్లాయందు బెజవాడకు పదిమైళ్ల దూరమున కొండపల్లి గ్రామముకడ కొండపైనున్న దుర్గము.



క్రీ. శ. ౧౩౬౦ సంవత్సర ప్రాంతమున కొండవీటి రెడ్డి యగు అనువేమారెడ్డిచే నిర్మింపఁ బడినట్లు చెప్పఁబడినది. గొల్ల కొండడను వాఁడీ దుర్గపు తావును రెడ్డిగారికి చూపుటచేత వానిపేర కొండపల్లి యని పేరిడఁ

బడి నటుల ప్రతీతి కలదు. రెడ్ల ప్రభుత్వాంత మున నీదుర్గము ఉత్కళ భూపతుల వశమై వారి నుండి క్రీ. శ. ౧౪౭౧ లో గుల్బర్గా ప్రభువగు రెండవ మహమ్మదుషా వశమై ౧౫౧౫ లో కృష్ణదేవరాయ (విజయనగరము) సార్వభౌముని వశమై యాతని వలన ఉత్కళ భూపతుల కీయఁ బడి మధ్య మధ్య కొన్ని మార్పుల నందియు ౧౫౮౭ సంవత్సరమున ఔరంగజేబు రాజ్యమున కుఁ జేరెను. పిదప క్రీ శ. ౧౭౬౬ లో బ్రిటీషువారి హస్తగతమై కొంత సైన్య మట నుంచఁబడి ౧౮[illegible] సైన్యములు తీసివేయఁ బడినవి

కొండ క్రింద కొండపల్లి గ్రామము కలదు. అందు కొండపల్లి బొమ్మలని పేరొందిన బొమ్మలు చేయుదురు.

**కొండప్రత్తి వ్యవసాయము** — ఇది స్వేచ్ఛ ప్రత్తి జాతిఁ జెందిన ప్రశస్తమైన జాతి. భరతదేశమున దనాదిగ నిట్టి పెరస్సు యుండొ కటి రెండు చెట్లుగ నాటఁబడి పెంచఁబడు చుండి నవి తెల్లని ప్రత్తి నిచ్చెడివి. కఱడి (హైడి) ప్రత్తి బోలి యుండుం గాని దాని రంగు దళ తెల్లగ నుండునది. భరతదేశపు సుప్రసిద్ధ జాతి సన్నపు నూలునకు పనికివచ్చునది. (ప్రత్తి వ్యవసాయము చూడుఁడు). ఇంచు మించు ఇరువది వత్సరము లీచెట్లు బ్రతుకుచు కాయుచుండును.

దీనిం బెంచు విధానము స్వేచ్ఛ ప్రత్తిం బోలియె యుండును.

**కొండముడుగు పురుషోత్తమకవి**- ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడిన వాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజస గోత్రము. తండ్రిపేరు గిరియప్ప ఈతనికి గయ్యలూరు మొదలగు గ్రామముల భూస్వాస్త్య ముండినది. రచించినది పానందగణేశ్వరము.

**కొండలుప్రమింగేవానికి గోపుర మొక యుద్దమా ? — ఆంధ్రలోకో క్తి.**

**కొండవీటిసీమ** — ఆంధ్రదేశమందలి గుంటూరుమండలమున గల కొండవీటి దుర్గము సుప్రసిద్ధము. ఈ ప్రాంత దేశభాగమునకు కొండవీటిసీమ యనిపేరు మెరక ప్రదేశమగుట నూతులు (బావులు) చాల లోతుగనుండి నీటి-చేదు కొను త్రాడు చాల పెద్దదిగానుండుట దేశప్రసిద్ధ మగాన, ఎక్కువ పొడవుగానున్న ధోరణిప్రసంగమునకు 'కొండవీటిసీమచాంతాడు' (చేదత్రాడు) అని సామెతగా పల్కుదురు. లేనిపోని వన్నియు అదేపనిగ వ్రాయఁబడి ప్రాముఖ్యతలేనిగ్రంథములకు 'కొండవీటిదండకవిలె' యందురు. తొల్లి కొండవీటి సీమ యందేవో పరిస్థితులు కొండవీటి దండకవిలె యని వ్రాయుచుండిరట. కొండవీటి గొల్లపాటయు నట్టిదే. వెట్టిధోరణి నదేపనిగపాడిన పాటకు కొండవీటి గొల్లవాటమని యనుచుందురు కొండవీటిసీమ రెడ్లప్రభుత్వముచే పేరొందినదేశము. (కొండవీడు చూడుఁడు).

**కొండవీటిసీమ చాంతాడు** — కొండవీటి సీమ చూడుఁడు.

**కొండవీడు** — ఈపేరు విననంతనే చేదతాడు జ్ఞప్తికివచ్చుటయేగాని, దాని నిజమగు ప్రసిద్ధి మఱుఁగుపడినది దాని నిజప్రసిద్ధి కొండవీటి దుర్గమని, పేర్కొనుచున్నాము. మహాబలాఢ్యమైయుండిన నిపర్వతదుర్గము, దాని చుట్టునుండిన యగాధమగు కందకము ను, ఉన్నత ప్రదేశములందు యుద్ధసమయానుకూలమగునట్లుల నిర్మింపఁబడిన బురుజులును, కోటలోనివారు బురుజులపై నెక్కి శత్రుసైన్యములరాకం బ్రతీక్షించు కట్టడపుపనులును వీక్షించ, తొల్లింట క్రీ. శ. పదునాలవ శతాబ్దారంభకాలమున ఓరుగల్లు సామ్రాజ్య మస్తమింగుటయు, ఆరాజ్యమున

కీ కొండవీటియందు సామంత ప్రభువై యుండిన పోలయ వేమారెడ్డి స్వతంత్రుఁడై తన ప్రభుత్వమును స్థాపించుకొని యీకోట కట్టి యిది తన రాజధానిగ నీప్రాంతపు పాకనాటిసీమనంతటిం బాలించుటయు జ్ఞప్తికివచ్చి రెడ్ల ప్రభుత్వకాలపు విశేషములు తలంపునకువచ్చును.

ఆయనయు నాయన తరువాతివారును నూరు సంవత్సరములు దీనిఁబాలించిరట. క్రీ.శ. ౧౪౫౪ సంవత్సరమున నుత్కళ భూపతియగు కటకపురాధీశ్వరుఁడు యీకోటఁబట్టుకొనెను. అరువది వత్సరముల వఱకు నది ఉత్కలుల వశమై యుండెనట. క్రీ.శ. ౧౫౧౫ ప్రాంతముల శ్రీకృష్ణరాయ సార్వభౌముని వశమాయెనట. అప్తరి సంభవించిన సంగరమున ఉత్కళప్రభువును దుర్గాధిపతిగ వీరభద్ర గజపతి చరిత్రమున పేర్కొనంబడినవాఁడు. అతఁడు రెండునెలల వఱకు దుర్గమును స్వాధీనముకానివ్వక నిలపినవాఁడని చెప్పబడినది.

పిదప కొంతకాలమునకు విజయనగర సామ్రాజ్యముక్రింద సామంతులుగనున్న రెడ్ల క్రింది కీకోటచేరెనట కాని విజయనగరసామ్రాజ్యము స్తమింపుటలో కొండవిటిరెడ్ల వైరులా గర్గమును భగ్నకఱచిపాడుచేసిరట. దీనిపాడిప్పుడు గుంటూరుమండలమున కొండలమయమగు మెరకప్రదేశమైయున్నది.

ఇందు తుప్పతొంకలు బలసి, ఘోరవనశ్యమైయున్నను అనేకులుపోయి చూచుచుందురట. కొండవీటిదుర్గమును చూచనేగుతఁ తొలుత ఉత్తరదక్షిణములకు వ్యాపించియున్న పర్వతశిఖరముల నడుమ శిథిలములైన కోటగోడ లగుపడును మెట్లనెక్కుచు కోటవైపుజన నొకవిశాలసమతలప్రదేశము నందు పెక్కు కాలిసడక బాటలు గన్పట్టును. మెట్లయిరుదెసలందు నడవి వలె చెట్లు బలిసియుండును కొంతవఱకి దుర్గసింహద్వారముకడకుం జేరనగును. ఇగి రాతిపై చేయఁబడిన మంచిచిత్రములుగలది. ఇటనె పైని వివరించిన మైదానముకలదు. అందు రాకొమరులాటలాడువారని ప్రతీతికలదు అటనుండి క్రిందికిజోస్యదిశగా వీక్షించిన నాపల్లపు ప్రదేశమున నొకమట్టికోటయుండిన యానవాళ్ళు గన్పట్టెడిని. అట పుట్టకోటయను కట్టణముండెడిదని చెప్పుదురు. ఈప్రాంతములందుగల సమప్రదేశములు కొన్నిగలవన్నియుంగలసి కొండవీడు పురముండెనట. ఇందు చక్కని బాటలును వీధికొక దేవాలయమును నుండెడివట. ఇంకఁగొంచము దూరమేగినతోడనె వేఱొక సింహద్వారము కొంత దూరమున గాన్పించును. అది చాలా ఎత్తుగు తావుననుంట ఆకాశమునంటునట్లు తోచెడిని. ఆప్రాంతముననె రహదారీ బంగళాకలదట తొల్లి గృహరాజ మేడయనంబడిన సుందరభవనముండెడిదట.

ఇచటకి సమీపముననే దుర్గాధీశుని కొలువుకూటపు పాడుగన్పట్టును. ఇంచుక దూరమున నేతికొట్టును, ధాన్యపుకొట్లు, ధనాగారములు నుండిన యానవాళ్లు కన్పించును. నేతికొట్టుకడ జలనిలయము కలదు. మరియు నీప్రాంతములు నూతులు, చెరువులునుకలవు. ఇవి తొల్లింటి కాలమువారికి దాహోదకముల నిచ్చు జల నిలయములట. ఇప్పుడు పెసురు డొంకలు బలసిన యొక పెద్దపల్లమును తొల్లింటి పెద్దచెరువని చూపుదురు. దానియుదకము లగత్తను నిండుచుండెడివట

క్రిందికోటయందొక దేవాలయము చూడతగినది. చక్కని పనితనముగల చిత్రము లిత్తడి రేకుపైఁదాపి అపరంజిపూత పూయుచుండిరట గాని, అపరంజిపూతపోయి యిత్తడిరేకులు నిలచియున్నవి. ఇచటి ధ్వజస్తంభ మేకశిలానిర్మితము.

దేవాలయద్వారమున నొక సీసపద్యము చెక్కఁబడి అరిగిపోయి స్పష్టముగ గానరాకున్నది. అది అచ్యుతదేవరాయుల కాలమున వారిక్రింద సామంతపాలకుఁడుగనో ప్రభువుగనో యామన్గాధిపతిగనుండిన రామయామాత్యభాస్కరుం గూర్చి చెప్పఁబడిన పద్యమని యచటివార నెదరు. ఇంక నట నాల్గు శిలాశాసనములు కలవని స్పష్టము గాకున్నను రెడ్డిప్రభుత్వమున నీదేవాలయము నిర్మింపఁబడినటుల తెలిసెడిని.

**కొచ్చిన్చీనా దేశము** (స్వదేశ సంస్థానము) — చీన ము చూడుఁడు.

**కొచ్చిరాజ్యము** — ఇది తొల్లింటి మళయాళ దేశములోని భాగము. బ్రిటీషు మలబారునకు, తిరువాన్కూరు రాజ్యమునకు నడుమనున్నది, రాజధాని ఎర్నాకుల నగరము. ఇది కొచ్చిపురమునకు సమీపమున నున్నది. ఉత్తరమున త్రిచూరు పేరోకపురము వర్తక స్థానము. కొచ్చినురాజ్యపు ప్రజలందు మళయాళీలేగాక యూదులు (జహోవమతస్థులు) సిరియన్ క్రిస్టియనులు విశేషముగాగలరు వీరు చిరకాలము నుండి వసించుచున్నారు, వర్తకులు.

**కొటికా (శాఖ) క్షత్రియులు** — కళింగియా క్షత్రియులు చూడుఁడు.

**కొటికెలపూడి వేంకటకృష్ణకవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడిన వాఁడు. వెలనాటి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రము. హరితసగోత్రము తండ్రి వెంకట రామయ్య. తాత శివరామయ్య. బొబ్బిలిసంస్థానమున రాయడప్ప రంగారావు నృపాలుని యాస్థానకవి. రచించినది శ్వేతాచల మాహాత్మ్యమును కూర్మమాహాత్మ్యము. వీనిని తన ప్రభువునకుం గృతియిచ్చెను. మఱియు నీతఁడు మేఘ సందేశమును పద్యకావ్యముగ రచించెననియు, దిలీపచరిత్రమును ప్రబంధమురచించి శ్రీరాముల కుంగృతి సమర్పించెననియు, నీవేంకటకృష్ణకవి గొప్ప జ్యోతిషవేత్త యనియుం గూడ తెలియుచున్నది.

**కొటేషన్మార్కులు** (Quotation marks) — ఇది యాంగ్లభాషా సాంగత్యమున ఆంధ్రభాషలోనికి తెచ్చుకొనిన గురుతు. దీని నాంగ్లమున నింకను Inverted commas అనియు ననుటకలదు. వేఱొకరు చెప్పిన మాటలను తాను వ్రాయుతరి దానికి ప్రారంభమున " అను గురుతును, కడను " అను గురుతును ఇడుదురు. ఇందువలన నీగురుతులు నడుమ వ్రాయబడినమాటలన్యుల ఉక్తియని స్పష్టపడును.

**కొట్టకుండా ఏడుస్తున్నావేమి పిల్లవాడా అంటే అందుకొరకేనన్నాడట** — ఆంధ్రలోకోక్తి.

**కొడగు దేశము** (Coorg) (క్రోడదేశము — పశ్చిమసముద్రతీరమున మళయాళ ప్రాంతముననున్న చిన్నదేశము ఈ పర్వతములకు కోరగిరి, కోలగిరి యను పేరులును, ఈదేశమునకుఁ "క్రోడదేశము" అను పేరును వాడుకయందుండినవట విష్ణుపురాణము ౧౨ అధ్యాయమునను ప్రశంసకలదు. స్కాందపురాణ కావేరీ మాహాత్మ్యమున ౧౧ అధ్యా. దీనికిం క్రోడదేశమనియున్నది. బహుశః క్రోడ, కొడగుగ మాఱియుండునని తోచెడిని

**కొడిశచెట్టు** — కొడిశచెట్టు కొడిశచెట్టనియు, కొడిశపాల చెట్టనియు రెండు భేదములుగ నుండును. కొడిశపాల చెట్టును, పాలకొడిశ చెట్టనుటయుం గలదు. మరియుం గొందఱు పెద్ద అంకుడు చెట్టని వాడుదురు. కొడిశచెట్టు వాసములుగ చెక్కి యిండ్ల కప్పులకు వైచెదరు.

కొడిశచెట్టు- లా. Holarrhena, antidysenterica అనియు, Chites antidysenterica. ఇంగ్ల.Kurchi Conessi అనియు Tellicherry bark tree అనియు సంస్కృత సం. పాండురద్రుమః, శక్రవృక్షమను పేరు కొడిశకు, పాలకొడిశకుం గూడ సాముదాయకముగ వర్తించును. కొడిశకట్టె వాసములు చాల బలముగ నుండు కలప దీని పుష్పములకు త్రిదోషములు హరించు గుణము కలదనియు, ఆకులకు వాతమునుహరించియు, కాకచేసియు, విరేచనము గల్గించు గుణము గలదనియు, కాయయందు అగ్నిదీప్తి నిచ్చియు, ఇంచుక మలబద్ధమును గల్గియు, గ్రహణి, గుల్మము, క్రిమి, మూలవ్యాధి, వాతములు, శూలలు, శ్లేష్మముల నడంచు ననియుం జెప్పఁబడినది.

కొడిశపాల చెట్టు - దీనిని పాలకొడిశ చెట్టనియు నందురు లా Nerium Antidysentricum. స ఇంద్రవృక్షః, కుటజః, పాలింగః అని పేర్లు కొడిశపాలు- గాయములను మాన్పును, కొడిశవిత్తులు చేదు, వగరు గల్గి యుండును. వీటియందు చెక్క కషాయమునందు గల గుణములే గలవు. మఱియు నీ పాలకొడిశ గింజలను వెచ్చచేసి గూడజేసి కషాయము గాచి కలరా జాడ్యమునందునగల్గు కడుపు నొప్పుల కిత్తురు. చెక్క కషాయము త్రిదోషహారమై అగ్నిదీప్తినిచ్చి బలముం గల్గించెడిని. మఱియు అతిసారము, రక్తాతిసారము, ఆమశూల, గ్రహణి, పురాణ రక్తగ్రహణి, కఫము, జ్వరము, వాతనొప్పులు, మేహవాతనొప్పులు, శూలలు, రక్తమువను మూలవ్యాధులను చక్కగ పనిచేసి నివారించును. ఈకషాయము చెక్కకషాయము కన్న పట్ట (Bark) కషాయము బలముగ పని చేయును. అందు పచ్చి పట్ట ఇంకను బలమైనది. ఆకునందు దంతముల పుప్పులు, నొప్పులు నివారించు గుణము కలదని చెప్పఁబడినది.

**కొడుకు బాగుండవలెను, కోడలు ముండమొయ్యవలెను** - ఆంధ్రలోకోక్తి.

**కొత్త అమావాస్య** — ఫాల్గుణ బహుళ అమావాస్య కీపేరు కలదు. బార్హస్పత్యమాన సంవత్సరమున పౌర్ణమితో సంవత్సరాంతమగుం గాన నీయమావాస్య నూతనసంవత్సరమున గల్గు మొదటిదగు కొత్తఅమావాస్యయే యగును.

**కొత్తలంక మృత్యుంజయ కవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడిన వాఁడు. ఆరువేల్వ లనాబడు (శివార్చక లేక, శివల) బ్రాహ్మణుఁడు. నివాసస్థలము గోదావరి జిల్లాలోని కొమరగిరి, బోధాయన సూత్రము, భరద్వాజసగోత్రము, తండ్రిపేరు విశ్వనాథము, పందొమ్మిదవ శతాబ్దాంతకాలమున నుండిన వాఁడు రచించినవి- ౧. బృహన్నారదీయ పురాణము, ౨ ధర్మాత్మజాపరిణయ మను ద్వ్యర్థి కావ్యము, 3 నిరోష్ఠ్యనలచరిత్ర మనంబడు చిత్ర కావ్యము

ఇందు ధర్మాత్మజా పరిణయమునకుం గర్తృత్వము అల్లూరి అప్పలరాజుగారికిని, నలచరిత్రమునకుం గర్తృత్వము ధనంజయగోత్ర రుద్రరాజు తిరుమలరాజుగారికిని, ద్రవ్యార్థియై ఆరోపించె నని తలంపఁబడుచున్నది.

**కొత్త వింత, పాత రోత** — ఆంధ్రలోకోక్తి.

**కొత్తిమిరి (ధనియపు) చెట్టు** — లా. Coriandrum Sativum అనియు, ఇంగ్ల. Coriander tree అనియు, సం. కుస్తుంబరీ, ధన్యా, ధన్యాక. కుస్తుంబరి యనుమాట కొత్తిమిరిగా మారెను. కొత్తిమీరి యని వాడు

చుందురు. ఇది ధనియాలచెట్టు. సువాసనకై భోజన పదార్థములందు చేర్చుదురు. త్రిదోషహారమైనది. ఆఁకలిని వృద్ధిచేసి, మలమూత్రనిరోధము సడలించును. నిద్ర దెచ్చును. వాతదోషమును శిరమున కెక్కనియ్యదు. నొప్పులుపడుచున్న స్త్రీలకు వాసనచూపించుచున్న త్వరలో ప్రసవమగునట్లు చేయును. (ప్రసవమునకు పిదప దీనినటనుండనీయరాదు.) శైత్యశరీరతత్వము గలవారికి పరాకుఁ గల్గించును. జీర్ణము జేయును. మేహశాంతి పైత్యశాంతి గల్గించును. నోటిపూతను నివారించును.

కొత్తిమిరిచెట్టుఆకులు నలిచ్చ జేసి నేత్రములపై గట్టిన నేత్రరోగములు నివారించుననియు, కడుపులోనిమంట, గడ్డలు, జ్వరములు, భ్రమ (ఉన్మాదము), వ్రణములు, వాతములు, విదాహము, విషదోషము, రక్తపైత్యము, శ్రమ, బడలికలు, శ్లేష్మము నివారించుననియు ఆరోగ్యకరమనియుఁ జెప్పఁబడినది.

**కొన్నవాఁడు తిన్నవాఁడు** — ఆంధ్రలోకోక్తి.

**కొనేదివంకాయ కొసరేదిగుమ్మడికాయ** — ఆంధ్రలోకోక్తి.

**కొబ్బరిచెట్టు** — లా Cocos nucifera. ఆంగ్ల Cocoanut palm or tree సం. నారికేరహః, నారికేలః, నాకేరి, నీలతరు, విశ్వామిత్ర కలాయం, విశ్వామిత్ర ప్రియః ఆంధ్ర దేశమున దీచెట్టు నెఱుఁగని వారుండరు. ఇందు ఇంచుక భేదముఁగల్గిన



జాతులనేకములు కలవు. కాని అన్నియు సమానములే. ఉష్ణదేశములందు చక్కగ పెరిగి కాచును. దీని ఉపయోగములకు మేరయే లేదు. భోజన పదార్థము. అరవమున తెంగాయి (దక్షిణ [దేశపు] కాయ) యని పేరు. కొబ్బరి చెట్టుయొక్క ఉపయోగాతిశయమునుండి ఉష్ణదేశములందు పలుచోట్ల విరివిగ నీచెట్టు పెంపఁబడుచున్నది. ముఖ్యముగ నిసుకభూములందిది విస్తారముగ పెరిగి ఫలించెడిని. సముద్రతీరపు టిసుకభూము లీచెట్టునకు శ్రేష్ఠములు. ఇవను ఒక్కసంగతి ఈచెట్టునకు ముఖ్యముగ నెఱుంగునది. ఈచెట్టు వేరునకు భూమియందలి నీటిచెమ్మ తగులునంతటి మెరకగ నీరుండు తావులందీచెట్టు పెరిగి ఫలించుఁగాని, వేళ్లకు నీటిచెమ్మ యుండని మెరకప్రదేశములం దీవృక్షము పెరిగి ఫలించదు. అనగా నీచెట్టు పాతిన తావున ఆరు లేక ఏడు అడుగుల లోతున నీరు పడునట్లుచూచి కొబ్బరి తోటల నాటవలసి యుండును. లేకున్న నీతోట నిష్ఫలప్రదమయ్యెడిని. ఇట్టిపరిస్థితులందు కొబ్బరిచెట్లు సముద్రతీరముననే గాక బహుదూరముగనుండు దేశములనపు నీరు మెరకగ లభించు ప్రదేశములందునపు అనుకూలమయ్యెడిని. కొబ్బరి చెట్లవేళ్ల కుఁదగులునీరు తీయనినీరే కావలయునను నియమము లేదు. చౌకలుగనుండు నీరైనను, కడకు కొంచెము ఉప్పగనుండు నీరైనను అనుకూలముగాను. కొబ్బరితోటకుఁ దఱుచు నీరు పారించుచుండినను ఉపయోగించుం గాని సొమ్ము పెట్టుబడి ఎక్కువయగునట నట్టిపద్ధతి నిరర్థకమయ్యెడిని.

కొబ్బరిచెట్టుయొక్క మునురు పండునుండి మొక్క మొలచును. అందు వయస్సుమీరిన చెట్ల పండ్లు శ్రేష్ఠమందురు. మఱియు నట్టిముసలి చెట్టుయొక్క పండ్లు బాగుగపండి తమంతట తామె నేలఁబడినవి మొక్కలందేసిన చక్కగ మొలచి పెరిగెడిని. పదిరోజులు పండును నీట నానవైచి తడియారకుండ నేలంబాతిన రెండు నెలలకు మొలకలెత్తెను అరునెలలకు మొక్క చక్కగ మూరాకవైచి కాప్పించును. కొబ్బరి

చెట్టు కదిసంవత్సరముల వయస్సునందు గాచెడిని. ఇందు చెన్నంగి కొబ్బరి, గంగాబొండము మొదలగు కొన్ని జాతుల కొబ్బరులు కొంత ముందుగ గాచుంగాని, పెద్దకొబ్బరిచెట్టు బ్రతికినంత కాలము బ్రతుకవు. కాపును త్వరితముగనె మానివేయును. గంగాబొండము (గంగాఫలము) కాయయందు నీరెక్కువయుండి మిగుల రుచికరమై యుండును. చెన్నంగి కాయయందు ఎక్కువ విలువగల పదార్థములుండును గాన కాయలెక్కువ ధరగల్గి యుండును కాయలోని కొబ్బరి ఎక్కువ దళసరిగ నుండి యెక్కువ నూనెగల్గియుండు పెద్దకాయలకు మంచిధర వచ్చునుగాన, అట్టిజాతికొబ్బరి చెట్లు శ్రేష్ఠముగ నెంచబడుచుండును. మూడు సంవత్సరముల ప్రాయముననే కాయలగాచు చిన్నజాతి కొబ్బరి మొక్కలొకలవు. అది అలంకార మాత్రము గాని వస్తూపయోగ మెంతమాత్రము కాదు. మఱియు పొడుము కాయలకుపయోగించు చిన్నజాతి కాయల కొబ్బరి మొక్కటియుంగలదు. అదియు నట్టిదియె. ఇంకను పదునారు లేక పదునెన్మిది అంగుళములపొడవును మఱియు నంత చుట్టుకొలతయుగల్గు పెద్దకాయల జాతి కొబ్బరి సింగపూర్, మలాకా, పినాంగ్ ప్రాంతదేశములందు కలదు.

సింహళదేశమున ఆగ్నేయదిశ యందలి సముద్రప్రాంత దేశమందయు నాకేకొబ్బరి తోటగ గాన్పించెడిని. ఆదేశస్థులు కొబ్బరిచెట్లు చెవులు గల్గియుండుననియు, మఱియును మనుష్యుల కంఠధ్వని వినంబడని (అనగా వినబడు చుండని) తావులందు కొబ్బరిచెట్టు అభివృద్ధినొంది ఫలింపదనియు నందురు. ఇందుల నిజమెంతయో మేమెఱుగజాలము గాని కొద్దిగనో గొప్పగనో వంకరలులేక తిన్నగ పెరిగియుండు కొబ్బరిచెట్లు కానరావు. మఱియును గ్రామముల సమీపముననే గాని నిర్మానుష్య ప్రదేశములగు అరణ్యములు, ఇసుకబయళ్లు, ఎడారులు మొదలగుచోట్ల నీటివసతు లెంతగల్గియున్నను కొబ్బరిచెట్లు గానరాకున్నవి. కొబ్బరిచెట్టంతయు నారమయమగు శరీరముగలది. ఇవి భూమినుండి జలమును బీల్చి దీనిమట్టలకు, కాయలకు నందించుచుండును. కొబ్బరిచెట్టు సంవత్సరమునకు పండ్రెండు వఱకు గెలలను వైచి కాచును. గెలకు ఏబది కాయల వఱకు మంచి పరిస్థితులందు నిలచును. కొబ్బరి కాయలోని కొబ్బరి భోజన పదార్థముగను, మఱియు భోజన పదార్థములకు రుచిగల్గించు నదిగను వాడుదురు. కొబ్బరినూనె అనేక కార్యముల కుపయోగించును గాన విలువగల్గి యుండును.

కొబ్బరిపీచు త్రాళ్లు పరుపులు మొదలగువాట్ల కుపయోగించును. ఆకుల ఈనెలును, ఆకులును చాపలు మొదలగునవిగ జేయుదురు. మట్టలను వంటచెరకుగ నుపయోగింతురు. కొబ్బరికాయలోనికొబ్బరి ఎండుకొబ్బరికన్న పచ్చికొబ్బరి శ్రేష్ఠమందురు. వాతదోషమును హరించి, వీర్యవృద్ధిని జేసి, శోషను ఎండదెబ్బవలన గల్గుశ్రమను నివారించి శరీరమునకు బలమొసంగి శరీరమున కవశ్యమగు నైసర్గికపు వేడినిగల్గించును ద్వంద్వరోగముల నివారించును. నరములకు బలమొసంగి, మలమూత్రముల వెడలించి మూలవ్యాధిని శమింపజేయును. పసపుగుడ్డతో నుడికించి కట్టిన ఒరిబీజపుకొప్పి మాన్పును. అధికముగఁ దినిన మూత్రమున సుద్దగల్గించును. దగ్గు, పైత్యము, శ్లేష్మముల నుద్రేకించును. దీనికి విరుగుడు బియ్యము, బియ్యపుకడుగు, నిమ్మకాయ, కస్బాజాపండునీరు, పంచదారయునని చెప్పంబడినవి. కొబ్బరి కాల్చి చేసినమసి అజీర్తిని నివారించునందురు. ఇవి యన్నియు ఎక్కువగముదిరిన పచ్చికొబ్బరిగుణములు.

ఇంక లేతకొబ్బరికాయలోని నీళ్ళు విరేచనములు గావించును. లేతకొబ్బరి వాతపైత్యము నడంచి, మేహశాంతి గల్గించి వీర్యపుష్టి జేయును. ఇంచుక పైత్యప్రకోపమును గల్గించును. మొత్తమున కొబ్బరికాయనీళ్ళు ఆరోగ్యమున నున్న వారికి చాల ననుకూలముగ నుండును ఉపవాసమున్న వారికి, ప్రసంగమొనర్చు వారికి ఎండవడ తగిలినవారికి, దేహాయాసము నందినవారికి, అలసినవారికి, క్షయరోగులకు అనుకూలమైయుండును. లేతకాయ నీరు వాతపైత్యమడంచి శాంతిని గట్టుననియు, క్రిములనడంచి వెడలించుననియు కొంచెము ముదిరినకాయలోని నీరు క్రిములనడంచి బలమొసంగి, వీర్యవృద్ధిగల్గించి ఇంచుక కఫము నుద్రేకించుననియు, మిక్కిలి ముదిరిన ఎండుకాయలోని నీరు చలవయేగాక జలుబుజేసి, శ్లేష్మము నుద్రేకించి దగ్గు తెచ్చుననియు, చెప్పఁబడినది. ఇంకను కొబ్బరికాయలోని నీరు గాలిబట్టకుండఁ ద్రావవలెననియు, గాలిబట్టిన రుచిచెడుటయేగాక దుర్గుణములఁ గల్గించునది యగుననియుం జెప్పఁబడినది. బెల్లము, పిప్పళ్ళ మూర్ణమున తేనెగల్పి లోనికిచ్చిన కొబ్బరికాయ నీళ్ళవలనగల్గెడి దుర్గుణము లడంగెడిని. మరియు అగ్నిమాంద్యము, అతిసారము, అజీర్తి, ఉబ్బు, కడుపుబ్బు, గ్రహణి, జ్వరము, పాండురోగము, వాతదోషము, శ్వాస కాస రోగములు కలవారు కొబ్బరినీళ్ళం ద్రావరాదు. వారిరోగ మతిశయించును. కొబ్బరినీళ్ళ నెవ్వరు నెట్టితరుణమునను అధికముగునట్లు త్రావరాదు. మితముగనె ఉండవలయును.

కొబ్బరికురిడీ లేక ఎండుకొబ్బరి మలమును వెడలించి పొత్తికడుపును శుభ్రపఱచును. ధాతుపుష్టి నుద్రేకించును శరీరప్రకృతియందు మార్పు గల్గించును. పైత్యము జేయును. మరియు మొలకమొత్తిన కొబ్బరికాయలో నేర్పడు పొంగ రుచిగనుండి చలవజేసి రక్తపైత్యము మేహములనడంచి ఇంచుక శ్లేష్మమును ఇంచుకపైత్యమును ఉద్రేకించును. దీనికి తేనెయు శర్కరయు విరుగుడులని చెప్పఁబడినది. పచ్చిలేతకొబ్బరి డొక్కరసము లోనికిచ్చిన అజీర్తి వికారములనడంచును. కొబ్బరి చిప్పలనుండి తీసిన తైలము, పూసినతామర, తీట, పల్లికలు, దద్దు, గజ్జి, చిడుము, దంతరోగములు నివారణమగుననియు, పేలు, ఈపు్చుండ్రు నివారించుననియుం జెప్పఁబడినది.

కొబ్బరికాయను ఱుతుకదంచి పిండి తీసినపాలు వీర్యపుష్టినిచ్చి, చలవజేసి బలమొసంగి, బడలికనడలించి, ఎక్కిళ్ళు, కఫశూలలు, కాస, శ్వాసరోగము, దంతరోగముల నడంచి ఇంచుక పైత్యము, వేడి, విదాహముఁ గల్గించును. మరియు పైత్యజ్వరమునందలి వాంతులనేగాక, కలరాజాడ్యము నందలి వాంతులనుగూడ నివారించును. తలవెంట్రుకలను కుదుళ్ళయందు గట్టిపరచి, వెంట్రుకలకు బలముగల్గించి పెరుగజేయును కొబ్బరిచూనె పలువిధములగు ఉపయోగములం గల్గినది. కొబ్బరికాయయందు ముదిగినతరి గల్గియుండిన గుణములన్నింటిం గల్గియుండును. చర్మరోగముల నాపును. తలవెంట్రుకలను బలపర్చును. పుండ్లను మెత్తపఱ్చి మాన్పును. కొబ్బరిచెట్టునుండి కొన్ని దేశములందు కల్లుదీయుదురు.

**క్రొయిలీసిరియా** — ఆసియాఖండమున సిరియాదేశములోని సారవంతమైన ప్రదేశము. లెబనాన్పర్వతపఙ్క్తులు రెండువరుసలుగ దీనిం జుట్టి ఉత్తరదక్షిణములకు వ్యాపించియున్నవి. (సిరియాదేశము చూడుఁడు.)

**క్రొయిలవన్ప్రభుత్వము** — అనేక రాజకీయపక్షులనుండి నాయకులను రావించి, ప్రభుత్వమునడపుట కేకమనస్కులం జేసి నడపుట కీపేరు కలదు. క్రీ. శ. ౧౮౧౫ లో ఐరోపా

మహాసంగ్రామ కాలమున నింగ్లాండునం దిట్టి ప్రభుత్వ మేర్పడవలసివచ్చెను. ౧౯౧౬-౧౯౨౨ ల నడుమ నిట్టిప్రభుత్వమే లాయిడ్జార్జిగారి ప్రధాన మంత్రిత్వమునందు సాగెను.

**కొరవజాతి** — వేణుచక్రవర్తి కుడికాలు నుండి వికారపిగ సృష్టింపబడిన నిషాదునకు (వికృతాకారునకు) జన్మించిన సంతతివారగు కొరవలు, చెంచువారు, యానాదులు, బోయలు అని వీరియందు వాడుకగలదు. ఇందునకు గ్రంథనిదర్శనములు గానరాకున్నను, అడవిజాతులవారగు వీరియందిది బలముగు వాడుకగలదు.

వేణుచక్రవర్తి యాంధ్రుడనియు, ఈయనకు సంతానము గల్గమి యాయనమృతికిం బిదప వక్షగహములు ఈయనకుడికాలునుండి నిషాదు నుద్భవింపజేసిరనియు వీరనెదరు.

**కొరవితో కొప్పు గోకికొనినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**కొరవిదయ్యము(Will o' the wisp)**— కొరవిదయ్యములు అనాగ ఎల్లదేశములవారలెఱిగినవే. వేత్వేఱుకాలములందు వీటిని వేత్వేఱు విధములుగఁ దలంచుచుండిరి.

చనిపోయినపిదప కళేబరములు భూమియందు మెరకగ పాతబడెనేని భూమియందు దాకళేబరము కొంతకాలమునకు భూమియందలి వెమ్మసహాయమున కుళ్ల నరంభించును. పైనుండు భూమి పొరగూడా దుర్వాసనలు పైకిరాజాలకుండినను, కుళ్లునుండి ఏర్పడిన గాలులు భూమిగుండా క్రమముగా పైకి తప్పుకొని రాగల్గెడిని కుళ్లునుండి జనించి, ఆకుళ్లు ముక్కుతెరి బయలువెడలినగాలి భాస్వరముతో మిళితమైన (Charged by Phosphorus) హైడ్రోజన్ అని చెప్పబడును. (Phosphorated Hydrogen). ఈ గాలి భూమిగుండా నడచి పైకెగసిపోవుచుండును.

భూమిందాటి బయటపడగానే మహావాయు మండలితో సంబంధము కల్గును. తోడనే అందున్న ప్రాణవాయువు(Oxygen)తోకూడికగలుగు కలన మండ నారంభించును. మండ నారంభించు వఱకు భూమినుండి రమారమి రెండడుగులు పైకి లేవగల్గియుండును. ఈమంట లతిసూక్ష్మము లగుట పగలు కనిపించజాలవు. రాత్రులందు ఊదారంగు గల్గి దీపములవలె అతిసన్నగ నుండి గన్పించును మఱియు గాలికి గొట్టుకొనిపోవును. అట్లయ్యు కొంతసేపు నిలచి కాలగల్గును. ఇవి చాటసమీపమున గల్గుతరి నడచువారినడక గాలికి సైతము మునుకుం ద్రోయంబడుచుం జనును. లేకున్న వెనుకఁ దేలుచు వెనకనంటురీతిని నడచును. ఒకవేళ నీటిగుండా నీగాలి పైకిదేలుచో చిన్నచిన్న బుడగలవలె పైకితేలి పిదప గాలిసంబంధము గల్గి మండ నారంభించును దానిని కొరవిదయ్య మందురు.

**కొరియాదేశము** — ఆసియాఖండమున చీనాభూమికంటిన యొక ద్వీపకల్పము. ఇప్పుడు జపానువారికిం జెందియున్నది. ౮౨,౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యమని అంచనావేయఁబడిన దేశము. ౧౭౦ లక్షల జను లుందురని తలంపఁబడుచున్నది. చక్కని వ్యవసాయదేశము. గోధుమలు, వరిధాన్యము, బార్లీధాన్యము, బటానీలు, పొగాకు విస్తారము పైరుచేయంబడుచున్నవి. చీనాదేశమున మత్తుపదార్థముగ వాడంబడుచున్న జిన్సాంగను పేరుగల చెట్లవేళ్లు నిమిత్తము జిన్సాంగు చెట్లు పెంచంబడుచున్నవి. బంగారము, రాగి గనులందు త్రవ్వి ఎత్తంబడుచున్నవి. జపాన్దేశముతో వర్తకము కలదు.

కొరియాదేశపుప్రజలు చీనాజాతులవారనియు, వారిభాషయు చీనాభాషసంబంధమే ననియుం చెప్పఁబడినది. వారు బౌద్ధమతస్థులు,

క్రీ. శ. ౧౮౯౫ వఱకు ప్రభువుచి త్తవృత్తిమేరకు పరిపాలననడచుచుండెను. అత్తరిదేశముచీనారాజ్యమునకు లోబడియుండినది. జపానువారీసువ్యరిపాలన నంగీకరింపరైరి. చీనాజపానుయుద్ధమునకిదియొక కారణముగ నుండెను క్రీ. శ. ౧౮౯౫ లో జరగిన షిమొనొసేకిసంధి చీనాప్రభుత్వపుటధికారముం దొలగించి లిమిటెడ్మొనార్కీ నుదయింపజేసెను ౧౮౯౭ లో భూపతిచక్రవర్తియని బిరుదమును దేశపాలనయందు కానిస్టిట్యూషను విధానప్రణాళికయు నేర్పడియెను. శాసననిర్మాణమును ప్రజాప్రతినిధుల వశమొ్నర్చిరి ఇప్పుడు జపానువారి రక్షణయం దున్నది సియోల్పురము రాజధాని. ఇందు రెండులక్షల జనులు కలరు చెముల్పోపురము (హాన్నదీతీరము), ఫూజానుపురము, యూఎన్సానుపురము విదేశవర్తకమునడచు గొప్ప రేవుపట్టణములు. చిన్న స్టీమరులు హాన్నదియందు పోగలవు. దేశమున రెయిల్వే వేయబడి అన్నిపట్టణములం గలుపుచున్నది.

**కొరుర** (యుద్ధరంగము) — ఇత్తావున ఉజ్జయినిపురాధినాథుండగు విక్రమాదిత్యుడు శకద్వీపనరపతి నోడించెననియు, అజయమున పెక్కుదేశభాగముల జనులకు మంచిరక్షణము కల్గింగాన వారు రాజభక్తితో విక్రమార్క శకమారంభించిరనియు చెప్పఁబడినది.

**కొరోనా** (Corona of the sun) — ఇది ఒకవిధమగు పరివేషము. సూర్యునకు మాత్రమే సంపూర్ణగ్రహణ కాలములందొక్కొకతఱిఁ గల్గుచుండెడిని. తిరుగుడలలో భూమికి చంద్రుఁడు సమీపముననుండి సూర్యునకు దూరముగనుండి అత్తరి Conjunction సంభవించినేని దూరముగనున్న సూర్యబింబము, సమీపమునన్నున్న చంద్రబింబముకన్న దశాంశ తగ్గియుండునని లెక్కింపఁబడినది. అట్టితఱి గల్గిన సూర్యగ్రహణము సంపూర్ణమగునేని, సంపూర్ణగ్రస్తమగుటతో సూర్యునికి ఒకపరివేషము ఏర్పడి కాన్పించును దీనికి ఎస్ట్రోనొమీ శాస్త్రమున Corona యని పేరు. సంపూర్ణగ్రహణకాలము ఏడుమినిట్లకన్న నధికముండదు గాన, కొరోనా యును అంతేకాలముగఁ బించెడిని. (గ్రహణములు చూడుఁడు, కంజాక్షను చూడుఁడు, ఎస్ట్రోనొమీ చూడుఁడు). దీనిని ఎస్ట్రోనొమీ శాస్త్రవిదులు "A narrow belt of bright crimson with prominences raising from the sun and the most beautiful halo of pale light which is sun's Corona" అని వివరించియున్నారు ఇది సూర్యునివల్లమచ్చలు (Sun spots) తో సంబంధము కలది యని చెప్పంబడినది (సూర్యగోళము, సూర్యరస్మి చూడుఁడు).

**కొర్నాటి చీరెలు** — దక్షిణ దేశమునుండి ఆంధ్రదేశమునకు అమ్మకమునకు వచ్చుచున్న చీరెలలో నొకతెగ చీరెలు. అరవ స్త్రీలయందెక్కువగా వాడుటగల్గియున్నను, ఆంధ్రదేశపు స్త్రీలును వీటిని కొంతవఱకు వాడుచున్నారు. ఇవి ఇంచుక దళసరిగనుండి ఎక్కువగా మన్నుటకు పేరందినవి. అనుదినము తడపుచున్నను చెడవు. ఇందు అరువదివఱకు భేదములు కలవందురు. రంగులు భేదములచే లెక్కింపఁజాలని విధములుగనైనవి. తంజావూరుజిల్లా మాయవరము పట్టణమునకు రైలుస్టేషనునుండి పోవుతఱి మార్గమునందున్న కొర్నాడనంబడిన గ్రామమునుండి పేరందినవి దక్షిణదేశపు ఇతరపట్టణములం దీచీరెలు నేయంబడుచున్నను ఈపేర ప్రసిద్ధియైనది.

**కొర్నాలీ పంజాబు క్షేత్రము** — ఇది పంజాబుదేశమున రావల్పిండిజల్లా గుజార్ఖాన్

తహశ్శీలులోని గుజ్రాన్వాలా పురమునుండి ఆరు మైళ్ల దూరమునందున్న కొర్నాలీ గ్రామమున నొకప్పుడు బాబా మోహనదాసను సిక్కు మతభక్తుఁడు వసించినతావు అట నాయనపేరిట నొక దేవస్థానమేర్పడి సిక్కుమత గ్రంథమగు "గ్రంథసాహేబు" నంగూంచి సంకీర్తన మొనర్చు చున్నారు ఇక్కాలమున సిక్కుమతస్థుల యాత్రా స్థలమై యున్నది.

**కొఱ్ఱ (గింజల) చెట్టు** — లా Setaria italica అనియు, Painicum italicum. ఆంగ్ల. Italian millet సం. పీత తండులః, కొందఱు కంగుధాన్య యనిరి కొఱ్ఱలు ఎఱ్ఱకొఱ్ఱ, తెల్లకొఱ్ఱ యని ద్వివిధము వీటిని కొన్నితావులందు జనకొఱ్ఱ యనియు, బొచ్చు కొఱ్ఱ యనియుం గూడ నందురు. ఇాదెఱ్ఱకొఱ్ఱ శ్రేష్ఠమందురు ఇంకను గంటికొఱ్ఱ యను వేఱొక భేదము గూడ కలదందురు. కొఱ్ఱలను (గింజలను) పైపొట్టుతీసి బియ్యముగజేసి అన్నముగను, క్షీరాన్నముగను, జావగను చేసుదురు. దేహమునకు నైసర్గికపుకాంతను బలపఱచియు, విరిగిన అవయవములను అతుకుకొనజేసియు, నడుమునకు బలమొసంగియు, ఇంచుక పైత్యమునుగాని, వాతమునుగాని ఉద్రేకించును. గురుత్వముగ నుండుంగాన కొంచెముగ తినుచూడవలయును కాని ఇది యాకలినుద్రేకించి, రక్తవృద్ధిం జేసి, కఫరోగమును, జ్వరమును నివారించును వాతశరీరులకు వాతనొప్పులు కలవారికి అనర్హమైనది. నెయ్యి, పంచదార, మజ్జిగ దీనికి విరుగుడులని చెప్పఁబడినది

**కొలంబస్** (Columbus) — క్రిస్టఫర్ కొలంబసు అనువాఁడు నావికుఁడు. వెస్టుఇండీసు ద్వీపములు మొదలగునవి స్పానియాదేశపుభూపతి పేర కనిపెట్టి పోకఁబడినవాఁడు. సుప్రసిద్ధుఁడు. బ్రిటీషువారి చరిత్రగ్రంథములందు ఈతఁ డిటలీ దేశస్థుఁడనియు, జనోవాయందు క్రీ. శ. ౧౪౪౧ జన్మించినవాఁడనియుఁ జెప్పఁబడినది. కాని ఇటీవల కోర్సికా ద్వీపమునందలి కాల్వెపట్టణమున నొక పాడుయింటి గుమ్మమునఁ గల శిలాఫలకమున " Here was born in 1441, Christopher Columbus immortalized by his discovery of the New World at a time when Calvi was under the domination of the Genoese. He died on 20 May 1550." వ్రాయంబడియుంట బయల్పడినది. మఱియు నాతనిసంతతివారమని చెప్పుకొనువా రాకాల్వె పురమున గలరని తెలియుచున్నది.

కొలంబసును గూర్చి చరిత్రవలన - ౧౪౯౨ ఆగస్టు 3 తేదీని పాలోస్ రేవునుండి బయలుదేరి కెనరీస్ దీవులకుంజేరి, సెప్టెంబరు ఆరవ తేదీని అటనుండి తిరుగ బయలునెడలి మైదు వారములలో బహామన ద్వీపములంజొచ్చుకుని అట కొంత సైన్యము నుంచి తిరుగ స్పెయినుకుం జేరెనట. పిదప వాటికి డొమింగో యని పేరిడఁబడెనట.

ఆసంవత్సరమె తిరుగ స్పెయినునుండి చాల నావల సైన్యముంగొని బయలుదేరెనట. ఆయన వెస్టుఇండీసు ద్వీపములం గనుంగొనెనట గాని, తిరుగ స్పెయినుకు మరలెనట. తిరుగ ౧౫౦౨ లో బయలుదేరి సెంట్రల్ అమెరికా గనుంగొని తిరుగ మరలెను. వెల్లాడోలిడ్ పురమున మృతినందెనట

**కొలంబియాదేశపు ప్రభుత్వము**— దక్షిణఅమెరికా ఖండమునందలి ప్రజాప్రభుత్వ దేశము. నాల్గులక్షల ఎనుబదిరెండువేల చతురపు మైళ్లు వైశాల్యమనియు, ఎనుబదిలక్షలు జన సంఖ్య యనియుం జెప్పఁబడినది.

**కొలంబియా ప్రజాప్రభుత్వ రాష్ట్రము** — ఇది దక్షిణఅమెరికాయందు వాయవ్యదిశగా నున్నది. దీని తొల్లింటిపేరు న్యూగ్రనడా యనియుండెను. పిదప క్రిష్టఫర్ కొలంబసుగారిపేర కొలంబియా యని పేరిడంబడి వాడుకయందున్నది. దీనికి వాయవ్యదిశగానున్న పనామా భూసంధిలోని యొక భాగమును ఈ దేశమునందు చేరియున్నది. ఇందు ౪౦౦,౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యము కలదు. దీనిని యునైటెడ్ స్టేట్సు ఆఫ్ కొలంబియా యని వాడుచున్నారు. దీని గుండ మూడువరుసల ఆండీస్ పర్వతపఙ్క్తులు నడచును ఇది పశ్చిమభాగము తూర్పుభాగమున Clanos కలవు. చింకోనా తోటలు విస్తారముగ గలవు. తోళ్లు పదును చేయుబడుచున్నవి. పొగాకు ప్రత్తి పైరుచేయం బడుచున్నవి బొగోటాపట్టణము ప్రధానప్రభుత్వ స్థానము. ౮,౦౦౦ అడుగుల ఎత్తుప్రదేశమున గలదు. పసిఫిక్కు మహాసముద్రతీరమున పనామా పట్టణము, కరిబియా సముద్రతీరమునగల ఏస్పిన్వాల్ పురము రేవుస్థలములు. ఇరుపబాటలు కలవు. (పనామాకెనాల్ చూడుడు, దక్షిణ అమెరికా చూడుడు).

**కొలతపరిమాణము** (ప్రమాణములు)- ఏవస్తువునకైనను పొడవు, వెడలుపు, దళసరి (లేక మందము) నని మూడు కొలతల పరిమాణములు చెప్పంబడి యున్నవి. ఇందు ఒక్కొక్కటి పొడవో లేక వెడలుపో ఏదో ఒకటి ఎత్తు అనంబడును. ఇట్టి కొలత పరిమాణములు గల వస్తువు లేక పదార్థమును ఆంగ్లులు **Article of the Material world** అనిరి.

గణిత శాస్త్రజ్ఞులు గీతకు పొడవేగాని వెడలుపు లేదనిరి. దళసరి అసలే లేదని భావము. బిందు చుక్క (Point) కు పొడవు, వెడలుపు, దళసరి కూడ లేక ఉనికిమాత్రము (గురుతుగా) కలదని నిర్ణయించి యున్నారు.

**Einstein** (ఐన్‌స్టైయిన్) అను పండితుండును **Minkowski** (మింకోవిస్కీ) యను పండితుండును కాల గమనమును గూడ పై పరిమాణమునకుం జేర్చి కాలమునకు పరిమాణము గలదని సిద్ధాంతపఱచి యున్నారు

**కొలనుపాక క్షేత్రము** — ఇది ఆంధ్రభూమియందు తొల్లింటి కాకతీయ రాజ్యములోనిది. ఇప్పుడు నిజాము రాజ్యమున నైజాం రెయిల్వే ఆలేరు స్టేషను నుండి నాల్గు మైళ్ల దూరమున గల క్షేత్రము. ఇటుల గల కొలనుపాక గ్రామమును జుట్టి యైదు క్రోసుల దూరము వఱకు శివలింగములు గానంబడు చోట నిది యాదిని గొప్ప శివక్షేత్రమై యుండనోపు. కాని యప్పటి పేరెయ్యదియో యాంధ్రులు మఱచిపోయి యుండవలెను. అచటి వారిది సుప్రసిద్ధ శివభక్తుండగు రేణుకారాధ్యుల జన్మస్థలముని మాత్రము నుడువు చున్నారు. కొలనుపాక నామము నవీనమై జైను దేవస్థాన సంబంధము గల్గి యుండునని తోచెడిని. జైనుల మతాధికార కాలమున నిది సంభవించి యుండునని తోచెడిని. పూర్వపు సోమనాథుని (శివలింగము) శివదేవస్థాన మిప్పటికిం గలదు గాని ధనవంతమైనది కాదు. ఈక్షేత్రమున నూట ఎన్మిది శైవభేద మతముల వారికి మఠము లుండె నందురు. అవి యన్నియు నిపుడు నామమాత్రావశిష్టములై యుంటయే గాక శివక్షేత్రము జైను క్షేత్రపు నీడయం దున్నట్లున్నది. అచటి వారు పశ్చిమ చాళుక్యులలోని యొక శాఖవారికిం గొంత కాలము రాజధానియై యుండిన తరి శివ దేవస్థానమును, గ్రామమునుఉచ్ఛదశననుభవించె

నందురు గాని యానవాళ్లు సరిగా దొరకుట లేదు.

ఈ ప్రాంతమున ఆంధ్రజైనులు కలరు. ఋషభనాథ తీర్థకరుల జైనదేవాలయ మిక్కాలమున నిట సుప్రసిద్ధమై, ధనవంతమై యున్నది. ఇది క్రీ. శ. రెండవ శతాబ్ద కాలమునకు ముందే యిట ప్రతిష్ఠింపబడినదని జైనులందొక వాడుక గలదు. జైన దేవస్థానము కొలిపాక ఊరి బయట నున్నది.

జినప్రభాసూరి యను జైనపండితుడు రచించిన తీర్థకల్ప మను గ్రంథమునం దీక్షేత్రమును గూర్చి యిటుల చెప్పబడినది. ఈయన విక్రమ శకము ౧౪ శతాబ్దమునాటి వాడట. శ్వేతాంబర జైనాచార్యుడట.

ఆదిని భరతుడు అయోధ్యయందు ఋషభనాథ తీర్థకరుని అర్ధపద్మాసనస్థమగు మరకత విగ్రహము ప్రతిష్ఠించి పూజించుచుండిరట. దానినటనుండి విద్యాధరులు గొంపోయి తమ లోకమునం బ్రతిష్టించి పూజించుచుండిరట. ఆ విద్యాధరుల నుండి దేవేంద్రుడు గైకొని తన పురియందు ప్రతిష్ఠించి పూజింప సాగెనట. అటనుండి లంకారాజ్యాధిపతి యగు రావణ భూపతి లాగికొని తన లంకలో ప్రతిష్ఠించి తన రాణి యగు మండోదరితో సహా నా ఋషభ తీర్థకరుల బూజించు చుండెనట. కాని రావణ మరణానంతరము మండోదరి యావిగ్రహమును దీకించి సముద్రమునం బడవేయించెనట.

పై కథనము యొక్క నిజానిజము లెట్లున్నను వినువారలకు వింత గొల్పకపోదు. జినప్రభాసూరి నుడివినటులు దర్వాతి చరిత్రమును యోచింతము గాక. విక్రమ శకము ౬౮౦ ప్రాంతముల కల్యాణ నగరమున రాజ్యమేలుచుండిన కాలచూర్యుల (కలాచూరిస్) తెగకుం జెందిన వాడగు శంకరవర్మ మహీపాలుని పాలన కాలమున నాతని రాజ్యమున మహామారి (వ్యాధి) పొడసూప నాయన ఖిన్నుండై యుండు తరి (ఈయన బుద్ధరాజు కుమారుడట) పద్మావతీదేవి యను జైన దేవత కలలో నగుపడి ఋషభనాథ తీర్థకరుని మరకత విగ్రహ మొకటి సింహళ లంకాపుర ప్రాంత సముద్రము నందున్న దనియు దానిందీయించి నీరాజ్యమునం బ్రతిష్ఠించి పూజించిన నీవ్యాధి వదలుననియుం జెప్పెనట. ఆభూపతియు తగు ప్రయత్నమున నావిగ్రహమును దెప్పించి తాను దనరాజ్యము కడదనుక నెను రేగి తిరిగి వచ్చుచో వెనుకకుం జూడనను నియమమున నేతెంచు చుండ నీకొలనుపాక కడ నాతండేమరి యేలనో వెనుకకుం జూడ నావిగ్రహమట నేలకాని బిగుసుకపోయి కదలదయ్యెనట.

అట శంకరవర్మ దేవాలయము నిర్మించెనట. అది చిరకాలమునకు శిథిలమై పాడుపడి యుండెనట. విగ్రహము ఇక్కాలమున మరక తత్వము గోల్పోయి నైలతుత్తము బోలిన నీలివర్ణపు శిలయై మంచి పనితనము గల్గి యున్నది. జినప్రభాసూరి రచిత తీర్థకల్పము వ్రాతప్రతి పూనా గ్రంథనిలయమున నముద్రితస్థితియం దున్నదందురు.

తరువాత నింకను జరిగినటుల చెప్పంబడిన కథనమును ఇక్కాలమున కొలనుపాక వాస్తవ్యులగు ఆంధ్ర జైనులందు వాడుకగ నున్న సంగతుల నిట వివరించుట సమంజసము. జైనమత గ్రంథములలోను ఇతర పత్రములలోను కొల్లిపాక, కుల్పాక, కొలిపాక యను పేరులతో ప్రశంసలుంట ఉత్తర హిందూస్థానపు జైనులు పరిశీలించి వెదకి యాంధ్ర దేశము నందున్న కొలనుపాకగ పోల్చి, యిచట మరకత విగ్రహరూపమున నున్న యా ఋషభనాథ తీర్థకరుల పాడుదేవాలయపు తావున నిటీవల నొక గొప్ప

దేవస్థానమును నిర్మించిరి. చుట్టును గొప్పప్రాకారము, ముఖద్వారమున రెండు బురుజులం బోలు కట్టడములు, నడుమం బ్రధానద్వారము, దానిపై నొక మేడ, లోనను బైటను యాత్రస్థుల విడిదికి వసతి గృహములు, వెలుపల నొకపూఁదోఁట రెండు దిగుడు బావులు నిర్మించి యున్నారు. లోన నొక పూఁదోఁట యందు కొన్ని (దొరకిన) శిలాశాసనములు శిథిల జైన విగ్రహములు స్థాపింపఁబడినవి గాని, యవిపరిశీలింపఁబడి ఏచరిత్రమున నింతవరకు సరిగ తెలుపఁ జేయఁ బడలేదట. ఇఁకను విక్రమశకము పదునాలవ శతాబ్దకాలపు గ్రంథకర్త యగు నేమిచంద్ర మహాకవి (ఈతఁడు సంస్కృత మాగధ భాషాకవియట) కొలనుపాక వృషభ తీర్థకరులం గూర్చి వ్రాసి యున్నాఁడని యచటి జైను లనుచున్నారు.

కొలనుపాక జైనుదేవస్థానమిప్పుడు శ్వేతాంబర జైన క్షేత్రమని శాసనముల నుండి తేలుచున్నది. విగ్రహములును దిగంబరములుకావు. దీనిం గూర్చి వ్రాసినవారును శ్వేతాంబర జైనులే జినప్రభాసూరియె "సముద్రమునఁ జిరకాల ముండుట, మరకతశిలము మైలతుత్థముం బోలిన రాయిగ మారెనదని వ్రాసెనట. విగ్రహము ఆరడుగుల ఎత్తుకలది, కూర్చున్నట్లున్నది, పనితనమంద మైనది, నాగార్జునకొండ, అమరావతి, రామిరెడ్డిపల్లి, బౌద్ధ శిల్పములకుం దీసిపోదని యచటివార నెదరు."

ఒక శిలాశాసనమున "ప్రలంబకీకర ముద్రామరకత మాణిక్యనిర్మితా వృషభమూర్తిః పుండరీకగణధర ప్రతిష్ఠితా మహిమధామా భూత్." అని యున్న సంగతిని వివరించుచు ముగింతుము గాక. మఱియు దీని యాది నామము బింబావతీ పురమని యుండెనని ఒక వాడుక గలదు. కొలనుపాక వీరనారాయణ ముకుంద యను మకుటముతో నొక శతకము గాన వచ్చుచున్నది. ఒకప్పుడు కళ్యాణపుర చాళుక్యులక్రింద నిది యొక ప్రధాన కార్యస్థానమై యుండినటుల నిచ్చటి వీరనారాయణ దేవాలయమునం దొక శాసనము కలదట ఈక్షేత్రమున చాళుక్యుల యొక్కయుఁ గాకతీయుల యొక్కయు శాసనములు పెక్కులు కలవు గాని సరిగా స్పష్టపడకున్నవి అందు చాళుక్య ధర్మములు, బిరుదములు చిత్రింపఁబడి యుండుటఁ గాననగు చుండును. ఇచట దేవాలయములను మఠములని వాడుచున్నారు అవి శైవులందు ప్రతి తెగ నారి కొక్కటి గలదందురు. (రేణుకాచార్యుఁడు చూడుఁడు.)

**కొలాబాజిల్లా** — అలీబాగుపురము ప్రధానస్థానము (బొంబై రాజధాని చూడుఁడు).

**కొలాల్పురము** — కొలాల్పురమను నది కన్నడభాషాపదము. దానిం దిద్దిత్పి కోలాహాల పురముగ నొకప్పుడు సవరించిరట గాని వాడుకయందు కోలారుమైపోయినదట మైసూరు రాజ్యమున ఒక జిల్లాపురము.

**కొలియనులు** (కోలియను నృపతులు)- కపిలవస్తు నగరముకడనున్న కోలిపురము రాజధానిగ నాప్రాంతసీమనేలిన నృపతులు, సుప్రబుద్ధుండను నామాంతరముగల అంజనరాజు కోలియుఁడే. కోలియనురాజ్యము కపిలవస్తురాజ్యముండిన కాలముననే యుండినట్లు తేలుచున్నది.

**కొల్సాక్ ప్రదేశము** (Coal Sack)- ఇది ఎస్ట్రానొమీ శాస్త్రమున Milky Way యందుగల వెల్లిప్రదేశము, వెలుఁగుమధ్య నల్లగ నగుపడుట నీపేరిడఁబడినది. ఇంకను ఈకొల్సాక్ యందే Cygnus అనంబడు కాన్స్టలేషను కడనున్న పగులు ( Opening ) వలె నున్న నేటొక నల్లని నిర్నక్షత్ర ప్రదేశమును, ఆశాస్త్ర

గ్రంథములందు కొందఱు Northern Coal Sack అని వాడియున్నారు.

**క్రొల్లాగపురము** (విశాలీ పురము లోనిది) — ఇది విశాలీపుర పరిసరము. తిరుహూత్ డివిజనులోని ముజాఫర్పూరు మండలమున నున్నది. తొల్లింట నీయూర నాయ కులను నటకుల క్షత్రియులు వసించువారట. జైన తీర్థకరులలో ౨౪ వ తీర్థంకరుడగు మహావీరస్వామి యచటి నాయకుల క్షత్రియ కులమునను జన్మించినవాడట

**క్రొల్లాపురము** — దీనికి రుద్రగయ యనియుంబేరని పద్మపురాణము ఉత్తరఖండము ౧౫౩ అధ్యాయమున కలదు

**క్రొల్హాపూర్ స్టేటు** — బొంబై రాజధాని ప్రభుత్వపు టధికారమునకు లోబడిన స్వదేశ సంస్థానము మహారాష్ట్ర దేశములోనిది. ప్రభువునకు ఛత్రపతి యనియు, మహారాజనియు బిరుదములు కలవు. ఈయన శివాజీ చక్రవర్తి సంతతివాడగును. రాజధాని కొల్హాపూర్, ఇది తొల్లిటి కరవీర పురము. ఇట సుప్రసిద్ధమగు మహాలక్ష్మి దేవస్థానము, శక్తిపీఠము కలదు.

**క్రొల్లేటరల్ సెక్యూరిటీ** Collateral Security-(వాణిజ్యసంబంధ పరిభాషాపదము). Security (హామీ) కాక దానికి ఇంకకొంతవేఱు Security ఈయబడెనేని, అది.

**క్రొల్లేరు సరస్సు** — ఇది గోదావరీ, కృష్ణా నదుల మధ్య



ప్రదేశ భూమియందు సముద్ర తీరమునకు గతిచయ దూరమున గల పల్లపు ప్రదేశము వర్ష కాలమున నూరుచతురపు మైళ్లు నీరునిలచి యుండియు వేసవియందు కడుంగడు తగ్గిపోయినగూడి దోమల కునికిపట్టుగ నుండును. ఈప్రాంతములందు కొల్లేటి దోమలనిన వాడుకపదమే.



ఆదిని ఈ నూరుమైళ్లు చతురముగల ప్రదేశమంతయు గ్రామముల మయమై యుండె ననియు, ప్రజలు ధనవంతులుగ నుండి గొప్పగొప్ప దుర్గములు నొనర్చువారనియు, దైవవంచనగ నీసీమ క్రిందికి గ్రుంకుట కొల్లేరాయె ననియు, అచటి వారనెదరు ఇంకఁ గొందఱు అచటిగ్రామములలో ఒకటి కొల్లేరను పేరుగలది యుండెనందురు. ఇదిప్పుడు నీటికొల్లు వసించుచుండ క్రమ క్రమముగ వ్యవసాయములచే నాక్రమింపఁబడు చున్నది. వేసవియందు నీరెండిపోవ వెనుక గ్రామములుండిన యానవాళ్లగుపడు చుండును.

**కొళంబు చెట్టు** — ఆంగ్ల Calumba (root) tree దీనింగూర్చి దక్షిణదేశము వారికి తప్ప మనకంతగా తెలియదు. చేదురుచి గలది. దీనివేరు చూర్ణముచేసియు, కషాయము గాచియు వాడుదురట. లోనికిచ్చిన జీర్ణశక్తి నభి వృద్ధిపఱచి నరముల వికృతి, నీరసము, నీళ్లవిరేచనములు, కలరా విరేచనములు నివారించి యాపి కుళ్లుచుండు పదార్థములను కుళ్లకూడ నాపుశక్తి దీనికిఁ గలదందురు.

**క్రొత్తగా అప్పుకుప్రయత్నించేస్తే ప్రాతఅప్పు బయటపడ్డట్టు** — ఆంధ్ర లోకోక్తి.

**క్రొత్తనీటికి చేప ఎదురెక్కినట్లు**- ఆంధ్రలోకోక్తి.

**కో - ఆపరేషన్** (Co-operation)— (వాణిజ్యసంబంధపరిభాషాపదము). ఈవ్యాపార సంబంధమును కో-ఆపరేటివ్ మువ్‌మెంటు (Co-operative movement) అనుచున్నారు. అన్యోన్య సాహాయ్యమని యర్థము. దీనింగూర్చి శాసనముకలదు. ప్రభుత్వోద్యోగులు కలరు. ప్రభుత్వము కొంత సాహాయ్యమొనరించును.

**కోకర్ పండితుఁడు**-"According to Cocker". Cocker పండితుడు. అంకగణితము (Arithmetic ) రచించిన మొదటివాఁడు గాన లెక్కతప్పనిదియనిభావము. Arithmetically correct అనునట్లు సినలగు మాటయనియు తా చెప్పినది నిశ్చయమనియు అర్థమిచ్చు ఉక్తి.

**కోక క్షేత్రము** — బంగాళములోని పూర్ణియా మండలములోని పశ్చిమభాగముం గల్పకొనిన కౌశికి లేక కుశినదికి పశ్చిమభాగ ప్రదేశమునకు కోకక్షేత్రమనిపేరు. ఇందు తాంబ్ర (తంబార్), అరుణ, కునకౌశిక (సూర్యకౌశిక) నదులుకలసిన త్రివేణియు, దానికి క్రిందుగనున్న నాథ్పూర్ అనుగ్రామముకడ వరాహక్షేత్రమును చేరియుండును. ఈ వరాహక్షేత్రమునకు కోక ముఖమనియుం పేరుకలదు. వీటి ప్రశంసలు వరాహపురాణము ౧౪౦ అధ్యా. శ్లో. ౭౨-౫౩ యందునను నృసింహపురాణము ౬౫ యందు నను కలవు.

**కోకిల గోత్రము** — కండిల గణము చూడుఁడు.

**కోకిల ప్రియము** — రాగములు చూడుడు.

**కోకిలానది** — దీనిని కోయిల్ అని వాడుచున్నారు. ఛోటా నాగపూరునందు జనించి బీహారములోని షహాబాద్ మండలముగో ప్రవహించును.

**కోకిలాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. పద్మాసన మున మతమువైచుకొని కూర్చుని, (పద్మాసనము చూడుఁడు) మోచేతుల నేలనానించి బొటన వ్రేళ్ళు బట్టుకుని యుండుట కోకిలాసనము. కడుపుపలచనై జఠరాగ్ని బలపడునని చెప్ప బడినది

**కోకో** (Cocoa) — ఈసుప్రసిద్ధ పానీయ పదార్థము కాయలలోని గింజల చూర్ణమై యున్నది. కాయయందై దేసి అరలుండి అరయందు పండ్రెండు గింజలుండెడివి. వీనిచూర్ణమే కోకో. శరీరమునకు త్రాణం గల్గించునని చెప్పఁబడినది.

**కోకో చెట్టు** (Cocoa) — ఇక్కాల మున కోకో పానీయముగానున్నదని మెల్లరెఱింగి నదే. ఇది "Warm wet" భూములందు చక్కగ పెరిగి కాచు చెట్లజాతి గోల్డుకోస్టు దేశమునందు ప్రపంచమునందంతటను కావలసిన కోకో లో సగముకన్న నెక్కువఫలించుచున్నది. తోలుత కోకో కాయలు పండబారినపిదప రాల గొట్టి గింజలందీసి గుండచేసి డబ్బాలలో నగు మతి చేయుదురు. కోకో కాయలను Pods అని యెదరు. ట్రినిడాడ్పురము కోకో వ్యాపారము నకుం పేరందినది. పెనురుబుట్టలందీగింజల నొక్కొక్కటిగ నాటి నీరుపోయుచు మొలపించి కొంచె మెదిగిన పిదప నేలనాటి తోటలంబెంచుదురు. గింజల నెండించి చూర్ణముచేయుతరి నవితడుప రాదట.

**కోకోలజీ** (Cocology), **కోకోగ్రాఫీ** (Caoocography) — Wrong use of words or Bad choice of words or bad Pronunciation, or all is called

Cocology. అపశబ్దప్రయోగములు, అర్థము అస్పష్టముగా నగు శబ్దముల ప్రయోగములు, ఉచ్చారణదోషములు (ఇవి అన్నియుం గాని, కొన్నియుం గాని) కోకోలోజీ యనంబడెడిని.

**కోక్** (Coke) — రాతిసబొగ్గు కాలగా మిగులునది. వంటచెరకుకాల్చగా బొగ్గు యెట్లు మిగులునో రాతిసబొగ్గునకు కోకు అట్టిది. దీనితో సున్నపురాళ్లు కాల్చుట మొదలగు కొన్నిపనుల కుపయోగించును. దీనిం గాల్చిన పొగ అంతగా రాదు.

**కోఖాన్కాత్సు** — మధ్యతురుష్కస్థానము చూడుడు.

**కోచిహస్తి గోత్రము** — జమదగ్ని వత్సఉపగణము చూడుడు.

**కోచ్ బండి** — గుఱ్ఱపుబండికి కోచ్ అనెదరు. తొలుత ఐరోపాలోని హంగేరీదేశమున Cotze అను పురమున జేయబడి, కోట్జీ అనం బడుచు రానురాను మార్పుగలిగి కోచినై నిలచి యున్నది.

**కోజాగరపౌర్ణమి** — ఆశ్వయుజ శుద్ధ పౌర్ణమిదినము. (జాజాలపౌర్ణమి చూడుము.)

**కోజికి లేక కోజికినిహొంగి** — జపాన్ దేశమునందలి షింటోమతగ్రంథము కోజికి యనిన పురాతనసాంప్రదాయగ్రంథ మని యర్థ మగు జపాను దేశభాషాగ్రంథము. దీనిని మికాడో (చక్రవర్తి) గెమ్మియోప్రభుడు క్రీ. శ. ౭౧౨ లో చెప్పించి కూర్పించి గ్రంథముగ వ్రాయించె ననియు, క్రీ. శ. ౧౬౪౪ లో ప్రథమతః ముద్రింపఁబడినదనియు చెప్పఁబడినది. జపాను దేశమున నీమతము బౌద్ధమతానుసారిణియై వ్యాపించియున్నది. వీరిదేవస్థానములను కలవు.

కోజికి మతగ్రంథమునకు అనుబంధగ్రంథ మగు నిహొంగి యను పేరుగల గ్రంథ మొకటి కలదు. దీనిని Chronicles of Nihon అని ప్రాశ్చాత్యు లనెదరు. దీనికర్త నిహొంగి మహాత్ముఁ డనియెదరు. రెండును కలసి కోజికి నిహొంగి యనఁ బరగుచు షింటోమతసిద్ధాంతములను, పూర్వచరిత్రను వివరించుచున్నవి. నిహొంగి క్రీ. శ. ౭౨౦ నాఁటిదని క్రైస్తవు లనుచున్నారు

**కోటగిరి** — దక్షిణదేశమునందు ఉదకమండలము కూనూరులకువలె నీలగిరికొండల పైననే ఉదకమండలమునకు ౧౮ మైళ్లదూరమునను, కూనూరునుండి ౧౩ మైళ్లదూరమునను ఉన్న సమశీతోష్ణప్రదేశము సముద్రపునీటి మట్టముపై ౬,౫౦౦ అడుగుల ఎత్తుగ నుండుటం జేసి ఉదకమండలమునకన్న తక్కువ చలిగా నుండియు, కూనూరుకన్న నించుక అధికము చల్లగా నుండు ప్రదేశము. ఏవరేజిటెంపరేచరు (ఫారన్‌హీటు థర్మామీటరు) ౬౨ డిగ్రీలునుండి కూనూరుం బోలిన వర్షపుపరిస్థితిం గల్గియుండుటచేతను ఉదకమండలము కూనూరులంబోలి గడబిడలసందడు లం గల్గియుండక విశ్రాంతికరముగ నుండు ప్రదేశము

**కోట, దుర్గము** — కోటలు, దుర్గములు, భద్రపర్చబడిన స్థానములు. ఇవి పరరాజులనుండి భద్రపడి వారికిఁ దుర్గమములుగాన దుర్గము లనం బడెను. ఇవి మూడు తెఱంగులుగ నుండును. ప్రభువులు సురక్షితముగ నివసించుటకైన నివాసభవ



నములు గలవి దుర్గము లనంబడును. కాపుదలకై సైన్యములుంచు టకు నిర్మింపఁబడినవి కోటలనంబడును. ప్రభువు

నివసించు భవనములును, సైన్యములు కావలికై యుండు సైన్యస్థానమును అనఁగా రెంటిని గల్గి యుండు కోటలు కొన్ని గలవు. పురముం జుట్టి రక్షణకై సైన్యస్థానములుగఁ గూడ నుండు కోటలును గలవు. అన్నిటికి బురుజులును, యుద్ధ మొనర్ప ఫిరంగులు సమర్పంబడి యుండినకంతలు గల్గియుండునట్లు నిర్మించి, బలమగు ద్వారముల నెత్తి, కోటంజుట్టి లోతైన కందకములం ద్రవ్వి నీరు నింపుదురు. కోటగోడలపై గూడ ఫిరంగులు తుపాకులతో యుద్ధమొనర్ప కంతలుండును. రాతితోగాని, ఇటుకతోగాని కోటలం గట్టుదురు. కొన్నితావులందు మట్టికోటలుం గలవు.

**కోటమరాజు నాగయ్యకవి** — ఆంధ్ర కవులలో నాధునికులుగ పరిగణింపఁబడినవాఁడు. ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడు, కాశ్యపస గోత్రుఁడు, తండ్రిపేరు భాస్కరమూర్తి, తల్లిపేరు శాంతమ్మ, కృష్ణాగుంటూరు మండలప్రాంతము నివాసము.

ఈతఁడధ్యాత్మరామాయణమును పద్యకావ్యముగ రచించెను ఈసందర్భమున కానాద పెద్దన సోమనాథకూడ దీనినే రచించెనని మనసునం దుంచుకొనవలయుచున్నది.

**కోటరాయ రఘునాథ తోండెమాన్ భూపాలుఁడు** — దక్షిణదేశమున పుదుక్కోట సంస్థానమును క్రీ. శ. ౧౭౭౦ సంవత్సరప్రాంతమున పాలించిన మహీపతి తోండైమాన్ చక్రవర్తి వంశజుఁడు ఈవిద్యాచక్రవర్తి ఈ కవిసార్వభౌముని యాస్థానమున ఆంధ్రభాషార్ణవ మను నిఘంటువును రచించి పేర్వడసి నుదుపాటి వేంకనకవి విద్వాంసుఁడైయుండెవాఁడు.

రాయరఘునాథ తోండెమాన్ రాజ విరచిత ప్రబంధములు రెండు గానఁబడుచున్నవి. అవి పార్వతీపరిణయము, కవిజనసంజీవనము నను పద్యకావ్యములు, మహాకవుల కావ్యగుణములు వీని యందు గన్పట్టెడిని. అద్భుతములగు నూతన భావనాకల్పనలు పుదుక్కోట సంస్థానాధిపతికిని తంజావూరు, మధుర రాజకవులకే చెల్లునని ప్రతీతి బలమగునది వ్యాపించియున్నది. ఈతని పార్వతీపరిణయమున కొన్ని వ్యాకరణదోషము లున్నను, భావములు నిరుపమానవైభవమున దనరుట నీకవిసార్వభౌమునకు సుప్రసిద్ధము హాస్యరసచాతుర్య మీమహాకవికి సహజసామాన్యమైయుండును. వ్యాజోక్తులు వీరికవిత్వమున స్వతంత్రముగా వెలసియున్నట్లుండును

**కోట, వర్ణాట, కాకతి, పరిచ్ఛేద, క్షత్రియసంజ్ఞలు** — ఆంధ్రక్షత్రియులలో వసిష్ఠ, ధనంజయ, కాశ్యప, కౌండిన్యస యను నాలుగు గోత్రములు కలవు ధనంజయగోత్రజులు కోట యను సంజ్ఞను, కౌండిన్యస గోత్రజులు వర్ణాట సంజ్ఞను, కాశ్యపస గోత్రజులు కాకతి సంజ్ఞను, వసిష్ఠగోత్రజులు పరిచ్ఛేద సంజ్ఞను కలిగియున్నారు ప్రసిద్ధులగు ఓరుగల్లు సామ్రాజ్యాధీశులు కాకతీయులు రహితాపురము (ఇప్పటి రఘుదేవపురము), కొరుకొండ జమీందారులైన మాదపాటివారును, తోకిచెర్ల గోపాలపురము జమీందారులగు ఉప్పలపాటివారును వాసనాలతి వారే. పిఠాపురం, విజయనగరం సంస్థానాధీశులైన వత్సవాయి, పూసపాటి కుటుంబములవారు పరిచ్ఛేదులు. మొగల్తుర్తి సంస్థానాధిపతులగు కలిదిండివారు వర్ణాటులు. తొయ్యేరు ఎస్టేటు దారులగు నల్లపరాజువారు కోటవంశస్థులు.

**కోట శివరామయ్య కవి** — ఆంధ్ర కవులలో మధ్యకవులుగా పరిగణింపఁబడినవాఁడు. శూద్రకులజుఁడు. కౌశికసగోత్రుఁడు. తండ్రిపేరు బాపనయ్య. నివాసము శ్రీకాళహస్తిక్షేత్రము. శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము రచించిన

ధూర్జటికవి శిష్యుఁడు. క్రీ. శ. ౧౫౨౫-౧౫౫౦ మధ్యకాలముగాఁ దోఁచెడిని రచించినదిసానందోపాఖ్యానము

**కోటా సంస్థానము** — ఇండియాదేశమందలి రాజపుటానా ఏజన్సీలోని బ్రిటీషురక్షిత సంస్థానము లిరువదింటిలో నొక రాజపుత్ర సంస్థానము. (రాజపుటానాఏజన్సీ చూడుఁడు). కోటాపురము రాజధాని.

**కోటికాస్యుఁడు** — క్షత్రియుఁడు. పాండవులు వనవాస మొనర్చుతరి నాశ్రమమున నొంటరిగనుండ ద్రౌపదీదేవిని సైంధవుఁడు వలచి, ఆమె యెవ్వరో కనుగొనిరమ్మని పంపగా వచ్చిన వాఁడు

**కోటికిం బడగనెత్తుట** — అదికాలమునుండియు నొకనికడ కోటి టంకములు (ఇప్పటి రూపాయలు) చేరగనే ఆ ధనమునకు రక్షణగల్గి ఐశ్వర్యము నిలచియుండుటకుగాను ఒక నాగాభరణయుక్త శివలింగమును నిలపి పూజించుచుంట యాచారమైయున్నది. అటుల నెన్ని కోట్ల సంపన్నులన్ని నాగాభరణయుక్త శివలింగముల నర్చించుచుందురు ఇట పడగయనిన నాగాభరణమని యర్థము. కోటి రూప్యములార్జించుట కీ యుక్తిని వాడుచున్నారు.

**కోటిక్రోదృశ్య మానోపబృంహణ న్యాయము** — కనుపడకున్న వస్తువు నెంత పెద్దయని చెప్పినను చెప్పనగుంగాని కన్పించిన పిదప దానిపరిమితి ఏర్పడునని భావము

**కోటితీర్థములు** — గోకర్ణక్షేత్రమున ప్రసిద్ధమైన కోటితీర్థమను సరస్సుకలదు. కురుక్షేత్రముననొక కోటితీర్థముకలదు.అదివామనపురాణము ౩౬ యందు ప్రశంసింపఁబడినది. వ్రజమండలమందలి మధురయందొక కోటితీర్థము కలదు. ఉజ్జయినియందు మహాకాళీ దేవస్థానావరణముననొక కోటితీర్థముకలదు. అదిస్కాంద పురాణము అవంతిఖండము ౨౨ యందు వివరింపబడినది. ఇంకను పద్మపురాణము ఆది సర్గ ౬ యందునగూడ ప్రశంసింపబడినది. రామేశ్వరమున దేవాలయముననొక కోటితీర్థపు బావికలదు. ఇంకను ధనుష్కోటితీర్థము సేతువుకడనున్నది. వీటిప్రశంస స్కాందపురాణము బ్రహ్మఖండము సేతుమాహాత్మ్యము ౨౮ నందుఁ గాననగును. మత్స్యపురాణమున ౧౯౦ యందు నర్మదానదియందొక కోటితీర్థము చెప్పఁబడినది. కాలాంజరమున కోటలో నొక రోదతీర్థమను కోటితీర్థము కలదు.

**కోటిఫలీ క్షేత్రము** — ఆంధ్రదేశమున గోదావరీమండలమున రామచంద్రపురము తహశ్శీలునకుఁ జెందినగ్రామము. ఇట గోదావరీ నదీస్నానము, కోటికోట్ల ప్రదమని చెప్పఁబడుట నీ పేరందినది. కోటిపల్లి యల్లియని సర్వసాధారణముగ వాడుకనందియున్నది. దీనికి నెదురుగ గోదావరి కవ్వలితీరమున ముక్తీశ్వరమను గ్రామమును ఇట్టిదేకలదు.

**కోటివిద్యలూ కూటికొరకే** — ద్రవ్యార్జనమునకేయని భావము.

**కోటి వెంకనార్యుఁడు** (లేక వెంకటకవి) ఆంధ్రకవులలో నాధునికుఁడుగ పరిగణింపఁబడిన వాఁడు. రచించినది "ఆంధ్రభాషార్ణవ" మను పేరుగల అచ్చతెనుఁగు నిఘంటు పద్యములుగా రచించెను. ఇది విజయరఘునాథుని పుత్రుండగు రఘునాథున కంకిత మొనర్చెను. శ్రీకృతిపతి రామనాథ సేతుపతిన్పపులకు సమకాలికుఁడని యట.

**కోటీశ్వర కవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడిన వాఁడు నియోగి

బ్రాహ్మణుడు. తండ్రిపేరు చక్రరాజు. తల్లిపేరు మంగమాంబ. రచించినది భోజకన్యాపరిణయమును ప్రబంధము.

**క్రోటీశ్వరదేశము** — కచ్ఛదేశము చూడుడు.

**క్రోటుగుండీలు** (Buttons of coats)- కోటులు భారతభూమి కాంగ్లదేశాచారముగ నే తెచ్చినవి. మగవారి కోటులకు కుడివైపునను, ఆడువారి కోటుల కెడమ వైపునను గుండీలతకబడి తక్కినవైపుల వాటిదూర్చు కన్నములుగల్గి యుండును. కొంతకాల మాడివారు కోటుల కసలే గుండీలులేక వాడుచుండిరట. పనిచేయు వాటముగల కుడిచేతిని వదలి ఏవాటము లేని ఎడమచేతితో ఎడమపై కోటుయంచును కుడివైపు అంచుపైకి కొంచెమెక్కించి అవసరమగు తరి శరీరమున కదిమి పట్టుచుండిరట. పిదప గుండీలు ఏర్పాటు కుదిరినపిదప నాయలవాటు మేరకే ఎడమవైపు రంధ్రములును, కుడివైపు గుండీలను కుట్టి యంటవేయుటయు గల్గెనట. నేటికిని అట్లే యున్నది. ఇది పురుషుల కోటులకుంబద్ధతి

ఇక స్త్రీలకు ఎడమచేత పిల్లనెత్తుకొనుట యలవాటుగాన కుడిచేతనీకోటుఅంచులం బట్టుట జరుగుచుండెడిదట. అట్లె వారికి నీగుండీలఏర్పాటు కల్గెను. ఏలగునంత వఱకు పురుషుల పద్ధతుల నుండి తమపద్ధతులను వేఱుగ గల్గుటయందు స్వతంత్రాభిలాష ప్రపూర్ణలగు ఆంగ్ల వనితల కీకుడి ఎడమ భేదము లనుకూలించెను. నేటికి ననేక మార్పులు కోటుల యాకారములందు గల్గినను గుండీలనుంచు విధానము మారక నిలచి యున్నది.

**క్రోటులకు చేతుల కడను గుండీలుండుట** — ఇంగ్లాండు దేశమున తొల్లింట నొకప్పుడు కోటులకు గుండీలనుంచ ప్రారంభమైన దినములలో ముందువైపునకేగాక, వెనుకను చేతులకును గూడ గుండీలం గుట్టి కన్నములం దూర్చి బిగించుటయు నొక యాదముగను, ఒయ్యారముగను తలంచెడి వారట. అనేక మార్పులు కోటులందుజరిగి, పెక్కురూపములు ఏర్పాటైనను చలిదేశమునందు కొడగదగిన పొడవుతోడను, కూర్చుండినచో వెనుకభాగమున చీలి ఇబ్బంది నీయని రీతిని వెనుక నడుము నకుం దిగువభాగమున చీలికం గల్గిన పొడ్డుగు కోటులకు నేటికిని వెనుకను, చేతుల కడను గూడ నిరర్థకముగ నైనను గుండీల నంటగుట్టు చున్నారు. ఇప్పు డీగుండీలు కేవల లాంఛన మాత్రమేగాని కన్నమున దూర్చి బిగించుటలేదు.

**క్రోటోపాక్సి** (అగ్నిపర్వత శిఖరము) — ఇది ప్రపంచమున నెక్కువ భయంకర ప్రమాదకరమునగు నగ్నిశిఖరము. దక్షిణ అమెరికా ఈక్వడోర్ రాష్ట్రమున ఏండీస్ పర్వత పఙ్క్తులలో తూర్పు పర్వత పఙ్క్తియం దున్నది. మాట లొకప్పుడు అరవైమైలు దూరము ఎత్తు పైకి లేచును.

**క్రోతము** — కుష్ఠు రోగములలో నొక భేదము. ఇది తామర పల్లికలవలె లేచునది.

**క్రోడలు కుమారుణ్ణి కనెదనంటే వలదనే అత్తగారుండదు** — ఆంధ్ర లోకోక్తి.

**క్రోడలు గృహప్రవేశము అత్త గంగాప్రవేశము** — ఆంధ్రలోకోక్తి.

**క్రోడి(కోడి)** కోడియనిన ఆముదపు దీపమున వెల్గు వత్తియొక్క కాలిపోయిన భాగము. ఇంకను ఆంధ్రులలో శ్రీవైష్ణవులనంబడు తెగవారిలో నుండు అంతశ్శాఖా భేదములకుం గోడి (బహువచనము కోడులు) యనిపేరు. (శ్రీవైష్ణవులు చూడుడు) ఇచట కోడియనిన శాఖాభేదములలో నొక భేదశాఖయని యర్థమగును.

**క్రోడి గ్రుడ్డు వగులగొట్టుటకు గుండ్రాయికావలెనా?** - ఆంధ్రలోకోక్తి.

**క్రోడిచెర్ల శ్రీనివాసకవి** — ఆంధ్రకవులలో నాధునికునిగ పరిగణింపబడినవాడు. కాపురము రాజమహేంద్రవరము. ఆత్రేయస గోత్రుడు. కొండమధని పుత్రుడు. కాలము సరిగా తెలియదు. రచించినది క్షేమధర్మరత్నాకరమను పద్యకావ్యము. దీనిని క్షేమధర్మమని సర్వసాధారణముగ వాడుచున్నారు.

**క్రోడిజుట్టు చెట్టు** — ఇదియు తోటకూరజాతిలోనిదే కాని భోజనోపయోగము కాని కలుపు మొక్కజాతిగ నెంచబడుచున్నది. దీనికాంగ్లమున Turk's cap అనియు, కొన్ని దేశభాగముల దీనిని చించలమనియు వాడుచున్నారు. ఇది ఎఱ్ఱతోటకూర స్తంభమువోలియుండి కోడి తలపై నుండు నెత్తిని వానిబోలి వెన్ను వేయుటంజేసి యీ పేరు గల్గియున్నది. దీని నలంకారముగ పూదోటలందు నాటుదురు. ఏటేట మొలచి చచ్చు చెట్టయియున్నది. గింజలును తోటకూర విత్తనములం బోలియేయుండును.

దీని విత్తులు లేక వేరు లేక సమూలము చూర్ణముగను, కషాయముగను జేసి వైద్యులుపయోగింతురు. లోనికిచ్చిన జఠరాగ్నిని, వీర్యమును ఉద్రేకించుననియు, ఉబ్బురోగము, గ్రంధివాతము, దగ్గు నివారించుననియు, దీని ఆకు నూరి వెచ్చజేసి కట్టిన శోధించి పుఱ్ఱఅంచి వ్రణములను మాన్పుననియు, దీనిని లోనికిం దినిన గ్రహణిం బుట్టించి క్రిమిదోషములం గల్గించుననియు, గాన తినదగినది కాదనియు, అట్టి దోషమునకు విరుగుడు చంద్రచెక్క చూర్ణము, విరిగిచెక్క చూర్ణము, పులుసు అనియుం జెప్పంబడినది.

**కోడిపిల్లమీద మీద పందిపిల్ల బలాదూర్**—ఆంధ్రలోకోక్తి.

**క్రోడూరు వేంకటాచల కవి** — ఆంధ్ర కవులలో నాధునికునిగ పరిగణింపంబడిన వాడు. నియోగిబ్రాహ్మణుడు, ఆపస్తంభసూత్ర కాస్యపస గోత్రుడు, తండ్రి పేరు శంకరయ్య, తాత పేరు ఎల్లరాజు.

స్కాంద పురాణములోని శివరహస్యఖండమును పద్యకావ్యముగ పురాణశైలిని రచించి మునుపు, ముమ్మనాగభుప్రభున కంకితమొనర్చెను. మైసూరు రాజ్యము నందలి కోలారు ప్రాంతమునని ముమ్మనాగళు (ములబాగుళము) నేలిన ప్రభుడాంధ్రుడు, కర్ణాటకులతో సంబంధములు చేసినవాడు.

**క్రోతికి అద్దముజూపినట్లు** - ఆంధ్రలోకోక్తి.

**క్రోతికి కొబ్బరికాయ ఇస్తే ఏమి చేయగలదు?** — ఆంధ్రలోకోక్తి.

**క్రోతికి జల్తారు కుళాయి** — ఆంధ్రలోకోక్తి.

**క్రోతిచేతికి పాము దొరకినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**క్రోతిపుండు బ్రహ్మరాక్షసి**— అడవియందొక కోతికి పుండగుటరి ప్రతికోతియు

దానింబరామర్శించు నుద్యమమున నొక్కొక్కసారి గోళి వడోలికుందెచ్చి దాని పైకి విసుచుండును. ఈగోళడముల నుండి చిన్నకుఱుపైనను పెద్ద శావిమై మానుట దుస్తరముగ బరిణమించును. అజ్ఞానులు ఆపేక్షతో చేసినపనులు బాధగా పరిణమించినతరి దానిందెలుపుట కీయుక్తి వాడు చుందురు.

**కోదండములు** — కార్ముకములు చూడుడు.

• **కోనసీమ** — గోదావరి యనంబడు గౌతమీనది ధవళేశ్వరమువద్ద నాలుగుపాయలుగనై సముద్రమునంజేరెడిని. ఆనాల్గుపాయలకును సముద్రముదనుక ద్వీపములవలె నేర్పడిన ప్రదేశములకు సర్వసాధారణముగం గోనసీమయనెదరు. కోనయనిన నిట తోటలనియర్థము. ఆంధ్రదేశమునందలి కోనసీమ గోదావరీమండలములోని ఎక్కువభాగమును నగరము తాలూకాయంతయుంగల్గి కోనసీమ యనంబడుచున్నది.

ఈ ప్రదేశము గోదావరి తెచ్చిన గొండుమట్టియు, ఇసుకయుంగలిసిన గరపమట్టియుగుటతన వరి వ్యవసాయమునకుం బనికిరాక తోటలుపెరుగుటకు చాల శ్రేష్ఠమైనదిగా నెన్నంబడినది. కొబ్బరి, పోక, అనంటి, పనస, నిమ్మ, దాడిమ, వెలగ, మామిడిచెట్లు ఈసీమయందు చక్కగ పెరుగును. కోనసీమవాసులు, మండువేసవిని గొడుగక్కరలేక నెండవేళ నెంతదూరమైనను నడచిపోవునంతటి నీడ తమదేశపు తోటలవల్ల గల్గునని గర్వముగననెదరు. అనగా తోటలంత విస్తారముగ గలవనిభావము. కొబ్బరిచెట్టు గలయందు రెండువందలవఱకు కాయలుగాచునంతటి శ్రేష్ఠముగుభూమియుట గలదు. జనవరినెలయందు పనసపండ్లను ఆశ్వయుజమాసమున మామిడికాయలును తమ సీమయందు దొరకునని యచ్చటివారనెదరు. పనసలిట గొప్పజాతులు కలవట.

**కోనాదిత్య క్షేత్రము** — (కోనార్క సూర్యక్షేత్రము చూడుడు). ఇది ఇప్పుడు పాడుపడి, సూర్యవిగ్రహము జగన్నాథములో దేవాలయావరణమున నొకతావున నుంచంబడియున్నది. కోనార్కమును పద్మాలేక పద్మినీ క్షేత్రమనియు ననుచుండిరి.

**కోనార్కము** — ఉత్కళ దేశమున జగన్నాథమునుండి వాయవ్యదిశగా నిరువదినాల్గు మైళ్ల దూరమున నొకప్పుడు సూర్యక్షేత్రమై యుండినతావు. దేవాలయపుపాడును ఆంగ్లులు **Black Pagoda** అనెదరు. (కోన = కడనున్న, అర్క = సూర్యక్షేత్రము). ఇట చాల గొప్ప దేవళము పాడగుట యద్భుతముగ దోచెడిని. తొల్లి యిట చంద్రభాగ యను నది యుండినదని చెప్పెదరు శ్రీకృష్ణుని సుతుండగు సాంబునకు శాపమువలన కుష్ఠురోగముగల్గ నట సూర్య ప్రతిష్ఠయొనర్చి తపంబొనర్చి విశుద్ధింగల్గించుకొనెనని కల్పించిరి. ఆతావు పంజాబునందలి ముల్తాను కడనుండ నిచటికి సిద్ధపఱచిరి. దేవాలయము చక్కని పనితనముకలది. సూర్యవిగ్రహమిప్పుడు జగన్నాథమున దేవాలయావరణమున నుంచబడియున్నది. రాతిధ్వజస్తంభము దేవాలయమున కెదుట గాననగును. దీనిని ఈయుత్కలదేశమేలిన గంగవంశపురాజులలో నేడవ నరపాలుండగు లాంగులీయ నరసింహానృపతి కట్టించెననియు, ఆతనిమంత్రి శిల్పశాస్త్రనిర్మాణమును పరిశీలించుచుండెననియు నిదర్శనములు గానవచ్చెడిని. దేవాలయపుపని క్రీ. శ. ౧౨౮౮ సంవత్సరమున పూర్తియాయెనట. లాంగులీయ నరసింహుడు క్రీ. శ. ౧౨౩౮ సంవత్సరమున సింహాసనమునకు వచ్చి ౧౨౬౨ వఱకు పాలించినవాడు. దీనికి

పద్మక్షేత్రమని పేరుండెనట. ఏపురాణమునను గానరాదు. ఐనను ఉత్కళులు శ్లో॥ వర్షాణాం భారతశ్శ్రేష్ఠో। దేశానాముత్కళశ్రుతః। యస్మాదాస్తేసదాస్సంతి। కృష్ణార్కపార్వతీహరాః॥ అని గర్వముగ శ్లోకము జదువుదురు. ఇందు కృష్ణక్షేత్రము జగన్నాథమనియు, అర్కక్షేత్రము కోనార్కమనియు, పార్వతీక్షేత్రము వైతరణీ నదీ తీరమందలి జాజపురములోని విరజాశక్తిపీఠమనియు, హరక్షేత్రము భువనేశ్వరమనియు వారి భావము. ఇందలి సూర్యవిగ్రహము నిప్పుడు జగన్నాథములోని జగన్నాథాలయాంగణమున నొకచో నుంచియున్నారు. కోనార్కమునందలి యొక శిలాస్తంభము జగన్నాథాలయ ముఖద్వారమున నెదుట నిలపియున్నారు.

**కోనిస్కోప్ (Koniscope)** — ఆకాశము, వాయువు మొదలగువాని యొక్క శీతోష్ణములను వాయువునందలి అణువుల సముదాయములను తెలుపు యంత్రము.

**కోనీ ద్వీపము (Coney Island)** — అమెరికా సంయుక్త రాష్ట్రముల లోని న్యూయార్కు నగరమునకు జెందిన విశ్రాంతి నివాసము.

**కోపయాజ్ఞ గోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుడు

**కోపర్నికస్‌పండిత సిద్ధాంతము**— ఈ మహనీయుని పేరు ఎస్ట్రానొమీ శాస్త్రవిదులయందును, కాన్‌స్టలేషను గ్రంథములందును సుప్రసిద్ధము. క్రీ. శ. ౧౪౭౩-౧౫౪౩ కాలమునాటివాడు పోలాండు దేశస్థుడు విస్చులానదీతీరమున థార్ను పురము జన్మస్థలము. తండ్రి ధనికుడగు వర్తకుడని చెప్పబడి ది. ౧౪౭౩ ఫిబ్రవరి ౧౯ జన్మతేదీగా చెప్పబడినది. క్రాకో నగరమున సర్వకళాశాలయందును, సట్టపరీక్షయందునను, ఇటలీదేశమునందలి రోమకపురి బొలోనా పురములందు అత్యుత్తమ పరీక్షలందునను కృతార్థుడైనవాడు. ఈయన చదివిన కళలలోనెల్ల ఎస్ట్రానోమీకళయు, గణితశాస్త్రమును ముఖ్యములు. బొలోనాకళాశాలయందు గణితశాస్త్రమును, క్రాకో కళాశాలయందు ఎస్ట్రానొమీకళయు చదివెనందురు. అచట నీయనకు నేర్పినది జెనో సెంట్రిక్కు (భూమధ్యసిద్ధాంత) విధానమే నైయుండెను (భూమధ్యసిద్ధాంతము చూడుడు)

గొప్ప విద్వాంసుడగుటయు, క్రైస్తవ మతాభిమానియగు భక్తుడగుటయు, నట యుపాధ్యాయపదవియందు కొంచెము కాలముండెగాని దానిని వదలి బాల్టిక్కు సముద్ర తీరముగాను ఫ్రానబర్గుపురపు కెథీడ్రలునందు శెనన్ యుద్యోగిగ ప్రవేశించెను.

డెన్మార్కుభూపతికి కోపర్నికస్పండితుని గణితశాస్త్ర నిపుణతయందు, జ్యోతిష (నక్షత్ర) కళా ప్రవీణతయందు బహునమ్మకముండి ఈయనను గౌరవించుచునుండువాడు. ఒకతరి నాణెములు ముద్రించుట కీగణితునితో యోచించి ఈయన యభిప్రాయము గైకొనియెనట. ఈయన పేరు ప్రతిష్ఠలుపెక్కండ్రు శిష్యుల నీతనికడ కాకర్షించుచుండెనట. క్రీ. శ ౧౫౧౪ ప్రాంతముల నైరోపాదేశముల కేలండరు సవరింపంబడుటయందీయన యభిప్రాయము గైకొనబడినది

ఈ విద్వాంసుని జన్మకార్యముగ బరిశీలించి గుడించి యొంర్చినది. టోలమీపండితుని భూమధ్య సిద్ధాంతము సరిగాదని లోకమునకు వెల్లడించి అంతకుపూర్వపువారగు అరిస్టోటల్ మొదలగు పండితవర్యుల సిద్ధాంతమగు హెలియో (సూర్య) సెంట్రిక్కు సిస్టమను స్థిరపర్చి యొక గొప్ప జ్యోతిష్యగ్రంథమును రచించుటయై యున్నది.

దానికి ప్రతిస్పర్థులు పెక్కండ్రుంట నాల్గువత్సరములవఱకు చెప్పబడలేదు. ఎట్టకేలకు ముద్రితమై వచ్చువఱకాతఁడు పక్షవాతరోగియై మంచముపై నుండి దానిం గాంచి యానందించి ప్రాణములు విడచెనట. లోకమునందీతని సిద్ధాంతమును వ్యాపింపఁజేసినవాఁడు, జాన్ కెప్లరు పండితుఁడు. (కెప్లరుపండితసిద్ధాంతము, ఎస్ట్రానొమీ, గాలిలియో, భూమధ్యసిద్ధాంతము చూడుఁడు.)

**కోప్టులు** (Copts) — క్రైస్తవులును మహమ్మదీయులును గ నున్నారు. ఈజిప్టుదేశపు ఆదిమనివాసులు. ఫెల్లాహీన్ (సేద్యవృత్తిగలవారు) అనఁబడుచున్నారు. వీరిలో క్రైస్తవుల మతాధిపతి అలెగ్జాండ్రియాయందున్నాఁడు.

**కోబాల్టు** (Cobalt) — ఇది ఒక లోహము. దీనికి Symbol Co. యనియు, Atomic weight 58.94 అనియు, Atomic number 27 అనియు, Specific gravity 8.50 అనియు, Melting point సెంటిగ్రేడు థర్మామీటరు 1500 డిగ్రీల వేడికనియు చెప్పఁబడినది. ఎఱ్ఱని ఊదాధాతువుం గల్గియుండు లోహము. గట్టిలోహము, నీటికి చెడదు.

ఉత్తర ఒంటారియో దేశమున కోబాల్టు మండలమున నిది దొరకుచుంట నీపేరు వానికయ్యెను. ఇది నికెలుతో కలసి దొరకుననియు, వెండిగనులందు దొరకుననియుం దెలియుచున్నది

**కోబ్లరీ** (Cobblery) — మరమ్మతు చేయు (Mend) కళ. కాలిజోళ్ళను మరమ్మతు చేయు కొడారిపని వానిని Cobbler అనియందురు.

**కోబ్డనిజమ్** (Cobdenisam) — Richard Cobden అను నాతఁడు ఇంగ్లాండునందు క్రీ. శ. ౧౮౦౪ సం॥ జన్మించిన ఘనుఁడు. ఈతఁడు Free Trade అనగా విదేశములనుండి దిగుమతి చేయఁబడు వస్తువులపై పన్నులు విధింపఁబడరాదను సిద్ధాంతమును నమ్మి బోధించుచుండువాఁడు. ఈతని మతమునకు Cobdenism అనియెదరు. ఈరాజకీయ మతావలంబకులు కలరుగాని లేకపోలేదు.

**కోమటులు** — ఆర్య వైశ్యులు చూడుఁడు.

**కోమకాయన గోత్రము**— సావాల గణము చూడుఁడు.

**కోమోరుద్వీపములు** — ఆఫ్రికా ఖండమునకుం జెందిన పండ్రెండు ద్వీపములు చూడుఁడు.

**కోయజాతివారు** — ఇది అడవిజాతులలో నొకజాతి. పాండవ ద్వితీయుండగు భీమసేనుని సంతతి వారమని వారనెదరు వీరింగూర్చిన గ్రంథములు గానరాకున్నను, వారి పూర్వచరిత్ర వారియాదిటుల వాడుక నందియున్నది. వీరియందు ప్రభువులకు టొరలని పేరు. ఇది ధొరయను పదమునుండి కల్గెనట. వీరికి పెద్దపులుల కధినాథుఁడగు కొర్రరాజు, బలులవలన సంతుష్టిం జెంది పంటలం బాడునట్లనుగ్రహించు మామిలమ్మ యను దేవతయు, భూదేవమ్మయను దేవతయు కులదేవతలుగ జెప్పుదురు. ఆదిని వేను చక్రవర్తి కుమారుఁడగు నిషాదని సంతతివారు అరణ్యములవసించుచుండ వారియందొక టొర (అధినాథున)కు ఆవనదేవతా వరప్రసాదముగ నొకసుందరాంగియగు పుత్రిక కల్గెననియు, అక్కాలమున పాండవులు తల్లియగు గొంతియాలమ్మ (కుంతీదేవి) తో అరణ్యమున నివసించుచు అచటి యడవిజాతుల వారికేయాపదలు రాకుండ రక్షించుచుండిరట. నిషాదసంతతి క్షత్రియులగు ప్రజలను రక్షకుండగు భీమటొర (భీమసేనుఁడు) యందు గౌరవాభిమానములతో ప్రవర్తించుచుండిరట.

ఇట్లుండినతరి నధిపతియగు టోరకుమార్తెచే భూదేవమ్మ మేకబలి నర్పించు సదనున నామె వీరనాట్య మొనర్చుచుండ భీమటోర గాంచుచుండెనట. నెమలిపించము, గారకొమ్ములు, పల్లికకుళ్లాయిం ధరించి, నారచీరం, బిగియుగట్టి గండ్రగొడ్డలిం జేబూని, వీరనాట్యమాడు యౌవనదేవతా ప్రసాద జన్మరాలగు యౌవనవతింగాంచి భీమటోరమోహించె, నామెయు నాతనిరూపలావణ్య బలముల కచ్చెరువంది యనురాగవతి యయ్యెనట. కులమువారీబంధుత్వమున కందఱు క్షత్రియులె గాన యంగీకరించి వారలకుం బరిణయ మొనర్చిరట. కులాచారము మేరకు ఆమెం గూర్చుండ నియమించి భీమటోరను వెనుక వంగొను నట్లొనర్చి కులాంగన లాంపకాయ తుంబలతో యువకము లాతని శిరముపై వాప నవి యూబాలమేని పైంబడ వివాహము పూర్తియాయెనట వారి సంతతివారె కోయజాతివారని చెప్పంబడినది.

**కోయంబత్తూరు జిల్లా** - దక్షిణ దేశములోనిది. చెన్నరాజధానిం జేరి యున్నది. కోయంబత్తూరు ప్రధాన స్థానము. ఇట వ్యవసాయక కళాశాల కలదు. ఈరోడు పట్టణము యినుపదారి కూడలిస్థానము. భవానినది కావేరిలో సంగమించు తావున భవానీకూడల్ అను పట్టణమును, అచటగల అమృతలింగ క్షేత్రమును సుప్రసిద్ధములు. కరూరు పట్టణము ఒకప్పుడీప్రాంత దేశమునకు రాజధానిగ నుండిన తావు

**కోయిలదేశము** - కోయిలుడను రాక్షసుని దేశము. వీనికి కోలుడనియుం బేరుండెనట. ఈరక్కసుడు బలరామునిచే నిహతుడైన వాడు. రాజధాని కోయిలపురము. ఇప్పటి సంయుక్త రాష్ట్రములలోని కోయుల పురము తొల్లింటి కోయిల పురముగ పోల్చబడినది.

**కోయిల్నది** — కోకిలా నది చూడుడు.

**కోరమ్** (Quorum) — రాజకీయ సంబంధమునగాని, పరిపాలన సంబంధమునగాని, వర్తకసంబంధమునగాని, ఇతర ఏవ్యాపార సంబంధమునగాని, తమ అభిప్రాయము నిచ్చు సభలందు అధమము ఇంతమంది చేరియుండనిచో వారి యభిప్రాయ మితర సభ్యులను లేక భాగస్థులను నిర్బంధించి బాధింప నేరకుండ నొక నియమము ఆదినాసంఘపు ఏర్పాటు కాలమున నిబంధన పత్రమున నేర్పాటుచేసికొని వ్రాసికొని యుండుట పద్ధతియై యున్నది. ఆ యధమపు సంఖ్య సభ్యులు కూడనిది అభిప్రాయము చెల్లదు. ఆ అధమపు సంఖ్యకే కోరమ్ అని వ్యవహార నామము

**కోరింత్ కెనాల్** (Corinth Canal)- గ్రీకుదేశపు తీరమున అథెన్సు గల్ఫు (Gulf of Athens) నుండి గల్ఫాఫ్ కోరింతు (పురము) దనుక త్రవ్వంబడిన సముద్రపు టొడ్డుల నడుమం దగిన కాలువ.

నాలుగుమైళ్ళ పొడవు, డెబ్బది రెండడుగుల వెడలుపు, ఇరువది మూడడుగుల లోతు గలది.

**కోరింత చెట్టు** (డొంక) - సం ఆధాకీ, కొందఱు ఆచార్య కాయనియనియు, ఖదిరవల్లి యనియు, దార్వీయనియుం గూడ వాడిరి దీనిని కంచెలకు (ముళ్లకంచెలుగాను) ఉపయోగింతురు. దీని వేరు, ఆకు, రసరూపమునను, కషాయరూపమునను వైద్యులుపయోగింతురు. విష దోషములను శమింపజేసి, కఫదోషము, క్రిమిరోగము, కుష్ఠరోగము, పాండురోగము, పైత్యము, శ్వేతకుష్ఠ (బొల్లి) లపై చక్కగ పని చేయునని చెప్పంబడినది. మఱియు దీని కాడల రసము (లేత పొర) పిల్లల కోరింత దగ్గుకు కుమ్ము సంకురు.

**కోరింత దగ్గు (Hooping Cough)**- ఇది అంటువ్యాధి. ఐదు సంవత్సరముల లోపు పిల్లలకు మాత్రమె సంభవించునట. ప్రాణాపాయకరమగు వ్యాధి. దీనిం గల్గించు సూక్ష్మజీవి కణికవలె నుండును. రోగితో సమీపమునం దుండుటయు, రోగి గుడ్డలు, దాహపాత్రలు, ఆట వస్తువులు సంపర్కము గల్గిన నితరుల బాలురం దీయంటువ్యాధి వ్యాపించును. నీటిమూలమునను, ఆహార పదార్థముల మూలమునను ఈ వ్యాధి వ్యాపించునది కాదని కన్గొనం బడినది. ఒకసారి యీవ్యాధి తగిలి కుదిరిన తిరిగి నీవ్యాధి అంటదు.

కుక్కలు, పిల్లులు మొదలగు పెంపుడు జంతువుల కీ సూక్ష్మజీవు లంటురోగము వ్యాపింపఁ జేయునని కన్గొనం బడినది. (అంటువ్యాధులు చూడుఁడు). దీనికి టీకాలు వేయు యత్నము లు జరిగెనుగాని ఏమంత ప్రయోజనము గలుగలేదు

**కోరింతు పురము** — గ్రీసుదేశము లోని పట్టణము (గ్రీసుదేశము చూడుఁడు).

**కోరియోగ్రాఫి (Choreography)**— జంగంకథలు, తందనాదములు మొదలగు వీధి గానములు (Ballad) మొదలగువానిని రచించు కళ. నాట్యముచేయుచు పాడుటకు వీలగు పాటలు రచించుటనుగుఱించినది. ఇది రష్యాయందును భరతదేశమున హిందీయందును అభివృద్ధి నందినది. దక్షిణహిందూస్థానమున ఆంధ్రమున సుప్రసిద్ధము. ఇంకను ప్రాచీనగుణతులమూలమున పాశ్చాత్యనాట్యకళ (Dance) వివరించు విద్య, లేక కళావిధానము.

**కోరిలేషన్ (Corelation)**- ఇది డైరక్టు కోరిలేషన్ అనియు, ఇవర్సుకోరిలేషన్ అనియు ద్వివిధము (చూడుఁడు) (స్టాటిస్టిక్సు చూడుఁడు).

**కోరుంగోలపురము** — ఏకశిలానగరము (తెలింగానాదేశము చూడుఁడు).

**కోరోగ్రాఫి (Choragraphy)** —వివిధ ప్రదేశములు వివరించుచు పటములు (Maps) గ్రాయు కళ.

**కోర్కెలేనివెట్టు తాడులేనికట్టు**- ఆంధ్రలోకోక్తి

**కోర్టిస్ (Courtice)** — నవీన కల్పిత నామము. ఇది Cranmer అను పేరు Canterbury Arch Bishop న్నామపేరు. పురుష నామము. (క్రైస్తవ నామములు చూడుఁడు).

**కోర్టుమార్షల్ (Court Martial)**— పటాలములందు తత్సంబంధనేరము లొనర్చిన సైనికులను విచారించి శిక్షించు సైనిక న్యాయస్థానము.

**కోర్మోజెనీ (Cormogeny)**— జర్మను పదజన్యము. వేర్వేరుజాతులప్రజలు,జాతీయులు, వీటి ఉత్పత్తి ఏర్పాట్లు విమర్శించి తెలుపు చారిత్రాత్మక పరిశీలన కళ.

**కోర్సికా ద్వీపము** — ఐరోపాఖండము నకుంజెంది ఫ్రాంచిదేశపు ప్రభుత్వము వారిదైన యొకద్వీపము. మధ్యధరాసముద్రమున సార్డినియా ద్వీపమున కుత్తరముననున్నది (ఫ్రాన్సుదేశము, ఐరోపాఖండము చూడుఁడు).

ఇది చాలచిన్నద్వీపము. ఎత్తైనపురాళ్ల కొండలమయమైనది ఎత్తైనశిఖరమున కెక్కి ద్వీపము చుట్టునుండు సముద్రము చూడనగునందురు. ఇందు కలపనిచ్చు గొప్పఅడవులుకలవు. కొండలనడుమలు ప్రత్యేక ప్రపంచములవలె నుండును. వ్యవసాయము చాలతక్కువ. వందలు వేల కొలదిచిన్న చిన్న కొండసెలయేరులుకలవు. సముద్ర

తీరములు చాలపల్లపు ప్రదేశములు, చాలఅనారోగ్యవంతములు, జ్వరములకు పుట్టినిల్లనిపించును. వేసవికాలమున సందర్భి ప్రజలు ముఖ్యముగతూర్పు తీరమునందు వసించువారు జూలై ఆగష్టు నెలలు తమనివాసగృహములకు తాళములువైచి మధ్య భాగమున 3000 అడుగుల ఎత్తు ప్రదేశముల కేగి వసించుచుందురు. ఆవేసవియందు నటన్నిద్రించుట యన మృతికి తలుపు తెరచుటయెనందురు.

కాని ఆప్రదేశములు చూచ సౌందర్యవంతములు అచ్చటచ్చటనున్న కొద్దిపాటి పొలములు, ద్రాక్షతోటలు, చెట్లుచేమలు, తంపరలు రమ్యముగ నుండును ఇటీవల ఫ్రెంచిప్రభుత్వమువారు అనారోగ్యమును జ్వరములను నిరోధించుటకు యూకలిప్టసుతోటలను విరివిగనాటించి పెంచుచున్నారు

తూర్పుతీరమున తంపరలు మొదలగసరస్సులు ఉప్పునీటివి విస్తారముకలవు. అందు ముఖ్యమగునది దియానా సరస్సు చాలాపెద్దది సముద్రమునట్టు చిన్నమార్గముకలదు. దానియందు ౪౬౦ గజముల చుట్టుకొలతగల చిన్నద్వీపమును అంగ చెట్లు తుప్పలనుగల్గి Oyster shells తో కల్పింపబడిన భూమికలది. ద్వీప మధ్యమునందుగల కొండలగుండా తూర్పునకు పడమరకు సముద్రతీరములకుం జేర్చు సన్నపు లోవలుకలవు. అట నిరుదెసలం గల కొండలు మూడు లేక నాల్గు వేల అడుగుల ఎత్తుగనుండును.

ద్వీపమున- ఫ్రాన్సు వైపునుండివచ్చు Mistral ప్రచండశీతవాయువును, ఆఫ్రికాలోని సహారా ఎడారినుండి వీచు Sirocco ప్రచండ ఉష్ణవాయువును అప్పుడప్పుడు వీచుచు చాల నసౌఖ్యముం గల్గించుచుండును.

ఈద్వీపపు పూర్వచరిత్ర కనికరము గల్గించునదిగాని శ్లాఘ్యమగునదికాదు. ప్రజలు మహావీరులు. తమస్వేచ్ఛకై ప్రాణములనైన విడువ సంసిద్ధులై యుండినవారు. అట్టివారు పడిన కడగండ్ల తెలుపు చరిత్ర రుచికరముగానుండదు. వీరెవ్వరిని బాధించిగాని అన్యుల ఆస్తులకాసించిగాని ఎరుగరు. అట్టివారు కార్తేజి, గ్రీసు, రోము, పైసా, జినోవా వారల దండయాత్రముట్టడి పరిపాలన బాధలకులోనైరి. తొలుత క్రీ పూ రెండుమూడు వందల సంవత్సరములకుం బూర్వమె కొంతకాలము కార్తేజనియనుల క్రిందనుండి అప్పుడు రోమనులక్రిందికి వచ్చెను. రోమనులనాటి వారిప్రధాన సెటిల్మెంటు దయానా సరస్సుకడనున్న ఆలేరియాపురము. నూరు సంవత్సరముల కిష్టములు ఉభయులకు కొంతవఱకు సఖ్యములవడం జేసెను. ఒకరోమను సేనానిం బట్టుకుని నిర్బంధించి బలాత్కరించి యొకసంధిపత్రమున కొడంబఱచి స్వదేశమునకనిపిరి అనేకసార్లు తిరగబడిరి. సముద్రతీరము లందు మాత్రమె రోమనులు తమయధికారము నిల్పుకొనగల్గిరి.

రోమనుల యధికారము బడద్రోచిన Goths, Vandals అనువారు తరువాత నీ ద్వీపముపై దాడయాత్రసల్పిరి పిదప మూరులు (మహమ్మదీయులు) క్రీ. శ. ౭౩౦ లో దాడి వెడలిరి. క్రీ. శ. ౧౦౦౦ లో కొందఱు ఐరోపా సామంతప్రభువులు (Lords) కూడి నడుమనొక గిరిపై దుర్గము నిర్మించి యది రాజధానిగం జేసిరి. ఆతావునకు దానినుండియె కోర్టి (Corte) అని పేరు కల్గెను. వారిపరిపాలన క్రూరమై రొయ్యి తిడింగలదిగా నుండినందున తిరుగబాటు లధికమై వారి బలము సన్నగిలిపోయెను.

మూరులనుండి పైజాదేశస్థులు లాగుకొనిరని నిదర్శనములుకలవు. పదునొకొండవ శతాబ్దాంతమునసిది జరిగియుండనోపు. క్రీ. శ. పదునాల్గవ శతాబ్ద మధ్యకాలమున నీద్వీపము Genoese

హస్తగతమాయెను. వారు క్రీ. శ. ౧౭౬౮లో ఫ్రెంచివారికి దీనిని విక్రయించి మూల్యము గొనిరి. కాని వేఱుకారణముల ౧౭౯౩ మొదలు ౧౭౯౬ వఱకు మూడేండ్లు బ్రిటిషువారి హస్తగతమై వారినుండి తిరుగ ఫ్రెంచివారికిం జేరిపోయి నేటికి నట్లేయున్నది. చరిత్రయందును తిరుగుబాటొనర్చిన వారినాయకులకథలతో నిండియుండుట గాననగును.

అజాక్సియోపురము పశ్చిమతీరమున ప్రధానకార్యస్థానములున్న తావు. ఇచటనుండినట్లు చెప్పఁబడిన దర్గనిప్పుడు గానరాదు. ఇప్పటి అజాక్సియోపురము క్రీ. శ. ౧౬వ శతాబ్దమున జినోయీస్ వారివలన నిర్మింపఁబడినది. బహుశః పూర్వపు అజక్సియోయుండిన తావునకిది దక్షిణముగా మైలుదూరమునందు కట్టఁబడినట్లు తెలుపఁబడుచున్నది. ఇండ్లు చాల పొడవైనవి. వీథిబాటల కిరుదెసలను నారింజచెట్లు, నిమ్మచెట్లు, తాటిచెట్లు నాటఁబడినవి కలవు. ఇండ్లన్నియు రంగులుపూయఁబడి కెరటములు లేని సముద్రపునీట నుదయకాలమున నద్దమునందువలె ప్రతిబింబించుచుండును. ఈయిరోపాఖండకల్లోలముఁ జేసి విడచిన నెపోలియన్ బోనపార్టుయొక్క స్వస్థలము, జన్మస్థానము. ఈపురమున నాయన పేరంబరగు వీథులు, దేవాలయములు, మ్యూజియములు, వీథులందాయన విగ్రహములు మొదలగునవి కలవు. వానినివాసభవనము వేఱొకతోటయందలి విశ్రాంతిగృహము చూడఁదగినవి. మూడంతస్తుల భవనము. ఈయింట ఆయన క్రీ. శ. ౧౭౬౯ ఆగష్టు ౧౫ ని జన్మించెనట. ఈగృహమున్న పురభాగమునకు Letitia అనియెదరు. ఇంటిని La-Maison Napoleon అనుచున్నారు. తల్లిగారిపేరు Madame Letitia. వేఱొకతోటయందలి విశ్రాంతిగృహమునకు Villa Milelli అనిపేరు. ఇందు వేసవియం దాకుటుంబము నివసించుచుండెడిదట.

బానిఫేషియో, కాల్వి, సాన్ ఫ్లారెంటు, బస్తియా, అజాక్సియో యనంబడునైగు కాలనీలను జినోయీసుల నాఁటివని చెప్పఁబడినది. కాల్విపురమున క్రిష్టఫరో కొలంబసునావికుఁడు జనించినగృహముకల దని నమ్మఁదగినది. తియోడోర్ పురము, అవేరియా, పియానా, యనంబడునవి ఇతరపురములు. కోర్సికాసార్డినియాల నడుమ జలసంధికి బానిఫేషియో జలసంధియని పేరు.

**కోర్స్ ఆఫ్ ఎక్సుఛేంజి** – (వాణిజ్య సంబంధ పరిభాషాపదము). Course of Exchange - ఒకదేశమునందు వాడుకయందున్న నాణెములయం దింత సొమ్ము వేఱొకదేశపు నాణెములయందింత యగునని (Equivalent money) చెప్పినలెక్క.

**కోర్టునే** (Courtenay) — నవీనకల్పిత నామము. ఇాను Cranmer అను పేరు Canterbury Arch Bishop స్వామి పేరు. పురుష నామము (క్రైస్తవ నామములు చూడుఁడు).

**కోలగిరి**—కొడగు(Coorg)నకు కోలగిరి యనునది తొల్లింటిపేరు. మహాభారతము సభాపర్వము 30 యందు ప్రశంసింపఁబడినది. ఇది కోల్వగిరి యని అగ్నిపురాణము ౧౦౯ యందు చెప్పఁబడినది.

**కోలన్** (Colon) — ఇది యాంగ్లభాషా సాంగత్యమునుండి యాంధ్రభాషకొనికి తెచ్చుకొనిన యొక గురుతు. ఇది ఫుల్ స్టాపువంటిదే. వేఱ్వేఱు ఊహాలను వివరించు రెండు ప్రత్యేక ప్రత్యేక వాక్యముల కేదేని సంబంధమునుంచుక గలదేని వానిరెంటికి నడుమ నీకోలన్ ఇడుదురు.

**క్రోలపర్వతపురము** — ఇక్కాలమున కులియాపహాడ్పూర్ అనబడుచు బంగాళరాజ్యమున నదియా (నవద్వీప) మండలమున నున్నది. గంగానది ముఖద్వారమున తొల్లియుంట సముద్రగారి (సముద్రగతి) యనంబడుచు నుండెను. తర్వాత గంగానది ప్రవాహగతిమారి వేఱు తావున సముద్రముం జేరుచున్నది.

**క్రోలపాలకూరచెట్టు** — సం. అర్కపుష్పికా, పయస్యా, పోటగలా, క్షీరవృక్షః. కూర గురుత్వముగనుండి, చలవజేసి, వీర్యపుష్టి నొసంగి, వాతశ్లేష్మములను వృద్ధినొందించును. స్త్రీల గొడ్డుతనము (వంధ్యాదోషము) నివారించును. దేహపుష్టినిచ్చి, శరీరమును ముడతలు పడనీయకను, తలవెండ్రుకలు నెరయకుండగను ఆపును. స్త్రీలకు ప్రసవించినపిదప పాలుపడంజేయును. పైత్యము, మేహము, నేత్రరోగములు వ్రణములు శమింపఁజేయును

**క్రోలఆడితే క్రొత్తిఆడుతుంది** — ఇట కోల అనగా, కోతికి విద్యనేర్పిన చేతికఱ్ఱ. (ఆంధ్రలోకోక్తి)

**క్రోలాచల (పర్వత) ము** — గయలోని బ్రహ్మయోనిపర్వతము. కొందఱు పరిశోధకులు పొరబడి కోలాచలము, కోలాహల పర్వతము నొకటియె నని వ్రాసిరి. కాని అది సరికాదు. రెండును వేఱ్వేఱు పర్వతములు. దీని ప్రశంస వాయుపురాణము ౧-౪౫ యందుకలదు.

**క్రోలాహలపర్వతము** — మకుళ పర్వతము చూడుము.

**క్రోలాహలుఁడు** — తండ్రి హిమవంతుఁడు, తల్లి మేనక, సోదరుఁడు (జ్యేష్ఠ) మైనాకుఁడు, భార్య శుక్తిమతి, కుమార్తె గిరికాదేవి, (ఈమె వసుమహారాజు భార్య).

శుక్తిమతీనది కోలాహల పర్వతము ప్రక్కంబడి ప్రవహించు చుండును.

విద్వజ్జన కోలాహలుఁడను పేర నింకొక వ్యక్తి యుండినటుల పుక్కిటి పురాణముల వలన దెలియు చున్నది.

**క్రోల్హాత్రివారు** — చోటా నాగపూరు ప్రోవిన్సు నందున్న కొండజాతి ప్రజలు. (చోటా నాగపూరు ప్రోవిన్సు చూడుఁడు).

**క్రోవర్డేల్** (Coverdale)- నవీన కల్పిత నామము. ఇంకు Cranmer అను పేరు. Canterbury Arch Bishop స్వామి పేరు. పురుష నామము. క్రైస్తవ నామములు చూడుఁడు.

**క్రోవలె గోపరాజు కవి** — ఆంధ్ర కవులలో నాథునికులంనుపరిగణింపఁబడినవాఁడు. ఆరువేలనియోగి బ్రాహ్మణుడు, హారితసగోత్రుడు, తండ్రిపేరు కసవరాజు, తల్లిపేరు కామాంబ, తాతపేరు గోపరాజు. కసవరాజు వేము గల్లు పురాధీశ్వరుఁడగు మల్లరాజాస్థానమున మంత్రిగ నుండెనట. ఈతఁడు రచించినది "ద్వాత్రింశత్సాలభంజిక" పద్యకావ్యము. ఇది ముప్పది రెండు కథలు విక్రమార్క సింహాసన సంబంధమైనవి.

**క్రోవాపరిశ్రమ** — హిందీభాష యందు కోవా యనంబడు దానిని వంగభాష యందు ఖోయా యనెదరు. అగ్నిపై పాలం గాచుచు దానయందలి జలపదార్థము నావిరిగ నెగిరిపోవం జేసిన నాయుగ్ని తప్తమైన క్షీరములు చిక్కఁబడి గట్టిపడిన రూపమే కోవా యనంబడును. దీని నినుప బాణలియం దదేపనిగ కలియఁబెట్టుచు చేయుదురు. ఈ స్థితియందు క్షీరములు చెడిపోవక చాలకాలము నిల్వయుండును.

మఱియు కోవా, పెక్కు విశాఖులు చేయ నుపయోగించును. తాజాపాలం గాచి చేసిన కోవా మిగుల రుచ్యమై చిరకాలము నిల్వ యుండెను. వర్తకపు లాభమునకుంగాను మైదా పిండి, ఆరోరూటు పిండి మొదలగునవి దీనికిం గల్పుగురు గాని దాని రుచిం దగ్గిపోవంజేయును. చిరకాలము నిల్వయు నుండక చెడిపోవును.

కోవాయందు క్షీరములందుండు ద్రవ్యము లన్నియు నుండుంగాని నాటి వాటి భాగముల పరిమితియందు మార్పు గల్గును. పాలయందలి యోగ్యతలంబట్టి కోవాయందలి రుచులుండెడిని.

**క్రోవిలదుంపచ్చెట్టు** — శింగాడాదుంప (శింగాణాదుంప). దీనిదుంప వైద్యోపయోగ మైనది. సం త్రికోణ, జలకంద, శృంగాట, త్రికోణఫల, శింగాడాదుంపయని వాడుకయుం గలదు. కొన్ని తావుల పరికె గడ్డయందురు. మల బద్ధముగల్గించి వాత, పైత్య, శ్లేష్మములను ప్రకోపించుననియు త్రిదోషకరమైనదనియుం జెప్పం బడినది. అపథ్యమై దోషయుక్తమైనది

**క్రోశన గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు

**క్రోశములు(నంచి లేక తిత్తి)ఐదు-** వాసుదేవమననమునందు ౧. అన్నమయకోశము (స్థూలశరీర సంబంధము), ౨. ప్రాణమయకోశము, 3. మనోమయకోశము, ౪. విజ్ఞానమయకోశము (ఈ మూడును సూక్ష్మశరీర సంబంధములు), ౫. ఆనందమయకోశము (కారణశరీరసంబంధము). వాసుదేవమననము వేదాంతశాస్త్రగ్రంథము.

**క్రోశానది** — కమస్వతి చూడుఁడు.

**క్రోశిలానది** — తొల్లింటి కుటికానది చూడుఁడు.

**క్రోష్టు** (చంగల కోష్టు లేక చంగల్వ కోష్టు) — లా. **Aplotaxis Auriculata** అరియు, **Saussserea Lippa.** ఇంగ్ల **Costus**. సం. కుష్టం, కుష్టః, పాకులం, హారి భద్రకం, హారిభవ్యకం. ఇది వేరు. దీనిచూర్ణ మును కషాయమును ఆయుర్వేద వైద్యులు ఉపయో గింతురు లోనికిచ్చిన వేడిచేసి త్రిదోషములను శమింపజేయుననియు, దోషజ్వరము (Typhus fever) నడంచుననియు, కుష్ఠురోగము, దురదలు, మూలవ్యాధి, విషదోషము, విసర్పి, సర్వ జ్వరముల నడంచి నివారించుననియు, దేహమునకు బలము, పుష్టి, వీర్యమునకు బలముంగల్గించు ననియుఁ జెప్పబడినది

**క్రోష్ణ గోత్రము** — ఔతథ్య ఉప గణము చూడుఁడు.

**క్రోసారికాదేశ ప్రభుత్వము** — మధ్య అమెరికాఖండ ప్రజా ప్రభుత్వము. ఇరువది మూడువేల చతురపు మైళ్ళ వైశాల్యమనియు, ఐదు లక్షల జనసంఖ్య యనియుం జెప్పఁబడినది.

**క్రోస్టారీకా (వజాపరిపాలన దేశము** (Costa Rick Republic) — ఇది మధ్య అమెరికా యందున్న ప్రజాస్వపరిపాలన దేశము. ౨3,౦౦౦ చతురపు మైళ్ళ వైశాల్యము కలది. ఇందు ఇంచుమించు ౨,౫౦,౦౦౦ జనులు వసించుచున్నారు. కోస్టారికాపురము ప్రభుత్వ స్థానముండిన తావు. (మధ్యఅమెరికా చూడుఁడు).

**క్రోహలగోత్రము** — శాండిలగణము చూడుఁడు. సావులగణము చూడుఁడు.

**క్రోశ్వరనాగము** — తొల్లింటి క్రమ సరస్సు మత్స్యావతార స్థలము. కాశ్మీరదేశము చూడుఁడు.

**క్రోస్టులాండు ప్రోవిన్సు**-ఆస్ట్రియా దేశము చూడుఁడు.

**కోహినూర్ వజ్రము**— ఇది గోదావరి నదియందు దొరకినదనియు నందురు. మఱికొందఱిదియె శ్రీకృష్ణుం భ్రమింపంజేసిన శమంతకమణి యనియుంగూడ గోదావరీ నదీతీరవాసు లనుటయుం గలదు. కాని దీని పూర్వచరిత్రం గూర్చిన నిదర్శనము లేనియుం గానరావు. ఎట్లైనను కొన్ని వేల సంవత్సరములకు ముందది గానోపు. ఎట్లట్లో మాళవదేశముకుం జేరి ఆయధిపతినుండి క్రీ. శ. ౧౩౦౪ లో మొగల్ సామ్రాజ్యాధిపతుల వశమయ్యెను. ౧౭౩౯ లో పారశీకుఁడును, పరాక్రమవంతుఁడు నగు నాదర్షా హస్తగతమై అతఁచే కోహినూరని నామముం బడసెనట. కోహినూరనిన తేజోమయ పర్వతమని అర్థ మ భాష యందర్థము. (కోహి=పర్వతము, నూర్=వెలుతురు).

నిదర్శనములు లేకున్నను ఈరత్నము నాదర్షా హస్తగతమగుట కొకగాథ కర్ణాకర్ణికగా దేశమునంగు వ్యాపించినది కలదు. అద్దానిట వివరించుట సమంజసము. కోహినూరు వజ్రము పామహామ్మద్ వశమునం దుండెడిదట. అయనదీనిని వీడక తన తలపాగాయం దెప్పుడుంచుకొను చుండువాఁడట. వీరియుభయుల కొకతరి నొకగొప్ప విందు జరుగుచుండ నామహానోద సమయమున నవరత్న ఖచితమై గొప్ప మాత్రికమణి విరాజితమైన నాదర్షా మహమ్మదీయ మతాచారమైన పద్ధతి మేరకు నాదర్షా తనకిమ్మల్మైన మైత్రిం బ్రకటింప నిండుసభయందు తనకిరీటమును పామహామ్మదు శిరమునం డిడి యాతని పాగను తనతలపై నుంచుకొనెనట. పామహామ్మదు తెలిసియో తెలియకయో చేయునదిలేక యూరకుండ నయ్యెనట.

ఇాకఁ గొంతకాలమునకు కోహినూరురత్నము రంజిత్సింగు (సిక్కుల చక్రవర్తి) హస్తగతమై ఆయన తరువాతి ప్రభువునకుం జేరి క్రీ. శ. ౧౮౪౯ లో సిక్కుసామ్రాజ్య పతనముతో ఈస్టిండియా కంపెనీవారి సైనికులగుండా కంపెనీవారి వశమాయెను. కంపెనీవారి యుద్యోగియగు డల్హౌసీ ప్రభువు విక్టోరియా మహారాజ్ఞిగారికి సమర్పించెను. అప్పటికీయది సానంబట్టంబడియుండక ౧౮౬ రతుల తూనికంగల్గియుండ నదియధికమగు బరువుగ నుంటయు ఎక్కువ నేర్పరులగు ఆంగ్లపనివాండ్రచే సానఁబట్టబడక యుంటయుఁ దలంచిగాబోలు నద్దానిని విక్టోరియా మహారాజ్ఞి ౧౦౬ రతులకు దగ్గియుండునటుల తిరిగి సానంబట్టించి తమసామ్రాజ్యపుఁ గిరీటమున మకుట స్థానమున బిగింపించి ధరించుచుండెను. నేఁటికిని బ్రిటీషు సామ్రాజ్యపు కిరీటమునందె యుండియున్నది. దీనిచరిత్రయుం దింతవనుకఁ గోహినూరివ్వరి చేతను అమ్మఁబడలేదు; కొనఁబడలేదు.

**కోహిరాశాఖ క్షత్రియులు** — ప్రమారశాఖ క్షత్రియులు చూడుఁడు.

**కోక్ష గోత్రము** — ఉపమన్యుగణము చూడుఁడు.

**క్రోఆటియా** హంగేరీదేశము చూడుఁడు.

**క్రోకెట్ ఆట** (Croquet)—ఈయాట నొక గడ్డిమైదానముపై ముప్పదిరైదు గజముల పొడవును, ఇరువదియొన్మిది గజముల వెడల్పును గల రంగప్రదేశమున ఆడుదురు. ఈ రంగప్రదేశమునకు మూలలందుకొండాలువై చెదరు ఎఱుపు, నలుపు, ఊదారంగు, పసుపుపచ్చ నాల్గురంగుల నాల్గు బంతులను పొడుగాటి చేతికఱ్ఱలం బోలిన యాటపరికరములతో నాడుదురు. ఈ యాట కఱ్ఱలకు Mallet లనిపేరు. బంతుల అడ్డ కొలత 3½ అంగుళములుగ జెప్పఁబడినది. ఒక కొన నుండి రెండవకొనకును, అటనుండి తిరుగ మొదటి

కొనకును బంతులంగొట్టుచు నడపు మార్గముల ఇరుదెసలను భూమిపై పంద్రెండంగుళములు పొడవుగ దిగగొట్టు కొయ్యలకు Hoops అనియు, కడలందు గురుతులుగ దిగగొట్టు కొయ్యలకు Pegs అనియు గురుతులు. పెగ్సు భూమిపై అడుగున్నర యొత్తునటుల దిగగొట్టంబడిన కొయ్యలు. ఇందు నిరుకక్షులుగ ఆటకాండ్రు ఆడుదురు. ఎఱుపు, పసుపురంగుల బంతుల నొకకక్షవారును, ఊదా నలుపురంగుల నొక కక్షవారును గైకొని యాడుదురు. ఈ యాటకు నిబంధనలు, విధులు విస్తారముగగలవు. వాటిం జక్కగ గమనించవలసియుండును.

**క్రోడ దేశము** — కొడగు దేశము చూడుడు.

**క్రోధన (క్రోధిన) గోత్రము** — ఉపమన్యుగణము చూడుడు.

**క్రోధము** — (Indignation) ఒకప్పుడు మరుగుపడియుండియు భరింపరాని దయ్యేనేని ఒకప్పుడు మనస్సును కలవరపరచును. శరీరమునందొకవిధముగా ప్రవహించుచున్న రక్తమకాత్తుగానాగి ఎక్కువయైనిలచి అతిత్వరితముగ మేనబర్వుట నారంభించును అట్టితరి నాడియు త్వరితగతిం గొట్టుకొనసాగును. రక్తము ఎక్కువవేడికలదగును శరీరమున సామర్థ్యము కొంత ప్రకోపించుటంజేసి శరీరమును కొంత వేడి యెక్కును. ఇట్టితరిని వర్ణించిచెప్పుచో "My blood boils" అందురు. కాని రక్తము నిజముగా Boiling point వేడికిరానేరదు.

**క్రోధవశ** — దక్షప్రజాపతి కుమార్తెలలో నొకతె. కశ్యపునిభార్య

**క్రోనోగ్రాఫీ** (Chronography) — కాలమును అప్పటికి జరిగిన సంగతులను వ్రాయుట తొల్లింటివారెఱిగినపనియే. దానిని History అనుటయుంగలదు. అట్లు వ్రాయు నాతని చరిత్రకుండని (Chronographist) అనియెదరు. వ్రాయగలుగు నేర్పును లేక వ్రాయు విద్యకు Chronography అనిపేరు. వ్రాయఁబడిన చరిత్ర గ్రంథమును Chronograph అనియెదరు.

**క్రోనోఫర** (Chronopher) — కాలమును నిష్కర్షగ కొలుచు పరికరము. ఇది Electricity బలమువలన Time signals ను తెల్పెడిపరికరము. (Chronometer చూడుడు).

**క్రోనోమీటర** (Chronometer) — కాలమును నిష్కర్షగ కొలచుపరికరము. ఇది గుఱ్ఱపుపందెములు, మోటారుపందెములు, నాడి కొట్టుకొనుట మొదలగు పనులయందెంత స్వల్ప కాలపరిమితినైనను స్పష్టముగా దెలుపును.

**క్రోనోలాజి** (Chronology) — ఆయా కాలములందు జరిగిన సంగతులకు కాలములం గుదర్చుకళ. కాలములంబట్టి వరుసగ జరిగిన సంగతులను గుదిర్చి వివరించునేర్పు. కాలము (సంవత్సర, నెల, తేది, గంటలు మొ) క్రమముగ వరుసగ నుండునటుల జరిగిన పనులను వరుసగ నమర్చుకళ. ఇట్లమర్చబడిన వరుసకు Chronological order అనియెదరు. ఈ విద్యకు Chronology అనిపేరు.

**క్రోన్స్టట్ కెనాల్** (Kronstadt Canal) — రష్యాదేశములోని ఓడలు నడచుటకుం ద్రవ్వఁబడిన ఓడలకాలువ. పదునారు మైళ్లు పొడవు. నూటయేబది అడుగుల వెడల్పు. ఇరువది అడుగులలోతు గలది. ఇది లినిన్గ్రాడు పురమునకు నోడలు పోవునటుల త్రవ్వంబడినది. యింక మొదటి పది మైళ్లనిడివానదిం ద్రవ్వి లోతుగ జేసి ఇంకను కల్పియున్నారు. తక్కిన భాగము త్రవ్వంబడినది.

**క్రోనోస్కోపు (Chronoscope)** — కాలమును నిష్కర్షగ కొలుచు పరికరము. ఇది ఎంత స్వల్పాతిస్వల్పకాలభాగమునైనను నిష్కర్షగ దెల్పెడిపరికరము. (Chronometer చూడుడు).

**క్రోమియమ్ లోహపుపూత పరిక్రమ (Chromium)** — విద్యుచ్ఛక్తి సహాయమునఁ జేయఁబడు మరియే యితర లోహపుఁబూతయును, క్రోమియం పూతయంత ప్రతీతిని గాంచి యుండలేదు. కొన్ని సంవత్సరములకుఁ బూర్వము ఈ Chromium లోహమునకు వర్తక ప్రాముఖ్యతయే లేదు. అమెరికా ఖండమునందలి Sargeant అను నొక మహానుభావుఁడు ఈలోహపు టుపయోగమును చూపించి Electro-plating చేయువారి కన్ను విప్పెను. అతి స్వల్పకాలములో నిపుడు దాని గిరాకీ యపరిమితమై పోయినది. ప్రతి వర్కుషాపు (కర్మాగారము) లోను నిపుడు Chromium Solution ఉపయోగింపఁ బడుచున్నది. దీని సాహాయ్యమున Electro-plating లో క్రొత్తక్రొత్త పద్ధతులు కనిపెట్టఁబడు చున్నవి.

Chromium లోహము నుపయోగించు వివిధ రీతులు- ఈలోహమున కింత ప్రాముఖ్యత గలుగుటకు ప్రకృతి సిద్ధములైన దీనిమూడుగుణములు కారణములు.

౧. ఒక్క Hydrochloric Acid వలనగాని, మరి యెట్టి పరిస్థితుల యందును ఈలోహము త్రుప్పు పట్టదు.

౨. అంగారార్థము మెఱుగు పెట్టుటకు అందలి యత్యధికమగు తేటు

3. ఇదివఱకు కనిపెట్టఁబడిన లోహములలో దేనికిని లేని గట్టిదనము.

ఇండ్లయందు సాధారణముగా నలంకరించుటకు వాడుక చేయఁబడు పద్దపు చట్రములు మొదలగు ప్రతి వస్తువునకు ఈకాలములో Chromium Plating చేయఁబడు చున్నది.

స్వయంచలనముగల ప్రతి యంత్రముయొక్క భాగములును, ఉపభాగములును తప్పనిసరిగా క్రోమియం పూత పూయఁబడుచున్నవి. ఇందు వలన నరుగుదలమాట యటుండఁగా గీటు మాయుటకైనను కలుగఁబోదు. అనఁగా మెఱుఁగుతగ్గుట మాత్రము పోదన్నమాట.

ఈ లోహములో కేవలము మెఱుఁగు మాత్రమేగాక మన్నికయుఁగూడఁగలదు. స్వయంచలన యంత్రములయందలి Bumper బారులకును, Radiator లకును, Lamp లకును ఈ కారణము చేతనే తఱుచుగా Chromium పూత పూయఁబడుచుండును. ఇంజనీయరింగునకు సంబంధించిన సున్నితములైన యంత్రముల భాగములకు Ganges మొదలగువానికి ఏమాత్రమును నరుగుదల లేకుండ కాపాడుటకై క్రోమియంపూత పూయఁబడును. అందువలన వాని నిర్దిష్టపరిమాణములయందు నూలివాసి యైనను అరుగుదల కలుగనేరదు.

రబ్బరు తయారుచేయు పరికరములకు Chromium పూతపూసినయెడల Vulcanization విధానమునందు ప్రయోగింపఁబడు రసాయనికవస్తువుల సంయోగమువలన నెంత మాత్రము ప్రమాదము గలుగదు. చిన్నచిన్న సీసాలను అసంఖ్యాకములుగా తయారుచేయు ఉక్కు అచ్చుదిమ్మెలకు Chromium పూత పూసినయెడల వానికి మరి చలనముండదు. Chromium పూత వెండిపూతవలెగాక ధృవముగా నుండిపోవును.

క్రోమియమ్పూతకు ద్రావకముచేయువిధము- Chromium Plating Solutions తయారు చేయుటకు పలువిధములగు మార్గములు గలవు.

గాని సార్జెంటుగారి స్వంతయోగ మీ క్రింద వివరింపఁబడినది:-

| | | |
|---|---|---|
| Chromic Acid | 40 oz | 250 grms |
| Sulphuric Acid | 0·4 oz | 2·5 grms |
| Distilled water | 1 gallon | 1 litre |

ఇందులో Chromic acid నకును Sulphuric acid నకును గల పాళ్ళు ముఖ్యముగా గమనింపఁదగినవి. పాళ్ళు భేదించిన యెడల ద్రావకము బలహీనమయిపోయి ఫలితము తృప్తికరముగా నుండదు. దీనికి కారణము నిరూపింపఁజాలముగాని అనుభవమువలన నెఱింగిన రహస్యమిది. Solution ను అప్పుడప్పుడు Test చేసిచూడఁగా Sulphuric acid అధికముగా నుండినట్లు కనుఁగొనఁబడుచున్నది. అప్పుడు Lead Chromate వేసి కలియబెట్టినయెడల Lead Chromate + Suphuric acid = Lead Sulphate + Chromic acid అగును. Lead sulphate ద్రావకములో కరుగనందువలన క్రిందికి దిగిపోవును. ఏవస్తువు నెంతమట్టున కుపయోగింపవలెనో తెలిసిన రసాయనిక శాస్త్రజ్ఞానము కలవానిచేతనే యీపని చేయింపవలయును.

సర్వసాధారణముగా పై Solution నే ప్రస్తుత ముపయోగింపఁబడుచున్నను కొంతమంది పరిశ్రామికులు గాలను 1 కి 50 మొ॥ 60 ఔన్సుల క్రోమిక్ ఆసిడ్ గల ద్రావకము నుపయోగించుటయే యుక్తమని చెప్పుచున్నారు. ఇందువలన మరికొంత వ్యయము తప్ప మరియేమియు ప్రయోజనము లేదని మా కొందఱభిప్రాయపడుచున్నారు.

అందుచే Plating చేయువారు తమ యనుకూల ప్రతి కూలములను కొంచెము కొంచెము రెండు రకముల Solution తోడను, Experiment చేసి చూచుకొని వలసినదేగాని, ఉపదేశముల వలన లాభము లేదు.

Solution మెంటెయిను చేయు మార్గము:- Solution పరిశుభ్రమైన ద్రావక స్థితి (Liquid state) లో నుండునట్లు ప్రమత్తులయి చూచుచుండవలయును. ఎందుకనఁగా ద్రావకములోఁ గరగని వస్తువు లందులోఁ జేర్పఁబడు చున్నవి. అంతే గాక Chromic acid న్ను, Sulphuric acid న్ను కలుపు పాళ్లలో కొంచె మెచ్చు తగ్గులు కూడ నంగీకరింపఁబడు చున్నవి.

తక్కిన వస్తువు లన్నిటికన్న Chromic acid ఇందు ప్రధానమయినది. దీని ధర్మమును బట్టియే Solution పని చేయుచున్నది.

ఈ క్రింద వివరింపఁబడిన పట్టీనిబట్టి యేపనికి నేసమయము నందు ఎంత Chromic acid ఉపయోగింపఁ బడవలెనో వ్యక్తమగును.

| Beaume | Sp. G | Grs. per litre | Oz. per Imp. Gal |
|---|---|---|---|
| 10 | 1.07 | 100 | 16 |
| 11 | 1.08 | 114 | 18.2 |
| 14 | 1.10 | 143 | 22.9 |
| 16 | 1.12 | 171 | 27.4 |
| 18 | 1.14 | 200 | 32 |
| 20 | 1.16 | 229 | 36.6 |
| 21 | 1.17 | 243 | 38 9 |
| 22 | 1.18 | 257 | 41.1 |
| 23 | 1.19 | 272 | 43.4 |
| 24 | 1.20 | 288 | 46.1 |
| 25 | 1.21 | 301 | 48 |
| 26 | 1.22 | 316 | 50 6 |
| 27 | 1.23 | 330 | 52 8 |
| 28 | 1.24 | 345 | 55.2 |
| 29 | 1.25 | 360 | 57.9 |

ద్రావకము Chromium deposition కొఱ కుపయోగింపఁబడు నపు డా Temperature లోఁ గొంత యావిరియై పోక తప్పదు.

ఈనష్టము భర్తీచేయుట కడప దడప కొంచెము కొంచెము జలము చేర్చు చుండ వచ్చును.

కావలసిన తొట్టెలరకములు- స్వల్పద్రావకముతో జేయు పరిశోధనవిధానములకు గాజు తొట్టెలుగాని, రాతితొట్టెలుగాని చాలును వ్యాపారార్థమై భారీగా తయారుచేయవలసివచ్చినపుడు లోహనిర్మితమయిన పెద్దబాణలి కావలసి యుండును. మృదువయిన యినుపబాణలి మేలు. మృదువైన యినుపరేకులను కాచి గట్టి (Weld) చేసి యీబాణలి తయారుచేయవలెగాని రివెట్ చేయుటగాని, బోల్టుచేయుటగాని పనికిరాదు. పెనములోనికి వేడిపేటినిగాని, ఆవిరినిగాని పంపుటకు అతుకబడు పైపులు మొదలగునవి కూడ కాచి సాగగొట్టి యతుకవలసినదేగాని రివెట్ చేయరాదు పెనములో పోసినవెంటనే ద్రావకముడికింపవలసివచ్చునుగాన ఉక్కుచట్రముమీద గాని, ఇటుకల పొయ్యిమీదగాని పెనమునర్పబడియుండవలయును. ఉపరేచక్ నిలుచునట్లు చేయుటకు సరియైనయూతకూడ నుండవలయును.

ఉపరేచక్- Solution యొక్క Temperature చూచుకొనుట కూడ చాల ప్రధానమయినది. Solution చల్లారిపోయిన యెడల అడుగున ముద్దగట్టుకొనిపోవును. తరువాత దానిని సరియైన స్థితిలోనికి దెచ్చుటకు చాల వ్యయప్రయాసములు కావలసియుండును ఇది కేవలము Electro-plating నకు మాత్రమేగాక కార్యాంతరములకు కూడ కావలసివచ్చును ఉష్ణద్రావకమున పలుచనయినట్టియు, సున్నితమైనట్టియు పూతపట్టును.

Deposit అనగా అడుగునకు దిగు వస్తువులలో మూడురకములుగలవు ఇవిపరిస్థితులననుసరించి మారుచుండును. ప్రవహింపజాలినంత సాంద్రత కలిగిన ద్రావకమువలన తెల్లని తేటగల పూత (Deposit) కలుగును. ఈపూత నిక్కలి పలుచగా నుండును. దీనికి వర్తకప్రాముఖ్యత లేదు. ద్రావకమునందలి సాంద్రత యధికముచేసినయెడల పూత కాంతివంతముగను, గట్టిగను, జిగ జిగలాడుచును మెఱుగుబెట్టవలసిన తరవాయిలేకుండ సిద్ధమైయుండును ఇంతకు సాంద్రతమరికొంచెము అధికముచేసినయెడల, అనగా ద్రావకము మరింత చిక్కగా తయారుచేయబడినయెడల మోటయిన పూతయుండును. తరువాత దానిని మెఱుగుబెట్టి తేటతెచ్చుకొనవలయును.

పనిలో చాకచక్యము- Plating పని ప్రత్యేకమయినవిధానములుకలిగియుప్రమత్తతతో నాచరింపబడ వలసినదని యిదివఱకే చెప్పియుంటిమి. అది మనముపయోగించు ౧. కరెంటు Density బట్టియు, ౨. Throwing power ను బట్టియు, 3. అందువలన వచ్చు Gas యొక్క పరిమాణమును బట్టియు నుండును.

క్రోమియమ్ లోహముపై ఇతర లోహముల పూత సాధారణముగాపట్టదు. అల్యూమినియమ్ లోహమునకున్న కారణమే దీనికిని గలదు.

**క్రోమోగ్రాఫీ** (Chromography) నకళ్లు చేయుటకు ఒకయంత్రము కలదు దానిచే భూపటములు, రేఖలు మొదలగు చిత్రములు అదే కొలతలకుగాని, ఎక్కువ కొలతలకుగాని, తగ్గించిగాని నకళ్లు గీయనగును దానికి Chromography instrument అని పేరు. దాని పనిచేయునేర్పు లేక విద్యకు (కళకు) Chromography అని పేరు.

**క్రోమో లిథో గ్రాఫీ** (Chromolithography) — పలుచని రాతి పలకలపై చిత్రింపబడిన వాటి మూలమున గాని, అల్యూమినియమ్ రేకులపై చిత్రింపబడిన వాటి మూలమున గాని భూపటములు

(Maps) రంగుల బొమ్మలు, రంగుల చిత్రములను ముద్రింతురు. అట్లు ముద్రింపఁబడిన దానికి Chromolithograph అని పేరు. ఆవిద్య (కళ) కు Chromolithography అని పేరు.

**క్రోమ్ టానింగ్** (Chrome Tanning)— తోలు పరిశ్రమ చూడుఁడు.

**క్రొవ్వొత్తి** (Candle) **కాలుట** — క్రొవ్వొత్తులు, పేరాఫిన్ లేక స్టియరైను అను పదార్థముల (Paraffin or Stearine) తో క్రొవ్వుం గలిపి చేయుదురు. వీటిని మైనపు వత్తులనియు నందురు.

క్రొవ్వొత్తి యందు నడుమ గుండా నుండు వత్తినిముట్టించుతమేని గాలినుండి కొంచెము ఆక్సిజెనును లాగుకొని వెలిగి కొంచెము వేడిం గల్గించును. ఆవేడికిం గ్రిందనుండి పేరాఫిన్ కొంచము కరఁగి చిన్న నీటిచెలమవలె నేర్పడి ఆకరగిన ద్రావకమునే ఒత్తిద్వారా పైకి పీల్చుకొను నట్లొనర్చురు. అపైకి పీల్చఁబడిన స్టియరైను ద్రావకము వేడివలనదగ్ధముగ నగుచు నావిఁగను గాస్ (Gas) గను మారి కాలి ఆక్సిజెనును లాగికొనుచు దీపముగ వెలుఁగు చుండును. దీనిని క్రొవ్వొత్తి వెలుఁగు చున్నదని తలంతుము. స్టియరైన కాలుచున్న కొలదియు అడుగునకు దిగుచున్న కొలదియు వత్తికాలి పైనుండి రొయ్య (Ashes) గ నగుచు దీపము క్రిందికి దిగుచుండును. ఇట్లు క్రొవ్వొత్తి యంతయుం గాలి పోవును.

**క్రోష్టుకి గోత్రము** — గర్గ ఉపగణము చూడుఁడు.

**క్రోష్టు గోత్రము** — నిధృవగణము చూడుఁడు.

**క్రోష్టువు** — చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి యదుమహారాజు. సోదరులు సహస్రజిత్తు, నలుఁడు, రిపుఁడు. పుత్రుఁడు, వృజినివంతుఁడు.

**క్లోరిక్ ఆసిడ్** (Chloric acid) — $HClO_3$) గురుతుగ ఆంగ్లరసాయన వేత్తలు దీనిని Oxy-acid of Chlorine అనియెదరు. క్రీ. శ. ౧౭౮౬ లో Mr. Berthellet అను నాయనచే కనిపెట్టఁబడెనట. ఇది Powerful oxidising agent అని చెప్పఁబడినది.

**క్లోరిన్ వాయువు**— హైడ్రోక్లోరిక్ ఆసిడ్ (Hydro-Chloric acid) ను విద్యుచ్ఛక్తిచేత, భేదించుటంజేసి బయల్పడిన ఒక వాయువు. పరిశీలకుఁడు, సర్ హంఫ్రీ డేవీప-డితుఁడు. (హంఫ్రీ డేవీపరిశీలకుఁడు చూడుఁడు.) దీనిని సోడియము ధాతువుతో సమ్మేళనమొనర్ప లవణము (ఉప్పు) ఏర్పడును. (సోడియము చూడుఁడు.)

**క్లోరీమీటర్** (Clorimeter) — రంగుయొక్క దట్టముందెల్పు పరికరము.

**క్లోరైన్** (Chlorine) - గాలిరూపమున నుండు Element పదార్థము. క్రీ. శ. ౧౭౭౪ సం॥ కనిపెట్టఁబడినది. Symbol is Cl. అనియు atomic weight ౩౫.౪౬ అనియు atomic number ౧౭ అనియు చెప్పఁబడినది. ఇది Sodium, Potassium, Manganese లతో కలసి దొరకునది. Sodium chloride అనంబడునది దేశవాళి ఉప్పు (సముద్రలవణము). పొటాసియమ్ క్లోరైడ్ ఉప్పుగనులలో సైంధవలవణముతో కలసి దొరకును.

**క్లోరోఫారమ్** (Chloroform) — దీనిని Trichloromethane అనియు నందురు. దీనికి $CHCl_3$ గురుతుగ చెప్పఁబడినది. క్రీ. శ. ౧౮౩౧లో Mr. Liebig అను వానిచే

గనిపెట్టఁబడినది. పిమ్మట దీనిని Sir James Simpson అను వారు చాల విధముల వాడుక లోనికి దెచ్చిరి.

**క్వోప్త్రీ క్వచనీరాజనా ఇతిన్యాయము** — ఎక్కడ ఎక్కడ మంగళహారతి ఎక్కడ? అని యర్థము. అన్వయ్తతలేదని భావము. నక్కయెక్కడ నాకలోకమెక్కడ యనెడి తెలుగుసామెత కిదియే యర్థము. ఈ సందర్భమున ఏనుఁగలు, గుఱ్ఱములు ఆయుధములు యుద్ధపరికరములుగ పూజింపఁబడును. కాని లొట్టిపిట్టల కాయర్హత లేదనిదానినారాధింపరనియెఱుంగునది. అనర్హతం దెల్పుచు హేళనగా నీన్యాయమును వాడుచుందురు.

---

**కౌండస్యగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు

**కౌండాయన గోత్రము** — గర్గ ఉపగణము చూడుఁడు.

**కౌండాయన గోత్రము** - భరద్వాజ ఉపగణము చూడుఁడు

**కౌండిన్య గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు

**కౌకసాది గోత్రము** -- పరాశర గణము చూడుఁడు.

**కౌకాక్షి గోత్రము** -- భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**క్రౌకుల్య గోత్రము** — కథ లేక కథ్య గణము చూడుఁడు

**క్రౌక్రోల్య గోత్రము** — కుండిన గణము చూడుఁడు.

**క్రౌచహాండి గోత్రము** - జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.

**క్రౌజలి గోత్రము** - గర్గ ఉపగణము చూడుఁడు.

**కౌటకద్వీపము** (కటద్వీపము) — దీని నిప్పుడు కట్వా యనుచున్నారు బంగాళమున ... నున్నది. ఇటఁజైతన్య దేవుఁడు Density బట్టియు, ... యను సన్యాసికడ ఆశ్రమస్వీకారము నంది దండిసన్యాసి యయ్యెను. ఇదిచైతన్య వైష్ణవుల యాత్రాస్థలమై యున్నది కట్వాయొక్క తొల్లింటిపేరు కౌటకనగరమని యుండెనట రానురాను మార్పులు కల్గెనట.

కట్వానుండి ౮ మైళ్ళ దూరమున నుత్తరముగానున్న జహామత్పూరు నివాసియగు కృష్ణదాసకవి రాజుగారు చైతన్య చరితామృతమును రచించెను (కటద్వీపము చూడుఁడు). మూర్షిడాబాదు నవాబుగ నుండిన మూర్షిక్కులీఖానుఁడు తనపేరిట (నీకౌటకనగర క్షేత్రమునకు) మూర్షిద్గంజని క్రొత్తనామమునిడి ఫర్మానా అనుగ్రహించెనటంగాని అది వాడుకనందలేదట. చైతన్యదేవుని తలవెండ్రుక లాక దేవస్థానమున భద్రపర్చఁబడి యున్నవి. మఱియు నాయన యాకార మొకతాపునదాదూరను గ్రామమునభద్రపర్చఁబడి యున్నది. అది కట్వానుండి ౧౮ మైళ్ళ దూరము.

**క్రౌటక నగరము** — కౌటకద్వీపము చూడుఁడు.

**క్రౌటలి గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**క్రౌటిల్య గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుఁడు.

**క్రౌటిల్య గోత్రము**— పీతవాహ్య లేక యాస్కగణము చూడుఁడు.

**కౌటిల్యుని అర్థశాస్త్రము** — ఈ పేరు వినగనే అర్థమన ద్రవ్యమనియు దానిం గూర్చిన శాస్త్రము అర్థశాస్త్రమనియు తోఁపక పోఁదు. ఇట్లయ్యు అర్థమన కేవలము రూపాయలనుటతో ద్రవ్యము కాదనియు, అర్థమనిన ప్రయోజనమనియు ద్రవ్య (వస్తువుల) ప్రయోజనమనియుఁ గూడ నర్థమగును.

మన యాంధ్రవాఙ్మయమున అర్థశాస్త్రము దాని ప్రాముఖ్యతకుం దగినంతగా ప్రచారము నుండి తొలగియుంట పరిశీలించువారి నిది కొంత చిక్కుపఱుపక పోదు. కొన్ని యక్షరములు కలసి యొక శబ్దమగును. ఆ శబ్దము దేనిం దెల్పునో అది దాని యర్థమగును. ఇటుల శబ్దార్థములు లేక పదార్థములు గ్రహించుచున్నాము ఇంక పదార్థమనిన వస్తువుయని సామాన్యముగ నందఱికి స్ఫురింపక పోదు వస్తువుకు సంస్కృత భాషయందు ద్రవ్యమనియు ఆంగ్లమున Material అనియు, వాడుక పదములు. ఈసాంప్రదాయార్థము (వాడుక) ల వలన సంస్కృతమున ద్రవ్యమనినను తెలుఁగు వాడుక పేరకు వస్తువ యనినను ఆంగ్లమున Material అనినను ఒకే యర్థము. పదార్థమని యర్థము. ఇట్టి పదార్థములు లోకమున పెక్కులు గలవు. మనుష్యులకు వలయు వస్తుసముదాయ మంతయు పదార్థ వితతియే. భోజనపదార్థములు, వాడుకపదార్థములు అనియు, లోహపదార్థములనియు, వ్యవసాయముచేసి పండించినవియనియు, రసాయన పదార్థములనియు, పదార్థవితతి లెక్కలేని విధముల నుండెడిని. ఇఁక వాటి యుపయోగముల ననుసరించి ముఖ్యజాతులుగ విడదీసి యీ శాస్త్రభాగములుగ వివరించియున్నారు.

ఇటీవల నొక విద్వాంసుఁడు దేశమందలి వస్తుసముదాయముల వర్తక వ్యాపారోపయోగము ప్రధానముగ గైకొని అర్థశాస్త్రమను నొక గ్రంథమును సులభశైలిని ప్రకటించెను. కాని తొల్లింట కౌటిల్యుని అర్థశాస్త్రము సామాన్యముగ దేశమందు కల వస్తుప్రయోజనము ప్రధానముగ సర్వవిషయములను వ్రాసియున్నాఁడు. ఇది రాజ్యమందలి ప్రజలకు పలు తెఱంగుల నుపయోగింపదగిన వాటి విషయమై మాత్రమేగాక ప్రభుత్వధర్మముగ నున్న సమస్త వస్తుప్రయోజన ఉపయోగములు అన్నియు ప్రధానముగ గైకొని అనేక ప్రభుత్వధర్మములను వివరించుచున్నది.

కౌటిల్యుని అర్థశాస్త్రము ధర్మ, అర్థ, కామ, మోక్షములను చతుర్విధ పురుషార్థములలో రెండవదియగు అర్థమును గూర్చిన శాస్త్రము. ఇది క్రీస్తుమునుపు నాల్గవశతాబ్దకాలమున మగధ రాజ్యమేలిన చంద్రగుప్త మహారాజను పేరుగల మౌర్యవంశపు చక్రవర్తి కాలమునాఁటివాఁడగు కౌటిల్యుఁడు లేక చాణక్యుఁడు అను సుప్రసిద్ధ వాడుక నామములుకల విష్ణుగుప్తుండనువానిచే వ్రాయఁబడిన శాస్త్రము.

కౌటిల్యుని అర్థశాస్త్రము రాజ్యమందలి ప్రజలు ఐహికముగ సమస్తవస్తువులంగల్గి వాటి ఉపయోగవిశేషములచే మిగుల వళివృద్ధిగాంచి సుఖమున మనుటయే ప్రయోజనముగా మనసు నందిడుకొని వాటి ధర్మవిధులను పద్ధతులను వివ

రముగ దెల్పు శాస్త్రము ఇదియొక్కటియే రాజ్య పరిపాలనతో సంబంధములు దెల్పుచుండునది. ప్రజానుకూలత, ప్రజాభివృద్ధి లేని పరిపాలనము నడచుచుండినను నిరర్థకమేనని నమ్మినకౌటిల్యుడు అట్లు కాకుండుట కర్హమార్గముల నీగ్రంథమున జూపెను.

ఈ మహాగ్రంథముగూర్చి హేమచంద్రుడును, కామందకుడును ప్రశంసించియున్నారు. కామందకుడు తన నీతిసారమను గ్రంథము నీ కౌటిల్యుని అర్థశాస్త్రము ననుసరించియే వ్రాసెనని ప్రతీతి కలదు. చాణక్యచంద్రగుప్తుల సంబంధకథనమే ముద్రారాక్షసమను నాటకము.

కొందఱు విమర్శకు లీగ్రంథ మొక్క కౌటిల్యునిచే వ్రాయబడుట యసంభవమేమోయనియు పరంపరగ కొందఱు పండితులు కొంతకాలమువఱకు వ్రాయుచునేయుండుట సంభవించియుండ నోపుననియు తలంచిరిగాని నిజమగు పరిశీలనలు చేసినవారు ఆ మహాగ్రంథమందలి భాషాశైలి మొదలగువాటిం బరిశీలించి యొక్కనిచే వ్రాయబడిన గ్రంథముగ నభిప్రాయపడుచున్నారు.

ఇంక నిందు వివరింపబడిన సంగతుల నీ గ్రంథమున వివరించుట మాకు పనిగాదు; అటుల వివరించుటకు చాలనుపదవాలటి గ్రంథ విస్తారము కలదు కాని యిది రాజ్యపరాధీనమై ప్రభుత్వమును, ప్రజలును గూడ నెఱిగియుండిన నా పరిపాలకు నంగా ప్రభుత్వమునకు, ప్రజలకుగూడ సమస్త శ్రేయస్సులకు మూలమగునని దెల్పుచు విరచితముగాక! ఇక్కాలమున కిరువదినాల్గు శతాబ్దములకు పూర్వకాలమున నట్టి యుద్గ్రంథము రచింపగల సామర్థ్యము భారతదేశస్థులకుండుట యెంతయు స్మరణీయము. ఇతరదేశములకన్న మున్ముగ నింత రాజ్యపరిపాలన విజ్ఞానమెఱిగిన దేశముయొక్క ప్రస్తుత స్థితింబలంచిన విచారము కల్గకపోదు.

**క్రౌశవ గోత్రము**- హారిత ఉపగణము చూడుడు.

**క్రౌంతలకపురము**— కుంతలక పురమున కీపేరుండెను దీని ప్రశంస జైమినిభారతము ౫౩ అధ్యాయమున గలదు. దీనినిప్పుడు కుబత్తూరను చున్నారు. మైసూరురాజ్యమునందున్నది (చంద్రహాసుని రాజధాని) దీని ప్రశంస జైమినీ భారతము ౫౩ యందు కలదు. (కుంతలపురము కుబత్తూరు చూడుడు).

**క్రౌత్స గోత్రము** — హారిత ఉపగణము చూడుడు.

**క్రౌనాభి గోత్రము**—లాంగాక్షిగణము చూడుడు.

**క్రౌపిశాయన గోత్రము**—వాధ్రస్యలేక మిత్రయువగణము చూడుడు.

**క్రౌభేయ గోత్రము** — అత్రిపుత్రికాపుత్రుల గణము చూడుడు.

**క్రౌభోజ గోత్రము**— వసిష్ఠగణము చూడుడు.

**క్రౌమండ ఉపగణము** — ఇది అంగీరస సంతతియందలి గౌతమగణములోని యొక ఉపగణము. ఇందు ఎనిమిదిగోత్రములు కలవు. ౧. కౌష్టకేభి, ౨. కౌమండ, ౩. మామందకేమణ, ౪. మాసురాక్ష, ౫ మాసుకేషి, ౬. రాజాయన, ౭. వాయన, ౮. వాసిరి.

ఈ (క్రౌమండ ఉపగణ) గోత్రములకు ప్రవరరూపములు- ౧. ఆంగీరస, ఔతథ్య, కాక్షీవత, గౌతమ, కౌమండ. ౨. ఆంగీరస, ఔసిజ, కాక్షీవత. ౩. ఆంగీరస, ఆయాస్య, ఔసిజ, గౌతమ, కాక్షీవత. ౪. ఆంగీరస, ఔతథ్య, గౌతమ, ఔసిజ, కాక్షీవత.

**క్రౌమండ గోత్రము** — కౌశిక్య ఉపగణము చూడుడు, కౌమండ ఉపగణము చూడుడు.

**క్రౌమార గోత్రము** — ఉపమన్యు గణముచూడుడు, హారీత ఉపగణముచూడుడు.

**కౌమారవత్స గోత్రము** —కౌశిక్య ఉపగణము చూడుడు. ఆయాస్య ఉపగణము చూడుడు

**క్రౌముది గోత్రము** — పరాశర గణము చూడుడు.

**కౌముదీ పౌర్ణమి** — ఆశ్వీజ శుద్ధ పౌర్ణమి కౌముదీ జాగరవ్రతదినము. దీని వింకను ఆగ్రాయణ (జాదముల) పౌర్ణమియనియు నం దురు (ఆగ్రాయణపౌర్ణమి చూడుడు జాద ముల పౌర్ణమిచూడుడు). అనతిక్రాంతమగునేని దాన ఫలవ్రత మొనర్తురు (పండుగులుచూడుడు).

**కౌరకృత్ గోత్రము** — ఉపమన్యు గణము చూడుడు.

**కౌరజాయన గోత్రము**— పరాశర గణము చూడుడు.

**కౌరవులు** — వీరు నూర్గురని మహా భారతమునందు చెప్పబడినది. ఎక్కువ పరిశీలన లపై వీరిపేర్లు బయల్పడినవి. వీరి తండ్రిపేరు ధృతరాష్ట్రమహారాజు. తల్లిపేరు గాంధారీదేవి వీరందరు భారతయుద్ధమున మడసినవారే.

కౌరవుల నామములు- ౧. దుర్యోధనుడు (దుర్యోధనునకు సుయోధనుడనియు పేరు కలదు), ౨. యుయుత్సువుడు, ౩. దుశ్శాసనుడు, ౪. దుస్సహుడు, ౫. దుశ్శీలుడు, ౬. జలసం ధుడు, ౭. సముడు, ౮. విందుడు, ౯.అనువిం దుడు, ౧౦. దుర్ధర్షుడు, ౧౧. సుబాహుడు, ౧౨. దుష్ప్రధర్షణుడు, ౧౩. దుర్మర్షణుడు, ౧౪. దుర్ముఖుడు, ౧౫ దుష్కర్ణుడు, ౧౬. కర్ణుడు, ౧౭ వికర్ణుడు (వివింశతి), ౧౮. శలుడు, ౧౯. సత్వుడు, ౨౦ సులోచనుడు, ౨౧. చిత్రుడు, ౨౨ ఉపచిత్రుడు, ౨౩ చిత్రాక్షుడు, ౨౪. చారుచిత్రుడు, ౨౫ శరాసనుడు, ౨౬. దుర్మదుడు (లేక దుర్మర్షణుడు), ౨౭. దుర్వి గాహుడు, ౨౮. వివిత్సుడు, ౨౯. వికటాన నుడు, ౩౦. ఊర్ణనాభుడు, ౩౧. సునాభుడు, ౩౨. నందుడు, ౩౩ ఉపనందనుడు, ౩౪. చిత్ర బాణుడు, ౩౫ చిత్రవర్మ (లేక చిత్రసేనుడు), ౩౬. సువర్మ, ౩౭. దుర్విమోచనుడు, ౩౮. అయో (వా) బాహుడు, ౩౯. మహా బాహుడు, ౪౦. చిత్రాంగుడు (లేక చిత్రాంగ దుడు), ౪౧ చిత్రకుండలుడు, ౪౨ భీమవే గుడు, ౪౩. భీమబలుడు, ౪౪ బలాకి, ౪౫. బలవర్ధనుడు, ౪౬ ఉగ్రాయుధుడు, ౪౭. భీమ కర్మ, ౪౮. కనకాయుడు, ౪౯. దృఢాయు ధుడు, ౫౦. దృఢవర్మ (శృతవర్మ), ౫౧. దృఢ క్షత్రుడు. ౫౨ సోమకీర్తి, ౫౩. అనూదరుడు, ౫౪. దృఢసంధుడు, ౫౫. జరాసంధుడు, ౫౬. సత్యసంధుడు, ౫౭. సదస్సు, ౫౮. సువాక్కు, ౫౯.ఉగ్రశ్రవుడు, ౬౦.ఉగ్రసేనుడు, ౬౧. సేనాని, ౬౨. దుష్పరాజయుడు, ౬౩. అపరాజితుడు, ౬౪. కుండశాయి, ౬౫ విశా లాక్షుడు, ౬౬. దురాధరుడు, ౬౭. దృఢ హస్తుడు, ౬౮. సుహస్తుడు, ౬౯. వాతవేగుడు, ౭౦ సువర్చస్సు, ౭౧. ఆదిత్యుడు, ౭౨. కేతు బాహుడు, ౭౩. నాగదత్తుడు, ౭౪ అగ్ర యాయి, ౭౫. కవచుడు, ౭౬ నిషంగుడు, ౭౭. కుండుడు, ౭౮. కుండధారుడు, ౭౯. ధనుర్ధరుడు, ౮౦. ఉగ్రుడు, ౮౧. భీమరథుడు, ౮౨. వీరబాహుడు, ౮౩ అలోలుపుడు, ౮౪. ఉభయుడు, ౮౫. రౌద్రకర్ముడు, ౮౬

దృఢరథుఁడు, ౮౭. అనాధృష్యుఁడు, ౮౮. కుండభేది, ౮౯. విరావి, ౯౦. దీర్ఘలోచనుఁడు, ౯౧. ప్రమథుఁడు, ౯౨. ప్రమాథి, ౯౩. దీర్ఘరోముఁడు, ౯౪. దీర్ఘబాహుఁడు, ౯౫. మహాబాహుఁడు, ౯౬. వ్యూఢోరువు, ౯౭. కనకధ్వజుఁడు, ౯౮. కుండాశి, ౯౯. విరజుఁడు, ౧౦౦. దుశ్శలుఁడు.

కౌరవులు (అత్రి, చంద్ర, పూరువు) కురువంశ క్షత్రియులు. మద్రదేశాధీశుఁడగు శల్యుఁడు మేనమామ.

**కౌరవ్య గోత్రము**-ఉపమన్యు గణము చూడుఁడు.

**కౌరిహ్య గోత్రము**-నిధ్రువ గణము చూడుఁడు.

**కార్ష్ణమణి గోత్రము** - రాణాయన ఉపగణము చూడుఁడు.

**కౌలకి గోత్రము**- ఉపమన్యు గణము చూడుఁడు.

**కౌలాక్షి గోత్రము** -గర్గశిరగణము చూడుఁడు.

**కౌలాంత్రయ గోత్రము** — గర్గశిర గణము చూడుఁడు.

**కౌలి గోత్రము** — వశిష్ఠ గణము చూడుఁడు.

**కౌవలి గోత్రము**— శండిలగణము చూడుఁడు.

**కౌవెల్ సిద్ధాంతము** (Cowell Theory)—ఇది ఎస్ట్రానొమీ శాస్త్ర సంబంధమగు కాలమును గూర్చిన సిద్ధాంతము. దీనిని తొలుత Cowell Nevill, Fatheringham అను పేర్లు గల ఎస్ట్రానొమీ శాస్త్రవిదులు బేబిలోనియన్ రికార్డులను, అస్సీరియన్ రికార్డులను, చీనాదేశపు రికార్డులను, గ్రీకురికార్డులను, ఈజిప్టుదేశపు రికార్డులను పరిశీలించుచు గుణించుచుండిరి. కాని భేదములుండు నట్లగుపడి చిక్కులు సంభవించి నిశ్చితాభిప్రాయములు గలుగ వీలు కాలేదని చెప్పఁబడినది.

పిదప కౌవెల్ పండితుఁడు ఈ సిద్ధాంతమును గుదర్చి బయలుదేర దీసెననియు నూరు సంవత్సరములలో సెకెండు కాలమునందలి రెండువందలవ భాగము దినమునందభివృద్ధి నందుచున్నదనియు, ఇటుల ఇన్నూరు సంవత్సరములు కొక సెకెండు కాలమును, ఒక కోటి డెబ్బది రెండు లక్షల ఎనుబది వేల సంవత్సరములు గడచు వఱకొక దిన మధిక మగుచుండు ననియు, తెల్పెను. ఈ లెక్క అన్ని రికార్డులకును క్రొత్త విధానపు సిద్ధాంతములకును గూడ సరిపోవునని సిద్ధాంతపఱచెను. (ఎస్ట్రానొమీ కాలము చూడుఁడు).

**కౌశాంబి నగరము** — పురూరవ సంతతి యందుండు పదియవ నృపాలుఁడగు కుశాంబ మహారాజుచే నాయన పేరున నిర్మింపఁబడి, పాండవ మధ్యముఁడగు అభిమన్యుని సంతతియం దెన్మిదవ వాఁడగు చక్రనరపతి పాలనమున అదివఱకుండిన రాజధాని హస్తినాపురము గంగానది వెల్లువచే నాశనము చేయఁబడుట, ఈ రాజధాని నిచటికి మార్పఁబడి యభివృద్ధి నందిన పురము. శ్రీమద్రామాయణమునం దీకావు ప్రశంస గాన్పించెడిని. ఉదయనవత్సభూపతి నాఁటి పురి గొప్ప వైభవ మనుభవించి యుండును. క్రీ. పె. అయిదు వందల సంవత్సరములకుం బిదప నుండిన కాళిదాసు కవిచే మేఘ సందేశమునను, రత్నావళి నాటకమునను, సోమదేవునిబృహత్కథ యందునను పేర్కొనుఁడు ప్రశంసింపఁబడిన వాఁడు. వత్సరాజు పాలనము నుండి దీనికి వత్స పట్టణమనియును పేరు కల్గినదట.

వత్సరాజు బుద్ధభగవానుని శిష్యుడై ఆయన జీవితకాలముననే రక్తచందనపుకఱ్ఱతో చేయించి తన ప్రాసాదమున నుంచుకొనెనందురు. అదియె ప్రపంచమున బుద్ధభగవానుని మొదటి విగ్రహ మందురు. హూయ్యాన్ త్సాంగు దానిదర్శించెను. ఇప్పుడది కోశాం అని పిలుబడుచు సంయుక్త రాష్ట్రముల లోని అలహాబాదు కోట నుండి ముప్పది యొక్క మైళ్ల దూరమునందున్న గ్రామముగ నున్నది.

**కౌశాంబేయ గోత్రము**—వీతహవ్య లేక యాస్కగణము చూడుడు.

**కౌశికర్షిగోత్రము**—(శిష్టకరణములు చూడుడు). వీరికి బ్రహ్మర్షి అంగిరస. ప్రవర రూపము, వైశ్వామిత్ర, దైవరాత, ఔదలత్రయార్షేయప్రవర చెప్పబడినది. మరియు, చీత, గాలవ, కాల, బవ, మను, త-తు, కుశిక, గోత్రములవారికి ప్రవరము చెప్పంబడినది. శిష్టకరణములలో ౧. ఎల్లుమహంతివారు, ౨. కాసిమహంతివారు, 3. కొర్లాంవారు, ౪. తోణంగివారు, ౫. దుర్గ మహంతివారు, ౬. బలరామ మహంతివారు, ౭. రాజమహంతివారు, ౮. సాహెబులుదాంవారు, అను వీటిపేర్లవా రీగోత్రజులైయున్నారు.

**కౌశిక గోత్రము** — అశ్మరథ్యగణము చూడుడు. ఇంద్రకౌశిక గణముచూడుడు.

**కౌశికీ అరుణానదుల సంగమము** — దీని ప్రశంస పద్మపురాణము సర్గ ౧౮ యందు కలదు.

**కౌశికీ కచ్ఛదేశము** — ఇప్పటి బంగాళము లోని పూర్ణియామండలము. ఆ ప్రాంతముల కౌశప్పడి పేరు గల్గియుండెను.

**కౌశికీదేవి**- గౌరీదేవి యొక్క కాయకోశము నుండి జనించినదై ఈమె శుంభనిశుంభు లను, చండుడు ముండుడు అను రాక్షసులను పరిమార్చెననియుం చెప్పబడినది. మరియు నీకీర్తిని చాముండి యనియునందురు. మరియు గాధిరాజు కుమార్తె కౌశికీ, భర్త ఋచీకుడు, కుమారుడు జమదగ్ని, విశ్వామిత్రుని సహోదరి. ఈమెకు సత్యవతియని నామాంతరము కలదు.

**కౌశికీ నది** — దీనినిప్పుడు కుశీయనుచున్నారు. దీని ప్రశంస రామాయణము ఆదికాండ 3౪ యందునను, వరాహపురాణము ౧౪౦ యందునను కలదు. తొల్లింటి పూర్వకాలములందు ఈనది ఆగ్నేయదిక్కునకుం బ్రవహించుచు నిప్పుడు తేజపూరను పురముండిన తావుప్రక్కగనడచి తూర్పునకు మరలి పోవుచు బ్రహ్మపుత్రానది యందు సంగమించెడిది. అక్కాలమున గంగానది తో కౌశికీనది కే సంబంధము లేకుండెను.

తర్వాత కాలానుగతముగ తనగతిని మార్చుకొని కౌశికీనదీ ప్రవాహము గంగానదియందు చేరినాయెను. అట్లు చేరిన కౌశికీగంగానదుల జలప్రవాహము ఘద్మానదిగాం దనరుచున్నది. కౌశికీనది వదలి మరలి వదలివేసిన తొల్లింటి ప్రదేశము అనగా పౌంగ్లి (మతి) మొదలు నవద్వీపము (నద్యా) తనుక రాను రాను మెరకవై భూమిం గలసిపోయెను. ఇటులనే Martin's Eastern India III P.15 యందునను వివరింపబడియున్నది. మరియు నంది మార్పు క్రీ. పూ. మూడు పేను శతాబ్దకాలములందు క్రమక్రమముగ రాను రాను జరిగియుండునని అభిప్రాయపడియున్నారు. ఇప్పుడా సంగమములు స్నానతీర్థములై యున్నవి.

కౌశికీ గంగానదుల సంగమము భాగల్పూరు మండలమున పాతరఘట్టా కుత్తరమున కహల్గాన్ కానుభుగ నవ్వాలి తీరమునందున్నది.

ఇంకను కురుక్షేత్రమున వేఱొక కౌశికీనది కానవచ్చుచున్నది. దీని ప్రశంస వామనపురాణము 3౮ యందు కలదు. ఈకురుక్షేత్ర కౌశికి ద్రిషద్వతీనదియందు స్థానేశ్వరమునకు దక్షిణముగా పదునేడు మైళ్ళ దూరమున రక్షీయనంబడు నదిపైనున్న బాలు అనుపేరుగల గ్రామము కడ సంగమించుచున్నది. ఈ సంగమమునుగూర్చిన ప్రశంస పద్మపురాణము స్వర్గఖండము ౧౩ యందు గానవచ్చుచున్నది.

మహాకౌశికి సప్త కౌశికలు కలిసిన నదిగనున్నది. ఇవి ౧ దీనిని మిలాంచి యనుచున్నారు. దీని అసలుపేరు తెలియదు. ౨. సూర్యకౌశికి (దీనిని శోణకోశి యనుచున్నారు) మఱికొందఱు కోటియా కోశియనియు నందురు. 3. తాంబకోశి-దీని అసలుపేరు తెలియదు. ౪. లిఖుకోశి-దీని అసలుపేరు తెలియదు. ౫. సగ్ధకోశి-దీనిని సప్తకోశి యని యందురు ౬. అరుణకోశి. ౭ తామ్రకోశి-దీనిని తామోర్ అనుచున్నారు. ఈ ఏడు నదులును కౌశికలే. అరుణకౌశిని గూర్చిన ప్రశంస పద్మపురాణము స్వర్గ ౧౯ యందును తామ్రకౌశికి గూర్చిన ప్రశంస మహాభారత వనపర్వము ౮౪ యందునను గలదు. ఇవన్ని యొకటితో నొకటి కలియుచు అన్నియు గలిసిపోయినచోట మహాకౌశికి యనంబడును. అందు బాగాళములోని పూర్ణియా మండలమున వరాహక్షేత్రము (కోశ ముఖమున) కలిసిన కలియు తామ్రకౌశిక, అరుణకౌశిక, సూర్యకౌశిక సంగమము త్రివేణి యనంబడుచున్నది.

**కౌశికీనది జన్మస్థానము** — నీలకంఠక్షేత్రము చూడుఁడు.

**కౌశికీ సంగమములు** — భాగల్పూరు మండలమున పాథర్ఘట్టా కు తూర్పుగా కహల్గాఁవ్ పురమున కెదురుగ సవ్యాలితీరమున కౌశికీనది (నుకి) గంగానదిలో సంగమించుచున్నది కలదు (అంగదేశము చూడుఁడు).

కురుక్షేత్ర స్థానేశ్వరమునుండి దక్షిణముగా ౧౭ మైళ్ళ దూరమున రక్షీనదిపైనున్న బాలు గ్రామమునకు ద్రిషద్వతీనది కౌశికిలో సంగమించుచున్నది కలదు. దీని ప్రశంస పద్మపురాణము స్వర్గ. అధ్యా ౧౩ యందు కలదు. ఇవి ఆర్కియాలాజికల్ సర్వేరిపోర్టు ౧౪ సంపుటము ౮౮ పుటయందు చర్చింపబడి వివరింపబడినవి.

**కౌశికుఁడు** — ఈ పేరు కలవారు పెక్కుమంది కలరు. విశ్వామిత్రుఁడు కౌశికుఁడను నామాంతరము కలదు. యదుసంతతియందు వసుదేవుని పుత్రులలో వత్సబాలకుఁడు లేక వత్సవంతుఁడను వాఁడు దత్తతతీసికొనిన కుమారుని పేరు కౌశికుఁడు. ఈ బాలుఁడు తొల్లింట వసుదేవుని సుతుండనియు, హంసుఁడను పేరుగల వాఁడనియును చెప్పెడివి. మిథిలాపురవాసియును ధర్మవ్యాధునివలన సకల ధర్మముల నెఱింగిన యొక విప్రునకు కౌశికుఁడని పేరు.

కౌశికుఁడను నొక ముని యోగాభ్యాసమున శరీరము విడచియుండ నా శరీరము క్షీణించి అస్థులు నిలచియుండె. దానిపై చిత్రరథుఁడను గంధర్వుఁడు తన విమానమున నేగుచు అస్థుల స్థలమునకు పైగా నేఁగుటచే నేలఁగూలెననియు, అంతట ఋషుల సలహాపై నతఁడా యస్థులను గొని సరస్వతీనదియందు నిక్షేపణమొనర్చి స్నాతుఁడై తిరుగ యథాస్వర్గమునకు పోయెననియుం జెప్పఁబడినది.

మరియు ప్రతిష్ఠానపురవాసినియగు నొక మహాపతివ్రత గూర్చి వివరించుచు నామె భర్త పేరు కౌశికుండని చెప్పఁబడినది.

ఇంకను జరాసంధుని (మగధదేశాధీశుఁడు) మిత్రుఁడగు కౌశికుఁడొకఁడు గానవచ్చుచున్నాఁడు. ఇతనికి హంసుఁడనియుం బేరుకలదు.

**కౌశికేయ గోత్రము**—నిధ్రువగణము చూడుడు.

**కౌశిగోత్రము** — శాండిల గణము చూడుడు.

**కౌశిదక లేక కాశీదకగోత్రము**- నిధ్రువగణము చూడుడు

**కౌసల్య గోత్రము** — అగస్తి యుపగణము చూడుడు.

**కౌసల్య** (కౌసల్యాదేవి) — ఈపేరు గలవారు ముగ్గురు గలరు.

దశరథ మహారాజు జ్యేష్ఠ పత్ని కౌసల్య. ఈమె సుతుడు శ్రీరాముడు. శ్రీకృష్ణుని తండ్రియగు వసుదేవుని భార్యలలో నొకతె కౌసల్య. ఈమెకు భద్ర యనియు మరొక పేరు కలదు. మఱియు యయాతి పుత్రుడగు పూరుని భార్య పేరు కౌసల్య.

**కౌసల్యాయన గోత్రము**- ఔతథ్య ఉపగణము చూడుడు.

**కౌక్షీవ గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుడు.

**క్రౌంచగోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుడు.

**క్రౌంచపర్వతము**— మానస సరోవరమునకు నైపున గల కైలాస పర్వత భాగము. దీనికి క్రౌంచ పర్వతమని పేరు. ఇందే క్రౌంచ రంధ్రముండునని చెప్పబడినది

క్రౌంచ రంధ్రమును నీతికనుమ మార్గమని (Nite pass) కొందఱనుచున్నారు. పెద్ద గుహామార్గము కాదని కొందఱనుచున్నారు. దీని ప్రశంస రామాయణము కిష్కింధాకాండము ౪౩ యందు కలదు.

నీతిమార్గము భరత దేశమునుండి టిబెట్టునకు మార్గమని తెలియ వలయును. ఇది రంధ్రము కాదు. కొండ మడతలగుండా నడచుదారి యని తెలియంగ వలయును.

**క్రౌంచపురము (వనవాసపురము)**- వైజయంతిదేశము, వైజయంతీపురము చూడుడు.

**క్రౌంచ రంధ్రము** — దీనికి హంస ద్వారమని పేరుకలదని మహాకవి కాళిదాసు మేఘసందేశము ౧-౫౭ యందు చెప్పియున్నాడు.

**క్రౌంచాక్షిగోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుడు.

**క్రౌంచుడు** — తండ్రి మైనాకుడు. పితామహుడు హిమవంతుడు. క్రౌంచపర్వతమును భేదించినకతన కుమారస్వామికి క్రౌంచ దారణుడు అని పేరుకలిగెను.

**క్రౌత్రకౌశికానది**— దీనిని పయోష్ణి యనియు, పూర్ణానది యనియు వాడుచున్నారు. బీరారులోని యొక నది. క్రౌతానదియు, కౌశికానదియు కలిసి క్రౌతకౌశికగా నైన నది పేరొకటి కలదు. విదర్భదేశ నృపతి పుత్రులగు వారు క్రౌతుడు, కౌశికుడు ఇద్దరి పేరబడిన నదులు కలసి క్రౌతకౌశికయయ్యెను. దీని ప్రశంస మహాభారతము సభాపర్వము ౧౩ యందు కలదు.

**క్రౌంకాయనగోత్రము**— జమదగ్ని బీధా ఉపగణము చూడుడు.

**క్రౌయనగోత్రము** — జమదగ్నిబీధా ఉపగణము చూడుడు.

**క్రౌర్యము** — ఈమురేని తావులందు వ్యాపించును. క్రూరగర్వమునం దశమాపమునందును. క్రూరత్వము దశలక్షణములలో నొకటి. క్రౌర్యమొక తావున నిల్చియె అపకారమొనర్పటకగా నాగు యదనునకై వేచియుండుటే నది క్రోధమనబడును దాని బయట పడనీయక లోపదాచి నెలవు ప్రవర్తనకుం గుటిలత యనియు కృతఘ్నవృత్తియనియు, కుచోద్యమనియుం పేరులు కలవు అనూయతాసహిత క్రౌర్య మీర్ష్య యనబడుచున్నదిగాని యది సరిగాదు. ఒకప్పుడు తనకొనర్చిన యపకృతికై పగతీర్చుకొనుటకు వేచియుండుట క్రౌర్యమనుట సమంజసము.

**ఖింఖమిత్రేయ గోత్రము** — నిధృవగణము చూడుడు.

**ఖంజనాసనము** — యోగశాస్త్రమునం జెప్పఁబడిన ఆసనములలో నొకటి. గుదస్థానమున కెడమభాగమున కుడి మడమను, కుడిభాగమున నెడమమడమను దట్టించి, కూర్చుని రెండుచేతులను ఇరుప్రక్కలనాని చేతులఆనిక పై శరీరము నెత్తియుంచుట ఖంజనాసనము. దీని యభ్యాసమున అపానవాయు ఊర్ధ్వగతియై తగ్గిపోవునని చెప్పఁబడినది.

**ఖండగిరిగుహాలు** — ఉత్కళదేశమున భువనేశ్వరమునుండి నాల్గుమైళ్ళ దూరమునంగల ఒక పాటికొండలయందు చేయఁబడిన గుహాలు. ఈకొండలు తొల్లింటి చతుష్పీఠపర్వతము (అస్సియా రేంజి) యొక్క శాఖయైయున్నది. తొల్లింట దీనికి ఉదయగిరియని పేరుండెనట. అందొకచోట రెండు శిఖరములనడుమ నొకకొంతతగ్గుదలయుండ దానిపైనుండి యవ్వలికేగు బాటయేర్పడ రాను రాను దానినొకను త్రవ్వి నరకి మార్గమొనర్చక్కఁ జేయ, అట్టుల ఖండింపఁబడిన దక్షిణమువైపు కొండభాగమునకు ఖండగిరియనియు, ప్రక్కన ఉత్తరమువైపు భాగమున కుదయగిరియనియు, ఖండగిరినంటి వెనుకకు పశ్చిమమువైపు సాగియుండిన పర్వతభాగమునకు నీలగిరియనియు, ఇట్టుల నొకే పర్వతపంక్తి మూడుపేరులం బరగుచున్నది.

ఇందుచూపఁదగిన ముఖ్యములగుగుహా లుదయగిరియందేకలవు. హ్యూయనత్సాంగు తనయాత్రాచరిత్రమున వివరించిన పుష్పగిరి సంఘారామమిటనే యుండెనని, పెక్కండ్రు అభిప్రాయపడియున్నారు. తొల్లింటనివి బౌద్ధులకొఱకై నిర్మింపఁబడినవియై క్రీ. పూ. ౧౦౦ సంవత్సరములనుండి క్రీ. వె. ౫౦౦ సంవత్సర కాలములమధ్య కాలపు పనితనముగ పోల్పఁబడినవి.

ఇచటి గుహాల నుత్కళులు గంఫలని వాడుచున్నారు. ఒకేరాతినుండి తొలువఁబడి గదులవలెను, సావిడులవలెను, వసారాలవలెను, అరుగులవలెను, తొలువఁబడినవి. పెద్దపెద్ద గండశిలలను, స్తంభములు, గోడలు పైకప్పులు, ద్వారబంధములు, కిటికీలు ఉంచబడుచు, పరస్థలములు తొలిచి తీసివేయఁబడినవి. ఇట్టులనే ఇందు మేడలును వాటిపై కెక్కుటకు సోపానములుంగూడ తొలువఁబడి వింతగొల్పుచుండును. ఉదయగిరియందు ౪౪ గుహాలును, ఖండగిరియందు ౧౯ గుహాలును, నీలగిరియందు 3 గుహాలును గలవు. ఇట్టుల నీగుహాలన్నియు ౬౬ కలవు. ఇందు పెక్కులు చాలచిన్నవియుం గలవు.

ఉదయగిరికొండ ఎక్కుట ప్రారంభింపగనె గుహాలు ప్రారంభమై ఎదురుగ నొకగుహాయు, దానికి కుడివైపున పెద్దచావిడివంటి గుహాయుం గలవు. ఇది యొకకాలమున సభలజరుపు తావని యందురు. కొంచెము విడప కుడివైపునకు నడచుచు కొండనెక్కుటతో రాణీగుంఫ తగులును. ఇదియె ఇచటి గుహాలలో నెక్కువ పనితనము కలది. ఇందు పెద్దనావలియు, దానికి మూడువైపుల చెక్కంబడిన గదులును కలవు. ఎదురుగనున్న వైపున మేడగ చెక్కబడిన భాగమున్నది. ఇది ఆగ్నేయముఖముగనుండి ఎదుటవైపు కడుదూరము భూప్రదేశమును, భువనేశ్వరమందలి యాలయములును గానవచ్చెడిని. ఇందు పెక్కు చిత్రదృశ్యములు చిత్రింపఁబడినవి ఒకచో నొకబౌద్ధభిక్షువు నూరేగించుట, కూడనడచు జనములు, అరుగులపైనుండియు గవాక్షములలో నుండియు చూచువారును చిత్రములందుఁ గానవచ్చెడిని.

మరియొకచో ఛత్రములంధరించి నడచువారును, గుఱ్ఱపుసవారి చేయువారు, ఏనుఁగలపై

నెక్కి యేగువారు, అడవిమృగములపై నేగువారును, ఇంకొకచో ఫలపుష్పాగులం బల్లెరమున నిడి దేవాలయముల కేగువారు, వేఱొకచో రాళ్ల మధ్యనుండి బెదరింపబడిన యేనుఁగలు పర్వెను చుండ వేటకాండ్రడ్డగించుటయు, మొదలగు చిత్రములు చక్కఁగ భావబోధకములగునటుల చిత్రింపబడియుండుట గాననగును.

వేఱొక తావున నొక జైనపురాణగాథ చిత్రింపబడి యుచ్చైరువు గొలుపుచుండును. నడుమ నడుమ గొంత యూహించుట కవసరమున్నను చిత్రము వింతయై భావస్ఫుటమనియె నుడువదగియున్నది. తొల్లి ఇక్ష్వాకువంశస్థుఁడగు అశ్వసేన మహారాజునకు రాజ్ఞియగు వామాదేవి గర్భమున బాలుండై యొకసుతుండు జన్మించుటయు, విద్యలభ్యసించుటయు, ఒకతరి నడవికేఁగి వేటాడుటయు, అరణ్యమున కొందఱుదుష్టులచే నపహరింపఁబడినపసుముఖిని చేయుటయు, నీయూవనుఁడా దుష్టులం దరిమివైచి యామెం జూచి యుచ్ఛైరువాది యామెకుం ధైర్యము బోధించుచో నానామె యందుగల వలపుం దెలుప నామెయు ముదమంది యాతని సంగీకరించుటయు, నాదిర్వురి సంభావణమున నదివఱకే మట్టములగుట యెఱింగి ముదమందుటయు, వారిపరిణయము నడచుటయు, వారు రతీమన్మథులవలె బద్ధానురాగులై సకలభోగములనుభవించుటయు, కొంతకాలమున కాతఁడు విరక్తుఁడై యామెయనుమతిపై నడవికేఁగి తపమొనర్చి, దర్శనజ్ఞాన గమనవిశుద్ధి మహిమాసంపన్నుండై శిష్యులకు జైనధర్మజ్ఞానములు బోధించుచు, పరశునాథ తీర్థకరుఁడనంబరగి (౨౩వ తీర్థకరుఁడు) కడకు నిర్వాణపద మందుటయుఁ జిత్రింపఁబడినది. పిదపవ్యాఘ్రగుహయనియొకటి కలదు. అది నోరువిప్పి యావులించుచున్న పులితలకాయవలెను, అందు నోటిలోపల నొకగుహయుం జెక్కబడినది. గణేశ (లేక వినాయక) గుహయనివేఱొక్కటిగలదు. అందు రెండేనుఁగులును ఒకగణేశవిగ్రహమును కలవు. మరియొకచో సూర్యవంశకురుగ దర్శనగుహయని యొకగుహ కలదు. గణేశగుహయందు కొన్ని శాసనములు కలవు గాని, యవి తెలియరావు ఒకశాసనములోని కొన్ని తెలిసిన భాగములనుండి యీగుహ క్రీ. పూ. ౧౫౩ మొదలు ౧౫౦ వఱకు నిర్మింపబడినదిగ సోల్పదగియున్నది. ఖరవాలుండను నృపతి నొకగుహం జయించినటుల నొకశాసనమునుండి సోల్చుచున్నారు

ఖండగిరియందునను మేకలున్న గుహలున్నవి గాని యవి రూపుమాయుచు శిథిలావస్థయందున్నవి ఖండగిరిపైనని ఇప్పుడొక జైనదేవళమును అందు జినదేవుఁడును ఇరువదినలుగురు తీర్థకరుల విగ్రహములను దిగంబర జైనులు పూజించుచున్నారు. ఈదేవళము నవీనముగుకట్టడము మరియు జైనుల ధర్మశాలయు దేవస్థానపు కార్యాలయమున కొండదిగువను గలవు.

**ఖండజాతి తాళములు** — సంగీతశాస్త్రమున సప్తతాళములందుగల యైదుజాతులలో నొకటి [జాతి(లయ) ప్రాణము చూడుఁడు].

**ఖండిత గోత్రము** — గర్గ ఉపగణము చూడుఁడు.

**ఖండేశజిల్లా** — ధూలియా ముఖ్య పట్టణము. (బొంబై రాజధాని చూడుఁడు).

**ఖండోబాక్షేత్రము** — M. & S. M. రెయిల్వే పూనా బెంగుళూరు లైనుపైనున్న జెజూరీ స్టేషను (పూనానుండి 3౨ మైళ్లు) జెజూరీ గ్రామమునందున్న ఈ సుప్రసిద్ధ క్షేత్రము ఖండోబాదేవుని భక్తికి ప్రధానస్థానము శివుని యవతారమందురు. పశ్చిమ ఇండియాయందు దీని భక్తి విశేషముగా కలదు. ఇతఁడు భూపతిగ

యుండెనట. అశ్వారూఢుడై భార్యను వెనుక నిడుకొని కుక్కయొకటి తోడరా నీమహానీయుని విగ్రహము చిత్రపటమున చిత్రించియున్నారు. దేశద్రిమ్మరివలె యీమహాత్ముడప్పుడప్పుడు వచ్చుచుండుట వారు తెల్పుచుండుట కలదు.

**ఖగద గోత్రము** — నిధృవ గణము చూడుడు.

**ఖగముఖుడు** — ఈతడు సహస్రపథుల సహాధ్యాయుడనియు, అతనిని డుండుభముగ నగునని శపించినవాడనియు చెప్పబడినది.

**ఖగేవస గోత్రము** — అగస్తి ఉప గణము చూడుడు.

**ఖగోళ గ్రహ గమనస్థల విభాగము** — ఆకాశమున గ్రహగోళములు తిరుగు మార్గప్రదేశమునంతను ఐరోపా శాస్త్రజ్ఞులు పండ్రెండుగా విభజించియున్నారు. భరతదేశపు సిద్ధాంతుల ద్వాదశ రాశి విధానమునకిది సరిపోవుచున్నది.

౧ Aquarius- దీనికి నీళ్లు పోయువాని చిహ్నము (జనవరి మాసము) Winter season లోనిది. కుంభరాశికి పోలిక కలది. ♒ గుర్తు

౨. Pisces- దీనికి చేపలు చిహ్నము. Winter season లోనిది. మీన రాశికి పోలిక కల్గినది. (ఫిబ్రవరి మాసము) ♓ గుర్తు

3. Aries-దీనికి మేక పోతు చిహ్నము Spring season లోనిది. మేష రాశికి పోలిక కల్గినది. (మార్చి మాసము). ♈ గుర్తు

౪. Taurus- దీనికి ఎద్దు చిహ్నము. Spring season లోనిది. వృషభ రాశికి పోలిక కల్గినది. (ఏప్రిల్ మాసము). ♉ గుర్తు

౫. Gemini- దీనికి కవల పిల్లలు (Twins) చిహ్నము. Spring season లోనిది మిథునరాశితో పోలికకల్గినది (మే నెల). ♊ గుర్తు

౬. Cancer- దీనికి ఎండ్రపీత (Crab) చిహ్నము. Summer season (వేసవి) లోనిది. కర్కాటక రాశికి పోలిక కల్గినది. (జూలై నెల). ♋ గుర్తు

౭. Lio- దీనికి సింహము చిహ్నము. Summer season (వేసవి) లోనిది సింహరాశితో పోలిక కల్గినది (జూన్ నెల). ♌ గుర్తు

౮. Virgo- దీనికి పడుచు (కన్య) చిహ్నము. Summer season (వేసవి) లోనిది. కన్యా రాశితో పోలికకల్గినది. ♍ గుర్తు

౯. Libra- దీనికి తక్కెడ లేక త్రాసు చిహ్నము. Autumn season లోనిది తులారాశితో పోలికకల్గినది. ♎ గుర్తు

౧౦ Scorpion- దీనికి తేలు చిహ్నము. Autumn season లోనిది వృశ్చిక రాశికి పోలికకల్గినది. (అక్టోబరు నెల). ♏ గుర్తు

ఖగోళగ్రహ చిహ్నములు

౧౧. Sagittarius- దీనికి ధనుర్విద్యాభ్యాసి చిహ్నము. Autumn season లోనిది. ధనస్సు రాశికి పోలికగల్గినది (నవంబరు నెల). I గుర్తు

౧౨. Capricornus- దీనికి మొసలి చిహ్నము. Winter season లోనిది. మకరరాశికి పోలిక గల్గినది. (డిసెంబరు నెల) ♑ గుర్తు

## ఖగోళగ్రహ చిహ్నములు

(ఎస్ట్రోనమీశాస్త్రమునందలివి)—

సూర్యగ్రహము (Sun). 

పౌర్ణమినాటి చంద్రగ్రహము. (Full Moon). 

అమావాస్యనాటి చంద్రగ్రహము. (New Moon). 

శుక్లపక్ష ప్రథమభాగపు చంద్రగ్రహము. (First quarter of the Moon) 

కృష్ణపక్ష క్షీణచంద్రగ్రహము. (Last quarter of the Moon). 

(Mercury) బుధగ్రహము. 

(Venus). శుక్రుడు 

భూమి. లేక Earth.  

(Mars) అంగారకుడు 

(Jupiter). బృహస్పతి ♃

శనిగ్రహము. (Saturn). ♄

Uranus. ♅

Neptune. ♆

గ్రహము. (Planet) ○

ధూమకేతువు. (తోకచుక్క) లేక, (Comet)– ⁎

ఉల్కలు- (Asteroids) ౨౫౦ అవి కనిపెట్టబడిన వరుస క్రమముగ 1, 2, 3, 4, మొ॥ లెక్కని వ్రాయుదురు ⁎1 ⁎2 ⁎3 ⁎4.

స్థిరనక్షత్రము (Fixed Star). ✱

Conjunction. ☌

Opposition ☍

Ascending Node. ☊

Descending Node. ☋

Degree డిగ్రీ (degree of arc) °.

Minute (S) ′

Seconds (S) ″

**ఖగోళశాస్త్రము** (ఎస్ట్రానొమీ) (Astronomy) — ఖగోళ శాస్త్రము. శాస్త్రములు చూడుడు.

**ఖటంగ ప్రపాతము** (జలపాతము)— సరస్వతీ నదీతీర వాసులు దక్షిణ దేశమునకు కొందఱేతెంచి పశ్చిమ సముద్రతీరమున కొంకణ దేశమున నివాసము ఏర్పరచుకొనిరి. వారు సారస్వతులని పిలువబడుదురు. ఇంకను కొంకణ దేశ వాసులగుటచే కొంకణులనియు పిలువబడుచున్నారు. క్రొత్తదేశమున సరస్వతీ నది యని యొక చిన్న నదికి పేరిడిరి. ఆనది పడమటి కనుమలనుండి బయలుదేరి పశ్చిమ సముద్రమున సంగమించును. మధ్యదూరమున ఇప్పటి మాంగళూరు పురపరిసరముల నొక జలపాతమై యానది సముద్రమును చేరెడిని. ఆజలపాతమునకు ఖటాంగ జలపాతమని పేరు. అపరిమితమగు ధ్వనినొసర్చుచు జలధారలు పడుచుండును.

**ఖట్మాండూ (ఖస్తమండపపురము)**- ఖస్తమండపపురము చూడుడు.

**ఖట్వాంగుడు** — ఇక్ష్వాకుసంతతి సూర్యవంశ క్షత్రియుడు. విశ్వసహుని కుమారుడు. కుమారుని పేరు దీర్ఘబాహువు. దేవాసురయుద్ధమున దేవతాపక్షావలంబియై సహాయము గావించెనని చెప్పబడినది.

**ఖట్వాహస్తము** — హస్తాభినయము చూడుడు, భరతశాస్త్రము చూడుడు.

**ఖడ్గ (కత్తి) రేఖ** — పురుష సాముద్రికము చూడుడు, స్త్రీ సాముద్రికము చూడుడు.



**ఖడ్గవంశ నృపతులు** — బంగాళము లోని కొన్ని ప్రాంతదేశమునకు తొల్లింటి సమతట దేశమును ఒకప్పుడు పాలించిరని చెప్పబడినది.

**ఖనాత్తు** — ఒక ఖాను పరిపాలించు దేశము.

**ఖత్తు** — అక్షరము వైఖరికి ఖత్తు అని పేరు. ఇది మహారాష్ట్ర భాషాపదము ఆంధ్రము లోనికిగూడ నితరభాషలలో వలెనే తేబడి వాడుకనందినది. విడివిడిగ వ్రాయు నక్షరములకు విడిఖత్తనియు, కలిపి పరిగెత్తునట్లు వ్రాయు నక్షరములకు గొలుసుఖత్తనియు వేర్వేరు విధముల ఖత్తులుండెడివి. ఇంతియేగాక వేర్వేరు సీమలందు వేర్వేరు విధముల ఖత్తులుండుటయు గలదు. నైజామురాజ్యమునందలి కొన్ని సీమలందలి ఆంధ్రాక్షరముల వ్రాతకును, ఆంధ్రదేశమునందలి విశాఖపట్టణము, గోదావరి, కృష్ణామండలముల ఆంధ్రాక్షరముల వ్రాతకును గలభేద మీఖత్తే యని యెఱుంగవలయును. గుండ్రనివి ఖత్తువ్రాత చదువ సౌఖ్యమనిపించును. ఒడ్డుఖత్తు కొంత కష్టమనిపించును. అచ్చులు ప్రబలుటతో నీఖత్తువ్రాత కొంత తగ్గినది. (దాక్షిణాత్య లిపులు చూడుడు.)

**ఖనిజములు** (నూరు)— ఖనిజములు భూమి నుండి త్రవ్వి ఎత్తబడినవి. ఖనిజములు అనగా Animal matter గాని Vegetable matter గాని కావని చెప్పబడినది. వజ్రములు, పచ్చలు, కెంపులు మొదలగు రత్నములు ఖనిజములలోనివే. లోహములు ఖనిజములలోనివే. భూమియందు ఖనిజములు వేయి వఱకుండునని శాస్త్రజ్ఞులనెదరు. పరిశీలకులు నూరు జాతులకు పేర్లిడి యున్నారు. మఱియు నింక ఏబది నిజముగ నపురూపములే. అందునను పిదప ఏబదియుంగా ముప్పది లభించిన లభించుచుండును గాని తక్కిన ఇరువది సాధించుట అరుదుగనే యున్నది. ఖనిజములలో పెక్కులు ఎన్నోది పదార్థముల కూటమి యనియు, కొన్నిటి యందు

కొన్ని తక్కువగ నుండుననియు, కొన్నిటియందు ఎన్నదికం దక్కువ కూడ నుండుననియు, కొన్ని ఒకే పదార్థముగ కలవనియు తేలుచున్నవి. ఖనిజముల రంగులు వాటియందలి పదార్థముల నుండి కల్గునని చెప్పబడినది.

Actinolite — ఇది Asbestos జాతులలో నొకటి.

Agate — A banded form of Chalcedony.

Alum - దీనిని Kalinite of alum అనియు నందురు. పటిక.

Amazon Stone- Microcline జాతి ఆకుపచ్చరంగు రాయి.

Amber—

Amethyst—

Analcite—A silicate of Alluminium and Sodium.

Antimony -

Apatite — దీనిని Phosphate of lime అని యందురు.

Apphyllite - A silicate of Alluminium.

Argonite - Carbonate of Calcium.

Arsenic -

Atacamite - Chloride of copper.

Azurite- (Chessylite అనియు నందురు). ఇది Carbonate of copper.

Beryl-

Bismuth-

Black lead- దీనిని Graphite అనియు నందురు.

Blue asbestos- దీనిని Crocidolite అనియు నందురు.

Baryles- a sulphate of barium.

Cairngorm- ఇది కసుపుపచ్చ రంగుగల Quartz జాతి శిల.

Calcite- దీనిని Rock milk అనియునందురు. (రాతిపాలు).

Carbuncle- a form of garnet.

Cat's eye- Chrysoberyl అనియునందురు. (మరకతము).

Chalcanthite- a sulphate of copper (మైలతుత్తపు రకములలో నొకటి).

Chalcedoney - ఇది Quartz రాతి జాతులలో నొకటి.

Chalybite — ఇది Carbonate of iron.

Chessylite - దీనిని Azurite అనియు నందురు. ఇది Carbonate of Copper.

Chondrodite - ఇది New Jersey ore అని వాడుక నామముగలది

Chrysoberyl - దీనిని Cat's eye అనెదరు. (మరకతము)

Chrysocolla - ఇది Silicate of Copper రకములలో నొకటి

Chrysoprase - దీనిని Pale apple green Chalcedony అని యందురు

Cinnabar- - ఇది Sulphide of mercury (హింగులీకము).

Copper pyrites- గనిలో ద్రవ్యముకు సాధారపు రాగి ఖట్టు (ore)

Crocidolite — దీనిని blue asbislos అనియందరు.

Crystal Quartz.

Cuprite- ఇది Oxide of Copper.

Cuprouranite-

Curussite - ఇది White lead ore.

Diamond - (వజ్రము) రత్నము.

Emerald - (పచ్చ) రత్నము.

Epidote-ఇది A silicate of Alluminium, Iron, and Calcium అని చెప్పబడినది.

Epsomite - ఇది Epsom salts అనంబడు చున్నది.

Erythete-

Fluorite - దీనిని Fluorspar అనియునందురు. ఇది Fluoride of Calcium అని పోల్చc బడినది.

Fluorspar-

Gacinth - దీనిని Hyacinth అనియునందురు. ఇది Zircon యొక్క ఎఱ్ఱజాతి రూపమని చెప్పcబడినది.

Galena - దీనిని Sulphide of lead అనియు నందురు.

Garnet-

Graphite - దీనిని Black lead అనియునందురు

Greenockite - దీనిని Sulphide of Cadmium అనెదరు

Gypsum-

Haematite - ఇది Iron ore (ఇనుపరాళ్లలో నొకజాతి)

Hornstone - Hornstone Quartz జాతి రాళ్లలో నొకటి

Hyacinth - దీనిని Jocinth అనియునందురు. Zircon యొక్క ఎఱ్ఱరంగుగలరూపాంతరము.

Idocrase - దీనిని Vesuvianite అనియు రు.

Iron Pyrite-

Jade-

Jasper - ఇది Quartz జాతిరాయి. దీనిరంగు ఇందున్న Iron-oxide వలన గల్గినదని చెప్పcబడినది.

Kalinite - దీనిని Alum అనెదరు. (పటిక లలో నొక తెగ పటిక)

Kyanite - ఇది Silicate of alluminium అని పోల్చcబడినది

Labradorite - దీనిని felspar అని యందురు.

Lapislazule-

Lemonite - దీనిని Brown రంగు ఇనుప రాయి యని పోల్చియున్నారు.

Linarite - ఇది Sulphate of lead and copper అనంబడును

Malachite - దీనిని Copper carbonate యొక్క ఒక రూపము నెదరు.

Meerschaum - నీటినురగ యని యర్థము. నీటియొక్క తేలును Seafroth అనియర్థము.

Metalic Copper ఇది రాగిగనులందు రాగి ore తో కలసి దొరకినది, రాగిజాతి.

Metalic Gold - ఇది బంగారు గనులందు దాని తో కలసి దొరకినది, బంగారుజాతి.

Metalic Platinum - ప్లాటినము గనులందు దానితో కలసి దొరకిన అదేజాతిది.

Metalic Silver - ఇది వెండిగనులందు దాని తో కలసి దొరకిన అదేజాతి

Mica - అభ్రకపు రేకు (అభ్రకము చూడుము) కాకిబంగారమని యు నందురు

Microcline - ఇది potash felspar అని పోల్చcబడినది.

Mispickel - దీనిని Arsenical iron pyrites అని పోల్చియున్నారు.

Moonstone - (చంద్రకాంతమణి) ఇది orthoclase జాతి సంబంధపు మణి.

Muscovite దీనిని Potassium Mica అని యు నందురు.

Native copper - దీనిని Metalic copper అనియు నందురు (చూడుము).

Native Gold - దీనిని Metalic Gold అని యు నందురు (చూడుము).

Native platinum - దీనిని Metalic platinum అనియు నందురు (చూడుము).

Native silver- దీనిని Metalic silver అనియు నందురు (చూతుడు).

Natrolite- దీనిని Needle stone అనియు నందురు.

Needle stone- దీనిని Natrolite అనియు నందురు

Oligoclase- దీనిని Sun stone అనియు నం దురు. (సూర్యకాంతి మణి)

Olivine- ఇది సానబట్టినదైవ Peridot అను పేరంబరగెడిని.

Onyx- ఇది Chalcedony రూపములలో నొకటి యుండు రు.

Opal- ఇది స్వచ్ఛకలేని Silica యొక్క పరి ణామము. ఇందు నీరు (Water) కలదు.

Orpiment ఇది Sulphide of arsenic అని చెప్పబడినది.

Orthoclase- దీనిని Potash felspar అని పోల్చియున్నారు.

Piradot- దీనిని సానబట్టినయెడల Olivine stone అనిపిలుతురు

Prehnite- ఇది silicate of alluminium and calcium.

Pyromorphite- Lead ore.

Quartz- ఇది శాఖాపురాయి, ఇందనేక రకము లు కలవు.

Rodochrosite- ఇది Carbonate of man- ganese అనంబడును.

Rose Quartz- ఇది Quartz రాతి జాతుల లో మంచిజాతిరాయి.

Ruby- (కెంపు) నవరత్నములలో నొకరత్నము.

Sapphire- (నీలము) రత్నములలో నొకటి.

Serpentine- (నాగమణి యనియు నందురు).

Sodalite-

Spinel- దీనిని double oxide of allumi- nium and magnesium అందురు.

Stannite- ఇది Tin pyrites.

Stibnite- ఇది sulphide of antimony అని పోల్చిరి.

Stilbite- ఇది silicate of alluminium and sodium అని పోల్చిరి.

Strontianite- Chief ingredient in red fire అని చెప్పబడినది.

Sulphide of Mercury - దీనిని Cinnabar అని యందురు.

Sulphur - గంధకము.

Sun stone - దీనిని Oligoclase అనియు నందురు. సూర్యకాంత మణి

Talc -

Tin pyrite -

Topaz - (పుష్యరాగము).

Tourmaline -

Turquoise -

Vesuvianite - దీనిని Idocrase అనియు నందురు

Wavellite - ఇదిPhosphate of allumi- nium అని చెప్పబడినది.

Wulfenite - దీనిని Molybdate of lead అని యందురు.

Zercon - A crystal found in granite గ్రనైటు రాతియందుగాని, రాళ్లలోగాని దొరకునది స్వచ్ఛమైనరాయి.

Zink - Blende.

Zincite - దీనిని Zinc ore అని కొందఱును, Zinc జాతులలో నొక జాతి Zinc అని కొందఱును ఆభిప్రాయభేదముగల్గియున్నారు.

ఇటుల నీ ఖనిజములు నూరు మాత్రము పేరు లిడబడినవి.

**ఖనిత్రుఁడు** — తండ్రి ప్రజాని, కుమారుఁడు క్షుపుఁడు, పౌత్రుఁడు వివింశుఁడు.

ఖనిత్రుని నాశనమునకై అతని సోదరుఁడు, ఖనిత్రుని వైభవాభివృద్ధుల కోర్వలేక మారణహోమము చేసెననియు, అందు కృత్తియను నొక శక్తి జనించెననియు, అది సకల గుణగణ సహితుఁడై అగణ్య పుణ్యచరిత్రుఁడును, ధర్మనిరతుఁడునగు ఖనిత్రుని డాయనోల్లక తన్ను పంపిన ఖనిత్రుని సోదరునిం బొమార్చె ననియు జెప్పఁబడినది.

ఇంకను ఖనిత్రుని సంతతియందే వివింశుఁడను వాని కుమారుఁడును, ఖనిత్రుఁడనిపేరు ఈతఁడు పుత్రార్థియై గోమతీ నదీతీరమున ఇంద్రుని గూర్చి తప మొనర్చి బలాశ్వుఁడు లేక కరంధముఁ డను సుతుని బడసెను

**ఖరాయము** — అష్టవిధాయుములు చూడుఁడు.

**ఖరింక గోత్రము** — ఔతథ్య ఉప గణము చూడుఁడు.

**ఖరుండ గోత్రము**—కణ్వోపగణము చూడుఁడు

**ఖర్జూరపు చెట్టు** — లా Phoenix dactylifera. ఆంగ్ల. Date tree సం ఖర్జూరమ్, ఖర్జు, స్కంధఫలా, కొందఱు నిశ్శ్రేణీ యని కూడ వాడిరి. ఈత చెట్టును బోలియుండు వృక్షము ఖర్జూరపుపండు, ఖర్జూరపుకాయలు దేశప్రసిద్ధములు ఇవి ఇసుకఎడారులలో నచ్చటచ్చట నీరుగల తావులందుండునవి. ఆఫ్ఘనిస్థానము, అరేబియా, మొరాకో, పాలస్తీనా దేశములందును, ఆఫ్రికాఖండమునందును విస్తారము కలవు. ఈనడుమ హైదరాబాదు రాజ్యమున నచ్చటచ్చట పైరుచేయఁబడుచున్నది. నాటిన యేడు సంవత్సరములకుఁ గాచును. ఎండను ఇసుకను లక్ష్యముచేయని యీ వృక్షమునకు పాదుదలనీరు గల్గిన చక్కఁగ ఫలించును. ఆంధ్ర దేశమున నచ్చటచ్చట పైరగునది. ఖర్జూరపు పూవ్వరపము లోనికిచ్చిన ఋతురక్తస్రావము, నీళ్లవిరేచనములు, మేహపైత్యము, రక్తపైత్యము, రక్తవిరేచనములు, రక్తాతిసారము నివారణమగును. పుక్కిలించిపట్టిన నోటిపూత, నోటిలోనిపుండ్లు మాయును. మేహశాంతి, చలవ జేసి, వమనములు, పైత్యవికారము, పైత్యజ్వరము, నివారించును. ఖర్జూరపుచెట్టునుండి కల్లు గీయుదురు. అది వాతము, గురుత్వము జేయునందురు.



ఖర్జూరపుకాయలు- పండకమునుపు చక్కఁగ ముదిరినకాయల నెండబెట్టి నిల్వయుంచుకొనిన నవి పండుకంటె పథ్యములగునవి. వేడి, మేహశాంతి, బలము, ధాతుపుష్టియుం గల్గించును. పక్షవాతపు బాధలం దగ్గించును. గుండెలకు బలముజేయును పుంసత్వము నుద్రేకించును. నడుమునొప్పి, కీళ్ల నొప్పుల నివారించును. ఉబ్బసము, అతిసారము, జ్వరము, తాపము, దాహము, పాండురోగము, మూత్రఘాతము, మూలవ్యాధి, రక్తపైత్యము, వాతదోషములపై చక్కఁగ పనిజేసియుండును.

ఖర్జూరపు పండునకును పైగుణములె ఇంచుమించు గల్గియుండునుగాని, కాయలకన్న నపథ్యమని చెప్పఁబడినది మొత్తమున ఖర్జూరము ఎక్కువగా తినుచుండిన వాతతత్వము గలవారికి మేలును, ఉష్ణతత్వము గలవారికి కీడునుచేయును. లోన కంతులంగల్గించును. రక్తమునార్చి, జిహ్వకు అరుచింగల్గించి, శ్లేష్మము నుద్రేకించి వికారము గల్గించును. దంతములకు, నేత్రములకు బలహీనత నష్టముంగల్గించును. ఖర్జూరమునకు బాదం

పప్పు, గసగసాల చమురు, దానిమ్మకాయలలోని గింజలనీరు, తేనె, సికింజబీను విరుగుడులని చెప్పఁబడినది. ఇంకను కొందఱు అనుభవవేత్తలు నువ్వులనూనె, నెయ్యి, వేపవిత్తులు, ఎండుమిరపకాయలు, ఉష్ణోదకము గూడ విరుగుడులే యందురు. ఖర్జూరపుచెట్టు నీడనుండిన త్రిదోషహారమని చెప్పఁబడినది. పచ్చిఖర్జూరపుకాయలు గురుత్వముగ నుండుటదక్క దోషముచేయవని యందురు.

**ఖర్జూరపురము** — ఇది బుందేలు ఖండమునందు చందేలు రాజవంశస్థులగు ప్రభువులకు రాజధానియై యుండెను.

**ఖరోష్ఠీ లిపి** — ఇది భరతదేశపు లిపులలో నొకటి. (లిపులు, భరతదేశపులిపులు, దేవనాగరలిపి చూడుఁడు) అశోక చక్రవర్తి తన ధర్మశాసనములను భరతదేశపు వాయువ్యదిశను (పశ్చిమోత్తరమున) ఖరోష్ఠీలిపితోనున్న తక్కిన తావులందు బ్రాహ్మిలిపితోనున్న వేయించి యుండెను. (ఇరాన్పాలీలిపి చూడుఁడు).

ఇప్పటి ఆఫ్ఘనుస్థానము, తురుష్కస్థానప్రాంతముల నీ ఖరోష్ఠీలిపియందు శాసనములుంట నీ ప్రదేశములం దక్కాలమున భారతీయరాజ్యములుండినటుల స్ఫురింపకపోదు. ఈ లిపి బ్రాహ్మిలిపివలె ఎక్కువ వ్యాప్తినందినది కాదు.

ఖరోష్ఠీలిపియందు ఆరు అచ్చులు ముప్పదియారు హల్లులు కలవనియు, ఇప్పటి పశ్చిమోత్తర సరిహద్దుపరగణాసీమలందు, తత్ప్రాంతసీమలందునను గాననగు అశోకశాసనములందునను, యవన, శక, కుశ, వంశస్థుల శాసనములందునను ఈ లిపికి ముప్పదితొమ్మిది వర్ణము లుండినటులను, మరియు నీ ఖరోష్ఠీ ద్వివిధ లిపులందు హల్లులతో అచ్చులంగూర్చి వ్రాయు విధానములు కలవనియు, కాని యవి రెంటియందు వేర్వేఱుగ నున్నవనియుం దెలియుచున్నది.

లలితవిస్తరమను గ్రంథమున బుద్ధభగవానుఁ డెఱిఁగినటుల చెప్పఁబడిన గాంధారలిపి ఖరోష్ఠీలిపియొక్క విభేదమేనని సుప్రసిద్ధ పరిశీలకులగు శ్రీలక్ష్మణరావుగారు అభిప్రాయపడియున్నారు. విశ్వకోశ నిఘంటు కారకుఁడు ఈ ఖరోష్ఠీలిపి నుండియే అపసవ్యలిపులన్నియు (కుడివైపు నుండి ఎడమవైపునకు వ్రాయు ఉరుదు మొదలగు భాషలందలివి) జనించినవని వ్రాసెంగాని దీనింగూర్చి కొందఱభిప్రాయ భేదములంగల్గియున్నారు.

ఖరోష్ఠీలిపియందు కాశ్మీరాది దేశభాముల నేలిన హువిష్క, కనిష్క, జుష్కానులగు మహారాజులు తమ శాసనములను హిమాలయప్రాంతముల నచ్చటచ్చట వేయించిరి.

**ఖల్వాటకః** — దద్రురోగమునకు ఆయుర్వేద వైద్యశాస్త్రమున పేరు.

**ఖల్యాయన లేక ఖల్వాయన గోత్రము** — పరాశరగణము చూడుఁడు.

**ఖల్వాటబిల్వీయ న్యాయము** — బట్టబుర్ర (బట్టతల) పై బిల్వఫలము పడినట్లని యర్థము. అనఁగా తలవెండ్రుకలు లేకుండుట వలన మారేడుపండు తలపై బడుట మరి బాధకరమని భావము. ఒకలోపము గల్గియున్న వారికి ఆలోపముండినతావుననే ఘాత సంభవించుట కీన్యాయము వర్తించును. కాని యాఘాత తనకు తానే సంభవించుట ముఖ్యము.

**ఖల్వాయని గోత్రము** — పరాశరగణము చూడుఁడు.

**ఖలాయని గోత్రము** — అగస్త్యుపగణము చూడుఁడు.

**ఖలి గోత్రము** — వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.

**ఖలీఫాత్** — కలీఫాత్ చూడుఁడు.

**ఖల్లీ** — హస్తపాదావమర్దన రోగము.

**ఖలే కపోత న్యాయము**— పావురములు కళ్లములో వాలుటయని యర్థము. అలంకార శాస్త్రమున నీ న్యాయము అనేక కారణముల కార్యమేకకాలమున జరుగుట గూర్చి వాడఁబడినది.

**ఖస్తమండప పురము** (ఖట్మాండు)— ఇది నేపాళదేశపు రాజధానిపురము. తొల్లింటి పేరు రాను రాను మారి ఇప్పుడు ఖట్మాండూ యని పిలువం బడుచున్నది. (నేపాళదేశము చూడుఁడు. హిమాలయ పర్వత వర్గములు చూడుఁడు). ఇది మహారాజ నివాసము. ఇట తులజాభవానీ దేవస్థానమును, మచ్ఛీంద్రనాథ యోగి దేవస్థానమును సుప్రసిద్ధములు. మచ్ఛీంద్రనాథయోగి బౌద్ధుఁడు, నేపాళమున వర్షములులేక క్షామములు కలుగ ప్రార్థితుఁడై వర్షములం గురియఁజేసి క్షామముం బాపిన వాఁడని చెప్పుదురు. దేశరక్షకుఁడుగ చెప్పఁబడు చున్నవాఁడు. తులాభవాని ప్రభు కుటుంబ రక్షకురాలైన దేవి. ఈసమీపముననే దేశప్రసిద్ధమగు పశుపతినాథ క్షేత్రము కలదు.

---

**ఖాఙ్కాయన గోత్రము**— హారిత ఉపగణము చూడుఁడు.

**ఖాఙ్కలాయన గోత్రము**— భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**ఖాండవ ప్రస్తము** (ఇంద్రప్రస్తము)- పాము(ల) కథనము చూడుఁడు.

**ఖాండవ వనము** — మీరతు నగరమునకు సమీపమున నున్న ముజఫర్ నగర్ ఉండిన తావున ఖాండవ వనముచు చున్నారు. ఖాండవవనము గోర్లాకీకుగుప్తవనము లోనిదని చెప్పఁబడినది. బులాంద్ షహరు మొదలు షహరాన్పూరు వరకు ఖాండవ వనము వ్యాపించి యుండెడి తావుగా పోల్చి యున్నారు. అశ్వరథ నదిపై నుండినటుల మహాభారతము వనపర్వము ౧౬౦ యధ్యాయమున నయ్యెడిని. పద్మపురాణము ఉత్తర ఖండ యందు ఖాండవ వనము యమునాతీరమున నుండెనియు, ఇంద్రప్రస్తము దానిలోనిదనియు, ఖాండవ ప్రస్తమని కూడ పేరుండెననియు తెలియు చున్నది.

ఖాండవ వనమున అగ్నిదేవుని యొక్క ఆకలి యర్జునుఁడు తీర్ప దహింప నిచ్చెనట. ఖాండవ వనము వనౌషధులకు పేరుఁదిన వనమని మహాభారతము ఆది. ౨౨౯ కలదు. ఇంద్రప్రస్తము ఢిల్లీలోని ఇంద్రపాటర్ అనం బరగుచున్న తావు. శ్వేతకియొనర్చిన మహాక్రతువున పన్నెండు వత్సరము లొకేధారగ యాజ్యాహుతుల వలన సనారోగ్యము కల్గుట, వనౌషధులంగల్గిన నీఖాండవ ప్రస్తవము పైబడి నగ్నికనుమతి నిచ్చిరట.

**ఖాండిక్యుఁడు**-నిమిసంతతి క్షత్రియుఁడు. కొంతకాలము మిథిల భూపతిగ నుండిన వాఁడు. తండ్రి మితధ్వజుఁడు. పితామహుఁడు ధర్మధ్వ

జుఁడు, పినతండ్రి కృతధ్వజుఁడు, పినతండ్రి కుమారుఁడు కేశిధ్వజుఁడు, ఖాండిక్య జనకుఁడు, కేశిధ్వజునితో వైరమున తన రాజ్యాధిపత్యమును గోల్పోయెనని యు, అటవియందు వసించుచు తపం బొనరించు చుండువాఁడనియు చెప్పఁబడినది.

ఒకతరి కేశిధ్వజుఁడొక యాగమొనర్ప యాగ పశువు పులిచే చంపబడెనట. దానికి ప్రాయశ్చిత్తమడవింబట్టి తపం బొనరించుచున్న ఖాండిక్యుని కడకేగి దీనత మన్ననవేడి తన యాగపరిసమాప్తి విధాన మెఱింగింపవలయునని ప్రార్థింప నాతండు నివ్వి దానికిం బదులు బ్రహ్మజ్ఞాన ముపదేశించి ఐహిక కాంక్షల వీడి బ్రతుకుమని యానెనట.

**ఖాత (కాన్త్రము) గణితము** — ఖాతమనిన త్రవ్వఁబడినదని యర్థము. చెరువులు మొదలగువాటిం ద్రవ్వుటకైన లెక్కవిధానమని భావము ఈ విధానము లీలావతి గణితమను గ్రంథమున చక్కగ వివరింపఁబడినది ఇది భరత దేశమున నాదికాలమునందు వాడుకయందుండిన లెక్కవిధానము. ఈ శాస్త్రము త్రవ్వడపు కూలుల లెక్కించుటకు, క్షేత్రఫలజ్ఞానమునకు ఉపయోగించునని చెప్పఁబడినది.

ఇది విషమఖాతమనియు, మధ్యోన్నతవిషమ ఖాతమనియు, సమఖాతమనియు, సమమితిఖాత మనియు, వృత్తఖాతమనియు నైదు భాగములుగ నైదు తెఱంగులై యున్నది

౧. విషమఖాతము- శ్లో॥ ఖాతేఽథతిగ్మకర తుల్యచతుష్కభేచ। క్షేత్రస్యాత్ఫలం నవమితి, కిలయ త్రవేధః। వృత్తేతథా వదశవిశ్రుణిపూచవేధే। సూచీఫలంవదతయోశ్చపృథక్పృథఙ్మే॥

౨. మధ్యోన్నత విషమఖాతము-శ్లో॥ భుజవక్ర తయాదైర్ఘ్యం। దశేశార్కకరైర్మితమ్ - త్రిషు స్థానేషు షట్పంచ। సప్తహస్తాచవిస్తృతిః॥

శ్లో॥ యస్యఖాతస్యవేధోపి। ద్వచతుస్త్రికరస్సఖే। తత్రఖాతేకియాత్ః। స్యుర్ఘనహస్తాః ప్రచక్ష్వమే॥

3. సమఖాతము- జాతంయద్ధోక్తకరణేన - ఖాతఫలం ఘనహస్తాః॥

౪. సమమితిఖాతము- శ్లో॥ ఖాతాంతరేకరణ సూత్రం సార్ధవృత్తం। ముఖజతలజ - తద్యుతిజ క్షేత్రఫలైక్యంహృతంషడ్భిః॥ శ్లో॥ క్షేత్రఫలం సమమేతద్వేధగుణం ఘనఫలం స్పష్టం సమఖాతఫలత్ర్యాంశః - సూచీఖాతేఫలంభవతి॥ ఉదాహరణమ్- శ్లో॥ ముఖేదశ ద్వాదశ హస్తతుల్యమ్। విస్తారదైర్ఘ్యంతు తలేతదర్ధమ్। యస్యాస్సఖేసప్తకరశ్చవేధః। కాఖాతసంఖ్యావదతత్రవాప్యాం।

౫. వృత్తఖాతము- (నూతులంద్రవ్వలెక్క).

**ఖ్యాతి** — దక్షప్రజాపతి కుమార్తెలలో నొకరిత. భృగువుయొక్క భార్య. కుమాళ్లు ధాత, విధాత యనువారలు లక్ష్మీదేవి ఈమె కుమార్తె. మఱియు ఉల్మకుని కుమారునిపేరు ఖ్యాతి యనియుం గలదు ఈతని సోదరుఁ డంగుఁడు.

**ఖ్యాతివాదములు** — వాదషట్కము చూడుఁడు

**ఖాదంతీముఖ గోత్రము** - శాండిల గణము చూడుఁడు

**ఖాదర్మాయన గోత్రము** — శౌనక లేక గ్రత్సమదగణము చూడుఁడు.

**ఖారమాయనగోత్రము**— శాండిల గణము చూడుఁడు

**ఖారీ** — నాల్గుద్రోణములు ఎత్తు ప్రమాణము. ద్రోణమున ౨౪ తులముల శేరు తూనికతో 3౨ శేర్లని ఎఱుంగునది.

**ఖారోష్ట్ర దేశము** (కాష్గార్) — తుర్కస్థాన దేశమున చిన్న బోఖెడియా యనం

బడుచున్న దేశమున కాదిని ఈపేరు వాడుకయం దుండెననియు, పూర్వపు అక్షరలిపి యగు ఖారోష్ఠ్రి. ఈదేశమునుండియే భారతదేశమునకు వ్యాపించెననియు, Dr. Stein పండితుడు తన Sand-buried Ruins అను గ్రంథమున ౭౦౭ పుటయందు తెల్పియున్నాడు.

ఖారోష్ట్ర దేశమును జంగిస్థానుడు జయించె ననియు, అతనిసుతు లాతనిరాజ్యమును పంచు కొనుటయందు ఇది జగతై యను సుతుని వాటాకు వచ్చెననియు, అతనినుండి తైమూరు లేః తామర్లన్ జయించి యాక్రమించెననియు, క్రీ వె ౧౭౧౮ లో చీనావారి హస్తగత మయ్యెననియు, Wright's Marco Polo అను గ్రంథమున వివరింపబడినది. ఖారోష్ట్ర లిపి సుప్రసిద్ధము గాన వేఱుగ వివరింపబడ లేదు.

**ఖాలిథం** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున కపాలరోగమునకుఁ బేరు.

**ఖాసదేశము** (ఖాసుల దేశము)—కాశ్మీర దేశమునకు దక్షిణమునను, ఆగ్నేయమునను వ్యాపించి ఖుస్తవాడు మొదలు పశ్చిమముగా వితస్థానదివరకు గల దేశము ఇంను రాజపురిలో హారసంస్థానములు చేరియుండును. ఇప్పుడు ఖాఖా లనంబడువార లీఖాసదేశపు ఆదినివాసు లనియు, వారికిఁ దొల్లింటిపేరు ఖాసులనియు Dr. Stein's రాజతరంగిణీ Vol. II యందుఁ జెప్పఁబడినది. మార్కండేయపురాణము ౫౭ యందు దీని ప్రశంసగలదు.

---

**ఖీవా ఖనాత్తు** — మధ్యతురుష్కస్థానము చూడుడు.

---

**ఖుంజ్గ** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున వాతరక్తరోగమునకుఁ బేరు.

**ఖురాసాన దేశము** — శ్లో॥ హింగు పీఠం సమారభ్య । మక్కేశాంతం మహేశ్వరి । ఖురాస్థానాభిధో దేశో । మ్లేచ్ఛమార్గపరాయణః॥ అని చెప్పంబడియుంట హింగుళాదేవి పీఠము మొదలు (బాలోచ్ దేశము చూడుడు) అరేబియా దేశముదనుకఁ దొల్లియొకప్పుడు ఖురాసాన్ దేశమైయుండనోపు. ఇట హింగుళాదేవి యన సంయుక్త రాష్ట్రములకుం జెందిన కుమాన్ (కూర్మాచల) డివిజనులోని హింగుళా దేవ స్థానముకాదని యెఱుంగునది. (సులైమాన్ పర్వతపు హింగుళాదేవి యని భావము). దీనినిప్పుడు Central Asia లోని భాగమని పోల్చు చున్నారు. వామపుపంటకు, గుఱ్ఱములకుం బేరందినది. పారశీక దేశమునకు లోబడిన దేశమని తేలుచున్నది. ఖురాస్థానమన డక్కల ప్రదేశమని యర్థము. బహుశః గఱ్ఱపుడెక్కలు గానోపు. తరువాత స్థానము అనుపదము వారి దేశభాషలో సాన్ అని మారియుండును.

---

**ఖిరాల్నాజిల్లా** — ప్రధానస్థానము, ఖుల్నాపురము. (బంగాళాదేశము చూడుఁడు).

---

**ఖేచరనాథ మఠము** — హిమన్నగముపై టిబెట్టుదేశపు వాగ్దున కర్ణాలీ నదీ తీరమునందు తకలాకోటకు ఆగ్నేయ దిశగా పది మైళ్ల దూరమునందున్న గొప్ప మఠము. తొల్లింట హిందూ సంతస్థులదిగా నుండి, పిదప బౌద్ధుల నాడు బౌద్ధాక్రాంతమై నేటికిని అట్లే యున్నది. ఇట గ్రామములేదు. మఠమును, అందలివారును గ్రామము వలెనే యుండెడిని. గొప్ప దేవాలయమున ఖేచరేశ్వర శివలింగమును, ఖేచరీదేవియు విశిష్టమై యుండి బౌద్ధులచే పూజింపంబడు చుండురు. రాగి, ఇత్తడి, గచ్చుమన్ను, కుండ విగ్రహములు బుద్ధభగవానునివియు, శ్రీరామ, సీతాలక్ష్మణ భరత శత్రుఘ్నులవియు, రావణాది అసురలవియు విగ్రహము లింద కలవు. వీరందఱు బౌద్ధులైరనియు, బుద్ధుని శిష్యులనియు నచటి వారందురు. ఈమఠమున హిందువులు, బౌద్ధులు కూడ పూజించు చుందురు.

మార్గము తకలా కోటనుండి కర్ణాలీ నదీ తీరమునసే గోలాఘాట్, జూడికోట్ గ్రామముల గుండా నడచును. ఖేచరనాథము ౨౨౮ భువనములలో నొకటిగఁ జెప్పఁబడినది. ఇటనుండి చంద్రనాథము, ముక్తినాథము, దామోదర కుండము నను క్షేత్రములు దర్శింప నగును.

**ఖేచరీముద్ర** — యోగాభ్యాస విధానమున చెప్పఁబడిన వింశతిముద్రలలో నొకటి. నాల్కక్రింది పలుచనిపొరను నేర్పరియైన గురుని సాహాయ్యమున వారమునకొకసారి తలవెంట్రుకంత కత్తితో ఛేదించి, తిరిగి కలియకుండ సైంధవ లవణము నటరాచుచు, నాల్కకిరుదెసలా వెన్న రాసి సాగదీయుచు మూడుసంవత్సరముల వరకు శ్రమచేసి ప్రయత్నించిన, నాల్క పొడవుగసాగి ఆయత్తమగుననియు, అప్పుడానాల్కను కొండనాల్కవద్ద జిహ్వారంధ్రములోనొన్ని లోని కెక్కించి భ్రూమధ్యమందు దృష్టినిల్పియుంచుట ఖేచరీముద్ర యనంబడును.

ఈయభ్యాసమువలన క్షుత్పిపాసలు నశించుననియు, శరీరబలము స్థిరపడుననియు, మాంద్యము దూరమై దేవతాశరీరతుల్యమై సమాధి అవస్థ సిద్ధించుచు అమృతపాన అవస్థగల్గుననియు చెప్పఁబడినది.

**ఖేతకము** — ఇప్పుడు కెయిరా యనుచున్నారు. గుజరాతునందలి అహమ్మదాబాదు పురమునకు దక్షిణముగా ౨౦ మైళ్ళ దూరమున వేత్రవతీ నదీతీరమునగల శైవక్షేత్రము. వేత్రవతీ నదిని ఇప్పుడు వట్రాక్ అనెదరు. పద్మపురాణము ఉత్తర, ౫౧ యందున ప్రశంసించబడినది. దశకుమారచరిత్ర, ౬ అధ్యా. దీనివివరణము కలదు.

**ఖేమవతీ నగరము** — క్షేమవతీ నగరము చూడుఁడు.

**ఖేరీజిల్లా** — ఖేరీనగరము ప్రధానస్థానము. (అయోధ్య ప్రోవిన్సుచూడుఁడు).

**ఖైబరు పేస్**—కనుమమార్గము భరత దేశపు వాయువ్యదిశను (పశ్చిమోత్తరము) భరత దేశమునుండి ఆఫ్గను (అఫగ) దేశములోని కేగు మూడు కొండమార్గములలో ముఖ్యమగుమార్గము. తక్కిన రెండుమార్గములలో నొకటి కుర్రం నది లోయగుండా ఆఫ్ఘనుస్థానములోని కరగెడిని. రెండవది డెరాఇస్మాయిలాను పురమునుండి పశ్చిమముగా గోమాల్పేసుగుండా గజినీపురమునకుం జేరి యటనుండి కాబూల్నగరము కరుగు వేఱు బాటగూడా రాజధానికి జేరుకొనును

నార్తు వెస్టు ప్రోవిన్సున, ప్రధానపురమగు, పెషావరు (శాల్లినెటి పురుషపురము లేక పుష్కలావతి) నుండి ఖైబరు కనుమమార్గముగూడా ఆఫ్ఘనుస్థానములోని కేగవచ్చును పెషావరుపురము గొప్ప సైన్యస్థానముగనున్నది ఇటనుండి ఖైబరు రస్తాగుండా వరకు, ఖైబరుమార్గము తగులును జమరస్తు వకునొకండమైళ్ళ పొడవు

జమరస్తునొంను ఖైబరుమార్గము ప్రారంభమగును. పెషావరునుండి ఖైబరుమార్గముగుండా ఇనుపబాట వేయబడినది. ఖైబరుమార్గపు ప్రారంభమున జమ్రూదను గ్రామమును, ఒకి పాటి గ్రామమునకలదు ఆగ గ్రమున బ్రిటీషుసైన్యము లుంపబడినవి. జమ్రూదు దుర్గముకడ నొకరైల్వేస్టేషను కలదు ఖైబరుమార్గము ప్రవేశించినపిదప నేను మైళ్ళలో చాగై యనబడు కుగ్రామము కలదు. అట నొక రైల్వేస్టేషనును, పిదప నాల్గుమైళ్ళలో మహా దుర్గ మనబడు కుగ్రామముకడ వేఱొక రైల్వేస్టేషనును కలవు ఇట కతిసమీపమునన్నే, ఆలీ మస్జిదను కోటయు నింకొక కుగ్రామమును, ఒక మహమ్మదీయ భక్తునిగోరియును కలవు. రైళ్లు గాని మోటార్లుగాని లేని శాల్లింటికాలమునం దీయాలీమసీదు దుర్గము ఈమార్గమున నడచు పాంథులకు విశ్రామ స్థలముగ ఒకరాత్రి రక్షణ స్థలముగా నుండెను. ఇట్టితావున నొకమహాత్ముని గోరీ యుండుట సమంజసమనితలంచి యాయూర నుండిన, యొక ముసలిభక్తుం బరిమార్చి, పాతి గోరీకట్టిరని, యాప్రాంతముల నొక కింవదంతి వ్యాపించియున్నది. ఇంది నిజమున్నను లేకున్నను ఆలీమసీదునాదలిగోరిమహమ్మదీయయాత్రాస్థానముగనైనది.

అటనుండి యైదుమైళ్ళలో జాతారాయను రైలుస్టేషనును ఇంక నైదుమైళ్ళలో లాండికోటలనుస్టేషనును కలవు అదిభరతదేశపు బ్రిటీషు సైన్యస్థానముగనున్నది. అటనుండి కతిపయదూరమున అనగా (ఇరువదిరమైళ్ళుండును) లాండికానా యనబడు సైన్యస్థానము దనుక నినుపబాట కలదు. లాండీ కోటాలు, లాండికానా సైన్యస్థానముల దరినుండియే నడుమ వాగ్గు మురాంరు లైనుకలదు. (మురాంనులైనుమూడుడు). అవ్వల ఆఫ్ఘనుస్థానమువారి సైన్యస్థానమున్నది దాని నుండి రాజధానిగాగు కాబూల్నగరమునకు నాంచిబాటయు మోటారు సర్వీసు సదుపాయము సర్పడియున్నది ఇటుల ఖైబరుమార్గమంతయు, మురాంరులైను దనుక భరతదేశమునకుం జెందియున్నదని ఎఱుంగునది ఈప్రదేశమంతయు కొండలమయము.

ఖైబరు మార్గమున కిరుదెసలను ఎక్కుటకు శక్యముగాని వాటములతో పర్వతములును, వాటిప్రక్కలం దపరిమితముగ చిన్న పెద్ద గుండు రాళ్ళును పరిబిత్తికి విరియున్నవి. వాటి నెవ్వరేని పైనుండి క్రిందికిం దొరలించిన దొరలుచు నపాయకరములై ఖైబరుమార్గమున నరగువారిం జితుకజేసి బలిమార్చెడిని. ఇంక నీపరిసర దేశము లోని సీమలను ట్రైబల్కంట్రీ యనియెదరు. ఆసీమలందు వసించెడిప్రజ లాఫ్రిడీలనునామముచే

బరగువారైనను వేశ్యేలు భేదములగు తెగలవారై, ఒక్కవారి నాయకునకుం దక్క వేఱొక పాలన నంగీకరింప నిష్టములేనివారు. సదా ఆయుధధారులు. వారి ఇండ్లయందు దెక్కువ యాయుధము లవసరముల కుపయోగింపఁ నిల్వ యుంచుకొను శూరులు. తిండికి లేకున్నను లాతి లేదుగాని పౌరుషమునను, శూరత్వమునను వెనుకబడరుగాన ఖైబరుమార్గగమన మపాయకర మని పేరుకల్గుట యబ్బురము కాదు.

ఈపర్వతసీమలో దించుక ఫలవంతమగు ప్రదేశము కలదేని దానిఁ గాచు పల్లెటూరికాపువద్ద సైతము తుపాకి సిద్ధముగానుంట సర్వసాధారణమే. దురంతములున్నూ, సర్వసాధారణమే. ఇట్టి తావులందు రక్షణ నెలకొల్పుట యన సుకరము గాదు. అధికారబలము చాలదు. సైన్యబలమే యుండవలయును. కావుననే అర్హస్థానములపై సైన్యములనుంచి లాండికోటాలునుండి అలీమశీదువఱకును, జమ్రూదుదుర్గమునుండి అలీమశీదువఱకును సైనికులపెట్రోలులు తిరుగుచునే యుండును. అలీమశీదు ఇప్పుడు ఓటొప్పెస్టుగ నున్నది. ఈబాట యాత్రయు మోటార్లపోవును. మోటారులలో ప్రయాణము కనువినోదకరమై యుండును.

**ఖైరా జిల్లా** — బొంబై రాజధాని చూడుడు. నడియాదుపురము ప్రధానస్థానము.

**ఖైరాలు శాఖ క్షత్రియులు** — ప్రమార శాఖ క్షత్రియులు చూడుడు.

**ఖైర్పూరు స్టేటు**—బొంబాయి రాజధాని ప్రభుత్వమునకు లోబడిన స్వదేశ సంస్థానము. సింధుదేశమున ఈశాన్య దిశగానున్నది. ఖైర్పూరు రాజధాని. ప్రభువు ప్రజలు మహమ్మదీయులు

---

**ఖోయా**— కోవా పరిశ్రమ చూడుడు.

---

**గంగకవి** — లింగకవి, గంగకవి చూడుడు.

**గంగరావిచెట్టు** — లా Morus indica అనియు, H...iscus populneus. స. పూవకః, బ్రహ్మావృక్షః బ్రాహ్మణః. ఇది కొంత రావియాకువలె కొనలంగల్గిన యాకులం గల్గియుంట నీపేరందెగాని రావితో సంబంధము కలదిగాదు. దీని శరీరమంతయు గుంపులుబారి యున్నట్లున్నను దీనికలప ఓకుకలపవలె చెక్కడపు పనులకుఁ బనికివచ్చునందురు. ఉప్పుచవిటి నేలలం దనుకూలముగ పెరిగి వృద్ధినందును.

దీని చెక్కరసము లేక కషాయము వేడిచేసి మేహములు, వ్రణములు, విషదోషముల

నివారించుననియు, దీనికాయ పాలయందు కపాల మాదలు, తామర, తీట, ద్రద్రు మొదలగుచర్మ రోగముల నివారించు శక్తిగలదనియు, చెక్క కషాయముతో వ్రణములం గడిగిన నవి శుభ్రమై మాన్పబడుననియు, తెలిక కషాయము లోనికిచ్చిన శరీరప్రకృతిని మార్పుజేయించుననియుం జెప్పం బడినది

**గంగలు** — గంగలు ౮ (అష్టగంగలు) ౧. గంగానది, ౨. యమునానది, ౩. కృష్ణా లేక కృష్ణవేణీనది, ౪. గోదావరీనది, ౫. సరస్వతీనది, ౬. నర్మదా (రేవానది), ౭. సింధునది, ౮. కావేరీనది.

మతాంతరమున అష్టగంగలు- ౧ భాగీరథీ, ౨ అలకానంద, ౩ మందాకినీగంగ, ౪ ధవళీగంగ, ౫. కాళీగంగ, ౬. నందాకినీగంగ, ౭ పిండారీగంగ, ౮. జాహ్నవీగంగ. మరికొందఱు కాళీగంగకుబదులు కౌశికగంగయనియు, పిండారీగంగకు బదులు సరస్వతీనది యనియు నందురు.

సప్తగంగలు- గంగ, గౌతమి, కావేరి, తామ్రపర్ణి, సింధు, సరయు, నర్మద ఇంకను నళినీ, హ్రాదినీ, పావనియను ప్రవాహములు తూర్పునకును, శీతా, చక్షు, సింధువు ప్రవాహములు పశ్చిమమునకును, భాగీరథీయనబడుశాఖ దక్షిణమునకును ఒకేగంగా జలసమూహమునుండి ప్రవహించెననియు, ఇవి సప్తగంగలనియు కొందఱనెదరు.

పంచగంగలు- కావేరీ, తుంగభద్రా, కృష్ణవేణీ, గౌతమీ, భాగీరథీనదులకు పంచగంగలని పేరు.

**గంగలో మున్గితే కాకి హంస యగునా?** — ఆంధ్రలోకోక్తి.

**గంగవంశ నృపతులు** — వీరు కళింగ గోత్రకములు కలిసిన కళింగదేశమేలిరి. వీరు పెక్కండ్రుగలరు అందు కళింగరాజ్యమేలిన వారు గాంగేయుడను వానిని మూలపురుషునిగ గల్గియుంట నీ పేరందిరి. ఇందు ౧వ కామార్ణవుడు బాలాదిత్యుడను భూపతిని జయించి కళింగరాజ్యమాక్రమించెను. పిదప ఈ గంగ వంశ నృపతులు పదొమ్మండుగురు కళింగరాజ్యమేలిరి. చోడగంగదేవుడనంబడు అనంతవర్మ శాసనములు సుప్రసిద్ధములు. మొత్తమున గంగ వంశపురాజులు కళింగమును ౩౮౦ సంవత్సరముల కాలము పాలించినట్లు తోచెడిని (కళింగ, గంగ వంశపురాజులు చూడుడు, కళింగ దేశము చూడుడు).

గంగవంశనృపతులు కొంగుదేశమును, చేర దేశమును క్రీ. శ. మూడవ శతాబ్దము మొదలు తొమ్మిదవశతాబ్దమువఱకు పాలించిరట. (చేర దేశము, కొంగుదేశము చూడుడు).

**గంగవంశపు కళింగ భూపతులు**— ౧. మొదటి కామార్ణవుడు బాలాదిత్యుని జయించి కళింగరాజైనవాడు, పాలన సం॥ ౩౬, ౨. దానార్ణవుడు పాలన సం॥ ౪౦, ౩. రెండవ కామార్ణవుడు ఇతడు నగరము రాజధానిగ ౫౦ సం రాజ్యమేలెను. ౪ గుణార్ణవుడు పాలన సం ౫, ౫. రెండవ వజ్రహస్తుడు పాలన సం ౧౫, ౬. మూడవ కామార్ణవుడు పాలన సం ౧౯, ౭. రెండవ గుణార్ణవుడు పాలన సం॥ ౨౭, ౮. జితాంకుశుడు పాలన సం॥ ౧౫, ౯. కళింగాంకుశుడు పాలన సం॥ ౧౨, ౧౦. మొదటి గుండమరాజు పాలన సం॥ ౩, ౧౧ నాల్గవ కామార్ణవుడు పాలన సం॥ ౩౫, ౧౨. వినయాదిత్యుడు పాలన సం॥ ౩, ౧౩. వజ్రహస్త అనియంకభీముడు పాలన సం॥ ౩౫, ౧౪. ఐదవ కామార్ణవుడు పాలన ఆరునెలలు. ౧౫. రెండవ గుండమరాజు పాలన సం॥ ౩, ౧౬. మధుకామార్ణవుడు పాలన సం॥ ౧౯, ౧౭. మూడవ వజ్రహస్తుడు పాలన సం॥ ౩౩, ౧౮. రాజరాజు (రాజకళింగ గంగ దేవు) పాలన సం॥ ౮, ౧౯. అనంతవర్మ (చోడ గంగదేవు). ఇతని శాసనములు పెక్కులుగలవు.



గంగవంశపు కళింగభూపతుల వంశవృక్షము —చంద్రుఁడు వంశము.
గాంగేయుఁడు మూలపురుషుఁడు.
కోలాహలుఁడు గంగవాడిలో కోలాహలపురము రాజధానిగ రాజ్యమేలినవాఁడు.
విరోచనుఁడు.
ఎనుబదియొక్క భూపతులు వంశపారంపర్యముగానని.
వీరసింహుఁడు.
౧ వ కామార్ణవుఁడు మొదటిభూపతి ఇతఁడు బాలాదిత్యుని జయించి కళింగరాజై ౩౬ ఏండ్లు రాజ్యమేలినవాఁడు.
దానార్ణవుఁడు రెండవభూపతి. ౪౧ సం॥ పాలించినవాఁడు.
గుణార్ణవుఁడు.
మారసింహుఁడు.
వజ్రహస్తుఁడు.
౨ వ కామార్ణవుఁడు మూడవభూపతి ఇతఁడు నగరము రాజధానిగ ఏబది సంవత్సరములు రాజ్యమేలినవాఁడు.
గణార్ణవుఁడు నాల్గవభూపతి ౫ సం॥ పాలన.
రెండవ వజ్రహస్తుఁడు ౧౫ సం। పరిపాలించినవాఁడు ఐదవభూపతి
మూడవ కామార్ణవుఁడు ౧౯ సం। పరిపాలించినవాఁడు, ఆరవప్రభువు.
రెండవ గుణార్ణవుఁడు ౨౭ సం॥ పరిపాలించినవాఁడు ఏడవప్రభువు.
మొదటి గుండమరాజు ౩ సం। పరిపాలించినవాఁడు ౧౦వ ప్రభువు.
పేరు తెలియదు
కళింగాఙ్కుశనృపతి ౧౨ సం॥ లు పరిపాలించినవాఁడు ౯వ ప్రభువు
జితాఙ్కుశుఁడు ౧౫ సం॥ పరిపాలించినవాఁడు ౮ వ ప్రభువు.
నాల్గవ కామార్ణవుఁడు ౩౫ సం॥ పరిపాలించినవాఁడు ౧౧వ ప్రభువు
వినయాదిత్య నృపాలుఁడు ౩ సం। పాలించినవాఁడు ౧౨వ ప్రభువు
వజ్రహస్త అణియాఙ్కభీముఁడు ౩౫ సం॥ పరిపాలించినవాఁడు, ౧౩ వ ప్రభువు.
జ్యేష్ఠభార్యవలన
కనిష్ఠభార్యవలన
౫వ కామార్ణవుఁడు ఆరునెలలు పరిపాలించినవాఁడు ౧౪వ ప్రభువు.
౨వ గుండమరాజు ౩ సం॥ పాలించినవాఁడు, ౧౫వ ప్రభువు.
మధుకామార్ణవుఁడు ౧౯ సం॥ పరిపాలించిన ౧౬ వ ప్రభువు.
౩ వ వజ్రహస్తుఁడు ౩౩ సం॥ పరిపాలించినవాఁడు; ౧౭వ ప్రభువు.
రాజరాజు ౮ సం॥ పరిపాలించిన ప్రభువు; ౧౮ వ ప్రభువు.
అనంతవర్మ లేక చోడగంగదేవుఁడు ఇతని శాసనములనేకములు కలవు. ఇతఁడు ౧౯ వ ప్రభువు.

**గంగా గండకీనదుల సంగమము**- (శోన్పూర్) బీహారుదేశములోని శరన్ మండలమున శోన్పూరను పట్టణముకడ నున్నది. (ఈస్టిండియన్ రెయిల్వేస్టేషను) ఇట కార్తీక పౌర్ణమికి గొప్ప స్నానయాత్రయు, సంతయుం జరుగును. శోన్పూరుసంత గుఱ్ఱములబేరమునకు పేర్వడసినది. గజేంద్రమోక్ష స్థలమీప్రాంతముననే కొంతదూరమున గలదు.

**గంగాద్వారము (హరిద్వారము)** - (గంగానదిచూడుఁడు). హరిద్వారమునకు తొల్లింటి పేరు ఇటనున్న దేవీక్షేత్రమునకు మాయాక్షేత్రమని పేరుండెను. (హరిద్వారము, కనఖలము చూడుఁడు).

**గంగానది (భాగీరథీగంగ)**— ఋగ్వేదము ౧౦-౭౫ యందునను, ఐతరేయ బ్రాహ్మణము ౮ ౧౪-౪ యందునను గంగానది ప్రశంసలు కలవు. బృహద్ధర్మపురాణము నందు గంగానది గమనము కొంత వివరింపబడినది. అరుణోదదేశము (ఇప్పటి గఢవాల్సంస్థానము) లోని గంగోత్తరియనంబడు తావున గంగాభగీరథీదేవస్థానము కలదు. ఇటనుండి ఎగువను తిపయ దూరమున పటంగిరి యనంబడు తావు పాండవ నివాసక్షేత్రముగలదు. ఇది పాండవుల కడపటి నివాసముగఁ జెప్పఁబడినది. ఇట మార్జున నకులసహదేవులును, ద్రౌపదియు ంకాగ భౌతికశరీరములను వీడ యుధిష్ఠిరుఁడు స్వర్గారోహణమను పేరుగల పర్వతశిఖరము కెక్కి తిరిగి రాలేదని చెప్పఁబడినది.

ఇట పర్వతపఙ్క్తికి రుద్రహిమాలయ మని పేరు. అందైదు శిఖరములు కలవు. తూర్పు శిఖరమునకు రుద్రహిమాలయ శిఖరమని పేరు. వానిది బ్రహ్మశిఖరము, పిదప విష్ణుపురిశిఖరము, పిదప ఉద్గరికాంతశిఖరము, పిదప స్వర్గారోహణశిఖరము కలవు. ఈ యైదు శిఖరములంగల్గి రుద్రహిమాలయ పర్వతపఙ్క్తి ధనురాకారముగ వంగి నడుమ పల్లమేర్పడియుంట నది మంచుచే నిండఁబడి గ్లేసియరుగ (Glacer)నై మెల్లగ కరఁగుచు నీరగుచు జారి ఇవతలవైపున హద్దుగ గట్టువలె నేర్పడి నిలచి, గోవు ఆకారముననున్న గోముఖపర్వతముయొక్క ముఖమువలెనున్న తావున గోవుముఖమునందలి నోటియందలి రంధ్రాకార మార్గముగుండా జారి ఇవ్వలకు జలపాతరూపమునఁబడి చిన్న ప్రవాహమై నడచును. ఇదియే భాగీరథీగంగయొక్క ప్రారంభస్థితి. ఈ హిమనిలయము (Glacier) నకు బిందురూప సరస్సు అని పేరు. ఇందే బంగారు, పసుపుపచ్చనిరంగు ఊదారంగు పూవులుండెడివి. వీటిని తామర జాతి నీటియందు నొకజాతి పూవులని పోల్చిరి. మరియు నిచటి రుద్రహిమాలయ పర్వతశాఖగ నేర్పడి యున్న పేఱొక చిన్న పర్వతమునకుఁ గాడపాద పర్వతమని పేరు. దానికడనే గంగోత్తరి దేవాలయమున్నది.

గాడపాదముం గొంతవరకుచుట్టినడచి రుద్వాలి కెగగనే కేదారగంగయనంబడు వేఱు జలప్రవాహము భాగీరథిని స్పృశించినట్లు కడు సమీపమున కేతెంచి తాకుచున్నట్లు నడచును. అసదుమనే భగీరథమహారాజు (భగీరథమహర్షి) గంగకై తపంబొనర్చిన యాశ్రమపుతావుఁ జూపుదురు. అందు గౌరీకుండమను ఒకచిన్న పవిత్ర సరస్సు కలదు. అద్దాని నా మహారాజు తనకుం గంగానది ప్రసాదింపంబడకపూర్వము తనయాశ్రమమున తన స్నానపానాదులకు నిర్మింపంజేసెనట. ఆ మహర్షి యొక్క గండశిలపైఁ గూర్చుని తపమాచరించువాఁడనియు, అందుగల గంగాదేవి దేవాలయమును, తా ప్రతిష్ఠించి యట తపంబొనర్చుచుండెననియు నచటివారు చూపుచుఁ దెల్పుచున్నారు.

ఈ ప్రాంతములు నీ నదికి భాగీరథియనియే పేరు వాడుచున్నారు. ఇటనుండి చిన్నచిన్న మంచుకరఁగిన ప్రవాహములు ఇందు చేరుచునే యుండుటయు ప్రవాహము బలపడుచు పాయలుగ చీలుచు తిరుగ గలియుచుంటయు నీ పర్వత ప్రదేశగమనము పొడవునను జరుగుచునే యుండెడిని. భగీరథాశ్రమము గడచిన కొంతదూరము ప్రవహించి కొంత బలపడగనే యమునోత్తరి నుండి యమునానది యటకే తెంచి రెండునుకలసిపోవునటుల ప్రక్క-ప్రక్కలం జేరుకొనుచు తిరుగ దూరం మరుగుచు నడచుచు తుదకు విడిపోయి దూరమగును.

అనేక పాయలగుచు తిరుగ గలియుచు పరిశీలించుట కపరిమితమైన చిక్కుగా నుండు నీ భాగీరథీనదికి వ్యాస్ఘాటను పేరుగల లొల్లింటి వ్యాసాశ్రమపు పవిత్ర క్షేత్రము దనుక నావేరుండి అటనుండి గంగానది యనంబరగు చుండును. కొందఱు భాగీరథీగంగ యని వాడుచుందురు కాని రాను రాను గంగానది యను పేరే వాడుకయందు వినబడు చుండును. ఇది ఇట్లుండ నీ పర్వత సీమలందే మందాకినీనది బదరీ కేదార క్షేత్రము ప్రక్కంబడి రుద్రప్రయాగ కడ నలకానందానదిం జేరుకొని సంగమించును. పిండారీగంగ కర్ణ ప్రయాగ కడ నలకానందం జేరుకొని సంగమించును. నందప్రయాగ కడ నాదాకినీ గంగ యలకానాద యందే సంగమించును. ధవళీ గంగ విష్ణుప్రయాగ కడ నలకానందలో సంగమించును. ఆయలకానందా నది దేవప్రయాగవద్ద భాగీరథీ గంగలో సంగమించెడిని. ఇటుల నధికమై బలపడిన గంగానది అనేక పాయలుగ జీలుచు తిరుగ నన్నియుం గలసికొనుచు నెట్టకేలకు హరిద్వారము కడకుం జేరి నడచును. హరిద్వారము కడ విష్ణుపాదము ప్రక్కంబడి ముందుకుం జనుతరి హిమవత్పర్వత సీమలనేగాక కడపటివగు మైనాక (ఇప్పటి శివాలిక్) పర్వత సీమలం గూడ వదలి సమతల ప్రదేశములం జేరికొని నెమ్మదిగ నడచు శీతల వాహినియై ఇరుదెసలనుండు భూములను ఫలవంతములుగనొనర్చుచు, ముందుకు సడువనారంభించును. ఇటనుండి గంగానది ప్రవాహపు గమనిక చాల శాంతముగ నుండును. హరిద్వారము కడ గంగానది తీర్థమునకుఁ దొల్లింట గంగా ద్వారమనియు, అటనుండు పురమునకు మాయాపురమనియు, దీని కెగువనే కంకాళమనియు పేరులు వాడఁబడు చుండునవి. కంకాళమను పేరట్లె యున్నది. ఇందే తొల్లింట దక్షప్రజాపతి యాశ్రమపు తావుగలదు. అందు దక్ష యజ్ఞగుండమును, అటనాయన ప్రతిష్ఠించిన దక్షేశ్వర శివలింగమును, కతిపయ దూరమున నొక తావున వీరభద్రస్వామి త్రిశూలమును చూపుచున్నారు. కాని మాయాపురము విడచివేయంబడి విష్ణుపాదమునుండి కంకాళము వఱకు హరిద్వారమను పేరున క్రొత్తగ పట్టణము నిర్మింపం బడినది.

హరిద్వారము గడచి ముందుకునడచు గంగానది బిజనార్, బూదాన్పురముల నంటి నడచుచు ముందునకుంజని ఫరూకాబాదు పురము ప్రక్కంబడి బ్రహ్మావర్తము (ఇప్పటి బితూరు) కడకుం జేరి, వాల్మీకాశ్రమము ప్రక్కంబడి ముందుకుం జనును. పిదప కాన్పూరు పట్టణమునంటి నడచి అలహాబాద్ తొల్లింటి ప్రయాగ కడకుం జేరుకొను నదికి పశ్చిమ దిశనుండి యమునానదియు, అంతర్వాహినియై సరస్వతీనది శాఖయు అటకేతెంచ వాటిం గల్పుకొనును. ఇట నీ సంగమమునకుఁ త్రివేణి యని పేరు. మఱియు నిది మాధవ ప్రయాగ యనియుం జెప్పఁబడినది.

ఇటనుండి ముందునకుం జనుచు భాగీరథీగంగ వింధ్యవాసినీ దేవస్థానమున కిరి ప్రక్కంబడి నడచి మిర్జాపూరు పట్టణము, చునారు దగ్గముల నంటి జని రామనగరము బనారసునగరముల మధ్యం జేరుచో అశీనదిం గలుపుకొని బ్రహ్మనాళమున ప్రవేశించి కాశీపట్టణపు సుప్రసిద్ధ స్నాన ఘట్టముల నంటి యుత్తర వాహినియై వారణాశీ క్షేత్రపు ఉత్తరపు కడను వరుణానదిని తనయందు జేర్చుకొని ముందునకుం జనును. పిదప కొంచెము దూరముననే కర్మనాశ నదియు నిందు జేరకొనును. పిమ్మట బక్సారుపురము (తొల్లిటి వ్యాఘ్రపురము) న కనతి దూరము నుండి నడచుచు తొల్లిటి వామనావతార స్థల మగు సిద్ధాశ్రమము, విశ్వామిత్రాశ్రమముల ప్రక్కంబడి జనుచు కొంతదూరమేగి అరాపట్టణ సమీప ప్రదేశమున గోగ్రానది దనయందు కల్పు కొనును. ఈగోగ్రానది యందిదివఱకే కొంద్రి యూలానదియు, రప్తీనదియుం గలసియున్నవి ఈ సంగమము దరిజేయున్న ఛప్రాపట్టణము నంటి నడచుచు అతి దూరముననే అరా పట్టణము సమీపించునంతట, గండకీనది, యఖోణాభద్రయు నటకేతెంచం దనయందు జేర్చుకొని ముందునకుం జనుచు పాటా నగరము (తొల్లిటి పాటలీ పుత్రము) దరి జేరుచు.

పాట్నా గడచిన పిదప కొంత దవ్వేగి భాగ ల్పూరు పురము, మాఘీరు (తొల్లిటి మొదాగిరి) ల ప్రక్కంబడి చని కోశీనది గల్పుకొని పూర్వ వాహినిగ కొంత దవ్వేగి, పిదప దక్షిణ వాహినియై ప్రమ్మార్, కలకత్తాల ప్రక్కంబడి ఏగి సము ద్రగామి యగు హూగ్లీ శాఖానదిని వీడి ముందు కుం జనుచు నచిర కాలముననే ఉత్తరమున సిక్కింనుండివచ్చు మహానదిం గల్పుకొని ఆగ్నేయ దిగ్వాహినియై రాంపూరు, బోలియా పట్టణము ప్రక్కంబడి యవ్వలికేగి పేటోళ శాఖానదిని దక్షిణ దిశకేగ వదలి, తూర్పునకుం జనుచు ఉత్తరమునుండి వచ్చు బ్రహ్మపుత్రానదిని తన యందు కల్పుకొని ఆగ్నేయ దిగ్వాహినియై పద్మా నది (ఇప్పటి పుడ్డా) యనం బరగుచు నేగి సము ద్రమున సంగమించును.

ఈ గంగానది సముద్రగామి యగుట నేడు పాయలుగ జీలును. మధ్యమార్గమున త్రిబేని, (త్రివేణి) యను గ్రామముకలదు ఇది బంగాళము లోని బంశబాటిపుర సమీపమున నున్నది. ఇట గంగ పెక్కు పాయలుగ జీలుచు పలు ద్వీపము లా జుట్టి నడచును. అందు త్రిబేని గ్రామము కడనే మూడు పాయలుగ జీలునవ్వాటిని గంగా, యమునా, సరస్వతులు మూడు చీలిపోవుట యందురు. అలహాబాదుకడ కలయుటచు యుక్త వేణి యనియు, ఇటం ద్రివేని గ్రామము కడ ముక్తవేణి యనియు నను చున్నారు. సముద్ర గామి యగుటకుం బూర్వము ద్వీపములు నేర్ప డిన బురద గురణ్య ప్రదేశమునకు సుందర వన మని పేరు.

సముద్రమునం గలియు తావున గల సగర ద్వీపము లేక సాగరద్వీపమునందు కపిలాశ్రమ ముండిన తావుం జూపు చున్నారు. ఇది గొప్ప స్నాన తీర్థమై యున్నది

**గంగాయనగోత్రము** — శౌనక లేక, గృత్సమదగణము చూడుఁడు.

**గంగాసింధూరము (చంద్రము)** - ఆంగ్ల. Vermillion అనియు, Red oxide of lead. సం. నాగరక్తః, నాగరేణుః, నాగసంభవం, నాగసింధూరం, రక్తవాలుకం.

ఇది ఇంగిలీక మూర్ణ సంబంధము. Cinnabar. ఇంకను పాదరసగంధకములకు Chemical treatment కల్గించుటవలన నిది యగును. ఇది

రంగులంను చేయునది. లక్క జేయుటయందు అచ్చు సిరాలంను చేయునది. గంగసింధూరము వేడిచేసి విషదోషము, దుష్టవ్రణములు, కుష్ఠురోగము, సర్పి, ఉబ్బుజాడ్యములు, దుర్మాంసము పెరిగిన కురుపులు, వ్రణములు నివారించు నని చెప్పఁబడినది.

గంగాసింధూరము ను నూనెతో విఘ్నేశ్వర, ఆంజనేయదేవస్థానములందు దేవవిగ్రహముల శరీరమునందును పూయుచున్నారు. కొన్ని శక్తివిగ్రహములకును గూడ గంగాసింధూరము రంగునై చెదరు.

**గంగారిదేశకాళింగము** — కళింగదేశము చూడుఁడు

**గంగాసాగర సంగమస్థలము** — ఇది బంగాళాదేశపు సుందరవనమున నున్నది. తొల్లింటి కపిలముని యాశ్రమస్థానము. ఒకప్పటి కాలువం బోలిన నదీశాఖపై కపిలముని దేవస్థానము కలదట. అటకుం గొంపయందూరమున ఆనదీశాఖ సముద్రమునఁగలియు తావున స్నానము లాచరించెదరు. తరువాతికాలమున కలుమాప్పులం జేరిన ఆదిని గంగానది ఇటనే సాగరసంగమమౌదట నిది పవిత్రస్థలిగా నెన్నఁబడుచున్నది. గంగాసాగర మేలా మకరసంక్రాంతి పండుగలలో జరగును. పెక్కుగ్రుడు బంగాళీదేశస్థు లరుదెంచుచురు.

**గంగోత్పత్తి సప్తమి** — చైత్రశుద్ధ సప్తమి గంగోత్పత్తి యందురు, గంగానదీతీరప్రాంతములను గంగోత్పత్తియుత్సవము లాజరిపి, గంగాపూజ లొనర్తురు. (పండుగలు చూడుఁడు.)

**గంజాముజిల్లా** — ఆంధ్రదేశములోనిది, చెన్నపురిరాజధానియం దున్నది. ఇందు కొంతభాగ ముత్కలరాజ్యమునకు ఇటీవలనే కలుపబడినది. బరంపురము పెద్ద పట్టణము, జిల్లాన్యాయస్థానముండు తావు ఛత్రపురము జిల్లాకలక్టరు, పోలీసుసిబ్బంది యుండు తావు. శ్రీకాకుళము (తొల్లింటి గుల్షనాబాదు) శిక్కాఖోల్నే కాజాగా శిక్కాఖోలు అనంబడి కడకు శ్రీకాకుళమై ఆంగ్లమున చికాకోలుగ నున్నది; క్షీణించుచున్నది. నర్సన్నపేట, ఇచ్ఛాపురం, సోంపేట, రసూల్కొండ, అస్కా, గోపాలపురం, కళింగపట్నము ఇతరపట్టణములు. పర్లాకిమిడి పెద్ద జమీందారీస్థలము పట్టణము, కళింగపట్టణము, గోపాలపురము రేవులు. జిల్లాయందు గల జమీందారీలు సుప్రసిద్ధములు. పశ్చిమభాగము మన్యప్రదేశము, ఉద్యానవనంబగు సముద్రతీరభాగమున కొబ్బరితోటలు, అరటితోటలు, కూరగాయలపాట లధికము. ఇది ఉద్యానమని తొల్లింటి పేరు. ముఖలింగక్షేత్ర మీజిల్లాలోనిది.

**గంజాయి చెట్టు** — లా Cannabis sativa. ఆంగ్ల. Ganja. సం. విజయా దీని ఆకు, గింజలు, వెన్ను కలసినవానిని గంజాయి యనుచున్నారు. దీనిని కుండగొట్టములలో వేసి కాల్చి పొగఁ బీల్చుటయు, భంగు చేసి త్రాగుటయు, మత్తుగల్గించి శరీరమును బుద్ధిని పాడు చేయుంగాన దీని నిరోధమునంకుంచుటకు ప్రభుత్వములు పూని, మితముగమాత్ర మనుమించుచు వ్యాప్తిగాకుండ జేయుచున్నరు.

గంజాయియందు మత్తు, ఉత్సాహము, మనోవికాసము, వాచాలత్వము, వీర్యపుష్టి, కామవికారములం గల్గించుశక్తి గలదనియు, అధికమైన పైత్యోద్రేకము, మతిభ్రమ, అతిఆకలి, గుండెలు శరీరము ఎండిపోవుట, పనియుం జేయ నసమర్థతయుం గల్గించి, నిరర్థకునిగ నొనర్చునని యుం జెప్పఁబడును. ఇది యభ్యాసమగు వారికి నల్లమందు,

శాఖీ, చుట్టలవలెనే మాదకశక్తిని నిర్బంధము గల్గించును. ఆకలిని లేకుండజేయును.

ఇటులయ్యు గంజాయియందు కొన్ని సుగుణములు గూడ కలవు. ఆరికెలవలెనే గంజాయివిత్తులను కోడిపెట్ట (ఆడుది) బాతులకు మితముగ పెట్టుచుండిన నెక్కువ గ్రుడ్లనిడి, సంతతి నతి శీఘ్రముగ నభివృద్ధి నొందించుకొనజేయనగును. అటులనే కొన్ని పక్షులకు తినిపించుచుండిన వాటిరంగు మారును. గంజాయి పచ్చిఆకు చితుకగొట్టి వెచ్చజేసి కండ్లను వేసి కట్టిన Photophobea (కండ్లమొగులు, నొప్పులు, చక్రములు, లతలు రూపములు ఊరకనే కన్పించు మాదు నేత్రరోగము) నివారణ మగుననియు, మూలస్థానమున కట్టిన మూలశంకబాధ తగ్గుననియు, ఆకురసము చెవిలో నుంచిన చెవిలోపోటు, చెవిలో కురుపులు, వాపులు నిమ్మళించుననియు, లోనికి మితముగనిచ్చిన నీళ్ళవిరేచనములు కట్టుననియు, తలకుపూసిన చుండ్రు పోయి పేలు, ఈపి, పురుగులు చచ్చుననియు, ఆకుల చూర్ణము గాయము నందద్దిచి తొడనే పైన జల్లి కట్టిన నవి మాన్పబడుననియు చెప్పబడినవి.

గంజాయిగ్రంథము రోగములకు వినుగుడు—అప్పుడుకాచిన అవునెయ్యియు, పచ్చిజామి యాకుల రసము నని చెప్పబడినది. గంజాయినరిగిన నుమ్ము వేదాంతులగు మహాత్ములు గంజాయిని జ్ఞానవస్తువనియు, జ్ఞానపదార్థ మనియు పేరిడియున్నారు.

**గంజీఫా** — దశావతారు చూడుడు

**గంటుబారంగి చెట్టు** — లా. Clerodendron Serratum. సం. బ్రాహ్మణయష్టిః, బ్రాహ్మణీ, బ్రాహ్మీరా, భార్గవాగ్రణీ, భార్గి.

దీనిని బారంగియనియు వాడుదురు. సర్వాంగ తిక్తమైనది ఇది పంచతిక్తములలో నొకటి. దీని సమూలకషాయము కాకజేసి, చెమటబట్టించి జ్వరములపై చక్కగా బనిజేయును. త్రిదోషహరమైనది. దుష్టద్రవములు కూడిన దానిని భేదించి వెడలించును. కాస, పీనస, యోని దోషము, శుక్లదోషము, క్షయల నడంచును. జ్వరములను హరించును.

దీని వేరుగంధము, లేక వేరురసము, లేక వేరుకషాయము దగ్గు, కఫముల ఉద్రేకముల నడంచి జ్వరము నివారించును. ఆకులను వెన్నలో గాని, నూనెలోగాని కాచిన తైలము తలనొప్పి, నేత్రరోగములు శమించుననెదరు. గంటుబారంగి విత్తులు చల్లలో నుడికించి లోనికిచ్చిన విరేచనము జేసి ఉబ్బుజాడ్యము నివారించుననెదరు

**గండకీ గంగానదుల సంగమము**- గంగాగండకీ నదుల సంగమముచూడుడు.

**గండకీనది** — హిమవన్నగమున మధ్య టిబెట్టునకు ఎల్లగ నేపాళదేశపుసరిహద్దున ధవళగిరియను శిఖరముగలదు. శిఖరమునకు దిగువ భాగమున కొండచరియలలో నొకపాటి పెద్దగియగు జలనిలయము (గ్లేసియర్) ఏర్పడియున్నది దానికి దామోదరకుండమని పేరు. దానితీరమున నే, దామోదర నారాయణస్వామి దేవస్థానమున్నది ఇటనుండియె గండకీనది (దామోదర కుండమునుండి) జనించును. ఈక్షేత్రమున కింకను సాలగ్రామ క్షేత్రమనియు పేరుకలదు. నదికిని సాలగ్రామియనియు, భక్తితో ననుచుందురు.

ఆది నిట భరతుని (జడభరతుని) ఆశ్రమము పులహాశ్రమమును ఉండెనని యాత్రావులం జూపుచున్నారు. సాలగ్రామినదికి శ్వేతగండకి యనిపేరు. ఈదామోదర కుండమునందే అటనట కలిపయదూరములందు ౧. బారిగాడ్ (దీని

సంస్కృత నామము తెలియకున్నది). ౨. నారాయణీనది, ౩. మర్శియాంగదీనది, ౪. దరంఢీ (దీని సంస్కృతనామము తెలియదు), ౫. గండనారాయణి (తపముచేసిన నారాయణవిష్ణుదేవుని గండస్థలములనుండి జారిన చెమటనుండి ఏర్పడినదట) నది, ఇంకను దీనింగొందఱు గండీనదియనియు వాడియున్నారు, ౬. త్రిశూలీనది యనంబడు ప్రవాహము లొకటొకటితో కలసిపోవుచు, అన్నియుం గలసిన ప్రవాహము గండకీనది యనం బరగెడిని. అందు సాలగ్రామినది దక్షిణతీరమున దామోదర దేవస్థానమునుండి మూడు మైళ్ళలో ముక్తినాథమనంబడు క్షేత్రము, అందు ముక్తినాథ నారాయణవిష్ణు దేవస్థానమును సుప్రసిద్ధములు. ఇటకు సమీపముననే టిబెట్టు నేపాలరాజ్యముల సరిహద్దుకలదు. (ముక్తినాథ క్షేత్రము చూడుడు). నది కొంత ఇంకను గడచి రిడి యనంబడు గ్రామముకడనున్న హృషీకేశ నారాయణక్షేత్రము (ఇప్పటి రిషేశ్వర్) గుండా నడచి యవ్వలకు దిగును. ఈహృషీకేశమునుం డియె శయనైకాదశి, ఉద్థానైకాదశి, చాతుర్మాస్యలు నేర్పడియెనట. (రిషేశ్వరము చూడుడు)

పిదప త్రిశూలీగండకీ నారాయణ (దీనిని రప్తీయనియు నందురు) సంగమముననున్న నారాయణక్షేత్రమునందాటి, కొంతనడచి, పర్వతసీమలంగడచి, త్రివేణి కడనుండి భరతదేశపు సమతల ప్రదేశములం బ్రవహించుచు, శోన్పూరు ప్రాంతముల గంగానదియందు సంగమించెడిని. ఈప్రాంతములందే గజేంద్రమోక్షణ స్థలము గలదు. వరాహపురాణము ౧౪౪ గండకీప్రశంస కలదు. (౧. సాలగ్రామక్షేత్రము, ౨. సాలగ్రామములు, ౩. సప్తగండకీనదులు, ౪. ముక్తినాథ క్షేత్రము, ౫. రిషేశ్వరము, ౬. నారాయణ క్షేత్రము, చూడుడు).

**గండఫెరోజా** — లా Galbanum ఆంగ్ల. Ganda Biroza. హిందీ బిరీజా, ఫారశీ బీజద్. ఇది బిరిజాచెట్ల జిగురనియు, ఆకుపచ్చ, పసుపుపచ్చరంగుల మిశ్రమధాతువుంగల్గి యుండునవియు తెలిసెడిని. కొబ్బరినూనె గ్లిసరైనులతో కల్పిపైనపట్టించిన, కంతులు, గడ్డలు, అర్ధగ్రలు, ప్రాతదెబ్బ నొప్పులు, కవుకుదెబ్బలు, వాపులు అడగుట, మెత్తబడుట, పగులుట, సంభవించుననియు, లోనికిచ్చిన స్త్రీల ఋతురక్తమును వెడలించుట, సుఖప్రసవము గావించుట, శ్లేష్మమును వెడలించుట, శరీరమునుండి మలమూత్రములను వెడలించుట, సెగజాడ్యబాధల నివారించుటలు గల్గించుననియు చెప్పెదరు.

**గండమాల** — ఆంగ్ల Serofula. మెడ తల నరముల త్రావులను, మెడకొంకులను, మెడముకు గుదస్థానమునను గ్రంథులుగను కురుపులుగను బయలుదేరి కక్కసమై చీము రసికారుపుండ్లు లేక పుండ్లు వృత్తములు (Circles) వరుసలు (Lines) ఇవి వ్రణములనిపించుకొనియెడిని. గుదస్థానమున వేసెడి గండమాల గాసనగండమాలమనియు నందురు.

**గండి** — (Canon or canyan of a river) నది యొక పర్వతమధ్యమునుండి ఇరుప్రక్కలు చాల ఎత్తుగ నుండునటుల మార్గముం జేసికొని ఇవ్వలనుండి యవ్వలకరిగినతరిని లేక మను నొకమార్గము ఏర్పడునటుల లోయయుండి పక్కలు చాల ఎత్తుగనుండినతరిని దానిని కేనన్ లేక కేన్యన్ అనెదరు. దీనికి భరతదేశమున నాంధ్రులు గండి యనెదరు.

ప్రపంచమున నిట్టికేననులలో గొప్పవి కొలరెడో నదికి దాని యుపనదులకుం గలవు. అందు పెద్దదియగు గ్రాండుకేనన్ నాల్గువేలు మొదలు మవేల వరకు అడుగుల ఎత్తుగల ప్రక్కలం గల్గి

యున్నది. దీనిపొడవు రెండువందలమైళ్ళనియు ఒక్కొకతావున అనుగునచీకటులంగ్రమ్మియుండు నంతటి లోతుగానునదియు దానిగుండా పడవలలో నేగుతరి ఒక్కొకతావున చీకటిగనుండ పగలే నక్షత్రము లగుపడుచుండుననియు నందురు.

**గండీషు గోత్రము** — విశ్వవగణము చూడుడు.

**గండోనోకు** — ఆఫ్రికా ఖండమునందలి సౌడాన్ లేక నీగ్రిటియా (నీగ్రోలాండు, నీగ్రో జాతులదేశము) లోని ఒకస్టేటు. (ఆఫ్రికాఖండము సౌడాన్ లేక నీగ్రిటియా దేశము చూడుడు).

**గండ్రగొడ్డళ్లు (Battle axes)** — (టంగీలు) ఇవి పురాతనాయుధములని వేఱుగ జెప్పనక్కరలేదు. భరతదేశమందే గాక ఐరోపాదేశము లందును నివి వాడుక యందుండె నని తెలియుచున్నది. లండనునగరపు టవరునందుంపబడుట ఆంగ్లదేశముగూడ వీటిందరించెనని తేలినది. ఇంతవరకు నిరువదియారు ముఖ్యాకార భేదములను లెక్కించియున్నారు. భరతదేశమున మన్యప్రాంతముల నివి నిండిగ గలవు.

**గంతకుదగిన బొంత** — (ఇది అర్థము కుదరని నామెత ఒకరికొకరు తగినవారే యని భావము. కాని గంత అనినను బొంత అనినను ఒకటియె అర్థము) ఆంధ్రలోకోక్తి

**గంధం అమావాస్య** – దీనికి సరియగు పేరు గంధముకొలిచి తీసివేయు తృతీయకు ముందువచ్చు పెద్దయమ యనుట సమంజసము. ఆంధ్రదేశమందలి ప్రాగ్భాగమున సింహాచలక్షేత్రముగలదు. అదియొక పాటి కొండపై నున్న నృసింహస్వామి దేవళము. విశాఖపట్టణము నుండి యది మైళ్లదూరమునం దున్నది. ఇది తొల్లి శివస్థలమనియు, శ్రీమద్రామానుజదేశికులనాడది విష్ణుస్థలముగ మార్చబడినదనియు నొకవాడుక కలదు గాని, శాసనములు మొదలగు నిదర్శనములు గానవచ్చుటలేదు. వైష్ణవ లీసింహగిరిపై నున్న దేవస్థానమందునుండియు విష్ణుస్థలమేననియు, ఉగ్రశాంతి కనుదినము చందనానులేపన మీ దేవతా విగ్రహమున కనుదినము జరుగుచుండు ననియు ననుచుందురు. కాని ఇది శ్రీచాదనము కాదనియు నొకప్రతీతికూడ కలదు. ఈపూంత లనుదినము దళసరియగుచుండ, ఏటేట వైశాఖ శుద్ధ తృతీయ దినమున నొలిచివేసి తీసివేసివేయు చుందురు. అత్తరి గొప్పయాత్రజరిగి బహుజను లేతెంచుచుందురు. ఆప్రాంత సీమలవారికిట నధిక భక్తి సహజముగాన తరచుగ రెండుదినములకు ముందుగ నమావాస్య ప్రాతముల బండ్లపై బయలుదేరి ఈయాత్రసల్పుదురు. కాన అటుల నీయమావాస్యకు గంధం అమావాస్య అని వాడుక. సింహాచల క్షేత్ర ప్రాంత సీమలందు వ్యాపించియున్నది. ఇక్కాలమున ధనవంతమగు దేవస్థానముగ నున్నది. (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుడు).

**గంధమాదన పర్వతము** — గంగోత్రి వద్దనున్న రుద్రహిమాలయ శాఖ యందొక శాఖ. కాళికాపురాణము ౮౨ యధ్యాయము కైలాసశిఖరమునకు దక్షిణమున నున్నదనియును, వరాహ పురాణము ౮౭ యధ్యాయమునను, మహాభారత వనపర్వము ౧౮౫-౧౫౭, శాంతిపర్వ 335 యందునను బదరికాశ్రమము, కదళీవనము నిందు కలదనియును, మార్కండేయ పురాణమున ౫౭ యందు అరుణోదదేశము (గడ్వాల్ సంస్థానము) న నీపర్వతముపై అలకానంద ప్రవహించు చున్నదనియును, దానిపేరు గంధమాదనమనియును, మఱియు నిది మందాకిని తీరముగ విక్రమోర్వశీయ నాటకమునను చెప్పబడినది.

ఆంజనేయుడు దీనిశిఖరమొకటి రామేశ్వరముకు దెచ్చెననియు, అదియట గంధమాధనమను పేరం బరగుచున్నదనియుం దెలిసెడిని. (కులపర్వతములు చూడుడు. అరుణోదదేశము చూడుడు). గంధమాదనపర్వతము హిమవత్పర్వత మొదలి రుద్రహిమాలయమందలియొక శాఖ. మఱియు సుగ్రీవుని సేనయందొక వానరుడు గంధమాదన నామము గలవాడే. ఈతడు కుబేరాంశ సంజాతుడట. ఇంకను యదువంశ క్షత్రియులలో శ్వఫల్కుని సుతులలో నొకడు గంధమాదనుడు. ఈతని సోదరులక్రూరుడు, క్షత్రోపేక్షుడు అనువారలు.

**గంధమాంసి చెట్టు** — ఇది జటామాంసి జాతిలోనిది. సం. భూతకేశీ, పిశాచికా, చిన్నజటామాంసి యనియు కొన్ని తావుల వాడెదరు

దీని వేరును గంధమాంసియని వాడుచున్నారు. దీని చూర్ణము లేక కషాయము చర్మరోగములు, ప్రమేహము, వాతదోషము, విషవేగములపై చక్కగ పనిజేసి వేడిచేయునని చెప్పబడినది.

**గంధములు ౮**— (అష్ట గంధములు) సుగంధద్రవ్యములు-౧. కర్పూరము, ౨ కస్తూరి, 3. పునుగు, ౪. జవ్వాది, ౫. అగరు, ౬. పన్నీరు, ౭. అత్తరు, ౮ శ్రీగంధము

శివగంధములు ౮.-౧. చందనము, ౨.అగరు, 3. కర్పూరము ౪. తమాల, ౫. దళ, ౬. కుంకుమపుష్ప, ౭. ఉశీరము, ౮. కోష్టము.

ఈ ఎన్మిదింటికి శివగంధములని పేరు.

**గంధర్వ కుమారుడు**-ఆంధ్ర భాషా సాంప్రదాయార్థపదము—తంత్రియను హేళనాస్పదమగు గుణముండియు, కుమారుని యందు కూడ నదేరకపు హేళనాస్పద లక్షణములు సూచించునేని అతంత్రిపోల్కియని హేళన చేయుటకుగాను గంధర్వ కుమారుడని యనెదరు.

**గంధర్వ నగర న్యాయము**—ఆకసమున మేఘము లొకప్పుడు చిత్ర విచిత్ర రూపములుగను, చెట్లుగను, మేడలుగను, గోపురములుగను గన్పట్టును. దానిని గంధర్వ నగరమందురు. అందు నిజమేదియు లేకున్నను ఆపేరం బరగు చుండును.

**గంధర్వులు** — వీరును దేవతలలోనొక తెగవారు. గానవిద్య యందువీరు ప్రసిద్ధులు. వేదము బ్రాహ్మణులకు విధాయకమైనటుల గానవిద్య వీరికి విధింపబడినదట. గంధర్వులు కశ్యపునకు ప్రాధయను భార్యయందు కల్గిన సంతానము.

అంగారపర్ణుడు- చిత్రరథుడు చూడుడు.

ఇందీవరాక్షుడు- నలనాభుడను గంధర్వ భూపతి పుత్రుడు. వరూధినికి సోదరుడు. ఈతడు కిపటోపాయమున నొక ఋషివద్ద ఆయుర్విద్య నేర్చి పిదప నాతనిం బరిహాసించుటం జేసి యసురుడగునట్లు శపింపం బడెననియు, ఆ శాపము వరూధిని సుతుండగు స్వరోచివలన తీరెననియుం జెప్పంబడినది.

కేతుమతి- గంధర్వస్త్రీ. సుమాలి యను రాక్షసుని భార్య

గ్రామణి- ఈతని కుమార్తె దేవవతి లేక దేవమణి. సుకేసుడను రాక్షసుని భార్య

ఘంటాకర్ణుడు- ఇతడు కుబేర కింకరుడు. ఈతడు పిశాచనాయకుడనియు, యక్షుడనియు పేకొకచో జెప్పంబడినది. శ్రీకృష్ణుం డొకతరి బదరికాశ్రమమునందు యోగసమాధియందుండ నప్పు డీతడు డాయనకడ నుపదేశమంది నియతిపై మెలగి తనపిశాచత్వమునుండి విముక్తి నందెనని చెప్పంబడినది. ఇంకను వేఱొక ఘంటాకర్ణుడు శివభక్తుడు, వేఱొక ఘంటాకర్ణుడు విష్ణుభక్తుడును గలరు.

చిత్రరథుడు- తొలుత అంగారపర్ణుడను నామమున వెలుగుచు సోమశ్రవ తీర్థమున అర్జునునితో కలహించి యాతనివలన యాగ్నేయాస్త్రమునకు గురియై దగ్ధరథుడై తిరుగి చిత్రరథుండను గంధర్వుడైనవాడు. ఈతని యుపదేశమున పాండవులు ధౌమ్యుని పురోహితునిగా నెన్నుకొనిరని చెప్పబడినది. భార్య పేరు కుంభీనస

మరియొక చిత్రరథుడను గంధర్వుడు తన విమానమున అంతరాళగమన మొనర్చుచు యోగాభ్యాసియై తన శరీరమును విడిచిన యొక ముని పవిత్రాస్థులను వాలఖిల్యుల సలహామేరకు గొంపోయి సరస్వతీనదీజలముల నిక్షేపణ మొనర్చి స్నాతుడై ఊర్ధ్వగమనము గల్గినవాడుగ చెప్పబడినది ఆ మునిపేరు కౌశికుడట. (కౌశికుడు చూడుడు).

చిత్రసేనుడు- ఈతడర్జునునకు స్నేహితుడగు గంధర్వుడు. పాండవులు ద్వైతవనమున సద్యస్కంధమను క్రతువు నొనర్చుచుండ కౌరవులు ఘోషయాత్రపేరిట అటవాటితో గూడ పట్టుబడిరి దీనిగంధర్వునిచేతనే

చిత్రాంగదుడు

చిత్రాయుధుడు-

జీమూతవాహనుడు- ఈతడు ఖేచరుడనియుఁ గూడ చెప్పబడినది. ఈతడు తన దేహము నొక గరుత్మంతున కాహారముగ నొసగి యొక నాగకుమారుని రక్షించి విడచినవాడని చెప్పబడినది

దేవమతి లేక దేవమణి గంధర్వస్త్రీ. గ్రామణి యను గంధర్వుని కుమార్తె. సుకేశుడను రాక్షసుని భార్య.

నర్మద- గంధర్వస్త్రీ. కుమార్తె పేరు సుందరి. అల్లుడు మాల్యవంతుడు.

నలనాభుడు- ఇతడు గంధర్వప్రభువు. కుమారుడు ఇందీవరాక్షుడు, కుమార్తె మహోధిని.

నలకూబరుడు- ఈతడు యక్షుడు. తండ్రి పేరు కుబేరుడు. సోదరుడు మణిగ్రీవుడు. ఈతనికిని, రంభయను యప్సరకు నన్యోన్యానురాగము కలదని చెప్పబడినది.

ప్రమద్వర- గంధర్వస్త్రీ. తండ్రి విశ్వావసుడను గంధర్వప్రభువు. తల్లి మేనక. ఈమెను పెంచినవాడు స్థూలకేశుడను ఋషిసత్తముడు. భర్త రురుడు.

పుష్పదంతుడు- మహాశివభక్తుండగు గంధర్వుడు. ఈతడు మహిమ్నస్తోత్రమును రచించెను. ఇంకను విష్ణుభక్తుడో లేక విష్ణుపరిచరుడో యొక పుష్పదంతుడున్నట్లు తెలిసెడిని. ఈతండును గంధర్వుడే.

మణిగ్రీవుడు - ఈతడు యక్షుడు. కుబేరుని రెండవ కుమారుడు. సోదరుడు నలకూబరుడు.

మణిమంతుడు కుబేరుని అనుచరుడగు ఖేచరుడు. పార్ష్ణిసేనుడను ముని యొక్క ఆశ్రమమున పాండవులుండుతరి భీమసేనునితో పోరి యాతనిచే మడిసినవాడు.

మందపాలుడు- ఈతడొక ఋషి యనియు, విద్యాధరుడనియు చెప్పబడినది.

మందారుడు- విద్యాధరుడు.

మనోరమ గంధర్వస్త్రీ ఇందీవరాక్షుడను గంధర్వరాజపుత్రిక. తల్లి మరదశ్వపుత్రిక యని చెప్పబడినది. ఈ మనోరమ మహోధినీసుతుండగు స్వరోచికి అస్త్రవిద్య నుపదేశించి యాతని (మేనత్త కుమారుని) పరిణయమయ్యెను. ఇంకను మేరువు కుమార్తె పేరు మనోరమ. ఈమెకు మేనకయనియు నామాంతరము హిమవంతుని భార్య.

మాణిభరుఁడు- ఈతని యక్షుఁడనియుఁ గూడ చెప్పఁబడినది. లోహిత్యానదీతీర దేవారణ్యమున గుహ్యకపరివేష్టితుఁడై మాణిభరుఁడుండువాఁడని చెప్పఁబడినది.

మాణిభద్రుఁడు- ఈతఁడు యక్షుఁడనియుఁ జెప్పఁబడినది. కుబేరుని సైన్యాధిపతి కుబేరునికిని, రావణునకును యుద్ధముజరుగుతరి రావణ గదాహతుఁడై మెడవంకరయై పార్శ్వమౌళియని వాడుకనందినట్లు చెప్పఁబడినది.

మాతలి- దేవేంద్రుని సారథి

రేవంతుఁడు- ఈతనిని గుహ్యకుఁడనియు నందురు.

వరాహకర్ణుఁడు- ఈతఁడు యక్షుఁడనియుఁ జెప్పుదురు.

వరూథిని-గంధర్వస్త్రీ నలనాభునికుమార్తె సోదరుఁ డిందీవరాక్షుఁడు కుమారుఁడుస్వరోచి.

వసుధ- గంధర్వస్త్రీ. మాలియను రాక్షసుని భార్య

విభావసి- ఈమె మందారుఁడను విద్యాధరుని కుమార్తె స్వరోచిభార్య. ఈమె మృగ పక్షి జాతుల భాష నెఱుఁగు విద్యను స్వరోచికుపదేశించి యాతని బదిణాయుమైనదని చెప్పఁబడినది.

విశ్వావసుఁడు- ఈతఁడొక గంధర్వరాజు. ఈతని కుమార్తె ప్రమద్వర యనియు, తల్లి మేనక యనియు, ప్రమద్వరను స్థూలకేశుఁడను ఋషిసత్తముఁడు పెంచెననియు, భర్త రురుఁడనియుఁ జెప్పఁబడినది.

శంఖచూడుఁడు- ఈతఁడొక గుహ్యకుఁడనియు, కుబేరభటుఁడనియు, బృందావనమునం దుండు గోపికలనొకతరి నత్తరముగాఁగొనిపోయి శ్రీకృష్ణునిచే నిహతుఁడైనవాఁడనియుఁ జెప్పఁబడినది.

శైలూషుఁడు- గంధర్వప్రభువు. ఈతని కుమార్తె లంకారాజ్యమేలిన విభీషణుని భార్యయగు సరమాదేవి.

స్వరోచి- తల్లి వరూథిని. మాతామహుఁడు నలనాభుఁడు. మేనమామ ఇందీవరాక్షుఁడు. భార్యలు మనోరమ, విభావసి.

సుకేతుఁడు ఈతఁడు యక్షుఁడు. కుమార్తె తాటక. (సుందుఁడను యక్షుపత్ని).

సుదర్శనుఁడు- ఈతఁడు విద్యాధరుఁడని చెప్పఁబడినది. ఈతఁడాంగిరసుని బరిహసించి శపింపఁబడి సర్పమైన వాఁడు. మరియు శ్రీకృష్ణుని పాదతాడనమున నా శాపవిముక్తి కల్గెనని చెప్పఁబడినది.

సుందుఁడు- ఈతఁడొక యక్షుఁడు. భార్య తాటక.

స్థూలకర్ణుఁడు- ఈతఁడొక యక్షుఁడనియు, వీనివలన శిఖండి పురుషరూపము నందుటయు, శిఖండి జీవితకాలమున నీతఁడు స్త్రీమైయుండు నటుల కుబేరశాపము కల్గెననియుఁ జెప్పఁబడినది.

హాహా- ఒక గంధర్వప్రభువు.

హూహూ- ఒక గంధర్వుఁడు. దేవలఋషి శాపమున మకరియై పుట్టి అగస్త్యశాపవశమున గజరూపముఁజెందియుండియున్న ఇంద్రద్యుమ్నుఁడను గంధర్వుని పట్టుకొనెను. ఆ గజముదీనత మొఱలిడ విష్ణుదేవుఁడు చక్రమున నీమొసలిం జంపి గజమును రక్షించెను. (గజేంద్రమోక్షము చూడుఁడు). అది యాతని శాపవిముక్తికింగారణమాయెను.

**గంధవతి** — దాశరాజు సుతయు, పరాశరునివలన వ్యాసుం గనిన తల్లియు నగు సత్యవతికి గంధవతి యనియు, మత్స్యగంధి యనియు, యోజనగంధి యనియు నానేక నామములు

కలవు. ఇంకను వాయువు (దిక్పాలురలో నొకఁడు) యొక్క రాజధానిపురము పేరు గంధవతి.

**గంధసీలకుల గోత్రము** — ఆర్య వైశ్యుల (౧౦౨) గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు)

గ్రంధిసిలగోత్రము ఏకార్షేయ (౧) గోత్రము పొల్లింటి సంస్కృతగోత్రము తమస, ఆయాస్య గణము, ఆపస్తంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథములు ధర్మసింధు, నిర్ణయసింధు, ఆశ్వలాయనసూత్రము, విజయేశ్వరుఁడు దేవత, భార్య విజయాంబ, తపస్థానము సహ్యాద్రి శృంగము, తటాకము విజయాంభోధి, జపసంఖ్య కోటి, దీపములు ౬౧, క్షేత్రసంఖ్య ౫౧, ఘృతము దానము, దేవకాంచనము వర్జనీయము (గ్రంధ సిల చూడుఁడు.)

**గంధాష్టకములు** — సర్వసాధారణముగ గంధాష్టక మన ౧ చందనము ౨. అగరు, 3. కర్పూరము, ౪. కుంకుమపుష్పు, ౫. గోరోజనము, ౬. జటామాంసి, ౭. శిలారసము, ౮ అనుములు అని చెప్పఁబడినవి. మాంసాహుల సుగంధముచేయు గంధాష్టకము- ౧. జాపత్రి, ౨ లవంగములు, 3. దాల్చిని చెక్క, ౪. ఏలకులు, ౫ నాగకేసరాలు, ౬. మిరియాలు, ౭ కస్తూరి, ౮ ఆకుపత్రి యని చెప్పఁబడినది దేవతాప్రీత్యర్థ గంధములు - ౧. చందనము, ౨ కర్పూరము, 3. నాగకేసరాలు, ౪ కురువేరు, ౫. తుంగముస్తలు, ౬. దేవదారు, ౭. గోరోజనం, ౮. కుంకుమపూవనియు చెప్పఁబడినది. గణపతిప్రీత్యర్థ గంధములు- ౧. చందనము, ౨. అగరు, 3. కర్పూరము, ౪. ఆకుపత్రి, ౫. కురువేరు, ౬. రక్తచందనము, ౭. చంగల్వకోష్టు, ౮. కుంకుమపూవు అని చెప్పఁబడినది.

**గంభీరానది** — మాళవ దేశమున శిప్రా (అవంతి) నది యందు సంగమించు వేఱొక నది.

**గగనరోమంథ న్యాయము** - గాలిని (నమలి) నెమరువకు తెచ్చుకొనుట. నెమరువకుఁ దెచ్చుకొనుట యన దొలుత తిన్న దానిని తిరిగి నోటిలోనికిం దెచ్చుకొని నములుట యని యర్థము. నిరర్థక కార్యమని భావము. నిష్ఫలితముగా కార్యమును చేయుటం గూర్చి యీ న్యాయమును వాడుదురు.

**గగనారవిందము**- ఆకాశపు తామర పువ్వని యర్థము. నిజముగా నుండునది కాదని భావము.

**గజకచ్ఛప కలహము** (పోరు) — సుప్రతీకుఁడు, విభావసుఁడు చూడుఁడు.

**గజకర్ణుఁడు**— ఈతఁడొక యక్షుఁడు.

**గజ జంపె తాళము**— తాళములు చూడుఁడు.

**గజలాళము**— దీనిని గజలీల యనియు నందురు. (తాళములు చూడుఁడు.)

**గజపతి వంశ నృపతులు** — వీరు కటకము చౌదువార్ రాజధానులుగ ఉత్కళ రాజ్యము, కళింగరాజ్యము మొదలగునవి ఏలిన వారు వీరు ముగ్గురనియు, అందు కపిలేశ్వర గజపతి మొదటి వాఁడనియు, ప్రతాపరుద్ర గజపతి మూడవ వాఁడనియు, ప్రతాపరుద్ర దేవుని కుమార్తెను శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముండు పరిణయ మాయెననియుం జెప్పఁబడినది.

**గజపతులు** (బిరుదము)— హయపతులు చూడుఁడు.

**గజభుక్త కపిత్థ న్యాయము** — ఏనుఁగు మ్రింగిన వెలగపండు లోని గుజ్జు మాయ

మైపోవును. కాయ పై కి కాయ వలెనె యుండుం గాని ఏమియుం దెలియదు. లోని గుంజు మాత్రము వాడించి పోవును.

**గజలక్షణము**— దీనిం గూర్చి మృగ చర్మీయమను గజలక్షణములను వివరించు గ్రంథ మొకటియు, పాలకాప్య ముని రచించిన హస్త్యాయుర్వేద మను ఏనుంగులరోగనిదానము వైద్యవిధానముః గల గ్రంథ



మొకటియు మాత్రము గానవచ్చుచున్నవి. అశ్వ లక్షణ ధర్మము లేనుంగులకు వర్తించునని కొంద అనెదరు. నాబత్తు వాయిద్యము వ్రాయింపఁ బడు చుండు తావుల నేనుఁగులకు సుడి సుద్దములం జూడ నక్కఱ లేదనియు చెప్పఁబడినది.

ఏనుఁగులు- ౧. భద్రము, ౨. మంద్రజాతి, 3. మృగజాతి యని మూడుజాతులుగ నుండును. మఱియు భద్రజాతి ఉత్తమమనియు, అందు గభీర వేది లక్షణములం గల్గియుండిన ఉత్తమోత్తమ మనియుం జెప్పఁబడినది. గభీరవేదికి గంభీరవేది యనియు ననుట కలదు.

**గజాంగములు**— అంగములు చూడుఁడు.

**గజాయము**— అష్ట విధాయములు చూడుఁడు.

**గజినీ వంశము**— క్రీ. శ. పదియవ శతాబ్ద కాలమున సింధునదికి పశ్చిమముగానున్న పాంచాల దేశ భాగములం దధికారము చేసిన ముసల్మాన్ రాజవంశము. గజినీ అఫఘన్ స్థానము లోనిది. సబక్తజిన్ దండయాత్ర సుప్రసి ద్ధము. ఇతని కుమారుఁడు మహమ్మద్ పదు నేడు పర్యాయములు భరతదేశమున వేర్వేఱు భాగముల దండయాత్ర సల్పి కొల్లలం గొనిన వాఁడు.

**గజేంద్రమోక్ష స్థలము** - ఇప్పటి శోనూపురకడ గంగానద యందు గండకీనదియు (దేవికానది) సరయూనది కలియు తావున త్రివేణి యనియు నందురు. ఇది గజేంద్రమోక్ష స్థల మని చెప్పఁబడినది. హరిహరనాథ క్షేత్రము. (దేవా లేక దేవికా నది చూడుఁడు).

**గటపరచా** (Guttapercha) — ఇది రబ్బరుం బోలిన కృతక పదార్థము. మలయ ద్వీపములందలి ఈ పేరుగల ఒకజాతి చెట్ల రస మును వండి చేయుదురు. ఈజాతిచెట్లు జావా ద్వీపమునందుకూడ పెంచఁబడు చున్నవి. రబ్బరు చెట్లనుండి పాలు దీయునట్లె తొక్కనుండి దీని రసము తీయుదురు. ఇది రబ్బరువలె సాగునది కాదు. రబ్బరువలె దీనిని వల్కనైజు చేయ వీలు పడదు. ఎలక్ట్రికు తీగెలను ఇన్సులేట్ చేయ దీని నుపయోగింతురు. గాఫ్ ఆట బంతులకు పై కప్పు వేయుదురు. ఇంక రబ్బరువలెనె పలు కార్యములం దుపయోగించు పదార్థము.

**గడ్డము గల తాఁబేళ్లు**— చీనా దేశమున హాంకాంగు పురమునందున్న ఒకపవిత్ర సరోవరమునందు కలవు. అవి చీనా వారికి పవిత్రజలనిలయమనియు, అందలి తాఁబేళ్లు చీనా వారిచే గౌరవింపఁబడుచు, ఆహారము తీయుం బడుచు జీవించునవిగఁ జెప్పఁబడినవి

వాటికి గడ్డములు, వెంట్రుకలు గలవట. అవి సముద్రపునీటి రంగున నాకుపచ్చని మొదలు మూడడుగుల పొడవుదనుకఁ బెరిగి యుండునట. ఎక్కువ పొడవైన గడ్డపు వెంట్రుకలం గల కూర్మములు అధిక గౌరవమునకుం బాత్రములట. ముసలవి యైనకొలఁది యవియు నెరసెడిని.

**గడియారము** (Clock) — తొలుత సూర్యగడియారములు (Sun dials), పిదప

ఇసుకగడియారములు, తర్వాత నీటిగడియారములు ఉండినవి. తరువాత బరువులు, చక్రములు, కొంతకాలము గడియారములై యుండెను. క్రీ. శ. ౧౧వ శతాబ్దమున Mr. Buckman అనువారు యంత్రపు గడియారముం జేసిరట కాని తొమ్మిదవ శతాబ్దముననే వెరోనా కాపురస్థుండగు Arch Deacon గా నుండిన Pacificus అనునాతఁడు కనిపెట్టి రచించెనని కొందఱు వ్రాసియున్నారు. మొదటి గడియారము అను పాసెవా తొవున నిర్మింపఁబడినదట. తర్వాత Grand father clock చేయఁబడెనట. ఇప్పుడు పలువిధముల గడియారములు కలవు మొట్టమొదటగ కనిపెట్టఁబడిన గడియారము క్రీ పూ. ౧౪౦౦ సంవత్సరమున నని యందురు

**గణకూటము** (గణపొంతనము) — జ్యోతిషశాస్త్రమున వధూవరుల ఎన్నికలంగూర్చి వివరింపఁబడిన ద్వాదశకూటములలో నొకటి. వధూవరుల నక్షత్రములయొక్క దేవ, రాక్షస, మానవగణముల నెఱింగి (ఆయా నక్షత్రములందే వాటిగణము చూడుఁడు). వధూవరుల గణములు అనుకూలమో, అననుకూలమో యెఱుఁగుటకు గణకూటము, లేక గణపొంతన మనియెదరు (ద్వాదశకూటములు చూడుఁడు)

**గణగారి గోత్రము** — హారీత ఉపగణము చూడుఁడు.

**గణపత్రి గోత్రము** — ఆత్రేయ గణము చూడుఁడు

**గణపత్రినవరాత్రములు** — భాద్రపద శుద్ధ చతుర్థి మొదలు తొమ్మిది దినములకీపేరు వాడుకయున్నది. వీటియందు మహాగణాధిపతి యగు విఘ్నేశ్వరుని పూజింపుదురు.

**గణపత్రిన్యాయము** — గణపతిని శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణాపత్యాది వైదికమతస్థులందరు పూజింతురు. మఱియు నానామతస్థులు గణపతిని తమతమ మతములకుం జెందిన వానిగనే చెప్పుదురు

**గణపతులు** (అష్టగణపతులు) — ౧. లక్ష్మీగణపతి, ౨. క్షిప్రగణపతి, 3. సిద్ధిగణపతి, ౪. చింతామణిగణపతి, ౫. శక్తిగణపతి, ౬. ఉచ్ఛిష్టగణపతి, ౭ ఏకాక్షర గణపతి, ౮. కుమారగణపతి.

**గణపవరపు వేంకటకవి** — ఆంధ్రకవులలో నాధునికులంగా పరిగణింపఁబడిన వాఁడు. నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు, ఆశ్వలాయన సూత్రము, వసిష్ఠసగోత్రము, తండ్రిపేరు అప్పయ్య. గుంటూరుమండలములోని కామేపల్లి సీమలోని గణపవరము కాపురమని తెలియుచున్నది. ఇది పలనాటిసీమలోని భాగము. రచించినది ప్రబంధరాజవేంకటేశ్వరవిలాసము ఇది ఏకాశ్వాసమైనను ఐదాశ్వాసములంతయున్నది.

**గణముఖకుల గోత్రము** — ఆర్యవైశ్యుల (౧౦౨) గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు). గణముఖకులగోత్రము-(గణముఖకుల లేక గణముఖుల) ఏకార్షేయ గోత్రము (౭౦), సంస్కృతగోత్రము కాశ్యపస, కశ్యపగణము, ఆపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాశ్వలాయనసూత్రము, నిర్ణయసింధు, ధనేశుఁడు దేవత, ధర్మాంబ భార్య, బ్రహ్మాద్రి తపస్థానము, ధర్మాబ్ధి తటాకము, జపము దశలక్ష, దీపములు ౧౭, క్షేత్రసాఖ్య 3౮, స్వర్ణ దానము, వాడగన్నేరు వృక్షపూజనము.

**గణాచారము** — ఇది శైవాగమములందు చెప్పఁబడిన పంచాచారములలో నొకటి.

ఇవి ౬౪ విధములగు శైవమతశీలములు (వ్రతములు లేక దీక్షలు).

**గణిగోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుఁడు, శరద్వంత ఉపగణము చూడుఁడు.

**గణితము** — నాల్గువిధములు (అంకెలను గణితశాస్త్రమునందు) ౧. సంకలితము- అంకెలను కలుపుట, కూడుట, గుణకము. ౨. ఉత్కలితము- అంకెలను ఒకదానినుండి వేఱొకదానిని తీసివేయుట ఒకదానినుండి వేఱొకదానిని తగ్గించుట. 3. గుణకహారము- ఒకదానిని వేఱొకసంఖ్యచే గుణియించుట లేక హెచ్చువేయుట. ౪. భాగహారము- ఒకదానిని వేఱొకసంఖ్యచే భాగించుట (విభాగించుట) లేక హరించుట, హరణము.

**గతిలేనిఅమ్మకు గంజేపానకము**— ఆంధ్రలోకోక్తి.

**గదబజాతి** — వీరింగూర్చి దెలుపు గ్రంథములు లేవు. వీరు అడవిజాతివారలలోనొకరు. వారి కులకథనము వారియొక్క జ్ఞాపకపరంపరచే పోషింపఁబడుచు నిట్లున్నది ఒకనాఁడొక వనదేవత వీరిగూడెమునకువచ్చి తానారాత్రి యుండుటకొకమంచెను (మంచము) ఇమ్మని యెల్లరం బ్రార్థించెనట. వారు దాక్షిణ్యమునూలి యాద లేకగ్రీవముగ బిచ్చగాండ్రకు మంచమీయఁతగదని నిరాకరించి నేలబండుమనిరట. ఆవనదేవత యలిగి మీకులమువారెంక మంచెలపైఁ బాడరాదని శపించి వెడలిపోయెనట గాన వీరు నేలనే బండి నిదురించుట పద్ధతియైనది. వీరు యింకను నారచీరలను మాత్రమే ధరింతురు అదియు నిట్లే వనవాసమునకరుగుచో వల్కలధారిణియగు సీతాదేవిం బరిహాసించి శపింపఁబడిరని చెప్పుకొందురు. వారు పట్టువస్త్రములను ముట్టనైనముట్టరు.

**గదలము** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున సర్పవిషమునకు గదలమని పేరు.

**గదాగ్రణి** — క్షయరోగమునకుఁ గదాగ్రణి యని పేరు. ఇచట గదశబ్దమునకు రోగమర్థము.

**గదారేఖ** — పురుష సాముద్రికము చూడుఁడు, స్త్రీ సాముద్రికము చూడుఁడు.

**గదుగలగంధము** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున కూనిరోగమునకుఁ బేరు

**గదుఁడు** — అత్రిచంద్ర యాదవక్షత్రియుఁడు, తండ్రి వసుదేవుఁడు, తల్లి రోహిణి, సోదరులు శ్రీకృష్ణబలరామాదులు.(వసుదేవుఁడు చూడుఁడు)

**గనుపు** (Knot in wood) — కఱ్ఱదూలములం జెక్కునపుడుగాని, కోయునపుడుగాని అందు గనుపు లగుపడుచుండుట నెల్లరెఱిఁగినదే. ఇవి కొమ్మలుండు తావులకడ చెట్లు అధిక బరువునుమోయవలసియుండుఁగాన నట నెక్కువ బలముగలదిగ నుండుట కిట్లు గూడు లేర్పడును. గనుపులు చాల గట్టిదిగ నుండి యేర్పడిన వృత్తాకారముల సముదాయములు.

ఒక్కొకతఱి చెట్టునందు కొమ్మ అంకురించిన తావులందు వేఱుకారణములచే నాకొమ్మ యటం బెరుగక యంతరించ నాయేర్పడిన వృత్తాకారసముదాయము బలపడక, ఆకారముమాత్రము గలదిగ నిలచియుండును. దీనిని కఱ్ఱయందలి సుడియనెదరు. కనుపులనియు నందురు.

**గబిధుమతీ (కుదారోట) పురము** — ఇటావాపురమున కీశాన్యదిశగా ౨౪ మైళ్ళ దూరమున నున్న తావు. ఫరూకాబాదు జిల్లాలోని సంకిసాపురమునుండి 3½ మైళ్లు దూరము. రొండవశిలాదిత్యుఁ డను

శ్రీహర్షుని పాలనకాలమున హరిదత్తుఁ డనువాఁడిట పాలకుఁడుగ నుండెనని (కనూజరాజ్యము) ఎపిగ్రాఫికా ఇండికా ౧ వ సంపుటము ౧౮౦ నుండి తెలుచున్నది

**గభీరవేది (భద్రజాతి) గజము** — గజలక్షణము చూడుఁడు

**గయ** — బీహారు (తొల్లింటి విహార) దేశమున గయామండలమున ప్రధాననగరము. గయాక్షేత్రము గయాశీర్ష మని యందురు ఉత్కల దేశమున వైతరణీ తీరమునఁ గల జాజిపూర్ (తొల్లింటి యజ్ఞపురము) నాభిగయ యనియు, ఇంక వేఱొకచోట పాదగయ కలదనియు చెప్పఁబడినది. ఇవిగాక నర్మదానదీతీరమున జబ్బలూపూరు మండలమున బేడాఘాటనంబడు తావున మార్బ్లరాళ్ళకడ ఇంద్రగయ యని యొకటి కలదు.

గయాక్షేత్రము ఫల్గునీనదీతీరము ఇది పితృప్రీతియగు పవిత్రక్షేత్రము ఇట ధర్మపృష్ఠమనంబడు పవిత్రశిలాతలమును, అక్షయవటంబను మఱ్ఱిచెట్టును, అటనే కతిపయదూరమున గల విష్ణుపాదములకుఁ దేవాలయమును కలవు. మరియు గయయందు మంగళగౌరి శక్తిపీఠము, అష్టాదశ శక్తిపీఠములలో నొకటి. గయపట్టణప్రాంతముల ప్రేతపర్వత మనియు రామశిల లేక, రణశిల యనియు, ఇంక నిట్టివే సప్తపవిత్రస్థానములు కలవు అవి సప్తగయలని మార్కండేయపురాణమున చెప్పఁబడినవి

శ్లో॥ గయాయాం ధర్మపృష్ఠేచ సదసబ్రహ్మణ స్పతే గయాశీర్షే వటేచైవ పితౄణాం దత్తమక్షయమ్' అని చెప్పఁబడియుంట నీగయాక్షేత్రమున పితృర్పణయు, పిండప్రదానమును హిందువులకుచాలముఖ్యముగ నెంచఁబడుచున్నవి. ఈ యర్పణలకుఁ గయాశ్రాద్ధ మని వాడుక నామము. గయాక్షేత్రమునకు పితృర్పణలునలుపనేకేట రెండులక్షలవఱకు యాత్రికు లేతెంతురట అమావాస్యదినములు పితృర్పణకు చాల ప్రీతికరమగు దినములు. ముఖ్యముగ పితృపక్షమనంబడు భాద్రపద బహుళపక్షమున యాత్రికు లధికసంఖ్యాకులుగ గయ కేగుదురు. పిండములవేయుచుండు విష్ణుపాదదేవస్థానమున పగలంతయు తిలలు, దర్భలు, పిండములతో నిండియుండుచు, రాత్రులందు కడిగి శుభ్రపఱచి శుభదర్శనమునకు వదలుచుందురు.

గయయందు గల పండాలకు గయావళ్ అని పేరు. వీరు గంగాపుత్రుల తెగవారు అందఱిచే గయావళీ లనంబడుచుందురు. వీరందఱు ద్వైత సిద్ధాంతమును మతముగాఁగల వైష్ణవులు. మధ్వగురువులకు శిష్యులు చాల ధనవంతులని పేరందినవారు

గయయందు వేత్వేఱుజాతుల శిలలతో చేయఁబడిన ప్రశస్తమగు కల్వములు చేయుదురు. ఇవి భారతదేశమంతటను ప్రశస్తములుగ పేరందినవి. ఇంకను చలికాలమున కప్పుకొను కంబళ్ళు (రగ్గు) లు నేయఁబడుచున్నవి. (గయాక్షేత్రము చూడుఁడు)

**గయమహారాజు** — షోడశమహారాజులలో నొకఁడు. (మహారాజులు చూడుఁడు.)

**గయాక్షేత్రము** — దీనిని శీర్షగయ యనెదరు దీనింగూర్చిన వివరములు వాయుపురాణము ౨-౧౦౧ యందుఁ జెప్పఁబడినవి.

గయాక్షేత్రము ఫల్గునీతీరముననే, ఉత్తరమున రామశిలపర్వతము మొదలు దక్షిణమున బ్రహ్మయోనిపర్వతముదనుక వ్యాపించియున్నది. గయాపట్టణము నవీనభాగ ముత్తరమున సాహెబ్ గంజియను పేరం బరఁగును. ఇందు విశాలమగు బాటలు మొదలగునవి సౌఖ్యనివాసమిచ్చెడిని. దక్షిణభాగ మంతయు యాత్రాస్థల

ములతోను, గయావళీల గృహములు, యాత్రికుల బసలచే దనరుచుండును. ఇందే విష్ణుపాద దేవాలయము కలదు. దీనిని ఇందూరుసంస్థానాధిపతి మల్హారిరావు హోల్కారు కోడలగు అహల్యాబాయి తొల్లింటి దేవాలయపుతావున క్రీ. శ. ౧౭౬౬-౧౭౮౭ తిరుగ పెద్దదిగ కట్టించెను.

ఏబదిరెండు తీరములలో నొక్కటియగు మంగళగౌరి దేవస్థానము బ్రహ్మయోనిపర్వతచరియపై భాసనాథమను పేరుగలతావున గలదు. దీని ప్రశంస దేవీభాగవతము ౭-౩౦,౩౮ యందు కలదు.

విష్ణుపాదమునుండి ఆరుమైళ్ళదూరముననున్న ధర్మారణ్యమును, మతఙ్గవాపియు, నైఋతిదిశగా నొకమైలుదూరమునంగల బ్రహ్మసారమును, దక్షిణముగ నొకమైలు దూరమున (మారన్పూర్ వద్ద) నున్న గొడాలోల మనంబడు తావును, ఉత్తరముగ నొకమైలుదూరమం దున్న ఉత్తర మానసమనంబడు సరస్సును, దేవఘాట్ వద్దనున్న దక్షిణమానసమును, ఈక్షేత్రమున యాత్రికులకు ప్రధానములని చెప్పఁబడినవి. వీటిప్రశంస అగ్నిపురాణము ౧౧౫ యందును, మహాభారతము వనపర్వము ౮౪ యందును గలదు.

బ్రహ్మయోనిపర్వతచరియను గయాశీర్ష మందురు. ఇదియె తొల్లింటికాలమున గయపట్టణ ముండిన తావని కొంద ఱనెదరు. ఇదిరెండు మైలు విశాలముకల తావు. ఇచట బుద్ధభగవానుఁడు ఆదిత్యపర్యాయసూత్రమును బోధించెనట. (గయ చూడుఁడు.)

విష్ణుపాదదేవాలయమునకడ సూర్యకుండము కలదు. అక్షయవటమునకడనున్న ఒక శిలాశాసనము క్రీ.శ. ౧౦ వ శతాబ్దమునిది. దీనిని బ్రహ్మగయ యందురు. కోల్హాపూర్ సంస్థానపు కొల్హాపూరునకడ రుద్రగయయును, బీరారు పరగణాలోని లీనాక్ అను తావున విష్ణుగయయు, జబ్బల్పూరునకడ నర్మదానదిపై ఇంద్రగయయు, ఉత్కలదేశమున కటకంజిల్లాలోని జాజిపూర్ (వైతరణీ నదీతీరమున) నందు నాభిగయయును కలవు.

**గయుఁడు** - లోకప్రసిద్ధుఁడగు గయాసురునిం గూర్చి యిందు తెలిగించెదే. ఈతనిశిరస్సు గల తావు గయపట్టణము. ఫల్గునీనదీతీరము. ఇట బ్రహ్మయోని పర్వతము, వటావృక్షము, ధర్మపృష్ఠము, విష్ణుపాదము మొదలగు పిత్రర్చన స్థలములు కలవు (గయ చూడుఁడు) మఱియు గయాసురునినాభి ఉత్కలదేశమున కటకముజిల్లాలోని వైతరణీ నదీతీరమున జాజిపురమున విరజాక్షేత్రమున గలదు. దీనిని నాభిగయ యనెదరు. ఇటగదాధర విష్ణుదేవుఁడు గలఁడు.

ఇాకన ఆఘార్త్రరజుని కుమారుఁడుగయుఁడనేక యజ్ఞములొనర్చి రాజర్షి యనిపించుకొనినవాఁడు. ఈతని యజ్ఞవాటమె గయాక్షేత్రము. మఱియు ప్రియవ్రతుని వంశస్థుఁడగు నక్తుని కుమారుఁడు గయమహారాజు. ఈతఁడు చక్రవర్తియనియు, షోడశమహారాజులలోని వాఁడనియుచెప్పఁబడినది. ఈతండే నూఱశ్వమేధ యాగము లొనర్చినవాఁడట. అసంఖ్యాక గోదానములొనర్చెనట. ఇంకను ఉల్ముకుని సుతుఁడొక గయుఁడుకలఁడు. ఈతని సోదరుఁ డంగుఁడు.

**గరళము** — పాముయొక్క విషమును గరళమందురు. ఆంగ్లమున Snake poison అనియు, సంస్కృతమున గరలం, సర్పవిషం అనియుంబేరులు. విషముగల పాములలో త్రాచుపాము లేక నాగుపాము అనంబడునది గాఢ విషముం గల్గియుండుటకు ప్రసిద్ధమైనది. ఇంకను కట్లపాములు, పొడపాములు మొదలగు పెక్కు జాతుల పాములున్నను వాటివిషము అంతగాఢమైనదికాదు. విషసర్పములందు గోనాగమనఁబడు

జాతి అన్నిటికన్నను మహాఘోరమైన విషముం గలదిగ చెప్పఁబడినను, ఇక్కాలమున నాజాతి చాలభాగము నశించిపోయి అరుదుగ నెచ్చటనోగాని కానవచ్చుటలేదు. గోనాగము యొక్క విషపువేడికి అచ్చటనున్న మార్గమున పచ్చగడ్డికూడ మాడిపోవునని చెప్పఁబడినది. ఇవి ఎక్కువ ఉష్ణముగల సీమలలోను మహారణ్యముల నెచ్చటనో యుండును.

త్రాచుపాము నోటను దవడలకడ దంతము లుండుతావున నిటునటు రెండుతిత్తులుండు. ఈ విషముండును. పామునకు ముందు రెండుకోర లుండి అవిపైనుండి క్రిందికివచ్చి వెనుకనైపు ఇంచుకవంగి సూదులై యుండును. పాముగరచుట యనఁ గోరలుత నిసూదల గ్రుచ్చి యాగాయములకు తననోటనుండు విషపుతిత్తుల నదిమి కొంచెము విషము నాక్రొత్తగాయములకు కారించును. రక్తము తగిలినతోడనే దానివెంట లోనికతివేగముగ బోవడి వ్యాపించుశక్తి సర్పవిషమునకెక్కువగ కలదు గాని విషము లోనికేగను అది ప్రాణముల బోగొట్టును. పామునోట విషముండు తిత్తులను మానవశరీరమందలి Saliva glands తో పోల్చి వాటిని Poison glands అనెదరు.

విషములేని పాములు కొండచిలువ (Boa) Anaconda (ఇది అమెరికా దేశమునందలి Boa జాతికిఁజెందిన నీటిపాము) Python (ఇది యొక పెద్దదగు పాము) మొదలగు కొన్నిజాతుల పాములున్నను వానికి విషములేక అవి పీల్చివేసి కాని, మ్రింగివేసికాని ప్రాణుల బాధించెడివి.

పామువిషము మిక్కిలి కాకఁజేయును శరీర మందన్ని యవయవములకు నతివేడి గల్గించును ముఖ్యముగ నేత్రములకు వేడిగల్గించి ఎఱ్ఱబడ జేయును. ఆయుర్వేద వైద్యులు వాతము ముంచి ఇక రోగిజీవించుట దుర్లభమని తోచిన యదనున నీగరళము లోనికిత్తురు. కాని యితర కాలములందు ప్రత్యేకముగ లోనికీయరు ఇదికడసారి ప్రయోగముగ నెంతురు. గరళము ఇతరఔషధములందు చిన్నపాలు చేర్పఁబడి మిక్కిలి వేడిగల్గించును.

గ్రహణి, కడుపులో పుండ్లు లేక గాయము, రక్తగ్రహణి గలవారికి గరళసంబంధమే తగుల రాదనియు, గరళమిశ్రమమగు ఔషధములంగూడ నీయరాదనియు, ఇచ్చిన ప్రాణహాని గల్గించుననియు జెప్పఁబడినది. మఱియును గాయములకు, పుండ్లకు, రక్తముదిమ్ము ఏపాటి చిన్నదెబ్బలు, సరకులకైనను గరళముయొక్క స్పర్శమైనను తగదు తగిలినతోడనే సర్పదష్టమువలె పనిచేసి చంపునని చెప్పఁబడినది.

**గరిక (గడ్డి) చెట్టు** — లా. **Cvnodon dactylon, Panicum dactylon, Agrostis linearis,** ఆంగ్ల **Huriallee grass, Couch grass, Creeping panic grass,** సం దూర్వా, భార్గవీ(నల్లగరిక), కొందఱు [illegible] గరిక తెల్లగరికయనియు, నల్లగరికయనియు రెండుభేదములు కలవు అందు నల్లది శ్రేష్ఠమందురు. గరికగడ్డి జాతులలో నొక జాతి గడ్డిచెట్టు.

గరికరసము లేక కషాయము దలవజేసి కఫము, క్రిమిరోగము, గంధకదోషము, తాపము, పైత్యము, రక్తదోషము, వివాహము, విసర్పి పీటినడంచుననియు, గరికవేళ్ళ రసము పుంస్త్వపుశక్తి నడంచి నపుంసకత్వము గల్గించుంగాన లోని కీయరాదనియుం జెప్పఁబడినది. తెల్లగరికనూరి నలుగిడిన పిల్లలశరీరము తెల్లఁబడి ఛాయగల్గునందురు.

గరిక పశువుల కాహారము. దీనికణుపులు భూమికి మోపినతావున వేళ్లుతన్ని పెరుగు మొండి జాతి. ఇది ఎండిపోయి చచ్చినట్లగుపడినను లోన

నెక్కడనో ఒక్కతావున పచ్చియుండిన నటవేళ్లు తన్ని పెరిగి వృద్ధిపొందెడిని. గరికిచిగుళ్లు (దూర్వములు) గణనాథునకు పూజింతురు.

**గరిమాసిద్ధి** — సిద్ధిసిద్ధులు చూడుఁడు.

**గరుడ తాళము** — తాళములు చూడుఁడు.

**గరుడ పురాణము** — (గారుడము) లింగ, కూర్మపురాణములందు దేవీభాగవతము నను పదునారవదిగను, తక్కినవాటియందు పదు నేడవదిగను చెప్పఁబడినపురాణము. గరుడోద్భవ బ్రహ్మాండ విషయములు, చావుఁబుట్టువు ప్రాణి స్థితి మొదలగు విషయములందెల్ల పురాణము. మత్స్యపురాణమున పదునెన్మిదివేలుగను, తక్కిన పురాణములందు ౧౯,౦౦౦ గను గ్రంథ సంఖ్య వివరింపబడినది.

**గరుడవర్ధనపు చెట్టు** — నందివర్ధనపు చెట్టు చూడుఁడు

**గరుడాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. ఇది రెండువిధ ములు:కుడి కాలిమీద నానినిలువంబడి,ఎడమకాలిని కుడికాలి వెనుకనుండి కొంచము త్రిప్పి ఎడమ కాలి వ్రేళ్ళను, కుడిపాదముపై నానించి, రెండు చేతులను మెలికవైచి త్రిప్పి, అరచేతులం గోడిం చియు, ఆ వ్రేళ్ళతో ముక్కుమూసుకొని నిలువం బడుట గరుడాసన మనంబడును. ఇది సవ్యమా ర్గము. ఇంక నెడమకాలునాని నిలువంబడి కుడి కాలిం ద్రిప్పి వ్రేళ్ళను ఎడమపాదముపై నానించి చేతులను పైవలెనే యుంచుట అపసవ్యమార్గము.

ఇంకను ప్రకారాంతరమున రెండుకాళ్ళవ్రేళ్ళ మోకాళ్ళు నేలనానించి రెండుమడిమెలపైని పిరు దులనానించి కూర్చుని అరచేతులు వెల్లకిలనుండు రీతిని మోచేతులను మోకాళ్ళపై నానించి చేతు లుసాచి కూర్చుండుటయుం జెప్పఁబడినది దీని యభ్యాసమున చిత్తైకాగ్రత గల్గుటయు ప్రాం వాయువు సుషుమ్న గతముగుటయుం జెప్పఁబడినది.

**గరుడ హస్తము** — హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.

**గరుడుఁడు** — ఇతనికి గరుత్మంతుఁడు



తార్క్ష్యుఁడు మొదలగునామ ములు పెక్కుగలవు. తండ్రి కశ్యపప్రజాపతి. తల్లి వినత. సోదరుఁడు అనూరుఁడు.

గరుత్మంతుఁడు విష్ణుభక్తుఁడు. విష్ణుదేవుం గూర్చి గొప్పతపం బాచరించి ప్రసన్నతవడసినవాఁడు. విష్ణు దేవుని వాహనము. నాగకులమునకు వైరి.

**గళాగలి గోత్రము** — సంకృతి ఉపగణము చూడుఁడు.

**గవర కులమువారలు** — వీరాం ధ్రులు. విశాఖపట్టణ మండలపు అనకాపల్లి పుర సీమ, మూలస్థానముగ నాదిని కాపురము కుదిరి ఆదేశ పరిసరములకేగాక బర్మా దేశమునకుం గూడ కొందఱుగ యున్నవారలు. వీరెచ్చట నున్నను అనకాపల్లి సీమయే వీరిప్రధానస్థానము. ముఖ్యవృత్తి సేద్యముగా నవలంబించువారు. వీరి యందు ధనికులెక్కువమంది కలరని బలమగు ప్రతీతికలదు. మితవ్యయమునకుం జేరందినవారు. పలురకముల సేద్యముల నొనర్ప నేర్పరులని పేరందిరి.

పల్లపు భూములను మెరకచేయుటకుఁగాని మెరకభూములను పల్లపుపొలములుగ మార్చు టకుగాని వీరుసమర్థులని గర్వముగఁ జెప్పుకొం దురు. వీరియందైకమత్యము, స్వకులాభిమానము బలమైనది. ఆంధ్ర దేశపు కులములలో సేద్యము నందగ్రస్థానమందినవారనిన నతిశయోక్తి కానే

రదు. వీరి స్త్రీలకు స్వాతంత్ర్యమధికము. వారు వర్తకపుసనులు, తాము పండించిన పంటదినుసుల నమ్మకట మొదలగుకార్యములందు నిపుణులు. వీరియందు మాంసమునములు కలవు. అన్యులు వీరి స్త్రీలను గౌరవముగ సంబోధించుటయందు అమ్మయ్య యనుట యాచారముగ గలదు.

వీరందరును శాక్తేయ మతస్థులు. వీరిలో కొందరు అన్యులవలె కిరువణి శ్రీమూర్తిములం ధరించుచున్నను వీరు గౌరీశక్తి నారాధించు సంఘముగాన గౌరీని వేరందిరి. అశబ్దమే వీరి కులనామముగ మారి గవరలని ప్రసిద్ధియు గాంచె.

**గవరక్షోమటులు** - ఆర్య వైశ్యులు చూడుడు.

**గవల గోత్రము** — కుశికగణము చూడుడు

**గవాక్షుఁడు** — సుగ్రీవుని సేనయందలి యొక వానరుఁడు. ఈతని పేరంబరగు ఒకతీర్థము ఈతఁ డేర్పఱచెనని రామేశ్వరమున నొక చిహ్నము జూపుదురు

**గవిష్ఠిర గణము**— ఇది అత్రి సంతతి యందలి యొక గణము. ఇందు ఇరువది యారు గోత్రములు కలవు.

కాత్యాయన సూత్రోక్త గోత్రములు (౧౦) ౧. అవరోధకృత్. ౨ ఔర్ణనాభి, ౩ గవిష్ఠిర, ౪ నాలందన ౫ గైజవాహన, ౬. మాంజకాశి, ౭. లాక్షి, ౮ వ్యాఘ్రిణి ౯ శైలేయ, ౧౦. సృపి

మాత్స్య సూత్రోక్త గోత్రములు (౧౬)- ౧. కేటకి, ౨ కృష్ణకేర్షక ౩ కాకళ్రి, ౪ గాలాశి, ౫. ప్లక్షి, ౬ పార్ష్ణి, ౭. పూర్వాతిథి, ౮. బరధృతి, ౯ బ్రహ్మపుష్పి, ౧౦. మైత్రేయ్య, ౧౧. లలందలి, ౧౨. వ్యాఘ్రపుష్పి, ౧౩ శ్యామపుష్ప్య, ౧౪. శికమక, ౧౫. సౌపుష్పి, ౧౬. హిరణ్య.

ఈగవిష్ఠిర గణమందలి గోత్రములు ౨౬ కి ప్రవర రూపములు (౨)-౧. ఆత్రేయ, అర్చనానస, గావిష్ఠిర, ౨. ఆత్రేయ, గావిష్ఠిర, పౌర్వాతిథి.

**గవిష్ఠిర గోత్రము**—గవిష్ఠిర గణము చూడుడు. ముద్గల గణముచూడుడు.

**గవేరణి గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుడు, హారిత ఉపగణము చూడుడు.

**గసగసాల చెట్టు** (నల్లమందుచెట్టు)— లా Papaver somniferum. ఆంగ్ల. Poppy tree. సం ఖస్ఖసవృక్షః, సుబీజః, సూక్ష్మబీజ వృక్షః నల్లమందునకు సంస్కృతమున అఫేనమ్ అందురు. నల్లమందుచెట్టునుండి చేయు విషపదార్థము (నల్లమందు చూడుడు). ఈచెట్టుకాయల లోని గింజలకు గసగసాలందురు. కాకలనడంచి గ్రహణినాపి ఇంచుక మత్తుగల్గించి వీర్యప్రకోపముఁజేసి మాంద్యముఁగల్గించుననియు, బోదకాలు రోగమును శాంతింపఁజేయుననియు, పొడిదగ్గు, క్షయరోగముల నివారించుననియు, మెదడుకు, మలమునకు తిత్తులు, మూత్రమునకు తిత్తులకు బలముఁగల్గించుననియు, కొంచెము వేయించి తినిన ధాతుపుష్టిగల్గించుననియు, అట్లే వాసన చూచుచుండిన నిద్రఁగల్గించుననియు, అధికమైనచో నిండుక కడుపుబిగియఁజేసి వాతముం బ్రకోపింపఁజేసి, ఇంద్రియనష్టము గల్గించుననియు, మలబద్ధము గల్గించుననియు, దీనికి విరుగుడులు తేనె, పంచదార, రూమిమస్తకి యనియుఁ జెప్పఁబడినది. నల్లమందుచెట్టుకాయల పెచ్చులకు పోస్తకాయలని పేరు. ఇందు కొంచెము మత్తుం గల్గించుగుణము కలదనియు, దీనికషాయము లోని కిచ్చిన విరేచనములంగట్టుననియు, నిద్రఁగల్గించు

వనియు, వేడికషాయములో గుడ్డముంచి పైన కాచిన కపురుదెబ్బలు, గాయములు మాన్పునట్లు వనియుం జెప్పుదరు. నల్లమందు పొగాకుతోఁగాని తమలపాకులతోఁ గాని సిద్ధపఱచి కాల్చుటకు (మద్దత్) తయారుచేయుదురు. ఇది కాల్చి పొగ పీల్చిన మత్తుగల్గించును. ఇది గరభ్యాసముగ దలంపఁబడుచున్నది.

**గహెవార్ (శాఖ) క్షత్రియులు** — శిశోదియా (శాఖ) క్షత్రియులు చూడుఁడు.

**గళగ్రహము** — దీనికి గళగోగ మనియు నందురు. కంఠవ్రణమని కొందఱు వాడుదురట. శ్లేష్మ సంబంధ రోగమని తలంపఁబడుచున్నది. ఆహారాదులను లోనికిఁ జననీయకుండు నటుల గళమున నగు విషపుజాతి వ్రణము. స్వరమును నీరసింపఁజేయునది అపాయకరమగు జబ్బు.

**గళస్థపాదుకాన్యాయము**— గళముపై కాలిజోడని యర్థము శత్రువు ఇరుకు నంబడినతరి కొన్నివిధుల (మరతులను) విధించి యవి తప్పినచో దుస్సాధ్యములగు కఠినోద్ధతులను విధించి బలాత్కరించు స్థితియందు ఈన్యాయము వర్తించును.

**గచ్చ (పొద) చెట్టు** — లా Caesalpinia bondue అనియు, Guilandina donducella. ఆంగ్ల. Molucca Bean లేక Nut tree. సం. కుబేరాక్షి. గచ్చచెట్టు ముండ్ల పొద గాన తోటలయొక్క పరిహద్దుకంచెలయందు వేయుదురు. గచ్చచెట్టుకాయలు పైనికూడ ముండ్లుండును. లోనిపిక్కలనే గచ్చకాయలని తఱచు వాడుచుందురు. గచ్చపిక్కలు గచ్చచెట్టుకాయల లోని గింజలుగనున్నవి. అవి ఆడపిల్లలు ఆటలకుపయోగింతురు. గచ్చాకు ముదిరినదానికన్న లేతది శ్రేష్ఠమని చెప్పఁబడినది. వీని కషాయము లేక రసము వేడిచేసి ఋతురక్తమును చక్కగ వెడలించును. శరీరములోల మలములను వెడలించును. ఆముదమునవించుక వెచ్చజేసిపైనికట్టిన ఒఱిబీజపుబాధ (అండవాతము) నిమ్మళించును. కషాయము లేక రసమునందు అండవాతము, ఋతుదోషము, క్రిమి, జ్వరదోషము, వాతములు, శూలలు, శ్లేష్మరోగము నివారణమగునని చెప్పఁబడినది.

గచ్చవేరురసము- అగ్నిమాంద్యము, కుష్టురోగము, వాతశూలలు నివారించి దేహమునందు నిల్వయగు దుష్టజలముల వెడలించి దేహమును గట్టిపరచునని చెప్పఁబడినది. గచ్చకాయలలోని పిక్కలం జికాకగొట్టి లోనిపలుకులు చేసుగనుండి అన్నభేదియందలి విషదోషము, పాషాణదోషము, ఇత్తడి,రాగి మొదలగు లోహముల విషదోషము, కడుపులోనిబల్లలు, క్రిమిరోగము, ఈడుపుదగ్గు, ఉబ్బసపుదగ్గు, గుండెలలోనినొప్పి, శూలనొప్పి, మన్యపుజ్వరము, వమనజ్వరము, చలిజ్వరము, నీరసము నివారించునని జెప్పఁబడినది. కాని పలుకులందు వమనముచేయు గుణము బలముగ గలదు గాన, వైద్యులతిజాగ్రతగా నుపయోగింతురు. గచ్చపప్పుచూర్ణము నీట నరుగఁదీసి (యోగంధపుముద్దను) తేలుకుట్టినచోట వేసి కాచిన బాధతగ్గును. పైనరాసికాచిన గవద బిళ్లలు, అడ్డగర్రలవ్యాధి, ఒఱిబీజము (లేక అండవాతపుబాధ) నివారించును. గచ్చపప్పు నూనె యందు కఫవాతము, ఈడుపుదగ్గులం గూడ నివారించుశక్తి (పైకిమర్దనా) గలదందురు. పప్పు కాల్చినమసి దంతరోగముల నివారించును.

**గజ్జి, దానిపురుగు** — ఇది సూక్ష్మ జీవుల (Worms) నుండి సంభవించు అంటు రోగము. తఱచుగ బాల్యమునందు యౌవనప్రాదుర్భావమునను సంపర్కదోషమునుండి అపరి

స్పృశతగలవారికిం గల్గుమండు కుష్ఠురోగవ్యాధి గ్రుడ్లనుండి జనించు జాతిపురుగు లీకుష్ఠురోగులకుం గారణము. వీటియందు స్త్రీపురుష భేదముకలదు. ముందు నాలుగు, వెనుక నాలుగు మూడ్లగుత్తుల వలె కాళ్లుండునందురు. (అంటు వ్యాధులు చూడుడు. సూక్ష్మజీవులు చూడుడు)

**గద్దరికాప్రవాహ న్యాయము** — మేకలమంద ఒక మేక మునుగనడచిన అన్నిమేక లును వెంటాడించుచు వెంబడించునని భావము. అర్థములేక ఒకనిని తానుసరించుట కీన్యాయము వాడుదురు.

**గద్వాల్ రాజ్యము** — అరుణోదదేశము చూడుడు.

**గద్యము లేక వచనకావ్యము** — గద్యకావ్యములు సాధారణముగ ద్వివిధముగ నుండును. ౧. గద్య- ఇదివాఙ్మభేదములు కలది. ౧. సాధారణగద్యము, ౨. విన్నపరూపగద్యము, ౩. చూర్ణికాగద్యము, ౪. బిరుదుగద్యము అని

ఇంక వచనకావ్యము లేదు తెలుగులు- ౧. సంభాషము (ఉత్తరప్రత్యుత్తరరూపము), ౨. ఉక్తులు (ఒకరు చెప్పినదానిని తాజెప్పుట), ౩. వ్యాసములు, ౪. చరిత్రలు, ౫. ఆఖ్యాయికలు. ౬. కథలు, ౭. నవలలు (Novels). ఇటుల వచనకావ్యభేదములు పెక్కురకముగ నున్నవి.

**గద్వాలసోమభూపతి** — ఈతడు క్రీ. శ. ౧౭౧౦ సంవత్సరప్రాంతమున ఇప్పటి నైజాము రాజ్యములోని గద్వాల సంస్థానమును పాలించిన ప్రభువు భద్రాపరిణయము రచించి పేరందిన కాణాదము పెద్దనసోమయాజి యీతని యాస్థానకవి యని తెలిసెడిని ఈ సోమభూపతి రచించినది రతిశాస్త్రము మూడాశ్వాసముల ప్రబంధము ఇది హరిహరప్రణీత సంస్కృత గ్రంథమును తెలుగున అనువదించినట్లగపడు చున్నది. ఈసోమభూపతి యాస్థానకవియగు కాణాదము పెద్దన్నసోమయాజి పురసంస్థానాధి పతియగు పామన్నపాలునకుమత్స్యపురాణమును, శేషశైలేశలీలయు కృతినిచ్చినవాడు.

**గన్నేరు చెట్టు** — మనదేశము నందిది సర్వసాధారణమైన వృక్షమే. పూదోటలందెల్లడల గానగుచుండును. ఇది తెలుపు, ఎరుపు, పసుపురంగుల పూవులంబూచు మూడుప్రధాన జాతులుగ నెంచనగును. అందు తెలుపుజాతియు, ఎరుపు జాతియు ఒంటిరెక్క పూవులం బూచు నదియు, ముద్దపూవులం (అనేకవరుసలు) బూచునదిగను, మఱి రెండు భేదములుగ నుండును. ఒంటిరెక్కజాతి పూవుయొక్క కాడ గొట్టములో నొకసన్నని స్తంభమును దానికడ నొక శివలింగాకారముగను గాననగును. ఈఒంటి రెక్క ముద్దపూవుజాతులలో ఎరుపు, తెలుపు రంగులొక తీరున నుండక పెక్కుమాత్రల భేదముల పరిమితిగల రంగులతో గాననగు చుండును కాని యారంగుల తారతమ్యము గన్నేరునందలి జాతిభేదము గానేరదు అది భూసార, జలసమృద్ధుల పైనను, వేసిన ఎరువు సత్తువలపైనను వృద్ధిజేసిన పనిగను నిస్సార మొనర్చి క్షీణింపజేసిన పనిగను ఇటీవల స్పష్ట మైనది. ఇంకమిగిలిన పసుపు పచ్చరంగు పూవులం బూచుజాతియు దింతదనుక నాలుగు ముఖ్యము లగు జాతిభేదములు గాననగుచున్నవి. అవి అడవి జాతి చెట్టువలెదోచు పచ్చగన్నేరును, . స్వర్ణ నామముతోడను వేఱొకజాతి పచ్చపూవుల జాతియు, బంగారుగంట యనంబడు ఎక్కువ దళ సరి మంచి బంగారుంబోలిన వన్నెయు పూవు గొట్టమునందలి కాడపై శివలింగాకారముండు టయుంగలజాతి యొకటియునై యున్నవి. ఇవి

మాత్రము స్పష్టమగు భేదముగలవని చెప్పక తప్పనివి. ఇందు అడివిజాతివలె గాననగు పచ్చ గన్నేరు నందు పచ్చపూవుపై నొకపాటి ఎఱ్ఱ మచ్చ లచ్చటచ్చటఁ గానగు పూవులంబూచు వేఱొక అంతర్భేదజాతియు నట్టిరూపముననే తెల్లపూవులంబూచు వేఱొక అంతర్భేదజాతి యొకటియు రెండుభేదములు కలవు. ఇంక నొకటి రెండడుగుల ఎత్తులోపుననే చిన్నడొంకవలె పెరిగి సదా యెఱ్ఱనిరంగు పైకిని తెల్లనిరంగు అడుగునకును బూవులంబూచు బిళ్ల గన్నేరనబడు వేఱొక ప్రత్యేకజాతి గన్నేరునామమునం గనబడిని. ఈబిళ్ల గన్నేరు పూప్రసూను సహ్యమగు పరిమళ మిసుమంతయును గానరాకున్నను ఐదేసి రెక్కలంగల్గిన పూవుల నీశాలము విరివిగ బూచుంగాన పూదోటలందు మార్గమున కిరు ప్రక్కలవేసి నాటుచుందురు. దీనివిత్తనములందు పైత్యముంగల్గించు గుణముకలదు. తీపిరుచిగల్గి యుంట చీమలు వీటిం గొంపోయి విస్తారముగ జేర్చుకొనుచుండును.

తెల్ల, ఎఱ్ఱ రంగు పూవులఁబూచు గన్నేరు జాతి- లా. **Nerium odorum.** ఆంగ్ల. **Sweet scented oleander.** సం. కరవీరః, కరవీరకః, అశ్వఘ్నః, హయఘ్నః, చండాతః, అనియు, చండాలః అను పదము ఎఱ్ఱగన్నేరునకును సంస్కృతపదములు. దీనివేరునందు విషముకలదు పూవులందునను బలహీనమగు విషము కలదు. గాన లోనికియ్యరాదు. ఇచ్చిన నరముల బలహీనతయు, గుండెకొట్టుకొనుటను నిలిపివేయుటయు, నాడి కనపడకుండుటయు ప్రారంభమగును. దీనికి విరుగుడు కరక్కాయల రసము లేక కషాయము, కుంకుడుకాయల పులుసు నని చెప్పఁబడినది. గన్నేరువేరు, గన్నేరుచెక్క, గన్నేరుఆకులరసము పైనివ్రాయుటవలన కంతులు, గడ్డలు, తామర, తీట నివారణమగుననియు, వాపులుతగ్గుననియు, వేరురసము కండ్లలోవేయుటవలన కండ్లనీరు కారుట నివారణమగుననియు, మఱియుఁ గఠిన మగు కుష్టు, గజ్జి, చిడుము, చీరపేరు, చర్మరోగ ములు, జంతువిషదోషములు, దద్రు, దుర దలు, పురుగులు, పొక్కులు, పుండ్లు నివారణ మగుననియుఁ జెప్పఁబడినది. గన్నేరుపూవులు నూరి తలకుంబట్టించిన తలమురద, చుండ్రు, వెండ్రు కల బలహీనత, పేలు నివారణమగునందురు. గన్నేరుపాలు లోనికిచ్చిన గాఢవిరేచనములు గావించి అపాయమొనర్చును. దీనికి విరుగుడులు కలకండచూర్ణము కల్పిన పెరుగు, జిల్లేడువేరు పైపొట్టుకల్పిన గేదెపాలు, కరక్కాయరసము లేక కషాయము నని చెప్పఁబడినది

పచ్చగన్నేరు- లా. **Thevatia neiifolia** ఆంగ్ల **The exile** అనియు, **Yellow oleander** అనియు నందురు. ఇది అడవిచెట్టువలె గాన నగుచుండునది ఇందు పసుపుపచ్చని పూవులు, తెల్లపూవులు, పచ్చరంగుపూవులపై నెఱ్ఱమచ్చలు గల పూవులు బూచు మూడుభేదములుండును. పాలు విస్తారముకారును. కాయలు పిద్దవి కాయల లోని పిక్కలు పెద్దవిగను గట్టివిగనుండును లోని పల్కులు ప్రాణఘాతమొనర్పగల విషతుల్య ములు. అవి లోనికిందివరాదు. దీనికి విరుగుడు ఆవుపేడరసము నీటంగల్పి వడకట్టి లోనికిచ్చుట యని చెప్పఁబడినది. చెక్కయందు గొప్ప విరేచ నములొనర్చు గుణముకలదు. అపాయకరమైనది.

**గన్మెటల్** (లోహము) Gun metal.— రాగి తొంబదిపాళ్లును, తగరము పదిపాళ్లును, కొంచెముగా నితరభాగములును కలిపిచేసిన లోహము. తుపాకుల భాగములను దీనితో చేయఁబడుచుంటచే నీపేరయ్యెను. ఇనుము, ఉక్కు ఉపయోగింప వీలుకానిభాగములు దీనితో

చేయుచున్నారు. దీనిని పురాతనపు బ్రాంజ లోహముకుం సరిపోవుటంజేసి శాస్త్రవేత్తలు బ్రాంజుఎల్లోయి అనెదరు

**గమ్మారేస్** (కిరణములు) — ఆర్టిఫిషియల్ రేడియమ్ చూడుడు

**గర్గ ఉపగణము** (ఆంగీరస, భరద్వాజ, గర్గ) — ఇది ఆంగీరససంతతి. భరద్వాజ గణమందలి గర్గఉపగణము (౯౦ గోత్రములు).

బోధాయనసూత్రోక్త గోత్రములు (౨౪)- ౧. కారిరాత్రి, ౨. కైవాల్య, 3 కైవల్య, ౪ క్రోష్టకి, ౫ గర్గ, ౬ గాంధారాయణ, ౭ తుల్య, ౮. దామావత, ౯. పౌలి, ౧౦ బాహులకి, ౧౧ భ్రష్టక, ౧౨. భ్రాజకాక్షి, ౧3. భ్రాష్టవిక ౧౪. రాడి, ౧౫.వాట, ౧౬. వైలహాని, ౧౭. శాఖాయని, ౧౮ సఖీన, ౧౯ సాంగ్రహవార, ౨౦. సాత్యాయని, ౨౧ సాంభరాయణ, ౨౨. స్రావాత, ౨3. సౌయామునీ, ౨౪ స్రోత్రాయని.

కాత్యాయనసూత్రోక్త గోత్రములు (౧౮)- ౧ పాండ్రాది, ౨ ఔపమర్కటి, 3. కాలకృత్, ౪. కాలాయన, క్రియాశ్వ, ౬. క్రీవ, ౭ క్రైష్మి, ౮. కౌలాత్రమ, ౯ గార్గ్య, ౧౦ క్షేమ్యాంగ, ౧౧. పైగలాయన, ౧౨. పైంగలాయన, ౧3 భాల్గవి, ౧౪. మాతులేయ, ౧౫ యావక్రి, ౧౬. శ్యామాయన, ౧౭ శాంఖ్యాయన, ౧౮. సాపిండార

మాత్స్యసూత్రోక్త గోత్రములు (౪౨) - ౧. అస్మి, ౨ ఆస్మి, 3. కాన్వాయన, ౪.కారి, ౫. కాలవిత్, ౬. కైవలాయన, ౭ కౌజలి, ౮ కౌండాయన, ౯. కాలాక్షి, ౧౦. గాధి, ౧౧. ధిరాయన, ౧౨. దామి, ౧3. నైద్రాక్షి, ౧౪. పైశ్వేన్ను, ౧౫ పైశ్వేకాయన, ౧౬ బలాకి, ౧౭. భారమత, ౧౮. భాల్లకృత్, ౧౯. భాంగి, ౨౦. భాష్ట్రకృత్, ౨౧. మధురావహ, ౨౨.మాధుర, ౨3. మార్కటి, ౨౪. రాత, ౨౫. లావద్య. ౨౬. లోమకృత్, ౨౭. వటు, ౨౮. వాత్సతరాయణ, ౨౯ వాసాయన, 3౦. విను, 3౧. విశ్వేకాయన, 3౨. శక్రి, 33. శాకలాయని, 3౪. శారాయణ, 3౫. శ్యాను, 3౬ శ్యామాయణ, 3౭. స్కంద, 3౮. స్వశ్వ, 3౯. సాక్ష్యాయన, ౪౦. సాభార, ౪౧. సావాని, ౪౨. కానాయన

ఇతర గ్రంథోక్త గోత్రములు (౬)- ౧. కపి, ౨ ఖండిన, 3. గర్గ ౪. తిత్తిరి, ౫. భూమి, ౬. స్పందిత.

ఈ (గర్గ ఉపగణ) గోత్రములకుఁ బ్రవరరూపములు- ౧. ఆంగీరస, బార్హస్పత్య, భరద్వాజ. ౨. ఆంగీరస, బార్హస్పత్య, భరద్వాజ, సైన్య, గర్గ (లేక గార్గ్య) 3 ఆంగీరస, సైన్య, గర్గ (లేక గార్గ్య). ౪ ఆంగీరస, గర్గ (లేక గార్గ్య), సైన్య ౫. భరద్వాజ, గర్గ (లేక గార్గ్య), సైన్య ౬. ఆంగీరస, తైత్తిరి, కాపిభువ.

**గర్గర్షి ఆశ్రమములు** — సంయుక్తరాష్ట్రములలోని రాయిబరేలిజిల్లాలోని అశ్వి అనుపురమున కొన రుగగంగకవ్వాలితీరమునగలదు. దాని నిప్పుడు గాగాసోఁ అనుచున్నారు ఇంకను కుమాన్ (కూర్మాచల) దేశపు టడవులలో లోద్మానా (లోధ్రవనము) యనంబడు తావున వేరొక గర్గాశ్రమము కలదు. ఈపరిసర అరణ్యములందే గర్గానది (ఇప్పటిపేరు గూగాస్) జనించి ప్రవహించుచు కడకు ధవళీనదిలో సంగమించును.

**గర్గ గోత్రము** — గర్గ ఉపగణము చూడుడు.

**గర్గశత దండన న్యాయము** — గర్గు లందఱికి సాముదాయకమున నూరు (రూప్య

ములు) దండన (జరిమానా లేక అపరాధము) విధింపబడినదని యర్థము. ఇది ఒక్కనికిగాదు. సాముదాయికముగా అందఱికి విధింపబడిన యపరాధము. ఒకగర్గుడు కాడు అనేకమంది గర్గులు. దండన గర్గులందఱు కలిసి సూడుచెల్లింపవలెనని భావము.

**గర్గుడు** — అత్రి, చంద, పూరువుసంతతి క్షత్రియుడు, బ్రాహ్మణుడైనవాడు. ఇతని సంతతి వారు బ్రాహ్మణులు, తండ్రి భువమన్యువు లేక మహితమన్యుడు, సోదరులు మహావీర్యుడు,నరుడు, బృహత్క్షత్రుడు, కుమారుడు గార్గ్యుడు, ఋషి. మరియు, యాదవుల పురోహితుడొకడు గర్గుడు కలడు. ఈతడు వసుదేవునిపంపున బలరామకృష్ణుల జాతకర్మనామకరణాదులు నందుని యింటికేగి నెరపించినవాడు.

**గర్గపురము (ఘాజీపూర్)**— ఈపుర మేలిన భూపతికి యోధపతి, విగ్రహపతి, యుద్ధనాథుడు రణస్వామి అను బిరుదములుండెనట. గంగానదీతీరము, బనారసునుండి ఏబదిమైళ్ళ దూరము. హుయ్యానత్సాంగుదీనిని గర్జనపురమని వ్రాసెను.

**గర్జిత లక్షణపరీక్ష** — కాలవిజ్ఞాన శాస్త్రమున వివరింపబడిన పరీక్షలలో నొకటి. (కాలవిజ్ఞాన శాస్త్రము చూడుడు). అనగా ఉఱుముల పరీక్ష. ౧. ఫెళఫెళమని రాళ్లువిరిగి పైఁబడునట్లు గొప్పధ్వనియొనర్చుచు భూమియదరునట్లుల ఉరిమిన వర్షముగురియుననియు, ౨. వర్షారంభమునగల్గిన గర్జితము వర్షముంగల్గించి, వర్షాంతమునంగల్గిన గర్జితము వర్షము నాపివేయుటకు గురుతులనియు, 3. కందెనములేని ఎడ్లబండి నడచుతరి సరమ ధ్వనివలెను, గాడిద ఓండ్రపెట్టుతరి గల్గు ధ్వనివలెను, మంటమండుతరి గల్గుధ్వనివలెను, పాత్రలం దోముతరి గల్గు ధ్వనివలెను, శబ్దముతో నుఱిమిన ననావృష్టియనియు, కొట్టెడు వచించియున్నాడు

**గర్డర్లు** — వీనినిసర్వసాధారణముగ ఇనుముతో చేయుదురు (రీనోఫోర్సుడుకాంక్రీటుచూడుడు). ఇనుపదూలములు రోల్డుగర్డర్సు అనియు, ప్లేటు గర్డర్సు అనియు, ట్రస్డ్ (Trussed) గర్డర్సు అనియు నానావిధములు. కాల్చి సాగించిన ఏకాండీదూలములకు రోల్డుగర్డర్సు అనియు, దళసరి ఇనుపరేకు బద్దలతో చేయబడు వానికి ప్లేటు గర్డర్సు అనియు, N మొదలగు ననేక ఆకారములుగ దళసరి యినుపరేకు బద్దలతో నిర్మింపబడిన దూలములకు ట్రస్డు గర్డర్లు అనియు త్రివిధముగా చేయబడును. ట్రస్డు గర్డర్లలో వారకే గర్డర్లు లెటీసు అనబడు ననేకవిధములగు దూలములును గలవు.

**గర్తవర్తి గోధావమాంస విభజన న్యాయము** — దాని కన్నములోనే యున్న ఉడుము మాంసము పంచుకొనుట కాలోచన యని యర్థము తనకు లభింపకుండనే దానిం గూర్చి పంచుకొనుట అసాధ్యము. యోచించుట నిరర్థకమని భావము.

**గర్తస్థమృతసర్ప న్యాయము** — గోతిలో చచ్చియున్న పాముని యర్థము. దూరమునుండి చూచుటకు భయంకరమైయున్నను మృతసర్పమేయని భావము.

**గర్ధభ గోత్రము** — కణ్వశపగణము చూడుడు.

**గర్ధభీముఖగోత్రము** — శండిల గణము చూడుడు.

**గర్భరుత లక్షణపరీక్ష** — కాలవిజ్ఞాన శాస్త్రమునఁ జెప్పఁబడిన పరీక్షలలో నొకటి. (కాలవిజ్ఞాన శాస్త్రము చూడుడు). గర్భరుత

వసగా మూలానక్షత్రము మొదలు మృగశిర పర్యంతము అనగా ౧. మూల, ౨. పూర్వాషాఢ, 3. ఉత్తరాషాఢ, ౪. శ్రవణము, ౫. ధనిష్ఠ, ౬. శతభిషము, ౭. పూర్వాభాద్ర, ౮. ఉత్తరాభాద్ర, ౯. రేవతి, ౧౦ అశ్విని, ౧౧ భరణి, ౧౨. కృత్తిక, ౧3 రోహిణి, ౧౪. మృగశిర అను పదునాల్గునక్షత్రములు గర్భనక్షత్రములు వీటిలో ప్రతి గర్భస్థస్య యొక్క లగ్నమునకు క్రూరగ్రహము (రవికుజాదులు) లున్నను, వీక్షింపు చున్నను, ఉదయమగుచున్నను, అట్టి ముఖ్యముగ కుజాదులున్నను, ఆ గ్రహములు చంద్రునిని కూడియున్నను, ఆ (లగ్న) దినమున సంభవించిన మనిషేసు మొదటి గర్భస్థానవలి రెండవభాగమున నా గ్రహము లక్ష్మియుండినను లేక మూడవభాగమందక్షేయుండినను లేక మూడు భాగముల కూడ కల్గియుండినను నాగర్భము చెడిపోవునని చెప్పబడెను ఈ పద్ధతి మున్ను గర్భస్థ నక్షత్రములకు నిటులనే వర్తింపచేసిని

రవి ధనుస్సునందున్న మకరమునందును సంచరించుతరి- మబ్బులు, మెఱపులు, ఊదుములు, ఇంద్రధనస్సు గల్గిన నాగర్భస్థస్య చెడలేనిచిహ్నముగ నెఱుంగదగినది మఱియు యిటులనే కుంభరాశి, మీనరాశి వీటియందు రవి సంచరించుతరి ఉత్తరదిశను గాలి, మబ్బులు, మెఱపులు గల్గుటయు గర్భస్థువు చెడలేదని యెఱుంగునది

మేషము, వృషభము వీటియందు సూర్యుండుండినతరి- మబ్బులు, మెఱపులు, ఊదుములు, పరివేషము, ఇంద్రధనస్సు, వర్షము గల్గుట గర్భస్థువుయొక్క పనులనియు, మిధునము, కర్కటకము వీటియందు రవియుండుతరి వర్షించుటయు, పునర్వసు నక్షత్రమున వర్షముగల్గుటయు గర్భస్థ కార్యములై సస్యసమృద్ధికరము లని చెప్పబడినది.

రవి మూలా నక్షత్రమున ప్రవేశించినది మొదలు ౭-౯౭ దినములందు సూర్యాదిధికల్గుటయు, ౧3-౧3౭ దినములం దింద్రధనస్సు కల్గుటయు, ౧౮-౧౦౮ దినముల మెఱుపులు గల్గుటయు, ౪౭ దినమున వర్షము, ౧౪౭ దినమున మేఘాడంబరము గల్గుటయు, గర్భస్థ చిహ్నములు.

కాలవిజ్ఞాన మనంబను రెట్టమత శాస్త్ర ధర్మమున కొందఱి మతమున- ౧. తీక్ష్ణమగు ఎండలు, ౨ భూమి పగులుట, 3. సూర్యునిచుట్టు పరివేషముగల్గుట, ౪ ఊఱుము, ౫. మెఱపులు, ౬. మంచు, ౭. గాలివీచుట, ౮. కుమారాయింపు, (ఉమ్మగిలుట), ౯. తుంపరగా చినుకులురాలుట, ౧౦ చలిగానుండుట యనునవి దశ వర్ష ధాతువులని చెప్పబడినవి మఱి కొందఱి మతమున- ౧. తీక్ష్ణమగు ఎండలు, ౨ గాలివీచుట, 3. సూర్యునిచుట్టి పరివేషము గల్గుట, ౪. మబ్బులోని యుఱుములు, ౫. మబ్బులోని మెఱపులు అను నీ యైదే వర్షధాతువులని చెప్పబడినవి గొప్ప వర్షముగురియుట కారుధాతువులును, సామాన్య వర్షమునకు నాల్గు ధాతువులును, స్వల్ప వర్షమునకు మూడుధాతువులును ప్రకోపించ వలయునని చెప్పబడినది. వర్షములు గురియుటకు గ్రహబలానుకూలత ముఖ్యమనియు, అదిలేకుండిన దశ ధాతువు లేకీభవించి ప్రకోపించినను పూర్ణ ఫల ముండదనియు చెప్పబడినది.

౧ సింహము, కన్య ఈరాసుల చంద్రుండుండుతరి వర్షయోగమనియు, సస్యములు చక్కగా బండుననియు,

౨. తుల, వృశ్చిక రాసులందు రవియుండు తరి స్వల్పవర్షమనియు, పంటలు తక్కువయనియు మిట్టపొలము లెండిపోవు ననియు,

౩. వృశ్చికము, ధనస్సు ఈ రాసులందు రవి యుండుతరి దశ ధాతువులు ప్రకాశించి తీర్చిన కర్ణాటక దేశమున వర్ష, సస్య సమృద్ధి గల్గు ననియు, పది ధాతువులు గల్గి గర్భమునుపిన మూలానక్షత్ర ప్రవేశము మొదలు ౧౯౫ వ దినమునకుగాని వర్షించదనియు చెప్పబడినది.

౪. మార్గశీర్ష మాసమున వర్షించుటయు, పుష్య మాసమున గాలి, పొగడయు గల్గిన ముందు సంవత్సరమున మంచి వానలు కురియుననియు,

౫. మార్గశీర్ష శుద్ధ పాడ్యమిని చంద్రరేఖ యాకసమున గానవైనను, మార్గశీర్ష శుద్ధ పౌర్ణమి యందు మబ్బులు, ఉఱుములు, మెఱపులు గల్గుటయు, మఱియు నాదినమున సూర్యుండు చంద్రుండు గూడ ప్రకాశమానముగ గానవగుటయు, ముందు సంవత్సరమున సమృద్ధిగ వర్షములు గురియుననియు,

౬. మార్గశీర్ష బహుళ పాడ్యమి నాడు మింటం దెల్లని రేఖలు దీర్చి గానవగుట, బహుళ పంచమి లోపు నను, తప్పిన యమావాస్య యాదైనను వర్షించుననియు,

౭. స్వాతి యందు చంద్రుండున్నచో ముందు రాగల యాశ్లేష కార్తెయందు చక్కగ వర్షించుననియు,

౮. పుష్య శుద్ధ సప్తమినాడు మేఘాడంబరము, ఉఱుములు, మంచు, గాలి ఇవి వ్యాపించిన యెడల నధికముగ వర్షములు గల్గుట చిహ్నముగ నెఱుఁగవలయుననియు,

౯. పుష్య మాసమున, రోహిణి నక్షత్రమందు పరివేషము చంద్రునకుంగల్గి మంచు పడినచో ముందు రాగల యాషాఢమున మిక్కిలిగ వర్షించుననియు,

౧౦. పుష్య శుద్ధ పౌర్ణమి మొదలు లేదు రోజులు దశ ధాతువులు చక్కగ నొప్పియున్నచో రాగలసంవత్సరమున వర్ష సమృద్ధిగల్గి చక్కగ పంటలు పండుననియు చెప్పంబడినది.

౧౧. పుష్య శుద్ధ పౌర్ణమి నాటి సాయం కాలముగాని, అర్ధరాత్రముగాని అధికముగ మంచు పడినచో కర్ణాటక దేశమున సస్య సమృద్ధి గల్గుటకు సూచన యనియు నందురు.

**గర్భస్రావము** — ఆంగ్ల Abortion, Miscarriage అనియు నందురు. దీనికి గర్భ విచ్ఛిత్తి యనియు, కడుపు పోవుట యనియు పేరు స్త్రీలు గర్భిణులయియుండ కొన్ని కారణముల వలన సహాత్తుగా గర్భము చెడిపోవుట.

**గర్భాయనగోత్రము** — కౌశిక లేక గ్రత్సమదగణము చూడుఁడు.

**గర్భాశయము** — స్త్రీల పిండకోశము నకు గర్భకోశమను పేరు.

**గర్భాసనము** (లేక ఉత్తానకూర్మాసనము) యోగశాస్త్రమున జెప్పఁబడిన యాసనములలో నొకటి. పద్మాసనమున మరము పై దిసల్లు కూర్చుని చేతులను మరముగోనికి క్రిందికిమార్చి ఆచేతులను పైకెత్తి మెడమీద లాకవేసి పట్టుకొని యుండుట గర్భాసనమనంబడును. దీనిని ఉత్తాన కూర్మాసనమనియు నందరు దీని యభ్యాసము వలన నిద్రాలస్యములు క్షీణించునని గాక ఇంద్రియశాంతి గల్గునని చెప్పఁబడినది.

**గల్లలక్త్తక**— లత్తుకమూని చూడుఁడు.

**గల్ఫ** (Gulf)— సాయుద్రగతము (సముద్రభాగము) Sea Portions చూడుడు. Gulf stream వేడివెళ్ళ సముద్రజల ప్రవాహము. దీనిగూర్చి సముద్ర (జల) ప్రవాహములు చూడుఁడు. Gulf stream జలములు వేడిగను తేలికగను ఉండును

**గల్ఫ్‌స్ట్రీమ్** (Gulf Stream) — గల్ఫ స్ట్రీమున భూమిపై నదులు ప్రవహించునట్లు

కలికముచేసి కండ్లకిడిన దురదలును నివారణ మగునని చెప్పఁబడినది. మఱియు గలిజేరు నధికముగఁదినిన గొంతునొప్పి గల్గించుననియు దానికి గాచు (కవిర) విరుగుడనియుఁ జెప్పఁబడినది.

**గవ్యపంచకము** (లేక పంచగవ్యములు) ౧. గోమూత్రము, ౨. గోమయము. 3 గోక్షీరము (ఆవుపాలు), ౪. గోఘృతము (ఆవునెయ్యి) ౫. గోదధి (ఆవుపెరుగు).

వీటి సర్వభాగములుగ (క్షీరములు, పాలలో సగము నెయ్యి, నేతిలో సగము పెరుగు, పెరుగులో నారవ భాగము గోమూత్రము, ఆ మూత్రమునాల్గవ భాగము గోమయము) కల్పినదానిని పంచగవ్య మందురు. దీనిని ప్రాయశ్చిత్తాదులందు ఉపయోగింతురు

**గవ్యాయన గోత్రము** — నిధ్రువ గణము చూడుఁడు.

**గ్రంథరచన, ముద్రణము, ప్రకటనము, పుస్తకవిక్రయము** — గ్రంథమును రచించుటయె గ్రంథరచన దానికి ప్రకటనముతో నేసంబంధమును లేదు. ఒక లేఖ వ్రాసి పంపుటయుందు గ్రంథరచన కలదు. అదియెవ్వరికి నిర్దేశింపంబడినదో వారికే ఆ



లేఖ బహిరంగపఱ్చబడినది కాని అన్యులకుంగాదు గాన, ప్రకటనక్రిందికిరాదు. వార్తాపత్రికలందు ప్రకటింపఁబడిన బహిరంగలేఖలు, ఎడ్వర్టైజుమెంట్లు వీరువారనిగాక ఎల్లరకు నిర్దేశింపఁబడినవి గాన ప్రకటనక్రిందికి వచ్చెడిని. పుస్తకవిక్రయము వ్యాపారమేగాని ప్రకటన ఉద్దేశింపఁబడినదికాదు. ముద్రణము వ్యాపారము మాత్రమే యగును.

**గ్రంథాక్షరలిపి**— ఇది దాక్షిణాత్యాక్షర లిపులలో నొకటి. (లిపివంశవృక్షము చూడుఁడు). ఇది అరవలిపిలో అక్షరములు తక్కువ గాన, సంస్కృతపదములు వ్రాయవలసివచ్చినతరి దీనిని వాడుచుండెదరు. ఇప్పటి గ్రంథాక్షరి మధ్యకాలపు గ్రంథాక్షరినుండియు, అది పురాతన గ్రంథాక్షరి నుండియు, అది చేరలిపినుండియు కల్గినమార్పులు. గ్రంథాక్షరములు త్రివిధము పురాతన లిపి క్రీ. శ. ౧౦౦౦ సంవత్సరములనాటిదనియు, మధ్యకాలపులిపి క్రీ.శ. ౧3౦౦ వత్సరములనాటిదనియు నాధునికలిపిఇక్కాలపుదనియుం జెప్పఁబడినది. కడపటిదియగు నాధునికము బద్ధఖత్తియు, గుండుఖత్తియు ద్వివిధముగ నున్నది. బద్ధఖత్తు తప్పి హిందువులు తమగ్రంథములందు ప్రయోగించునది (సంస్కృతపదము లరవలిపియందు వ్రాయుటకైనది). గుండుఖత్తు జైనులు తమ మతగ్రంథములను వ్రాయుగ్రంథాక్షరి.

**గ్రంధితగరపు చెట్టు** — లా. **Valerina Wallichi** ఆంగ్ల. **Indian Valerian** సం. కాలకౌర్యః, శితపుష్పః అని కొందఱనెదరు. తెల్లని పూవులంబూచుననియు, దీనివేరునకు గ్రంథితగరమని పేరనియుం జెప్పఁబడినది. దీని చూర్ణకషాయములు కఫవాతముల నివారించి, మూత్రమును చక్కగ వెడలఁజేసి, ఉన్మాదము, అతిసారము, జ్వరములు, తాపము, రక్తపైత్యములు నివారించుననియు, దీనియాకుం జితుకగొట్టి యాముదమున వెచ్చజేసి పైన వేసికట్టిన పిల్లలకు దంతములు వచ్చుతరి శరీరమున లేచెడి పొక్కులు మానుననియుం జెప్పఁబడినది.

**గ్రంధితగరము**— తగరము చూడుఁడు.

**గ్రంధిభేద వాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. మతము వైచుకుని పద్మాసనమున కూర్చుండి (పద్మాసనము చూడుఁడు) రెండుమోకాళ్లను పీలగునంత దగ్గరకుం జేర్చి చేతులుండు రెండు వైచి కుడి

అరచేతిలో నడుమువేలిని, ఎడమఅరచేతితో కుడిమోచేతిని పట్టుకుని కూర్చుండుట గ్రంధి భేదాసనము.

**గ్రంథులు**— ఆంగ్ల. Wens. ఈశబ్దము నుండియె తెనుగునందలి కంతి యను శబ్దము కల్గెను. గడ్డలు, కురుపుల ప్రారంభావస్థ ఇది ఆయుర్వేదార్థము. మఱియు యోగశాస్త్రమున ౧. బ్రహ్మగ్రంధి- ఇది లింగస్థానము, అగ్నిమండలము, సృష్ట్యవస్థ యనియు, ౨ విష్ణుగ్రంధి- ఇది హృదయస్థానము, సూర్యమండలము స్థితి యవస్థయనియు, 3 రుద్రగ్రంధి- ఇది భ్రూమధ్య స్థానము, చంద్రమండలము, లయావస్థ యనియుం జెప్పఁబడినది

**గ్రీష్మమదగణము** — దీనిని శౌనక గణ మని వ్రాసియున్నారు ఇదిభృగుసంతతిలోని యొక గణము (శౌనకగణము చూడుఁడు.)

**గ్రహకూట లక్షణ పరీక్ష**— కాలవిజ్ఞాన శాస్త్ర పరీక్షలలో నొకటి (చూడుఁడు)

గంగానది మొదలు హిమవత్పర్వతము వఱకు బుధ క్షేత్రమనియు, వింధ్య పర్వతము మొదలు గోదావరి నది వఱకు శుక్ర క్షేత్రమనియు, గోదావరి మొదలు దక్షిణభూమి కంగారక క్షేత్రమనియు రెట్టమతమున పరిభాష వ్రాసియున్నారు.

ఒకే రాశియందు శని కుజులు కలసి యుండిన క్షామము కలహము గల్గుననియు, ఒకే రాశియందు మూడు గ్రహములుండిన నరపాలురకు, నాల్గు గ్రహములుండిన విప్రులకు, ఐదు గ్రహములుండిన దేశమందలి ప్రజలకు ముప్పు వాటిల్లుననియు చెప్పఁబడినది

ఒక రాశియందైదు గ్రహములు కూడి అందొక గ్రహము రాహువగు నేని ప్రజానాశనము గల్గునని చెప్పఁబడినది.

ఒక రాశియందు బుధుఁడు, బృహస్పతి కూడి యుండిన వర్ష యోగ మనియు, శని, బృహస్పతి యొకరాశియందు గూడిన జలనిలయములకు గీడు కల్గుననియు, గురు, శుక్ర, చంద్రు లొక రాశి యందు కూడిన సంపూర్ణ వృష్టి కల్గుననియు, కుజ, శను లొక రాశియందుండగ చంద్రుఁడందు చేరినను లేక కుజుఁడు వక్రించినను లేక ఏరివెనుక రాశియందు శుక్రుఁడుండినను వర్ష యోగము కల్గుననియు, శుక్రుఁడుదయించిన ఏడురోజులలో వర్షించిన మిక్కిలి చక్కని వర్షములు కురియుననియుం జెప్పఁబడినది.

అమావాస్య నాఁడు శుక్రుఁడుదయించిన పంటలు చక్కఁగ బండి సుభిక్షము వ్యాపించి యుండుననియుఁ జెప్పఁబడినది.

శ్రావణ, కార్తీక, మార్గశీర్ష మాసములందు శుక్రుఁడు తూర్పునవృషభ రాశియందుదయించిన అనావృష్టికర మనియు చెప్పఁబడినది.

ఒకరాశియందు కుజుఁడు, శని, వక్రగతియుం గూడిన యుద్ధము, పశునాశనము ఫలితములని చెప్పఁ బడినవి, మఱియు కుజ, రవి, శని, రాహువు లొక రాశియందు కూడియుండిన ప్రజలకు సంచలనము, కలహములు గల్గునని చెప్పఁబడినది ఒకే రాశియందు గురు, శుక్రులు కూడినను కలహములే ఫలితమని చెప్పఁబడినది

గ్రహణములవలన సూచింపఁబడు భూకంపములు (Earthquakes denoted by Eclipses) గ్రహణములనేమియో గ్రహణము లేమే కారణముల వలన ఘటిల్లుచున్నవో పాశ్చాత్యులు విశదీకరించి యున్నారు. కాని గ్రహణములకును భూకంపములకును గల సంబంధము గాని, భూకంపము కొన్ని కొన్ని గ్రహణముల వలన సూచింపఁబడు చున్నవని గాని

పాశ్చాత్యులలో తచ్ఛాస్త్ర పండితులు వివరించి యుండలేదు.

సూర్య, చంద్ర గ్రహణములతో భూలోకమున కెంతో సంబంధము కలదు. కొన్ని కొన్ని గ్రహణములయందు వచ్చు గ్రహణముల వలన భూకంపములువచ్చునని మన వారీవరకే గ్రహించి యుండిరనుట కీక్రింది పద్యమొక్కటి చాలునని తలంతుము,

గీ॥ "చైత్రమున జ్యేష్ఠ ఫాల్గుణ శ్రావణముల
సర్వసోమోపరాగంబులైన రుజలు।
భూభ్రమణ మగ్నిభీతం బులుం బుట్టు॥"

అని గ్రహణ లక్షణమున అయ్యలరాజు, అయ్యలకవి, భాస్కర కవులు చెప్పియున్నారు (గ్రహకూట లక్షణ పరీక్ష చూడుడు. గ్రహణములు చూడుడు అయ్యలరాజు, అయ్యల భాస్కర కవులు చూడుడు).

**గ్రహణములు** (Eclipses) — ఇది ఎస్ట్రానొమీశాస్త్రసంబంధమున తెలియదగిన విజ్ఞానము. ఖాల్డియనులు ఆదికాలమున ఎస్ట్రానొమీ శాస్త్రమును ఎక్కువగా పరిశీలించిన వారు. వారు గ్రహణములంగూర్చిన పధకము లు కుదుర్చుకొనియుండిరి. వాటికి Chaldian Saros అనిపేరు (చూడుడు).

తొలుత ఎస్ట్రానొమీశాస్త్రవిదులు (ఎస్ట్రానొమీ చూడుడు) క్రీ. శ. ౧౬ వ శతాబ్ద మధ్యకాలమువఱకు భూమి నడుమగ నుండు ననియు దానిఁజుట్టి ఆకాశగోళము లన్నియుం దిరుగుచుండుననియు తలంచుచుండిరి. అట్లే యగునేని ఆ విధానమునకు Geo centric system అని పేరుండవలసియుండెడిని.

పిదప నది సరికాదనియు, సూర్యునిఁజుట్టి భూమి తిరుగుచున్నదనియు, చంద్రుఁడు భూమికి ఉపగోళమనియు Copernicus పండితుఁడు ఋజువుపఱచుటంజేసి నాఁడాదిగ నీ క్రొత్తవిధాన మాయనపేరనే కోపర్నికస్ సిస్టమని వాడుక నందెను. కాని యాయన యా విధానమునకు Helio centric system అని పేరిడి యుండెను నేటికిని హీలియో సెంట్రిక్కు సిస్టమే గారవింపంబడుచు ఈ శాస్త్రమున వాడం బడుచు సుప్రసిద్ధమై యున్నది.

ఈ మహానీయుఁడు పోపు పదవి నందిన వాఁడని కొన్నితావులందు కలదు. ఈయన Polish German ఎస్ట్రానొమర్ అనియు, పోలాండుదేశములోని Thorn అనంబడుగ్రామమున క్రీ. శ. ౧౪౭౩ ఫిబ్రవరి ౧౯ తేదీని జనించి, ౧౫౪౩ మే ౨౪ తేదీని మృతినందిన వాఁడనియుం దెలియుచున్నది. ఈ మహానీయుని పూర్తియగునామము Nicolaus Copernicus అనియు, 'Father of Modern Astronomy' అను బిరుదమందిన వాఁడనియు, ఈయన వ్రాసిన గ్రంథము చాల సంవత్సరములకుం బిదప ౧౫౪౩ లో నాయన మృతినందనున్న యదనున ముద్రితమై ప్రకటింపంబడెననియుం జెప్పంబడినది.

ఈయన విధానముమేరకు ఎస్ట్రానొమీశాస్త్రమున సూర్యునింజుట్టి ఇతరగోళములు తిరుగుచుండుమార్గములకు Orbits అనిపేరు. ఇంక భూమి సూర్యునిఁజుట్టి తిరుగుచుండు మార్గమునకు ప్రత్యేకముగ Ecliptic అని ఎస్ట్రానొమీ శాస్త్రవిదులు పేరిడియున్నారు.

చంద్రుఁడు భూమింజుట్టి తిరుగు ఆకాశ మార్గము ఎక్లిప్టికోవంటిదికాక ౫ డిగ్రీల ౯ మినిట్ల కోణము కల్గించునది (Angle) గ నుండుట దీనిగుండా భూమిఁజుట్టి వచ్చుటకు కొంచెము తక్కువగా ఒక నెల పట్టును. భూమి మార్గమగు Ecliptic ను చంద్రుఁడు భూమింజుట్టి తిరుగు మార్గమును కలియునట్టి తావులకు

Nodes అనిపేరు. ఇవి భరతదేశపు జ్యోతిషము నందలి రాహుకేతు స్థానములుగ పోల్పదగి నవిగ నున్నవి

ఇంకొక సంగతి ఈ సందర్భమున వివరింపబడదగినది కలదు. భూమినుండి యగు పడు కిరణ సూర్యుని Diameter 31' (మినిట్లు) 32'' (సెకండ్లు) కును, 32'-36'' కును నడుమ నడుమ నుండుటయు, చంద్రుని Diameter 28'-48'' కును, 33'-32'' కును నడుమనుండుట యీ వీటి దామాషాల (Mean values) యందెట్టి భేదముండకు చంద్రుడు సూర్యునికన్న చాల చిన్నదైన శరీరము గల్గియుండియు భూమికి సమీపముననుండుట భూమిపై వారలకు సూర్యుని కన్న పెద్దకోణము (Large Angle) ప్రదర్శించు చుండును

గ్రహణములు- ఎస్ట్రొనొమీ శాస్త్రమున చంద్రగ్రహణములను Deprivations అన దరు. అనగా సూర్యచంద్రులకు నడుమ భూమి అడ్డమువచ్చి సూర్యుని వెలుతురును చంద్రునిపై బడనీయక తప్పించినది అని ఆ పేరు గల్గెను గ్రహణములు సూర్యచంద్రులకేగాని యొఱుగునది. నక్షత్రగ్రహణములు నీ ఎస్ట్రొనొమీ శాస్త్రమున గ్రహణములుగ పాటింపఁ బడక Occultations అని పేరిడంబడినవి (గుప్తగ్రహణములు చూడుడు) సూర్యగ్రహణములు సంపూర్ణగ్రహణములనియు, ఖండగ్రహణములనియు, కంకణగ్రహణములనియు త్రివిధములుగను, చంద్రగ్రహణములు సంపూర్ణ గ్రహణములనియు, ఖండగ్రహణము లనియు ద్వివిధములుగను చెప్పబడినవి.

నోడ్సనంబడు తావులు ఒకేచోట నెప్పుడు సాధపించుమాను (శీఘ్రమనుమార్గముల) సంధి స్థానములు కావు భూచంద్రపథము లిటు నటు మారుచుండునవి కాన నవి సంధించు తావులును మారు చుండెడిని. నవి దినమునకు 3' పైచిలుకుగ వెనుకకు నడచును సూర్య గమనమున కెదురుగఁ జనును పదునెన్మిది వత్సరములపైని పది లేక పదునొకండు దినములకు పూర్వపుస్థానమునకుం జేరుకొనుచుండును. ఈ మధ్యకాలమునందు సంభవించిన సూర్యచంద్ర గ్రహణములవరుసయే పిదప తిరుగ ప్రారంభమై తిరుగఁదిరుగ సంభవించుచుండెడిని. (ఛాల్డియన్ సారోస్ చూడుడు).

ఒక నెలయందొక గ్రహణము సంభవింప నా నెలయందు తిరుగ నాగ్రహణము సంభవింప వీలేదయ్యెడని వేఱుగ వ్రాయనక్కరలేదు. ఒక సంవత్సరమున నైదుసూర్యగ్రహణములు, రెండు చంద్రగ్రహణములుగాగాని, నాల్గు సూర్యగ్రహణములు, మూడు చంద్రగ్రహణములుగాగాని మొత్తము యేడుగ్రహణములకన్న నధికముగ గలుగ జాలవని ఎస్ట్రొనొమీశాస్త్రవేత్తలగు గణకులు లెక్కించియున్నారు. గ్రహణముల ఆద్యంత కాలములనుండి భూమిపై Longitude రేఖ లంబకీలించుచున్నది.

గ్రహణములు Nodes కడనే సంభవించును. అనగా సూర్యుఁడమావాస్య Conjunction యందునను చంద్రుఁడు పౌర్ణమి Opposition యందునను కేవలముగనో, స్వల్పభేదమునో ఎక్లిప్టిక్కు మార్గమును సంధించినతరినే గ్రహణములు సంభవించును. లేకున్నం గలుగనేరవు.

సూర్యచంద్రగ్రహణములందలి ముఖ్య భేదములు- సూర్యగ్రహణమున సూర్యబింబము స్వప్రకాశము గలదిగాన, దాని ప్రకాశము భూమిపై వారల కగపడకుండునటుల మరుగుపర్చబడుటయు, చంద్రగ్రహణమున చంద్రబింబము సూర్యునుండి వెలుతురునందుచు, భూమిపై ప్రతి-

ఫలించును వెన్నెలను రాత్రులందు కాయునది కాన సూర్యుం డవ్వలనుండుటం జేసి భూమి వలన గల్గిన యవ్వలినీడ చంద్రునిపైం బడ నాతావున సూర్యుని వెలుతురుం గోల్పోవుటయు నై యుండెనని కాననే సూర్యగ్రహణము ఎదురుగ నుండిన భూగోళార్ధభాగమునందు వేర్వేరుతావుల వేర్వేరుగ గన్పట్టును, కొన్నితావుల లేకపోవుటయు సంభవించుచుండును. చంద్రగ్రహణము నం దట్లుకాక ఎదురుగనుండిన భూగోళార్ధభాగమునం దంతట నొకేరీతి నగుపడుచుండును.

సూర్యగ్రహణము సూర్యుం డుండిన తావు, అడ్డముగవచ్చిన చంద్రుం డుండిన తావు, పరిమితులు చూడంబడుతావులకుం గల పరిస్థితులు వీటినుండి సంపూర్ణగ్రహణముగ గాని, భాగగ్రహణముగ గాని, కంకణగ్రహణముగ గాని, గ్రహణమే లేకపోవుటగాని అగుపడుచుండెడిని. ఈభేదదృశ్యములు గుడించుట మూలమున నెఱుంగుచున్నారు

సూర్యగ్రహణములు- అమావాస్యలం దొకకడను సూర్యబింబమును, పిదప చంద్రబింబమును, పిదప భూమియు నొకేవరుసను (నొద్దునకడ) సంభవించుటచే కల్గునని చెప్పఁబడినది. దానినే ఎస్ట్రోనామీ శాస్త్రమున Conjunction అని యెదరు. ఇట్టి సూర్యరశ్మి భూమిపైం బడకుండ చంద్రుం డడ్డముండును అటుల గ్రహణము గన్పూర్తిగ చీకటియై యుండెడి కాల మేమునిట్ల కన్న నధికముగ నుండజాల దని లెక్కించి యున్నారు. నొద్దునలందు సంధించుటచే నమావాస్య Conjunctions లందే కల్గుంగాని, లేకున్న కలుగనే కలుగవు.




• చంద్రునినీడ యొంత భూగోళార్ధప్రదేశము నావరించునో యంతమేర సూర్యగ్రహణ మగుపడునుగాని ఆభూగోళార్ధమున తక్కిన ప్రదేశములం దగుపడదు.

చంద్రగ్రహణము- సూర్యుండు భూమి పిదప చంద్రుండుగ నొకేవరుసను (In a line) పౌర్ణమలందు నొద్దునకడ సంభవించుటచే చంద్రగ్రహణము కల్గెడిని. మఱియును నట్టిస్థితిని Opposition అని ఎస్ట్రోనామీశాస్త్రమున పేరిడియున్నారు. అట్టిచో చంద్రుండు ఎదురుగ నుండుటయు, ఎదురుగ నడచుచుండుటయు నాపేరిడి యున్నారు.

సూర్యచంద్రుల నడుమ నడ్డముగా నున్న భూమియొక్క నీడ పౌర్ణమినాటి రాత్రియందు చంద్రునిదెసను వ్యాపించియుండునుగాన, అనేక కిన్నాళ్ళన్నింగా చంద్రనిమార్గ మునుండి గ్రహణమే గలుగక తప్పిపోవుటయు, దానిం దగులుటచే ఖండగ్రహణము సంభవించుటయు, దాని గుండా దూరి నడచుటచే సంపూర్ణగ్రహణము

సంభవించుటయు గలుగును. ఈనీడ కోణాకారమున (Conical shape) నుండును. దీని పొడవు భూమి నుండి చంద్రునికడకుండు దూరమునకు మూడున్నరెట్లధికము మున్నదనియు, చంద్రగ్రహ దానిగుండా దాటు తావున వెడలుపు, చంద్రుని వ్యాసమునకు మూడు రెట్లుండుననియు లెక్కించియున్నారు. కావుననే చంద్రునకు కంకణ గ్రహణములు కలుగనేరవనియు చెప్పబడినది.

భూమియొక్కనీడ
భూమి
సూర్యుడు
చంద్రగ్రహణము
చంద్రుడు భూమిచుట్టుతిరుగుమార్గము

గ్రహణము సర్వమునకు పూర్ణచంద్రుని బింబమును పండ్రెండు భాగములుగ విభజింపబడినట్లు భావించి వానికి Digits అని ఎస్ట్రానమీ శాస్త్రమున పేర్కొనియున్నారు. ఈ శాస్త్రవేత్తలు ఎన్ని భాగములు గ్రహణముపట్టినది అనుటకు అన్ని Digits గ్రహణమని వాడుచుందురు.

కంకణగ్రహణము (Annular eclipse)— ఒక్కొకతరి సూర్యగ్రహణము స్పష్టమగును. అనగా సూర్యబింబమునకు, భూమికిని నడుమ చంద్రబింబము అడ్డముగా వచ్చియు, సూర్యుని కాంతిని కొంతవరకు ప్రసరింపనీయక బహుదూరమయ్యు నీనీడ భూమికి చాలక నీడకొన భూమికి కొంచెమెత్తున ముగియును. దీనిని కంకణ గ్రహణమనియు ననుట కలదు. ఏలనన సూర్యబింబము కప్పబడిన చంద్రబింబము సూర్యుని మధ్యగ నుండుటచే నలుపు పల్లనిమచ్చగను, చుట్టును తెలుపుగ కంకణము వలెను Ring ను అతికించిన భూభాగముపై గన్పట్టునుగాన, ఆ దేశపు జ్యోతిశ్శాస్త్రవేత్తలా పేరిడిరి. ఎస్ట్రానమీ శాస్త్రమున దీని Annular eclipse అని యెదరు. ఇవి చాల అరుదుగ గలుగుచుండును. క్రీ. శ. ౧౮౩౬ లో స్కాట్లాండు దేశపు ఎడింబరో నగరమునకు సమీపమున యొకటి యగుపడి ఐదు నిమిషములు నలుబదియెన్మిది సెకండ్లుండెను

భూమి
చంద్రునినీడ
చంద్రుడు
సూర్యుడు

కంకణగ్రహణదృశ్యము Annular eclipse. (సూర్యుడు మధ్యమున చంద్రబింబము.)

**గ్రహణి**— ఆంగ్ల. Dysentery. (అతిసారరోగము చూడుడు. ఆమాతిసారము చూడుడు.)

**గ్రహబలలక్షణ పరీక్ష** — (కాలవిజ్ఞానశాస్త్రపరీక్షలలో నొకటి.) గ్రహబలములం బట్టి దేశములకు ఫలములు గల్గుటయందు ముఖ్యముగ పరిశీలన నందదగిన గ్రహములు గురుశనులనియు, తక్కిన గ్రహములవలన గల్గు ఫలములు స్వల్పములుగాన నంతగా పాటింప నక్కరలేదనియు, రెట్టదైవజ్ఞుఁడు నిర్ణయించెను (కాలవిజ్ఞానశాస్త్రము చూడుడు.)

గురుఁడు- ౧. మేషరాశియందుండు కాలమున సమవృష్టి, సుభిక్షము, ధనధాన్యములు, పాడిపంటలు కల్గియుండును. ౨. వృషభరాశి దుర్భిక్షము, పైరులకు నష్టము, శిశువులకు రోగము, దేశమున వ్యాధులు కల్గియుండును. 3. మిథునమున- గురుఁడుండు యుద్ధము. ౪. కర్కాటకరాశియందున స్వల్పవృష్టియు, శిశుపీడనము గల్గియు, చెరకు వరిపంటలు బాగుండును. ౫. సింహరాశియం దుండుతరి- కలహములు, ప్రజాపీడ, స్వల్పవృష్టి, ౬. కన్యారాశియం దుండుతరి- సమస్తధాన్యసమృద్ధి, పాడిసమృద్ధి, ౭. తులారాశియందుండ- తొలివానలు, చక్కని పంటలు, ధాన్యసమృద్ధి, సంతోషసుఖజీవనము దేశమున గల్గియుండును. ౮. వృశ్చికరాశియం దుండుతరి- అతివృష్టియుండి పంటలు తక్కువయగును. ౯. ధనస్సునం దుండిన, వరిపైరు లధికమగును. ప్రత్తి పెసరపంటలు సమముగను, నువ్వులపంట అల్పముగ నుండును. వెనుకటివర్షములు గురియును. ౧౦. మకరరాశియందుండిన- సమవృష్టి, పంటల సమత్వము గల్గియుండు. ౧౧. కుంభరాశియం దుండిన- వర్షాధిక్యత, జలసమృద్ధి, పంటల వృద్ధి గలిగియుండును. ౧౨. మీనరాశియం దుండుతరి- వరిపంట బాగుండుట, అల్పవృష్టి గల్గును.

గురూదయము, ద్వాదశవిధ వత్సరములు, వాటి ఫలపరీక్ష- ౧. గురుఁడు చిత్త లేక, స్వాతి నక్షత్రములం దుదయించిన నద్దానిని చైత్రాబ్దమని ఈశాస్త్రమున వాడుదురు. ఇందు అల్పవృష్టి, అల్పసస్యములు, దుర్లక్షణములు గల్గియుండును. ౨. వైశాఖాబ్దము గురుఁడు విశాఖ, అనూరాధ నక్షత్రముల నుదయించిన నద్దానిని వైశాఖాబ్దమని యందురు. ఇది సుభిక్షకాలము. 3. జ్యేష్ఠాబ్దము- జ్యేష్ఠమూలనక్షత్రములందు గురూదయమైన దానికిం జ్యేష్ఠాబ్దమని పేరు దీనియందు పైరులు పొల్లుగ నష్టము గల్గించును. ౪. ఆషాఢాబ్దము- పూర్వాషాఢ, ఉత్తరాషాఢ నక్షత్రముల గురూదయము సంభవించినది ఆషాఢాబ్దము ఇందు ప్రజాపీడ, అనావృష్టి, పంటలోపముగల్గి యుండును. ౫. శ్రావణాబ్దము- శ్రవణ, ధనిష్ఠ, శతభిష నక్షత్రముల గురూదయము గలుగ నది శ్రావణాబ్ద మనఁబడును. ఇం . సస్యసమృద్ధి గల్గియు ప్రజాపీడ గల్గియుండు ౬. భాద్రపదాబ్దము- పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతులందు గురూదయ మయ్యెనేని యది భాద్రపదాబ్ద మనఁబడును. ఇందు అన్నియు సమృద్ధముగ గల్గిన సుభిక్షసంవత్సరము. ౭ ఆశ్వీజాబ్దము- గురుఁడు అశ్వనీ భరణీ నక్షత్రములం దుదయించుట సంభవించ నద్దాని నాశ్వీజాబ్దమని యందురు ఇందు వర్షసమృద్ధి, సస్యసమృద్ధి, సుభిక్షము గల్గియుండియు, ప్రజాపీడ గల్గియుండును. ౮. కార్తీకాబ్దము- కృత్తిక రోహిణులందు గురూదయము గల్గిన నద్దానిని కార్తీకాబ్ద మని యందురు. ఇది అస్త్రభీతి, ఈతిబాధలు, రోగము, అల్పవృష్టి, అంతః కలహములు గల్గియుండును ౯. మార్గశిరాబ్దము-మృగ

శిర, ఆర్ద్రనక్షత్రముల గురూదయము గల్గినది. ఇందు సమవృష్టి, చక్కనిపంటలు, క్షేమము గల్గియుండును ౧౦. పౌషాబ్దము- పునర్వసు, పుష్యమి, ఆశ్లేషలందు గురూదయము కల్గిన నందు సమకాలముగ నడచును, సుఖముగ నుం దురు ౧౧ మాఘాబ్దము మఘ, పుబ్బలందు గురూదయమైన మాఘాబ్దమనంబడును. ఇది సమకాలము, సుభిక్షకాలము. ౧౨ ఫాల్గునా బ్దము- ఇది ప్రజలకు ఉత్తేజి, ఆపదలుగల్గిన కష్ట కాలము

ఇటులను బృహస్పతి ఏకనక్షత్రమున సంవత్సర ముండిన మధ్యమమనియు, రెండునక్షత్రముల సం సంవత్సరముండిన మేలనియు, మూడునక్షత్రము లందొక సంవత్సరముండిన నది అధమకాల మనియు, అందు ప్రథమనక్షత్రమున పాపగ్రహ సంయుతుడైన అగ్నిభయమును, రెండవనక్షత్ర మునైన ప్రచండవాయుభయమును, మూడవనక్ష త్రమున పాపగ్రహముగూడియుండిన క్షామ పీడాభయమును, వరుసగ మూడునక్షత్రములందు పాపగ్రహయుక్తుడే యుయ్యేని అనేక విపత్తుల కుదు దేశప్రజలు పాల్పడుదురని చెప్పబడినది

మరియు గురుడు ఒక రాశియందు పదినెల లుండుట సంభవించిన నది విశ్వవత్సరమనంబడును అందు వర్షము, పంట తనమాత్రముగ నుండునని చెప్పబడినది పదినొకండు నెలలుండుటసంభ వించిన నది కురువత్సరమనంబడును. అందు సుభిక్షముగను సంతోషముగను ప్రజలు మనుదు రని చెప్పబడినది. పండ్రెండు నెల లొకరాశి యందుండుట సంభవించిన నది యగ్నివత్సరమనా బడును. అందు మధ్యమఫలము గల్గును. అట్లే గురుడు పదమూడు నెల లొకరాశియం దుండుట సంభవించునేని దానిని దైవవత్సర మనియు, బలివత్సరమనియు నందురు. అది సుభిక్ష కాలమని చెప్పబడినది. పదునాల్గుమాసము లొకరాశియందుండుట సంభవించిన నది ప్రాజా పత్య వత్సరమనంబడును అందు ప్రజలు సుభిక్ష మున సుఖాతురని చెప్పబడినది.

శనిగ్రహముయొక్క స్థితి- ౧ మేషరాశి యందు శనియుండుటవలన సుభిక్షము, క్షేమము, సౌజన్యత గల్గియుండును. ౨. వృషభరాశియందు జొన్నలపంట తక్కువ పండును. చోరాగ్ని బాధలు వెలనాటిసీమయందు గల్గియుండును. కష్టదినములు. 3 మిథునరాశియందు శనియుండ- దుర్భిక్షము, కష్టదినములు. ౪. కర్కాటకమున శనియుండ- ధాన్యము చక్కగ ఫలింపుటయు, ఉత్తేజియు, కష్టములు గల్గియుండును ౫. సింహ రాశియందుండ- దేశమున సర్వత్రా నష్టము, కష్టముగ నుండును ౬. కన్యారాశియం దుండ- అల్పవృష్టి, స్వల్పముగ పండుట, పశునాశనము గల్గియుండును ౭. తులారాశి యందుండ- సువృష్టి, సుభిక్షము, యుద్ధములు గల్గును ౮ వృశ్చికరాశియందు శనియుండ- సమవృష్టి, ఉపద్రవము గల్గును ౯ ధనస్సు నందుండుటవలన- క్షామడాంబరము, యుద్ధము, జన పశు సస్యనాశనము గల్గుచుండును ౧౦. మకర రమునందు శనియుండ- సస్యసమృద్ధి, హీనపాలన గల్గును ౧౧ కుంభమున శనియుండ- అతి వృష్టి, అల్పసస్యములుగల్గియుండును. ౧౨. మీన రాశియందు శనియుండ అనావృష్టి, పంట నష్టము, కలహములు గల్గియుండును

౧. అశ్వనీనక్షత్రమున శనియుండుటవలన- వర్ష ములు బాగుగ కురిసి సన్నధాన్యములుఫలించును. ౨. భరణియందుండుటవలన- రవికుజులు శనికి సప్తమ మందుండిరేని స్వల్పవృష్టి, స్వల్పసస్యము గల్గి యుండును. 3. కృత్తికయందుండుటవలన- క్షామ భయము, సస్యానుకూలవర్షములు కల్గును. రోగ

పీడ వ్యాపించును. ౪. రోహిణియందు శని యుండుతరి- ఖండవృష్టి, అచ్చటచ్చట సస్యములు బాగుండుట, అచ్చటచ్చట పంటనష్టము, రోగపీడ గల్గును. ౫. మృగశిరయందుండుతరి- కలహప్రదముగ నుండును. ౬. ఆర్ద్రయం దుండుతరి- కాలము ద్వంద్వముగ గడచును. ౭. పునర్వసునందుండుతరి- సస్యములు, వృష్టి బాగుండును. ౮. పుష్యమియందుండుతరి- స్వల్ప వృష్టియు, స్వల్పసస్యము, క్షితి కల్గియుండును. ౯. ఆశ్లేషయందు శనియుండుతరి- సస్యానుకూల వర్షములు, సస్యసమృద్ధి, సుభిక్షము, సౌఖ్యములు గల్గియుండును. ౧౦ మఘానక్షత్రమున శనియుండుతరి స్వల్పవృష్టి స్వల్ప సస్యఫలము, వ్యాధులు, పశునాశనము గల్గియుండును. ౧౧. పుబ్బయందుండుతరి - అల్పవృష్టి, పాడిపంటలు బాగుండుట, దుర్భిక్షము కల్గును కొంద అనావృష్టి యుండును. ౧౨ ఉత్తర యందుండ- సస్యానుకూలవృష్టి, సస్యసమృద్ధి, ధరల ఎచ్చు కల్గియుండును. ౧3. హస్తయం దుండ వర్షసమృద్ధి, సస్యానుకూలత, సుభిక్షము గల్గియుండును. ౧౪. చిత్రా నక్షత్రమునందుండ అధికవృష్టి, చక్కని పంటలు, సుభిక్షము ౧౫. స్వాతియందుండ మితవృష్టి, పూర్ణసస్యము, సుభిక్షము. ౧౬ విశాఖయందుండ- కడపటి వానలు, మితసస్యము గల్గును. ౧౭. అనురాధ యందుండ మితవర్షము, సస్యానుకూలము, సుభిక్షము. ౧౮. జ్యేష్ఠయందు శనియుండ అల్పవృష్టి, మితమగు పంట, రోగములు. ౧౯. మూలా నక్షత్రమున శనియుండ- వర్షసమృద్ధి, సస్యానుకూలత, రోగములు, అపరధాన్యముల పంట నష్టముగల్గును. ౨౦. పూర్వాషాఢ యందుండ అతివృష్టి, అధికసస్యము, అచ్చటచ్చట రోగపీడ, కలహములు గల్గియుండును. ౨౧. ఉత్తరాషాఢ యందుండ సస్యలోపము, అన్యసస్య నాశనము, జలసమృద్ధి. ౨౨. శ్రవణనక్షత్రము నందుండ ఖండవృష్టి, ఖండసస్య సమృద్ధి, తిరగబాటుబాధ, కొన్నిచోట్ల నధికసస్యము గల్గియుండును. ౨3 ధనిష్ఠ నక్షత్రమున శనియుండుతరి నధికవృష్టి, అధికమగుపంట, ధాన్యసమృద్ధి, మార్గగమున పీడ గల్గియుండును. ౨౪ శతభిషమున శనియుండ కడపటివానలు, అచ్చటచ్చట పంటలసమృద్ధి, అచ్చటచ్చట అల్పసస్యము కల్గియుండును. ౨౫. పూర్వాభాద్ర యందుండ పాడిపంట లభివృద్ధి గాంచును, సుభిక్షము గల్గియుండును. ౨౬. ఉత్తరాభాద్ర- వర్షము, సస్యము బాగుండును. ౨౭ రేవతీనక్షత్రమున శనియుండుతరి స్వల్ప సస్యము, క్షామము గల్గియుండునని యు చెప్పబడినది

**గ్రహములు** — నవగ్రహములు చూడుడు.

**గ్రహమ్సు లాండు** (Graham's Land)- ఇది దక్షిణధ్రువ ప్రదేశములందు గల అంటార్కిటికా సంబంధమగు ద్వీపముల గుంపుగ పోల్పబడిన భూప్రదేశము (అంటార్కిటికా చూడుము).

**గ్రహ లయ** — సంగీతశాస్త్రమున దశ ప్రాణములలో నొకటి లయ లేక తాళమునందు గ్రహముంగూర్చి సంగీతదశప్రాణములందు వివరింపబడినది. (చూడుము). అందు గ్రహము లయ నాల్గు భేదములు. ౧. అతీతము- గీతము నడచిన పిదప తాళము నడచుట. ౨. అనాగతము- తాళమునడచిన పిదప గీతమునడచుట 3. సమము- తాళము, గీతము సమముగనే నడచుట. ౪. విషమము- పై మూడు విధములును గూడ గాకుండ నడచుట.

**గ్రహాలక్షణ పరీక్ష** — కాలవిజ్ఞాన శాస్త్రమునఁ జెప్పఁబడిన పరీక్షలలో నొకటి (కాలవిజ్ఞాన శాస్త్రము చూడుఁడు).

ఒక్కనెలలో రెండు గ్రహణములు (పౌర్ణమి చంద్రగ్రహణమును, అమావాస్య సూర్యగ్రహణమును) గల్గిన కలహములు గల్గుననియు, చైత్రము, జ్యేష్ఠము, శ్రావణము, ఫాల్గుణము లను మాసములందు గ్రహణములు గల్గిన భూకంపము, వ్యాధులు, వింతలు కల్గుననియు కెట్టుతనము అశ్విని, పునర్వసు, హస్త, చిత్త, ఉత్తరాషాఢ, ఉత్తర, ఉత్తరాభాద్ర లను నేడు నక్షత్రములందు వాయవ్య దిశనుండి గ్రహణము కల్గిన పెద్దలకు, పిన్నలకునుగూడ రోగప్రదమనియు, దుర్భిక్షము, కలహము, అల్పవృష్టి మూడుపక్షములలో కల్గుననియు, ఆర్ద్ర, ఆశ్లేష, పుబ్బ, స్వాతి, పూర్వాషాఢ, శతభిషం, రేవతి యను నేడు నక్షత్రములందు నైరుతిదిశనుండి గ్రహణము కల్గిన శిశువులకు మృత్యు, ఎండతో కూడిన చినుకులు, కలహములు, పైరులెండుట కల్గుననియు, రోహిణి, మృగశిర, అనూరాధ, మూల, శ్రవణము, ధనిష్ఠ, అభిజిత్తు అను నేడు నక్షత్రములందు ఈశాన్యదిశనుండి గ్రహణము గల్గినచో సుభిక్షము, సౌఖ్యము కల్గుననియు, భరణి, కృత్తిక, పుష్యమి, మఖ, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ అను నీయేడు నక్షత్రముల యందు ఆగ్నేయ దిశనుండి గ్రహణముగల్గిన శిశుపీడయు, దుర్భిక్షము, శిలావర్షము, ఎండలు, ప్రభుత్వపు ఒత్తిడి, అతివృష్టి దోషము, ఒకప్పు డనావృష్టి యుఁగూడ గల్గును. మూడు పక్షములలో నీఫలము గల్గుననియు కెట్టవిజ్ఞాని చెప్పియున్నాఁడు.

**గ్రహరాట్ క్షత్రియవంశము** — శిశోదియా క్షత్రియులు చూడుఁడు.

**గ్వటెమలాదేశపు ప్రభుత్వము** (Guatemala) — మధ్యఅమెరికా ఖండమునకుఁ జెందిన ప్రజాప్రభుత్వ దేశము. నలుబదియెన్మిది వేల రెండువందలతొంబది చతురపుమైళ్ల వైశాల్యమనియు, ఇరువదియైదులక్షల జనసంఖ్య యనియు చెప్పఁబడినది.

**గ్వటెమాలా దేశము** (Guatemala Republic)-ఇది మధ్యఅమెరికాయందున్న ప్రజాస్వపరిపాలనదేశము ౪౮,౨౯౦ చతురపు మైళ్ల వైశాల్యముగలది. ఇంచుమించు ౧[illegible],౦౦,౦౦౦ ప్రజలకు నివాసము. న్యూగువాటెమాలాపురము (౮౨,౦౦౦)ప్రధానపురము, ఓల్డుగువాటెమాలాపురము భూకంపముచేపాడై తిరుగ కట్టఁబడి తిరుగ భూకంపముచే పాడుచేయఁబడి వదలివేయఁబడినది. (మధ్యఅమెరికా చూడుఁడు).

**గాంగ దేశము** — రాఢాదేశము చూడుఁడు.

**గాంగాయన గోత్రము** — శాండిల గణము చూడుఁడు.

**గాంగిపురరాజ్యము** — రాఢాదేశము చూడుఁడు.

**గాంగిలోగాక్షి గోత్రము** — సాకృతి ఉపగణము చూడుఁడు.

**గాంగేయ గోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.

**గాంగోదకి గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**గాండీవము** — పాండవమధ్యముఁడగు నర్జునుని ధనస్సునకు పేరు (అర్జునుని ధనస్సు, ధనుర్విద్య చూడుఁడు).

**గాంధారదేశము** — అఫ్ఘనుస్థానమునకిప్పుడు చెందియున్న కాందహార్ తొల్లింట గాంధార పురమై యుండి యుండుననియు, దాని నుండి గాంధార దేశమనియో లేక గాంధార దేశమునుండి దానికిం గాంధార పురమనియో పేరు గల్గి యుండునని యాదలు తలంచు చున్నారు గాని నిదర్శనములు గాన రాకున్నవి. సింధునది మొదలు కునార్ (తొల్లింట కుభానది లేక ఇక్కాలపు కాబూలునది) వరకు నదీ తీరముల గాంధార దేశముండెనని పోల్చఁబడినది, అనగా పాంచాలోత్తర భాగమున ఇప్పటి రావల్పిండి, పెషావరు జిల్లాలని అందఱు తలంచు చున్నారు.

"Memorandum of Ancient Monuments of Eusofzai" అను దాని యందు పెషావరు రావల్పిండి మండలములు మాత్రము గాక స్వాత్ సంస్థానరాజ్యము, హజారీమర్దన్ అనంబడు యూసుఫ్ జాయిలోని దేశము గూడ గాంధారములోనివేనని చెప్పఁబడినది. యూసుఫ్ జాయి దేశమున సింధు, పాంచగోరాల నడుమభూమి యీలోని దుర్గాశిఘాట్, సఘానో, నుత్తు, బౌద్ధమతపు ఆవాళ్లు గాగ్గలిన ప్రదేశమని ఎఱుంగునది (ఈ అనవాళ్ళు బౌద్ధ కట్టడములు క్రీ. శ. ౧వ శతాబ్దమున కాశ్మీరమేలిన కనిష్క మహారాజు కాలపు పనులుగ పోల్చఁబడినవి). మఱియు నీ యూసుఫ్ జాయిలోని దేశమునకు తూర్పున సింధునదియు, దక్షిణమున కుభా (ఇప్పటి కాబూలు) నదియు, పశ్చిమమున బెజవారును, సుభవస్తు (ఇప్పటి స్వాత్ నది), ఉత్తరమున చిత్రాల్, యాసిన్ సంస్థానములును ఎల్లలుగ నెఱుఁగ వలయును.

రామాయణమున నిది గాంధర్వ దేశమని ఖ్యాని యిమ్మనకుల చెప్పఁబడినది. మహాభారతమున గాంధర్వముగ చెప్పఁబడినది. ఇది గాంధారమే నని పెక్కండ్ర యభిప్రాయము. గాంధారము చంద్రగుప్త అశోకులు వలన రాజ్యమునకు జెందియుండెను అదివఱకు రాజ్యమేలు చుండిన వారియ్యలను "అగాథోక్లీసు" అను సైనికుఁడు తరిమివై చెనట. అశోకచక్రవర్తి క్రీ. పూ. ౨౪౦లో నాగు మద్ధ్యాంతికుని గాంధారమునకు బౌద్ధమత వ్యాప్తికిం బంపెనని మహావంశ మను బౌద్ధగ్రంథమున గలదు.

ఇది ఆదిని రాజధానిగనుండు గాంధారపురమునకుం బిదప చెప్పఁదగిన పట్టణము, నగరహారము. ఇదియు కొంతకాలము గాంధార దేశమునకు రాజధానియై యుండినదేనట ప్రస్తుతము జలాలాబాద్ అనంబడుచు అఫ్ఘనుస్థానమునను్న పట్టణమునకు పశ్చిమమున రెండుమైళ్లు దూరమున నున్న నగరక్ అను పల్లెగ్రామమును ఆపరిసరములనున్న యానవాళ్లను తొల్లింటి నగర

హారపురమని పోల్చిరి. ఫాహియాన్ (క్రీ. శ. ౩౯౯-౪౧౩) దీని దర్శించి తన యాత్రా చరిత్రలో "నాకీ" యని వ్రాసెను. బేబరు చక్రవర్తి తన అనుదిన చరిత్రయందు నంగన్హార్ అని నగరహారమునకు పేరిడి యున్నాడు. అచటి కొండలోయను నంగన్హార్ అనుచు నేటికిని వాడుక గలదు. బేబరు అందు ౧. సర్ఖాబ్, ౨. గండమాల్, ౩ కుర్రమ్నరా, ౪ భిస్రిసుర్, ౫ హిసారక్, ౬ కోటి, ౭. మోమాండరా, ౮. కోషేట్టి, ౯ కాబూల్ అను తొమ్మిది నదులు ప్రవహించు చుండు లోయ యని వ్రాసి కొనెను. కుభానదియందు తక్కిన నదులు చేరు చున్నవి. కుభానదికి దక్షిణ తీరమునందుండిన ఈ నగరహారపురికి తొల్లింట యొకప్పుడు ఉదయన పురమని పేరుండెనట. సుఖా లేక సుఖహాద్ నది కుభానదియందు సంగమమగు తావున గలదని చెప్పబడెడి.

నగరహార నగరముల కుభానది కుత్తరముగ మేరోన్ పర్వతము గలదు. దానిని నిక్కాలము మారోక్కహా యనుచున్నారు. దాని నలెగ్జాండరు చక్రవర్తి యొక్క చరిత్రకారులు మేరోస్ అని వ్రాసిరి. ఇది యొకప్పుడు మేరుత్వము వహించి యుండెనా యని సందేహము గలదు. నగరహారముల నే కుభానది దక్షిణతీరమున క్రీ. శ. ౨౦౦ సంవత్సరముల తర్వాత కనులుగా బోల్చబడిన నలువది బౌద్ధ స్తూపములు కలవు. బీహారు దేశపురమునకు బీహారుపట్టణమున కాగ్నేయ దిశగా పది మైళ్ల దూరమున గున్నా అన్నబడు గ్రామము బైట బైలుబడిన యొక శిలా శాసనమున నగరహారపుర ముత్తర పథమని చెప్పబడెడి.

(శ్రీ)రాముండు గాంధార దేశమును తన సోదరుండగు భరతునిపుత్రు డగు పుష్కలుని కొసంగి నటుల శ్రీమద్రామాయణము ఉత్తర ౧౦౧-౧౧౪ యందు కలదు. భరతుండే ఉత్పలావతి యను పురమును నిర్మాణముజేసె ననియు, దానిని పుష్కలుండు తనపేరిట పుష్కలావతి యని పిలచుచు, తన రాజధానిగ జేసి యేలెననియు చెప్పంబడినది. ఇప్పుడు కేలీ యని పిలువంబడుచున్న తావును, తొల్లింటి పుష్కరావతి లేక పుష్కలావతి యుండిన తావుగ పోల్చియున్నారు.

కొంత కాలము పురుష పురము మఱి యొకప్పుడు తక్షశిలానగరము లేక తక్షకశిలానగరమును రాజధానులుగనుండెనట. పురుషపురమును ఇప్పటి పెషావర్ అని పెక్కుండ్రు పరిశీలకులనుచున్నారు. తక్షశిలా నగరమును మహా అలెగ్జాండరు చరిత్రకారులు తాక్సిలా యని వ్రాసిరి. అత్తావు దిబ్బల మయమై యున్న ఇటీవలం ద్రవ్వబడుచు పురము బయలుదేర దీయంబడుచున్నది. దానిని Taxila అను చున్నారు. అక్బరు చక్రవర్తి చరిత్రకారులు వ్రాసిన "ఐనుని అక్బరీ" అను గ్రంథమున కాశ్మీరము, అటాకుల మధ్య గల పుష్కలై జిల్లా గాంధారము లోనిదని వ్రాయంబడి యున్నది.

ఒకప్పుడు ఉదఖాండపురము గాంధారపు రాజధాని యని తెలియుచున్నది. షా లేక షాహియ నృపతులు దీనిని రాజధానిగ నీరాజ్య మేలిరని డా. స్టెయిను పండితుండు తన రాజతరంగిణి II ౩౩౭ లో నుడివియున్నాండు. ఉదఖాండ పుర మిప్పుడు ఛిండ్ అని కొందఱును, ఉండని కొందఱిచేతను పిలువంబడుచు సింధునది దక్షిణతీరము పెషావరు డివిషను నందొక గ్రామమై యున్నది.

బుద్ధభగవానుండు తొల్లింటి జన్మమున తన శరీరమును ఆకలింగొని తన పిల్లలనే తినవేయ చూడిన ఒక యాడుపులి కాహారముగ నొసంగె ననియు, అప్పటి యాతని పేరు బ్రహ్మప్రభర్షి యనియు, అత్తావు పుష్కలావతీపుర పరిసరారణ్య

ప్రదేశమనియు దివ్యావధానమూల యనంబడు బౌద్ధ మత గ్రంథమున చెప్పఁబడినది.

**గాంధారాయణ గోత్రము** — అగస్తి ఉపగణము చూడుఁడు. గర్గ ఉపగణము చూడుఁడు

**గాంధారీ (దేవి)** — గాంధార దేశరాజ పుత్రిక యనిభావము. తండ్రి గాంధార దేశాధీశుఁడగు సుబలుఁడు. భర్త ధృతరాష్ట్రుఁడు. సంతతి దుర్యోధనాదులు నూర్గురు కౌరవులకీమె తల్లి. మహాపతివ్రత యని పేరొందినది భర్త అంధుఁడు కాన, తానును ఎల్లరం జూడనొల్లక నేత్రము మూసికొనియుండిన సాధ్వి ఈమె మతియును దేవతాంశ సంభూతురాలని చెప్పఁబడినది

**గాంధారీనాడి**—అష్టాంగయోగములు చూడుఁడు.

**గాంధారుఁడు మహారాజు** — అత్రి సంతతి చంద్రవంశ క్షత్రియుఁడు ఈతనినుండియె గాంధార దేశమునకు పేరుకలిగెను ఈతని సంతతి వారికి తురగారోహణ నిపుణులని ప్రతీతి కలదు. కుమారుఁడు ధర్ముఁడు

**గాంభోజి** (పచ్చజిగురు) — లా. Stalagmitis Gambogioides అనియు, Garcinia Pictoria. ఆంగ్ల. Gamboge. అటవమున మక్కుయున్నది ఇది పసుపుపచ్చరంగుగనుండు జిగురు. కాంభోడియా సీమను ఆప్రాంతసీమలను ఉండు ఒకవిధము చెట్ల బంక ఈచెట్లు Garcinia అనియు, అవి Guttiferae తెగయనియు ఆంగ్ల శాస్త్రవేత్తలందురు. కాంబోడియానుండి దీనినామముత్పన్నమైనటుల దోచుచున్నను, ఈచెట్లు ఇప్పుడు సయాం, కొచ్చిన్ చైనా, సింహళము, మలయాళము దేశములందు కూడ విరివిగ గానవచ్చుచున్నవి. దీనికొమ్మలకుం గంట్లుండి అందునుండి కారునట్టి పసుపుపచ్చరంగు పాలంబోలిన ద్రవమును వెదురుబొంగుల పాత్రలందుపట్టి ఎండింతురు. ఇది రంగులందు కలుపుదురట. ఆయుర్వేదవైద్యులు లోనికిచ్చిన గాఢ విరేచనములఁజేసి, ఉదరరోగము నివారించి, క్రిమిని వెడలించి నాడాపాముచు వెడలఁజేయునని చెప్పుదురు.

**గాజరగడ్డ** — ముల్లంగి చూడుఁడు.

**గాజులబలిజకులము** — వీరు ఆంధ్రులలో నొక జాతివారుగ నున్నారు. వీరిజాతి యుత్పత్తిం గూర్చిన గ్రంథపరికరములు లభింపకున్నవి.

వీరియందు వాడుకనంది అనుశ్రుతముగ చెప్పుకొనంబడుచున్న కథవ మిట్లున్నది. ఆదిని పరమేశ్వరుని వినోదార్థము ఆదిశక్తిచే ప్రార్థితుఁడై గాజులును, పసుపును, పరమేశ్వరుండు కల్పించి, శక్తియగు పార్వతికొసంగెననియు, యామె వాటిం ధరింప నాటఁగ కొంతదకరమయ్యెననియు, అత్రి గాజులబలిజలమూలపురుషుని సృష్టించి, వీటిని లోకమున వ్యాపింపఁజేయ నియమించెననియు, నాతని సంతతివారు గాజులబలిజ లనియు చెప్పుదురు

**గాజుల జేరము భోజనమునకు సరి** — ఆంధ్రలోకోక్తి.

**గాడిదగడప చెట్టు** — లా. Aristolochia bracteata సం. బస్త్రాంత్రి అనియు, కొందఱు త్రివృత్పత్రా యనియు, విషగంధికా యనియుం గూడ వాడియున్నారు. గాడిదగడప సాకు నూరి లోనికిచ్చిన సర్పవిషము హరించును గాని ఎక్కువగానుండ జాగ్రత్తగ నీయవలయును. ఆకును ఆముదముతో వేయించి నారింజ కాయంత ముద్ద లోనికిచ్చిన గుల్మములు, పసుపుల

వాతములు, కడుపునొప్పి నివారణమై విరేచనము జేసి సౌఖ్య మిచ్చును. ఇది చూలుతో నున్న ఆడపశువులకు, ఆడగుఱ్ఱములకు గర్భస్రావము గల్గించునుగాన సియరాదు. ఎండిన గాడిద గడపాకు తైలికకషాయము లోని కిచ్చిన క్రిమి వ్యాధులు, చర్మవ్యాధులు నివారణమగును.

పచ్చిఆకు రసము పుండ్లుగలుకట్టిన గాయము లలో పోసిన శుభ్రపడి మాన్పట్టును. ఆకుపసరులో మాల్కకిణివిత్తులు, సముద్రపాలవిత్తులు కల్పినూరి ఒంటికి పూసినను, వెన్నుకు పట్టువేసినను పురాణ జ్వరములు, ఆహిక జ్వరములు, వెన్నుకుపట్టిన ఉష్ణములు నివారణ మగును. నొప్పులుపడుచున్న స్త్రీలకు ఆకులరసము రెండుబది చుక్కలుగాని, గాడిదగడపవేరు చూర్ణము రెండుబద్ది గోధుమగింజలు ఎత్తుగాని, పూవులు కాయలతోనున్న సమూలవృక్షకషాయము పాగుతులముల ఎత్తుగాని లోపలికిచ్చిన త్వరితముగ సుఖప్రసవ మగునని చెప్పఁబడినది

గాడిదగడప ఆకు పచ్చిది ఆముదముపై వెచ్చజేసి పసిపిల్లల పొట్టపై కట్టిన విరేచనమై క్రిములు పడిపోవుననియు. తామర తీట మొదలగు చర్మ వ్యాధులు మానుననియు, గాడిదగడప చెట్టు యొక్క గింజములు చేదు వెగటుగ నుండి వాంతి జేసి విరేచనము గల్గించి వాతములనడచి సర్వవిషదోషములను పరిహరించి, చర్మరోగముల మాన్పు. కడుపునొప్పులు స్త్రీల గర్భనొప్పి (ముట్టులోగల్గు నొప్పి) నివారించుననియుం జెప్పఁబడినది

**గాడిదకు గంధపువాసన ఎట్లు తెలియుట?** — ఆంధ్రలోకోక్తి.

**గాడిదపుండుకు బూడిదేమందు**— ఆంధ్రలోకోక్తి.

**గాదర్భి గోత్రము** — ఆర్ష్టిషేణగణము చూడుఁడు.

**గాదిక్రిందిపొలుకు గాదిక్రిందనే బ్రతుకుతుంది** — ఆంధ్రలోకోక్తి.

**గాధి గోత్రము** — కపిఉపగణము చూడుఁడు, గర్గఉపగణము చూడుఁడు.

**గాధిన గోత్రము** — శౌద్ధకగణము చూడుఁడు

**గాధిపతి గోత్రము** — ఆత్రేయగణము చూడుఁడు.

**గాధిపురము** — తొల్లింటి కన్యాకుబ్జపురమున (ఇప్పటి కనూజపురము) కీ పేరుండెను. గాధిమహారాజు విశ్వామిత్రునితండ్రి. ఈపురమునకింకను మహోదయ మనియు, కన్యాకుబ్జ మనియుం గూడ పేర్లుండెను.

**గాధిమహారాజు** (గాధిరాజు)— అత్రిసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు కుమారుఁడు విశ్వామిత్రమహర్షి. భార్యపేరు మేనకాదేవియట. జమదగ్నిమహర్షి యీయనకుబావమరిది (పరశురాముని తండ్రి) గాధిరాజు కన్యాకుబ్జదేశమేలిన ప్రభువు. వాల్మీకిరామాయణమున గాధిరాజు కుశనాభుని కుమారుఁడుగ జెప్పఁబడియున్నది.

**గానాభినయ నృత్య (నాట్య) కళాంగములు** — అంగములు చూడుఁడు.

**గాయత్రీముద్రలు** — వీటిని చతుర్వింశతిముద్ర లనియునందురు. ఇవి ఇరువదినాల్గు. గాయత్రీదేవి వీటియందు సుప్రతిష్ఠితమని చెప్పంబడినది. ౧. సుముఖముద్ర, ౨ సంపుటముద్ర, 3. వితతముద్ర, ౪. విస్తృతముద్ర, ౫. ద్విముఖముద్ర, ౬. త్రిముఖముద్ర, ౭. చతుర్ముఖముద్ర, ౮. పంచముఖ ముద్ర, ౯. అధోముఖమగు

మణ్ముఖముద్ర, ౧౦. వ్యాపికాముద్ర, ౧౧.అంజలీ ముద్ర, ౧౨. శకటముద్ర, ౧౩. యమపాశ ముద్ర, ౧౪. గ్రథితముద్ర, ౧౫. మణ్ముఖముద్ర, ౧౬. ఉన్ముఖముద్ర, ౧౭. ప్రలంబముష్టికముద్ర, ౧౮. మత్స్య ముద్ర, ౧౯. కూర్మ ముద్ర, ౨౦. వరాహముద్ర, ౨౧. సింహాక్రాంతముద్ర, ౨౨. మహాక్రాంతముద్ర, ౨౩ ముద్గరముద్ర, ౨౪. పల్లవముద్ర. ఇవి చతుర్వింశతి గాయత్రీ ముద్రలు. గాయత్రీజపమునకు పూర్వమునందు, పరమునందు కూడ నడపుదురు.

**గాయని గోత్రము** — వశిష్ఠగణము చూడుడు.

**గాయపు (ఆకు) చెట్టు** (బీజపత్రపు చెట్టు) — లా. Kalanchoe laciniata, Cotyledon laciniata. సం. పత్రబీజమ్ ఉరుమభావయంను జక్మేహయాత్. దీని యాకు నందే బీజములుంట, అటనే మొక్కలేర్పడుట, పత్రజీవిచెట్టనియు ననుటకలదు. ఆకుల రసము చలవజేసి త్రిదోషముల హరించుననియు, దేహ పుష్టి నిచ్చుననియు, గాయములను మాన్పజేయుననియు, తేలువిషమును హరించుననియు, వాపులు తీయుననియు, ఇరుకు (ఇలుకు) నొప్పులు శమింపజేయుననియు చెప్పబడినది. మఱియు మూలవ్యాధి నడంచునందురు.

**గాయపు సంధి**— ఆంగ్ల. Tetanus. కాలియందుగాని, చేతియందుగాని, బొటనవ్రేలు లేక బొటనవ్రేలు సంధియందు గాయము తగిలిన తరి వచ్చెడి సంధిజబ్బు.

**గారకి గోత్రము** — ముద్గల గణము చూడుడు.

**గార చెట్టు** — లా. Balanites Aegyptiaca. సం. హింగుపత్రీ, తాపస తరుః, తాపసద్రుమః, తాపసప్రియః, ఇంగుదః. (గారకాయ లేకపండు=ఇంగుడీ) దీని వేరుమొక్క గాని, చెక్కయొక్క గాని రసము లేక కషాయము వాతజ్వరముల నివారించుననియు, పండు వేడిచేసి కఫవాతమును, క్రిమిరోగమును నివారించుననియు, గారవిత్తుల చూర్ణము బలమును, వీర్యపుష్టి నొసంగుననియు, గారవిత్తుల నూనె సమధాతువై గల్గించి దేహమును శీఘ్రముగ వ్యాపించి పైత్య శాంతి, దేహపుష్టి నొసంగి, ఇంచుక శ్లేష్మ ప్రకోపము గల్గించుననియు, విరేచనము గావించు ననియుఁ జెప్పబడినది

**గారడివిద్య** — భరతదేశపు గారడివిద్య ఒకశాస్త్రమునందు చెప్పబడినది. అది ఇంద్ర జాలము, మహేంద్రజాలము, టక్కు, టమారు, గజకర్ణ విద్య, గోకర్ణవిద్య, కనుకట్టు యను భేదములు కలదిగ జెప్పబడినది. ఆంగ్లమున గారడివిద్యకు Magic అనియెదరు. పాశ్చాత్య గారడియగు Magic విద్య ౧. White or Beneficient magic అనియు, ౨. Black or Baleful magic అనియు, ద్వివిధముగ చెప్పబడినది.

**గారుడ (పక్షి) శాస్త్రము** — గరుత్మంతుడు (గరుడపక్షి) ప్రయాణకాలమున ఎడమవైపునుండి కుడివైపునకుం బోయిన ప్రయాణమున కష్టములు గల్గుననియు, కుడివైపు నుండి



ఎడమవైపునకుఁబోయిన ధనలాభముగల్గుననియు, ప్రదక్షిణముగా చుట్టివచ్చిన శుభప్రదమనియు చెప్పబడినది. కాని మతాంతరాభిప్రాయములు కొందఱికి రెండును శుభప్రదములగుననియు కొందఱికి గరుడపక్షి కన్పించుటయే శుభప్రద మనియుంగూడ గాననగుచున్నవి. పెక్కండ్రనుభ

వజ్జలు గరుత్మంతుఁడు ఎవరుగ నేఁగుటయు గుడి నుండి యెడమవైపున కరుగుటయుఁగూడ సకల శ్రేయోదాయకమని చెప్పుచుందురు.

గరుత్మంతునకు తన యాహారమును నోటఁ గఱచుకొని కృష్ణాయని పైకి వినఁబడునట్లుఅఱచుచు గన్పించుట సకల శ్రేయోదాయకమనియు, ఏ దిక్కున నెవఁడు గన్పించునో ఆ దిశయందు లాభ ప్రాప్తియనియు, నల్ల పాల (గుమ్మ) పిట్టయు, శునకము, నక్క ఇవి తనకిరుపార్శ్వముల నేఁగుచుట కార్యసిద్ధియనియు, ఉదయమున నిద్దుర మేల్కాంచగనే గరుడపక్షియే ప్రథమమున గానఁబడుట జయప్రదమనియు చెప్పఁబడినది. జలనిలయములచెంగట గారుడశకునము శుభప్రదమైనను ఒక్కొకతఱి జలాభావమునగుటయుఁగూడ గలదని అనుభవవేత్తలు చెప్పియున్నారు.

**గాలవర్షి ఆశ్రమము** — చిత్రకూట పర్వతముపై గాలవాశ్రమముకలదు. బృహచ్ఛివ పురాణము ... దీనిగూర్చి ప్రశంస కలదు.

మఱియు రాజపుత్రస్థానములోని జయపూరునకు మూఁడుమైళ్ల దూరమున నొక గాలవాశ్రమ ముండినట్లు జూపుచున్నారు.

**గాలవ గోత్రము** — జమదగ్ని వత్స ఋషిగణము చూడుఁడు.

**గాలవుఁడు** — ఋషి. కువలయాశ్వునకు దశదిశగమన శక్తిగల అశ్వమును (కువలయాశ్వమును) ఇచ్చిన ఋషి. (కువలయాశ్వుఁడు చూడుఁడు.)

ఇంకను శుక్లయజుర్వేదాధ్యాపకుఁడగు గాలవుఁడను ఋషి యొకఁడు కలఁడు. ఈతఁడు విశ్వామిత్రశిష్యుఁడట. ఈతఁడు అయోధ్యాధినాథుఁడగు ఇక్ష్వాకుమహారాజుకడ రెండు వందలును, భోజపురాధినాథుఁడగు శిబియొద్ద రెండువందలును, కాశీభూపతియగు దివోదాసు కడ రెండువందలును మొత్తము ఆఱువందల గుఱ్ఱములను సంపాదించి గురుకట్నమర్పించెనని చెప్పఁబడినది.

**గాలికిపుట్టి ధూళికి పెరిగినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**గాలిజల్లుట** — వేపపువ్వు అనఁబడు చర్మరోగమునకుఁ గాలిజల్లినదని యందురు. ఇది పెక్కండ్రు ఏదో దేవతవలనకల్గిన రోగమని తలంతురు. ఆంగ్లవైద్యులు అంటురోగమందురు, గాలిలో నెగురఁగల పురుగులవలన గల్గునందురు. ఇది మూఁడు, ఐదు, లేక ఏడుదినములవఱకుండు రోగము, చిన్న పొక్కులుగ శరీరమంతయు వ్యాపించునది.

**గాలిచెక్క** — పిడుగుచెక్క చూడుఁడు.

**గాలితీగ** — దీనిని గాలిమొక్కలనుటయుఁ గలదు. పసుపుపచ్చగనుండు నొకవిధమగు తీగ. దీనికి నాకులుండవు. దానికి నేలతో సంబంధమే లేదు. ఇది సాధారణముగ మామిడిచెట్లు మొదలగు పెద్ద ఫలవృక్షములపై నుండి ప్రత్యేకమైన చెట్లరసమును పీల్చివైచుచు, చెట్లను నిరసింపఁజేసి పాడుచేయును.

ఇది వానకాలములోని కొన్నికొన్నితఱి అవతరించును. అట్టితఱి నాగడ్డిగూడ నట్లే పాడు చేయును గాన నీగాలితీగల నటుగన్ననట త్రెంపి పారవైచుచుండుఁడు. ఈతీగయందలి పచ్చియారక మున్నె తెగి, ఏపాటిముక్క మిగిలినను గాలిచేనో, చెట్లచే నాకర్షింపఁబడియో, తిరుగ చెట్లపై కెగఁబాకుకొనియో, వ్యాపించ నారంభించును. ఇది చెట్లకపాయకరమయిన తీగ.

**గాలితుపాకి** (Air gun) — దీనిని క్రీ. శ. ౧౬౫౬ వ సంవత్సరమున మారిన్

అనునాయన (ఫరాసుదేశస్థుఁడు) దీనిని మొదట వాడె ననియు, కనిపెట్టె ననియు తెలియు చున్నది.

**గాలి పరుపులు** (Air beds) — దూది పరుపులు మనమెఱుగుదుము. గాలి పరుపులు మఱియొక తరగతివి. దూదిచే నింపబడి కుట్టబడిన పరుపులు దూదిపరుపులు, గాలిచే నింపఁబడి ఆగాలి పైకిపోకుండ నేర్పున నేర్పఱచిన పరుపులు గాలిపరుపులు. ఇట్టిపరుపులు వాడుకలో నుంచినవారు పాశ్చాత్యులే యనియు, మనవారికి గాలిపరుపు లెఱుఁగరనియు పెక్కండ్ర యభిప్రాయమై యున్నది కాని పింగళి సూరనామాత్యుడు రచించిన కళాపూర్ణోదయమున ద్వితీయాశ్వాసమున

సీ. నునుగాడ్పు దూదినించిన యట్టి చల్లని
పానుపుపై లీలఁ బవ్వళించి,

అని రచించెను. దీనిని బట్టి చూచిన నాటికే గాలిపరుపులు మన దేశమున నెంతో వాడుకలోనికి వచ్చియుండె ననక వీలులేదు.

ఇంతలో నీగాలి పరుపు లాగలేదు. "నునుగాడ్పుదిండి పానుపున బండెడు మేటి, బమ్మదేవుని తండ్రి తమ్మికంటి" అని పైడిపాటి లక్ష్మణకవి తన ఆంధ్రనామ సంగ్రహమున వ్రాసియుండెను.

"విష్ణుమూర్తికి శేషుఁడు పాన్పు" అనఁగా గాలిమేపరియగు శేషుని పాన్పునబన్నుండువాఁడు విష్ణుమూర్తియని యర్థము తేలుచున్నది నవనాగరికు లిప్పుడు విష్ణుమూర్తి పరుండు పరుపు గాలిపరుపేగాని శేషుఁడు (పాము) కాదనియు,

"నునుగాడ్పు దిండిపానుపు", "నునుగాడ్పు దూది నించినయట్టి చల్లని పాన్పు" అని యనుటలెల్ల ఆలంకారికములేకాని యింకేమియు కాజాల వనియు నభిప్రాయము పొందియున్నారు.

ఎవరెట్లభిప్రాయము పొందియున్నను, గాలి పరుపులు కలవనియు, అవి భరతదేశమున నాఁటి నుండియు, వాడుకలో నుండెననియు నను సంగతులు మాత్ర మసంగతములు కావు.

**గాలి బిళ్లలు** — ఆంగ్ల Mumps. చెవులకు మెడకు సంధులందు చంకలందు గజ్జలందు మొదలగుతావుల సంధులందగు లేమ బిళ్ళలు లేక గడ్డలు. ఇవి వాపు పోటు ఒకప్పుడు జ్వరములనుగూడా గల్గియుండునవి.

**గాలిలో దీపంబెట్టి దేవుడా నీ మాహాత్మ్యంచూపుమన్నట్లు** — ఆంధ్ర లోకోక్తి.

**గాలియొక్క ఒత్తిడి** — ఎయిర్ ప్రెషర్ చూడుఁడు.

**గాలివీచు ఏర్పాటులు** — ప్రపంచమున గాలివీచు ఏర్పాటులు చూడుఁడు

**గాలి హోరు** — గాలి విసరుతరి హోరుమను ధ్వనికిం గారణము. గాలి విసరుట యన బర్విడుటయని భావము అట్టితరి నే శబ్దము నిజముగ దానిగమనమువలన గలుగ నేరదు. కాని దానికారణములవలన భూమిపై నుపరిభాగమునసే గాలి పర్విడుతరి గాలి యలలు అడ్డములుగానున్న గండశిలలకు పర్వతములకు వృక్షములకు, పెద్దపెద్ద భవనములకుందాఁకి తిరుగబడియు దెబ్బలో ప్రక్కకుమరలియు కొట్టుకొనుతరి అలలరాపిడులు (Vibrations) సంభవించు హోరుధ్వని గలుగును. అడ్డములవలన గాలియలలకు గల్గురాపిడి ఒక్కొక్కటి ఒక్కొక ధ్వని గల్గించును. గాలి ఎడతెగక ఒకేరీతిని కొంతసేపు పరుగిడునదిగాన నాటంకములకడ నలలకుం గల్గుచుండు ధ్వనుల పరంపరలన్నియు కలసి వేర్వేఱుగ వినుపించవు అన్నిధ్వనులు కలసి

...కే హోరుమనిధ్వనిగా మనకుం దెలియును. గాలి హోరుమని విసరుచున్నదని కొందఱనుకొందురు ఇంకను మఱికొందఱు గాలివలన కదపబడిన చెట్ల యాకులు కదలిక యీధ్వని గల్గించుచున్నదని తలంతురు. చెట్లయాకుల కదలికవలనగల్గు గలగల మను చప్పుడైనను, గాలియొక్క రాపిడుల వలన ( Vibrations) అలలుచేయు ధ్వనుల పరంపరయైనగాని వేఱుగాఁ జరుగుపని యిదియె.

**గాలివానావస్తే కథయే మానె నన్నట్లు** — ఆంధ్రలోకోక్తి

**గాఁఖుపులు** — గాడ్పులుచూడుడు.

**గాట్ల అమావాస్య** — జ్యేష్ఠబహుళ అమావాస్యకీపేరు వాడుచుందురు. దీనికి ద్వివిధ ములుగఁ జెప్పుచున్నారు. జేష్ఠబహుళ అమావాస్య ప్రాంతముల విశూచిజాడ్యము లచ్చటచ్చటగల్గి యుండురు విశూచిరోగమునకుగాట్లనివాడుచుండుట యుండుటచే దానినుండి యీపేరు గల్గెనని కొందఱనెదరు. ఇంకఁ గొందఱు అత్తరుణమున ఎండలధికముగనుండి గాడ్పులు (వేడిగాలులు) వీచునుగాన గాడ్పుకొద్దిగా మనమాది గాలుగనయ్యె నందురు.

**గాడ్పులు** — (గాఁఖుపులు) వడ వేడి గాలి కీపేరులుగలవు. కొంతదూరమున గాలి వేడెక్కి యచ్చట వీచుచు ప్రజలను వడదాకచేసిన వేడిగాఖుపులందురు. మిగత వేఱ్వేఱు దేశములు వేఱ్వేఱు నామములు కలవు. ఆఫ్రికాయందలి సహారా ఎడారియందు వేడియైనగాలి వీచుచున్న తరి దానిని ఇటలీదేశమున సికోక్కో (Sirocco) యనుచున్నారు స్విజర్లాండు దేశమున వీచుతరి దానిని ఫోహాన్ (Fohan) అనియెదరు. స్పానియాదేశమున వీచుతరి సోలేన్ (Solane) అనియెదరు. ఈజిప్టు దేశమున నీవేడిగాలితో సహా ఇసుకయు కొంచెము రాలుచుండును. దీనిని ఈజిప్టు దేశస్థులు ఖామ్సిన్ అనియెదరు. అనగా ఏబదియని యర్థము. ఇది ఏబదిదినములు వీచునట. సిరియాదేశము అరబ్బీదేశములందు వీచెడి ఇట్టి గాలికి సైమూన్ అనిపేరు. ఇటులనే శీతవాయువులును కొన్నిచోట్ల వీచును. ఫ్రాన్సుదేశపు దక్షిణభాగమున ఆల్ప్సు పర్వతపు శీతగాలికి మిస్ట్రాల్ (Mistral) అనియెదరు.

**గాత్రము** (గాత్రపుపాట) - గాత్రమనిన కంఠధ్వనియని యెఱుఁగునది. ఇది సంగీత సందర్భమున యంత్రగాత్రములని వాడెదరు యంత్రమనిన తీగెలసంగీతము, వీణ, ఫిడేలు మొదలగునవి. గాత్రమనిన గళముతోఁ బాడు గానమనిభావము. సంగీతము పాడుటకు గాత్రము సరియగు ధ్వని నొల్కునటుల నుంచు కళయని భావము. ఇది సంగీతములోని భాగము కాదు. సంగీతమునకు వలయు ధ్వనులను చక్కఁగవల్కునటుల శరీరమును శరీరభాగములను అమర్చుకొను విధానమును దెల్పు విద్యగా నెఱుఁగునది.

గానమున కవుసరించు గాత్రస్వరమందుట మానవ శరీరధర్మమునందు స్వభావమేయైనను కొన్ని ఇతర యాటంకములు కారణములుగ నవను ఛాలములగు గాత్రస్వరూపము లేర్పడును. గాత్రము సరిగా ఒదగకుండిన నచటి పరికరములు సరిగా పనిచేయుచుండలేదని యెఱుఁగునది.

శరీరమునందలి సమభారస్థితి దీనికి ముఖ్యమని చెప్పఁబడినది. బద్ధకముగను సోమరితనముగను శరీరస్థితి యుండునపుడు గాత్రము సరిగా ఒదగి పలుకదని యెఱుఁగునది ఎంత ఒనుగుట కలవాడు పడిన గాత్రమైనను మెడను ముందునకు వంచి గడ్డము గుండెలకుఁ దగులునటుల నుంచినస్థితి యందు గాత్రము ఒదిగి పలుకకుండును.

భుజములను చక్కఁగ విప్పి వెనుకకు విరచి యుంచుట గాత్రము ఒనుగుట కత్యవసరము.

గళమును చక్కఁగ నిలువంబడఁ జేయుటలు గడ్డమును పైకెత్తుటయు ఒడుఁగుటకు సాధనములే. పండ్లను బిగించి పట్టుటయు, నోరు కేవలము మూసియుంచుటవలెనే నిరోధములని అనుభవజ్ఞులు తెల్పుచున్నారు.

త్రిప్పుకొనుటయు, శిరఃకంపము మొదలగునవి వర్జించుట శ్రేయము. గానవిద్యాప్రదర్శనమున ఉపన్యాసమునందువలెనే అభినయాదులు వీలగునంతవఱకు వర్జించుచుండుటయే సమంజసమని యెఱుంగునది. (ఉపన్యాసము చూడుఁడు). పాశ్చాత్యగానవిశారదులు గాత్రమును ఒదిగించుటయందు అచ్చునుండిగాని వ్రాఁతనుండిగాని చదువగల్గిన చైతన్యము ఉండుననియు, లేకుండిన ఈపు సట్లభ్యాసమొనర్చుట శ్రేయమనియు, చైతన్యము తగ్గుటయన ఒదిగించుటయందు తనస్వాతంత్ర్యము తగ్గుటగా నెఱుంగవలయుననియు నందురు. కాని పాశ్చాత్యగాయకులందు గాత్రము నొదిగించి పాడుచుండుతిరి వ్రాఁతను చదువలేని బలహీనత పెక్కండ్రకుం గలదని తెలియుచున్నది. అచ్చు అక్షరములనుమాత్రమే చదువగల్గునటు గాత్రము ఒకగంటంగూర్చి Mr. Watson Lyle పండితుఁడు "Singing made Easy" అను గ్రంథమును వ్రాసియున్నాఁడు. (సంగీతము చూడుఁడు).

**గార్గ్యాయని గోత్రము** — పరాశర గణము చూడుఁడు.

**గార్గ్య గోత్రము** — గర్గఉపగణము చూడుఁడు.

**గార్గ్యాయణ గోత్రము**— అగస్త్య ఉపగణము చూడుఁడు.

**గార్గ్యుఁడు** — అత్రి, చంద్ర, పూరువు సంతతి. తండ్రి గర్గుఁడు, బ్రాహ్మణుఁడు. ఈతఁడు శాకల్యుని శిష్యుఁడు, ఋగ్వేదాధ్యాపకుఁడు, శనిపుత్రుఁడనియుం జెప్పఁబడియున్నది.

**గార్ధభాయణ గోత్రము**- లౌగాక్షి గణము చూడుఁడు.

**గార్ప్యాయన గోత్రము** — జమదగ్ని వత్సఉపగణము చూడుఁడు.

**గార్హపత్యాగ్ని** — అగ్నిత్రయము చూడుఁడు. ఇది తండ్రివలన గల్గిన యగ్ని

**గార్హస్థ్యాశ్రమము** – ఆశ్రమచతుష్టయము చూడుఁడు

**గార్త్సమద గోత్రము**— శౌనక లేక గ్రత్సమదగణము చూడుఁడు.

**గార్నిష్మెంటు** (Garnishment) — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము). ఒకనికి అప్పులెక్కువై అతని సరకులను లేక ఆస్తులను ఋణములుతీర్పక ఎగవేయ తలంచుచున్నట్లు న్యాయస్థానమువారికి తోఁచునెడ నాయాస్తుల నతని స్వాధీనమునుండి తప్పించుచు వశపఱచుకొన (జప్తు చేసి) వాటిని ఋణముతీర్చుటకై వినియోగింప నుత్తరువిచ్చుకాదు అట్టిపనికి Garnishment అనిపేరు. అట్టి ఉత్తరువునకు Garnished Order అనియెదరు. ఎవరిపై నట్టి యుత్తర విచ్చెదరో అతనిని Garnishee అనియెదరు.

**గాల్వనైజుడ్ ఐరన్** (Galvanized Iron) — ఇది సర్వసాధారణముగ నీటిగొట్టములకు వాడఁబడుచున్నమాట. నిజమున గాల్వనిజ్ము (Electricity) పనుల కనుకూలింపఁబడఁ జేయఁబడినవి కావు. ఇనుపగొట్టములకు తుత్తినాగము (Zinc) పూఁతపూయఁబడినవి. పేరు వాడుక యగుట పొరపాటు, కుదూహ్యము.

**గాల్వనోగ్రాఫీ** (Galvanography) - ముద్రించుటకు (అచ్చు కొట్టుట) రేకులపై

Galvanic Electricity మూలమున రచించు చిత్రములకు గాల్వనోగ్రాఫు అనిపేరు. ఆ కళకు Galvanography అనిపేరు.

**గాల్వనోమీటర్** (Galvanometer) - ఎలక్ట్రిక్కు కరెంటులు చిన్నచిన్న వాటినిగొలుచు పరికరము.

**గాల్వానోప్లాస్టీ** (Galvanoplasty) Galvanic Electricity ని చిన్నచిన్న వస్తువులపై నితరలోహపు పూతలంబూయుటను పయోగించుటకు Galvanize అనెదరు. అవిద్య గాక కళ.

**గాల్వనిజమ్** (Galvanism) — Electricity produced by chemical action ఇదియు Electricity యొక్క నొకభాగము. లోహములను విద్యుచ్ఛక్తి మూలముగ కొన్ని వస్తువులపై మలామా చేయుటకు Galvanizing అనియెదరు. అట్టివిద్యుచ్ఛక్తిని Galvanic Electricity అనియెదరు.

**గాస్ ఎంజిన్** (Gas Engine) — ఇది ఇంటర్నల్ కంబస్చన్ ఎంజిన్. ఇందు Gas fuel గా వాడఁబడుచున్నది. మొదట Coal gas fuel గా వాడు మొదటి Power engine ను Etienna Lenoir అను మహాశయుఁడు క్రీ. శ. ౧౮౬౦ లో కుదిర్చెనట. తర్వాత దానిని Nicholas A Otto అను నాయఁడును, Eugon Langen అనునాయనయు పెక్కు మార్పులుగల్గించిరి. ౧౮౭౬ లో Otto అను నాయన Compression పద్ధతినికూడ చేర్చి యొకటి ఎంజినును జయప్రదముగ పనిచేయించెను. తర్వాత ౧౮౮౬ లో క్లార్కు అను పేరుగల యంత్రనిర్మాత Low cycle engine కనిపెట్టెను. ఇక్కాలమున పెద్దపెద్ద Gas engines యొక్కు వానిపద్ధతులే వాడఁబడుచున్నవట. కొన్ని Gas engines అయిదు వేల గుఱ్ఱముల బలము (Horse power) కలవి కలవని వినుము.

**గ్యారంటీఫండు** (Guarantee Fund) (వాణిజ్యసంబంధ పరిభాషాపదము)—నష్టములు గల్గునెడల వానినుండి సంస్థను రక్షించుటకు నిల్వయుంచిన మూలధనము (Reserve). ఇందువలన Guarantee యన హామీ యని యర్థము కాగలదు. ఇట్టివే Guarantee భీమాలును కలవు. ఇట్లు హామీగల వాటాలకు Guaranteed-stock అనియెదరు.

**గ్రాండ్ ఫాదర్ క్లాక్కులు** (Grand-father Clocks) — పదు నేడవ శతాబ్దాంత కాలమున హాలండు దేశమునుండి గడియార యంత్రములంగొని ఇంగ్లాండునకుం దెచ్చుకొని వాట్లకు పలువిధముల కేసులం (Case) జేసి యందమర్చి గడియారములుగ విక్రయించు వారట. ఆకాలమున చేయఁబడిన పలుతెఱంగుల గడియారములలో పొడవుం క్రిందికి వ్రేలాడు పెండ్యులమ్ (Pendulum) బిళ్లలు గల గడియారములు కొన్ని యుండినవట. వానికి గ్రాండ్ ఫాదర్ క్లాక్కు అని పేరయ్యెనట. దీనిం గూర్చి యొక ముచ్చట కలదు.

ఒకయూర నొక వృద్ధుండగు కఱ్ఱ పనివాని కొక మనుమం డుండెనట, వానికిదే వృత్తియట. ఒకనాడా బాలుండు పొడవుగ నొక విశేషాకారముగ గడియారపు డొక్కుం జేసి, అం దొక గడియార యంత్రము నమర్చిబిగించి యీ గడియారము తనతాత (Grand father) సులువుగ జూడగల్గుటకు వీలుగల పొడవు గలదిగాన గ్రాండ్ ఫాదర్ క్లాకు (తాతగడియారము) అని దానిపై పేరుచెక్కెనట. గడియారముం గొన వచ్చినవారి దృష్టినది యాకర్షించినంతగదోప దాని

కావేరిడ కారణమడిగిరట. ఊహాపోహ లెక్కువగ గల్గిన యాబాలుడు "అయ్యా' అందలి యంత్రము చాలగట్టిది. పై కేసును అందుకు తగురీతిని గట్టి పనితనముగ రచింపబడినది. ఈ గడియారము తరతరములుగ నుండి పనిచేయునదిగాన తాతలనాటి గడియారమయ్యు మనుమల కాలమునఁ గూడ పనిజేయుంగాన గ్రాండ్ ఫాదర్ క్లాక్కు (తాతలనాటి గడియారం) మని పేరొందినది" యనెనట. నానాటికాగడియారములు మంచి వ్యాపకమును గాంచి నేటికి నాపేరం బరగుచున్నవట.

**గ్రాంథికభాష** — ఆంధ్రదేశపు భాషయగు నాంధ్రభాషాగ్రంథములలో వాడఁబడిన భాషయని యర్థము అనఁగా పురాణములు, ప్రబంధములు మొదలగు పద్యకావ్యములందు వాడఁబడిన భాషయని భావము. ఇది సాహిత్యపరమై, సమాసయుతమై, వ్యాకరణయుక్తమై, అలంకారలక్షణవిరాజితమై, గద్య పద్యాత్మకములుగను, గద్యాదివచనరూపములుగను, నాటకములుగను యున్నది. ఇటీవల కొందఱు ఆంగ్ల విద్యాధికులగు పరిశీలకులు మార్చి ప్రస్తుతము దేశమున ప్రచారమందుండు రీతిని వ్యావహారిక భాషను అందరికి తెలిసి స్వేచ్ఛగ వాడుకొనగల్గునటుల మార్చవలయునని ఒక యుద్యమును బయలుదేరదీసిరిగాని పరిశుద్ధతం జెరిపి, భాషను పలచబఱచ ట్లొనర్పరాదని పండితు లెదిర్చిరి (గ్రామ్యభాష చూడుఁడు)

**గ్రాఫ్** (Graph) — Gelatine తో నేదేని నకలుతీయు నొకసాధనము. ఈవిధాన విద్యకు గ్రాఫ్ అని పేరు.

**గ్రాఫైటు లోహము** — బ్లాకులెడ్ విద్యకు చూడుఁడు.

**గ్రాఫోమీటర్** (Graphometer)— మూలలు కొలచుటకైన పరికరము. దీనిని Survey చేయువారు వాడుదురు.

**గ్రాఫోలాజీ** (Graphology) — వ్రాసినమాటలధోరణి. వ్రాఁత, కళ. ఒకని దస్తూరీ చూచి అతని చిత్తవృత్తులం గనిపెట్టుట. కళ.

**గ్రామ్యభాష** — ఆంధ్రదేశపు భాషయగు ఆంధ్రము వ్యాకరణాదినియమములకు లోనైయుండక వాడఁబడినరీతిని గల్గినభాష. "అనియమాత్ గ్రామ్యంహి" అను వ్యాకరణ సూత్రమువలన నియమము లేకుండుటవలన గ్రామ్యమగునని భావము. ఈభాష దేశమున సర్వసాధారణజనుల వాడుకయందు ప్రచారమంది యున్నదనియు, దీనిని గ్రాంథికభాషకు మారుగ వాడవలయునని యుద్యమమును, కొందఱాంగ్లవిద్యావిశారదు లగు పరిశీలకులు బయలు దీసిరిగాని, పండితులెదుర్కొని అడ్డుపడుచు మన్నారు (గ్రాంథికభాష చూడుఁడు).

**గ్రామ్యాయణగోత్రము** — భృగు సంతతి. (ఆర్షి షేణగణము చూడుఁడు.)

**గ్రావిటేషనల్ ఎస్ట్రోనామీ** — ఎస్ట్రోనామీ చూడుఁడు.

**గ్రావిమీటర్** (Gravimeter) — ద్రవపదార్థముల యొక్క Specific gravity కనుగొను పరికరము.

**గ్రావ్ణి రేఖేవ ఇతిన్యాయము** — గ్రావ్ణియన శిల లేక, రాయి కర్థము. అందుపై రేఖ యన శిలాక్షరమని భావము. శాశ్వతమని చెడని దని తెలుపుట కీన్యాయము వాడుదురు.

**గ్వాలియరు చింతచెట్టు ఆకు** — గ్వాలియరు సంస్థాన నగర మగు గ్వాలియరు

(లష్కరు) నగరము సంగీతమునకు పేరందినదని సంగీతవిద్వాంసులెల్ల రెఱింగినదే. అందున మహా సంగీతకళానిధి యని పేరందియుండిన తాన్సేను సింగు లేక, తాన్సింగను సంగీతవిద్యాదేశికుని సమాధి సుప్రసిద్ధయాత్రాస్థలముగ గానవిద్యా విశారదులు దర్శించి పోవుచుందురు. దాని ప్రక్కనే ఒక చింతచెట్టు సుప్రసిద్ధము. దాని యాకులం దినిన గానమునకు గాత్రము చక్కగ నొదిగి, సుఖకరమగు పాట యలవడునని ఆదేశ మున బలమగు వాడుక గలదుగాన దానిం దిను చుందురు.

**గ్వాలియరు సంస్థానరాజ్యము** — సెంట్రలిండియా ఏజన్సీసంస్థానములలో బ్రిటీషు రక్షితసంస్థానము. దీనిని సింధియాస్‌డొమినియన్సు నియు ననుచున్నారు. ఇది పెద్ద రాజ్యము. ఏల్లింటు మాళవదేశభాగము కడు ఫలవంతమై నది. గ్వాలియరుపురము రాజధాని. ఇట హిందూస్థానీదేశపు సంగీతకళాభవనము సుప్రసిద్ధము. గ్వాలియరుదుర్గము కడు బలమైనదని పేరందినది. ప్రభువు మహారాష్ట్రుఁడు. గ్వాలియరుపురమును లష్కరనియు నందురు. తొల్లింట నిట బ్రిటీషు సైన్యము లుండఁబడుట నిపేరు గల్గెనట. మొరారను పేరుగల ఆనాటి సైన్యస్థాన మిటీవల బ్రిటీషుప్రభుత్వమువారు గ్వాలియరు సింధియా మహారాజునకిచ్చివై చిరి. సుప్రసిద్ధమగు ఉజ్జయినీ పురము, బిల్సాబౌద్ధవిహారములు ఈరాజ్యము లోనివి. (సెంట్రలిండియాఏజన్సీ సంస్థానములు, సాంచిస్తూపము, మాళవ దేశముచూడుఁడు).

**గ్లాడియాటోరిజమ్** (Gladiatorism)— స్వబలప్రయోగమున నాదటి రంజిల్ప గల మను నమ్మకము లేక, లోకమును మెప్పింపఁగోర్క.

---

**గిన్నీ**—గిన్నీఅనఁటికోడు అరటులలోనొక జాతి. (అనఁటి చూడుడు.)

గోల్డెనుగిన్నీ అను నొకజాతి ద్రాక్షపండ్లు కలవు. ఇవి ఫ్రెంచిదేశమున పెరుగునవి. సుప్రసిద్ధములు.

గిన్నీ నాణెము- (The Gunea Coin) ఇది ఆంగ్లసీమయందు ఎలిజబెత్ రాజ్ఞి ప్రభుత్వ కాలమున క్రీ. శ. ౧౬౬౩ సంవత్సరమున Mill & Screw పద్ధతిని టంకశాలయందు చేసిరట. కాని మఱికొన్ని వత్సరములలో మాను కొనిరట. అదిమొదలు సుత్తులతో బాది చేసిన నాణెములు అంతరించినవి. పిదప మఱికొంత కాలమునకు తిరిగి ముద్రణపుపద్ధతిని ఫ్రెంచివాఁడగు బ్లాండూ పరిశీలనక్రింద నుండెను. ఈ నాణెములు ఆఫ్రికాలోని గినియాదేశపు గనుల నుండి తేబడినబంగారముతో చేయఁబడుట గిన్నీ అని పేరిడఁబడి, అయిదు గిన్నీలు, రెండు గిన్నీలు, ఒకగిన్నీ, అరగిన్నీ నాణెములుగ ముద్రింపఁ బడినవి ఆబంగారమును దెచ్చెడి వర్తకసంఘము నకు "Company of Royal Adventurers of England Trading into Africa" అని పేరుండెను

ఈసందర్భమున నాటంకశాలయం దొకవిందు జరగినదనియు, నాణెములప్రదర్శనము జరుపఁ బడినదనియు, అందు జర్మనీ మొదలగు కొన్ని దేశముల నాణెములుకూడ ప్రదర్శింపఁబడె ననియు, మఱియు నీఫెంచియుద్యోగిచే నాంగ్ల భూపతికై చేయఁబడిన బంగారు, వెండినాణె ములు మెప్పువడసెననియు చెప్పఁబడినది. అది మార్చి ౯ యని వ్రాయఁబడినది.

**గిన్నీగడ్డి వ్యవసాయము** — ఇది విలువగల మేతలలో నొకటిగ చెప్పఁబడినది. బాగుగ పైరుచేసి జాగ్రతగకాపాడిన చాల సంవత్సరములు జీవించును. చక్కగ పైరగు గడ్డి

జాతి. తొలుత గినియా దేశమునుండి వచ్చినదగుట నీపేరందినది. భరతదేశ పరిస్థితులకు యిల వాటుఁబడి యనుకూలించుచున్నది. జొన్న, సజ్జ, మొదలగు జాతులుకంటె వేరు భూమిలోనికి లోతుగ నాటుకొను జాతి గాన భూమిమెత్తగా నున్నవలసియుండును. మరియు నిది యవ్వకునేలల లో బాగాపెరిగి వర్ధిల్లునదిగాన నీరు నధికముగా కావలసియుండును. ఈ గిన్నిగడ్డికి వేళ్ళలోనీరు నిలచిన కుళ్లిపోవునను భయములేదు. లూసర్న్ గడ్డికి బనికివచ్చు భూములేగాక ఇతరభూములు గూడ దీనికి బనికివచ్చును. కేవలము ఇసుక మాత్రము బనికిరాదు. భరతదేశమునమే జూన్ నెలలయందు దీనిని పైరుచేయుచుందురు విత్తులు తోట్లలో నారుబోసి అరంగుళము పెరిగిన పిమ్మట పొలములకునీరుగట్టి యూడ్చెదరు. ముందె దుప్పువేసి పిదపమన్ని నీరుగట్టిగాని వానపడుచుండు సమయమునగాని రెండేసియడుగుల దూరముగ నాటుదురు. అతిత్వరగ పెరిగి దుబ్బుగట్టి గడ్డి బలి యును. భూమికారంగుళములు వదలి గడ్డికోయు చుండవచ్చును. మొక్కలు ఎండజూపినప్పుడెల్ల నీరుగట్టుచుండవలయును గాని రెండవసంవత్సరము నుండి అవసరమువెంబడిని నిరుగట్టవచ్చుంగాని తఱుచుగా గట్టనక్కరలేదు. అప్పుడప్పుడు భూమి మొండి గట్టిబారిపోకుండ గొప్పుత్రవ్విగాని మధ్య మధ్య దున్నిగాని భూమిని గుల్లగాచేయుచుం డుట యవసరము. వేళ్లు పదునెనిమిది యంగుళ ములకంటె నెక్కువగ వ్యాపించి గడ్డిదుబ్బు లెక్కువ బలిసినయెడల వాట్లనువిడదీసి చిన్న చిన్న దుబ్బులను వేఱుగనాటియు పెంచవచ్చును. చేను బలహీనముగాకుండే గత్తమువైచుచు గొప్పుత్రవ్వుచుంటయు నీరుగట్టుచుంటయు గమ నించుచుండవలయును. నీరధికమయిన గడ్డిపెరగ దని (యధికముగనని) యెఱుంగునది. ఎకరమునకు నూట నలుబది క్వింటాళ్ళ నూటఏబది మణుగుల పచ్చిగడ్డికోయవచ్చును పశువులకు నిది చాల రుచియైన యాహారము. భరతదేశమున కనుకూ లించినపంట.

**గిప్సీ జాతివారు** (Gypsees) — వీరిప్పుడైరోపా దేశముల గానంబడుచున్నారు. తొల్లింట ఆశియా ఖండమువారని ఒకప్రతీతి కలదు. వీరు దొంగలని అపవాదుక కలదు. వీరిలోకొందఱు సంగీతము పాడువారు, నృత్య మొనర్చువారుగ నుందురు. కొందఱు ఇనుప పని చేయుదురు. కొందఱు గుఱ్ఱముల వ్యాపార మొనర్తురు ఇంకను అనేకవృత్తులు కలవు తఱుచుగ వీరు ప్రత్యేక తావులందు వసించుచుందురు (హంగేరీదేశము చూడుఁడు).

**గిబ్బన్సు** (Gibbons) — ఫేజెస్ ఆఫ్ ది మూన్ చూడుఁడు.

**గిరికర్ణిక** — గుజరాతులోని సబర్మతీనది చూడుఁడు. దీనింగూర్చిన ప్రశంస పద్మపురాణము ఉత్తర. గీత యాగ గలదు

**గిరినగరము** — ఇప్పటి జూనగడ్ సంస్థాన పురమునకు జూనగడ్ నుండి కతిపయ దూరమునగల తొల్లింటి రైవతపర్వత మిప్పుడు గిరినార్ (గిరినగరము) అనుపేరం బరగుచున్నది. ఇది జైనుల యాత్రాస్థలము. నేమినాథ్, పరసు నాథ్ అను తీర్థకరుల దేవస్థానములు గిరిపై నున్నవి. నేమినాథ్‌స్వామి శ్రీకృష్ణునిజ్ఞాతి. ఉగ్రసేనుని కుమార్తెయగు రాజమతీదేవి సుతుఁడు. ఆయన జైనస్వామియై, తీర్థకరుఁడై దత్తాత్రేయుండనునృపునకుదేశికుఁడై యాయనకు జైనదీక్షనిచ్చి యిటనే వృద్ధుఁడై నిర్వాణపథ మందెను. ఈదేవస్థానములు దిగంబర జైనులవి.

గిరినగర పర్వతమునంటియె ఫలాశినీ యనంబడు చిన్న స్వర్ణరేఖానది ప్రవహించుచుండును.

లోఁ బ్లింట జూనగర్పురమునకే గిరినగరమని పేరు. పిదప పేరుమార్చఁబడి ఇక్కుడీపర్వతమునకే వర్తించుచున్నది.

ఈ రైవతక పర్వతముపై గురుదత్త పాదమని యొక పాదముయొక్క ఆనవాలు చెక్కఁబడి యున్నట గాననగును అది శ్రీకృష్ణుని పాద మైనని తావని యనెదరు

తొల్లింటి కాలమున నిట దత్తాత్రేయు ఆశ్రమ ముండిన దందురు. బృహత్సంహిత ౧౪-౧౧ యందు గిరినగరమును గూర్చిన ప్రశంస కలదు. గిరినార్ రుద్ర దమనుని శిలా శాసనము లందు ఆయన పూర్వుల పేర్లు మొదలగునవి పెక్కులు గలవు. అందైదుగురు యోన (యవన) నృప తులపేర్లు గానవచ్చెడిని. సందర్భము మాత్రము తెలియకున్నది అవి ౧ అంతియోకో లేక అంతియోకస్, థియోస్ ఆఫ్ సిరియా, ౨. తుర మాయా లేక టోలెమి, ఫిలడల్ఫస్ ఆఫ్ ఈజిప్టు, 3. ఆంటికినీ లేక ఆంటిగోనస్, గోనాటస్ ఆఫ్ మేసిడన్, ౪. మక లేక మగస్ ఆఫ్ సైరిని, ౫ అలికసుందర లేక అలగ్జాండర్ (రెండవవాఁడని భావము) ఆఫ్ ఎపిరస్ అనునవి.

గిరినగరమునకు వస్త్రాపాద క్షేత్రమని పేరు కలదు. స్కాంద పురాణ ప్రభాసఖండ వస్త్రాపాత మాహాత్మ్యము ౧-౧౧ యందు ప్రశంస కలదు

**గిరి నది** — హిమాలయ పర్వతపఙ్క్తుల లోని చూర్ అను పేరుగల పఙ్క్తియందుత్పన్నమై రాజగాట్ అనంబడు తావున యమునానదియందు సంగమించునది. పురాణప్రసిద్ధమైన నది కాళి దాసు తన విక్రమోర్వశీయమను నాటకమున దీనిగూర్చి నుడివియున్నాఁడు ఇది పుష్క లావతీ పట్టణము ప్రక్కనుండి ప్రవహించుచు ఇప్పుడు లండై యను వాడుకనామము బడసి యున్ననదికిని తొల్లింటిపేరు గిరియనియే నని తెలియుచున్నది.

**గిరినార్పర్వతము** — గిరిపంచకము చూడుఁడు.

**గిరిపంచకము** — జైనయాత్రాస్థాన ములు. ౧. శత్రుంజయశిఖరము పాలీటానా సంస్థానములోనిది. కథ్యవార్ సూరత్‌కు నైఋ త్యదిశగా ౨౦ మైళ్లు. భావనగర్‌నుండి 3౪ మైళ్లు. ఆదినాథతీర్థకరక్షేత్రము.

౨ సుమేరుశిఖరము- సమేర్‌శిఖర మని జైనులు వాడెదరు. ఇరువదిమూడవ తీర్థకరుఁ డగు పరేశనాథక్షేత్రము (పరేశనాథభక్తులు శ్వేతాంబర జైనులు, ౨౪ వ తీర్థకరుఁడగు మహా వీరనాథ తీర్థకరుని భక్తులు దిగంబరులు). సుమేరు శిఖరమున నిరువదినల్గురిలో పదునొమ్మండుగురు తీర్థకరులు నిర్వాణమందిరి. బీహారు రాజ్యము లోని హజారీబాగ్ జిల్లా E. I R. ఇస్రీ స్టేషను సమీపము.

3 అర్బుద శిఖరము- ఆబుశిఖరము, ఆరావళి, తొల్లింటి ఆదర్శావళి పర్వతపఙ్క్తి. ఇది నేమినాథ ఋషభతీర్థకరుల క్షేత్రము. మరియు నిచట వశిష్ఠా శ్రమము తొల్లింట నుండిన తావనియు జెప్పి అంబాభవాని దేవాలయమును జూపుదురు. రాజ పుత్రస్థానములోని సిరోహి సంస్థానములోనిది.

౪. గిరినార్ పర్వతము లేక తొల్లింటిగిరి నగర శిఖరము- నేమినాథ పరశునాథక్షేత్రములు కలవు. తొల్లింట నిది దత్తాత్రేయాశ్రమము. దీనిని వస్త్రపాదక్షేత్రమందురు. ఫలాసిని లేక స్వర్ణరేఖానదీతీరము. నేమినాథతీర్థకరుఁడు అరిష్ట నేమియని పేరుగలవాఁడు. ఉగ్రసేనుని కుమార్తె యగు రాజమతీదేవి పుత్రుఁడు. శ్రీకృష్ణుని జ్ఞాతి. ఇచట నిర్వాణమందెను. ఈ గిరికి రైవతక పర్వతమనియుం బేరుండెనట. ఇచట కృష్ణుని

పాదమూనవాలు కలదు. దానిని జైనులు గురుదత్తపాదమనియెదరు. ఇది జూనగడ్ సంస్థానము లోనిది.

గి. చంద్రగిరి శిఖరమని కొందఱును, అష్టపాదశిఖరమని కొందఱును చెప్పుచున్నారు. చంద్రగిరిశిఖరము మైసూరు రాజ్యములోని హాసన్ జిల్లాయందు శ్రావణబెళగోలము అనంబడు తావు. ఇదిగోతమేశ్వరక్షేత్రము. మయూర చంద్రగుప్తుని నిర్యాణస్థలము. ఇంక అష్టపాద శిఖరము హిమవన్నగముపైనున్న టిబెట్టు సరిహద్దున కైలాసశిఖరప్రాంతము.

**గిరిమాలపంచకము** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున రేల, గ్రంథిపత్ర, తుంగ ముస్తలు, చేదపొట్ల, కరక్కాయలకు గిరిమాల పంచకమని పేరు

**గిరిముత్పాట్యమూషికోద్ధృతా** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. కొండం త్రవ్వితే ఎలుక బయలుదేరినదని యర్థము.

**గిరియేల్** — మగధరాజ్యము చూడుఁడు, కైకుతదేశము చూడుఁడు.

**గిరివ్రజపురము (రాజగిరి)** — ఒకప్పుడు మగధరాజ్యమునకు రాజధాని. (మగధ రాజ్యము చూడుఁడు).

**గిరొస్సప్ప జలపాతము** — మైసూరు రాజ్యమునందు శివమొగ్గజిల్లా శివమొగ్గనుండి గిరొస్సప్పగ్రామము ఏబదిమైళ్లుండును. మంచి బాట కలదు. మోటారు బస్సులు తిరుగుచుండును. శివమొగ్గ మైసూరు రెయిల్వేస్ నంటియే యున్నది. ఇది శరావతీ నదియొక్క జలపాతము. మైసూరు రాజ్యమునకును, బొంబాయి రాజధానికిని సరిహద్దుగ నున్నది. మార్గము మైసూరరణ్యములగుండా నడచుటవింతగొల్పెడిని. పిదప శరావతినదిందాటు రేవుగలదు. పిదప నింక రెండుమైళ్ల అరణ్యపుబాటం గడచిన జలపాతమున కెదుట నేర్పడియున్న ఉన్నతస్థలముల నుండి గాంచనయ్యెడిని.

జలపాతము భూమిందాకు తావున లోతైన గుండమేర్పడి యున్నది. అందునుండి జలములు పైకెగురుట, చిన్నచిన్న సీటిధారలు, ఆవిరి పైకెగురు దృశ్యము లచ్చెరువు గొల్పెడిని. ఈ శరావతీనది మొగుడనుజలపాతముదనుక నతిత్వరితగతిం దొరలుచు పేరు సార్థకముగావించుకొనుచుండును. గోతియందు అట తాండవమాడి యల్లకల్లోలమొనర్చి దానినుండి తిరుగ నదీ ప్రవాహరూపమున బయలువెడలిన తరినుండియు నతి సాధువై శాంతముగ నడచి తన ఉభయవిధ గమనపాండిత్యముం బ్రదర్శించును. జలపాతము ఎనిమిదివందల అడుగులనియు, ధ్వని చుట్టు కొన్ని మైళ్లదూరమువఱకు వినిపించుచుండు ననియుం దెలియుచున్నది.

ఈ జలపాతము నాలుగుగ పడుచుండును. వాటికి రాజాయనియు, రోరరనియు, రాకెట్టనియు, రాణియనియు పేళ్లిడియున్నారు. రాజా ౮౩౦ అడుగుల ఎత్తు. జలస్తంభమో యనునట్లొకేధారగ పడు పెద్ద జలపాతము. రోర్ జలపాతము ఎత్తు కొంతతక్కువైయుండి దీనిపతనము క్రిందిపల్లమున మధ్యమునకమరి ధ్వనిలో మూడుపాళ్లిదియే గల్గించుచున్నదనిపించును. రాకెట్టు జలపాతము నడుమ నడుమ రాళ్లకుం దాకుచు నెగురుచు పూలగుత్తులవలె భ్రమించుచు బాణసంచా కాల్చుచున్నట్లుండును. రాణిజలపాతము సన్నమై విన్నాణములతో దిగునట్లు అందముల రాసియై కన్పట్టును.

వేసవియం దీజలపాతము నీరడుగంటి నీరసస్థితినుంట చూడఁదగియుండదు. వర్షాకాలమున

నీ తావున గొప్ప మంచు దట్టమైయుంట నసలు చూడ నీలేయుండదు. కాని జనవరి ఫిబ్రవరి మాసములే అర్థకాలము ఇందలి ఇంద్రధనస్సుల రంగు లతి రమ్యములు.

**గిలిగిచ్చచెట్టు** — లా. Crololava Verrucosa, Crotolaria sericea. సంస్కృతపుపేరు తెలియదు. కొందఱు ఘంటారవ, బృహత్పుష్పి, శణపుష్పిక యనెదరు గాని యివి పెద్ద జనుము పేరులయియున్నవి. దీనింగొందఱు గిలిగిలిచెట్టని యనుచున్నారు. దీనికాయలు పండి యెండినవిగల్లగనుండియు, లోనిగింజలు (కాయంగదిపిన) గిలగిల ధ్వనిజేయుంగాన నీపేరు గల్గియుండెనోపు. పూవులు తెల్లగను, ఎఱ్ఱగను, పచ్చగను చిక్కుడుపూవులవలె పుష్పించు మూడుభేదములం గల్గియున్నవి. దీనివేరు, ఆకురసము, లేక కషాయము లోనికిచ్చిన ప్లీహము వాపు (Enlargement of spleen) తగ్గు ననియు, గుల్మము (కడుపులోనిబల్లి) తగ్గుననియు, జ్వరవేదన తగ్గుననియు, ఆకునుగాని సమూలముగ గాని నూరి పైనిపట్టువేయుటవలన సమస్త చర్మరోగములేగాక కుష్ఠువ్యాధియు శమించు ననియు నందురు.

**గిలి గోత్రము** — భారద్వాజ ఉపగణము చూడుడు.

**గివ్ ఆన్** (Give on) — (వాణిజ్య సంబంధ పరిభాషాపదము). కాంటాంగో (Contango) ను చెల్లించుటకు గివ్ ఆన్ అనియందురు. (కాంటాంగో చూడుడు).

**గిల్బర్టు ద్వీపములు** — పసిఫిక్కు మహాసముద్రమునందలి ద్వీపములు. బ్రిటిషు సామ్రాజ్యములోనివి. వీటియందు పదునెన్మిది జననివాసములు, కొబ్బరిచెట్లు చక్కగా నిటం బెరుగుచున్నవి. మొత్తము ౧౬౬ చతురపుమైళ్లు.

**గిల్డ్ సోషలిజమ్** (Guild Socialism)- ఒక్కొక వృత్తిపనివాండ్రందఱు ఒక్కొక చోట కూడి సంఘీభవించి కలసిపనిచేయుట యీడ కుండుట.

**గ్రిగోరియన్ కాలమానము కేలండరు** — ఐరోపా కాలమానము చూడుడు. కాలవిభజనము చూడుడు.

**గ్రిధ్రకూట పర్వతము** — మగధ దేశమున గిరివ్రజపుర ప్రాంతముల ఇంద్రగుహా యున్న పర్వతమున కీపేరుండెనని కన్నింగ్హామ్ పరిశీలకుం డభిప్రాయపడి యున్నాడు.

**గ్లిఫోగ్రఫీ** (Glyphography) — ఒక రాగిరేకుపై Engrane చేయబడినదానికి Graphite పులిమి. రాగిపూత Electropte చేసి దానితో ముద్రించు కళ. ఇది క్రీ. శ. ౧౮౪౨ వ సంవత్సరమున కనిపెట్టబడినది.

**గ్రీకు దేశమునందలి అథీనియములు** — గ్రీసుదేశమునందు ప్రధానదేవత యగు అథీనాదేవి విద్యలకుఁ గళలకు అధినాథు రాలని తలంపంబడుచుండి ఆమె దేవాలయముల కాదిని అథీనియమ్ అని పేరు వాడుకగానుండెను. రానురాను విద్యల దేవాలయములకుఁ గూడ నామెనట పూజించుటంజేసి పాఠశాలలకుంగూడ అథీనియములని వాడుకలేర్పడియెను. ప్రధాన నగరమగుఅథెన్సుపురమునకుం గూడ నాపేరగుట కిదియే కారణము. అథెన్సునిర్మాత Theseus గారు. ఈనగరము Attica మైదానమునం దున్నది. (అట్టికా మైదానము, గ్రీసుదేశము చూడుఁడు).

**గ్రీకు నృపతులు** - డెరయస్‌హిస్టాస్పస్ పాంచాలదేశ భాగమును జయించిన పిదప ౧. మేనండేరు (మిళిందుఁడు). ౨. అప్పొలోడో డీస్, 3. జోయిలస్, ౪. డియోనీసియస్, ౫. స్ట్రేటర్, ౬. హిపోస్ట్రేటర్, ౭. డియోమి డీస్, ౮. సినియస్, ౯. టెలిఫోస్, ౧౦. హెర్మా యిఅర్ అను పదిమంది, వేఱ్ఱేఱుభాగములు, కొందఱేకకాలమును, కొందఱు వేఱ్ఱేఱు కాలములను పాలించిరి. వీరికాలము క్రీ. ము. రెండవ శతాబ్దమాదిగ క్రీ. వె. డెబ్బదియెన్మిది సంవత్సరములదనుక ౨౭౮ సంవత్సరములకాలము పాలించిరి. వీరిని శకనృపతులు (ఇండోసిథియను నరపతులు ఓడించి రాజ్యమాక్రమించిరి).

**గ్రీకుభాష అక్షరములు** —

1. Alpha, 2. Beta, 3. Gamma, 4. Delta, 5. Epsilon, 6. Jeta, 7. Eta, 8. Theta, 9. Iota, 10. Kappa, 11. Lambada, 12. Mu, 13. Nu, 14. Xi, 15. Omicron, 16. Pi. 17. Rho, 18. Sigma, 19. Tau, 20. Upsilon, 21. Phi, 22. Chi, 23. Psi, 24. Omega. ఇవి అక్షరములకు ఆంగ్లోచ్చారణలు.

**గ్రీనిచ్ నక్షత్రశాల** — గ్రీనిచ్‌పురము లండనునగరపు బరోగా థేమ్సునది దక్షిణము వైపున నున్నది. ఇటుగల నక్షత్రశాలః లోకమునందలి గొప్ప నక్షత్రశాలలలో నొకటి. లండను సిటీ నుండి ఆరుమైళ్ల దూరము.

**గ్రీనిచ్ మీన్ టైము** — మధ్యాహ్నము పండ్రెండు గంటలు మొదలు తిరుగ మరునాటి మధ్యాహ్నము పండ్రెండు గంటల కొక రోజగుననియు, నిది శాస్త్రతః (భేదములులేక) పాటింపందగిన నైసర్గిక మగు దినమనియు నెల్లరకుం దోఁపకపోదు కాని భూమి సూర్యుంజుట్టివచ్చు కాలములందించుక భేదము కలదని కనిపెట్టంబడినది. ఉత్తరాయణపు చలి యందు భూమి సూర్యునికించుక సమీపముగ నరుగుతరి దినమునందెక్కువకాలమును ఉత్తరాయణపు వేసవియందు భూమి సూర్యునుండి ఇంచుక దూరమగుతరి దినపరిమాణమించుక తగ్గియును ఉండుననని కనిపెట్టంబడినది. దీని వివరేజికాలము గ్రీనిచ్‌మీన్ (Greenich mean time) గా నిర్ణయింపంబడినది. అది సున్న మొదలు పదునారు మినిట్ల వరకుండెడిని. ఇది యంత్రప్రాముఖ్యమని దోఁపకుండినను Nautical Observations నందు ముఖ్యముగాను, Almanacs నందు వివరింపంబడుచుంటఁ గాన నగును.

**గ్రీన్లాండు ద్వీపము** — ఇది ఉత్తర అమెరికా ఖండమునకు ఈశాన్య దిశగా నెనుట నున్న యొక పెద్ద ద్వీపము. దీనిని డేనిష్ అమెరికా యనియు కొంద ఱనెదరు. సముద్రపు నాచు, పాచుడు ద్వీపము చుట్టు తీరము లందు పుట్టి యల్లుకొని స్టీమరులనుండి చూచువారల కాకుపచ్చగ గన్పించుచుంట నీపేరెవ్వరో యిడి

యుండునని తలంపఁబడు చున్నది. ఇది చాల పెద్ద ద్వీపమని పెక్కుండ్రు తలంచు చుందురు. కాని కాలభేదమును పాటింపని మాచు ఘనీభవించి యనేక చిన్న చిన్న ద్వీపసమూహములు బాధించి ఒకే ద్వీపమువలె నిట్లున్నదని కొందఱు పరిశీలకు లనుచున్నారు. శిలామయ ప్రదేశము. మంచుమయము. స్వల్పముగా తొల్లింటి డెన్మార్కు దేశ వాసులై యుండిన వారిను కాపురము కుదిరి అచ్చటచ్చట వసించు చుండ గానసగును.

ఆస్ట్రేలియా తరువాత ప్రపంచమునఁ జెప్ప దగిన పెద్ద ద్వీపమిదియె క్రీస్తు వెనుక పదియవ శతాబ్దమున ఐస్లాండు ద్వీపవాసులు ఇటకుం గాపురమే తెంచి అభివృద్ధిఁగనుచు మూడు వందల సంవత్సరములు మనిరట గాని క్రీ. వె ౧౮౦౦ సంవత్సరమున సందఱు నాశన మైరట వారి నివాస గృహములు పాడై యచ్చటచ్చట యూర వాళ్లు కలవు. ఆదిమ నివాసులు ఎస్కిమో (Esquimaux) జాతివారు చేపలను ఇతర జలచరములను వేఁటాడుచు జీవించువారు కొందఱు కలరు

నార్వే దేశస్థుఁడగు Dr Nausen గారు క్రీ. వె, ౧౮౮౩ లో దీనిం దిరిగి పరిశీలించిరి. ద్వీపముయొక్క పశ్చిమతీరమున Uppernavik అను సెటిల్మెంటు ప్రపంచమున ఉత్తర దిశయం దున్న యొక్కజననివాస స్థానమని చెప్పఁబడినది.

ఉత్తర అమెరికాకుఁ జెందిన చాల భాగము ఉత్తర ధృవ (Arctic ) భాగమునందు అట్లాంటిక్కు మహాసముద్ర మందున్న పెద్ద ద్వీపము. ౮,౨౩,౦౦౦ చతురపు మైళ్ల వైశాల్యముకలది. ఇందు ఎస్కిమో జాతి ప్రజలకు నివాసముగ నున్నది డెన్మార్కు దేశము క్రింద కొంతగను నార్వే దేశము క్రింద కొంతగను ఉన్నది.

**గ్రీసుదేశము** (గ్రీకుల దేశము) — ఐరోపాఖండము నందున్న ఒకచిన్నదేశము. దీని కుత్తరమున టర్కీ (తురుష్క) దేశము, తూర్పున ఈజియన్సీ (ఆర్కిపిలెగో సముద్రము), దక్షిణ వైపుల మధ్యధరా సముద్రమును ఎల్లలు. గ్రీక్కులనిన భరతదేశమునకుం గ్రొత్తకాదు. సుప్రసిద్ధుండగు అలగ్జాండరు ది గ్రేటు గ్రీసుదేశస్థుఁడే. మేసిడోనియాయని చెప్పఁబడిన దీదేశమే. ఇది పూర్వౌన్నత్యముం గోల్పోయి ఇప్పుడొక చిన్న దేశమై యున్నది ఇప్పుడు మూడుభాగములుగ నున్నవి ౧ హెల్లాస్ దీనిని Continental Greece , ౨. మోరియా దీనిని Peninsular Greece అనెదరు, 3. ద్వీపములు ఇవి గ్రీసు పరిపాలనకు నైక్యమై యున్నవే. అందులోనివే మైయున్నవి.

తొల్లింటి గ్రీసుయొక్క దక్షిణభాగ మిప్పుడు గ్రీసనంబడుచున్నది. తక్కినవన్నియు బాల్కను స్టేట్సు. టర్కీ మొదలగునవన్నియు వేరైపోయినవి ఇది ఇటీవల కొంతకాలము టర్కీ క్రిందనుండి తిరుగ స్వతంత్ర దేశమైనది. సాలే, ఎపిరసులోని భాగమును క్రీ వె. ౧౮౮౧ లో టర్కీనుండి దీనికిఁగలసినవి

ద్వీపకల్పమగు మోరియా ప్రాకృతీగ ఆకు అని యర్థము. దానిఆకారముగనుంట నాపేరుగల్గెనట. దాని కదివరకు పెలోపొనిసస్సని పేరుండెనట. అనగా పెలోప్సు ద్వీపకల్పమని గ్రీకుభాషార్థము. గ్రీకుదేశమునకుం జెందిన ముఖ్యములగు ద్వీపములు- ౧. నెగ్రోపొంటు ద్వీపము- దీనికిం దొల్లింట ఇయూబోయియా యని పేరుండెను. ౨. సైక్లాడీసు ద్వీపము- ఇది యీగియన్సము ద్రమునందున్నది. 3. ఇయోనియా ద్వీపములు ఇవి యన్నియుంగలసి విలాదు గ్రీస్ అనంబడు చున్నవి.

ఇందు డిలోసుద్వీపము, ఆంద్రోసుద్వీపము, నాక్సోసుద్వీపమును పెద్దద్వీపములు. తక్కినవి చిన్నవియై వీటిచుట్టియుంట చే Cyclades అని పేరయ్యెనట. గ్రీసు, నానావిధములుగనున్న పర్వతమయదేశము. మధ్యనున్న లోయలు చాల సుందరవంతములు. సముద్రతీరములు ఓడలు రాదగిన లోతుగలవి. తీరమున సమీపమునుండియు చిన్న ద్వీపములుకలవి. సముద్రములందు స్పాంజి విశేషముగగలవు. దేశవైశాల్యము ౨౫,౦౦౦ చతురపు మైళ్లుండునని అంచనా వేయబడినది.

ఉత్తరపువైపు సరిహద్దుల నెన్మిదివేల అడుగుల ఎత్తుగల్గిన పర్వతపజ్త్కిలకు అదిఒక్కలోయ గుండాతప్ప దాటిరాశక్యముకాదు. ఆలోయకు Pass of Thermopylae అనిపేరు. అది ఏబదియడుగుల వెడల్పుకలది. మరియు నుత్తరదిశయందే పర్నాసస్పర్వతములు, హెలికాన్ పర్వతములు తొల్లింటికాలపు గ్రీకుల దైవముల నివాసములుగ నెంచంబడుచుండినవి. వర్షాకాలము నందుదప్ప దక్కినకాలములందు ఆకాశము స్వచ్ఛమై యుండుటయు, సమశీతలమై ఆరోగ్యవంతముగ నుండుటయు, గ్రీకు పేరందినదేశము. గోధుమలు, ధాన్యములు, ద్రాక్షలు, ఓలివ్ తోటలు, కర్రెంట్సు (గింజలేని చిన్ననల్లద్రాక్ష) విస్తారము సేద్యమగుచున్నది. తేనె విస్తారము దొరకుచున్నది గోగ్రాసప్రదేశము లధికముగాఁ గలవు. పట్టునేతపని కొంతివఱకుంగలదు. అట్టికాలోని హైమటస్సుపర్వతమున, తేనెపట్లు విస్తారము లభించుచున్నవి. మైనమును అధికముగనే లభించెడిని. అరణ్యములును విస్తారముగనే కలవు. గ్రీకులు వాణిజ్యమందు, ఓడలునడపుటయందు చాల నిపుణతగలవారు. ఎక్కువమంది విద్యాధికులు, గ్రీకుచర్చి క్రైస్తవమతస్థులు, క్రీ. ము. ౨౦౦ సంవత్సరముల నాఁటినుండి గ్రీకులువిగ్రహచిత్రమునను, గృహనిర్మాణ విద్యయందునను కడుఁగడు నిపుణులని వారినాఁటిపనులనుండి మన మెఱుఁగుచున్నాము. ఆకాలముననే నాగరికతం గల్గిన విద్యావంతులైయుండిరి. బలాఢ్యులైయుండిన పారశీకుల నెదిర్చి తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యములకై పోరాడినశూరులు. క్రీ. ము. ౧౪౬ లో గ్రీసుదేశము రోమనులచే నాక్రమింపఁబడియెను. క్రీ. శె. ౧౫౦౦ ప్రాంతమున టర్కీవారిచే నాక్రమింపంబడియెను. ౧౮౨౧ లో తిరుగబడి ౧౮౨౯ వఱకు కలహాలములలో నుండిరి. అప్పుడు టర్కీ గ్రీసును వదలివేయవలసివచ్చెను. ౧౮౩౨ బవేరియా రాకొమరుండగు ఓతోయనువారిని రాజుగ నెన్నుకొని భూపతిఁజేసికొనిరి కాని ౧౮౬౨ లో అతనిని వెడలనంపివైచిరి. ౧౮౬౩ లో డేనిషు రాకొమరుఁడగు ౧ వ జార్జిని భూపతిఁజేసికొనిరి. పిదప నాయనతోటిని కుదరక వెడలఁజేసి ప్రజాప్రభుత్వమునుఏర్పఱచుకొనియున్నారు. దేశమున గ్రీకులేగాక ఆల్బేనియనులు, రోమను సంతతి వారుంగూడగలరు. ఆల్బేనియనులు సైనికులుగ నున్నారు. కర్రెంట్సు ఇంచుమించు ప్రపంచము నందన్ని దేశములవారును కొనుచుందు రపురూపపు జాతిపండ్లు ఇచటి ఆలివునూనెయు సుప్రసిద్ధ పదార్థమే.

ఆతెన్సుపట్టణము- దేశమున ముఖ్యపట్టణము. ఇది ఈగినాసంయుక్తాగ్రగుడతీరము. వీరిపూర్వుల దేవతయగు అతీనాదేవి పేరిడఁబడినపురము. ఈ దేవతనే రోమనులు మినర్వాదేవియని పూజించుచుండువారు. ఆతెన్సుపురముపాడై పూర్వపు పట్టణమును అభివృద్ధిలక్షణములతో నిప్పటి పట్టణమును గాననగుచున్నవి. పురాతననగరమున గొప్పభవనములు పాడైనవి కానవచ్చెడిని. అక్కాలమున నందు సోక్రటీసు, ప్లాటో, అరిస్టాటిల్ మొదలగు తత్వవేత్తలు

పెక్కండ్రీనగరముననే యుండినవారు. డెమస్థనీసు మొదలగు మహావక్తలిట నుండినవారు. ఫిడియాస్ మొదలగు సుప్రసిద్ధవిగ్రహచిత్రకారులిట నుండినవారు పైరేయస్పురము ఆతెన్సుయొక్క రేవుపట్టణము ఇది ఏడుమైళ్ళ దూరము. ఇప్పు డినుపబాట కలదు. లరిస్సాపురము థెస్సలీయందు ప్రధానపురము. కోరింతుపురము చాల గొప్పదశ ననుభవించినపురముగాని ఇప్పుడు తగ్గియున్నది కోరింతుసంయుక్తాగ్రగుడతీరమున నున్న పెట్రాపట్టణము కర్రెంట్సువర్తకము ఎక్కువతి విస్తారముగాగల రేవు నాప్లియాపట్టణ మొకప్పుడు గ్రీసుకు రాజధానిగనుండిన పురము. ఆర్గోస్పురము గ్రీసుదేశమున కడు పురాతన పట్టణము. స్పార్టాపురము తొల్లింట సుప్రసిద్ధపురమై యుండెడిది దానికి లెసిలోమానను వాడు కవే రుండెను. ఆకాలపు ఆదినృపతులలో లైకర్గస్ అను భూపతి సుప్రసిద్ధుండనియు, ధర్మశాస్త్రము నొసంగినవాఁడనియు, జెప్పఁబడినది. నవారినోపురము మధ్యధరాసముద్రతీరపు రేవు పట్టణము. ఇటనే ఆంగ్ల పరాసు రష్యను సంయుక్తనావికాదళము టర్కీనావికాసైన్యముల నాశనమొనర్చి క్రీ. వె. ౧౮౨౭ లో గ్రీసుదేశమునకు పునఃస్వాతంత్ర్య మిప్పించినవని చెప్పఁబడినది. సైరాపట్టణము కొంత వర్తకముఁగల రేవుపట్టణము.

ఇయోనియన్ ద్వీపములు గ్రీసుదేశమునకుం జెందినవి. (చూడుఁడు ) నైలోనికాసంయుక్తాగ్రగుడమునకు పశ్చిమముగానున్న ఆలింఫసు పర్వతములు తొల్లింటి గ్రీకుల దేవనివాసస్థానముగా తలంపంబడినవి. (ఆలింఫసుపర్వతము చూడుఁడు; పార్తినార్ దేవళము చూడుఁడు.)

---

**గుంటకలగర చెట్టు**- లా. Eclipta prostrata, Eclipta erecta, Verbesina calendulacea. సం. భృంగః, భృంగరజః, భృంగరా, భృంగరాజః, కేశరంగః, కేశరంజనః, కేశరాజః, కుంతలవర్ధనః అని పేర్లుకలవు. ఇది నూనెయందు మరిగించి చేసినతైలము, సమస్త శిరస్సునందలి దోషములనడంచి తలనొప్పి నివారించి, శిరస్సునకుఁ జలవచేసి, తలవెండ్రుకలం బెంచి, కురుళ్ళను గట్టిపరచును పసరు చెవిలోని కురుపుల మానఁజేయును. ఆకునందు రక్తము శుద్ధిఁజేయు గుణమును, నొప్పిమాన్పు నీరును పీల్చు గుణమును, దీని సమూల వృక్షమును నూరి నూనెంగల్పి పైకి వ్రాయుచుండిన బోదకాలు రోగము నివృత్తియగుననియు చెప్పఁబడినది.

గుంటకలగర సమూలకషాయము వేడిచేసి శరీరములోని మలమును వెడలించుననియు, ఉన్మాదము, పాండురోగము, దద్రు, దగ్గుజ్వరము, ఉబ్బుల నివారించుననియు, కండ్లకు చలవచేసి, తలవెండ్రుకలను కురుళ్ళయందు గట్టిపఱచి నలుపెక్కించుననియు చెప్పఁబడినది. వేరును ఉప్పుతో నూరి లోనికిచ్చిన మూత్రపు మంట తగ్గును. సమూలగసముతీసి కాళ్లు, చేతులు దానియందొకగంట కాలము (రెండున్నర ఘడియలు) యుంచిన శరీరమందలి పాదరస దోషము నివృత్తియగునని చెప్పఁబడినది. గుంటకలగర చిగుళ్లు, మిరియములు అనుదినము ఉదయమున లోనికిచ్చుటవలన అస్థిగత జ్వరములు మొదలగు సమస్త జ్వరములు నివృత్తియగుననియు, అక్కు-

రసము నోటిసపుట్టు నివారించుననియు, గుంటకలగర వేరు విరేచనము, వమనము గల్గించుంగాన జాగ్రతగ వాడవలయుననియు చెప్పఁబడినది.

**గుంటూరుజిల్లా** — ఆంధ్రదేశములోనిది. చెన్నపురిరాజధానికిఁ జేరియున్నది. గుంటూరు ప్రధానస్థానము, గొప్ప వర్తకస్థలము. వినుకొండ, నర్సారావుపేట, తెనాలి వర్తకస్థానములు. మాచర్ల పురాతనదేవాలయములుగల తావు. అమరావతి తొల్లింట నీప్రాంతదేశమునకు రాజధాని. మంగళగిరి సుప్రసిద్ధక్షేత్రము. వడ్లపూడి నారింజతోటలకు పేరందినది. చీరాల, వేటపాలెము వర్తక స్థానములు. బాపట్ల, వంగవోలు యితరపట్టణములు. వంగవోలు పసువులకు సుప్రసిద్ధము. కరవది గ్రామము పెద్దపసువులకు పేరందినది. కోటప్పకొండ శివక్షేత్రము. వెంకటగిరి పెద్ద జమీందారీస్థానము. పలనాటిసీమ ఈజిల్లాలోనిది. (పలనాటిసీమ చూడుఁడు.)

**గుండగకుల గోత్రము** — ఆర్యవైశ్యుల (౧౦౨) గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు).

గుండగకులగోత్రము- (గుండకుల లేక, గుండకకుల గోత్రము). తొల్లింటి సంస్కృతగోత్రము శార్జవస, శార్జవగణము, అపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాద్యప్రవరఖండ, కుబ్జేశుఁడు దేవత, కుముదాంబ భార్య, ఋష్యమూకము తపస్థానము, కూష్మాండసరస్సు తటాకము, జపము లక్ష, దీపములు ౨౦, క్షేత్ర సంఖ్య ౨౦, గుమ్మడికాయ దానము, గురుగుకూర, నిమ్మపండ్లు వర్జనీయము. (ఏకాన్షేయ ౭౮ గోత్రమిది).

**గుండ్లు తేలి బెండ్లు మునిఁగినట్లు చెప్పేవాఁడు** — (అసృతవాది లేక మాయకబుర్లు చెప్పి వాదించేవానిఁగూర్చి చెప్పే సామెత) ఆంధ్రలోకోక్తి.

**గుంభీభా** — దశావతారే చూడుఁడు.

**గుగ్గిలము** — గుగ్గిలము, గుగ్గిలపుచెట్టుయొక్క జిగురు. ఇవి అడవిచెట్టులు. గొప్ప మ్రానులగును. దూలములకు, వాసములకు గుగ్గిలముకఱ్ఱ చాల గట్టిగ నుండును. గుగ్గిలపు కఱ్ఱ బల్లలు, పెట్టెలు, భోషాణములు, బెంచీలు మొదలగు పనుల కుపయోగించును. ఇది చాల పొడవు, వలముగ పెరిగెడి చెట్టుగాన గుగ్గిలపు కలపకు మంచి విలువకలదు. గుగ్గిలపుచెట్టు బంకకు గుగ్గిలమని పేరు.

బైబిలునందు Book of Genesis లో గుగ్గిలపుకఱ్ఱనుగూర్చి ప్రశంస కలదు. భరతదేశమున గుగ్గిలమునకు దేవధూపః, గుగ్గులు అని పేర్లు సంస్కృతమున నుండఁబట్టి ఇది ఎంతసనాతన కాలముల నెఱుఁగబడినదో తెలియఁగలదు. ఈ చెట్లు మనదేశమున నడవులందు గానఁగును. ఆఫ్రికాఖండపు అడవులందుకూడ కలవని తెలియఁగలదు.

గుగ్గిలమున కాంగ్లమున Bdellium అనియందురు. కాల్చిన ఒకవిధమగు పరిమళముగల్గి ఇంచుక పైత్యము నుద్రేకించునది. శివాచార్యులు శివాలువేయు దాసురాండ్రు గుగ్గిలపుపొగ వేసికొని పైత్యోద్రేకముం గల్గించుకొందురు. గ్రామదేవతలకు గుగ్గిలపుధూపము (పొగ) చాల ప్రీతిగ నెంచుదురు. మశూచికము వేపపువ్వు మొదలగు రోగములు సంభవించినతఱి దానివ్యాపకము నాపుటకు గుగ్గిలపుపొగను రోగికి వైచెదరు. ఇందువలన నంటురోగములు వ్యాపింపకుండ నిరోధించి యాపు శక్తి గుగ్గిలమునందు కలదని యెఱుఁగునది.

గుగ్గిలమునందు ఎఱ్ఱజాతి, తెల్లజాతి, పచ్చ జాతి మూఁడుభేదములు కలవుగాని అన్నిటిగుణ లక్షణము లొకటియేయైయుంట పాటింపఁబడు టయే లేదు. గుగ్గిలమును లోనికిచ్చిన మల మూత్రముల వెడలించుచు చెడురక్తమును శుభ్ర పఱచుననియు, దీనిపొగ పీల్చిన మూలవ్యాధి నయమగుననియు, తేలుకుట్టినచోట దీని నరగ దీసి పట్టించిన బాధ నివారణమగుననియు, దెబ్బ తగిలినచోట పట్టువైచిన వాపులు హరించు ననియు, అచటి దుష్టరక్తమును బాగుచేయు ననియు, స్త్రీలకు ఋతురక్తదోషము వాపి చక్కఁగ వెడలఁజేయు ననియు, నొప్పులు బడు చుండుతఱి శీఘ్రప్రసవము గావించుననియు, ముఖ్యముగ స్త్రీపురుషుల కీళ్ళనొప్పులపై పట్టు వైచిన వాటిబాధ నిర్మూలించుననియు జెప్పఁ బడినది. గుగ్గిలమునకు జాపత్రి విరుగుడు.

**గుగ్కులిగోత్రము**— కుండిన గణము చూడుఁడు.

**గుజరాతు జిల్లా** — గుజరాత్పురము ప్రధాన స్థానము. (పంజాబుదేశము చూడుఁడు).

**గుజరాతు స్టేట్సు** (సంస్థానములు)— ఇవి బరోడా యందున్న బ్రిటీషు ఇండియా పొలిటికల్ ఏజంటుగారి పరిశీలనయందున్నవి. ఇందు రాజపిప్పల, కాంబే, ధరమ్పూరు సంస్థానములు ముఖ్యములు. తక్కినవి చిన్నవి. కొన్ని పరిపాల నాధికారములలో కొన్నిటిని మాత్రమే గల్గియున్న విగ నున్నవి.

**గుజరాతు పట్టణము** — ఇది పైకి స్ఫురించునటుల గూర్జరదేశసంబంధపురముకాదు. పాంచాల దేశములోనిది. లాహోరు నగరము నకు ఉత్తరమున డెబ్బదియొక మైళ్లదూరమునను వజీరాబాదు నుండి తొమ్మిది మైళ్ల దూరమునను చీనాబు నది పశ్చిమ తీరమున నున్న పట్టణము. ఇందు ఏబది రెండు హిందూ దేవాలయములు, ౭౯ మశీదులు, ౧౧ శిక్కు ధర్మశాలలు కల పట్టణము. జిల్లాయందు ప్రధానస్థలము, వర్తక స్థలము. కాశ్మీరమునుండి పండ్లవర్తక మీ పట్టణముగుండా నడచును. బట్టల వర్తకమధికము. పుష్మీనా యనంబడు నూలుబట్టయు, ఇత్తడి సామానులు, కత్తులు, గుఱ్ఱపు జీనులు మొద లగునవి ఇట చేయఁబడు చుండును. కుండెలు, కఱ్ఱసామానులు కొంతవఱకిట పేరుగాంచినవి.

ఇచట చూడదగిన వింత పాదాలా యనం బడిన మహమ్మదీయ మహాత్ముని గోరీ. ఈయన ఔరంగజేబు పరిపాలనయందిచటికిఁ జేరి నివాసము కుదిరెనట. సంతానార్థులగు స్త్రీలా మహాత్ముని దర్శించి సంతానముఁ బడయుచుండిరట. నేటికి నాయన గోరీ నట్లే దర్శించు చుందురు. మ్రొక్కుకున్న రీతిని మ్రొక్కు చెల్లింపని వార లకు తర్వాత గల్గెడి సంతానము మెడపొడుగు, చిన్నబుఱ్ఱ, పెద్దచెవులు, చుంచుపోల్కి స్ఫురించు ముఖలక్షణములుం గల్గి పిచ్చివారుగ జన్మింతురట.

ఆశ్చర్యకరముగ నట్టివారనేకులు నా తావున గానఁగుదురు. వీరి పోషణకై పట్టణవాసులు భయభక్తులతో చందాలనొసంగి ధర్మమొనర్తురు. లేకున్న తమకును అట్టి సంతానము గల్గునని వెఱపుఁజెందెదరు. వారిని 'పాదాలాకాచుహా' అని పిలచెదరు. అచటి మశీదు పాదాలా మహాత్ముఁడె కట్టించెనట. దానశీలుఁడట. అడవి మృగము లామహాత్మునికి స్వాధీనమై చనువున నాయనకడ మెలంగెడివట.

అచటనే ఆయన సంతతి వారగు పీరు వసించు నివాసము కలదు. ఆయన కడ దీని సంబంధ మగు కొన్ని కాగితములు, బొమ్మలు కలవు.

పాదాలాకాచుహా లకు లోకజ్ఞానము, జాగ్రతవ్యక్తి, బుద్ధికుశలత చాల తక్కువగా నుండును.

ఇది పంజాబు నందంతటను ప్రసిద్ధిగ పేరందిన దేవస్థానము.

**గుజరాల్వాలా జిల్లా** — గుజరాల్వాలాపురము ప్రధానస్థానము. (పంజాబుదేశము చూడుడు).

**గుడజిహ్వికాన్యాయము**- నాల్కపై బెల్లము వ్రాసికొనుటమూలమున అరుచి పదార్థము మ్రింగగల్గుటయని భావము.

**గుడశ్లేష్మన్యాయము** — బెల్లము కఫమును వృద్ధిపఱచును. కఫరోగికి బెల్లమిచ్చి వృద్ధియైనకఫమును వెడలజేయుదురని చెప్పఁబడినది. కాని ఇది ఎంతనిజమో లేక దీనికి వేరుపయోగము కలదో తెలియదు. ఈ న్యాయము వాడుకయందు తఱచు గానంబడదు.

**గుడారు వెంకటదాసుకవి** – ఆంధ్ర కవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. బలిజకులస్థుఁడు. పైడిపాలగోత్రము. తండ్రి పేరు గురవేంద్రుఁడు. తల్లి రంగమాంబ. రచించినది "ప్రబంధరాజశిరోభూషణ ప్రకృష్టబలరామ చరిత్ర" యను ప్రబంధము. దీనిని సాధారణముగ బలరామచరిత్ర యనుచున్నారు. చాల ప్రౌఢ కావ్యము.

**గుడిపాటి కోదండపతికవి** – ఆంధ్ర కవులలో నాధునికులందుపరిగణింపఁబడినవాఁడు. నందవరీక నియోగిబ్రాహ్మణుఁడని చెప్పఁబడినది. (నందవరీక బ్రాహ్మణులు చూడుఁడు). ఆశ్వలాయనసూత్రము, భారద్వాజసగోత్రము. తండ్రి పేరు రంగయ్య. తల్లిపేరు వీరమాంబ. తాత పేరు వేంకటమంత్రి. రచించినది శృంగార రస మంజరి యనుపేరున రసమంజరిని మూడు గుచ్ఛములుగ పద్యకావ్య మొనర్చెను. ఈ రసమంజరి భానుమిశ్రవిరచితమని తోఁచుచున్నది.

**గుడ్ బై** (Good bye) — "శలవు" గైకొనుచు వెడలిపోవుతరి సమానులనుకొను ఉక్తి. God be with you అను మాటలసంక్షిప్తరూపము. Good old times- ఆంధ్రమున "గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్" అను సూక్తికి సమానోక్తి ప్రశాంతములగు నైకమత్యపు దినములని భావము. (Golden age చూడుఁడు).

**గుణకారము** — గుణించుట లేక హెచ్చించుట. చతుర్విధ గణితములలో నొకటి. (గణితములు చూడుఁడు).

**గుణదోష న్యాయము** — గుణము దోషము, ఒకేపుట్టుక గలవి. అన్యోన్యవైరము లక్షణముగాగల్గి ఒకటితోనొకటి యెప్పుడు కలియఁదగినవిగాక వేఱైయుండునవి. ఎప్పటికిని కలియనివని భావము.

**గుణమతీ** (విహారము) — బీహార దేశమున గయజిల్లా జహానాబాద్ డివిషనులో దర్వాత్ అను తావునగల కున్వాకొండపై నున్నది. ఇటగల భైరవవిగ్రహము పండ్రెండు చేతులు గలదానిని బౌద్ధుల అవలోకితేశ్వర విగ్రహముగ బోల్చెదరు. దీనిని హ్యూయనత్సాంగు దర్శించెనట.

**గుణములు**- గుణములు (త్రిగుణములు) 3 :- ౧. సత్వగుణము- ఉత్తమము, మాయా సంబంధము, దైవసంబంధము, పరమేశ్వర సంబంధముగల చిత్తవృత్తిచే ప్రశాంతము గల్గుట. ౨. రజోగుణము- మధ్యమము, అవిద్యా సంబంధము, మానవసంబంధము, ఐహికఐశ్వర్య ఆధిక్యత అధికారములచే రాజసము (రాయసము) గల్గియుండుట. 3. తామసగుణము- లేక తమోగుణము (చీకటియందుండు గుణమని యర్థము). అధమము, ఆవరణశక్తిసంబంధము, అసురలక్షణమన చెప్పఁబడినది. దురహంభావము, ముక్కోపము,

ఈర్ష్య, మూర్ఖత మున్నగు వాటి ప్రేరేపణ నుండి మనస్సు తప్పించుకొనలేక పరవశమగుట, వికారముం జెందిన యవస్థ.

చతుర్వింశతి గుణములు- ౧. రూపము, ౨. రసము, ౩ గంధము, ౪ స్పర్శము, ౫ సంఖ్య, ౬. పరిమాణము, ౭. పృథక్త్వము (వేఱుగానుండుట), ౮. సంయోగము, ౯. విభాగము, ౧౦ పరత్వము, ౧౧. అపరత్వము, ౧౨. గురుత్వము (బరువుగానుండుట), ౧౩. ద్రవత్వము, ౧౪. స్నేహము (కలియుగల్గియుండుట), ౧౫ శబ్దము, ౧౬. బుద్ధి, ౧౭. సుఖము, ౧౮. దుఃఖము, ౧౯ ఇచ్ఛ, ౨౦ ద్వేషము (విరోధము కలియకయుండుట), ౨౧. ప్రయత్నము, ౨౨ ధర్మము ౨౩ అధర్మము, ౨౪ సంస్కారము-వీటికి చతుర్వింశతి గుణములని పేరు.

**గుణశైవము** — ఇది చతుర్దశ శైవభేద మతములలో నొకటిగఁ జెప్పఁబడినది. (మాయిదు). ఈ మతమున త్రిపదార్థములు, మలత్రయము శివసమవాది శైవమునందువలెనే యుండెను ఈమతమున పతియగు శివుని అష్టమంగళగుణములను పశువు తన అష్టగుణముల చేత నలవడఁజేసికొనవలయుననియు, దానివలన ముక్తిగల్గుననియు, ఇదియే మోక్షమార్గమనియు నందురు.

**గుడ్సు అండు ఛాటిల్సు**— (వాణిజ్య సంబంధ పరిభాషాపదము). Goods and Chattels- చరాస్తులు, డిక్రీలు, అప్పులిచ్చిన పత్రములు, బాంకినోట్లు, గవర్నమెంటు నోట్లు, పత్రములు, డిక్రీలు మొదలగు చరరూపకములగు విలువఆస్తుల కీపేరు వాడెదరు.

**గుణాస్సర్వత్రపూజ్యన్తే** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. ఎట్టివానియైనను గుణములుండుకతన పూజ్యుఁడగునని భావము.

**గుణుపూడి జంగాలు, తణుకు దాసరులు** — ఇది యొక సామెతగా పరిణమించినది. అధికాలోచనలను నెరపుచు క్రియాచరణమునకు నిలువజాలనివారిం గూర్చి హేళనగ "గుణుపూడి జంగాలు, తణుకుదాసర్లు" నని యనుచుందురు. గుణుపూడి కృష్ణామండలమున గుడివాడనుండియు, పశ్చిమగోదావరీమండలమున నిడదవోలునుండి ఇనుపబాట సంబంధముగల్గి భీమవర మనంబడుచున్న తాలూకా గ్రామముకడ నున్న గ్రామము. ఇట జంగముకుటుంబములు కొన్నిగలవు. సోమసుందర శివలింగ మిటకలదు. వీరనుదినము గంటలు చేతంబూని గ్రామములకరగుచు భిక్షమునైకొను వృత్తిగలవారు. సాయంకాలమందరు గుణుపూడికిం జేరుకొని వారికిం దోచిన సర్వవిషయములంగూర్చి గొప్పగొప్ప యోచనలం జేయుచుందురేగాని క్రియాచరణమొంచుకంతయైనను లేనివారుగ నుండిరట. ఇంక తణుకు, నిడదవోలు ఇనుపబాటల సంధినుండియె యేగఁదగినది. తాలూకాగ్రామము. ఇటఁగొందఱు దాసరికులజులిట్టివారేయుండిరట. కాన నీసామెత కిటుల నుత్పత్తిగలిగి వ్యాపించెనందురు.

**గుడ్విల్** (Good will)- వాణిజ్యసంబంధ పరిభాషాపదము. అదివఱకే పేరుప్రతిష్ఠలను, పరపతిని సంపాదించిన ఒక సంస్థయొక్క స్వకీయ (Real) ము, లోకీయము (Inherent) నగు విలువ (ధనసంబంధముగాక, వ్యాపారనమ్మకమని యర్థము.)

**గుడ్డిఎద్దు జొన్నచేలోపడ్డినట్లు**- ఆంధ్రలోకోక్తి.

**గుడ్డికన్ను కంటె మెల్ల కన్ను మేలు** — ఆంధ్రలోకోక్తి.

**గుడ్డికన్ను తెరచినా మూసినా ఒక్కటే** — ఆంధ్రలోకోక్తి.

**గుడ్డిగుఱ్ఱానికి పండ్లు తోమినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**గుడ్డివానికి కుందనపు చాయ ఏమి తెలుసును ?** — ఆంధ్రలోకోక్తి.

**గుదకీలః (లేక) గుదాంకురః** — ఈ రెండుపేర్లు ఆయుర్వేద వైద్యశాస్త్రమున మూలశంఖ రోగమునకుం బేరులు.

**గుదకుందః** — కేవలము పసిబాలురకు ముడ్డిక్రిందను చుట్టుపట్లను ఎఱ్ఱగబరిసెడి ఒరుపున కాయుర్వేదవైద్యశాస్త్రమున గుదకుందమని పేరు.

**గుప్తగ్రహణములు** — అశ్లేషను చూడుఁడు, గ్రహణములు చూడుఁడు.

**గుప్తవంశనృపతులు** — వీరు పాలించినది ముఖ్యముగ మగధదేశము. వీరియందు సముద్రగుప్త మహారాజు చక్రవర్తియై అనేక రాజ్యముల నేలినవాఁడు. ఈతఁడు రాజధానిని పాటలీపుత్రమునుండి అయోధ్యకు మార్చెను. సముద్రగుప్తునకు దత్తాదేవి యను పేరుగల భార్యవలన రెండవచంద్రగుప్తుఁడుకల్గెను. ఈతఁడు విక్రమాదిత్యుఁడని పేరిడికొనియెను (అది క్రీ.వె. 3౭౫). అనూపదేశ (చేదిదేశ) మంతకో కొంతకో గాని దాహాలదేశమని పేరుండెనట. అద్దానిని కాలాంజరపురము రాజధానిగ గుప్తులేలిరట. క్రివి లేక అరాటదేశమును (పాంచాల భాగములను) క్రీ. వె. 3౭౬ లో కుషాను రాజులంజయించి రాజ్యమాక్రమించిరట. చంద్రగుప్తుని తండ్రి సముద్రగుప్తునిపాలన క్రీ. వె 3౨౬-3౭౫ అని తెలియుచున్నది. వీరు పెక్కండ్రు గలరు. కడపటి గుప్తవంశపు ప్రభువు కుమారగుప్తుఁడనియు, క్రీ. వె. ౫3౦ మొదలు ౫౫౦ వరకు పాలించి శత్రువులెవరో కాన పోరి, యోడి రాజ్యమప్పగించి తాను తక్కినకాలమును బౌద్ధభిక్షుకుఁడుగ శ్రవస్తియందుఁ గడపెనని చెప్పఁబడినది. (క్రివి లేక అరాటదేశము, మగధదేశము, మహారాష్ట్రదేశము, కుంతలదేశము చూడుఁడు).

**గుప్తాసనము** — యోగశాస్త్రమున చెప్పఁబడిన యోగాసనములలో నొకటి. ఇది సిద్ధాసనమునకు సంబంధించిన అవాంతరభేదాసనము. ఎడమకాలిమడమ లింగస్థానముపైనుంచి దానిపైని కుడికాలి మడమనుంచి తక్కినవన్నియు సిద్ధాసనమువలెనే. (సిద్ధాసనము చూడుఁడు).

**గుమ్మడిచెట్టు** — లా Gmelina arborea, Gmelina parviflora సం. కాశ్మరీ, కాశ్మీరీ, సర్వతోభద్రా, సర్వతోభద్రికా. కొందఱు గంభారీ యనియువాడిరి. దీనియాకులం జతుకగొట్టి నీటవైచిన నవి గట్టిపడునందురు. అవి నిక్కాకలను, సెగరోగమును, దారుణమేహమును నివారించునందురు. గుమ్మడికఱ్ఱ చెక్కడపుపని కుపయోగించు కలపగ వాడఁబడుచున్నది. గుమ్మడివేరు, ఆకులరసము చూర్ణము కషాయము నందు చలవజేసి రసదోషములనడంచి గాయములను మాన్పుగుణము కలదనియు, మూత్రనిరోధము సడల్చుననియు, జ్వరతాపము, రక్తపైత్యము, క్షయరోగములపై చక్కగ పనిచేయుననియుం జెప్పఁబడినది.

**గుమ్మడి పాదు** — గుమ్మడిపాదు కాచెడి కాయలు గుమ్మడికాయలు భోజన పదార్థము. ఇందు ప్రధాన భేదములు తీయగుమ్మడియు బూడిద గుమ్మడియునై యున్నవి. బూడిద గుమ్మడికాయను పుల్లగుమ్మడి కాయయని కొన్ని తావులందు వాడుచున్నారు గాని, అందు పులుపు గాని, పాదునందు పుల్లలు విరుగుటగాని గానరాదు. ఈ రెండును భోజన పదార్థములుగ వాడు

చుందురు. కాని బూడిదగుమ్మడి పాదుపెట్టి మొలపించరాదని యొక ప్రవాదము గలదు. కాన దానిగింజల నొకపెంటపైఁ బారవైచి వాటంతనవి మొలచినపై నామొక్కలం దెచ్చి పాదునందు పాతుచుందురు. మఱియు బూడిద గుమ్మడికాయ లధికముగఁ గాచినచో నాకుటుంబమునకుఁ గీడు వాటిల్లుననియు, తీయగుమ్మడి అధికముగగాచిన తేరి మేలుకల్గుననియు నొక నమ్మకము వ్యాపించి యున్నది. బూడిదగుమ్మడి కాయలు ముదిరిన కొలఁది దాని యాకుపచ్చకేసముపై తెల్లని బూడిదవంటి రజనుగాటి అభివృద్ధి నందుంగాన దాని కీపేరు గల్గెను.

ఇంక తీయగుమ్మడి యందనేక భేదములు గానవచ్చెడిని. అందు కొట్టుగుమ్మడి, సూర్య గుమ్మడి, కోలగుమ్మడి (కాయ కోలగనుండును), అక్షయపాత్ర గుమ్మడి (కాయ చాత్తాద శ్రీవైష్ణవుల [సాతానుల] రాగి యక్షయపాత్రం బోలి యుండు కాయ), మచ్చల గుమ్మడికాయ మొదలగునవియై యున్నవి. ఇందు సూర్యగుమ్మడి కాయ యక్షయపాత్రం బోలి చిన్నదిగ నుండి రుచి చిక్కుటముగ గలది. గింజలుచుచిన్నవిగనే యుండును. కొట్టుగుమ్మడి కాయయు చిన్నదియె. గుమ్మడికాయజాతి యంతయు ఒకేజాతియని ఏర్పడెడిని. గుమ్మడికాయలు భూసారము, కాల మానస్థితి, వర్షములుపై నాధారపడి పెద్దకాయలనో, చిన్నకాయలనో గాచును వీనిని పైకెగ ప్రాకనిచ్చిన చక్కగ పెరిగికాచును.

గుమ్మడిజాతి కాయలు ముదరకమునుపు విష తుల్యమగు అపథ్యకారిగను, ముడిచతేరి దోష రహితముగను చెప్పబడినవి. వైద్యులు తీయ గుమ్మడిపండును లేహ్యా మొనర్తురు. తీయగుమ్మడి పండ్లయుదెట్టని రంగుగలదానిని శ్రేష్ఠముగ నెంతురు. మఱియు సూర్యగుమ్మడి కాయల నెత్తి గుమ్మడికాయలని వాడుటయుం గలదు. మత్స్యములందు గుమ్మడి కాయలను ఉడికించి యాహారముగ నుపయోగింతురు. గుమ్మడి కాయలలోని గింజలలోని పలుకులు రుచికరములు గాన పలు కార్యముల కుపయోగించు చుందురు.

తీయగుమ్మడి కాయ- లా. Cucurbita pepo maxima, Benincasa cerifera ఆంగ్ల. Pumpkin, Squash Gourd. సం. కూష్మాండమ్, కూశ్మాండమ్. అఱవమునకల్యాణ పూసిని

గుమ్మడిపండు రుచికరమగు శాకమై దేహ పుష్టి, బలము, మేహశాంతి గల్గించి ధాతువునకు బలమొసంగి మలమూత్రముల వెడలించును. కడుపుబ్బరము, తాపము, దాహము, పైత్యోద్రేకము, మూలశంకల నడంచి వాతమును రేపి, యధికమగుతేరి సుష్టరక్తము గల్గించుననియు, లేతకాయ వాతప్రకోపము గల్గించి, అగ్నిమాంద్యమును రక్తపైత్యములను బుట్టించుననియు మిగుల యపథ్యమై దుర్బల దేహులకు, రోగులకు తినరాదనియుఁ జెప్పఁబడినది. దీనికి శొంఠి, కానుగ వేరు లేక కానుగవిత్తుల రసములను పొంగించి చేసిన కషాయము విరుగుడులని చెప్పుదురు. గుమ్మడి పువ్వులను కొందఱు భోజనపదార్థముగ నుపయోగింతురనియు, లేతయాకులు, కాడలం గూడ నట్లె యుపయోగింతురనియు దెలిసెడిని. ఇవికొంత పథ్యమందురు.

బూడిద (పుల్ల) గుమ్మడికాయ- లా. Beninkasa cerifera, ఆంగ్ల. Ash coloured melon gourd. సం. కుష్మాండః, కుష్మాండకః, కుష్మాండీ, కర్కారుః, కర్కోటికా, పుష్పఫలః, పుష్పఫలీ.

దీని కాయరసము (నీరు) తలకు రాసిన శిరస్సునందలి వేడి, వేసవిగాడ్పుల వడబాధయు

నివారించును. పట్టుబట్టల నిండునానించిన దాని మరకలు, మాలిన్యమును వదలించి శుభ్రపరచును. ముదురు కాయలోని గుంజు చలువజేసి మంచి రక్తమును శరీరమున గల్గించును. మేహాకారకము నశించును. పొత్తికడుపును శుభ్రపఱచును. మూత్రకోశము నందలి జబ్బుల నివారించి మూత్రము వెడలించును. క్రిమి ప్రమేహము, క్షయలనడంచి శరీరమున జీర్ణించిన (పాద) రస దోషము హరించును. ఇంచుక అగ్నిమాంద్యము గల్గించును. లేతకాయ వాతప్రకోపము గల్గించును. అపథ్యమై యుండును. దీనికి విరుగుడులు పుదీనా, జీలకర్ర, లవంగాలు అని చెప్పఁబడినవి గింజలు అజీర్తింగల్గించును. బూడిద గుమ్మడి కాయతో చేసిన వడియములు వేడి, పైత్యము జేయును. దీనికి విరుగుడు ఉప్పుగల్పిన తరవాణి నీళ్లు.

**గుమ్మడి రేగు చెట్టు (కట్ఫలవృక్షము) కాయఫలచెక్క చెట్టు** — సం. కట్ఫలమ్, భద్రా, సోమవల్కలమ్, సోమవల్కలః, సోమ వృక్షః. దీని చెక్కను కాయఫలచెక్కయనియు గూడ వాడుచున్నారు చెక్క చూర్ణము లేక రసము లేక కషాయము ఆమశూల, ఉబ్బు రోగము, కఫవాతము, గ్రహణి, గుల్మరోగము, పాండువు, మేహము, విషమజ్వరములు ఈరోగములపైఁ జక్కగ పనిజేసి నివారించునని చెప్పఁబడినది.

**గుయానా దేశము** (Guiana) — ఇది దక్షిణ అమెరికా యందున్న దేశము. ఉత్తరమున అట్లాంటిక్కు మహాసముద్రము, దక్షిణమున బ్రెజిల్ దేశము, వాయవ్యదిశను వెనిజులా దేశమును ఎల్లలు. ఇది ౧,౮౦,౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యము గలది. దక్షిణ అమెరికాయందు ఐరోపా ప్రభుత్వములకుం జెందిన దేశమిదియొకటియె. ఇది మూఁడుభాగములుగనై యొకభాగము బ్రిటీషువారికిని, ఒక భాగము ఫ్రెంచివారికిని,ఒకభాగము డచ్చివారి (హాలండు) కిని చెందియున్నవి. బ్రిటీషువారి సీమ గుయానా దేశమంతటిలో సగముండునని చెప్పఁబడినది.

సముద్రతీరములు పల్లముగను, వేడిగను ఉండును. వర్షములు చాలనధికము. చెరకు, కాయధాన్యములు, వరియములు అధికముగ పైరు చేయఁబడుచున్నవి. సముద్రతీరముల పల్లములందు ఐరోపాదేశస్థుల సంతతివారును, నీగ్రో జాతులును, లోనకొండల, అడవుల ప్రదేశములందు ఇండియన్ జాతులును, నివసించు ప్రజలు గనున్నారు. కారిబులను ఇండియన్ జాతి ప్రజలు చాల క్రూరులని పేర్వడిసిరట. వారు వసించు దేశతీరసముద్రమునకు కరీబియన్ సముద్రమని పేరయ్యెను.

జార్జిటౌన్ బ్రిటీషు గుయానాకు ప్రభుత్వస్థానము. ఇది డెమరారానదీ ముఖద్వారము కడనున్న రేవు. బ్రిటీషుగుయానాయందు ఎస్సెక్వెబో యనియు, డెమరారాయనియు, బెర్బిస్ అనియు మూడు మండలములున్నవి కెయన్నీపురము ఫ్రెంచిగుయానాకు ప్రధాన స్థానము. ఇదియొక ద్వీపమునందున్న రేవుపట్టణము. ఇటనుండి మిరపకాయలు విస్తారమెగుమతి చేయఁబడుచున్నవి. వీటిని Cayanne pepper అనుచుందురు. చాలతడిగనుండు ప్రదేశము. ఇప్పుడు వారి Penal settlement కూడ నై యున్నది.

పారామరిబో పట్టణము డచ్చివారి గుయానాకు ప్రభుత్వస్థానము. ఇది సురినామ్ నదీతీరము. ఈదేశమునకు సురినామ్ దేశమనియు వాడుక పేరుకలదు.

**గురజకాయ చెట్టు** — దీనికాయ పచ్చిది. జఠరాగ్నిదీప్తినిచ్చి అరుచిదోషము నివారించి స్త్రీల గర్భాశయనొప్పిని (ఋతువునందుగల్గు గంటు నొప్పి) నివారించుననియు, ఉబ్బు, కఫవాతము, గ్రహణి, పాండురోగము, మేహరోగములపై చక్కగ పనిచేసి యాపుననియు, ఇంచుక విరేచన బద్ధము గల్గించి వాతపైత్యము గల్గించుననియుం జెప్పంబడినది. గురజఆకులు వేడిచేసి యగ్నిదీప్తి నిచ్చి పైగుణములనే గల్గియుండెడిని.

**గురుక్కళ్** — ఆదిశైవ మతము చూడుడు.

**గురుగుకాయ చెట్టు** — దీనికూర అగ్నిమాంద్యము నివారించి అరుచిదోషము హరించి, చిక్కాకి మలమూత్ర నిరోధము, శూలలను, నివారించి, ఇంచుక శ్లేష్మమును, వాత పైత్యమును ప్రకోపింపజేయునందురు. దీనిఁగూర్చి అంతగా (తెలియదు. మనుబాలచూడుడు).

**గురుగుచెట్టు భూరుండి చెట్టు** (తేలుమణిచెట్టు)- లా Heliotropium indicum, ఆంగ్ల. Heliotrope, సం. భూరుండీ, భూరుహా, హస్తిశుండీ, జవేచ్ఛయా, నాగదంతీ, నాగశుండీ, శుండీ, ధూసరపత్రికా.

హస్తిశుండి యనియు, భూరుండి యనియు, తేలుమణి చెట్టనియు వాడుకలు గలవు. వంగ చెట్టు ఆకులంబోలి యాకులును, ఏనుఁగు తుండముంబోలి యిమడక వంకరంగల్గిన కాయలును (రమారమి జానెడంత పొడవు), కాయ కొనను పువ్వును గల్గి అడుగున్నర పొడవుగ చెట్టు పెరుగు నని, పదునుగల స్థలములలో వృద్ధి నందుననియు తెలిసెడిని.

ఆకు ఆముదమున వెచ్చచేసి పైన కట్టినను దీని యాకు రసము లేక కషాయము విడిపోయిన గాయములనుసైతము మాన్పుననియు, ముఖము పైఁబుట్టెడు బొటిమల నడంచుననియు, కనుఱెప్పల పుండ్లను మాన్పుననియు, తేలు విషము, పిచ్చి కుక్క కాటు విషము, కాటు గాయములను హరించి మాన్పుననియు, ఉబ్బు, దగ్గు, ఇగుళ్ళ నొప్పి, మధు మేహము, వాతము, విదాహ దోషము, శీతజ్వరములపై కషాయము చక్కగ పని యొనర్చుననియుం జెప్పఁబడినది.

**గురుఁడు**— బృహస్పతి దేవతాచార్యుం డగుట గురుఁడను నామము సుప్రసిద్ధంబయ్యెను. మఱియు పూరు వంశమున సంకృతి కుమారుం డగు రుచిరథునకు గురువని వాడుకపేరు గలదు. శివ కుమారుఁడగు కుమారస్వామికి గురుస్వామి యని పేరు కలదు. ఈయన ప్రణవమున కర్థము వివరించుటంజేసి యట్టిపేరు వాడుక యయ్యెనట. అరవదేశమున ప్రచారము నందున్న పేరు.

**గురుదత్త పాదము** — గిరి నగరము చూడుడు. శ్రీకృష్ణునిపాదము ఆనవాలు.

**గురుదాస్పూరు జిల్లా**—గురుదాస్పురము ప్రధానస్థానము. (పంజాబుదేశము చూడుడు).

**గురుపాదగిరి**—బీహారములోని గయా మండలమున గయనుండి కొంతదూరమున గురు పాదగిరియను బౌద్ధక్షేత్రముకలదు. ఇట శాక్య సింహునికన్న ముందుగనేగిన కాశ్యపబుద్ధుఁడు నిర్వాణపథమందెను.

ఈతావున మైత్రేయుం డను రాగలబుద్ధుఁడు బౌద్ధమత దివ్యబోధ సల్పునని దివ్యావధాన మాల యను బౌద్ధగ్రంథమున జెప్పంబడినది.

**గురురాజకవి**— ఆంధ్రకవులలో నాథు నికులందు పరిగణింపఁబడినవాఁడు. ఈయన రచించినది శివధర్మమను నాంధ్రపద్యకావ్యము. దీనిని.

బళ్ళారిమండలమునందలి జోహారాపురాధీశుఁడగు సంజీవిరెడ్డిగారికిం గృతియిచ్చెను. ఇంకను చిత్ర శ్లేషకావ్యమగు పద్మావతీ పరిణయ నాటకము, రుక్మిణీపరిణయమను ప్రబంధము, అలంకారమణి మాలిక, రాఘవేంద్రాష్టకము, చాటుధారాసహ స్రము, అనిరుద్ధ చరిత్రమను ఆంధ్రనాటకము, భర్తృహరి శతకత్రయము రచించెనని చెప్పఁ బడినది.

**గురువారము** (Thursday) — దీనిని లక్ష్మీవారమనియు, బేస్తవారమనియుం గూడ నందురు. వారమునందైదవదినము. కొందఱు బృహస్పతివారమనియు నందురు. మార్గశిరమాస మున గురువారములందు మహాలక్ష్మీ పూజ లొనర్తురు. హిందువు లీదినములందు వెలగ పండ్లను తినరు.

యూరోపుదేశములవారు గురువారమును Day of strength and power అనియెదరు. నాఁడు కష్టకార్యము లీదినమున ప్రారంభించిన సిద్ధించునని ప్రతీతి కలదు. స్కాండినేవియా వారి దేవతలలో బలాఢ్యుండును, జయశీలుం డును అగు Thor పేరంబరగు వాని యు ఆయన కాయుధము సుత్తి అది మనుష్యుఁడెత్తజాలని బరువుకలది. ఆయనకు Iron gloves కలవు. ఈయన కొకపటకా కలదు. అది నడుమునకుం బిగించుకొనినతరి నీయన శరీరబల మినుమ డించునని చెప్పంబడినది.

ఇట్టి ఓడెన్ దేవుని యాయుధమగు సుత్తి నొకతరి Thrym అను రాక్షసుఁడపహరించి దాచివైచెనట. దానిని Freya యను దేవతా వనిత తన్ను వరించినంగాని యీయ ననెనట. తోడనే Thor ఆమె వేషమున నారాక్షసుని కడకేగి యా సుత్తిం దెచ్చుకొనెను. దానితోనే వానిం జితుకఁగొట్టి పరలోకంబున కనిపెనట. ప్రజలు కృతజ్ఞులై నాల్గవవారమును బుధవారము నకు Thor పేరున Thor's day యనిపేరిడ నది కాలవశమున మార్పుంజెంది Thursday యని వాడంబడుచున్నదని చెప్పఁబడినది. బైబిలు నందు గురువారమున సూర్యచంద్రులను నక్షత్ర ములను సృజించి దివారాత్రములను స్థాపణచేసెనని చెప్పఁబడినది

**గురువును మించిన శిష్యుఁడు** — ఆంధ్రలోకోక్తి.

**గురుస్వామి (కుమారస్వామి)** — గురుఁడు చూడుఁడు, ఓంకారము చూడుఁడు.

**గురూదయాబ్దములు** — ఇవి జ్యోతిష శాస్త్రసంబంధములు పంచాంగము లందు గురుగ్రహము ఉదయించు సందర్భమున వివరింపంబడుచుండునవి. ఇవి ౧ చైత్రాబ్దము, ౨. వైశాఖాబ్దము, ౩ జ్యేష్ఠాబ్దము, ౪ ఆషా ఢాబ్దము, ౫. శ్రావణాబ్దము, ౬. భాద్రప దాబ్దము, ౭. ఆశ్వీజాబ్దము, ౮. కార్తీకాబ్దము, ౯ మార్గశిరాబ్దము, ౧౦. పుష్యాబ్దము, ౧౧ మాఘాబ్దము, ౧౨ ఫాల్గునాబ్దము నని మాసనామములుగఁ దనరుచు పండ్రెండు తెఱంగులు.

**గుర్గాం జిల్లా** — గుర్గాంనగరము ప్రధానస్థానము. (పంజాబుదేశము చూడుఁడు).

**గుఱ్ఱపునుడులు**— అశ్వ శాస్త్రము చూడుఁడు.



**గుఱ్ఱపుపిల్లకు గుగ్గిళ్లు తినడము నేర్పవలెనా?** — (గుగ్గిళ్లు = ఉడికించిన ఉలవలు). ఆంధ్రలోకోక్తి.

**గుఱ్ఱమంత కుక్కను పెంచి రెడ్డి తానే మొరిగినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**గుఱ్ఱము గుడ్డిదైనా దాణాకు తక్కువయుండదు** — అనగా గుడ్డిగుఱ్ఱమైనను దాణాతినుటయందు తక్కువది కాదని భావము. ఆంధ్రలోకోక్తి

**గుఱ్ఱము తోకవుంటే తానే విసరుకుంటుందికాని ఇతరుల కుపయోగమేమి?** — ఆంధ్రలోకోక్తి

**గులాబీచెట్లు జాతులు** - ప్రాశ్చాత్య వృక్షశాస్త్రజ్ఞులు గులాబీ చెట్లను అవి పూచు పూవుల రంగుల నుండియు పూవుల వాసనల నుండియు పదునాల్గు భేదజాతులుగ విభజించి యున్నారు. ఇందొక్కొక్క భేదజాతి కనేక అంతర్భేదములు చెప్పబడినవి. ఇవి కనుస్వల్ప భేదములుగ, నేత్రగోచరములుగను, ఘ్రాణేంద్రియ గ్రాహ్యములుగను ఉన్నవి.



౧. Hybrid Tea Roses - పూవులందు చక్క తేనీటి వాసన గలవు. ఇవి నూట ఇరువది భేదజాతులుగ లెక్కించి యున్నారు.

౨. Single Roses - వీటికి ఐరిష్సింగిల్సు అనియును పేరుకలదు. నిజమున నివి ఐర్లాండు దేశపు జాతులు గావు. ఇవియు Hybrid Tea Roses జాతివే యనియు, Single Flowers కలవనియు పరిశీలనలనుండి తేలుచున్నది. పూవులు సుందరముగ నుండును, విస్తారము పూచును గాని త్వరితముగ రేకులు రాలిపోవును. ఇందేడు భేదజాతులు లెక్కింపబడినవి. (ఇది ఒంటిరేకు గులాబీజాతి).

3 బోర్బన్గులాబీ జాతి- చీనాదేశపు గులాబీలకు వీటికి భేదమేమియును గానరాదు. రెంటియందు ఈజాతిలో కొన్నిసదా పూచుచుండునవియు, కొన్ని ఏటేట నొకసారి మాత్రము పూచునవియు కలవు. తుప్పలుగనగు జాతియు, డొంకవలె తీగప్రాకుజాతియు, చిన్నచెట్లుగనుండి పూచుజాతియు నైదు అంతర్భేద జాతులుగ నున్నవి.

౪ Hybrid Perpetual Roses — ఇది చాల గట్టికరంగల్గి బలముగనుండుజాతి. దీనిని దేశవాళీగులాబీ యని యనెదరు. పరిస్థితులు బాగుండిన పదియడుగులవఱకుం బెరుగును. ఒక్కొక్కతరి పూచుచుండును. పూచినతరి గుంపులుగుంపులుగ చాల పూవులు పూయును. చిగురుకనిపించుట పూచుటకు యదనుగనెఱుంగదగినది. పూవులు పెద్దవిగను అత్తరుచేయుటకనుకూలమగు పరిమళముగలవిగను ఉండును. వీటిని టీరోజెసు చెట్లతోకల్పి పాతిన బాగుగ పెరగవని కనిపెట్టబడినది. ఇందు ముప్పది జాతులు అంతర్భేదములు గలవని లెక్కించి యున్నారు.

౫. Tea scented Roses— ఇవి కేవలము తేయాకువాసనం గల్గియుండు గులాబీజాతులు. రంగులందు చాల తేలికయైన భేదములుగ నుండునవి. వీటికి ఎరువులబలము, భూమిబలము ఎక్కువ కావలసియుండును. ఇందు ఇరువదియొక్క భేదజాతులను లెక్కించి యున్నారు.

౬. బంగాళీజాతి గులాబీలు- ఇవి చీనాజాతులను బోర్బను జాతులంబోలినవియె. పూవులు చిన్నవికాని ఇంచుమించు సదాపూయుచుండునవి. వీనియందు ముండ్లధికముగాన చల్లనిప్రదేశములందు కంచెలందు నాటుచుందురు.

౭. డమాస్కు గులాబీ- దీనిని ఫ్రెంచిరోజని యెదరు. డమాస్కసుజాతి.

౮. **Moss Roses**- వీటిని కొందఱు కేబేజరోజెస్ అనుచున్నారు. మఖ్మలోపెరుగు గట్టిజాతి.

పూవులు మనోహరములుగ నుండును. ఇంకు తెలుపునందు రెండుజాతులు, తెలుపు ముద్దజాతి ఒకటియు గులాబీరంగు రెండుజాతులును మొత్తమైదుజాతులు లెక్కించియున్నారు.

౯. ఆస్ట్రియా జాతి గులాబీ- దీనిని Brier Rose and Hybrid Rose అనియెదరు. పాశ్చాత్యవృక్షశాస్త్రవేత్తలు Rosa Factida అని పేరిడిరి. ముఖ్యముగ పసుపుపచ్చరంగుజాతులిందుకలవు. ఫ్రెంచిదేశస్థులు వీనిని మూడు వాదల సంవత్సరములుగ నెతిగి పరిశీలించుచు అంట్లుగట్టుచు మార్పులంగల్గించి Pernetianas గులాబీజాతిన్ని చేసిరట. Rosa Factida జాతి యందు ఆరు అంతర్భేదజాతులను లెక్కించియున్నారు.

౧౦. Pernetianas Rose-దీనింగూర్చి ఏమియుందెలియదు.

౧౧. Climbing Roses- ఇవి ప్రాకునట్టి గులాబీజాతి. వీటిని Rambling Roses అనియు నందురు. ఇవి తొల్లింట జపాన్‌దేశపు అడవి గులాబీజాతిగనుండి ప్రాశ్చాత్యులచే మార్పు గల్గింపఁబడినదందురు. అడవి గులాబీగానుండుతరి Rosa Wichuraiana అని పేరంబరగునదని చెప్పఁబడినది. ఇది ప్రాశ్చాత్యులిడిన పేరు. జపాను దేశములందు డొంకలయందే కంచెలయందు గాన నగుచుండును. పూతయు బాగుగనె పూయుచుండును. ఇందు 1. Hardy Climbing Rose అనియు, 2. Climbing Hybrid Tea Rose అనియు ద్వివిధములుగనున్నది. మొదటిజాతియందు తొమ్మిది అంతర్భేదజాతులును, రెండవదానియందు పది అంతర్భేదజాతులును కలవు. ఇంకను ఎన్మిది ఇట్టి అంతర్భేద జాతులును కలవట.

౧౨ Polyantha Rose - నిజముగ నిది సదాపూచుచుండు జాతియని చెప్పఁబడినది. తఱుచుగ పొట్టిపొదలవలె నుండును. పసునెన్మిదంగుళములకన్న పెరుగవు గుత్తులుగ పూచును. ఇందు ఇరువది రెండు జాతులను లెక్కించియున్నారు.

౧3. Cabbage Rose దీనిని Provence Rose అనియు నందురు. దీని నాదినుండియు నెఱుఁగుదురట గట్టిరేకులును పరిమళముగల పూవులుగలజాతి. ఏటేట నొకసారిపూచును. ఇందు రెండు అంతర్భేదజాతులు గలవు.

౧౪. Noisette Roses- ఇవి చిన్న పూవులు. సుందరముగబూచును. ఇందు ముఖ్యభేదజాతులు- ౧ ప్రాకి పైకెగబాకు జాతులును, ౨. కస్తూరి పరిమళముగల పూవుల జాతులును, 3. తేయాకు పరిమళముగల పూవులంబూచు జాతులును నైయున్నవి. కొందఱు వృక్షశాస్త్రవేత్తలు, పైకెగబాకు జాతులు చీనాదేశపు జాతులని యనుచున్నారు. చాల నాజూకైన జాతి.

ఇంక వీటియందుగల అంతర్భేదజాతుల నామములు అనేకులనేకవిధములుగ తమయిచ్చవచ్చినట్లు నుడివియున్నారు. కాన వాటిని వివరించుట దుస్తరము. ఇటీవల వృక్షశాస్త్రజ్ఞులు మొత్తము గులాబీజాతుల అంతర్భేదములు ౧౨౦౦ కలవనుచున్నారు.

## గులివింద(గురిగింజ) చెట్టుపాదు

గులివింద గింజలలో ముఖ్యముగుజాతి భేదములు రెండుకలవు. చెట్టునుండికాచు గులివిందయు, తీగనుండికాచు గులివిందయునై యున్నవి. చెట్టునుండికాచు గులివిందను బాడిగులివింద యనియు, పెద్దగులివింద యనియు నందురు. ఇందు ఎఱ్ఱనిరంగు, తెల్లనిరంగు, నల్లనిరంగు గింజలంగాచు

మూడుభేదముల జాతులు కలవందురుగాని, ఒక్క ఎఱుపు తప్ప తక్కినవి గానవచ్చుటలేదు. ఇంక తీగెగులివింద అడవులందు ఇతరవృక్షముల పైకెక్కి ప్రాకి కాచులతలు. ఇందు ఎఱుపు, తెలుపు, నలుపురంగుల గింజలగాచు మూడు భేదములజాతులు గానవచ్చుచున్నవి. ఇందు తెల్ల జాతి శ్రేష్ఠమని చెప్పబడినది. దీనిని చిన్నగులి వింద గింజలనియు, గురిగింజలనియుం గూడ వాడుదురు. ఈచిన్న గురిగింజలనే బంగారపు పని చేయు కుకాణములందు తూనికల ప్రమాణము గను, నీటనుంగడిసి దీనిగంధపు బంకచే బంగారు రేకుల నంటించి టంకముచే నతికించ గాల్చుట కును ఉపయోగించుచున్నారు. ఈపనుల కెర్ర జాతిగింజలనే వాడుదురు. తీగెగులివింద ఆకురసము తేనెయుంగల్పి పైనపూసిన వాపులు తగ్గును. తీగెగురుగింజల గంధము పైనిపట్టువేసిన కండ్ల నొప్పులు మానునందురు. మఱియుం జిన్నగులి వింద గింజలలోన విషపదార్థము కలదు. దానికి విరుగుడు ఆవుపాలు, తేనె, చింతపండు రసమునని చెప్పబడినది. తెల్లజాతితీగె గులివిందవేరు, ఆకుల రసము కాకఁజసి కిమి, ప్రమేహము, పైత్యము, మేహము, రక్తవాతము, విషదోషముల నడంచు నని చెప్పబడినది.

తీగెగులివెందకు లాటిన్ భాషయందు Abrus precatorius అనియు, ఆంగ్లమున Jequirity Indian Liquorice అనియు, సంస్కృత మున మాడామణిః అని గులివెందకును, మూడా అనగ తెల్లగులివెందకును, గుంజా, గుంజాకీన్, గుంజకా, మూడాలమ్, శిఖాండికా, శిఖండిన్, శిఖండీ అను ఏడుపేరులు అన్ని గులివెందజాతుల కును వర్తించు సంస్కృతపునామములైయున్నవి.

ఇంక బండిగులివెంద పెద్దమానగును. ఇందు నకు సామాన్యమున లాటిన్భాషా పదము Adenanthera pavonia అనియందురు. దీని చెక్క కషాయము బిగదీసి బలముగల్గించుననియు నీళ్లవిరేచనములు రక్తగ్రహణి కట్టుననియు, దీని విత్తుల గంధము పైనిరాసిన వేసవిలో శరీరమున పేలడపు పొక్కులడంగిపోవుననియు,అండములపై రాసిన వాటివాపుకొప్పి తీయుననియు, గింజల చూర్ణము లోనికిచ్చిన వమనము గల్గించుననియు చెప్పబడినది. దీనిపూవులందు మన్మథోద్రేకముం గల్గించుగుణము గలదందురు.

**గులేబకావలీస్థలము** — ఉపప్లవ్య దేశము చూడుఁడు.

**గుల్మ** — వాతపిత్త శ్లేష్మములు చెడుట వలన లేక కుక్షస్థితిం జెందుటవలన లోజనించెడి ద్రవకూటము, ఘనపదార్థకూటము, కడుపులోని బల్లలు ఈ సంబాధములే. గుల్మోదరరోగము, జలోదరరోగములు ఈ సంబాధములే.

**గుల్లబుచెట్టు (వేరుసంపెంగ)** — ఇది తురుష్కసీమలనుండి మహమ్మదీయ భూపతుల కాలమున భరతదేశమునకు రప్పింపం బడినదిగ తెలియుచున్నది. ఉల్లిపాయవలెనుండు దుంపనుండి పైకి దొంగల్వమొక్కవలె లేచి సన్నపు పొడుగాటి ఆకులనడుమగ నొక స్తంభ ముంబోలి కాడకొన నిమిడియున్న పూవులంగల్గి తెల్లని వంకరదిరిగిన పూవుల నలుదెసలకుం జూచుచు పరిమళము వెదజల్లి మనోహరముం గల్గించు చిన్న పూలచెట్టు. పూఁదోఁటలందు పెంచుదురు. ఒంటిరెక్క పూవులును ముద్ద పూవులం బూచు రెండు భేదములుగలది. ఈ పూవులనుండి తీసిన అత్తరు లేక గుల్లబుతైలము పైకి మర్దనచేయుటవలన అన్ని నొప్పులు మానుననియు, ఏ అవయవమునకు మర్దనచేయు దురో ఆయవయవము బలపడుననియు, శరీరపు

బలమును ఉత్సాహమును అధికముగునట్లొనర్చు శక్తి ఈపూవులందు కలదనియు తెలియుచున్నది.

**గువ్వలచెన్నడు** — సుప్రసిద్ధుండగు పంచమకులజుఁడుఁయువాశదాతయని పేరందినవాడు. తొలుత కట్టెలమోపు లమ్ముకొనుచు జీవించు చుండెనట. రామరాజభూషణుడను సుప్రసిద్ధ కవినాటివాఁడని చెప్పఁబడులయు, ఆ రామరాజ భూషణుఁడు శ్రీకృష్ణరాయ సార్వభౌముని యాస్థానవిద్వాంసుండగుటయు నెఱింగిన గువ్వల చెన్నఁడును శ్రీకృష్ణరాయ సార్వభౌముని కాలమువాఁడని తెలుచున్నది.

గువ్వలచెన్నఁడు కట్టెలమోపులను విజయ నగరము వీధులందమ్ముకొనుచు జీవించుచుండు వాఁడట. రామరాజభూషణుని (భట్టుమూర్తి లేక శారదామూర్తి) యింట కట్టెమోపులు ఆయన యింట లేనితరి వైచుచుండ నాయన యేతెంచి "నీకేమికావలయు? నిచ్చెదన"నెనట. చెన్నడుఁ "దేవరా! నాకుఁ గవిత్వమిప్పింపుఁ" డనియెనట. రామరాజచ్చెరువంది మెచ్చిగువ్వల చెన్నా! యను మకుటముతో కొన్ని పద్దెముల రచించి వానికిచ్చెనట. అవి నూరు పద్యములు కలవందురు.

వాటినెవ్వారేని జదివిన నాగువ్వలచెన్నడుప్పొంగుచు తనకడనున్న డబ్బులు వారికింబంచియిచ్చు చుండువాఁడని ప్రతీతి కలదు. ఆంధ్రవాఙ్మయమున గువ్వలచెన్నని పద్యములు అందరెఱిగినవే. మచ్చునకు రెండు పద్యములే క్రింద వివరింతుము గాక!

కం॥ సారాసారము లెఱుఁగని
బేరజముకు బుద్ధిసెప్పు ♦ పెద్దలపోమా?
నీరెంత పోసి పెంచిన
గూరౌనా నేలవేము ♦ గువ్వలచెన్నా ॥

కం॥ పలుమాటలేల హాళలు
తులతూగునె తనదువృత్తి ♦ దొరగినభువిలో
కలిమి తన కెంతగల్గిన
కులవృత్తికి సాటిగావు ♦ గువ్వలచెన్నా ॥

**గుహమాత** — గంగానదికీపేరు కలదు.

**గుహలేత్ క్షత్రియులు** - శిశోదియా క్షత్రియులు చూడుఁడు.

**గుహుండు** — శృంగిబేరపురమున అధి నాథుఁడగు నొక కిరాతనరపాలుఁడు. ఈతఁడు శ్రీరామ భక్తుఁడట. కుమారస్వామికిని గుహుఁడని పేరుకలదు. మరియు గంగకు గుహమాత యని పేరు కలదు. ఈగుహు డోకఁడు గానసగు చున్నాఁడు.

- **గుహ్యకులు** — కుబేరుని నవనిధులను కావలిగాచు రక్షకులు గుహ్యకులని చెప్పఁబడినది. (లోకవాడుకయందు కుచ్చితుని గుహ్యక శబ్దముచే హేళనగా పల్కుట వాడుకయందు గలదు). మణిభద్రుఁడు గుహ్యకేశఁడట. వీరు హిమాలయముపై "ఉండేశ లేక హుండేశ" దేశమునఁ దొల్లింటి నివాసులగు ఘూర్కాలను వీరి సంతతివారుగ పోల్చియున్నారు.

**గుళ్లో దేవునకు నైవేద్యము లేక పోయినా పూజారికి పులిహోర తప్పనట్లు** — (ఇది విష్ణాలయములంగూర్చిన సామెతగా తోచెడిని. శ్రీవైష్ణవులందు పులిహోర ఎక్కువగా వాడుచుందురు.)

**గ్రుండైజమ్**(Grundyism)-లోకులు ఎట్లుతలంతురో అను వెఱపు విశేషమైపనికి సాహసములేకుండు పిరికితనము.

**గ్రుడ్డివాండ్ల ఆంగ్లాక్షరములు** (Blind Alphabet) — ఈ అక్షరములు పైకి ఉబ్బెత్తుగా (Embossed) ముద్రింపంబడి యుండును. వాటిని తడుముకొనుచు గ్రుడ్డివారు పోల్చి చదువుదురట. దీనికి Braille సిస్టం అనియుం బేరు కలదు. దీనికి National Institute ఒకటి కలదని తెలిసెడిని.

| | | | | |
|---|---|---|---|---|
| A. | B. | C. | D | E. |
| F. | G | H | I | J |
| K | L | M | N. | O |
| P. | Q | R | S | T. |
| U | V | W | X | Y |
| Z | | | | |

**గ్రుడ్డు (అండము) పిల్లను వెక్కిరించినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**గ్రుడ్డు లేక, అండము** (Egg) — పిట్టలు గ్రుడ్లుపెట్టి పొదిగి పిల్లలం జేయుట ఎల్లరెఱింగినదియే. గ్రుడ్డును ఆంగ్లపరిశీలకులగు శరీరశాస్త్రవేత్తలు Reproductive cell formed in the body of female animal అనుచున్నారు. మఱియు When fertilised by union with the spermatozoon of the male produces a new individual అని వ్రాసిరి.

ఈ "పొదుగుట" పని తక్కిన స్త్రీశరీరములందు కడుపులోనే జరగి ప్రసవమగుటతో పిల్లయే పుట్టుచుండును.

**గృత్స్నమదుఁడు** — కృత్స్నమదుఁడు చూడుఁడు.

**గృష్టిక్షీరము** — ఆయుర్వేదవైద్యశాస్త్రమున అప్పుడే ప్రసవించిన స్త్రీయొక్క చనుపాలకు గృష్టిక్షీరమని పేరు.

**గృహాలగోత్రము** - శాండిలగణము చూడుఁడు.

**గృహస్థః స్త్రియముద్వహేత్** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. ఇది సంబంధములేని మాట. స్త్రీపరిణయమైనవాఁడే గృహస్థనిపించుకొనును. అట్టి గృహస్థు స్త్రీని ఉద్వాహము (పెండ్లి) యాడుట అనవసరము.

పెట్టి కుదిరినంగాని పెండ్లికాదు, పెండ్లియాడినంగాని పెట్టి కుదరదనునట్లున్నది.

**గృహీత్వార్థం గతాశ్చోరాః కస్తాన్నాప్నోతి మర్త్యతీత్రిన్యాయము** — దీనావస్థయగు ననవాయస్థితిని ఎకసక్కియము లాడు న్యాయము.

దొంగలు దోచుకొని పారిపోయిరి. వారింబట్టి ఆ స్తిం దిరుగ తెచ్చుట కెవ్వరుకర్తలు ? ఎవ్వరు లేరని భావము.

---

**గూర్ఖాలు** — వీరి తొల్లింటి పేరు ఘూరకులనియు, ఆదిని ఆంధ్రదేశస్థులుగ నుండి మిథిలదేశమున కేగి యటనుండి హిమవన్నగపఙ్క్తులం గొన్నిటిం దాటి నేపాళదేశమున కాపురము లేర్పఱచుకొనినవా రనియుం దెలియుచున్నది. ఇప్పటి నేపాళదేశపు పరిపాలకులు గూర్ఖాలేగ వారే. మహాశూరులనియు, యుద్ధనైపుణ్యము న తెల్వితేటలు గలవారనియు పేరొందినవారు. వీరి ప్రధానావయవముకు కుక్రీయని పేరు. బ్రిటీషు సైన్యమున గూర్ఖాపటాలములు కొన్ని కలవు. మనదేశమున ఇనుపదారులపై కావలివాండ్రుగ కొందఱు గాన్పించుచున్నారు. కాని నివాసము నేపాళదేశమే. (గుహ్యకులు చూడుఁడు)

**గూళికంటి వేంకటరమణ కవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు, నియోగి బ్రాహ్మణుఁడు, తండ్రిపేరు వేంకటామాత్యుఁడు, తల్లిపేరు రంగమాంబ.

ఈతఁడు కనకరంజితశిఖామణీపరిణయ మను ప్రబంధము రచించి శ్రీవెంకటేశ్వరస్వామికిం గృతి సమర్పించెను. ఇంకను హరివంశముం గూడ రచించినట్లు తెలిసెడిని.

---

**గెజెట్** (Gazette) - (వాణిజ్యసంబంధపరిభాషాపదము). వార్తలం దెలుపు పత్రము. తెలుపవలసినవాట్లను బహిరంగపఱచి తెలుపు పత్రమని యర్థము. ఇక్కాలమున నిది ప్రభుత్వాధికారప్రకటితమై యుండుటను స్ఫురించెడిని.

తొల్లింటికాలమున క్రీ. శ. ౧౫౩౬ సంవత్సరమున ఇటలీదేశమునందు వెనిస్ నగరమున మొదటివార్తాపత్రిక ఒకకాగితముగ ప్రకటింపఁబడసాగెను. దానిని వీథులందు అప్పటి ఆదేశపు చిన్న నాణెముగు గెజెట్టా (Gazetta) కమ్మఁబడుచుండెనట. దానంజేసి ఆ నాణెముపేరే పత్రికకు గూడ వాడఁబోడంగిరట.

**గెనుసుగడ్డతీగ** — కందమూలము తీగ చూడుఁడు.

**గెయిషా వనితలు** — వీరు జపాను దేశపు స్త్రీలు. చమత్కారముగ మాటలాడుట, సంగీతము పాడుట, నాట్య మొనర్చుట వృత్తిగా గలవారు. ఈవిద్యల నాబాల్యతః నేర్చి యారి

తేరి యుండువారుగాన, విందులు, బహూకార సభలు, శుభకార్యముల సభలు, రిసెప్షనులు మీటియందు అతిథుల కామోదకరముగ కాలము గడుప నీరిని కుదర్చి నియమింతురు. ఈయాచారము జపానుదేశమున సర్వత్రాకలదు.

**గెయిసర్సు** (Geysers) — వీటినాంగ్లమున Burns అనియు నందురు. అగ్నిపర్వతముల సంబంధ కార్యముగ వేడినీళ్ళు భూమిపైకి ఎగురుట లేక చిమ్ముటలను Geysers అనిపేరు. (Mountains చూడుడు). ఇవి సాధారణముగ అగ్నిపర్వత సంబంధముననే ఉండును. లేకున్న ఒక్కొకప్పుడు భూమియందు లోతునగల్గి యుండిన వేడివలన గల్గుచుండునవి గను ఉండెడిని.

**గెలీషియా** — ఆస్ట్రియా దేశము చూడుడు.

---

**గేదంగి (పూవుల) చెట్టు** - లా. Pandanus odoratissimus దీని పూవులు పరిమళము గలవిగాన పూదోటలందు నాటి పెంచుదురు దీనిగూర్చి ధాతువృద్ధికరముగ జెప్పబడినది.

**గేరుడాళ్ళు** - ౖరేకద్వయము చూడుడు.

**గేలాక్సీ** (Galaxy or Milky-way)- ఇది చిన్నచిన్న నక్షత్రములగుంపు లేక సముదాయము. నక్షత్రములు కన్పించనంతటి చిన్నవి చేరియుండుటంగాన వాటివల్ల గగ్గినవెల్గు ప్రతిఫలించుచు తెల్లనిమార్గముగ రాత్రులందు చీకటిలో నాకసమునం గన్పించుటంజేసి దీనికి ఈపేరేగాక Milky-way యని ఆంగ్లమున వాడుటకలదు.

ఇదియు Constellation లలో చేరినదేనని ఎస్ట్రోనొమీ శాస్త్రమున చెప్పబడినది. (ఎస్ట్రోనొమీ చూడుడు). మఱియు దీనిని ఫిక్సెడ్ స్టార్సు సముదాయములలో నొకటిగ చెల్పియున్నారు. (ఫిక్సెడ్ స్టార్సు చూడుడు). కడు చిన్ననక్షత్రములగుట మర్భిణిగుండా చూడవలసి యుండును. సుప్రసిద్ధుడుని రెండు నక్షత్రములం గనిపెట్టిన పరీక్షలకుండగు Dr. Herschel పండితుడు దీనియొక్క ఒకభాగమున ౨,౧౦,౦౦౦ నక్షత్రములుండునని చెల్పియున్నాడు. మఱియు దీనిని Via Lactia అనియు నందురు.

**గేలికేనిజమ్** (Gallicanism) — Pope యొక్క పొలిటికల్ Power తగ్గించివేసి Bishops అధికారమును బలపర్చవలయుననియు అదిశ్రేష్ఠమకరమనియు నమ్ముట

**గేస్** (Gas) — దీనిని రసాయనశాస్త్రజ్ఞులు ఆక్సిజెన్, హైడ్రోజెన్, నైట్రోజెన్ మొదలగు Gases లను వాయువునుండి వేఱుగఁజెప్పియున్నారు. కొన్ని ఘనపదార్థములు కొన్ని ద్రవపదార్థములు వేడితో సాంగత్యము కల్గుక తన Gases గా పరిణమించుటయు, Gases నకు శీతల సాంగత్యమువలన ఘనపదార్థములుగను ద్రవపదార్థములుగ పరిణమించుటయుం గూడ కలదు. Gases నకు Electrical discharge తో గాని roys తో గాని సాంగత్యము సంభవించినప్పుడు అనగా Radio-active Sub-

stances తో సంబాధము కల్గుకతన దానికి Ionised స్థితికల్గి Conductor అగును. Gases యొక్క లక్షణస్థితులిట్టివి.

Gases ను గూర్చి Sir J. J. Thomson మొదలగు శాస్త్రజ్ఞులు గొప్పగొప్ప పరిశీలనల నొనర్చిరట. Coal gas ఆంగ్ల సీమలందు అనేక పనుల కుపయోగింపఁబడుచున్నది. ఒక సుప్రసిద్ధ పరిశీలకుఁడు "Gas is an elastic fluid which gives light and heat but may become a deadly enemy" అని నుడివి యున్నాఁడు. గాలిం బోలియుండు పదార్థము.

ఈసందర్భమున Solid, Liquid, Gas లం గూర్చి Sir Oliver Lodge పరిశీలకుఁడు వచించిన యొక మహావాక్యమునిట వివరించుట సమంజసము.—"A solid has Volume and shape A Liquid has Volume but no shape; a gas has neither Volume nor shape"

Gasలు Natural gas అనియు Artificial gas అనియుం గూడ గలవు. మొదటివి భూమి నుండి పుట్టును. భూమి నుండి ఇట్లుత్పన్నమైన Gas ఒకప్పుడు మాడుచు ఎల్లప్పుడుంటయుం గలదు. Artifical gas యంత్రముల సహాయమువలన చేయఁబడునది. నీటియావిరిని Gas అని తలంపరాదు. నిజమున Gas కంటికగుపడునది కాదు. ఆవిరియందు తెల్లగ నగుపడునదంతయు అణుప్రాయములగు నీటి తుంపురులు.

**గేసోమీటర్** (Gasometer) —Gas నిల్వంజేయు నొక పరికరము.

**గేల్వానోలొజీ** (Galvanalogy) — Chemicals వలన కల్గింపబడిన Electricity లేక Galvanic Electricity ని గూర్చిన కళ.

**గేష్వాయన గోత్రము** — వాధ్ర్యశ్వ లేక మిత్రయువగణము చూడుఁడు.

**గేస్ట్రోనొమీ** (Gastronomy) — వంటలం గూర్చిన శాస్త్రము, పాకశాస్త్రము. దీనిని భోజన కళ యనియు నందురు. భుజించుటం గూర్చి తెల్పునది.

**గేస్ట్రోలొజీ** (Gastrology)— పొత్తికడుపు (Stomach) దానికి శరీరమందలి ఇతర భాగములతోఁ గల సంబంధములు, అది చేయు పనులు, అచటి రోగములు మొదలగునవి దెల్పు కళ.

**గేహ్ల గోత్రము**— జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**గ్లేసియర్సు** (Glaciers) — పోలార్ రీజియన్సు అనంబడు ధృవప్రదేశములందునను, ఎత్తగు పర్వతోపరిభాగములందునను, విస్తారముగ మంచుపొరలు కొంత నిలువగల ప్రదేశమునంబడి నిలువయుండుటం జేరి పైపొరల భారమునకు పొరల కొత్తిడిగల్గించ కొంత పల్లముగానుండిన మార్గమున జారనారంభించి అతియాలస్యముగా (కనిపెట్టుటకు వీలుగానంత ఆలస్యముగా) పల్లమునకు మంచుప్రవాహము దిగజారుచుండును. దీనికి Glacier అనియు, Glacier river అనియుం బేరు. ఇది సంవత్సరముల కాలముగ నెమ్మదిగదిగి Snow line చేరువంకకుం గరుఁగ నారంభించి ఒక సెలయేరగును. దీనితోఁ గూడ నిది గొనివచ్చు రాళ్లు మొదలగునవి మార్గమున నిలచి స్థంభించి Moraines అనిపించుకొనును. Polar regions నందు గొప్ప గ్లేసియర్సు నుండి విరిగి తేలుచు గొప్పగొప్ప మంచుముక్కలు (పర్వతములవలె) ఓడలం జిదుకగొట్టగల్గునవి వచ్చును. వాట్లకు Icebergs అనిపేరు.

**గ్లేసియోలోజీ** (Glaciology) — Glaciers, Icebergs వీటింగూర్చిన కళ.

**గ్రేట్ ప్లేగాఫ్ లండన్** — ఇది లండనునగరమున క్రీ. శ. ౧౬౬౫ లో బ్యూబోనిక్ ప్లేగువ్యాధి సంభవించి గొప్ప జననాశన మొనర్పుటయైయున్నది.

**గ్రేట్ పవర్సు** (Great Powers)— ప్రపంచమాదలి దేశములలో బలవత్తరమగు దేశములని యర్థము. క్రీ. శ. ౧౮౧౫ సంవత్సరమునకు గ్రేటుబ్రిటను, రష్యా, ఫరాసుదేశము, ఆస్ట్రియా దేశమును ఐరోపాయందు గ్రేటు పవర్సుగా చెప్పఁబడినవి. జర్మనుదేశము, ఇటలీ దేశము కలసి తర్వాత చేర్పఁబడి ఆరు గ్రేటు పవరులని చెప్పఁబడినవి. ఇటులనే బెర్లిను కాంగ్రెసుసభయందు అంగీకరింపఁబడినది. పిదప నాశతాబ్దాంతమున అమెరికా సంయుక్తరాష్ట్రములును, జపాన్‌రాజ్యమును కూడ చేరి ఎన్మిది గ్రేటుపవర్సుగా నంగీకరింపఁబడెను. ఐరోపా మహాసంగ్రామమున కొన్ని దేశములు బలహీనమై ౧౯౧౯ పీస్ కాన్ఫరెన్సునందు బ్రిటన్, అమెరికా సంయుక్తరాష్ట్రములు, ఫరాసుదేశము, ఇటలీ దేశము నాల్గు నిలచినటులు చెప్పఁబడినవి. తరువాత జరిగిన World Conference నందు జపాన్‌గూడ లెక్కింపఁబడి పిదప జర్మనుదేశము, సోవియట్ రష్యాదేశము కూడ చేర్పఁబడి ఇప్పటికి ఏడు గ్రేటుపవర్సుగా చెప్పఁబడుచున్నవి.

**గ్రేట్నాగ్రీన్** (Gretna Green) — ఇంగ్లాండు, స్కాట్లాండుదేశముల నడుమ హద్దుగ ప్రవహించు నదియగు సార్కు నదీతీరమున నున్న గ్రామము. పెద్దవారికిందెలియకుండ పారిపోయి వచ్చిన దొంగదంపతులకు పరిణయస్థలముగ తొల్లింటపేరంది నేటికి సామెతగనైయున్నది. ఇది క్రీ. శ. ౧౭౫౪ మొదలు ౧౮౫౬ వఱకు ఇట్టి వివాహము లెన్నియో నడచెనట.

**గ్రేటు బారియర్రీఫ్** — ప్రపంచమున గొప్ప పగడపుచట్టు చూడుఁడు.

**గ్రేమేర** — Grey mare will prove the better horse. గొప్పవారికన్న సర్వసాధారణుల వలనని ఎక్కువ యుపయోగము గల్గునని తోచినయెడల దానిందెలుపుటకీ యుక్తి వాడబడుచుండును. ఫ్లాండర్సులో సర్వసామాన్యములుగఁ దలఁపఁబడు Grey mares (గుఱ్ఱములు) తరిబీయ్యతునంది ఇంగ్లాండుదేశపు సుకుమారపుబాడి గుఱ్ఱములకన్న నెక్కువగా శ్రమకోర్చి పనిచేయును. కాన నీయుక్తి వాడుక నందెను.

**గ్రేవింగు**—వాణిజ్యసంబంధ పరిభాషా పదము. ఓడయొక్క అడుగుతట్టున బాగుచేయుటకీపేరు వాడుచున్నారు.

**గ్రేసియా సామంత ప్రభువులు** - ప్రమాణశాఖ క్షత్రియులు చూడుఁడు.

**గ్రేస్‌డేస్**— (గడువు కాలము) వాణిజ్య సంబంధ పరిభాషాపదము. సార్వసాధారణముగ మూడుదినములు గ్రేస్ డేస్ అని చెప్పఁబడినను, వేర్వేఱువిధులకు గ్రేస్ డేస్ వేర్వేఱువిధములుగ నుండెడిని.

**గైరిక ద్వయము** — (ఎరుపు, పసుపు రెండురంగులవి). లా. Bole Armenic సం. గవేధుక. వీనికిగీరురాళ్ళని వాడుకనామముకలదు. ఇవి ఎరుపు, పసుపు రెండురంగుల రాళ్ళనియు, ఆవుపాలతో లోనికిచ్చిన కండ్లకుఁ జలవచేయు ననియు, విషమజ్వరములు, పాముకాటు విషము, శ్వాసకాసల నివారించుననియుఁ జెప్పఁబడినది. ఇవి మన్నుగ కొందఱెంచుచున్నారు. వీట్లకు విరుగుడు గాడిద లద్దె రసమని చెప్పుదురు.

**గైరిక్షిత గోత్రము** — వీతహవ్య లేక యాస్కాగణము చూడుఁడు.

**గైక్వార్సు డొమినియన్సు**—బరోడా సంస్థానరాజ్యము చూడుఁడు.

---

**గోంగమదేశము**— కొంకణదేశము చూడుఁడు.

**గోండా** — పతంజలి జన్మస్థానము. (గోనార్ధ చూడుఁడు).

**గోండా జిల్లా** — గోండా నగరము ప్రధాన స్థానము. (అయోధ్య ప్రోవిన్సు చూడుఁడు).

**గోండాల్సెటు**—బొంబై రాజధాని ప్రభుత్వపు టధికారమునకులోబడిన చిన్న స్వదేశసంస్థానము. కచ్చి ద్వీపకల్పమునందున్నది. గోండాల్పురము రాజధాని.

**గోండోలా నావ** — ఇది చిన్న పడవలు. ఇటలీ దేశమునందలి వెనిస్‌నగరమున, జలమార్గములగు వీధులందు తిరుగుచుండును.

**గోంకెమగోరుతీగ** - లా. Prederia oeftida. సం. చారుపత్రికా, ప్రసారిణీ, సుప్రసారా. దీని సమూలరసము లేక కషాయము దెబ్బ, కాస, జ్వరము, విషదోషము, విసర్పి, శ్వాసల నడంచి పుంస్త్వమును వీర్యవృద్ధిం గల్గించునని చెప్పఁబడినది.

**గోంతెమ్మ కోరికలు** — మాయజూదమునందు దాయాదులగు ధార్తరాష్ట్రులకు లోఁబడి పాండవు లరణ్యవాసమునకుఁ బోయినపుడు వారి జనయిత్రియగు కుంతీదేవి తన పుత్రుల భావిభాగ్యమును గూర్చి యనేకములగు మనోరథములనుకోరుచు మనస్సులోనే సమాధానమును, సంతృప్తిఁ జెందుచుండెను. ఆ కోరికలలో కొన్ని నెరవేరునట్టివి, కొన్ని యెన్నటికిని నెరవేరనట్టివి. అప్పటినుండియు ననేకములగు అందరాని కోర్కెలు కోరుచు డెందమునందే ఆనందించు మందభాగ్యుల వాంఛితములకు గోంతెమ్మకోర్కెలను పేరుకలిగెను.

**గోంకేటి సూరన్నకవి** — ఆంధ్రకవులలో నాథునికులందు పరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజసగోత్రము. తండ్రి కాశిరాజు. తాతపేరు కామరాజు. రచించినది కృష్ణాభ్యుదయమను ప్రబంధము. దీనిని బొల్లాప్రగడ కామమంత్రికిం గృతియిచ్చెను.

**గొడగలవాండ్రు** — వీరు ఆదిని మేదరకులమువారు. ఆదిని పరమేశ్వరారాధనకు వలయు పరికరములగు చాటలకు మైలసోకి

యపవిత్రతంగల్గించిన దోషమునకు వీరు మేదరి కులమునుండి తగ్గిపోయిరని చెప్పుకొనుచుండుట వీరికథనముగ నున్నది. అది వీరియందనుశ్రుతముగ జ్ఞాపకశక్తిచే పోషింపబడుచున్న కథనము.

**గొడుగు** — భరతదేశమున ఛత్ర మనాది పరిచితమే. భరతఖండమంతయు నేలిన భరత మహారాజు మొదలగు చక్రవర్తులను ఏకచ్ఛత్రాధిపత్యముగ భరతఖండమంతయు నేలిన భూపతులుగ నేటికిని ప్రశంసించుచుననే యుందుము. ఛత్రము ప్రభుత్వచిహ్నముగ నాటినుండియు నొప్పినది. మహారాష్ట్రసామ్రాజ్యమేలిన శివాజీమహారాజునకు ఛత్రపతియని బిరుదముండెను. నేటికిని ఆ బిరుదము నట్లె వారి సంతతివారగు కొల్హాపుర సంస్థానాధీశులు వాడుకొనుచునే యున్నారు

గొడుగులు సర్వసాధారణముగ బీదలు తాటి యాకులతో చేసి వాడుదురు. ఇవి వర్షాకాలమున నుపయోగించెదరు. మన్యపు ప్రాంతవాసులు అడ్డాకులు, మోదుగాకులు మొదలగు వాట్లతో చేసిన ఛత్రముల నుపయోగించుదురు. వాట్లకు గొడుగులని పేరు. పాశ్చాత్యవిధానమున రచింపబడిన గుడ్డగొడుగు లిక్కాలమున నెక్కువ ప్రచారమందియున్నవి. బర్మాదేశమున యాదికాలపు [illegible] వెదురుకఱ్ఱల గొడుగుల నేటికిని చేసి వాడుచునేయున్నారు. జపానుదేశమునందును పూర్వవిధానపు ఛత్రములే వాడబడుచున్నవి.

ఆంగ్లసీమయందు తొల్లింట గొడుగులు స్త్రీలే వాడుచుండుటయు పురుషులు వాడకుండుటయు యాచారమై యుండెనట. పారశీకదేశము, రష్యాదేశము మొదలగు దేశములందు వాణిజ్య మొనర్చుచు సంచారమొనర్చియుండిన Jonas Hanway మహాశయుడు క్రీ. శ. ౧౭౫౦ సంవత్సరమున తాను లండను నగరమున గొడుగు నుపయోగించ మొదలిడెనట. అయ్యది దురాచారమని కొందఱును, దైవమున కపరాధమని కొందఱును, ఇది వాడిన వర్షములుకురవక నిలచిపోవునని కొందఱును తలంచి యాతని నిరసించి యాతని వంచించిరట. పిదప రానురాను ఆబాధ వదలి పరిపాటయ్యెను.

**గోడౌన్** Godown (**గోదాము**) - వాణిజ్యసంబంధ పరిభాషాపదము. దీనిని Storage warehouse అనియెదరు. సరకులను నిల్వయుంచుకొను గృహము.

**గొట్టిగడ్డచెట్టు** - నమ్మచెట్టు చూడుడు.

**గొడ్డుగోతఁబడితే తలో బెడ్డ వేస్తారు** — ఆంధ్రలోకోక్తి.

**గొడ్డువాడు గొడ్డు కేడ్చితే గొడారి తోలుకేడ్చినాడట** — ఆంధ్రలోకోక్తి.

**గొడ్రాలికేమి తెలుసునురా బిడ్డ ముద్దు అనినట్లు** — ఆంధ్రలోకోక్తి

**గోనార్ధ** — అయోధ్యరాష్ట్రములోని ఇప్పుడు గోండా యనబడుచున్న తావు తొల్లింటి గోనార్ధపురమే. ఇది వ్యాకరణ మహాభాష్య కర్తయగు పతంజలి జన్మస్థానము. పతంజలికి గోనార్ధీయుండనియు పేరుండెను. ఈ మహనీయుడు క్రీ. పూ. రెండవశతాబ్దమున నుండిన వాఁడనియు, మగధరాజ్య మేలిన పుష్యమిత్ర మహీపాలునకు సమకాలికుఁడనియు, క్రీ. పూ. ౧౮౦-౧౫౦ సంవత్సరముల మధ్యకాలమున నీ వ్యాకరణభాష్యము రచించియుండుననియు లెక్కించియున్నారు.

మరియు ఉజ్జయని, విదిశా (ఇప్పటి-భీల్సా) పురములమధ్య నొక గోనార్ధమనుపురముండెను. దీనింగూర్చి వత్సగాతమును నామాంతరముగల

సుత్తనిపాతమున ప్రశంసింపఁబడినది. ఇంకను కాశ్మీరభూపతి గోనార్ధుండను పేరుగలవాఁడు పాంచాలమును జయించి యేలుటంజేసి పాంచాలమునకు గోనార్ధదేశమనియు నొకప్పుడు వాడుక యయ్యెను. గోనార్ధముంగూర్చిన ప్రశంస మత్స్యపురాణము ౧౧౩ అధ్యాయమున గలదు.

**గొప్పభవనములు, అందుకూర్చుండుటకు తావు**— ప్రపంచమందలి ఈ క్రింద వివరింపఁబడిన గొప్ప భవనములందు ఎందఱు జనులుకూర్చుండుటకు తావుగలదో దానివివరము.

| | |
|---|---|
| St. Peter's Chathedral, Rome. Italy. | 58,000 |
| Colısium, Rome, Italy | 87,000 |
| Cathedral, Mılan, Italy | 40,000 |
| Theatre of Pompey, Rome, Italy. | 40,000 |
| Theatre of Marcellno, France | 20,000 |
| St. Paul's Cathedral, Rome, Italy. | 38,000 |
| St. Paul's Cathedral, London, England | 31,000 |
| St. Petronıa Cathedral, Bologna | 26,000 |
| Antwerp Cathedral, Holland | 25,000 |
| Florence Cathedral, Italy | 23,500 |
| St. John's Lateran, Rome, Italy. | 23,000 |
| St. Sophıa Mosque, Constantınople. | 23,000 |
| Notre Dame, Parıs, France | 21,500 |
| Plasa Cathedral, Italy | 13,000 |
| St. Stephen's Cathedral, Vıenna. | 12,400 |
| St. Domınıc's Cathedral, Bologna. | 12,000 |
| St. Peter's Cathedral, Bologna | 11,400 |
| Vıenna Cathedral, Austria | 11,000 |
| Morman Temple, Salt Lake Cıty, U. S. A. | 8,000 |
| St. Mark's Cathedral, Venıce, Italy. | 7,500 |
| Madıson Square Gardens Hall New York, U. S. A. | 8,443 |
| Spurgeons Tabernacle, London | 6,000 |
| Bolshı Theatre, St. Petersburg | 5,000 |
| Unıversıty Hall, Ann, Arber | 3,500 |
| Musıc Hall, Cıneınnutı | 4,824 |
| Alexander Cathedral, St. Petersburg | 2,332 |
| San Carıos, Naples, Italy | 3,600 |
| Musıc Hall, Boston, England | 2,585 |
| Academy of Musıc Hall, Parıs France. | 2,002 |
| Imperıal St. Petersburg, Russıa. | 2,100 |
| La Scala, Mılan | 4,000 |
| Covent Garden, London | 2,684 |
| Ambıgue, Comıque, Parıs | 1,900 |
| Opera House, Berlın | 1,636 |
| Porte St Martın, Parıs | 1,800 |
| Theatre Lyrıque, Parıs | 1,700 |
| Odeon, Parıs | 1,650 |
| Academy of Musıc, New York, U. S. A. | 2,433 |
| Academy of Musıc, Phıladelphıa, U. S A. | 2,805 |
| Caıro Fellce, Genoa, Swıtzerland | 2,500 |
| Opera House, Munıch, Bavarıa | 2,307 |
| Tremynt Temple, Boston, U. S. A. | 1,942 |
| Beethoven Hall, Boston | 1,500 |
| Museum, Boston | 1,275 |
| Cooper Unıon Hall, New York, U. S. A. | 2,500 |
| Exeter Hall, London | 3,500 |
| Metropolıan Opera House, New York | 3,500 |
| Plymouth Church, Brooklyn, U. S. A. | 3,000 |
| St. James Method Church, Montreal, Canada | 3,000 |

**గొబ్బిచెట్టు** (నీరుగొబ్బి చెట్టు) – లా. Asteracantha longifolia సం ఇక్షుగంధా, ఇక్షుగంధికా, కోకిలాక్షః, కోకిలాక్షకః, కోకిలాక్షః. గొబ్బి యనియు, నీరుగొబ్బి యనియు ఈచెట్లు ద్వివిధము. ములుగోరింత లేక ముని గోరింతను గొబ్బిజాతిలోనిదేనని కొందఱు పొరపాటుగ దలంచుచుందురు గాని అది సరిగాదు. కొన్ని సామాన్య రూప సామ్యములున్నను గుణభేదమెక్కువగ గలదు. గొబ్బిచెట్టు గింజలు నీట నానించి వడియగట్టిన జిగట గుజ్జుగాని, పంచదార పానకమున గొబ్బిగింజల చూర్ణముగాని కల్పిగాని లోనికిచ్చిన ద్వారలో మిహాశాంతి బలముగల్గించి ఇంద్రియమును గట్టిపడజేసి పుంస్త్వమును రేపి రక్తములోని దుర్గుణముల నడంచి మూత్రము గుండా వీర్యముపడు(Spermmatoria)రోగము నివారించునని చెప్పంబడినది.

ఇంక నీరుగొబ్బి వేరు కషాయమునందు మూత్ర రోగముల నివారించు శక్తియు, మేహము, ఉబ్బు, ఉదరరోగముల నడంచుశక్తియు గలదని చెప్పం బడినది. దీనివేరు కషాయమునందు మూత్రము వెడలించి, ఉబ్బురోగము హరించుటయును, సమూలకషాయము సాగా ఉబ్బురోగము నడంచుటయును చెప్పంబడినది. ఈచెట్టు సమూలముం జిరుకనొట్టి ఆముదమున వెచ్చజేసి పైనికట్టిన సమస్త కీళ్ళనొప్పులు నివారించును. దీనియాకు కూరగవండుకొని కొందఱు తిందురని తెలిసెడిని. పాండు క్షయరోగుల కది యనుకూలమట.

**గొ(రెవిడ్చినని తోడేలుకు కనికరమా?**—ఆంధ్రలోకోక్తి.

**గొ(రెకొవ్వినదంతాగొల్లవానికే లాభము**—ఆంధ్రలోకోక్తి.

**గొఱ్ఱెలు** — గొఱ్ఱెలు మనదేశము నందరెఱిగినవియే. అది సాధువైనజంతువు. కత్తి చేతలేనివానిని గొఱ్ఱెకరచునని సామెతగ దెల్పుదురు. అనగా సాధువైన జంతువుసహితము నిరాయుధులను బాధించునని యతిశయోక్తిగ దెల్పుట. ఒక్కజాతి గొఱ్ఱెకు తప్ప తక్కినగొఱ్ఱెలకు తోకయుండదు. మగగొఱ్ఱెలు, ప్రోత్సాహపరచిన పోట్లాడుకొనును. ఇతరుల మాటలను విని యకారణముగ గలహమునకుం దిగినవారిని "గొఱ్ఱెపోతువలె పోట్లాటకుం దిగె" నని పరిహసింతురు. గొఱ్ఱెల పోట్లాటయం దొకప్పుడొక గొఱ్ఱె తనవైరిమీదికి నాలుగడుగుల ఎత్తున కెగిరెనని చెప్పంబడినది. గొఱ్ఱెలయందొకగుణము కలదు. ఒక గొఱ్ఱెలమంద నడచునపుడు అందొక గొఱ్ఱె ఏకారణముననో యొకవైపునకుం దిరిగిన తక్కిన గొఱ్ఱెలన్నియు కారణమరయకనె దానిం దప్పక వెంబడించును. ఈ యైకమత్యము గొఱ్ఱెలందసమానముగు విధిగ దనరెడిని.

పాశ్చాత్యులు గొఱ్ఱెలను నాల్గుతెగలుగ విభజించి, ఏబదిరెండు భేదజాతులుగనవి లెక్కించి యున్నారు. ఈలెక్క తెలిసినంతవరకని ఎరుంగునది. గొఱ్ఱెలజాతు లింకను ఇతరదేశములందు కలవనియు భేదజాతుల పరిశీలన ఇంకను జరగవలయుననియు తలంపబడుచున్నది. ఇంతవరకు పాశ్చాత్యులు విభజన మేరకు గొఱ్ఱెలు ౧. అడవిజాతి లేక కొండజాతి గొఱ్ఱెలు. ౨. పొడవు బొచ్చుగల జాతి గొఱ్ఱెలు (Long wools) 3 పొట్టిబొచ్చుగల జాతి గొఱ్ఱెలు (Short wools) ౪. ఇతరజాతుల విదేశపు గొఱ్ఱెలు (Foreign Sheep) అని నాల్గుతెగలుగ విభజింపబడినవి.

౧. అడవిజాతి లేక కొండజాతి గొఱ్ఱెలు-(Mountain Breed Sheep). 1: Black faced Mountain Sheep or Heath Sheep. 2. Scotch black face. 3. Lonk Sheep. 4. Rough Fell Sheep. 5. Swale

dale Sheep. 6. Derbyshire Sheep. 7. Cheviot Welsh Mountain Sheep. 8. Dartmoor Sheep. 9. Exmoor Horned or Porlock Sheep. 10. Gritstone Sheep. 11 Herdwick Sheep. 12. Limestone Sheep. 13. Old Norfolk Horned Sheep. 14 Radnor Sheep. 15. Penistone Sheep. 16. Big horns

ఇందు Big horns అను జాతి గొఱ్ఱెను ఉత్తర అమెరికాలో Rocky Mountain Sheep అనెదరు. ఇది చాల పెద్దజాతిగొఱ్ఱె. చురుకైనజాతి. మగజంతువులు గూడెలుకడ నలువది యంగుళములుండును. కొమ్ములును నలువది యంగుళముల పొడవునకు పెరుగును. బొచ్చు అధికము. బొచ్చు అడుగున వేఱొక మెత్తని బొచ్చుండును. ఈజాతి గొఱ్ఱెలందు తెల్లరంగు కలవి Kamchatka దేశమునను, నల్లరంగువి Cassia దేశమునను, పసుపురంగుగలవి Alaska దేశమునను, Brownish grey రంగు గలవి Siberia దేశమునను గాననగుచున్నవి. ఇవియన్నియు కొండజాతి లేక అడవి జాతి గొఱ్ఱెలని చెప్పంబడినవి.

౨. పొడుగుబొచ్చుగల జాతి గొఱ్ఱెలు (Long wools) ౧౧ జాతులు. 1. Leicester గొఱ్ఱెలు, 2. Border Leicester జాతి గొఱ్ఱెలు, Lincon గొఱ్ఱెలు, 4. Kent or Romney Marsh sheep, 5 Cots wooled sheep, 6. Wensleydale sheep, 7. South Devon sheep, 8. Devon long wool sheep, 9. Roscommon sheep, 10. Half breed Border Leicester cheviot type sheep, 11. Long and heavy tailed sheep తోకగల జాతి గొఱ్ఱె. దీని తోకయే చాలపౌనుల బరువుండెడిని.

3. పొట్టిబొచ్చుగల జాతి గొఱ్ఱెలు (Short wools) ౧౧ జాతులు. 1. South down sheep, 2. Shropshire sheep, 3 Saffolk sheep, 4. Hampshire down sheep, 5. Oxford down sheep, 6. Dorset down sheep 7. Dorset horned sheep, 8. Ryeland sheep, 9. Kerry hill sheep, 10. Clumforest sheep, 11. Western or Wiltshire horned sheep.

ఇందు పొడుగుబొచ్చు, పొట్టిబొచ్చు తెగలందలి ఇరువదిరెండు జాతులను ఆంగ్లదేశమువారు వృద్ధిపఱచి తామే ఈ పేరులిడిరనియు ఇవి తమ దేశమునందలి ప్రత్యేకజాతుల గొఱ్ఱెలనియు చెప్పెదరు

౪. ఇతరజాతుల విదేశపుగొఱ్ఱెలు (Foreign breed sheep) ౧౪ జాతులు.

౧. Hairy long legged- ఇది గినియా దేశపు గొఱ్ఱె. ఎత్తైన కాళ్ళుగలది.

౨. Hausa sheep- వంకరలు తిరిగిన కొమ్ములుగల జాతి.

3 Zulu sheep- తెలుపు నలుపువన్నెలుగల బొచ్చుశరీరము గలది.

౪. భరతదేశపు గొఱ్ఱె - మన దేశమున సాధారణజాతి.

౫. నేపాలదేశపు గొఱ్ఱె- దీని కొమ్ములు రెంటును కలసి పుట్టిపెరుచుకొనిపోయి ఒకే కొమ్మువలె నయి వెనుకకు వంగియుండుజాతి.

౬. Wallachian Sheep- ఇది ఆంగ్లదేశమునగల జాతి. దీనికొమ్ములు పెనుచుకుని చుట్టుకొని స్క్రూమేకువలె నుండెడిని.

౭. Abyssinian Sheep-గుఱ్ఱమునకువలె మెడపై జూలువెంట్రుకలుగలజాతి గొఱ్ఱెలు.

౮. Bharal Sheep- టిబెట్టుదేశమున గల జాతి. మేకలపోల్కిగ నుండును.

౯. Udad Sheep- దీనిని farbary Sheep అనియుననుటకలదు. ఇది తొల్లి ఆఫ్రికా ఖండపు అడవిజాతినంతతి గొఱ్ఱె.

౧౦. **Argil Sheep**- ఇది ఆసియాఖండపు మధ్యభాగపు సీమలందునను, ఈశాన్యదిశ సీమలందునను గానవచ్చుచున్న జాతి. పెద్దగాడిదలంతేసి యుండెడిని. క్రీ. శ. ౧౭౭౩ నుండి ఐరోపా దేశస్థులు దీనిని మార్కోపోలో గొర్రె యని పిలుతురట

౧౧. **Asiatic Urgil Sheep**- దీనిని **Shapo** జాతియనియు ననుటకలదు. చాల పిరికిజాతిగొర్రె. భయపడుచుండును.

౧౨. **Old Red Sheep**- దీనిని **Gmelin Sheep** అని కూడ ననుచున్నారు.

౧౩. **Moufion**- ఇది కోర్సికా, సార్డినియా ద్వీపములందుఁ గల గొర్రెజాతి. కొమ్ములు ముప్పదియొన్మిదంగుళముల పొడవున నుండును. ఇది ఇంగ్లీషు అడవిజాతిగొర్రెల సంతతి.

౧౪ **Asiatic Big-horned Sheep**-ఇది అమెరికాలోఁ గలజాతికి పూర్వపుజాతి. దీని నుండియె అమెరికాజాతి పుట్టినది. కొమ్ములు పెద్దవి. గొర్రె అమెరికాజాతివలె వృద్ధిపొంది పెద్దశరీరముకాలేదు

## గొలకోర (గడ్డ) చెట్టు

— దీనిం గూర్చి యంతగా దెలియదు. గొలకోరగడ్డ (దుంప) రుచిగానుండునదియు, పైత్యశాంతి గల్గించి బల మిచ్చి జఠరశక్తినిచేసి స్మృతిగల్గించు నదియనియు ఇంతయే కఫవాతము, క్రిమిరోగము, మూత్ర బద్ధము గల్గించుననియు ప్రసిద్ధవైద్యులు నుడువు చున్నారు.

## గొలిమిడి (ఇక్షుగన్ధచెట్టు)

— లాటిన్భాషయందుగొలిమిడిచెట్టునకు **Adenema Hyssopefolia** అనియు, ఇక్షుగంధమునకు **hygrophilia spinosa** యనియు భేదనామముల నాంగ్లపండితు లారోపించినను రెండు చెట్టు లొక్కటియేనని తలంపఁబడినవి. దీనికి సంస్కృతమునగల పేర్లేవియుఁ గానరాకున్నవి. కొందఱు గొబ్బిచెట్టుపేర్లగు ఇక్షుగన్ధా, కోకిలాక్షః, వజ్రకంటకః అని చెప్పుచున్నారు.

దీని సమూలరసము గాని సమూలకషాయము గాని అతిమూత్రరోగము, కఫరోగము, ప్లీహ, రాళ్లుపడు మూత్రరోగము, వాతముల నివారించు నందురు. దీనికూరయు భోజనపదార్థముగ నుపయోగించుట కలదనియు దానికి నివే గుణము లనియు నందురు

## గొలుగుచెట్టు

—(వరగోగు లేక వరగోగు) లా. **Salvadora persica** సం. కరభవల్లభః, గుడఫల. దీనిఅకురసము లేక కషాయము కఫ, గుల్మ, మూలశంక, వాతాదిరోగములపై చక్కఁగఁ బనిచేయునని చెప్పఁబడినది. దీని పసరును చిన్నపిల్లలకు పట్టుదురు. దీనిని వరగోగు, వరగోకి, వరగోగు చెట్టని వాడుకనామములు కలవు.

**గోకర్ణ నృపాలుఁడు** — ఈతఁడు క్రీ. వె. ౧౩౩౦ సంవత్సరముల కాలమునాఁటి వాఁడు. సూర్యవంశపుక్షత్రియుఁడు. చోళవంశీయుఁడు. ఇప్పటి నైజామురాజ్యమున వనపర్తి కిం (సంస్థానపురాజధాని) గతిపయదూరమున పాడైయున్న వర్ధమానపురము రాజధానిగ నాప్రాంతదేశ మేలినవాఁడట. తండ్రి భీమరాజు. మనుమని పేరు ఉదయాదిత్యభూపతి. అతనిపుత్రిక పద్మావతీదేవి. ఈమెను యుద్ధమొనర్చి రుద్రదేవుఁడు గైకొనెనని చెప్పఁబడినది. ఉదయాదిత్యుఁడు కర్ణాటకభాష నొక యలంకారగ్రంథము రచించెనందురు. శాసనములం దుదయాదిత్యుని జోడోదయుఁడని యనిరని తెలిసెడిని. భీమచ్ఛంద మగు కవిజనాశ్రయము రచించినది గోకర్ణనృపాలుఁడేననియు, భీమకవి నృసింహపురాణము రచించెననియు పరిశీలకులనుచున్నారు. గోకర్ణుని గురువు వాగీంద్రచూడామణి యనంబడు జైనమత సమయాచార్యుండట. అతని కోర్కెమేరకు కవిజనాశ్రయమును రచించి జైనుఁడగు రేచభూపతి యను వైశ్యునకంకితమిచ్చెనట. రేచభూపతి జగదేకమల్లుని సైన్యాధిపతి యని తేలుచున్నది. గోకర్ణునకు శ్రావకాభరణాఙ్కుఁడని బిరుదము గల్గెనట. గోకర్ణుఁ డనేకాగ్రహారములనిచ్చి శాసనములు వేయించిన మహనీయుఁడు.

**గోకర్ణక్షేత్రము** — బొంబై రాజధాని కార్వార్ (ఉత్తరకొంకణము) జిల్లాలోని యొక సుప్రసిద్ధ శివక్షేత్రము. M. & S.M. Railway పైనున్న హుబ్లీనగరమునుండి మంచిబాటపై మోటారుసర్వీసు కలదు. అంకోలాపట్టణమున కవ్వల వెస్టర్న ఘాట్సు పర్వతపఙ్క్తి కవ్వల పశ్చిమసముద్రతీరమునందున్న క్షేత్రము. ఇచటి మహాబల శివలింగము విఘ్నేశ్వరప్రతిష్ఠితమనియు, సింహళద్వీపప్రభువగు రావణభూపతిచే కైలాసాచలమునుండి తీసికొనిరాబడిదనియు చెప్పఁబడినది. ఇట గల శతశృంగి పర్వతముపై ఋష్యాశ్రమములు కొన్ని చూపుదురు. తామ్రగౌరి యనంబడు చిన్న కొండజక్కర ఎండిపోయియున్నది. సకలవైభవోపేతమగుక్షేత్రము. (గోరాష్ట్రదేశముచూడుడు). ఇంకను గంగను తెచ్చుటకు భగీరథుఁడు గోకర్ణమున తపంబొనర్చెనని రామాయణ బాలకాండ ౪౩ యందు చెప్పఁబడుటచే హిమవన్నగమున గంగోత్తరికవ్వలి భగీరథుని తపస్థలమున కీపేరుండెనో లేక భగీరథుఁడు ఇప్పటి గోకర్ణమున తపం బొనర్చెనో యని సంశయము కల్గెడిని. మఱియు వరాహపురాణము ౧౭౦ యందు సరస్వతీ నదీ సంగమమున గోకర్ణము చెప్పఁబడుటచే నది గోకర్ణతీర్థమై యుండనోపునని తోచెడిని.

**గోగు (గోంగూర) చెట్టు** — లా. **Cannabis sativa** సం. పీలుశాకము, కొందఱు శ్వేతసహస్రాక్షీ యనిరి. మరికొందఱు గోగుచెట్టును విరేచనఫలవృక్ష మనిరి ఇది ప్రసిద్ధ భోజనపదార్థము. ఆంధ్రదేశమందలి కృష్ణాగుంటూరుమండలములందు గోంగూర పచ్చడి (గోగు ఆకుల పచ్చడి) సుప్రసిద్ధమే గోగుచెట్లు ఎఱుపు, తెలుపురంగుల కాడలభేదముచే ద్వివిధము ఇంకను పొడుగు (ఎత్తుగ) పెరుగుజాతియు, పొట్టిజాతియు రెండు కలవు. ఇందు పొడుగుజాతికి జనపకూర చెట్టని పేరు. ఇది నారకై పెంచబడుచుండును. ఎఱ్ఱజాతిగోంగూరను పుల్లగోంగూర అనుటయుం గలదు. దీనియందు గుణబల మధికమని తలంపఁబడుచున్నది. దుర్గుణములైనను అధికమే. (జనపకూరచెట్టు చూడుఁడు.)

కార్శ్యమునకు బలముం గల్గించుటయు, శరీరమున రక్తమును శుభ్రపఱచుటయు, రేచీకటి (రాత్రులందు కండ్లుకనిపించని నేత్రరోగము) నడచుటయు, ఇంచుక పైత్యముగాని, మలబద్ధము గాని, విరేచనముగాని ఆయాశరీరతత్వప్రకృతుల మేరకుగల్గించుటయు, జ్వరదోషమును రేపుటయు గోంగూర సామాన్యగుణములు. నిల్వయుండిన పాతది నిర్దుష్టమై యుండును. (కొండగోగు చూడుఁడు.)

**గోగు నార వ్యవసాయము** — ఇచట గోగు అనిన ఆంధ్రదేశమున భోజనపదార్థముగ వాడఁబడుచున్న గోగుకూర (గోంగూర) చెట్లను నివియు నొక్కటియే యని పొరబడరాదు. ఇది కేవలము నారకై పెంచఁబడు పైరుగ యున్నది. ఇంకను దీనివలెనే నారకై



పెంచబడు జనపచెట్లు కేవలము మరొకజాతివయి యున్నవి

నారకు పనికివచ్చు గోగులందు రెండు భేద జాతులు గలవు. రెంటిని ఏటేట విత్తవలసినవియే. గుండ్రని కాయలుగల జాతి- ఈచెట్లు ఐదు మొదలు, పదియడుగుల ఎత్తువఱకు పెరుగును. దీనిని నీటిగోగు యనియు ననెదరు. మూఁడడుగులనీరు నిలచినను యీచెట్లు చెడవు. దీని నారకు ధర అధికమయి యుండును. ఇందికను ఆకుపచ్చరంగుగల మొక్కలు, ఎఱ్ఱని రంగుగల మొక్కలని రెండువిధము లుండును. అందు ఆకుపచ్చగ నున్న గోగునారకు ధర యధికముగ యుండును. ఈనీటిగోగు శ్రేష్ఠమైన జాతియని చెప్పఁబడుచున్నది. రెండవదియగు కోలకాయలుగల గోగు మెట్టగోగు అనఁబడును. ఇది నీరునిలవని భూములయందు చక్కగ పైరగును. గోగులన్నియు ప్రతిరకము నేలలోను పెరుగును. నీటిగోగు జమ్ముమొలచు నేలలో లాభకరమై యుండును. సున్నపునేలలు, ఇంకెర నేలలు గోగుజాతికి పనికిరావు. ఉప్పు అధికముగ నుండు నేలలందుసహితము గోగులు పైరు చేయనగునని కనిపెట్టఁబడినది. విత్తనములుచల్లు కాలమున భూమియందు దించుక చెమ్మయు, అంతకు పూర్వము భూమిని మెత్తగ దున్నుటకు వీలిచ్చుటయు గల్గినంజాలును. మెరకభూములలో కంది, సెనగ మొదలగునవి పండించినపిదప మెట్టగోగు చక్కగ పైరగుచున్నది. కలుపుచచ్చుటకు నడుమ నడుమ కొంత విరామముతో పొలముం దున్నుట శ్రేయమని కనిపెట్టఁబడినది. ఒండ్రునిలచు పల్లపు తావుల కెరువక్కరలేదనియందురు. యకరమునకు ఆముదాలపిండి ఆరుమణుగులు, ఎముకలపొడి మూఁడు మణుగులు, సూరేకారము ముప్పది శేరులు పశువులపెంటతోఁ గలిపి యెరువు వేయ వలయునని చెప్పబడ్డదిగాని, బరడ్వాన్ వ్యవసాయ పరీక్షలలో యితర ఎరువులకన్న ఎకరమునకు నూటయేబది మణుగులపేడ ఎరువు వేయుటయే శ్రేయమని కనిపెట్టఁబడినది

గోగువిత్తనములు ఎకరమునకు మూఁడు మొదలు నాలుగున్నర శేర్లు వఱకు వేయవలసి యుండును. ఈ జల్లుట సమముగ నుండుటకు తూర్పునుంచి పడమటకు సగమువిత్తనములును, ఉత్తరమునుంచి దక్షిణమునకు సగమును జల్లుచున్నారు. బంగాళాదేశమున నీటిగోగునారకొఱకు యధికముగ వ్యవసాయముచేయుట ప్రారంభమైనదాదిగ గోగునారజాతియందు బరాక్ జాతి, అమూనియా జాతి, బొంబై జాతి, కాక్యా జాతి, దేశవాళీజాతి బారాహాట్ జాతి యను వేర్వేఱు జాతులను విడదీసియున్నారు. ఈజాతులు పల్లపుప్రదేశములకు, మెరకప్రదేశములకుగూడ బనికివచ్చునట. కేవలము మెట్టవిత్తనములందు తరవయని, పాట్నల్లాయనియు, పార్బిలాజీయనియు, ఏవో వేర్వేఱుజాతుల నేరి పేరిడియున్నారు.

భూములయొక్క స్థితినిబట్టి మారినను, మూఁడుసార్లు కలుపుతీసిన చాలునని తెలిసెడిని. గోగు నార నాలుగు నెలలపంట. తీయుట యాలస్యమైన నార బిరుసెక్కి ధర తగ్గిపోవును. లేతపరువున తొందరపడి పెరికివైచిన నారయందు బలముండదు. ఆచెట్లను వారముదినములు వడలనిచ్చి నీటియందు నానవేయుదురు. నీరు అదివరకే చెడిపోయిన మురికిగుంటగా నున్నచో నార నల్లబడి నిగనిగఁ గోల్పోయి మంచిధర రాకుండును. ప్రవాహపుజలముల నార నానవేయరాదు. తగిన పదును వచ్చినంతనే పుల్లలం దీసివైచి నారం జక్కగ యుతికి గడగి దాచుకొందురు. యకరమునకు ముప్పది మొదలు ముప్పదిరెండువఱకువ్యయమగునని అంచనా వేయఁబడినది.

**గో(గ్రా (ఘుర్ఘరా) నది**—ఘుర్ఘరానది చూడుఁడు. దీనినే సరస్వతినది యందురు.

**గోచారము**—నవగ్రహములు ద్వాదశస్థానములయందు నుండునపు డిచ్చెడి గోచార ఫలములను తెలియజేయు చక్రము.

| గ్రహములు. | ౧. | ౨. | ౩. | ౪. | ౫. | ౬. | ౭. | ౮. | ౯. | ౧౦. | ౧౧. | ౧౨. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవిః | స్థానచలనం | భయం | సంపత్తు | మానభంగం | భయం | శత్రుక్షయం | దేహపీడ | రోగం | భయం | లాభం | ఆరోగ్యం | వ్యయం |
| చంద్రః | సౌజన్యం | వ్యయం | లాభః | రోగం | కార్యనాశనం | ధనం | లాభం | వ్యయమ్ | వ్యాకులం | లాభం | సుఖం | దుఃఖం |
| కుజః | భేదం | వ్యయం | లాభం | శత్రుపీడ | రిపుభయం | ధనలాభం | కలహం | భయం | వ్యయం | చలనం | లాభం | రోగం |
| బుధః | బంధం | లాభం | వ్యయం | శత్రుభయం | దరిద్రం | భ్రామణా | వ్యసనం | సంతోషం | దుఃఖం | శుభం | సుఖం | వ్యయం |
| గురుః | గమనం | ధనలాభః | ఆపత్తు | నాశనం | సంపత్తు | క్లేశం | ఆరోగ్యం | హాని | ధనాగమనం | హాని | సంతోషం | పీడా |
| శుక్రః | ఆరోగ్యం | భాగ్యం | సౌఖ్యం | సుఖం | పుత్రలాభం | మానహాని | క్లేశం | భయం | ధనలాభం | హాని | సౌఖ్యం | లాభం |
| శనిః | అఫలం | హాని | సంపత్తు | కుక్షిరోగం | బుభుక్షు | లక్ష్మి | రాజదండం | దుఃఖం | రోగం | జాడ్యం | లాభం | క్లేశం |
| రాహుః | భయం | కలహం | సౌఖ్యం | మానహాని | ధనవ్యయం | సుఖం | భయం | మృత్యువు | సంతాపం | కలహం | లాభం | హాని |
| కేతుః | భయం | విరోధం | సుఖం | మానహాని | ధనక్షయం | సుఖం | భీతి | హాని | కలహం | విరోధం | ధనాగమః | హాని |

**గోచికి పెద్దా కొల్లాయిగుడ్డకు చిన్నా** — (కొల్లాయి=అంగవస్త్రము) ఆంధ్ర లోకోక్తి.

**గోటమీటి తే పోయ్యేదానికి గొడ్డలియేల?** — ఆంధ్రలోకోక్తి.

**గోడబాగుంటే చిత్తరువులెన్నియైనా ఎక్కింపనగును**- ఆంధ్రలోకోక్తి.

**గోడలకుఁ గూడ చెవులుంటవి** అనగా రహస్యముపట్ల జాగ్రత్తయుని అదలించుట భావము. ఆంధ్రలోకోక్తి.

**గోడలు** (Walls) — సంస్కృతపు కుడ్య శబ్దమునుండి కల్గిన గోడయనుపద మీ గోడలాగూర్చి భరతదేశమున ననాదిగనే అభివృద్ధి విజ్ఞానముండినదని తెలుచున్నది. కోటగోడలు, వేల్పుల మందిరముల ఇంటిగోడలు, ప్రహరీగోడలు, మొదలగు వివిధములగు గోడలు తొల్లింటి కాలమునసే నిర్మింపఁబడినవి.

గోడలకాంగ్ల భాషయందు Walls అనిపేరు ఇవి రాతి సున్నములతోఁగాని, ఇటుక సున్నముల తోగాని, సిమెంటున్ను కాంక్రీటుతోగాని నిర్మింపబడును. ఇవి తిన్నని నిలువు గోడలుగగాని (Straight walls) ఒకప్రక్క తిన్నగనిలచియుండి రెండవవైపు ఇంచుక ఏటవాలు ఆకృతిగలవిగ గాని (Battered walls), కూడ నుండెడివి. ఇట్టివి ముఖ్యముగ కోటగోడలందునను, మురికిమట్టి జారి పడిపోకుండ నడ్డముగ నిర్మింపబడు తావులందును గానవచ్చును.

ఒక్కొక్కతఱి గోడలకుదన్నుగ వెలుపలి భాగమున దిమ్మలంగట్టి భద్రతం గుదర్చుటయుం గలదు. ఆపకట్టులకు మారుగ చిన్నచిన్న నదులందు జలప్రవాహమున కడ్డముగ రాతి సున్నములతో బలముగ, అధికముగ నెత్తులేని గోడలంగట్టి నీటి మట్టమునందెత్తు గల్గించి మరల్చి కాల్వలగుండా పొలముల కంపుటయుం గలదు. హార్బరులందు (Harbour) Dock walls లేక Quay walls మొదలగు Retaining walls వేల్పుల పనులాజేయు తగినదిగ నుండవలసి యుండును. ఏలనన ఈగోడ లోకవైపున స్టీమరుల బరువునుమోయు నీటిని, రెండవవైపున సరకును, మనుష్యులను, క్రేన్సు మొదలగు బరువులను మోయు Platform నకును మాధ్యస్థత వహించి నిలువవలసి యుండెడిని.

నీటినిగాని, మట్టిబరువులనుగాని పడిపోనీయక నిలపుటకై నిర్మింపఁబడిన గోడలకు Retaining walls అనిపేరు. (హార్బరు ఇంజనీరింగు చూడుఁడు).

**గోధా (శాఖ) క్షత్రియులు** — శిశోదియా (శాఖ) క్షత్రియులు చూడుఁడు.

**గోతమేశ్వర (జైన) విగ్రహము**- శ్రావణ బెళగోళము చూడుఁడు.

ఇది మైసూరు రాజ్యమున మైసూరురెయిల్వే పైని ఫ్రెంచిరాక్సు అనంబడు స్టేషనునుండి ఐదు మైళ్ళదూరమున శ్రావణబెళగోళముకడ కొండల మధ్యనున్నది. గొప్పవిగ్రహము.

**గోతిక్ ఆర్కిటెక్చర్** (Gothic architecture) — ఈగృహనిర్మాణ విధానము నిజమున Goths అనంబడు ప్రజల సంబంధముకలది కాదు. పాతకాలమునాఁడే ఫ్రాన్సు, ఇంగ్లాండుదేశములందు దేవాలయములకు వాడిరి. కాని అజ్ఞులు దానికిఁగోతులపేరిడిరేమో. నేటికి నాపేరుననే దనరుచున్నది.

**గోదాయని గోత్రము** – కధ లేక కధ్యగణము చూడుఁడు.

**గోదాయన గోత్రము** — పీతహవ్య లేక యాస్కగణము చూడుడు. హారిత ఉప గణము చూడుడు.

**గోదావరీనది (గౌతమీనది)** — దీనికై తపంబొనర్చి పరమేశ్వరానుగ్రహంబు బడసి గంగం గొని, నదిగ భూమియందు తన త్రియంబకాశ్రమము నుండి బంగాళాఖాతము వరకు గోదావరినదిం బ్రవహింపంజేసిన గౌతమ మహర్షి పేర నీనది గౌతమి యనంబడుచున్నది. దక్షిణఇండియా యందిది పెద్దనది. పొడవు తొమ్మిదివందల మైళ్ళుండునందురు. మనుష్యుల కుపయోగించుచు పొలములం దడపుటయందిది గంగానదిం బోలియుండును.

బొంబై నగరముకు ఈశాన్యదిశగ డెబ్బదిమైళ్ల దూరమున పడమటి కనుమలందు త్రియంబక క్షేత్రమున (తొల్లింట గౌతమాశ్రమము) నొక రాతియందు మూడుధారలుగ జనించుట త్ర్యంబకమని పేరంది గౌతమీనది యాయెను. ఇట గౌతమప్రతిష్ఠిత శివలింగముంజూపుదురు. ఇచటికి అరేబియన్‌సీ ఏబదిమైళ్ళ తిన్ననిదారిని యుండిన నుండునట. కొండదిగినై ఋతిదిశగ ప్రవహించుచు తోడన వేఱొక ప్రవాహముం గల్పుకొని ఇంచుక పెద్దదిగనై నాశికపట్టణము గుండా పంచవటి ప్రక్కగ నడచి కుడి ఎడమల లెక్కలేని ప్రవాహములం గల్పుకొనుచు బలపడి పైఠణ్ పట్టణముదనుక సరిహద్దుగ నుండి నిజామురాష్ట్రమునంజొచ్చి సరస్వతీక్షేత్రమగు వాసరీ ప్రక్కంబడి వరద, మంజీర, పైంగంగ మొదలగు ప్రవాహముల నన్నిటిని గల్పుకొని బలపడి ఒక మైలుమొదలు వేఱ్వేఱు తావులందు రెండున్నర మైళ్ళవఱకు వెడల్పుకలదియై భద్రాచలము ప్రక్కంబడి నడచి తూర్పుకనుమల దరిజేరి పాపికొండలనంబడిన కనుమలనడుమ వెడలుపుతగ్గి ఎక్కువ లోతుగలదియై ఎక్కువ వడితో ప్రవహించును. ఇచట పర్వత పైభాగములు రెండు వందల గజములు దూరముండునటుల మూసిన తావులుం గలవు. వాటిక్రింద కొండవలె నున్న పర్వతమునుండి ఏడుమైళ్ళు గోరిజగుండా నడచును. ఆగోరిజకు రాజమహేంద్రవరము నలువది మైళ్ళ దూరముండెడిని.



పిదప గోదావరి లంకలం జుట్టికొని పెక్కుపాయలై తిరుగ కలసికొని పోలవరము ప్రక్కగను వీరభద్రస్వామి దేవళముగల పట్టణము ద్వీపముంజుట్టి నడచి, రాజమహేంద్రవరము ప్రక్కంబడి ధవళేశ్వరము, విఘ్నేశ్వరము (తొల్లింటి విజయేశ్వరము) ల నడుమనుండి పెక్కుపాయలుగజీరి నడుమ కోనసీమం బోలిన ద్వీపములు గడచి సముద్రముం జేరును

**గోదావరీ (గౌతమీ) నది వైనతేయశాఖ** —ఇది గోదావరీనది ధవళేశ్వరపు ఆనకట్టకడ నైనశాఖలలో వశిష్ఠశాఖనుండి చీలి వేఱుగ సముద్రగామి యగు శాఖానది. దీని ప్రశంస బ్రహ్మపురాణము ౧౦౦ అధ్యాయమున గలదు ఈవైనతేయశాఖకు సుపర్ణయనియుం బేరుకలదు.

**గో ది హోల్ హాగ్ (Go the whole hog)**— "కడవరకు నల్లెపనిచేసి పూర్తి రొనర్పుము "అనుట కీయుక్తిని వాడుచున్నారు.

తొల్లింటి ఆంగ్లసీమలందు పందిమాంసము విక్రయించుటకు పందిని భాగములుగ కోయుచు కొనవచ్చినవారి కోరికొలది భాగము చొప్పున విక్రయించుచుండిరట. దానింబట్టి ఈయుక్తి యేర్పాటుగలైనట. 'go' కిబహువచనరూపము goes త్రాగుబోతులు మొదలగు అవినీతిపరుల కీపేరున

వాడుచున్నారు. ఒకప్పుడిద్దరు సుప్రసిద్ధ మద్యపానాగ్రేసరులు ఒక సారాయి దుకాణమున కేగి ఇద్దరుకలసి త్రావి అంతలో నొకఁడు "Now we'll go" అనఁగా రెండవవాఁడు "we will have another and then go" అని ప్రత్యుత్తరమిచ్చి వారించెనట. అట్లు ఇద్దరు త్రాగుచు ఒకఁడు పోదమనుటయు రెండవవాఁడు మఱిమూఁడు త్రావి పోవుదమనుచుండుటలతో దుకాణము మూయు బహువఱకుఁ జరపి దుకాణము మూసినపిదప వెడలి పోయిరట దానినుండి యిట్టివానికీపేరు వాడుక యయ్యెను

**గోదోహనన్యాయము** — క్రతువు నాచరించువారు కొన్ని క్రతువులందు పాలకొట్టితో జలములుగాని తేవలసియుండును. అన్ని క్రతువులందట్టి విధియుండదు. ఏదైన నరుకాగ జేయఁబడి అది విధియైయుండినకతన నట్టిదానిని వివరించుటయం దీన్యాయము వాడుదురు

**గోధనగిరి** — గోధ పర్వతమున కీపే రుండెను. దీని ప్రశంస బాణభట్టుని హర్షచరిత్రయందు కలదు.

**గోధుమలు చెట్టు** — లా. Triticum sativum, Triticum vulgare. ఆంగ్ల Wheat plant. సం. గోధూమః ఇవియు వరివలెనే భోజన ప్రధాన పదార్థముగుట, దాని బార్లీ పొలములందు పండు గడ్డిజాతిలోనిది. ఇంద నను తెల్లగోధుమ, ఎఱ్ఱగోధుమ, తోకగోధుమ, అడవిగోధుమ మొదలగు జాతులును, పెద్ద గోధుమ గింజల బహుజాతియు చిన్నగింజల బహుజాతియుఁ గూడ గలవుగాని దీనిపంటయగు గోధుమలన్నియు సమానముగనే చూడఁబడుచున్నవి. మఱియు ధాన్యమునకువలెనే గోధుమ గడ్డియు పశువులకాహారముగ నిడఁబడుచుండును. గోధుమలు వరిబియ్యముకంటె ఎక్కువ బలకరములు. విరేచనమును వెడలించు గుణము వీటి యందు కలదు. ఉత్తరదేశములందిది ముఖ్యభోజన పదార్థమగుట దీనినందఱెఱిఁగియే యున్నారు.

**గోధుమవ్యవసాయము** — గోధుమలు భరతదేశమందధిక భాగమున ముఖ్యాహార పదార్థముగ గనబడుచున్నది. పదును తన యందు నిలుపుకొనగల బలహీనములుగాని సర్వ భూములు దీనికనుకూలములు. మందముశాకత్తులు చేసిన మధ్యరకపు బలహీనపు భూములు సహితము ఉదక స్వాస్థ్యముగల్గిన గోధుమపంట కనుకూలించును. బరోడా సంస్థానమునందు, బొంబాయి రాజధానియందు ఉదక స్వాస్థ్యముతో గరపభూములం దీపంట పండింపఁబడుచున్నది. గోధుమలతో నితరపంట వేయు పద్ధతి కలదుగాని, అదియంత లాభకారికాదని తేలుచున్నది. ఇది పరిస్థితులననుసరించియు, కాలము ననుసరించియు, మూఁడున్నర లేక నాలుగున్నర నెలలలో పండుపంటగ యున్నది. ఎబ్బది పౌనుల విత్తులు ఎకరమునకు పట్టును. భూముల ననుసరించి పదిహేనుదినముల కొకతడిగాని వారము దినములకొక తడిగాని నీరిడుచుందురు. పరిశీలనల వలన నొకటిన్నర పౌనులు సూరేకారపు పొడి నొకటిన్నర పౌనుల ఎముకలపొడిగాని లేక ఐగుమణుగుల ఆముదపుపుచ్చు, గోధుమ పొలముల కవసరమనియు, యీమూఁటిలో భూమి కేది యవసరమో యెఱిఁగి వేయవలయుననియు, బలమైనయెఱుభూములకు యెరువువేయనక్కర లేదనియు, చెప్పఁబడినది. పల్లపు పంటకు ఎకరమునకు రెండువేల పౌనుల గోధుమలను ఒకటన్న గడ్డియు పండుననియు పల్లపు వ్యవసాయమునకు వేయి పౌనుల గోధుమలు ఫలించుననియు పరిశీలనల నుండి తేలుచున్నది. గోధుమలందనేక రకములు

గలవు. అందు ఢిల్లీ ప్రాంతముల పైరుచేయఁబడు గుండెన్న ఫేడ్ గోధుమలును, అయోధ్య ప్రాంత సీమల డౌది గోధుమలను, డెరాయిస్మాలీఖాన్ ప్రాంతముల నున్న సఫేదు గోధుమలును మధ్యరాష్ట్రములలోని తెల్లగోధుమలును చాల శ్రేష్ఠములని చెప్పబడుచున్నవి. ఇంకను మంచి రకములు పెక్కుగలవు. గోధుమపంటకు రస్టు అనుపేరుగల వ్యాధి గొప్పనష్టముం గల్గించును. చేను పంటకువచ్చు నదనున ఎండలులేక మబ్బులుగా నుంటయు, అకాలపు వర్షములు పడుటయు నీవ్యాధికి కారణములని తలంపఁబడుచున్నవి. కాని ఈవ్యాధి కాప్లీయనుజాతి గోధుమలకు తాకదని చెప్పుదురు. వేఱొకవ్యాధి స్మట్ యనునది గూడ గలదనియు, విత్తులు పొలములో జల్లుటకు ముందు నూరుతులముల నీళ్ళలో అరతులము మైలుతుత్తము కరగించి అందులో విత్తులనుదడిపి ఎండించి నాటిన నీరోగము పట్టదనియు పరిశీలకులనుచున్నారు.

**గోధూళికాలము**— సాయంకాలమున పశువులు మేతనుండి ఇండ్లకరుదెంచుచుండు కాలము. (అభిజిత్తు చూడుఁడు).

**గోనాగ సర్పములు** — ఈ మహానాగమును ఉత్తరహిందూస్థానమున హామద్ర్యాడ్ అనియు, ఆంగ్లభాషయందు Naia Bungarus అనియు పేరులు కలవు వాడుకగా లేకున్నను ఈజాతి పాములకు నాగరాజమనియు, మహానాగములనియు పలుతావులందునుడివియున్నారు. ప్రపంచమందలి విషసర్పములలో నగ్రగణ్యమనియు, కఱచి విషముం బ్రయోగించునేని పది లేక పదునేను నిమిషములలో మృతికలుగుననియుం జెప్పంబడినది. దీనిపొడవు పదియడుగులనుండి పదునేనడుగుల ఆరంగుళముల దనుక నుండునందురు. అధికబలము, శరీర త్రాణ, బలవత్తరమగు విషముంగలది. బొంబై నగరపు నేచురల్ హిస్టరీ సొసైటీవారి ప్రదర్శనమున నీ జాతి పాము చర్మమొకటి పదునేనడుగుల ఐదంగుళములది కలదు.



గోనాగము కాటునుండి త్రాచుబాముకఱచిన విషముకన్న పదిరెట్లు అధికబలముగల విషమును కాటునకుం జేర్చునని పరిశీలకులు కనిపెట్టిరి. ఇట్టి ఘోరవిషమును పరిహరింపగల శక్తి బర్మాదేశపు టడవులలో నుండు నొక వృక్షముయొక్క బెరడునందుకలదని తెలిసెడిని. డాక్టరు నికోల్సను బర్మాదేశపు హామద్ర్యాడ్ (గోనాగ) సర్పమొక పాములంబట్టువానిం గఱచెననియు, అయ్యది పదియడుగుల పొడవుగల బలమైన గోనాగమనియు, ఆ పాములవాఁడా కాటును సరకుగొననట్లే ఏదో చెట్టుపై బెరడును నోటవైచుకొని నమలి మ్రింగుచు దాని నాకాటు తావున రుద్ది, తోడనే తన ప్రయత్నమును వీడక నా పాముంబట్టు ప్రయత్నము సాగించుచుండెననియు వ్రాసియున్నారు. గోనాగసర్పపు కాటునుండి కల్గు మృతిని ఒక గొప్ప వైద్యపుంగవుఁడు పరిశీలించి ఇట్లు తెల్పెను.

"There is first a feeling of intoxication, then a creeping paralysis sets in commencing at the legs, mounts to the body, finally to the head. Breathing becomes increasingly difficult and finally impossible. A convulsion usually heralds the cessation of respiration, but the heart may on beating for a minute or two longer".

ఈ గోనాగసర్పవిషముంగూర్చి పరిశీలనలొనర్చిన వేఱొకయాంగ్లవైద్యశాస్త్రవేత్త భరతదేశపు సాధారణపు త్రాచుపాముల Venom నుండి చేసిన Anti-serum తో ఇంజక్షను ఇచ్చినచో

కాచుపాముల విషదోషమును హరింపజేసి జీవింపగల్గునగుంగాని గోనాగ దష్టమునందు కొంత కాలము ఇంచుక జీవనమును పొడిగించుంగాని చావు తప్పదని వ్రాసియున్నాడు. గోనాగవిషములకు ఏంటిసీరమ్ ట్రీటుమెంటు వీలుకాదట.

ఈ మహానాగములు హిమాలయ పర్వతారణ్యములందు, అస్సాముదేశమునందు, దక్షిణ ఇండియా దేశమున కొలందిగను, చీనాదేశపు దక్షిణభాగములందు, బర్మాదేశము వేర్వేఱు సీమలందు, అరణ్యములందు, మలయా, ఫిలిప్పైను ద్వీపములందు కానవచ్చుచుండును. దీనికి కోప మధికము. సాహసమెక్కువ అకారణముగ బాధించునది. పాము నాలుగడుగుల ఎత్తువఱకుం గూడ పడగ నెత్తగల బలముగలది చెట్లు నెక్కగలది నీటంబడి ఈదగలది. ఇతరజాతి పాములం గూడ తినివేయును.

జనవరి ఫిబ్రవరి నెలలలో జోడుకట్టునని యు, మే, జూను మాసములందు దాదునాగము లీని గ్రుడ్లుపెట్టునని యు పరిశీలకు లనుచున్నారు. (గోనాగక్షేత్రము చూడుఁడు).

**గోనాగ క్షేత్రము** — పంజాబు దేశమున లూఢియానా మండలమున లూఢియానా నుండి ౧౭ మైళ్ల దూరమున చప్పార్ అను గ్రామమునందు గల సుబ్రహ్మణ్యక్షేత్రము. నార్తువెస్ట్రన్ రెయిల్వే యందు చప్పార్ స్టేషను కలదు.

ఇట దేవాలయములోనుండి చల్లని గాలి వచ్చుచుండును. అద్దానిని గోనాగముయొక్క ఊపిరిగాలి యనెదరు. ఇట నొక గొప్ప యాత్ర జరుగును. లక్షమందిజను లేతెంతురట. (గోనాగ సర్పము చూడుఁడు).

**గోనియోమేటర (Goniometer)**— మూలలను(Angles) కొలచుటకైన పరికరము.

**గోపక పురము** (గోవా) — గోపకవన రాష్ట్రము చూడుఁడు.

**గోపకవనము** — పశ్చిమ సముద్ర తీరమున గల పోర్చుగీసు గోవాపరిసరారణ్యము నకు పేరు. గోవా అను పేరు లేక గావో అను పేరు దీనినుండియే కల్గెనని తలంపంబడు చున్నది.

**గోపకవనరాష్ట్రము లేక గోవవన రాష్ట్రము** — ఇదియు పరశురామక్షేత్ర మనంబడిన సప్తకొంకణముల వాగ్దులలో నొకప్పుడు పేరంబరగిన రాజ్యము. దక్షిణకొంకణమున ఇప్పటి పోర్చుగీసు గోవా పరిసర దేశముగ పోల్చుచున్నారు గోవాపురమును గోపకపురము లేక గోపకవనపురము నని వాడుచుండిరట అది మారి నానాంటికి గోవా లేక గావో యైనదట. ఇక్కాలమున గొప్ప రేవుపట్టణముగ నున్నది. దీనిం దొల్లి కాదంబనృపతులు పాలించిరి. గోవా పట్టణమున కెదురుగ సముద్రమునందొక ద్వీపము కలదు. దానికిం దొల్లింటిపేరు దీపవతి యనియో లేక ద్వీపవతి యనియో నుండెనట ఇప్పుడు దివార్ అని వాడుటకలదు. పోర్చుగీసుభాషను ద్వీపమునకు నార్వెమ్ అనియు, అందున్న పట్టణమునకు పాంజిమ్ అనియు పేరులుకలవు. అందుపోర్చుగీసు ప్రభుత్వకార్యాలయములున్నవి. మఱియు నాద్వీపముయొక్క ఉత్తరపుకొనను సప్తమహర్షి ప్రతిష్ఠితమని చెప్పంబడుచున్న సప్త కోటీశ్వరమహాదేవ దేవస్థానము కలదు.

**గోవన గోత్రము** — కుండినగణము చూడుఁడు.

**గోపరాష్ట్రము లేక గోపరాష్ట్ర దేశము** — బొంబైరాజధాని నాశికజిల్లా యందు ఇగాత్పురి పట్టణప్రాంతదేశమని పోల్చు

చున్నారు. మహాభారతము భీష్మపర్వము ౯ అధ్యాయమున దీనిప్రశంస కలదు.

**గోపవన గోత్రము** – అత్రేయగణము చూడుఁడు.

**గోపవన్మ గోత్రము** — అత్రేయ గణము చూడుఁడు.

**గోపాచలము** (గోపాద్రి) — రోహితాస్ పర్వతమునకు గ్వాలియరు కోటయున్న కొండకు కాశ్మీరములోని శ్రీనగరముకడనున్న తత్త్ సులేమాన్ కొండకు నిమధ భూమి (నార్వాత్ సెంట్రలిండియా) లోని గోశృంగ పర్వతమునకు ఈపేరు వర్తించెడిని. గోశృంగ పర్వతప్రశంస మహాభారతము సభాపర్వము ౩౧ యందు కలదు. రోహితాస్ పర్వతమునకు గోపాద్రి యని పేరు. కాశ్మీరములోని శ్రీనగర పరిసరములనున్న తత్త్‌సులైమాన్ పర్వతమునకు గోపాద్రి యనిపేరు. శంకరాచార్య పర్వతము చూడుఁడు. గ్వాలియర్ కోటయున్న పర్వతమునకుం గోపాద్రియనిపేరు. ఇప్పుడు తత్త్‌సులేమాననబడుచున్నది. (సాదిమానపర్వతము చూడుడు). దీనిప్రశంస దేవీపురాణము ౨౫ యందు కలదు.

**గోపాయన గోత్రము**—వశిష్టగణము చూడుఁడు.

**గోపాయన గోత్రము** — వాధ్ర్యస్వ లేక మిత్ర యువగణము చూడుఁడు.

**గోపాల కుండము (గోల్కొండ)**- తొల్లింటి కాలకుండపురము చూడుఁడు.

ఇది విద్యారణ్య స్వామి (మాధవాచార్య) జన్మస్థానము. ఒకప్పుడు నైజాం రాజ్యపు రాజధానియై యుండెను. ఇట నొక వజ్రముల గని యుండె నందురు. హైదరాబాదున కారు మైళ్ల దూరము.

**గోపాలకృష్ణ గోకలే** — దేశ సేవా పరాయణుఁడగు నీమహనీయుఁడు క్రీ. శ. ౧౮౬౬ సంవత్సరమున బొంబై రాజధానిరత్నగిరి మండలమున చిప్లను తాలూకాకుం జేరిన యొక చిన్న పల్లెగ్రామమున బీదలగు మహారాష్ట్ర కుటుంబమున జన్మించెను

ఈయన తండ్రి ఈయన పండ్రెండవ యేటనే మరణింప, జ్యేష్ఠ సోదరుఁడగు గోవిందరావతనిని పెంచి విద్య గరపెను. గోకలేగారు క్రీ. శ. ౧౮౮౪ లో పట్టపరీక్షలోఁ గృతార్థులైరి. అత్తరుణముననే ఆకాలపు పూనాలోని పెద్దలచే స్థాపింపఁబడిన దక్కను విద్యాసంఘమున యావజ్జీవ సభ్యుఁడై దాని కనుబంధముగ స్థాపింపఁబడిన పూనాఫెర్గుసన్ సర్వకళాశాలయం దుపాధ్యాయపదవింబడసి తన యభిమాన విద్యలగు అర్థశాస్త్రము, చరిత్రలు బోధించుచు పదునెనిమిది సంవత్సరములు గడపెను. దాని పద్ధతులు మేరకు నెలకు డెబ్బదియైదు రూప్యముల సంబళముఁ గైకొనుచు నిరువది సంవత్సరములు ఆ యుద్యోగము నందుండి నెలకు ముప్పది రూప్యములు ఉపకార వేతనము గైకొనియెను. ఈ మహనీయుఁడు శలవుల క్రింద కాలము వ్యర్థము చేయునందున పదునెనిమిది సంవత్సరముల నాఁటికి అనగా ౧౯౦౨ నాఁటికి రెండు సంవత్సరములు శలవు తీసికొన సావకాశమున్న కాలము కలసి వచ్చుటచే నిరువది వత్సరములైనట్లు భావింపఁబడి ఉపకార వేతన మొసంగిరి. నాఁడాదిగ దేవసేవా పరాయణుఁడాయెను.

కాలేజి యందున్న కాలముననే ౧౮౮౭ సంవత్సరము నుండి పూనా సర్వజనసభా కార్యదర్శియై వారి త్రిమాస పత్రికకు సంపాదకుఁడై నడపు చుండెను. 'సుధాకర' యను పత్రికను

నడపుచు నాల్గు సంవత్సరములు సంపాదకుఁడై యుండెను.

పిదప బొంబాయి రాజధాని సంఘమునకు కార్యదర్శియై నాల్గు సంవత్సరములు సేవ యొనర్చెను. ౧౮౯౭ సంవత్సరమున వెల్బీకమీషన్ ఎదుట సాక్ష్యమీయ నింగ్లాండున కేగి గావించిన ప్రబోధము దేశమంతయు వ్యాపించి ప్రఖ్యాతి నించెను.

బోంపూర్ నాశిక మండలముల ప్రతినిధిగా బొంబాయి శాసన నిర్మాణ సభకు ౧౮౯౯ సంవత్సరమున సభ్యుఁడాయెను. పిదప ౧౯౦౨ సంవత్సరమున వైస్రాయిగారి చట్టనిర్మాణ సభా సభ్యుఁడై ౧౩ సంవత్సరములు మహోపకార కార్యము లొనర్చెను

ఈయనకు క్రీ. శ. ౧౯౦౪ సంవత్సరమున సి. ఐ. ఇ. బిరుద మీయఁబడినది. ౧౯౦౫ సంవత్సరమున సర్వెంట్సాఫిండియా సొసైటీని స్థాపించి తానందు ప్రథమ సభ్యుఁడై యావజ్జీవ సేవ యొనర్చెను. ఈమహామహుండు భరత దేశోద్ధరణమున కింగ్లాండున కేగి యెన్నోపర్యాయములు చేసిన సేవవలనఁగల్గిన మహోపకారములు, అసంఖ్యాకములు. ఈమహాత్ముఁ డెప్పుడును తన బోధల వలన దేశమును కడగండ్ల పాల్జేసిన దేశోద్ధారకుఁడు గాఁడు, ప్రజా నాయకుఁడనని తానెప్పు డనుకొనలేదు.

౧౯౦౫ సంవత్సరమున కాశీలో జరిగిన దేశీయ మహాజనసభ కగ్రాసనాధిపతి యాయెను. రాయల్కమీషన్ సభ్యుఁడాయెను. నిరతము దేశ సేవయందే గడపి దేశ సేవాసంఘ కార్యాలయమున క్రీ. శ. ౧౯౧౫ ఫిబ్రేవరి ౧౯ తేదీని పగలు పదిగంటలకు ప్రాణములు విడచెను. ఈయన కిద్దరు కుమార్తెలుండిరి. కుమాళ్లు లేరు. భార్యకొంతకాలము క్రిందటనే గతించియుండెను. (సర్వెంట్సాఫిండియా సొసైటీ చూఁడుఁడు).

**గోపాలనృపతి** — మగధదేశమేలిన పాలవంశ నృపతి. (మగధరాజ్యము చూడుఁడు.) ఈతనిసుతుఁడు ధర్మపాలనృపతి.

**గోపాలి గోత్రము**— పరాశరగణము చూడుఁడు.

**గోపాలుని సింగయకవి** — ఆంధ్ర కవులలో నాధునికులందు పరిగణింపబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు, మౌద్గల్యసగోత్రము, కర్నూలు ప్రాంతనివాసి యని తోచెడిని. తండ్రి పేరు వీరరాజు, తాతపేరు భాస్కరుఁడు.

భారవికృతమగు కిరాతార్జునీయమును పద్యకావ్యముగ రచించి, అహోబలనృసింహస్వామికిఁ గృతిసమర్పించెను.

**గోపి గోత్రము** — పరాశరగణము చూడుఁడు.

**గోపీనాథము వేంకటకవి** — ఆంధ్ర కవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. వెలనాటి బ్రాహ్మణుఁడు, కావలిపురముకడనున్న లక్ష్మీపుర గ్రామము నివాసము, వెంకటగిరి సంస్థానమున నాస్థానకవిగా నుండినవాఁడు, పెక్కు గ్రంథముల రచించినవాఁడు, భాస్కరరామాయణాదులను మూలానుసారముగను, వాల్మీకి రామాయణ మంతయు పద్యములుగ రచించినవాఁడు, బ్రహ్మకైవర్తపురాణములోని శ్రీకృష్ణ జన్మఖండమును, శిశుపాలవధ, భగవద్గీతాశాస్త్రము మొదలగు పద్యకావ్యము లెన్నిటినో రచించినవాఁడు, ఈయనకు వెంకటగిరి వారగ్రహార మిచ్చిరట.

**గోపీచందనము** - సుద్దమట్టి చూడుడు.

**గోపుచ్ఛయతి** — ఇది సంగీతశాస్త్రపు యతిగాని కవిత్వసంబంధముకాదు. (యతిప్రాణము చూడుఁడు).

**గోపుచ్ఛాగ్రము** — శాఖాగ్రములు చూడుఁడు.

**గోపోదంతి గోత్రము** — ఉప మన్యుగణము చూడుఁడు.

**గోబలీవర్ధన్యాయము** — ఆవులు అంబోతు న్యాయము.

**గోబాలమఖాలీపుత్రస్వామి** — బౌద్ధభిక్షువు. అంబలత్తికావన (ఇప్పటి ఖాన్మతీ గ్రామ) నివాసి. ఇది నాలంద విశ్వవిద్యాలయ ముండినతావు. ఈయనయే అజీవక బౌద్ధమత శాఖానిర్మాత. (మగధదేశము చూడుఁడు).

**గోబీఎడారి** — చీనారాజ్యములోని మంచూరియా దేశమునందున్న గొప్పఎడారి. దీనిని షామోఎడారి యనియు నందురు. ఎడారియందు హాన్హాయ్ అనంబడు పెద్దదియగు పల్లపు ప్రదేశము కలదు. అద్దానియం దొకప్పుడు నీరుండి ఎండి పోయెనట. హాన్హాలనిన ఎండిపోయిన సముద్రమని యర్థము. (మంగోలియా దేశము చూడుఁడు). సముద్రపు నీటిమట్టముపై ౪,౦౦౦ అడుగుల ఎత్తుప్రదేశమునందున్న ఎడారి. 3,00,000 చతురపుమైళ్ల వైశాల్యముండునందురు. ఇందు కప్పఁబడిపోయిన పట్టణముల అనవాళ్లుంట నిది యొకప్పుడు జననివాసభూమిగా నుండనోపునని అనుమానించుచున్నారు. దీనిసంగతి సరిగాఁ దెలియరాదు.

**గోభానుఁడు** — అత్రి సంతతి, చంద్ర వంశపు క్షత్రియుఁడు, తండ్రి పేరు వహ్ని, కుమారుఁడు కరంధముఁడు.

**గోభిల గోత్రము** — శాండిల గణము చూడుఁడు.

**గోమంతగిరి**—పడమటి కనుమ (Western Ghats) లేక సహ్యాద్రి యందొక శిఖరమునకు గోమంతగిరి యని పేరు. ఇట శ్రీకృష్ణ బలరాములు జరాసంధుం జంపిరని హరివంశము ౪౨ యందు చెప్పఁబడినది. ఇట గోరక్షకుకలదు. అది గోమంత పర్వతములోనిది. ఇది గోమంత దేశములోని దని (గోవా దేశము లేక కొంకణదేశము) పద్మపురాణము ఆది ౬ యందు చెప్పఁబడినది. బొంబై రాజధాని ఉత్తర కన్నడ జిల్లా.



ఇంకను గుజరాతులోని రైవతక పర్వతమునకును గోమంతమని పేరు కలదని మహాభారతము సభాపర్వము ౧౪ అధ్యా. చెప్పఁబడినది.

**గోమతి**—అయోధ్య రాష్ట్రములోని లక్నో నగరము ప్రక్కగ ప్రవహించు గోమతీ (ఇప్పటి పేరు గుంతీ) నదింగూర్చి రామాయణ అయోధ్య కాండము ౪౯ అధ్యాయమున ప్రశంస కలదు.

మఱియు గోదావరి (గౌతమీ) నది జన్మించు తావున నినదికి గోమతీ నది యనిపేరు. శివ పురాణము ౧-౬౪ యందు చెప్పఁబడినది. గుజరాతునందు ద్వారక పట్టణము కడ ప్రవహించు నది కీపేరు గలదని స్కాందపురాణ అవంతీ ఖండమున ౬౦ యందు గలదు. మాళ్వ దేశమున చంబల్ నదియొక్క ఒక శాఖానదిపేరు కల దని మేఘసందేశము ౧-౪౭ యందు కలదు. ఇంకను అఫ్ఘను స్థానమున గోమాల్ నదికిని, పంజాబు నందలి కాంగ్రా జిల్లాలోని ఒక నదికిని తొల్లింటి పేరులని తెలియుచున్నది.

**గోమతీ ద్వారక**—ద్వారకలు చూడుఁడు.

**గోమయపాయస న్యాయము**— ఆవుపేడయు, ఆవుపాలును ఆవునుండియె వచ్చుంగాన రెండును సమమేనని వాదించు అసందర్భపు వాదసంబంధిన వాదన కీన్యాయము వర్తించెడిని.

**గోమాయన గోత్రము** — నిధ్రువ గణము చూడుము.

**గోమాల్పాస్ మార్గము** — ఖైబరు పేస్ చూడుము

**గోమహిషీ న్యాయము**— ఆవునకు, గేదకు స్నేహపు కలయిక యుండదు. అట్లని విరోధభావమును ఉండదు.

**గోముఖ పర్వతము** — రుద్ర హిమాలయమునకుం జెంది గంగోత్తరికడ నున్న పర్వతభాగము. (గంగానది చూడుము).

**గోముఖ వ్యాఘ్రము** — తన క్షేమముగోరెడి మిత్రునివలెనే నటించుచు కుటిలాలోచనల వలన ఘాతకమొనర్పజూచు దుష్టుని కీపేరుసామెతగావాడుచుందురు. గోవుముఖముతో నున్న పులియని యర్థము.

**గోముఖుండు**— శాకల్యుని శిష్యుండు.

**గోమూత్రగోత్రము** — శాండిల గణము చూడుము

**గోమేధికము** — గోమేధికము నవరత్నములలో నొకటి. ఆంగ్ల. Agate అనిపేరు. సం గోమేదః, గోమేదకం అని పేరులు. గోమేధికమునందు జాతిభేదములు పెక్కులు కలవు. కాని వాటికిం బేర్లులేవు. ఇది వజ్రమంత స్వచ్ఛముగ లేకున్నను కొంతవఱకు స్వచ్ఛతం గల్గియుండును. ఆంగ్ల విద్వాంసులు గోమేధికమును Quartz జాతికిం జేర్చిరి. ఈమణి ఆభరణములందు బిగించుదురు. ఇంకను గొప్పవారి ఇండ్లయందు గోమేధికముతో చేయంబడిన కల్వములు, చిన్నగిన్నెలు, చిన్నపాత్రలు మొదలగునవి చేయించి వాడుదురు. బంగారమును తీగలుగ సాగదీయు నొక పనిముట్టునందు మధ్యభాగపు ప్రధానావయవముగ నీగోమేధిక రత్నమమర్పంబడి యుంట నాపనిముట్టునకే అగేట్ అని పేరయ్యెను. అగేటనునదము ఆంగ్లభాషకు అమెరికాదేశపు పదమై చేరినదిగ జెప్పంబడినది. ప్రాశ్చాత్యులకు జూన్ మాసపు జన్మకాలమణిగను, ఆరోగ్యమును, దీర్ఘాయువును సూచించు రత్నముగను గోమేధికము దనరారుచున్నది. లాటిన్ భాష యందు గోమేధికమునకు Achates అనిపేరు. సిసిలీ ద్వీపమున నీపేరుగల నదియొద్ద నీరత్నము తొలుత వారికి గనబడినకతమున పాశ్చాత్యులీ నామమిడిరట. అనాదిసిద్ధమైన గోమేధికనామము దాని స్వచ్ఛతనుండి గల్గియున్నది.

గోమేధికము Chalcedoney అనియు దీనియందు అనేక రకముల Silicas కలవనియు ఆంగ్లపండితులనెదరు. ఆయుర్వేద వైద్యులు గోమేధికమును శాస్త్రయుక్తముగ భస్మముం జేసి ఉపయోగింతురు. లోనికిచ్చిన కామిలరోగము, జ్వరములు, దగ్గులు, పాండురోగము, పైత్యము, ఒగరుపు, క్షయరోగము, వాతరోగములు నివారణమగునని చెప్పంబడినది.

**గోయ ల్వాల్ క్షత్రియులు** — చౌహానులు చూడుము.

**గోరంటచెట్టు** (గోరింత, గోరింట) —లా Lawsonia alba. ఆంగ్ల. Henna plant.

గోరింత ఆకు నూరి ఆడపిల్లలు అట్లతదియ, ఉండ్రాళ్లతదియల పూర్వదినముల సాయంకాలము చేతి, కాలివ్రేళ్లయందు పెట్టుకొందురు. పూదోటలందు బాటల ప్రక్కను కంచెలుగ వేయుదురు. ఈజిప్టు దేశమున గోరింతలందు శ్రేష్ఠమైన జాతి యొకటికలదు. అద్దాని పూవులు మిగుల సువాసన గలవి. వాటి నాదేశమున నమ్మువారు స్వర్గీయ పరిమళమని యరచుచు నమ్మెదరు. దీని చెక్క కషాయము పైనరాసిన కాలిన పుండ్లు, నోటి పుండ్లు, చిడుము, గజ్జి మొదలగు చర్మరోగములు

మానును. ఆకునూరి పైనవేసికట్టిన పైపుండ్లు మానును, తలనొప్పి నిమ్మళించును, పుప్పిగోళ్లు మానును, గోళ్లు ఒలముగ పెరుగును, తల వెంట్రుకలు దృఢపడును, గ్రంథులు, గాయములు మాన్పట్టును, వాపులు తీయును.

ములుగోరింటచెట్లు దీని పేరున బరగుచున్నను దీని జాతివి కావు. వాటి ప్రత్యేక స్థానము లందు వాటి నెఱుంగ వలయును.

**గోరంటకులగోత్రము** — కురటకుల చూడుఁడు.

**గోరంతవుంటే కొండంతచేసినట్లు** ఆంధ్రలోకోక్తి.

**గోరక్పూరుజిల్లా** — గోరక్షకపుర మందు గోరక్పూరునగరము ప్రధానస్థానము. (ఆగ్రా ప్రోవిన్సు చూడుఁడు).

**గోరథ గోత్రము** — ఉపమన్యు గణము చూడుఁడు.

**గోరక్షాసనము**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. తొల్లి గోరక్షనాథయోగి యభ్యసించి యోగసిద్ధింబడసినకతన నా మహనీయునిపేరం బరగనాయెను. గోరక్షనాథుఁడను పేరంబరగుచు నా మహాయోగి ఉత్తరహిందూస్థానమున నేటికిని పూజింపఁబడు చుండుట గానవచ్చెడిని.

గుదస్థానమునకు పైభాగమును, అండములకు క్రిందిభాగమును సీవనిస్థానమందురు. ఆసీవని స్థానమున కిరుదెసల రెండుకాళ్ల మడిమ లుంచి మడిమలు ముందునకు, వ్రేళ్లు వెనకకుండునటుల పాదములం దిరుగవైచి, పాదములం జోడించి రెండు చేతులను వెనుకవైపున ద్రిప్పి జాలంధర బంధమును ముక్కుకొనచూపులను నిలిపియుండుటకు గోరక్షాసనమనిపేరు. దీని యభ్యాసమున సకలరోగనాశనమై స్వప్నములు నిలచిపోయి ఆరోగ్యము స్థిరపడునని చెప్పఁబడినది.

**గోరాత్రి త్రయోదశి** — భాద్రపద శుద్ధ త్రయోదశి. ఘూర్జరదేశమున గోరాత్రివ్రత మొనర్చు వ్రతదినము. (పండుగలు చూడుఁడు).

**గోరాష్ట్ర కొంకణము** — సప్త కొంకణములలో నొకటి చూడుఁడు. (కొంకణ దేశము చూడుఁడు).

**గోరాష్ట్ర దేశము**—తొల్లి గోకర్ణమొక ద్వీపమై యుండెననియు, అది గోరాష్ట్ర దేశమనియు నచటివారనెదరు. స్నాన సంకల్పమున అట్లే చెప్పుచున్నారు. ఇది సప్తకొంకణములలో నొకటి. పరశురామక్షేత్రము గోకర్ణము ప్రధానస్థానమైయుండెను. ఇది ప్రసిద్ధ శివక్షేత్రము. సింహళద్వీపమేలిన రావణభూపతి కైలాసమునుండి తెచ్చిన శివలింగమిట ప్రతిష్ఠింపఁబడినదని స్థలపురాణమునఁ జెప్పఁబడినది. బొంబై రాజధాని కర్వార్ (ఉత్తర కన్నడ) జిల్లా కుంతా తాలూకాలోనున్నది

ఈపురముగుండా తామ్రగౌరియను పేరుగల చిన్ననది ప్రవహించుచు నిట పశ్చిమసముద్రముం జేరుంగాని, ఇక్కాలమున సిగరికట్టంబడి పొలములకుం గొంపోబడుట నదియందు సముద్రపునీరు కొంతకలసుగాని, నదిగాలేదు. ఇటఁగల శతశృంగి పర్వతముపై పెక్కు ఋష్యాశ్రమపు తావులు, గుహలు కలవు. పాదమున శ్రీరాముఁడు తొల్లింట వసించిన గుహయు, రామతీర్థమను జలధారయుఁ గలవు. ఇచట మహాబలేశ్వర శివలింగము సుప్రసిద్ధము. దీని ప్రశంసలు మహాభారతము ఆది ౨౧౭ యందునను, శివపురాణము 3-౧౫ యందునను కలవు.

**గోరీ వంశము** — మహమ్మదు గజినీకొంబిదప క్రీ. శ. ౧౧౭౫ మొదలు ౧౨౦౬

పర్యంతము ఢిల్లీ, అజమీరు, కనూజ, బీహారము, బాగాళముల మహమ్మదీయ రాజ్యముల స్థాపించినవాఁడని చెప్పఁబడినవాఁడు మహమ్మద్ గోర్. ఈతఁడు చంపఁబడి బలాత్కార మరణము పాలాయెను. ఈతనికిఁబిదప నీతని బానిస కుతుబుద్దీన్ క్రీ. శ. ౧౨౦౬ లో సింహాసన మెక్కెనట.

**గోరుచిక్కుడుచెట్టు** — లా Dolichos faboeformis. దీని కాయలు భోజనపదార్థము. వీట్లను చేతి గోరులతోఁ చిక్కి ముక్కలుగఁ జేరి వాడుదురు గాన గోరుచిక్కుడు అనిపేరుకల్గెను. పైత్యము, అజీర్తి, కడుపుబ్బు లను చేయును. గుల్మరోగి దీనికి విరుగుడు నవాబు

**గోరుచుట్టుపై రోకటిపోటు** — ఆంధ్రలోకోక్తి.

**గోరోచనము** — దీని కాంగ్లమున Biliary calculus of Cow or Ox అనెదరు. గోరోచనము వార్ధక్యమున కనవచ్చుకుం బ్రతికి నైసర్గికపుమృతినందిన పసుగ్రుమున నుండు పైత్యపుత్తిత్తియా నంగుడది నీనికి సంస్కృతపు పేరులు గోపిత్తా, గోపిత్తజా, గోమతీ, గోరుచీ, గౌతమీ, గౌరీ, గ్రహహా, గోరోచనా. పైత్యము, కాకిజేసి, విషదోషము హరించుననియు, వీర్యవృద్ధిం గల్గించుననియు, అజీర్ణము, వాతము నివారించుననియు, పిల్లల జలు బలు, జ్వరములు, దగ్గులు మాన్పుననియు, నీళ్లనరగదీసి పైపూసిన పాము, తేలు విషముల విరుచుననియు, వెన్నతోఁగాచి పైమర్దనచేసిన పట్లుతప్పిన కీళ్ళకొసనలవాగి తిరిగ బలమొసంగు ననియుఁ జెప్పఁబడినది.

**గోలకొండ దుర్గము (తొల్లింటి పాలకొండ)** — ఆదిని గోపాలుండను నొక యోగి ఇప్పటి గోల్కొండ దుర్గముండిన గుట్టయందొక గుహలో వసించుచు యోగసాధన క్రియలు నెరపుకొనుచుండ నాగుట్టకు (కొండకు) గోపాలుని కొండయని వాడుకకల్గెను. అది రానురాను గోపాలకొండగ వాడుకయందే క్లుప్త రూపమునంది మరికొంతకాలమున కింకను "పా" యక్షరము కూడ లోపింప వాడుకయందు గోలకొండయాయెనని అచ్చట నొకప్రతీతికలదు.

దీనికిం దార్కాణముగ నాకొండయందేగల యొక గుహను అందువసించు కొందఱు హిందు వులాజూపుచు నాఁటినుండి నేఁటికిని ఆ గుహ హిందువుల వశమందే యున్నదనియెదరు. ఈ తావుయొక్క ప్రాముఖ్యతం గుర్తించియేమొ వరంగలు పట్టణమున రాజ్యమేలుచుండిన యప్పటి త్రిలింగ భూపతి తన సైన్యము నొకటి యిటయుంచ నొక మట్టికోటం గట్టెననియు, నది రాజకీయ కారణములచేరకు గుల్బర్గ బహిమనీ సుల్తాను మహమ్మదుషాకు క్రీ శ. ౧౩౬౪ లో వశపఱ్పఁబడెననియుఁ జెప్పంబడినది.

ఈ బహమనీరాజ్యము క్రీ. శ. ౧౩౪౭ మొదలు ౧౫౧౨ వఱకు నుండినది (అనగా ౧౬౫ సంవత్సరములు) గాన గోలకొండ మట్టి కోట బహమనీ ప్రభుత్వమునకు దాని ప్రారంభ దశయందే సమర్పణమైనదిగ మనసునందుంచు కొనఁదగును. ఈ బహమనీరాజ్యము రెండవ అల్లాయుద్దీన్ బహమనీసుల్తాను పాలనమున ౧౪౩౬ నుండి బలపడి గొప్ప యుచ్ఛదశ ననుభవించెంగాని పిదప నచిరకాలముననే భిన్నమై యైదు వేర్వేఱు మహమ్మదీయ రాజ్య ములుగ చీలిపోయెను. అందు గోల్కొండ కుతుబ్షాహి రాజ్యమొకటి.

అక్కాలమున గోల్కొండయందు రాజప్రతి నిధిగ నుండిన క్వాలికుతుబ్షాహి ౧౫౧౨ లో స్వతంత్రతగా తానే గోల్కొండసుల్తాన్ (నవాబు)

నని ప్రకటించుకొనెను. తోడనే తన రాజధానిగ గోల్కొండ మట్టికోటను రాతితోకట్టి బలపఱచెను. అతఁడు ముప్పది సంవత్సరములు (౧౫౪౩ సెప్టెంబరు దనుక) అజేయుఁడై రంజకముగ రాజ్యమేలుచు నాదినమున మశీదునందు ప్రార్థించుచుండుతరి నాతని జ్యేష్ఠపుత్రుఁడు జంషెడ్కూలీ కుతుబ్షాహి తన సేవకుండగు మీర్మహమ్మద్హమేదాని యనువానిచే (కొంబది సంవత్సరముల వృద్ధుండగు) తండ్రిం జంపించి మశీదునుండియే గోరిలోని కనిపెను.

పిదప జంషెడాలీ ప్రభువయ్యెంగాని (రెండవ సుతుఁడగు) ఈతని తమ్ముఁడిబ్రాహీం గర్భ విరోధిగ నుండెను. క్రీ॥ శ॥ ౧౫౫౦ లో నీతని యకస్మాన్మృతికిపిదప నెలలబాలుండగు నీతని సుతుని సింహాసనముపై నుంచిరి. అతని పేరు సుభాన్కూలి కుతుబ్షాహి. ఇబ్రహీం కోటంజొరంబడి యాక్రమించి తాను సింహాసన మెక్కెను. (ఇది ౧౫౫౦) ఈ ఇబ్రాహీముకూలి కుతుబ్షాహి ముప్పది వత్సరములు రాజ్యమేలి ౧౫౮౦ లో మృతినొందెను. ఈతని శాసన మొకటి గోల్కొండ దుర్గపు మక్కీదర్వాజాపై నున్నది.

ఈతనికింపిదప నీతని మూడవ కుమారుఁడు మహమ్మద్కూలీ కుతుబ్షాహి రాజ్యమునకు వచ్చి గోల్కొండ కైదుమైళ్లదూరమున మూశీ నదీతీరమందున్న భాగ్యనగరమున నొకదుర్గముం గట్టి కొన్నిభవనములను నిర్మించి తన రాజధానిగ చేసికొనెంగాని గోల్కొండను వదలక పటంగూతో పాలించుచునేయుండెను. గోల్కొండ జలవాయువులక్కడ్యమున నిరుకై అనారోగ్యవంత మగుట దానికొఱకట్లు చేయవలసివచ్చెనని చెప్పుంబడినది. ఈతండే (హైదరాబాదునందలి) చార్మినార్ కట్టించెనట. జామామశీదును ఈతండే కట్టించెనని శాసనమున్నది.

ఈతని కొర్కమెరకతని యనంతరము మేనల్లుఁడగుసుల్తాన్మహమ్మదు రాజ్యమునకువచ్చెను. అతనికింపిదప నాతని సుతుం డబ్దుల్లాకూలీ కుతుబ్షాహి సింహాసనమెక్కెను. ఇది ఢిల్లీయందు మొగలాయి చక్రవర్తి యౌరంగజేబు పరిపాలన కాలము.

ఈయబ్దుల్లాకడ ప్రధానమంత్రిగ నుండిన మీర్ జుమ్లా తన సుతుని కొక రాజ్యముం గూర్పు నుద్దేశముతో ఔరంగజేబు చక్రవర్తికిలోనై యాయనకడనుండి యొకలేఖం గొనివచ్చి యబ్దుల్లానవాబున కందిచ్చెను. దానింగాంచి యది కుట్రగా నెంచిన యబ్దుల్లా మీర్ జుమ్లాను జైలునందు నిర్బంధించెను. ఆవార్త యౌరంగజేబున కెఱుకయై గొప్ప సైన్యముతో తన సుతుండగు మహమ్మదుసుజీమ్ (రాకొమరుని) సైన్యాధిపతిగ నొనర్చి యబ్దుల్లాపైకి పంపెను. అప్పటికి అబ్దుల్లానవాబు గోల్కొండదుర్గమునాశ్రయించెను. మొగలై సైన్యములు భాగ్యనగరము (పిమ్మట హైదరాబాదు) నాక్రమించుకొనియెను. తోడనే చక్రవర్తియగు ఔరంగజేబునకు యబ్దుల్లా తనకుమార్తెనిచ్చి కరిణముమొనర్చ రాజీయయ్యెను. భాగ్యనగరమున చక్రవర్తియొక్క ప్రతినిధి యుండుట కంగీకరింపుతో తిరిగి అబ్దుల్లావశ మొనర్పంబడియెను. మరియు నాతండు ౧౬౭౨ లో మృతినంద నాతనిమేనల్లుం డగు అబూల్హసన్ గోల్కొండ నవాబాయెను. అకాలముననే భాగ్యనగరమును హైదరాబాదు నామధారిగ మార్పునందెను.

ఈ అబుల్హస్సేనునవాబునకే తానా యని వాడుకనామ ముండెను. తానా యనిన కులాసాపురుషుండని యర్థమట. పిదప నీపేరే ఆంధ్రు

లంచు తానీషాగా మారిపోయెను. గోపన్న రామదాసుగారు భద్రాచలం దేవస్థానపు కట్టడములను సర్కారు బొక్కసమునుండి కట్టించిన కథకాలపునవాబు తానీషాయే. సర్వదా ఒమార్ ఖాయమ్ కవివరుని కవిత్వముతోను, కంచెనీల టుమ్రీపాటలతోనుమత్తుడైయుండి, కాలము గడపుచుండిన భూపతి. మొగలై చక్రవర్తి ప్రధానసేనానియగు ఖానిజహాన్ నీతిని బట్టి చెఱనుంచి, రాజ్యము మొగలాయిరాజ్యమునకు గల్పివైచెను.

ఔరంగజేబునకు విదప మొగలై సామ్రాజ్యము అస్తమించగయ్యోను అక్కాలమున హైదరాబాదు (భాగ్యనగరము) నందు మొగలై రాజప్రతినిధిగానుండిన అసఫ్‌జా హైదరాబాదు మొదటి నిజాముల్ముల్కుగ ౧౭౦౭ నందు ప్రకటించుకొని స్వతంత్రుండాయెను వారిసంతతివారే ఇక్కటి నిజాములు.

గోల్కొండకోట దుర్గ మిక్కిలమున పాడుపడుచున్నను దానిని వివరించి ముగింతుము గాక. దుర్గము నిర్మింపబడినకొండ భూమినుండి ఐదువందల అడుగుల ఎత్తుకలది. పెక్కుతావులందు కొండపాదమునకూడ కోటగోడలు కలవు. కొండ నెత్తిపైనను, కోటబురుజులపైని ఔరంగజేబు యుద్ధకాలమునందుండిన ఫిరంగు లట్లే యున్నవి. కోటయందు ఎనుబదియేడు బురుజులును, ఎనిమిది ద్వారములును నిర్మింపబడినవి. అందు నాల్గు ద్వారములిప్పుడు కప్పివేయబడి తక్కిన మెక్కా, జమాలీ, బంజారా, ఫతే దర్వాజాలుమాత్రము వాడబడుచున్నవి. లోనికరుగగనే నవామహాల్ (తొమ్మిది ప్రాసాదము) లను కట్టడముకల దది పాడుపడుచున్నది. లోన నింకను జామామసీదు, శిలాఖానా(Armoury), అంబార్ఖానా (Store house of Valuables) మొదలగు భవనములున్నవి. అందు కడపటిది అబ్దుల్లాకుతుబ్షాహి నవాబు ౧౬౫౭ లో నిర్మించెనని శాసనము కలదు.

రాజభవనము (నివాసభవనము) న్యాయసభామందిరము పాడుపడు చున్నవి కాంచ నగును.

**గోలకొండ వేరులు** — నైజాము రాజ్యమునకు తొల్లింటి రాజధానిపురము. ఇచట వజ్రపుగను లుండెనని ప్రతీతి కలదు.

అట్టి అబద్ధములాను చూడిన, గోలకొండ దచ్చీలు కొట్టుచున్నాడనుదురు. గోలకొండ చిక్కుడుకాయలను పేరుగల ఒకదినుసుశాకము కలదు. రామానుజీయ వైష్ణవబ్రాహ్మణశాఖలలో నొకశెగవారిని (బ్రహ్మపురవైష్ణవ... ము) గోల్కొండవ్యాపారు లనియెదరు. ఆజను ... దేశపు వర్తకులు గానోపు

**గోలాగోకర్ణ నాథము** — ఇది గొప్పశివక్షేత్రము అయోధ్యరాష్ట్రమున రోహిల్ఖండు కుమాంరోయిల్వేపై నున్న పురాతన స్థలము. ఒకసరస్సుఒడ్డున గొప్పదేవళమున నాల్గడుగుల లోతుగల కుండలములోగల గోకర్ణనాథ శివలింగము రావణ ప్రతిష్ఠితమని చెప్పబడినది. చెఱువుచుట్టు దేవాలయములు, మఠములు, సత్రములు కలవు ఇట నివసించువా రందఱు గోసాయిలే.

ఫాల్గుణమా దొకటి, చైత్రమునం దొకటియు గొప్ప ఉత్సవములు జరగును. ఒక్కొకటి పదునేను దినములు జరగును. ఈపవిత్రస్థలి పదునెన్మిది మైళ్లు చతురపుప్రదేశమట. తూర్పున పదునెన్మిది మైళ్లదూరమునన్న దియోకాలిగ్రామమును, దక్షిణమున అంతేదూరమునగల బాల్మియార్ బార్కర్ గ్రామమును, పశ్చిమమున నదేదూర

మందున్న మత్రిగ్రామమును, ఉత్తరమునం దంతే దూరమున మహాపూర్ గ్రామమును ఈపవిత్రస్థలికి ద్వారములని చెప్పఁబడినది.

**గోశేయ గోత్రము** — ఆత్రేయ గణము చూడుఁడు.

**గోర్జి** (Gorge of a river) — నది మెత్తని ప్రదేశములం బ్రవహించుతరి చాల లోతునకుంగోసివేసిన గండి. దీని కమెరికాదేశము నందు Canon (కేనన్) అనియెదరు. (కానన్ చూడుఁడు). ఇది ఇంగ్లీషుశబ్దము. గోర్జి అనునది పల్లెలలో వాడుకొనుచున్న కృతకశబ్దము.

**గోర్డియన్ నాట్** (Gordian Knot)_ దుస్సాధ్యమగునది లేక గొప్పచిక్కు యని భావము. Phrygia నరపతి యగు Gordius అనునాతఁడొక యవస్థాకాలమున నొక గొప్ప ముడివైచి యందు కొనలు రెండును బయటికగుపడకుండునట్లమర్చి దానిని తమ జాతిదైవముకడ నుంచెనట. ఆముడి నెవ్వఁడు విడఁదీయునో ఆతనికి జయమును, ఆసియాదేశమును వశమగునని యాదైవము తెలిపెనట దానికి అలెగ్జాండరు దానిని తన ఖడ్గముతోఁగోసి ఛేదించి విడదీసెనట.

**గోల్కొండ భట్టర్లు** — గోల్కొండ వ్యాపారులు చూడుఁడు.

**గోల్కొండ వ్యాపారులు** — ఆంధ్రదేశపు బ్రాహ్మణశాఖలలో నొకటిగ నున్నవి. వీరందఱు రామానుజీయవైష్ణవమతస్థులు. వీరిని తెలగాణ్యపు నియోగులనియు, బ్రహ్మపుర (ఉత్కలదేశమునం దున్న బరంపురము) వైష్ణవులనియుకూడ ననుట కలదు. వీరంద ఱొకపేరం బరగుచు నొకేరీతి నగుపడుచున్నను వీరియం దైకమత్య మధికముగఁ గన్పట్టుచున్నను వీరియందు భేదములు లేకపోలేదు.

వీరియందు గాదివారిలో నొకశాఖయు, కాఖారివారు, కొండుపర్తివారు, గుండాలవారు, గుండుమళ్ళవారిలో నొకశాఖయు, న్యాయపతివారు, పరాఙ్కుశంవారు, బచ్చువారు, మంగువారిలో నొకశాఖయు రాపోలువారు పూర్వవైష్ణవు లనంబడుదురు వీరు శ్రీవేంకటేశాధీశాధిభట్టరు వారి సంతతివారనియు, తిరుమలనివాసులగు వైష్ణవసాంప్రదాయస్థులనియు చెప్పుచున్నారు. (వేంకటేశాధీశాధిభట్టరు చూడుఁడు) వీరికిం భట్టరులని వాడుక యుండెనందురు.

భట్టరులు కొందఱు గోల్కొండసీమ కరగి యట నివాసులుగ నుండుటచేతన గోల్కొండ భట్టరు లనంబడిరట. తక్కినవారిం దిరుమలభట్టరులని వాడుచుండిరట. ఆతిరుమలభట్టరులే దక్షిణదేశపుసీముల కరగి ఇప్పుడు ద్రావిడవైష్ణవు లనం బరగువారి పూర్వులుగ నుండిరనియు, గోల్కొండ భట్టరు నానాఁటికి వ్యాపారవృత్తిం గైకొనుట గోల్కొండవ్యాపారులనంబరగి క్రమముగ నుత్తర సర్కారులకును, నెల్లూరిసీమకుం జేరిరనియు, మరియుబరంపురపు సీమయందు వీరధికసంఖ్యాకులుగ నుంట వీరిటీవల బ్రహ్మపురవైష్ణవులను నామముం గైకొనిరనియు నందురు.

ఈపూర్వవైష్ణవ గోల్కొండవ్యాపారులందు కౌండిన్య, భరద్వాజ, భార్గవ, శ్రీవత్స, హారిత, ఆత్రేయ యనంబడు నాఱుగోత్రములు గానవచ్చుచున్నవి. వీరు మతకర్మలందు తమపేరునకుం బిదప నాచార్యశబ్దము విధిగా వాడుచున్నారు.

పిమ్మట కొన్ని తెలగాణ్యపు కుటుంబములు వైష్ణవమతస్వీకరణ మొనర్చి సంస్కారముల నంది వీరియందు చేరి గోల్కొండవ్యాపారులనం బరగుచున్నారనియు, వారు గాదివారి నుండి గుండుమళ్ళవారినుండియు

రుద్యాలవారును, ఇంకను తెలువాళ్ళ ఔసరాల వారు, గంధంరాజువారు, దాశిరాజువారు, దురుశేటివారు, శంబరాజువారు, దేవరాజువారు, ద్రోణంరాజువారు మొదలగు కొన్ని నియోగి కుటుంబములును, వైష్ణవమతస్వీకరణ మొనర్చి వీరియందు చేరిరట (తెలగాణ్యులు చూడుడు).

**గోల్డు జాతివారు** — అమూరు నది, సైబీరియా, మంచూరియాల నడుమగా నడచి ఎల్లయగుచు ఒకాటస్కు సముద్రమున సంగమించుటకు ఉత్తరవాహినిగ తిరిగి నికోలయేవ్స్కి యను పురముకడ సంగమించును. ఈప్రాంత సీమలం దైకవేల వింతప్రజలు గోల్డ్సనంబడు వారు కలరు. ఈప్రాంతసీమలు చీనావారిక్రింద క్రీ. శ. ౧౮౬౦ వఱకు నుండెను. అప్పటి యుద్ధమున రష్యావారికి వశమాయెను. చీనావారు వీరిని యూపీటట్సే (చేపలచర్మపుజాతి) యని వాడుచుండిరి. చేపలచర్మములం దీసి బాగుచేసి వస్త్రములుగ ధరించుచు కాలిజోళ్ళు, మేజోళ్ళు, సంచులు, పెట్టెలు మొదలగునవి వీరు చేసికొనుట నాపేరునకుం బాల్పడిరట. ఆకారమున మంచూరియా ప్రజలవలె నుందురు. గొప్ప వేటకాండ్రు. ఆప్రాంతముల ఫర్ మృగములు మెండు. వారి యిండ్లను మంచూరియాదేశపు పోలికయే.

దేశ మతిశీతలప్రదేశమగుట వీరు కష్టజీవులు. వేసవియందు చేపలం బట్టి జీవింతురు. ఫర్ జంతువుల వేటాడునగు శీతకాలము దీర్ఘమైనది. నీరు ఘనీభవించియుండ ఎండుచేపలే వీరికాహారమగును. వీరికుక్కలే వీరి స్లెడ్జిబండ్లను ఈడ్చుకొని మంచుపై బర్విడును.

గ్రామమునం దొక మతాధికారియగు గురువుండును. ఆయనకు షామానని యందురు. ఆయన వైద్యుడు, మంత్రవేత్త, పిశాచహర్త, దయ్యములం బట్టి వెళ్ళించి, శిక్షించియు పారద్రోలియు రోగుల కారోగ్య మిప్పించువాడు. వీరియందు పునర్జన్మములు కలవు. ప్రాణులకు నివాసభూమియగు బూనీయను లోకము కలదు. దానింగూర్చి షామానుగారికి చక్కని జ్ఞానము కలనుగాన నాయన జ్ఞాని యనంబడును. అందొక పవిత్రవృక్షము చాల పెద్దది యుండును. దాని కొమ్మలలో శరీరమువాసిన ప్రాణులు పక్షుల యాకారమున వసించుచుండెడిని. కారణాంతరములచే ప్రాణులకు పునఃపునర్జన్మములు కల్గుచుండును. ప్రాణి జన్మించినపిదప నొకవత్సరకాలము పరిశుద్ధావస్థయందుండును. పిల్లపుట్టిన తోడనే ప్రాణి పక్షిరూపమును వీడి జన్మస్థానమునకు (బూనీనుండి) నేతెంచి, పిల్లశరీరమందు ప్రవేశించునట. బూనీయే వీరికి స్వర్గానుభవస్థలము.

**గోల్డు డెలివరీ** - వాణిజ్య సంబంధమున స్టాకుఎక్స్ఛేంజి పరిభాషాపదము. సెక్యూరిటీ అర్హావిధానముననే అర్హమగు స్థితియందు ఉండుటం దెల్పుటకీ పదమును వాడుచున్నారు.

**గోల్డు బాండ్సు** (Gold bonds) — బాగారు నాణెములలో వడ్డీచెల్లించుట, ఋణము తీర్చుట మొదలగు విధులుగల పత్రముల కీపేరు వర్తించును. అట్టి ఋణపత్రములు గోల్డుబాండ్సు అనంబడును. మఱియు బాగారు నాణెములకు గోల్డనియు వాడుచున్నారు.

**గోల్డెన్ గేటు** (Golden gate) — పసిఫిక్కు మహాసముద్రము నుండి సాన్‌ఫ్రాన్సిస్కో బే లోనికింగల్గు కాలువ. ఐదుమైళ్ళపొడవు. చక్కని ప్రదేశమగుకతన నీపేరిడియున్నారు.

**గోల్డెన్ హారన్** (Golden Horn) — టర్కీదేశముకడ యూరోపాయందు బోస్ఫరస్ జలసంధి విజృంభించినశాఖ. ఇస్తాంబూల్ (కానస్టటి

కాన్‌స్టాంటినోపిల్) నగరము. పేరా, గలాటాల వంటియున్న సముద్రపుకాలువ. సౌందర్య విశేష మున నిట్టి పేరందినదట.

**గోల్డెన్ ఏజి** (Golden Age) — **Bright epoch** అనియు, Good old days అనియు నర్థము. తొల్లింటి ధర్మకాలమనిభావము. దానికింబిదప Silver age అనియు, దానికిం బిదప Brass age అనియు, దానికింబిదప (ఇప్పటి) కాలమునకు Iron age అనియు నాలుగు భాగములుగ దీనింబల్కుచుందురు.

**గోల్ఫు ఆట** (Golf) — గోల్ఫు ఆట ప్రధానముగ నొకటియేయైనను దీనిం ద్రివిధములుగ నాడుచున్నారని తెలియుచున్నది. ఇది యొక పెద్దమైదానపు ప్రదేశమున నాడఁబడును. సర్వసాధారణముగ గోల్ఫు అనంబడు ఆట కుపయోగింపఁబడు ప్రదేశము సమతలమై యుండవలయును. ఒక్కొకతరి పచ్చగడ్డిపట్టి దాని బాగుగ నంటకత్తిరించియుంచుదురు. గడ్డి ఎత్తుగ పెరుగునేని బంతులు దొరలుట కాటంకముగ నుండును. ఆట బయలునందర్హమగు ప్రదేశమున లేక ప్రదేశములందు నాల్గంగుళముల యడ్డుకొలత గల గుంటలు చేయఁబడియుండును. ఈగుంటలు స్థలవిశాలమును బట్టియుండును. ఐనను సర్వసాధారణముగ పదునెన్మిదిగుంటలుండుట యాచారమై యున్నది. ఒకప్పుడెక్కువ గూడ నుండుటకలదు. ప్రతిగుంటకడను యానవాలుగ నొక చిన్న ఎఱ్ఱ జెండాగుర్తు దెల్పుచుండును. ఈ యాటయం దుపయోగింపబడు చిన్న యాటబంతుల నా గోతులం బడద్రోయుటయే ఆటవిధానము. శక్తి కొలఁది వీలగునన్ని తక్కువవ్రేటులతో నాబంతిం దొరలజేయుచు గుంటంబడద్రోయుటయె జయము.

బంతిందోయుటతో నాటనారంభించుతావున 'టీ' గుర్తువేయఁబడును. మఱియు నత్తావునకును 'టీ' యని వాడుచున్నారు. అట్టి 'టీ' ప్రదేశము నుండి గుంట ఇంతదూరమున నుండవలయునను నియతిలేదు. ఎంతదూరముననైన నుండవచ్చును. వేర్వేఱు గుంటలు వేర్వేఱు దూరతలముల నిర్మింపఁబడి యుండునని యెఱుంగునది.

ఆటబంతులను టీ ప్రదేశమునుండి గుంటల కడకుం ద్రోసికొనిపోవుటకు చేతికఱ్ఱలంబోలిన వేర్వేఱు ఆకుతీఁకులంగల్గిన కఱ్ఱలుపయోగింపఁబడును. వీట్లకు Clubs అని గుఱుతుగలదు. వీట్లయందు Driver Club అనియు, Niblick Club అనియు, Mastic Club అనియు, Cleek Club అనియు, Putter Club అనియు పెక్కురకముల పేర్లుగల Club కఱ్ఱలుపయోగింపంబడెడిని బంతులు రబ్బరు ఉండలపై Caoutchouc cover వేసి తెల్లరంగు వేయుదురు. ఒక్కొకఆటగాని కొకబంతి యుండును. లేక ఇరువ్వరు కలసిగాని ఒక్కొకబంతి నాడుట యుంగలదు. ఒక్కరొకబంతి వోప్పున నాడెడి యాటకు సింగిల్సు (Singles) అనియు, ఇర్వురొకబంతి నాడుయాటకు ఫోరు సమ్సు (Four Somes ) అనియు నందురు. దీనినింకను Guartetle అనియు ననుటయుంగలదు. ఇది సర్వసాధారణమగు బహిరంగపుటాట.

గోల్ఫుఆటం గొంతసులభపర్చి స్వంతఆట ప్రదేశములందు (Lawn) ఆడుకొనుఆటకు Clock Golf అనిపేరు. ఇందు Putter అనంబడు కఱ్ఱలతో నొదటైనను యాడుచుందురు. ఒకగుంటకుం గొంతదూరమున తలపై బంతులను వహించు సంఖ్యాగుర్తులను నేలగుచ్చి దానిపై నొక్కొక యాటకాఁడును తనబంతినిడుచు వీలగు నన్ని తక్కువవ్రేటుదెబ్బలతో ఆబంతిం గుంటం జేర్చ ప్రయత్నించెదిని. ఇంకను ఒక్కొకతరి ఈ గుంటనుండి వేర్వేఱుదూరముల నీగుర్తులనిడి

యాడుచుందురు. ఒకమైదానమున నొకతావున నొకగుంటచేసి దానికి వేర్వేరు దూరముల వేర్వేరు సంఖ్యాస్థానములను ఆట ప్రారంభించు తావులుగనిల్పి, ఆయాతావులనుండి యాటనాడుటకు మొదలిడి Putter కఱ్ఱతో బంతిద్రోయుచు గమ్యస్థానమగు గుంటచేర్చుయాటకు పుట్టింగు గోల్ఫు (Putting Golf) అని యనుటయు గలదు. కాని ఈభేదముతో ఇది Clock Golf ఆటయెయగుట నేఱుగ వివరించుచు వదలి వేయుట సమంజసము.

**గోవత్సద్వాదశి** — కార్తిక బహుళ ద్వాదశి (పండుగలు చూడుఁడు).

**గోవర్ధన మఠము** — శుద్ధాద్వైత మఠము.

**గోవర్ధనపురము** — బొంబై రాజధాని నాశికమండలమున నాశిక పట్టణమునకు సమీపగ్రామము. దీనిప్రశంస మార్కండేయ పురాణము ౫౭ యందు కలదు.

**గోవ రాష్ట్రము** — గోపరాష్ట్రము చూడుఁడు.

**గోవింద ద్వాదశి** — ఫాల్గుణ శుద్ధ ద్వాదశి ఆదివారము పుష్యమీ నక్షత్రము, శోభననామయోగము సంభవించి అత్తా కుంభ రాశియందు రవి, ధనస్సునందు గురుఁడు, మకర రాశియందు శనియు నుండినచో నాతిథి యీపేర బరగెడిని.

**గోవింద భగవత్పాదాచార్యుఁడు** - వీరు జీవన్ముక్తికై చిరాయువుగల్గు సాధనముగ పాదరసమందలి దోషములను శుద్ధిఁజేసి క్రమముగ లోనికివాడుచుండుటవలన సిద్ధులై చిరజీవులగు మార్గములను గొప్ప పరిశీలన లొనర్చినవారు. ఈయన రసార్ణవమను గ్రంథమును రచించెనట. ఇందు రసయోగసిద్ధి వివరింపఁబడినది. భౌతికశరీరము వజ్రాశికమని ఇందు చెప్పఁబడినది. దృష్టిచేతను, స్పర్శనముచేతను, సేవనముచేతను రసయోగియై సిద్ధుఁడై జీవన్ముక్తుఁడగునని యిందు గలదు. ఈపరిశీలనలందీతని ప్రధానశిష్యుఁడగు రసేశ్వరయోగి ఈయనకు సహాయపడుచుండెనని యందురు. (రసేశ్వరుఁడు చూడుఁడు). ఈతఁడు శంకరాచార్యుని గురువనియు (శుకుని శిష్యుఁడగు) గౌడపాదాచార్యయతికి శిష్యుఁడనియు తెలియుచున్నది. గౌడపాదయతి సుభగోదయమను మంత్రశాస్త్రగ్రంథము రచించినవాఁడు.

**గోవిందవ్యూహము** — రామానుజీయవైష్ణవ చైతన్య వైష్ణవ మతధర్మములందు తదేకాత్మరూప మహావిష్ణువు అంశ ద్వితీయ చతుర్వ్యూహములలో నొకటి యనియు, సంకర్షణ వ్యూహము లైదింటిలో నొక ఉపవ్యూహమనియు, వైభవ విలాసమూర్తియనియు, వరుసగ చక్ర, గదా, పద్మ, శంఖము లాయుధములనియు చెప్పఁబడినది. (విష్ణుదేవాలయములందలి విగ్రహములు చూడుఁడు).



**గోవిశాన దేశము** — రాజధాని విరాట లేక వైరాట పట్టణమనియు (బైరాట్) ఇది సంయుక్తరాష్ట్రములోని కుమాన్ డివిజనులో నున్నదనియు కొందఱనుచున్నారు. ఇప్పటి ధీకూలిగ్రామముగ బోల్చుచున్నారట. పడమటి రోహిల్ఖండమునందు బిగ్నోరు సమీపమున

ముండోరనుతావున గోవిశానపురమని పోల్చి యున్నారు. ఇప్పటి కాశీపూర్ ఈదేశములోనిదే. మహాభారతము భీష్మపర్వము ౧౭ నందు దీని ప్రశంస కలదు.

**గోవుతోక పట్టుకుపోనా** — ఒక దీనుండగు అంధుని ద్రోణాచార్యుడు ఒక గోవు తోక నొకదుష్టుడు అంధునిచేతికిచ్చి అదివదలక నడచిపోతే ఊరిలోనికి పోగలవని దారిచెప్పెనట. నాడాదిగ దష్టులుచెప్పు మాయమాటలను గోవుతోక పట్టుకుపోవుట యని వాడుచుందురు.

**గోవులు లేని ఊరిలో గొడ్డు గేదె శ్రీమహాలక్ష్మి యగును** —

**గోవ్యాధి గోత్రము** — అగస్త్య ఉపగణము చూడుడు.

**గోశ్వపిగిలి గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**గోశ్వపి గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**గోషాయన గోత్రము** — నిధ్రువ గణము చూడుడు.

**గోస్సలమఠము** — హిమవన్నగముపై టిబెట్టుదేశమున మానసరోవర రక్షస్థల్ (రాక్షస తలము లేక రావణహ్రదము) సరస్సులనడుమగ నున్న బౌద్ధమఠము. ఇది కైలాసగిరి యాత్రస్థులకు మకాము స్థలము. మఠమే గ్రామమువలె నున్నది. అందు బజారు అంగడులు కలవు. బౌద్ధ భిక్షువులు (లామా) అంగడులయందు కూర్చుని క్రయవిక్రయము లొనర్చుచుందురు. గౌరీ ఉదయారు గుహనుండి ౯ మైళ్లును, తకలాకోట నుండి ౨౫ మైళ్లును దూరముండును. (గౌరీ ఉదయార్ గుహ చూడుడు, కైలాసశిఖరము చూడుడు).

**గోళ్లపైనపడు తెల్లనిమచ్చలు** - ఇవి వ్రేలిగోళ్ళపైనప్పుడప్పు డగుపడు చిన్నచుక్కలు. వీట్లను బాలురు ఆకాశమున నెగురుచుండు కొంగలకుం జూపిన గల్గెడివనెదరు. వీటి నదృష్టలాభ సూచకమని తలంతురు.

మనుష్య శరీరమంతయు చిన్నచిన్న గూడులు, అందు రంధ్రములు లేక గుంటలమయమై యున్నది. గోళ్ళక్రిందనూ అట్టిగూళ్ళుకలవు. వీటినిండా రక్తముండుటంజేసి గోళ్ళగుండా ఎఱ్ఱని రంగగుపడుచుండును. ఏకారణమువలననైనను గోరుపై లోతుకు నాటగలిగిన ఒకపాటిదెబ్బ తగిలెనేని, దానివలన గోరుక్రిందనుండు గూళ్లు ఒకటి రెండు మూడు చితికి చెడిపోవును. అందు రక్తముండనేరదు గాన అవి తెల్లబడి రక్తస్రావము లేక అటులనే మొద్దుబారియుండియు గోరుగుండా పైకి తెల్లగాగన్పట్టును. దానిని తెల్లమచ్చ (చుక్క) యనుకొందురు.

రానురాను కొంతకాలమునకు అడుగునుండి క్రొత్తగూళ్ళు పుట్టి చెడిపోయినగూటి నాక్రమించి కలిపివేయును. తిరుగ నెత్తురక్తమాక్రమించుకతన తెల్లమచ్చ కనుపడక మాసిపోయి అంతయు నెఱుపుగనె గాన్పించుటతో నా తెల్లమచ్చలు పోయినవనుకొందురు.

**గ్నోస్టిసిజమ్** (Gnosticism) — తొల్లికాలమున అనగా క్రీ. శ. ఒకటి మొదలు ఆరవశతాబ్దమువఱకు పాశ్చాత్య సీమలందు ఒకతెగ మనుష్యులకు వీరికొన్ని దివ్యదృష్టి దివ్యజ్ఞానశక్తులు మనోసామర్థ్యములు కల్గియుండునవియు తదితరులకు అట్టిశక్తులుండవనియు ఒక వాడుక నమ్మకములు ఉండెడివి. ఇప్పుడట్టివి కానరావు.

**గోశీలకుల గోత్రము** — పునగశీల చూడుడు.

**గోహిల్ శాఖ క్షత్రియులు** — క్షత్రియకులము చూడుడు.

**గోళార్థము భూగోళార్థము** — Hemisphere గోళార్ధము భూమి గోళముగా బంతివలె నుండుటంగాన ఆ గోళమున సగపు డనది గోళార్ధము లేక అర్ధగోళము





భూమియందు ఆసియా, యూరోపా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఖండములుండు సగముగోళమునకు పూర్వగోళార్ధమనియు (Eastern Hemisphere), అమెరికాఖండము లుండు అవ్వలిభాగమునకు పశ్చిమగోళార్ధమనియు (Western Hemisphere) వాడుక గలదు.

**గోక్రీడన ప్రతిపత్తు** — కార్తీక శుద్ధ పాడ్యమి. ఈదినము గోవులనలంకరించియు మేపియు, పూజించుటకుం గొంపోయి వానితో నాడుకొందురు. ఇది పండుగదినము. (పండుగలు, పర్వదినములు, వ్రతదినములు చూడుడు).

**గోత్రములు** — ఆర్యులకుం గులగోత్రములు ప్రధానములు. పిల్లను విసర్జించుటయను మతధర్మములం గోత్రప్రకటనయగును. అందు గోత్రములు సప్తమహర్షుల సంబంధము. భృగు, అంగీరస, కశ్యప, అత్రి, వసిష్ఠ, అగస్త్య, విశ్వామిత్రులు సప్తమహర్షు లనంబడుదురు. వీరి సంతతి వారగు ఋషులు గణర్షులనియు, ఉపగణర్షులనియు, గోత్రర్షులనియు, పేరులంబరగుచున్నారు. ఇందు భృగు అంగీరసులందు గోత్రములధికముగ గలవు. ఈ రెండుసంతతులందు వేర్వేఱుగణముల వారనోన్యము వివాహసంబంధములు చేసుకొన వచ్చుననియు, తక్కిన ఋషుల సంతతులందు ఒకేఋషి సంతతిగోత్రములవారనోన్యము వివాహము లొనర్చుకొనరాదనియుం జెప్పంబడినది. అటులనే భృగు, అంగీరస మహర్షుల సంతతులందు ఒకఋషి సంతతిలో ఏకగణమందలి గోత్రముల వారనోన్య వివాహసంబంధములు చేసుకొన రాదని నిషేధింపంబడినది. కాన వివాహసంబంధముం దీపరిశీలనను జాగ్రతగ జేయవలసి యుండును.

గోత్రములందు కొన్ని బోధాయన సూత్రోక్తములుగను, కొన్ని కాత్యాయన సూత్రోక్తములుగను, కొన్ని మాత్స్య సూత్రోక్తములుగను, ఇంకం గొన్ని గోత్రము లితరగ్రంథముల నుండియు, లభించెడిని కొన్ని విరివిగను కొన్ని స్వల్పసంఖ్యాకములుగను లభించెడిని. మరియు భారతము శాంతిపర్వమునందు కొన్నిగోత్రములు గానవచ్చెడిని. గోత్రజులలో నెక్కువ ప్రాముఖ్యత నందిన మొదటి మువ్వురు పురుషులు సర్వసాధారణముగ ప్రవరర్షులగుదురు. ప్రవరలిట్టుల తొలుదొలుతం త్రయార్షేయములుగ నేర్పడియెం గాని, రానురాను ద్వ్యాముష్యాయణాది ధర్మములంబడసి ఎక్కువ ఋషులంబడయుచు ప్రవరలు పంచార్షేయములు మొదలు దశార్షేయములుగ గూడ నయ్యెను. మరియుం గొన్నిగోత్రము లేకార్షేయప్రవరలనే గల్గియుండుటయుం గలదు. ప్రతిమహర్షి సంతతి యందు, గణర్షుల సంతతి యందు కేవల గోత్రములు కలవు. కేవల గోత్రము, ఆ ఋషిసత్తముని స్వంత సంతతియగుట. ఆగోత్ర మాసంతతి ఇతరగోత్రము లాదగ్రత వహించునని చెప్పంబడినది. ఇంకను కొందఱు ధర్మశాస్త్రకర్తలు కేవల గోత్రముల వారికిం గన్యలనీయవచ్చుంగాని వారికన్యల నన్య గోత్రజులు (ఆఋషి సంతతిలోనివారలు) పరిణయ

మగుట శ్రేయముగాదని సూచించియున్నారు. ఇంక దొరకిన గోత్రములసంఖ్య ౨,౧౮౯.

**గోద్వేషి గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**గోప్రజార్చన పరీక్ష**—కాల విజ్ఞాన శాస్త్రమునందు వివరింపఁబడిన పరీక్షలలో నొకటి (కాలవిజ్ఞాన శాస్త్రము చూడుడు).

తన పశువులభివృద్ధినంది తనకు పాడి పంటలు సమృద్ధిగనుండి సుభిక్షముగ కాలము గడువ గోరు సేద్యవృత్తిపరుఁడు ప్రతిసంవత్సరము ఆషాఢ బహుళ నవమిని ప్రథమ యామమున గోవులను (పశువులను) పూజింప వలయునని ఋషులు నుడివి యున్నారు.

౧. గోపూజా దినమున - పూజా నంతరము (ద్వితీయయామము) న పాలిచ్చుచున్న గోవైనను పెద్ద మూపురముగల యెద్దైనను మందనుండి వెడలినచో నా సంవత్సరము చక్కఁగ వర్షించి సమృద్ధిగపండి ధర లనుకూలించి ధనవంతుఁ డగు ననియు,

౨. గోపూజా దినమున - పూజా నంతరము, నలుపు, ఎరుపు కల్గిన పాలీయనిది, లేక గొడ్డావు మందనుండి బయలు వెడలినచో స్వల్ప వృష్టి యనియు, పాడి తగ్గుననియు, కలహములు గల్గు ననియు,

3 గోపూజా దినమున - పూజ కాలమున ఎఱ్ఱనిది, కుంటిది లేక గ్రుడ్డిది, బక్కచిక్కినది, చక్కఁగా త్వరితముగ నడువలేనిది, కాలీడ్చుచు నడుచునది యగు ఎద్దుగాని, ఆవుగాని మందనుండి ఈవలకు వచ్చినచో నా సంవత్సరము వర్షలోప మనియు, పశువులకును, మనుష్యులకును పీడా కరమనియు, ప్రభుత్వ రక్షణమునకు లోపమనియు రెట్టవిజ్ఞాని కాలవిజ్ఞానమున సూచించెను.

**గోబ్లిన్** — పాశ్చాత్యదేశీయులవారియందు దుష్టపిశాచములు గోబ్లిన్ అను జాతివి కలవని వారి గ్రంథములందు వ్రాయఁబడినది. కాని కొందఱు నమ్మకుందురు.

---

**గౌడదేశము**—వంగదేశము చూడుఁడు.

**గౌడపాదపర్వతము** — రుద్ర హిమాలయశాఖ. (గంగానది చూడుఁడు).

**గౌడపాదాచార్యులు** — తండ్రి విష్ణుదేవుఁడు, తల్లి గుణవతి. బ్రాహ్మణుఁడు. సుభ ద్రర్షి యాశ్రమసమీపమున, భూపాలగ్రామము జన్మస్థలము. తల్లి దండ్రులిడిన పేరు, సుభదత్తుఁడు. ఈ బాలుఁ డైదువత్సరములనుండి సకలశాస్త్ర ములం జదివి, గౌడ దేశమునకరిగి, జిష్ణుదేవుం డను తపస్వి గుహాముఖంబున తపంబొనర్చి ఆమునిసత్తమునిచే మంత్రోపదేశ మందెను. ఆమంత్రమును తపస్సిద్ధిగల్గింప గౌడపాదుఁడని పేరు ప్రసిద్ధమయ్యెనట. ఈయన శ్రీ చక్రమున పరదేవతారాధన మొనర్చుచుండువాఁడు. (శ్రీ చక్రముచూడుఁడు). సుభగోదయమను శాక్తేయ గ్రంథరచయిత, మాండూక్యోపనిషత్తునకు కారి కలను రచించినవాఁడు. శంకరభగవత్పాదుల దేశి

కుండగు గోవిందభగవత్పాదులకు గురువు. గంగోత్రికి పశ్చిమదిశగానున్న పర్వతముపై తపమాచరించుచు సిద్ధిం జెందినకతన నాగిరికి గౌడపాదపర్వతమను పేరు వాడంబడుచున్నది.

**గౌడపురము** (ఇప్పటిగౌర్)– తొల్లింటి వంగదేశపు రాజధాని. ఇప్పుడు గౌరనంబడుచున్నది. (వంగదేశము చూడుడు).

**గౌడ బ్రాహ్మణులు** — పంచగౌడశాఖలలో నొకశాఖవారు (బ్రాహ్మణులు చూడుడు) వీరు ఇప్పుడు బంగాళమనంబడు దేశములోనుండిన గౌడదేశమున నివసించువారగుటనుండి ఈపేరందిరి. (గౌడదేశము, బంగాళాదేశము చూడుడు). వేర్వేఱు కాలములందు చీలి వేఱైన గౌడబ్రాహ్మణులలోని అంతశ్శాఖలలో ముఖ్యమగువాని ఈకాలమున వారు గన్పఱిచిరి. వీరు మత్స్యభుక్కులు.

౧. అగ్రదానీశాఖ- తొలుత వీరికి దానము (ప్రథమతః) చేయుటర్హులుగాన ఇది బిరుదనామముగ గల్గినదని చెప్పుదురు. వీరు అపరకర్మలందునను ప్రేతకార్యము లందునను దానములు బట్టుట యాచారముగ నేటికింగలదు.

౨. ఆచార్యబ్రాహ్మణులు (లేక ఆచార్జ). వీరు అపరకర్మలందు భోక్తలుగనుండుట యాచారమైయున్నది తొల్లి దశరథ మహారాజు స్తమించిన తరి పుత్రుండగు భరతభూపాలుండేతెంచువరకు ఆచార్యబ్రాహ్మణ సంఘ మాకళేబరముంగనిపెట్టుకునియుండి కాచుచుండిరట. దానికిం గృతజ్ఞుండై భరతుండా మహారాజు వస్తుచయమును తయు నేకాదశాహంబున వారికొసంగ తొలుత నైకొన సంశయించియు, పశ్చాత్ప్రేరితులై పరిగ్రహించిరట. పిదపం గొంతకాలమునకు శ్రీరాముండరుదెంచి యీసమాచారమంతయువిని సంతసించి యంతటినుండి అపరకర్మలం దేకాదశాహమున ఆచార్యబ్రాహ్మణులు పూజనీయులనియు ఒక్కనినైనను పూజింపకుండ కర్మసిద్ధిగలుగనేరదనియు విధించెనట. నేటికిని యీయాచారము కోసలదేశమందు విధిగా పాటింపంబడుచున్నది.

అత్రి ఆచార్యబ్రాహ్మణు డొకండు కుశలం గోమూత్రమునందడిపి పుణ్యాహవచనోదకముల ముంచుచు నిల్లాతయు శ్రీరామనామ పఠనమున జల్లుచు అశౌచముంబాపి శుభ స్వీకరణమొనరించెను.

3. ఆదిగౌడశాఖ- శుక్లయజుర్వేదులు. వీరియందు స్మార్త అద్వైతము, స్మార్తశాక్తేయమునను రెండుమతములు వ్యాపించియున్నవి.

౪. కీర్తన్య గౌడశాఖ- యజుర్వేదులు. వీరిం గూర్చి ఇంతకన్న తెలియరాకున్నది.

౫. శ్రీగౌడ శాఖ- సామవేదులు. భారద్వాజ సంతతి వారమని చెప్పుకొనుచున్నారు. మాళవదేశము, కాశీప్రాంత దేశములందు గానంబడుచున్నారు

౬. శుక్లవాలగౌడశాఖ- శుక్లయజుర్వేదులు. వీరు జోషీలనియు, ఒఝ్ఝులనియు ఇరుతెగలుగనున్నారు

ఇట జోషీశాఖంగూర్చి ఇంచుక వ్రాయ ముచ్చటయగును. ఢిల్లీయందు రాజ్యమేలుచుండిన రాజవంశమందలి యొకబాలుండేలకో యాపదలనంది తనసోదరికడ అలహాబాదు ప్రాంతమునంగల యొకచిన్న సంస్థానమున వసించ నయ్యెనట. అట నాతనికి సరిపడక గుంది బదరీనారాయణమునకేగ సమకట్టి పోవుచుండెనట. మార్గమున చంపావతి పురప్రాంతమున నొకచెట్టుక్రిందంబండి నిద్రించుకతన నాతని మేనిపైగల కొన్ని రాజచిహ్నముల నొకచాబె బ్రాహ్మణుండగు జ్యోతిష సాముద్రిక శాస్త్రపండితుండు కనిపెట్టి యాతనికడ గాచుకొనియుండి నిద్రలేచిన తరిని 'మహా

ప్రభూ! నీకు రాజయోగము కలుగనున్న'దని చెప్పెనట. నాబాలుం 'డటులగల్గిన నీకుమంత్రిత్వ మొసంగువాఁడ' ననియెనట. మఱియు నాబ్రాహ్మణుఁడు డాక్షత్రియబాలుని తనగృహమునకుం గొంపోయి పోషించుచుండ నాదేశమేలుకత్యూరి భూపాలుం డాబాలుంజూచి మోహమున కచ్చెరువంది పిలుచుకొనిపోయి తన కోటయందుంచి యాదరించుచు యాతని గుణ గణముల కానంద మొందుచుండె యారాజసుతయు నీబాలుని వలచెనట. రాజును వల్లెయని పరిణయమొనర్చి వారికి చంపావతీ పరగణా నరణమొసంగెనట. ఆక్షత్రియుఁడు భూపాలుండై చౌబేగ్రాహ్మణ జ్యోతిషుని రావించి యాదరించి ప్రధానత్వ మిచ్చెనట.

ఆజ్యోతిషునకిరువురు పుత్రులుండిరి. పెద్దవాఁడు చంపావతీ పర్వతమున కొక వైపున ఝుర్ఝుహారను గ్రామమునను, రెండవయాతఁడు రెండవ వైపున సేలాఖోలా (చల్లనియని యర్థము) యను గ్రామమునను కాపురములు కుదిరిరి. ఇకను ఝుర్ఝుహారనజ్యేష్ఠ (సంతతి) యని యర్థమట. వీరును ప్రసిద్ధిగాంచి తమతండ్రివలెనె జోషీలనంబడిరి. పిదప వీరిసంతతి వారందఱు జోషీలను పేరం బరగనైరట. పెద్దసంతతివారు నేటికినీ ఝుర్ఝుహారు జోషీలనియు, చిన్నసంతతివారు సేలాఖోలా జోషీలనియు నేటికిని పేరంది యున్నారు. వీరు చౌబేబ్రాహ్మణ శాఖ లోనివారు.

**గాడలి గోత్రము** — వశిష్ఠ గణము చూడుఁడు.

**గాఢి** (కీలి)— లక్షణ చూడుఁడు.

**గౌణ చాంద్రమాన మాసము**— మాసములు చూడుఁడు.

**గౌణముఖ్య యోర్ముఖ్యే కార్య సంప్రత్యయః ఇతిన్యాయము**- ముఖ్యార్థమన శబ్దమునందు గల ప్రధానార్థము, గౌణార్థమన ముఖ్యార్థ సంబంధమగు విశేషార్థము. ఇందు ముఖ్యార్థమే కార్య సంప్రత్యయమునందు వర్తించునది.

ఎద్దువలె పని చేయునను తరి, ఎద్దు శబ్దపు ముఖ్యార్థమే కార్య సంప్రత్యయము. కాని ఎద్దువంటి వాఁడను తరి తెలివితేటలులేక కష్టించి పనిచేయునని యర్థమిచ్చుచు గౌణార్థము గనెఱుంగునది.

**గౌణివథగోత్రము**—ఆత్రేయ గణము చూడుఁడు.

**గౌతమ గణము**— ఇది అంగీరస సంతతిలోనియొకగణము. ఇందుఆయాస్య, శరద్వంత, కౌమండ, దీర్ఘతమస, ఔశనస, కారేణుపాలి, రాహూగణ, సోమరాజక, వామదేవ, బృహదుక్థ, ఔతథ్య, ఔసిజ, కాక్షీవత, రాఘువ యని పదునాలుగు ఉపగణములు చెప్పఁబడినవి.

**గౌతమ గోత్రము**— ఔతథ్య ఉపగణము చూడుఁడు

**గౌతమ మహర్షి**—గౌతము లనేకులు కలరు. అందు అహల్య భర్తయు, శతానందునకు తండ్రియు, కృపాచార్యుని పితామహుఁడు నగు గౌతముఁడు మహర్షులందు పరిగణింపఁబడిన వాఁడు. వేఱొక గౌతమునకు నక్షపాద గౌతముఁడని పేరు. ఇతఁడు నైయాయిక శాస్త్ర (తర్కము) సూత్రకర్త.

మహర్షి గౌతముఁడు దేవేంద్రుని, అహల్యను శపించిన వాఁడు. మహాక్షామ కాలమున సత్రయాగ మొనర్చి అన్నమిడి పెక్కండ్రను బ్రతికించినవాఁడు. తపంబొనర్చి శివ జటాజూటమందున్న గంగను భూమిగతంజేసి గౌతమీ (గోదావరి) నదిందెచ్చిన వాఁడు. గొప్ప తపస్సంప

న్నాడు. నివాసాశ్రమ స్థలము బొంబై రాజధాని నాశిక కడ నున్న త్రియంబక క్షేత్రము. ఇట నీతడు ప్రతిష్ఠించిన శివలింగము కలదు. ఇంకను నీతడు ప్రతిష్ఠించిన శివలింగము లితర తావులం గూడఁ గలవని తెలియు చున్నది. కుమారుఁడు శతానందుఁడు. గౌతముఁడు, శతానందుఁడు, జనక మహారాజు గురువులు (పురోహితులు). ఇంకను కణాదునకును బుద్ధభగవానునకును గూడ గౌతమ నామము గలదు.

**గౌతమర్షిగోత్రము**— (శిష్టకరణములు చూడుఁడు). ఈగోత్రము వారికిం బ్రధానర్షులు ఆంగీరసుఁడు, గౌతముఁడు అనియు, ప్రవర, ఆంగీరస, ఆయాస్య, గౌతమ, త్రయార్షేయ మనియుం జెప్పఁబడినది. ౧ శిరకవలసవారు, ౨. పాత్రుని మహంతివారు, ౩ మామిడిపల్లివారు, ౪. రొట్ట వలసవారు, ౫. వృద్ధగోలువారు అను ఇంటిపేర్లు గల శిష్టకరణము లీ గోత్రమువారై యున్నారు.

**గౌతమాశ్రమములు**—౧. అహల్యాస్థానము- బీహారములోని తిరుహూత్ నందు జనక్పూరునకు నైఋతి దిక్కున ౨౪ మైళ్ల దూరమున (జరైల్పరగణాలోని) అహ్యారి యనంబడు గ్రామముకడ నున్న గౌతమాశ్రమము రామాయణమున వివరింపఁబడిన తావిదియె.

౨ గౌతమాశ్రమము - సంయుక్తరాష్ట్రములలోని చన్ద్రపురము పశ్చిమముగా నారుమైళ్ళ దూరమున రేవెల్గంజికి సమీపమున గోద్నా (గోదాన) యనంబడు తావుకడనున్నది. తొల్లింట గంగానది గోద్నా గ్రామము ప్రక్కనుండియె ప్రవహించు చుండెనట గాని ఇప్పుడు దూరమైనది. ఇది న్యాయదర్శనమను గ్రంథము రచించిన గౌతమర్షి ఆశ్రమ మని పరిశోధనల వలన పోల్పఁబడినది.

3. వాక్సార (బక్సార్) సమీపమున అహిరోలి యనంబడు తావున గల గౌతమాశ్రమము. దీనిం గూర్చిన ప్రశంస బృహన్నారదీయ పురాణము ౯ వ అధ్యాయమున గలదు.

౪. బొంబై రాజధానిలోని నాశిక మండలమున త్రియంబక మనంబడు తావున గౌతమాశ్రమమున్నది. ఇట గౌతమేశ్వర శివలింగముకలదు. గౌతమీ (గోదావరి) నది ఇందే జనించు చున్న తావు దీనింగూర్చిన ప్రశంసలు శివపురాణము ౧-౫౪ యందునను, స్కాందపురాణ గౌతమీ లేక గోదావరి ఖండము యందునను గలవు.

ఇంకను హరద్వారముకడ నొక గౌతమాశ్రమము కలదని తెలియుచున్నది.

**గౌతమీ నది** — గోదావరీనది కీపేరు కలదు. గౌతమమహర్షి నుండి ఈపేరు కల్గినది.

**గౌతముఁడు** — ఋగ్వేదములో పెక్కు సూక్తములను, సామవేదములో గొన్ని సామములును నీతనివై యున్నవి గౌతమకులజులగు "నోధా" మొదలగువారు కూడ ఋగ్వేదములో పెక్కుసూక్తములకుఁ గర్తలై యున్నారు. సూక్తరూపకమగు ధర్మసూత్రములకును, శ్లోకరూపకమగు ధర్మశాస్త్రమునకును న్యాయధర్మమునకును ఈతఁడె కర్తయై యున్నాఁడు.

**గౌధవి గోత్రము** — వశిష్ఠగణము చూడుఁడు.

**గౌరగి గోత్రము** — ఆత్రేయగణము చూడుఁడు.

**గౌరన మంత్రి కవి**— ఆంధ్రకవులలో మధ్యకవులందు పేర్కొనంబడిన వాఁడు. శైవుఁడగు నియోగి బ్రాహ్మణుఁడు. గౌతమస గోత్రుఁడు. తండ్రిపేరు అయ్యలరాజు అనంబడిన ఎల్లయ్య. తల్లి పోచమ్మ. పెద్దతండ్రి పోతరాజు. మాధవభూపాలుని మంత్రియని చెప్పఁబడినది.

రచించినవి అచ్చతెనుగు హరిశ్చంద్రోపాఖ్యానము, ద్విపద నవనాథ చరిత్రమను ద్విపద కావ్యము.

**గౌరగ్రీవి గోత్రము**— ఆత్రేయగణము చూడుడు.

**గౌరప్య గోత్రము** — వశిష్ఠగణము చూడుడు.

**గౌరముఖుడు** — ఋషి. శమీకర్షి శిష్యుడు.

**గౌరవీత గోత్రము** — ముద్గల గణము చూడుడు.

**గౌరాంగుడు** — చైతన్యాచార్యుడు లేక, చైతన్య మహాప్రభువు. ఈమహాత్ముడు చైతన్య మతకర్త, గొప్ప విష్ణుభక్తుడు. ఈయనబోధ చైతన్యవిధానవిష్ణు భక్తిగాన ఈమహానీయుని ఎల్లరు చైతన్యమహాప్రభుడని యనుచుండిరి. మతాచార్యుండు గాన చైతన్యాచార్యుడనియు వాడుచుండిరి.



తండ్రిపేరు జగన్నాథమిశ్రుడు, తల్లిపేరు శచీదేవి, జ్యేష్ఠసోదరుడు విశ్వరూపుడు, ఆయనకు విశ్వంభరుడనియూ పేరు కలదు. ఎనమండుగురు తోబుట్టువు లుండిరటగాని వారెవ్వరు జీవించి కొంతకాల ముండినవారుకారట. గౌరాంగుడు బాల్యమున నల్లరిచేయుచుండు బాలుడని ప్రతీతి కలదు. విశ్వరూపుండును గొప్ప విద్వాంసుండై విరాగియై సన్యాసము స్వీకరించెను. గౌరాంగుడు క్రీ. శ. ౧౪౮౬ లో జన్మించినట్లు చెప్పుచున్నారు.

నవద్వీపమున గంగాతీరమునందు తప మాచరించుచుండిన జగన్నాథమిశ్రునకు ఆడుపిల్లల మృతులును, విశ్వరూపునివిరాగము, సన్యాస స్వీకరణమును, గొప్ప మనోవేదనం గల్గించెనట.

షడ్దర్శనములు చదివిన వాసుదేవసార్వభౌముండను గొప్ప విద్వాంసుం డొకడు తత్కాలమున నవద్వీపమునందు సుప్రసిద్ధ చతుష్పథి (అనగా శాస్త్రపాఠశాల) ని నడపుచుండువాడట. గౌరాంగుడాపాఠశాలయందు జేరి విద్యాభ్యాస మొనర్చినకొలది అల్లరిమాని శాంతస్వభావము కలవాడై విద్వాంసుడగుచుండినతరి జగన్నాథమిశ్రుడు మృతినందెను. దుఃఖతయగు శచీదేవియు గౌరాంగుడును విరాగియగునేమోయని వెఱగందుచు పుత్రుని వివాహమాడు మని బోధించుచుండెనట. అతడును వల్లభాచార్య పుత్రికయగు లక్ష్మీదేవిం బరిణయమై విద్యాభ్యాసము ముగించి తాబాలురకు బాఠములం జెప్పుచు న్యాయశాస్త్రమున దిట్టరియై గొప్ప గొప్ప పండితుల కజేయుండై యుండెనని చెప్పబడినది. అక్కాలమున శ్రీవాసుండను భక్తుండు గౌరాంగునితో శ్రీకృష్ణునిపై భక్తిలేనిపాండిత్యము సమర్థతయు నిరర్థకము లనియెనట. దానికిం గౌరాంగదేవుడు పరమేశ్వరుడు నాకు భక్తి నొసంగనిండని ప్రత్యుత్తరమిచ్చెనట. మరికొంతతరి వేఱొకపండితు డొక న్యాయశాస్త్రటీకను వ్రాసి గౌరాంగపండితునికిం జూపెనట. అదివఱకే తానును రచించిన గౌరాంగస్వామి 'నే నొకటి వ్రాసితి' ననిన నాపండితుడు ఖిన్నుండై 'మీగ్రంథముండ నాగ్రంథము జూచువా రెవ్వరుందు'రన నామహాత్ముడు దయార్ద్రహృదయుడై తనగ్రంథముం జించి పారవైచి 'ఇక మీగ్రంథము ఆదరణ

నొందుచునెనట. అపండితుఁ డచ్చెరువంది వందన మొనర్చి 'గౌరాంగదేవా' ఇంతస్వార్థత్యాగి వగు నీవు దేశికుఁడవై యుండదగిన వాఁడ' వని నుతించెనట.

పిమ్మట గౌరాంగుఁడు గ్రామమున లేనితరి యాతని యనుంగుపత్నియగు లక్ష్మీదేవి మృతి నంద, తిరుగ విష్ణుప్రియయనుకన్యం బరిణయంబై కాలముఁ బుచ్చుచుండిరట. ఆమహానీయుఁడు గయయందు వసించుచున్న ఈశ్వరపురి యను యోగికి శిష్యుండై యోగాభ్యాస మొనర్చి విరాగము కలుగ ప్రారంభించెనట పిదప నితఁడు నాటిలను భక్తాగ్రేసరుం డీయనకుఁ గురుండై వైష్ణవమతధర్మమును, విష్ణుభక్తిని బోధించెనట. తోడనే విష్ణుభక్తియు వృద్ధినందుచుండెను. నీయప్పుడప్పుడు భక్తిచే మైమరచియుండుటయు, అట్టితరి విష్ణుదేవుఁడు నిరీక్షడనేయుంట వారికి దోచుచుండునట వీని జనులు చైతన్యదేవుం డని యనుచుండిరట. పిదకి శిష్యు లసంఖ్యాకు లుగ నేర్పడి విష్ణుభక్తికి చైతన్యవిధాన మేర్ప డియెనట. చైతన్యమతమును వీరిఱువదినాల్గవ సంవత్సరముననే శ్రీజగన్నాథమునఁబోధించిరనియు, పిదప నుత్కల సీమలందు బోధించి రనియు, ముప్పదియవయేట నీలాంజరక్షేత్రమున యుండి బోధించుచుండిరనియు, వీరు కొంతకొంతకాలము శాంతిపూర్, బనారస్, వ్రజమండలము, రామే శ్వరము వఱకుఁ గల దక్షిణసీమలు దర్శించి విష్ణుభక్తి బోధించిరనియు చెప్పుదురు. (చైతన్య మతము చూడుఁడు)

**గౌరాత్రేయ గోత్రము** — ఆత్రేయ గణము చూడుఁడు.

**గౌరాంభి గోత్రము** — భృగుసంతతి. ఆష్టిషేణగణము చూడుఁడు.

**గౌరి గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**గౌరిత్రయ గోత్రము** — వశిష్ఠ గణము చూడుఁడు.

**గౌరిపురము** — వంగదేశపు రాజధానిగ నుండెను. (వంగదేశము చూడుఁడు).

**గౌరివాయనగోత్రము** — నిధృవ గణము చూడుఁడు.

**గౌరీ ఉదయూర్ గుహ** - హిమవన్నగ సీమలందు ఉదయూరనిన గుహ కర్థము. టిబెట్టు దేశమున భరతదేశమునుండి తకలాకోటమీదుగ మాన సరోవరమున కరుగుమార్గమున తకలా కోటనుండి ౧౭ మైళ్లదూరముననూ ఆల్మోడా నుండి ౨౦౮ మైళ్లదూరమునను కల గుహ. ఇది గౌరీదేవి జలకమాడుట, విఘ్నేశ్వరుని జేయుట మొదలగు కథలకు సంగస్థలము. గుహయందు వేడినీళ్ల జలధార కలదు. అది గౌరీదేవి తొల్లింట జలకమాడిన జలనిలయ సంబంధ మందురు. స్నానము సౌఖ్యముగ నుండెడిని. ఇట బసలకు మూడు గుహలు వేఱుగ గలవు.

**గౌరీ కళ్యాణము పాడుట** — ఇది మంగళ పాడుటవంటి యర్థమేగల ఆంధ్రభాషా సాంప్రదాయార్థ పదము. ఒకపనిని పాడుచేసి దాని చెప్పుట కీయుక్తిని హేళనగా వాడుచుందురు.

**గౌరీ తపోవ్రతము** — మార్గశిర బహుళ అమావాస్య. వ్రతదినము.

**గౌరీ నది** — దీనిం దొల్లింటి గ్రీకులు గౌరయూస్ అని వ్రాసిరి. ఇప్పటిపేరు పాంజ్కోరా. ఇది పంచగౌరీయని యుండిన పేరుయొక్క వికార రూపము. ఈ నదిపై పంచగౌడమనుపుర మును కలదు. ఈనది శుభవస్తు (స్వాత్) నదితో కలసి లాండోయియను పేరున నడచుచు కుభా

(కాబూల్) నదియందు చేరుకొనును. మహాభారతము సభాపర్వము 3౨ యందు పంచకార్పాతము పంచగౌరీనదీతీర దేశమనియు, పంచకార్పాతదేశమనియు, దానిని సహదేవుఁడు జయించెననియుం జెప్పఁబడినది. కాన నక్షాలమున నీప్రాంతదేశమునకు పంచకార్పాతమనియు పేరుండవలెనని తెలిసెడిని. (పంచకార్పాతదేశము చూడుఁడు). గౌరీనదులు ఇప్పటికాశ్మీరరాజ్యములోని గిల్గిట్‌కడ జనించి ఖోనార్ స్వాత్‌ల నడుమగ ప్రవహించ మొదలిడును. (పంచగౌరీదేశము చూడుఁడు).

**గౌరి లేక గౌరీదేవి** — పార్వతీదేవికి గౌరీదేవియని నామాంతరము. తెల్లనిదియని భావము. పెంపుడుతండ్రి హిమవంతుఁడు. భర్త పరమేశ్వరుండగు శివుండు. వరుణుని భార్యయొకతె గౌరీదేవి కలదు.

**గౌరీపౌర్ణమి** — ఆశ్వయుజశుద్ధ పౌర్ణమి యందు సేద్యమొనర్చువారు తమ పొలములందలి సస్యముల రక్షణకుఁ గౌరీశంకరులను పూజింతురు. వెన్నుతోనున్న వరిదుబ్బును గౌరీదేవిగను, నందివాహనారూఢునిగ శంకరవిగ్రహమును ఊరేగించి పూజించుట ఆంధ్రదేశపు రైతులందాచారమైయున్నది. తఱుచుగ నీదేవతలకు గౌరమ్మ యనియు, నందెన్నయనియు వాడుటయుం గలదు.

**గౌరీలతాలింగమండలము** — ఇది ఆగమోక్తమగు రంగవల్లి (ముగ్గు లేక పట్టు). చిన్మయదీక్షాదులందు దీనినిడుచుందురు. వీరాగమమునందు చెప్పఁబడినది. దీనింగూర్చి ఇటులఁ జెప్పఁబడినది. శ్లో॥ క్షేత్రేవింశపదీకృతే నృపవరైః రంధ్రోరుహాంమధ్యమే ౪ కుర్యాద్దిక్షుతు వార్ధిసాగరపదైః పట్టించకంజంగశమ్ । కంజం పట్టికమేవలింగమథత త్కోణేషు భూభృత్పదైః । వల్లీస్యాత్పరమేవమండలమిదంగౌరీలతాలింగకమ్॥ వింశపదీకృతే క్షేత్రే యనిన ఇరువది గదులు పొడవును, ఇరువదిగదులు వెడలుపును గల్గిన నాల్గువందలగదుల చతురశ్రప్రదేశమని భావము. ఈనాల్గువందల గదుల మధ్యప్రదేశమున పదునారు గదులందు అష్టదళపద్మము లిఖించవలెను. పిదప నాల్గుదెసలనుండియు మొదలిడి (వార్ధిసాగరపదైః యనిన చతుస్సముద్రార్థములచేత) మధ్యనున్న ఎన్మిదిగదులచే నాల్గుదెసలను నాల్గు అధఃపట్టికలు లిఖించవలయును. (లింగము చూడుఁడు). తరువాత నారుగదులచే (మధ్యగదులనియె భావము) నాల్గు అధఃకంజములును, తరువాత మధ్యగదులు నాల్గును, వాటితరువాత వరుసయందు నాల్గుగదులంగల్గి ఎన్మిదేసిగదులచే నాల్గుదెసలందు నాల్గుకంఠములను రచించవలెను. ఇందు అధఃకంజమారుగదులును, కంఠమెన్మిది గదులును కలసి పదునాల్గు గదులగును. వార్ధిసాగరశబ్దములు రెండును సముద్రార్థపదములే గాన, సప్తసముద్రములుగ నర్థము చెప్పి ఏడు ఏడూ కలసి పదునాలుగని ఇచటియభిప్రాయము. పిదప వార్ధిపదమునకు సాగరపదమునకు రెంటికిం గూడ నొక్కొకదానికి నాల్గు ఏడు సంఖ్యలు అర్థములుకలవని పైనిచెప్పఁబడియున్నది. ఆరెంటిం గల్పి పదునొకండర్థముచెప్పి రెండుపదకొండ్లు ఇరువదిరెండు గదులలో నాల్గులింగములను ఊర్ధ్వకంజము లారుగదులతోడను, ఊర్ధ్వపట్టిక లెన్మిదేసి గదులచేతను, ఆద్యప్రదారికలు రెండు వరుసలుగ ఎన్మిదేసిగదులచేతను (మొత్తమిరువది రెండు గదులు) రచించిన నాల్గు దెసలనుండి నాల్గు లింగములు (అష్ట దళ పద్మమున్న పదునారుగదుల క్రిందుగ) ఏర్పడును. ఇంక రంగవల్లియొక్క నాల్గుమూలలను (ఆరేసి గదుల పొడవు, ఆరేసిగదుల వెడలుపుంగల్గిన) ముప్పది

యారేసి గదులచౌకములు నాలుమిగిలెడిని. వాటియందు చుట్టునుండిన యొకగదివరుస మార్గమును వదలి లోనున్న (నాల్గు నాలుగులు) పదునారుగదుల చౌకములందు లతలు లిఖించవలయునని చెప్పఁబడినది తరువాత నడుమను (పదునారుగదుల చౌకమునందు) లిఖించబడియున్న అష్టదళపద్మమునకు నాల్గుమూలలందు నాల్గేసిగదుల చౌకములు మిగిలెడిని. వాటియందు పటమునందు చూపఁబడిన విధమున నడుమ సప్తదళపద్మములు లిఖించునట్లుఁ జెప్పఁబడియున్నది ఈగౌరీలతాలింగమందు వేఱ్వేఱు తావులందు వేఱ్వేఱురంగులు చెప్పఁబడినవి. వాటి



శ్లోకములను వివరించుటకన్న ఒకపటమున వివరించుట సమంజసము. ఇంతియెగాక గౌరీలతాలింగ మండలమునకుం దూర్పున స్వస్తికశంఖములును ఆగ్నేయదిశయం దష్టదళ పద్మమును, దక్షిణదిశయందు అఙ్కుశఛత్రములును, నైఋతిదిశయందు పంచకోణమును, పశ్చిమదిశయందు నాగబంధము, పద్మత్రయము (మూడు అష్టదళపద్మములు) ను, వాయవ్యదిశయందు షట్కోణమును, మఱియు నటనే వేఱొక యష్టదళపద్మము, తొమ్మిదిగనుల చౌకపుమండల ప్రదేశమును, ఉత్తరదిశయందు చామరశూలములును, ఈశాన్యదిశయందు అష్ట కోణమును ఉండవలయునని చెప్పఁబడియున్నది. ఈసంబంధమగు హోమకుండములు వేఱు కావున వివరింపఁబడినది.

**గౌరీశంకర శిఖరము (ఎవరెస్టు శిఖరము)**-హిమవన్నగముల నెత్తైనశిఖరము. ఇది ప్రపంచమందన్ని శిఖరములకన్న ఎక్కువఎత్తు గల్గియుంట ప్రథమశిఖరముగ నెన్నఁబడుచున్నది. ఆంగ్లులు దీనిని ఎవరెస్టు అనుచున్నారు. దీని ఎత్తు సముద్రపు మట్టముపై ౨౯,౦౦౨ అడుగులని లెక్కించబడినది. దీనికి గౌరీశిఖరమనియుం బేరు కలదు. వరాహపురాణము ౨౧౫ నాదిది ప్రశంసింపఁబడినది.

**గౌళి (బల్లి) శాస్త్రము** — ఇది శివప్రోక్తమని చెప్పఁబడినది. ఇది గౌళి పతనమనియు (బల్లిపాటు), గౌళి వాక్యనియు (బల్లి పలుకు) రెండు భాగములు కలది.

౧. గౌళి పతనము (బల్లిపాటు) పురుషులకు- ౧. తలయందు బల్లిపడిన, కొంచెము కలహము గల్గి కార్యజయము కల్గును, ౨. జుట్టు-కొంచెము కలహముగల్గి కార్యజయము కల్గును, ౩. కుడి చెంప-మిత్రులను గౌరవించుట, ౪. ఎడమచెంప-చింతిత కార్యసిద్ధి, ౫. జుట్టుముడి-వ్యాధి, ౬. నడినెత్తి- మరణతుల్యమగు ఆపద, ౭. ముఖము-ప్రయత్నమూలకమగు ధనలాభము, ౮. కనుబొమలు-ధనవ్యయము, ౯. భ్రూమధ్యము-ధనలాభము, ౧౦. కుడికన్ను-కష్టములు. ౧౧. ఎడమకన్ను-శుభము, ౧౨. లలాటము-బంధుసన్మానము, ౧౩. నాశికము (ముక్కు)- సౌఖ్యము, ౧౪. నాశికాగ్రము-కష్టములు, ౧౫. కుడిచెవి-దుఃఖము, ౧౬. ఎడమచెవి-లాభము, ౧౭. నడిమిచెంప మృష్టాన్నభోజనము, ౧౮. అధరోష్ఠము-ధనలాభము, ౧౯. ఉత్తరోష్ఠము- కలహము, ౨౦. రెండుపెదవులు-మృత్యువు, ౨౧. గడ్డము-బలవంతులతో వైరము, ౨౨. కంఠము-స్నేహదర్శనము, ౨౩. మెడవెనుక భాగము-శత్రుభయము, ౨౪. ఎడమ మూపురము-జయము ౨౫. కుడిమూపురము-రాజభయము, ౨౬. హస్తము-ద్రవ్యనష్టము, ౨౭. చేతి మణికట్టు-భూషణలాభము, ౨౮. మోఁచేయి-ధనహాని, ౨౯. వ్రేళ్లు-స్నేహ దర్శనము, ౩౦. గోళ్లు-ధన వ్యయము, ౩౧ గోళ్లుకొనలు , ౩౨ అరచేయి-సౌఖ్యము, ౩౩. పిడికిలి-బాధనము, ౩౪. పిరుదు-వార్తాశ్రవణము, ౩౫. ప్రక్క-బంధుదర్శనము, ౩౬. కడుపు-ధనలాభము, ౩౭. రొమ్ము-సౌఖ్యము, ౩౮. నాభి-స్త్రీ సుఖము, ౩౯. కుడి భుజము-సాకటము, ౪౦. ఎడమభుజము-గౌరవము, ౪౧ ముంజేయి-భార్యతో కలహము, ౪౨. మొల-వస్త్రలాభము, ౪౩. మోచేయి - సుఖ దుఃఖ మిశ్రమ ఫలము, ౪౪ గుహ్యము- మరణము, ౪౫. తొడలు-వస్త్రాభరణ నష్టము, ౪౬. నోరు- రోగము, ౪౭. మోఁగాళ్లు- బంధనము, ౪౮. కాలిపిక్కలు-ప్రయాణము, ౪౯. పాదములు- కష్టములు, ౫౦. పాదముల వెనుకభాగము- సుఖము, ౫౧. కాలివ్రేళ్లు- పుత్రపీడనము, ౫౨. కాలి గోళ్లు- పశుహాని, ధనహాని, ౫౩. అరికాలు,

యందు బల్లిపడిన- శత్రునాశనము ఫలముగ జెప్పఁబడినది.

గౌళిపతనఫలములు స్త్రీలకు- ౧. శిరస్సు- సంకటి, ౨. నడినెత్తి- మరణతుల్యమగు నాపద, ౩. కొప్పు- వ్యాధి, ౪. కొనవెండ్రుకలు- మానహాని, ౫. గొంతుక- కలహము, ౬. నొసలు- ధననాశము, ౭. ఎడమచెంప- భర్తకుఁగీడు, ౮. కుడిచెంప- బంధుదర్శనము, ౯. ఎడమచెవి- ఆయువు, ౧౦. కుడిచెవి-ధనలాభము, ౧౧. కండ్లు- భర్తప్రియము, ౧౨. ముక్కు- రోగము, ౧౩. ఉత్తరోష్ఠము- కలహము, ౧౪ అధరోష్ఠము- ధనము, ౧౫. రెండుపెదవులు కలసి- కష్టము, ౧౬. గడ్డము-కలహము ౧౭. మొగము- మృష్టాన్నభోజనము, ౧౮. కంఠము- ఆభరణములు, ౧౯. బాహుమూలములు- సౌఖ్యము, ౨౦. మెడ వెనుకతట్టు - బంధుదర్శనము, ౨౧. భుజములు- శుభసౌఖ్యములు, ౨౨. వీపు- మృతవార్తాశ్రవణము, ౨౩. కుడి హస్తములు- ద్రవ్యలాభము, ౨౪ ఎడమహస్తము- మనస్తాపము, ౨౫ అరచేయి- సుఖము, ౨౬. ముంజేయి- లాభము, ౨౭. మోఁజేయి- చింత, ౨౮. వ్రేళ్లు- భూషణప్రాప్తి, ౨౯. హృదయము - దుఃఖము, ౩౦ కడుపు - పుత్రీపుత్ర వివాహ కార్యములు, ౩౧. నాభి- కీర్తి, ౩౨. గుహ్యము - కష్టము, ౩౩. నడుము-వస్త్రలాభము, ౩౪. ముఖము- వ్యాధి, ౩౫. పిక్కలు- బంధుదర్శనము లేక ప్రయాణము, ౩౬. మోకాళ్లు- నిర్బంధము, ౩౭. చీలమండ- కష్టము, ౩౮. ఎడమకాలు- ప్రయాణము, ౩౯. కుడికాలు-శత్రునాశనము, ౪౦. కాలివ్రేళ్లు- సంతానలాభము, ౪౧. కాలి గోళ్లు-ధనలాభము, ధాన్యలాభము (బల్లిపడిన) దని చెప్పఁబడినది.

గౌళిపతన దిక్కుల ఫలము (స్త్రీపురుషు లిద్దరకు)- ౧. తూర్పు- చింతితకార్యజయము ఆలస్యము, ౨. ఆగ్నేయదిక్కు- అగ్నిభయము, ౩. దక్షిణము- మృత్యుసంకటము, ౪. నైఋతి దిక్కు- కలహము, ౫. పశ్చిమమున-ధనలాభము, ౬. వాయవ్యదిశ- వ్యాధి, ౭. ఉత్తరము- గౌరవముప్రాప్తి, ౮. ఈశాన్యము- కార్యసిద్ధి (చింతితము).

పైనుండి బల్లి పాన్పుపైఁబడిన తొలుత లాభమును, పిదప కష్టమును గల్గుననియు, తా గూర్చుండు ఆసనమునఁబడిన శుభ, అశుభ మిశ్ర ఫలమును, త్రోవనేగుతరి చెట్టుపైనుండి బల్లి పడుట జూచినయెడల శత్రువులకు జయమనియు చెప్పఁబడినది. అన్నము తినుచుండగా విస్తరియందు బల్లిపడిన బంధుమిత్రసన్మానము గలుగుననియు (ఆవిస్తరిని తోడనే వదలివేయవలయుననియు), వంటచేయునప్పుడు బల్లిపడుటచూచిన కళత్రకష్టము కల్గుననియు, దేవాలయములోని కేగుచుండుతరి బల్లిపడిన ఒక సభాధ్యక్షుఁడగునంతటి పదవి యబ్బుననియు, తానెక్కు శకటమున తాఁజూచుచుండగ బల్లిపడిన ప్రయాణమును, కార్యజయమును గల్గుననియు చెప్పఁబడినది.

బల్లిపడి దీప మారిపోయెనేని ఆయిల్లు పాడు పడుననియు, దీపమున బల్లి పడి మరణించిన త్వరలో నాయింటినుండి పీనుగవెడలుననియు, తన శరీరముపైగాక తాకట్టుకొని లేక కప్పుకొనియుండు బట్ట కడను బల్లి పడునేని మానహాని కల్గుననియు తాబట్టిన యాయుధముపై బల్లి పడుట కలహము గల్గుననియు, బల్లిపాటు ఫలములు చెప్పఁబడినవి.

బల్లిపాటు దోషపరిహారమున సచేలస్నానము దీపారాధనము చేసి దానిం దర్శించుటయుం జెప్పఁబడినవి.

బల్లి పలుకు ఫలము-దినమునందు సూర్యోదయాదిగ పగలు నాల్గును, రాత్రి నాల్గును ఎన్మిది జాములు కలవు. అందొక్క జామున ఎన్మిది దిక్కులందు బల్కిన బల్లి పల్కులకు ఫలములు వివరింపఁబడినవి. ఒక్కొక జామునకు గడియలు నేడున్నర యనియు, గంటలు మూడనియు, ఎఱుంగవలయును.

౧. తూర్పు-౧వ జాము భయము, ౨వ జాము చింత, ౩. హాని, ౪. జయము, ౫. లాభము, ౬. ధనము, ౭. సంపద, ౮. శుభము. ఈఫలములు ఎన్మిది జాములకుఁ గ్రమముగా గల్గునని ఎఱుంగునది.

౨ ఆగ్నేయము-౧. రోదనము, ౨. రణము, ౩. భుక్తి, ౪. జూదము, ౫. వస్త్రము, ౬. ధనము, ౭. శుభము, ౮. జయము.

౩. దక్షిణదిక్కు-౧. బంధు దర్శనము, ౨. లాభము, ౩. క్రోధము, ౪. కష్టము, ౫. మరణము, ౬. చింత, ౭. మృష్టాన్న భోజనము, ౮. శుభము

౪. నైఋతిదిశ-౧. మరణము, ౨. సంతోషము, ౩. శుభము, ౪, శత్రుభయము, ౫. అశుభము, ౬. హాని, ౭. ధనము, ౮. సంపద.

౫. పశ్చిమదిశయందు-౧. ధనము, ౨. చుట్టములు, ౩. లాభము, ౪. మరణము, ౫. శుభము ౬. కీడు, ౭. ధనము, ౮. సంపద.

౬. వాయవ్యదిశ-౧. మేలు, ౨. లాభము, ౩. ధనము, ౪. సంపద, ౫. వాహనము, ౬. శుభము, ౭. స్థిరము, ౮. జయము.

౭. ఉత్తరదిశ-౧. మరణము, ౨. లాభము, ౩. శుభము, ౪. భక్తి, ౫. సంతోష వార్తాశ్రవణము, ౬. సుఖము, ౭. భయము, ౮. జయము.

౮. ఈశాన్యదిశ-౧. గండము, ౨. అగ్నిభయము, ౩. సుఖము, ౪. జయము, ౫. వివాహము, ౬. లాభము, ౭. స్త్రీలకు కీడు, ౮. నిష్ఫలము.

ఇటుల నీ అరువదినాల్గు ఫలములు బల్లి ఏ దిక్కు బల్కునో ఎఱింగి అప్పు డెన్నవ జామో లెక్కించుకొని దాని ఫలము నెఱుంగునది.

ఇంకను ప్రయాణ కాలమున బల్లి ఎడమవైపున బల్కిన సంపద, జయము ననియు ప్రయాణ ప్రవేశ కాలమున బల్లి దక్షిణముగ బల్కిన కార్యసిద్ధి యనియు, శుభకార్యములందు దక్షిణముగ బల్కిన శ్రేయస్కరమనియు, కుడివైపునుండి పల్కిన ఆలస్య మనియు, ఎదురుగ బల్కుట కార్యనాశ కరమనియు, వెనుకను బల్కిన శుభమనియుం జెప్పఁబడినది. మఱియు ప్రయాణములందు గాక తక్కిన కాలమున బల్లి ఎడమవైపున బల్కుట శ్రేయముకాదని కొందఱనిరి.

బల్లులు రెండు మూడు కలిసి పల్కిన పల్కులకు తోరణగౌళి వాక్కు నిరెుదరు. దీనికి ఫలము, స్నేహితులు, బంధువులు ప్రియరాండ్రు వచ్చుటయు చింతిత కార్యసిద్ధియు, సంతోషము నని చెప్పఁబడినది.

**గౌష్టాయన గోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.

**గౌర్వాయన గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**గౌర్త్సన్మ గోత్రము**— అత్రేయగణము చూడుఁడు.

**గాల్సు (Gauls) జాతి** — తొల్లింట రోమనుల ప్రాబల్య కాలమున ఫ్రాన్సుదేశమునకు Gallia అని పేరుండెనట. రోమనుప్రభుత్వము వారు ప్రజలను గాల్సుఅని వాడుచుండిరట.

**గార్జిగ గోత్రము** — వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.

**గ్రౌండు రెంటు** (Ground rent) — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఒకరికి హక్కుగల జాగాయందు ఇండ్లు మొదలగునవి నిర్మించి వారికి ఏటేటగాని, నెలనెలకుగాని చెల్లించుచుండు కట్టుబడి మూల్యము. అట్టిజాగాను Lease hold land అనియెదరు.

**గ్రౌండేజి** (Groundage) — వాణిజ్య సంబంధ పరిభాషా పదము. ఓడ రేవున నిలుచుతరి అది ఆక్రమించియుండు జాగాకగు సొమ్ము (Charge). ఇట్లు వార్ఫేజి మొదలగు ఛార్జీలు వసూలు చేయుటయుగలదు.

---

**ఘజినీ** (ప్రాచీన గాంధారదేశపు గజనీపురము) — ఇప్పుడు అఫ్ఘనిస్థానములోని పురముగనున్నది. కాబూల్ నగరమునకు నైఋతి దిశగ ఎనుబది మైళ్ళదూరము. పదివేలమంది జనులు వసించుచున్నారని అంచనా వేయఁబడినది. గజనీ మహమ్మదు నీయుఁడు ఘజనీపుర వాసియె.

ఇప్పటి ఘజని పట్టణము నవీనమైనది. ఆనాఁటి కాలపు ఘజనీపురపుపాడు ఇప్పటి పట్టణమున కీశాన్యదిశగ మూఁడుమైళ్ళ దూరమున గాననగు చున్నను.

**ఘటకర్పరుఁడు** (కాత్యాయనుఁడు)— ఉజ్జయని నగరము చూడుఁడు.

**ఘటప్రదీప న్యాయము** — కుండలోఁ బెట్టిన దీపమని యర్థము. ఆవెలుతురు కుండలోనే కాని పైకి వ్యాపించదని భావము.

నిర్బంధములలోనై బయటఁబడని మహత్తుఁ గూర్చి యీన్యాయము వర్తించును.

**ఘట్టప్రభువు కవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడిన వాఁడు యాజ్ఞవల్క్య బ్రాహ్మణుఁడు (ప్రథమ శాఖ). తండ్రిపేరు ఎల్లామాత్యుఁడు. రచించినవి యాజ్ఞవల్క్య చరిత్రము, కుచేలోపాఖ్యానము, సురాభాండేశ్వరము. నెల్లూరు మండల వాసియని చెప్పఁబడినది. కవిత్వమునందు లోకోక్తులు న్యాయములు గూర్పుటయందు నిపుణుఁడు.

**ఘంటకుల గోత్రము** — ఘంటాస్థాలకల చూడుఁడు.

**ఘంటలు** (Bells) — భరత దేశమునకు గంటలుపోత పోయువిధాన మనాదిగ తెలిసిన విద్యయే కాని క్రొత్తది కాదు.



ప్రతిహిందూ దేవాలయమునను నాదమునకై ఘంటలు వ్రేలాడదీయఁబడి యుండును. క్రైస్తవ దేవస్థానములందు సహా నీఘంటానాదము సుప్రసిద్ధమే. ఘంటలోంకార నాదము చక్కఁగ వచ్చునటుల తగుపాళ్ళతో లోహములు గరగించి పోత పోయుదురు. ఇందు ప్రధానభాగము కంచు లోహము. దీనినాంగ్లమున బెల్మెటల్ అనియెదరు. ఇది అవ్యాహతనాదముల వచ్చునటుల పాళ్ళంగల్పి కంచు గరగించుట, పోతపోయుట, పిదప నాదము కనువగురీతిని దానినరగదీసి నాదముం-

గుమర్పుట మొదలగు పనులన్నియు నొకళకళగ నేర్పడియున్నది.

భరతదేశమునకు ప్రక్కనేయున్న బర్మాదేశస్థులీకళను చక్కగ గ్రహించి గొప్పగొప్ప ఘంటలను పోతఁబోసి తమదేశమున దేవాలయాను లందు ప్రతిష్ఠించి యున్నారు. ఐరోపాఖండమున రష్యాదేశమందలి నుజినీనోవగరాడ్ సీమ ఘంటలనుచేయ పేరందినది. సుప్రసిద్ధమగు నుజినీనోవగరాడ్ సంతయం దీఘంటల ప్రదర్శనము, బేరము సుప్రసిద్ధములు. చీనాదేశమును ఈవిద్య యందారితేరినట్లు అనాదిగనే పేరందినది. జపాన్ దేశమునం దీకళయం దారితేనవారు కానవగుచునే యున్నారు. ఇంకఁగొన్ని యితరదేశములం దీవిద్య నెఱింగిన వారున్నను, పెద్దపెద్ద పరిమాణములు ఘంటలు పోతఁబోయంబడమి సుప్రసిద్ధములు కాకున్నవి. ప్రపంచమందలి పెద్దపెద్ద పరిమాణములు గల్గిన ఘంటలంగూర్చి ఇటనించుక వివరించుట సమంజసము.

౧. మింగూన్ ఘంట- బర్మాదేశమున మాండలే నగరమున కెగువను తొమ్మిదిమైళ్ళ దూరమున నైరావతీనదీ పశ్చిమ తీరమున మింగూన్పురము నందలి బుద్ధదేవాలయము నందున్నది. దీనిఎత్తు ౩౧ అడుగులు, అడ్డుకొలత ౧౬ అడుగులు. ఘంటబరువు ౯౦ టన్నులు. దీనిం బరువగు కఱ్ఱలతో మోదుచు మ్రోగింతురు. కర్జన్ప్రభువు రాజప్రతినిధిగ నుండిన కాలమునం దీఘంట భూమియందు పడియుండ నెత్తించి ఇట వ్రేలాడదీయం జేసెను.

౨. ట్సార్ బెల్- ఇదిరష్యాదేశపు మాస్కోనగరమున క్రెమ్లిన్దేవాలయావరణమున, ఇవాన్వెల్కీటవరు అనంబడు తావుననున్నది. ఘంట యెత్తు ౧౯ అడుగులు, చుట్టుకొలత మొదటను ౬౬ అడుగులు, ఘంట బరువు ౨౦౦ టన్నులు.

ఇది పగిలిపోయినది. ఆపగిలిపోయినముక్కయె పది టన్నులు బరువుకలది. ఇది ఎప్పుడును మ్రోగి యుండలేదు.

క్రీ. వె. ౧౭౩౫ లో ఉత్తరువు లొసంగఁబడి పోతపోయంబడినది. క్రీ. వె. ౧౭౩౭ లో దీనిం బోయు కర్మాగారమునందగ్ని ప్రమాదముకల్గి ఘంట అడుగుభాగమున పగిలి పదిటన్నుల బరువుగలముక్క ఊడిపోవ నాఘంట నటనేవదలిచిరి. పిదప నూరు సంవత్సరములనాకు తీసి ఇప్పుడున్నతావున రాతిగోడంగట్టి దానిపైఁ బోయినభాగము నానించి నిలపి పోయిన భాగమందే ద్వారముంగుదర్చి, తలపై బంతిని శిలువను నిలపి లోన నొకదేవాలయముగ నుపయోగించుచుండిరి.

ఘంట వెలుపలిభాగమున జారు ఇవాంద్రభుని యొక్కయు, వారిధర్మపత్ని విగ్రహములు, ఏనా ఇవానాగారి విగ్రహము, క్రీస్తుప్రభువు, సెంటుపీటరు, సెంటుపాల్, సెంటుజాన్, ఋషుల విగ్రహములు Bas Relief పనితనమున చిత్రింపంబడియున్నవి గానవగుచుండును. ఈ జారు ఇవాంద్రభునియాజ్ఞ మేఱకే చేయఁబడిన, ఇంతే పరిమితిగల వేఱొకగంటయుంగూడ కలదందురు. అది ఇంతకన్న చాలాచిన్నదియై ౧౨ టన్నుల బరువు కలదియని చెప్పంబడినది.

తరువాతం జెప్పఁదగినది చీనాదేశపు పీకిన్ నగరమున కుత్తరముగా రెండుమైళ్ళదూరమున నొకదేవాలయమున కఱ్ఱదూలమునకు వ్రేలాడదీయంబడియున్న ఘంట. ఇది వ్రేలాడదీయంబడి మ్రోగుచున్న పెద్దదియని చెప్పిరిగాని, దీనికన్న పెద్దదియగు మింగూన్ఘంట, ఎత్తింపంబడిన పిదప నదియే నాగౌరవమునకు పాత్రమాయెను. ఇది ౧౪౦౬ లో పోతపోయంబడినది. ఎత్తు ౧౪ అడుగులు, చుట్టుకొలత ౩౪ అడుగులు, బరువు

౧౨ టన్నులు, మందము (దళసరి) తొమ్మిదంగుళములు.

చీనాదేశ మేలిన ప్రభువులలో చీనాజాతి (అనగా మంచూజాతి కాదు) ప్రభుండగు యుంగ్‌లో అనుపేరుగల చక్రవర్తి పాలనమున ఆయన ఆజ్ఞమేరకు ఆయనపరిశీలనక్రిందనే ఐదు ఘంటలు పోతపోయబడినవట. ఈ భూపతి ౧౮౦౩ లో సింహాసన మధిష్ఠించినవాడు. గొప్ప పరిపాలకుండని పేరొందినవాడు. న్యాయశాస్త్రమును శాసనమొనర్చినవాడు.

ఈ పైదు ఘంటలలో పేజూోకఘంట పీకింగ్ నగరముం జుట్టియున్న కోటగోడల వెలుపట అడ్డముగాపడి, సగము భూమియందు పూడియున్నది. దీనిబరువు ఏబదిటన్నుల కధికముండు నని అంచనావేయబడినది. రెంటిరూపము లొక్కటిగనేయున్నవి కొలతలును సరిగోయొడిని. తక్కిన మూడుఘంటలంగూర్చి తెలియరాకున్నది.

పిదపం జెప్పందగినది, జపాన్ దేశమున క్యోటో పురమున, నైబుత్సా అనంబడు దేవళమున వ్రేలాడదీయంబడి పనిచేయుచున్న ఘంట ఇది ౧౬౧౭ లో పోతపోయంబడినది. పదునాలుగడుగుల ఎత్తుకలది. అడ్డుకొలత తొమ్మిదడుగులు, దీనిబరువు ౭౩ టన్నులు

పిదపం జెప్పందగినది, ఆ క్యోటో పురమందే చియోనిన్ అనంబడుమఠమున వ్రేలాడదీయంబడిన ఘంట ఈమఠము టోకియోశాఖ జపాన్ శాఖలది. ఒకమంటపమున వ్రేలాడదీయంబడినది. ఎత్తు ౧౧ అడుగులు, అడ్డుకొలత ౯ అడుగులు. ఇది ౯౮ టన్నుల బరువుకలది కజ్జిలతో మోది ప్రయోగించుచున్నారు. వేరొక గొప్ప ఘంట జపానుదేశమందలి నారా పట్టణమున గలదంటారు. కాని దానింగూర్చి సరిగా తెలియరాకున్నది.

**ఘంట సింగయ్యకవి** - నందిమల్లయ్యకవి చూడుండు.

**ఘంటాకర్ణ శివలింగము** – వాలుకాదేవి చూడుండు.

**ఘంటాకర్ణునకు అష్టాక్షరీ మంత్రోపదేశము** — ఘంటాకర్ణ మహాదేవుండు గొప్పశివభక్తుండు. ఇతని వైష్ణవమంత్రముపదేశించుట వెత్తితనమని భావము.

**ఘంటా వేదిక** — శిల్పశాస్త్రమున దేవాలయశిల్పమనంబడు విమాననిర్మాణమునందు చెప్పంబడిన సప్తవేదికలలో నొకటి. (విమాన లక్షణము చూడుండు). ఈవేదికయందు మహానాశికలు, క్షుద్రనాశికలు, కోతులు, సింహములు, గండభేరుండాదిపక్షులు, ఘంటాకారముగం జిత్రించిన నది ఘంటా వేదిక యనంబడు ననియు, పురుషవిమానములం దీవేదికకు అగ్నిహోత్రుండును, స్త్రీవిమానములందు ఇంద్రుండును, మిశ్రవిమానములం దీశ్వరుండును, సంకర విమానములందు జలమును అధిదేవతలనియు, అన్ని విమానములయందు ఘంటావేదికయందు జమదగ్నిఋషి యనియుం జెప్పంబడినది.

**ఘంటాశుల గోత్రము** — ఘంటాస్థాలకుల చూడుండు.

**ఘంటాస్థాలకుల గోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుండు). ఘంటాస్థాలకుల గోత్రము- ద్వ్యాముష్యాయణ (౭) గోత్రము, తొల్లింటి సంస్కృతగోత్రము పల్లవస, పల్లవ గణము, ఆపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథము ఆర్యప్రవరఖండ, గణేశుండు దేవత, పల్లవాంబ భార్య, కృష్ణాతీరము తపస్థానము, పుష్టిసరస్సు తటాకము, జపము కోటి,

దీపములు ౩౦, క్షేత్రసంఖ్య ౭౦, స్వర్ణ దానము, అరటిపండ్లు వర్జనీయము.

**ఘుట్టము** — హిందూస్థానీ భాషయందు ఘాట్ అనెదరు. జలములందు స్నానమాడ తీరమునుండి నీటిలోనికిం గట్టంబడిన మెట్లవరుస (రేవుస) కు ఘుట్టమనిపేరు. ఇంకను వ్యాసుండు భారతము రచించుతరి అచ్చటచ్చట శ్లోకములందు కథాసందర్భార్థము చిత్రమైన కాఠిన్యముం గల్గి అన్యార్థము స్ఫురించుచుండునటుల ఒక్కొక శ్లోకమును రచించుచు నడపెనట. అట్టిగడ్డుశ్లోకములను వ్యాసఘుట్టములనుచున్నారు.

**ఘటారోహిణ న్యాయము**- కుండపై నెక్కిన అది చితికిపోవును. కాని యభ్యాసము వలన కుండపై అతిసున్నితముగా నృత్యమొనర్చువారును కలరు. చాలానేర్పరి యని భావము.

**ఘటికాసిద్ధి** — అంజనాద్యష్టసిద్ధులు చూడుఁడు.

**ఘటీయంత్రన్యాయము** — కూప యంత్రఘటికాన్యాయము చూడుఁడు.

**ఘటోత్కచుఁడు** — పాండవ ద్వితీయుండగు భీమసేనునకు హిడింబాసురుని చెలియలగు హిడింబయందు గల్గిన సుతుఁడు. భారత యుద్ధమున నొకరాత్రి ఒక అక్షౌహిణిదండును వధించి అర్జునునిపై కర్ణుఁడు వదలినశక్తిచే (అస్త్రమున)నిహతుఁడాయెను. కుమారుడంజనపర్వుఁడు. ఇతనిశిరమును శ్రీకృష్ణుని యాజ్ఞమేర కిటకుం దెచ్చి ఘటోత్కచుని స్వస్థానమగు నీయాశ్రమస్థానమున సమాధికొనర్చినటుల చెప్పఁబడినది. అందుపై నొక దేవస్థానము నిర్మింపఁబడి అందాతనియాకారముంజిత్రించి యొక శివలింగమును ప్రతిష్ఠించిరందురు. ఆగ్రా, అయోధ్యా, సంయుక్త రాష్ట్రములలోని ఆల్మోడా (కాళీకుమాన్నును) లోని చంపావతీపట్టణ పరిసరముల నున్నది.

**ఘడవాలు జిల్లా** — ఘడవాలు నగరము ప్రధానస్థానము (ఆగ్రా ప్రోవిన్సు చూడుఁడు).

**ఘడవాల్సంస్థానము** (Gharwal State) — ఇది రక్షితసంస్థానము. తొల్లింటి పేరు అరుణోదదేశము లేక చతురశీతిలింగదేశము. ఇప్పటి రాజధాని తెహిరీపురము. (అరుణోద దేశము, ఆగ్రాప్రోవిన్సు చూడుఁడు).

**ఘనలోల గోత్రము** — ఘనశ్రీల కులగోత్రము చూడుఁడు.

**ఘనశీల గోత్రము** — ఘనశ్రీలకుల గోత్రము చూడుఁడు

**ఘనశ్రీలకుల గోత్రము** — ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు). ఘనశ్రీలకులగోత్రము ఏకాగ్నేయ (౩౧) గోత్రము తొల్లింటి సంస్కృత గోత్రము కౌండిన్యస, కుండినగణము, ఆపస్తంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాద్య ప్రవరఖండ, గౌతమేశుఁడు దేవత, కలశాంబ భార్య, కైలాసాద్రి తపసానము, కమలజలధి తటాకము, జపము లక్ష, దీపములు ౭౦, క్షేత్ర సంఖ్య ౮౦, తులాభారము దానము, గురుగు కాయలు వర్జనీయము.

**ఘనీభవించిన (మంచు) జలపాతము, లేక హిమపాతము** — ప్రపంచమునందు చూడఁదగిన గొప్పవింతలలో నొకటి. ఇది నైసర్గికదృశ్యము. చలికాలమునందు సైతము మంచురూపమున జారి పడుచుండుంగాని ఘనీభవించినదని నిలచియుండదు. టిబెట్టు దేశమునందలి చుంబిలోవలో నున్నది. ఫారీనుండి పదిమైళ్ళ దూరము. ఏటేట అక్టోబరు నెలకడదినములందు బిగుసుకొనిపోయి వేసవివఱ కట్లే యుండును.

ఠక్కువకాలమున (పేటి) జలపాతమై పడుచుండును. ఇది తొంబదియడుగుల ఎత్తునుండి పడు జలపాతము. క్రీ. శ. ౧౯౦౮ లో జల మధికమై ముప్పది యడుగుల వెడల్పున పడుచుండె నని యందురు.

సముద్రపునీటిమట్టముపై పదునాఱువేల అడుగుల ఎత్తునందుండుట ప్రాంతముల చెట్టుచేమలు లేవు. వేసవియందు చిన్న మొక్కలు కొన్ని పుట్టి పూవులం బూచెడిని.

**ఘర్ఘరానది** — దీని నిప్పుడు ఘాగ్రా యనియు, గోగ్రా యనియు ననుచున్నారు. కుమాయూ పర్వతములందు జనించి సరయూనది యందు సంగమించునది. దీనిప్రశంస పద్మపురాణము భూమిఖండము ౫౭ యందు కలదు. కురుక్షేత్రమా మున్నది. గోగ్రానది గంగానదియందు ఛప్రాపట్టున సంగమించునది యొకటి కలదు.

**ఘర్మ్యుడు** — అత్రిసంతతి చంద్రవంశ క్షత్రియుడు, గాంధారనృపతి, తండ్రి గాంధారుడు, కుమారునిపేరు ధృతుడు.

---

**ఘాగ్రా (ఘర్ఘరా) నది** - ఘర్ఘరా నది చూడుడు

**ఘాజీపూర్జిల్లా** — ఘాజీపూరునగరము ప్రధానస్థానము. (ఆగ్రా సోవిన్సు చూడుడు.)

**ఘాట్రామేశ్వరక్షేత్రము** — ఆగ్రా అయోధ్యసంయుక్తరాష్ట్రములోని ఆల్మోడా (లేక, కాళీకుమాయూ) డివిజనులో నున్నది. ఆల్మోడానుండి డెబ్బదిరెండుమైళ్ళ దూరము. ఇట సరయూనదియందు రామగంగానదియు, ఇంచుక ఎగువను సుర్మాద్గోరా యను నదియును సంగమించెడిని. సంగమమునందే శ్రీరామప్రతిష్ఠితమగు రామనాథశివలింగము కలదందురు. దీనినే ఘాట్రామేశ్వర మని వాడుచున్నారు. బాగేశ్వరగ్రామము ఇటకు సమీపము.

**ఘానిక గోత్రము** — భరద్వాజఋషిగణము చూడుడు.

**ఘారానది** — పాంచాలదేశమున సింధునదియందు కలియు విపాశ (బీయాస్) శతద్రు (సెట్లెజ్)నదులసంయుక్తప్రవాహమునకుం జేరును. ఇది సింధునదియందు కలియుచు.

శతద్రు విపాశనదులు కలసిన సంయుక్తనదీప్రవాహప్రాంత సీమకును ఈపేరు వాడుచున్నారు (ఘారాయని).

**ఘారాపురి** — ఎలిఫెంటా ద్వీపమున బొంబైనుండి ఆరుమైళ్లదూరమున నున్నది. దీనికి పూరియనియుం బేరుండెనట. క్రీ. శ. మూడవ మొదలు పది శతాబ్దముల మధ్యకాలమున యాత్రాస్థలముగ నుండెను.

---

**ఘుణాక్షర న్యాయము** – కఱ్ఱపై తొలుచు చిన్న గాడివలె వేఱ్వేఱు ఆకారములుగ దానిం దిని, తానిచో రాల్చునట్టిపురుగునకు ఘుణమని పేరు. అట్టిపని యొకప్పుడు అక్షర రూపముగ నగును.

ఎవ్వరో ఏదోపనిచేసిన అది యొకప్పుడొక రీతిగ బరిణమించుతఱి దానిగూర్చి వాడెడి న్యాయము.

---

**ఘూర్జరదేశము** — ఘూర్జర దేశమును, గుజరాతుదేశమును ఒకటియని పొరబడరాదు. ఇవి వేఱ్వేఱుదేశములని తోచెడిని.

ఘూర్జర దేశమునకు క్రీ. శ. ఆరు మొదలు తొమ్మిదవ శతాబ్దకాలముదనుక విమలపురము రాజధానిగ నుండెననియు, విమలపురము అర్బుద శిఖరమునకు (Mount Abu) పశ్చిమముగా ఏబదిమైళ్ళ దూరమున నుండినదనియు తెలియుచున్నది. దీనిప్రశంస స్కాందపురాణ శ్రీమాలా మాహాత్మ్యమున గాననగుచున్నది. ఇంకను బొంబై గెజటీర్ ౧వ వాల్యూము, ౧వ భాగము, P. 461 యందు ఘూర్జరదేశము గూర్చి వివరణము కలదు. ఘూర్జరదేశముగుండా సబర్మతీ వృత్రఘ్ని లేక, వేత్రవతీనదులు ప్రవహించుననని చెప్పఁబడినది. వృత్రఘ్ని సబర్మతియందు సంగమించును. దీని నిప్పుడు వేత్రాకునది యనుచున్నారు. ఖండేశము తొల్లి యొకప్పుడు మాళవలోనిదై యుండినది, ఘూర్జరమున చేరిపోయియున్నది. క్రీ. శ. ఏడవశతాబ్దకాలమున హ్యూనత్సాంగు ఈదేశము సందర్శించుతఱి (బొంబై రాష్ట్రములో నిప్పుడున్న) ద్వీపకల్పమునకు సౌరాష్ట్ర మని పేరువాడుకయందుండెంగాని ఘూర్జరమను పేరు వ్యాపించియుండనట్లు ఆయనవ్రాతనుండి తెలియుచున్నది.

ఇప్పటి మార్వాల్ జిల్లా ప్రాంతమునకు మాత్రము ఘూర్జరమను పేరుండినదని తర్వాత పరిశీలనవలన తేలుచున్నది. వలభీనగరము (తొల్లింటి వలభద్రపురము) ఈదేశమునకు రాజధానియై యుండెనట. దానిని వనరాజు అను నామాంతరము గల బాణరాజు కలహమున పాడయ్యెననియు, పిదపగల్గిన జలప్రళయము క్రీ శ ౭౪౬ ప్రాంతమున పూర్తిగ నాశనమాయెననియు, పిదప నాగసాగరులనే అనహిల్లాపురము నిర్మింపఁబడి రాజధానిగ చేయఁబడెననియు చెప్పఁబడినది. అనహిల్లాపురము క్రీ. శ. ౧౨ వ శతాబ్దకాలముదనుక రాజధానిగ నుండెనట. ఇట పరిపాలించిన కుమారపాలుఁడను నృపతి జైనమతమును స్వీకరించెనట. ఈతని యాస్థానముననే హేమచంద్రుఁడు విద్వాంసుఁడై యుండెనట. ఈతఁడును జైనుఁడే. హేమచంద్రుని కాలము క్రీ శ. ౧౧౪౩-౧౧౭౩ అని కొందఱు లెక్కించుచున్నారు. అనహిల్లా ప్రస్తుతము బరోడారాజ్యమున పటాణ సబుడివిజను నందలి పటాణకడ నని పోల్చఁబడినది. ఇచట నూటఎన్మిది జైనదేవస్థానములు కలవు. ఎక్కువమంది జైనులుకలరు. మరియు నిచట జైనగ్రంథ పుస్తకభాండాగారములు కొన్ని గలవు. అందు

తాటియాకు పుస్తకములు, జైనగ్రంథములు, అమూల్యములగునవి కలవనియు ప్రతీతి కలదు. అనహిల్లప్రక్క గ ప్రవహించునదికి సరస్వతి యని పేరుండెనట. కాని ఇది యే సరస్వతియో తెలియ రాకున్నది.

ఆనర్తపురము పేర్కొన్బడు రాజధాని యని చెప్పబడినది బహుశః ఈప్రాంతభూములే యొకప్పు డనర్తదేశమను పేరం బరగుట అనగా ఘూర్జరదక్షిణసీమలు అనర్త లేక, సౌరాష్ట్ర యని పేరం బరగుతరి ఆనర్తపురము రాజధానియై యుండనోపు. ఇది కుశస్థలియనగా బరగిన ద్వారక గనో లేక, ఆపరిసరములనూపు పూర్వముగనో నుండియుండును. క్రీ. శ. ౬౮౯-౬౭౧ సంవత్సరములనాటి రాగి రేకుశాసనములందిది ఆనర్త పురమని పేర్కొనబడినది దీనిని హ్యూయెన త్స్యాంగు దర్శించినటుల వ్రాసికొనియున్నాఁడు.

ఆనర్తపురమును నగరములును ఘూర్జర శాఖలలోని ఒకశాఖవారగు నగరబ్రాహ్మణు లకు మూలస్థానమగుట దీనికిప్పుడు నగరమని వాడుకపేరు కలదు. కుమారపాలభూపతి ఆనర్త పురముం జుట్టి కోటగట్టెనని శాసన మీటగంగు. కాని యానందపురమను నామాంతరము గల తొల్లింటి ద్వారక లేక, కుశస్థలిగూర్చిన క్రొత్త సంగతులు లేశము తెలియరాకున్నవి. తొల్లింటి ద్వారక సముద్రాక్రాంతమై పోవ ఆప్రాంతతీర మున నిప్పటిద్వారక నిర్మింపఁబడినదని ప్రతీతి బలముగ గలదు. ఇప్పటి ద్వారక నవీననిర్మిత మగుట నిస్సంశయాంశము.

ఆనర్తపురమును రాజధానిగ రెండవధృవ సేనుఁడను రాజు ఘూర్జరమును ఏలెననియు, ఆయన యాస్థానపండితుఁడు భద్రబాహుస్వామి కల్పసూత్రముల రచించెననియు, అది క్రీ. శ. ౪౧౧ సంవత్సరప్రాంతమనియు, డాక్టరు స్టీవెన్సన్ పండితుఁడు కల్పసూత్ర పీఠికయందు వ్రాసి యున్నాఁడు.

బాద్నగర్ శిలాశాసనములందు ఘూర్జర మేలిన నృపతులు మూలరాజు మొదలు కుమార పాలునివఱకు కొంత వివరణము కలదని తెలియు చున్నది.

గుజరాతీదేశమేలిన నృపాలురలో పేర్కొనం దగినవారు క్రీ. శ. ౮౧౨వ సంవత్సరమునాటి ఒకశాసనమున కొంత దొరకినది. అందు గోవింద భూపతియు(సౌరాష్ట్రాలంకారబిరుదముగలవాఁడు) ఆయనసుతుఁడు లతేశ్వరభూపతియు, అతని సుతుఁడు (కర్క) ఖడ్గనృపతియు పేర్కొనంబడిరి. మరికొన్ని పరిశీలనలు ఖడ్గభూపతి గోవిందుని మొదవతరము వాఁడని చెప్పుచున్నవి. ఈతఁడు క్రీ. శ. ఏడవశతాబ్దమధ్యకాలమువాఁడట. పిదప నాహులవంశనృపతులు అధిపతులైరి

**ఘూర్జరదేశమునందలి పంచ పురాతన శివలింగములు** - ఇవి ఘూర్జర దేశమున గుజరాతీలచే పంచ శివదేవస్థానములుగ వాడంబడుచున్నవి. ఈయైదింటిని ఒకయాత్రగ సంచరించెదరు. యాత్ర నూరుమైళ్లగు నందురు. ప్రపంచప్రదక్షిణ మొనర్చిన ఫలము గల్గి చంద్రలోకనివాస సౌఖ్యపదవి కర్తృత గల్గు ననియు దీని ఫలము చెప్పంబడినదట.

౧. కుల్లేశ్వర (మహాదేవ్) శివలింగము - వ్యారాతాలూకాలో నున్నది.

౨. కేదారేశ్వర శివలింగము - బార్డోలీ తాలూకాలో నున్నది.

3. కపిలేశ్వర శివలింగము- నవాసారీజిల్లాలో నున్నది.

౪. కనకేశ్వర శివలింగము - పాల్సనా తాలూకాలో నున్నది.

౫. కాంతారేశ్వర శివలింగము - చోర్యాశీ తాలూకాలో నున్నది.

కొందఱు భిక్షులు నడచుచును, కొందఱు పర్విడుచును వీటిం దర్శింతురట. వారియందిరువది గంటలలో యాత్రసల్పువారుం గలరట.

**ఘూర్జరబ్రాహ్మణులు** — పంచ ద్రావిడశాఖలలో నొకశాఖ. (బ్రాహ్మణులు చూడుఁడు). ఘూర్జరనృపతి పాలించిన రాజ్యమునకు ఘూర్జరమని పేరయ్యెననియు, ఆదేశపు విప్రులు ఘూర్జరులని పేరందిరనియుఁ జెప్పఁబడినది. (ఘూర్జరదేశము చూడుఁడు). వీరికి గుజరాతీ బ్రాహ్మణులనియు వాడుకనామము కలదు గాని, గుజరాతని పేరుగల పురముతో సంబంధము మాత్రము కాదు. వీరియందు వేఱ్వేఱు కాలములందు చీలిన యుపశాఖలు ఇరువదితొమ్మిది గాననయ్యెడిని.

౧. అగస్త్వాల్ శాఖ- అగస్త్యమహర్షి శిష్య సంబంధులై పేరందినశాఖ, యజుర్వేదులు. వీరు కత్తియవాడ్, అహమ్మదాబాద్ ప్రాంతముల గాన్పించుచున్నారు.

౨. అనావల్ శాఖ- వీరికి ఖాతేలాబ్రాహ్మణులనియు, మహాస్త్రావ్నాఖ బ్రాహ్మణులనియు వాడుక నామములు కలవు. సూరతు పురమునుండి నలుబదిమైళ్లి దూరమునంగల అనావల్ పుర ప్రాంతవాసులగుట ఈ పేరందిరట. పెక్కండ్రు సేద్యవృత్తిగలవారు.

౩. అష్టయమంగళశాఖ- మార్వాడీదేశమునను, పాలచ్పూరు ప్రాంతములను గాననగుచున్నారు.

౪. కపిలబ్రాహ్మణశాఖ- సామవేదులు. కపిల సంతతి గోత్రములవారు. శ్రీవిద్యోపాసకులు. శాక్తేయమతము ప్రధానమతము. సూరతు, ఖేడా ప్రాంతముల గానంబడియెదరు.

౫. ఖదాయతు బ్రాహ్మణశాఖ- ఋగ్వేదులు కొందఱును, యజుర్వేదులు కొందఱును గలరు. బొంబై రాజధాని ఖేదామండలములోని ఖదాయతుపుర ప్రాంతవాసులగుట నీపేరందిరని చెప్పుదురు.

౬. ఖేడావాల్ బ్రాహ్మణశాఖ- యజుర్వేదులు. బొంబాయిరాజధానిలోని ఖేడాపుర ప్రాంతవాసులగుట నీపేరందిరట.

౭. గయావళులు- యజుర్వేదులు. కాశీలోని గంగాపుత్రులును, ప్రయాగలోని ప్రాగ్వాలులును, వీరును తొల్లింట ఒకేశాఖవారనియు, చిరకాలముక్రిందటనే వేఱై పూర్వసంబంధములు పాటింపక యున్నారనియు వాడుకకలదు. గయలోని గయావళులు ద్వైతమతము నవలంబించి యున్నారు. వీరు చాల ధనికులని ప్రతీతికలదు. ఖేదామండలములో కొందఱు ద్వైతమతస్థులుగను కొందఱు స్మార్తులుగను కాననగుచున్నారు.

౮. గుగలీ- బ్రాహ్మణశాఖ కృష్ణవిగ్రహముల నర్చించు పూజారులుగనున్నారు. వీరిలో కొందఱు వల్లభాచార్య సాంప్రదాయము నాచరించువారు. బొంబాయిప్రాంతమున గాననగుచున్నారు.

౯. గోమతీవాల్ శాఖ- గోతమర్షి వలన పేరందినవారట. యజుర్వేదులు.

౧౦. చోవిస- బ్రాహ్మణశాఖ. ఋగ్వేదులు కొందఱును, కృష్ణయజుర్వేదులు కొందఱును, సామవేదులు కొందఱును, నైయున్నారు. బరోడారాజ్యమున ముఖ్యముగను, నర్మదానదీ తీరములందునను గాననగుచున్నారు.

౧౧. ఝాలోరాశాఖ బ్రాహ్మణులు- యజుర్వేదులు, ఉదయపూర్ రాజ్యమునందలి ఝాలోర్పుర ప్రాంతనివాసులై యాపేరందినవారట.

౧౨. తపోధన్ శాఖ- తపతీనదీతీర ప్రాంతము లందు సూరత్పుర ప్రాంతములందు గానవచ్చుచు న్నారు శివార్చకులుగను, సేద్యవృత్తిగలవారు గను పెక్కండ్రు గానవచ్చుచుందురు.

౧౩. తలాజీయశాఖ- శుక్లయజుర్వేదులు, మాధ్యందిన శాఖవారు

౧౪. దధీచులు దధీచిమహర్షి సంతతివారు మందురు. వీరిలో పెక్కండ్రు గురువులుగను, కొందఱు భిక్షుకులుగను, కొందఱు వ్యవసాయ వృత్తిగలవారుగను ఉన్నారు.

౧౫. నర్సిపురబ్రాహ్మణులు - ఋగ్వేదులు, శుక్లయజుర్వేదులునై యున్నారు వల్లభాచార్య సాంప్రదాయ మతముగలవారు శ్రీకృష్ణాలయ ములం దర్చకులుగ తరుచుగ గానవచ్చుచుందురు.

౧౬. నాందోద్రాశాఖ- ఋగ్వేదులుకొందఱు యజుర్వేదులు కొందఱు, సామవేదులు కొంద ఱుగ నున్నారు. రాజపిప్పల సంస్థానరాజ్యము, ధరంపూర్ సంస్థానరాజ్యములను, ఆప్రాంతము లందే వీరు గానవచ్చుచుందురు. ఆసంస్థానాధిపతులు వీరిశాఖకుజెందిన వారిశిష్యులని యందురు

౧౭. పారాశర్యులు- పరాశరశిష్య సంతతి వారై పేరందిరట. క్షత్రియవాడు ప్రాంతము, జోధ్పూరు ప్రాంతములందు గానవచ్చెదరు.

౧౮. శ్రీవాల్ శాఖ- యజుర్వేదులు, క్షత్రియవాడు ప్రాంతమున అరుదుగ గానబడు చున్నారు.

౧౯. భార్గవ బ్రాహ్మణులు- శుక్లయజుర్వేదులు, మాధ్యందినశాఖ. భృగుమహర్షి శిష్య సంతతివారై యీపేరందిరట.

౨౦. మొతాలబ్రాహ్మణులు- ఋగ్వేదులు, యజుర్వేదులుగను ఉన్నారు. సూరత్ నగరము నుండి ౧౫ మైళ్ళ దూరమునందున్న మొతా ల్పుర ప్రాంతవాసులై ఈ పేరందిరట.

౨౧. యాజ్ఞికవాల్- బ్రాహ్మణులు, సూరత్ ప్రాంతమున గానంబడుచున్నారు. కొందఱు ఋగ్వేదులుగను, కొందఱు యజుర్వేదులుగను నున్నారు.

౨౨. రజవాల్ శాఖ- యజుర్వేదులు, బొంబాయి రాజధాని ఖేడాపుర ప్రాంతమున గానబడి యెదరు.

౨౩. వడులబ్రాహ్మణులు - క్షత్రియవాడు ప్రాంతముల గానంబడియెదరు.

౨౪. వలాంద్ర బ్రాహ్మణులు- యజుర్వేదులు స్మార్తశాఖ, శ్రీ విద్యోపాసకులై శాక్తేయు లుగ నుందురు. బొంబాయిరాజధానిలోని అహ మ్మదాబాదు ఖేడాపురముల ప్రాంతముల గాన బడుచున్నారు.

౨౫. వాల్మీకి బ్రాహ్మణులు- శ్రోత్రియుల నియు, వేదవిద్యానిధులనియు పేరుగాంచినవారు వాల్మీకి మహర్షి సంతతివారమని చెప్పుదురు.

౨౬. శ్రీమనీలు-వీరిది పూర్వవైష్ణవమతము. మాఘుకవి ఈ శాఖకు జెందినవాడందురు. వీరిలో ఇంకను చాల తెగలు కలవందురు (వీరు రామానుజీయ శ్రీవైష్ణవులుకారు).

౨౭. ఔదీచ్యబ్రాహ్మణులు - వేదవిద్యా నిపుణులని పేరందినవారు. వీరి యందు యజుర్వేదాధ్యయనము, సామవేదాధ్యయనము ప్రధానములు. వీరియందు ౧. సిద్ధపురి ఔదీచ్యులనియు, ౨ సిహోరాఔదీచ్యులనియు, 3. తోల్కియ ఔదీచ్యులనియు మూడు అంత శ్శాఖలు కలవు. వారు పజ్క్తిభోజనము లొనర్తురు గాని సంబంధబాంధవ్యముల మానుకొనిరని తెలిసెడిని.

౨౮. జంబూబ్రాహ్మణులు- కణ్వశాఖ, కౌతుమశాఖ, పిప్పలశాఖ, ఆశ్వలాయన శాఖలను

వాల్గు శాఖలలో నొకదానికిం జెందియుందురు. ఒరోచి ప్రాంతమునంగల జంబూసార్ అనంబడు పురప్రాంతవాసులై యుంట నీశాఖవారి కీపేరు గల్గెనట.

౫. సజోద్రా బ్రాహ్మణశాఖ- వీరు సామ వేదులు, వ్యవసాయము వీరిప్రధానవృత్తియట. వీరింగూర్చి ఇంకనేమియు తెలియరాకున్నది. వీరు చాల తక్కువమందియే యున్నారని తెలిసెడిని.

---

**ఘెట్టో** (Ghetto)— యూదుల నివాసమునకు ప్రత్యేకింపంబడిన పట్టణభాగమున కీ పేరు వర్తించెడిని. వెనుక (మధ్య కాలము లందు) ఐరోపా దేశములవారు యూదులను అం దఱివలెనే క్రైస్తవులతోపాటు నివసింప నీయక వారికై యేర్పఱుపంబడిన ప్రత్యేకస్థానము (ఘెట్టో) లం జుట్టు గోడలంబెట్టి రాత్రులందునను, పండుగ పర్వములందనను, ఆదివారములందునను పైకి రానీయక నిర్బంధము విధించి ఘెట్టోల ద్వార ములకుం దాళములం దగుల్చు చుండిరి. ఇది రోమను పదము గాన ఇటలీయం దీనిర్బంధము ప్రారంభమై యుండునని పెక్కండ్రు తలంచు చుం దురు. ఘెట్టోనిర్బంధము క్రీ. వె. ౧౯ శతాబ్ద మధ్య కాలముతో నంత మయ్యెను. ఇప్పటికిని ఘెట్టోలు వాడంబడుచున్నవి.

---

**ఘోరాంటకకులగోత్రము** — ఇంచుపతుల చూడుఁడు.

**ఘోటక బ్రహ్మచర్య వ్రతము**— అనగా కలసిరానంత కాలము నియమమును, కలసివచ్చిన పిదప వ్రతభంగమునకు సిద్ధమును దెల్పు సామెత (త్రికరణశుద్ధి చూడుఁడు).

**ఘోటముఖ గోత్రము** – అశ్మరథ్య గణము చూడుఁడు.

**ఘోర అంగిరస్సు** — అంగిరస్సు చూడుఁడు.

**ఘోషమణి** — నకులుని శంఖము. ధనుర్విద్య చూడుఁడు. నకులుఁడు చూడుఁడు.

**ఘోస్టిసిజమ్** (Ghosticism) — Simon magho అను నాతఁడు ఈ అభిప్రాయ మతమునకుఁ గర్త. తనమతమునందే నిజమున్న దనియు తక్కినవన్నియు నిరసించ బడవలసినవే యని మతము.

**చంచలి** (కూర) **చెట్టు**—లా. Marsilea quadrifolia (తీయచెంచలి), Oxalis corniculata (పుల్లచంచలి), ఆంగ్ల. Indian sorrel, సం. క్షుద్రామ్లా (పుల్లచంచలి). కొందఱు ఆమ్లలోని శాంగేరి యని తీయచంచలిని వాడిరికాని నైఘంటికము కానేరదు. చంచలి తీయచంచలి యనియు, పుల్లచంచలి యనియు ద్వివిధము. ఇంకను కుచంచలి యని వేరొక అధమపుజాతి యొకటి కలదు. అందు తీయచంచలి బలముగల్గించి అరుచి దోషము నశించును. మూలవ్యాధి, రేచీకటి (రాత్రులందు కానబడని నేత్రరోగము), గుల్మవాయు (కడుపులో నుండు గుల్ల) వీటిం గల్గించు అగస్త్య కదాన్నము ఆకు పసరు తేలు విషమును నాశనమును.

దీనికి పరుగును చంద్రిచెక్క చూర్ణము లేక కషాయము అని చెప్పబడినది

పుల్లచంచలి- ఈ చంచలి జాతియందిది యుక్తమజాతిగ నెంచబడెడిని ఇది భోజన పదార్థముగ వాడబడు చున్నది దీనిని పులిచింతయని కొన్ని సీమలందు వాడుదురట. దీని సమూలరస కషాయములుగాని, చూర్ణముగాని వాడుచున్నారు

వాతము నడంచి జఠరదీప్తిం గల్గించి అగ్నిమాంద్య రోగమును (Dyspepsia) ను నిర్మూలింపఁగల శక్తి దీనికిం గలదనియు, మూత్రమును వెడలించి వీర్యవృద్ధిఁ గల్గించి శరీరమందలి నైసర్గికపు వేడిని స్థిరపర్చుననియు, గ్రహణి, సంగ్రహణి రోగములను నిర్మూలించుశక్తి దీనికిం గలదనియు, గర్భరోగములపై చక్కగ పనిఁజేయుననియు, ఎఱ్ఱనిపుండ్లపై దీని యాకు నూరి కట్టిన మంట, పోటు అడగి మాన్పట్టుననియు, తలకు పూసిన పైత్యపు తలనొప్పి మానుననియు, పులిపిరికాయలు హరించుననియు, కండ్లపై గట్టిన కండ్ల ఎఱుపులు, పోటు మొదలగు నేత్ర రోగములు హరించుననియు, కండ్ల పొరలు, దుర్మాంసము గూడ నివారణమగుననియు చెప్పఁబడినది.

ఇంక కుచంచలిం గూర్చి యంతగా తెలియరాదు (కుచంచలి చూడుఁడు).

**చంచుజాతి వారు** — కొరవజాతి చూడుఁడు.

**చంద్రచెట్టు**— చంద్రచెట్టు తెల్లచంద్ర, ఎఱ్ఱచంద్రయని ద్వివిధము. ఏదియైనను చంద్రచెట్టు జిగురునందు బలమును, వీర్యవృద్ధియు, ఓషధుల పటుత్వమును, అభివృద్ధిపరచు గుణమును, చంద్రచెట్టు వేళ్ళనుండి తీసినరసము సర్వదోషములను హరించి క్రిమి, అజీర్తి, కడుపులోని బల్ల, నోటిపూత, శరీరము వలమైపోవుట మొదలగు పలురోగముల నివారించునని చెప్పఁబడినది. దీనిపుల్లలతో దంతధావన మొనర్చుచుండిన దంతరోగములు మాని,పండ్లుగట్టిపడ జేయును. ఇవి చంద్రసామాన్య గుణములు

తెల్లచంద్రచెట్టు-లా Mimosa Catechu, Accacia catechu. సం శ్వేత, ఖదిర (సామాన్యముగ ఖదిరయనిన చంద్ర). దీని చెక్కరసము లేక కషాయము చేసుగనుండి నోటివెంట రక్తము పడుట, గర్భస్రావము, వ్రణములను నివారించి, జ్వరము, దద్రు, కఫము, వాతములపై చక్కని పని జేయునందురు.

తక్కిన ఎఱ్ఱజాతి చంద్రకు ప్రత్యేకనామము లేదు. సంఖదిర యని వాడుదురు. దీనిచెక్కరసము లేక కషాయము లేక చూర్ణము ఆకలిం గల్గించి ఆమవాతము, ఆమవికారముల నడంచి, అజీర్తి నివారించి, ఉబ్బరోగము, జలోదరము మొదలగు ఉదరరోగములు, జ్వరములు, దంతరోగములు, పాండువు, పైత్యరోగము, మేహము,

వాపులు, విసర్పి, బొల్లి (శ్వేతకుష్ఠు) నివారించు నని యందురు.

**చందకకుల గోత్రము**– ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి (వైశ్యగోత్రములు చూడుఁడు)

చందకకుల గోత్రము– ఏకార్షేయ (౨౨) గోత్రము– సంస్కృత గోత్రము వాసలస, ముసల గణము, ధౌమ్యర్షి, అపస్తంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణ గ్రంథ మాద్యప్రవరఖండ, సమానగోత్రములు జంభసూదనస, ధౌమ్యస, చిత్రేశుఁడు దేవత, చిత్రాంబ భార్య, యమునా తీరము తపస్స్థానము, చిత్రాబ్ది తటాకము, జపము పదిలక్షలు, దీపములు ౨౧, క్షేత్రసంఖ్య ౨౧, నువ్వులు, కృష్ణాజినము దానము, తెల్లచెరకు వర్జనీయము.

**చందన వృక్షము** — చందనము ప్రసిద్ధ సుగంధ ద్రవ్యము. మనదేశమునందు చందనము నెఱుఁగని వారుండరు. ఇది తెలుపు, పసుపు, ఎరుపు రంగుల గంధములనిచ్చు చెక్కలు గలచెట్లుగ త్రివిధమై యుండును. ఇందు తెలుపు, పసుపు రంగులించుక భేదము మాత్రము గల్గి యుంట వాటిం బాటింప జనదనియు, ఒకేజాతిగ నెన్నదగిన దనియు పెక్కండ్రు వాదించుచున్నారు. ఇది ఇట్లుండ ఇందధమపు జాతిదగు కుచందనమని యొకజాతి కలదు. అది సులభముగ నడవులందు పెరుగును. అసలు చందనమువలె అంటున పెంచ వలసిన యావశ్యకత లేదు.

మంచిగంధము లేక శ్రీచందనము– ఇది సువాసనకై గంధముతీసియు, దీని బల్లల నపురూపముగ పెట్టెలను, దువ్వెనలు మొదలగునవి చేయుదురు. ఈచెట్టు పెంపకముచాల కష్టసాధ్యము. ఒకసంవత్సరము వయస్సునకుఁ బెంపఁబడిన నక్కెరి మొక్కలను గోతముల కెత్తుకొని సిద్ధపర్చుకొని మంచిగంధపు విత్తులను మొరక గోతము లందు విత్తి మొలకలం ద్రోసి నాటింతురు. ఇది చింతచెట్టుం బోలి పప్పుజాతిగింజనుండి వెలువడునదిగాన పప్పుబద్దలలోని యాహారమువలన పోషింపఁబడుచు క్రిందకు వేళ్ళుతన్నక మొండెమువలె కొంచము పెరుగును. ఇంతలో నా నక్కెరి మొక్కల మొదళ్ళకు చిన్న గోయివలె రంధ్రము పొడిచి అం దీమంచిగంధపుమొక్క మొదలుందోపి చుట్టు మైనము నలంది కట్టుఁగట్టి భద్రపర్చి గాయము మాన్పుదురు. ఆరెండును కలసిపోవు యదనున నక్కెరిమొక్క తలనచటికిం గోసి గాయము మానఁజేతురు. ఇంతటికి నక్కెరి మొదలుపై మంచిగంధపు పైభాగమును చెట్టుగ నేర్పడును. దానిని పరిశీలనయందుంచి పెంచి కొంత ముదిరినతరి భూమియందు నాటి తోట వేయుదురు. మంచిగంధపుమొక్కకు వేళ్ళుండవు ఇతరజాతి (ముఖ్యముగ నక్కెరి) చెట్టు వేళ్ళతో బీల్చుకొను రసమాహారముగ గైకొనుచు పెరుగు వృక్షము. మంచిగంధపు ద్రుమాను సర్పముల కాశ్రయము. కాన నీచెట్టుగల తావున పాములు మెండుగనుండును. వాటింబట్టి చంపుచుండవలయును. మంచిగంధపు కఱ్ఱకు విలువ యెక్కువ గలదుగాన చెట్టు రమారమి పదిహేనువందల రూప్యములవరకు అమ్ముడుపోవును. ఈ వనములు మైసూరు రాజ్యమున విస్తారముగ బెంచబడుచున్నవి. అచట మంచిగంధముకఱ్ఱతో చేయఁబడిన కుర్చీలు మొదలగునవి కూడ గాననయ్యెడిని.

లా. **Santalam alba.** ఆంగ్ల. **Sandal-wood tree.** సం. చందనం, భోగీవల్లభా, శ్రీగంధం, శ్వేతచందనమ్, శ్రీచందనం. మంచిగంధపుచెక్క రస కషాయము చూర్ణము లేక మంచిగంధపు నూనెలందు చలవజేసి కండ్లకు

చల్లదనము గల్గించుగుణమును, చర్మవ్యాధుల నివారించు గుణమును, రక్తమును శుభ్రపఱచు గుణమును కలవని చెప్పఁబడినది. మరియును క్రిమి, కుష్టువు, గంధర్వరోగము, చర్మవ్యాధులు, తాపము, తాపజ్వరము, పాండురోగము, మేహము, ప్రమేహము, రక్తపైత్యము, విద్రధి (నాభివ్రణము), శగరోగము, స్త్రీల కుసుమ రోగము నివారించుగుణముకలదని చెప్పఁబడినది.

రక్తచందనము- ఎఱ్ఱజాతి. దీనితో పిల్లలాడుకొను బొమ్మలు, భరిణెలు మొదలగునవి చేయుదురు. ఈ జాతి విత్తనములనుండి మొక్కలు మొలచి పెరుగునుగాని అంటుకట్టవలసిన పనిలేదు. దీనికి లాటిన్భాషలో Pterocarpus santalinus ఇంగ్లీషులో Red sandalwood, సంస్కృతమున శ్వేతచందనము, తామ్రవృక్షః, తామ్రసారం, తామ్రాభం, లోహిత, లోహిత చందనం, లోహితజం, హరిచందనము. రక్తచందనము కల్క అరగదీసి పైపట్టువేసిన ఇఱుకు, బెణుకు నొప్పుల నివారించును. కాళ్లు, చేతులు, కండ్ల మంటల నివారించును. చర్మమును శుభ్రపఱచును. కాలినపుండ్లు, సర్పి మొదలగు చర్మవ్యాధు లడంచును. గుండెల నొప్పి నివారించును.

రక్తచందనపు చెక్క రస కషాయ చూర్ణములు లోనికిచ్చిన అనుకూలమైన చలవచేయును. కాలినమంటలు, అతిసారము, కుష్ఠు, ఉన్మాదము, మదము, దాహము, పైత్యము, రక్తపైత్యము, సర్పి, రక్తోద్రేకము, శ్వేతకుష్ఠు, విషమజ్వరము, శ్లేష్మదోషము, అతిసారము, మూత్రకృచ్ఛ్రము, మలమూత్ర నిరోధముల నివారించునని చెప్పఁబడినది.

ఇంక మిగిలిన యుధమపుజాతి కుచందన వృక్షము లడవిజాతివి. ఇవియు రక్తచందనము వలెనే విత్తులేనాటిన మొక్కలగునుగాని అంటు గట్టనవసరముండదు. ఇది ఒకమోస్తరు మంచి గంధముంబోలిన పరిమళము గల్గియుండుంగాని గంధపుగుణములం బూర్తిగ గల్గియుండదు. మంచిగంధము గల్గించు దోషములకు తేనె, పటికపంచదార విరుగుడులని చెప్పఁబడినది.

**చందనగిరి (మలయగిరి)**- మళయాళమువై పుగల మలయగిరిని ఈపేరున త్రికాండశేషమునుండి వాడియున్నారు. దక్షిణదిశనుండి వచ్చు చల్లనిగాలి నీదేశమున మలయమారుత మందురు.

**చందనన్యాయము** — శ్రీచందనము నకేమునాదొక భాగమున అలందినను అంతటా అలందినట్లే పరిణమించునని భావము. సుగంధ ద్రవ్య మొకింత ఎచటవ్రాసినను అంతటారాసినట్లు పరిణమించును. ఇట్టి సాదృశ్యములం దెల్పుతరి నీన్యాయము వాడుచుందురు.

**చందనానది** — ఘూర్జరదేశమున సబర్మతీనది కీపేరు కలదందురు. (పద్మపురాణము చూడుఁడు). బాగాళదేశపు సంతాల్పరగణాలలో నొక చందనానది కలదు. ఇది గంగానదిలో చేరును. దీని ప్రశంస రామాయణము కిష్కింధ కాండము ౧౧-౨౦ యందు కలదు. (అంగదేశము చూడుఁడు.)

**చందనావతిదేశము** — ఇది ఇప్పటి బరోడా సంస్థానప్రాంతసీమగ తలంపబడుచున్న రాజ్యము.

**చందకుల గోత్రము**— చంద్రమశిష్ట చూడుఁడు.

**చందూశాఖక్షత్రియులు** — చౌహానులు చూడుఁడు.

**చంద్రకళలు** — కళలు చూడుము.

**చంద్రకళాహస్తము** - హస్తాభినయము చూడుము, భరతశాస్త్రము చూడుము.

**చంద్రకాంతచెట్టు** —లా. Mirabilis Jalappa. ఆంగ్ల. Four O'clock flower tree. సం. చంద్రకాంతిపుష్పవృక్షః,సంధ్యారాగ వృక్షః అని కొందఱు వాడిరి. అనుదినము సాయంత్రము పుష్పించుచుండును. గుంపనుండి మొలచును. మూడునాలుగు సంవత్సరములు కాలము బ్రతుకుచెట్టు. పూదోటలందేగాక పెరళ్లయందు కూడ పెంచుదురు. దీనియందు పలురంగుల పూవులుగూడ జాతులు కలవు. దీని యాకుల నాముదము రాసి వెచ్చజేసి యవిగాని, దీనిదుంప జీలకఱ్ఱగొట్టి ఆముదమున వెచ్చజేసి యదిగాని కురుపులు, వాపులు, సెగగడ్డలు మొదలగువాటిపై వేసికట్టిన యవి యడగిపోవుననియు, లేక త్వరగా చితుకుననియు, ఎరుపు పూవులుగూడ చంద్రకాంతమూలము వాడుదురు. శరీరపుష్టిని నివారించు శక్తి (రోగనివారణ) కలదనియు చెప్పఁబడినది.

**చంద్రకాంతమణి** (Moonstone) — తెల్లరంగునకు జొరుచు రంగులేని స్వచ్ఛతా గొంతవఱకు (అర్థస్వచ్ఛత) గల్గి యుండు మణి. సింహళద్వీపము మొదలగు తావుల గనులందు దొరకెడిని. ఎండకుం జూపిన పైకొక్క వలచిన ముంజబాలి ధాతువు గల్గియుండును. ఇది ఫెల్స్పార్ జాతికిం జెందినది.

**చంద్రకుల గోత్రము** — చంద్రకులము చూడుము, చంద్రవంశము చూడుము.

**చంద్రకేతుఁడు** (చంద్రవక్త్రుఁడు) — సూర్యవంశక్షత్రియుఁడు. శ్రీరాముని తమ్ముఁడగు లక్ష్మణుని రెండవ కుమారుఁడు. ఇతనికి చంద్రవక్త్రుఁడనియుం పేరుకలదు.

**చంద్రగిరి దుర్గము** — తాళికోట యుద్ధమునకుం బిదప విజయనగర రాజ్యమేలు



చుండిన భూపతులకు చంద్రగిరి నివాసమయ్యెను. శత్రువులకు దుర్భేద్యమగు చంద్రగిరిదుర్గము ఇప్పుడు క్రింద కానబడు కున్నది కొండపైనున్న దుర్గము సరిగానే యున్నది. క్రింద నొక చిన్న సరస్సును, రాజమందిరమును, రాణులనివాసమని చెప్పఁబడు రెండు ఇతర మేడలును కలవు. ఇవి కఱ్ఱలేకుండ రాతితోనే కట్టఁబడినవి. వాసములు సహా రాతివే అమర్పఁబడినవి. పిదప తలుపులు ద్వారబంధములు కఱ్ఱవి అమర్పఁబడి రాజ నివాసము క్రొ్రొత్తవెలయ్ను బంగళాయై యున్నది. ఈ ప్రదేశము తిరుపతికి సమీపమున చిత్తూరు మండలము నందున్నది. గ్రామము కానరాదు. కాని కలిపడు దూరమున ఫర్లాంగ్ ల లెమను ఊరు కలదు M. & S. M R. చిన్నలైనుపైనున్న చంద్రగిరి స్టేషను నుండి రెండు మైళ్లుండును.

చెన్నపురియున్న భూప్రదేశము నీస్టిండియా కంపెనీవారికిచ్చిన పత్రము చంద్రగిరి నుండే పుట్టినదట

**చంద్రగిరి శిఖరము**—(శ్రావణ బెళగోళము) గిరిపంచకము చూడుము.

**చంద్రగుప్త మహారాజు**— నవనందులకుంబిదప మగధదేశాధీసుఁడు.మురకుమారుఁడు. వీరి సంతతిని మౌర్యులందురు. మౌర్యుల కీర్తిఁడు మూలపురుషుఁడు, సుప్రసిద్ధుఁడు. (బింబిసారుఁడు, మగధరాజ్యము చూడుము).

**చంద్ర గ్రహణము** — గ్రహణములు చూడుము.

**చంద్ర చంద్రికా న్యాయము**— చంద్రుఁడు వెన్నెల వినా భావ సంబంధము గలవి

ఒకటి లేనిదీ రావని యుండదు. వీటిని వేఱు పఱచుట దుస్తరము (పిలుకాని పని).

అన్యోన్య సంబంధ పదార్థములను గూర్చి ఈ న్యాయము వర్తించును.

మఱియు దీప దీపికా (కాంతి) న్యాయమును జూడుఁడు.

**చంద్ర తీర్థము** — దక్షిణ దేశమున కావేరీనది జన్మస్థానము కూర్మ పురాణము ౨-౩౧ యందు దీని ప్రశంస కలదు.

**చంద్ర నాగోరుపురము**—తొల్లింటి పేరు చంద్రనగరము. ఫ్రెంచివారిది. (బంగాళా దేశము చూడుఁడు).

**చంద్రపరిక్రమము**(Lunar Cycle)- దీనిని Metonic Cycle అని యనుటయుం గలదు. ఇది పందొమ్మిది సంవత్సరముల పరిమాణ కాలముగలదిగ చెప్పఁబడినది. ఇందు ౨౩౫ పౌర్ణమలుండునని అతెన్సు (గ్రీసుదేశము) పుర వాసియగు మీటన్ పండితుఁడు కన్గొనెనట ఇది క్రీస్తునకు పూర్వము ఐదవ శతాబ్దకాలమునాడని చెప్పఁ బడినది జూలియన్ కేలండరుమేరకు పందొమ్మిది వత్సరములలో ఒకటిన్నరగంట తేడా కన్పించు చున్నది

**చంద్రపరివేషము** (Halo) — ఒక్కొక్క ప్పుడు చంద్రుని చుట్టుకొని చిన్నదిగనో, పెద్దది గనో వలయాకారముగ ఒక యావరణము గుండ్రముగా నున్నవలె గాన్పించును దీనిని చంద్రుని గుడికట్టినాడందురు. ఇది చిన్నదిగా (చంద్రునకు దగ్గఱగా) నుండిన వర్షములు సమీ పించుచున్నవనియును, పెద్దదిగా (చంద్రునకుగొంత దూరముగా) నుండిన వర్షములు గొంత విలంబ ముగా (ఆలస్యముగా) కురియునవియు తలంతురు. ఆకాశమునందలి పరిస్థితులవలన నీటియావిరి గొంచెముదట్టమై ఒక్కొక్కప్పుడు భూమినుండి దూరముగా పైని యాకాశమున గాలియందేర్పడి యుండును. దట్టమైన ఆవిరికణములు, జలబిందు వుగగాని, మంచుముక్కగగాని అగునంతబలము చాలకయు, నీటియావిరికణములకన్న బలపడియు నుండును వీటిగుండా నగుపడుదృశ్యము ఒక లస్టరునుండి ప్రేలాడు అర్ధపుకణిక (మూడు పలుకలది) గుండా నగుపడు దృశ్యమువలెనె యగుట వలనను, అప్పుడప్పుడు కొన్నివిశేషము లగు రంగులుగల్గియుండొచ్చును. చుట్టునువాగిరమై యుంట వలయాకారము (Circle) గ గన్పించును రంగులు కన్పించుటకును, కన్పించక తెల్లరంగే గన్పించుటకును, దూరము, గాలి, వాకరరగానుండుట మొదలగునవి కారణములు. ఆకాశమందలి పరిస్థితులు గాలివలన మాఱినచో నీవలయాకారము అదృశ్యమగును. దీనికిపైగా ఒకప్పుడు పలుచని మేఘము కల్గినను దానికి క్రిందుగనున్న పరిస్థితి మారుదనుక నీవలయమట్లే యగుపడుచుండును.

**చంద్రపురము** (చందువాడ్) — దీని నిప్పుడు ఫిరోజాబాద్ అనుచున్నారు. కనూజ భూపాలుండగు జయచంద్రుండు క్రీ. శ. ౧౧౯౩ సంవత్సరమున మహాబుద్దీన్గోరీతో సంగరమున మడసినతావు. దీని తొల్లింటిపేరు జయచంద్ర పురమును ఫిరోజాబాదుగా మార్చఁబడినది. మరియు మధ్యరాష్ట్రములలోని చాందాపురము నకుఁ దొల్లింటిపేరు చంద్రపురమని యుండెను.

**చంద్రప్రభునాథుఁడు** — జైనతీర్థ కరులలో నొకఁడు; (తీర్థకరులు చూడుఁడు). చంద్రప్రభునాథుఁడు- వీరిచిహ్నము చంద్రుఁడు. ఇక్ష్వాకువంశక్షత్రియుఁడు. తండ్రి మహాసేన రాజు. తల్లిపేరు లక్ష్మణాదేవి. జన్మస్థానము

చందపురి. పొడవు ౧౫౦ ధనస్సులు. (ధనస్సు మూడున్నరమూర). శ్వేతవర్ణము. ఆయువు పది లక్షలు. గణధర్ సంఖ్య ౯౩. నిర్వాణస్థానము సుమేరుశిఖరము (శిఖరీజీ లేక అర్బుద శిఖరము). తొంబదికోట్ల సాగర్.

**చంద్రబింబములు** — భూమిపైకి గన్పించునది ఒకే చంద్రబింబము. జ్యూపిటర్ అనంబడు గోళముపైకి నాల్గుచంద్రబింబములును, శాటర్న్ అనంబడు గోళముపైకి ఎన్మిది చంద్రబింబములును, చుట్టు చాల పెద్దదియగు ఒక



కరివేసముం గన్పకుననియు, యూరేనస్‌గోళముపైకి గన్పించునవి ఆరు చంద్రబింబములును, నెప్ట్యూను గోళముపైకి గన్పించునది ఒక చంద్రబింబమనియు పరిశీలనల వలన తేలుచున్నది. చంద్రబింబములనిన ఆయా గోళములకు (భూమికి చంద్రుడువలెనే) సమీపము గ దానిం జుట్టి తిరుగుచు సూర్యకాంతిని తాకి గాని వెన్నెలగా రాత్రియం దాగోళముపై ప్రసరింపం జేయు ఉపగోళములని ఎఱుంగునది.

**చంద్రభాగానది** — జీలమ్, చీనాబ్ నదుల సాముదాయిక ప్రవాహమునకు చంద్రభాగ యనిపేరు. కాని యిక్కాలమున సర్వసాధారణముగ జీలమునదితో కలియకపూర్వము గూడ యానదిని చీనాబ్ అనుచున్నారు.

**చంద్రమశిష్ట గోత్రము** ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యుల గోత్రములు చూడుడు). చంద్రమశిష్ట గోత్రము-ఆత్రేయగోత్రము (3). దీని (చంద్రకళ) సంస్కృతగోత్రము జాతుకర్ణ్యస, జతుకర్ణ్య గణము, ఆపస్తంబయజుశ్శాఖ, ప్రమాణగ్రంథ మగాదృ(?)ప్రవరఖండ, శ్రీశేసుడు దేవత, పొన్న మాంబ భార్య, తోతాద్రిశృంగము తపస్థానము, పున్నాగసరస్సు తటాకము, జపము కోటి, దీపములు ౩౯, క్షేత్రములు ౪౭, అశ్వదానము, శంకుపూసలు, లత్తుగ, చాదనము వర్జనీయములు.

**చంద్రము** — గంగాసింధూరము చూడుడు.

**చంద్రవక్త్రుడు** — చంద్రకేతుడు చూడుడు.

**చంద్రశర్మ** — తండ్రి విష్ణుశర్మ ఇతనికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతుల వారగు నల్వురు భార్యలుకలరనియు, బ్రాహ్మణవర రుచియును, క్షత్రి. విక్రమాదిత్యుడును, వైశ్య. భట్టియును, శూద్ర భర్తృహారియు సుతులుగ బడసెనవారు.

అందు వరరుచి గొప్పవిద్వాంసుడు. పాణిని సూత్ర (వ్యాకరణశాస్త్రము) ములవృత్తి వ్రాసిన వాడు విక్రమాదిత్యుడు మాళవ (అవంతి) దేశాధీశుడగు గొప్పమహారాజు, విద్యాపోషకుడు (అవంతిచూడుడు) (విక్రమాదిత్యుడు చూడుడు). భట్టి ఆ యాస్థానపు ప్రధానమంత్రి యయ్యెను. భర్తృహరి, కొంతకాలము విక్రమాదిత్యునకుం బిదప రాజ్యమేలెగాని యోగియైన వాడు. భర్తృహరి సుభాషిత మీతనిరచన.

**చంద్రశేఖర పురము**—(చిట్టగాంగు) ఇది కొంతకాలమునకు మారి చటలాయనియు పిదప చిట్టిగాంగుగను మారెనట. ఆసాంలోనిది. ఇది క్షేత్రము ఇటగల శీతకుండము కడ చంద్రశేఖర పర్వతమునను్న శివలింగమును, భవాని దేవస్థానమును ౫౧ శక్తిపీఠములలో నొకటిగ వారాహితంత్రము ౩౧ యందు వివరింపంబడినది. యాత్రాస్థలము. దీనిని కొందఱు చటుపురమనుచున్నారు. (చూడుడు).

**చంద్రాతిథి గోత్రము** — ఆత్రేయ గణము చూడుడు.

**చంద్రాదిత్య పురము** — యదు (యాదవ) వంశనృపతియగు శ్రీధారప్రహారుడను నృపతికి రాజధానియై యుండినటుల తెలియుచున్నది. ఇప్పుడు బొంబాయిరాష్ట్రములోని నాశికజిల్లాలోని చాందోర్ అను పేరంబరగుచున్నది.

**చంద్రావతీనది** — ఇది అంగదేశము నందలి చంపానగరముకడ గంగానదిలో సంగమించును. దీనినిప్పుడు అంధేలా యనుచున్నారు. ఒకప్పుడు చందన్ అని పేరుండెనట. (అంగదేశము చూడుడు).

**చంద్రావతీ పురము** — చేది దేశమున దొకప్పుడు శిశుపాల నృపతికి రాజధానిగ నుండెనట.

Central India లోని లలితపూర్ జిల్లా యందు చందేరియను పేరంబరగుచున్నది (అనూప దేశము చూడుడు).

**చంద్రాశ్వుడు (లేక దండాశ్వుడు లేక ధృఢాశ్వుడు)** — ఇక్ష్వాకు సంతతి సూర్యవంశ క్షత్రియుడు తండ్రి కంకుమారుడు కుమారుడు హర్యశ్వుడు.

**చంద్రిక** — వెన్నెల చూడుడు.

**చంద్రుడు (గోళము)** (Moon) — చంద్రుడు భూమినాశ్రయించి దానిచుట్టి తిరుగుచుండుగోళము. భూమిచుట్టి తిరిగి యథాస్థానము చేరుటకు ౨౭.౩౩ రోజులు పట్టునని జ్యోతిశ్శాస్త్రవేత్తలు లెక్కించియున్నారు. ఇందుకు ౨,౩౮,౮౦౦ మైళ్ళ దూరము, చంద్రుని Diameter ౨,౧౬౦ మైళ్ళని చెప్పబడినది. తనకు తానై గిరగిర తిరుగుచు భూమిచుట్టి తిరుగుచుండునదిగ చెప్పబడినది.

చంద్రుడు భూమిచుట్టి వచ్చుకాలము నొక (చాంద్రమానమున) మాసముగ చెప్పబడినది. ఆంధ్రదేశమున మతసంబంధకృత్యాచాంద్రమానమే విధింపబడినది. చాంద్రమాసములు పండ్రెండగుచో, అనగా పండ్రెండుపౌర్ణములు పండ్రెండు అమావాస్యలు గడచువరకు ఒక సంవత్సరమగును. ఇది సర్వసాధారణముగ నడచుచుండు పద్ధతి. ఒక్కొకతరి పదమూడుమాసములు సంవత్సరముగ సంభవించును. దీనిని అధికమాస మందురు వేరొకతరి పదునొకండు మాసములకే సంవత్సరము పూర్తియగును. అట్టి లేనిమాసమును క్షయమాస మనెదరు (కాలము చూడుడు).

మహమ్మదీయమతస్థులకు చాంద్రమానసంవత్సరమే ప్రధానము. వారిపండుగ లీలెక్కనే యేటేట లెక్కింపబడుచుండును. చంద్రగోళము భూమినాశ్రయించి భూమిచుట్టి తిరుగుచుండుట యా భూమిచే నాకర్షింపబడుచుండుటయో, లేక తాను భూమినాకర్షించుచుండుటయో, లేక రెండును కల్గియుండవలెనని భావము. భూమిని (అందు ముఖ్యముగా తన కెదురుగ సమీపము నందుండెడి భాగమును) ఆకర్షించుచుండుటవలన ఆభాగమునందలి జలములు ఆకర్షణశక్తిలోనై సముద్రములందు పోటుకల్గుచుండును. అనగా అచట నీరుపొంగుటయు, ఇతరతావుల నీరచటికి చేరుటయు సంభవించును. పొంగినతావుకు పోటనుచున్నారు తక్కిన తగ్గిపోయిన తావులకు పాటనుచున్నారు. (పోటుపాటు చూడుడు)

చంద్రునకు స్వతస్సిద్ధమగుకాంతి లేదు. సూర్యకిరణములు చంద్రునిపైం బడి ప్రతిఫలించి భూమిపైం బడినవెల్గునే వెన్నెలయందురు. అమావాస్యదినమున భూమిచుట్టి తిరుగుట పగటియందు మనకు గానరానందున, రాత్రియందు పశ్చిమగోళార్ధసంచారియగుట, రాత్రియందు చంద్రునివెన్నెల మనకుండక చీకటిరాత్రిగనే

యుండెడిని. పౌర్ణమియందట్లుగాక పగలు పశ్చిమ గోళార్ధసంచారియై రాత్రియంతయు మనగోళార్ధమున సంచరించుచుండుగాన మనకు వెన్నెల గాంచ నగును. అమావాస్యదినమున పగలు భూమికిని సూర్యునకును నడుమగ చంద్రుండేగుటసంభవించునేని, అత్తరి సూర్యకిరణములు భూమిపైఁ సరిగా పడక అంతయో కొంతయో అడ్డుకల్గును, దానిని సూర్యగ్రహణమందురు. పౌర్ణమినాఁటి రాత్రి సూర్యునకును చంద్రునకును భూమి నడుమగ నడచుట సంభవించునేని అత్తరి సూర్యకిరణములు చంద్రునిపైఁ సరిగా పడుట అంతయో కొంతయో అడ్డుకల్గును, దానిని చంద్రగ్రహణమందురు

అమావాస్యకు అమావాస్యకు నడుమ ౨౯.౫౩ రోజుల కాల ముండును. ఏలనన సూర్యుఁడు కొంచెముముందునకుం జనియుంట నీకాలాధిక్యత గల్గెడిని. కాని తిరుగుచు నేగుటకు వలయు కాలము ౨౭.౩౨ రోజులని ముందే చెప్పఁబడినది. దాని నతిక్రమించుటకు చంద్రునకు రమారమి రెండుదినములు కావలసియుండును.

చంద్రునియందు బయళ్ళేగాక పర్వతములు విస్తారముగనే కలవని కనిపెట్టఁబడినది దూరదర్శిని యంత్రపరికరమూలమున చక్కగను జాగ్రతగను పరిశీలించిన నొకయగ్ని పర్వతశిఖరము ముప్పదివేలయడుగుల ఎత్తు కలదనియు, అగ్ని పర్వతముయొక్క ఒకముఖరంధ్రము అరువది మొదలు ఎనుబదివఱకు మైళ్ల అడ్డుకొలత గలది కలదనియు గానవచ్చెడిని.

చంద్రుని తిరుగుట లెక్క (Cycle) పందొమ్మిది సంవత్సరములని తేలినది. క్రొత్త Cycle ప్రారంభమున ఒకేనెలయందు అమావాస్యయు పౌర్ణమియు ఒకేవారమున కల్గును.

చంద్రుఁడు భూమిచుట్టి తిరుగుటయందు ఎల్లప్పుడు ఒకేవైపును భూమికెదురనుండునటుల తిరుగుచుండును

**చంపకచతుర్ధశి** — జ్యేష్ఠశుద్ధచతుర్ధశికీపేరు గలదు. ఈదినమున సంపంగిపూలతో శివార్చన సల్పవలయునని చెప్పఁబడినది.

**చంపకదేశము** (చంపారన్) — ఇప్పుడు చంపారన్ అనుపేరం బరగుచు మధ్యరాష్ట్రముల లోని రాజిమ్ పురమునకు ఉత్తరముగ నైరుమైళ్ల దూరమున నున్నదని తెలియుచున్నది. ఇది బౌద్ధులకు, జైనులకు యాత్రాస్థలమై యున్నది. పద్మపురాణము ౧౭ సర్గయందు దీనిప్రశంస కలదు. చంపకపురము హంసధ్వజుని రాజధానిగ జైమిని భారతము ౧౭ అధ్యాయమున చెప్పఁబడినది.

ఇంకను హిందూదేశములో చంపారన్ అనం బడు వేఱొకతావు గలదుగాని అది దీనికిసరిపోవుట లేదు శక్తిసంగమతంత్రమను గ్రంథమున ఏడవ యధ్యాయమునఁగల గ్రంథసకు సరిపోవుచున్నది.

**చంపనత్త్ పురము** — దక్షిణకోసల చూడుఁడు.

**చంపమహారాజు** — చంద్రవంశ క్షత్రియుఁడు. పృథులాశ్వ మహారాజు (అంగదేశాధీశుఁడు) కుమారుఁడు. (అంగదేశము చూడుఁడు).

**చంపయవన దేశము**— (చంపాదేశము చూడుఁడు). వాట్సనస్వాంగు సయాందేశప్రాంతమని వ్రాసియున్నాఁడు.

**చంపాదేశము** — ఇప్పటి భరతదేశపు పశ్చిమోత్తర దిశను ఇప్పటి చంపా (చంబా) సంస్థాన రాజ్యమని పోల్చుచున్నారు. కాంగరా, త్రిగర్త, కాష్ఠవాత దేశముల నడుమగ నుండునని తలంపఁబడుచున్న దేశము. కొందఱు చంపాదేశము సయాందేశ ప్రాంతమని తలంచిరిగాని

హ్యూయనత్సాంగు చంపయవన దేశమని వ్రాసి యుంట అది సరికాదని తేలుచున్నది

**చంపానది** — ఇది అంగ, మగధదేశముల నడుమ సరిహద్దుగ నుండెనని కేంబ్రిడ్జి ఎడిషన్ జాతకములందు, చాంపేయ జాతకమున (౪ సంపుటము ౨౮౧ పుట) చెప్పబడినది. ౧౬౦౯ పుటయందు కూడ కలదు. దీనిప్రశంస పద్మపురాణ సృష్టి ౧౧ యందు కలదు

**చంపా పురము** — తొల్లింటి అంగ దేశపురాజధాని కర్ణునకిదియే రాజధానిగ నుండెను. (అంగదేశము చూడుడు)

**చంపారణ్యము** (చంపారన్) — బెంగాల్ నాగపూర్ రైల్వేకి కలకత్తా కార్డ్ లైన్ మీదనున్న రామపూర్ జంక్షను నుండి అబహార్‌పూరు చిన్నలైనుపై కడనున్న అబహాన్పూరు నుండి రాజిమ్ అను ప్రదేశమునకు పోవలెను. రాజిమ్ నుండి ఉత్తరముగ నైరుతి మైళ్ళదూరమున చంపారణ్యము కలదు దీని నిప్పుడు చంపారన్ అని వాడుచున్నారు. చంపారణ్యము బౌద్ధమతగ్రంథ సుప్రసిద్ధ మగు పవిత్రారణ్యము. ఇది తపస్థలమని చెప్పబడినది.

చంపారణ్యమును జైనులు, బౌద్ధులు కూడ గౌరవించుచున్నారు. ఇరుసంఘములకిది యాత్రా స్థలమై యున్నది (చంపకదేశము చూడుడు, అరణ్యములు చూడుడు).

**చంపారంజిల్లా** — చంపారను పురము (చంపారణ్యము) ప్రధానస్థానము. (బీహారదేశము చూడుడు).

**చంపావతి** — కూర్మాచల దేశమునకు ప్రధాననగరమై యుండెను. ఇది గొప్పక్షేత్రము. క్రాంతేశ్వర శివలింగము, హింగుళాదేవి మొదలగు పెక్కుక్షేత్రములు కలవు. మహాభారత వనపర్వ ౮౫ి నందు దీనిప్రశంస కలదు.

**చంపావతీదేవి** (సిద్ధురాలు) — ఈ మహాత్మురాలు సుప్రసిద్ధ శివభక్తుడగు బాణాసురుని కుమార్తె. అనిరుద్ధుని భార్యయగు ఉషాదేవికి అక్క. ఈమె యోగినియై గొప్ప తపం బొనర్చి సిద్ధురాలయ్యెను ఈమె యాశ్రమము నేటికిని ఈమెపేరన బరగు చంపావతీ పురమున బాలేశ్వర దేవాలయావరణమున గలదు. ఇది ఈమెసమాధి పరిసరములై యుండనోపు. (నాగనాధయోగి చూడుడు)

ఆగ్రా, అయోధ్య, సంయుక్త రాష్ట్రముల లోని అల్మోడా (లేక కాళీకుమాఊ సీమ) పరగణాపట్టి అస్సియులోని చంపావతీ పురము ఈమహాయోగినిరాలి పేరన బరగుచున్నది.

**చంపాషష్ఠి** — భాద్రపద శుద్ధషష్ఠి. ఆదివారము విశాఖా నక్షత్రము వైధృతి నామ యోగము కూడిన నాదినమును చంపాషష్ఠి యనెదరు

**చంపుడు** — ఈపేరుగలవారిద్దరు గలరు. హరితుని కుమారుడొక చంపుడు, ఇతని సుతునిపేరు సుదేవుడు. అంగదేశాధీశుడగు పృథులాక్షుని కుమారుడు చంపుడు. ఇతడు నిర్మించిన పురము చంపా నగరము.

**చంబ** (తీగ లేక పాదు) — సం. ఖడ్గశింబ, స్థూలశింబ. కాయలకూర వేడిచేసి ధాతువృద్ధి నిచ్చును. అపథ్యపదార్థము. వాతము, పైత్యము, శ్లేష్మము, మూలవ్యాధి, వికారము, జఠరమాంద్యము, మలబద్ధము, దృష్టి బలము తగ్గుట మొదలగు దుర్గుణములు చేయును.

ఇందు అడవిచమ్మ యని ఒక తీగ కలదు. ఆకు రసము కర్ణరోగముల శాంతింప చేయును.

కాయ శైత్యాధిక్య మొనర్చును. రెండును రమారమి ఒకేజాతికి చెందినవి. చమ్మచిక్కుడు జాతిలోనిదని తలంపఁబడు చున్నది.

**చంబాస్టేటు** (సంస్థాన రాజ్యదేశము)— పంజాబులోని బ్రిటీషు రక్షిత సంస్థానములు 3౪ లో నొకటి. కాశ్మీరము జమ్మునకుం దూర్పున నున్నది. చంబాపురము రాజధాని. కొండల రాజ్యము. దీని తొల్లింటి పేరు చంపాదేశమం దురు. కొందఱు చంపాదేశము సయాం ప్రాంత మని వాదము సాగించిరికాని వ్యాఖ్యానత్స్యాంగు అది చంపాయవనదేశమని వ్రాసియుంట నిరా ధారమని తేలినది. (కాంగరా, త్రిగర్త, కాష్టవాడ రాజ్యముల ప్రాంత దేశము).

**చకర్నగర్**—ఏకచక్రపురము చూడుఁడు.

**చక్కిలాలు తింటావా చద్ది తింటావా అంటే, రెండూ తింటాను తరువాత భోంచేస్తానన్నదట**– (అనగా తిండిపోతని భావము).

**చక్రతీర్థము** — ఇవి పలుచోట్ల పెక్కులు గాన నయ్యెడివి. అందు ముఖ్యములు

౧. కురుక్షేత్రమున రామహ్రదము లేక ద్వైపాయన హ్రదమున నొక చక్రతీర్థము. (దీనిం గూర్చిన ప్రశంస భారతమునగలదు).

౨. గుజరాతు ఎంగు ప్రభాసతీర్థముకడ గోమతి నదియందు. దీనిం గూర్చి ద్వారకా మహాత్మ్య మున ప్రశంస కలదు.

3. గోదావరీ నది జన్మించు త్ర్యంబక క్షేత్ర మునుండి ఆరుమైళ్ల దూరమున నొకటి కలదు.

౪. కాశీయందు మణికర్ణికా కుండమునకు చక్రతీర్థమని చెప్పఁబడినది.

౫. రామేశ్వరమున దేవాలయమున రెండవ ప్రాకారమున నొక చక్రతీర్థము కలదు.

౬. ఆంధ్ర దేశమున నర్సాపురము కడ నంతర్వేది యందు సముద్రమునొకటి కలదు.

౭. శ్రీజగన్నాథమున (ఉత్కళదేశము) నొక చక్రతీర్థము కలదు.

**చక్రధర్మి గోత్రము**— విధృవ గణము చూడుఁడు.

**చక్రభ్రమణ న్యాయము** — ఇట కుమ్మరవాని చక్రమునకర్థము అది తిరుగుట యని తాత్పర్యము

జీవన్ముక్తులు సైతము పూర్వకర్మ పూర్తిగ అనుభవమగు వఱకు జీవించి యుండవలెం గాని ముక్తినందరని యీన్యాయము వాడెదరు.

**చక్రమూలకుల గోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౧ గోత్రములలో నొకటి (వైశ్య గోత్రములు చూడుఁడు).

ఏకాక్షేయ (౮౦) గోత్రము. సంస్కృత గోత్రము చక్రపాణిస, చక్రపాణిగణము, అపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాద్య ప్రవరఖాండ, చక్రేశుఁడు దేవత, రామాంబ భార్య, బ్రహ్మావర్తము తపస్థానము, రామసరస్సు తటాకము, జపము కోటి, దీపములు ౭౦, క్షేత్ర సంఖ్య ౭౦, ఛత్రదానము, చక్రవర్తి కూర వర్జనీయము.

**చక్రరేఖ** — పురుష సాముద్రికము చూడుఁడు, స్త్రీ సాముద్రికము చూడుఁడు.



**చక్రవర్తి (కూర) చెట్టు** — లా. **Chenopodium album.** సం. వాస్తుకీ. ఇందు తెల్లచక్రవర్తికూరకు జ్వరఘ్ని, వాస్తుకీ యను పేర్లు కలవు. ఇది తెలుపు, ఎఱుపు, నలుపు మూడుభేదముల జాతులు గలదిగాని అన్నియు

సమానగుణములు గలదియే. దీని యాకు (కూర) త్రిదోషహరమై మూలవ్యాధినణచి, విషదోషమును, నులిపురుగులను నివారించి, జఠరపుష్టి, బలము గల్గించుననియు, వేపిచేసి అగ్నిమాంద్యము, ఆమవికారము, అరుచిదోషముల నడంచియు, సంగ్రహణిరోగము నిర్మూలించుననియు చెప్పబడినది. మరియు నిది కొన్ని తత్త్వములకు ఎక్కువ వేడి జేసి విరేచనబద్ధము గల్గించును. దీనికి విరుగుడు చంద్రచొక్క చూర్ణము, రసము లేక కషాయము నని చెప్పబడినది.

**చక్రవర్తులు లేక మహారాజులు**- షట్చక్రవర్తులు- భరతఖండము నేలిన ప్రసిద్ధసామ్రాట్టులు ౧. హరిశ్చంద్రచక్రవర్తి, ౨. " చక్రవర్తి, ౩. పురుకుత్సచక్రవర్తి, ౪ పురూరవచక్రవర్తి, ౫ సగరచక్రవర్తి, ౬ కార్తవీర్యార్జునచక్రవర్తి. వీరిని మహారాజులనియు ననుట గలదు.

షోడశమహారాజులు- ౧ మరుత్తు, ౨. సుహోత్రుడు, ౩. శిబి, ౪ శ్రీరాముడు, ౫. దిలీపుడు, ౬. మాంధాత, ౭. యయాతి, ౮. అంబరీషుడు, ౯. గయుడు, ౧౦. రంతిదేవుడు, ౧౧. భరతుడు, ౧౨. పరశురాముడు, ౧౩. శశిబిందుడు, ౧౪ పృథువు, ౧౫. అనంగుడు, ౧౬. భగీరథుడు. వీరలను చక్రవర్తులనియుం గూడ నందురు.

**చక్రవాకీ చక్రవాకన్యాయము** — చక్రవాకపక్షుల దంపతులు పగలొకచోటనే కలసియుండి రాత్రి వేళ విడిపోయి మేతకుజని విరహవేదన నొందుచు ఉదయమున తిరిగి కలుసుకొనుచుండును. ఇట్టి నిత్యవియోగ నిత్యసంయోగములకీన్యాయము వాడుచుందురు.

**చక్రహస్తము** — హస్తాభినయము చూడుడు, భరతశాస్త్రము చూడుడు.

**చక్రాసనము (లేకవర్తులాసనము)**- యోగశాస్త్రమున చెప్పబడిన యాసనములలో నొకటి నిలుచుండి రెండుచేతులతోను రెండు పాదాంగుష్ఠములను పట్టుకొని ముందుకువంగి యుండుట. ఈ యభ్యాసము వలన కుండలినీ ప్రబోధము సిద్ధించునని చెప్పబడినది.

**చక్రుడు** — అత్రి చంద్ర యాదవవంశ క్షత్రియుడు, తండ్రి శ్రీకృష్ణుడు, తల్లి సత్యభామ, సోదరులు ప్రద్యుమ్నాదులు. (శ్రీకృష్ణుడు చూడుడు)

**చటకస్య మాంసంభాగశతమ్** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. పిచిక మాంసము నూరు భాగములనుటయందు స్వల్పాతిస్వల్పమనియు, నిరుపయోగమనియు భావము.

**చటులా (చిట్టగాంగు) పురము** — చంద్రశేఖరపురము చూడుడు. దీని తొల్లింటి పేరు చంద్రశేఖరపురమని కొందఱనుచున్నారు. (చూడుము).

**చటాయన గోత్రము** - శాండిలగణము చూడుడు.

**చటాయని గోత్రము** — ఆర్ష్టిషేణగణము చూడుడు.

**చచ్చత్పుట తాళము** — తాళములు చూడుడు.

**చచ్చినంత కలగంటే వెంద్రాళే మేల్కొన్నట్లు** — ఆంధ్రలోకోక్తి.

**చచ్చినపాప (పసిబిడ్డ) కండ్లు చేరడేసి అన్నట్లు** — ఆంధ్రలోకోక్తి.

**చచ్చేవానికి సముద్రము మోకాలి లోతే** —(అనగా తెగింపుతో నిర్భయుఁడై యుండునని భావము) ఆంధ్రలోకోక్తి

**చతురంగుఁడు** - అంగదేశాధీశుఁడగు రోమపాద మహారాజుపుత్రుఁడు (అతిరథుని చూడుఁడు)

**చతురశీతిలింగదేశము** – అరుణోద దేశము చూడుఁడు. ఇప్పటి గడవాలు సంస్థానము.

**చతురహస్తము** — హస్తాభినయము చూడుఁడు. భరత శాస్త్రము చూడుఁడు

**చతురామ్లములు** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున అమ్లవేతసము, వృక్షామ్లము, నిమ్మ, గజనిమ్మలకు చతురామ్లములని పేరు

**చతుర గోత్రము** — కణ్వ ఉప గణము చూడుఁడు.

**చతురూషణములు**—త్రికటకములు అనగా శొంఠి, పిప్పలి, మిరియములు, పిప్పలి మూలము (కుబ్బు) వీటి కాయుర్వేద వైద్య శాస్త్రమున చతురూషణము లనిపేరు

**చతురోపాయములు** - ఉపాయములు చూడుఁడు

**చతుర్జాతకములు**— ఆయుర్వేద వైద్యశాస్త్రమున ఆకుపత్రిక, యాలకులు, దాల్చినచెక్క, నాగకేసరాలకు చాతుర్జాతకము లనిపేరు.

**చతుర్దశ చాటువులు** — చాటువులు చూడుఁడు.

**చతుర్దశ భువనములు** — భువనములు చూడుఁడు.

**చతుర్దశ భువనలోకములు** — ఊర్ధ్వలోకములు ఏడు-౧. భూలోకము, ౨. భువర్లోకము, 3. సువర్లోకము, ౪ మహర్లోకము, ౫. జనలోకము, ౬ తపోలోకము, ౭ సత్యలోకము

అధోలోకములు ఏడు- ౧ అతలము, ౨. వితలము, 3. సుతలము, ౪. రసాతలము, ౫ మహాతలము, ౬. తలాతలము, ౭ పాతాళము. రెండుగలసి పదునాల్గు లోకములు

**చతుర్దశ మనువులు** — మనువులు చూడుఁడు

**చతుర్దశ మహారత్నములు**-ఇవి చక్రవర్తి కుండఁదగిన మహైశ్వర్య బలములు అత్రి సంతతిలోని చంద్రవంశమున, యాదవులలో క్రోష్టు సంతతిలోని చిత్రరథుని పుత్రుఁడగు శశిబిందు మహారాజు కుండెనని చెప్పఁబడినది. అవి సజీవ రత్నములనియు, నిర్జీవ రత్నములనియు రెండు విధములు. (రత్నమనగా నిట జాతి శ్రేష్ఠ సాజ్ఞమని యెఱుఁగునది)

శ్లో॥ భార్యాపుత్రో పురోహిత శ్చైవ। సేనానీ రథకృచ్ఛ యః। పత్త్యశ్వకలభా శ్చేతి ప్రాణినస్సప్త కీర్తితాః॥
శ్లో॥ చక్రం రథో మణిః ఖడ్గమ్ చర్మ రత్నం చ పంచమం। కేతుర్నిధిశ్చ సప్తైవ ప్రాణహీనాని చక్షతే।

పతియుంట- ౧. భార్య, ౨. పుత్రులు, 3 హితులు, ౪. సైన్యాధికతులు

**చతుర్దశ విద్యలు** — విద్యలు చూడుఁడు.

**చతుర్దశ శైవభేదమతములు**-ఇవి శైవ మతభేదములుగ చెప్పఁబడుచున్నను ఆరాధ్యుల మతముతో గాని, వీరశైవుల మనుకొను లింగాయతులు జంగముల మతముగాని, ఏసంబంధము గలవిగా గనపడుటలేదు. ఈమతముల వారొక్క విభూతి, రుద్రాక్షధారణాది బాహ్య లక్షణములను మాత్రము గలిగి యున్నారు.

వీరి సిద్ధాంతమేమో తెలియరాదు. వీరి గ్రంథములు ఆగమములని చెప్పుటయేగాని అవి బయల్పడుటయును లేదు. వీరియందువిద్వాంసులు లేనిచే వీరి మతవిధులు వీరాచరించుట వలననే గాక అన్యత్రా తెలియరాకున్నవి.

౧ సమ్మిశ్రితశైవము ౨. మహావ్రతశైవము, ౩ శివసమవాదిశైవము, ౪ ఐక్యవాదిశైవము, ౫ సంక్రాంతివాదిశైవము, ౬. ప్రవాహేశ్వరవాదిశైవము, ౭. అవికారవాదిశైవము (దీనిని కపాలిమత మందురు), ౮. ఊర్ధ్వశైవము ౯ అనాదిశైవము, ౧౦ మహాశైవము ౧౧. గుణశైవము, ౧౨ క్రియాశైవము, ౧౩ సతుష్పాపిశైవము, ౧౪ శుద్ధశైవము అనునవి

**చతుర్దశారణ్యములు**—౧. నైమిశారణ్యము. ౨ బదరికారణ్యము, ౩ దండకారణ్యము, ౪. గంధకారణ్యము, ౫. కాళుకారణ్యము ౬. బృందావనము. ౭ కదళికావనము ౮ మహారణ్యము. ౯ దేవతారణ్యము ౧౦ కేదారారణ్యము. ౧౧ ఆనందవనము, ౧౨ గాయత్రీవనము, ౧౩ పిత్రారణ్యము, ౧౪ మహా (వా) రణ్యము

**చతుర్థికా** — నాల్గతులము పరిమాణమునకు ఫలపరిమాణమనియు, చతుర్థికా పరిమాణమనియు పేరు. దీనిని కొందరు ఎనిమిది తులము ప్రమాణమనియున్నారు

**చతుర్బీజములు** — ఆయుర్వైద్యశాస్త్రమున మెంతులు, ఆశ్వాలు, వామము, నల్లజీలకర్రలకు చతుర్బీజములందురు.

**చతుర్ముఖము**— తాళములు చూడుడు.

**చతుర్విధ జన్మములు** — ౧.అండజములు - గ్రుడ్లనుండి పుట్టు పక్షులు మొదలగువాని జన్మములు. ౨. స్వేదజజన్మ- చెమట నుండి పుట్టు నల్లులు, పేలు మొదలగువాటి జన్మములు. 3. జరాయుజములు- సంచుల నుండి జన్మించు మనుష్యులు, పశువులు మొదలగువాటి జన్మములు. ౪. ఉద్భిజ్జములు- భూమినిపెకలించుకొని పుట్టు మొక్కలు, పైరులు మొదలగునవి.

**చతుర్విధ పురుషార్థములు** — పురుషార్థములు చూడుడు

**చతుర్విధ ప్రమాణములు** (కొలత, తూనికలు)— ప్రమాణచతుష్టయము చూడుడు.

**చతుర్విధ బౌద్ధమతపక్షములు**— ౧ సత్తు లేక సత్పక్షము. ౨ అసత్తు లేక అసత్పక్షము, ౩ సదసత్తు లేక సదసత్పక్షము, ౪ సదసద్విలక్షణపక్షము.

**చతుర్విధ బౌద్ధములు**- ౧. యోగాచారము-గురుడు చెప్పుట-యోగము, శిష్యుడు బోధపఱచుకొనుట ఆచారము అర్థములు చెప్పిన రీతినే బోధపఱచుకొనువారు యోగాచారులు. ౨ సౌత్రాంతిక బౌద్ధము- సూత్రములందు గల నిగూఢార్థమును పాటించుట ప్రధానముగాగల్గి గురుబోధనైనను అతిక్రమించుటకు వెఱచువారు సౌత్రాంతికబౌద్ధులు. 3. మాధ్యమికబౌద్ధము- యోగాచారములంగల కొంతనమ్మకము చాలకుండియు, సౌత్రాంతికార్థములకొఱకు యోగాచారములం దిరస్కరించ ధైర్యము చాలకుండియు మధ్యస్థితియందుండువారు మాధ్యమిక బౌద్ధులు. ౪. వైభాషిక బౌద్ధము- యోగాచారమును బహిరంగముగ తిరస్కరించియోగాక విభావలాడి తిరుగబడినవారు వైభాషిక బౌద్ధులు.

**చతుర్విధ వాద్యములు** — వాద్యములు చూడుడు.

**చతుర్విధ శాంతములు** — సాధన చతుష్టయము చూడుఁడు.

**చతుర్విధ సంగీతములు** — వాదములు చూడుఁడు.

**చతుర్విధ క్షీరములు** — ౧ ఆవుపాలు- ఇవి గుమ్మపాలు (పితికినవేడి నురుగు చల్లారకుండ నుండుతఱి) అమృతతుల్యమై యుండును. పిదప కాచినవి శ్లేష్మము. ఇవి వృద్ధాలశరీరముల కనుకూలమని చెప్పఁబడినది. ౨. గేదెపాలు- ఇవి గుమ్మపాలు దోషము గుమ్మ చల్లారినతోడనే అమృతతుల్యమై యుండుననియు, పిదప కాచినవి శ్లేష్మమనియు, ఇవి గాయములు తగిలియున్న రోగుల కనుకూలమనియు చెప్పఁబడినది. ౩ మేకపాలు- ఇవి కాగి వేడిగా నున్నపుడు అమృతతుల్యమై యుండుననియు, అంతకుపూర్వముగాని పిదపగాని యోగ్యములు కావనియు, ఇవి పిల్లలకు అనుకూలమనియు చెప్పఁబడినవి ౪. గొఱ్ఱెపాలు- ఇవి కాచి చల్లార్చినపిదప అమృతతుల్యముగ నుండుననియు, మరియు శ్వాసరోగము గలవారికి గొఱ్ఱెపాలనుకూలమై యుండుననియు చెప్పఁబడినది.

ఈసందర్భమున మొగశిశువు తల్లికడ చనుబాలు మొగశిశువున కనుకూలించుననియు, అవి లఘువుగా పథ్యమై యుండుననియు, ఆడశిశువు తల్లికడ చనుబాలు ఆడశిశువుల కనుకూలించుననియు, అవి గురుత్వమై అపథ్యమై (అన్యులగు మొగశిశువులకని భావము) యుండుననియుఁ జెప్పఁబడినది.

**చతుర్వింశతి గాయత్రీముద్రలు** - గాయత్రీముద్రలు చూడుఁడు.

**చతుర్వింశతి గుణములు** — గుణములు చూడుఁడు.

**చతుర్వింశద్యవతారములు** — ౧. యజ్ఞవరాహ, ౨ సుయజ్ఞ, ౩ కపిల, ౪. దత్తాత్రేయ, ౫ కుమార, ౬. నరనారాయణ, ౭. ధృవ, ౮. పృథుచక్రవర్తి, ౯ ఋషభ, ౧౦ హయగ్రీవ, ౧౧. మత్స్య, ౧౨ కూర్మ, ౧౩. నృసింహ, ౧౪ హరి, ౧౫. వామన, ౧౬. హంస, ౧౭. మన్వంతర, ౧౮ ధన్వంతరి, ౧౯. పరశురామ, ౨౦. శ్రీరామ, ౨౧. శ్రీకృష్ణ, ౨౨ వ్యాస, ౨౩ బౌద్ధ, ౨౪. కలికి అవతారములు విష్ణుదేవుని చతుర్వింశద్యవతారములని చెప్పఁబడినది.

**చతుర్వింశతి తత్త్వములు** - యోగశాస్త్రసంబంధమున నిరువదినాల్గు తత్త్వములు చెప్పఁబడినవి ౧ పృథివీతత్త్వము, ౨ జలతత్త్వము, ౩ అగ్నితత్త్వము, ౪ వాయుతత్త్వము, ౫ ఆకాశతత్త్వము, ౬. గంధతత్త్వము, ౭ రసతత్త్వము, ౮. రూపతత్త్వము, ౯ స్పర్శతత్త్వము, ౧౦. శబ్దతత్త్వము, ౧౧. ఘ్రాణతత్త్వము, ౧౨. జిహ్వతత్త్వము, ౧౩ చక్షుస్తత్త్వము, ౧౪. త్వక్తత్త్వము, ౧౫. శ్రోత్ర తత్త్వము, ౧౬. పాయుతత్త్వము, ౧౭. ఉపస్థతత్త్వము, ౧౮ పాదతత్త్వము, ౧౯ పాణితత్త్వము, ౨౦. వాక్తత్త్వము, ౨౧. మనస్తత్త్వము, ౨౨ ప్రకృతి తత్త్వము, ౨౩ మహత్తత్త్వము, ౨౪. అహంకారతత్త్వము అనగా పంచభూత తత్త్వములు, పంచతన్మాత్రా తత్త్వములు, పంచ జ్ఞానేంద్రియ తత్త్వములు, పంచ కర్మేంద్రియ తత్త్వములు, మనస్తత్త్వము, ప్రకృతి తత్త్వము, మహత్తత్త్వము, అహంకార తత్త్వమును. ఈ ఇరువదినాల్గు తత్త్వములు మాత్రము యోగశాస్త్రమున నంగీకరింపఁబడినవి.

**చతుర్వ్యూహన్యాయము** — చతుర్వ్యూహము లనేక తావులయందు వేదవ్యాసుగ

చెప్పఁబడినవి. వైష్ణవ సిద్ధాంతమున వాసుదేవ వ్యూహము, సంకర్షణవ్యూహము, ప్రద్యుమ్న వ్యూహము, అనిరుద్ధవ్యూహము చతుర్వ్యూహములని చెప్పఁబడినవి. సాంఖ్య పాతంజలదర్శనములందు హేయము, హానము, హేయహేతువు, హానోపాయము చతుర్వ్యూహములని చెప్పఁబడినవి. వైద్యశాస్త్రమున రోగము, ఆరోగ్యము, నిదానము, భైషజ్యము అనునవి చతుర్వ్యూహములు.

**చతుర్వేదవిత్ న్యాయము** — నాల్గు వేదవిత్ అనఁగా నాల్గువేదముల నెఱింగినవాఁడని యర్థము. ఇట్లనుటయందు నాల్గు వేదములు చదివి ఎఱింగినవాఁడని యర్థముకాని, వేదములు నాలుగున్నవనుటమాత్ర మెఱింగినవాఁడు కాఁడని భావము.

**చతుర్హస్తశాఖ క్షత్రియులు** — క్షత్రియకులము శాఖలను క్షత్రియులు చూడుఁడు.

**చతురశ్రజాతి తాళములు** — సంగీతశాస్త్రమున సప్తతాళములందుగల ఏకజాతులలో నాల్గు జాతి (లఘు) ప్రమాణము చూడుఁడు

**చతుర్వర్ణము** — తాళములు చూడుఁడు.

**చతుష్పాద శైవము** — ఇది చతుర్విధ శైవ భేదములలో నొకటి (చూడుఁడు). ఈ మతమున త్రిపదార్థములు సులక్షణము శివసమవాదిశైవమునందువలెనే యుండును. చర్యా పాదము, క్రియాపాదము, యోగ పాదము, జ్ఞానపాదము ననంబడు (ఆగమోక్తి) నాల్గుపాదములచే నీ మతమునకు చతుష్పాదశైవమని పేరయ్యెనట. గురునివలన దీక్షనంది పై నాల్గుపాదములందు చెప్పఁబడిన దానిని సాధించి నిష్ఠగలవాఁడై పశువు పతియందైక్యమగుటయే ముక్తియని చెప్పఁబడినది.

**చతుష్పీఠ పర్వతము** - దీనినాంగ్లులు అస్సియా రేంజి అనెదరు. ఉత్కలదేశమున కటకంజిల్లాలో జాజిపుర ప్రాంతమునుండి భువనేశ్వరమువరకు వ్యాపించియున్నది (ఉత్కల దేశము చూడుఁడు ఖండగిరి గుహలు చూడుఁడు).

**చతుష్షష్టి కళలు** - విద్యలు చూడుఁడు.

**చతుష్షష్ట్యుపచారములు** — ఉపచారములు చూడుఁడు

**చతుష్షష్టి తంత్ర గ్రంథములు** - ఈ తంత్రములు శివప్రోక్తములు ఇవి అరువది నాలుగు. ఇందు పదునెన్మిది ప్రధానములనియు తక్కినవి యుపవిద్యలనియుఁ గొందఱు చెప్పెదరు. ఇవి వేదములకుముందే యుండినవని చెప్పఁబడినది

౧ మహామాయా శంబరము, ౨. యోగినీజాల శంబరము, 3 తత్త్వశంబర తంత్రము, ౪ సిద్ధభైరవతంత్రము, ౫. కంకాళభైరవము, ౬ కాలాగ్నిభైరవము, ౭ అగ్నిభైరవతంత్రము, ౮. శక్తిభైరవతంత్రము, ౯. యోగినీభైరవము, ౧౧ మహాభైరవతంత్రము, ౧౧ ప్రధానభైరవము, ౧౨. బ్రాహ్మితంత్రము, ౧3 మాహేశ్వరీతంత్రము, ౧౪ కౌమారీతంత్రము, ౧౫. వైష్ణవీతంత్రము, ౧౬. వారాహీతంత్రము, ౧౭. ఇంద్రాణీతంత్రము, ౧౮. చాముండా తంత్రము, ౧౯ శివదూతీతంత్రము, ౨౦. యమళాష్టకము, ౨౧. చంద్రజ్ఞానతంత్రము, ౨౨. మాలినీవిద్య, ౨3 సమ్మోహనము, ౨౪. మహాసమ్మోహనము, ౨౫. వామాజుష్టతంత్రము, ౨౬. వాతూలము, ౨౭. వాతూలోత్తరము, ౨౮. కాముక

తంత్రము, ౨౯. హృద్భేదము, ౩౦. తంత్రభేదము, ౩౧. గుహ్యతంత్రము, ౩౨. కలావాదతంత్రము, ౩౩. వాత్స్యాయనాదికము, ౩౪. కలాసారము, ౩౫. కుండికామతము, ౩౬. మతోత్తరతంత్రము, ౩౭. వీణాతంత్రము, ౩౮. త్రోతలతంత్రము, ౩౯. త్రోతలోత్తరము, ౪౦. పంచామృతము, ౪౧ రూపభేదము, ౪౨ భూతోడ్డామరము, ౪౩ కులసారము, ౪౪. కులోడ్డీశము, ౪౫. కులచూడామణి, ౪౬. సర్వజ్ఞానోత్తమము, ౪౭. మహాకాళీమతము, ౪౮. అరుణేశతంత్రము, ౪౯. మోదినీశతంత్రము, ౫౦. వికుంఠేశ్వర తంత్రము, ౫౧. పూర్వతంత్రము, ౫౨ పశ్చిమతంత్రము, ౫౩. దక్షిణతంత్రము, ౫౪. ఉత్తరతంత్రము, ౫౫. నిరుత్తరతంత్రము, ౫౬. విమలతంత్రము, ౫౭. విమలోదతంత్రము, ౫౮. దేవీమతతంత్రము, ౫౯. ంభాగమపంచకము, ౬౦ వశిష్ఠసంహిత, ౬౧. సనకసంహిత, ౬౨. శుకసంహిత, ౬౩. సనందనసంహిత, ౬౪ సనత్కుమారసంహిత.

**చతుష్షష్టి తంత్రములు, ౬౪ —** ౧ అవ్యాజపాలినీ తంత్రము, ౨. రాజ్యలక్ష్మీప్రసాదక తంత్రము, ౩. సర్వసామ్రాజ్యతంత్రము, ౪ అగారగమనతంత్రము, ౫. రాజ్యోపాగ తంత్రము, ౬. శ్రీబాలరాజతంత్రము, ౭ చామరద్వంద్వ తంత్రము, ౮. బ్రహ్మరాజతంత్రము, ౯. ధీరతంత్రము, ౧౦ గ్రామపాలనతంత్రము, ౧౧. మిత్రలక్ష్మీప్రయోగతంత్రము, ౧౨ గర్గపాలన తంత్రము, ౧౩. ప్రాణలక్ష్మీప్రయోగ తంత్రము, ౧౪. ప్రభాలక్ష్మీప్రయోగతంత్రము, ౧౫. తోయలక్ష్మీప్రయోగతంత్రము, ౧౬. గంధలక్ష్మీప్రయోగతంత్రము, ౧౭. పుష్పలక్ష్మీప్రయోగ తంత్రము, ౧౮. కామరూపతంత్రము, ౧౯. కలాజీవనికాతంత్రము, ౨౦. కుంజకంబల తంత్రము, ౨౧. కనకప్రయోగతంత్రము, ౨౨. బోధినీతంత్రము, ౨౩ సత్యలక్ష్మీప్రయోగతంత్రము, ౨౪ పాశకా తంత్రము, ౨౫. ప్రజ్ఞాలక్ష్మీప్రయోగతంత్రము, ౨౬. ఖేటకతంత్రము (ఢాలు), ౨౭. చాప తంత్రము, ౨౮. లేపతంత్రము, ౨౯. శిల్పతంత్రము, ౩౦. భీమలక్ష్మీప్రయోగతంత్రము, ౩౧. మణిస్థానప్రయోగతంత్రము, ౩౨ పాతాళగమన తంత్రము, ౩౩. మృగిణీ తంత్రము, ౩౪. స్ఫులింగలక్ష్మీతంత్రము, ౩౫. శంఖమర్దనతంత్రము, ౩౬ చక్రాయుధ ప్రయోగతంత్రము, ౩౭ భైరవాదిప్రయోగతంత్రము, ౩౮. సూక్ష్మతంత్రము, ౩౯. లేఖతంత్రము, ౪౦ పృథ్వీతంత్రము, ౪౧ అశ్వతంత్రము, ౪౨. గజతంత్రము, ౪౩ గోరక్షకతంత్రము, ౪౪ ఐశ్వర్యలక్ష్మీతంత్రము ౪౫ శల్యతంత్రము, ౪౬ [illegible]లక్ష్మీప్రయోగతంత్రము, ౪౭. జీవనీతంత్రము, ౪౮. గిరితంత్రము, ౪౯ వనతంత్రము, ౫౦. స్థానాపత్యప్రయోగతంత్రము, ౫౧ శ్రీపర్వదాడినీతంత్రము, ౫౨ విఘ్నవిచ్ఛేదతంత్రము, ౫౩ భరతతంత్రము, ౫౪ శృంగవాద్యప్రయోగతంత్రము, ౫౫. వరవాహన తంత్రము, ౫౬ స్తంభిని తంత్రము, ౫౭ దాహినీతంత్రము, ౫౮ మారిణీతంత్రము, ౫౯. ద్వేషిణీతంత్రము, ౬౦. ఆకర్షణతంత్రము, ౬౧ ఉచ్చాటనతంత్రము, ౬౨ శోషిణీతంత్రము, ౬౩ మృతసంజీవనీతంత్రము, ౬౪ నాగమేఖలికా తంత్రము.

**చతుష్షష్టి విద్యలు —** విద్యలు చూడుడు.

**చతుస్తాళము —** తాళములు చూడుడు.

**చతుస్సమములు —** చందనము, అగరు, కస్తూరి, కుంకుమ పువ్వులకు చతుస్సమములని పేరు ఇంకను కొందఱు జాజికాయ, లవంగాలు, జీలకఱ్ఱ, వెలిగారములకు చతుస్సమములనియున్నారు.

**చదరంగము ఆట** — ఇది ప్రపంచ మంతయు వెలసి ఏదో ఒకపేరున అన్ని దేశముల వారిచే ఆడఁబడుచున్న సుప్రసిద్ధమగు ఆట. ఆంగ్ల దేశమున Chess అనఁబడుచున్నది. ఇతర **వేఱ్వేఱు** దేశములందు వేఱ్వేఱు పేరులు కలవు.

వరుసకు ఎనిమిదిగళ్ల చొప్పున ఎనిమిదివరుసలం గల్గిన అరువదినాల్గు గడులుగల పలకపై నీయాట రెండు ఏనుఁగులు, రెండు గుఱ్ఱములు, రెండు శకటములు, ఒక మంత్రి, ఒక రాజు, ఒక్కొక్క పక్షమునకుండును. వీటి యొక్కొక్కదానికి కుట ఒక్కొక బంటు చొప్పున పక్షమునందు ఎనమండుగురు బంట్లుండును. ఇట్లొక్కొక్క పక్షమునందుండు ఇరు పక్షములందు ముప్పదిరెండు పరికరములతో నీయాట ఆడఁబడును. (పటము చూడుఁడు)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఏనుగు | గుఱ్ఱము | శకటు | రా | మం త్రి | శకటు | గుఱ్ఱము | ఏనుగు |
| బంటు | బంటు | బంటు | బంటు | బంటు | బంటు | బంటు | బంటు |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| బంటు | బంటు | బంటు | బంటు | బంటు | బంటు | బంటు | బంటు |
| ఏనుగు | గుఱ్ఱము | శకటు | మం త్రి | రా జు | శకటు | గుఱ్ఱము | ఏనుగు |

ఇట్టియాటను సర్వసాధారణముగ మస్తుఆట యనియు, నిస్సస్తుఆట యనియు ద్వివిధముగ నాడుచుందురు. ఆరెండువిధములగు ఆటలకు ముఖ్యసూత్రములను ముందుగా వివరించుట సమంజసము.

ఏనుఁగు- ఒకయెత్తు (Move) లో ఏదేనియొక దెసకు తిన్నగా ముందునకు, వెనుకకు ఉభయ పక్షములకు ఎంతదూరమైనను పోగలదు. తన కడ్డమువచ్చినవానిని చంపగలదు. ఏనుఁగు ఐమూలగడులకు పోవఁజాలదు. ఏనుఁగుతో రాజు నొసర్చుతఱి పెట్రాజనియు, మహాయనియు నుడువుచున్నారు.

గుఱ్ఱము- ఒకయెత్తు (Move) లో ఐమూల గడితరువాతి తిన్ననిగడిలోనికిగాని లేక, ముందు తిన్ననిగడితరువాత ఐమూలగడికిగాని దాటించవలసిన జంతువు. అనగా ఇట్లు దాటుటకు తా నాగు గడి ఖాళీగానుండి యుండవలెనని ఎఱుంగునది. ఇట్లు దాటుచు ఏదిశకైనా పోవగలుగును. తా నాగు గడియందున్న జంతువుంగాని, బంటుంగాని, రాజు మంత్రులంగాని చంపు

గలుగును. గుఱ్ఱముదాటుతరి ఆనుగది ఖాళీగా నుండవలయునేగాని దాని యినతలి (మధ్య) గది ఖాళీగా నుండనక్కరలేదు. గుఱ్ఱముతో రాజు నెదుర్చుతరి వేసిరాజనియు, మహా యనియు నుడువుచున్నారు.

శకటు- ఒకఎత్తు (Move) నందు ఐమూల గదులలో నెంతదూరమైనను పోగలదు. అనఁగా అన్ని దిక్కులకు ఐమూలగా పోవగలదు. తానెదుర్కొనిన జంతువుం జంపగలదు. ఇది రాజునెదుర్కొనినతరి మహా యనియు, వేసిరాజనియు ననుచున్నారు.

మంత్రి- ఏనుఁగువలెను, శకటువలెను, ఎత్తులో (Move) నడువగలదు. ఇది పరరాజు నెదుర్కొనుతరి పేర్రాజనియు, మహాయనియు నుడువుచున్నారు.

రాజు- తిన్నగా మూలను నిక్కలకును ఐమూల గడులకును ఒకేగది నడచును అనఁగా ఒకఎత్తున ఎన్మిదిదిశలలో నేదిశకైనను ఒకేగదికిఁ జనును. ప్రతిఆటయందు పగవారు రాజు అనకపూర్వము ఒకపర్యాయము గుఱ్ఱమువలె ఒకేదాటు దాటఁగలదు. కాని, పగవారెదుర్కొని "రాజు" అనుటతో నీగుఱ్ఱపుదాటుశక్తి యస్తమించి పోవును పగవారిపక్షమువారెవ్వరైనను రాజు నెదుర్చు చుండరు. ఏలనన రాజు పడిపోయిన నాటయె కట్టిపోవును. కాన తనబలము రాజును భద్రముగ నుండునట్టు చూచుకొనుచుండవలెను. రాజుపగవారిం జంపగలదుగాని, పోవుట ఎదుర్కొనుట శ్రేయముగాదనియు, రాజుపై రాజెన్నడెదుర్కొన నపాయమనియు చెప్పుదురు.

ఇతరశత్రు జంతుబాధలు కేవలము దరిని లేకుండినతరినే రాజు చంపంగల్గి యుండుంగాని కానిచో చంపవీలులేదని భావము.

పిదప వివరింపఁదగినది బాటుగూర్చియై యున్నది. దీనికిఁజాల పద్ధతులు కలవు చదరంగపు టాటయందు ఇతరులకన్న బాటుగూర్చియె ఎక్కువగా నెఱుఁగవలసినవి కలవు.

బాటు- ఒకఎత్తు (Move) నందు ఎదుటనున్న ఒకేగది కేగును. ఇది వెనుకకు రాలేదు. శత్రుని ఎదురుగనుండుతరి చంపలేదు గాని ఎదుట ఐమూలనాటపు గదియందుండు జంపి అటకేగి నిలచును అనఁగా తనగదికిఁ దగిలియున్న ఎదుటి మూలగదియని భావము ఇది రాజునెదుర్కొనుటకు త్రోసి రాజనియు, మహాయనియు నిల్వుచున్నారు. ఇది త్రివిధములుగ నెదుర్కొనవలయును

౧ సాధారణత్రోసి రాజు- ఒకే బాటుతో రాజునెదుర్కొని త్రోసిరాజు అని ఆట కట్టుట.

౨ రెట్టింపు (డబుల్) త్రోసి రాజు- రెండు బాటులు వరుసగా ప్రక్కప్రక్క గదులలో నుండి (అనఁగా నొకటివెనక నొకటిగ కాదని భావము) ఒకబాటుతో "త్రోసిరాజు" అని రాజుప్రక్క గదిలోనికి దప్పుకొనినతరి ప్రక్కనున్న రెండవ బాటుతో తిరుగత్రోసి రాజుఅని ఆటఁగట్టునట్లు చేయుట.

3. ఉయ్యాలత్రోసి రాజు- రెండుబాటులు ప్రక్కగా ప్రక్కప్రక్క గదులలో నడుమనొక గది ఖాళీయుండునటుల నుంచి ఒకబంటుతో వరుసగా రెండుసార్లు "త్రోసిరాజు" అనినపిదప రెండవ బంటుతో తిరిగి త్రోసిరాజుఅని ఎత్తునడపి ఆట కట్టుట.

ఇకనీబాటు ఏనుఁగుకు ముందుగ నుండునది (ఏనుఁగులేకుండినతరి) ముందునకు తిన్నగ నడచి ఎదుటికడ గదికిం జేరునేని అంతటితో దానిశరీరము మారి ఏనుఁగుగనై ఆఎదుటికడ గదియందు నిలచును. ఆటయందలి స్వపక్షమున రెండేనుఁగు

**చదివినవానికన్న చాకలియె నెర వన్నట్లు** — ఆంధ్రలోకోక్తి.

**చదువవేస్తె ఉన్నమతీ పోయిన దట** — ఆంధ్రలోకోక్తి.

**చదువుల సోమలింగయ్య కవి** - ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడిన వాఁడు. నియోగి శైవుఁడు. గారుత్మతమ్యతిస గోత్రుఁడు, తండ్రిపేరు వేంకటచలమయ్య, ఆరాధ్యులు. తల్లి అన్నపూర్ణమ్మ. గొప్పకవి. రసవంతమై నిర్దుష్టమగు కవిత జెప్పఁగలవాఁడు

రచించినది మదనసాయక విలాసమనెడి ప్రబంధము. ఇది చాలరసవంతముగ నున్నది. దీనిని శ్రీశైల మల్లికార్జున స్వామికి గృతి సమర్పించెను.

**చద్దికూడుతినినభార్య మగనిఆకలి నెఱుగదన్నట్లు** — ఆంధ్రలోకోక్తి.

**చనశిష్ట గోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యుల గోత్రములు చూడుఁడు).

చనశిష్టస గోత్రము, ఏకార్షేయ (౨౭) గోత్రము, దీనిని చనసష్ట యనియు, చనసిష్ట యనియు గూడ నందురు. సంస్కృత గోత్రము జాబ్రిస, జబ్రిగణము, శాండిలర్షి, ఆపస్తంబ యజుశ్శాఖ, ప్రమాణగంథ మాధ్యప్రవరఖండ, సమానగోత్రములు, జాబ్రేయస, శాండిల్యస, దుర్గేశుఁడు దేవత, ధర్మాంబ భార్య, రజితాద్రి తపస్థానము, ధర్మాంబుధి తటాకము (ధర్మ సరస్సు), జపములకు, దీపములు ౭౮, క్షేత్ర సంఖ్య ౧౦, ఏనుఁగు దానము, చేమలు వర్జనీయము.

**చనిపోవుట** — జనన మరణములు చూడుఁడు.

**చనుబాల చెట్టు** — లా. Cassia absus దీనింగూర్చి యేమియు దెలియరాదు. దీనివిత్తులు లోనికిచ్చిన విరేచనము చేయుననియు, నీళ్ళతోనూరి పైనపట్టువేసిన తామర మొదలగు చర్మవ్యాధులు నివారణమగుననియు నందురు.

**చన్నచర్ల (గడ్డ) చెట్టు** — దీనిని నాగేటికూప, నాగేటిగడ్డ, కనిగుడ్డుగడ్డ యని గూడ వాడుచున్నారు. సంస్కృతపుపేరు కనికాగీ, హావినీ, రంగపుష్టా యని కొందఱను చున్నారు. ఇది శీఘ్రముగ శరీరమున వ్యాపించి వేడిచేసి నులిపురుగులం జంపుననియు, స్త్రీలకు గర్భస్రావము గల్గించుననియు, పైత్యముజేసి, కుష్ఠు, మూలవ్యాధి, వ్రణములు, శూలలు, నివారించుననియు నందురు.

**చన్నికుల గోత్రము** — చన్నకుల చూడుఁడు.

**చన్నిశుల గోత్రము** (చన్నికుల గోత్రము) — చన్నకుల చూడుఁడు

**చపలభస్మము** — ఇది యొక రాతి భస్మము. శాస్త్రోక్తముగఁ జేయఁబడవలెను. ఈ భస్మము లోనికిచ్చిన వాత,పైత్య, మేహసంబంధ రోగముల నివారించి అగ్నిదీప్తిఁగల్గించి మిక్కిలి వీర్యవృద్ధి జేయునని చెప్పబడినది.

**చప్పి - చప్పిడి** — విసప్పి చూడుఁడు.

**చమత్కార పురము**— దీనికి ఆనంద పురమనియు, బారానగర్ అనియు పేర్లు కలవు. గుజరాతు దేశములోనిది. ఇచట అచలేశ్వర శివలింగము కలదు.

ఇది నాగర బ్రాహ్మణుల నివాసమై యుండి యొకప్పుడు నాగరమనియును, నాగరపుర మనియుం బేర్లుం బెనట.

చమత్కారపురము తొల్లి యొకప్పు డనర్త దేశపు ప్రధాన నగరమై యుండెనట. ఇది

హాటకమను పేరంబరగు పవిత్ర క్షేత్రము. సిద్ధపూర్ నుండి ఆగ్నేయముగా డెబ్బదిమైళ్ల దూరము. దీనిం గూర్చిన ప్రశంస స్కాందపురాణము నాగర ఖండమున గలదు.

**చమసోద్భేదము** (తీర్థము)— సోమోద్భేదము చూడుఁడు.

**చమూ** — చమూ యను సంస్కృత పదమునకు సేన యని యర్థము. అది ౭౨౯ ఏనుఁగులు, ౭౨౯ రథములు, ౨౧౮౭ అశ్వదళము, ౩౬౪౫ పదాతిదళమునని నిర్ణయింపఁబడినది. (అక్షౌహిణి చూడుఁడు) చమూపతియనిన నిట్టి సైన్యదళమున కధికారియని భావము

**చమ్మ (కాయ) తీగ** — ఈ పాకు కాయలను చమ్మకాయలందురు. ఇది చిక్కుడు జాతిలోనిదని తోచెడిని. కొందఱు దీనికి సంస్కృతపుపేరు చంపరో, శంబరో యనియు, దాని వికారరూపమే చమ్మకాయయెననియు నందురు గాని సరిగా తెలియరాకున్నది. కాయలు లేతగ నుండఁగా భోజనపదార్థముగ వాడుదురు. వేడియు, పైత్యము జేయును. త్రిదోషములు, మూలశంఖవ్యాధి, దృష్టిమాంద్యము, ఆకలి మందగించుట, మలబద్ధకములంగల్గించు నపథ్యకరమైనది. దీనికి విరుగుడు చంద్రచెక్కచూర్ణము, నువ్వులచెట్టు కాల్చిన క్షారము నని చెప్పుదురు.

**చరకుల గోత్రము** — శమనకుల చూడుఁడు.

**చరపంచకము** — చరించునవి. ఖేచరులు = పక్షులు, భూచరులు = మనుష్య, పశు, వనచరులు = మృగాదులు, జలచరులు = మత్స్య, తిమింగలాదులు, ధీచరులు = దేవతలు.

**చరణాద్రి** — సంయుక్తరాష్ట్రములలోని ఇప్పటి చునార్ అనఁబడుపురముకడనున్న పర్వతము. దీనిపై నొక కోట కట్టంబడినది. దానిని తొల్లింట కాలమున పాలవంశపురాజులు కట్టిరట. వారు బంగాళ, బీహారముల క్రీ. శ. ౮ వ శతాబ్ద మధ్యకాలమునుండి పండ్రెండవ శతాబ్దము వఱకుం బాలించిరట. అంత కొంత కాలము భర్తృహరి యోగియై వసించినతావుం జూపుదురు. అతఁడు క్రీ శ. ౬౫౧-౬౫౨ సంవత్సరములలో మరణించెనందురు. కొంతకాలమునకు ఇప్పటి బుందేల్ఖండనంబడు మహోబా నుండి ఏతెంచిన ఛండేల్వంశపు క్షత్రియులాక్రమించి ఏలిరట. పిదప మహమ్మదీయులకును, తర్వాతి నాంగ్లేయులకును వశమాయెనట.

**చరికొండ ధర్మనకవి** — ఆంధ్రకవి. మధ్యకవులందు పరిగణింపఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రము, కౌండిన్యసగోత్రము తండ్రిపేరు తిమ్మరాజు, తల్లిపేరు మాదమ్మ. ఇతనికి శతలేఖినీసురత్రాణుఁడని బిరుదముండెను. శతఘంటావధాన మొనర్చినవాఁడు. విష్ణుభక్తుఁడు. రచించినది చిత్రభారతము. దీనిని విన్నమలపల్లి పెద్దనామాత్యునకు కృతినిచ్చినవాఁడు. కృతిపతి కాశ్యపసగోత్రుఁడు, తండ్రిపేరు మాదన. అతఁడు మానభూనాథునకు మంత్రిగ నుండెను.

**చరిత్ర** (History) — సాధారణముగ చరిత్రమన దేశములయొక్క రాజకీయ సంబంధమగునట్టియు దానితో సంబంధించి మత, సాంఘిక, ఆర్థిక పరివర్తనములు, యుద్ధములు, దండయాత్రలు, జయాపజయములు, రాజకీయమునందలి మార్పులు మొదలగువాటిచరిత్రలను History లని వాడెదరు. History యనిన నన్నిటిం దెల్పు చరిత్రయని యర్థము.

**చరిత్ర (లేక చారిత్రక పురము) జగన్నాథము పూరీ** — ఉత్కళదేశము



లోని శ్రీ జగన్నాథము లేక ఇప్పుడాంగ్లులచే పూరీ యనఁబడుచున్న పట్టణము. ఇది దీనికి తొల్లింటిపేర నియు, శ్రీకృష్ణనిర్యాణానంతరము జగన్నాథుని దేవాలయము నిర్మింపఁబడి ప్రసిద్ధికి వచ్చినపిదప జగన్నాథుని పేరు వాడుకలోనికి వచ్చెననియు, ఇది పురుషోత్తమ క్షేత్రమగుట ఆంగ్లుల ప్రారంభకాలమున పూరీ యని పేరుకల్గెననియు కన్నింగ్హామ్ పండితుఁడు వ్రాసెను. దీనికప్పటికి చారిత్రకపురమనియో, చరిత్రపురమనియో పేరుండెనట. (జగన్నాథము దేవస్థానము చూడుఁడు).

**చర్పరి తాళము** — తాళములు చూడుఁడు

**చర్ది** — వమనములు గల్గుచు తినిన పదార్థములు లోన నిముడక నుండురోగమునకు చర్దియని పేరు. ఇది అతిగ్రిసాబాధము నించుకఁ గల్గియుండునని తలంపఁబడుచున్నది. తినుటకు వాంఛ మెండుగ నుండెడిని.

**చర్మములు పదును చేయుట** (Tanning) — తోళ్లు లేక పశువుల చర్మములను పదునుచేయుటకు తొల్లింట భరతదేశమున వస, పసపు, నూనె మొదలగునవి వాడుచుండిరి. వీటితో పదునుచేసిన చర్మములు చిరకాలము నిలచునవికాని వెంట్రుక లూడిపోవుమాట లోపముగా నుండెను. ఇటీవల ఆంగ్లవిధానము భరతదేశమున వాడుకలోనికిరా, చర్మములు చిరకాలము నిలువకున్నను రోమములూడక నిలచియుంటయు, చర్మములకు చక్కనివన్నెయు రంగులు విచిత్రాకార విశేషములుగల్గుచుండుట. ఇంక కొక్క విశేషమింపు గమనింపఁదగినది కలదు. పచ్చిచర్మము క్రుళ్లువరకు రాకపూర్వమే పదునుచేయు పనులనాదిననే రోమములునిలచుట గల్గుచుండును లేకున్న చర్మమునందలి వెంట్రుకలు నిలువక రాలిపోవుట సంభవించును. వగరు, ఘాటు గల కొన్ని చెట్ల పట్టలు చెక్క కషాయములు, కరక్కాయలు పదునుచేయుట యందుపయోగించుచుండెడివారట. ఇప్పుడాంగ్ల విధానమున Tannic acid నుపయోగించుచున్నారుగాన్నరనే తోళ్లు పదునుచేయుట కాంగ్లమున Tanning అనెదరు. ఇంక పిదప నచ్చులలో పెట్టి నొక్కి విచిత్రరూపముల వాటిపైఁ గన్పించునట్లుల చేయుదురు వీటికి యంత్రములు కలవు. చర్మములను Skins అనియు వాటికి పదునిడినపిదప Leather అనియు ఆంగ్ల నామములు

**చర్మపు ముడతలు** (Wrinkles) — మన శరీర చర్మములందు సాగునట్టి గుణము గలదు. ఈ సాగునట్టిగుణము అవసరమువెంబడి ముడుచుకొనుటకన్న నెక్కువయని కనిపెట్టఁబడినది. ఇంకను మనము బాల్యమున ఎదుగుతరి నీ సాగునట్టి గుణమేగాక చర్మము నెదుగునని (Grow) కనిపెట్టఁబడినది.

నిండు జవ్వనమున చర్మము చక్కగ సాగి యుండును. మనఃక్లేశ మధికమైనను లేక వార్ధక్యపు నిరసము తలచూపినను మన శరీరము లోపలిభాగము Tissues వృధాయగుచు అర్హరీతిని నిలువజాలక క్షీణించి తగ్గిపోనారంభించును. దానితో పై చర్మము (Skin) చేయునది లేక వీలగు తావులందెల్ల వ్రేలాడుచు ముడుతలు (Wrinkles) పడును.

ఇంకను వేడినీళ్లయందు మనచేయిని ముంచి వేడిగల్గించితిమేని గూళ్ళు సాగి (Expand)

లోని రక్తము వాటిలోనికిం జేరుకతన కొంత లావుయగును. పై చర్మము తగురీతిని సాగును. పరిస్థితులు చల్లారి రక్తము లోనికి తిరుగబోవుటయు, కాళ్లు తిరిగి ముడుచుకొనుటయుఁ గల్గిన తిరి సాగిన చర్మమున సన్నని ముడతలు గానగును. కాని యవి త్వరితముగనే సర్దుకొని అదృశ్యమగును.

**చర్మస్వతి** (రామేశ్వర సంగమము) — చర్మస్వతి పర్ణాశనదిలో సంగమమునకు రామేశ్వర సంగమమని పేరు.

**చర్మరోగములు** — ఆంగ్ల. Skin disease. గజ్జి, చిడుము, పొక్కులు, సర్పి, తామర, తీట, మొలగజ్జి, కల్లికలు, దద్రు, పురదలు, కుష్ఠు, సవాయి మొదలగు వ్యాధులు మొదలగునవన్నియు చర్మసంబంధ రోగములనఁబడును. చిట్లపిరంగియు చర్మరోగమే.

**చర్వితచర్వణన్యాయము** — చేసిన పనినేతిరిగి చేయుట కీన్యాయము వాడుచుందురు.

**చలన** — (అదురుట లేక అదరుపాటు శాస్త్రము). అదరుటవలన గలుగు ఫలములు గొప్ప అనుభవము వలన గల్గినవిగఁ జెప్పఁబడినవి. ఇవి వేర్వేఱవయవము లదరుటంబట్టి యుండును.

౧. కుడిపార్శ్వము-శాంతి, ౨ ఎడమకణత-మృష్టాన్నభోజనము, ౩ నడినెత్తి-మృష్టాన్నభోజనము, ౪. కుడిచెంప-చేటు, ౫. ఎడమచెంప-వ్యవహారికము లేటస్థించును ౬. నొసలు-వ్యవహారము కల్గి సఖ్యతయగును, ౭. కుడిచెవి-ఆభరణప్రాప్తి, ౮. ఎడమచెవి - కార్యజయము, ౯.కుడికంటికొన క్రిందిభాగము-మేలు, ౧౦.కుడికంటికొన పైభాగమున-కీడు, ౧౧.ముక్కు-రక్తము గండ్లఁజూచు చిరాకు, ౧౨. రెండుకండ్లు-మంచిది, ౧౩. పై పెదవి-కలహము, ౧౪. క్రింది పెదవి- భోజనసౌఖ్యము, ౧౫. గడ్డము- లాభప్రాప్తి ౧౬. కుడిచెక్కిలి-ధనలాభము, ౧౭.ఎడమచెక్కిలి- చోరభయము, ౧౮. కుడిభుజము-(స్త్రీలకు) శుభము, ౧౯. ఎడమభుజము-(స్త్రీలకు) పుత్రులకుచేటు ౨౦. కుడిప్రక్క, ఎడమప్రక్క-(స్త్రీలకు) అగ్నిభయము ౨౧. అరచేయి పుత్రలాభము, ౨౨. ఉదరము, చేతులు, మోఁజేయి, అరచేయి యదరిన-వాహనప్రాప్తి, ధనప్రాప్తి, ౨౩. కుడిగోడ-సంపద, ౨౪. ఎడమగోడ_రాజభయము, ౨౫. మోకాళ్లు అదరిన-రోగభయము, ౨౬. కాళ్లు అదరిన ఆభరణప్రాప్తి, ౨౭. పై కాళ్లు లేక మీఁగాళ్లు (పాదముల పై భాగము) అదరిన-ధాన్యలాభము, ౨౮. అరికాళ్లు అదరిన మొదల శుభము లింట సంభవించును

**చలిమిడి చెట్టు** —దీని గూర్చి యంతగా తెలియరాదు.

దీనివేరు ఆకురసము చలవచేసి రక్తముపడు, మూలశంక రోగమును అడఁచి కాసనునివారించి, లోని విషమును, విషదోషములను హరించు నందురు.

**చలియందు ఊపిరి బయటకు విడచుతరి నీటియావిరి గానగుట**- మనము లోనికిం బీల్చు గాలి చల్లగా నుండును. అది లోనికేగి మన శరీరమందలి వేడితో సంబంధమువలన తానును వేడెక్కును. ఊపిరి బయటకు వదలునపుడు వేడిగాలియై వచ్చుచు బయటపడి మహావాయు మండలిలోఁ జేరుకొనును.

మనశరీరము నందునను, చలికాలమున బయటి మహావాయు మండలి యందునను, నీటి కణము లుండును. అవి మన లోని వేడికిని, బయటకు వచ్చు మన ఊపిరి వేడికిని ఆవిరియై అవియె మన నోటినుండి వచ్చుతరిని మన నోటికడ గానవచ్చుచుండును. కాని నిజముగు మన యూపిరి వాయువే గాన గానరాదు. మనకు గనబడునది నీటియావిరియే.

**చలుఖి గోత్రము** — శండిల గణము చూడుడు.

**చలువపందిరిలోని కుండలకు కన్నములు పొడిచేవాఁడు**— (చలువ పందిరి=దాహముఁదీర్చు పాక) అనగా ధర్మ కార్యములకు హానిచేయువాఁడని భావము. ఆంధ్రలోకోక్తి

**చలువ (తోక) మిరియములతీగె లేక చెట్టు** — దీని పూర్వోత్తరములు సరిగా తెలియవు. కాని ఇవి అన్నిచోటుల దొర కెడిని. లా. Cubeba officinalis. శరీరమునకు మ శ్యామగ నరములకు బలమిచ్చి అగ్నిమాంద్య రోగము నడఁచి, గ్రహణి, శోగరోగము, మూత్ర నిరోధము, సిరుచురుకు, మేహముల నడంచునని చెప్పఁబడినది దీనిం దాంబూలముతో నములుటయు గలదు.

**చల్లకువచ్చి ముంత దాచనేల** — (అనగా మజ్జిగ అడుగుకొనుటకువచ్చి గొంపోవుటకు తెచ్చిన పాత్రను దాచుకొని చూపకుండి నట్లు) ఆంధ్రలోకోక్తి.

**చల్లగడ్డలు లేక సఫేదు మిస్రీ**- లా. Asparagus larmentosus. హిందీ. సఫేదుముశిరీ. ఇవి దుంపలు. వీనిచూర్ణము మేహ శాంతిజేసి దేహపుష్టి, బలము, వీర్యపుష్టింగల్గించు నందురు. కొన్ని దేశములలో బంగాళాదుంపలవలె ఆహార పదార్థముగ నుపయోగింతురని తెలియు చున్నది.

**చళ్లపిళ్ల నరసకవి** – ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. వెలనాటి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రము. భారద్వాజస గోత్రము. తండ్రిపేరు కామయ్య. పిఠాపురపు ప్రభువగు రావునీలాద్రి నృపుని యాస్థానకవిగ నున్నవాఁడు.

రచించినది యామినీపూర్ణతిలకా విలాసమను ప్రౌఢ ప్రబంధము. ఇందు శబ్దాలంకారములు అధికము. రసవంతము.

**చస్తున్నతరి సంధ్యమంత్రము** — ఆంధ్రలోకోక్తి.

**చక్షు నది** — దీనికి బక్షు అని నామాంతరము గలదు. ఆంగ్లులు ఆక్సస్‌నది యనిచెదరు. చక్షు నదింగూర్చిన ప్రశంస మత్స్యపురాణము ౧౦౧ అధ్యాయమునను, బ్రహ్మాండపురాణము ౫౧ వ అధ్యాయమునను కలదు. ఇది శాకద్వీపము గుండా ప్రవహించు నదిగా జెప్పఁబడినది

**చక్షుర్దీపన్యాయము** — దీపము నేత్రములుకూడ యుండినగాని రాత్రులందు వెలుతురుండియు ప్రయోజనము లేదు. చీకటియందు దీపములేకుండిన వెలుతురే యుండదు. ఉండినను నేత్రదృష్టి లేకున్న ప్రయోజనముండదు. కాన రెంటింగల్గియుండుట ముఖ్యమని భావము.

**చక్షువు** — తండ్రి అనువు పితామహుఁడు యయాతి మహారాజు

**చక్షుష్మతీనది** — ఇక్షుమతీ నదికీపేరుండెను. దీనిప్రశంస వరాహపురాణము ౮౫ యందునను, మత్స్యపురాణము ౧౧౩ యందునను కలదు.

**చ్యవనప్రాశము** — ఇది యొక దివ్యౌషధము. అశ్వినీదేవతలు చ్యవనమహాముని వార్ధక్యముపోయి యౌవనము సిద్ధించుటకై కల్పించిన సిద్ధౌషధ యోగము. శర్యాతిపుత్రిక యగు సుకన్య యను సాధ్వి భర్తయగు చ్యవనునితో నాశ్రమములోనుండగా నొకనాఁడశ్వినీదేవతలు సుకన్య యొంటరిగా నుండుటంజూచి యామె సతీత్వమును శోధింపసాగిరి. ఈసంగతి సుకన్య తనభర్తతో చెప్పెను. సుకన్య తన భర్తతోఁగలసి యశ్వినీకుమారులయొద్దకుపోగా వారొక నదిలో

స్నానము చేయుచుండిరి. చ్యవనుడును కూడ వచ్చి ఆనదిలోనే స్నానము చేయుటకై దిగెను. స్నానము చేసి లేచిన వెంటనే ముగ్గురును సమానరూపములతో నుండిరి. ఆముగ్గురిలో తనభర్త యెవరో సుకన్యను తెల్పుమనిరి. సుకన్య తన పాతివ్రత్య మహిమచే నిజభర్తను గుర్తింపగల్గెను. అశ్వినీకుమారులు ఆదంపతుల ననుగ్రహించి చ్యవనుని వార్ధక్యముపోయి చిరముగా యౌవనము నిల్చుటకై యీ చ్యవనప్రాశమను ఔషధము రచించియిచ్చిరి. కాబట్టి దానికి చ్యవనప్రాశ మని పేరువచ్చెను.

**చ్యవనమహాముని** — ఇతడు ఒక ఋషి. భార్యపేరు సుకన్య. ఆమె శర్యాతిపుత్రిక యని చెప్పబడినది. కుమారుడు ప్రమతి. (చ్యవనప్రాశము చూడుడు, సుకన్య చూడుడు). చ్యవనమహర్షి గొప్ప తపస్వియనియు, యాగములు చేసినవాడనియు, సోమపానము కల్పించిన దీతడే యనియు చెప్పబడినది.

**చ్యవనర్షి ఆశ్రమములు** — ౧. బీహారులోని షహాబాద్ మండలమున దౌసా యను తావున నొకటి. దీనిగూర్చి స్కాందపురాణ అవంతీఖండ ౫౭ అధ్యాయమున ప్రశంసింపబడినది. ౨. సాత్పుర కొండలపైనున్న యరణ్యమున పూర్ణానదీతీరమున నొక యాశ్రమముండెనట. దీనిం గూర్చిన ప్రశంస పద్మపురాణము పాతాళఖండము ౮ అధ్యాయమునం గలదు. ౩. జయపూర్ రాజ్యమున రాజపుత్రస్థానము నందలి నగరమునకుం దక్షిణముగా నాలుమైళ్ల దూరమున ధోశి యనంబడుచోట నొక యాశ్రమముండెను. ఇట నొక యనూపదేశ రాజపుత్రికవలన ఋషినేత్రములు పొడిచివేయబడెననియు, పిదప నాతడామెను బెండ్లియాడెననియు చెప్పబడినది. ౪. గంగానదీతీరమున రాయబరేలీ జిల్లా యందలి చిలన్లా యను తావునందు నొక యాశ్రమముండెనియు అట నిశ్వినీదేవతా కుమారుల (అశ్వినీదేవతల) వలన నీఋషి తిరిగి యౌవనవంతునిగ నొనర్పబడెననియు చెప్పబడినది.

**చాందాపురము** — చంద్రపురము చూడుడు.

**చాందేరీ** (చంద్రావతీపురము) — అనూప దేశము చూడుడు.

**చాంద్రమానము** — చంద్రుడు భూమిం జుట్టితిరుగుచుండుటంబట్టి కాలమును లెక్కించుటను చాంద్రమానమనెదరు. ఇది వింధ్యపర్వతమునకు దక్షిణమునను, ఉత్కలదేశమునకు పశ్చిమమునను గల దేశములందు వాడుకయందున్నది. ఆంధ్రదేశ మీమానమునే లెక్కించుచున్నది. అరవదేశమున సౌర (సూర్య) మానమును, ఉత్తరహిందూస్థానమున బార్హస్పత్య (బృహస్పతి) మానమును పరిగణింపబడుచున్నది (చూడుడు).

సంధ్యావందనాదుల సంకల్పములందు "అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన...సంవత్సరే...అయనే...ఋతౌ...మాసే...పక్షే...తిథౌ" అనునవి యాంధ్రదేశమున వచింపబడుచుండెను. ఇట్లే అన్యదేశములవారును తమతమ దేశోచిత మానములను వచించి, సంవత్సరాదులను

నుడువుచుందురు. చాంద్రమానసంవత్సరమునందలి సంవత్సరములు ప్రభవాది షష్టిసంవత్సరములై యున్నవి. వీటియందుగల పండ్రెండుమాసములు చైత్రాది ద్వాదశమాసములే. చంద్రుడు షోడశ కళాప్రపూర్ణుడై సంపూర్ణ తేజంబునొందునట్టి దిన మగు పౌర్ణమినాటి నక్షత్రనామ మాసలకిడి యున్నారు (మాసములు చూడుడు). మాసమున తొలుత శుక్లపక్షమును, పిదప కృష్ణపక్షమును నడచి చంద్రకళలు లేశమును కాన్పింపని అమావాస్యను నెలయందు కడదినముగ బరిగణించెదరు.

**చాంద్రమానమానము** — చంద్రుని గమనమును బట్టి లెక్కించుకొనునది చాంద్ర మానము. చాంద్రమాన మాసములు రెండు విధములుగ పరిగణింపబడు చున్నవి (మాసములు చూడుడు). ౧ ముఖ్య లేక అమాంతపరిగణనము, ౨ గౌణ లేక పౌర్ణమ్యాంతపరిగణనము.

ఆర్యభట్ట సిద్ధాంతము మేరకు చాంద్రమాన సంవత్సరపుపరిమితి ౩౫౪ దినముల ౮ గంటల ౪౮ నిమిషముల (Minutes) ౩౪ సెకండ్లని చెప్పంబడినది. ఈసంఖ్యలు భరతదేశపు ఘటికావిఘటికల ను ఆంగ్లవిధానపు గంటలు, మినిట్లు, సెకండ్లుగ మార్పంబడిన లెక్కగనెఱుంగవలయును. సంవత్సరమునకు పండ్రెండు మాసములని యెల్లరు తలంచుచుందురు. కాని యివి సమమాససంవత్సరమనియు అధికమాస సంవత్సరమనియు నష్ట లేక లుప్త మాసమనియు త్రివిధములు.

సమమాసవత్సరమున పండ్రెండు పౌర్ణములు పండ్రెండమావాస్యలును, అధికమాసవత్సరమున పదమూడు పౌర్ణములు పదమూడమావాస్యలును లుప్తమాస వత్సరమున పదునొకండు పౌర్ణములు పదునొకండమావాస్యలును కల్గుచుండెడిని.

ఇట్టి చాంద్రమానవత్సరమందలి మాసములన్నియు నొకేపరిమాణముగలవిగానుండవు. చంద్రసూర్యులగమనవేగములంబట్టి త్రివిధములుగ నుండెడిని, ఎక్కువగనగుతరి దిన ౨౯ గంట ౧౯ మిని ౩౦ లును, మధ్యరకముగనుండుతరి దిన ౨౯ గం ౧౨ మిని ౪౪ గను తక్కువనుండుతరి దిన ౨౯ గంట ౭ మిని ౨౦ గను ఉండును. (సౌరమాసమాసముచూడుడు, అధికమాసముచూడుడు, నష్ట మాసముచూడుడు)

**చాంద్రాయణ గోత్రము** — సాంకృతి ఉపగణము చూడుడు

**చాంద్రాయణ వ్రతము** — ఇది చంద్రుని వృద్ధిక్షయముల ననుసరించి తాను తిను నాహారము హెచ్చించుకొనుటగాని, తగ్గించుకొనుటగాని చేయునట్టి వ్రతము. పూర్ణిమ నాడు పూర్తిగా భుజించి కృష్ణప్రతిపత్తిథి మొదలు దిన దినము నొక్కొక్క కబలము వంతున భోజనము తగ్గించుచు తుదకు అమావాస్య నాడు శుష్కోపవాసము చేయు వ్రతవిధాన మొకటి. రెండవ విధమగు చాంద్రాయణ వ్రతము కృష్ణపక్షములో నుపవసించుటయు, శుక్ల పక్షములో భుజించుటయు నాచారముగాఁగలది యని చెప్పఁబడినది.

**చాత్రాయణగోత్రము** — నిధ్రువ గణము చూడుడు.

**చాగ(చెట్టు) తీగ** — లా. Sanseviera zeylanica, సం. దహానీ, మధుశ్రేణీ, మూర్వా.

దీని నుంప రసము వేడిచేసి, కఫవాతము, కుష్ఠు, దగ్గు, దద్రు, వ్రణములు, హృద్రోగము, క్షయలను నివారించు ననియు, దీని లేతయాకుల రసము పసిబాలురకిచ్చిన లోని శ్లేష్మము పడిపోవుననియు చెప్పఁబడినది. చాగదుంపల తైలము పై రాసిన వ్రణములు మాన్పట్టునందురు.

**చాచపుటతాళము** — తాళములు చూడుఁడు.

**చాటుధార పద్యములు** — చాటువులు చూడుఁడు

**చాటువులు, చాటుధారలు** (చతుర్దశచాటువులు) — ౧ ముక్తము- ఒక పద్యము, ౨. శోక్యము- మూడు పద్యములు, 3. వారధిమాల- నాల్గుపద్యములు, ౪. పంచ రత్నములు- ఐదుపద్యములు, ౫ వారణమాల- ఎన్మిదిపద్యములు, ౬. నవరత్నములు- తొమ్మిది పద్యములు, ౭ అవతారమాల- పదిపద్యములు, ౮ భాస్కరమాల- పన్నెండు పద్యములు, ౯. శశికళ- పదునాలుగు పద్యములు, ౧౦. నక్షత్ర మాల- కీర్తిని తారావళి యనియు నందురు ఇది ౨౭ పద్యముల సముదాయము, ౧౧. రాగ మాల- ముప్పదిరెండు పద్యములని కొందఱును, డెబ్బదియారు పద్యములని కొందఱును అను చున్నారు (౭౬ కర్తారాగములు)(3౨ తెలియును). ౧౨. విద్యామాల- ౫౪ పద్యములు, ౧3 తత్వ మాల- తొంబదియారు పద్యములు, ౧౪. శత కము- నూరు పద్యములు.

**చాద్లియాశాఖ క్షత్రియులు** — క్షత్రియకులము చూడుఁడు.

**చాణక్యుఁడు** — ఈతనికి యోగానందు డనియు మహానాగుఁడనియు పేరులుండెనట. (మగధరాజ్యము చూడుఁడు, "చాణక్య" మహా మంత్రి చూడుఁడు).

**చాతకజీమూతన్యాయము**—చాతక పక్షికి నితరస్థలములందు నీరు దొరకినను మేఘ ములందలి నీటినేకోరును. అనగా తన అపేక్షితము ముందర తక్కినవి కొరగావని భావము.

**చాతుర్భద్రకములు** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున శొంఠి, అతివస, తుంగముస్తలు, తిప్పతీగ వీటికి చాతర్భద్రకములనియు, కిరాతాది గణము అనగా నేలవేము, తిప్పతీగవేళ్లు, తుంగ ముస్తలు, శొంఠి వీటికి చాతుర్భద్రకములనిపేరు.

**చాతుర్జాతము** — ఏలకులు, లవంగాలు, దాల్చినిచెక్క, నాగకేసరాలు గాని, ఏలకులు, లవంగాలు, ఆకుపత్రికము, నాగకేసరాలు గాని, ఏలకులు, దాల్చినచెక్క, ఆకుపత్రికము, నాగ కేసరాలు గాని, వీటిని చాతుర్జాతకములు లేక చాతుర్జాతములందురు. వీటిచూర్ణము శ్లేష్మరోగ ములు, వాతరోగములు, అగ్నిమాంద్యరోగము, నివారించి మేహశాంతి, పైత్యశాంతి గల్గించి విస్యమునకు వేడిగల్గించునని చెప్పఁబడినది.

**చాతుర్మాస్య ఏకాదశులు** — ఏకాదశి తిథులు చూడుఁడు.

**చాతుర్థికములేకచాతుర్థికగణము** ఆయుర్వేదవైద్యశాస్త్రమున ఉశీరిక, కరక, చిత్ర మూలము, పిప్పళ్లకు (నాల్గింటికి) పేరు.

**చాతుర్మాస్య ద్వితీయ** — ఆషాఢ బహుళ ద్వితీయ. నేఁడు మొదలు కార్తీకబహుళ ద్వితీయవరకు యతులకు (నాల్గునెలలు) పర్వదిన ములు గాన చాతుర్మాస్యలనంబరగుచు వ్రతదిన ములుగ సంచారమొనర్పక నొకేతావుననిలచి ఆదినములు (వ్రతదినములుగ) గడపెదరు. కార్తీక బహుళ ద్వితీయ చాతుర్మాస్యలంను కడదినము గాన నాఁడు యతులకావ్రతము ముగియును. (పండుగలు, పర్వములు, వ్రతదినములు చూడుడు).

**చాదరాసికూర** - లా. Pharnaceum mollugo. సం. నిర్ఝరా యని కొందఱనెదరు. వేడిచేసి మూత్రకృచ్ఛ్రము, మూలవ్యాధి, శ్లేష్మ పైత్యము నడంచి నిద్రపట్టించును. ప్రసవస్త్రీల మైలరక్తము వెడలించును. నులిపురుగులం జంపును. నేత్రదృష్టిం దగ్గించి మందగించును.

దీనికివిరుగుడు వెలగచెక్క, విరిగిచెక్క నని యందురు.

చాదరాసిజాతికిం జెందిన పెట్టిచాదరాసి కూడ గలదు. దీనియాకురసము విరేచనము జేయును. స్త్రీల ఋతురక్తమును వెడలించును. దీనియాకునూరి పైనివేసికట్టిన పుండ్లకుళ్లు నివారణమై మాన్పట్టును.

**చానల్ ద్వీపములు** — బ్రిటను దేశమునకును, ఫ్రాన్సు దేశమునకును నడుమ నుండు ఇంగ్లీషుఛానల్ నందున్న ద్వీపముల సమూహము. ఇందు జర్సెగు, ఎర్న్స, ఎల్డర్నె, సార్కనంబడు నాల్గును ముఖ్యమైనవి. తక్కినవి చిన్నవి పెక్కులుకలవు. ఇందుకొన్ని బ్రిటీషు ప్రభుత్వమునకును, తక్కినవి కొన్ని ఫ్రెంచి ప్రభుత్వమునకును చెందియున్నవి.

**చాంగరి గోత్రము** — నిధృవగణము చూడుడు.

**చాపములు**- కార్ముకములు చూడుడు.

**చాపరేఖ** — పురుష సాముద్రికము చూడుడు. స్త్రీసాముద్రికము చూడుడు.

**చాపచిరిగిశే చదరంత** — ఆంధ్ర లోకోక్తి.

**చామ (దుంపల) చెట్టు** — లా. Colocasia antiquorum. ఇంగ్ల. Coces సం. వింతుండా (శాకః). చామదుంపలు, ఆకులు, కాడలు భోజన పదార్థము. చామ నలుపు, తెలుపురంగుల భేదముచే ద్వివిధము. ఇంకను అడవిచామయని పేరుగల అధమపుజాతి ఇందొకటి కల దది దురదంగల్గి యుండునది. కాన దానిని తేలచువాదరు.

దుంపలయందు ఇంచుక వేడిచేసి వీర్యముకు బలముసంగి రక్తవృద్ధిం గల్గించును. విరేచన బద్ధము, శ్లేష్మప్రకోపము గల్గించును. అధికముగ బుచ్చుకొనిన వాతప్రకోపము, అజీర్తి గల్గించి వాతమును రేపును

ఆకులు, కాడలు- మూలవ్యాధి, అగ్నిమాంద్యము, మూత్రకృచ్ఛ్రము, మూత్ర మలబద్ధముల నడంచి విరేచనము గల్గించును. కాడలనూరి కట్టిన గాయములు మానును. పుండ్లు, గడ్డలు, చెవిలోపుండ్లు కాడలరసముచే నివారించనగును. చామగల్గించు దోషములకు పులుసు, చంద్ర చెక్క చూర్ణము విరుగుడులని చెప్పఁబడినది. చారకందయని వేఱొక దుంపజాతియు దీనింబోలి యుండుంగాని అది వేఱుజాతి.

**చామరద్వయము** — పురుష సాముద్రికము చూడుడు. స్త్రీసాముద్రికము చూడుడు.

**చామరరేఖ** — పురుషసాముద్రికము చూడుడు, స్త్రీసాముద్రికము చూడుడు.

**చామలచెట్టు** — చామలు గడ్డి పంట యనంబడును ఇది నల్లని చామలు, తెల్లని చామలు అని రెండుభేదములుగలది. తెల్లచామలు ఇందు శ్రేష్ఠమందురు. అన్నిటికి గుణ మొక్కటియే. Millet Panicum అనియు, ఆంగ్ల. Millit అనియు నందురు

దీనిని బియ్యముచేసి అన్నముపండియు, రొట్టె జేసియు వాడుటకలదు. అన్న మిందుక గురుత్వముగ నుండి బలముగల్గించి శ్లేష్మము, రక్తపైత్యము, సంగ్రహణి, అజీర్తి, మలబద్ధముల నడంచి కడుపులో నొప్పి, మూత్రములో సుద్ద యుం గల్గించును. దీనికివిరుగుడు పాలు, నెయ్యి, పేలపిండి, దానిమ్మపండ్ల రసము, బెల్లము, పంచదార యని చెప్పఁబడినది.

**చామోయిస్‌చర్మము** చామోయిస్ మృగము ఐరోపా దక్షిణసీమలను అందు

ముఖ్యముగ స్విజర్లాండు ఆల్ప్సు పర్వతప్రదేశమునను, ఆశియాఖండపు పశ్చిమసీమలందునను వసించు మృగము. అది మాచమను లక్ష్యము చేయక పర్వతచరియయందు రెండడుగుల ఎత్తు వఱకు నెగిరి దాటుచు పరుగిడుచుండు మృగము. దీనిని వేటాడి చర్మమును పదనుచేసిన నది మెత్తని పట్టువలె నగును. అద్దములు మొదలగునవి తుడుచుటకు పనికివచ్చును. జేబుగడియారములకు దీనితో సంచులం జేయుదురు. విలువగ నమ్ముడుపోవు చర్మము.

**చామోరు పురము**— చంద్రాదిత్య పురము చూడుఁడు.

**చారకి గోత్రము** — కుశిక గణము చూడుఁడు.

**చారణులు**- దేవతులలో నొక తెగవారు.

**చారపప్పు చెట్టు** (మొరలిచెట్టు) — చారపప్పు ప్రసిద్ధ ఫలహార పదార్థము. పండును మొరలి పండనియెదరు. ఇది అడవులందుండు చెట్టు. పండు మిక్కిలి వేడిచేసి వాతము పడఁజేయును లా Celtis orientalis. సం. ఖరస్కంధవృక్షః, తాపసేష్టః, ప్రియాలః, ప్రియాలకః

చారపప్పు వీర్యవృద్ధినిచ్చి పైత్యము జేయునని చెప్పఁబడినది. దీనికి కరకపిండెల రసము లేక గపాయము, లేక కరక్కాయల బెరడు, నువ్వుల నూనెయు దీనికి విరుగుడని కొందఱు తలంచు చున్నారు.

**చారిత్రకులు లేక కథకులు** —

౧. నందికేశ్వరుడు- పరశివ తత్త్వమును, శివ ధర్మమును కృతయుగమున లోకమునకు వెల్లడించెను.

౨. సనకుఁడు- బ్రహ్మలోకమునందు పరబ్రహ్మ తత్త్వమును దెల్పిన వాఁడు.

3. వేదవ్యాస మహర్షి- ద్వాపరాంతమున సమస్త పురాణ గాథలు రచించిన వాఁడు. మఱియు వేదములను విభజించి వెల్లడించెను.

౪. సూతుఁడు - వ్యాసశిష్యుఁడు. శౌనకాది మహర్షి బృందమునకు సమస్త పురాణ గాథలం దెల్పుచు ప్రసంగించు చుండిన వాఁడు.

**చారువు లేక చారువదుఁడు** — పూరుసంతతి క్షత్రియుఁడు. మనస్యుని సుతుఁడు.

**చారుధేష్ణుడు** — అత్రి,చంద్ర,యాదవ క్షత్రియుఁడు. తండ్రి శ్రీకృష్ణుఁడు. తల్లి రుక్మిణీ దేవి. సోదరులు ప్రద్యుమ్నాదులు (శ్రీకృష్ణుని చూడుఁడు).

**చారువదుడు** — చారువు చూడుఁడు.

**చార్లేమాన్ చక్రవర్తి** - (Charlemagne) — ఈపదమునకు Charles the Great అని యర్థము. క్రైస్తవులకు ఈయన చాల హితకరుఁడు గాన వారీతని నతిగౌరవ ప్రపత్తితో గౌరవించుచుందురు. కాన నీ మహానాదయుని చరిత్ర చరిత్రాత్మకముగ వివరింపబడుట సమంజసము. ఫ్రాంకులనంబడు జాతివారిం గూర్చి ఐరోపాచరిత్రల నెఱింగిన వారెఱింగియేయుందురు. వారు తొలుత జర్మనీ, ఫ్రాన్సు దేశభాగములందును, ఆప్రాంతసీమలందు వసించుచుండిరి. Pepin అను పేరుగల నాయకునిక్రింద వారు ఐకమత్యముంగల్గి క్రీ. శ. ఏడవ శతాబ్దాంత కాలమున నొక రాజ్యముగ నేర్పడి యుండిరి. ఆయనకుంబిదప నాయనసుతుండగు Charles Martel వారి ప్రభువయ్యెను.

మూరులు ఐరోపాదేశము నాక్రమింప బయలుదేరిన యుద్ధులను నెదుర్కొనినది చార్లెస్ మార్టెల్ భూపతియే. ఇటనె వారికి పరాభవము ప్రారంభమయ్యెను. ఫ్రాంకులు మూరుల నోడించి యరికట్టిరి. క్రైస్తవులు దేవునిసమ్మతిట.

యని చార్లిస్మార్టెలు ప్రభునకు బిరుదమర్పించిరి. ఆయన యవసానమున తనరాజ్యమును తన సుతు లిద్దరకుం బంచియొసంగంగాని, పెద్దకుమారుఁడు తపస్వియై రాజ్యభాగమును తమ్మునకు వదలి వేసెను. కాన రెండవసుతుఁడగు పెపిన్ రాజ్య మంతకును ప్రభువయ్యెను. ఇది క్రీ. శ. ౭౫౧, ఈతని రాజధాని Soissons అనియు, ఈతని పట్టాభిషేకము తండ్రి మరణించిన పిదప పందొమ్మిదవ సంవత్సరమున ననియుఁ జెప్పఁ బడినది.

ఈ పెప్పిన్నృపతికిం బిదప నీతని సుతుఁడగు నీ వ్యాసనాయకుఁడు ఛార్లెసు రాజ్యమునకు వచ్చెను. ఈతనికి ఛార్లెమాన్ చక్రవర్తియని పేరు. రోమను దేశపు పోపు దేశికుండీతనికిం గిరీట మిడి, ఈతని రక్షణకు లోఁబడియెను. పట్టాభిషేకము క్రీ. శ. ౮౦౦ సవంబరు ౨౫ తేది క్రిస్టమసుపండుగనాఁడని చెప్పంబడినది. రోమను చక్రవర్తులకు, సామ్రాజ్యమునకు నితఁడే మూల పురుషుఁడును ప్రారంభము నని చెప్పఁబడినది. ఈతని రాజధానిపురము Aix-la-Chapelle అని తెలియుచున్నది.

ఛార్లెమాగ్నే చక్రవర్తి వ్రాయు చేతగాని వాఁడని యొక ప్రతీతికలదు. ఈయన విద్యాభి వృద్ధికి, కళలకు చాలఁ బ్రయత్నించి తన ప్రజల నభివృద్ధికిం దెచ్చినవాఁడు. జన్మతః ఫ్రాంకనియు, రోమను చక్రవర్తియనియు వాడుకకలుగు ఫ్రాంకులను, శాక్సనులను, లోంబార్డులను వశపఱచుకొనెనట. మాగ్యారులు, స్లావులు ఈయనకు లోఁబడిరట. తన వయస్సు నతిక్రమించిన దూరదృష్టితో పాలించిన రాజకీయ చతురతం గల్గినవాఁడు.

**చార్వాకమతము** (లోకాయితమతము)- చారు అనగ మనోహర మనియు, వాక్ అనగ మాటయనియు నర్థము. ఈమతము లోకాయిత మతముతోడను, దేహాత్మవాదిమతము, ఇంద్రి యాత్మవాదిమతముతోను సంబంధము కలది. దీని కీపేరును చార్వాకసూత్రములు రచించిన బృహస్పతి యొసంగెనని వాడుక గలదు. ఇది నిరీ శ్వరమతము, వేదబాహ్య (లేక అవైదిక) మతము లలో నిదియొకటి. అవైదికమతములందు వేద మును (ఋగ్యజుస్సామాథర్వణాత్మకమగు వేద ము) ప్రమాణముగాఁ గైకొనక, వేదమతముల లక్షణధర్మములనుమాత్రము గైకొనుచు వాదు చుందురు దీనిని నాస్తికమతములలో నొకటిగ జెప్పియున్నారు. చార్వాకుఁడు లేక, లోకాయి తుఁడు బృహస్పతి శిష్యుఁడని కొందఱు పరిశీలకు లనుచున్నారు.

లోకాయితమతమునకుం గర్త బృహస్పతి యని వాడుకగలదు. ఈబృహస్పతి దేవగురుం డగు బృహస్పతియేనా యని శంకపొడమెడిని. ఈమతము బృహస్పతియొక్క నిజాభిప్రాయ మనియు, చార్వాకుండను నొకఋషి దీని నుద్ధ రించి వ్యాపింపఁజేసెననియు, మాధవాచార్యుని సర్వదర్శనసంగ్రహమునం దుంట గాకున్న నీబృహస్పతి వేఱని యనువారమే. కాని ఈ చార్వాకమత మును పురాతనమతమేనని తోఁచెడిని. కొన్ని మతములను విమర్శించియు నిరసించియు, సంస్క రణరూపమున రచించినమతమై యుండనోపు. ఈమతమునకు ముఖ్యవిరోధి యద్వైతమతము కాకున్న నద్వైతమతమున కీచార్వాకసిద్ధాంత ముపైఁ బ్రబలవైరభావముండి యుండవలయును. శ్రీమద్రామాయణమున వరణ్యవాస మొనర్చు శ్రీరామునకుఁ జార్వాకుఁడు తనసిద్ధాంతముం జదివి వినిపించునటుల వాల్మీకి వ్రాసియుంట చార్వాకుఁడు శ్రీరాముని సమకాలికుఁడేమో నని సంశయము కలుగఁగలదు.

ఈమతము నందీశ్వరుం డంగీకరింపఁబడలేదు; జగత్తు సృష్టింపఁబడినది లేదు. జగత్తును దాని విధానమును నైసర్గికములని చెప్పఁబడినవి. ఒక్క ప్రత్యక్షప్రమాణము తప్ప నితర ప్రమాణముల నీమతస్థు లొప్పుకొనరుగాన, దృశ్యములగు పృథివి, జలము, అగ్ని, వాయువు అను నాల్గు భూతములే యంగీకరింపఁబడినవి. ఇవి సత్యములనియు, నశించునవి కావనియుఁ జెప్పఁబడినది. ఆత్మయనునదియు వేఱేయుండునని యంగీకరింపఁబడలేదు. చతుర్భూతములచే శరీరేంద్రియములు కల్పింపఁబడినవనియు, వానికూడికయే ఆత్మ లేక, ప్రాణ మని యితరమతస్థులు దేనిననుచున్నారో యదియగుననియు, శరీరేంద్రియనాశనవిశ్లేషములే మృతియనంబడుననియు, కాన శరీరమున ప్రాణమనంబడునది వేఱుగ నొకటి యుండదనియు చార్వాకమతసిద్ధాంతము.

ఇందువలననే "నేను" అను అహంభావము శరీరమునకే యన్వయించును గాని, వేఱొక దానికిం గాదు. ఆత్మజ్ఞానమని యితరమతస్థులను జ్ఞానము దేహేంద్రియసంబంధజ్ఞానము. ఈజ్ఞానము శరీరము వృద్ధియగుటతో వృద్ధియగును. క్షీణించు చుండును. మృతికిం బిదప ప్రాణియుండదుగాన, పునర్జన్మమనునది యీమతమున తెలుపఁబడలేదు. ప్రపంచమునకుం దప్ప స్వర్గనరకములనం బడునవియు నంగీకరింపఁబడలేదు. తానను భవించిన సుఖసంతోషములే స్వర్గానుభవమువంటివి. కష్టములు, దుఃఖములు, వేదనలు నరకానుభవము వంటివి. ఈమతమునఁ బురుషార్థములలో అర్థము, కామముమాత్ర మంగీకరింపఁబడినవి గాని, ధర్మము, మోక్షము అను రెండును అంగీకరింపఁబడలేదు. జీవించియుండువారికే పురుషశబ్దము వర్తించును.

ఈచార్వాక మతమున సదృష్టమనునది యొకటి యుండునని అంగీకరింపఁబడలేదు. ఈ సిద్ధాంతము మేరకు స్త్రీజాతి, పురుషజాతి యని రెండుజాతులే యంగీకరింపఁబడుట, బ్రాహ్మణ క్షత్రియాది వర్ణములు పాటింపఁబడలేదు. మృతికిం బిదపఁ జరుగఁగలదేదియు తెలుపఁబడలేదు.

అగ్నియం దుష్ణమును, ఉదకమునందు శీతలమును ఎటువంటి నైసర్గికలక్షణములో అటువంటి నైసర్గికలక్షణ విధానమే జగద్విధానము గాన అంగతనకు సుఖసౌఖ్యము లనుభవించుటకై ప్రయత్నించుటదక్క నే బాధ్యతలు లేవు. ఆత్మయనంబడునదే లేదుగాన బంధమోక్షములు తెలుపఁబడనేలేదు. నిరీశ్వర మతముగాన దర్పనాదిక విధానము భక్తి. దేవస్థానములు, దేశికత్వము నను నవి తెలుపఁబడనేలేదు. ఇంక సృష్టికర్తలేని కారణమున సృష్టింగూర్చి తెలుపఁబడలేదు. పదార్థముక్క నైసర్గికమగు జగత్తుకన్న వేఱుగానరాదు. ఈమతమునకు చార్వాకసూత్రములును శబరస్వామి వ్రాసిన భాష్యమును కలవు. విధి నిషేధములులేని మతమునకు మతగ్రంథములుండుటయు నిష్ప్రయోజనమే.

**చాలనీ న్యాయము** — జల్లించు నప్పుడు గట్టిగింజలు క్రిందపడి పొల్లు పైకి తేలును.

అర్హా పరీక్షయందు బయలు బడుట భావము.

**చాలుక్య క్షత్రియులు** — అర్బుద పర్వతముపై ఋషులచే నొనర్పఁబడిన తపోహోమాదులవలన బ్రహ్మాంశమున జనించినటులఁ జెప్పఁబడినవారు. వీరికి చలూక శాఖ వారనియు, సోలంకి శాఖ వారనియుం గూడ వాడుక నామములు కలవు. ఆది కాలమున ఋషులచే వీరికి అన్హిలాపుర రాజ్యమొసంగఁబడినది.

అన్హిలా పురమున చిరకాలము పాలించి వీరి సంతతి వారు వాతాపీ పురము (ఇప్పటి బాదామీ) పురమునకు వీరి రాజధానిని మార్చుకొనిరని తెలంపంబడు చున్నది.

వీరిలోని అంతశ్శాఖలం గూర్చి అంతగా తెలియరాకున్నది. బాఘేలుశాఖ చాళుక్యరాజులు ఇప్పుడు బాగల్ఖండనంబడు చున్న రాజ్యమున స్థిరపడిరి. వారి పాలనమువలననే ఆదేశమున కాపేరు గల్గెను. సిద్ధిరాజా యను పేరు గల ప్రభుని తండ్రి వాఁడట స్థిరపడిరని చెప్పఁబడినది. గుజరాతీ దేశమున బగేలారాజు వంశస్తులు పెక్కండ్రు చిన్న చిన్న సంస్థానాధిపతులై ప్రభువులుగ నున్నారు.

వీరికి మూలపురుషుఁడు జయసింగని బలమగు ప్రతీతి కలదు. అనేక పాటలందీసంగతి ఉత్తర హిందూ దేశమునఁ గాన్పించు చున్నది.

మేవాడునందొక ప్రభువు సిద్ధిరాజసంతతివాఁడు కలడు. ఆయనకడ మూలపురుషుఁడగు జయసింహుని యుద్ధశంఖము కలదని చూపుచున్నారు. ఇది రూప్నగరునందు చూడనగును. సిద్ధిరాజయసింగు శాలివాహన ౧౧౪౦-౧౨౦౧ పాలించినటుల శాసనములనుండి స్థిరపడియున్నది. ఈయనపాలనకాలమున El. Ebrisi అను పేరు గల న్యూబియన్ జాగ్రఫర్ వీరి యాస్తానమును దర్శించి సత్కరింపఁబడెనని చెప్పఁబడినది. సిద్ధిరా జయసింగు మూలపురుషుండగు జయసింహ మహారాజునకు తరువాత నేడవ భూపతియని లెక్కింపఁబడినవాఁడు, సుప్రసిద్ధుఁడు. ఈయనకు లోఁబడిన సామంతప్రభు లిరువదియిద్దరుండిరట.

జయసింహమహారాజు భోజరాజ సుతను బరిణయమైనవాఁడనియు, ఆయన పౌత్రుఁడు ఒకటవ పులికేశి అశ్వమేధయాగ మొనర్చినవాడనియు, ఆయన పౌత్రుఁడు రెండవ పులికేశియనియు, రెండవపులికేశి కనిష్ఠసోదరుఁడు కుబ్జ విష్ణువర్ధనుఁడు వేగిదేశాధిపతి యాయెననియు, చరిత్రలు తెల్పుచున్నవి. (వేగిదేశము చూడుడు). అన్హిలాపురమున ప్రభువై యుండిన మూలరాజా యనుభూపతిని పదచ్యుతుంజేసి జయసింహుఁడు రాజ్యమాక్రమించినటుల పాటలు కలవు. అది నిజమగుచో క్రీ. శ. ౯౦ సంవత్సరమగునని కొందఱు తలంచుచున్నారు. జయసింహునకు జయసింగుసోలంకియని పేరు పాటలందు వాడఁబడినది. వీరి వంశము పరిపాలనయందు కుమారపాలుండను భూపతి కడపటిదినములందు పటుత్వము గోల్పోయి తరువాతి ప్రభువగు బ్లో మూలదేవ్రనికాలమున (క్రీ. శ. ౧౩౮౭) అంతమయ్యెనని చెప్పఁబడినది.

కల్యాణపురమున రాజ్యమేలిన బిజ్జలదేవు బఘేలా వంశస్థుఁడనియు సిద్ధిరాజు వంశపువాఁడనియు వాదుక కలదు. ఈయనకడనే బసవేశ్వరుఁడు మంత్రిగ నుండినవాఁడు. హీరిది బల్లిక వంశమనియుంగూడ చెప్పఁబడినది. బఘేలా బల్లికగా మారెనో లేక ఇందు నిజమెద్దియో పరిశీలన జరగవలయును. బిజ్జలుఁడు జైనమతస్థుఁడు. (కుంతలదేశము చూడుఁడు).

వీరిలోని మధ్యానీశాఖ చళూకరాజులు భారద్వాజగోత్రులనియు, సామవేదులనియు, గోర్లోకేశినీయులనియు, సరస్వతీనదీతీర వాసులనియు, కిరోజదేవి మైపాల్ (బహుశః మహీపాల) పుత్రులనియు ఆదేశమునకు "తిరతుర్వాగ జెనారని (Zone of three threads) పేరుండెననియు పాటలందు కలదు. మరియు నా సందర్భముననే కపిలేశ్వరదేవయనియు, కర్దమాస్రీశ్వరనియుంగూడ పేర్లు కలవు.

కలనల్ జేమ్సు టాడ్ అను చరిత్రకారుడు పరిశీలన కొనర్చి వీరాదిని లాహోరు ప్రాంతవాసులై యుండిరనియు, లాంగుహాస్, తోగ్రాస్ అను మహమ్మదీయులు వీరివారేననియు, పిమ్మటను మహమ్మదీయులై యుందురనియు నభిప్రాయపడిన

యున్నాఁడు. వీరిప్పుడు ముల్తాన్ ప్రాంత నివాసులై యున్నారు.

రహతోరు శాఖ వారికి రాష్ట్రకూటులనియు పేరుకలదు. వీరు కనూజు రాష్ట్రమును స్వాధీన పఱచుకొని కొంతకాల మేలినవారు. అంతకు పూర్వము రాష్ట్రకూటులు గంగానదీ తీరమున నూరు రాష్ట్రములు పాలించుచుండిన వారని తెలియుచున్నది. కనూజరహతోరులు (రాష్ట్రకూటులు) పురిహార రాజులకుం గొంతకాలము సామంతులుగ నుండిరనియుం జెప్పఁబడినది.

**చాల్కోగ్రాఫీ** (Chalcography) — రాగిమొదలగు లోహపురేకులపై (ముద్రణయంత్రమునందిడి ముద్రించుటకుగాను) వివిధ రూపములను, అక్షరములను చిత్రించు కళ. దీని Engraving art అనియెదరు. ఈవిద్య ఇటలీ దేశములోని Florence నగరమున క్రీ. శ. పదునేనవ శతాబ్దమున నొక బంగారుపనివానిచే ప్రారంభింపఁబడినదట. పిదప ఉక్కురేకులు చాల కాలము మనుటకని పెట్టబడినదిగాని, చెక్కుట కష్టతరముగాన రాగిరేకులపై పలుచని ఉక్కుపూతపూసి యుపయోగించు చున్నారు.

**చావు రెండుసార్లు రాదు** — ఆంధ్ర లోకోక్తి

**చాషగోత్రము** — హిరణ్యాదకేశిప గణము చూడుఁడు.

**చానరాయణి గోత్రము** — సాంకృతి ఉపగణము చూడుఁడు.

**చ్యానైరా క్షత్రియులు** — చౌహానులు చూడుఁడు.

**చాహమా రెనాఖ క్షత్రియులు** - క్షత్రియకులము చూడుఁడు.

**చాళుక్యభీమవరము** — తొల్లి యొక స్వుడు పశ్చిమచాళుక్యులు వేఁగిదేశమును చేర నాంధ్రదేశభాగ మేలుకాలమున చళుక్యభీమనృపతి తనరాజధానిని ఈపురమున నేర్పఱచుటం జేసి దీనికి చళుక్యభీమవరమని పేరు ప్రసిద్ధంబయ్యెనట. ఇది యాతనికిని కుమారభీమనృపతికి రాజధానిపురములై యుండెనట. ఇది యిప్పటి చామర్లకోట కనుటనున్న భీమవరమను చిన్న గ్రామము. అదిగ (కొల్లవెంబడినే రాజమహేంద్రవరము వైపున) మానేనిపురమువఱకు వ్యాపించి యుండెనట. అటనేగల యొక ప్రాచీనదేవళ మానాఁటిదే యందురు.

వేములవాడ భీమకవిని నిరాదరణ జేసినకతన నాపురము నేలం గలియునని నాతఁడు శపించెననియు, నది పాడగుచుండ ప్రజలు యిప్పటి భీమవరమునకునుచుట్టుప్రక్కలకుం జెదరిపోయిరనియు నచటివారు తెల్పుదురు. తొల్లింటి శ్యామలకోట దుర్గ మాపట్టణము వెలుపల నుండెడిదట. రాను రాను కోటపోయి గ్రామమేర్పడి, శ్యామలకోట మారి చామర్లకోట యాయెనట. ఈసంగతు లాగ్రామస్థులు నుడువుచుందురు. శ్రీనాథమహాకవి తనపద్యములందు చళుక్యభీమవరమని వ్రాసిన దీపురమునుం గూర్చియేనట.

**చాళుక్యులు** — ఒకప్పుడు మహారాష్ట్రమైయుండిన కుంతలదేశ మేలిరి. వీరికాలమున రాజ్యము విస్తరించెను. వీరియందు ఒకటవ పులికేశియనువాఁడు రెండవపులికేశి బలాఢ్యుండని చెప్పఁబడినవాఁడు. కనూజభూపతియగు రెండవ శిలాదిత్యుఁ డనంబడిన హర్షవర్ధను నోడించినవాఁ డనియుఁ జెప్పఁబడినది. వీరు ఏడవశతాబ్దమున తూర్పుచాళుక్యు లనియు, పశ్చిమ చాళుక్యు లనియు యిరుదెగలుగనైరి. తూర్పువా రచ్చటనే రాజ్య మేలుచుండిరి. పశ్చిమచాళుక్యులు అనఁగా రెండవపులికేశి సోదరుఁడు (మొదటి పులికేశి మనుమలలో రెండవవాఁడు) విష్ణువర్ధ

నుఁడు వేంగిపురము, రాజమహేంద్రవరము రాజధానులుగ ఆంధ్రదేశభాగమగు కృష్ణాగోదావరీ నదుల మధ్యపుపల్లపుభూముల నాక్రమించి ఏలినవాఁడు. ఈతని సుతుఁడు రాజరాజ నరేంద్రుఁడు. వీరు పల్లవులం జయించి రాజ్య మాక్రమించిరనియు, వీరు చోళులచేనోడి రాజ్యముగోల్పోయిరనియుఁ జెప్పఁబడినవి. వీరు పశ్చిమచాళుక్యులు.

తూర్పుచాళుక్యులలో కడపటివాఁ డగు కీర్తివర్మ నోడించి క్రీ. శ. ౭౫౩ రాష్ట్రకూటనృపతియగు దంతిదుర్గనృపాలుఁడు మహారాష్ట్రసింహాసన మెక్కెను. క్రీ. శ ౯౭౩ లో తిరుగ చాళుక్యులు పాలనకు వచ్చిరి. ఇత్తరి మాన్యఖేటము రాజధాని.

క్రీ. శ. ౧౦౪౦-౧౦౬౮ రాజ్య మేలిన అహవమల్లుఁ డను ఒకటవసోమేశ్వరనృపతి రాజధానిని మాన్యఖేటము నుండి కల్యాణమునకు మార్చెను. ఇది కుంతలములోనిదిగాన నప్పటికి కుంతలము ఇందుల చేరియుండెనని తేలుచున్నది అతని సుతుఁడు త్రిభువనమల్లుఁడు అనంబడిన రెండవవిక్రమాదిత్యుఁడు, క్రీ. శ. ౧౦౭౬-౧౧౨౬ రాజ్యమేలినవాఁడు. పిదప రెండవ తైలపుని పాలనము ౧౧౬౨ వఱకు నడచెను. అతనిమంత్రి బిజ్జలుఁడు రాజ్య మాక్రమించి రాజై క్రీ. శ. ౧౧౬౭ వఱకు నేలిన జైనుఁడు. ఈతనికడనే ప్రసిద్ధుండగు బసవేశ్వరుఁడు మంత్రిగ నుండెను

**చాక్షుష మనువు** — తండ్రి విశ్వకర్మ యని భాగవతమునగలదు. తండ్రి రిపుంజయుఁడని తల్లి బృహతీదేవియనియు, బ్రహ్మనాశి జన్మించెనియు మరికొన్ని తావులం జెప్పఁబడినది. మార్కండేయ పురాణమున తండ్రి మిత్రుండనియు, తల్లి గిరిభద్రయనియు, భార్య నడ్వలాదేవియనియు, విధాతయే యీతనికిచాక్షుసుండను నామమిడెననియు, కుమాళ్లు శతద్యుమ్న, ఊరు, పూరు, తపస్వి, శుచి, అగ్నిష్టోమ, అతిరాత్రి, ప్రద్యుమ్న, స్వచ్ఛపి, సత్యవాక్కులను పదిమందియనియు, విష్ణుభక్తియనియు చెప్పఁబడినది. ఈతనికాలమున మనోజవుఁడ వాసి, ఇంద్రుఁడు, సుమేధు, విరజ, హవిష్మంత, ఉన్నత, మధు, సహిష్ణు, విమలు లను ఋషులు మహర్షిత్వము వహించిరి. ఆషాఢశుద్ధ దశమి చాక్షుస మన్వాది.

---

**చింతకులగోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.

చింతకులగోత్రము (చింత్యము), త్ర్యార్షేయ గోత్రము, సంస్కృత గోత్రము, సాత్యాన తేసాత్యప్రవర, సత్యగణము, ఆపస్తంబ యజుశ్శాఖ, సూత్రపుణ్యగంథ మాధ్య ప్రవరఖండే, ప్రణవే శుఁకుదేవత, చింతామణి భార్య, సింహాచలము తపస్థానము, చిన్నామణి సరస్సు తటాకము జపము కోటి, దీపములు ౩౯, క్షేత్రసంఖ్య ౨౯, చిత్రవస్త్రప్రదానము, చింత, అల్లము, నల్లజీడి వర్జనీయములు.

**చింతకుంట కోదండరామ కవి** — ఆంధ్రకవులలో నాధునికులుగను పరిగణింపఁబడిన

వాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. నందవరీక శాఖ.

ఈతఁడు రామునిభాస్కరుని తన వంశీకునిగఁ జెప్పికొనియెను. క్రీ. శ. ౧౭౮౦ ప్రాంతమున నీకవి జీవించియుండిన వాఁడు. రచించినది సునందా పరిణయము, ప్రదీప చరిత్రము.

**చింత చెట్టు) చచ్చినా పులుపు చావదు** — పులుపున కాశ్రయమైన చింత చెట్టు చచ్చినను చచ్చుఁగాని పులుపు జగమున లేకపోదని భావము. చింతచెట్టు చచ్చియు పులుపుం గోల్పోవనియు స్ఫురించెడిని. ఆ-క్రి లోకోక్తి.

**చింతచెట్టు** — లా. Tamarindus Indica ఆంగ్ల. Tamarind tree, సం. అమ్లవృక్షః, అమ్లికా, తింత్రిణః, తింతిడ, తింతిడీకః, తింతిడీకః, తింతిడీకా, తింత్రిణీ, తింతిలికా. చింత చెట్టు ఆంధ్రభూమియందు అందరెఱింగిన చెట్టు. చింతపండును భోజనపదార్థముగ సంవత్సరము పొడవునను నిల్వయుంచి విక్రయింతురు. చింత పండువలననే ఈచెట్టునకు ప్రసిద్ధికల్గెను.

చింతపండు క్రొత్తది ఎఱుపురంగు గల్గియుండి అపథ్యమై యుండుననియు, ప్రాతబడినచో నల్ల రంగుగమారి పథ్యమనియు చెప్పఁబడుచున్నది. కాని, పెక్కండ్రు వైద్యులు అసలు చింతపం డేస్థితియందున్నను అపథ్యమె యనియెదరు. చింత పండునందు వాతదోషమును, పైత్యదోషమును అడఁచి విరేచనము వెడలించి, శ్లేష్మమును ప్రకోపింపజేయు గుణముగలదు. కండ్లకు నష్టము జేయును. చింతపండు ప్రాతది అభిఘాత (బదలిక వలనగల్గిన) జ్వరము నడఁచునని చెప్పఁబడినది.

చింతచెట్టుపువ్వు- వాతమును, రక్తాతిసార దోషమును అడఁచును. చింతఆకులను లేతపరు వునగోసి భోజనపదార్థముగ వాడుదురు. ఇది మేహశాంతిజేసి కడుపును శుభ్రపఱచును. అతి వేడిచేయును. మూలవ్యాధి ఉధృతమును తగ్గించును. అగ్నిమాంద్యము గల్గించును. నేత్రదృష్టిని బలహీనపఱచును. ఈచింతచిగురు నొడించి పప్పు జేసిందానిని చింతగాక అనెదరు. కొందరు చింత పొట్టుమసియుంగలదు. మిగుల పథ్యమనియు, శ్రమ, భ్రమ, బదలిక దాహము, పైత్యవికార ముల నడంచుననియు ఈచింతగాయ కషాయమున గలదందురు.

చింతకాయలు రక్తమును విరచు ననియు నందురు. చింతగింజలు ఉష్ణము, పైత్యము జేసి గఫము, క్రిమి, గ్రహణి, రక్తగ్రహణి, వీర్యనష్ట ములు నడంచి బలముగల్గించును చింతఆకుల రసము కామిలరోగమును శమింపఁ జేయుననియు, లేగుబాడు, దువ్వలమూన, పసుపు దీనికి విరుగు డులని చెప్పఁబడినది.

**చింతమతిన్న గోత్రము** — అందేరకుల మూలుఁడు.

**చింత్రలపల్లి వీరరాఘవ కవి**— ఆంధ్ర కవులలో నాధునికులందు పరిగణింపఁ బడినవాఁడు, నియోగి బ్రాహ్మణుఁడు, ఆశ్వలా యన సూత్రము, తండ్రిపేరు వేంకటరాజు, తాత పేరు వీరరాఘవయ్య

వీరరాఘవకవి పెక్కు సంస్థానముల గొప్ప మర్యాదల నందిన వాఁడు. ఆశుకవిత్వమును, శతకములు చెప్పుటయు, అవధానము లొనర్చు టయు నీతనికి జెలగాటల వంటివి.

రచించినది మధురవాణీవిలాసమను గ్రంథము. దీనిని శ్రీవేంకటేశ్వర స్వామికిం గృతి సమర్పించెను. ఇంకను చంద్రాంగదోపాఖ్యా నమను ప్రబంధమును రచించెను. ఈతఁడు తుంగభద్రా నదీ తీర ప్రదేశముల నెక్కడనో కాపుర ముండెనందురు.

**చింతలపూడి యెల్లనార్య కవి** — రాధామాధవ కవి చూడుఁడు.

**చింత్మకుల గోత్రము** — చింతకుల చూడుఁడు.

**చింతాపూర్ణీ క్షేత్రము**— పంజాబు దేశములోని జలంధర్ ప్రాంతములందు హోశి యార్పూర్ మండలమున చింతాపూర్ణగిరిపై నున్న యిట ఛిన్నమస్తకాదేవి దేవస్థానము కలదు. ఇది దేశప్రసిద్ధమగు క్షేత్రము ఇట దేవాల యమున పిండామూర్తి విగ్రహమునకు వెనుకగా నున్నది.

ఈతావు సముద్రపు మట్టముపై 3౦౦౦ అడుగుల యెత్తు.

**చింతామణిం పరిత్యజ్య కాచమణి గ్రహణ న్యాయము** — ఉన్నత పదవిని వదలి అధమస్థితిం గైకొనుట యని భావము

**చింతాలకులగోత్రము**—అంబేరకుల చూడుఁడు.

**చింతిత గోత్రము** — కుశిక గణము చూడుఁడు.

**చికిత్సాంగములు** — అంగములు చూడుఁడు.

**చికీర్ష గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**చికెన్పాక్సు వ్యాధి**— ఆటలమ్మ వ్యాధి చూడుఁడు.

**చిక్కుడు** (పాదుసు) **తీవచెట్టు** — చిక్కుడుకాయలు కూర భోజన పదార్థము గాన పేరందినది. మాఘ మాసమున ఆదివారము లందు నను, రథసప్తమి దినముననను స్త్రీలు సూర్యుని చిక్కుడు పూవులం బూజింతురు. చిక్కుడునం దనేక రకములు కలవు. అందు వెన్నెల చిక్కుడు, బియ్యపు చిక్కుడు, ఎఱ్ఱ చిక్కుడు, తెల్ల చిక్కుడు, నల్ల చిక్కుడు, పెంకు చిక్కుడు రాజులచిక్కుడు నను నవి ముఖ్యములు.

ఇంకను తీగయై ప్రాకక చిన్న తుప్పవలె ప్రాకి బలిసి కాచుచుట్టజాతి చిక్కుడు రకములు పెక్కు గలవు. వీటి కాంగ్లమున Beans అనిపేరు. ఇవిగాక ప్రత్యేకజాతులగు కంచిచిక్కుడు, ఆనప చిక్కుడు, గోల్కొండ చిక్కుడు నను విస్తార భేదముగల ప్రత్యేక జాతి చిక్కుడులు కలవు. ఇంకను చమ్మకాయల పాకులును ఈచిక్కుడు జాతికిం జేరనవియె మఱియు గొంగళి చిక్కు డని పేరుగల పాకున నూగుతోనుండు కాయలు గాచెడిని. ఇది అడవి జాతిగ నెంచి భోజన పదార్థముగ వాడక విసర్జింతురు. గోరుచిక్కుడు ప్రత్యేక జాతిగాని ఈచిక్కుడుతో నేసంబంధము లేనిది.

ఇన్నివిధములుగ దినరుచున్నను చిక్కుడు కాయలు లోని గింజలంగుగల గుణమొక్కటియె నందురు ఇందు రాజుల చిక్కుడు ఉత్తమ జాతియనియు, పెంకు చిక్కుడు అధమపు జాతి గను ఎంచబడెడిని తీగగ పాకుప్రాకు జాతుల చిక్కుడు మనదేశమున వర్షకాలమున మొలచి నాల్గు మాసములు గడచినవెనుక పూచి వేసవి కాలము వ్యాపించు వఱకు కాచు చుండెడిని. కాని తుప్పవలెం జెంగి పొట్టిగనై కాచు బీరుసు చిక్కుడు చల్లని పరిస్థితు లమరిన ఎల్లప్పుడును కాచుచుందురు.

చిక్కుడు కాయలందు మూత్రము వెడలించు టయు, మూత్రమున సుద్దఁ బుట్టించుటయు, పురు షులందు వీర్యవృద్ధియు, పిల్లతల్లులందు క్షీర వృద్ధియుఁ గల్గించుటయు, గురుత్వముగ నుండి ఇంచుక అజీర్తియు, విరేచన బద్ధమును గల్గించు టయు, కఫములో వాతము, విదాహము గల్గిం

చుటయు గుణములని చెప్పఁబడినవి. చిక్కుడు గింజల పై పొట్టునందు గర్భమున వాయువుంజేర్చి కడుపుబ్బరము గల్గించు గుణమును, లోని పప్పు బద్దలందు శైత్యోద్రేకము, వీర్యవృద్ధి, బలము గల్గించు గుణమును గలదందురు.

అధికముగ బుచ్చుకొనిన నేత్రములకు దృష్టికి జబ్బు గల్గించు దృష్టి బలముం దగ్గించునని చెప్పఁబడినది. చిక్కుడు గల్గించు దోషములకు విరుగుడు వాముము, సొంఠి, కరక్కాయపిందెల చూర్ణము లవంగములు, పుదీనా, తెల్లయుత్తరేణిచెట్టు సమూలము కాల్చిన బూడిదె, చిక్కుడును లేతకాయలన్నను ఉడికించి వార్చుటయును, ముదురు కాయలన్న గింజల పైపొర దీసివైచి ఉడికించి వార్చుటయు దోషపరిహారములగును.

**చిజ్జుళ తిమ్మభూపాలుడు**-ఈతఁడు క్రీ. వె. ౧౭౦౦ ప్రాంతమున కృష్ణానదీ తీరమున ప్రాకుటూరి పురము నేలినవాఁడట. వేమారెడ్డి వంశజుఁడట

రచించినది అనర్ఘరాఘవమను చంపూకావ్యము. ఇది మురారి ప్రణీతమగు అనర్ఘరాఘవమును మాతృకగా జేకొని రచించె నందురు. ఏదియైనను తిమ్మభూపాలుని చంపూకావ్యము మిక్కిలి ప్రౌఢమై నేటికినీ నిరుపమాన గౌరవము నొంది యున్నది

**చిట్టగాంగు పురము**— చంద్రశేఖర పురము చూడుఁడు

**చిట్టి అంకుడు చెట్టు**—అంకుడుచెట్టు చూడుఁడు.

**చిత్తము శివునిపైని భక్తి చెప్పులపైని**—

**చిత్ర విభ్రమ సన్నిపాతము**— సన్నిపాత దోషము చూడుఁడు.

**చితాభూమి(చిద్భూమి)**-దీనిని వైద్యనాథ క్షేత్రమందురు. ఆదేశస్థులు దియోఘర్ (దేవగృహము) అనుచున్నారు. వంగదేశములోని సంతాల్పరగణా లోనిది. ఇది ద్వాదశ మహాలింగములలో నొకటి యని శివపురాణము ౧-౩౮-౪౪ వివరింపఁ బడినది. ఇచటి పార్వతీ దేవి దేవస్థానము ౫౨ శక్తి పీఠములలో నొకటి. హృదయపీఠము, శివపురాణమున దీనిని పంపాపురము లేక పార్వతీ పురమనియు పేరొఁ బడినది పార్వతీపురము నానాటికి, పార్లీ పురమనియు, పార్లీగ్రామమనియు, పాలుగాగా అనియు మార్పులం జెందెనట. ఇది రావణ భూపతి ప్రతిష్ఠించిన శివలింగము. ఇది తొల్లింట హారీతకీ వన మను పేరుగల భూమి.

ఇచటి తూర్పుదెసగా నాలుమైళ్ల దూరమున త్రికూట పర్వతము కలదు. ఇచట నొక నీటి యూట స్నాన తీర్థముగ నున్నది. మఱియు ఇచటి కారుమైళ్ల దూరముననె రావణుఁడు తపంబొనర్చిన తపోవనమును, అందొక పర్వతమున తపస్వి వసించిన నైసర్గిక కందరముల (Natural cave) గలవు కేతకీ వనము చూడుఁడు.

**చిత్రా నక్షత్రము**—ఇదిముత్యమువలె కాంతిగల్గిన ఏకనక్షత్రము. దీనికింకను ఇంద్రమనియు, త్వష్ట్రదైవత్య మనియు, త్వాష్ట్ర మనియు, సురవర్ధకి మనియు పర్యాయ నామములు చెప్పఁబడినవి.

త్వష్ట్రుఁడధి దేవత, రాక్షస గణ నక్షత్రము, తిర్యఙ్ముఖము, స్త్రీ స్వభావము, వ్యాఘ్రము, ఆడకొంగ, బిల్వవృక్షము ఈనక్షత్ర సంబంధములనియు ప్రవేశించిన ఇరువది ఘడియల పైత్యా

జ్యము (విషఘుటికల) నియు, నలువదినాల్గు ఘుడియలపై యమృత ఘుటికలనియు, మృధు స్వభావ నక్షత్ర మనియుఁ జెప్పఁబడినది.

**చిత్తూరు జిల్లా** — ఆంధ్ర దేశము లోనిది. చెన్నపురి రాజధానికిఁ జేరియున్నది. చిత్తూరు ముఖ్య పట్టణము. తిరుపతి పెద్దపట్టణము. ఈప్రాంతమున కొండపై గల తిరుమల దేవస్థానము సుప్రసిద్ధము. తిరుపతి నాగొండ పండ్లకు పేరొందినది. కాళహస్తి గొప్ప క్షేత్రము పట్టణము నై యున్నది. (శ్రీ కాళహస్తి చూడుఁడు). ఈప్రాంతము అంటుమామిడి పండ్లకు పేరొందినది ఇట సువర్ణముఖరి జన్మస్థానము కలదు. పాకల వేఱొక పట్టణము.

**చిత్రకవి అనంతకవి** — ఆంధ్రకవులలో మధ్యకవులందు పేర్కొనఁబడినవాఁడు ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. భరద్వాజ సగోత్రుఁడు కాత్యాయనసూత్రము, తండ్రిపేరు చిత్రకవి. పెద్దనకవి కుమారుఁడు రమణకవి సాంబవిలాసమను ప్రబంధము రచించినవాఁడు.

అనంతకవి రచించినవి-ఇందుమతీపరిణయమను ప్రబంధము రచించెను. మఱియు రామరాజభూషణుఁడు రచించిన హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు వ్యాఖ్య వ్రాసెను. గండికోటదుర్గమునధ్యక్షుఁడుగ నుండిన పెమ్మసాని చినతిమ్మరాజున కాస్థానకవి. క్రీ. వె. ౧౬౧౮ ప్రాంతమువాఁడు

**చిత్రకవి పెద్దనకవి** — ఆంధ్రకవులలో మధ్యకవులందు పరిగణింపఁబడినవాఁడు ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. భరద్వాజ సగోత్రుఁడు. కాత్యాయనసూత్రము. కుమారుఁడు అనంతకవి ఇందుమతీపరిణయమును మనుమఁడు రమణకవి సాంబవిలాసమును రచించిరి.

పెద్దనకవి రచించినది సర్వలక్షణసారసంగ్రహమను లక్షణగ్రంథము క్రీ. వె. పదునారవ శతాబ్దాంతమునందుండిన కవియని తేలుచున్నది.

**చిత్రకవి రమణకవి** — ఆంధ్రకవులలో మధ్యకవులుగా పరిగణింపఁబడినవాఁడు ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. భరద్వాజ సగోత్రుఁడు. కాత్యాయన సూత్రము. తండ్రిపేరు అనంతకవి. తాత పెద్దనకవి. తల్లి పేరు ఓబళాంబ. రచించినది సాంబవిలాసము. ఇది దుర్యోధన సుతయగు లక్షణను శ్రీకృష్ణసుతుఁడైన సాంబునికిచ్చి చేసినపరిణయచరిత్రము ఇంక రామాయణమొకటి విద్వత్కవి కర్ణరసాయన సకల వర్ణనాపూర్ణ రామాయణ మను పేర రచించెను. మరియు అభిమన్యువిలాసము, కుమారగురువిలాసము నను ప్రబంధములును రచించెను. గొప్ప విద్వత్కవి

**చిత్రకవి సింగరార్యకవి** — ఆంధ్రకవులలో నాధునికులుగా పరిగణింపఁబడినవాఁడు. ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు కుమారుఁడు నాగసింహార్యకవి రచించిన పాండిపెద్ది కృష్ణస్వామి రచించినట్లు చెప్పఁబడిన బిల్హణీయమునియు, సింగరార్యుని యనంతరము నాగసింహార్యుఁడు తలలుమార్చి కృష్ణస్వామి రచించినట్లు దిద్దెననియు ఒక ప్రతీతి కలదు. అది రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగం పంతులు గారును అంగీకరించియున్నారు.

**చిత్రకుఁడు** — అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి వృష్ణి లేక, పృశ్నిసోదరుఁడు శ్వఫల్కుఁడు.

**చిత్త (కార్తి) చిత్తగించి, స్వాతి (కార్తి) చల్ల జేసి, (చల్ల నగల్గ నక్కు వర్షించి) విశాఖ (కార్తి) విశిరికొడితే**

**(పెద్దవాన కురిస్తే) చేను కంకిలో కావలతినన్ని ధాన్యము పండుతానన్న దట** — ఆంధ్రలోకోక్తి.

**చిత్రకూట (పర్వత) ము** (రామగిర్యాశ్రమము) — పయోష్ణీనదీతీరము. దీనినిప్పుడు పైశునీ యనుచున్నారు మఱియు మందాకినీ యనియు గూడ వాడుకయుండెను. శ్రీరామ, సీతామహాదేవు లిట కొంతకాలము వసించిరని రామాయణ అయోధ్యాకాండ 56 వ అధ్యాయమున చెప్పఁబడినది. కానసే దీనికి రామగిర్యాశ్రమ మని మహాకవి కాళిదాసు తన మేఘసందేశపు ప్రథమశ్లోకమున వ్రాసియున్నాఁడు G I P Railway చిత్రకూట్ స్టేషనుకు నాలుగైదుమైళ్ళదూరమున బుందేల (బుందేల్ఖండ్) ఖండమునం దున్నది

ఇది యాత్రాస్థలము పర్వతపరిక్రమమార్గము క్రీ శ 1766–1769 సంవత్సరముల రాము చంద్రకున్వారను పేరుగల పన్నామహారాజు నిర్మించెను. ఇందు ఎక్కు దేవస్థానములు, సత్తీర్థములు కలవు. అవి కోటితీర్థము, దివిజగంగ, హనుమద్ధార, పాటకిశైలతీర్థము, అనుసూయాతీర్థము, గుప్తగోదావరీతీర్థము, భరతకుండము అనునవి 33 దేవస్థానములు వేర్వేరు గుట్టలపై పర్వతముచుట్టి యున్నవి అందు ప్రధానదేవస్థానము చరణపాదుక యనఁబడు రావున శ్రీరామ సీత లక్ష్మణుల పాదముల గురుతులు (అనూపదేశము చూడుఁడు.)

**చిత్రకేతుఁడు** — యాదవసాత్వతక్షత్రియుఁడు. తండ్రి దేవభాగుఁడు పెదతండ్రి వసుదేవుఁడు. (ఇతఁడు కృష్ణపుత్రుఁడట)

వేఱొక చిత్రకేతుఁడు సౌరసేనదేశపు నరపాలుఁడు గలఁడు. ఈతఁడు నారదాంగీరసుల నుండి జ్ఞానోపదేశమునంది జ్ఞానియై, దేవత్వమంది విద్యాధరాధిపతియై యుండెననియు, అత్తరి కారణాంతరబద్ధుఁడై శివాపరాధ మొనర్చి శపింపఁబడి రాక్షసత్వము వహించి వృత్రాసురుఁడై జన్మించెననియుఁ జెప్పఁబడినది. వృత్రాసురు నింద్రుఁడు చంపుటతో నాశాప విముక్తి యయ్యెనని చెప్పఁబడినది

**చిత్రగుప్తుఁడు** — యమునికడనుండు యుద్యోగి, మనుజుల పాపపుణ్యములను యమున కెఱిఁగించుచుండువాఁడని చెప్పఁబడినది.

**చిత్రంతవి గోత్రము**— కుశికగణము చూడుఁడు.

**చిత్రమూలపు చెట్టు** — లా. Plumbago Zeylanicum - Plumbago rosea Capensis - ఆంగ్ల. Ceylon Leadwart - సం అగ్ని, అగ్నికః, అగ్నిముఖ, చిత్రకః చిత్రపాఠి చిత్రభానుః, చిత్రాంగః (ఎఱ్ఱచిత్రమూలము), దహనః, చిత్రమూలము, ఎఱ్ఱపూవుల జాతి, తెల్లపూవుల జాతి, నీలిపూవుల జాతి, యని మూడుభేదములు కలది ఇందెఱ్ఱపూవులజాతి శ్రేష్ఠమనియు బలముగఁ బనిజేయుననియుఁ జెప్పఁబడినది.

చిత్రమూలపువేరు, రసముగాని, కషాయముగాని, ఎండించిచేసిన చూర్ణముగాని వైద్యులుపయోగింతురు. ఇది తగిలినచోట పుండు చేయు గుణముగలది. కాన దీనిని ప్రత్యేకముగ లోనికీయక ఇతరఔషధములతో కల్పి వాడుచుందురు. వేరుపైచెక్క బియ్యపుగంజితో నూరి పైన పట్టువేసిన అడ్డగ్రంథులు, బిళ్ళలు (సుఖవ్యాధులు) పై పట్టువేసిన నివారించుననియు, తీరని వాతపుపొంగులుగల తావులఁగాననను, పక్షవాత దోషమున పడిపోయిన అవయవపు కీళ్ళయందునను, కుదురక మొండిగనగుచుండు రక్తవిరేచనము లగుచుండుతరి నాభిచుట్టునను పట్టువేసిన పుండుచేసి

బాధనివర్తించుననియు, వేరుచెక్క నీటితో ముద్దగ నూరి, నూనెయందు వేసి కాచి పైకిమర్దనా చేసిన కటివాతము ధనుర్వాతము మొదలగు వాత నొప్పులు శమించుననియు, చిత్రమూలపు ఆకు నూరి వేసినను కంఠనొప్పి, అడ్డగర్రలు, బిళ్ళలు నివారణమగుననియుఁ జెప్పఁబడినది మఱియు చిత్రమూలపు వేరువలన విషమజ్వరము, అజీర్ణ జ్వరము, పురాణజ్వరములను పోఁగొట్టుశక్తి కలదనియు, వాతములు, ద్వంద్వరోగములు, కడుపులోనిబల్లలు, అగ్నిమాంద్యము, మొదలగు ఉదరరోగములును, సమస్తవాతములు, గ్రహణులు, కఫదోషములు, మూలవ్యాధులు ఉబ్బు రోగము, దద్రు, వ్రణములు, శ్వాసలు, శూలలు నివారించుననియుఁ జెప్పఁబడినది. ఆకు మిక్కిలి (లోనికిచ్చిన) క్రిమివాతముల వేడిచేసి హరించెడిని.

**చిత్రరథుఁడు** — పాండవసంతతి క్షత్రియుఁడు. తండ్రి ఉక్తుఁడు, పితామహునకు నిమి లేక నేమిచక్రుడు. కుమారుఁడు సుచిరథుఁడు యదు సంతతియందు భేరుశంకుని కుమారుడు (శశిబిందుని తండ్రి) అను సంతతియందు దిపీరథుని కుమారుఁడు చిత్రరథుఁడు, కౌరవ్యులలో నొక చిత్రరథుఁడుకలఁడు అంగారపర్ణుని చూడుఁడు.

**చిత్రరథానది** — ఇదియొక చిన్ననది. ఉత్తరపినాకినియందు సంగమించును. మహాభారతము భీష్మపర్వము ౯ అధ్యా దీనిప్రశంసకలదు. ఉత్తరపినాకినీనది నెల్లూరుకడ పెన్నయనంబడుచు ఆనకట్టంగల్గియున్నది.

**చిత్రరేఖ** — బాణాసురుని కుమార్తె యగు ఉషయొక్క చెలికత్తె తండ్రి కబాధుడు (బాణాసురునికడ మంత్రి). ఈమె చిత్రరువులు వ్రాయుటయందు నేర్పరియనియు అనిరుద్ధుని రూపచిత్రమీమె వ్రాసి లిఖించెననియుం జెప్పఁబడినది.

**చిత్రరోగము** — ఇది కుష్టరోగ భేదములలో నొకటి.

**చిత్రలఘు** — సంగీతశాస్త్రమున జాతి (లయ) ప్రాణమున చెప్పఁబడిన దశలఘువులలో నొకటి. తొమ్మిదక్షరము లకాలము. జాతి (లయ) ప్రాణము చూడుఁడు

**చిత్రవాహనుఁడు** — (మలధ్వజమహారాజు) ఈతనికి మలయధ్వజుఁడనియుఁ బేరుకలదు. దక్షిణ పాండ్యదేశాధీశుడు కుమార్తె చిత్రాంగద (అర్జునుని భార్య). ఈమెకుమారుఁడు బభ్రువాహనుడు మలయధ్వజుఁడు చూడుఁడు

**చిత్రవిగ్రహములు (ప్రతిమలు)**- ఇవి దేవాలయములపై సలంకారమున చిత్రింపఁబడు ప్రతిమలు (శిల్పశాస్త్రము చూడుఁడు).

విగ్రహములు- వీట్లకు శిల్పశాస్త్రమున ప్రతిమలనిపేరు. ఇవి దేవతా విగ్రహములనియు, రాజవిగ్రహములనియు, జంతుచిత్రములనియు, చిత్రములనియు, నాల్గుతెరగులు. దేవతావిగ్రహములు, దేవాలయములందు ప్రతిష్ఠింపఁబడి పూజింపబడునవి రాజవిగ్రహములు నరపాలుర యొక్కయు, ఋషుల్యమునులయొక్కయు, దేవతల యొక్కయు విగ్రహములు. ఇవి అలంకారమునకై దేవాలయములందు పైభాగములను, మంటపము లందునను, గోపురములపైనను చిత్రింపబడునవి. జంతుచిత్రములు అలంకారార్థము చిత్రింపబడు పశుపక్షిమృగాది జంతువుల చిత్రములు, ఇంక చిత్రములన పుష్ప, ఫల, లతా వృక్షాదుల రూపములలంకారార్థము చిత్రింపఁబడునవి.

మనుష్యాకారవిగ్రహ- అవయవ పరిమాణములు. కుడిచేతి మధ్యమవ్రేలిగోరు ఎంతవుండ వలయునో తొలుదొలుత నిర్ణయించుకుని దానికి రెట్టి వ్రేలికణుపుగను, వ్రేలికణుపును మూఁడింటిచే

గుణించగా వచ్చినది మధ్య వ్రేలియొక్క ప్రమాణమని తెలియగునది విగ్రహములు విగ్రహావయవపరిమాణములు- లెఖ ఇట్లే.

విగ్రహముల అవయవములంగొలుచు లెక్కయందు ఒక అంగుళము గోధుమ, అంగుళము వ్రేలికిన కొలుపుచు, నాల్గంగుళములు కుడిచేతి మధ్యవ్రేలును రచించియున్నారు ఇట్లగుతరి హస్తము ఇరువదినాలుగంగుళము లుండెడిది. పురుష (మనుష్య) ప్రమాణము తొంబదిరెండంగుళములును, స్త్రీవిగ్రహముయొక్క ప్రమాణము నూటయెనిమిదంగుళములును యుండుట లోకప్రసిద్ధము

పురుషులకు- శిరః ప్రమాణము ౧౨ అంగుళములు. ఇందు శిరస్సు మొదలు నాభివఱకు ఊర్ధ్వకాయమనబడునది. ౩౨ అంగుళము లుండెడిది నాభి మొదలు పాదములవఱకు అధఃకాయ మనంబడును దానిప్రమాణము [illegible] అంగుళము లుండెడిది హృదయము మొదలు మొలవఱకు పదునారంగుళము లుండెడిది అట నుండి అధఃకాయమును తయుతకి, పదిపాదము సర్వసాధారణముగ నెన్మిదంగుళములును, ముక్కు రెండంగుళములును, చెవులు మూడంగుళములును, కంఠము నాల్గంగుళములును వాటి వెడల్పులు అంగ సగముగను యుండెడిది

స్త్రీలకు- స్త్రీవిగ్రహములకు (సామాన్య శరీర) ప్రమాణము శిరస్సు మొదలు పాదముల దనుక నూటయెనిమిదంగుళము లుండెడిది. అందు శిరస్సుమొదలు నాభివఱకు [illegible] అంగుళములును, నాభినుండి క్రిందికి పాదములదనుక ౩౨ అంగుళము లుండుట యాచారమై యున్నది. మఱియు పురుషావయవములకన్న చేతులు, పాదములు, పిక్కలు మొదలగు స్త్రీఅవయవములు తక్కువగ నుండవలయును. ఆయా అవయవముల పొడవునందు సగము వెడలుపని తెలియగునది. పరిమాణములయందలి దోషలోపములు వికృతాకారముగ జేయును

అండజములు (పక్షుల) ప్రమాణములు—— వేర్వేఱుజాతుల పక్షులప్రమాణములు అను భూతబుద్ధివలన నెంచుకొనవలయును. ఒక్కొక్కప్పుడు పెద్దవిగ గాని, చిన్నవిగ గాని చిత్రింప దలంచినచో నిక్రింది విధముల పాటించవలయును

ముక్కు ప్రమాణమునకు రెండురెట్లు శిరస్సును, శిరస్సునకు రెండురెట్లు మెడయు, మెడకు రెండు రెట్లు ఉదరము, మెడ పొడవెంతయుండునో అంత పొడవును, శిరస్సెంతయుండునో అంత పిక్కలు, ముక్కెంతయుండునో అంత గోరు, ఉదర మెంత యుండునో అంత తోక యుండునని తెలియగునది

జంతువులు, మృగములు, పశువులు- వీట్ల రూపపరిమాణములను బుద్ధిచే నూహించుకొనవలయును వీటి అవయవప్రమాణములు- డెక్కలు పాదములు కలసియున్న కాలు పొడుగా పిక్కయుండును. పిక్కయొక్క నాలుగురెట్లు జంఘములు, మెడకు ఎన్నిరెట్లు ఉదరము, ముఖము నూరెండు, పిక్కలపై నుండి చేతులు ముఖముతో సమము. తోక వెనుకటికాళ్ల మోకాళ్లవఱకు నుండి ఆకాళ్ల డెక్కలవఱకు నుండెడిది. కొమ్ములు రెండుడెక్కలంత ప్రమాణము, కొమ్ము లెంతెంత యుండునో చెవులును అంతంతే యుండెడిది.

సర్పములు వీటి రూపపరిమాణములు- శిరమునకు రెట్టింపు మెడయును, దానికి నాలుగురెట్లు కడుపుపొడవును, దానికి సమముగ తోకయు, పాములచిత్రములం దుండవలయును. కడుపుయొక్క చుట్టుకొలత యెంతయుండునో విప్పిన పడగ అంతకు మించి యుండరాదు. తగ్గియె యుండవలయును. కడుపుకొననుండి తోకకడకు

క్రమక్రమముగ సన్నగిలుచు పోవలయును. పరిమాణములలోపము దోషము, వికృతాకార రూపము గల్గించెడిని

**చిత్రసేనగోత్రము** — పీతవ్య లేక, యాస్కగణము చూడుడు

**చిత్రసేనుడు** — వైవస్వతమనువు పుత్రులలో నొకడగు నరిష్యంతుని కుమారుడు. (వైవస్వతమనువు చూడుడు)

కర్ణునికుమారుడు (అంగరాజు) చిత్రసేనుడు భారతయుద్ధమున నకులునిచే నిహతుడైనవాడు మగధభూపతి యగు జరాసంధుని మిత్రుడు డిచికుడని వానిపేరు చిత్రసేనుడు. సుయోధనుని తమ్ములలో నొకడు చిత్రసేనుడు కలడు పాండవమధ్యముండగు నర్జునునకు స్నేహితుడగు చిత్రసేనుడను పేరుగల గంధర్వుడు కలడు. పాండవులు ద్వైతవనమున నుండు తరి యొకసరోవరతీరమున సద్యస్కందమను క్రతువు ధర్మరాజొనర్చుచుండ దుర్యోధనాదులు తమ యైశ్వర్యప్రదర్శన మొనర్ప, ఘోషయాత్ర స్త్రీలతోసహా వెడలి, ఆసరోవరతీరముననే గంధర్వునిచే స్త్రీలతోసహా కట్టబడి నిర్బంధింపబడిన కతన ధర్మరాజు విడిపించెనని, భారతయుద్ధమున చెప్పబడిన ఆగంధర్వునిపేరు చిత్రసేనుడు.

**చిత్రాంగదుడు** — అత్రి చంద్ర పూరువు, కురుసంతతి క్షత్రియుడు, తండ్రి శంతన మహారాజు, తల్లి దాశరాజు, పెంపుడుకూతురు సత్యవతి, సోదరులు భీష్ముడు, విచిత్రవీరుడు. ఇతడు ధృతరాష్ట్రుని పెదతండ్రి. బాల్యమునందే చిత్రాంగదుడను గంధర్వునిచే నిహతుడైన వాడు. మరియు దుర్యోధనుని తమ్ములలో నొకనికిని, చిత్రాంగదునిచంపిన గంధర్వునకును చిత్రాంగదనామములే.

ఇంకను పాండ్యభూపాలుని కుమార్తెయు, అర్జునుని భార్యయు నగు వనితపేరు చిత్రాంగద. ఈమె కుమారుడు బభ్రువాహనుడు, తండ్రి చిత్రవాహనుడు లేక, మలయధ్వజమహారాజు.

**చిత్రాంగనాన్యాయము** — పటమునందు చిత్రింపబడిన స్త్రీవిగ్రహము నత్యంత మనోహరమై కన్పించుచున్నను, అందు నిజమేమియు లేదని భావము. మనోహరమగు వట్టి భ్రమంగూర్చి యీన్యాయము వాడుచుందురు.

**చిత్రాంగి** — రాజరాజనరేంద్రుని రెండవ భార్య. కుమారుడు సారంగధరుని కాలుచేతులు నరకించినదని చెప్పబడినది ఈ కథ కల్పితమనియు, నిజము కాదనియు పరిశీలకులు అనుచున్నారు.

**చిత్రోత్పలానది** — దీనికి చిత్రోపల యనియు పేరుకలదు. ఉత్కల (ఓఢ్ర) దేశము నందలి కటకమను పట్టణపరిసరమున ప్రవహించును. మహానదియొక్క ఒక శాఖానది. దీనింగూర్చిన ప్రశంసలు మహాభారత భీష్మపర్వ ౯ అధ్యాయమునను, మార్కండేయపురాణము ౫౭ అధ్యాయమునను గలవు.

**చిదంబరము**—ఇది పుణ్యక్షేత్రము. దక్షిణ దేశమునందు కలదు. ఇట శివలింగమగు నటేశ్వరస్వామి ఆకాశలింగ మని చెప్పబడుచున్నది. నిజముగా నిట లింగము లేదు. ఒక పీఠముపై వేయుబడిన తెరకు వెనుక గోడకు దాపబడియున్న శిలాఫలకమునందు గల రాతి తలుపులె లింగాకారముగ మెఱయుచుండును వేఱొక సంపుటమున నొక లింగము కలదు అది వజ్రలింగమందురు. దీనికి అన్నపు మెతుకులు పూజించి అభిషేకాదుల నొనర్తురు. మూర్తికొన్ని బంగారు విగ్రహములు కలవు విష్ణు దేవాల

యము, శివదేవాలయము నిరుగు పొరుగుగ నొకే యావరణమున నుండుట, ఇట విశేషొల్లెడిని. కనకసభయందు నాట్యములు ౧౦౮ యు ప్రదర్శింపబడి చిత్రింపబడినవి

దేవాల యావరణము ముప్పది రెండెకరముల పరిమితికలది. అనేక మంటపములు, సహస్ర స్తంభ మంటపము మొదలగు పెక్కు కట్టడములు కలవు. వీటిని తిరుప్పణివారు (నాటి కోటిచెట్లు) జీర్ణోద్ధారణమొనర్చి బలముగనిర్మించి యున్నారు దేవస్థానపు తిరిగిపై బంగారపు రేకు వేయబడినదని జెప్పుదురు. ఇందు శివ లింగము [illegible] [illegible] [illegible] మగు తలుపులు [illegible] [illegible] చూడుము

చిదంబర [illegible] కౌశిక [illegible] విద్యా లయము [illegible] అన్నామలైచెట్టి గారు ధనమిచ్చి నెలకొల్పి యున్నారు ఆ తాపునకు అన్నామలై నగర మనిపేరు. [illegible] అప్పయదీక్షితులను మహాశివభక్తుడగు విద్వత్కవి [illegible] చిదంబరమున నే వసించుచు నిట్టి [illegible]

**చిదురువెళ్ల గోత్రము** — బిస్రాహ్మ కులగోత్రము చూడుము.

**చిద్రూపకులగోత్రము** — ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి (వైశ్య గోత్రములు చూడుము) చిద్రూపకులగోత్రము-నకా [illegible] (౬౦) గోత్రము దీనిని చిదురుపెళ్లి అనియు నందురు సాంస్కృతగోత్రము త్రైత్రేయస [illegible] కాశ్యపము, పవిత్రపాణియు, ఆపస్తంబ యాజుశ్శాఖ, ప్రవరాణ్య్ర కమాద్యప్రవరఖండ, సమానగోత్రములు మనోగస, పవిత్రపాణిక, చిత్రేశులు దేవత, చింతామణి భార్య, ప్రయాగ తపస్థానము, చింతామణిసరస్సు తటాకము, జపము అబ్బదములు, దీపములు ౯౦, క్షేత్ర సాఖ్య ౧౮, ఛత్ర దానము, చేమంతి చిత్రికూర వర్జనీయములు

**చిద్భూమి** — చితాభూమి చూడుము.

**చిన్నఆంటిలీ ద్వీపములు** (Lesser Antilles) — ఇవి పశ్చిమగోళార్ధమున పసిఫిక్కు మహాసముద్రమునందు వెస్టిండీసు దీవుల కుంజెందిన మూడు ద్వీపసమూహములలో నొక ద్వీపసమూహము (వెస్టిండీసుదీవులు చూడుము). ఇందు విర్జిన్ ద్వీపము ఉత్తరమునను, మధ్యను లీవర్డుద్వీపము, దక్షిణమున విండువర్డు ద్వీపములును కలవు. వాటివాటిగూర్చి వేర్వేఱు తావులం గనందగును.

**చిన్నఆసియా దేశము** — ఏషియా లేక ఆసియామైనరు చూడుము.

**చిన్నగండకీనది** - అచిరవతి చూడుము.

**చిన్న టిబెట్టు దేశము** — బాల్టిస్థానము చూడుము

**చిన్న పాముపైనను పెద్ద కఱ్ఱతో గొట్టవలయును** — ఆంధ్రలోకోక్తి.

**చిన్న పుస్తకము** (World's Smallest Book) — ఇంగ్లాండు దేశమునందలి ఆక్సుఫర్డులోని Bodleian లైబ్రరీలో నున్నది. దానిని Mr Henry, H. Chamberlainఅను వారొసంగియుండిరి. ఆయన అమెరికాదేశపు కవి పుంగవుండు. అందలికథ Rubaiyat of Omar Khayyam 46 Quatrains ఆంగ్లభాషలోనికనువదింపబడిన గ్రంథము. అమెరికా సంయుక్త రాష్ట్రములలోని Worcester Massachusets నందు ముద్రింపబడినది. పుస్తకమున 3౮ ఇండియన్పేపరు పుటలు కలవు తోలుతో బైండు (అట్ట) చేయుంబడినది. ఐనను దీనితూనిక ఒకటిన్నర గ్రేయిసులు మాత్రము కలదట. ఒక

పోస్టేజిస్టాంపునందు పగము పరిమాణమునందు ననియు, సరియగుకొలత Six-Six-Tenths of an inch by Three-Sixteenths of an inch అని చెప్పఁబడినది. పుటలందు ముద్రింపఁ బడిన ప్రదేశము, ప్రతిపుటకును One Sixty eight of a square inch అనియు, ఏకు సావత్సరములు చాలమైన ముద్రింపఁబడినదనియు, ఆముద్రణము రాగిరేకులపై Photo engraving నుండి చిత్రించి ముద్రించిరనియు తెలిసెడిని.

**చిన్ని చెట్టు** - లా. Acalypha betulina దీనింగూర్చి యంతగా తెలియరాదు. కాని ఇది పాలచెట్టువంటి యొక జాతి చెట్టనియు, ఆకులు కోలగనుండి ఇంచుక సువాసనఁ గల్గి యుండు ననియు, దీని పూవులలోని మకరందమును తేనె టీఁగలు గొనిపోయి ఈచెట్టు లేక పాలచెట్టు తొర్రలందు జేర్చి నిల్వయుంచ నది బిగిసి ఎండి చిన్నిపూదేనె యనఁబడు (Crystal honey) పదార్థము అగుననియు, అవి పలుకులవలె గట్టిగను, అతిమధురముగను ఉండుననియు కొందఱందురు.

ఆకుల కషాయము శరీర తత్త్వమును బాగు పఱచి అగ్నిమాంద్యము నడంచి గర్భమందలి గుల్మము (బల్లెం) గరగించు గుణముగలదందురు. చిన్నిపూఁదేనెకు మధుశర్కర యనిపేరు. ఇది ఉన్మాదము, గ్రహణి, జ్వరము, మేహము, రక్తపైత్యము, వాతదోషము లడంచి బలమిచ్చు నని చెప్పఁబడినది. చాల విలువగలది.

**చిన్ని పూదేనె** (Christal honey)— బొర్రలు, తొర్రలు విడిచిన పాలచెట్లతోట పరిసరముల విస్తారము పూవులుగల తోటలుండునేని అనగా తేనె లభించు పూవులుగల చెట్లుండునేని తేనెటీఁగ లాపాలచెట్ల బొర్రలందు కూడ బెట్టిడిని. అవి అచట వెంటనే ఆరిపోయి తళ తళ లాడు పలుకులుగా నొడిపోయి యుండును. వానిబట్టి తెచ్చుకొనెదరు దానికి చిన్నిపూతేనె యని పేరు. ఇది చాల అపురూపపు వస్తువు. విస్తారము దొరకనే దొరకదు.

**చిప్ప గడ్డి** —ఇది గడ్డిజాతులలో నొకటి. తెలికగ నుండును. కారము, చేదు గుణముల గల్గి యుండుననియు, క్రిమిరోగము, జంతు వాతము మొదలగు వాతదోషములు, శ్లేష్మము, హృద్రోగముల శమింపఁజేయు శక్తి దీని కషాయమునకుఁ గలదనియు నందురు.

**చిమ్మపూడి అమరేశ్వర కవి** — ఆంధ్ర కవులందు పూర్వకవులలో పేర్కొనఁ బడిన వాఁడు. ఈతనిని సుప్రసిద్ధకవిగా అనంతామాత్యకవి, ప్రౌఢకవిమల్లన మొదలగు వారు తమగ్రంథములందు ఆదిని నుతించి పేర్కొని యున్నారు.

ఈతఁడు రచించినది విక్రమసేన మను పద్య కావ్యము. రా. బ. కందుకూరి వీరేశలింగం పంతులుగారు శ్రీ యమరేశ్వరుని నన్నయ తిక్కనల ప్రారంభ కాలమునఁగా ఎఱ్ఱాప్రగ్గడ కాలమునకో, కొంచెము తరువాతనో యుండిన వానినిగ తలంచిరి. ఈగ్రంథమును సరిగా దొరకుట లేదు.

**చిరకారి** - ఋషి. మేధానిధి కుమారుఁడు. తొందరపడక దూరాలోచనగల మొదటి వాఁడని చెప్పఁబడినది.

**చిరగడము దుంప చెట్టు** — ఇది బాగాళా దుంపలు బోలి యుండునుగాని నూపపై చిన్న చిన్న నారపోచలవంటి పోగులుండును. భోజన పదార్థము.

ఇది గురుత్వముగ నుండి ఇంచుక చలవజేసి శ్లేష్మమును ప్రకోపించును. ఇది కందమూలము దుంపలంత అపథ్యకారి కాదందురు.

**చిరంజీవులు** — ౧ అశ్వత్థామ, ౨ బలిచక్రవర్తి, ౩ ఆంజనేయుడు, ౪ విభీషణుడు, ౫ కృపాచార్యుడు, ౬ వ్యాసర్షి, ౭. పరశురాముడు వీరిని సప్తచిరంజీవులని యందురు.

**చిర్రతలిచెట్టు** — ఇందు తెల్లచిరుతలి, ఎఱ్ఱచిరతలి, నల్లచిరతలి యని మూడు భేదములు కలవు. అన్నియు నొకేగుణమని తెలియుచున్నది. చెక్క చూర్ణముగను రసముగనియు, కషాయము పెట్టియు వాడుదురు వేడిచేయును. వాతమును శూలరోగములను హరించును

**చిరాయువు లేక శతాయువు** — అత్రిసంతతి చంద్రవంశక్షత్రియుడు పురూరవ చక్రవర్తి కుమారుడు సోదరులు ఆయువు, ధీమంతుడు, అవవసుడు, శ్రుతాయువు అనువారలు.

**చిర్రాపుంజి** — షిల్లాంగు నుండి ముప్పదిమూడుమైళ్లు దూరమునందు చిరాపుంజి కలదు. ఇది Wettest place in Asia అని చెప్పబడు తావు. సగటు ౪౫౦ అంగుళముల వర్షము కురియుచుండును. కాని నేడది చిరాపుంజియందు వర్షించుచున్నదనియే చెప్పవలయును. క్రీ. శ. ౧౮౬౧ లో ౯౦౫ అంగుళముల వర్షము కురిసినదని లెక్కింపబడినది. తొల్లి యొకప్పుడిది ఖాసి జయంతి పర్వతసీమలకు ప్రధానస్థానమై యుండెను. వర్షాధిక్యముచే ప్రభుత్వోద్యోగుల కచేరీలు షిల్లాంగునకు మార్పబడియెను. చిరాపుంజి కొండలతొత్తుగా పైకిలేచి వర్షపుగాలుల నడ్డగించుచుండును. ఈ తావుచుట్టు పల్లపుప్రదేశములగు కొండలోయలు కలవు. దట్టముగ పెరిగిన అరణ్యసీమలయందు మై గానవచ్చెడిని. ఎత్తగు తావులనుండి చూచిన నిక్కట్టు సమతల మగుపడియెడిని. చిరాపుంజి వర్షాధిక్యతకు పేరొందినది.

**చిరింజి (పప్పు) చెట్టు** — వేడి చేయును. దేహపుష్టి, వీర్యపుష్టి జేసి మేహశాంతి గల్గించును. దీనికి కరక్కాయ పిందెలు విరుగుడు.

**చిరివేరు చెట్టు** — లా. Olden Landia umbellata. ఆంగ్ల. Chayroot plant, Indian madder. దీనిని సిరివేరు అనుటయును గలదు. దీనివేరునందు గాఢమగు రంగుకలదు కావున బట్టలకు రంగువేయుదురు ఈ చెట్టు ఆకులు కోలగనుండి నేలప్రాకునట్లుండునని చెప్పబడినది దీని సమూలరసము లేక కషాయము లేక చూర్ణము శ్లేష్మమును వెడలించి ఉబ్బసపుదగ్గు, కాస, శ్వాస, క్షయరోగముల శాంతింపజేయును జలుబు, సమస్త విషములు, సమస్త చర్మరోగములు నివారించును. ఉబ్బసమునకు దీనిఆకుల నెండించినచూర్ణము గోధుమ పిండియందు చేర్చి రొట్టెలు గాల్చిపెట్టుదురు. చిరివేరు రంగుబట్టలు హేమంత శిశిరఋతువులందు అనుకూలముగ నుండుననియు, శ్లేష్మమును, వాతమును అడంచుననియు జెప్పబడినది.

**చిర్రికూరచెట్టు** — లా. Amaranthus campeotria. సం. గ్రంథిలః, తండులః. దీనియాకుకూర వేడిచేసి త్రిదోషముల నడంచి నేలికను అగ్నిదీప్తిని కల్గించును. దీనిరసము లేక సమూలకషాయము, అందు ముఖ్యముగ వేరు రసము విషరక్తమును శుభ్రపఱచి రక్తపైత్యమును, వాతమును హరించును. తత్వమును మార్చి మూత్రబద్ధము, రసదోషమును, వసనాభి విషమును హరించి ఆకలిని హెచ్చించి నేత్రములకు బలమొసంగునని చెప్పబడినది. చంద్ర చెక్క చూర్ణము, పెరుగు దీనికి విరుగుడులు.

**చిరోగ్రాఫీ (Chirography)** — వివిధములగు దస్తావేజుల మామూలువిధానమున

వ్రాయు నేర్పు (కళ) అనగా దస్తావేజులను వ్రాయువిధానముల నన్నింటిని ఎఱింగియుండుకళ.

**చిరోపోడీ** (Chiropody) — కొన్ని శరీరవ్యాధులం గుదుర్చుటకు చేతులకు, కాళ్లకు ఔషధములనంటించి కుదుర్చు వైద్యవిధాన కళ

**చిరోమేన్సీ** (Chiromancy) లేక (Palmistry) — హస్తసాముద్రికము. దీనిని Palmistry అనియు నందురు. హస్తమునందలి రేఖలుబట్టి ఫలములను, గుణదోషముల నెఱుంగ జేయు కళ.

**చిలకతల్లి** (బంగారుతల్లి) — ఈరెండు పదములు బుద్ధిమంతురాలగు ఆడపిల్లను హెచ్చరించుటకు ' ముద్దు మురిపెములతో వాడుచుందురు.

**చిల్టన్హండ్రెడ్సు చీపు కనిష్టేబిల్ పదవి**—బ్రిటీషు పార్లమెంటు సభ్యులు పదవి. రాజీనామా సాంప్రదాయము చూడుడు.

**చిలుక (కూర) చెట్టు**-లా Hingtsha repens. ఆంగ్ల Olus plant. సం హిలమోచిక యని కొందఱనెదరు. అగునేని ఇది బ్రహ్మిలో భేదము గావలయును లేక జలబ్రహ్మి యను పేరు గావలయును ఇది సరిగా దెలియరాకున్నది.

దీని సమూల రసముగాని, కషాయముగాని, సర్వదోషముల హరించుననియు, ఆకలి, బుద్ధి బలపడుననియు, కడుపులోని బల్లలు, జ్వరములు, నివారణమై శరీరత్రాణ బలపడుననియు నందురు. చిలుకకూర చెట్టు తెల్లనిది, ఎఱ్ఱనిది, నల్లనిది యని త్రివిధ భేదములు. అన్నిటికీ గుణమొక్కటియే. కొందఱు దీనిని కూరగ వండి తినెదరని తెలిసెడిని.

**చిలుకపలుకులు** — చిలుకలు పలుకుట మనతో సంభాషించుట యని కొందఱు తలంచి భ్రమపడుచుందురు పరిశీలించిన నిది భ్రమయెగాని నిజముకానేరదు. చిలుకలు ఒక ధ్వనివంటి ధ్వనిని తాపులను పలుకనేర్చుకొనగలవు ఈశక్తి దానికి మనుష్యులంబోలిన నాలుక జిహ్వేంద్రియ ముండుటవలన గల్గునది గాని మనుష్యులవలె దానికి మేధావయవము లేదు కాన దానిమాటలు దానికే



యర్థముకాకుండ ఇతరులవలెనె పల్కు Imitation పల్కులుగాని సాభిప్రాయాన్వయముం కల మాటలుకానేరవు. కాని చిలుకలు చాల ముదిరిన పైని తాను మాటాడినచో తనకు మంచి యాహారపదార్థముల నిడుదురనియు, ఇతరులు తన మాటలకు వినోదింతురనియు, కొంతవరకు గ్రహింపగలుగును. అట్టితఱి తన కలవడిన మాటలనన్నిటినిగాని జ్ఞాపకమునకు వచ్చిన గొన్నిటింగాని వచించును అందేమాటలైనను ప్రమాదవశమున కాకతాళీయముగ సమయోచితములు సందర్భానుసార వచనములగునేని చిలుకమాటల కర్థయుక్తమని తలంచి యెన్నోకింతురు.

**చిల్లికుండలో నీళ్లు నింపడము యిల్లంతాకారడానికిగాని కుండ నిండడమునకు గాదు** — ఆంధ్రలోకోక్తి.

**చిల్లిగవ్వను వెతకబోయిన తఱి చింతామణిజీవరత్నముదొరకినట్లు**- ఆంధ్రలోకోక్తి.

**చిలుక ద్వాదశి**-కార్తిక శుద్ధ ద్వాదశి క్షీరాబ్ధి ద్వాదశి చూడుడు. పండుగలు చూడుడు. యోగీశ్వర ద్వాదశి చూడుడు.

**చీకటికొన్నాళ్లు వెన్నెలకొన్నాళ్లు**- ఆంధ్ర లోకోక్తి.

**చీకటి మ్రాను** — తమాలవృక్షము చూడుడు.

**చీకటిలో జీవరత్నపరీక్ష** — ఆంధ్ర లోకోక్తి.

**చీట్ల పేక ఆట** (Playing Cards)— ఆంధ్రదేశమున చీట్లపేకఆట మిక్కిలి వ్యాపించియున్నది. చాల అందమైన పేకదస్తాయందు 52 ముక్కలుండును. ఇవి నాల్గు తెగలుగ నుండును. పదమూడు పేకలు గల్గియుండును. ఇస్పేటు (Spade), కళావరు (Club) అను రెండు తెగలును, నల్లని గుర్తులు గల్గియు. డైమను (Diamond) ఆఠీను (Heart) అను రెండు తెగలు, ఎఱ్ఱని గుర్తులు గల్గియు నాల్గు తెగలుగ నుండును. ప్రతి తెగయందును పదమూడుముక్కలలో రాజు (King), రాణి (Queen), జాకీ (Jack or knane) అను మూడు పేకలును, పది, తొమ్మిది, ఎనిమిది, ఏడు, ఆరు, ఐదు, నాల్గు, మూడు, రెండు, ఒకటి గుర్తులుగల పేకలుగలవని పద మూడు పేకలుగలవు. ఒక గుర్తుగల పేకను ఆసు (Ace) అనియు నందురు. ఇది అన్నిటికన్న గొప్పది. అటుగా రాజుకన్నను ఎక్కువ విలువగలది.

పేకలాట కొంతవరకు ఆంధ్రదేశమునకే ప్రారంభమైన క్రీ. శ. పదునాల్గవ శతాబ్ద మధ్య కాలమున ఐరోపాదేశములోనికిగూడ చేర్పఁబడినదని వాడుకగలదు. పేకలను అనేక పేర్లతో ననేకవిధములుగ వాడుదురు. బ్రిడ్జి ఆట యనియు, వేలం ముక్కాట నాల్గు ఆటయనియు (Auction Bridge) పోకరుఆటయనియు, విష్టు (Whist) ఆట యనియు. మీనాపు (రన్నాము) ఆటయనియు, ఎత్తుల్లు, అడ్డాట, ఏను ముగాడు రెండుపల్లాట, లంకన్ ఆసు, లిటరేచరు, తమలపాకు ఆట, క్లియరెన్సు ఆట, నోట్రంపు ఆట, కోడిగ పక్షి ఆట (దీనినే రహితాస్ ఆట) మొదలగు విధానముల ఆటలెన్నియోకలవు.

**చీనా తురుష్కస్థానము** (Eastern Turkistan) ఇది టిబెట్టుదేశమునకు వాయువ్య దిశగానున్న తురుష్కస్థానభాగము తియనుషానుకు దక్షిణమున నున్నది. ఇది యొక గొప్ప పీఠభూమి. తూర్పువైపు తప్ప తక్కిన దిశలందు ఎత్తగు పర్వతములచేఁ జుట్టఁబడినది. ఈ దేశపు వర్తకమంతయు కార్వానాపై నడచుచుండును. దేశమున యార్కండుపురము కాష్గారుపురము వర్తకస్థానములు.

ఒకప్పుడు యాకూబ్బేగను మహమ్మదీయుడు కొంతమంది గడేకామజనులు గూర్చుకొని హఠాత్తుగా చీనాయుద్యోగులపైఁబడి మడియించి తాను ప్రభువునని కొంతకాలము దీనినేలి తాను సుల్తానునని ప్రకటించుకొను యదవుస చంపి వేయఁబడియెను. దేశము తిరుగ చీనావారి రాజ్యమునచేరి వారిచే పరిపాలింపఁబడు చున్నది. (తురుష్కస్థానము చూడుడు.)

**చీనాదేశపు గొప్ప గోడ** — (Great wall of China) ఇది మధ్యకాలములందు ప్రపంచమందలి గొప్ప వింతలలో నొకటిగ నెన్నఁబడినది. పొడవు ౧౫౦౦ మైళ్లనియు, దీనియందలి Loops మఱియొక వేయిమైళ్లుండు ననియు, ఇరువదియైదు వేల కావలిగోపురము లుండెననియు చెప్పఁబడినది. క్రీ. ము. మూడవ శతాబ్దాంతకాలమున, ట్సిన్ భూపతియగు ఘిన్ చెంగు చక్రవర్తి దీని నిర్మింపజేసెనట. ఆయనకు షీహ్వాంగ్టీ యని వాడుకపేరుండెనట. ఉత్తరదిశనుండి వచ్చు దోపిడిగాండ్రగు తార్తా

రులనుండి ఈ దేశమును రక్షించుటకు దీనిం గట్టించెనట. ఇప్పుడు పాడగుచున్నను ఎక్కువ భాగము బలవత్తరమై నిలిచియేయున్నది.

**చీనాదేశపు ప్రభుత్వము** - ఆసియా ఖండములోని ప్రజాప్రభుత్వదేశము. నలుబది రెండులక్షల డెబ్బదియేడు వేల చతురపుమైళ్లు వైశాల్యమనియు, నలుబదియొకకోటి నలుబది లక్షల పదునొకండువేల ఆరువందల జనసంఖ్య యనియుం జెప్పఁబడినది.

**చీనాదేశపుసామెతలు** — అమ్మట మనస్సులో నుంచుకొని అవస్తువును బేరమాడవలెను. ఆపదలగాధములు సంతోషము చాల మెరక. ఆలస్యంగాచేసేదే అందమైనపని. ఇరుగు పొరుగులం జూచుకొని ఇంటిలో కాపురము చెయ్యవలెను. ఎలుగుబంటినల్లగానున్నదని కాకి వెక్కిరించినదట. ఏసూదికీ రెండుమొనలుండవు. ఒక కుక్క దేనినోచూచి యరిస్తే తక్కినకుక్కలు దాన్నిచూచి అఱవడం ఆరంభిస్తవి. కడివెళ్ళయినా భూమిలో మిగిలితే గతికి చిగర్చక మానదు. కనకమే మంచిదైతే కాల్చుకు నెడుస్తుందా? కజ్జగంట కంగున మ్రోగెది కాదు. కష్టపడి సంపాదిస్తూంటే కడుపునిండా తింటూ ఘనంగా బ్రతకవచ్చును. కాగితము, కలము, సిరా కూడ ఖడ్గమువంటి ఆయుధములే నని నమ్ము. గొప్పమాటలు గోడలు దాటవుగాని, చెడ్డ వార్తలు జగమంతా ప్రాకుతవి. చంద్రునికి గుండ్రదనము, జలదము (మేఘము) లకు స్థిర నివాసము ఎంతకాలముండునవి? చమురులేని దీపములోనివత్తి చరచర కాలిపోతుంది. చవకగా దొరికేవి మంచివవుతాయా? మంచివి చవకగా దొరకుతాయా? దారులెఱింగినవాడు దూరం తిరగడు. నవ్వుముఖంలేనివాడు అంగడికిఅర్హుడు కాడు. నావలందేల్చేదీనీరే ముంచేది నీరే. నోరు తెఱవడంకంటె చెవులు తెఱవడం శతధాలమేలన్ను. పటాలములంటించుట పగవారిగూడ్ల కప్పజెప్పుటకే. పుట్టినవారు చచ్చినవారు పుణ్యపురుషులన్నట్లు. పెద్దకెరటములవెన్క చిన్నకెరటముల వలె పెద్దవారివెన్క చిన్నవారు ముందుకువచ్చుచుందురు. పెద్దచెట్లకు సుడిగాలి పెనుభూతము. మనతప్పు లితరులవలన మనమెఱుంగుట సుకరము. ముసలితనమునకు చకాపుకుంటున్నా ముగిపక దకలేము. మూగకు అంగడులలో బేరమాడి ధా కనుక్కుంటే మూర్ఖుడైనా మోసపోడు. మేఘములు చెదరిపోయినా వర్షపునీరు నిలిచియే యుండును. సేవకు లింటిలో లాన్నైతే చేసేపరు లూడిపోవుట తప్పనిదే.

**చీనాదేశము** (China Proper) — ఆసియాఖండమున చీనామహారాజ్యములోని యొక దేశము. బహుశః ఇండియాదేశమంత వైశాల్యము గలదనియు, అంతకన్న జనాభా యెక్కువ యుండుననియు తెలుపఁబడుచున్నది. దేశము పవగాలలోయలుకొండలమయమై, ఎక్కువ భాగము వ్యవసాయముక్రింద నున్న దేశము. దేశము పశ్చిమమునకు ఏటవాలుగ నుండును. పర్వతశిఖరము లెప్పుడు మంచుతో గప్పఁబడి యుండునవి ఉత్తరమున పెల్లింగుపర్వతములు, నాన్లింగుపర్వతములు దక్షిణమునను గల ముఖ్యములగు పర్వతపఙ్క్తులు. చీనాదేశమున పెద్దనదియగు గూంగ్సీ లేక, యాంగ్సికీయాంగునది పూర్వవాహినియై యెల్లోసముద్రమున సంగమించును. హోయాంగ్హోనది అనేకసారులు తనప్రవాహమును మార్చుచు, తనవఱదముంపులచే దేశమునకుఁ గొప్పనష్టములం గల్గించుచున్నది. ఇప్పుడు పేఛిల్ సంయుక్తాగ్రగుడమున సంగమించుచున్నది. దీనిని చీనావారు చీనావారి దుఃఖప్రవాహ మనియెదరు.

పీ-హో-హానది (తెల్లనది) ఉత్తరమునకుం జని అదియు పిఖిల్ సంయుక్తాగ్రగుపమునంగూఁ జేయుకొనుచున్నది దక్షిణమున కేంటన్నది కలదు. పీకిన్నది మొదలు యాంగ్సీనదివఱకు ఒక పెద్ద కాలువ త్రవ్వఁబడినది కలదు అది 200 మైళ్ల పొడవు గలది. ఇది ప్రపంచమున నెక్కువ పొడవైన కాల్వయనెదరు. చీనాప్రజలు విస్తారము మంది పడవలయందే నగరులపైఁ గాని, కాలువలం గాని, సముద్రమునఁ గాని జీవించుచుందురు వారి సామెతగా ఎన్నుట సుప్రసిద్ధము

ఉత్తరభాగములందు చలి యధికము దక్షిణ భాగములు వేడిగానుండును ఎట్లున్నను శీతోష్ణములు రెండును అధికములుగనే యుండును దేశము North Temperate zone నందుండుట శీతోష్ణతులు స్పష్టములుగనే తెలియును. ఎల్లెడల దక్షిణమున ఉష్ణాధిక్యతయు, అప్పటప్పుడు వీచుచుండు సుడిగాలి, తుపానులును, దేశమున ముఖ్యముగ కన్పడగలవి ఉత్తరమున శీతలాధిక్యముచే పీ-హో-హానది వెంట మూడు నెలలు మంచుగా బిగిసిపోయి యుండును.

చీనాదేశమున రాక్షసబొగ్గుగనులు విశేషముగ కలవు. ఒక్కతావున రాక్షసబొగ్గుగనుల ప్రదేశమొకటి 20,000 చతురపుమైళ్ళది కలదని చెప్పఁబడినది. ఇది ప్రపంచమున పెద్దరాక్షసబొగ్గు ప్రదేశము కాయోలిన్ అను పేరుగల చీనామన్ను (China clay) చీనా సామానులు చేయుటకుపయోగించునది చాల విలువగల గనులు కలవు నాగిగనులును, జింకు (తుత్తనాగము) గనులు, పాదరసము గనులు పశ్చిమపు కొండలందు సమృద్ధిగ నున్నవి. ఇనుపగనులు దేశమున విస్తారముగ నిడివఱకే కలవు. ధాన్యము, తేయాకు దేశమున ముఖ్యమైన పంటలు, పత్తి, చెఱకు, నీలిమందు, దక్షిణమునను; గోధుమలు, బార్లీ ధాన్యము, జొన్నలు, ఉత్తరమునను కొంతవఱకు పైరుచేయఁబడుచున్నవి. భూమి సారవంతమై జలముగల్గియుంట, పంటలు జనబాహుళ్యమునకు సమృద్ధియనిపించుచుగాని లోపముండదు. వెదురు దేశమంతటను సమృద్ధిగగల్గి మిగుల నుపయోగించుచున్నది. చీనాదేశపు కాగితములు వెదురుతోనే చేయఁబడుచుండునవి. క్రొవ్వొత్తులకు క్రొవ్వును, కర్పూరపు చెట్లనుండి కర్పూరమును విస్తారముగ దేశమున చేయఁబడుచున్నవి. చీనాదేశము ఎక్కువ వ్యవసాయదేశమట అడవి మృగములు నశించిపోయినవి. పందులు, చేపలు ఆహారపదార్థములు విస్తారము పెంచఁబడుచున్నవి గుఱ్ఱములు చాలతక్కువ. పశువులును సమృద్ధిగలేవు. బంగారుచేపలు, వెండిచేపలు, (Gold fish, Silver fish) ఈదేశము మాతృస్థానముగగలవియె చీనావారు మంగోలియా జాతి చెందినవారు, మంగోలియా తెగవారు నైయున్నారు. గట్టివారు, బుద్ధిమంతులు, పని పాటులందు ఓపిక శ్రద్ధకలిగి నిష్ఠగలవారు. పొదుపు, మితవ్యయములుగల్గి, తృప్తితో మెలంగువారు పూర్వాచారపరులు

చీనాభాష Monosyllabic భాషగ చెప్పఁబడినది. అనగా ఒక ఊతయందొకొకటి నుచ్చరించదగిన మాటలుగల్గినది. కాని ఉచ్చారణలు, మిశ్రిత ఉచ్చారణల మయమైయుండును. ఇతర భాషలందువలె నీభాషయందు పెద్దమాటలు స్వతంత్రముగ నర్థమిచ్చునవి యుండక మాటల సంపుటుల వాక్యములుగనుండును. మఱియు నీ భాష నిలువునా పఙ్క్తులను వ్రాయుదురు. చీనావారాదికాలముననే విస్తారము నాగరికులైరి. అచ్చుయంత్రములు, కాగితములు యూరోపుదేశముల కెఱుకఁబడనికాలముననే వాడుచుండిరి. మేరినర్సు కంపసు (దిక్కులజూపుయంత్రము) ను కనిపెట్టి

చేసినది చీనావారే. విద్యాధికులు వీరియందు కలరు. ఐనను పనిపాటులం జేయుటకు ఇతరజాతులవలె లజ్జపడి తమగౌరవమునకు తక్కువయని తలంపరు. ప్రభుత్వ మిటీవల రిపబ్లికుగా జేయంబడినది. వెనుకటి ప్రభుకుటుంబము మాంచూ జాతివారుగ నుండిరి. వెనుక Great Wall of China ఈదేశమునందే నిర్మింపఁబడినది (చూడుఁడు)

క్రీ. శ. ౧౮౯౪ లో చీనా జపానులకు కలహము లుకల్గి ఫార్మోజా ద్వీపమును, పెస్కాడోర్సు దీవులును, జపానువారిచేతంబడెను పిదప మరి కొన్ని దీవులు, భూములు, ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సుల పాలయ్యెను. రష్యాఈదేశముపైకి న్నవైచి యుండినట్లుండెను. క్రీ. శ. ౧౮౪౨ లో వర్తకపురేవులందఱికి తెరువంబడియెను. చీనావారు బౌద్ధమతస్థులు. కంఫ్యూషియస్ మతమీదేశమునే జనించినది (కంఫ్యూషియస్ మతము చూడుఁడు). పట్టునేతపని పోర్సిలెయిన్ సామానులు చేతపని, లక్కరంగు పూతపని (Lucquered ware work) వీరిదేయని చెప్పవచ్చును. ప్రపంచమున ఆకనులనేర్పునందు వీరిని మించినవారు లేరందురు. చీనాదేశము పరిపాలనకు పదునెన్మిది ప్రోవిన్సులుగా జేయంబడినది

పీకిన్ నగరము దేశమున ముఖ్యపట్టణము. పీకిన్ననిన ఉత్తరపు రాజస్థానమని యర్థము. పీహెయో నదీతీరమున ఏడులక్షలు జనాభా యనెదరు. ఇది తార్తారు నగరము, చీనానగరము నను రెండు పురములుగ నున్నది. తార్తారు నగరమునను తొల్లింట రాజనివాస భవనములు, ఉద్యానవనములు ఉండెను. తొల్లింట నిది చీనారాజ్యమున కంతకు రాజధానిగ నుండిన నగరము. వర్తకస్థలము. దీనికి పియిహోనదీతీరమున నేయున్న టీన్సిన్పురము రేవు స్థానము. ఇందు లక్షజనులు కలరు టీన్సిటను కాగ్నేయమున కడనేయున్న చిఫూపురము వర్తకస్థానము

హాంకోనగరము- ఇది యాంగ్సీనదిపై నున్న రేవుపట్టణము. గొప్ప వర్తకస్థలము సముద్రమున నడచు ఓడలు ఇచ్చటికి నదియానుగాగల లోతున్నది గాన నిచటకు వచ్చును. ఇచటికి సముద్రమేడువందల మైళ్ళుండును. హానునది యాంగ్సీనదిలో నీ పురముకడనే సంగమించును హానునదికిని, యాంగ్సీనదికిని నడుమ సంగమము కడ హియాంగ్యాంగుపురము కలదు అదియు వర్తకస్థానమే. హాన్యాంగనిన సంగమమునియర్థము. హాంకోనగరము కెదురుగనే యాంగ్సీనది కవ్వలి తీరమున వూచాంగనాబడు పెద్ద పట్టణముకలదు. అదియు వర్తకమునడచు తావుగనే యున్నది. యాంగ్సీనదియందు ముఖద్వారమునుండి వెయ్యి మైళ్లవరకు ఓడలు నడచును. అట ఇఛాంగను పురమున్నది.

షాంగ్హై నగరము- విదేశవర్తకస్థానము. ఐరోపా వర్తకు లిట విశేషముగ గలరు. నాల్గు లక్షల జనులుగల వర్తకస్థానము

నాన్కింగుపురము- ఇది తొల్లింటి చీనా మహారాజ్యపు రాజధానిగ నుండినది. నాన్కింగనిన దక్షిణరాజస్థానమని యర్థము బట్టలనేత అధికమై పేరందియున్నది

కేంటను పురము- దక్షిణముగా నున్నది. వర్తకస్థలము. విదేశవర్తకమిట నధికము. ఆంగ్ల వర్తకులున్న తావు. ఇది కేంటనునదీ ముఖద్వారమున నున్న పురము. తేయాకు వర్తక మిట యధికము.

ఇంకను అమోయిపురము, ఫూచౌపురము (ఇది ఫార్మోజాద్వీపమున కెదురుగ నున్నది), నింగ్పోపురము (ఇది చూసాన్ ద్వీపమున కెదురుగ నున్నది, ఇట పట్టువర్తక మధికము),

చీమలు కూడ కలవని తెలియుచున్నది. చీమలందు పట్టుదలయు, శ్రద్ధ, బాధ్యత మెండు. తెల్లజాతి చీమలను చెదయందురు. ఎఱ్ఱజాతికి పుల్లెలందురు. నల్లచీమలు పెద్దవి. చలిచీమలను పేకొకజాతి పిరికిజాతి చీమలందు చచ్చినవాటి మాంసముందినివేయు ఆచారముకలదని చెప్పఁబడినది.

**చీలకుల గోత్రము** — చిలకుల చూడుఁడు.

---

**చుంబనములు** — కామశాస్త్రము చూడుఁడు.

**చుక్కినది** — శుతుద్రీనది చూడుఁడు.

**చుట్టములకు దూరము, నీటికి చేరువ చాలా శ్రేయస్కరము** — ఆంధ్రలోకోక్తి.

**చునార (దుర్గము) పురము** — కొల్లింటి చరణాద్రి పర్వతముకడ నున్న చునార్ పురము.

---

**చుటియానాగపూర** — ఝూరఖండదేశము చూడుఁడు, ఛోటానాగపూర్ చూడుఁడు.

**చూడచుట్టము మ్రొక్కదేవము లేనట్లు** — (దీనావస్థయునిభావము). ఆంధ్రలోకోక్తి.

**చూడచుంచు, చేసేవిపందికొక్కు చేష్టలు** — ఆంధ్రలోకోక్తి.

**చూడగా చూడగా గుఱ్ఱం గాడిదగా మారినదట** - ఆంధ్రలోకోక్తి.

**చూళి**-ఋషి. బ్రహ్మదత్తుని తండ్రి. (కన్యాకుబ్జము చూడుఁడు).

**చూళిక భాష** — పైశాచికభాషలోని భేదము. అష్టభాషలలో నొకటి. (భాష ఎన్నివిధములు చూడుఁడు).

**చూళికాపైశాచి భాష** — షట్ప్రాకృతభాషలలో నొకటి. (ప్రాకృత భేదములు చూడుఁడు).

---

**చెంగల్పట్టు జిల్లా** — ఆంధ్రదేశము లోను, అరవదేశములోను నున్న జిల్లా. కాంచీపురము పెద్ద పట్టణము, గొప్ప క్షేత్రమునై యున్నది. చెంగల్పట్టు న్యాయస్థానములున్న తావు. (సైదాపేట చెన్నపట్టణముకసనే యున్నది). కలెక్టరున్న తావు. తిరుకళికుండ్రము (పక్షితీర్థము) సుప్రసిద్ధ క్షేత్రము. పల్లవరము, సెంటు తామస్మౌంటు చెన్నపురియొక్క సైన్యస్థానములు. పులికట్టు సరస్సుతీరమందున్న పులికట్టు, చదురంగపట్నము (పూర్వము డచ్చివారిది), పొన్నేరి (మహావలిపురము) యితరపట్టణములు. దీనిని సెవెన్ పెగోడాసు అనుచున్నారు.

**చెంగలికోష్టు చెట్టు** (చెంగల్వకోష్టు)- లా Aplotaxis auriculata అనియు Sausseerea lippa ఆంగ్ల Costus సం. కుష్ఠః, పాకజా, పాకలం, వాభిభద్రకం, వారిభవ్యకమ్ దీనికి చెంగలికోష్టనియు, చెంగల్వకోష్టనియు, కోష్టనియు కూడ వాడుకపేర్లుకలవు దీనివేరును జెంగల్వకోష్టని యందురు. చూర్ణము లేక కషాయము ఇంచుక సుగంధముతో నుండి వేడిచేసి త్రిదోషములను హరించును. ధాతుపుష్టి, వాతముజేసి, దోషజ్వరము (Typhus fever) పై చక్కగ పనిజేయును. మఱియుఁ గుష్టు, జ్వరములు, దద్రు (దురదలు), మూల వ్యాధి, విషదోషము, విసర్పి వీటి నడంచును.

**చెకుముకిరాయి** — దీని నినుపబిళ్లతో కొట్టిన నిప్పురవ్వలుకల్గి ఎగురును. చెకుముకి రాయి చాల గట్టిరాయి గాన నినుముతో సంఘట్టనమున రాతిదెబ్బయొక్క వడి నినుమునం దగ్నిగామారి యట్లు వెడలుచుండునని కనిపెట్టఁబడినది. కాలినదారముల గుంపును దీనికడకుం జేర్చి అందాయగ్ని పడంజేసి దానిని చుట్ట కాల్చుట మొదలుగాగల పనులకు ఆదికాలము నుండియు నుపయోగించుచున్నారు. అగ్గిపుల్లలు లేనికాలమున దీనివాడుక యధికముగ నుండెను.

**చెక్కు** (Cheque) — పద్ధతులమేరకు చెక్కు అనగా Bill of exchange అని భావము. తనిఖీచేయఁబడిన లెక్కయని యర్థము బాంకి లేక ట్రెజరీలగుండా సొమ్ము ఒకరినుండి ఇంకొకరి వశమగును.

**చెక్ లేక చెక్కు**-Cheque (వాణిజ్య సంబంధపరిభాషాపదము)-Chequeలో వివరింపబడిన సొమ్మును వివరింపబడిన ఆసామీకి గాని ఆతనిఆర్డరు పొందినవారికిగాని యిమ్మని ఒక Banker పైకి వ్రాసిన ఒక Order పత్రము. ఇట్టి చెక్కుపై ఐమూలవాటమున "& Co." అని వ్రాసినదానిని Crossed Cheque అనియెదరు. ఇవి రెండువిధములు. ఊరకనే & Co. అని వ్రాయఁబడినది General Crossed Cheque అనియు, ఫలానా బాంకి అని వివరించి & Co. వ్రాసిన Special Crossed Cheque అనియు నందురు. Crossed Cheque ఒక బాంకివారిద్వారా వసూలు కాబడవలయుంగాని అన్యత్రా వీలుండదు. వివరింపఁబడిన సొమ్మును యిది తెచ్చువానికి Bearer యిమ్మని వ్రాసిన చెక్కులకు Cheque to bearer అని పేరు.

**చెట్టు ఎక్కించి నిచ్చెన తీసివేసే మహాత్ముఁడు** — ఆంధ్రలోకోక్తి.

**చెట్టు చెడేకాలమునకు కుక్క మూతిపిందెలు** — ఆంధ్రలోకోక్తి.

**చెట్టునరికి వెనవేసుకొన్నట్లు**— ఆంధ్రలోకోక్తి.

**చెట్టు నాటినవాఁడు నీరు పోయఁడా?** — ఆంధ్రలోకోక్తి.

**చెట్టుముందా విత్తుముందా?**— (లోకమునకు గల్గినది అని భావము.) ఇది తేలని మొండివాదమని భావము.

**చెట్లెక్కు చేపలు** — సింహళద్వీపపు తూర్పుతీరమున, ఒకతంపరయందలి ద్వీపమునం దున్న బట్టికాలోవాపుర పరిసరసీమలందు ఈజాతిచేపలు కలవనియు, అవి ప్రాకుకొనుచు నీటినుండి వెలికివచ్చి పరిసరములనున్న రాళ్ళపైకి చెట్లపైకి నెగప్రాకుననియు, చెప్పంబడినది. ఆంధ్రమున చేపలు చెట్టెక్కినవను ఉక్తిని వాడుచుందురు.

**చెట్టెవంగనిది మ్రానై వంగునా?** — ఆంధ్రలోకోక్తి.

**చెట్లకొమ్మలు** - చెట్లు తమయాకుల గుండా సూర్యరస్మి సహాయమున Carbon Dioxide అనంబడు వాయువును పీల్చుకొన వలసియుండును. కాన ఆరోగ్యకరమగు వృక్షము తనకు వలసినంత కార్బనాయువును గైకొనుటకు తనబలమునకు వీలగునన్ని యాకులను గల్గించుకొనుచుండును. ఈయాకు లన్నియు కొమ్మలయందుండుటచేత నాకొమ్మలను వీలగునంత ఎక్కువమొత్తము దుండునటుల వ్యాపించుటకు వలయుతావులు గల్గించుకొనునని తేలుచున్నది. ఇది నైసర్గికముగ గల్గియుండవలసినస్థితి.

ఇంక గాలిపాటులు, రోగములు, ఆటంకములు మొదలగువాటికి లోబడియే ఈపరిస్థితులు చెట్టులకుం గల్గుచుండునని తలంపవలయును. వేర్వేరు జాతులచెట్లకు వేర్వేరు విధానముల కొమ్మలుంటగాని, కొమ్మలే లేకుంటగాని స్వతస్సిద్ధస్వభావమై యుండును. ఏది ఎట్లున్నను ఆకులు ఎండ వీలగునంతపూర్తిగ ననుభవించు [illegible] దీని ప్రధానధర్మముగ తలంప [illegible]

**చెడిపోయినవానికిచ్చినగోవును దానమిచ్చినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**చెడి స్నేహితునింటికి జేరవచ్చుం గాని చెల్లెలింటికి చేరరాదన్నట్లు** — ఆంధ్రలోకోక్తి.

**చెదుబాద్వీపము** — లోవరు బర్మాదేశము చూడుడు.

**చెన్నమరాజు చెన్నమరాజు కవి** — ఆంధ్రకవులలో మధ్యకవులందు పరిగణింపఁబడినవాఁడు. నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు, ఆత్రేయసగోత్రము, తండ్రి శేష మామాత్యుఁడు. కవి పెమ్మసాని తిమ్మరాజున కాశ్రితుఁడు. తిమ్మరాజు ఆర్వీటి శ్రీరంగరాయులకడను, పిదప వేంకటపతిరాయులకడ మంత్రిగ నుండినవాఁడు. కవియొక్క ముత్తాత లక్ష్మీపతి. శ్రీనాథమహాకవి శిష్యుఁడని చెప్పుకొనెను.

రచించినది చారుచంద్రోదయ మను ప్రబంధము. ఈతని కాలము క్రీ. శ. ౧౫౭౪-౧౬౧౪ మధ్యనని తేలుచున్నది.

**చెన్నరాజధాని రాజ్యము** — దీనిని చెన్నపురిరాజధానియనియు, ఆంగ్లభాషయందు మెడ్రాసుప్రెసిడెన్సీయనియు, ప్రభుత్వోద్యోగులు ప్రెసిడెన్సి ఆఫ్ ఫోర్టుసెయింటు జార్జి యనియు వాడుచున్నారు. ఇండియాదేశమునకుం దక్షిణపుకడనున్న దేశము. ఇందు ఆంధ్రదేశము, అరవదేశము, కన్నడదేశము, మళయాళదేశముచు భాగములుగ కల్పింబడినవి. వైశాల్యము ౧౪౧,౦౦౦ అని చెప్పఁబడినది. సముద్రతీరపు పొడవు ౧,౭౦౦ మైళ్లుండునని చెప్పుచున్నారు. ఇందు కొంతభాగము దక్కన్పీఠభూమియుంగూడ కలసియున్నది. తూర్పుకనుమలు పడమటికనుములు (పూర్వాచల, సహ్యాచలములు), ముఖ్యపర్వతములు. ఇవి దక్షిణమున పళనికొండలయందు

కలియును. అందే ఉదకమండలమను సుప్రసిద్ధ సమశీతోష్ణప్రదేశము కలదు. ఆపర్వతమునకు నీలగిరియని ప్రత్యేకనామము కలదు. ఇట్లే వీటి వేర్వేఱుశాఖలకు వేర్వేఱు నామములు కలవు. గంజాముమండలములోని మహేంద్రగిరి విశాఖ పట్టణముకడనున్న సింహాద్రి (సింహాచలపర్వతము), కృష్ణామండలములోని శోభనాచలము, బెజవాడకడనున్న ఇంద్రకీలాద్రి, నెల్లూరుమండలములోని యాదగిరి, చిత్తూరుమండలములోని శేషాద్రి, కర్నూలుమండలములోని శ్రీశైలము (పర్వతము), వేలూరుమండలములోని అరుణాచలము, చెంగల్పట్టుజిల్లాలోని వేదగిరి, సెంటుథామాసుమౌంటు, సేలముజిల్లాలోని శివరాయకొండలు, తంజావూరుజిల్లాలోని తీర్థమలై, తిరువాన్కూరురాజ్యములోని పూనమలై, మధురకడనున్న యానమలై మొదలగు ప్రత్యేకప్రత్యేక నామములు లెక్కకు మిక్కిలి దేశమున కలవు. వీటియందలి శిఖరములకును ఇట్టిపేళ్లే కలవుగాని అంతగా చెప్పదగిన ఎత్తుగల శిఖరములు దేశమున లేవు.

మహేంద్రతనయానది, వంశధారానది, నాగావళీ (శొల్లింటి లాంగుల్యానది) శారదానది, వరాహానది, గోదావరీనది, కృష్ణవేణీనది, ఉత్తర సర్కారులందు ప్రవహించుచు సస్యానుకూల పరిస్థితులం గల్గించుచున్నవి. ఉత్తరపినాకిని (పెన్న), పాలేరు, దక్షిణపినాకినీ, కావేరీనది, తామ్రపర్ణీనది, తుంగభద్రా నదులు రాజ్యమున ముఖ్యములగు నదులు.

మహేంద్రగిరియం దుత్పన్నమైన కతన, మహేంద్రతనయానది పేరందినది. వంశారణ్య సంజాతయగుట వంశధార పేరందినది. లాంగలి (నాగలి) నుండి లాంగుల్యయు, తెల్లనినీటగల్గి పాలేరును, కవేరుండను ఋష్యాశ్రమ సంజాతయగుట కావేరియును, ఎఱ్ఱభూములగుండా నడచుచు తామ్రపర్ణియు, తుంగానది భద్రానదులు కలసిన సంయుక్తప్రవాహయగుట తుంగభద్రయు పేరందియున్నవి. భవాని, అమరావతీనదులు కావేరియందు సంగమించు ఉపనదులు. కృష్ణా వేణీనదులు కలసి కృష్ణవేణియైనది. (ఇండియా దేశము చూడుడు). పశ్చిమసముద్రతీరములందు ౧౫౧ అంగుళములును, తూర్పు సముద్రతీరములందు ౪౦ అంగుళములవరకును, పీఠభూమియగు, కడప, కర్నూలు, బళ్లారి మండలములందు ౩౦ అంగుళములును ఏటేట వర్షించును.

ఉదకిసౌకర్యముగల తావులందు వరిపంట సమృద్ధిగగలదు. చెరకును పైరుచేయఁబడుచుండును. లేనితావుల జొన్నలు, రాగులు, మిరపకాయలు మొదలగు మెట్టపంటలు పైరగును. చెట్లవేళ్ళకు జలము చెమ్మతగులు తావులందు కొబ్బరితోటలును, లేని తావుల నంటుమామిడితోటలును పెంచఁబడుచున్నవి. గోదావరీ ప్రాంతముల బత్తాయి నారింజలు, కృష్ణాప్రాంతముల దేశవాళీ నారింజలు, జలసమృద్ధిగల తావులందు నిమ్మలు, అనఁటులు పెంచబడుచున్నవి. తంజావూరు తిరుచనాపల్లి మండలముల అనఁటులు కొబ్బరితోట లధికముగా గలవు.

సగటున తంజావూరు మండలము, గోదావరి జిల్లా పల్లపుప్రదేశము, కృష్ణా పల్లపుప్రదేశము పెద్ద వరిపొలములుగను, తిరునల్వేలి, కర్నూలు, కృష్ణాజిల్లా మెరకలు ప్రత్తిపొలములుగను, దక్షిణ ఆర్కాడు నెల్లూరులు నీలిమందు చేలుగను గోదావరిలంకలు భవానిలంకలు మధుర భూములు పొగాకు గుడ్డెలుగనూ చెప్పఁబడినవి. పశ్చిమసముద్రతీరము కొబ్బరితోటలుగ చెప్పఁబడినది.

ఆంధ్రదేశమున ఆంధ్రమును, అరవదేశమున అరవమును, మళయాళ దేశమున మళయాళమును, కన్నడదేశమున కన్నడము, తులు, కొంకణభాషలును వాడుకయం దున్నవి. మైలు చౌకమున ౨౭౦ మంది వసించుచున్నారని లెక్కింపఁబడినది. ప్రజలందు పదునారవవంతు మహమ్మదీయులు, క్రైస్తవులు ఇతరతాపులందు వలెనే కలరు.

ఈరాజధానియందు డివిజనులు లేవు. దేశమంతయు జిల్లాలుగ విభజింపఁబడి యున్నది.

చెన్నపట్టణ మొక ప్రత్యేక జిల్లాగా చేయఁబడినది. ౧. గంజాముజిల్లా, ౨. విశాఖపట్టణము జిల్లా, ౩. తూర్పుగోదావరిజిల్లా, ౪. పశ్చిమ గోదావరిజిల్లా, ౫. కృష్ణాజిల్లా, ౬. గుంటూరు జిల్లా, ౭. నెల్లూరుజిల్లా, ౮. చెంగల్పట్టుజిల్లా, ౯. చిత్తూరుజిల్లా, ౧౦ వేలూరుజిల్లా, ౧౧. కడపజిల్లా, ౧౨ కర్నూలుజిల్లా, ౧౩. బళ్లారిజిల్లా, ౧౪. అనంతపురంజిల్లా, ౧౫. దక్షిణార్కాడు జిల్లా, ౧౬. తంజావూరుజిల్లా, ౧౭ తిరుచనాపల్లి జిల్లా, ౧౮. సేలంజిల్లా, ౧౯. కోయంబత్తూరు, జిల్లా, ౨౦. మధురజిల్లా, ౨౧. తిరునల్వేలిజిల్లా, ౨౨. నీలగిరిజిల్లా, ౨౩. మలబారుజిల్లా, ౨౪. దక్షిణకన్నడముజిల్లా, ౨౫. రామనాథ జిల్లా.

**చెన్నకుల గోత్రము** — చన్నకుల చూడుఁడు.

**చెన్నూరి శోభనాద్రికవి** — ఆంధ్ర కవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. తండ్రిపేరు రామచంద్రుఁడు. రచించినది శృంగారసుధాసముద్ర పూర్ణచంద్రోదయము. ఇందలి కథ బిల్హణీయములోనిది. చాల ప్రౌఢకావ్యము.

**చెప్పినబుద్ధీ కట్టినచద్దీ ఎంతకాలము నిలచెడిని?** — ఆంధ్రలోకోక్తి.

**చెప్పు కట్టు (ఆకు) చెట్టు** (చెప్పుతట్టాకుచెట్టు) - దీనిని ఆంగ్లమున Asarabacca Plant అనెదరు దీని వేరునందు ఉష్ణముగల్గించి వాతము, సన్నిపాతము, వాతజ్వరములను శమింపఁజేయు శక్తిగలదనియు, పైత్తికుక్కవిషము హరించుటకిది మంచిమందనియుఁ జెప్పఁబడినది.

**చెప్పులు (కాలిజోళ్లు) కిర్రు** — కాలిచెప్పుల అట్ట లొకటికొకటి రాసికొనుట వలనకల్గెడి ధ్వనికి కిర్రు అని పేరు ఈకిర్రు చేతితోఁ గుట్టఁబడిన పాదరక్షలందు నడమంతరి పొరముల మొత్తిడివలన కలుగుచుండుట సర్వసాధారణమే

యంత్రముచేకుట్టబడిన జోళ్ల అడుగుమట్టు పొరకు పొరకు మధ్యను ఫ్రెంచిచాక్ (French Chalk) గాని, బ్లాకులెడ్ (Black lead)గాని పులిమి చక్కని వెలితికలుగని యట్లుగా గుదర్చి కుట్టెదరుగాన నీజోళ్లు కిర్రుపెట్టి ధ్వనిచేయవు. చెప్పులజోడైనను పాతగిలినకొలది చర్మము (Leather) నందలి పటిమ చెడియు, ప్రమాదవశమున నీటం దడిసియు, మురికిపట్టియు, రాపిడి వలనగల్గు ధ్వనిం జేయుచుండెడిని.

**చెప్పులు తొడుగుకొనిన వానికి భూమియంతా తోలుతో కప్పఁబడినదిగానే యుండును** — ఆంధ్రలోకోక్తి.

**చెప్పేవానికి సిగ్గులేకపోతే వినేవానికైనా వినుగుండవలసివచ్చును**- ఆంధ్రలోకోక్తి.

**చెంబేలీ (చమేలీ) చెట్టు** — ఇది పూవులంబూచు చెట్టు. బహుశః తురుష్కుల ప్రభుత్వ కాలమునాఁడు రప్పింపఁబడినదిగాఁ దోఁచెడిని.

పరిమళముగల పుష్పములం బూచెడిని. తుప్పగా తీగెలం బ్రాకుచుండు. పుష్పములను మెదడునకు బలమొసగి వాతమును హరించుగుణము కలదందురు.

**చెముడు చెట్టు** — చెముడుచెట్టు పేరున పెక్కు భేదములగు చెట్లులు. గానవచ్చె డిని. కాని కాడలంగల్గి లోన పాలంబోలిన తెల్లని రసముం గలవానిని సర్వసాధారణముగ చెముడు చెట్టని వాడుదురు. ఇందు గానవచ్చు భేదజాతులు- కోలచెముడు, తిరుగుడిచెముడు, బ్రహ్మ (లేక, బొమ్మ) చెముడు, పలకచెముడు, నాగచెముడు. ఆకుచెముడు ఇంకను కత్తిరాకు చెట్టును ఈ చెముడుజాతిలోనిదే.

కాడలచెముడు- దీనిని పాలచెముడనియు నందురు లా. Euphorbia terucalli. ఆ-గ్ల. Milk hedge tree. సం. సమంతదుగ్ధా, స్నుక్ఛదః, స్నుహా, స్నుహీ. దీనిపాలను చెముడు పాలనియెదరు. అవి కొంతవఱకు ఆయుర్వేద వైద్యోపయోగముం గల్గియున్నను, అపాయకరములుగాన జాగ్రతగ వాడవలసి యుండును. చెముడుపాలు మెత్తనిచోట్ల శరీరముపైన రాచిన పొక్కును. లోపలికిచ్చుటలో మోతాదెక్కువ యగునేని అధికవిరేచనములం జేయును నరములకు చాల నష్ట మొనర్చును. కాన వైద్యులు చాల జాగ్రతగాని వాడవలయును. సుకుమార శరీరములకు చెముడు వాడరాదని నిషేధించ బడినది

చెముడుపాలు ఒకచుక్కలో సగము తులము వెన్నతోఁగల్పి లోనికిచ్చిన విరేచనము లగుననియు, ఆకులను దగ్గుమలపుగుణము కలదనియు, రాచపుండు ప్రారంభదశయందే చెముడు పాలు పైని అంటకుండ పోయుచుండిన అది హరించిపోవుననియు, కీళ్ళనొప్పులకు పైనిరాసిన నిమ్మళించుననియు, లేక కాడలపాలుకన్న ముదిరిన నట్టువంటిపాలు ఎక్కువ బలకరముగ పనిచేయు ననియు, పండుకాడలు వెచ్చచేసి రసముపిండి చెవిలో పోసిన చెవిలోని కురుపులు, పోటు నివారించుననియు, చెముడుకాడల నొడబెట్టి కాల్చి భస్మముచేసి తేనెతోఁగాని, పంచదారతోఁ గాని లోనికిచ్చిన వేడిచేసి వాతము జయించి శూలనొప్పులు, దగ్గులు నివారణమగునవియుఁ జెప్పఁబడినది.

చెముడు పాలుగాని, చెక్క లేక రసముగాని, కషాయముగాని, మిక్కిలి వేడిచేసి, కడుపులోని బల్లలు మొదలగు గుల్మరోగములు, అష్టోదరములు, అగ్నిమాంద్యము, ఉబ్బు, కఫము, కర్ణ (చెవి) వాతము, గ్రంధివాతము (కీళ్లవాతపట్లు), పాండురోగము, శ్వాస, శూలలపై చక్కగ పని చేసి నివారించుననియుం జెప్పఁబడినది. దీనిదోషములకు విరుగుడు- కలకండపానకము, తంగేడు చిగుళ్ల రసము, నీరుల్లిపాయలరసము, పొక్కిన పొక్కులపై వెన్నయు, చింతాకురసము పూయుటవలన మానునని చెప్పఁబడినది.

కోలచెముడు- దీనిని పలకల చెముడనియు నందురు. ఇది తిన్నగ పైని స్తంభములవలె లేచి ముండ్లు గల్గియుండుగాన తోటకంచెలకు వేయుచుందురు లా. Euphorbia antiquorum. సం యామశకంటకా, కొందఱు సమంత దుగ్ధా యనియు వాడియున్నారు. బొమ్మచెము డని కొందఱనెదరు. కోలచెముడు పాలు లేక రసము వేడిచేసి గాఢవిరేచనములు గల్గించును. దీనియందుగల దుర్గుణములు తాపమును, వాంతులను గల్గించును. తేలుకాటుపైన రుద్దిన విషము హరించి బాధనివారణమగును. మర్దనాచేసిన మెదడునందలి రోగములు, ఉన్మాదము (పిచ్చి), వ్రణములు, వాతదోషపు నొప్పులు, అష్ఠీలక

వాతము, వాపులు నివారణమగునని యు, మరియు నిందు ఆమదోషము, ఉదరరోగములు, గుల్మలు, కపోదరము, కడుపుబ్బరము, శూలలు, ప్రమేహము, ప్లీహ, కఫదోషము, పాండురోగము, జ్వరములు మాత్రమేగాక కుష్ఠరోగమునైఁ గూడ మంచి పనిచేయునని చెప్పఁబడినది. కాడల చెముడుపాల గుణములం గూడ గల్గియుండు నందురు.

తిరుగుడిచెముడు- ఇది అరుదుగ గానవగు చుండు జాతి. లా. Euphorbia tortilis. ఆంగ్ల. Twisted Spurge. ఇది కత్తిమందు చెట్టు పోలికంగల్గియు, త్రాడువలె చుట్టుకొని పెరుగును. కాని తీగజాతికాదు. దీనిపాలయందు పొక్కుగుణము కలదు. తిరుగుడుచెముడు పాలు పైనబూసిన కుష్ఠరోగపుమచ్చలు, కుష్ఠపుండ్లు మానునని యు, వేరుకషాయము శూలనొప్పుల నడంచుననియు, కాడలనునూరి యాముద్దను పైన కట్టువేసిన తామర, గజ్జి,చిడుము, పల్లికలు మొదలగు సమస్త చర్మవ్యాధులు నివారణమగు ననియు, పాలు ఆముదముతో కల్పి మర్దనచేసిన కటివాతపు నొప్పులు, పురాణ వాతనొప్పులు నివారణమగుననియు, పాలనెండబెట్టి చూర్ణము చేసి తాటిబెల్లముతోఁ జేర్చి లోనికిచ్చిన నంత అపాయకరముగాదనియు, మిత్తమున నియ్యది గాఢవిరేచనకారి యనియుం జెప్పఁబడినది.

బ్రహ్మచెముడు- ఇది మట్టలుగ పెరిగి ముండ్లు గల్గియుండుంగాన తోటలకంచెల కుపయోగించు చుందురు. దీనియందు చెముడు సామాన్యగుణములే యుండును. దీనిమట్టల ముండ్లుం దీసిపైచి మట్టలనించుకగాల్చి ఆవుల కాహారముగ నిచిన విస్తారము పాలిచ్చును. అనఁటితోటలు దొరవుగ చెట్లునాటి గోతులందిడిన అనఁటి బాగుగపెరిగి పెద్దకాయలంగాయును. బ్రహ్మచెముడుకు నున్నపు ఘాటు నాశకరము. దీనిని లాటిన్భాషయందు Cactus indicus అనియు, Opuntia dellenii అనియు నందురు. ఆంగ్లమున Prickly pear. హిందూస్థాన్ దేశభాషలందు చప్పల్ సెండ్ అనివాడుదురు. దీనికి మట్టలెతప్ప ఆకులు కేఁబుగనుండవు. మట్టలకడనె పూవులంబూచి కాచెడిని. దీనిని చెవ్వుచెముడనియు, నాగజెముడనియు కొన్ని దేశములందు వాడుదురట. సంస్కృతపుపేరు సరిగా తెలియరాగు నాగఫణి యని కొందఱు వాడియున్నారు. దీనిమట్టల రసముగాని, వేరురసముగాని గ్రంథులు, రక్తస్రావము, వాతగుల్మల నివారించుననియు, మట్టల గుంజగాని పూలరేకులు నూరి కట్టిన, గడ్డలు పగిలి చితుకుననియు, వ్రణములు మానుననియు, మంటలు పోటు అడఁగుననియు, పడ్లగుంజు శగ రోగము నివారించి మేహశాంతి యొనర్చుననియు అందురు.

నాగచెముడు- ఇది చిన్నచెట్టు. పొడుగుగా మట్టలుండును. వాటిపై పాముపొస్తరు వన్నె యుండుంగాన ఆపేరు గల్గెను. దీనివేరు లేక మట్టలరసము మిక్కిలి వేడిచేసి విరేచనములం గల్గించును. దీనిని పూదోటలందు అలంకారముగ నాటుచుందురు.

ఆకుచెముడు- లా. Euphorba nerii-folia సం. సుధ రేచన స్నుహి, దళస్నుహి. ఆకురసము చేదు, వెగటులంగల్గి మిక్కిలి వేడి చేయును. మలమూత్రముల వెడలించును. పురాణ జ్వరములు, ఆహిక జ్వరములు వీటివలన గల్గిన ఉబ్బు ఉదరము మొదలగు తావులకేరు కొని వెడలని దుష్ట ద్రవములను, దుష్ట పదార్థములను, దర్మలములను వెడలించును. కఫ వాతము, ప్లీహము, రక్తవాతము, మూలశంఖ వ్యాధి, పిల్లలకుఁ గల్గెడి బాలపాపచిహ్న రోగము

పిట్లను శమింపజేయును. కాళ్ల చేతుల నరముల బిగదీసికొనిపోవు వాతములను (వేపనూనెతో గల్పి పైనిమర్దనచేసిన శమింపఁ) జేయును. అధికముగ లోనికి పుచ్చుకొనిన ఎక్కిలి కాక, పైత్యము నుద్రేకించి ప్రేగులకు కీడుగల్గించును దారుణముగ విరేచనములు చేయును వికారము గల్గించును.

## చెఱకుతీపి అని వేళ్లు నహో నమలి మ్రింగుదురా? (అత్యాశ యని భావము). ఆంధ్రలోకోక్తి.

**చెఱకు** — చెఱకు వెదురుగడలవంటి గడలుగ పెరుగు వృక్షము. ఇది సాదాచెఱకు లేక తెల్ల చెఱకు అనియు, ఎఱ్ఱరంగుగల చెఱకు అనియు, అడవిచెఱకు అనియు, నామాల చెఱకు అనియు నాల్గు తెఱంగులు. లా. Saccharum officinarum ఆంగ్ల. Sugarcane సం. ఇక్షు, మధుతృణ యనిపేర్లు చెఱకునుండి పంచదార, బెల్లము చేయుదురుగాన ఎక్కువ విలువగల పంటగా తలంపఁబడుచున్నది. ఇది రమారమి ఉష్ణదేశము లందంతటను పండును చెఱకు గంపులు లేక కణుపులనుండియే విత్తనమై చెఱకుగడ లుద్భవిల్లును. చెఱకునకు భూమియు దెక్కువ సత్తువయు, విస్తారము నీరును ఉండవలయును.

చెఱకు కణుపులు తినుటకు రుచిగానుండవు పీటియందలి రసమునకు విదాహము గల్గించుటయు, గురుత్వముగ నుండి విరేచనబద్ధము, గల్గించుటయు, వాతపైత్య శ్లేష్మముల నభివృద్ధి జేయుటయు గుణములు. చెఱకునకు వెన్నువేయు సంతటివఱకు ముదరనీయరు. వెన్నువైచిన చెఱకునందలి రసమునకు రుచి చెడును. ముదిరి వెన్నువేసిన చెఱకును విత్తనముగ జేయుదురు. తెల్లచెఱకు రసము వేడిచేసి చలవచేయును. రక్తపరిశుద్ధత గల్గించును. మలమూత్రములం జక్కగ వెడలించి పొట్టను శుభ్రపఱచి జిహ్వాదోషమును సవరించి ధాతుపుష్టియు వాతశ్లేష్మముల నభివృద్ధిపఱచును. చెఱకురసము నిల్వయుండిన యపథ్యకారియగును. చెఱకురసము కాచినది గురుత్వముగ నుండి పైత్యవాతమునుహరించును. మలబద్ధము, శ్లేష్మమును పెంచును. ఎఱ్ఱచెఱకు నందు వాతముచేయుగుణము కలదు. తక్కిన లక్షణము లన్నిరకముల చెఱకులకు సమానమే.

కుష్టురోగము, ప్రమేహము, అగ్నిమాంద్యము, జలోదరము, పీనస, కఫము, దవడతీపు, గుల్మము, జ్వరము, ఉబ్బు, భగంధరము ఈ రోగములుగలవారు చెఱకు తినరాదని చెప్పఁబడినది. అడవిచెఱకు ఎందుకును పనికిరానిది. దీనికి దెయ్యపుచెఱకనియు పేరుకలదు. (అరవమున పేయిక్కరంబు). ఇది నీటివారలందు పెరుగును. చెఱకుగడలవలెనేయుండి నిరుపయోగకరమైనది

అడవి చెఱకునకు వేణునిస్వన యనియు, వనయిక్షుయనియుం బేర్లుకలవు. దీని రసము కొంచెము తీపిగనుండి ధాతువృద్ధి, బలము, ఆమవృద్ధి జేయును. మేహ, శ్లేష్మ, క్షయలను వృద్ధినందించెడిని.

చెఱకురసమునకు అల్లము, సోపు విరుగుడులగును. ఆయుర్వేద శాస్త్రవేత్తలు చెఱకును ౧. ఇక్షువు, ౨. కాంతారము, 3. కాశము (కాశిచెఱకు), ౪. నేపాళము (ఎఱ్ఱచెఱకు), ౫. పౌండ్రకము (నామాల చెఱకు), ౬. శతపర్వకము, ౭. ఆరణ్యకము (అడవి చెఱకు లేక దెయ్యపుచెఱకు అరవమున పేయిక్కరంబు) అని సప్తవిధములుగ విభజించిరి.

**చెరుకువండినతావునకు చీమలు అవేచేరుకుంటవి** — ఆంధ్రలోకోక్తి.

**చెరువు నిండితే కప్పలకు కరువా?** (లేక కప్పలు తామే చేరుకుంటవి) — ఆంధ్రలోకోక్తి.

**చెవిటివానికడ శంఖము పూరించినట్లు** -(ప్రయోజనములేని పనియనిభావము) ఆంధ్రలోకోక్తి.

**చెవ్వాకు** — ఆదికాలమున దక్షిణదేశమున స్త్రీలు చెవుల తమ్మెల రంధ్రములందిడికొనుచుండిన రంగువేసిన తాటియాకుచుట్టకు పేరు.

---

**చేకొణిద చెట్టు** — దీనింగూర్చి యంతగా తెలియరాదు. దీనివేరు, ఆకులరసము జ్వరములను, వాతరోగములను, నివారించు నని యందురు.

**చేగోళ్ళ గోత్రము** — క్షేమకుండలకుల చూడుడు.

**చేటా** — బౌద్ధులు చేటియ లేక చేటియగిరిని చేటాయని వాడిరి. (చేటియగిరి చూడుడు. చేటియనగరము చూడుడు).

**ఛత్రములు** — భరతభూమియందు తొల్లింటి కాలమున ఇప్పుడు చేతికర్రలు వాడబడునట్లు విల్లు, అంబులు ధరింపఁబడుచున్నవి. పిదప నృపాలురు అధికార సూచకముగ రాజదండమును, భటులు ఈటెలును, పిదప దండము (బాణాకర్ర) లను ధరించుచుండెడివారు. ఉద్యోగులు ధరించుట లేదు. సామంతులు ఖడ్గములను ధరించువారు.

ఫ్రాన్సుదేశమున తొల్లింటి కాలమున రాజపరిపాలనముండులేరి రాజసన్మానముగల యధికారులు చేతికర్రలం ధరించియుండువారు. ఇవి నారి ఆజ్ఞలనిచ్చు నధికార చిహ్నముగ పరిగణింపఁబడుచుండునవి. పిదప నీచేతికర్రలు గొప్పవారి ఔన్నత్యసూచకముగ వాడఁబడినవి.

పదునేడవ శతాబ్దాంత కాలమున చేతికర్రలం బూనుట బ్రిటీషు ద్వీపములందు ప్రారంభమై అతిత్వరితముగ వ్యాపకముం గాంచెను. అచట చేతికర్ర సంపన్నతను సూచించు చుండునది. రానురాను బ్రిటీషు సీమలందు సర్వసమానభావము ప్రబలినకొలది ఎల్లరు చేతికర్రలనో, గొడుగులనో చేతంబట్టి ఏగుట పరిపాటయ్యెను అదియె భరతదేశమునను ప్రారంభమయ్యెను. కొన్నివిధముల బలమగు చేతికర్ర నడకయందు సహకారిగగూడ నున్నది. పటాలమునందును, రక్షక సైనికులు (Police) ను సన్నపు పేపబెత్తములను చేతంబూనెదరు.

**చేతియచ్చకము** (Block printing by hand) - కలంకారి పరిశ్రమ చూడుడు.

**చేతి(వేళ్ల నీడలు** — చేతి(వేళ్లను వివిధాకారములు మలిచిపట్టి వాటి దీపపు నీడనొక తెల్లబట్ట తెరపైంబడునట్లు దీపమునమర్చి తెరకవ్వలనుండి చూచువారలకు వివిధాకార

ములుగ నిప్పుడున్నట్లు ప్రదర్శించుట సనాతనముగ భారతదేశమున వ్యాపించియున్నది. ఈ విద్య ఇటీవల కొంత తగ్గినను ఆంధ్రదేశమున నచ్చ టచ్చట గానంబడుచునే యుండును.

పాశ్చాత్యదేశములందు కూడ నీ విద్య గలదని వినికిడి. ఈవిద్య కొంతములేదు. ఊహా పోహలకొలది చక్కని యభ్యాస మొనర్చి లెక్కలేని మృగ పక్షి కీటకాదుల యాకారము లను నీడగా తెరయందు ప్రదర్శించి చూప నగుచున్నది. ఈవిద్యను బుద్ధికొలది యోచించి యభ్యసించి యభివృద్ధిపఱచవలసినది

**చేతి(వ్రేళ్ల సంజ్ఞల ఆంగ్లాక్షరములు** — చేతి(వ్రేళ్లతో నాంగ్లాక్షరములను సంజ్ఞలుగఁ దెల్పు పద్ధతి ఐరోపాదేశములందు వాడుకగలది. ఇది ముఖ్యముగ నాంగ్లసీమ లందు చెవిటివారికిగాని, మూగవారికిగాని ఉప యోగింపఁజేయుచుందురు. ఇందు ఆంగ్లాక్షర ములు ఇరువదియారును కలవు. మంచికి చెడ్డకు రెండు సంజ్ఞలున్నవిగాని ఫుల్‌స్టాపు, కామా, సెమికోలన్ మొదలగువాటికిగాని, అంకెలకుం గాని సంజ్ఞలు కానరావు. మఱియు నిందు పెద్ద అక్షరములు, చిన్న అక్షరములు అను భేదములును అచ్చు అక్షరములు, వ్రాత అక్షరములు అను భేదములును చెప్పఁబడియుండలేదు.

**చేతీయగిరి** — చేదా చూడుఁడు.

**చేతీయ నగరము** (చైత్యగిరి) — తొల్లింటి దశార్ణదేశపు ముఖ్యపట్టణము. (చూడుఁడు). ఇప్పుడు భోపాలసంస్థానపు రాజ్యమున సాంచిస్తూపముకడ భిల్సాపురికి మూడుమైళ్ల దూరమున నున్నది. వేత్రవతీ (బేత్వా) నది. విశాలీ (బీస్) నదితో సంగమించుతావున నున్న చిన్న పాడుపడిన గ్రామము.

**చేది** (కుశుఁడు) — యాదవసంతతి చంద్ర వంశక్షత్రియుఁడు. విదర్భుని మూడవకుమారుఁడు. ఇతనినుండి ఇతఁడేలిన దేశమునకు చేదిదేశమని పేరయ్యెనట. (చేదిదేశము చూడుఁడు). పితా మహుఁడు జ్యామఘుఁడు. ఈచేదినృపతికి కుశుఁ డనియుం బేరుగలదు. ఇతని సోదరుఁడగు రోమ పాదుని సంతతివాఁడొక చేదినృపాలుఁడు కలఁడు. అతఁడు కడు ప్రసిద్ధిమంతుఁడు. అతనిసంతతివారికి చైద్యులని పేరు. వీరు యాదవులలోనివారగు ఒక శాఖ.

**చేది దేశము** — అనూపదేశము చూడుఁడు.

**చేది పురము** — అనూపదేశము చూడుఁడు

**చేదిపుఁడు** — అత్రి, చంద్ర, పురు, కురు సంతతి క్షత్రియుఁడు. ఉపరిచరవసువు యొక్క కడపటి కుమారుఁడు. సోదరులు బృహ ద్రథుఁడు, కుశుంబుఁడు, మత్స్యుఁడు, ప్రత్యగ్రుఁడు.

**చేదు గోత్రము** — నిధ్రువగణము చూడుఁడు.

**చేపపిల్లలకీత నేర్పనక్కరలేదు** — ఆంధ్రలోకోక్తి

**చేపలదృష్టి** - మెరకనీటియందుండుచేపలను తీరమునందుండు మనుష్యులు చూడగలరు గాని, అవి చూడజాలవని చేపలంబట్టువారు చిరకాలము నుండి తలంచుచుండిరి. ఇటీవలి పరిశీలనలవలన నది సరికాదనియు పల్లపునీటియందుండు చేపలు సైతము వృత్తాకారమున నీటియందు గన్పట్టు వెలుగుకుండా అవి లోని ఇతరజంతువులనే గాక తీరమునందలివారిని నీడ ప్రతిఫలించుటనుండి ఆకాశమున నెగురు పక్షులంగూడ చూడగల్గునని తెలుచున్నది. చేపల నేత్రములు అన్నిటిం గూడ

చూడగలవు. వెలుతురు సహాయము వాటికిం గూడ సహాయకారిగాబోలును.

**చేపపొలుసు** — చేపలలో పెక్కు జాతులు కలవనుట యందరెరింగినదే. అందేవో కొన్ని జాతులకు తప్ప తక్కిన యన్ని జాతుల చేపలకు అద్దమువలె కొంత స్వచ్ఛమగు నొక పొరవంటి పలుచని పొలుసులు లేక బిళ్లల సముదాయము (Semi Transparent Thin Plates) దాని నిజమగు చర్మమునకుం బైకప్పుగానుండియుండును. ఈచర్మమును చిన్నచిన్న గూళ్లసముదాయమె. ఆగూళ్లనడుమ రంధ్రములును, అందు ఒకవిధమగు జిడ్డుపదార్థమును గల్గియుండును. ఈజిడ్డుపదార్థమే చేప చేతియందుంచుకొనుతరి చేతినుండి జారిపోవఁజేయునది. ఇంకను నీటియందే వసించు జంతువుగాన చేపల కీపొరయు, ఇందలి జిడ్డును నీటియందు రక్షణములై యుండును. మరియు నీబిళ్లలు రాత్రియందు తళతళ మెరయుచు వెలుగిచ్చునట్లుండి చేపలకు గాత్రులానగుపడఁజేయును.

**చేపలు** —





చేపలు చల్లని రక్తము గలవి. ఎముకలు కలవి చేపలందు నరములుండును గాని అవి ఇతర శరీరములతో పోల్చిచూచిన చాలతక్కువ. నరములు తక్కువగ నుండుటంజేసి చైతన్యము, స్పృహయు చాలతక్కువ యని తేలుచున్నది. బాధననుభవించుటలో శరీరపీడకన్న మనస్సునకొక్క వేదన ఎక్కువ కారణమని స్పష్టపడిన యీకాలమున చేపలు అల్పచైతన్య వంతములు (Less sensitive) గాన బాధలనంతగా ననుభవించనివని స్ఫురించుచున్నను బాధ, ప్రేమ, దుఃఖములు కేవలము చేపలకుండవని చెప్పవీలు లేదు.

చేపలు గ్రుడ్లనీని వాటింగాచుకొనియుండును. తల్లిచేప గుడ్లను చూచుచుండుట వలననే పొదుగబడి చేపపిల్లలు పెరిగి పెద్దవియై తమమేతం దాగడించుకొనశక్తి గలవి యగునని మనపూర్వులు కనిపెట్టిరి.

**చేపలునీటియందు మున్గుచున్నందులకు స్నానఫలమా?**— ఆంధ్రలోకోక్తి.

**చేమకూర వేంకటరాజ కవి** — ఆంధ్రకవులలో మధ్యకవులంగ పేర్కొనబడిన వాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. తండ్రిపేరు లక్ష్మణామాత్యుఁడు. ఈకవి క్రీ. వె. ౧౭ వ శతాబ్ద మధ్యకాలము నాటివాఁడని తలంపఁబడుచున్నాఁడు. ఈతఁడు తంజావూరు రాజధానిగ రాజ్యమేలిన అచ్యుతేంద్ర రఘునాథ రాజుకడ యాస్థాన కవి. రచించినవి సారంగధర చరిత్రము, విజయవిలాసము అను గ్రంథములు, మహాప్రబంధములు, జాతీయములతోను, సామెతలతోను శబ్దాలంకారములతోను దనరుచు రసవంతమై రుచికరమై యున్నవి సారంగధర చరిత్రమున శ్లోకము చక్కగ వర్ణింపఁబడుటయు, సంయోగ వర్ణనలు లేకుండుటయు, తనప్రభువు నిజముగ నేర్చినట్లున్నదనియు, అనుభవములేని కావ్యమనియు వినోదముగనని మెచ్చుకొనెనట. దానికాకవి విజయవిలాసము రచించెనట. ఇందు ముమ్మారు సంయోగములు వర్ణింపఁబడినవి రంజకమైన ప్రబంధ వర్ణనలు ధోరణిగల గ్రంథములు.

**చేమంతి (పువ్వుల) చెట్టు**—ఆంగ్ల. Chamomile plant లేక Christamus flower plant. దీని వేరు రసము, ఆకురసము, కషాయము సమధాతువుగ ఊర్ధ్వశ్వాసరోగము, ఉబ్బుజాడ్యము, కఫరోగము, క్రిమిరోగము, గుల్మము, జ్వరములు, పైత్యదోషము, మల

మూత్రబద్ధము, మూలవ్యాధిరోగముల నడంచి నరములకు బలమొసంగి స్త్రీల ఋతుబద్ధమును నివారించును. పూవుల రసమునకు, పూవుల చూర్ణమునకు, పూవుల కషాయమునకును ఇవియే గుణములు. చేమంతిపూవులంబట్టి పెద్ద పూవులం బూచునది, చిన్నపూవులం బూచునది, వివిధవర్ణములపూవులంబూచునది పెక్కుజాతులు గలవు. మరియును పసుపుపచ్చరంగు, తెల్ల రంగు, ఎరుపురంగు ఇవికలసిన మిశ్రవర్ణముల రంగులు గల్గి, చేమంతిపూవులంబట్టి చేమంతులు పలుజాతులై యున్నను అన్నిటికిం గుణ మొకటియే యని వైద్యులనెదరు మొత్తమున చేమంతి పూల రెక్కలకు సమశీతోష్ణము గల్గించి కండ్లకు చలువజేయు గుణము కలదనియు, పైత్యము తలత్రిప్పు నివారించునియు, నీటి రసము లేక ఎండ రెక్కల కషాయము వాడనగు ననియు నందురు.

**చేవ్యము** — ఇది మిరియపుచెట్టు పేరని వాడుకకలదు సంస్కృతమున కోలా, చవ్యా, చవికా యనియు వాడుకయందు తెలుగున చేవ్యము, శేవ్యము ననికూడ పేర్లు కలవు ఆంగ్లమున Pepper chaba అనియు నందురు కషాయములందు వాడుదురు

చేవ్యమునకు అగ్నిదీప్తి నధికపఱచి సర్వజ్వరములనుజయించి వాతపైత్యములను శమింపఁజేసి బలము, వీర్యవృద్ధి గల్గించుగుణములు గలవనియు, అతిసారము అగ్నిమాంద్యము, దెబ్బ, కఫము, క్రిమిరోగము, పాండురోగము, మూలవ్యాధి, వాతము, శూల, హృద్రోగములపై చక్కనిపని యొనర్చుననియుఁ జెప్పఁబడినది.

**చేరదేశము** — ఇప్పటి మైసూరురాజ్యమందలి భాగమును కోయంబత్తూరు, సేలము, దక్షిణోత్తరమళయాళసీమలును తిరువాన్కూరు, కొచ్చిరాజ్యములు కలసి తొల్లింటి యాదికాలమున చేరదేశమని పేరం బరగెనని తలంపఁబడుచున్నది. క్రీ. పె. మూడవ శతాబ్దము మొదలు ఏడవ శతాబ్దమున అంతముదనుక కొంత దేశము క్షీణించిదో, అభివృద్ధినందిదో చేరదేశమని పేరుండినట్టుల తెలియుచున్నది. మరియు నొకప్పు డీకాలమధ్యకాలములనే దక్షిణకొంకణముగూడ చేరెనట. మలయాళ, కన్నడ (తిరువాన్కూరుసహా) ములు కేరళమనియు, ఉత్తరమున గోవా, దక్షిణమున కన్యాకుమారియగ్రము ఎల్లలనియు నందురు. దీనికే వేఱొకకాలమున చేరదేశమని పేరయ్యెనందురు.

అశోకుని శాసనములందు నీ ప్రాంతదేశము నకుఁ గేరళపుత్రమనియు, స్కందపురము ప్రధాననగరమనియు కలదు. క్రీ పె. రెండవశతాబ్దము వాఁడగు టోలమీచరిత్రకారుఁడు "కరోవ్రా" ప్రధాననగరమని వాసియున్నాఁడు. ఇందువలన కోయంబత్తూరుజిల్లాలోని కరూరు రాజధానియని తెలుచున్నది. ఇది కావేరిలో కలియు చిన్ననది యగు అమరావతిపైన నున్న పట్టణము. దీనికి వంచిపురమనియును బేరుండెను ఇప్పుడు కరూరను పేరం బరగుచున్నది. పిదప తలకాడు రాజధానియయ్యెను. ఇందే క్రీ. పె మూఁడు మొదలు తొమ్మిదవ శతాబ్దమువఱకు గంగవంశపురాజు లీదేశము నేలిరి. తలకాడిప్పుడు పాడుపడి దళవాయిపురమను పేరం బరగుచు మైసూరురాజ్యమందలి శ్రీరంగపట్టణమునకు తూర్పుగా ముప్పదిమైళ్ళ దూరమున నున్నది. ఆనవాళ్ళు బాగుగ గలవు.

క్రీ. పె. పదియవ శతాబ్దమునుండి చోళులు లేక, హొయసలబళ్ళారిరాజులు రాజధానిని తలకాడునుండి ద్వారావతికి మార్చిరి. పిదప ద్వారావతి ద్వారసముద్రముగ మారి దొర

సముద్రముగనై ఇప్పుడు హాలెబిడ్ అనంబరగుచు మైసూరురాజ్యమున హిసన్ జిల్లాలో నున్నది. మైసూరురాజులు ఈప్రాంతసీమను తనరాజ్యమునకుం జేర్చుకొనుట క్రీ. వె. ౧౩౩౮ సంవత్సరమని తెలిసినది.

**చేరల గోత్రము** — శాండిలగణము చూడుఁడు.

**చేలక గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**చేలగంగ** — కావేరినది చూడుఁడు.

**చేలోపత్తిపంట చేలో ఉండగానే బట్టలనేతకాలోచించునట్లు** — ఆంధ్రలోకోక్తి

**చేష్టాశకునములు** — ఒక కార్యాలోచన మొనర్చుతఱిని లేక కార్యప్రారంభమున కార్యాచరణకుతగుతఱిని లేక ప్రశ్నించుతఱి, నీ చేష్టాశకునము లెఱుఁగదగినవిగా చెప్పఁబడినవి. తత్కాలమున కార్యపుయజమాని చూచునవిగను, ప్రశ్నించువారు చూచునవిగను ఉండెడివి.

శిరస్సు- తాకకుండగ జూచుట కార్యమునకు జయము, తలగోకికొనుట చెరుపు.

చెవులు- కుడిచెవితాకుట శుభము, ఎడమచెవి కార్యహాని, రెండుచెవులు కీడు.

కనులు- కుడికన్నునంటుట జయము, ఎడమకన్ను నష్టము.

నాశికము- ముక్కుందాకుట వ్యాధికరము.

మీసములు- ఎడమమీసముం దాకిన దిగ్విజయము, కుడిమీసము మోసము.

కంఠముందాకుట శుభప్రదము.

గడ్డముందాకుట కార్యహాని.

ఉరము- గొప్ప ఫలప్రదము. అందుం గుడిరొమ్ము సౌఖ్యము, ఎడమరొమ్ము కష్టము.

కడుపుందాకుట- సంతోషప్రదము, నడుము రోగము.

పురుషాంగమును ముట్టుట- కార్యహాని, వస్త్రముందాకుట మేలు

వీపు-వీపును కుడిచేతం దాకిన బాధునర్శనము.

చరణములు- పెనచుకుని నిలచుటంజూడ అపశకునము, భూమికి మడిమలానించినిలచుట కార్యహాని, పాదముల వ్రేడలపై నిడుకొని కూర్చుండుట మేలు, ఒకకాలు నేలనానినిలచుట ప్రయాణసూచకము.

చేతివ్రేళులు మెటికెలు విరచుట కార్యసిద్ధి గుర్తు. గోకుకొనిన కార్యహాని, వ్రేళ్లతో నెడమభుజముందాకిన కార్యనష్టము, వ్రేళ్లతో తలవెండ్రుకలం దాకుట పట్టుట చెరుగు అని చెప్పఁబడినది.

ఇంకను చేష్టాశకునములం గుకార్యారంభమున పుల్లలు విరచుటంజూచుట కార్యహానియనియు, మునికోల మున్నగునవి నేలగీయుటంజూచుటయు తాటినారవడకుటం జూచుటయు, కష్టముల సూచకమనియు, చూరు, పెండె, వాసము మొదలగువాటిపై జేయానించియుంటయుం దేనినేని జీల్చుచుంటయు, నోటనేపుల్లనేని నిడుకొని యుంటయుంజూడ నశుభకరములని చెప్పఁబడినది. చింతతోనేదేని యోచింపనారంభించుట తగదనియు, గొంతుకూర్చుని ప్రశ్నించుట కీడనియు, కోపమడంచుకొనజాలక గొణుగుచు నడుగుట శుభమనియు జెప్పఁబడినది.

భోజనముచేసి వేడుక, రాజసములతో కార్యాచరణమునకుం గడంగుటయు, ప్రశ్నించుటయు, కార్యసిద్ధిప్రదములనియు, దూతయై వచ్చినవాఁడు ఎడమవైపుననిలచి యటంగూర్చుని కుడివైపునకుంబోయిన నాకార్యము జయముం గాంచుననియు ఋషులనిరి.

సంతుష్టాంతరంగుఁడై నగుచుగాని, నీటిం దాకుచుగాని, తాంబూలము వేయుచుగాని కార్యానికై ప్రారంభము ప్రశ్నించుటయు శుభప్రదములగును. మరికొందఱి మతమున [illegible] శుభశకునకాలమే నగును. కార్యారంభ కాలమున పూవులు, పండ్లు, తాంబూలము, చందనము నెయ్యి, పెరుగు, అప్పుడే వీనిం గాంచుట కార్యసిద్ధినిచ్చు శకునము లని చెప్పఁబడినది.

**చేసికొనిన వారికి చేసికొన్నంత** - ఆంధ్రలోకోక్తి.

**చేసికొనేవే అనుభవించడము** - ఆంధ్రలోకోక్తి.

---

**చైకేత గోత్రము** — నిధ్రువ గోత్రము చూడుఁడు

**చైతకి గోత్రము** — కపి గణము చూడుఁడు

**చైతన్య చరితామృతము** — చైతన్యదేవుని జీవచరిత్రము, కొటక ద్వీపము చూడుఁడు.

**చైతన్యదేవుని తలవెంట్రుకలు**— కొటకద్వీపము చూడుఁడు.

**చైతన్యమతనిషేధములు** — విష్ణుదేవుండగు హరియొకఁడే సర్వేశ్వరుఁడను నమ్మకమునందు సంశయము గల్గుటయు, భక్తిని హరియగు విష్ణుదేవునియందు కన్న అన్యులందు వ్యాపింపఁ జేయుటయు, కామక్రోధాది అరిషడ్వర్గమునకు లొంగిపోవుటయు, అష్టమదములం గల్గియుండుటయు ఇవి నాల్గు నిషేధ కార్యములని చెప్పఁబడినది.

**చైతన్యము** (Sensation)—చైతన్యము నొకసుప్రసిద్ధ ఆంగ్ల పండితుఁడు "Feeling or mental state resulting from the action of external stimulation due to some bodily organ connected by nerve fibres with the brain" అని నిర్వచించి యున్నాఁడు. దీనిని విభజించుట దుస్తర మనుచున్నారు. దీనికి Quality, Intensity, Duration లు కలవు. మఱియు నిది సంతోష, దుఃఖ, ఆశ్చర్య, భయాత్మకమై యుండునని కొందఱనిరి. రుచి, స్పర్శము, గంధము, శీతోష్ణస్థితులు ఇందుకలవని కొందరనిరి.

[illegible] శాస్త్రమున చైతన్య సిద్ధాంతము కలదు. అందు చైతన్యము, పరిజ్ఞానము (Knowledge) నకు మూలమని చెప్పఁబడినది. అనగా ఊహాలు, జ్ఞాపకములు, తోచిన, కారణములు, అభ్యాసములు చైతన్య సంబంధములే యని భావము.

**చైతన్య మతము** — ఇది వైష్ణవ మతములలో నొకటి. కర్త చైతన్య మహాప్రభు మతాచార్యుఁడు. ఈయనకు తలిదండ్రులిడిన తొల్లింటిపేరు విశ్వంభరబాబు. ఈయనకుఁ గౌరాంగుఁడనియు పేరు కలదు. తండ్రి పేరు జగన్నాథమిశ్రుఁడు. తల్లిపేరు శచీదేవి. సోదరుడు విశ్వరూపుఁడు. ఈతఁడు సన్యాసియై

పోయెను. భార్య వల్లభాచార్యుని పుత్రికయగు లక్ష్మీదేవి. ఈమె మరణానంతరము పెండ్లాడిన రెండవభార్య విష్ణుప్రియ.



చైతన్యుడు పండితుడు గొప్ప త్యాగి. వైరాగ్య బోధ నొసగిన గురుడు ప్రయాగ వాసియగు ఈశ్వర పురియను యోగీశ్వరుడు. వైష్ణవ ధర్మములను బోధించిన గురువు నిత్యానందుడను భక్తుడు విద్యాగురువు నవద్వీపవాసియగు వాసుదేవ సార్వభౌమ పండితుడు. జన్మస్థలము నవద్వీపము. పరమేశ్వరుని సన్నిధికి చేరుకొనిన తావు శ్రీజగన్నాథము.

చైతన్యుడు అన్నిజాతులవారును ఎక్కువ తక్కువలు లేక ఉపదేశమునకు పాత్రులనియు, విష్ణుదేవుడే దేవుడనియు, మోసమెఱుగని విశ్వాసమును, అవ్యభిచారభక్తియుం గలిగి పరమేశ్వరుని సేవించవలయుననియు బోధించిన వాడు. ఈ రెండును ముక్తిమార్గములుగ చెప్పబడినవి. చైతన్యమతమున కర్మమార్గమునకు తావేలేదు.

దేవుడు జగత్కర్తయనియు, నియామకుండనియు, దుర్గుణములుగలవారిని శిక్షించువాడనియు, శిష్టపాలకుడనియు, రక్షకుడనియు, తన మనస్సున నిస్సంశయముగ నాటించుకొనుట. మోసమెఱుగని విశ్వాసమనగను, అనన్యభావప్రీతి యనగా నితర దైవములందించుకైనను వ్యాపింపనీయక చక్కగ నిరోధింపబడి రాధాకృష్ణులయందే వ్యాపింపజేయబడిన భక్తి (నిశ్చలభక్తి) అవ్యభిచారభక్తిగ ననునిర్వచింపబడినది. ఇవియే ముక్తిసాధనోపాయములు. చైతన్యమతమున సంసారము విడచుట నిరర్థకమని చెప్పబడినది. కృష్ణుడే పరమాత్ముడగు విష్ణుదేవుడు, రాధయే పరమేశ్వరుని శక్తి. పరోపకార బుద్ధియే మానవ ధర్మము. స్వార్థపరత్వమును పరోపకారము కొఱకు తగ్గించుకొనుటయే సాధకము. భాగవతము, పారాయణగ్రంథము (భగవద్గీతయు ధర్మనిధుల నెఱింగించుటగాన గౌరవించదగినదే) చైతన్యులు ౧౦౮ తులసిపూసలుగల మాలను ధరింతురు. కంఠమునుజుట్టి మెడవరకు తులసిమాలధరించుటయుంగలదు. ముఖమున గోపీచందనము ధరింతురు. ఎవ్వరేని యెదురగత్రే "హాహాబోలో" "హరినుడుము" అనుచుందురు. కృష్ణనామమును సదాస్మరించుచుందురు. విష్ణుదేవునితోపాటు చైతన్యదేవునిగూడ పూజింతురు.

చైతన్యుని బోధయందు ఇంద్రియములకు లోనై సంసార వ్యామోహముచేత పుట్టినది (భార్య పుత్ర మిత్రాదులాగాను) ప్రీతిగ నిర్వచింపబడినది. ఇంద్రియనిగ్రహముచేసి సంసార వ్యామోహమును ధిక్కరించి స్వార్థబుద్ధినివిడచి తనప్రీతిమమతలను పరమేశ్వరుండగు కృష్ణుని యెడలను, శక్తియగు రాధయెడలను ఉంచవలయునని చెప్పబడినది. వీటివలననే ముక్తి లభించుట. ఇంద్రియనిగ్రహము భక్తికావశ్యకము. కామక్రోధాది యరిషడ్వర్గమును, కులమదము, బలమదము, ధనమదము, రూపమదము, విద్యామదము, తపోమదము, రాజ్యమదము, యౌవనమదమునను అష్టమదములను గూర్చి జాగరూకతగొని నిరోధించవలయుననియుం జెప్పబడినది. ఈమతమున ౧. ఇంద్రియనిగ్రహము, ౨. సంసారమునందుండియే ముక్తిని సాధించుట, 3. ఆత్మ

18-5 [illegible], అష్టపదములను నిరోధించుట, ౪. ఆత్మ దేహముతో గూడియుండుటవలన గల్గు దోషముల నెదుర్కొనుట, ౫. స్వార్థరాహిత్యయుత పరోపకారము, చైతన్యవైష్ణవప్రచార ధర్మములుగా చెప్పఁబడినవి.

చైతన్యవైష్ణవమతమున పరమేశ్వరుండగు మహావిష్ణువు ౧. స్వయంరూపమహావిష్ణువనియు, ౨. తదేకాత్మరూపమహావిష్ణువనియు, ౩ ఆవేశరూపమహావిష్ణువనియుఁ ద్రివిధములుగా చెప్పఁబడుచున్నాఁడు.

౧ స్వయంరూపమహావిష్ణువు- (ఇది ద్వివిధము) ౧ శుద్ధస్వయంరూపము- ఇది వ్రజేంద్రనందనరూపము ౨ స్వయంప్రకాశరూపము- (ఇది ప్రభావ విభావములచే ద్వివిధము) ౧ ప్రభావము- బలరామరూపము. ౨ విభావము- (ఇది ఐశ్వర్యమనియు, మాధుర్యమనియు ద్వివిధము) ౧ ఐశ్వర్యము- దీనికి గురాలసాగర్షణమనియు పేరు. మఱియు నిది ద్వారక చతుర్భుజబలరామత్వమనియు, బృందావన ద్విభుజ బలరామత్వమనియు- ద్వివిధము ౨. మాధుర్యము- ఇది ఆశ్రమవిగ్రహత్వము.

౨ తదేకాత్మరూపమహావిష్ణువు- (ఇది ౧. విలాసము, ౨. స్వాంశ యని ద్వివిధము.) ౧ విలాసము- ఇది ఆదిచతుర్వ్యూహము. ద్వితీయచతుర్వ్యూహము అని ద్వివిధము. చతుర్వ్యూహములు- ౧. వాసుదేవ లేక, శ్రీకృష్ణవ్యూహము, ౨. సంకర్షణ లేక, రోహిణేయవ్యూహము, ౩. ప్రద్యుమ్న లేక, మకరధ్వజవ్యూహము, ౪. అనిరుద్ధవ్యూహము ననిపిల్వఁబడు దినవది నాల్గు విగ్రహములు చెప్పఁబడినవి. (విష్ణుదేవతా విగ్రహములు చూడుఁడు.) ౨ స్వాంశ- ఇది ౧. పురుషత్వము, ౨. గుణము, ౩. లీలావతారములు, ౪. మన్వంతరావతారములు, ౫. యుగావతారములు, ౬. అర్చావతారవిగ్రహములు నని ఆరువిధములు.) ౧. పురుషత్వము- ఇది ౧. కారణార్ణవశాయివిష్ణువనియు, ౨. గర్భోదకశాయి విష్ణువనియు, ౩. క్షీరోదకశాయివిష్ణువనియుఁ ద్రివిధము. ౨. గుణము- బ్రహ్మత్వమనియు, విష్ణుత్వమనియు, మహేశ్వరత్వమనియుఁ ద్రివిధము. ౩. లీలావతారములు- విష్ణుదేవుని లీలావతారము లీమకరీత్యా ఇరువదియైదు చెప్పఁబడినవి. ౧. విధాత, ౨. యజ్ఞవరాహ, ౩. నారద, ౪. నరనారాయణ, ౫. కపిలసిద్ధ, ౬. దత్తాత్రేయ, ౭. యజ్ఞ, ౮. ఉరుక్రమ (ఋషభ), ౯. పృథుచక్రవర్తి, ౧౦. మత్స్యావతార, ౧౧. కూర్మావతార, ౧౨ ధన్వంతరి, ౧౩. మోహిని, ౧౪ నృసింహ, ౧౫. వామన (ఉపేంద్ర), ౧౬. భార్గవ (పరశురామ), ౧౭. వ్యాస, ౧౮. శ్రీరామ, ౧౯. బలరామ, ౨౦. శ్రీకృష్ణ, ౨౧. బుద్ధ,

౪. మన్వంతరావతారములు (పదునాలుగు.)

| | | |
|---|---|---|
| ౧. స్వయంభు మన్వంతరమున | | యజ్ఞావతారము |
| ౨ స్వారోచి | ,, | విభుఅవతారము |
| ౩. ఉత్తమ | ,, | శక్తిసేనావతారము |
| ౪. తామస | ,, | హరిఅవతారము |
| ౫. రైవత | ,, | వైకుంఠావతారము |
| ౬. చాక్షుష | ,, | అజితావతారము |
| ౭. వైవస్వత | ,, | వామనావతారము |
| ౮. సావర్ణిక | ,, | సార్వభౌమావతారము |
| ౯. దక్షసావర్ణి | ,, | ఋషభావతారము |
| ౧౦. బ్రహ్మసావర్ణి | ,, | విష్వక్సేనావతారము |
| ౧౧. ధర్మసావర్ణి | ,, | ధర్మసేతుఅవతారము |
| ౧౨. రుద్రసావర్ణి | ,, | సుధామావతారము |
| ౧౩. దేవసావర్ణి | ,, | యోగేశ్వరావతారము |
| ౧౪. ఇంద్రసావర్ణి | ,, | బృహద్భానుఅవతారము |

